# సమర్పణ

బ్రహ్మశ్రీ మేకా నరసింహారావార్యులు, నిర్భయానంద అనెడి సాంప్రదాయనామకులు, అచల సాంప్రదాయ సద్గురు వర్యులైన బ్రహ్మశ్రీ కొల్లి గురుప్రసాదరావార్యుల వారి ప్రియ శిష్యులు. అవతార పురుషులు, సద్గురువులు ఒక్కొరొక్కరుగా ఈ స్వామి వారిని నడిపించుచు, అనుభవములిచ్చుచు, తుదకు సర్వ ఎరుకలనుండి విడిపించిరి. పిమ్మట దైవీ ప్రణాళికననుసరించి ఈ లేని స్వామి వారిని ఎంచుకొని బ్రహ్మ విద్యా ప్రాప్తికి పనిముట్టుగా కార్యములను జరుపుచున్నారు.

సర్వము యొక్క యదార్థము శూన్యమేనని లేనివి లేకుండా చేసే పద్ధతిని "సర్వం - శూన్యం, శూన్యం - సర్వం" అని శ్రీవారికి స్ఫురణ కలిగినది. జ్ఞాన సరస్వతీ దేవి ఆశీస్సులతో ప్రారంభమైన సర్వవేదాంతసార సంకలనము శ్రీవారి స్ఫూర్తికి అనుగుణముగా శ్రీవారి ప్రియశిష్యులైన బ్రహ్మశ్రీ ప్రాతూరి విద్యాసాగరు వారిచే రూపుదిద్దుకొనబడినది. క్రొత్తగా శిష్యులైన శ్రీ కోసూరు మురళీకృష్ణారావు లేఖకునిగా, సహాయకునిగా ఎంచుకొనబడిరి. బ్రహ్మశ్రీ జల్లూరి బలరామకృష్ణయ్య గారు, పెద్దల వాక్యానుసారము ఆ సంకలనమును ప్రమాణముగా చేసిరి. శ్రీ మాతా సరస్వతీ దేవియే ఈ సంకలన గ్రంథమునకు "సర్వ వేదాంత శిరోభూషణము" అని నామకరణము చేసిరి.

కర్తలే లేని ఈ గ్రంథము ప్రకాశమయ్యెను. దీనిలో సాంఖ్య తారక అమనస్క పద్ధతి, అనేక సాంప్రదాయకుల సిద్ధాంత, సాధనా పద్ధతులను సమన్వయపరచడము లక్ష్యముగా తుదకు అచల పరిపూర్ణ నిర్ణయము అందించబడినది.

ఈ గ్రంథ సారమును సత్సంగములో బోధించుచుండగా, శ్రవణము చేసిన శిష్యులు అక్షర రూపముగా మార్చిరి. శ్రీ మురళీకృష్ణారావు, విజ్ఞాన స్వరూప్ అనెడి సాంప్రదాయ నామకులు బోధించినదే ఈ వ్యాఖ్యాన గ్రంథమాయెను. దీనిని ఎల్లరు శ్రవణ మననములు జరుపుకొనగలరు గాక !

ఈ బోధనా గ్రంథము అన్ని సాంప్రదాయకులకు, స్వతంత్రముగా సాధనలు చేయుచున్నవారికి వినియోగపడునట్లు ఆ వేదమాత యొక్క ప్రణాళికగా మరియు అశరీరులై సద్గురువర్యుల అంతర్యామియైన గురుతత్త్వము చేత అందించబడినది. కావున సచ్ఛిష్యులు తరించెదరు గాక !

శుద్ధ అంతఃకరణ ప్రాప్తిరస్తు ! బ్రహ్మ విద్యా ప్రాప్తిరస్తు !! పరమపద సిద్ధిరస్తు !!!

| | |
|---|---|
| చల్లపల్లి, కృష్ణాజిల్లా | బుధజన విధేయుడు |
| మాఘ పౌర్ణమి, 2018 | విజ్ఞాన స్వరూప్ |

శ్రీ గురుభ్యోన్నమః

# ప్రస్తావన

**ఓం సహనావవతు సహనౌ భునక్తు సహవీర్యం కరవావహై**
**తేజస్వి నావధీతమస్తు మావిద్విషావహై**
**ఓం శాంతిః శాంతిః శాంతిః**

మనది చలాచలబోధ. చలము అంటే కదిలేది. అచలము అంటే కదలనిది. కదిలేది, కదలకుండా ఉండేది కూడా కదిలే దానికి ఆధారమై ఉంటే కదిలేదాని క్రిందే లెక్క. ఒకప్పుడు కదలకుండా ఉన్నా కదిలే అవకాశాలకు ఆస్కారము ఉన్నటువంటిది కదలికకు కారణమైనది కూడా కదిలే దాని క్రిందే లెక్క. ఎప్పటికీ, ఎప్పటికీ కదలకుండా ఉండేది ఏదో, దాంట్లో కదిలే అవకాశం లేకుండా ఉంటుందో, దానిని ఎప్పటికీ కదలనిది అంటాము. లేదా అచలము అంటాము. అచల బోధ చెప్పాలి అంటే ఈ కదిలేది కదలనిది రెండూ చెప్పవలసి వస్తుంది. కదిలేది ఏది అంటే, భూమి తిరుగుతోంది, గాలి వీస్తోంది, అగ్ని ప్రజ్వరిల్లుతోంది, ఆకాశం కదలకపోయినా ఒకప్పుడు ఉండకుండా, ఒకప్పుడు ఉంటోంది.

సృష్టిలో ముందు ఆకాశము వస్తోంది. తరువాత నాలుగు భూతాలు వస్తున్నాయి. సృష్టి లయం అయ్యేసరికి ఆకాశం కూడా పోతోంది. ఆకాశానికి రాకడ, పోకడ ఉంది కాబట్టి, ఆకాశం కూడా కదిలేదే అయింది. చూడడానికి కదలనట్లు కనబడుతోంది కానీ, చాలా కాలం ఉంటోంది కానీ, ఎప్పుడో ఒకప్పుడు కొంతకాలానికి ఆకాశం కూడా లేకుండా పోతోంది. ఆత్మనుండి ఆకాశము, ఆకాశము నుండి వాయువు.... అనేటటువంటి క్రమంలో, ఆత్మలో ఆకాశం లయమైపోయి లేకుండాపోతుంది. ఆత్మనుండి ఆకాశము మళ్ళీ వ్యక్తమౌతోంది. రాకడ పోకడ ఉంది కాబట్టి ఆకాశం కూడా కదులుతోంది.

మనస్సు కదులుతోంది, ఇంద్రియాలు కదులుతున్నాయి, అవయవాలు కదులుతున్నాయి. బ్రహ్మకు సంకల్పం వచ్చినా, అది కూడా కదలికే. శాశ్వత నిర్వికల్పమే కదలిక లేనిది. శాశ్వత నిర్వికల్పము ఏ అనుభవమూ లేనిది. అనుభవము అంటూ ఉంటే దానికి ఆది, అంతం ఉంటుంది. దృశ్యాన్ని బట్టే దృక్కు వచ్చేటటువంటి చలనాలు. దృశ్యము అనిత్యము కాబట్టి, దృక్కు దానిని దృశ్యీకరించి, విషయీకరించుకుంటే, దృశ్యాన్ని బట్టి ద్రష్ట స్థితి కనుక వస్తే, దృక్కు కూడా కదిలేవాడే అయ్యాడు. దృశ్యాన్ని పట్టించుకోకుండా, తనకు తానుగా ఉన్నవాడు, ఎప్పటికీ దృశ్యాన్ని పట్టించుకోనటువంటి ద్రష్ట. కేవలము ద్రష్ట యొక్క ఉనికి, దృశ్యాన్ని బట్టే ఉంది. దృశ్య రహితమైనప్పుడు ద్రష్టృత్వము కూడా రహితమవుతుంది. అనగా ద్రష్టలో ద్రష్టృత్వం రహితమౌతుంది. అప్పుడు దృక్కు, దృశ్యము, దర్శనము అనే మూడు ఎప్పుడైతే లేకుండా పోతాయో, త్రిపుటి రహితం అవుతోందో, అక్కడ ఎతిగేవాడు లేడు. ఆ ఎతిగేవాడు లేనటువంటి స్థితిని అచలమని అంటాము.

బండరాయి కూడా అచలమే కావచ్చును. కాకపోతే దానికి ప్రకృతిని బట్టి, ఉత్పత్తి నాశనాలు ఉన్నాయి. అప్పుడు బండరాయి అచలం అయినప్పటికి నశించేదే. ఎప్పటికీ ఎప్పటికీ కదలకుండా వుండేది కాదు. ఉత్పత్తి నాశనములు లేనటువంటిది కాదు. ఉత్పత్తి నాశనాలు వుండేటటువంటి బండరాయి అచలం కాదు. ఈ విధంగా అచలాన్ని నిర్ణయం చేసినప్పుడు కదలనిది మళ్ళీ ఎందుకు కదులుతోంది? కదలని దాంట్లో ఏదైనా అసౌకర్యమున్నా ఒక అనుభవం వచ్చి మళ్ళీ పోతూ వున్నా ఒక అనుభవం కావాలనుకుని ఆ కావాలనుకున్న అనుభవం కనుమరుగైతే మళ్ళీ ఆ అనుభవం కోసం ప్రయత్నం చేసినా మళ్ళీ కదలికలు వస్తాయి. కనుక అచలంలో నిత్య తృప్తం వుండాలి. నిత్య వర్తమానంలో ఆ తృప్తి కొనసాగుతూ వుండాలి. ఆ తృప్తి ఎప్పుడూ కూడా అసౌకర్యంగా కానీ అసంతృప్తిగా కానీ మారకూడదు. అట్టి దానిని పరిపూర్ణము అన్నాము.

పరిపూర్ణుడైనటువంటి వాడు కదలడు. పరిపూర్ణ స్థితిలో అసౌకర్యం వుండదు. పరిపూర్ణ స్థితిలో ఇబ్బంది వుండదు. పరిపూర్ణ స్థితిలో వున్నవాడు మళ్ళీ సర్దుబాటు చేసుకోవాల్సిన అవసరం లేదు. ఉదాహరణకు కూర్చున్నవాడు ఎంత సుఖంగా వున్నప్పటికీ ఎక్కువ సేపు కూర్చుంటే మళ్ళీ లేచి, కదిలి నిలబడాలి అనిపిస్తుంది. నిలబడ్డవాడికి కాస్త అటూ ఇటూ నడవాలి అనిపిస్తుంది. ఏదో ఒక భంగిమ ఎక్కువసేపు కొనసాగితే అది ఇబ్బందే అవుతుంది. అపరోక్షానుభూతిలో ఏదైతే అనిర్వచనీయంగా

నిర్విశేషంగా వున్నదో అది ఎప్పుడు పరిపూర్ణం అవుతుంది అంటే మళ్ళీ కదిలేటటువంటి అవసరము వుండకూడదు. ఆ అచల స్థితిలో సౌకర్యముగా ఏ మాత్రమూ కూడా కదలవలసిన అవసరం లేకుండా ఎటువంటి ఇబ్బంది కలుగకుండా వుండాలి. ఆ కదలిక మనసుయొక్క కదలిక కావచ్చు. చైతన్యము యొక్క వ్యాపకత్వము అనేటటువంటి కదలిక కూడా కావచ్చు. చైతన్యం వ్యాపకం అనేటటువంటి పరమాత్మ కదిలేవాడే అయ్యాడు. విషయాలు తోచినప్పుడు విషయాల వరకు వ్యాపకత్వం వుంటుంది. విషయము తోచనప్పుడు దృశ్యము లేనప్పుడు ద్రష్టత్వం విరమించబడుతోంది. ఇక్కడ వ్యాపకత్వం అవ్వడము వ్యాపకత్వము కాకపోవడము కూడా భ్రాంతి. వస్తువును బట్టి విషయాన్ని బట్టి అక్కడిదాకా వ్యాపించాడనియు వ్యాపించలేదనియు అంటున్నాము. కాని ఆ వస్తువులు విషయాలు కూడా మిథ్య. కల్పితము. అవి ఎప్పుడూ లేనేలేవు. భ్రమలోనే కల్పితము, భ్రమలోనే వికాసము. భ్రమలోనే వ్యావర్తనము. భ్రమలోనే కుంచించుకుపోవడము, ముకుళించుకుపోవడము. ఈ పదాలన్నీ వాడినప్పుడు అవన్నీ కదలికలు అయినాయి కాబట్టి అది అచలం కాదు. కనుక పరమాత్మ స్థితి కూడా అచలం కాదు.

పరిపూర్ణమై అచలమై అది నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వరూపము అయినప్పుడే అచలము అనవలసి వస్తుంది. ఇక్కడ సాధకుని విషయానికి వచ్చేసరికి సృష్టిని చెప్పాము. అచల పరిపూర్ణమే వున్నది. దానికంటే అన్యము లేదు. అదెప్పుడూ కదలదు, కదిలే అవకాశము లేదు. కాని మనమిప్పుడు ఎక్కడున్నామంటే సృష్టిలో వున్నాము. బ్రహ్మ సత్యం జగత్ మిథ్య అంటే సృష్టి లేనిదే. ఎప్పుడైతే ఈ సృష్టి లేనిది, మిథ్య అన్నప్పుడు ఈ భ్రమలోనే కదులుతున్నాయి కనుక కదలికలన్నీ భ్రమే. భ్రాంతి రహితమైతే కదలికలు లేని అచలమే వున్నది.

అందుకని భ్రమలో వున్నవాడు ముందు అవిద్యా దోషము పోగొట్టుకుని, తరువాత కదలికలకు కారణమైనటువంటి మాయని తెలుసుకుని, మాయ పద్ధతి, మాయ మర్మము తెలుసుకుని, ఈ కదిలేది మాయకదా, కదలనిది పరమపురుషుడు కదా అని నిర్ణయం కావాలి. ఇక్కడ మనన నిది ధ్యాసన లేదు. నిర్ణయమే. గురు వాక్య విశేషాన్ని శిష్యుడు వినినంతనే దానిని విచారించి ఇంగిత జ్ఞానముతో తనకు తానే ఇదే వున్నది ఇంకేమీ లేదని భ్రాంతిలో వున్నవన్నీ కూడా కల్పితమని గట్టిగా నమ్మాలి. మననము నిది ధ్యాస చేస్తే ఒక వస్తువు అనుభవములోకి వచ్చి నిష్ఠగా మారుతుంది. అంతకుముందు లేనిది ఇప్పుడు వచ్చింది. మనన నిధి ధ్యాసలో వచ్చినది కనుక, మనన నిది ధ్యాసలు లేనప్పుడు లేదు కనుక, అది కూడా వచ్చేదే పోయేదే అయింది.

ఈ అచల పరిపూర్ణము వ్యక్తావ్యక్తములు కాదు. రాకడ పోకడ కాదు. అందుకని బ్రహ్మనిష్ఠ కూడా చలించేదాని క్రిందే జమకట్టాము. చలించేదాని నుండి చలించని దానికి ప్రయాణము లేదు. చలించేది భ్రాంతిలో మాత్రమే వున్నది. చలించనిది సత్యముగా వున్నది. చలించుట అనేటటువంటి భ్రాంతి రహితమైతే చలనము లేని బయలే వున్నది. అందుకని చలించే దాని నుండి చలించని దానికి మార్గము లేదు. చలించేది దృక్ స్థితిలోనో, దృశ్యాన్ని బట్టి దర్శనానుభవంలోనో వున్నందుచేత ఇదంతా ఎరుక. చలించనిది, ఎరుక లేనిది బయలు. చలించనిది చలిస్తోంది అని అనరాదు. అప్పుడది అచలమే కాదు. నిజముగా సత్యముగా అచలముగా పరిపూర్ణముగా వున్నది ఎప్పటికీ చలించదు. చలించేది ఎరుక కనుక చలించనిది బయలు. బయలంటే ఎరుక యొక్క లేమితనము.

ఇట్టి బయలు శాశ్వతముగా కదలనిది కనుక ఇట్టి బయలు నుండి ఎరుక పుట్టదు. బయలందు ఎరుక అవ్యక్తముగా వుండదు, ఎరుక వ్యక్తమూ అవ్వదు. బయలుకు ఎట్టి సంబంధమూ లేకనే, ఎరుక తనకు తానే బీజరూపంలో అవ్యక్తముగా మొదట్లో వుండి, తరువాత వుండుటకు ఉపక్రమించి మహత్తు అయిన తరువాత వుండుట అనేటటువంటి ఎరుకలో మహదహంకారము పుట్టి ఇలా ఎందుకొచ్చామో తెలియనప్పుడు సత్ చిత్ ఆనందముగా వుండి, మరల ఎందుకొచ్చామో తెలిసినప్పుడు సృష్టి స్థితి లయలుగా త్రిమూర్తిత్వముగా మారి, సర్వానికి అధిష్ఠానముగా మారి, సర్వాన్ని కల్పించుకుని కల్పించుకున్న దానిని ఈక్షించి, ఆ ఈక్షించిన దానితో తాదాత్మ్యత చెంది, తాదాత్మ్యత చెందిన దానిలో ఇంకా ఎక్కువగా చలించడం జరుగుతోంది. కనుక ఎక్కడి నుండి కదలిక మొదలయినదో అక్కడి నుండే భ్రాంతి మొదలయింది. సత్వ గుణం రాగానే మాయ మొదలయింది. అవ్యక్తంగా వున్నప్పుడు మూలా విద్య త్రిగుణములు బీజావస్థలో వున్నది. ఇది విచారించి మాయ మర్మం తెలుసుకుని – ఎరుకన్నా మాయన్నా భ్రాంతి అన్నా ఒకటే కనుక, భ్రాంతి రహితమయినప్పుడు ఎరుక లేకుండా పోతుంది. ఇది సిద్ధాంతము.

ఈ సిద్ధాంతాన్ని ఎరుకలోనే తెలుసుకున్నాడు. ఇప్పుడు తను బయలవ్వడం ఎలాగు? ఇంతకు ముందు ఆధార ఆధేయ పద్ధతిగా బ్రహ్మనిష్ఠగా వచ్చాడు. ఇప్పుడు బ్రహ్మ నిష్ఠ నుండి అచల పరిపూర్ణం అవ్వాలి. అచల పరిపూర్ణం అవ్వాలి అంటే దారి లేదు. బ్రహ్మ నిష్ఠ ఆగిపోవడమే బయలు. ఇది వుంటే అది లేదు, అది వుంటే ఇది లేదు. దీని నుండి దానికి దారిలేదు. దీని నుండి దారి వుంటే ఎరుకకి మూలం బయలే అవుతుంది. బయలు వేరుగా విలక్షణముగా వుంది. ఎరుక తనకు తానే తోచింది. బయలు కారణంగా తోచలేదు. బయలందు భ్రాంతి పుట్టింది. భ్రాంతి మాయ వల్ల పుట్టింది. మాయ అంటే ఏది లేదో అది వున్నట్లు వుంది. కనుక పుట్టింది, వచ్చింది అనేవి కూడా లేనిదే. అందువల్ల మాయ అనేది ఒకటి, బయలు అనేది ఒకటి రెండు వున్నాయని చెప్పడానికి లేదు. బయలు అద్వయం. మాయ రెండవదిగా చెప్పినప్పటికీ మాయంటే లేనిది కనుక బయలు అద్వయం అంటే సరిపోతుంది. ఇటువంటి అద్వయమైన బయలందు ఎరుకన్నా మాయన్నా ఒకటే కాబట్టి ఆ ఎరుక లేదు. ఇది లేని మాయ, కనుక ఎరుక లేనే లేదు. మరి భ్రాంతిలో తోచిన ఎరుకకు బయలు మూలము కాదు. ఎరుక బయలు యందు అవ్యక్తముగా కూడా లేదు. బయలు కారణంగా వ్యక్తం కాలేదు. బయలులో సత్తా లేదు. బయలులో సామర్థ్యం లేదు. అది అచలముగా వుండి కూడా, చలించే వాటికి సత్తా మాత్రంగా కూడా లేదు. అట్టిది బయలు. బయలు ప్రకాశించదు. బయలందు ఎరుకే ప్రకాశిస్తుంది. ప్రకాశ రూప ఎరుకకు కారణం మాయ. మాయంటే లేనిది కనుక ఎరుక లేనిది. లేని ఎరుకే వున్నదని అందరూ భ్రాంతిలో వున్నారు. భ్రాంతిలోనే శిష్యుడు, భ్రాంతిలోనే గురువు, భ్రాంతిలోనే అజ్ఞానము, భ్రాంతిలోనే జ్ఞానము, భ్రాంతిలోనే బ్రహ్మనిష్ఠ.

భ్రాంతిలోనే నిర్గుణము, భ్రాంతిలోనే సగుణము. కాని నిర్గుణము సగుణ మయ్యే అవకాశము వున్నది. ఎందుకంటే అది ఎరుక బ్రహ్మ కనుక. ఎరుకకు సంబంధించిన బ్రహ్మ కనుక. ఎరుక అవ్యక్తముగా వుంటే నిర్గుణ మవుతోంది. వ్యక్తముగా వుంటే సగుణమవుతోంది. సగుణ నిర్గుణాతీతమైనది ఏదో అది త్రిగుణ రహితము. మాయ త్రిగుణాత్మికము కనుక త్రిగుణ రహితమందు మాయ లేదు. కనుక మాయ మర్మమెరిగి మాయను అధిగమించినటువంటి స్థితిలోనే మాయకు పరమైనది బయలు. పరుడు అని పిలవబడే బ్రహ్మకు కూడ పరమైనది కనుక పరాత్పరమైనటువంటి బయలే అచల పరిపూర్ణము.

ఈ విధముగా చలమునకు అచలమునకు వున్న బేధమును తెలుసుకుని, ఇది వున్నది ఇది వున్నది ఇది వున్నది అనుచు, బయలునెరిగి, ఇది లేనిది ఇది లేనిది ఇది లేనిది అని, లేనెరుక నెరిగి ఎరుకకి సంబంధించినదంతా కూడా లేనిదే అని తెలిసి ఆపై ఎరుకను మానాలి. అయితే బయలు నిర్ణయంగా ఎరుక మానాలి. బయలిట్టిది అట్టిది అనరానట్టిది. ఏదో వున్నదని ఎరుక వున్నది.

గురుడు బయలును చూపించి ఎరుకకి మూలాన్ని చూడమన్నాడు గాని, బయలు ఇట్టిది అట్టిది అని చూడమని చెప్పలేదు. బయలందు ఎరుకకు మూలము లేదని ఆ రకంగా ఎరుకగా వున్న బ్రహ్మనిష్ఠుడు **"మూలం లేని గుర్తెరిగే శరీరం ఏమీ లేదు"** అని తెలిసి బయలు తనకు మూల కారణము కాదు అని తెలిసి, గొడ్రాలి బిడ్డ సామెతగా తానుండుట అనేది లేనెరుక అని తెలిసి, లేనెరుకను లేకుండా చేసుకుని, ఎరుక లేకపోతే ఏదైతే శేషించి వుందో, అదే బయలని వార్తీక పద్ధతిలో నిర్ణయం చేసుకుని గురుకృప కోసం వేచివుండాలి. గురుకృపకోసం సంసిద్ధమై, ఎరుక విడుచుటకు సంసిద్ధమై, నిరీక్షించాలి.

అట్టి పరిస్థితిలో, అట్టి నిరీక్షణలో, ఎరుక తాత్కాలికముగా లేనటువంటి స్థితిలో, సచ్ఛిష్యుడు దేశికేంద్ర గురువులైనటువంటి అశరీరి గురువుయందు మమైకమైనప్పుడు **"మౌనములోనే ఇవ్వబడును మౌనములోనే పుచ్చుకొనబడును"** అనేటటువంటి సిద్ధాంతము చేత, అశరీరి గురువు యొక్క మౌన వ్యాఖ్యలో అతని నుండి ఈ పరిపూర్ణమనేటటువంటిది ఏ విధంగా వుంటుందో అది శిష్యుడికి అందించబడి అతడు ఎరుక విడిచి నిర్వాసనా మౌన ముద్రలో స్థిరమయిపోయి లేనివాడైపోతాడు. అప్పుడు అందించే గురువు గాని, అందిపుచ్చుకునే శిష్యుడు గాని అస్తిత్వముగా కాని, గుర్తుగా కాని వుండరు. ఎప్పుడైతే గుర్తులు లేవో ఎరుక పోయింది. **"గురుతెరుక బాయెన్"** అన్నారు. గురువు శిష్యుడు విడివిడిగా వున్నటువంటి గుర్తు వున్నంత వరకు ఎరుక వుంటుంది. గురువు శిష్యుడు ఏకమైనప్పుడు గురుతెరుక పోతుంది.

ఈ పద్ధతిలో బయలుగా వున్నటువంటి గురువందు మమైకమైనటువంటి శిష్యుడు కూడా బయలయ్యే వుంటాడు. కాని ఐక్యతా సిద్ధి జరుగుచున్నప్పుడు మాత్రము ఎరుకలోనే వుండి ఐక్యమవుతాడు. ఎరుకలో వున్నంత వరకు గురు శిష్య భేదముంటుంది. ఎరుక నుండి విడివడినప్పుడు శిష్యుడిలో ఎరుక లేకపోయినప్పుడు ఏ శిష్యుడి కోసమైతే బయలై వున్న గురువు, ఏ శిష్యుడైతే ఆర్తిల్తో వేడుకుని లేనెరుకలోకి గురువుని మేల్కొల్పాడో అటువంటి గురువు, శిష్యుడు వున్నంత వరకు శిష్యుడి కోసం లేనెరుకలో వుండి, శిష్యుడు ఎరుక విడిచి లేనివాడయ్యే సరికి, లేనెరుకలోకి లాగినటువంటి శిష్యుడు ఎప్పుడైతే లేడో, లాగబడుట ఎప్పుడైతే ఆగిందో, ఆ లేనెరుక గురువులో అవసరము తీరిన పిదప లేకుండాపోతే, గురువు బయలయ్యే వున్నాడు. అప్పటికే శిష్యుడు గురువులో ఐక్యతా సిద్ధి పొంది వుండటంచేత గురువు బయలు కాగానే శిష్యుడు కూడా బయలయ్యే వున్నాడు.

ఇది గురువు శిష్యులు ఇద్దరూ కూడా ఎరుకలో ఐక్యతా సిద్ధి పొంది, లేనెరుక లేకుండా పోయినటువంటి సందర్భములో ఇద్దరూ బయలు రూపమై, ఇద్దరూ అద్వయమై, ఇద్దరూ అచలమై, ఇద్దరూ పరిపూర్ణమై వుండుటే ముగింపు. దీనినే కడతేరుట అంటారు. ఇదే గురుమర్మము. ఇప్పుడు చెప్పిందే పరిపూర్ణ బోధ. చలము నుండి మొదలుపెట్టి బోధ అచలానికి తీసుకు వెళ్ళినప్పటికీ చలము ఆధార ఆధేయ పద్ధతిలో సాగి చివరకు అచలము సిద్ధించాలి అన్నప్పుడు, ఇప్పుడు చెప్పినటువంటి పద్ధతిలో అనగా నిరపేక్ష పద్ధతిలో లేకుండా పోగానే, వున్నదేదో వున్నట్లుగా ఉన్నది. లేనిది లేకుండా పోతే భ్రాంతి రహితము. సర్వ కాలాలలో సర్వ దేశాలలో నిండినిబిడీకృతమై ములు గ్రుచ్చ సందు లేక, ఎరుకకు మూలము లేక, ఎరుక నిలిచేందుకు స్థానము లేక, ఏదైతే వున్నది వున్నట్లుగా వున్నదో, దాని పేరే ఉత్త బట్టబయలు. సర్వ కాలాలలో అదే వున్నది వున్నదున్నట్లున్నది. ఇక గురువు లేడు శిష్యుడు లేడు. ఇంక బోధ లేదు. మరొక మాట లేదు. అంతే! అదే పరిపూర్ణము. చలాచల బోధ యొక్క విషయాన్ని ఈ విధముగా శిష్యులకు నాందీ వాచకముగా అందించడమయినది.

**ఓం శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః**

**విజ్ఞాన స్వరూప్**

# పీఠిక

ఈ గ్రంథము వ్రాయడానికి ఎవరైతే ప్రేరేపించారో, ఎవరి ప్రేరణవల్ల ఈ గ్రంథము తయారుచేయాలనేటటువంటి సంకల్పము మనకు కలిగిందో, అటువంటి పరమేష్ఠి గురువులకు సుజనులందరికి వారి చరణ నీరజ రేణువులకు, సత్పురుషులదరికి నమస్కరిస్తూ వివరించబోయేదేమిటంటే – మనది బృహద్వాసిష్ఠ సిద్ధాంతము. యోగవాసిష్ఠ, జ్ఞానవాసిష్ఠ, బృహద్వాసిష్ఠ అనేటటువంటి సిద్ధాంతాలున్నాయి. ఇవి జ్ఞాన పద్ధతిలో వరుసగా చెబుతూ ఉంటారు. ఈ బృహద్వాసిష్ఠ పద్ధతి ఏదైతే ఉందో అది అద్వైతాన్ని పరాకాష్ఠకు తీసుకువెళ్ళి, అచల పరిపూర్ణ నిర్ణయాన్ని నిర్దుష్టంగా చేస్తుంది. ఇది అద్వైత గ్రంథమే కానీ, అచల గ్రంథము కాదు. కనుక దీనిని ప్రమాణంగా తీసుకున్నప్పుడు, అచల సిద్ధాంతాన్ని కూడా ఆమోదించవలసి వస్తుంది. ఇవన్నీ ఉపనిషత్తులలో ఉన్నవి. భ్రాంతిలో ఉన్నటువంటి శిష్యులకు, భక్తులకు వస్తు నిర్ణయము అప్పటికప్పుడు చేయలేము కనుక ఆత్మ అనేటటువంటి దానిని ప్రతిపాదన చేసుకుంటూ, ఆత్మానుభవం పొందడం కోసమని చెప్పి, అనాత్మ భావన విడవాలని, ఆత్మ అనాత్మకు ఆధారమని, ఆధార ఆధేయ పద్ధతిలో తీసుకువెళ్ళడం జరుగుతుంది. అక్కడినుండి రెండవ దశ. నాలుగు మహా వాక్యాల ద్వారా **ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి** అనేటటువంటి వాక్యాల ద్వారా ముఖ్యంగా ఆధార ఆధేయ పద్ధతిలో జరిగింది. **తత్త్వమసి** మహావాక్యం ద్వారా, ఈ గురూపదేశ వాక్యం ద్వారా ఆధార ఆధేయ పద్ధతిని తెగగొట్టి, నిరపేక్ష పద్ధతిలో వస్తు నిర్ణయాన్ని చేయడం జరుగుతుంది.

శాస్త్రము సృష్టికి పరబ్రహ్మకి ఉన్న సంబంధము ఈ విధంగా చెప్పినప్పటికి, అవిద్యా దోషము, మాయా దోషము ఉన్నటువంటి శిష్యుడు తనయొక్క సాధనలో క్రమక్రమంగా భ్రాంతిని, భ్రమని విడుస్తూ వెళ్ళడానికి తగినట్లుగా ఈ పాఠాలు వాటియొక్క బోధలు, క్రమము పెద్దలచేత ఏర్పాటు చేయబడింది. ఏదైనా విముఖంగా ఉన్నవాడికి మనం చెప్పి ఒప్పించలేము. ఈ జ్ఞానం అనేది సర్వజనులందు వ్యాపించాల్సిన అవసరం ఉన్నప్పటికీ, విముఖంగా ఉన్నవాడికి మనం ఏమీ చెప్పలేము. అయితే ఇప్పుడు సర్వ వేదాంత శిరోభూషణము అటువంటి వారిని గూర్చి కాకుండా, కొంత జిజ్ఞాస ఉండి, ఆ జిజ్ఞాసకు గురుశిష్య న్యాయముంటేనే పని జరుగుతుందన్నప్పుడు ఆ ఉపనిషత్ మతాన్ని ఏదైతే పరంపరా పద్ధతిగా చెబుతున్నారో, అది కూడా గురుశిష్య పరంపరగా, గురుశిష్య న్యాయంగా జరుగుతుంది.

శిష్యుడు గురువు నడిపించే మార్గానికి అంకితమై, తనకు అలవాటుగా ఉన్నటువంటి స్వభావాన్ని, గురువాజ్ఞకు కట్టుబడేటట్లుగా చేసి, శ్రద్ధతో, శరణాగతితో గురుని ఇంటా, వెంటా, జంటా పెట్టుకుని వెంబడిస్తేనే కానీ జరుగదు. గురుశిష్య న్యాయం అంటే ఇదే. ఇందులో ముఖ్యంగా ఉన్నవి జగత్తు, జీవుడు, ఈశ్వరుడు. ద్వైత పద్ధతిలో పోతే ఈశ్వరుడే గొప్పవాడు. అంతా ఈశ్వరుని కృప. ఈశ్వరుని అనుగ్రహము. ఆ భక్తి భావనలో నేనే ఈశ్వరుడు అవ్వాలనే లక్ష్యం ఉండదు గాని, ఈశ్వర కృపకు లేక అనుగ్రహం కోసం ఈ భక్తిని సాధనగా చేసుకుంటారు. అయితే గురుశిష్య న్యాయంగా వచ్చినవారు మాత్రమే నిజానికి భక్తిని సాధనగా చేసుకుంటారు.

మిగతావారి భక్తి, పేరుకు భక్తియే కాని, అది నిజమైన భక్తి కాదు. భగవంతుని దగ్గరకు వెళ్ళాలని కాని, భగవంతుని కృప పొందాలని కాని, భగవంతునిలో ఐక్యమొందాలని కాని, ఈ మూడు దశలలో సామాన్యులకు భక్తి ఉండదు. అటువంటి ఈశ్వరుడు కూడా భ్రాంతి అనేటటువంటిది మనం తెలుసుకోవలసినటువంటి అవసరము ఉన్నది. అందుకని జగత్తు అంటే ఏమిటి? జీవుడు అంటే ఏమిటి? ఈశ్వరుడు అంటే ఏమిటి? ఈ మూడు తెలుసుకుని ఈ ముగ్గురు కూడా అనాత్మలో భాగమే. కాకపోతే జగత్తు అనేది ఈశ్వరుని యొక్క సంకల్పములో ప్రథమంగా కల్పించబడి, తరువాత జీవుడిలో **"యద్భావం తద్భవతి"**గా, వాసనగా చేరి, ఆ వాసనలో ఉన్నదే, మళ్ళీ అనుభవించడానికి వచ్చి, అనుభవంలో ఉండగానే, మళ్ళీ సంకల్పాలు, ఊహలు భావనలు చేస్తే, మళ్ళీ అదే చక్రభ్రమణంగా ఈ జగత్తు కొనసాగుతోంది.

జగత్తు కల్పితమని చాలామందికి తెలుసు. **బ్రహ్మ సత్యం జగన్మిథ్య** అంటున్నారు. కనుక జగత్తు ఎక్కడి నుండి వచ్చింది? అంటే జీవుడి యొక్క సంకల్పంతో, జీవుడి యొక్క భావంతో, జీవుడి యొక్క కారణంతో వచ్చింది. అది జీవుడిని బాధిస్తోంది. అలాగే ఈశ్వరుని యొక్క సంకల్పంతో, ఈశ్వరుని యొక్క ఊహలో కూడా ఈ జగత్తు వచ్చింది. కాని ఈశ్వరుడిని బాధించడం లేదు. ఈశ్వరుడు మాయా కల్పిత జగత్తుచేత బాధించబడకుండా, దానికి లోబడకుండా సాక్షీభూతంగా, విలక్షణంగానే ఉంటున్నాడు. అయినప్పటికీ ఈశ్వరుడికి కూడా జగత్తు సత్యమే. ఈశ్వరుడికి జగత్తు సత్యం కాకపోతే, సృష్టి స్థితి లయలు ఎందుకు చేస్తాడు? ఈ **"బ్రహ్మ సత్యం జగన్మిథ్య"** అన్నప్పుడు ఈ మిథ్యా సృష్టికి, సృష్టి స్థితి లయకర్తలు ఉండరు కదా! మరి ఈశ్వరుడు వాటికి కర్త కదా! ఆ కర్తృత్వం ఉండడం చేత, జీవుడికి అవిద్యా దోషంతో ఉండేటటువంటి సంసారము, ఏదో అవే బాధలు లేకపోయినప్పటికీ, ఈశ్వరుడికి కూడా ఆ సంసారము ఉన్నది. ఈ జీవుడు, ఈశ్వరుడు ఎలా వచ్చారు? అన్నప్పుడు ఈశ్వరుడు ఒక సంకల్పంలో **ఏకోహం బహుస్యాం** – అనగానే అనేక జీవులుగా మారాడు. ఈ పద్ధతిలో చూస్తే జీవులు ఈశ్వరుని సంకల్పం నుండి వచ్చారు. అందువలన జీవులు సత్యం కాదు. ఒకరి సంకల్పములో, ఒకరి ఊహలో వచ్చింది ఏదైనా కానీ అసత్ అనబడుతుంది. అది సత్యము కాదు. ఇప్పుడు జగత్తు సత్యము కాదు. జీవులు సత్యము కాదు అని తేలింది.

ఈశ్వరుడు ఎలా సత్యము కాదు? ఈశ్వరుడేగా అనేక జీవులైంది? అనేకమైనటువంటి జీవులు, ఏ ఒక్క జీవుడు కూడా సత్యము కానప్పుడు అనగా వ్యష్టి జీవులు సత్యము కానప్పుడు సమష్టి జీవులు కూడా సత్యం కాదు. ఈ మూడు కూడా భ్రాంతిలోనే ఉన్నాయి కనుక జీవుడు జగత్తుని మిథ్యగా చేసుకుని, అనాత్మ భావాల నుండి విడుదలై, అవిద్య నుండి విడుదలై, వ్యష్టి నుండి విడుదలై, సమష్టి రూపంలో అనగా అవిద్యా దోషము పోగొట్టుకున్నటువంటి అవస్థలో, ఈశ్వరానుభవము పొందుతాడు. అటువంటి ఈశ్వరుడు కూడా భ్రాంతి అన్నప్పుడు ఆ ఈశ్వర భ్రాంతి కూడా నిర్మూలము కావాలి. బ్రహ్మ జ్ఞానము చేతనే ఈశ్వర భ్రాంతి నిర్మూలము అవుతుంది. ఎలాగంటే మాయా ప్రతిబింబముగా తయారైనవాడు ఈశ్వరుడు. అంతఃకరణలో అవిద్యా ప్రతిబింబముగా తయారైనవాడు జీవుడు. కనుక వీళ్ళ అస్తిత్వము ప్రతిబింబ అస్తిత్వమే కానీ, నిజ అస్తిత్వము కాదు. ఇది థియరీ. సాధనకు కూడా అలాగే పనికి వస్తుంది. ఇప్పుడు సాధనకు పనికి వచ్చినప్పుడు ఈ మూడు రకాల భ్రాంతిని, జగత్ జీవ ఈశ్వర భ్రాంతిని, నిర్మూలించాల్సిన అవసరం ఉంది.

దానిని లక్ష్యంగా స్వీకరించి, ఈ సర్వవేదాంత శిరోభూషణము అనే గ్రంథాన్ని తీసుకురావడం జరిగింది. ఈ సందర్భముగా మనందరికి గురుతుల్యులు, గురువులకు గురువు నిర్భయానంద మేకా నరసింహారావు గారు ఉన్నారు. ఆయనకు ఒక సంకల్పం కలిగింది. సర్వము మిథ్య కాబట్టి, లేకుండా పోతే శూన్యమే. శూన్యము మాయా కల్పితముగా, సర్వముగా, లేకనే ఉన్నట్లుగా

గోచరించింది అనేది అనుభవములో తొలిచింది. నన్నూ (విజ్ఞాన స్వరూప్ కోసూరు మురళీకృష్ణ), విద్యాసాగర్ గారిని పిలిచి, 'సర్వమూ శూన్యము, శూన్యము సర్వము' అంటే జీవేశ్వర జగత్తులు శూన్యము. మాయాకల్పితముగా జీవేశ్వర జగత్తులు భ్రాంతిలో తోచారు. భ్రాంతి రహితమయ్యే సరికి జీవేశ్వర జగత్తులు వారికి సంబంధించిన సర్వమూ కూడా లేనిదై శూన్యమౌతుంది. ఆ శూన్య స్థితిలో ఏది ఉంది అంటే, ఉన్నది ఉన్నట్లుగా ఉన్న బట్టబయలు. ఆ బట్టబయలు ఎఱుక పద్ధతిగా చూస్తే ఏమీలేదు.

ఆ సంకల్పం వారికి కలిగిన తరువాత 'సర్వము శూన్యము, శూన్యము సర్వము' – అనేటటువంటి సాధనా గ్రంథము వెలువడింది. అయితే దీనికి 'సర్వవేదాంత శిరోభూషణము' అనే పేరు ఎందుకు పెట్టాలి? గ్రంథము మాత్రము ఏదో రాస్తున్నాము, పూర్తి అవుతోంది. మళ్ళీ సవరణలు చేస్తున్నాము, కలుపుతున్నాము. ఆరు నుండి తొమ్మిది నెలల వరకు ఇంతే! ఈ గ్రంథము అనేటటువంటిది రచన కాదు సంకలనము. ఆ సంకలనము కూడా ఒక వరుసలో పేర్చడము, పెద్దలకు వివరించడము జరిగేది. జల్లూరి బాలరామకృష్ణయ్య గారని ఉన్నారు. ఆ రాసినవన్నీ కూడా ఆయనకు చూపించి, ఆ పెద్దల విధానంలో వస్తు నిర్ణయానికి సరిపోయిందా? లేదా? అని ఆయనవద్ద వారి అంగీకారము తీసుకుంటే గాని, దానిని యధాతథంగా ఉంచలేదు. వారు అంగీకరించకపోతే కొన్ని మార్పులు చేర్పులు చేసి వారికి మళ్ళీ చూపించి, సరిచేసేవాళ్ళము. అప్పటికి విజ్ఞాన స్వరూప్‌గా లేను. కేవలం మురళీకృష్ణగానే ఉన్నాను. కేవలం కలం తీసుకుని విద్యాసాగర్ గారు చెప్పింది చెప్పినట్లుగా ఆయన ఇచ్చిన కొన్ని గ్రంథాలలో ఆయన చెప్పినవి అన్నీ కూడా వ్రాసుకుంటూ, ఆయన సూచించిన విధముగా ఒక వరుసలో పేర్చి వ్రాయడము జరిగింది.

కనుక ఈ గ్రంథము తయారవ్వడంలో బ్రహ్మశ్రీ మేకా నరసింహారావు గారి స్ఫూర్తి, ఆ స్ఫూర్తిని అందుకోగలిగిన శక్తి ఉన్నటువంటి ప్రాతూరి విద్యాసాగర్ గారు, వేదాంతంలో మళ్ళీ మనం చెప్పడానికి ఏమీ మిగలకుండా, అన్నీ కూడా ఇందులోకే వచ్చేటటువంటి పద్ధతిలో, అవసరమైతే కొన్ని పటాలు కూడా దీనికి కలిపి తయారుచేసినదే ఈ పుస్తకము. దీని తరువాత ఇక పుస్తకాలు అవసరం లేదు అని. అన్నీ ఇందులోనే ఉండాలని సర్వ వేదాంతసారముగా సర్వమూ ఇందులో ఉండాలని అనుకోవడము జరిగింది. శూన్యమే సర్వముగా తోచింది. సర్వమూ ఉన్నది అనే భ్రాంతి పోగానే అంతా శూన్యమే అనేది సద్గురు ప్రేరణ. సర్వము శూన్యమునుండే వచ్చింది. విచారిస్తే సర్వమూ శూన్యమే. ఈ లక్ష్యంతో వేదాలు, ఉపనిషత్తులలో ఉన్నవన్నీ కూడా సేకరించాము.

ఈ సేకరణలో విద్యాసాగర్ గారు ఈ సర్వ వేదాంత శిరోభూషణము అనేటటువంటి గ్రంథములో అనేక గ్రంథాలను పరిశీలించిరి. పరిపూర్ణ బోధ, యాజ్ఞవల్క్య జనక సంవాదము అలాగే అచల సిద్ధాంతానికి సంబంధించి, పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణం, నిజ ప్రబోధ విధానము, శుద్ధ నిర్గుణతత్వ కందార్థ దరువులు, నిర్గుణాత్మ జ్ఞాన సంయోగ కందార్థ రత్నావళి మొదలగు అచల గ్రంథాలతోపాటు కొన్ని అద్వైత గ్రంథాలు కూడా తీసుకుని, సుజ్ఞాన దీపం అనే గురుగీతలో ఉన్నటువంటి శ్లోకాలయొక్క తాత్పర్యము, కొల్లి కోటయార్య విరచితమైన వేదాంత పదవింశతి సేకరించి పెట్టుకున్నాము.

ఆత్మలింగ శతకము, సిద్ధరామ శతకము, పరమహంస విరచితమైన శ్రీ బ్రహ్మ విద్య, అష్టావక్రగీత, తారకామృత సారము, ఆత్మవిద్యా విలాసము, సత్యసాయిబాబా వారి వాహినులు, వేదాంత డిండిమ, వివేక చింతామణి.. ఇంకా మా సుబ్బారావు గురువు గారు, వారి పెద్దల వద్దనుండి విని నేర్చుకున్నటువంటి వేదాంత భావర్థ దీపిక ఇటువంటి గ్రంథాలన్నీ మేము వరుసగా పెట్టుకున్నాము. ఈ సందర్భముగా ఒకటి తెలియజేయవలసిన అవసరమున్నది. బ్రహ్మశ్రీ కొల్లి కోటయార్యుల వారి శిష్యులు, పుత్రులు అయిన బ్రహ్మశ్రీ కొల్లి గురుప్రసాదరావార్యుల ప్రియ శిష్యులే మన పాగోలు స్వామి అని పిలువబడుచున్న మేకా నరసింహారావార్యులు, నిర్భయానంద సాంప్రదాయ నామకులు. శిష్యులకు ఏ క్రమముగా బోధ చేయాలి? వేదాలు, ఉపనిషత్తుల సారమంతా కూడా ఒక క్రమంలో అందించడం కోసం, మేము పెట్టుకున్న పాఠ్యాంశాలలో ఈ గ్రంథాల యొక్క సారాన్ని ఆ వరుసలో తీసుకురావాలనేటటువంటి సంకల్పముతో, విద్యాసాగర్ గారు దీని గురించి నూటికి నూరుపాళ్ళు ఆయనే ఈ క్రమమైనటువంటి విషయాన్ని, సబ్జెక్టుని ఇవ్వడం, నేను ఆయనకు లేఖకుడుగా, సహాయకుడుగా, వారు చెప్పినట్లుగా, ఆయా భాగాలను వ్రాస్తూ క్రిందిది పైకి, పైది క్రిందకు జరుపుతూ, మార్పులు, చేర్పులు ఆయన సూచనలతో చేస్తూ తయారైన గ్రంథము ఈ సర్వ వేదాంత శిరోభూషణము.

ఈ గ్రంథములో ప్రథమాంకములో ఏమి చెప్పామంటే? జీవ జగత్తులను ఆత్మదృష్టి చేత విచారణ చేసే విధానము, సాధన చతుష్టయ సంపత్తి, సృష్టి వివరము, సృష్టికి సంబంధించి ప్రణవము, ఉపాసనకు సంబంధించి పంచాక్షరి, సాధనకు సంబంధించి పిండాండ పంచీకరణ. సృష్టికి సంబంధించి మూడు గుణాలు, అవి ఎలా పనిచేస్తున్నాయని, ఆ తరువాత పిండాండంలో శిష్యుడు మొట్టమొదలుగా గురువు దగ్గర ఉపదేశం తీసుకున్నవాడు మొదటి పాఠంగా శరీరత్రయ విలక్షణము, పంచకోశ లక్షణ వ్యతిరిక్తము, అవస్థాత్రయ సాక్షి.. ఇవన్నీ పాఠ్యాంశాలుగానే కాకుండా విచారణ పద్ధతిగా కూడా అందించడమైనది.

రెండవ అంకమందు జ్ఞాత అయినటువంటి జీవుడు, తాను వ్యష్టియందు ఆత్మ స్వరూపుడై, సమష్టియందు ఈశ్వరుడై ఉండేటటువంటి రీతిని, బ్రహ్మాండ పంచీకరణ ద్వారా శిష్యులకు, వారి బుద్ధిలో దృఢంగా నిర్ణయం అయ్యేటటువంటి పద్ధతిలో చెప్పడం జరిగింది.

ఆధార ఆధేయ పద్ధతిలో నాలుగు మహావాక్యాలు బోధిస్తూ, దాంట్లో శిష్యుడు వ్యష్టిత్వాన్ని, సమష్టిత్వాన్ని కూడా పోగొట్టి శుద్ధ చైతన్యంగా, సర్వ వ్యాపకత్వాన్ని పొందడానికి లక్ష్యముగా చెప్పడం జరిగింది. అక్కడ వచ్చేటటువంటి అనుభవము సత్ చిత్ ఆనందము. ఈ సత్ చిత్ ఆనందము అనేటటువంటిది ఉత్కృష్టమైన ఎఱుక. ఇంతకంటే గొప్ప ఎఱుక లేదు. ఇంతకంటే ఆనందాన్ని, తృప్తిని ఇచ్చే ఎఱుక లేదు. అయినప్పటికి అది ఎఱుకే. దీంట్లో అద్వైతలో ఉపయోగించేటటువంటి మాటలను, ప్రజ్ఞానాన్ని, అజ్ఞానాన్ని, విజ్ఞానాన్ని తెలియజేయడమైనది. ప్రజ్ఞానం అంటే ఎరిగే ఎఱుక కదా! కనుక ఆ పదాలను ఎఱుక పద్ధతిగా మార్చాము. ఎందుకు అలా చేశామంటే, అచల సిద్ధాంతం అంతా కూడా ఎఱుక – బయలు అనే పద్ధతిలో నడుపుతుంది కనుక. ఈ ప్రజ్ఞానమును ఎఱిగే ఎఱుకను, ఆ పదాన్ని వినియోగించుకుని, ఎఱుక అనే పదానికి పర్యాయ పదము తీసుకురావడము జరిగింది.

ద్వితీయాంకములో ఏదైతే అద్వైత నిర్ణయాన్ని, అచల సిద్ధాంతముగా సమన్వయము చేసే దానికి ఆ పదాలయొక్క సామ్యాన్ని ఇక్కడ వినియోగించుకుంటూ ఆ ఎఱుక నిర్ణయాన్ని, ఆ నిర్ణయసారమైనటువంటి లక్ష్యాన్ని కూలంకషంగా వివరిస్తూ ఇందులో బ్రహ్మానుభవం అంటే ఏమిటి? అనేది విషయంగా చెప్పాము. ఎందుకు విషయంగా చెప్పాము అంటే, తిరిగిరాని మోక్షము ఒక్కటే మనకు కావాలి. దానికి సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య ముక్తులని కొన్ని ఉన్నాయి. ఇవి కొంతకాలానికే విడుదల కానీ. మళ్ళీ పునరావృత్తి ఉంది వీటిలో. మనకు శాశ్వతమైన విడుదల కావాలి. కనుక ఈ రకమైన నాలుగు ముక్తులను విషయంగా పెట్టడము జరిగింది.

తృతీయాంకములో కూటస్థమైనటువంటి దానిని వ్యష్టిలో కూటస్థ ఆత్మగా, సమష్టిలో కూటస్థ బ్రహ్మగా తెలపడమైనది. ఆత్మ బ్రహ్మ ఒక్కటే అన్నప్పుడు ఆ బ్రహ్మ మాయాశబలిత బ్రహ్మమా? సగుణమా? నిర్గుణమా? ఆ బ్రహ్మకు సృష్టితో సంబంధం ఉందా? లేదా? అనేటటువంటి నిర్ణయం చేసిన తరువాత, బ్రహ్మ సత్యం తదితరమంతా మిథ్య అన్నప్పుడు, కేవల పరబ్రహ్మమే అద్వయంగా ఉన్నాడు అన్నప్పుడు, అక్కడ ఎక్కడైతే తెగగొట్టామో, జగత్ జీవ ఈశ్వర స్థితులను, గతులను, అవస్థలను, వ్యాపారాలను తెగగొట్టామో, తెగగొట్టేంత వరకూ ఉన్న బ్రహ్మకు సగుణమని, మాయాశబలితమని చెప్పాము. తెగగొట్టిన తరువాత అచలమని, పరిపూర్ణమని చెప్పాము.

దీనిక్రింద అంతకుముందు చెప్పినటువంటి మహావాక్యాలని ఎఱుక నిర్ణయ పద్ధతిగా మార్చి, అచల సిద్ధాంతంలో చెప్పేటటువంటి పద్ధతిగా మార్చి ఆ మహావాక్యాలనే మళ్ళీ విచారణలో తీసుకుని, జీవ ఈశ్వర ఐక్యము భ్రాంతేనని నిరూపించి, శుద్ధముగా, త్రిగుణ రహితముగా ఉన్నటువంటి సత్ గురించియు, ఆ సత్ గురించి తెలియజేసేటటువంటి విద్య సద్విద్యల గురించి వివరించడమైనది. ఇటువంటి సద్విద్య అయినటువంటి సత్ చిత్ ఆనంద పరిపూర్ణమును స్పష్టంగా వివరించాము. అయినా ఎఱుక మిగిలి ఉంటే, జన్మ రాహిత్యము కాదు. కనుక జన్మ రాహిత్యము లక్ష్యముగా, ఎఱుక లేకుండా పోయే లక్ష్యముగా సర్వమూ శూన్యము అయ్యే లక్ష్యముగా అప్పుడు ఏది అన్ని కాలాలలో శేషించి ఉన్నదో, దానిని బయలు అని నిర్ణయముగా వివరించడమయినది. బయలే పరమపదము. తిరిగిరాని మోక్షము. అటువంటివన్నీ కూడా ఈ తృతీయాంకములో ప్రతిపాదనగా తీసుకువచ్చాము. ద్వాదశి, షోడశి, పంచదశి.. అనేటువంటి, అచల సాంప్రదాయమైనటువంటి మంత్రాలు

రహస్యమైనవి. ఈ స్థితికి వచ్చినటువంటి సచ్ఛిష్యుడికి, సాధకుడికి, ఆ రహస్యం బయట పెట్టేటటువంటి సమయం ఆసన్నమైనది. అక్కడ సూచనగా, పరిచయముగా ఈ మూడు మంత్రాలు బయలు నిర్ణయముగా, ఎఱుక అనుభవాన్ని లేనిదిగా నిర్ణయించారు. ఎఱుకలో ఉంటూనే బయలు అనేది నిర్ణయం తీసుకునేలాగా వివరించాము.

ఇక చతుర్థాంకములో బయలు ఏదైతే నిర్ణయమైందో, చివరికి బయలే మిగిలి ఉండి, ఎఱుకను లేకుండా పోయే పద్ధతి క్రింద, కదలనిది అచలమని, కదిలేది ఎఱుక అని యాజ్ఞవల్క్యుడు, అష్టావక్రుడు శుకులవారితోటి, జనకుడుతోటి అనేక స్థాయిలలో సంవాదము అంటే గోష్ఠి జరిపారు. గోష్ఠి అంటే ఒకళ్ళు ఎక్కువ, ఒకళ్ళు తక్కువ కాదు. సమానమనే చర్చ చేస్తారు. అయినప్పటికీ చివరికి ఏమౌతుందంటే, అనుభవజ్ఞులు అక్కడ అధిష్ఠానముగా మారిపోతారు. గోష్ఠిలో పాల్గొని, అనుభవంలో ఏదైనా వ్యత్యాసము ఉన్నప్పుడు కేవలము సత్సంగము చేసో, వస్తువును గ్రహించేవాళ్ళుగానో మిగిలిపోతారు. ఇదీ సంవాదము. సంవాదము జనకుడికి, వీళ్ళకి మధ్యలో జరిగినప్పటికి, ఆ గోష్ఠిలో అనేకమంది పండితులున్నారు, సాధకులున్నారు. వాళ్ళందరికీ కూడా ఇది ఉపయోగమే. ఎలాగైతే కృష్ణపరమాత్మ అర్జునుడికి ఒక్కడికి చెప్పినా, అక్కడ ఎవరూ వినలేదు. తరువాత కలియుగంలో చాలామందికి, చాలా లోకాలలో ఈ భగవద్గీత ప్రచారము జరిగి ఉపయోగపడింది. ఇప్పుడు ఎఱుక అనేటటువంటి భాషకు ఎప్పుడైతే మార్చామో, మలినపుటెఱుక అంటే అజ్ఞానమని, శుద్ధ ఎఱుక అంటే జ్ఞానమని, ఈ రకముగా ఎఱుక ఏ రూపంలో ఉన్నా, అది బయలు కాదు కనుక ఆ ఎఱుక నిర్ణయంలో వచ్చేటటువంటి ముక్తి శాశ్వత ముక్తి కాదు అనేటటువంటి దానిని విపులంగా చెప్పడానికి, ఇందులో అనేక అంశాలు తీసుకున్నాము.

అవి అహంకార నిరసన, చైతన్య నిరసన, కార్యకారణ తను నిరసన. ఇట్లాగ ఒక పన్నెండో, పదహారో భాగాలక్రింద వివరించాము. ఎందుకిన్ని భాగాలు పెట్టామంటే, అద్వైతంలో దేనికైతే అలవాటు పడియున్నారో, దానిని ఎఱుక అనేటటువంటి పదానికి అన్వయం చేసి, ప్రతిపాదిస్తూ ఎఱుక లేనిది కనుక, ఎఱుక – బయలు అనే నిర్ణయ పద్ధతిలో బయలే ఉన్నది, ఎఱుక లేనే లేదు అనే నిర్ణయ పద్ధతిలో అజ్ఞానంతోపాటు జ్ఞానాన్ని కూడా నిరశన చేయవలసిన అవసరమున్నది. చైతన్యం అనేది ఉంటే సర్వవ్యాపకముగా ఉంటుంది. వ్యాపకముగా లేకపోతే కేవలము సత్తాగా ఉంటుంది. ఆ సత్తావల్ల ఈ శూన్యము సర్వమై తోచి, జీవేశ్వర జగత్తులు కూడా తోచి, మళ్ళీ పునరావృత్తి జరుగుతూ వుంటుంది. కనుక ఈ మొత్తానికి ఆధారము, కారణము, మహా కారణము ఏ రూపంలో ఉన్నా కొంతకాలము కదలకుండా ఉన్నా, సత్తామాత్రంగా ఉన్నా, దాని ప్రభావము దీనిమీద ఉంటే మాత్రం, అది కూడా నిరశించవలసి ఉంటుంది. ఆ రకంగా పూర్తిగా నిరశించడానికి మూడే మూడు మంత్రాలు, పరిచయం చేసి ప్రతిపాదించబడినవి.

ఇక్కడ పూర్తి వివరణతో, ద్వాదశి, షోడశి, పంచదశిలు బోధించడము జరుగుతుంది. ఇక్కడ బోధ మనన నిది ధ్యాసలుగా కాకుండా వస్తు నిర్ణయముగా, నిరపేక్షముగా, కేవలము ఇది కాదు, ఇది కాదు, ఇది కాదని, సర్వమూ శూన్యము కాగా, దృశ్య విషయములో సర్వమూ శూన్యము కాగా, దృక్ విషయములో కూడా అష్టతనువుల యొక్క అహంకారములు శూన్యము కాగా, చివరికి ఏది శేషించి ఉన్నదో, అది అచలమని, పరిపూర్ణమని తిరిగి దానినుండి ఏదీ వ్యక్తం కాదని. ఉన్నదున్నట్లు ఉన్నదని ఎఱిగి, ఆ ఎరిగిన ఎఱుకను కూడా గురుకృపతో వదలివేసి, ఏ విధంగా చూసినా, దృక్కుగా, దృశ్యముగా కూడా లేక, త్రిపుటిగా, ద్విపుటిగా కూడా ఏమీ లేదు అనే నిర్ణయంలో బోధయొక్క ముగింపులో గురువు, శిష్యుడూ కూడా లేరనే నిర్ణయంలో ఈ గ్రంథాన్ని పరిపూర్తి చేయడం జరిగింది.

ఈ పరిపూర్తి చేసేటటువంటి క్రమంలో శిష్యుడికి ఏమైనా అందించాలా? అనేటటువంటి దానిని కొంత ప్రింటు అయ్యి, ప్రూఫ్ రీడింగ్ చేసేటటువంటి సమయంలో కూడా కొన్ని పైవి క్రిందకు, క్రిందవి పైకి పెట్టుకుంటూ మరికొంత జతచేస్తూ, అవి కూడా కలిపి తప్పులు దిద్దుతూ ఉన్నటువంటి క్రమంలో మన మేకా నరసింహారావు (నిర్భయానంద) వారికి ఒక రోజున జ్ఞాన సరస్వతి మాత తెల్లవారు ఝూమున ఆయన కూర్చున్న మంచంమీద, ఆయన ప్రక్కనే కూర్చొని, దీనికి సర్వ వేదాంత శిరోభూషణము అని పేరు పెట్టమన్నది. "శిరోరత్నం" అని పెట్టవచ్చు కదా అని ఆయన ప్రశ్నించారు. భూషణము అంటే రత్నము కంటే విలువైనవి దాంట్లో ఉంటాయి, రత్నం ఎంత విలువైనది అయినా అంతకంటే విలువైనది ఉండవచ్చును కదా! దీని విలువను

కొలవలేము. భూషణం అని పెడితే అందులో అన్ని రకాల విలువలు వచ్చేస్తాయి అని ఆమె గురువుగారికి స్పష్టంగా చెప్పడం వలన, చివరికి సర్వ వేదాంత శిరోభూషణము అనేటటువంటి పేరు దీనికి ఖాయమైంది. "ఇంక ఆపు" అన్న తరువాత ఈ మాట కూడా వ్రాయకూడదు. అది ఆపు.. అంటే అక్కడకు గీత కొట్టాలి. కానీ, ఆమె గురువు గారికి చెప్పిందని వ్రాయకపోతే ఎట్లా? అందుకని దానిని విషయంగా వ్రాయకుండా, దానికి ఒక బాక్సు కట్టి, జ్ఞాన సరస్వతి మాత కృపచే సర్వ వేదాంత శిరోభూషణము అనే నామధేయము ఒసంగబడిన గ్రంథరాజము, అమ్మ సాక్షాత్కారముచే పరిసమాప్తము. ఓం శాంతిః శాంతిః శాంతిః అని ఈ రకముగా ముగించడము జరిగింది.

ఈ గ్రంథము (1) ఆత్మ సాక్షాత్కారము (2) ఆత్మానుభవము (3) బ్రహ్మానుభవము (4) మౌన వ్యాఖ్య (5) పరిపూర్ణము అనెడి క్రమములో వివరించబూనడమైనది. దీనికి గ్రంథకర్త లేదు. జ్ఞాన సరస్వతి ప్రేరణము. సద్గురువర్యులైన నిర్భయానంద మేకా నరసింహారావార్యుల వారి స్ఫూర్తియే ఈ గ్రంథముగా రూపుదాల్చినది.

ఈ గ్రంథము తయారు చేసిన వారికి, వ్రాసిన వారికి, అప్పటికప్పుడే పది సంవత్సరాలు శిష్యరికం చేసి, నేర్చుకోవలసినదంతా కలిపి, ఈ గ్రంథము పూర్తయ్యేలోపే అవగాహన అవ్వడము జరిగింది. ఆధ్యాత్మిక ప్రయాణము మురళీకృష్ణకు కానీ, విద్యా సాగర్‌కు కానీ.. అమితమైన వేగంతో ఊపందుకుంది. ఆ గురువు చేతిలో గురువు స్ఫూర్తితో పనిముట్టుగా వ్యవహరించేటటువంటి స్థాయికి ఇద్దరూ ఎదిగారు. అట్టి కారణముచేత ఎలాగైతే భగవంతుడే స్వయంగా చెప్పిన, భగవద్గీత పవిత్రమో, ఆ భగవద్గీతను పూజగదిలో పెట్టి మనం పూజిస్తామో, అలాగే ఈ సర్వ వేదాంత శిరోభూషణము అనే గ్రంథము కూడా పూజనీయమే!

కాని, స్వామి స్ఫురణలో శూన్యము - సర్వము, సర్వము - శూన్యము అని వచ్చింది కదా! అసలు మొదట్లో పెట్టిన పేరు అదే అయితే, జ్ఞాన సరస్వతి పెట్టిన పేరు ముఖ్యము కనుక **"సర్వ వేదాంత శిరోభూషణము"** అని పెద్ద పేరు పెట్టి, బ్రాకెట్‌లో 'శూన్యం-సర్వం, సర్వం-శూన్యం' అని చిన్న పేరు పెట్టడం జరిగింది. ఈ గ్రంథము భగవద్గీత అంత పవిత్రమైనది. గురు సత్తాతో వ్రాయబడినది కనుక ఈ గ్రంథము మీ ఇంట్లో ఉన్నా, చదివినా, ఆ గ్రంథములో ఉన్న విషయము కేవలం విషయంగా కాకుండా, ఎంత అర్థం కానివారికైనా సరే అవగాహన అయ్యి, అనుభవానికి వచ్చేటటువంటి శక్తి ఈ గ్రంథానికి ఉన్నది. కనుక ఇది పవిత్ర గ్రంథము. రేపటినుండి ఈ సర్వ వేదాంత శిరోభూషణము అనే గ్రంథాన్ని సత్సంగముగా మొదలుపెడదాము. నేను కూడా అప్పుడప్పుడు రిఫరెన్సుగా చదవడమే తప్ప, మొదలుపెట్టి చదివింది లేదు. శిష్యులు నాకా అదృష్టాన్ని ఇప్పుడు కలుగజేస్తున్నారు. వారికోసమన్నట్లుగా మొదటిసారి కూలంకషంగా చదువుతూ, చెప్పేటటువంటి భాగ్యం నాకు కలిగింది.

**విజ్ఞాన స్వరూప్**

ఓం

# సర్వ వేదాంత శిరో భూషణము

(శూన్యం - సర్వం, సర్వం - శూన్యం)

**గురుస్తుతి**

**కం. జనులార జనన మరణము । లను దొలగన్ । ద్రోయజాలు లక్షణయుతమై । వినువారికి ।**
**కనువారికి । తన లావెరిగించు దీని । తప్పాక వింటె । అప్పుడె వార । లెప్పుడూ గంటే - కనుకా వినబుద్దైతె ।**
**వినుడీ చదివెద మీకె కనుగొన మనసైతె కనుడీ । పుస్తకమంత । తప్పాక వింటె । అప్పుడె వారలెప్పుడూ గంటే**

ఓ జనులారా! 'జనులారా' - అని ఎందుకు సంబోధించారు అంటే, **జ** అంటే పుట్టేవాళ్ళు, **న** అంటే నశించే వాళ్ళు కనుక జనాలు అంటే చావు పుట్టుకలు ఉన్నవాళ్ళు అని అర్థము. వారికే చావు పుట్టుకలు లేని బోధ కావాలి.

**లక్షణయుతులై :** లక్షణయుతులు అంటే, అజ్ఞానము విడిచి, **'అహంబ్రహ్మాస్మి'** జ్ఞానము పొంది, ఈ అహంబ్రహ్మాస్మి అనేది తిరిగి వచ్చే మోక్షమా? తిరిగిరాని మోక్షమా? అనేటటువంటి పద్ధతిలో బోధ కోసం వినాలి.

**'అహంబ్రహ్మాస్మి'** జ్ఞానంలో యావత్ సృష్టికి బాధ్యత వహించేటటువంటి ఘోర సంసారముంది. అక్కడ బాధపడలేక తగినటువంటి అశరీర గురువులను, దేశికేంద్రులైనటువంటి గురువులను ఆశ్రయించి, బ్రహ్మజ్ఞానం నుండి కూడా విడుదల చేయమని, ఎవరైతే కోరుతారో, వాడు లక్షణయుతుడు.

అద్వైత జ్ఞానము కలగాలంటే సాధన చతుష్టయ సంపత్తి ఎలా ఉండాలో, అది ఉన్న వాళ్ళకే నాలుగు మహావాక్యాలు చెప్పి, **'తత్త్వమసి'** వాక్యంతో అద్వైత జ్ఞానాన్ని సిద్ధింపచేస్తారు కదా సద్గురువులు ! కానీ అది తిరిగి వచ్చే మోక్షమా? తిరిగిరాని మోక్షమా? అనేది తెలియాలి.

ఏ బ్రహ్మ సంకల్పంతో ఈ సృష్టి వచ్చిందో, అటువంటి బ్రహ్మజ్ఞానంలో తిరిగి సృష్టి వచ్చేటటువంటి ప్రమాదంలేని పద్ధతిలో ఒక బోధ కావల్సి ఉంటుంది. దీనినే 'పరిపూర్ణబోధ' అంటారు. కనుక ఈ పరిపూర్ణబోధకు అధికారి ఎవరూ అంటే, **'అహం బ్రహ్మాస్మి'** అనుభవంతో జీవన్ముక్తుడు అయినవాడు. వాళ్ళని ఇక్కడ లక్షణయుతులు అంటున్నారు. ఈ ప్రబోధ తప్పక విని కనియెదరో అన్నప్పుడు

**'ప్రబోధ'** అంటే ఏమిటి?

'బోధ' అంటేనేమో ఒకరు చెప్పేవారు, ఒకరు వినేవారు, అంతవరకే! 'బోధ' అనగా శ్రవణము చేయుటకు వీలైనది. 'ప్రబోధ' అంటే గురువు తన సత్తాతో చెప్పేది, తన స్వానుభవంతో చెప్పేది. శిష్యుడు తను శ్రవణం చేస్తున్నప్పుడే హృదయంలోకి అనుభవముగా స్వీకరించబడేది. గురువు తన సత్తాతో సూచనవాక్యంగా చెప్పేటటువంటిది, శిష్యుడు వినినంతనే గురువు శిష్యుడిలోకి వ్యాపించడం ద్వారా ఆ గురువు యొక్క అనుభవం ఏదో, అదే శిష్యుడి అనుభవంగా మారేటట్లుగా గురువు బోధించే దానిని **'ప్రబోధ'** అంటారు. అటువంటి **'ప్రబోధ'** తప్పక ఎవరైతే వింటారో, ఇక్కడ శ్రద్ధతో అని అనడంలేదు. 'శ్రద్ధ' అంటే సాధన అవుతుంది. ఇంతకంటే మించినది లేదని, ఏమరుపాటు లేకుండా జాగ్రత్తగా వింటారో, మళ్ళీ ధ్యాన పూర్వకముగా విననవసరం లేదు. ఇంగిత జ్ఞానంతో సంశయ నివారణకోసము విన్నట్లుగా వింటే చాలు. మనన, నిది ధ్యాస పూర్వకముగా కాదు. ఇది మననము, నిది ధ్యాస చేసేది కాదు. అది ఎరుకను విడిపించేటటువంటి అచల బోధ. 'లక్షణయుతమైన' – అన్నప్పుడు, అక్కడ మాటలు చెప్తున్నాము. ఇది **'సర్వ వేదాంత శిరోభూషణము'** కనుక, మొదట సాధన చతుష్టయ సంపత్తితో మొదలు పెట్టి, శరీరత్రయ విలక్షణము, పంచకోశ లక్షణ వ్యతిరిక్తము అయినటువంటి ఆత్మ, అవస్థాత్రయ సాక్షి అయినటువంటి ఆత్మకి, ఆత్మానాత్మ వివేకాన్ని ఇచ్చి, నాలుగు మహావాక్యాలు చెప్పినప్పుడు, శ్రవణ మనన నిది ధ్యాసలు తప్పవు, అవి ఉంటాయి.

ఇప్పుడు ఈ కందార్థము ఏమిటంటే, అక్కడిదాకా వచ్చినవాడు లక్షణయుతుడు. ఇక శ్రవణ మనన నిది ధ్యాసలు చేయకూడదు. అక్కడ పూర్తి విడుదల అవ్వడానికి బ్రహ్మజ్ఞానము అనేటటువంటి ఎఱుక కూడా బంధమే – అనేటటువంటి దాంట్లో **'జ్ఞానాతీతబోధ'** కోసము, ఎవరైతే యోగ్యులో వారు లక్షణయుతులు. వారు తప్పక వినాలి. గురువు అందించేది ఎక్కించుకోవాలి. నిర్దుష్టంగా నిర్ణయంగా గ్రహించాలి. సంశయచ్ఛేదముగా, నిస్సంశయముగా, నిర్ణయముగా వినాలి. నిస్సంశయముగా, నిర్ణయముగా వినడాన్ని **'వార్తీక పద్ధతి'** అంటారు. గురువు కూడా ఆ మాదిరిగా అందించడాన్ని వార్తీక నిర్ణయ బోధ అంటారు. ప్రబోధ అంటే ఆ అర్థంతో తీసుకోవాలి.

'వినయెదరో, కనియెదరో'– అంటే, పరిపూర్ణమైనటువంటి అచలాన్ని బయలుగా, పరబయలుగా, గురుకృపతో దర్శిస్తే, ఆ పరబయలు దర్శనం చేత, తదితరమంతా ఏదీ లేదు, అని పూర్తిగా దృశ్యము, దృక్కు వాటికి సంబంధించిన వాసనలతోసహా లేకుండాపోయే పద్ధతి ఆ పరబయలు దర్శనంతో వస్తుంది. కాబట్టి 'కనియెదరో' అంటే – గురువు చూపించగా శిష్యుని చేత చూడబడినది.

అప్పుడే అచల పరిపూర్ణ పరబాహ్యము అనగా 'అచలము' అంటే కదలనిది, **'పరిపూర్ణము'** అంటే – ఎటువంటి ఇబ్బంది లేకుండా, ఎటువంటి అసౌకర్యమూ లేకుండా, పరిపూర్ణమైన తృప్తితో, పరిపూర్ణమైన శాంతితో, ఆ శాంతి నుండి, ఆ తృప్తి నుండి, దేని కోసమూ మళ్ళీ చలించవలసిన, స్పందించవలసిన అవసరము లేదో, అట్టి దానిని 'పరిపూర్ణము' అని అంటాము. ఈ పరిపూర్ణ స్థితి కలిగినటువంటి శిష్యుడు కదలడు. అసలు మన లక్ష్యము కూడా అచల పరిపూర్ణము. కదలకుండా పరిపూర్ణముగా ఉండేదేదో అది. పరిపూర్ణము నందు కదిలే ఆవశ్యకత కూడా ఉండనటువంటిది.

కదలటానికి ఎటువంటి ప్రేరణ వచ్చినా, ఆ ప్రేరణకు స్పందించకుండా వుండేది ఆ పరిపూర్ణము. స్పందన లేకపోవడమే అచలము. మూడు గుణాలతో స్పందిస్తారు ఎవరైనా, కనుక త్రిగుణ రహితమే పరిపూర్ణము. త్రిగుణ రహితమే అచలము. 'అచల పరిపూర్ణము' అని దేనికి చెప్పారు?

అనేక భ్రాంతులతో, అనేక ఎఱుకలతో, ప్రజ్ఞానం అనేటటువంటి ఎఱిగే ఎఱుకతో ఉన్నటువంటి వాళ్ళు, ఆ **'ప్రజ్ఞానం బ్రహ్మ'** అని అదే బ్రహ్మజ్ఞానముగా స్థిరమైనటువంటి వాళ్ళు ఎరుక రూపులే. కనుక అన్ని అనుభవముల యొక్క ఎఱుక, ఎరిగే ఎఱుక యొక్క అనుభవము కూడా లేనిది మరియు ఎఱుకకు వ్యతిరేకార్థముతో ఉన్నటువంటిది బయలు కనుక ఎఱుక లేనిదే బయలు. ఆ బయలు లక్ష్యంతో చెబుతున్నారు. దానికే అచల పరిపూర్ణము అని పేరు.

అయితే ఇక్కడ పరబయలు అని ఎందుకు అంటున్నారు? బాహ్యము అన్నా బయలు అన్నా ఒక్కటే. పరబాహ్యము అన్నా పరబయలు అన్నా ఒక్కటే. బయలంటే సరిపోతుంది కదా! పరబయలు అని ఎందుకు అన్నారు అనంటే, బయలు ఇట్టిది, అట్టిది అనంటే అది కూడా ఎఱుకే. కనుక బయలు తెలిసినప్పటికీ ఈ బోధ ద్వారా బయలు అంటే నిర్ణయమైనప్పటికీ, శిష్యుడు ఎరుకగానే ఉన్నాడు. బయలును ఎఱిగి, ఎఱుకగా ఉన్న శిష్యుడు, ఆ శిష్యుని యొక్క ఎఱుక విడిపించినప్పుడు, ఎఱుక లేని బయలు అని ప్రబోధ ద్వారా తెలియబడినటువంటి లక్ష్యంలో పరబయలు, బయలు కంటే అతీతమైనది. బయలనే ఎరుక కూడా కానిది పరబయలు. అట్టి పరబయలును గురువు చూపిస్తాడు. చూపించగానే ఎఱుక పారిపోతుంది. ఎఱుక లేకుండా పోతుంది. ఎందుకంటే పరబయలు ఈ ఎఱుకకు మూలం కాదు కనుక. వ్యక్తావ్యక్త స్థితిలో మూలమైన దాంట్లో, అవ్యక్తమై, ఎఱుక మళ్ళీ తిరిగి వ్యక్తమవ్వదు. ఈ వ్యక్తావ్యక్తములు లేనిది పరబయలు. వ్యక్తావ్యక్తముగా ఏదైతే ఉన్నదో, వ్యక్తము – అవ్యక్తము రెండూ కూడా పోవలసినవే.

అటువంటి బోధ గురువు తన సత్తాతో శిష్యునికి **'అహంబ్రహ్మాస్మి'** అనేటటువంటి జ్ఞానంతో, యోగ్యత సంపాదించినటువంటి, లక్షణయుతుడైన శిష్యునికి చెబుతున్నారు. అయితే, బ్రహ్మానందము, అద్వైతానందము పొందినటువంటి శిష్యుడు లక్షణయుతుడు అవ్వచ్చు, అవ్వకపోనూవచ్చు. ఆ ఆనందమే గమ్యమూ, లక్ష్యమూ అని ఆ ఆనందంతో ఓలలాడుతూ ఉండి, ఒక బ్రహ్మ యొక్క ఆయుష్కాలము, ఒక కల్పాంతము వరకూ కూడా ఆ ముక్త స్థితిలోనే ఉండి, బ్రహ్మ ఆయుష్షు తీరి, మరొక కల్పమందు, బ్రహ్మ మళ్ళీ సంకల్పం ద్వారా పుట్టి, మళ్ళీ బ్రహ్మాండాన్ని ఆవిర్భవింప చేయాలి – అనే సంకల్పం ద్వారా వచ్చినప్పుడు, ఆ బ్రహ్మ తిరిగి వస్తున్నాడు కనుక, ఈ బ్రహ్మ జ్ఞానము తిరిగిరాని మోక్షము కాదు.

అది తెలియని వాళ్ళు, అక్కడ ఆస్వాదించి, అక్కడ నిర్ణయమై ఉండి పోతారు. ఆ పై బోధగా పరిపూర్ణ బోధగా 'బయలు' ఒకటి ఉన్నదని చెబితే నమ్మరు. ఆ నమ్మకము లేనివాళ్ళు ఆ బయలు నిర్ణయానికి పోకుండా, బ్రహ్మానంద స్థితిలో ఘోర సంసారమున పాట్లు పడుతూ ఉండేవాళ్ళు ఉంటారు. కాని దానిని భరించలేనివాళ్ళు, ఆ పైన ఏదైనా ఉన్నదా అని అంటే, అప్పుడు వాళ్ళు తహతో ఈ 'నిజ ప్రబోధ', 'అచల పరిపూర్ణ పరబయలు'ని నిర్ణయించేటటువంటి బోధ, అశరీర గురువుద్వారా వినడానికి ఉద్యుక్తుడౌతారు. అందుకని 'వినువారికి' అని అన్నాము. 'కనువారికి' అంటే – అద్వైత ఆనందాన్ని కనుట, అంటే ఆనందించుట లేక దర్శించుట అని అర్థము. ఇట్టి అద్వైత ఆనందాన్ని అనుభవించిన వాళ్ళు, దర్శించినవాళ్ళు కనియెదరు. ఇట్లా 'వినియెదరో, కనియెదరో' – పరబయలు లక్ష్యమును ఒప్పుకుంటారో, వాళ్ళు లక్షణయుతులు. అటువంటి వారికి, అచల పరిపూర్ణ పరబయలు యొక్క ఆధిక్యత, గొప్పతనము తెలిపి పరిపూర్ణబోధ, నిజప్రబోధ, తిరిగి రాని మోక్షాన్ని ఇచ్చేది అందిస్తారు. దీని యొక్క మరొక పేరు పరమపదము.

ఈ పరమపదము అన్ని మోక్షాలలో కెల్లా అధికము. దీని యొక్క ఆధిక్యత నమ్మాలి. అదొకటి ఉన్నదని తెలియాలి. తెలిసి నమ్మిన వాడే లక్షణయుతుడు. తెలిసి నమ్మడమంటే, **'అహం బ్రహ్మాస్మి'** జ్ఞానము కలిగినవాడు, ఆ పైన అధికమైనది ఒకటి ఉన్నదని, దాని ఆధిక్యత తెలిసినవాడు, దానిని వినడానికి, ఆ దర్శనాన్ని పొందడానికి, భ్రాంతి నుండి భ్రాంతి రహిత స్థితిలో మేల్కొనడానికి, ఎవరైతే సంసిద్ధులై, ఉద్యుక్తులై ఉంటారో, వాళ్ళకు దీనియొక్క ఆధిక్యతను, వార్తగా ఎవరి ద్వారానో వినగా తెలుసుకున్న శిష్యుడు, అటువంటివాడికి వివరముగా ఈ చావు పుట్టుకలు లేని బోధని, ఆ దేశికేంద్రులు అయినటువంటి అశరీరి గురువు ప్రబోధగా చెప్తాడు. దానివల్లనే చావు పుట్టుకలు లేకుండా పోయి, తిరిగి చావు పుట్టుకలకు వచ్చే ప్రమాదం కూడా లేకుండా పోతుంది.

కనుక వినవలయునని కోరియున్న వారికి నేను చదివెదను వినండి అని గురువు బోధించుట లేదు. నిజానికిది నిజ ప్రబోధయే. ఇక్కడ చదివెదను అంటున్నాడు. బోధిస్తే గురువు కూడా ఎఱుకలో ఉన్నట్లే. బయలు కానట్లే. అందుకని తన స్వానుభవములోనుండి చెప్పేదైతే ఎఱుక బోధ. బయలైన గురువులో అనుభవమే ఉండదు. కనుక స్వానుభవములో బయలు నిర్ణయములో అనుభవము లేదు. కనుక స్వానుభవము నుండి వచ్చేది ఏదీ ఉండదు. ఎఱుకలోకి వచ్చి కూడా చెప్పడం అంటే, యథార్థ స్థితిలో బయలు అయ్యే ఉండి, ఎఱుకను సామాన్యంగా చెప్తాడు. చదివినట్లుగా చెప్తాడు. ముచ్చటలాడినట్లుగా చెప్తాడు. అనుభవంలోనుండి చెప్పడు. ఎందుకనంటే, బ్రహ్మానుభవం అయితే అనుభవంలోనుండి చెప్తాడు. బయలు అంటే అనుభవమే లేదు కనుక, చెప్పేదే లేదు. అటువంటి దాంట్లో ఎఱుకే పుట్టదు. అందుకని ఇక్కడ గురువు చెప్పేటటువంటి బోధ లేనెఱుకలో ఉంటుంది. 'లేనెఱుక' అని అనకుండా, (బోధ లోపలికి వెళ్తే, 'లేనెఱుక' అంటే ఏమిటో తెలుస్తుంది) ఆ పద్ధతిలో చెప్పే గురువుని ఇక్కడ స్తుతిస్తున్నాము. అందుకని 'చదివెదను వినండి' – అని అంటున్నారు. పరిశీలించుటకు ఇష్టమున్నవారు, గ్రంథమును మీరే పరిశీలించండి. ఇక్కడ ఊరికే ఉపక్రమణగా చెప్తున్నాము. ఎవరి ద్వారానో తెలుసుకుని వచ్చిన శిష్యుడికి చెప్తున్నాము. అయితే పరిపూర్ణబోధ కోసం గురుస్తుతి చెప్పాము. కానీ, ఈ సర్వవేదాంత శిరోభూషణములో జీవభావము నుండి బ్రహ్మానుభవము దాకా కూడా ఇందులో వివరించడం జరిగింది.

**రెండవ కందార్థము: చిన కందార్థ దరువులు.**

**కం. గురుమంత్రముచే నిలువని । ఎఱుకను పరిపూర్ణమనుచు ఎఱిగి నిరతమున్ । ఎఱుకైయుండిన**
**వారల । తెరువిక నీకేల వట్టిదీజోలి మానూ । ఎఱుక లేని । యా జోలి బూనూ – గురునీ చే**
**పరిపూర్ణ మరసి ఈ తెలిసీన । యెఱుకనెన్నటికి నీవెఱుగాకు మిది వట్టి । దీజోలి మానూ । ఎఱుకలేని ఆ జోలిబూనూ ॥**

'గురుమంత్రముచే నిలువని ఎఱుకను పరిపూర్ణమనుచు ఎఱిగి నిరతమున్' – కొందరు ఏముందండీ! చెబుతుంటే అర్థమైపోయింది కదా, ఇంకా గురువెందుకు నాకు అంటారు. ఇంకా గురువెందుకు నాకు యూట్యూబ్‌లో వింటాను, వాట్సాప్‌లో వింటాను, ఫోనులో వింటాను అని అనుకుంటారు. ఇది గురుమంత్రము. మంత్రము అంటే – **'మననాత్ త్రాయతే ఇతి మంత్రః'** గురువు చెప్పినది విని అవగాహన చేసుకున్నవాళ్ళకు చావు పుట్టుకలు లేనటువంటి ఒక రక్షణ స్థితి కలిగించేది. దేనికైనా సంప్రదాయం ఒకటి ఉంటుంది. ఆ సంప్రదాయం ప్రకారం గురుశిష్య న్యాయం జరగాలి. ఆ గురుశిష్య న్యాయము ఖచ్చితంగా ఉండి, గురుశిష్య న్యాయముతో శిష్యుడు కడతేరాలి అంటే, మంత్రం అనేటటువంటి శక్తి ఇద్దరి మధ్యా పనిచేయాలి. కనుక గురుమంత్రంతోనే ఇదంతా నేర్చుకోవాలి. గురూపదేశంతోనే దీక్షగా నేర్చుకోవాలి. అలా కాకపోతే ఇది నిలువదు. ఈ బోధ నిలువదు. గురుమంత్రముచే నిలువని ఎఱుకను అంటే, గురుమంత్రం తీసుకుంటే ఎఱుక నిలువదు, పారిపోతుంది. శిష్యుడు బయలైపోతాడు. కడతేరుతాడు.

కాని, **'ఆ ఎఱుకనే పరిపూర్ణమనుచు ఎఱిగి నిరతమున్'** – ఎఱుకై ఉంటే ఎట్లా? మంత్రము మననము చేస్తే రక్షిస్తుంది అంటే, మననము చేసేది ఎఱుకే కదా! ఇక్కడ మననము జరుగ కూడదు. వస్తు నిర్ణయము అయిపోయి, ఆ నిర్ణయ పద్ధతిలో నిర్ణయానుసారము అలా ఉండిపోవాలి. **'ఆ ఎఱుకైయుండిన వారల – తెరువిక నీకేల ? వట్టి దీజోలి మాను'** – అంటే, పాత పద్ధతి ఏదైతే ఉందో, అది మాను. **'ఎఱుకలేని ఆ జోలి బూను'** – ఎఱుకతో జెప్పేటటువంటి బోధ మాను. ఎఱుక లేకుండా, ఎఱుకను విడిపించే పని పూనుకో! అట్టిపెట్టుకో, అటువంటి గురువును పట్టుకో!

ఎఱుక మిగిల్చేటటువంటి బోధ గురువును వదలివేయి. అయితే ముందు ఎఱుక మిగిల్చే గురువునే పట్టుకుని, బ్రహ్మజ్ఞానం పొందావు. అక్కడికి ఆ గురువు గొప్పే! ఆ గురుకృప లేనిదే ఇక్కడిదాకా రాలేదు కదా! ఒక వేళ ఆ గురువే పై బోధ చెప్పవచ్చు. లేదంటే అక్కడి వరకూ చెప్పిన గురువునే భక్తితోనే, సాంప్రదాయంగా పెట్టుకునే, అత్యధికమైనటువంటి తిరిగిరాని మోక్షము, పరమపదము గురించి చెప్పేటటువంటి బోధ, ఎఱుక విడిపించేటటువంటి బోధ, ఎక్కడ ఎవరి ద్వారా దొరుకుతుందో, ఆ గురువును కూడా పట్టుకో! ఆ గురువు చెప్పే బోధ, ఎఱుకలో చెప్పే బోధ కాకుండా, ఎఱుక విడిపించే బోధ కావాలి.

ఈ విధముగా సత్ చిత్ ఆనందము అనేటటువంటి, బ్రహ్మానుభవము కూడా ఎఱుకే కనుక, అక్కడిదాకా వచ్చి, లక్షణయుతుడైనటువంటి శిష్యుడు, ఆ పై బోధకై, తిరిగిరాని మోక్షము కోసము, పరమపదము కోసము, ఎఱుక లేని బోధ పూనుకోవాలి. **'నీకేలా వట్టిదీ జోలి మాను'** – ఎఱుకను దృఢపరిచి, స్థిరపరిచేటటువంటి బ్రహ్మానందము అనే లక్ష్యాన్ని చెప్పే బోధ ఇక్కడి దాకా మంచిదే! కానీ, ఇక మానివేయి, ఇక వదిలేయ్. ఎరుక వట్టిదే, ఉళక్కి ఆ తరువాత ఎఱుక లేని ఆ జోలి బూను. ఎక్కడ ఆ ఎఱుక లేకుండా చేసేటటువంటి, బోధ ఉన్నదో దానిని పూనుకో! 'గురువు నీచే పరిపూర్ణము అరసి' – నీకు పరిపూర్ణము అంటే ఏమిటో తెలియజేసి, **'ఈ తెలిసినా ఎఱుకలన్నిటిని నీవెఱుగకు'** – ఇంతకు ముందు తెలిసినటువంటి ఎఱుకలన్నీ కూడా ఔననకు, కాదనకు. ఆ బోధను మరిచిపో! వాసనతో సహా మరచిపో! ఆ బోధ బ్రహ్మజ్ఞానం వచ్చేంత వరకే!

ఏరు దాటించే తెప్ప, ఏరు దాటేంత వరకే ఉపయోగపడుతుంది. ఏరు దాటటానికి ఆ తెప్పలేకపోతే దాటేవాడే కాదు. అంతగొప్పది ఆ తెప్ప. ఏరు దాటాక ఇంకా నాలుగు మైళ్ళు నడవాలి. తెప్పతో ఇక పనిలేదు. తెప్ప అనే బరువును అక్కడ వదిలించుకుని తేలికగా చేసే ప్రయాణము, కష్టము లేకుండా ఆ పైబోధ వినడానికి అనుకూలంగా ఉంటుంది. ఎఱుక అనేటటువంటి బరువు మోసుకుంటూ వస్తే, ఎఱుక విడిపించే గురువు దగ్గర కుదరదు. ఎఱుకను అక్కడ నువ్వు వదలాలి అనేటటువంటి నిర్ణయం తీసుకుని, ఎఱుక నీ వెంట రాకుండా, ఎఱుకను విడిపించేటటువంటి కీలకము, రహస్యము, గురువు చెబితే, ఆ రహస్యాన్ని అవగాహన చేసుకుని ఎఱుక విడవాలి. అంతకు ముందు ఉన్న ఎఱుకంతా కూడా ఏదైతే నేర్చుకొన్నారో, ఆ నేర్చుకున్నదంతా వదలివేయాలి. జ్ఞానమనే ఎఱుకను వదలాలి. బ్రహ్మజ్ఞానం కోసం ఏదైతే తెలుసుకున్నారో, ఆ తెలివంతా మానాలి. అప్పుడే బయలు లక్ష్యము, స్థిరము, సిద్ధము అవుతుంది. ఈ తెలిసిన ఎఱుకనెన్నటికీ నీవు ఎఱుగాకు. ఇంతకు ముందు తెలుసుకున్న ఎఱుకను ఎఱుగాకు. అంతేకాదు బయలు నిర్ణయంగా గురువు చెప్పేది అర్థం చేసుకోవాలి. అంతేగాని అది మననము చేసి, నిదిధ్యాస చేసి, నాకు బయలంటే తెలుసు అని అనుకుంటే అది ఎఱుకే అవుతుంది. కనుక బయలు ఒకటి ఉన్నదని తెలుసుకుని, బయలంటే ఇదికాదు ఇదికాదని, సర్వ ఎఱుకలను విడిపించే వరకూ, దానిని అవగాహన చేసుకుని, మీ బుద్ధిలో నిర్ణయము చేసుకుని, ఆ నిర్ణయమైన తరువాత దానిని కూడా వదిలేసేయి. ఎందుకంటే బయలంటే ఏమో తెలిసిన ఎరుకను కూడా వదలాలి కాబట్టి. దానిని కూడా వదిలేయి.

'నీవెఱుగాకుము. ఇది వట్టిది. దీని జోలి మాను' – ఎఱుకనేది తెలుసుకోవచ్చు, బయలు అనేది కూడా తెలుసుకోవచ్చు. ముందు తెలుసుకో, తరువాత తెలుసుకునే తెలివి మానెయ్యి. తెలుసుకునే తెలివిని మూట కట్టి వదిలివెయ్యి. **'ఎఱుక లేని ఆ జోలి బూను'** – పరిపూర్ణ బోధ ద్వారా తిరిగి రాని పరమపదాన్ని ఇచ్చేటటువంటి బయలు, లేక పరబయలు ఏదైతే ఉందో, ఆ లక్ష్యంగా ఉన్నటువంటి దానిని నువ్వు పూనుకో!

ఓ శిష్యుడా! **'సద్గురుడు తెలిపిన పరిపూర్ణ బయలు నందు, నిలువని ఎఱుకను'** – ఆ బయలందు ఎఱుక నిలబడదు. ఎందుకంటే బయలు బయలుగానే ఉంటుంది గాని, ములుగ్రుచ్చ సందులేక నిండి నిబిడీకృతమై, బయలే ఉంటుంది కాని, దాని యందు రెండవ వస్తువు ఉండుటకు అది అవకాశమివ్వదు. అందువల్ల ఎఱుకనేది రెండవది, బయలు కంటే వేరైనది, నిజానికి లేనే లేదు. ఒక వేళ ఉందనుకున్నా, ఎఱుక బయలందు నిలువ లేదు. బయలు ఎఱుకను పుట్టించదు. బయలు ఎఱుకను తనయందు లయము చేసుకోదు. బయలు వ్యక్తముగా కానీ, అవ్యక్తముగా కానీ, ఏ కాలమందునూ ఉండదు. ఎఱుక నిలిచేందుకు మూలముగానీ, స్థానము గానీ బయలందు లేదు.

కనుక మన అనుభవములో ఎఱుక ఉన్నది కదా అంటే, ఏదైనా ఎఱుకంతా కూడా భ్రాంతే! లేకనే ఉన్నట్లు తోచినదే! లేకనే ఉన్నట్లు తోచినదేనని, విచారణ వలన నిర్ణయమైనప్పుడు బయలు తప్ప మరొకటి లేదు. పరబయలు నందు ఎఱుక నిలువదు. కనుక ఎఱుకతో ఉన్నవాళ్ళు పరబయలు నిర్ణయాన్ని చేయలేరు. కానీ పరబయలును తెలుసుకోవాలంటే ఎఱుక కావాలి. అందుకని ఏమంటున్నారంటే, తెలుసుకుని తెలుసుకున్న ఎఱుకని కూడా వదిలేసినప్పుడు బయలయ్యి ఉంటాడు సచ్ఛిష్యుడు. దానిని నమ్మండి. ప్రస్తుతం బోధ గురుప్రార్థనతో మొదలయ్యింది కానీ, బోధ చేయట్లేదు. అయితే, ప్రార్థన యొక్క అర్థాన్ని చెబుతున్నాము మనము. ఈ వివరము మూడవ అధ్యాయములో పరిచయముగా ప్రతిపాదనగా వస్తుంది. నాల్గవ అధ్యాయములో వస్తు నిర్ణయముగా తెలుస్తుంది. మనము ఇప్పుడు ఎక్కడ నుండి మొదలుపెట్టాము అనంటే, జీవభావంలో మొదలుపెట్టాము.

**'మొదలచలమునెఱిగించెద, ఆపై లేనెఱుకను వివరించెద'** అన్నారు. 'ఎఱుక లేనిదే', ఆ లేనెఱుక ఎలా ఉన్నట్లుగా ఉందో, సాంఖ్య తారక అమనస్కములో వివరిస్తాము. **'తుదకు ఎఱుకను విడిపించెద'** – లేనెఱుకను విడిపిస్తాము. లేనిది లేకుండా పోతే, ఉన్నదేదో ఉన్నది. అదే బయలు. ఆ పద్ధతిగా సాగుతుందది. ప్రస్తుతానికి పరిపూర్ణము అనేది ఒకటి ఉన్నదని, అది అచలమని, అది బయలని నమ్మి, ఎల్లప్పుడు ఎఱుకై ఉన్నటువంటి, పామరుల యొక్క మార్గము నీకెందుకు? బ్రహ్మజ్ఞానము కలిగి అదే గమ్యము, అదే లక్ష్యము, ఇక నాకు పై బోధ అక్కర్లేదనేవాడు మూర్ఖుడు, మూఢుడు, పామరుడు అని చెబుతున్నారు.

జీవభావం దగ్గర ఉన్న పామరుడు, జ్ఞానం వస్తే, వాడు పామరుడు కాదు అని మనం చదువుకున్నాము. వాళ్ళు అహంబ్రహ్మాస్మి జ్ఞానంతో ఆగిపోయి, ఆనందపడుతూ అదే మోక్షం అనుకునే వాళ్ళు బుద్ధి హీనులు, పామరులు. అటువంటిది నీకెందుకు? ఆ తత్త్వమసి వాక్యార్థముతోటి, **'అసి పదము'**గా నీవు మారాలి. అసి పదమే బయలు. తత్పదం కాదు. అది భ్రాంతి లక్షణం. కనుక ఆ జోలి విడువుము. ఆ జోలికి వెళ్ళవద్దు. ఎఱుకలేనట్టి అచల పరిపూర్ణ పద్ధతి అనుసరించుము. సద్గురుమూర్తిచే పరిపూర్ణ పరబయలును ఎఱిగి తరువాత ఆ ఎఱిగిన ఎఱుకను కూడా, ఎప్పుడూ ఎఱుగ వద్దు అని భావము. దానికి శిష్యుడు ఏమంటున్నాడు?

**కం. అనిమెచ్చి ఏమి ఇచ్చెద । వని గురు దక్షిణ నటంచు నతడడిగిన ।**
**నన్నని పల్కె శిష్యరత్నము । విని ఇది ఇక ముట్టబోక విహరించు మనెన్ ॥**

**'పరిపూర్ణబోధ'** అయిపోయింది. పరిపూర్ణ బోధ అయిపోతే ఈ శిష్యుడు దాదాపు, ఎఱుక విడిచి లేనివాడై, బయలై యున్నాడు. బయలైనటువంటి శిష్యుడికి మళ్ళీ గురువు ఏం చేస్తున్నాడు? అంటే, శిష్యుడి పరంగా లేకపోతే గురువు తన ఎఱుకని అప్పుగా ఇచ్చాడు. ఈ ఎఱుక నాది. నేనిచ్చింది. నీకు ఎఱుకేలేదు. నేను ఇచ్చిన ఎఱుకతో నాకు జవాబు చెప్పు అన్నాడు. ఏమిటా ప్రశ్న? ఇంత పని చేశాను కదా నీకు, తిరిగిరాని మోక్షము వచ్చే పద్ధతి చెప్పాను, నువ్వు కడతేరావు, నీకు ఇక ఎఱుక లేదు. నేను అప్పుగా ఇచ్చిన ఎఱుక ఉంది. ఆ ఎఱుకతో నాకు గురుదక్షిణ ఏమి ఇస్తావో చెప్పు అని అడిగాడు గురువు.

**'అని మెచ్చి'** – అని మెచ్చి అంటే శిష్యుడు అక్కడి దాకా గురువు అందించినది అందుకున్నాడు కాబట్టి, గురు దక్షిణ ఇవ్వాలి కదా! గురు కృపకు పాత్రుడై, గురువు అందించినది అందిపుచ్చుకుని, ఈ నిజప్రబోధ విధానంలో కృత కృత్యుడయ్యాడు. అనుకున్నది సాధించేసాడు. లక్ష్యం సిద్ధించింది. గురువు మెచ్చుకొనుచున్నాడు. అటువంటప్పుడు గురు దక్షిణ ఇవ్వాలి కదా!

**'ఏమిచ్చెదవని గురుదక్షిణ నటంచు నతడడిగిన'** – అప్పుడు శిష్యుడు ఏమన్నాడు? **'నన్నని పల్కె శిష్య రత్నము'** – నన్ను నేనే సమర్పించుకుంటున్నానన్నాడు శిష్య రత్నము. నేను నేను అనేది ఇచ్చేస్తున్నాను అన్నాడు. నేను అనే ఎఱుకను ఇచ్చేస్తున్నాడు. అహం, అహం అనే ఎఱుకను ఇచ్చేస్తున్నాడు.

**'విని ఇది ఇక ముట్ట బోక విహరించు మనెన్'** శిష్యుడు నన్ను నేనే సమర్పించుకొంటున్నాను, పూర్తిగా సమర్పించుకొంటున్నాను, మళ్ళీ ఈ 'నేను'ను నేను తీసుకోను, అన్నప్పుడు గురువు అది విని, ఇది ఇక ముట్టబోకు. నీ ఎఱుకని నాకు ఇచ్చేసావు కదా! నీలో ఉన్న నేనును నాకు ఇచ్చేసావు కదా! మళ్ళీ ఈ నేను నీ దగ్గరే ఉంటుంది. నాకిచ్చినా నేనేం చేసుకుంటాను, నేను బయలుగానే ఉండాలనుకుంటున్నాను. నిన్ను బయలు చేసాను. లేనెఱుకని నీకు అప్పిచ్చాను. లేనెఱుకలో గురుదక్షిణ అడిగా. లేనెఱుకలో **"నన్ను నేను ఇచ్చేసుకుంటున్నాను"** అన్నావు. ఈ లేనెఱుకగానే ఉండు. మళ్ళీ **'అహం'** అనేటటువంటి ఎఱుకను వాడుకోకు. కాని నీది కానట్లుగా వాడుకో! శరీరం పడిపోయేదాకా, ప్రారబ్ధం ఉంది కాబట్టి వాడుకో, కావాలంటే నీవు ఇతరులకు కూడా పరిపూర్ణ బోధ చేయాలంటే... లేనెరుకలో ఈ నేనును వాడుకో ! కానీ లేని నేనుగా ఉండు! మళ్ళీ ఈ నేను నిజమనుకుని, విక్షేపముతో వ్యవహరించవద్దు. ఇక ముట్టబోక అంటే, ఆ నేనుని మళ్ళీ తెచ్చుకోవద్దు అని. గురుదక్షిణగా ఇచ్చినటువంటి నేనును మళ్ళీ తెచ్చుకోవద్దు. లేని నేనుతో వ్యవహరించు. శరీరము పడిపోయే దాకా వ్యవహారము తప్పదు గనుక, లేని నేనుతో వ్యవహరించు.

ఓ శిష్యుడా! నేను నీకు చెప్పిన మార్గమును, ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకున్నావు. పరిపూర్ణబోధ అయిపోయాక, చివర్లో చెప్పే మాట ముందే చెబుతున్నాము. నీకు లక్ష్యం స్థిరమవ్వడం కోసము, లక్ష్యం ఉండాలి. అందుకే 'మొదలచలమును ఎఱిగించెద' – వివరాలు తరువాతి సంగతి. ముందు దానికి కట్టుబడి ఉండు. ఒకరికి జరిగింది చెబితేనే మీరు అనుసరిస్తారు.

ఆయనన్నీ మాయ మాటలు చెబుతారు, అదంతా జరిగేనా, పెట్టేనా? బయలంట బయలు, బయలంటే శూన్యమేగా! లేకుండాపోతే మోక్షమేంటి? శాశ్వతంగా, ఆనందముగా ఉండేది మోక్షము కదా! అనే భ్రమ ఉంటుంది కదా! ఆ భ్రమలో ఉన్నవారికి అది నిజమే కదా! అందుకోసం లక్ష్యాన్ని కూడా ముందు చెప్పాలి. ఋజువు కోసం, కొత్తగా వచ్చిన శిష్యుల కోసం, కొందరు తరించిన వారి యొక్క వివరం చెప్పాలి. అందుకే యాజ్ఞవల్క్యుడు జనకుని తరింప చేసాడు బయలుగా! అలాగే, దక్షిణామూర్తి సనకసనందనాదులను తరింప చేసాడు. బ్రహ్మనిష్ఠ నుండి విడుదల చేసి బయలులో చేర్చాడు. అదే పరమపదము.

ఇలా కొన్ని ఉదాహరణలు ఉంటే, ఇది పిచ్చి బోధ, మాయ బోధ, మోసం చేస్తున్నారు అనుకోకుండా, అవగాహనతో, బుద్ధిలో నిర్ణయముతో, ఈ బోధ వినటానికి మీరు వస్తారు. అందుకే ముందే చెప్పారు. **'వినువారికి, కనువారికి'** – అని, వినబుద్ధి అయితే రండి లేకపోతే పొండి అన్నారు. ఏమిటి? ఈ బోధ ఎవరికి కావాలి? గురువు గారు మోసం చేయడానికేమీ కాదు, వినాలనుకుంటే వినండి. ఇది ఒకటి ఉంది. లేదూ? బ్రహ్మానందముతో ఆగిపోతాను అనుకుంటే ఆగిపొండి. మీ ఇష్టం. కాని ఇష్టం కూడా గురువే కలిగించాలి కదా! అజ్ఞానులకు ఇష్టం ఎలా ఉంటుంది? జ్ఞానము విషయంలో ! అజ్ఞానమే గొప్పదంటారు కదా! ఎఱుకలో ఉన్నవాళ్ళు బ్రహ్మానందమనే ఎఱుకే గొప్పదంటారు కదా! ఆ బ్రహ్మానందాన్ని కూడా వదులుకుంటే, ఏది శేషించి ఉంటుందో అది బయలని, అదే పరమపదమనీ చెబితే నమ్మర్దూ? నమ్మినా గాని, నాకు బ్రహ్మానందము ఉండాలి, పోకూడదు అంటారు.

అందుకని ఒక శిష్యుడు ఎలా కడతేరాడో చెబుతున్నాడు. గురుదక్షిణగా **'నన్ను అనే నేను'**ను సమర్పించిన తరువాత, లోక వ్యవహారానికి దీనిని **'లేని నేను'**గా ఉపయోగించుకోవాలి గాని, నువ్వు నిజం కాదు. **'నేను'**ను మళ్ళీ ముట్టుకోవద్దు. 'నేను నిజం' అనే ఎఱుకగా కూడా నువ్వు ఎప్పుడూ భావన చేయవద్దు. అని చెప్పారు. 'నన్నే' గురుదక్షిణగా ఇస్తున్నాను అని శిష్యుడు చెప్పగా విని, అట్లు ఇచ్చిన యెడల దీనిని నీవు అంటకుండా ప్రవర్తించు. అనగా స్థిరమైనటువంటి, స్థితమైనటువంటి, ప్రజ్ఞా రూపంలో ఉండి, నేను అనేది లేకుండా చేసి, వ్యవహారార్థము **"లేని నేనుగా"** ఉండమని అర్థము. స్థిత ప్రజ్ఞుడు అంటే, ఇక్కడ కదలకుండా ఉండేటటువంటి ప్రజ్ఞలో నీ స్వానుభవంలో నీవు ఉంటే, లోక వ్యవహారానికి ఈ నేను లేనిదని తెలిసి, 'లేని నేను'ను వ్యవహారం వరకే ఉపయోగిస్తూ, వ్యవహారం లేనప్పుడు నేను కూడా లేకుండా, అలా చేసుకోమన్నారు. ఇది జీవన్ముక్త స్థితి. అలా ప్రవర్తన చేసుకోమని గురువు ఆజ్ఞాపించాడు. ఇక్కడ గట్టిగా చెప్పాలి, బ్రతిమాలితే కాదు. అందుకే ఆజ్ఞాపించాడు. ఇది లక్ష్యమని చెప్పాము. కడతేరే విధానాన్ని చెప్పాము. కడతేరినవాడు ఎలా ఉంటాడో చెప్పాము. ప్రస్తుతము మన లక్ష్యము చెప్పడము అయిపోయిన తరువాత, సాధన చతుష్టయ సంపత్తితో జీవుడు తన సాధనను మొదలు పెడుతున్నాడు.

**శ్లో॥ గురుమధ్యే స్థితం విశ్వం । విశ్వమధ్యే స్థితో గురుః ।**
**గురుర్విశ్వం నచార్న్యోతి । తస్మై శ్రీ గురవేనమః ॥**

ఈ విశ్వమంతా కూడా గురువుయొక్క అదుపాజ్ఞలలో ఉన్నది.అయినా ఇంతటి విశ్వంతో గురువుకేమీ సంబంధము లేదు. ఇంతటి విశ్వంలో గురువుని వెంబడిస్తూ, గురువుని ఇంటా వెంటా జంటా పెట్టుకుని ఆర్తితో, శ్రద్ధతో, ఏకాగ్రతతో, నిర్దుష్టముగా తను కడతేరే విధానం కావాలని ఎవరైతే ఉన్నారో వారికొరకు ఆ సద్గురువు బయలైయుండి కూడా లేనెరుకలోకి దిగి ఆ శిష్యుని యొక్క యెఱుక విడిపిస్తాడు.

యావత్ విశ్వంలో ఎవరు ఎక్కడ ఉన్నా కూడా అక్కడ ఈ విధమైన ప్రక్రియ గురువు ద్వారా జరుగుతుంది.

ఇక్కడ విశ్వం అనే పదం వాడారు. ప్రతి ఒక్క బ్రహ్మాండానికీ త్రిమూర్తులుంటారు.అనంతకోటి బ్రహ్మాండాలకు అనంతకోటి త్రిమూర్తులుంటారు. ఈ త్రిమూర్తులతో సహా అనంతకోటి బ్రహ్మాండాలు భ్రాంతి లేనివే. ఈ లేనివన్నీ గురువులో లేనెరుకలో ఉంటాయి. నిజముగా ఉండవు. గురువనే పాత్ర పోషిస్తున్నాడు కాబట్టి అవి లేనెరుకగా ఉంటాయి.

గురువనే పాత్ర లేకపోతే ఆ గురువుగా కూడా తాను లేనివాడు. తనకంటే అన్యము లేనివాడు. విశ్వం మాటేలేదు. విశ్వంలో గురువుంటేనే ఉపయోగము సచ్ఛిష్యులకు.

ఇటువంటి లక్షణయుతులైన శిష్యులకు ఉపయోగం కలగాలంటే గురువు విశ్వంలో ఉండాలి. అయితే తాను తానైనటువంటి యదార్థ స్థితిలో ఉంటూనే శిష్యులకు దొరకడానికి వీలుగా ఉండాలి. దొరికేటటువంటి ఉపాయము, కీలకము శాస్త్రములో ఉన్నది. ఆ కీలకాన్ని శిష్యుడు ఉపయోగించుకొని గురువును, తన కోసము బయలునుండి లేనెరుకలోకి రప్పించి ఆ గురువును వెంబడించి, తన "ఎఱుకను" గురువుచేత తానే విడిపింప చేసుకుని తాను కూడా ఆ గురువువలె బయలై యుండాలి.

అందువలన గురువు విశ్వంలో ఉన్నాడనే చెపుతున్నాము. గురువుయొక్క అంతరంగములో విశ్వమంతా ఉన్నది. ఆయన అంతరంగము వ్యక్తము చేస్తే, విశ్వావిర్భావము అవుతుంది. వ్యక్తము చేయాలనే ఇచ్ఛకనుక గురువుకు లేకపోతే, అది అవ్యక్తము గాక అలాగే ఉంటుంది.

**విశ్వ మధ్యే స్థితో గురుః**

విశ్వమంతా కూడా అనంతకోటి బ్రహ్మాండాలు కలిగి ఉంది. ప్రతి బ్రహ్మాండములోనూ కూడా అనంతకోటి పిండాండాలు. ఈ బ్రహ్మాండ పిండాండాలన్నింటిలోనూ ఎక్కడికక్కడ **"అణోరణీయాన్"** గా గురువు దొరుకుతాడు.

**"గురుర్విశ్వం నచాన్యోఽతి ?తస్మై శ్రీ గురువేనమః"??**

ఈ విశ్వమనేది బ్రహ్మాండము కంటే అతీతమైనది. అటువంటి ఈ విశ్వమంతా గురువునందున్నది. గురువు ఈ విశ్వమంతా వ్యాపించియున్నాడు. ఇది ఊహకు అందదు. ఒకపాము తన్ను తాను తినటము మొదలుపెట్టి తన తోకను తానే మింగుతుంది. చివరకు ఏం మిగిలింది? తినబడిన పాము మిగలలేదు! తిన్నపాము ఉందిగా! కాని తన్ను తాను తిన్నప్పుడు తానే ఉండకూడదుగా! ఇది ఊహకు అందని విధము.

**"గురు మధ్యే స్థితం విశ్వం ?విశ్వ మధ్యే స్థితో గురుః "**

అనేది కూడా ఊహకు అందదు. ఒక పదునైన, సున్నితమైన ఊహను మీరు పెంచుకుంటే హృదయ స్థానములో అర్థమవుతుంది. ఈ మేధస్సుకు, బుద్ధికీ అర్థంకాదు. కనుక విశ్వమంతా సద్గురువే. అలా అనుకోవాలి. విశ్వం భ్రాంతి , కల్పితము కనుక అంతా గురువే ఉన్నాడు, గురువు తప్ప అన్యము లేదు. ఆ గురువే ఈశ్వరుడు. **"ఈశ్వరో గురురాత్మేతి"**

గురువైనవాడు ప్రస్తుతానికి లక్ష్యమైన ఈశ్వరుడూ తానే, లక్ష్యమూ తానే, లక్ష్యాన్ని అందించే మార్గమూ తానే. అందువలన శిష్యునికి అవసరమయినప్పుడు అందుబాట్లో ఉండేది కూడా తానే. అందుబాటు అయినవాడు జీవము, లక్ష్యానికి తీసుకు వెళ్ళేవాడు మార్గము, లక్ష్యమే తానైనవాడు సత్యము. అందుకని ఏసుక్రీస్తు **"జీవము నేనే, మార్గము నేనే, లక్ష్యము నేనే"** అన్నాడు. ఇక్కడ కూడా అంతే. లక్ష్యమనే ఈశ్వరుడు తానే గురువై, మార్గమై, సత్యమైనవాడు శిష్యునియొక్క ఎఱుక స్థాయికి దిగి, తాను మాత్రము లేనెరుకలో ఉండి శిష్యుని యొక్క భ్రాంతిలో ఉన్న నిజమనుకునే ఎఱుకను విడిపించి, ఎఱుక లేకుండా చేస్తాడు. ఎఱుక లేకుండా పోయిన వెనుక అంతా బయలే. గురువూ బయలే. శిష్యుడు బయలే.

దీంట్లో అనేకత్వము గానీ ద్వైతము గానీ, గురు శిష్యభేదము గానీ, ఏదీ ఉండదు. పని పూర్తయేదాకే ఇదంతా. పూర్తయే దాకా ఉన్నవి, జరిగినవి అన్నీ భ్రాంతిలోనే. కలలో జరిగినట్లే ఇదంతా జరుగుతుంది. మీరంతా కలలో ఉన్నారు. మీ కలలోకి నేనొచ్చాను. కలలో ముచ్చటలాడినట్లుగా ఈ బోధంతా మీకు చెపుతున్నాను. కల చెదిరిపోయాక గురువూలేదు, శిష్యుడు లేదు.

అసలు అయినదీ లేదు, కానిదీ లేదు. ఉన్నదేదో ఉన్నదున్నట్లున్నది అని చిన కందార్థాలలో ఒక కందార్థములో ఆ భావము తోటి చెప్తారు. ఇంతటి స్థితి కలిగినటువంటిగురువుకు నమస్కరిస్తున్నాను. నమస్కారము అంటే అర్థము తెలియాలి. నమః అంటే "నేను లేను" అని. "న" అంటే లేను. "మః" అంటే ఉనికి. "నమః" అంటే ఉనికిగా లేను. అంటే నన్ను నేను సమర్పించుకుంటున్నాను. లేని పద్ధతిగా సమర్పించుకుంటున్నాను. గురువుకి తను లేని పద్ధతిగా తనలో ఉన్నటువంటి లేని నేనును తాను లేకుండా పోయే పద్ధతిగా ఆ"నేను" ను సమర్పించుకోవడమే "నమః". దీనినే కైంకర్యము అని కూడా అంటారు.

**శ్లో ॥ శ్రీమత్పరబ్రహ్మ గురూస్మరామి । శ్రీమత్పరబ్రహ్మ గురూభజామి ।**
**శ్రీమత్పరబ్రహ్మ గురూవదామి । శ్రీమత్పరబ్రహ్మ గురూనమామి ॥**

మొదట్లో **"స్మరామి"** అన్నారు. తరువాత **"భజామి"** అన్నారు. తరువాత **"వదామి"** అన్నారు. తరువాత **"నమామి"** అన్నారు. గురువునేమో **"పరబ్రహ్మ స్వరూపం"**గా చెప్పారు. అద్వైతములో పరబ్రహ్మ అన్నపుడు వస్తునిర్ణయంలో అదే అచల పరిపూర్ణ పరబ్రహ్మ. ఆ మాట తరువాత, ముందు పరబ్రహ్మ అనే పెట్టుకుందాము. గురువే సాక్షాత్ **"పరబ్రహ్మ"**

సృష్టి స్థితి లయలు జరుగుతున్నప్పటికీ, సృష్టి స్థితి లయలు చేస్తున్నటువంటి గానుగెద్దులాంటి బాధ్యత ఆ గురువుకు లేదు. త్రిమూర్తులకు మాత్రము ఉన్నది. యదార్థముగా గురువు **"సాక్షాత్ పరబ్రహ్మ"**. సృష్టి స్థితి లయలు చేస్తున్న త్రిమూర్తులు సాక్షాత్ పరబ్రహ్మ కాదు. ఒక్క దత్తాత్రేయులే సాక్షాత్ పరబ్రహ్మగా ఉండి అవసరార్థం సృష్టి స్థితి లయలను లేనెరుకగా చేశాడు. పురాణంలో ఒక కథలో ఉన్నది. పిలిస్తేనే వచ్చాడు గాని, తన ధ్యానంలో అనగా తాను తానైనటువంటి నిజ తపస్సులో బయలై యున్నాడు.

ఆర్తితో అవసరార్థము త్రిమూర్తులలో ఒకడైనటువంటి శివుడు పిలిస్తే వచ్చాడు.అదికూడా శివుడు తనంతట తాను పిలువలేదు.అత్రి మహర్షి వద్దకు వెళ్ళి మాత అనసూయతో పిలిపిస్తే వచ్చాడు.అసూయ అంటే బేధము.అనసూయ అంటే అబేధము. అత్రి అంటే త్రిగుణ రహితస్థితిలో అబేధ స్థితిలో శుద్ధమైనటువంటి ఒక సంకల్పాన్ని ఆ బయలుగా ఉన్నటువంటి దత్తాత్రేయుడిలో ఈ శివుడు అనేటటువంటి వాడు ప్రవేశ పెట్టినపుడు ఆ దత్తాత్రేయుడు లేనెఱుకలో మేల్కొని శివుని యొక్క అభ్యర్థనని తన తల్లి మాటగా స్వీకరించి అప్పుడు విశ్వాన్ని రక్షించాడు.

తనకు సృష్టి స్థితి లయ జ్ఞానము, సామర్థ్యము ఉన్నప్పటికీ ఇదంతా మిథ్య కనుక, లేనెఱుక కనుక, తానందులో ఉండడు గనుక, బయలయ్యే ఉన్నాడు గనుక, తత్ సంబంధీకుడు కాడు.ఆర్తితో వేడుకుంటే తత్ సంబంధీకుడు కాకుండానే, సృష్టి స్థితి లయలు చేసే సామర్థ్యం ఉంది కాబట్టి, తాత్కాలికముగా లేనెఱుకగా చేస్తాడు. అవసరము తీరిపోయిన తరువాత సృష్టి మీద మమకారము గాని, రాగము గాని లేకుండా ఉన్నపళాన వదిలివేసి తాను తానైనటువంటి బయలుగా ఉంటాడు ఆ దత్తాత్రేయుడు. అటువంటి దత్తాత్రేయ స్వరూపాన్ని మనము గురువుగా పరబ్రహ్మగా పిలుస్తున్నాము.

పై శ్లోకంలో గురువు అన్నారు. క్రింద శ్లోకంలో పరబ్రహ్మ అన్నారు. అంటే గురువును పరబ్రహ్మ స్థితిలో అందుకోవాలి. నిజమైన గురువు స్థితి బయలుకాబట్టి అందుకోలేరు. అటువంటి గురువు "స్మరామి". మీరు స్మరిస్తేనే వస్తాడు. ఆ స్మరణ ఎట్లా ఉండాలి. త్రిగుణ రహితముగా, అనసూయగా, అభేద స్థితిలో ఉన్నపుడే అటువంటి స్మరణలోనే ఆ గురువు సాక్షాత్ "పరబ్రహ్మ గా వస్తాడు.

పరబ్రహ్మ ఎప్పుడూ వచ్చేవాడు కాడు. గురువే పరబ్రహ్మ స్వరూపమై వచ్చేవాడయ్యాడు. జీవము మార్గము సత్యము ఈ మూడూ అయ్యాడు కాబట్టి వచ్చాడు. జీవముగా వచ్చినా అది ఆయన విషయములో లేని జీవమే. లేని ఎఱుకే. లేనెఱుకలో జీవమై నీకు అందుబాటైయున్నాడు. ఎందుకంటే నువ్వు జీవ చైతన్యమై ఉన్నావు కనుక.

తరువాత గురుం **"భజామి"** అన్నారు. స్మరించిన వెంటనే గురువు వచ్చాడు. భజామి అంటే కలసిపోవడము. **"భజన"** అంటే కలవడము.**"విభజన"** అంటే విడిపోవడము. స్మరించినంతనే సాక్షాత్కరించినటువంటి గురువులో నువ్వు మమైకమవ్వాలి. అది **"భజామి"** అంటే.

తరువాత **"శ్రీమత్పరబ్రహ్మ గురూ వదామి"** ఇక అప్పుడు ఏమంటున్నారు? నీవే ఆ పరబ్రహ్మవు. ఆ పరబ్రహ్మ లక్షణంగా ఉన్నదానికి, నీకు గురువుకూ బేధం లేదు. ఏది మాట్లాడినా వ్యవహారానికి మాట్లాడుతావు తప్ప ఈ తేడాలు వ్యవహారములో ఉన్నాయిగాని, వ్యవహారము లేనిచోట తేడాలు లేవు. వ్యవహారములో ఉన్న తేడాలన్నీ భ్రాంతి. కనుక తేడాలన్నీ వ్యవహారములో చూపిస్తున్నప్పటికీ ఇది భ్రాంతి కదా! ఇది మాయ కదా! ఇది లేనిది కదా! అనేటటువంటి భావములో **"వదామి"** ఆ స్వరూప నిర్ణయముగా మాట్లాడుతావు.

శ్రీమత్పరబ్రహ్మ గురూ **"నమామి"** ఇక్కడ నమామి అనగా పైన చెప్పుకున్నాము. "నమః" అంటే "నేను" లేకుండా పోవడము. గురువును స్మరించాడు. గురువులో మమైకమయ్యాడు. ఆ మమైకమయిన స్థితిని కాపాడుకుంటూనే వ్యవహారము చేసాడు. ఎంత వ్యవహారము చేసినా అది "విభూతి"గా చూస్తాడు తప్ప "విభజన"గా చూడడు. కట్టకడకు "నమః" అన్నప్పుడు గురువుయందు చేరి తాను లేకుండా పోయాడు.

గురుంనమామి అన్నప్పుడు గురువులో మమైకమై "నేను" లేకుండా పోయినప్పుడు గురువూ నువ్వూ ఒక్కటే. గురువు పరబ్రహ్మమైతే నువ్వూ పరబ్రహ్మమే. గురువు ఏదైతే నువ్వూ అదే. ప్రకాశము స్వరూపముగా గల సద్గురువును స్మరించుచున్నాను. స్మరించడము ద్వారా ప్రకాశమే నీవై మమైకమగుచున్నావు. మమేకమయిన తరువాత సేవించుచున్నావు. ఇక్కడ సేవించుట అనగా "చతుర్విధ శుశ్రూషలు" అంగ శుశ్రూష, స్థాన శుశ్రూష, భావశుశ్రూష, ఆత్మ శుశ్రూష.

**1. అంగ శుశ్రూష :** గురువు లేనెఋకగా ఉన్నాడు కాబట్టి, అశరీరి కాబట్టి, శరీరము కల్పితము అనేటువంటి భావముతో గురువుకు శుశ్రూష చేసి శిష్యుడు తానుకూడా శరీరము లేనివాడననే నిర్ణయముగా ఉండుట "అంగశుశ్రూష"

**2.స్థాన శుశ్రూష :** ఉన్నది బయలే గనుక అది దేశకాలములకు అతీతము గనుక అక్కడ దేశమనేదీ లేదు, స్థానమనేదీ లేదు. స్థానము అంటే కైలాసము, వైకుంఠము, సత్యలోకము, స్వర్గలోకము వంటివి. అటువంటి ఈ లోకాలన్నీ కూడా లేవు. అలోకమే. **లోకంబులు, లోకస్థులు, లోకేశులు తెగినతుది అలోకంబగున్.** ఇప్పుడు గురువు అలోక స్థితియందున్నాడు కాబట్టి అటువంటి స్థానమే లేనట్టి గురువుకి అలోక స్థితిలో శిష్యుడు శుశ్రూష చేసినప్పుడు శిష్యుడు తన స్థానాన్ని కోల్పోవాలి. స్థానాన్ని పరిత్యాగం చెయ్యాలి. గురువుకి స్థాన శుశ్రూష చేసినప్పుడు శిష్యుడు తన స్థానాన్ని పరిత్యాగం చేస్తాడు.

**3. భావ శుశ్రూష :** గురువుయొక్క సేవ ద్వారా, గురు శుశ్రూష ద్వారా శిష్యుడు తాను స్వయంగా ఉన్నటువంటి భావనను పరిత్యాగం చేస్తాడు. గురు భవమే తన భావముగా ఉంటుంది. గురువు అభావము గనుక శిష్యుడు కూడా అభావమే.

**4. ఆత్మశుశ్రూష :** ఇక్కడ ఆత్మయొక్క ప్రతినిధి **"నేను"** నేను శిష్యుడను తమరు గురువుగారు అనేటటువంటి బేధము అక్కడ ఉన్నది."నమామి" అన్నపుడు ఆ "నేను" కాస్తా సమర్పణయై, పరిత్యాగమై తిరిగిరానిది అయింది.

ఈ విధముగా గురువులో అన్ని రకాలుగా అంగము లెక్కలో "అశరీరి" అయ్యాడు. స్థానము లెక్కలో "అలోకము" అయ్యాడు. భావన లెక్కలో "అభావము" అయ్యాడు. "నేను" లెక్కలో "నేను" అనే ఎఋక పోయింది. ఎందులో పోయింది? గురు తత్త్వంలో ఏదైతే ఉందో దానిని పొంది దానిలో శిష్యుడు తన నాలుగు విధాలుగా ఉన్నటువంటి అస్తిత్వాన్ని లేకుండా చేసుకున్నాడు. అప్పుడు గురువుయొక్క స్థితి ఏదో, గురువుయొక్క స్థానమేదో, గురువుయొక్క భావమేదో, ఆత్మ ఏదో, శిష్యుడు కూడా అదే అయ్యాడు. గురువు ఆత్మగా లేడు. బయలుగా ఉన్నాడు. గురువు భావముగా లేడు. అభావముగా ఉన్నాడు.

గురువు ఏ లోకములోనూ లేడు అలోకమై యున్నాడు. గురువుకు శరీరమే లేదు."అశరీరిగా ఉన్నాడు. ఇప్పుడు శిష్యుడు కాడా అశరీరియై, అలోకమై, అభావమై, ఎఋక లేనటువంటి బయలై యున్నాడు. కనుక ఈ నాలుగు విధములైన శుశ్రూషల ద్వారా శిష్యుడు లేకుండా పోయి గురువు ఏదైయున్నాడో తానూ అదే అయి ఉన్నాడు. గురువుయొక్క స్థితి బయలైతే శిష్యుడు కూడా బయలే. అయితే రెండు బయళ్ళు లేవు. ఒకే బయలు అనడానికీ లేదు. బయలును ఒకటీ రెండూ అని లెక్కపెట్టటానికి లేదు. హద్దులన్నీ ప్రకృతిలోను ఎఋకలోనే కాబట్టి బయలులో హద్దులు లేవు. నిరామయం. హద్దులు లేని దానిని "నిరామయం"అంటారు. బయలు నిరామయం కనుక, గురువు నిరామయం కనుక శుశ్రూషల నాచరించడము ద్వారా శిష్యుడు అన్ని విధముల తానే లేకుండా పోయినప్పుడు శిష్యుడు కూడా నిరామయమే.

**శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తిం । పూజామూలం గురోః పదం ।**
**మంత్రమూలం గురోర్వాక్యం । ముక్తి మూలం గురోః కృపా ॥**

గురువుయొక్క దేహమే ధ్యానమునకు కారణము.బయలు మీద ధ్యానం చెయ్యలేరు కనుక నామరూపాలు లేనటువంటి పరబ్రహ్మ మీద ధ్యానము, ఏకాగ్రత కుదరదు కనుక గురువు ఏ శరీరముతో అయితే నీకు అందుబాటులో ఉన్నాడో ఆ కనబడే శరీరాన్ని ధ్యానానికి ధ్యానవస్తువుగా పెట్టుకుని, చంచలమైనటువంటి నీ బుద్ధిని స్థిరబుద్ధిగా మార్చుకునే వరకూ గురువుయొక్క దేహాన్ని తీసుకుంటే, ఆ తరువాత గురువు అశరీరి అనేది ఆ ధ్యానములో నీకు తెలియబడటము, నువ్వు కూడా అశరీరివే అనేది నీకు తెలియబడటము జరిగిపోతుంది. కనుక ధ్యానానికి గురుమూర్తిని కనపడే శరీరముగా పెట్టుకోవాలి.

కృష్ణపరమాత్మ కనపడగానే ఈయన పరమాత్మ అంటున్నాము.నామరూపాలతో గుర్తించే ఈయనను జగద్గురువు అంటున్నాము. ఒక దుర్మార్గుడు కనపడగానే వీడు దుర్మార్గుడు అంటున్నాము. నీకు దుర్మార్గము ఎక్కడ కనిపించింది? వాడి శరీరమేగా కనపడింది.అలాగే కృష్ణుడి రూపమేగా కనపడింది? పరమాత్మ కనపడ్డాడా! అయితే శరీరాన్ని ధ్యానించడము ద్వారా ధ్యానములో ఒక ఏకాగ్రత కుదిరేవరకే ఈ శరీరము సరిపోయింది గాని, ఆ తరువాత శరీరం కాదు. పరమాత్మ శరీరము కాదు. పరమాత్మయొక్క శరీరము పరమాత్మ యొక్క లీలా విలాసముగా ఆయనయొక్క విభూతిగా కల్పించబడినది. శిష్యుడికి ధ్యానం చెయ్యడానికి ఒక ధ్యానవస్తువుగా అది కల్పించబడింది.

**"పూజా మూలం గురోః పదం"**

గురువు యొక్క పాదాలకు పూజచేస్తున్నాము అన్నాము. మూడు పాదాలు సృష్టిలోకి రాలేదు సృష్టికి అతీతముగా ఉన్నాయి .ఒక్క పాదమే సృష్టి అయింది అంటున్నాము.

ఈ సృష్టి భ్రమ, భ్రాంతి గనుక ఒక పాదము కూడా సృష్టిలోకి రాలేదు. అసలు బ్రహ్మకు పాదాలు లేవు. బ్రహ్మకు విభజన లేదు. అఖండము, అవిభాజ్యము.అయితే గురువు సాక్షాత్ పరబ్రహ్మమే. శిష్యులు భ్రాంతిలో ఉన్నారు కాబట్టి ఈ భ్రాంతి రూప ప్రపంచములో ఒక పాదము సృష్టిలోకి అందుబాటైంది.మిగతా మూడు పాదాలు లక్ష్యముగా ఉన్నాయి.

బయలు లక్ష్యముగా, సాక్షాత్ పరబ్రహ్మ లక్ష్యముగా మూడు పాదాలున్నాయి. ఒక పాద బ్రహ్మము కూడా సాక్షాత్ పరబ్రహ్మమే అయినప్పటికీ కూడా శిష్యుని యొక్క ఎఱుకలోకి, శిష్యునియొక్క భ్రాంతిలోకి అందుబాటైన పాదాన్ని పట్టుకుంటే అక్కడే భ్రాంతి రహితమైతే, శిష్యుడు కూడా ఆ త్రిపాదస్యబ్రహ్మ, **"సాక్షాత్ పరబ్రహ్మ"** అనేటటువంటిది సిద్ధిస్తుంది. కనుక నువ్వు పూజచేసేది ఏమిటంటే ఈ మాయా ప్రపంచములో అందుబాటయినటువంటి "సర్వ వ్యాపక పరమాత్మ"అనేటటువంటి "శుద్ధ చైతన్యము"గా ఆ గురువు ఒక పాదాన్ని నీకు అందించినటువంటి పాదముగా తీసుకోవాలి. అనగా పరమాత్మ లక్షణాలున్నటువంటి గురువుగా తీసుకోవాలి. పరమాత్మగా తీసుకోకుండా ఆ లక్షణాలతో ఉన్నటువంటి గురువుగా తీసుకోవాలి. ఇక్కడ "పరమాత్మ" ప్రకాశము లేదు. సద్గురువు యొక్క తేజము ఉన్నది. కనుక మనము ఆ సద్గురు తేజమును పూజిస్తున్నాము. పూజ అంటే ఏమిటి? పూజ్యము అంటే సున్నా. వీడి పొట్టపొడిస్తే ఒక్క అక్షరం ముక్క లేదు. వీడికి విద్య పూజ్యము అంటారు. పూజ్యము అంటే సున్న అని, లేదు అని అర్థము. ఇక్కడ పూజామూలం అంటే ఆ గురువుని ఈ భ్రాంతిరూప ప్రపంచములో ఎలాగోలాగ పట్టుకుంటే నువ్వు పూజ్యము, శూన్యము అయిపోతావు. నువ్వు లేకుండా పోతావు.

**"మంత్రమూలం గురోర్వాక్యం"**

మంత్రాలు చెవిలో శాలువా కప్పి చెవిలో చెప్పనవసరము లేదు.గురువు ఏ వాక్యము చెప్పినా వస్తునిర్ణయముగా, లక్ష్య దిశలోనే ఉంటుంది. శిష్యుడి స్థాయినిబట్టి కొంచెము దిగినా, లేనెఱుకలో చెప్పినా అది ఆప్త వాక్యముగా ఉంటుంది. ఆప్తవాక్యం సిద్ధాంతము కంటే భిన్నముగా ఉంటుంది. కాని శిష్యుడికి అక్కడివరకు ఉన్న సంశయం తీరడానికి ఆధ్యాత్మిక సాధనా పురోగమనానికి పనికి వస్తుంది. అది ఆప్తవాక్యం. ఆ స్థితిలో ఒకానొక శిష్యునికే ఆప్తవాక్యం పనికివస్తుంది గాని, సర్వ సామాన్యముగా అందరి శిష్యులకు పనికి రాదు. కనుక ఆ ఒక్క శిష్యుడికే ఆప్తవాక్యం కూడా మంత్రమే అవుతుంది.

సిద్ధాంత వాక్యము కూడా స్థితినిబట్టి ఆపై ఆధ్యాత్మిక పురోగమనంలో ఉన్న శిష్యుడికి మంత్రమే. మంత్రానికి మహిమ ఉంటుంది కనుక, ఆ మంత్రానికి శక్తి ఉంటుంది కనుక ఆ మహిమ, ఆ శక్తివలన శిష్యునియొక్క ఆధ్యాత్మిక పురోగమనము జరుగుతుంది. తనయొక్క సంస్కారముల బలమువలన బలహీనపడినటువంటి శిష్యుడు ఈ మంత్రబలము వలన తనయొక్క బలాన్ని పుంజుకుని గురువుని వెంబడించి తాను లేకుండా పోతాడు.అటువంటి శక్తి కలిగినది.

**"ముక్తి మూలం గురోఃకృపా"**

గురు వాక్యాలు రెండురకాలుంటాయి. ఒకటి అవాంతర వాక్యాలు. రెండు సూచన వాక్యాలు. తరువాత సిద్ధాంత నిర్ణయము. అక్కడ వాక్యముండదు. మౌనవ్యాఖ్య.

అందుకని ఆప్తవాక్యము, సూచన వాక్యాలే ఉంటాయి. ఇవి కొంచెము సంకేతాలుగా ఉంటాయి.ఆప్త వాక్యాలు భ్రాంతిలో ఉన్న శిష్యుడికి ఆ లేని ప్రపంచములో, లేని విషయాలలో, ఒక లేని విషయంనుండీ మరొక లేని విషయంలోకి ఎలా మారాలి అనేది చెప్తారు గాని, నిజానికి సిద్ధాంతము ప్రకారము చూస్తే ఏదీ లేదు. పరబ్రహ్మ అవ్వాలిగా అని లేని మాటల్లోనే ఒక నాలుగు అంచెలు పెట్టి ఈ లేనిది ఆ లేనిదై, ఆ లేనిది ఆ లేనిదై, ఆ లేనిది, ఆ లేనిదై, చివరికి అన్నీ లేకుండా పోయి ఏదైతే ఉన్నదో అది ఉన్నది అనేది ఎవరికి ఏది చెప్పాలో అది చెప్తారు.

ఆ పద్ధతిలో చెప్పినప్పుడు అది సూచన వాక్యం కూడా లక్ష్యానికి చెప్తుంది. అది ఆంతరికమైనటువంటి లక్ష్యాన్ని, మజిలీలను సూచిస్తుంది. మజిలీలన్నీ భ్రాంతిలోనే. సర్వ భ్రాంతి రహితమైతే ఇక మజిలీలు లేవు, సూచనలు లేవు. ఆధ్యాత్మిక పురోగమనం అనే ప్రయాణము కూడా లేదు. ఏది ఉన్నదో, ఇంతకుముందు లక్ష్యంలో ఏది చెప్పామో, అది మాత్రమే ఉంటుంది. అందుకని సూచన మంత్రముగా హంస మంత్రము ఇస్తారు. దాని తరువాత మహావాక్యాలను సూచనగా ఇస్తారు. తరువాత రహస్యంగా దాచిపెట్టినటువంటి రహస్యాత్రయ మంత్రములను ద్వాదశి, షోడశి, పంచదశి మంత్రములను ఇస్తారు గురువు.

ఇదీ క్రమబోధ. ఆఖరుకు చెప్పిందే సిద్ధాంతము. అందుకే ఆఖరి మూడు మంత్రాలతోటి అచల పరిపూర్ణము అవుతాము కాబట్టి ఆ మంత్రాల వలన ఏది జరుగబోతోందో, అది అచల సిద్ధాంతము అయ్యింది. మిగితావన్నీ మతాలయినాయి. ద్వైత మతము, అద్వైత మతము అని మతాలైనాయి. మత పద్ధతికి అతీతముగా మతాతీతముగా అచల సిద్ధాంతము వచ్చింది. అచల సిద్ధాంతాన్ని ముందుగా చెప్పకూడదు. ఇప్పుడు మాత్రము ఒక లక్ష్యాన్ని సూచించడం కోసము చెప్పాము. అదీ లక్షణయుతమైన వారికే పనికి వస్తుందని చెప్పాము. ప్రస్తుతము నీ అధికారిత్వాన్నిబట్టి, పూర్తిగా జీవభావముతో ఉంటే, సాధన చతుష్టయ సంపత్తితో మొదలుపెడుతాము. గురుస్తుతిలో ఉపోద్ఘాతములోనే పుస్తకములో ఏముందో అంతా వచ్చేస్తుంది. వివేక చూడామణి కూడా ఉపోద్ఘాతం ముప్పై పేజీలు ఉంటుంది. చివరిదాకా చెప్పే బోధ అంతా ఆ ముప్పై పేజీలలోనే వచ్చేస్తుంది. అంత బోధ అప్పుడే వచ్చిన శిష్యుడికి ఏమి అర్థమౌతుంది? అర్థమవ్వక్కర్లేదు. ఏదో ఒక లక్ష్యమున్నదని తెలుస్తుంది. అది చాలు.

కాని విధానం ఇట్లా ఉంటుంది, సాధన ఇట్లా ఉంటుంది, మజిలీలు ఇట్లా ఉంటాయి, భ్రాంతి ఇట్లా ఉంటుంది, ఎక్కడిదాకా మజిలీలు ఉంటాయో, ఎక్కడిదాకా భ్రాంతి ఉంటుందో, ఎక్కడ దాకా జీవ ఈశ్వర ఐక్యము, ఎక్కడి దాకా జీవబ్రహ్మ ఐక్యము, ఎక్కడి దాకా కేవల పరబ్రహ్మస్వరూపము ఉంటుందనేది అంచెల వారీగా ఒక క్రమాన్ని ఇవ్వాలి. ఈ గురుప్రార్థనలో, గురుస్తుతిలో అది నీకు ఇస్తున్నాము. ఇక్కడ చాలా పై స్థితికి చెప్తున్నప్పటికీ అర్థమైనా అవ్వకపోయినా ఓహో! ఇలా ఉందా పద్ధతి? మేము ఇట్లా చేయాలా ప్రయాణం అని మనసులో పెట్టుకోవాలి. మధ్యలో ఏమైనా అనుభవాలు వస్తే ఇది కాదుగా, గురువుగారు ఇంకా పైది చెప్పారుగా అని తెలిసినా తెలియకపోయినా ఇంకా పైది ఉంది అనేటటువంటి భావన మీకు వస్తే, మధ్యలో మీరు ఎక్కడా చిక్కుకోకుండా పోతారు. మీరు చిక్కుబడకుండా ఉండడం కోసమే, పై బోధను కూడా క్రిందకు దింపి విషయముగా చెప్పడం జరిగింది. ఇది విషయముగా చెబుతున్నాము కాని అనుభవముగా కాదు. పూర్తి వివరణ వచ్చినప్పుడు అనుభవముగా కూడా బోధ చెప్పడం జరుగుతుంది.

గురువు యొక్క దేహమే ధ్యానమునకు కారణము. గురువు యొక్క పాదమే పూజించుటకు కారణము. అంటే మాయలోకి బ్రహ్మయొక్క ఒక పాదము ఉంది. మాయాతీతముగా మూడు పాదాలున్నాయి అనేటటువంటి వేదాలయొక్క సారముగా చెప్పాము. గురువాక్యమే మంత్రమైంది అంటే అవాంతర వాక్యములచేత, సూచన వాక్యములచేత, శిష్యుడు గురువుతో భజించి, మమైకమయ్యి, నమామి – గురువులో చేరి, గురువుయందు తన్ను తాను కోల్పోవడము జరుగుతుంది. గురుం నమామి అంటే గురువుయందు చేరి, తనను తాను కోల్పోవుట. ఆ మాదిరిగా ఆ పరబ్రహ్మ స్వరూపమే ధ్యానించదగినది.

ఇవన్నీ అందుబాటు అయినటువంటి సంకేతాలే కానీ, అసలు మన లక్ష్యం పరబ్రహ్మ. గురుస్థానమేదో అదే లక్ష్యమునకు పరబ్రహ్మగా పూజింపదగినది. గురుదేవుల తత్త్వోపదేశమే మహామంత్రము. తత్త్వాన్ని నీకు అందుబాటుగా నీ హృదయ సమీపానికి తీసుకురాగలిగినవాడికి అనుభవానికి దొరికేదే ఉపదేశము, తత్త్వోపదేశము. ఇదియే మహా మంత్రము. మరియు మననము చేయవలసినది. పరబ్రహ్మదాకా మననము చేయాలి. అసలు పరబ్రహ్మ తరువాత వస్తాడు, అచల పరిపూర్ణ పరబ్రహ్మ. అప్పుడు

మననము లేదు. అంతవరకూ మననము ఉన్నది. గురుదేవుని అనుగ్రహమే మోక్షము. ఆయన అనుగ్రహము మామూలుగా అందదు. మీరు ఆయనతో ట్యూన్ అయినప్పుడు, ఆయనలో మీరు లేకుండా పోయినప్పుడు కాసేపు తాత్కాలికముగా లేకుండా పోతారు. అనేక జన్మల వాసనలచేత, ఇంకా రజోగుణం పోనందువల్ల మళ్ళీ వెనుకకు వెళ్తారు. గురువు అనుగ్రహము ఏమిటంటే, అక్కడిదాకా మీరు అందుకుంటే ఆ స్థితిని నీకు ఖాయం చేసి, వెనక్కు పోకుండా చూస్తారు. అది గురువు యొక్క అనుగ్రహము.

**శ్లో॥ గురు మూర్తిం స్మరేన్నిత్యం । గురుర్నామ సదా జపేత్ ।**
**గురోరాజ్ఞాం ప్రకుర్వీత । గురోరన్యం నభావయేత్ ॥**

**'గురుమూర్తిం'** అంటే మూర్తీ భవించినటువంటి పరబ్రహ్మ స్వరూపము. స్వరూపాన్ని కూడా మూర్తి అంటాము. స్వరూపము తెలిసిందిగా! గురువు ఈ అష్ట శరీరాలు కాదని, ఆయన స్వరూపం ఇదీ అని తెలిసింది. పరమాత్మ, పరబ్రహ్మ అని తెలిసింది. మిగితా ఏడు శరీరాలు తీసేయ్యి. స్థూల, సూక్ష్మ కారణాలను, విరాట్ హిరణ్య గర్భ అవ్యాకృతులను, వృష్టిలో ప్రత్యగాత్మను తీసి, పరమాత్మను పెట్టుకోవాలి. ఆ పరమాత్మగా ఉన్నటువంటి గురువును సాక్షాత్ పరబ్రహ్మ అని, నిర్వికల్పమందు పరమాత్మ స్వరూపమైనటువంటి గురువు, పరబ్రహ్మమే అని పెట్టుకో. ఆ రకముగా కొన్ని సంకేతాలతోటి, కొన్ని యుక్తులతోటి, పరబ్రహ్మని పెట్టుకో. అతని అంగముతోటి, అతని స్థానముతోటి, అతని భావనతోటి, అతని ఆత్మతోటి అతను జ్ఞానపూర్వకముగా ఉంటూనే, లోకాలలో విషయాలలో ఉండి కూడా అసంగముగా, అంటకుండా ఎలా వ్యవహరిస్తున్నాడు అనే దానిని కాపీకొట్టి, అవగాహన చేసుకుని దర్శించు. అటువంటి గురువునే స్మరించు. ఆ లక్షణాలు, స్మరణద్వారా నీకు అంటుకుంటాయి. ఇప్పుడు లక్షణయుతుడుగా నీవు మారిపోతావు. జీవుడిగా ఉన్నటువంటి గుణాలు, స్వభావాలు, అన్నీ తెగిపోతాయి.

**'గురోర్నామ సదా జపేత్'** – ఆయన పేరు అంటున్నాము కానీ, సాక్షాత్ పరబ్రహ్మమే ఆయన పేరు. ఈ శరీరానికి పెట్టిన పేర్లు తీసేస్తారు. ఉదాహరణకు మా గురువుగారికి **"నిర్భయానంద"** అని పేరు పెట్టారు. నాకు మా గురువుగారు **"విజ్ఞానస్వరూప్"** అని పేరుపెట్టారు. విజ్ఞానస్వరూప్ అంటే ఏమిటి? అని అడిగారు. జ్ఞానాజ్ఞానాములకు అతీతమైనటువంటి జ్ఞానమే తానైనటువంటి విజ్ఞానమైనప్పుడు స్వరూప లక్షణంతోటి **సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ** అనే దానితో సమానమయ్యింది. అది తప్ప మరొకటి కాదు అని నేనన్నప్పుడు **"విజ్ఞానస్వరూప్"** అని పేరు పెట్టారు. గురువుగారు ఆ అర్థంతో పెట్టారు. అప్పటికి అది అయ్యానో లేదో తెలియదు. ఆ అర్థముతో గురువుగా నేను కార్యక్రమము నిర్వహిస్తున్నాను. కనుక నన్నిప్పుడు మురళీకృష్ణగా కాకుండా, విజ్ఞాన స్వరూపుడు అనే భావనతో వెంబడించండి. గురువుయొక్క నామాన్ని జపం చేయడం అంటే గురువు యొక్క లక్ష్యాన్ని, లక్షణమును ధ్యానం చేయాలి. 'ఆత్మారామ' అంటే సరిపోదు. రామ అంటే ఆత్మారాముడని, తనలో తాను రమించేవాడని, ఆ రమ్యమైనటువంటి బ్రహ్మానందాన్ని మనం స్వీకరించాలి తప్ప పేరు కాదు. నామి వేరు, నామం వేరు కాదు. **విజ్ఞానస్వరూప్** అనే నామంలో **విజ్ఞానస్వరూప్** అనే లక్షణము నామి. అందుకని నామి, నామము రెండూ ఉన్నాయి. నామి ఏమో పరబ్రహ్మ. నామమేమో **విజ్ఞానస్వరూప్.** దిగంబర స్వామి అని ఉన్నారు. ఒక గురువుగారు అప్పుడు నామి ఎవరు అంటే బట్టబయలు. అంటే లక్ష్యాన్ని బట్టి పేరు. భార్య అన్నప్పుడు అందరు స్త్రీలు భార్యలా? కొన్ని లక్ష్యాలు, కొన్ని లక్షణాలను బట్టి, కొన్ని భావనలు అవినాభావ సంబంధాన్ని బట్టి భార్య అంటే ఏమిటో మీకే తెలుస్తుంది. ఎవరు భర్తో, వారు భార్య అనేటటువంటి పదానికి ఏ రకముగా భార్యభర్తల సంబంధముందో, ఏ రకంగా ఆ భార్యను స్వీకరిస్తున్నావో, గ్రహిస్తావో, అది నీ భావానికే తెలుస్తుంది. అది సున్నితము, సూక్ష్మము. ఇది ఉదాహరణ. ద్రాష్టాంతము వచ్చేసరికి పరబ్రహ్మ నిర్ణయముగా ఉన్నా, విజ్ఞాన స్వరూపాన్ని పట్టుకున్నప్పుడు, **విజ్ఞానస్వరూప్** అంటే మురళీకృష్ణ దేహము కాదు. మురళీకృష్ణ నామము కాదు. విజ్ఞానస్వరూప్ అనేది పట్టుకుంటే చాలు. చివరికి అది కూడా కాదు. విజ్ఞానస్వరూపంలో ఏ స్వస్వరూప సాక్షాత్కారముందో, దానిని అతి సున్నితముగా గ్రహించగలిగి ఉండాలి. ఇక్కడ జపమేమి లేదు. ఆ సున్నితత్వాన్ని గ్రహించడమే జపము. జపము యొక్క సారము, ఆ సున్నితత్వానికి వెళ్ళడము. పైపైన చేసే జపంతో లోతుగా క్రమముగా సున్నితమైన స్థితిలోకి వెళ్ళడమనేదే సాధన.

**'గురోరాజ్ఞాం ప్రకుర్వీత'** – ఒక్కోసారి గురవు లాలించి చెబుతాడు, బుజ్జగించి చెబుతాడు, వాత్సల్యంతో చెబుతాడు, సూచన వాక్యముగా చెబుతాడు, సిద్ధాంత వాక్యముగా చెబుతాడు, ఉపదేశ వాక్యముగా చెబుతాడు. హెచ్చరించి చెబుతాడు. ఆజ్ఞాపించి చెబుతాడు. నువ్వు భ్రాంతిలో ఉన్నావు. ఎన్ని ఉపాయాలైనా నీ భ్రాంతి పోవట్లేదు. ఒక్కోసారి నిన్ను నానా తిట్లు తిట్టాడు. ఎందుకట్లా చేయవని గట్టిగా ఆజ్ఞాపిస్తాడు. గురువును చూసి నువ్వు భయపడిపోయి, శిరసావహించడంలో నువ్వు విడుదలవుతావు.

**'గురోరాజ్ఞాం ప్రకుర్వీత గురోరన్యం నభావయేత్'**– గురువే నీ భావన. ఇంతకంటే అన్యమైన భావన నీకు లేదు. స్వరూపమంటే సాక్షాత్ పరబ్రహ్మ. అనిర్వచనీయము, అవాంగ్మానస గోచరము అయిన పరబ్రహ్మ దొరకదు కానీ, గురువు దొరికాడు కదా! గురువు అదే అయివున్నాడు. గురురూపం ద్వారా అదే అయివున్నదానిని గ్రహించాలి. ధర్మరాజు అంటే ధర్మంగా ఉంటాడని, దుర్యోధనుడు అంటే దుష్టస్వభావంతో దుర్మార్గంగా ఉంటాడని, కృష్ణుడు అంటే పరమాత్మ అని, జగద్గురువు అని, నామరూపాన్ని బట్టి ఆ లక్షణాన్ని ఎలా అనుకుంటామో, అట్లా పరబ్రహ్మ అని, దొరికినటువంటి గురువులో అతనున్నాడని అనుకోవాలి. అయితే మీకు దొరికిన గురువులందరూ కూడా సాక్షాత్ పరబ్రహ్మమేనా అని అనుమానము వస్తుంది. నీ విశ్వాసము వలననే నీ పరిణామము.

నీకు దొరికిన గురువు సాక్షాత్ పరబ్రహ్మము అయ్యాడో లేదో నీకు అనవసరము. నీకు ఆ సందేహము వద్దు. అనుమానము వద్దు. సాక్షాత్ పరబ్రహ్మమే అని నీవు గురిపెట్టు. అక్కడ నీ గురి ముఖ్యం. నీ సాధనకు నువ్వు పెట్టే గురి ముఖ్యం. ఏకంగా సిద్ధాంతం దగ్గర నిలబడలేవు కాబట్టి, గురువు మీద పెట్టుకుంటున్నావు. గురువు వ్యక్తిగతంగా అయ్యాడో లేదో నీకు అనవసరము, ఆ జోలి కాని, ఆ విచారణ కాని, ఆ అనుమానము కాని, ఆ ప్రశ్న కాని, అటువంటి అజ్ఞానము కాని వద్దు. నీకు దొరికిన గురువు సాక్షాత్ పరబ్రహ్మమే అనే నిర్ణయముతో ఉండు.

**శ్లో॥ నిత్యం బ్రహ్మ నిరాకార । నిర్గుణం బోధయేత్పరం ।**
**భాసయేత్ బ్రహ్మ భావంచ । దీపో దీపాంతరం యథా ॥**

గురువు ఎవరయ్యా? అనంటే, నిత్యుడు. సాక్షాత్ పరబ్రహ్మము. నిరాకారుడు. పైన ఆకారాలు, నామాలు చెప్పారు. మళ్ళీ ఇక్కడేమి చెబుతున్నారు? పై శ్లోకము కనబడేది పట్టుకోవడానికి. ఈ శ్లోకము ఆ కనబడే దానిలోపల, ఆ గురువుగారు ఆ బ్రహ్మము ఎలా ఉన్నాడు? అని. నిత్యుడై, పరబ్రహ్మమై, నిరాకారుడై, నిర్గుణుడై ఉన్నాడు. **'బోధయేత్పరం'** – జ్ఞానమే తానై, జ్ఞానము కంటే అన్యము కాకుండా ఉన్నాడు. బోధ అంటే జ్ఞానము.

బోధ అన్నచోటల్లా బోధించటమే కాదు. క్రియారూపం కాదు, నామ వాచకముగా చూసినప్పుడు బోధ అంటే జ్ఞానము. కపిలుని సాంఖ్యము ఉన్నది. పురాణాలలో కపిలుడు బోధావతారం అని ఉంటుంది. అంటే జ్ఞానస్వరూపావతారమని అర్థము. కనుక ఇక్కడ బోధ అంటే జ్ఞానము. జ్ఞానము తప్ప అన్యము కాదు. **'బోధయేత్పరం'** – జ్ఞానముకంటే పరమైనది, అతీతమైనది, విజ్ఞానస్వరూపము. **'భాసయేత్ బ్రహ్మ భావంచ'** – నువ్వు బయటకు వ్యాపించాలి అంటే, నీలో ఉన్న ఆత్మ బయటకు ప్రకాశిస్తూ వ్యాపించాలి. అంటే నీ మనసు ద్వారా, నీ బుద్ధి ద్వారా బయటకు వ్యాపించినప్పుడు, నీ బుద్ధిలో బ్రహ్మభావన ఉండాలి. విషయాలు ఉంటే, విషయాల వరకూ వ్యాపిస్తావు. బ్రహ్మభావన కలిగితే బ్రహ్మ భావనతో వ్యాపిస్తావు. బ్రహ్మభావనతో నువ్వు వ్యాపించినప్పుడు అది విషయాలదాకా పోయినప్పటికి నీవు విషయాలు కావు. విషయాలకు అసంగముగా ఉంటావు. విషయీకరించుకోకుండా ఉంటావు. బ్రహ్మభావనలో ఉంటూనే, నువ్వు విషయాలదాకా వ్యాపించినప్పుడు, విషయాలలోకి నీ అంతట నీవు వ్యాపించవు, ప్రారబ్ధాన్ని బట్టి విషయాలు తోస్తాయి. తోచినవి **'బంధాయ విషయాసక్తం'** – అని విషయాసక్తంతో నీవు వ్యాపిస్తే అది బంధమే. విషయాసక్తం లేకుండా బ్రహ్మభావనతో నీవు వ్యాపిస్తే, అది బంధముకాకపోగా అది విడుదలకు పనికి వస్తుంది. అది విమోచనకు, విముక్తికి పనికి వస్తుంది. **'దీపో దీపాన్తరం యథా'** – ఒక దీపంతో మరొక దీపాన్ని ముట్టించావు. ఆ దీపంతో మరొక దీపం ముట్టించావు. వెనక్కి వెళ్తే, శిష్యుడు అనే దీపాన్ని, పరమాత్మ అనే దీపంతో ముట్టించావు. పరమాత్మ అనే దీపం మళ్ళీ దేనిచేత ముట్టించబడింది? పరమాత్మ స్వయం ప్రకాశం, దానిని ఎవరూ ముట్టించలేదు. ఎప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటాడు. మొదటి దీపము సహజ ప్రకాశము. స్వయం ప్రకాశము, నిత్య ప్రకాశము, అద్వయము. ఈ గురువు అట్టివాడు. గురు సాక్షాత్ పరబ్రహ్మ అంటే, గురువు అట్టి మొదటి దీపమై యున్నాడు. సహజముగా ప్రకాశిస్తూ ఉన్నాడు. స్వస్వరూపముగా ప్రకాశిస్తూ ఉన్నాడు. ఆ ప్రకాశమే తానై యున్నాడు. కానీ ఒక పాదము సృష్టిలోకి, శిష్యుడుకోసమై వచ్చాడు. శిష్యుడులోకి ప్రవేశించాడు. శిష్యుడులో ఉన్నటువంటి అజ్ఞానాంధకారము తొలగింది.

**'గుకారో అంధకారస్య రుకారో తేజముచ్యతే'** – శిష్యుడులోకి గురుతేజం ఎప్పుడైతే వ్యాపించిందో, ఆ శిష్యుడులో ఉన్నటువంటి అజ్ఞానాంధకారము పటాపంచలై, ఆ శిష్యుడు కూడా ఆ గురువు వలె, పరమాత్మయై ప్రకాశిస్తూ ఉన్నాడు. ఇదీ **దీపోదీపాంతరం యథా** అంటే. ఏ విధంగా అయితే ఒక దీపం చేత, మరొక దీపం వెలిగించబడుతుందో, అదే విధంగా సాక్షాత్ పరబ్రహ్మ అయిన గురువు ద్వారా, శిష్యుడు కూడా పరబ్రహ్మ అనేటటువంటి ప్రకాశం పొంది, శిష్యుడు కూడా పరబ్రహ్మమై, సహజమై ముక్తుడై ఉంటాడు. గురువు పరబ్రహ్మ, నిరాకారుడు, నిర్గుణుడు, జ్ఞానస్వరూపుడు. జ్ఞానానికి కూడా అతీతమైనటువంటి, పరమైనటువంటి స్థితిలో ఉండి, అంటే. **"భాసయేత్"** అంటే శిష్యుడు కూడా ప్రకాశిస్తున్నాడు, వ్యాపిస్తున్నాడు, భాసిస్తున్నాడు. విషయాలు తోచినప్పుడు విషయాలలోకి వ్యాపిస్తున్నాడు. మామూలుగా వ్యాపించడం లేదు. పరమాత్మ ప్రకాశానికి వ్యాపకత్వం లేదు. అజ్ఞానంలో విషయాలున్నప్పుడు, విషయాల ద్వారా వ్యాపించడమే వ్యాపకత్వం. బ్రహ్మభావనతో వ్యాపిస్తే విషయాసక్తి నశిస్తుంది. ఆ రకముగా శిష్యుడు విషయాలను నివృత్తి చేసుకునే పద్ధతిలో, బ్రహ్మభావనతో వ్యాపిస్తాడు. బ్రహ్మభావనతో అన్ని విషయాల దగ్గరకు వెళ్ళినా, ఆ విషయాలన్నీ కూడా విషయీకరించబడక నివృత్తి అయిపోతాయి. ఇది నివృత్తి మార్గము.

**శ్లో॥ స్వయం తథా విధో భూత్వా । స్థాతవ్యం యత్ర కుత్ర నత్ ।**
**కిటో భృంగ ఇవ ధ్యానా । ద్యథా భవతి తాదృశః ॥**

కీటకము తదేక ధ్యానము వలన తుమ్మెద కాగలిగినట్లుగా గురుపరబ్రహ్మధ్యానము వలన తానే ఆ గురు స్వరూపుడు అగును. అతడెచ్చట నుండిననుసరే బాధలేదు. ఈ భ్రమరము అనేటటువంటిది ఆ ఝుంకార నాదములో అన్నప్పుడు ఉదాహరణకు దృష్టాంతానికి సాక్షాత్ పరబ్రహ్మ అనేటటువంటి అపరోక్షానుభూతి గురువులో ఉన్నట్లుగా ఈ ఝుంకార నాదాన్ని పోల్చారు. కీటకాన్ని సచ్ఛిష్యుడిగా పోల్చారు. ఈ భ్రమరము ఏం చేస్తోందంటే, ఒకానొక కీటకాన్ని తెచ్చి, ఒక గూటిలో పెడుతుంది. నిజానికి ఈ కీటకాలన్నీ కూడా భ్రమరము అయ్యే అవకాశము ఉన్న కీటకాలు కాదు. ఏదో ఒక కీటకానికే ఆ అవకాశం ఉంటుంది. అలాగే అనేకమంది జనాలలో సచ్ఛిష్యుడైనవాడు ఒకడే ఉంటాడు. ఆ యోగ్యతను అర్హతనుబట్టి చూచి, గురువు ఆ శిష్యుడిని తన సమీపానికి ఆకర్షించి తెచ్చి, భ్రమరము ఎట్లా అయితే కీటకాన్ని కుడుతుందో, ఆ కుట్టినప్పుడు అది విలవిల లాడుతూ, ఆ బాధ తప్ప అన్యము మరచి ఉంటుందో, అట్లాగే గురువు శిష్యుడికి కఠినమైనటువంటి శిక్షణ ఇస్తాడు.

ఆ శిక్షణలో అతను బహిర్ముఖముగా సంసారములో ఉన్నటువంటి తాదాత్మ్యత నుండి కాస్త విడివడి ఉంటాడు. అప్పుడు గురువు మంత్రమిస్తాడు. భ్రమరము యొక్క ఝుంకారం లాగా ! ఆ గురువు యొక్క మంత్రము శిష్యునిలో పని చేస్తుంది. ఆ మంత్రము అనేటటువంటి జ్ఞానాజ్ఞానాల మధ్యలో వారధిలా ఉన్నటువంటి మంత్రము ద్వారా, మంత్ర శక్తి ద్వారా శిష్యుడు గురువులో మమైకం అవుతాడు. ఆ కీటకము కూడా ఆ ఝుంకార నాదం విని విని, చివరికి సర్వమూ మరచి, ఆ ఝుంకార నాదాన్నే ధ్యాసలో పెట్టుకుని, ధ్యానం చేస్తూ చివరికి **'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి'** అయినట్లుగా ఆ ఝుంకార నాదము అనేటటువంటి నాదాను సంధానము చేత తాను కూడా భ్రమరమే అవుతుంది. అదే విధముగా శిష్యుడు కూడా గురువులో మమైకం అవుతాడు. గురు సాక్షాత్ పరబ్రహ్మ కనుక శిష్యుడు కూడా పరబ్రహ్మమే. **'యథా భవతి తాదృశః'** ఈ దృష్టాంతముతో కీటకము ఏ రకముగా భ్రమరమౌతుందో, అదే విధముగా సచ్ఛిష్యుడు కూడా గురువులో మమైకమై, సాక్షాత్ పరబ్రహ్మమే అవుతాడు.

**శ్లో॥ పిండే ముక్తాః పదే ముక్తాః । రూపే ముక్తాః వరాననే ।**
**రూపాతీతేచ యే ముక్తా । స్తేముక్తా నాత్ర సంశయః ॥**

కుండలనీ శక్తియందును, హంస స్వరూపమునందును, ఆపోజ్యోతి స్వరూప దర్శనమునందును కళాతీతమైన పరిపూర్ణమందునూ చేరి ముక్తులగువారెవరో వారే ముక్తులు. ఈ విషయమందు సందేహము లేదు. ఎన్నిరకాల ముక్తులున్నాయి? ఇక్కడ పిండే ముక్తా – పిండాండమునుండి ముక్తుడు కావాలి. జీవుడుగా లేకుండా పోవాలి. పదే ముక్తాః, రూపే ముక్తాః, పదము అంటే ఒక స్థానము, పదవి – అహంకారముతో కూడినటువంటి ఒక అవస్థని పదవి అంటారు. **రూపే ముక్తాః వరాననే, రూపాతీతేచ యే ముక్తాః** – రూపము నుండి ముక్తుడై, రూపాతీత స్థితిలో ఉంటాడు. రూపాతీత స్థితి నుండి కూడా ముక్తుడౌతాడు. ఈ రకంగా ముక్తి అనేటటువంటి దశలు ఎన్నైనా ఉండవచ్చు. పంచవిధ ముక్తులున్నాయి. సార్ష్ణి ముక్తి, సామీప్యముక్తి, సారూప్యముక్తి, సాలోక్యముక్తి, సాయుజ్య ముక్తి.

**రూపాతీతేచ యే ముక్తాః** అన్నప్పుడు స్వస్వరూపము వచ్చేసరికి సాయుజ్యముక్తి కూడా కాదు. ఇక్కడ అర్థము సాయుజ్యముక్తి వరకూ చెప్పినప్పటికి, రూపాతీతేచ అన్నప్పుడు అచల సిద్ధాంతము లక్ష్యముగా, అచల పరిపూర్ణము లక్ష్యముగా, పరమపదము అనేటటువంటిది ఆఖరు ముక్తి. పరమపదమే తిరిగిరాని మోక్షము. దీంట్లోనే దర్శనాలు ఉంటాయి. కుండలినీ శక్తి మూలాధారము నుండి సహస్రారము దాకా పైకిపోతే, ఆజ్ఞాచక్రము దాటేసరికి జీవుడిగా విడుదలౌతాడు. హంస స్వరూపం – మనకు ఉపదేశంలో హంస మంత్రం ఇచ్చాము. సోహం హంసః అని సోహం సోహం అనేది కూడా హంసే. శివుడు కూడా హంసే. ఎట్లా? హంసశ్శివః సోహం హంసః – హంసయేశివుడు సోహమే హంస, నీలో ఏదైతే సోహం, హంసోహం అంటూ అంతఃకరణ ప్రతిబింబం ద్వారా స్ఫురణ వచ్చిందో, అది బింబరూపంలో శివుడే. ఇక్కడ జీవుడిని హంసగా మార్చాము. ఎందుకు మార్చామంటే, హంసకు ప్రయాణముంది. రెక్కలున్నాయి. కాళ్ళున్నాయి. శిరస్సు ఉంది, శిరస్సుతో సోహం, సోహం అని అజపము చేస్తుంది. రెక్కలతో ఎగురుతుంది. కాళ్ళతో నడుస్తుంది. కాళ్ళతో నడిచినప్పుడు జీవుడన్నాము. రెక్కలతో ఎగిరినప్పుడు ఈశ్వరుడన్నాము. శిరస్సుతో సోహం, సోహం అనే ధ్యానము చేసినప్పుడు ఈ హంస ఉపాధిలో సోహం అయినప్పటికి నిరుపాధిక తత్త్వంలో శివ స్వరూపమే. సోహంతో సమానమైనటువంటి మంత్రము, మంత్రార్థము, వివరణ కొంతమందికి చెప్పడం జరిగినది. ఇక్కడ హంస అంటే, ఎలా పాలు, నీరు వేరుచేసి, నీటిని వదిలి పాలను ఎలా తీసుకుంటుందో, ఆత్మను, అనాత్మను వేరుచేసి, అనాత్మను వదిలి ఆత్మనే స్వీకరిస్తుంది. కనుక ఇక్కడ హంస అని పేరు పెట్టాము. మరొక విధంగా హంస అనేటటువంటి పేరు ఎందుకు పెట్టారు అంటే ఉచ్ఛ్వాస, నిచ్ఛ్వాసాలలో హం, స వదిలేటప్పుడు ఒక శబ్దము, పీల్చేటప్పుడు ఒక శబ్దము స, హం అంటున్నాము. అందుకని హంస అంటున్నాము. హంసను తిరగేస్తే సోహం అవుతుంది. సః అహం సోహం. అహంతో కూడుకున్నది సోహం. అహం అనేది అంతఃకరణ ప్రతిబింబము, చిదాభాసుడు కనుక శుద్ధ అంతఃకరణ ప్రతిబింబముగా ఉన్నటువంటి వాడు సోహం అనేటటువంటి జ్ఞానంలో ఎవరైతే ఉంటారో, ఉపాధి తాదాత్మ్యత విడిచినప్పుడు వాడే శివ స్వరూపుడు అని ఈ హంస యొక్క మంత్రార్థము.

కనుక ఈ హంస యొక్క ప్రయాణము పిండాండము దాటి, నాద బిందు కళలను దాటి, మండలత్రయాన్ని దాటి, శింశుమారక చక్రం దగ్గరకు వెళ్ళి, లేని హంస లేకుండా పోతే, చక్ర స్థానములో ఏదైతే ఉన్నదో, అక్కడ ఎఱుక అనేది లేకుండా పోతుంది. ఈ హంస అనేది ఎఱుకకే సంకేతము. కనుక హంస లేకుండా పోవడము అంటే, ఎఱుక లేకుండా పోవడము అని అర్థము. ఎఱుక లేకుండా పోయిన తరువాత, ఏమైతే శేషించి యున్నదో అది బయలు. ఆ బయలే బ్రహ్మము. ఆ బయలైయుండుటే పరమపదము. తిరిగిరాని మోక్షము. కనుక ఇక్కడ కుండలనీ శక్తి ద్వారా కాని, హంస స్వరూపము యొక్క మంత్రార్థము తెలిసి, ఆ ప్రయాణములో కాని, ఆపోజ్యోతి స్వరూపదర్శనమునందు కాని, చేరి లయం కావాలి. ఆపో అంటే జలము, నారయణా అంటే నారములు, అంటే జలము. అంటే జలములో నివశించువాడు నారాయణుడు, కనుక నారయణ స్వరూపము జ్యోతి స్వరూపము, ఆపోజ్యోతి అంటే నీరు అన్నాము, కాని నీరు కాదది చైతన్యము. కనుక చైతన్య స్వరూపమే ఆపోజ్యోతి. అది దర్శించారు, చైతన్యాన్ని దర్శించారు. దర్శించినప్పుడు బింబము, ప్రతిబింబము రెండుగా ఉన్నాయి. దర్శించబడేదేదో అదే నీవైయున్నప్పుడు నీ స్వరూప దర్శనము ఉంటుంది కాని, అన్యదర్శనము ఉండదు. ఇక్కడ బింబ ప్రతిబింబ న్యాయముగా మోక్షాన్ని పొందాలి. ప్రతిబింబ జ్ఞానము సోహం అనేది సరిపోదు. ఈ సోహం అనేది శివస్వరూపము యొక్క ప్రకాశమే. అంతః కరణ ప్రతిబింబము అయ్యింది కనుక వేదము, వేదాంతము ఏమి చెబుతుందంటే, ఆ శివస్వరూపమే నీవైయున్నావని చెబుతోంది. కనుక ప్రతిబింబ జ్ఞానమునుండి విడుదలై నువ్వు బింబ జ్ఞానమునకు మారాలి. దానికోసం బింబ ప్రతిబింబ విచారణ చేయాలి. ఆ విషయం తరువాత వస్తుంది.

ఇక్కడ అన్నిరకాల మోక్షాలు ఉన్నాయి, అన్ని రకాల సాధనలు ఉన్నాయి. గుణముల మీద సాధన చేసి, తమోగుణము, రజోగుణము, సత్వగుణము నుండి విడుదలై, త్రిగుణాతీత స్థితిలో మోక్షము వచ్చేటటువంటి ఒక బోధ ఉన్నది. కుండలినీ పద్ధతిలో మూలాధారము నుండి సహస్రారానికి వెళ్ళి, సహస్రారమునుండి ద్వాదశాంతములో చంద్రకళాస్థానములో దర్శనాన్ని స్వరూపముగా మార్చుకునే సరికి అది తిరిగిరాని మోక్షము అవుతుంది.

అట్లాగే అంతఃకరణతో, ఇంద్రియాలతో, మనసుతో కూడినటువంటి విషయాలతో కూడినటువంటి చైతన్యాన్నుంచి, చైతన్యం మీద ఆపాదించబడినటువంటి సంస్కార ముద్రలను చెరిపి వేసి విడుదలైతే, అప్పుడు వచ్చేటటువంటి దర్శనము ఆపోజ్యోతి దర్శనము. అంటే శుద్ధ చైతన్యదర్శనము. కళాతీతము అంటే నాదబిందుకళాతీతమైనదే పరిపూర్ణము. ఎన్ని రకాలుగా చెప్పినా,

అచల పరిపూర్ణమునే నిర్ణయముగా చెబుతున్నాము. అలాగ ఇన్ని దశలలోను, ఇన్ని రకాలుగాను మాయ అనేక రకాల భ్రాంతులలో ముంచి నప్పటికీ, ఒక్కొక్క రకమైన భ్రాంతిలో నుండి విడుదల అవ్వడానికి, ఒక్కొక్క రకమైన సాధన చెబుతున్నారు. **'నదీనాం సాగరే గతి'** – అన్నట్లుగా నదులన్నీ కూడా సాగరంలో కలుస్తున్నట్లుగా, ఆ సాగరంలో కలిసిపోయిన నది తనయొక్క ప్రత్యేకమైన అస్తిత్వాన్ని ఎలా కోల్పోతుందో, ఈ సాధనామార్గాలు ఎన్నైనా సరే స్వరూప నిర్ణయంలోకి వచ్చేసరికి, స్వరూపం ఒక్కటిగానే ఉంటుంది. మార్గాలు, వాటి యొక్క అస్తిత్వాలు, ఆ మార్గాల యొక్క మజిలీలలో వచ్చినటువంటి అనుభవాలు అన్నీ కూడా భ్రాంతి లోనివే. ఆధ్యాత్మిక ప్రయాణం కూడా భ్రాంతిలోనే. భ్రాంతి పోతే నీవు అదియై ఉన్నప్పుడు ప్రయాణమే లేదుగా. అజ్ఞానం నుండి విడుదల అయ్యేటప్పుడు ఆవరణ దోషాల నుండి విడుదల అయ్యేటటువంటి సాధనలు చేస్తున్నప్పుడు, కొన్ని మజిలీలలో కొన్ని అనుభవాలు వస్తూ ఉన్నప్పుడు, వాటిని అంది, పొంది, మీరుట ద్వారా జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం, అధిగచ్ఛతి... అనే పద్ధతిలో దాటి పోతే, చివరికి తిరిగిరాని ముక్తి ఏదో, అది పరమపదము అనే లక్ష్యాన్ని ఈ శ్లోకంలో మనకు అందిస్తున్నారు.

**శ్లో॥ ఏకాకి నిస్పృహ శ్శాంతా । శ్చింతాసూయ వివర్జితా ।**
**బాల్యభావేన యోభాతి । బ్రహ్మజ్ఞానేన ఉచ్యతే ॥**

ఒంటరిగా ఉండువాడును, ఇచ్ఛ లేనివాడును, శాంతి గలవాడును, రాగద్వేష అసూయాదులు మొదలగునవి విడిచిన వాడై, ఎవడు బాల భావముతో ప్రకాశించుచున్నాడో, వాడే పరబ్రహ్మమును తెలిసినవాడని చెప్పబడుచున్నాడు.

ఇక్కడ సాధన ఎందుకు చేయాలి? ఎలా చేయాలి? అనేటటువంటిదీ, సాధనలో మనం ఏమేమి సంపాదించాలి? ఏమేమి వదులుకోవాలి? అనేది చెబుతున్నారు. ముందు ఏమి చేయాలి? ఒంటరిగా ఉండాలి. ఏకాంత స్థితి. ఒంటరిగా ఉండటం అంటే ఏమిటి? మనస్సు నిర్వికల్ప స్థితికి వెళ్ళినప్పుడే ఆ ఒంటరితనము. నీవెప్పుడూ ఏదో ఒక ఆలోచనతో, విషయంతో, ఊహతో, అనుభవంతో, జ్ఞాపకంతో, వృత్తితో ఉన్నంతసేపూ అది ఒంటరితనం కాదు. సుఖదుఃఖాలు ఉన్నప్పుడు అది ఒంటరితనం కాదు. సుఖముతో కూడి, దుఃఖముతో కూడి, రాగముతో కూడి, ద్వేషముతో కూడి, క్రోధముతో కూడి, గతములో ఉన్నటువంటి జ్ఞాపకాలు, అనుభవాల యొక్క స్మృతులతో కూడి, భవిష్యత్తుకు సంబంధించిన ఊహలతో కూడి ఉన్నప్పుడు అది ఏకాంత స్థితి కాదు. ఏకాకి అంటే ఏకాంత స్థితిలో ఉండాలి. ఒకరకంగా నిర్విషయ స్థితిలో ఉండాలి. నిస్సంకల్ప, నిర్వికల్ప స్థితిలో ఉండాలి. పరబ్రహ్మ స్వరూప జ్ఞానం కావాలి అంటే ఇదీ షరతు.

భక్తులే ఉన్నారు. నవ విధ భక్తి మార్గాలలో ఉన్నారు. భక్తి అంటే ఏమిటి? భగవంతుడిలో ఐక్యతా సిద్ధి పొందడమే భక్తి. విభక్తి అంటే విడిపోయినటువంటి స్థితి. భక్తి అన్నా భజన అన్నా రెండూ కలిసిపోయి, ఏకత్వాన్ని పొందేటటువంటి స్థితి. కనుక ఇక్కడ ఏకాకి అంటే, భగవంతుడిలో ఏకత్వాన్ని పొందేటటువంటి సాధన.

మనం మామూలుగా వాడేటటువంటి స్పృహ, నిస్పృహ అంటే. మనం ఏది పట్టుకున్నా, బంగారం పట్టుకున్నా మట్టి అయిపోయినప్పుడు నిస్పృహ చెందుతాము. నిరాశా నిస్పృహలతో ఆత్మహత్య చేసుకుందామనుకుంటాడు ఒకానొకడు. ఈ నిస్పృహ అనేటటువంటి అర్థం ఆ రకంగా తీసుకోకూడదు.

నిః + స్పృహ, నిస్పృహ, స్పృహ అంటే 'శరీరం నేను'గా ఉండేటటువంటి ఒక స్పృహ. అంటే శరీరము తోచుట శరీరానుసారమైనటువంటి స్పృహ. అలాగే అనాత్మ విషయంలో, అనాత్మ తోచుట అనేది ఎక్కడైతే ఉన్నదో అది స్పృహ. నిస్పృహ అంటే శరీరము గాని, అనాత్మ గాని, విషయములు గాని, దృశ్యములు గాని తోచకుండుట. కేవల దృక్ స్థితిలో తానే పరబ్రహ్మ గనుక, **"పరబ్రహ్మ తాను అనేటటువంటి స్వరూప జ్ఞానము"** ఆవరించబడి అజ్ఞానియై, శరీరాలను, విషయాలను స్మృతిలో, స్పృహలో పెట్టుకుంటున్నాడు కనుక ఇది తన స్వరూప జ్ఞానానికి ఆవరణగా, ఆటంకముగా, అవరోధముగా ఉంది కనుక అటువంటి స్పృహను వదులుకోవడాన్ని నిస్పృహ అన్నారు.

**'శాంతా'** – మనసే రజోగుణము. రజోగుణము ఉంటే అశాంతే. శాంత స్థితి కావాలి అంటే, మనస్సులో ఊహలు, ఆలోచనలు, ఆరాట – పోరాటాలు, విషయాలు, సంఘర్షణలు, తృప్తి–అసంతృప్తి, ఇష్టము–అయిష్టము, కామక్రోధాదులు, ఇవన్నీ ఉన్నంతవరకూ అశాంతే. శాంతః అన్నప్పుడు ఇవన్నీ లేనటువంటి స్థితి. రజోగుణముతో కూడినటువంటి అహంకారము, తమోగుణముతో కూడినటువంటి మమకారములు, వీటియొక్క తాదాత్మ్యతలు. ఇవన్నీ లేకపోవడమే శాంతి. అవన్నీ ఉంటే, అనిత్యమైనటువంటి ప్రపంచములో, అనిత్యమైన, వచ్చిపోయేటటువంటి అనుభవాలలో, అనేక ఆశలతో ఉన్నవాడికి, ఈ అనిత్య వస్తువుల ద్వారా నిరాశ కలుగుతుంది. దుఃఖము కలుగుతుంది. శాంతము అంటే సుఖము కూడా అశాంతే. ఎందుకంటే,

సుఖము కూడా అనిత్యమవ్వటంవల్ల, సుఖానికి కూడా ఒక రోజున అంతము వస్తుంది కనుక, సుఖానికి మరిగినవాడు సుఖాంతములో దుఃఖి అవుతాడు కనుక, సుఖదుఃఖాలు రెండూ కూడా అశాంతే. ఆశ, మోహాలు రెండూ కూడా అశాంతే. సుఖాన్నిచ్చే ఇంద్రియములు కూడా అనిత్యమవ్వటం చేత, ఒక కాలమందు అవి నిన్ను అశాంతికి గురిచేస్తాయి. అందువలన వీటికి మూలము మనస్సు కనుక, వీటికి మూలములు విషయములు కనుక, అమనస్క స్థితి, నిర్విషయ స్థితే శాంతము. కనుక ఇది ఒక షరతు. మొదట్లో ఏకాంత స్థితి. రెండవది అనాత్మ స్పృహ లేకుండా ఉండటము. మూడవది అశాంతిగా ఉన్న మనస్సును అమనస్కము చేయడము.

**'చింతా అసూయ వివర్జితః'** – చింత దేనివల్ల జరుగుతుంది? చిత్త వృత్తులు ఎక్కడ వస్తున్నాయి? చిత్తము చింతన చేస్తేనే చిత్త వృత్తులు. అలా చిత్తవృత్తులు వస్తూంటాయి. చిత్తముయొక్క చింతన కొనసాగుతున్నంత వరకూ నీకు మనశ్శాంతి కలుగదు. ఉపరతి కలుగదు. అట్టి ఉపరతి కలిగిన తరువాతే స్వస్వరూప జ్ఞానము సిద్ధిస్తుంది. ముందస్తుగా స్వస్వరూప జ్ఞానం సిద్ధించాలి అంటే, ఉపరతి కావాలి. ఉపరతి కావాలి అంటే, చిత్తవృత్తి నిరోధం కావాలి. మనస్సు అమనస్కం కావాలి. విషయాలు నిర్విషయం కావాలి. అనాత్మ తోచనే తోచకూడదు. నీవు నీవుగానే ఏకాంతముగా, ఏకాకియై ఉండాలి.

**'అసూయ'** – అంటే అర్థం ఏమిటంటే, ద్వైతము ఉండి ఒక దాని మీద ఇష్టము, మరొక దాని మీద అయిష్టము ఉండడమే అసూయ. అనసూయ అంటే ఎట్టి భేదము చూడనివాడు. సామాన్యముగా మనము ఏది చూసినా, నాకేమిటి? నాకేది ప్రయోజనము? నాకిది సుఖాన్ని ఇస్తుందా? నాకిది దుఃఖాన్ని ఇస్తుందా? అనేది పెట్టుకుని ప్రతి వస్తువుని చూస్తున్నాము. నేను, నీవు, ఇదీ, అదీ అని చూస్తాము. ఇది అనేది నీ సొంతము, అది అనేది దూరంగా ఉన్నదానిని సొంతం చేసుకోవాలి అనుకోవడము. ఈ విధముగా నాలుగు భాగాలుగా, లేక నేను, నీవు, ఇతరము మూడు భాగాలుగా, లేక నేను నాది ఇతరము మూడు భాగాలుగా అలా భాగాలు, విభాగాలుగానే ఈ మనస్సు ఆలోచిస్తుంది. ఈ విధముగా ఆలోచిస్తున్నంత సేపూ మనస్సు ఉంటుంది. ఈ విభాగాలు, భేదాలు లేకుండా అభేద స్థితిలో ఉంటే, మనస్సు పని చేయదు. 'మైండ్ నాట్ వర్కింగ్' అనే స్థితికి వస్తుంది. అభేద స్థితిలో మనసు పని చేయదు, భేద స్థితిలో మనస్సు పని చేస్తుంది. మనసంటే ఆలోచనలు. ఆలోచనలంటేనే మనస్సు.

మనసంటే వేరే లేదు. కొన్ని వెదురు బద్దలతో గూడు తయారు చేసినప్పుడు, దానికి పంజరమని పేరు. ఈ పంజరము పేరే మనస్సు. వెదురు బద్దలేమో నేను, నీవు, నాది, నావారు, మంచి చెడు, ఇష్టము, అయిష్టము, రాగద్వేషాలు, అరిషడ్వర్గాలు ద్వంద్వాలు ఇవన్నీ వెదురుబద్దలే. ఈ వెదరుబద్దలు ఒక్కొక్కటీ తీసివేస్తే పంజరమే ఉండదు. అలాగే రాగద్వేషాలు, అరిషడ్వర్గము, ఇష్టాయిష్టాలు, భేదములు చూచుట అనేటటువంటి బుద్ధి ఎప్పుడైతే లేదో, అప్పుడు మనసే ఉండదు.

కనుక అసూయ అంటే మనసు ఉన్నది. అసూయ అంటే భేద భావాలు తెచ్చిపెట్టేది. భగవద్గీతలో అర్జునుడిని **'అనసూయ'** అని జగద్గురువు కృష్ణ పరమాత్మ సంబోధిస్తాడు. అనసూయ అంటే అసూయ లేకపోవడమనే సాధారణ అర్థము కాదు. భేదభావములు లేని వాడా, సర్వమునూ అభేదముగా చూచువాడా, సర్వమునూ ఒక్కటైన పరమాత్మగా చూచువాడా, సర్వమును ద్వంద్వభూయిష్టమైనటువంటి ప్రపంచముగా చూడని వాడా అని అనసూయకు అర్థము.

**'చింతాసూయా వివర్జితః'** – వీటినుండి వర్జ్యము అంటే కూడదు అని. వివర్జ్యము అంటే ఆ కూడని దానిని తొలగించి విడిచిపెట్టి, విశిష్టముగా విడవడము. విశిష్టముగా వర్జించడము అంటే, తిరిగి రాకుండా విడవటము. ఒకసారి వదిలిన దానిని మరలా తిరిగి తలవకూడదు. కక్కినటువంటి కూడును మళ్ళీ ఎవరూ స్వీకరించరు కదా! ఆ విధముగా మనసుని, చిత్తమును, భేద భావాలను, అనాత్మ స్పృహను పూర్తిగా వదలినవాడు తిరిగి వాటి జోలికి వెళ్ళకుండా ఉండడమే వివర్జితః.

**'బాల్యభావేన యో భాతి'** – అప్పుడే పుట్టినటువంటి శిశువు రెండు మూడు నెలలలో మనసు కాని, అతని శరీరానికి చెందిన ప్రారబ్ధము కానీ పని చేయదు. శరీర ప్రారబ్ధము ఉన్నప్పటికి, పెద్ద వాళ్ళకు అస్వస్థత అనేది తెలుస్తుంది. పసి పిల్లలు అస్వస్థత భరించలేక బాధతో ఏడుస్తారు. బాధ లేకపోతే తనలో ఉన్న చైతన్యము చేత, కాళ్ళు, చేతులు అన్ని అవయవాలు కదిలిస్తూ ఉంటారు. అతనిలో ఉన్న చైతన్యము అనేటటువంటిది అతని అవయవాల కదలికల ద్వారా తెలుస్తుంది. మనస్సు విషయానికి వస్తే, ఇది మంచి, ఇది చెడు, ఇది కావాలి, ఇది వద్దూ అనేది తెలియదు. ఏ కాలానికి ఏది వస్తే, ఆ బాధ తట్టుకోలేక ఏడ్వడము కానీ, సుఖకరముగా ఉంటే, ప్రశాంతముగా ఉండడము మాత్రమే ఉంటుంది. కర్తృత్వ భోక్తృత్వాలు లేవు. పిల్లలు

ఆడుకుంటూ పోట్లాడుకుంటూ ఉంటే, దెబ్బ తగిలినా కానీ, మళ్ళీ వెంటనే మరచిపోయి ఆడుకుంటూ ఉంటారు. కానీ పెద్దలు మాత్రం పోట్లాడుకుని, వైరుధ్యాలు పెట్టుకుని మాట్లాడుకోరు. పిల్లలు అలా చేయరు, వెంటనే మరచిపోతారు. కనుక బాల్యభావేన – ఆత్మ స్థితిలో ఉన్నవాడు మనస్సు విషయంలో, బాలుడు ఎలా ఉంటాడో, అలా ఉంటాడు. ఆ విధంగా 'భాతి' అంటే ప్రకాశించుట. బాల్య భావాన్ని వ్యక్తం చేయడము. ఊహ ఇంకా కలుగనటువంటి బాలుడి యొక్క స్థితిలో, ప్రకాశిస్తూ, ప్రకటిస్తూ, ప్రకటించబడుతూ ఉంటాడు.

**'బ్రహ్మజ్ఞానేన ఉచ్యతే'** – అలా ఉండాలి. బ్రహ్మజ్ఞాని అలా ఉంటాడు. ఒంటరిగా ఉండేవాడు, అనాత్మ స్పృహ లేనివాడు, శరీరము తాను అనే స్పృహ లేనివాడు, శాంతి కలవాడు, అన్ని ఇంద్రియాలను తాబేలువలే తనలోకి ముడుచుకుని యుండువాడు, అటువంటి శమదమాదులు ఉన్నవాడు, అటువంటి తితీక్ష ఉన్నవాడు, రాగద్వేషాలు, అరిషడ్వర్గాలు, భేదభావములు అవన్నీ విడచినవాడు, విడచినవాటిని తిరిగి ముట్టనివాడు, ఇలా చేస్తే, వాడు ఎలా అవుతాడంటే, పసి పిల్లవాడులా అయిపోతాడు. ఎవరైతే తన లోపల ఉన్నటువంటి స్థితిని పసి పిల్లవాడనే భావనతో ప్రకటిస్తాడో, ప్రకటించబడిన దాని మీద కర్తృత్వ భోక్తృత్వాలు ఉండవో, అటువంటి దానిమీద నిత్యవర్తమానముగా ఉండి, భవిష్యత్తు ప్రణాళిక చేయడో, గతాన్ని తలచడో, అది బాల్యభావేన యోభాతి. అటువంటివాడిలో బ్రహ్మజ్ఞానము సిద్ధిస్తుంది. సాధనలో పుట్టుకొస్తుంది, అబ్బుతుంది అన్నప్పటికీ, అది సిద్ధ వస్తువు గనుక సిద్ధిస్తుంది.

**శ్లో॥ సర్వజ్ఞం ఫలమిత్యాహ । ర్దేహే సర్వమయో భువి ।**
**సదానందః సదాశాంతో । రమతే యత్ర కుత్ర చిత్ ॥**

జీవుడు భూమియందు ఎక్కడైతే సదానందుడును, సదాశాంతుడును, సమస్త స్వరూపుడును అయివున్నాడో, బాలుని వలె క్రీడించుచున్నాడో, దానినే సర్వజ్ఞత్వ పదమని, బ్రహ్మవేత్తలు చెప్పిరి. బ్రహ్మజ్ఞానము కావాలంటే, బ్రహ్మవేత్తలు చెప్పినట్లు ఉండాలి. బ్రహ్మవేత్తలు బ్రహ్మానుభవములో ఉండి, వారి స్వానుభవములోనుండీ చెబుతున్నారు. కాబట్టి వారు చెప్పింది ప్రమాణము. బ్రహ్మవేత్తలు చెప్పేదంతా వేదప్రమాణము. అనుభవము లేనివాళ్ళు, అష్టవిధ గురువులలో శాస్త్రము గురించి చెప్పేవారు, వేదాల గురించి ప్రవచనము చేసేవాళ్ళు, జీవభావాన్ని కూడా దాటించలేనివాళ్ళు, జీవభావాన్ని దాటించినంత మాత్రాన, పరమాత్మ స్థితిలో నిన్ను స్థిరం చేయలేనటువంటి గురువు చెప్పింది అనుభవ జ్ఞానము కాదు. వేద ప్రమాణము కాదు. గురూపదేశము ద్వారా నాలుగు మహావాక్యాలతో ఆ పరమాత్మ నేనే అనేటటువంటి అనుభవం వస్తుంది. శిష్యుడికి అటువంటి పరమాత్మానుభవం కలిగిన గురువు ఉపదేశిస్తే, పరమాత్మ అనేటటువంటి అనుభవము వస్తుంది. ఆ గురువుకి అటువంటి సామర్థ్యము ఉందో లేదో? ఇక్కడ బ్రహ్మవేత్తలని చెప్పడంలో ఉద్దేశ్యము ఏమిటంటే, వారు గురువే కానక్కర్లేదు. బ్రహ్మవేత్త అయివుంటే చాలు. వాళ్ళు చెప్పేదేదో, వాళ్ళ స్వానుభవం నుండి చెబుతున్నారు. శిష్యులను పెట్టుకుని బోధిస్తే గురువు అవుతాడు. శిష్యులను పెట్టుకోకపోతే, తన స్వానుభవం తనలోనే ఉంటుంది. తన స్వానుభవంచేత గ్రంథాలు వ్రాయవచ్చు. ఇవన్నీ ప్రమాణములే.

ఈ బ్రహ్మవేత్తలైన వారే ఉపనిషత్తులుకు గాని, బ్రహ్మసూత్రాల యొక్క వ్యాఖ్యానములు గాని వ్రాశారు. అటువంటి బ్రహ్మవేత్తే శ్రీకృష్ణ పరమాత్మ. భగవద్గీతను సర్వ ఉపనిషత్తులయొక్క సారముగా మనకు అందించారు. కనుక ఇవన్నీ ప్రమాణాలు. స్మృతి, శృతి ప్రమాణాలు. బ్రహ్మవేత్త చెబితే శృతి. బ్రహ్మవేత్త కావాడానికి ఉన్న శాస్త్రము స్మృతి. బ్రహ్మవేత్త దర్శించి చెప్పింది శృతి. అది తపో దర్శనము. బ్రహ్మవేత్త అయినవాడు చెప్పేది స్మృతి. ఉదాహరణకు భగవద్గీత స్మృతి. కృష్ణ పరమాత్మ తన స్వానుభవంలోనుండి చెప్పాడు కాబట్టి అది స్మృతి. వేదాల ద్వారా దర్శనాలు పొందడమూ, తద్వారా వచ్చినటువంటి అపరోక్షానుభూతి, ఆ వేదాల ద్వారా అందించబడినప్పుడు, అది శృతి. బ్రహ్మవేత్త అని ఎందుకు వాడారు అంటే, అతను చెప్పినదే ప్రమాణము. ఎందుకంటే, ఆ రకంగా ఆధ్యాత్మిక ప్రయాణాన్ని చేసి, కొన్ని మజిలీలలో అనుభవము పొంది, ఏకంగా ఇంద్రియాల నుండి, మనస్సు నుండి, జీవచైతన్యము నుండి, అనాత్మ భావన నుండి క్రమముగా విడుదలయ్యాడో ఆ పద్ధతిలోనే ఈ శాస్త్రాలన్నీ వచ్చాయి కాబట్టి, బ్రహ్మవేత్త చెప్పినదే ప్రమాణము.

ప్రమాణములు మూడు ఉంటాయి. ఒకటి ఆగమ ప్రమాణము, రెండు అనుమాన ప్రమాణము, మూడు ప్రత్యక్ష ప్రమాణము. బ్రహ్మవేత్తలలో ఉన్నది ప్రత్యక్ష ప్రమాణము. ఆగమ ప్రమాణము శాస్త్రాలలో ఉంది. శాస్త్ర ద్రష్టం, గురోర్వాక్యం, తృతీయం ఆత్మనిశ్చయం. ఆగమ ప్రమాణము ద్వారా పరిశీలించాలి. ప్రత్యక్ష ప్రమాణంగా ఉన్న బ్రహ్మవేత్తల దగ్గర, సద్గురువుల దగ్గర శ్రవణము చేసి, మననము, నిది ధ్యాస చేసి, ఈ మనన కాలంలోనే నీకు నీ బుద్ధిలో ఈ వస్తువు దృఢంగా నిర్ణయము కావాలి. ఈ దృఢమైనటువంటి నిర్ణయము కావాలంటే, అధ్యారోప అపవాద పద్ధతిలో స్వయం విచారణ చేయాలి. ఈ స్వయం విచారణ చేయడమే అనుమాన ప్రమాణముగా జరుగుతుంది.

నిప్పులేనిదే పొగరాదు అన్నట్లుగా సర్వవ్యాపక పరమాత్మ అనేటటువంటి శుద్ధ చైతన్యము లేనిదే ఏ జీవి కూడా తన జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలను గాని, అవయవాలను గాని, చలనాలను గాని, చేసేటటువంటిది అసాధ్యము. జడమైనటువంటి ఈ ప్రకృతి, ప్రపంచము, జడమైనటువంటి దేహాదులు, పంచకోశాలు, జడమైనటువంటి మనస్సు, జడమైనటువంటి కర్మ, ఒక కార్య కారణ పద్ధతిలో ఇవన్ని పనిచేస్తున్నాయి అంటే, జన్మ కర్మ విధానము ఉంది అంటే, సృష్టి స్థితి లయ విధానము ఉంది అంటే, వీటిని కదిలించేటటువంటి తాను మాత్రము కదలకుండా సర్వ వ్యాపకమైనటువంటి శక్తి ఉండి ఉండాలి. ఆ శక్తి లేనిదే ఇవన్నీ జరగవు అనేటటువంటి విచారణలో అనుమాన ప్రమాణము పనిచేస్తుంది.

సర్వజ్ఞత్వము అనేటటువంటిది పరబ్రహ్మ నిర్ణయం. ఆ పదవి సచ్ఛిష్యుడు అందుకోవాలి. అది అందుకోవాలి అంటే, ఈ జీవుడు ఈ భూమియందు సర్వకాల సర్వావస్థలలో కూడా సదా వాటిచేత బాధించబడక, వాటిచేత రెచ్చగొట్టబడక, వాటిచేత స్పందించబడక, శాంతుడుగాను, ఏమీ పట్టనివాడుగాను ఉన్నాడో, ఏకాకి అని పై శ్లోకంలో చెప్పారు. దానివల్ల సమస్తము తన యొక్క స్వరూపమే అని అద్వయ స్వరూపుడై, నేను ఇతరము అనే భేదము లేక ఉంటాడు. అనసూయ అన్నప్పుడు నేను – ఇతరము అన్న భేదము లేక, కాని ఇక్కడ ప్రపంచములోని వ్యవహారము జరుగుచున్నది చూస్తున్నాడు. అభేద స్థితిలో జరిగేది చూచినప్పుడు అది క్రీడ. వాడు నిన్ను కొట్టినా, తిట్టినా, బాధించినా అదంతా క్రీడే. ఖేల, లీలా విలాసము. ఈ జగత్ వ్యాపారమంతా కూడా నేను, నాది అని లేక సర్వమూ తానైయున్నటువంటి ఏకాకిగా, ఏకాంత దర్శనముతో ఎవడైతే ఉన్నాడోవాడికి ఇదంతా ఒక పెద్ద ఖేల. ప్రజ్ఞావిలాసము, మాయా విలాసము. దానిని అట్లా విలాసముగా, వినోదముగా ఆనందముగా, శాంతముగా, రెచ్చకొట్టబడే వాటి మధ్యలో ఉంటూ కూడా, శాంతుడుగా ఉండి, కదిలించే వాటి మధ్యలో ఉండికూడా, కదలకుండా ఉంటాడు. కూటస్థుడు అంటే అదే అర్థము. మనస్సు ఇంద్రియాల యొక్క ప్రపంచము యొక్క విషయాల యొక్క స్పందన, ప్రతిస్పందనల మధ్య నీవు ఆత్మనిష్ఠుడవై కదలకుండా ఉండడమే కూటస్థము. అవి ఎంత కదిలించినా, వాటి ప్రభావము నీమీద పడినా, వాటితో కూడకుండా ఉండే స్థితి కూటస్థము. కూటస్థుడే సర్వజ్ఞ పదవి పొందగలడు అని బ్రహ్మవేత్తలు వారి స్వానుభవము నుండి చెబుతున్నారు.

**శ్లో॥ స్వయం బ్రహ్మమయో భూత్వ । తత్పరంచావలోకయేత్ ।**
**పరత్పరతం నాన్యత్ । సర్వగ్ం తన్నిరామయం ॥**

పరము కంటే పరమైన దానికి, అనగా సూక్ష్మమైనది పరం, అంతకంటే పరత్పరతం, న అన్యత్, దానికంటే అన్యము లేదు. సర్వం 'తత్' నిరామయం. సర్వము కూడా అదే అయివున్నది. అది నిరామయము. తాను పరబ్రహ్మ రూపియై ఉండి, విషయాలను చింతించి విషయరూపుడయ్యాడు, తిరిగి బ్రహ్మమును చింతించి బ్రహ్మరూపుడయ్యాడు. చింతనచేత ఇదంతా అయినది **యద్భావం తద్భవతి**. కనుక భావాన్నిబట్టి అయ్యేది కాకుండా, భావాన్ని బట్టి చింతించేది ఆపితే, ఒక అభావ స్థితి వస్తుంది. సత్యము అన్ని కాలాలలోనూ, అన్ని చోట్ల ఉంది కనుక వ్యష్టిలో ఎవడైతే తన భావాలు అన్నిటికీ కూడా అతీత స్థితిలో, అభావమై ఉంటాడో, తన సహజమైనటువంటి, తన సత్యమైనటువంటి స్వరూపమునకు ఈ భావాలవల్ల ఆటంకము కలుగుచున్నందుచేత, అభావ స్థితిలో ఆటంకము తొలిగింది కనుక తాను సత్యస్వరూపుడుగా ఉంటాడు. కనుక బ్రహ్మరూపుడు అనేటటువంటిది **యద్భావం తద్భవతిగా**, ఏది చింతన చేస్తే, ఆ ఆకారం అయినట్లుగా అయ్యాడు కనుక చింతనవల్ల జరిగే ఆకారాలన్నీ భ్రాంతి. ఇక్కడ బ్రహ్మరూపుడు అనేదికూడా భ్రాంతియే. ఈ భ్రాంతి కొన్ని లక్షణాల చేత, సత్యవస్తువుకు సమీపముగా ఉంది. సమంగా, సామీప్యంగా, దగ్గరగా ఉంది. దీని వల్ల కలిగేటటువంటి అనుభవము ఉపరతి. బ్రహ్మరూపుడగుట వలన కలిగే అనుభవము ఉపరతి. సాక్షాత్ పరబ్రహ్మ అయ్యేది తరువాతి సంగతి. అప్పుడు చిత్తవృత్తి ఆగిపోతుంది, చింతన ఆగిపోతుంది. భావాలు ఆగిపోతాయి. అతనిని బంధించేది, పక్కదారి పట్టించేది, నిరోధించేది ఏమీ లేనటువంటి స్థితిలో అన్ని అడ్డంకులు తొలగినటువంటి స్థితిలో సత్యము సాక్షాత్కరిస్తుంది.

ఇక్కడ సాక్షాత్కారము అంటే గోచరించుట కాదు, అపరోక్షము. జ్ఞాననేత్రముచేత దర్శించబడినదానితో ముడిపడి రెండవది లేక అద్వయమై ఉన్నటువంటిది సాక్షాత్కారము. అటువంటి సాక్షాత్కారము బ్రహ్మరూపి అయిన తరువాత వస్తుంది. బ్రహ్మరూపము కూడా చిత్తవృత్తే. అందుకని దాని పిమ్మట దానికి అతీతమైనటువంటి పర స్వరూపము, పరమున కంటే, పరమున కంటే పరమైనది, దాని కంటే పరము లేనిది, అది సత్యము. ఆ పర స్వరూపము ఏమిటి? అంటే, ఆత్మ అనేటువంటి ఒక శిష్యుడు, ఈ రకముగా జీవభావమును వదిలి, అదే శిష్యుడు ఈశ్వరభావాన్ని వదిలి, అదే శిష్యుడు బ్రహ్మరూప భావన కలిగి, ఆ బ్రహ్మభావాన్ని కూడా వదిలి, అదే శిష్యుడు ఒంటరివాడై, తనకంటే అన్యము లేనివాడై, తనకంటే అన్యముగా ఉన్న దృశ్యము తోచనివాడై, తనకు తానే అయివున్నవాడు కేవలాత్మ. కేవలము తానే ఆత్మగా ఉండడము కేవలాత్మ. ఇది త్రిపుటి లేకపోవడము. ద్రష్ట, దర్శనము, దృశ్యము అనే మూడు లేకపోవడంతో సాధకుడు, సచ్ఛిష్యుడు, ఆత్మస్వరూపుడు ఎవరైతే అన్నీ వదులుకుని మిగిలి ఉన్నాడో వాడు 'కేవాలత్మ'. కేవలాత్మను చూచును. ఇక్కడ చూచుట అంటే దర్శించుట అని అర్థము. అట్టి పరస్వరూపము దర్శించుట అనేది పోవాలి అద్వైతములో.

పర స్వరూపముకంటే పరమైనది పరాత్పరము. ఆ పరాత్పరాన్ని అవలోకించాలి అంటే, నీలోకి నీవు అంతర్ముఖమై, దర్శన రూపంలో, అనుభవరూపంలో చూడాలి. 'తత్పరంచ అవలోకయేత్' – అట్లా అవలోకించాలి. ఎక్కడికి అవలోకిస్తారు? 'అవ' – అంటే లోతుగా, లోపలికి అని. ఆలోకన – అంటే చూడడము. అవలోకన అంటే లోతుగా చూడటము. నీ అంతర్ముఖంలో, లోతుగా నీ హృదయస్థానానికి వెళ్ళి, నీ ఇంద్రియాలను, విషయాలను వాటికి సంబంధించిన అన్ని అనుభవాలను వదలివేసి, నిన్ను నువ్వు దర్శించాలి. అక్కడ నిన్ను నువ్వు దర్శిస్తే అది నువ్వే అవుతావు. ఎవరిని వారు ఎలా దర్శిస్తారు? మిమ్మల్ని మీరు చూసుకోగలుగుతారా? మీకంటే అన్యముగా ఉన్న ముఖాన్ని మీరు చూసుకోగలరు. ఆత్మ స్వరూపమైన నిన్ను నీవు ఎలా చూసుకుంటావు?

మాయ అనే అద్దములో ప్రతిబింబముగా చూసుకుంటూ, బ్రహ్మాకారము అయ్యింది. మాయను విడిచిపెడితే, ప్రతిబింబము పోతే, ఆ బ్రహ్మాకారము అనే జ్ఞానము పోయి, స్వస్వరూపమైన బ్రహ్మమే అవలోకనలో సిద్ధిస్తుంది. అవలోకనలో కనబడుట కాదు, దృశ్యము కాదు, సాధన కాదు. సాధ్యాసాధ్యములు లేనిది. భేదాభేద్యములు లేనిది. బాధాబాధ్యములు కానిది. సిద్ధవస్తువు ఆ పరబ్రహ్మ. అది పరిపూర్ణము. పరిపూర్ణము కంటే అన్యము ఏదియూ లేదు. అది అంతటను నిండియున్నది. అది మాత్రమే ఉన్నది. అది కేవలమై యున్నది. అది తన్మాత్రమై యున్నది. అది తప్ప అన్యము లేదు. దాంట్లో అన్యము తోచుటకు కూడా వీలుకాక, అన్యము సృష్టించుటకు వీలుకాక, సృష్టించడానికి అవకాశము లేక, నిరాకాశమై, ములుగ్రుచ్చ సందులేక నిరంధ్రమై యున్నది. అంతటా నిండి దట్టముగా, నిబిడీకృతమై యున్నది. దేశకాల వస్తువులు లేకుండా ఉన్నది. అది అపరోక్షముగా స్వస్వరూపముగా తనలోతాను రమించే పద్ధతిగా ఆ రమించే పద్ధతి బహిర్గతముగా చెప్పడానికి, వ్యక్తము చేయడానికి వీలుపడని విధముగా ఉన్నది. అది దేశము, కాలము, వస్తువులు ఉంటే, దాంట్లో వ్యాపకముగా, ఆమయముగా ఉండేది. కాని అది నిరామయము.

దేశ కాల వస్తువులు మాయావరణ దోషము చేత ఉన్నాయి. మాయావరణలో దేశ కాల వస్తువులు ఉన్నాయనేటటువంటిది నిరశన చేస్తే, మాయ మర్మమెరిగి, మాయను అధిగమించిన వారి విషయంలో, ఆవరణ పోయి నిరావరణ అయ్యింది. నిరావరణ యందు వ్యాపకత్వస్థితి లేదు. వ్యాపకము లేకపోవడము, ఆమయము లేకపోవడము నిరామయము. ఈ పదాలకు అర్థము తెలిస్తే, ఆ పరబ్రహ్మని ఊహకు అందించుకోవచ్చు. అందుకే నిరామయము అంటే, ఆమయము కానిది, వ్యాపకము కానిది, సర్వవ్యాపక బ్రహ్మానుభవము నుండి, వ్యాపకత్వాన్ని విరమించినవాడు పరబ్రహ్మ స్వరూపుడు అవుతాడు. ఇది ఊహకు అందేమాదిరి చెప్పాము. అది మాయాకల్పిత విషయాలు కనుక అజ్ఞానములో, భ్రాంతిలో విషయీకరించుకుని, కొన్ని విషయాల దాకా వ్యాపించాడు. కనుక వాడు అనాత్మ అయ్యాడు.

విషయాలు అసత్యమని, విషయాల నుండి సాక్షి విలక్షణమయినప్పటికి వ్యాపిస్తూ ఉన్నాడు కనుక అన్నిటి దగ్గరకు వెళ్ళి, అన్నిటికి అంటకుండా విలక్షణంగా ఉండి, అసంగముగా ఉండి, అన్నిటికి సాక్షిగా ఉంటే అది పరమాత్మ. పరబ్రహ్మము అంటే సాక్షిత్వము పోవాలి. విలక్షణత్వము పోవాలి. వ్యాపకత్వము, సంగత్వము పోవాలి. ఇవన్నీ పోతే అది నిరామయము. సర్వవ్యాపకుడు, సర్వమంతా తానే ఉన్నవాడు అన్నప్పుడు పరమాత్మ. నిరామయము అన్నప్పుడు పరబ్రహ్మ. అద్వయ పరబ్రహ్మ. మాయకు పరమైన పరబ్రహ్మ. శిష్యుని విషయములో ఇది మాయ మర్మమెరిగి, మాయను దాటినవాడు. ఇది మాయ కదా, ఇది లేనిది

కదా అనుకున్నవాడికి, నిర్ణయముగా తెలిసినవాడికి, ఆ పరాత్పర స్థితి, ఆ సచ్ఛిష్యుని స్థితి, ఐక్యతా సిద్ధిగా ఒక్కటే 'అయ్యింది' అని అనకుండా జాగ్రత్త పడుతూ చెబుతున్నారు. ఈ వాక్యము వినండి. 'అయ్యింది, పొందాడు, దాటాడు' – అనకూడదు. భ్రాంతి రహితము అయ్యింది, అంతే! అందుకని శిష్యుడని, పరాత్పరమని రెండు లేవు. ఉన్నది పరాత్పరమే. శిష్యుడు ఉన్నాడు అంటే, భ్రాంతిలోనే ఉన్నాడు. గురువు ఉన్నాడు అనంటే భ్రాంతిలోనే ఉన్నాడు. భ్రాంతిలోనే గురువు, శిష్యుడు, బోధ, సాధన, తరించడము, సాంఖ్యము, తారకము, అమనస్కము. అవన్నీ అయిపోయిన పిమ్మట, అతీత స్థితిలో, పరాత్పర స్థితిలో, మాయాత్పర స్థితిలో, అద్వయస్థితిలో అన్యమేదీ లేకుండా, భ్రాంతి రూప ప్రపంచములో, సర్వత్రా నిండియుండి, ఏది ఉన్నదో అదే ఇప్పుడు భ్రాంతి రహిత స్థితిలో నిరామయమై ఉన్నది.

ఏక కాలంలో మాయలో సర్వవ్యాపకముగా ఉండి, నిరావరణయందు స్వస్వరూప జ్ఞానమందు, అపరోక్షానుభూతియందు, నిరామయముగా ఉన్నాడు. అటువంటివాడు జీవన్ముక్తుడుగా వ్యాపకస్థితిలో, లీలావిలాసముగా దర్శిస్తున్నాడు. వానికి సృష్టి లీలావిలాసము. ఈ నిరామయమైనది ఏదో, అది దేనికీ ఆధారము కాదు. తనకు తానే స్వతహా సిద్ధమై యున్నది. దానినుండి ఏదీ పుట్టలేదు. దానిలోకి ఏదీ లయము కాదు. అది నిర్వికారము, అచలము, పరిపూర్ణము. దానికంటే అన్యము లేదు. అన్యమేదైనా ఉంటే, భ్రాంతిలో ఉంది కనుక భ్రాంతి రహితమైతే, ఉన్నదున్నట్లున్న సత్యమే ఉంటుంది కానీ, భ్రాంతిలోనే ప్రయాణం చేసి, సత్యాన్ని పట్టుకోవడం అనేది సాధ్యం కాదు. కలలో ఉన్నంతసేపూ, కల సత్యంగానే అనిపిస్తుంది కాని, మేల్కొంటే కల ఉండదు. జాగ్రదావస్థలో ఉన్నటువంటి అనుభవము సత్యముగా అనిపిస్తుంది. అలాగే పరబ్రహ్మమందు మేల్కొన్నప్పుడు, పరబ్రహ్మమే తానై యుంటాడు. తదితరము అంతా తోచదు.

అందుకని అసత్యము నుండి సత్యానికి ప్రయాణము లేదు. అసత్యము నుండి సత్యానికి చేరడానికి, సమీపము వరకూ రావడానికి సాధన, సాధనా ఫలితము, ఆధ్యాత్మిక ప్రయాణము ఉంటుంది. చివరికి ఇదంతా కూడా భ్రాంతే. సాధనలు అన్నీ భ్రాంతే. సమీపానికి వచ్చిన తరువాత, స్వరూప లక్షణం వీనికి సిద్ధించాలి అంటే, సమీప అనేటువంటి స్థితి పోవాలి. ఇది పోవడము, అది ఉండడము ఒకేసారి. ఇది పోతే అదే ఉన్నది. పోగొట్టుకునే సాధనే ఉందికానీ, రాబట్టుకునే సాధన లేదు. ఎందుకనంటే అది నువ్వే అయివున్నావు. నువ్వు రెండవ సారి, మూడవసారి అది అవ్వక్కర్లేదు. ఎప్పుడూ నువ్వు అదే అయివున్నావు. అన్ని కాలాల్లోనూ నువ్వు అదే అయివున్నావు.

నువ్వు సనాతన పురుషుడివి, ఆది అంతము లేనివాడివి, రాకడ – పోకడ లేనివాడివి, నిర్వికల్పుడివి, అచలుడివి, నువ్వు పరిపూర్ణుడివి. ఎందుకొచ్చిందో ఈ మాయ కమ్మి, ఆ పరిపూర్ణుడు అనేటటువంటిది మరుగునపడి, అజ్ఞాని అయ్యావు. అజ్ఞానిగా ఉన్నప్పుడు బంధమోక్షాలు ఉన్నాయి. ఈ సమీపము దాకా బంధమోక్షాలు ఉన్నాయి అని వచ్చావు. ఉప అనే సమీప స్థితి ఎప్పుడైతే పోయిందో, స్వస్వరూప సాక్షాత్కారమందు, ఇంతకాలము చేసిన, శ్రవణ–మనన–నిదిధ్యాసన సాధనలన్నీ కూడా శిష్యుడిగా గురువుగా, ప్రబోధ అందించడము గాని, వీరంతా ఉన్నారని గాని, ఇదంతా జరిగింది అనిగాని, అంతా తూచ్. ఏమీ లేదు. అన్ని కాలాల్లో అదే ఉన్నది. ఇదేమీ జరుగలేదు. జరిగినవన్నీ **'కలలో తోచినవి ఎలాగో, ఆలాగే'** జరిగినాయి. ఆ పరబ్రహ్మమునందు మేల్కొన్నవాడు, పరబ్రహ్మముగా స్థిరమయ్యే ఉంటాడు. అది శాశ్వతము, నిత్యవర్తమానము అయి ఉంటుంది. దానికి భూతకాలము, భవిష్యత్తు ఉండదు. ఈ భూతకాలములో ఇంత వరకూ జరిగినవన్నీ కూడా లేనివే. భ్రాంతి కాలములోనే ఉన్నాయి. భ్రాంతి రహితమైతే నిజానికి లేవు. **'కలలో తోచినవి ఏలాగో, ఆలాగే'** – అంతే అయిపోయింది!

**శ్లో॥ కిమావాహనమవ్యక్తే । వ్యాపకే కిం విసర్జనం**
**అమూర్తేచ కథం పూజా । కథం ధ్యాన నిరామయే ॥**

దీని తాత్పర్యం నీవే చూసుకోవాలి, ఇది నీకే వదిలేశాము. గురుగీతలో ఉంటుంది. కిం, ఆవాహన, అవ్యక్తే, వ్యాపకే, కిం, విసర్జనం.

అసలు ఇక ఏమున్నదని? ఏది ఆవాహన చేసుకున్నావు? ఏది భ్రాంతిలో నువ్వు అయినది? భ్రాంతిలో నువ్వు కానిది మీదేసుకున్నావు. ఏవి భ్రాంతిలో వ్యక్తమైనాయి? ఏది వ్యాపించింది? ఏది బంధించింది? ఏది విసర్జించావు? అన్ని కాలాలలో అదే ఉంటే, ఇవన్నీ ఎక్కడ ఉన్నాయి? 'అమూర్తేచ' – అవి ఎప్పుడూ కూడా మూర్తీభవించలేదు, ప్రతీతి కాలేదు, ప్రకటించబడలేదు. ఏది మూర్తీభవించినా, ఏది ప్రతీతి కావాలన్నా, ఏది ప్రకటించబడాలన్నా, అది మాయలోనే సాధ్యము. మాయ లేనప్పుడు, మాయను దాటినప్పుడు, మాయమర్మము తెలిసినవాడికి అవన్నీ కూడా అమూర్తము. మూర్తీభవించలేదు. అటువంటి కథ. కథ

అంటే ఏమిటి? కల. అవి ఎవరో చెబితే కథగా విన్నట్లు ఉంది కాని, సత్యము కాదు. అది వార్త. చూచినవాడెవరో వచ్చి, చూచింది చూచినట్టుగా కాకుండా వాడికి ఎలా కనపడిందో అట్లా చెప్పిన వార్తని సత్యమని నమ్మలేము. కథ అంటే జరిగింది కాని, జరగనిది కాని, ఎవరో ఒకరు వచ్చి చెప్పింది, నీవు విన్నది ఎంతవరకూ సత్యము? కనుక ఈ మాయలో జరిగేవన్నీ ఒక కథ. ఎవరో చెబితే అనవసరముగా నమ్మాము.

యోగ వాశిష్టములో ఒక దాది పిల్లవాడిని నిద్రపుచ్చడానికి రోజుకు ఒక కల్పితమైన కథ చెబుతుంది. ఆ కథ నిజమనుకుని విని, ఆనందపడి నిద్రపోతాడు ఆ పిల్లవాడు. ఆ దాది ఇలా రోజుకో కథ కల్పించి చెబుతూనే ఉంటుంది. కనుక ఈ చావు పుట్టుకలు, ఈ ప్రపంచము, ఈ పంచీకరణ **'బ్రహ్మణో అవ్యక్తః అవ్యక్తో మహత్ నుంచి అఖిలం జగత్'** దాకా, నామరూప జగత్తుదాకా జన్మ కర్మ పద్ధతిగా, జీవ ఈశ్వర పద్ధతిగా, బ్రహ్మ సంకల్పంలో ఇవన్నీ కూడా మాయ అనేటటువంటి పొరలో, ప్రకాశించే బ్రహ్మయొక్క సంకల్పము ద్వారా జరిగినాయి. మాయ పొరద్వారా, మాయ ఉపాధి ద్వారా, మాయ తెరద్వారా ఏదైతే జరిగిందో, అవన్నీ సత్యవస్తువును సత్యముగా చూపించక, నామ రూప జగత్తుగా చూపిస్తుంది. ఇది మాయ కనుక ఆ చూపించేవన్నీ లేనివే ఉన్నట్లు చూపిస్తుంది. మాయయొక్క నిర్వచనము **'యామాసా మాయ'** – ఏది లేదో అది ఉన్నట్లు చూపించేటటువంటిది మాయ.

కనుక మాయ పొరలోనే ప్రతీతి, ప్రకటన, ఉండుట, పంచీకరణ, సృష్టి స్థితి లయ, అజ్ఞానము, జ్ఞానము, సాధన, బంధము, మోక్షము. అంతా కూడా ఈ మాయ అనే తెరలోనే ఉంది. ఒక్కసారి మాయ తెర దాటితే ఇవన్నీ ఏమీ లేవు. అన్నీ **'కలలో తోచినవి ఏలాగో, ఆలాగే'** – ఇవన్నీ ఒక పెద్ద కథ. ఎవరో మాయలోకి వెళ్ళి, కనుక్కొచ్చి చెప్పారు. నువ్వుమాయను దాటినప్పుడు దానిని కథగానే చూడు. ఇవి లేవు. అనగనగా రాజు, రాజుగారికి ఏడుగురు కొడుకులు, వేటకెళ్ళారు, ఏడు చేపలు తెచ్చారు, ఒక చేప ఎండలేదు... అన్నం పెట్టలేదు, అది లేదు, ఇది లేదు, చీమ కుట్టింది.... చీమ, చీమ ఎందుకు కుట్టావు? అసలు మొదట్లోనే రాజు లేడు. రాజు అంటే ఇక్కడ నేను. లేని రాజే వేటకెళ్ళాడు. లేని రాజు కొడుకులు వేటకెళ్తే, లేని ఏడు చేపలు దొరికాయి, ఏమీ లేవు. రాజే లేనప్పుడు... మిగితా కథ ఏముందక్కడ? కథ అంటే అది. ఏమిటా కథా కమామీషు? అంటారు. అంటే కథలు కల్పిస్తారు. కథలు సత్యము కాదు. ఒక వేళ కథలు సత్యమైనా, అది చెప్పేవాడి ద్వారా వక్రీకరించబడుతుంది. అసత్యముగా మారుతాయి. అసలు కథ అనేది ఎక్కడుంది? మాయలోనే కథలు. మాయ దాటితే కథే లేదు. రెండవ వస్తువు లేక, అన్యము లేక, అద్వయముగా, పరబ్రహ్మమే తనకు తానై, విశ్వానుభవాలు లేక, త్రిపుటి లేక, ద్విపుటి లేక, అపరోక్షమై, తనలో తాను రమిస్తూ ఉండడము తప్ప మరొకపనిలేదు. నిత్య వర్తమానముగా, ఆది అంతములు లేకుండా, ఉన్నది పరబ్రహ్మము. మిగితాది ఏది చెప్పినా కథ. కథ అంటే కల్పితము.

'కథం పూజా' – పూజా అంటే శూన్యము. ఏమీ లేనిదానినే ఉన్నట్లుగా కథలు చెప్పారు. **'కథం ధ్యాన నిరామయే'** – ఈ కథను ధ్యానం చేయకండి. కథ అంటే మాయ. నిరామయములో ఏమీ లేవు. ఆమయములోనే కథలన్నీ.

**శ్లో॥ తుర్య స్వరూప పరిపూరిత దివ్యభావౌ । సర్వ ప్రపంచ సృజనాత్మక శక్తి యుక్తౌ ।**
**ధ్యానైక గోచర విశిష్ఠ విశేష తత్త్వౌ । శ్రీ దేశికేంద్ర చరణం శరణం ప్రపద్యే ॥**

దేశికేంద్రులను అసలెప్పుడు పట్టుకోవాలి? ఒకటో క్లాసులో ఈయన దొరకడు. హైస్కూలులో దొరకడు. కాలేజీలో దొరకడు. రీసెర్చ్ చేసేటప్పుడు దొరుకుతాడు. బ్రహ్మనిష్ఠా గరిష్ఠుడై, అది కూడా బంధమేనని, ఆపైన ఏమున్నదో తెలియని వాళ్ళు, తెలుసుకుందామని వెళ్ళినటువంటి స్థితిలో, ఆ దక్షిణామూర్తి తత్త్వముగా, దేశికేంద్రులుగా, వారి యొక్క అవసరము అప్పుడొస్తుంది. నిజస్వరూపము వచ్చిన తరువాత, పరిపూర్ణత్వము వచ్చిన తరువాత, ఈ పరిపూర్ణత్వము కూడా అద్వైతములోనే. అచల పరిపూర్ణము అప్పుడే కాదు. అటువంటి పరిపూర్ణములో శరీర సంబంధ, భూలోక సంబంధ, భావాలు కాకుండా, ఆత్మ దివ్యాత్మ అయ్యింది.

జీవాత్మకి, బ్రహ్మాత్మకి మధ్యలో, దివ్యాత్మ అనే స్థితి ఒకటి ఉంది. బ్రహ్మ యొక్క ప్రకాశము దివ్యము. బ్రహ్మమే అయినది బ్రహ్మాత్మ. బ్రహ్మము నుండి వెలువడినటువంటి ప్రకాశము తానైనది దివ్యాత్మ. జ్యోతి వెలుగుతోంది, జ్యోతి యొక్క ప్రకాశము గదంతా నిండిది. జ్యోతిని నీవు దర్శించలేదు. జ్యోతి యొక్క ప్రకాశమును నీవు దర్శించావు. ప్రకాశము నువ్వైయ్యావు. ఆ ప్రకాశము తానైన వాడు దివ్యాత్మ. ఈ ప్రకాశము దేని నుండి వస్తుందో, ఆ జ్యోతి స్వరూపుడైన వాడు పరబ్రహ్మ. కనుక పరబ్రహ్మకు, జీవాత్మకు మధ్యలో దివ్యాత్మ అని ఒక స్థితి ఉంది. ఇక్కడ ఉన్నటువంటి అహంకారము కూడా దివ్యాహముగా

ఉంటుంది. కనుక ఆ దివ్యాత్మ యొక్క భావము **'దివ్యభావ'** – కనుక ఆ దివ్యాత్మగా ఉన్నప్పుడు, ఆ చైతన్యములో ఉన్నప్పుడు, దివ్యానుభవంలో ఉన్నప్పుడు, సర్వసాక్షిత్వముగా తురీయస్థితిలో ఉన్నప్పుడు, నీ లక్ష్యము 'తురీయాతీతము'. ఈ తురీయ స్థితిలో ఉన్నవాడికి, తురీయాతీతము లక్ష్యము. ఈ తురీయమందు అన్ని కాలాలలోనూ రెండవది తోచనటువంటి, ఒక అద్వయ బ్రహ్మ స్థితిని, పరిపూర్ణబోధగా గ్రహించి, మనన నిది ధ్యాసలు చేసి, చివరికి తురీయాతీత స్థితికి వెళ్తే, అది తిరిగిరాని మోక్షము. అలా కాకుండా సామాన్య స్థితిలో, బ్రహ్మ నిష్ఠని, సగుణాన్ని ఒక ధ్యానములో, ఒక నిర్వికల్ప సమాధిలో, నిర్గుణము చేసుకున్నంత మాత్రాన, అది కూడా ఒక మోక్షమే అయినప్పటికీ, అది తిరిగిరాని మోక్షము కాదు. ఇప్పుడు మనకు తిరిగిరాని మోక్షము కావాలి అంటే దేశికేంద్రులే కావాలి.

**'సర్వప్రపంచ సృజనాత్మక శక్తి యుక్తా'** – దివ్యభావము, దివ్యశక్తి, దివ్య అహంకారము నీకు వచ్చినప్పుడు, అష్టసిద్ధులు, దశ సిద్ధులు, అనేక సిద్ధులు వచ్చి, నువ్వు మళ్ళీ పునఃసృష్టి చేయగలవు. త్రిమూర్తులలాగా సృష్టి స్థితి లయలు చేయగలిగే సృజనాత్మక శక్తి ఉంటుంది నీకు. ఆ శక్తులు వినియోగించకూడదు. ఒక వేళ వినియోగిస్తే, మిథ్యా జగత్తు అనేటటువంటి దాంట్లో, నీకు మిథ్యాభావన లేదని అర్థము. వినియోగించకపోతే, మిథ్యాభావన గట్టిపడింది కాబట్టి, వినియోగించవలసిన అవసరము లేదు కనుక, అట్టి స్థితిలో నువ్వు, తురీయాతీత స్థితికి వెళ్తే, అది పరమపదము, అది తిరిగిరాని మోక్షము.

**సృజనాత్మక శక్తియుక్తా, సర్వప్రపంచ సృజనాత్మక శక్తి యుక్తా, ధ్యానైక గోచర విశేష, విశిష్ఠ తత్త్వా...** అన్ని శక్తులు కూడా, ఈ దక్షిణామూర్తి విశిష్ఠ తత్త్వంలో, దేశికేంద్రుడులో 'లేనెఱుక' గా ఉన్నాయి. తన యథార్థ స్వరూపము ఈ సామర్థ్యాన్ని వినియోగించేటట్లుగా లేదు. అవసరమైతే అన్నీ చేయగలిగిన వాడు, దత్తాత్రేయ త్రిమూర్తత్వముగా ఉండి, వినియోగించనటువంటి స్వరూప ధ్యానములో, నిరంతరాయముగా ఉండేటటువంటివాడు. అత్రిని సమీపించి, అనసూయ ద్వారా అతనిని లేనెఱుకలోనికి మేల్కొలిపి అత్రి అనసూయలు ఇక్కడ తల్లి తండ్రీ కాదు. నువ్వు దక్షిణామూర్తిని కదిలించాలి అంటే, ఆయన యొక్క స్థితి త్రిగుణ రహితము. భేదము లేనటువంటిది. కనుక నువ్వు త్రిగుణ రహితాన్ని అనగా అత్రిని ఆశ్రయించాలి. 'అత్రి' – అంటే త్రిగుణములు, త్రిపుటులు లేనిది, 'అనసూయ' అంటే భేద భావములు లేనిది. నీవు ఆ దత్తాత్రేయుడిని ఆవాహన చేయాలి అనంటే, నువ్వు త్రిగుణ రహిత స్థితిలో, నిర్గుణ స్థితిలో, భేదభావము లేని స్థితిలో, ఆయనను ఆవాహన చేస్తే, ఆయన వచ్చి, ఆయన బయలైయుండి, త్రిగుణ రహితమైయుండి, నీ ఆవాహనద్వారా వచ్చి, లేనెఱుకలోనికి దిగి, నువ్వు అప్పగించినటువంటి సృష్టి స్థితి లయలు అతనికి సామర్థ్యము ఉంది కాబట్టి చేస్తాడు.

అందుకే **'గురుః బ్రహ్మ గురుః విష్ణుః గురుః దేవో మహేశ్వరః'** – అన్నప్పుడు ఆ సామర్థ్యము ఉన్నది. అయినప్పటికీ అవి చేసేటటువంటి గానుగ ఎద్దు కాదు, వాటికే లోబడినటువంటి పరిమితత్వము కాదు. ఆ సామర్థ్యము ఉపయోగించవలసిన అవసరము లేనివాడు. సాక్షాత్ పరబ్రహ్మమై యున్నాడు. 'గురుసాక్షాత్ పరబ్రహ్మ' – శిష్యుడు ఆర్తితో ముందు గురువును మేల్కొల్పితే, గురువు లేనెఱుకలో ఉండి, భ్రాంతిలో ఉన్న శిష్యుడిని సత్యవస్తువులోనికి మేల్కొల్పుతాడు. అందుకే కందార్థాలలో మీరు నన్ను మేల్కొల్పండి, మిమ్ములను నేను మేల్కొల్పుతాను అని చెప్తాడు గురువు. ఈయన బయలైయుండుటచేత శిష్యుడు లేనెరుకలోకి మేల్కొలపాలి. మేల్కొలపాలి అంటే, తాత్కాలికముగా అయినాసరే, నీవు అత్రిని ఆశ్రయించాలి. అంటే త్రిపుటి రహిత స్థితిలో ఉండాలి. అనసూయను ఆశ్రయించాలి అంటే, అభేద స్థితిలో ఉండాలి. అటువంటి వాడే పరుడు. వాడిప్పుడు పరాత్పరుడు అవ్వాలంటే, దేశికేంద్రుడిని పట్టుకోవాలి. ఆ రకముగా సృజనాత్మక శక్తి, యుక్తి ఉన్నవాడు ఆ సద్గురువు. నువ్వు కూడా ఆశక్తులు సంపాదించినా, వాటిని వినియోగించకుండా, ఆ దేశికేంద్రుల యొక్క కృపతో అధిగమించి, నిరామయమై బయలవ్వాలి.

**'ధ్యానైక గోచర విశిష్ఠ విశేష తత్త్వా'** – అటువంటివాడు తన సామర్థ్యాన్ని చూపించకుండా, విశేషమైనటువంటి, నీకు అర్థము కానటువంటి, అనిర్వచనీయమైనటువంటి, ఒక తత్త్వము గురుతత్త్వము. బయలైయుండి కూడా లేనెఱుకలో ఎఱుక వ్యవహారము సర్వ సమర్థముగా నిర్వహించగలిగినటువంటి వాడి తత్త్వాన్ని ఎవరూ అంత తేలికగా అర్థం చేసుకోలేరు. ఇటు ఎఱుకలో ఉన్నాడు, ఎఱుకలో ఉన్నట్లుగానే ఉంటాడు, కానీ బయలైయున్నాడు. ఇట్లా రెండు రకాలుగా ఉన్నవాడిని మీరు ఎలా గ్రహించగలరు? ఎట్లా నిర్ణయించగలరు? అటువంటి దేశికేంద్రుని యొక్క చరణములను శరణం ప్రపద్యే – ఆయనయొక్క పాదములను శరణు వేడుకోవాలి. ఇక్కడ పాదమంటే ఏమిటి? బయలై యున్నవాడు ఒక పాదము మాయలోకి, నీకు అందుబాటు చేసేటటువంటి చరణమును పట్టుకుని అంటే రెండు కాళ్ళు కాదు, బ్రహ్మ యొక్కనాలుగు పాదాలలో, మూడుపాదాలు

బయలైయుంటే, ఒక పాదము మాయలోకి వచ్చి, లేనెఱుకగా, ఆయన వైపు నుండి చూస్తే, అది లేనెఱుకగా మీకది దొరికింది. నువ్వేమో ఎఱుకలో ఉండి దానిని పట్టుకోవాలి. 'శరణం ప్రపద్యే' – అటువంటి చరణములను ఆశ్రయించి శరణాగతి పొందినప్పుడు నీవు లేనివాడవు అవుతావు. అప్పుడు అదే అయివుంటావు.

**శ్లో॥ మంగళం దేశికేంద్రాయ । మహనీయ గుణాత్మనే ।**
**మంగళం రాజయోగీంద్రాయ । గురుదేవాయ మంగళం ॥**

మంగళం అంటే ఏమిటి? సర్వమంగళం పాడింది అంటారు. అంటే ఏమిటి? వ్యాపారంలో నష్టం వస్తే, ఉన్నదంతా ఊడ్చుకుపోతే, సర్వమంగళము అంటారు. ఇక్కడ 'మంగళము' అంటే, శుభము అని అర్థము. కానీ ఈ పరిపూర్ణబోధలో మంగళము అని అంటే, అన్నీ లేకుండా పోయి, బయలై యుండటమే మంగళము. కనుక దేశికేంద్రుడు ఎట్లా ఉన్నాడు? బయలుగా ఉన్నాడు. బయలే శుభం. బయలే మోక్షం. బయలే పరమపదం. పరమపదం అయినది మంగళకరము కాదా? పరమపదమైనటువంటిది, మోక్షస్థానము అయినటువంటిది శుభప్రదము కాదా? అందుకని మంగళము అనే శబ్దాన్ని అలా దేశికేంద్రులకు సరిపోతుంది. ఆయనా లేనివాడే, అన్నీ లేకుండా చేసేవాడే.

**'మహనీయ గుణాత్మనే'** – మళ్ళీ ఏమయ్యాడు? లేనివాడైనాసరే మహద్బ్రహ్మగా, లేనెఱుకగా, మహనీయాత్మగా, లేనెఱుకలో ఉన్నటువంటి కల్యాణ గుణములు కలిగినవాడై యున్నటువంటి గురువుకు **'మంగళం రాజయోగీంద్రాయ'.** యోగి అంటే కలిసిపోవడం. యోగీంద్రుడు అంటే ఆ కలిశాడు అనేటటువంటిది పోయి, ఏకత్వసిద్ధిలో శ్రేష్ఠుడై మళ్ళీ ద్వైవత్వము తోచనటువంటి స్థితి యోగీంద్రుడు. ఈ దేశికేంద్రుడు ఎవరయ్యా అనంటే, అటువంటి యోగీంద్రులలోకెల్లా రాజు. **'మంగళం రాజయోగీంద్రాయ'** అటువంటివాడు మనకిప్పుడు గురువు. అటువంటి గురువును మనమిప్పుడు ఆశ్రయిస్తున్నాము. **'గురుదేవాయ మంగళం'** దేవ అంటే ఏమిటి? దివ్యముగా, వ్యాపకముగా ప్రకాశించుటను దేవా అంటారు. చైతన్యప్రకాశముయొక్క వ్యాపకత్వాన్ని, మాయావరణయందు చైతన్యప్రకాశము యొక్క వ్యాపకత్వాన్ని దైవమని, దివ్యమని అంటాము.

గురువు నిష్కళారూపుడై, నిష్ప్రకాశ రూపుడై, బయలై ఉన్నాడు. మాయావరణలోనే పరమాత్మ ప్రకాశించింది. కనుక మాయావరణలో పరమాత్మ ప్రకాశరూపంలో దిగివచ్చి, నిన్ను కూడా పరమాత్మ అనే అనుభవంలో, నీ ప్రకాశంలో ఏకత్వాన్ని చేసి, నిన్ను తనలో మమైకం చేసుకుని, ఆ శిష్యుడిని కడతేర్చి, ఈ 'దేవ' అనే శబ్దంతోటి ఉన్న, పరమాత్మ జ్ఞానం నుంచి విడుదల చేసి, ఈ ఎఱుక అనే బీజమును లేకుండా చేసి, నిష్కళ అయినటువంటి, నిష్ప్రపంచ రూపుడు అయినటువంటి, నిరామయమైనటువంటి అచలమైనటువంటి, పరిపూర్ణమైనటువంటి 'బట్టబయలుగా తానుండి' – మాయలో నిన్ను మమైకం చేసుకున్నటువంటి, నిన్ను కూడా మాయావరణం దాటించి, నిరావరణమందు ఇద్దరూ కలసి, లేనివారై బట్టబయలుగా ఉన్నారు. మంగళం అంటే 'లేనివారు' అయ్యారు అని. **'గురుదేవాయ మంగళం'** అంటే, దేవ శబ్దంతో గురువు, శిష్యుడిని తనలోకి మమైకం చేసుకుని, మంగళం శబ్దంతో ఇద్దరూ కలిసి, బయలైపోయారు అనే అర్థం తీసుకోవాలి ఇక్కడ. ఇది మంగళహారతి.

**సద్గురుభ్యోన్నమః**

# గుర్వనుగ్రహము

**శ్లో॥ ఓం నమః ప్రణార్థాయ । శుద్ధ జ్ఞానైక మూర్తయే ।**
**నిర్మలాయ ప్రశాంతాయ । దక్షిణామూర్తయే నమః ॥**

**నిర్మలాయ** – మూడుగుణములు తన స్వభావములో లేనివాడు.

**ప్రశాంతాయ** – శాంతి అంటే పరబ్రహ్మమే. అశాంతి అంటే జీవుడు, ఈశ్వరుడు ఇవన్నీ. శాంతమే బ్రహ్మ. శాంతము అంటే శమము యొక్క అంతము. ఎంతవరకు నీవు సహజ స్థితిలో ఉంటున్నావో, దానియొక్క పరాకాష్ఠ శమము యొక్క అంతము శాంతము. శాంతము, దాంతము అంటాము. దాంతము అంటే దమించుటకు అంతము. దమించుట అంటే నిగ్రహించుట. నిగ్రహించవలసిన అవసరము తీరిపోతే దాంతము. శమించుట అనే సాధనయొక్క అంతము శాంతము. అంటే కేవలము పరబ్రహ్మే. ప్ర – అంటే ప్రకృష్ఠముగా, శ్రేష్ఠముగా, గొప్పగా అనియు, దానికంటే మిక్కిలి ఉన్నతమైనది మరొకటి లేదు అని అర్థము. ప్రశాంతాయ అంటే పరమ శాంత స్వరూపుడు.

నిర్మలాయ అంటే, త్రిగుణ రహితము, ఏ మాలిన్యము లేనివాడు. దక్షిణామూర్తయే నమః. దక్షిణామూర్తి అంటే రెండు మూడు అర్థాలున్నాయి. దక్షిణము – ప్రకృతి పురుషులలో దక్షిణము అంటే కుడివైపు ఉండేది శివుడు. ఎడమవైపు, వామ అంటే ఎడమ వైపు ఉండేది ప్రకృతి. అర్థనారీశ్వరుడు, కుడివైపు ఈశ్వరుడు, ఎడమవైపు ప్రకృతి. ప్రకృతి అంటే మాయ కనుక ఎడమవైపు తీసేసి, కేవలము కుడి వైపు చెప్పుకునేటప్పుడు, మాయను తొలగిస్తే దక్షిణామూర్తి అవుతాడు. పురుషోత్తముడౌతాడు. అర్థనారీశ్వరుడు – మాయతో కూడినవాడు సగుణుడు. ఆ అర్థంలో మాయను తొలగిస్తే, కేవలం దక్షిణము వైపు ఉన్నవాడు, దక్షిణామూర్తి అవుతాడు. పురుషోత్తముడౌతాడు.

నమః అన్నప్పుడల్లా నీవు లేకుండా పోయే విధముగా దీనిని గ్రహించాలి. ఏదైనా ఇక్కడ వేదాంత బోధ జరుగుతుంటే, నమః అనే శబ్దంతో మొదలుపెడుతున్నాము కనుక వినేటప్పుడు, వింటున్నవాడు లేకుండా పోవాలి. అందుకే ముందు శాంతి మంత్రాలు చదివి, ఓం శాంతిః శాంతిః శాంతిః అని మూడు సార్లు అంటాము. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆది దైవిక ప్రేరణలు నీలో కలుగకుండా శాంతించాలి అని ప్రార్థన చేసుకుని మనం ప్రారంభిస్తున్నాము. ప్రార్థన చేసేటప్పుడు శాంతించాలనే కోరికతో నీవు మిగిలివున్నావు కదా! నమః అనే శబ్దంతో నీవు లేకుండా ఉండే పనిగా, ఈ వేదాంతాన్ని గ్రహించాలి.

ఓం నమః – ఓం అంటే ఆది అని, మొదలు అని, ప్రణవానికి వ్యక్త స్థితి ఆది. అవ్యక్త స్థితిలో ఆది, అంతము ఏదీ లేదు. వ్యక్త స్థితి ఎప్పుడు ప్రారంభమైందో అది ఆది. వ్యక్త స్థితి ఓంకారముతో మొదలైంది. కాబట్టి ఓంకారము వల్ల మూడు మాతృకలతో అకార, ఉకార, మకార మాతృకలతో స్థూల, సూక్ష్మ, కారణ సృష్టి జరిగింది కనుక ఓం అంటున్నాము. స్థూల, సూక్ష్మ, కారణ సృష్టిలో ఉన్న మనము, ఓం దగ్గరకు వెళ్ళడం అంటే, సృష్టికి మూలానికి వెళ్ళడము. వ్యక్తరూపమే మనకు దొరుకుతుంది కాబట్టి ఓం అని మొదలు పెడుతాము. ఓం ప్రథమం అంటాము. ఓం కి వెనుక ఉన్నది ప్రణవము. ఓం అనేటటువంటి ఆది స్థితికి వెళ్ళి, వెనుక ఉన్నటువంటి అనంత స్థితి ప్రణవార్థము. ప్రణవార్థ స్వరూపుడు ఆ సద్గురుమూర్తి. శుద్ధ జ్ఞానైకమూర్తి. మాలిన్యములు సహజముగా ఎప్పటికీ లేనివాడు. ఒకప్పుడూ ఉంటే వదిలించుకున్నవాడు కాదు. ఎప్పుడూ లేనివాడే. నిర్మలాయ – శమాదులచేత శాంత స్వరూపము, పరబ్రహ్మమైనవాడు కాదు. ఉన్నదున్నట్లున్నటువంటి, అన్ని కాలాలలోను ప్రశాంతాయ దక్షిణామూర్తయే – అంటే మాయకు పరమైనవాడు పురుషోత్తముడు. అటువంటి గురువును మనము అనుగ్రహించమని అడుగుతున్నాము.

## పాగోలు స్వామి వారి గురుపరంపర

అన్ని రకాలుగా దీనిలో ఏమిచ్చారంటే, అవతార్ మెహెర్ బాబా, భగవాన్ సత్యసాయి బాబా అని ఉన్నాయి. ఇది క్రింద నుంచి పైకి చదవాలి. క్రింద నుంచి పైకి చదివినప్పుడు సుబ్బయాచార్యులు గారు, ప్రథమముగా ఆ పీఠాధిపతి బ్రహ్మశ్రీ కొల్లి కోటయార్యులు గారు, తరువాత వారి కుమారుడు కొల్లి గురుప్రసాద్‌గారు, ఆయన ద్వారా స్వామికి బోధ, ప్రబోధ సర్వవ్యాపక స్థితి జరిగింది. గురుప్రసాద్ గారు అనారోగ్యంతో శరీరాన్ని విడిచే సందర్భంలో మన గురువుగారైన నరసింహారావుగారికి చిన్న కందార్థాలు అనే పుస్తకం ఇవ్వడము జరిగింది. అది గురువుగారి సొంత పుస్తకము, చిన్న పుస్తకము. తాత్పర్యము ఏమీ లేదు. చదువుతూ ఉండు, నీకది అర్థమవుతుంది అని అన్నారు. మరి మీరు శరీరం చాలించబోతుంటే, నాకెవరు చెబుతారు? నేనేం చేయాలి? అని అడిగారు. నువ్వు పరమాత్మగా, చైతన్యంగా, సర్వవ్యాపక స్థితిగా ఉన్నావు కనుక నీకు స్థూలముగా గురువులు అక్కర్లేదు. సూక్ష్మంగా ఎవరో ఒకరు సహాయం చేస్తారు. ఆ సూక్ష్మముగా సహాయం అందేది గురుతత్త్వం ద్వారా అని చెప్పడము జరిగింది. తరువాత ఆయన చాటైపోయారు. కొంతకాలం అలా పాడుతూ ఉండగా, షిరిడి సాయిబాబావారు సూక్ష్మ స్థితిలో మన గురువుగారికి సహాయం చేశారు. తరువాత శ్రీ తాజుద్దీన్‌బాబా అనేటటువంటి సద్గురువు యొక్క సహాయం అందింది. ఆ తరువాత శ్రీ ఉపాసనీ మహారాజ్ యొక్క సహాయంతో కొన్ని విశ్వగోళాల యొక్క అనుభవం, విశ్వగోళాలన్నీ కూడా ఆయన నుండి బయటకి వెళ్తూ, మళ్ళీ ఆయనలోకే లయమౌతున్నట్లుగా అనుభవం వచ్చింది. ఆ విశ్వంలో బ్రహ్మాండాలన్నీ ఒక్కొక్క బ్రహ్మాండమూ ఒక్కొక్క గోళాకారముగా, ఆ తరువాత స్వామిలోనుంచి బయటకు వెళ్తూ, వెనక్కు వచ్చేటప్పుడు స్వామిలోకి వెళ్ళకుండా, ప్రక్కలకు వెళ్ళడం జరిగింది.

అలా అనుభవాలను దాటుకుంటూ వెళ్ళినప్పుడు వారు సహాయాన్ని పొందినటువంటి వారిలో, శ్రీ మాతా అరవిందులున్నారు. ముఖ్యముగా శ్రీ బళ్ళ సుబ్బనాగన్న గారు – చల్లపల్లిలో వారి ఆశ్రమము ఉంది. వారు చాటైయ్యారు. వారి ఆరాధనలు ప్రతి సంవత్సరము జరుగుతూ ఉంటాయి. అటువంటి ఆరాధనలకు వెళ్ళినప్పుడల్లా స్వామివారు ఆయన సమాధి

దగ్గర తల పెట్టి వేడుకుంటూ ఉండేవారు. నాకీబోధ సూక్ష్మంగా మీ ద్వారా అందాలి అని వేడుకుంటూ ఉండేవారు. అలా ఉండగా ఒకరోజు తెల్లవారు ఝామున గురుప్రసాద్ గారు ఇచ్చిన కందార్థముల పుస్తకం, (అర్థం అయినా అవ్వకపోయినా ప్రతిరోజూ చదువుతూ ఉండేవారు) ఒకచోట చదువుతూ ఉండగా, ఆయనకు ఎఱుక, బయలు యొక్క రహస్యం తెలిసి, ఎఱుక విడిచేసింది. అక్కడ తారీకు వేసి, పెన్సిల్‌తో అండర్‌లైన్ చేసిన పుస్తకం నాకు ఇచ్చేశారు. దొంతులమ్మ గారని ఒక అవధూత మచిలీపట్నంలో ఉండేవారు. ఒక కుండ మీద కుండ దొంతులుగా పెట్టుకుని మంచినీళ్ళు తెస్తుంటే దొంతులమ్మ అనే పేరుతో ప్రతీతి అయ్యింది. ఆమె లంబాడీ స్త్రీ. అసలు పేరు తెలియదు. చల్లపల్లి వస్తూ ఉండేవారు దేహం ఉన్నప్పుడు. ప్రస్తుతం దేహం లేని స్థితిలోనే స్వామికి దొంతులమ్మవారు సూక్ష్మముగా కనపడి నువ్వు ఉన్నావా? అని అడగడము, నేను లేను అని చెప్పడము, లేకపోతే మరి ఉన్నావు అని ఎలా చెప్పావు? అని అనడము, ఈయన మౌనముగా ఉండడం, తరువాత ఆమె గొడ్రాలి బిడ్డ సామెత తెలుసా అని అడగడము, ఈయన తెలుసు, గొడ్రాలికి బిడ్డలులేరు, బిడ్డ ఉన్నట్లుగా దత్తత తీసుకుంటే, ఉన్నట్లుగా ఉంటుంది అన్నారు. మరి ఇప్పుడు ఎఱుక ఉందా అంటే లేదన్నారు. మరి ఎలా చెబుతున్నావు? అంటే, లేనెఱుకతో చెబుతున్నాను అన్నారు. ఎఱుక లేనే లేదు అన్నారు. దొంతులమ్మ తల్లి ఆ విధంగా సహాయం చేశారు. ఇక్కడ గ్రంథములో అనుబంధములో చూస్తే, దొంతులమ్మతో సంవాదము, కాలుడు అనే కాలపురుషుడతో ఉన్న సంవాదము ఉంటుంది.

ఒక్క సత్యసాయి బాబాయొక్క ప్రేరణతోనే, అవతార్ మెహెర్‌బాబా వద్ద దర్శించుకున్న విధానం అంతా కూడా ఇదే గ్రంథము చివరిలో వివరించబడింది. అలాగ ఇంతమంది మహానుభావులు సూక్ష్మస్థితిలో ఒక్కొక్కరూ ఒక్కో అనుభవము ఇచ్చి, మరొకరి దగ్గరకు పంపితే, వారు కూడా మరొక అనుభవము ఇచ్చి, పై స్థితికి పంపితే ఇది పూర్తయ్యింది. భగవాన్ సత్యసాయిబాబా వారు ఈ కార్యక్రమము అంతా మీరే నెరవేర్చాలి, నిర్వహించాలి అని చాలా సార్లు ఆయన వచ్చి ఆదేశాలు ఇవ్వడం జరిగింది. నాకు ఆరోగ్యము సరిగా లేదు, నేను తిరగలేను, నాకు బోధించడం రాదు, అనుభవము మాత్రము ఉన్నది, నన్ను వదిలిపెట్టండి, నా వల్ల కాదు అనేవారు. అప్పుడప్పుడు ఐదారుసార్లు ఆయన కనబడి అడగడము, ఈయనేమో నా వల్ల కాదని ప్రాధేయపడడం జరిగింది. ఇది ఇలా ఉండగా... ప్రస్తుత విజ్ఞానస్వరూప్ ఆయనకు దొరికాక సత్యసాయిబాబా వారి ఆదేశాన్ని అంగీకరించి, వారి యొక్క పనిముట్టుగా, విజ్ఞానస్వరూప్ అని ప్రస్తుతం ఎవరైతే ఉన్నారో, వారిని వీరి యొక్క పనిముట్టుగా పెట్టుకుని, వారి యొక్క కార్యక్రమం జరుగుచున్నది. అందులో భాగంగానే ఈ సర్వవేదాంత శిరోభూషణము అనే పుస్తకము తయారవ్వడము, దానిని అందరికీ పంచడము జరిగింది. దీని యొక్క శక్తితో, అర్థంకాని వాళ్ళకు కూడా అర్థం అయ్యే పరిస్థితి కలగడము జరిగింది. దివ్యగ్రంథములో ఆ శక్తి ఉంటుంది కదా! ప్రస్తుతము ఈ గ్రంథసారము సాధ్యమైనంత ఎక్కువ మందికి అందేలా ఇవాళ సత్సంగములో దీనిని ప్రారంభించడము జరిగింది.

ఈ గ్రంథము మూడు శరీరాలు పంచీకరణతో ప్రారంభమై, జీవుడు, ఆత్మ, జీవన్ముక్త స్థితి. అనేక అంశాలను స్పృశించుతూ, వివరించుతూ, అచల సిద్ధాంతానికి అద్వయ బ్రహ్మకు ఏ భేదమూ లేదు అనే పద్ధతిలో మూడవ అధ్యాయం ఉంది. రెండిటిని దీని మాటలుగా దానివిగా, దాని మాటలుగా దీనివిగా చెప్పి, ఒకటిగా చెప్పడం జరిగింది. చతుర్థాంకము పూర్తిగా అచల సిద్ధాంతముగా ఉంటుంది ఈ గ్రంథములో. మూడవ అంకము సమన్వయముగా ఉంటుంది. అద్వైతానికి, అచల సిద్ధాంతానికి సమన్వయముగా ఉంటుంది. అందుకే మనది చల, అచల సంప్రదాయము. కేవలము అద్వైత సంప్రదాయము కాదు. కేవలము అచల సంప్రదాయము కాదు. ఈ పేరును హిమాలయ ఋషి విశ్వాత్మ అనే ఆయన ఈ చలాచలబోధ అనే నామకరణము సాంప్రదాయముగా మనకు ఇచ్చారు. అప్పుడు ఇంత విరివిగా సత్సంగములు జరుగుతాయని తెలియదు. కానీ ఇవాళ ఆ పేరు సార్థకమయ్యింది.

**సద్గురుభ్యోన్నమః**

## సర్వ వేదాంద శిరో భూషణము

### జగత్, జీవ, ఈశ్వర భ్రాంతి నిర్మూలన (పటము)

మొదటి భాగంగా ఉన్న పరమాత్మ మాయావరణలో, అవిద్యావరణలో దిగాడు. కనుక అతడు సృష్టిలో పంచతన్మాత్రలుగా వ్యక్తమై,పంచీకరణలో సూక్ష్మ భూతాలు, స్థూల భూతాలుగా వ్యక్తమై స్థావర జంగమ సృష్టి జరిగింది. జీవసృష్టి జరిగింది. జీవ సృష్టిగా వ్యక్తమైన దాంట్లో, లోహము, శిలలు లేక ఖనిజములు, వృక్షజాతి, జంతువులు, క్రిమికీటకాదులు, జలచరాలు. పక్షులు భూమిపై ఉండే జంతువులు ఏడు దశల పరిణామము తరువాత మానవుని సృష్టి జరిగింది. ఇది మెహెర్‌బాబా వారి సిద్ధాంతము.

సృష్టి విషయములో చాలా సిద్ధాంతాలున్నాయి. ఏదైనా ఇది మాయా కల్పితమైన సృష్టి కనుక, ఎలా వచ్చింది? అనేది మనకు అంత ముఖ్యము కాదు. కొందరు పంచీకరణ ద్వారా వచ్చిందంటారు. కొందరు త్రివృత్కరణము ద్వారా వచ్చిందంటారు. త్రివృత్కరణము అంటే మూడే పాల్గొంటాయి. జలతత్వము ప్రాణముగా, పృథ్వీ తత్వము అన్నముగా, అగ్నితత్వము తేజస్సుగా, బుద్ధిగా, ఈ మూడే సృష్టిలో ఉన్నాయని, ఆకాశాన్ని వాయువుని లేకుండా చేసి, మూడింటితోనే సృష్టి జరిగిందని చెబుతారు. స్థూల శరీరానికి అన్నము ముఖ్యము, పృథ్వీ తత్వము, అగ్ని తత్వముతో బుద్ధి, జల తత్వముతో ప్రాణము ఏర్పడినాయి. ఇదే సృష్టి అనేది నిర్ణయం. దానిని ఇంకా ఎక్కువ భాగాలు చేస్తే, పంచీకరణలో ఐదు రకాలున్నప్పటికి, త్రివృత్కరణము అంతవరకే. ప్రకృతిలో మనం చూసేటటువంటి పంచభూతాలను బట్టి, ఐదు తీసుకుని పంచీకరణ చెప్పే పద్ధతి కూడా ఉన్నది.

ఇక బైబిల్‌కి వెళ్తే, ఐదు రోజులు సృష్టిచేసి, 6వ రోజు మానవుని నేరుగా సృష్టి చేసి, (పరిణామము ద్వారా కాకుండా) ఏడవ రోజు ఆయన విశ్రాంతి తీసుకున్నాడు అనే పద్ధతిలో ఉంది.

ఏది ఏమైనప్పటికీ మనము అవిద్యాదోషము, అజ్ఞానముతో మాయకు వశమై ఉన్నాము కనుక మూలంలోకి వెళ్ళడము అనవసరము. ఇప్పుడు మనకున్న పరిస్థితి దుఃఖభూయిష్టముగా, జనన మరణముగా, పునర్జన్మలుగా, వ్యాధిబాధలుగా, సంసారముగా, బంధముగా, బయటపడటానికి వీలులేని పద్ధతిలో ఉన్నదానినుండి ఎలా బయటపడాలి? అనేది మనం తెలుసుకుంటే సరిపోతుంది. ఈ మానవుడు వ్యక్తమయ్యాక, మానవునిలో కూడా మూడుగుణాలు వచ్చి, రజోగుణము చేత అహంకారము పుట్టింది. ఈ అహంకారము త్రిగుణాత్మకముగా మారి, జీవభావాన్ని పొందింది. ఇంకా ఈ క్రిందికి వస్తే, అక్కడే జీవుడిగా దుఃఖానుభవము, పంచకోశ విచారణ, **శాస్త్ర ద్రష్టం, గురోర్వాక్యం, తృతీయం ఆత్మనిశ్చయం, చతుర్థం సంశయచ్ఛేదం, పంచమం ముక్తి దాయకం** అనే లైన్‌లో మన విచారణ, శ్రవణ మనన నిదిధ్యాసలుగా, గురుశిష్య న్యాయముగా, గురుబోధను స్వీకరించే శిష్యుడు చేయవలసినటువంటి ఆధ్యాత్మిక ప్రయాణముగా, ప్రస్తుత పరిస్థితిని వర్ణించడం జరిగింది.

దీంట్లో మొదట్లో విచారణ పద్ధతి ఉంది. వేదాంతం ఉంది. నిష్కర్షగా వస్తు నిర్ణయంగా ఉంది. వార్తీకముగా శిష్యునిలో స్థిరమై, ఆరూఢమై, అనుభూతిగా వచ్చే నిర్ణయము అది. ఈ గ్రంథం మొత్తం ఈ పద్ధతిలో నడుస్తుంది. ఇక్కడనుంచి పైకి ప్రయాణము. ఎడమప్రక్క క్రిందికి ప్రయాణం చెప్పాము. ఇక్కడినుంచి పైకి ప్రయాణం చేశాం. పైకి ప్రయాణంలో విషయముల నుండి విరక్తి అంటే వైరాగ్యం రావాలి. శరీరం నేను, మనసు విక్షేపాలతో కూడి ఉన్నటువంటిది. ఎడమ ప్రక్క అణవీ దీక్ష అని తారక పద్ధతిలో చెప్పుకొచ్చాము. కుడిప్రక్క భక్తిమార్గము చెప్పాము. నవవిధ భక్తులు శ్రవణము, కీర్తనము, స్మరణము... అనుకుంటూ ఆ తరువాత విశ్వాసముచేత, భక్తిచేత, తీవ్ర మోక్షేచ్ఛచేత, ఏడు జ్ఞానభూమికలలోని మొదటి జ్ఞానభూమిక శుభేచ్ఛ చేత విచారణ ప్రారంభించాము.

అక్కడికి మనసునుంచి బుద్ధిని వేరుచేసుకునే ప్రయోగం ప్రారంభమయ్యింది. అటువంటి బుద్ధి, ప్రాణశక్తి ఆధీనముగా యోగసాధన రాజయోగ పద్ధతిలో తమో రజో గుణాలను విడచి, శుద్ధ సత్వగుణాన్ని పెంపొందింపచేసుకోవడం, బుద్ధి ఆ మాదిరగా తయారయ్యాక చిత్తము దగ్గరకు ప్రయాణముచేసి, చిత్త వృత్తి నిరోధం చేయడం. ఆ చిత్తం వెనుకనే సంస్కారాల పుట్ట ఉన్నది. ఆ సంస్కారాల పుట్ట, కొన్ని వేల జన్మలు, లక్షల జన్మలు అనుభవించి రద్దు చేసుకుంటే తప్ప పోయేవి కావు. అందుకోసం సద్గురువుకి శరణాగతి చెందినప్పుడు **జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణి** అనే పద్ధతిగా, ఎంత టైం అయినా పట్టని, ఈ జన్మంతా చివరిదాకా పట్టినా ముందు ప్రయాణమంటూ మొదలు పెట్టాలి. అయినవాళ్ళకు అవుతుంది. కానివాళ్ళకు మరొక రెండు జన్మలలోనో, మూడు జన్మలలోనో పూర్తైపోతుంది. లక్షల జన్మలు ఎత్తడం కంటే ఇది నయం కదా!

దీంట్లోనే యోగవాశిష్ట పద్ధతి ఎడమ ప్రక్క చెప్పాము. దాంట్లో యోగ వాశిష్ఠ పద్ధతిలో సాధన చతుష్టయ సంపత్తి, శమదమాది సంపత్తి, ఇహాముత్ర ఫలభోగ విరాగము, నిత్యానిత్యవస్తువివేకము, ముముక్షుత్వము... ఇవన్నీ కూడా యోగవాశిష్ఠ సాంప్రదాయంగా దొరుకుతున్నాయి. కొంచెం పైకెళ్తే కొన్ని విషయాలను అధిగమించాము. అంతకు ముందు బుద్ధి పరిధిలో, గురువును పట్టుకున్నప్పటికీ, గురువు రాకముందేమో నవవిధ భక్తి మార్గాలలో నడిచాము. అంతకుముందు కర్మమార్గములో నడిచాము. కర్మమార్గములో కొంత పరిణామము, పరిణతి వచ్చాక భక్తిలోకి వెళ్ళాము. కర్మ, భక్తిలో కొంత పరిణతి వచ్చాక గురువును పట్టుకున్నాము. బుద్ధి పరిధిలో గురువును పట్టుకుని చిత్తందాకా వెళ్ళాము. చిత్తంలో పరిపూర్ణమైన గురువుకు శరణాగతై, నాలుగు విధాల శుశ్రూషలు చేశాము. ఆ వైరాగ్యము వచ్చింది. మనసు నుంచి మనోవ్యాపారము నుంచి 'నేను'ను వేరుచేయటం జరిగింది. ఆ నేను అనగా వేరైనవాడే జ్ఞాత అని అక్కడ పంచీకరణ చెప్పి, 24 తత్వాల నుంచి జ్ఞాతను వేరు చేయడం అనేది జరుగుతోంది. ఇక్కడే సాంఖ్య బోధ జరుగుతోంది.

ఎడమ ప్రక్క ఏదైతే ఉందో, ఇదంతా కూడా తారకంగా పోతోంది. తారకము, సాంఖ్యము సమాంతరంగా జరుగుతాయి. అనేక సాధన మార్గాలున్నాయి కాబట్టి, అన్ని మార్గాలు కూడా ఈ సర్వేవేదాంత శిరోభూషణమని పేరు పెట్టినందుకు, ఈ పటములో అన్నిరకాలు చెప్పాము. కుడి ప్రక్క చూస్తే, ఇక్కడ పంచకోశ నిరశన, వ్యష్టిగా ఉన్నటువంటి సంసారమును అధిగమించు స్థితిని జ్ఞానభూమికలలో తనుమానసి అంటారు. 'శుభేచ్ఛ, విచారణ, తనుమానసి' – బుద్ధి దగ్గర శుభేచ్ఛ, బుద్ధి దాటాక విచారణ, చిత్తం దగ్గర గురువుకు శరణాగతి, ఆ తరువాత జ్ఞాతగా నిర్ణయమయ్యే టైం వచ్చేసరికి, జ్ఞానభూమికలలో తనుమానసి ఇక్కడ సమన్వయం చేస్తున్నాము. ఏ భూమికలో, ఎన్నో భూమికలో చిత్తం దగ్గర ఉన్నామా? అహంకారం దగ్గర ఉన్నామా? బుద్ధి దగ్గర ఉన్నామా? ఇంతవరకూ ఏమి సాధించాము? సాధన చతుష్టయ సంపత్తి సాధించాము.

తరువాత వైరాగ్యము, ఇహాముత్ర ఫలభోగ విరాగము కాకుండా ఇది వస్తునిర్ణయం ద్వారా కలిగేటటువంటి మిథ్యాభావంతో వచ్చే వైరాగ్యం ఇక్కడ ప్రవేశమైంది. సాంఖ్యబోధ తరువాత సంకెళ్ళు విడిచినాయి. అక్కడ గురూపదేశం జరిగింది. ఈ గురూపదేశాలు నాలుగైదు స్థాయిలలో ఉంటాయి. గురువుకి, శిష్యుడికి ఒక అవినాభావ సంబంధానికి నిజమైన ఉపదేశము జరిగినప్పుడు జ్ఞాత అని పిలువబడ్డాడు.

బైబిల్ ప్రకారంగా క్రీస్తు స్థితి దాటిన తరువాత, మెహర్‌బాబా చెప్పినట్లుగా చైతన్య వికాసము, అక్కడి దాకా వచ్చాక గురూపదేశము, మంత్రము – మంత్రార్థము, మంత్రోపదేశము చేసి మంత్రార్థము చెప్పడం జరుగుతుంది. అక్కడ లక్ష్యాన్ని, లక్ష్యార్థ వివరణని ఒక ప్రాజెక్ట్ చేస్తే, ఎట్లా అయితే ఆ లక్ష్యం సాధించడానికి యాక్షన్ ప్లాన్ ఎలా అయితే ఇస్తూ ఉన్నారో, ఇది అంతర్ముఖ ప్రయాణానికి, ఈ యాక్షన్ ప్లాన్ ఈ మంత్రం ద్వారా జరుగుతుంది. పైకి వచ్చేసరికి తారకము, హంస ప్రవేశము. అంతర్ముఖము. అందుకే మొదటి మంత్రమేమో హంసమంత్రమిచ్చాము. అంతకు ముందు కూడా ఒక మంత్రమిస్తాము. అయితే మనం కొన్ని సంవత్సరాలపాటు విచారణ చేసినప్పుడు, సత్సంగాలు చేసినప్పుడు, ఈ మార్గంలోకి రావాలనే తహకలిగినప్పుడు మొదటి మంత్రం మనం తీసేసి, సూచన మంత్రం అనే హంస మంత్రాన్నే, మొదటి మంత్రంగా ఇవ్వడం జరుగుతోంది.

ఈ మంత్ర చైతన్యంతో ప్రయాణం ఉంటుంది. ఇది వరకూ శరీరానుసారమైనటువంటి జీవచైతన్యంతో ఉన్న ప్రయాణము, శరీరము నుండి విడివడినటువంటి జ్ఞాత, కూటస్థ చైతన్యంగా మారింది. ఆ కూటస్థ అనుభవం రావాలంటే, మంత్రోపదేశం జరిగింది. ఆ జీవచైతన్యం, మంత్ర చైతన్యంతో మిళితమైంది. అక్కడ నుంచి షట్చక్రానుభవాలు ఐదు, ఆరు జ్ఞానభూమికల వరకూ ప్రయాణమైంది. మెహర్‌బాబా ప్రకారము ఏడు చైతన్య భూమికలలో ఆరవ చైతన్య భూమికకు వచ్చాము. స్థూలమును దాటగానే మొదటి నాలుగు భూమికలు సూక్ష్మ ప్రపంచము. అష్టసిద్ధులు కలగటం, అనేక సవికల్పములు, దశవిధ నాదాలు, దృశ్యానువిద్ధ, శబ్దానువిద్ధ సవికల్ప సమాధులు, చిత్కళ దర్శనాలు, భూతభవిష్యత్ వర్తమానములు ఎఱుగబడుట ఇవన్నీ ఉంటాయి.

ఐదవ జ్ఞానభూమిక వచ్చేసరికి, మానసిక ప్రపంచంలోకి ప్రవేశించి, ఐదు మనసు, ఆరు బుద్ధి అని గనుక విడదీసుకుంటే స్థూల సూక్ష్మ సంస్కారాల నుండి విడుదలైనట్టి మనసు, ఆ సంస్కారాలకనుగుణంగా నిర్ణయించవలసిన అవసరం తీరిపోయిన బుద్ధి, ఈ ఐదు, ఆరు భూమికలలో అకారణమైనటువంటి వేదన, అకారణమైనటువంటి ఉద్వేగాలు వస్తాయి. సంస్కారాలు లేవు కనుక కారణాలు లేవు. ఈ స్థితి ఆరవ భూమికను దాటిన తరువాత మానసిక ప్రపంచము కూడా పోతుంది.

మొదట్లో స్థూలం పోయింది, నాలగవ భూమికలో సూక్ష్మ ప్రపంచం పోయింది, ఐదు, ఆరు భూమికలలో మానసిక ప్రపంచం పోయింది. ఇక నీకు ఏ విధమైన సంస్కారాల యొక్క ఆవరణ విక్షేపాలు లేవు కనుక నీవు ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతావు. ఈ ఆత్మ సాక్షాత్కారం వచ్చేసరికి, ఇక్కడ నాద బిందు కళల యొక్క అనుభవము. ఎడమ ప్రక్క ఓంకారములో ఉన్న, త్రిమాతృకయుత ప్రణవ ధ్యానము, ఆత్మానాత్మ వివేక న్యాయంగా ఇక్కడ జరుగుతోంది. మొదట్లో మనకు ఆత్మానాత్మ వివేకము చెప్పినప్పటికీ, ఈ మంత్ర చైతన్యం చివరకు మంత్రార్థ ఫలితంగా, ఆత్మచైతన్యంగా మారింది. ఈ ఆత్మ చైతన్యము, ఆత్మ సాక్షాత్కారము ఎప్పుడైతే కలిగిందో, ఆత్మ చైతన్యంగా మారింది. యోగ చైతన్యము, మంత్ర చైతన్యము కాస్త ఆత్మ చైతన్యంగా మారింది. తారకాన్ని దాటాము, అమనస్కమవ్వాలి.

అమనస్కం, ఆత్మసాక్షాత్కారంతో వ్యష్టిగా అయ్యింది. కానీ ఈశ్వరీయ జ్ఞానం కలిగాక, అక్కడ కూడా అమనస్కమవ్వాలి. వ్యష్టినుంచి సమష్టికి వెళ్ళి, హంస విచారణని వ్యష్టిలో కుండలినిలో చేసే విచారణని, భ్రూమధ్యస్థానంలో భూమాలో, సహస్రారంలో ఉన్నటువంటి హంసలని, సహస్రారంలో ఉన్న హంస అచల హంస, కారణ హంస, భూమాలో ఉన్న హంస కలహంస, భ్రూమధ్య స్థానంలో ఉన్నహంస జీవ హంస. ఇంతకు ముందు క్రింద హంస ఇడాపింగళ నాడులలో శ్వాసరూపంలో ఉంది. కొన్ని సాధనలలో సోహం అనేటటువంటి సాధన, ప్రణవ ధ్యాన సాధన, కుండలనీ సాధన, ఇవన్నీ జరిగినప్పుడు, ఆ తారకమంతా అయిపోయి, దాని ఫలితంగా వ్యష్టిలో అమనస్కమయ్యింది.

సమష్టిలో కూడా అమనస్కం చేయడం కోసమని, మళ్ళీ ఇక్కడ గురువులను స్థూలంగా ఆశ్రయించాము. ఈ మహావాక్య విచారణ చేయవలసి వచ్చేసరికి, వ్యష్టి నుండి సమష్టి అయ్యేసరికి, ప్రత్యగాత్మ, పరమాత్మ ఒక్కటే అనే నిర్ణయాన్ని తెలుసుకునే సరికి, అక్కడ శిష్యుడు గురువుని మానసికంగా అనుసరించాలి. ఇంక స్థూలంగా అక్కర్లేదు, స్థూలంగా కుదరదు. స్థూలంగా చేస్తూ ఉంటే, నువ్వు స్థూలంలోనే బిగించబడుతావు. కనుక గురువుని అక్కడ స్థూలంగా పట్టుకోవడం మానేసి, పాద నమస్కారాలు లాంటివి మానేసి, చతుర్విధ శుశ్రూషలు కూడా మానసికంగా చేయాలి. అంగ, స్థాన, భావ, ఆత్మ శుశ్రూషలు ఇది వరకూ స్థూలంగా చేసినవాడివి, ఇప్పటినుంచి మనసులో మానసికంగా సూక్ష్మంగా జరగాలి. నీలో ఆ రకంగా పరిణామము చెంది, గురువు అంతటివాడవు, అన్ని రకాలుగా నువ్వు అవ్వాలి. ఇక ఈ రకంగా పైకి తీసుకెళ్తున్నప్పుడు, జీవుడు లేడు. ఆత్మసాక్షాత్కారమయ్యింది. ప్రత్యగాత్మ పరమాత్మ ఒక్కటే అనే నాలుగు మహావాక్య విచారణ ఇక్కడ జరుగుతోంది.

ఈ పద్ధతిలో త్రిగుణాతీత స్థితిలో హంస ఒక అనుభవాన్ని పొందాడు. **'ఆత్మయేనేను, నేనే ఆత్మ'** – అని మెహెర్ బాబా వేదాంతము. ఇక్కడ జీవన్ముక్త స్థితి అని పేరుపెట్టింది. మెహెరుబాబా ఈ జీవన్ముక్త స్థితికి, ఆత్మనిష్ఠలో వుంటూ, శరీరంతో చేసి, చేయనివాడుగా ఉండుటను మజ్జూబ్ – ఏ – సాలిక్ అన్నారు. శరీరంగా ఉంటూ ఆత్మనిష్ఠగా ఉండడాన్ని సాలిక్ – ఏ – మజ్జూబ్ అన్నారు. జీవన్ముక్త స్థితి మనకు తెలుసు. బ్రహ్మవిదుడు, విద్వరుడు, ఈ మూడు స్థితులు ఈ ప్రక్కన పేజీకి వచ్చినట్లయితే క్రిందనుంచి పైకి వెళ్తున్నాము. నాలుగు మహావాక్యాలు అయిపోయాయి. ఆజ్ఞాచక్రం దగ్గర జీవహంస అయ్యాడు. అక్కడ జీవన్ముక్తస్థితి కూడా మనమందించాము.

ఈ జీవన్ముక్త స్థితిలో నాలుగు ముక్తులున్నాయి. సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము అని. ప్రజ్ఞానం బ్రహ్మ వాక్యం చేత సాలోక్యముక్తి, తత్త్వమసి వాక్యం చేత సామీప్యముక్తి, అహంబ్రహ్మాస్మి అను నిర్ణయం చేత సారూప్యముక్తి. నేను–బ్రహ్మము ఒక్కటే అనేది సారూప్యము. అయమాత్మాబ్రహ్మగా అద్వైతం సిద్ధించేది సాయుజ్యముక్తి. హంస ప్రయాణము అక్కడిదాకా వచ్చింది. ఇప్పుడు ఇక్కడ మాయాశక్తియే పరాశక్తి రూపంలో ప్రేరేపిస్తేనే, ఆదిశక్తి రూపంగా ఉన్న బ్రహ్మలో సంకల్పం కలిగి యావత్ సృష్టి జరిగింది. ఆ సృష్టిలో అవరోహించి ఈశ్వరుడు, జీవుడు మనం అయ్యాము. ఆ పరాశక్తిని అలాగే వదిలేస్తే, ఇంత ప్రయాణము చేసి కూడా మళ్ళీ పెద్దపాము నోట్లో పడి, కిందకు వచ్చినట్లుగా ఉంటుంది కాబట్టి, అక్కడ అనాహత శబ్దానుభవము ఈ పరాశక్తి దగ్గర వచ్చిందే, బైబిల్‌లో యెహోవా స్థితి. యెహోవా అలాగే ఉండకుండా కుమారుడిని సృష్టించి తండ్రి అయ్యాడు.

మనోన్మని, ఉన్మని, అమనస్కము అంటుంటాము కదా! ఉన్మని అంటే అతిమానసము. మనోన్మని అంటే నిర్విషయ మనసు. ఉన్మని అంటే – అటువంటి నిర్విషయ మనసు దాటినటువంటి మనసు. దానిని అతిమానసం అంటారు. దీనినే మాతారవిందులు అతిమానసం అంటారు. ఈ అతిమానసం తరువాత దివ్యజ్ఞానం అంటారు. అయితే ఆత్మజ్ఞానం తరువాత దివ్యజ్ఞానం. దివ్యజ్ఞానం తరువాత బ్రహ్మజ్ఞానం ఉంటుంది. వారేమంటారంటే దివ్యజ్ఞానం తరువాత బ్రహ్మజ్ఞానానికి వెళ్ళకుండా మానవుడు ఏ దుఃఖము, కష్టము లేకుండా ఆనందముగా జీవించవచ్చు – అని అరవిందుల వారి సిద్ధాంతము.

సహస్రారానికి చేరాడు. అంతర్ సుషుమ్నని అధిగమించాడు. పూర్ణమయ్యాడు. ఇక్కడ అద్వైత సాంప్రదాయంలో, ఈ పూర్ణమైన వారికి, పూర్ణము అనేటటువంటి ఆఖరి ఉపదేశము ఇచ్చి, అతనికి ఒక కొత్త పేరు పెడుతారు. శరీరానుసారమైన పేరు తీసేసి, విజ్ఞానస్వరూప్ అని ఎలా పెట్టారో, స్వామి వారికి నిర్భయానంద అని ఎలా పేరు పెట్టారో, అలా పూర్ణాధికారము ఇచ్చి పేరు మారుస్తారు. ఆ తరువాత ఈ బ్రహ్మజ్ఞానము. ఈ పూర్ణమైనవాడు అద్వైత పద్ధతిలో వచ్చినవాడు.

ఇక్కడి నుంచి బృహద్వాశిష్ఠ పద్ధతిగా తన ప్రయాణాన్ని కొనసాగించాలి. ఇక్కడి దాకా ఉన్న ప్రయాణమేమో యోగవాశిష్ఠము. ఈ నాలుగు మహావాక్యాల దగ్గర వచ్చినటువంటి ప్రయాణము జ్ఞానవాశిష్ఠము. ఆ తరువాత పూర్ణాధికారము వచ్చిన తరువాత ఆ ఎఱుక కూడా లేనిదే. ఆనందము కూడా లేనిదే. బ్రహ్మ కూడా లేనివాడే. బయలే ఉన్నది అని చెప్పడానికి ఇక్కడ బృహద్వాశిష్ఠ సాంప్రదాయం మొదలైంది. అక్కడ ద్వాదశి, షోడశి బోధ జరుగుతుంది. ఈ బ్రహ్మానందాన్ని లేనెఱుకగా పెట్టి, ఆ లేనెఱుకను బయలు లక్ష్యంలో విడిపించడం, అనేటటువంటిది పై మార్గము. ఆ బ్రహ్మానందము అనే ఎఱుక అఖండ ఎఱుక. ఘన రూప అఖండ ఎఱుక. నిర్గుణముగా కనబడుతున్నప్పటికి నిజానికి సగుణమయ్యే అవకాశాలు దానిలో ఉండడముచేత, అది త్రిగుణ రహితం కాదు కనుక ఈ బ్రహ్మానందము అనేటటువంటి, సగుణము అయ్యే అవకాశము ఉన్నటువంటి, ఘనరూప అఖండ ఎఱుకగా ఉన్న చిద్ఘనము, సద్ఘనము, ప్రజ్ఞాన ఘనము, ఆనంద ఘనము – అనే పేరుతో సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అనే పేరుతో ఏదైతే ఉన్నదో, అది లేనెఱుకని చెబుతున్నారు.

ఇక్కడ లక్షణయుతమై వినువారికి, కనువారికి అంటూ అచల సిద్ధాంత బోధకి ఉపక్రమించినప్పుడు, ఎవరా లక్షణయుతుడు అంటే, సాయుజ్యముక్తి పొంది, కనీసం క్రింద స్థాయిలోనైనా జీవన్ముక్త స్థితి ఉంటే, అక్కడి నుంచి జ్ఞాన వాశిష్ఠ పద్ధతిలో అతడికి రహస్యాత్రయ మంత్రాన్ని, ద్వాదశి, షోడశి, పంచదశి. మంత్రాలని ఈ ఉత్తబట్టబయలు ఏమీ లేదని, మూలం లేని గుర్తెరిగే శరీరము లేనెఱుక కనుక ఏమీ లేదని, ఎఱుక పోతే ఏమీ లేదని, ఎఱుకలో ఇంతవరకూ జరిగిన ప్రయాణమంతా కూడా మాయాశక్తి యొక్క ప్రేరణతో ఆది పరాశక్తి యొక్క ప్రేరణతో, జ్ఞాన ఇచ్ఛాశక్తి యొక్క వ్యవహారముగా, క్రియాశక్తి యొక్క రూపములో ఉన్న నామరూప జగత్తుగా ఉన్నదే తప్ప, తమోగుణ సృష్టి అంతా జడజగత్తుగా, రజోగుణ సృష్టి అంతా ప్రాణులుగా, జీవులుగా, సత్వగుణ సృష్టి అంతా శక్తి రూపముగా, అధిష్ఠాన దేవతలుగా, త్రిమూర్తులుగా ఉన్నది. ఇదంతా కూడా ఎఱుకే. ఇట్టి ఎఱుక లేనిది అను నిర్ణయముతో మళ్ళీ ప్రయాణము మొదలుపెట్టిననప్పుడు ఇప్పుడు నిజమైన అమనస్కం వచ్చింది. ఇది జీవుడికి వ్యష్టిలో వచ్చిన అనుభవం కాదు. ఇక్కడ హంసకు అమనస్కం వచ్చింది.

ఈ హంస యొక్క ప్రయాణం జరుగుతోంది. హంస అనేటటువంటి శుద్ధ ఎఱుక, గురువుతో ప్రయాణం మొదలౌతుంది. ఇక్కడి నుంచి శిష్యునికి ఏ సాధన ఉండదు. పైగా గురువు ముందే నీ వద్ద ఒట్టు తీసుకున్నాడు. **ఏ సాధన జోలి నేనొల్లనని నీవు బాస జేసితివేని, నేనెరిగింతుపోకు, సాధనలందు మరిగితే రాకు** అన్నాడు. నా దగ్గరకు రావద్దన్నాడు. ప్రమాణం చేస్తే రా. వెళ్ళిపోవద్దు ఉండు. ఇక్కడ సాధనలు అయిపోయినాయి. గురువు మార్జాల కిశోర న్యాయంగా చేస్తాడు. శిష్యుడు నమ్రతతో గురువుకు ఆధీనమై, ఇంతకు ముందే చతుర్విధ శుశ్రూషలు చేసేసి లేనివాడైపోయాడు. గురువుకి అర్పణలో గురువే మిగిలాడు. శిష్యుడు లేనివాడయ్యాడు. శుశ్రూషలు సూక్ష్మంగా మానసికంగా చేయాలి. అది స్థూలంగా కాదు. చేసినప్పుడు అమనస్క స్థితిలో శూన్యం వచ్చింది. శూన్యం మోక్షం కాదు. సర్వము, శూన్యము రెండూ మోక్షం కాదు. ఆ శూన్యాతీతానుభవము నీకు గురువే ఇచ్చాడు. నీకు ఎఱుక (లేనెఱుక) చాలావరకూ పోయింది. కాని పూర్తిగా పోలేదు. వెంట్రుకవాసి ఎఱుక ఉన్నది. నువ్వేమీ సాధన చేయడం లేదు కాబట్టి, జరిగేదాంట్లో భోగించడం కూడా లేదు కాబట్టి, భోక్త కూడా కాదు. సాధనలేదు కాబట్టి కర్తృత్వం లేదు. అనుభవాన్ని విస్మరిస్తున్నావు కాబట్టి భోక్తృత్వం లేదు. గురువుకు అర్పణ అయ్యావు కాబట్టి నువ్వూ లేనివాడవే. లేనివాడవైనా సరే వెంట్రుకవాసి ఎఱుక ఉంటుంది. దాంట్లో శూన్యానుభవం తెలిసిన దగ్గర నుంచి ఆపైదంతా కూడా తెలియబడుతూ ఉంటుంది. శూన్యాతీతానుభవం తెలియబడుతుంది.

తరువాత సంకల్పం దగ్గరకు వెళ్ళాడు. మెహర్‌బాబా దానిని ఆది లెహర్ అని, లెహర్ వల్లే ఈ సృష్టి వచ్చిందని చెప్పారు. లెహర్ అంటే మనకు వేదాంతంలో మూలావిద్య, మూల ప్రకృతి. ఇది త్రిగుణముల యొక్క బీజావస్థ. త్రిగుణముల యొక్క అవ్యక్త స్థితి. త్రిగుణముల యొక్క ప్రభావాన్ని దాటడంతో ప్రకృతిని దాటినప్పుడు సామ్యావస్థను దాటావు. ఇప్పుడు మూలావిద్యను దాటినప్పుడు త్రిగుణముల యొక్క బీజము కూడా నిర్బీజము అవుతుంది. త్రిగుణముల యొక్క బీజావస్థను దాటటమంటే నిర్బీజమవడము. త్రిగుణములు బీజంగా ఉండడం వల్లే, నిర్వికల్ప బ్రహ్మమందు సంకల్పము కలిగి సృష్టి జరిగింది. అటువంటి సంకల్పం పేరే ఆది లెహర్ అని, మూలావిద్య అని పేరు. ఈ సంకల్పం మళ్ళీ మళ్ళీ రాని విధంగా పరిపూర్ణ బోధలో గురుకృపతో ఆ సంకల్పం కూడా మానేస్తాము. అప్పుడు నిస్సంకల్పం అవుతుంది. కొంచెం పైకెళ్తే ఆది లెహర్. నేను లేదు కాబట్టి నిస్సంకల్పం అనేది లేదు. నేను లేకపోవడం వెనుక శింశుమారక చక్రం నుండి మొదట్లో ఒక ప్రకాశ

బిందువు ఉన్నదని చెప్పాము కదా! ఆ ప్రకాశ బిందువు ప్రకాశించుట లేదు. తనను తాను ప్రకాశించుకుంటూ, బాహ్య ప్రకాశము లేనిదిగా ఉన్నది. ప్రకాశ బిందువులో ప్రకాశ బిందువుకు ఎట్టి సంబంధము లేకుండా లేని మాయ విమర్శ బిందు రూపములో ప్రకాశబిందువు నుండి విడివడింది. లేని మాయ విడివడినటువంటిది విమర్శబిందువు అయ్యింది. విమర్శలో ద్వంద్వాలు తోచేటటువంటి ఒక అవ్యక్త స్థితి ఉన్నది.

విమర్శ బిందువు అద్దం లాంటిది. విమర్శబిందువు ప్రకాశబిందువు యొక్క ప్రకాశాన్ని బాహ్య ప్రకాశంగా మార్చివేసింది. ఈ విమర్శ బిందువు మాయ కనుక బాహ్య ప్రకాశము లేనిదే. లేని మాయ కనుక, లేని మాయ వల్ల కనపడేవన్నీ కూడా లేనివే. కాబట్టి ఆ లేనివన్నీ ఉన్నాయనుకునే దాంట్లో మాయ విస్తరించింది. విస్తరించిన మాయను తెలుసుకున్నవాడికి మాయ లేదు. మాయకు లోబడిన వాడికి, మాయలో కల్పించుకున్నవన్నీ నిజం కనుక, ఆ విమర్శబిందువు ద్వారా వచ్చిన ప్రకాశము ప్రకాశ బిందువు ద్వారా వచ్చిన ప్రకాశము రెండూ మిశ్రమమై, ఆ కూడిక దగ్గర ఒక మిశ్రమ బిందువు ఏర్పడింది. ప్రకాశ బిందువు నుండి వచ్చిన ప్రకాశము పేరు చంద్రమండలము, విమర్శ బిందువు ద్వారా వచ్చిన ప్రకాశము అగ్నిమండలము, రెండు ప్రకాశముల ద్వారా మిళితమై, మిశ్రమమైన చోట, మిశ్రమ బిందువు ఏర్పడి దానివల్ల వచ్చిన ప్రకాశము అది సూర్య మండలము. ఈ విధముగా చంద్రమండలము సూర్యమండలము అగ్ని మండలము అని మండల త్రయం ఆవిర్భవించింది.

శింశుమారక చక్రం నుంచి లేని హంస, ఉన్నట్లుగా బయలు దేరి, మండల త్రయాన్ని దాటి, మండల త్రయం యొక్క ప్రభావాన్ని, అంటే మాయ యొక్క ప్రభావాన్ని అనుసరించి హృదయంలో ప్రకాశబిందువుగా, పరమాత్మగా, దివ్యచైతన్యముగాను, విమర్శబిందువు యొక్క ప్రభావము చేత, మాయకు లోబడినట్టిది, మిశ్రమ బిందువు యొక్క ప్రభావము చేత, అవిద్యకు లోబడినదిగాను, ఈ మండల త్రయాలలో మూడు మండలాలకు సంబంధించిన మూడు బిందువులున్నాయి. ప్రకాశ బిందువు, విమర్శ బిందువు, మిశ్రమ బిందువు. ఈ మూడు బిందువులని ఒక గీత చేత మనం త్రిభుజంగా కలిపితే, ఆ త్రిభుజము మూడు భుజాలు, మూడు కోణాలతో ఏర్పడింది. ఈ మూడు కోణాలతో ఉన్న త్రిభుజములోని ఆవరణలో త్రికోణాంతర్గత దీపికగా, ప్రజ్ఞానం అనేటటువంటి ఒక జ్ఞానము ప్రకాశిస్తుంది. ఆ జ్ఞాన ప్రకాశమే లేనెఱుకగా ప్రయాణం చేసే హంస. ఆ ప్రజ్ఞ మండల త్రయంలో త్రికోణాంతర్గత దీపికగా, దీపిస్తూ, ప్రకాసిస్తూ, ఏదైతే కొత్తగా ఇప్పటికిప్పుడు సృష్టించబడిందో, అదే ఎఱిగే ఎఱుక, ప్రజ్ఞానము. అనంతోపనిషత్తులో బొమ్మల రూపంలో, చూపించినది ఇదే. కనుక మండల త్రయాన్ని, హంసను విచారణ చేసి, ఆ మండల త్రయం దాటినప్పుడు ఆ మండలముల యొక్క ప్రభావము, అనగా అవిద్యా ప్రభావము, మాయా ప్రభావము. ఈ రెండింటి నుంచి విడుదలై, ప్రకాశ బిందు రూపమయ్యింది. ప్రకాశబిందు రూపమొక్కటే ఉన్నప్పుడు, అది స్వయం ప్రకాశముగా, అంతర్గత ప్రకాశముగా, తాను తానైనటువంటి అపరోక్షముగా అద్వయముగా ఉన్నది.

ఎప్పుడైతే మిశ్రమబిందువు వచ్చిందో, మాయ అనేటటువంటి ఆవరణ కలిగిందో, ఈ ప్రకాశబిందువులో కూడా బయట ప్రకాశము అనేది, ఒకటి వచ్చింది. ఈ బయట ప్రకాశం మాయవల్ల వచ్చింది కాబట్టి, బయట ప్రకాశం లేనిదే. బయిట ప్రకాశం వలన కలిగిన జ్ఞానము లేనిదే. బయట ప్రకాశమువల్ల కలిగిన సత్ చిత్ ఆనందము కూడా లేనిదే. అంతర్గత ప్రకాశమేమో అనిర్వచనీయము, తెలియదు. అటువంటి తెలియనిదేదో అది తెలిసిందీ కాదు, తెలియనిదీ కాదు. తెలియదు అంటే అజ్ఞానము, తెలిసింది అంటే జ్ఞానము. అనగా జ్ఞానాజ్ఞానాలు కానిది. అందువలన దీనిని అనిర్వచనీయము అన్నాము. ఈ అనిర్వచనీయానికి ఒక పేరు పెట్టారు బయలు అని. కనుక మండల త్రయాన్ని దాటినవాడు మూడు ప్రకాశములు లేకపోయే సరికి, నిష్కళ అయ్యింది. ప్రకాశము ఉంటే కళ. సూర్యమండల ప్రకాశము లేదు. అగ్ని మండల ప్రకాశము లేదు. చంద్రమండల ప్రకాశము లేదు. మండల త్రయ ప్రకాశము ఎప్పుడు లేదో, కళలు పోయి, నిష్కళ అయ్యింది.

ఈ నిష్కళలో కాలము దర్శనము అయ్యింది. మన గురువుగారికి కాలుడు దర్శనమయ్యాడు ఇక్కడ. ఆ కాలుడు దర్శనమయితే, యావత్ సృష్టి కూడా కాల మహిమ చేత, కాల ప్రభావము చేత ఉత్పన్నమవుతూ జరుగుతూ ఉంది. ఇప్పుడు నువ్వు అక్కడికి వెళ్ళావు కాబట్టి, సచ్ఛిష్యుడుగా ఆ కాలుడికి ఉన్నటువంటి శక్తి, ఆ కాల ప్రభావము చేత, ఆ కాల ప్రభావమును అధిగమించావు కానీ, ఆ కాలుడి శక్తి నీకు వచ్చి, ఆ కాలుడు చేసే పనులన్నీ నువ్వూ చేయవచ్చు. అయితే ఇంత ప్రయాణము చేసి, అన్నీ ఇది కాదు ఇది కాదు ఇది కాదని వదులుకుంటూ వచ్చి ఆ వదులుకున్న వాటి మీదేగా ఈ కాల ప్రభావంతో నీ శక్తిని

వినియోగించేది? అవి లేనివని తెలిశాక ఆ కాలునియొక్క శక్తులు, నీకు అబ్బినప్పటికి నీవు అవన్నీ వినియోగించకూడదు. వినియోగిస్తే అజ్ఞానమే కదా! ఒకవేళ వినియోగిస్తే, అక్కడ నీకు సద్గురువు తోడుగా ఉంటాడు కాబట్టి, నిన్ను పతనం కానివ్వడు. అందుకని కాలుడు రూపంలో ఉన్న గురువు నిన్ను హెచ్చరిస్తాడు. నీకు ఆ శక్తులున్నాయి. నా పని నన్ను చేసుకోనివ్వు. నా పనిలో నువ్వు కల్పించుకోవద్దు. నాకు ఆటంకం కలిగించవద్దు అని కాలుడు నిన్ను వేడుకుంటాడు. ఎందుకంటే నువ్వు అంతటి మహానుభావుడివి కాబట్టి తరువాత నువ్వువినకపోతే మామూలుగా చెబుతాడు. ఆ తరువాత హెచ్చరిస్తాడు. హెచ్చరించినా నువ్వు వినకపోతే నీవే పతనమైపోతావు. కాబట్టి అత్యంత జాగ్రత్తగా కాలమునుండి కాలాతీత స్థితికి వెళ్తే, అక్కడ బయలు దర్శనం అవుతుంది.

ఈ బయలు ఏమిటంటే, ఎఱుక యొక్క లేమి తనము. అంటే నిజమైన బయలుకాదది. ఎఱుక లేకుండా పోయేసరికి, శూన్యమనే అంటాము. శూన్యము, శూన్యాతీతము, కాలము, కాలాతీతము దాటాము కదా! మరిక్కడ ఎఱుక లేకపోతే ఏముంటుంది? ఎఱుక లేకపోవడాన్నే బయలుగా చెప్పారు. ఎఱుక – బయలు అనే ద్వంద్వాలయొక్క విమర్శగా బయలు నిర్ణయమైంది కాని, సహజంగా ఉన్నది ఉన్నట్లుగా బయలు నిర్ణయం కాలేదు. అందుకని దానిని ఎఱుక బయలు అని అన్నారు. ఎఱుక బయలు అంటే ఇది బయలని ఎఱిగావు. బయలుని ఎఱిగావు అంటే అది ఎఱుకే అవుతుంది కాని, బయలు కాదుగా! బయలానుభవం వస్తుంది. ఎఱుక యొక్క లేమితనం వస్తుంది. ఎఱుక లేకపోవడమే బయలని వస్తుంది. ఆ వచ్చిందేదైతే ఉందో, అది కూడా ఎఱుక అనే నిర్ణయంతోనే, ఇంకొంచెం పైకెళితే ఎఱుకకు మూలమైనటువంటి విశ్వము, ఆ విశ్వంలోకి ప్రవేశిస్తావు.

ఎఱుకకి ఆధారమైన, మూలమైన విశ్వంలోకి హంస రూపంలో ఈ పరిణామం చెందుతున్నటువంటి మండలత్రయ ప్రభావాన్ని కూడా అధిగమించినటువంటి హంస ఎఱుక విడిచి, బయలానుభవం పొందిన హంస. బయలానుభవం కూడా లేనిదే అనేదానికి ఇంకా ముందుకు ప్రయాణం చేస్తుంటే, ఆ హంస విశ్వంలోనికి ప్రవేశించింది. విశ్వము సకల ఎఱుకలకు మూలము. అక్కడ విశ్వ ప్రవేశము తరువాత విశ్వానుభవము కలిగింది. అంటే అవ్యక్తములో ఏముందో అది తెలిసింది. మూల ప్రకృతిలో ఏముందో, అది తెలిసింది. బ్రహ్మణో అవ్యక్తః అవ్యక్తో మహత్ అన్నప్పుడు ఎఱుక విడిచి, ఎఱుక బయలయ్యేసరికి, అవ్యక్తములో ఉన్నవి తెలియబడ్డాయి. ఎలా తెలియబడ్డాయి? నువ్వు సాధన చేత తెలుసుకున్నావా? మార్జాల కిశోర న్యాయంగా వెంట్రుక వాసి ఎఱుకతో, గురువు నడిపిస్తూ ఉంటే నీకు తెలియబడింది. అట్లా నువ్వు విశ్వప్రవేశం చేశావు. విశ్వమంటే ఏమిటో తెలుసుకున్నావు. తెలుసుకున్న తరువాత నీ లక్ష్యము బయలు.

ఆ బయలు కూడా ఎఱుగబడే బయలు కాదు. ఎఱుక లేని, ఎఱుక విడిచేందుకు స్థానము లేని, ఎఱుకకు మూలము లేని బయలు. ఎఱుకకు మూలం విశ్వం కాబట్టి, నువ్వు విశ్వాతీతం కావాలి. అట్టి విశ్వాతీత స్థితిలో అక్కడ ఈశ్వరుడు కూడా లేడు. పరబయలే ఉన్నది. అదే అచలము, అదే పరిపూర్ణము, అదే ఉత్తబట్టబయలు. అటువంటి ఉత్తబట్టబయలు అనేటటువంటి స్థితికి, నువ్వు చేరినప్పుడు అది సహజస్థితి. ఉన్నదున్నట్లున్న స్థితి. సాధకుని యొక్క ప్రయాణము ఆగిపోయిందని చెప్పడానికి వీలుగా పైన ఒక గీత కొట్టాము. ఆ గీతపైన ఏముంది అంటే, పరశివము – మూలము.

ఇక్కడ మూలమంటే అథశ్శాఖ – ఊర్ధ్వమూలం అంటున్నాము. మన ప్రయాణము కింది నుంచి పైకి వెళ్ళాము కాబట్టి, ఇది ఊర్ధ్వమూలమే పరశివం. ఈ మూలమే శింశుమారక చక్రము. అది ఉన్నదున్నట్లుంటుంది. అదే పరశివము. దాని నుండీ ఏదీ రాదు. దాంట్లోకి ఏదీ లయం కాదు. అటువంటి పరశివం నువ్వే అయ్యావు. అటువంటి పరశివానికి, పరబయలుకి, అచలానికి, పరిపూర్ణానికి తేడా లేదు. పరబయలు, అచలము, పరిపూర్ణము అంటే సాధకునియొక్క లక్ష్యాన్ని, గమ్యాన్ని చెప్పడానికి అలా వాడినప్పటికి, ఏ గమ్యాన్ని ఏ లక్ష్యాన్ని పెట్టుకు వెళ్ళాడో, అది అచలమై, పరిపూర్ణమై, నిర్వికారమై, సహజమై, శాశ్వతమై యున్నది. దాని పేరే పరశివము. అక్కడే మూలము. ఇప్పుడు మూలచ్ఛేదమయింది.

జీవుడనే స్థాయిలో ఉండి, సాయుజ్యముక్తి జరిగిన తరువాత వెంటుక వ్రాసి ఎఱుకతో గురువును ఆశ్రయించి, ఏ సాధన చేయకుండా గురువు నీ హృదయంలో ఉండి ప్రయాణం యొక్క మజిలీల అనుభవాన్ని వెంట్రుక వాసిగా ఎఱుకతో ఎఱుగబడుతూ ఉంటే, ఆ ఎఱుగబడే ఎఱుకలో కూడా బయలై, శూన్యమై, శూన్యాతీతమై, కాలంలో ప్రవేశించి, కాల ప్రభావాన్ని కూడా తప్పించుకుని, కాలాతీతమై, విశ్వప్రవేశం చేసి, విశ్వానుభవం పొంది, ఇదికాదు ఇదికాదని, ఇది ఎఱుకకు మూలమే

కానీ, నాకు మూలం కాదని, విశ్వాతీతమై, బయలై, బట్టబయలై గురువు పరబయలును దర్శింప చేయగా మూలము లేని గుర్తెరిగే శరీరము ఏమీ లేదని నిర్ణయముగా విశ్వాతీతమై, విశ్వాతీత స్థితిలో అచలుడై, పరిపూర్ణుడై యున్నాడు. ఏ పరబయలైతే గురువుచేత శిష్యుడికి దర్శింపబడిందో, ఆ పరబయలే తానై, ఎఱుక లేనివాడై, వెంట్రుక వాసి ఎఱుక కూడా లేకుండా పోయి, ఈ గీత వరకూ శివుడు, ఈ గీత దాటితే పరశివుడు, కనుక శివుడితో, పరశివుడితో సమానమైనట్టి నిర్గుణ శివుడిని, త్రిగుణాతీత శివుడిగా చేసి, సాధన యొక్క గమ్యాన్ని చేరినట్లుగా చూపించి, ఇక్కడ గమ్యానికి, పరశివానికి ఏ భేదమూ లేని స్థితిలో నిన్ను వదిలేశాడు.

ఇక నువ్వు తిరిగి ఎప్పటికీ కూడా సృష్టిని సంకల్పించడము కానీ, విశ్వంలోకి ప్రవేశించడం కానీ, మూలావిద్య ప్రభావానికి లొంగడము కానీ, ఏదీ నీకు జరుగదు. అందుకని ఇది పునరావృత్తి లేని మోక్షము.

మెహెర్‌బాబా 'చైతన్య వ్యావర్తనం' అన్నారు. జీవ స్థాయి దాక 'చైత్యన్య వికాసము' అన్నారు. జీవుడినుంచి ఆత్మ, పరమాత్మ, పరబ్రహ్మ, అచలము, పరిపూర్ణము దాకా చైతన్య వ్యావర్తనము ఎక్కడిదాకా వచ్చిందంటే, ఈ చైతన్యము ముకుళించి, ముకుళించి, చివరికి లేనిదై, సున్నా అయితే బట్టబయలే ఉన్నది. వ్యావర్తనము అంటే ముకుళించడం. ఇందులో కొంత భాగము జ్ఞానవాశిష్ఠముగా ఎక్కడి వరకూ వచ్చింది? సాయుజ్య ముక్తులతో పూర్ణమయ్యేదాకా. పూర్ణమైనటువంటివాడు, లేనెఱుక నిర్ణయమయ్యే దాకా కూడా జ్ఞాన వాశిష్ఠమే. లేనెఱుక నిర్ణయము అయిన తరువాత ఎఱుకను విడవడానికి చేసే అచల సిద్ధాంత నిర్ణయముతో ప్రయాణము చేసి, మూడు మంత్రాలను గురూపదేశంగా తీసుకునే మార్గాన్నంతా బృహద్వాశిష్ఠమని చెబుతారు. ఈ బృహద్వాశిష్ఠము ఎక్కడి వరకూ ఉందో, అక్కడ ద్వాదశి, షోడశి వివరాలను ఇచ్చాము. ఇక్కడ పంచ వివేకాలలో చూస్తే, వెనుకకు వెళ్తే, నిత్యానిత్య వివేకము, సాధన చతుష్టయ సంపత్తి అంతా చెప్పాము. మళ్ళీ ప్రస్తుతము సదసద్‌వివేకము సాయుజ్య ముక్తి దాకా ఉన్నది. కార్యకారణ వివేకము, మూలావిద్య దగ్గర బ్రహ్మకు సంకల్పం కలిగే దగ్గర, ఆ సృష్టి సంకల్పం కలిగే దాకా, ఆ సంకల్పం నిస్సంకల్పం అయిపోయిన తరువాత, దృక్‌దృశ్య వివేకంతో ప్రయాణమైంది. దృక్‌దృశ్య వివేకము ఎంతవరకు ఉందంటే, విశ్వప్రవేశము దాకా ఉన్నది. అయితే శింశుమారక చక్రము ఎక్కడ ఉంది? విశ్వాతీతము పైన ఉన్నది. విశ్వము అనేది ఎఱుకకు మూలమైంది కనుక శింశుమారక చక్రము ఎక్కడ ఎఱుక ప్రారంభమైనదో, అక్కడ ఉన్నది. ఆ శింశుమారక చక్రంవద్ద లేనెఱుక లేకుండాపోతే, శింశుమారక చక్రానికి కానీ, ఎఱుకకి కానీ ఎట్టి సంబంధము లేకుండా, పరబయలే మిగిలి ఉన్నది. అదే అచలము. పరిపూర్ణము. పరమపదము.

కనుక ఇంత కష్టమైనదానిని చివరలో చెబుదాం అనుకున్నా, దానిని ఎందుకోగాని, ఇప్పుడే మొదలుపెట్టి చెప్పడము జరిగింది. ఇదంతా గురుకృప. ఇక్కడితో మీరు దీనిని ఇంగిత జ్ఞానముతో విచారణ చేయండి. మీ విచారణ యొక్క ఫలితాన్ని బలపరచుకోండి. శ్రవణము అయిపోయింది. మనన, నిది ధ్యాసగా కాకుండా, కామన్ సెన్స్‌తో విచారణ పూర్వకముగా, విచారణ పూర్వకమైన మననాన్ని కొనసాగిస్తూ, వస్తు నిర్ణయాన్ని మీ బుద్ధిలో దృఢతరం చేసేటటువంటి నిదిధ్యాసని మీరు పొందే ప్రయత్నం చేయండి. ఏ సాధన లేకపోయినా, ప్రస్తుతము సాధన చేయవలసిన పరిస్థితిలో మీరు ఉన్నారు కనుక ఏ సాధన లేదు అనేది సాయుజ్య ముక్తి తరువాత గనుక ఈ సాధన స్థితిలోనే, ఆధార ఆధేయ పద్ధతి, సాపేక్ష పద్ధతి ఇది కాదు, ఇది కాదు, ఇది కాదని విడుదలయ్యేటటువంటి పద్ధతిలో ప్రయాణించండి. ఈ నిరపేక్ష పద్ధతిలో చేసే విచారణని, ఇప్పటి నుంచే అలవాటు చేసుకోండి. దీని వలన మీకు పరిణామము సులభతరమౌతుంది.

## సర్వ వేదాంత శిరోభూషణము
## (శూన్యం - సర్వం - సర్వం -శూన్యం)
## ప్రథమాంకము

ఏమీలేని నుంచి సర్వం తోచింది. విచారిస్తే సర్వం లేనిది అయ్యేసరికి సర్వం శూన్యం అయ్యింది. ఈ టాపిక్‌తో వేదాంతం అంతాకూడా సృష్టి అవరోహణ, సాధకుడు ఆరోహణగా మళ్ళీ తన మూలస్థానానికి వెళ్ళేది అని అర్థంతో మన గురువుగారు ఆ పేరు పెట్టారు. అయితే ఈ గ్రంథం పూర్తి అయ్యేసరికి జ్ఞాన సరస్వతి **'సర్వ వేదాంత శిరోభూషణము'** అని పేరు పెట్టమని చెప్పడం ద్వారా ఈ రెండు పేర్లు వచ్చినాయి. **సర్వ వేదాంత శిరోభూషణము** పెద్ద అక్షరాలు పెట్టేశాము. మనం మొదట్లో అనుకున్నది **"శూన్యం - సర్వం - సర్వం - శూన్యం"** అనేది బ్రాకెట్లోకి వెళ్ళిపోయింది.

ఇది 4 అంకాలుగా ఉన్నది. ప్రథమాంకం జీవభావం దగ్గర ఉంటుంది. ద్వితీయాంకం బ్రహ్మవేత్తల గురించి జ్ఞానం గురించి ముక్తి విషయంగా ఉంటుంది. తృతీయాంకంలో అద్వైత పరంగా ఉన్న జ్ఞానాన్ని అచల పరిపూర్ణ జ్ఞానంతో సమన్వయంగా ఉంటుంది. 4వ అంకము పూర్తిగా అచల సిద్ధాంతం ఉంటుంది. దానికి తగ్గట్టుగానే ఇక్కడ గురు ధ్యానంలో కూడా మనం ఏ అంకములో ఏమి చెప్పబోతున్నామో దానికి తగిన శ్లోకాలు గురు ధ్యానంగా పెట్టడం జరిగింది.

**గురు ధ్యానము**

**శ్లో॥ బ్రహ్మానందం పరమ సుఖదం । కేవలం జ్ఞానమూర్తిం ।**
**ద్వంద్వాతీతం గగన సదృశం । తత్త్వమస్యాది లక్ష్యం ।**
**ఏకం నిత్యం । విమల మచలం । సర్వధీ సాక్షిభూతం ।**
**భావాతీతం । త్రిగుణరహితం । సద్గురుం తం నమామి॥**

గురుప్రార్థన అయినప్పటికీ ఇందులో మనం చేరవలసిన లక్ష్యమును లక్షణాలుగా చెప్పడం జరిగింది. లక్షణములుగా ఎందుకు చెప్పాలి? ఆ లక్ష్యము ఆ గమ్యము అవాంగ్మానస గోచరము, అనిర్వచనీయము కనుక దానిని చెప్పడము కుదరదు. కొన్ని లక్షణాల చేతనే దానిని చెపుతున్నాము. ఆ లక్షణాలు కూడా ఎలా ఉంటాయంటే ప్రకృతిలో మనకు తెలిసిన పదాలతో ఉంటాయి. అర్థం మనకు తెలుసు కనుక ఆ అర్థానికి అతీతంగా ఉండేలాగ ఆ వాక్యాలు, పదాలు తయారు చేసుకుని బ్రహ్మకు ఆపాదించి చెపుతాము. బ్రహ్మానందం అనేది బ్రహ్మలో ఆనందం ఉందో లేదో తెలియదు మనకు ఆనందమే బ్రహ్మ అవునో కాదో తెలియదుకాని **బ్రహ్మానందం** అంటున్నాము. బ్రహ్మ అంటే అన్నిటికంటే గొప్పది, దానికటే గొప్పది లేదు. సగుణ బ్రహ్మ జ్ఞానం దగ్గరకు వస్తే మనుష్యానందం కంటే గంధర్వానందం ఎన్నోరెట్లు ఎక్కువ. గంధర్వానందం కంటే దేవతలానందం ఎన్నో రెట్లు ఎక్కువ. ఈ విధంగా అనేక దశలలో చివరకు బ్రహ్మానందం అనేటువంటిది ఏ జీవన్ముక్తుడులో కానీ, ఆనంద స్వరూపంలో కానీ ఎంతో ఎక్కువ అని సగుణ బ్రహ్మకి సాపేక్షంగా చెప్పడము జరుగుతుంది. ప్రస్తుతం దాన్నే మనము లక్ష్యముగా పెట్టుకున్నాము. నిర్గుణంలో బ్రహ్మానందం ఉందో లేదో? నిద్రపోయేవానికి ఏ అనుభవం ఉందని చెప్తాము? తెలివైనవాడు మెలకువలో ఎంతో చదివి ఒక ఐ.ఎ.ఎస్.కు ప్రిపేర్ అయ్యాడనుకోండి. అతడు నిద్రపోయాడు. వాడిలో జ్ఞానము ఎక్కడుంది? ఉదయం మెలకువ వచ్చింది. వెళ్ళి పరీక్ష రాశాడు. మొదటి ర్యాంకు వచ్చింది. ఈ మొదటి ర్యాంకు వచ్చే జ్ఞానం కాబోయే కలెక్టరు గారికి గాఢ నిద్రలో ఉందా? లేదా? ఉందనీ చెప్పలేము లేదనీ చెప్పలేము. కనుక వ్యక్తమంతా మాయలోనే. ఆ కలెక్టరు గారిలో ఉన్న జ్ఞానమంతా కూడా పరీక్షలో వ్యక్తమయినది. ఆ మాయలోనే. అవ్యక్తంలో ఆ జ్ఞానము ఘనంగా స్వరూపంగా ఉన్నది. ఇది సర్వజ్ఞత్వం అనే పేరుతో ఉన్నది. సర్వమూ శూన్యం అయినపుడే సర్వజ్ఞత్వం. ఆ సర్వజ్ఞత్వం ఎందుకు ఉపయోగపడుతుంది? సర్వమూ ఉంటే, సర్వమూ తెల్సుకుంటే, వాడికి తెలియనివాడు లేడు బాహ్య ప్రపంచంలో. కాని మాయను దాటినవాడే, సర్వాన్ని శూన్యంగా చేసుకున్నావాడే సర్వజ్ఞుడు. ఇక్కడ అదీ తమాషా! అలాగే బ్రహ్మానందం. ఇది బ్రహ్మ యొక్క లక్షణము. లక్షణాలన్నీ కూడా స్వానుభవం వచ్చేసరికి ఎగిరిపోతాయి. ఆ లక్షణంతో చెప్పేది ఏముంటుందో అపరోక్షానుభూతి వచ్చిన వారికి తెలుస్తుంది. వారు కూడా మాటల్లో వ్యక్తం చేయలేరు. వాడు చెప్పినా మన మనసుకి, ఊహకు అందదు.

**పరమ సుఖదం :** సుఖదం అనగా సుఖాన్ని ఇచ్చేది. మామూలుగా సుఖం అంటే విషయాల వలన సుఖదుఃఖాలలో సుఖం. పరమ సుఖదం – ఎక్కడైనా పరమ అనే పదం వాడితే శ్రేష్ఠమైన, ఆధ్యాత్మికముగా శ్రేష్టమైన అని అర్థము. బ్రహ్మ–పరబ్రహ్మ, ప్రశ్న – పరిప్రశ్న. ఆనందం – పరమానందం, ఆత్మ–పరమాత్మ, పరి–పర–పరమ అనే శబ్దాలన్నీ కూడా ఒక అతీతమైన దానికి పెట్టిన పేర్లు. అతీతం అన్నప్పుడు ఈ సుఖం కన్నా గొప్ప సుఖం ఉంటుందంటాము. లేకపోతే సుఖం కూడా లేదు. ఈ సుఖాన్ని దాటిపోతే అతీతమైన దాంట్లో మామూలు సుఖం ఎలా ఉండదో అలా లేదని చెప్పవచ్చు. అసలైన అర్థాలు కొంచెం మర్మంగా ఉంటాయి. కేవలం జ్ఞానమూర్తిం. కేవలానికి అర్థం తెలియాలి. కేవలాన్ని విడగొట్టుకోండి. కేవలం అనేది ఒక నామవాచకం. జ్ఞానమూర్తికి కేవలం అనేది ఒక విశేషణం కాదు. నామవాచకంగా తీసుకుంటే కేవల స్వరూపుడు. కేవలమంటే? ఇది కేవలం అది కేవలం అంటాము. అప్పుడు ఇది, అది అనేవి ఒక నామవాచకము. కాని ఇక్కడ కేవలమే నామవాచకము. దాని ప్రక్కన ఇంకేదీ లేదు. కాబట్టి కేవలం అంటే అవ్యక్తము. ఇది మాత్రమే అది మాత్రమే కాదు. ఏదీ లేనిది మాత్రమే కేవలం.

**జ్ఞానమూర్తి:** జ్ఞానమంటే వ్యాపకత్వం ఉంటుంది. జ్ఞానం ఉంటే సర్వజ్ఞత్వం ఉంటుంది. వ్యక్త ప్రపంచంలోకి వెళితే ఆ సర్వజ్ఞత్వం అనేది అనేక విషయాలుగా తెలుసుకోవడముగా ఉంటుంది. ఈక్షించేలాగ ఉంటుంది. ఈశ్వర జ్ఞానంగా ఉంటుంది. అనాత్మ భావం చెందితే జీవుడి జ్ఞానంగా ఉంటుంది. ఈ తెలుసుకునే తెలివి, ఎరిగే ఎరుక అనేదే ప్రజ్ఞానం. ప్రజ్ఞానం అంటే రెండు అర్థాలు. **ప్ర** అంటే ప్రకృష్టమని, శ్రేష్ఠమని, ఆధ్యాత్మికంగా శ్రేష్ఠమని. **ప్ర** అంటే ప్రవహించేది. **ప్రకర్షీయతే ఇతి** అంటాం. ప్రకటించబడేది ఏదో అది. కనుక ప్రకటించబడేటువంటిదిగానున్న జ్ఞానము ఈ మాయాకల్పిత బ్రహ్మాండ పిండాండాలలో వ్యాపించింది. ఇవన్నీ కల్పితం. కనుక దేశ కాలాదులే లేవు. కనుక వ్యాపకత్వమే లేదు. అపుడు జ్ఞానం ఏమైంది. గడ్డ కట్టింది. మూర్తీభవించింది. మూర్తి అంటే జ్ఞానం వ్యాపకముగా లేదు. ఘనంగా వుంది అని అర్థము. మూర్తిమంతంగా ఉంది అని. కేవలం, జ్ఞానమూర్తిం ఇవన్నీ మన లక్ష్యాలు ఈ లక్ష్యాలన్నీ గురువులో వున్నాయి. అట్టి గురువును మనము ప్రార్థిస్తున్నాము.

**ద్వంద్వాతీతం గగన సదృశ్యం**. ద్వంద్వాలంటే మంచి చెడు, లాభం నష్టము. ఇంతేకాదు. ద్వైతము, అద్వైతము, భేదము, అభేదము. వ్యక్తము, అవ్యక్తము. ఇవన్నీ కూడా ద్వంద్వాలే. వ్యక్తావ్యక్తములు కానిది. భేదా భేదములు లేనిది. సాధ్యా సాధ్యములు కానిది ద్వంద్వాతీతము అయినది. గగన సదృశం. ఆకాశం ఎలాగ ఖాళీయో అలాగ ఆ ఖాళీయే బ్రహ్మం. అక్కడ ఖాళీ అంటే శూన్యమనేది కాదు. శూన్యం అన్నామంటే శూన్యం కూడా సర్వంలో భాగమే. ద్వంద్వాతీతమంటే సర్వ శూన్యములు కూడా లేవు. ఏదీ లేదు. ఏదీ లేనిదానిని ఆకాశమంటే మళ్ళీ అవకాశం ఇస్తుంది. ఆకాశానికి అర్థం అవకాశం ఇచ్చేది అని, ఆకాశం నుంచి మిగతా 4 భూతాలు ఉత్పత్తి అయినట్లుగా, ఉన్నట్లుగా వాటికి అవకాశం ఇచ్చి వాటిని తనయందు ఉండనిచ్చి, తిరగనిస్తుంది. అలా కూడా పరబ్రహ్మ కాదు. ఉండనిచ్చి తిరగనిచ్చేది అంతా మాయాకల్పితము. అయితే అపుడు ఆకాశం నిరాకాశం అవుతుంది. ఇక్కడ గగన సదృశం అన్నప్పుడు సృష్టిలో ద్వంద్వాతీతం గగన సదృశ్యం సరిపోతుంది. కానీ ద్వైతం, ద్విపుటి వర్తించేటపుడు అటువంటిది గగనం లాంటిదే కానీ, గగనం మాత్రము కాదు. గగనం పంచ భూతాలలో ఒకటి. ఆకాశం కూడా జడమే. పరబ్రహ్మ జడం కాదుగా! ఆకాశంవలె అని అంటే అక్కడ తెలియబడేది ఏదీలేదు అని. వస్తువు ఉంటే తెలియబడుతుంది. కాని తెలియబడేది లేదు. ఇవన్నీ లేనిచోట తెలియబడేవేవీ లేవు. అంటే జ్ఞానంకూడా లేదా? బ్రహ్మకు జ్ఞానం అక్కర్లేదా అంటే మళ్ళీ అది కాదు. జ్ఞానం గడ్డ కట్టింది. జ్ఞానం క్రియారూపంలో లేదు. ఆ జ్ఞానం శాశ్వతంగా గడ్డగానే ఉంటుంది. అంటే ఘనంగా ఉంటుంది. ఆనంద ఘనంగా, చిత్ ఘనంగా, సత్ ఘనంగా, ప్రజ్ఞాన ఘనంగా ఉంటుంది. అదీ జ్ఞానమూర్తిం అంటే అర్థం.

ఎపుడైతే ఇది శాశ్వతమో అది ఎప్పటికీ వ్యక్తం కాదు. వ్యక్తం కావాలంటే మాయ కల్పించిన ఆవరణలో మాత్రమే వ్యక్తమవుతుంది. మాయ అంటే లేనిది కనుక. వ్యక్తమైనవన్నీ లేనివే కనుక అవ్యక్తమే శాశ్వతం. ఇక్కడ గగన సదృశ్యం అంటే శాశ్వతమైనటువంటి ఒక అవ్యక్తం. ఈ ఆకాశాన్ని ఖం అంటాము. అందువల్ల ఖం బ్రహ్మ అనేటువంటిది కూడా ఉంది. ఖం బ్రహ్మ అంటే సర్వ, శూన్యాలు కానిది. ఆకాశం కానిది. ఆకాశం అవకాశం ఇస్తుంది. ఈ బ్రహ్మ మాయకు అవకాశం ఇవ్వలేదు. మాయలేని మాయ. తనకు తానే వచ్చింది. తనకు తానే అన్నీ తోచింది. ఎరుక కూడా అలాగే తోచింది. ఎరిగే ఎరుకా తోచింది. సర్వమూ తోచినాయి. తోచబడ్డవన్నీ ఎరిగే ఎరుకచేత ఎరుగబడ్డాయి. ఎరుకే మాయ. ఎరుకన్నా మాయన్నా ఒక్కటే. మాయ లేనిది. అందువలన ఎరుక లేనిది, లేకనే ఉన్నట్లు తోచింది. దానిని లెక్కలోకి తీసుకోకపోతే **'ఖం–బ్రహ్మ'** అనేది శాశ్వతం. **"ఖం బ్రహ్మ"** అంటే బయలే ఇక్కడ ప్రార్థనలో శ్లోకాలన్నీ కూడా బయటకు మనకు ఒక దశలో అందుబాటులో ఉన్నప్పటికి బాహ్యార్థం ఒక రకంగా ఉన్నా, విచారణ చేస్తే అంతరార్థానికి కనుక వెళితే లక్ష్యాన్ని చూపిస్తున్నాయి ఇవన్నీ. బయలు అనే లక్ష్యాన్ని చూపిస్తున్నాయి. ఎవడైతే **'ఖం'** రూపంలో ఉన్నాడో వాడికి అనుకూలమైన వాతారణం ఉంటే సుఖం, వాడికి వ్యతిరేకమైన వాతావరణం ఉంటే దుఃఖం, **సు దుః** తీసేస్తే **'ఖం'** అంటే ద్వంద్వాతీతం అంటే సుఖదుఃఖములకు అతీతం అయినది. అనగా సుఖము, దుఃఖము రెండూ లేనిది అని. రెండింటికీ అవకాశం కూడా ఇవ్వనిది అని. ఆ విధంగా అవకాశం ఇవ్వనిది బ్రహ్మము ఒక్కటే. అది నిరాకాశము.

అవకాశాలన్నీ మాయ వలన వచ్చినవి తప్ప బ్రహ్మవల్ల రాలేదు. సగుణ బ్రహ్మవల్ల వచ్చినట్లే అనండి. ఎందుకంటే బలమును, బలవంతుడిని వేరుచేయలేముగా. బలవంతుడేమో పురుషుడు. బలమేమో మాయాశక్తి. ప్రకృతి పురుషుల యొక్క కలయికగా, సగుణంగా సృష్టి వస్తుంది. అమ్మవారి వలన వచ్చిందని కొందరు, అయ్యవారి వలన వచ్చిందని కొందరు అంటారు. ఎలా అనుకున్నా పర్వాలేదు. అమ్మవారే అంతా గొప్ప అనుకుంటే లలితా సహస్రనామాలు, అయ్యవారే గొప్ప అనుకుంటే విష్ణు సహస్రనామాలు, అమ్మా, అయ్యా కలిసి సృష్టి జరుగుతుంది. కానీ పురుషుడు ఎప్పుడూ కూటస్థుడై, నిర్వికారుడై ఉన్నాడు. పురుషుడిని ఆశ్రయించకుండా మాయ మాయా పనులు చేయదు, చేయలేదు. మళ్ళీ పురుషుడిని ఆశ్రయించిన మాయకు పురుషుడు అసంగముగా ఉన్నప్పటికీ నిర్గుణంగా నిర్వికారంగా ఉన్న పురుషుడిని సగుణ పురుషుడిగా చూపిస్తూ ఆ పురుషుడే సర్వానికి కర్త అని మాయవలన తెలియబడుతుంది. మాయ వలన తెలియబడేవన్నీ అసత్యం కనుక దీని గురించి ఇంత చర్చ అవసరం లేదు. సగుణమే మాయ. బ్రహ్మ విషయంలో కూడా సగుణం మాయే. నిర్గుణ బ్రహ్మను, సగుణ బ్రహ్మగా మాయ చూపిస్తుంది. కాని అప్పటికి నిర్గుణ బ్రహ్మ నిర్గుణమే గాని, సగుణ బ్రహ్మ కాలేదు. నిర్గుణ బ్రహ్మ శాశ్వతంగా నిర్గుణమే. మాయే ఆయనని సగుణంగా చూపించి ఆయన్ని సృష్టికి మూలకారణంగా చూపిస్తుంది.

బ్రహ్మము 4 వంతులలో 3 వంతులు అచలం. పరిపూర్ణము. నిర్వికారంగా ఉంటే, ఒక వంతు బ్రహ్మను మాయ, ఏకదేశీయంగా ఆశ్రయించి మాయ మాయ పనులుచేస్తే అవి మాయ పనులు అని కాకుండా, ఏ బ్రహ్మమును ఒక వంతు బ్రహ్మను ఆశ్రయించి మాయ మాయ పనులు చేస్తుందో ఈ పనులన్నింటికీ కర్తృత్వం, అధిష్టానం ఆ బ్రహ్మకి కట్టబెట్టడం జరిగింది. మరి సాధనా సౌలభ్యం కోసం ఆ బ్రహ్మనే సగుణ బ్రహ్మనే తీసుకోవచ్చు. ఈ మాయాశక్తి శంకరాచార్యులు ప్రతిపాదించారు. కాని తసగుణ బ్రహ్మను తీసుకోవచ్చు. ఆయన మాయను పెడితే ఏం కొంప మునిగింది? లేనిమాయ అన్నాడు కదా! లేనివంటే, నిజంగా లేనిదిదంతా ఒక సంకల్పమాత్రం చేత వచ్చినవి. ఒక ఉపాధిలో వచ్చినవి. ఊహలో వచ్చినవి. ఊహ వరకే అస్తిత్వం. ఊహించిన వాడికే వుంది. కలలో తోచినవి కలగన్న వాడికే వచ్చినవి. కలగన్న వాడికే ఉన్నాయి. పక్కన వేరే కలగన్న వాడికిలేవు. గాఢనిద్ర పోతున్నవాడికి, మెలకువతో ఉన్నవాడకి లేవు. ఎవరికి వాళ్ళకి వారి అనుభవములే సత్యము. అసలు సత్యమేమో మరుగున పడింది. కలలో తోచినవి ఎలాగో అలాగ ఆధ్యాసగా తోచింది. అది నిజమని అనుకున్నవాడికి క్షోభ కలిగి విక్షేపము అయి, సంసారము వచ్చింది. సంసారము ఎవరికైతే నిజంగా ఉందని అనుకున్నారో వారికి బంధం. విచారణ చేస్తే బంధ మోక్షాలే లేవు.

**<u>తత్వమస్యాది లక్ష్యం</u> :** తత్ అంటే స్వయం ప్రకాశం. త్వం అంటే మాయావరణలోనున్న ప్రకాశము. ఒక ప్రకాశాన్ని లక్ష్యార్థముగా తీసుకొని వాచ్యార్థమును విడిచిపెడితే అనగా మాయావరణలో తోచినవన్నీ కూడా విడిచిపెడితే సాపేక్షంగా తీసుకుంటే తత్‌లో ఉన్న స్వప్రకాశము, స్వయం ప్రకాశముగా పరబ్రహ్మలో ఉన్నది తీసుకుంటే, ఆ ప్రకాశము ఈ ప్రకాశము ఒక్కటే. ఆ ప్రకాశం మాయ లేనప్పుడు మాయను అధిగమించిన వానికి స్వస్వరూప సాక్షాత్కార జ్ఞానాన్ని ఇచ్చింది. మాయావరణ మాయ ఇచ్చినటువంటి ద్వారంగుండా మాయవరణలో ఆ ప్రకాశమే వెలుపలికి వచ్చింది. ఈ వెలుపలి ప్రకాశం త్వం. శుద్ధ చైతన్య పరమాత్మ ప్రకాశంలో ఎవరికైతే స్వానుభవమో వారు త్వం. నేను సర్వ వ్యాపకుడనని, సర్వాన్ని సాపేక్షంగా పెట్టుకోకుండానే ప్రకాశ రూపుడనని, నిరపేక్షంగా తీసుకున్నపుడు మాయలోనున్న ప్రకాశం, నిరావణ ప్రకాశము రెండూ ఒకే ప్రకాశంగా చూస్తే, అభేదము. ఈ రకంగా తత్వమసి వాక్యాన్ని ప్రకాశ లక్షణంతో అబేధాన్ని సాధించినపుడు సాపేక్షమైన త్వంలో అన్నీ పోయినపుడు నిరపేక్షమైన ప్రకాశము సద్రూపమే అవుతుంది.

ఇక్కడ తత్వమస్యాది లక్ష్యం అంటే ఈ విధంగా మాయలోనూ, మాయకు అతీతంగానూ రెండు రకాలుగా ఉన్నటువంటి ఈ ప్రకాశాన్ని సాక్షీ చైతన్యాన్ని కూటస్థ చైతన్యాన్ని, కూటస్థ పరమాత్మ ప్రకాశాన్ని ఎన్ని పేర్లయినా చెప్పనివ్వండి, ఇవన్నీ కూడా మాయలో ఒక మాదిరిగా కనబడుతుంది. మాయ లేకపోతే సత్యంగా ఉన్నదున్నట్లున్నది. మాయలో ఎలా కనపడుతుంది? దానికి మాయ అనే ఉపాధి కారణం కనుక ఉపాధి కారణంగా గోచరించేవన్నీ వాచ్యార్థంగా విడిచిపెట్టినపుడు కేవల ప్రకాశం ఇక్కడా అక్కడా ఒకటే అవుతుంది. వాచ్యార్థంగా ఉన్నప్పుడు సాపేక్షంగా ఉంది. విడిచిపెట్టినపుడు నిరపేక్షం అయ్యింది. ఈ మాయావరణలో నిరపేక్షమైనటువంటి ప్రకాశజ్ఞానం ఏ శిష్యుడికైతే కలిగిందో ఆ నిరపేక్షంగా, నిరావరణగా ఉన్నటువంటి స్వయం ప్రకాశ బ్రహ్మతో సమానం.

మాయ గేటు దాటేవరకు సాధన వుంది. ఆరోహణ ఉంది. సమాన స్థితిలో గేటుకి ఇటు ఉన్నా అటు ఉన్నా ఒకటే అని. తత్వమసి వాక్యం చెపుతోంది. కనుక నిరపేక్షంలో ఇటున్నది లెక్కలేదు. అటున్నదే లెక్క. కాబట్టి అది స్వస్వరూప సాక్షాత్కారంగా అవుతుంది. ఈ విధంగా వాక్యాన్ని మొత్తంగా చెప్పేటటువంటిది. గురువు దగ్గర లక్ష్యం వుంది. కేవలం త్వంగా వచ్చినపుడు కూడా పరమాత్మగా ఆయన లక్ష్యంగా ఉంటారు. తద్రూపంగా కూడా లక్ష్యంగా ఉంటారు. ఈ పోలిక, ఈ బోధ, ప్రబోధ శిష్యుడు గురువు ఉన్నప్పుడు ఉన్నటువంటి స్థితి. తత్, త్వం, రెండు ఉన్నప్పుడు తత్ లక్ష్యమే, అంతకుముందు త్వం కూడా లక్ష్యమే. గురువుని కాపీ కొడతాం కదా మనం. కాని ఐక్యతా సిద్ధి జరిగినపుడు తత్ లేదు, త్వం కూడా లేదు. 'తత్' 'త్వం'ల యొక్క అభేద స్థితిలో అసిపదం ఎప్పుడైతే వచ్చిందో తత్ లేదు. త్వం లేదు. తత్ రూపం ఉన్నమాట నిజమే. అది అఖండ మండలాకారం. వ్యాప్తం యేన చరాచరం. చూశారా సాపేక్షంగా చరాచర జగత్తంతా వ్యాపించియున్నటువంటి అఖండ మండలాకారంగా ఉంది. ఈ ప్రకాశము మండలత్రయ ప్రకాశంగా ఉంది. స్వయం ప్రకాశంగా కూడా ఉంది. మాయలో ప్రకాశించినటువంటి ప్రతిబింబ ప్రకాశంగా వుంది. ఆ బింబంతో తయారైన ఈశ్వరుడిగా వుంది. అవిద్యలో ప్రవేశించినటువంటి ప్రతిబింబ ప్రకాశం వుంది. ఆ ప్రకాశంతో సంబంధమైనటువంటి జీవసృష్టిగా ఉన్నది. మరి ఈ మండలం అంటే ఇవన్నీ వచ్చినాయి. వీటన్నింటిలో కూడా ఒక్కటే వస్తువు వుంది. సర్వ వ్యాపకంగా ఉంది. ఆ వస్తువు పేరే తత్పదం. ఇదంతా సాపేక్ష నిర్ణయం కదా. ప్రకాశం ఒక్కటే తీసుకుంటే అది నిరపేక్ష నిర్ణయం. అంటే మాయావరణంలో నిరపేక్ష నిర్ణయంగా ప్రకాశం ఒక్కటే తీసుకుంటే స్వయం ప్రకాశ సాక్షాత్కార జ్ఞానంలో ఇదీ అదీ ఒక్కటే అని అసిపదం చెప్పినపుడు అసిపదమే తానై ఉంటాడు. అసిపదమే తానైనదే బయలు. అక్కడ తదుపరి లేదు.

అద్వైతులు తద్రూపం అంటున్నారు. అచల సిద్ధాంతులు బయలు నిర్ణయంతో అసి పదమును బయలుగా నిర్ణయిస్తున్నారు. అసి పదమే మోక్షం అంటున్నారు. త్వంపద లక్ష్యార్థం, తద్ పద లక్ష్యార్థం, అసి పద లక్ష్యార్థం ఈ మూడింటిని విడివిడిగా తీసుకుంటే మనకి దొరికినటువంటి గురువు ఆ మూడింటినీ ఇవ్వగలరు. గురువులలో 2 రకాలు వున్నారు. తత్ పద లక్ష్యార్థాన్ని ఇచ్చేవారు సద్గురువు. అసిపద లక్ష్యార్థాన్ని ఇచ్చేవారు దేశికేంద్రులు.

**ఏకం నిత్యం విమలమచలం**. ఏకం –ఒక్కటే ఉందండీ. అదే నిత్యమూ శాశ్వతంగా ఉన్నది. సాధకుని విషయానికి వచ్చేప్పటికి మలము అంటే 3 గుణాలు. జీవుడి దగ్గర మలము అటే మలత్రయము. మలత్రయమంటే ఆవరణ, ఆధ్యాస, విక్షేపము. ఆవరణ వలన స్వరూపమును మరవడము. ఆధ్యాస వలన అన్యం తాననుకోవడము. విక్షేపం వలన అన్యం తాననుకోవడం వలన క్షోభ కలగడము, క్షోభ వలన సంసారము, బంధము ఏర్పడటము, ఆవరణ, ఆధ్యాస, విక్షేపము ఇదే మలత్రయం. ఆవరణ వలన పరబ్రహ్మ స్వరూపం ఆవరించబడింది, మరుగునపడింది. ఆధ్యాస వలన సగుణ బ్రహ్మగా, మాయావరణలో తోచాడు. మాయావరణ దృశ్యమంతా తన కేవల స్థితిని మరపించి, ఆధ్యాస వలన దృశ్యం తోస్తే తోచిన దృశ్యానికి ద్రష్ట అయ్యాడు. ద్రష్ట అయినపుడు మాయకు వశుడు కాకుండా ఈశ్వరుడుగా ఈక్షిస్తున్నాడు. జీవుడై అవిద్యాదోషం తోటి మాయకు వశుడయ్యాడు. వైకుంఠ పాళిలో ఒక పాము కరిస్తే క్రిందికి దిగినట్టు దిగాడు. దిగేసరికి ఏమయ్యింది? సుఖ దుఃఖాలు రకరకాలుగా వచ్చి ఏదో ఒక క్షోభ కలిగింది. ఇలా క్షోభ అనే అర్థంతోనే విక్షేపం అనే పదముంది. ఈ క్షోభ వలన గింజుకొని బయటపడటానికి ప్రియం, మోదం, ప్రమోదం అనే సుఖాభిలాషతో దుఃఖనివారణార్థం కర్మ చేస్తూ కర్మ ఫలితాన్ని అనుభవిస్తున్నాడు. దీనివలన సంసారం వచ్చింది. సంసారం వలన దుఃఖము వచ్చింది. ఈ సంసారము, దుఃఖము, బంధమునకు హేతువు విక్షేపము. అవిద్యని, మాయను, త్రిగుణాలని వీటన్నింటినీ మలంగా చూసి, ఈ మలాన్ని గనుక వదిలించుకుంటే విమలం. ఈ స్థితి విశిష్టంగా వుంది. విమలం అంటే ఏమిటి? మలం ఏనాడూ లేనిది. ఒకవేళ సాధకుడి విషయంలోకి వస్తే మలం విసర్జించిన తరువాత తిరిగి ఆ మలమును అంటించుకోకుండా, ఆ మలంతో సంగత్వం చెందకుండా ఉండేది విమలం. వి అంటే మలం నుండి విడుదల అయినది. విలక్షణమైనది, విశిష్టమైనది. ఆ విమలం ఒక్కటైనది. నిత్యమైనది. విమలం అంటే త్రిగుణరహితమైనది. అచలమైనది.

ఇవన్నీ కూడా లక్ష్యమైన పరబ్రహ్మ యొక్క పరమ పదమనే మోక్షము యొక్క వర్ణన. ముందు తెలుసుకోవాలిగా! ఇవన్నీ లక్షణ వాక్యాలతో చెపుతున్నారు. అది అనిర్వచనీయము. అవాంగ్మానస గోచరము. నీ యొక్క సమీపానికి దానిని గానీ, దానియొక్క సమీపానికి నిన్ను గాని తీసుకువెళ్ళడం ఉపదేశం. సమీపం వరకే ఎవరైనా వెళ్ళగలరు. ఆ సమీపం తర్వాత ఎవరికి వారే అజ్ఞాన ఆవరణ నుంచి విడుదలై స్వరూప సాక్షాత్కారం చెంది ఉండాలి. అయినవాడే అయ్యేవాడై ఉండాలి. కొత్తగా

అయ్యేది లేదు. ఎపుడూ ఉన్నదే అంటే, అది సిద్ధ వస్తువు, సాధ్య వస్తువు కాదు. సాధనచేత మనమంతా చేసే సాధన అంతా కూడా నివృత్తి మార్గంలో ఇది కాదు, ఇది కాదని వదిలించుకోవడానికే పనికివస్తుంది. సమీపానికి వెళ్ళడానికి ఈ లక్షణాలని నీమీద ఆపాదించుకోవడమే ఉపాసన, అనుష్ఠానము. ఆవరణ తొలగడానికే ఈ ప్రక్రియలన్నీ అనుష్ఠానం అనేటువంటి కర్మకూడా సగుణ బ్రహ్మకు తీసుకు వెళ్తుంది. సాధన, సాధ్యము కానిది నిర్గుణ బ్రహ్మ. సిద్ధవస్తువు. వస్తువు అంటే ఏమిటసలు? వాస్తవంగా ఏది ఉన్నదో ఆ వస్తువు. మనం అనుకునేటటువంటి నామరూప వస్తువులు కాదది. పదార్థం కాదు. ద్రవ్యం కాదు. వస్తు నిర్ణయం అన్నప్పుడల్లా ఆ సత్యత్వం యొక్క నిర్ణయం.

**సర్వసాక్షీభూతం :** ధీ అంటే బుద్ధి. సర్వధీ అంటే అన్ని బుద్ధులకూ అని. ధీ అంటే మహత్తు. బ్రహ్మ సృష్టిలోకి మహత్తు రూపంలోకి వచ్చిందే బుద్ధి. ఆ మహత్తుకు కూడా సాక్షి. అంటే శాశ్వత అవ్యక్త బ్రహ్మమే మహత్తుకు సాక్షి. సర్వధీ సాక్షీభూతంలో సాక్షిగ అంటే చూచి గుర్తుపెట్టుకునే సాక్షి కాదు. చూసీ చూడనివాడు, చూసీ పట్టనివాడు, చూసీ తాదాత్మ్యత చెందనివాడు, పూర్తిగా అసంగుడు. దృశ్యం తోచినా కూడా దానికి అంటనివాడు. సాక్షి సాక్ష్యాతీతం అంటే దృశ్యమే తోచకపోవడం గనుక, పరబ్రహ్మ విషయంలో సాక్షిగా కూడా మిగలకూడదు. జ్ఞానిగా కూడా మిగలకూడదు. కాస్త సగుణం చెప్తున్నాం. ఎందువలనంటే అర్థం కావాలిగా, ఊహకు రావాలిగా, సమీపానికి రావాలి. ఇది తప్పు చెప్పటం కాదు. సమీపం వరకూ రైటే. స్వస్వరూప సాక్షాత్కారం దగ్గర చెప్పేది వేదము యొక్క శిఖరము. అది వేదాంతము. వేదాంతమంతా సిద్ధాంతము. వేదములో చెప్పిన వాటియొక్క ప్రమాణాలయొక్క అంతము వేదాంతము. ఈ సిద్ధ వస్తువు దగ్గరకు ఈ వేదాంతము చేర్చినపుడు అది సిద్ధాంతమైంది. మతం వేరు. మతాతీతమైనది సిద్ధాంతము. మతి అంటే బుద్ధి. బుద్ధి పరిధిలో ఉండేది, చెప్పేది, బోధించేది, వినేది, అవగాహన చేసేది, సాధన చేసేది, సమీపం దాకా చేరేది అంతా మతం.

మతాతీతంలో సిద్ధాంతం ఉంటుంది. అది ఉన్నదున్నట్లు ఉన్నది. ఏ మాయ ద్వారం దాటిన తరువాత సృష్టి అంతా అవరోహణ అయ్యిందో, శిష్యుడు తిరిగి ఆరోహించి, మాయ ద్వారం దాకా వచ్చేదాకా సాధనలున్నాయి. మాయద్వారం నుంచి నిరావరణ బ్రహ్మగా ఉండటానికి గురుకృపతో అసిపద, తత్వమసి వాక్యార్థ లక్ష్యాన్ని పెట్టుకున్నపుడు **"ఏ సాధన నీకెందుకు, వీసానికి పనికిరాదు"** సుమా అయ్యా! శ్రవణ, మనన, నిది ధ్యాసలు కూడా ఆగిపోతాయి. స్వరూపం దగ్గరకు వస్తే అది అందుకునేది ఎలా? నిన్ను నీవు ఎలా అందుకుంటావు? నీవే అది అయి వుంది. సిద్ధ వస్తువుకు సాధన ఉండదు. అయితే వేదాలలో ఈ వాక్యాలు ఎందుకు వచ్చాయి? పొందడమని? సగుణ బ్రహ్మకి పొందడం అనవచ్చు. అక్కడ సాధన వుంది ఆరోహణ వుంది కనుక. సర్వధీ సాక్షీభూతం అంటే ఆ పరబ్రహ్మ అచలం. పరిపూర్ణం అయినపుడు నిత్యం, ఏకం అయినవాడు. అమలం, విమలం త్రిగుణ రహితం అయినవాడు. మాయావరణలో ఉన్నవాడికే సాక్షీభూతము వర్తిస్తుంది. మాయావరణకు సాక్షి అయినవాడు వెనువెంటనే నిరావరణం అవ్వాలి. నిరావరణ స్థితిలో ఉంటూ మాయావరణలో తోచినవాడికి సాక్షీభూతంగా, అసంగంగా ఉంటున్నాడు. అట్టివాడే మాయ మర్మమును తెలిసి, మాయను అధిగమించినవాడవుతాడు.

**భావాతీతం :** ఇక్కడ భావం అంటే జీవుడి దగ్గర వచ్చే భావాలు కాదు. మహత్ బ్రహ్మకు ఒక భావం కలిగితే మహదహంకారం అయ్యాడు. మహదహంకారం అయ్యేసరికి ఆ భావానికి అధిష్ఠానము హిరణ్యగర్భుడయ్యాడు. ఇపుడు హిరణ్యగర్భ స్థాయి మోక్షము కాదు. మహదహంకారం పోవాలంటే మహదహంకారం అనే స్థితిలో అధిష్ఠానంగా ఉన్నటువంటి తన ఉనికిని అనుభవిస్తున్నటువంటి సత్‌చిత్ ఆనందమనే ఉనికిని అనుభవించుట ఉండకూడదు. అట్టి స్థితిలో హిరణ్యగర్భుడుగాని ప్రథమాత్మ గాని, ప్రథమ జీవుడు గాని, ప్రథమ ప్రాణి గాని అతనికి కలిగినటువంటి సంకల్పము ద్వారానే తన్మాత్ర సృష్టి కలిగింది. అతనికి కలిగినటువంటి ఊహ ద్వారానే తన్మాత్ర సృష్టి జరిగింది. అతనికి వచ్చినటువంటి భావాన్నిబట్టే అది జరిగింది. భావాతీతము అన్నప్పుడు మహదహంకారానికి అతీతమైనటువంటిది మహత్తు. ఆ మహత్తులో త్రిగుణాలు సామ్యంగా వున్నాయి. త్రిగుణరహితం అన్నపుడు మహత్తు కూడా పోయి అవ్యక్తం వచ్చింది. అది త్రిగుణరహితం కాబట్టి అవ్యక్తం తిరిగి వ్యక్తం కాకుండా ఉంది. వ్యక్తావ్యక్తములన్నీ సాధకుని యొక్క సృష్టి యొక్క అవరోహణ, ఆరోహణలోనే ఉన్నాయి. సాధననుబట్టి తెలుసుకోవడానికి పెట్టినవే ఈ పదాలు.

ఆ గీతవద్ద అవ్యక్తములో వ్యక్తమయ్యే ఆస్కారం ఉంటే మాయ గీతకు ఇవతలే ఉంటుంది. అవ్యక్తం శాశ్వతంగా ఉండి, వ్యక్తం కాకుండా ఉంటే అది మాయకు ఆవల ఉంటుంది. ఈవల ఉన్నది త్వం. ఆవల ఉన్నది తత్. రెండూ ఒకటే అంటున్నాడు. ఎప్పుడు ఒకటి అయ్యింది? ఆవల ఉన్నదానిని శాశ్వతపరచుకుంటే నిరావరణమైతే ఈవలకు రాకపోతే, అది అసి పదం యొక్క లక్ష్యార్థము. ఏమిటంటే ఆవలది ఈవలది ఒకటే అని. ఈవలకు ఎందుకు, ఎలా వచ్చిందో సృష్టి విధానాన్ని తెలుసుకొని అటువంటి విధానాన్ని నిరశించి, తనకు కలిగినటువంటి బ్రహ్మ నిష్ఠలో ఉండి, ఇది కాదు ఇది కాదు అని సర్వమును నిరశించి బ్రహ్మనిష్ఠ నుంచి జారిపోకుండా ఉండటమే అక్కడ అతను చేయవలసిన పని. ఆ బ్రహ్మనిష్ఠలో ఉండటాన్ని శమము అంటారు. బ్రహ్మనిష్ఠ నుండి జారిపోకుండా నిగ్రహించడమును దమము అంటారు. ఇక్కడ శమదమాలు పై అర్థంలో మాయ ద్వారం దగ్గర అదీ ఇదీ సమానమైనటువంటి బ్రహ్మనిష్ఠ అనేటటువంటి అనుభూతి కలిగినపుడు కాసేపు అపరోక్షంగా ఉండి, కాసేపు పరోక్షానికి వస్తున్నాడు. కాసేపు మాయ అవతల ఉండే ప్రకాశ రూపంగా ఉంటున్నాడు. కాసేపు మాయలో ప్రకాశించే ప్రకాశ రూపంగా వచ్చి, ఆ ప్రకాశ రూపంలో సాపేక్షంగా (సాక్షీ భూతంగా) ఉంటున్నాడు. మాయాకల్పిత ప్రపంచానికి సాక్షీభూతంగా ఉంటున్నాడు.

ఈ సాక్షీభూత స్థితినుండి సాక్షి రహిత స్థితికి వెళ్ళాలి అంటే సాపేక్షం కాస్తా నిరపేక్షం అయితే చాలు. ప్రపంచ ఉంది అంటే ప్రపంచంలో సర్వవ్యాపకం. ప్రపంచం లేదనుకుంటే అసలు వ్యాపకత్వ స్థితి లేదు. తాను తానైటువంటిది. మీకు ఊహకు అందాలంటే వ్యాపకత్వాన్ని విరమించుకున్నటువంటి స్థితిలో అది ఘనము. ఘనము, ద్రవము, వ్యాపకము అనే స్థితులున్నాయి. వాయువు వ్యాపిస్తుంది. వ్యాపకమనేది విరమిస్తే ఘనము. ఘనమే అవ్యక్తము. ఈ అవ్యక్తం శాశ్వతమైతే అది అచల పరిపూర్ణబ్రహ్మం. ఈ భావాతీత స్థితి ఎలా ఉంటుందంటే సగుణ, నిర్గుణ బ్రహ్మల దగ్గర భావము, అభావము అంటాము. సగుణము భావము. నిర్గుణము అభావము. త్రిగుణరహితమైనటువంటి అచల పరిపూర్ణ పరబ్రహ్మ సగుణ నిర్గుణాతీతము. భావాభావాలకు కూడా అంతీతము. భావము అభావము అనేవి రెండూ లేవు. వ్యక్తా వ్యక్తములు రెండూ లేవు. ఇది కేవల అభావము. అంటే నిర్వికల్పము. నిస్సంకల్పము. ఊరకుండుట. అచలము. అచలం శాశ్వతం అయితే అక్కడ గుణములయొక్క ప్రమేయం లేదు. గుణముల ప్రమేయం ఉంటే మాయలోనే వ్యక్తమవుతాడు. గుణముల ప్రమేయం లేకపోతే సత్యస్వరూపుడుగా, సత్యత్వ స్థితిలో తాను తానైనటువంటి స్థితిలో తానుగా ఉండి తనను తాను ప్రకాశించుకుంటూ తనలోతాను రమించుతూ ఉంటాడు. ఈ వాక్యాలు లక్షణ వాక్యాలు. అవగాహన కోసం ఈ రమించడాలు అన్నీ కూడా మాయావరణంనుండి నిరావరణకు వెళ్ళేటప్పుడు నీకు అర్థం అవడం కోసం వ్యాపకత్వాన్ని విరమించడాన్ని ఘనంగా చెప్పడము. తటస్థ లక్షణాన్ని అనుభవంగా ఉన్నదానిని పరోక్షమని చెప్పి, అది నీవే అయివున్నావు అన్నపుడు, అపరోక్షం అన్నపుడు ఘనం అనేమాట చెప్పడము స్వరూప లక్షణాన్ని సూచిస్తుంది. స్వరూప లక్షణాన్ని సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అని చెప్పడం జరుగుతుంది. ఈ భావాతీతం ఏమిటయ్యా అంటే తిరిగి భావంలోకి రాకపోవడమే, అంటే త్రిగుణరహితము.

ఇవన్నీ బ్రహ్మ లక్షణాలు. ఈ విధముగా చెప్పిన మా గురువు అటువంటి లక్షణయుతుడు. అటువంటి సద్గురువునకు **తంనమామి**. ఆ సద్గురువునకు శరణాగతి. ఆ సద్గురువునకు చతుర్విధ శుశ్రూషణలు చేసి శుశ్రూషలలో అంగముగా, స్థానముగా, భావముగా, ఆత్మగా శిష్యుడు లేకుండాపోయి, లేనివాడయి, తాను సర్వమూ గురు స్వరూపముగా ఉండటం అన్నమాట. నమః నేను లేను అంటే శిష్యుడు లేకుండాపోయే పద్ధతిలో, ఆ గురువులో మమైకమయ్యే పద్ధతిలో గురుస్తుతి, గురుధ్యానం చేస్తున్నాడు. ఇక్కడ అటువంటి గురువును స్మరించుకుంటున్నాము. గురువు యొక్క సహాయం వస్తుందనే విశ్వాసం వచ్చింది. ఆ గురునకు శరణాగతి అయ్యాము. ఈ చెప్పిన పద్ధతితో ఆ లక్షణాలు తెలుసుకున్నాము. దానికి వ్యతిరేకంగా ఉన్నవన్నీ పోగొట్టుకోవాలనే నిర్ణయంతో ఉన్నాము. అంటే పోగొట్టుకోవడం అంటే దుఃఖము జన్మరాహిత్యముల కోసమే కాదు. నిజానికి అవి లేనివే కనుక, లేకనే ఉన్నట్లు తోచినవి కనుక మిథ్యా భావంతో తోసేస్తున్నాము తప్ప, అవీ ఉన్నవి – ఇవీ ఉన్నవి అని, ఇక్కడ ఉంటే పునర్జన్మలున్నాయి గనుక అక్కడ ఉంటే ఉండవు అనే భావంతో వెళ్ళటము లేదు మనం. ఇది అబద్ధం కాబట్టి వదిలేస్తున్నాం. హిత బోధగా దుఃఖహేతువు అని చెప్తున్నాము. హితబోధలో తీవ్ర మోక్షేచ్ఛ కావాలని అన్నాము. ఇక్కడ మోక్షేచ్ఛ కూడా వదలాలి. ఎందుకంటే నీ లక్ష్యంలో బంధమోక్షాలు లేవు. మరి మోక్షం ఎందుకు నీకు? జ్ఞానాజ్ఞానములు రెండూ పోయినప్పుడే జ్ఞానము

అజ్ఞానము అనే ద్వంద్వము పోతే ద్వంద్వాతీతం గగన సదృశ్యం. సత్తు, అసత్తు, రెండూ పోతాయి. నిత్యం అనిత్యం రెండూ పోతాయి. ఇంద్రియ గోచరము అంతా పోతుంది. చలించేది చలించనిదీ అన్న భేదభావం పోతుంది. తత్త్వం అనే సచ్ఛిశిష్యుని యొక్క స్థితి పోతుంది. చివరకు అసి పదమే మిగులుతుంది. ఈ లక్ష్యాన్ని ఈ శ్లోకం ద్వారా మనకు అందిస్తున్నారు. దీనితోనే లక్ష్యం శిష్యునకు తెలిసింది. ఇక మిగతా గురు ప్రార్ధన అక్కరలేదు.

**శ్లో॥ అహం నిర్వికల్పో నిరాకార రూపః । విభూత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణాం ॥**
**నచాసంగతంనైవ ముక్తిర్నమేయః చిదానందరూపః శివోఽహం శివోఽహం ॥**

గురువుతో మమేకం అవ్వాలని తెలిసింది. ఏమి పోవాలో తెలిసింది. అన్నీ తెలిశాయి. అపుడు నిర్వాణషట్కమునకు వెళ్ళి ఇది కాదు ఇది కాదని మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములు నేను కాదని పాపపుణ్యములు లేవని, అదని, ఇదని చెప్పేసి ఆఖరికి ఏమంటున్నాడు? **అహం నిర్వికల్పోనిరాకార రూపః విభూత్వాచసర్వత్ర సర్వేంద్రియాణం – శివోహం** అని శిష్యుడు అంటున్నాడు. ఆ గురుప్రార్ధన చేసినవాడే శిష్యుడు. ఆ ప్రార్ధన చేసి శిష్యుడు ఏం చేశాడు? అవగాహన చేసుకొని ఇది కాదు, ఇది కాదు అని సర్వమూ శూన్యమని, ఉత్త బట్టబయలు ఏమీ లేదని, నేనే ఆ నిర్వికల్పుడను. నేనే నిరాకార రూపాన్ని, నేనే అనేకంగా మాయావరణలో గోచరిస్తున్నాను. మాయకు పరమైనదాంట్లో నేను స్వస్వరూపంగానే ఉన్నాను. మాయద్వారం దాటి మాయావరణలోనికి వస్తే చరాచర జగత్తంతా ఏదయితే కనపడుతున్నదో అవన్నీ నాయొక్క ప్రతిబింబ రూపాలే. నాయొక్క విభూతి. **సర్వత్రా సర్వేంద్రియాణాం** అంతటా అన్ని ఇంద్రియాలతో ఏపనయితే ఈ మాయావరణలో జరుగుతుందో అదంతా నాదే. అవన్నీ నిజానికి నేను చెయ్యడం లేదు. మాయావరణలో నేను చేస్తున్నట్లు కనిపిస్తున్నది. ఇది మాయా విలాసము అంటున్నాడు. **నచా సంగతంనైవముక్తిర్నమేయః**. దేనిలోనూ నాకు సంగత్వం లేదు. అద్దంలో ఉన్న నీ ప్రతిబింబానికి నీకూ ఎలా సంగత్వం ఉంటుంది? నీవు నీవుగానే ఉన్నావు. అద్దంలో నిన్ను నీవు తమాషాగా చూసుకో. సంగత్వ, నిస్సంగత్వములు రెండూ లేవు.

**<u>ముక్తిర్నమేవ</u>** : బంధ మోక్షములు రెండూ లేవు. నేను అదే అయివుంటే ముక్తి ఏమిటి? నను బంధించేది మాయ అయ్యిందిగా! మాయా కల్పితమైనదే గాని నిజం కాదుగా! నిజం కానిది బంధించటం ఏమిటి? ఉత్తుత్తి తాడుతో బంధిస్తే దానికి ముడి లేదుగా! నిజమైన తాడుకి ముడివేస్తే కదా బంధము! ఉత్తుత్తి తాడని తెలిసిపోయిందిగా! లేని ముడేగా ! విప్పటం లేదుగా. అంటే బంధ మోక్షములు లేవు. ఏ ప్రమేయమూ లేదు. ప్రమాణం, ప్రమాత, ప్రేమయం అనే త్రిపుటి లేదు. ప్రమేయాన్నిబట్టి ఇవన్నీ వచ్చాయి. ప్రమాణం అంటే ఆపై స్థితిలో జ్ఞానము. ప్రమాత అంటే జ్ఞాత. ప్రమేయం అంటే జ్ఞేయవస్తువైన పరబ్రహ్మ. ప్రమేయమే లేదు అంటే ఏమయింది. త్రిపుటి పోయింది. త్రిపుటిపోతే ఏమయింది? అప్రమేయుడయ్యాడు. అప్రమేయుడెవరు? పరబ్రహ్మమే. ఆ ప్రమేయంగాని నాకు లేవు. నేనెపుడుకూడా చిదానంద స్వరూపుడిని. నేనెపుడూ ఏ ఉపాధిలోనూ లేని నిరుపాధికమైనటువంటి మంగళస్వరూపమైనటువంటి ముక్తి స్థానమైనటువంటి ధామము అనే పేరుగల శివుడను. అట్టి శివుడ్ని నేను అంటున్నాడు శిష్యుడు.

తర్వాత ప్రథమాంకంలో బోధ మొదలవుతుంది. శరీరత్రయ విలక్షణము, పంచకోశ విలక్షణము, అవస్థాత్రయ సాక్షి, పంచీకరణము ద్వారా విలక్షణ జ్ఞాత కూటస్థ ఆత్మ ఇవన్నీ వస్తాయి. అపుడే అయిపోయాడా? లక్ష్యాన్ని ధ్యానం చేసుకుంటున్నాడు. ఏదవ్వాలో లక్ష్యాన్ని ఒక యాక్షన్ ప్లాను తయారు చేసుకుంటున్నాడు. ఈ గురు ధ్యానంలో యాక్షన్ ప్లాన్ లక్ష్యం ఏది అంటే ఏఏ పాఠాల ద్వారా ఏఏ మజిలీలు దాటి ఎంతవరకు భ్రాంతిరహితము అవుతుందో చివరికి పరిపూర్ణంగా భ్రాంతిరహితం అయ్యేసరికి నేనేదై వుంటాను అనేది చూచాయగా చెప్పాలి. ఏ గ్రంథమైనా, ఉపోద్ఘాతంలో చెపుతారు. అది మనం ఇప్పుడు చెప్పుకున్నాము. అలాగే గురు ప్రార్ధనలో కూడా ఈ వరుస చెప్పుకుంటున్నాము. ఆ వరుస మనకు వాచాగా తెలియాలి. తరువాత సాధనగా ఆచరిస్తాం. ముందు వాచాగా తెలియాలిగా !

**శ్లో॥ స్థూల సూక్ష్మ సకారణాంతరఖేలనం పరిపాలనమ్ । విశ్వతైజస ప్రాజ్ఞ చేతసమంతరాత్మ నిజాంశుకమ్ ।**
**సర్వకారణమీశ్వరం నిటలాంతరాళ విహారకమ్ । ప్రాతరేవహి మానసాంతర భావయేద్గురు పాదుకామ్ ॥**

జీవుడి దగ్గర స్థూల, సూక్ష్మ కారణ శరీరాలు, ఈశ్వరుడి దగ్గర విరాట్, హిరణ్యగర్భ అవ్యాకృత శరీరాలు అనేటటువంటి వాటన్నింటి మధ్యలో కూడా ఒక ఖేలగా సర్వవ్యాపకముగా, ఏ శుద్ధ చైతన్యమున్నదో అదిప్పుడు పరిపాలిస్తోంది. చిద్విలాసంగా, పరమాత్మ విలాసంగా పరిపాలిస్తోంది. మాయావిలాసంగా పరిపాలిస్తోంది. ఎందుకంటే అకార, ఉకార, మకారాలు, స్థూల,

సూక్ష్మ. కారణాలు. వ్యష్టిలోను, సమష్టిలో కూడా. మళ్ళీ ఇవికూడా ఎక్కడున్నాయి? స్థూలమంతా స్థూల ప్రపంచంలో, సూక్ష్మమంతా, సూక్ష్మ ప్రపంచంలో, కారణం మానసిక ప్రపంచంలో ఉన్నాయి. ఈ 3 ప్రపంచాలు దాటితే ఆత్మ సామ్రాజ్యమే. ఈ మూడింటిలో కూడా వ్యాపించినటువంటిది ఆత్మ చైతన్యము. ఆత్మ సామ్రాజ్యంలో ఉన్నటువంటి చైతన్యమే ప్రణవము. ప్రణవం యొక్క వ్యక్త స్థితిలో అకార, ఉకార, మకారాలలో స్థూల సూక్ష్మ కారణాలలో ఒక ఖేలగా, విలాసంగా ఈ మాయావరణయందు జరుగుతోంది. జరుగుతున్నట్లుగా కనపడుతోంది. అక్కడ ఉన్నవారికిది ఖేల. చైతన్యానికి విలాసము. చైతన్యమన్నా, మాయన్నా ఒక్కటే. కనుక మాయావిలాసానుభవం ఉన్నవాడు ఇదంతా తన విలాసమనుకుంటే ఇంకా విడుదలవ్వాల్సిన అవసరముంది. కాని అది మాయావిలాసమే అనుకుంటే వాడు విడుదలయినట్లు లెక్క. ఇది విలాసం కాదు అనుకున్నపుడు ఏమయింది? సృష్టి, స్థితి, లయములకు కర్త అయి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులై త్రిమూర్తులయ్యారు. త్రిమూర్తి స్థానంలో జగత్తు వాళ్ళకున్నది. వాళ్ళకి జగత్తు మిథ్య కాదు. అందుకే ఈ బోధ. త్రిమూర్తులకంటే అతీతమైనవంటివాడు గురువు. గురుబ్రహ్మ గురువిష్ణు గురుదేవో మహేశ్వరః అన్నపుడు అంతవరకు ఉన్న త్రిమూర్తులు ఒక బాధ్యతగా ఈ ప్రపంచం లేనిదని తెలియకుండా ఒక కర్తవ్య భావంతో జీవులయొక్క ప్రారబ్ధాన్ని పంచుతూ ఖేలగా ఆటగా చేస్తున్నారు. వాళ్ళకు ఆట ఎందుకయ్యింది? మాయకి వశులు కాలేదు కాబట్టి.

జీవునికయితే అనేక బాధలున్నాయి. మాయకు వశులై జీవులు అవిద్యా దోషంతో బాధపడుతున్నారు. బాధలు పడేసరికి కర్మ అంటుకుంది. మాయకు వశుడు కాపోయేసరికి ఈశ్వరుడికి కర్మ అంటలేదు. అయినా ఈశ్వరుడు కూడా భ్రాంతిలోనే కర్మ నిర్వహిస్తున్నాడు. కర్తృత్వంపోతే వాడు సాక్షాత్ పరబ్రహ్మే. గురువు ఇవన్నీ చెయ్యగలడు. చేసే సామర్థ్యం వుంది. కాని చెయ్యాల్సిన అవసరము లేదు. ఎందుకంటే సాక్షాత్ పరబ్రహ్మగా, బ్రహ్మ తప్ప అన్యం లేనట్లుగా ఉన్నపుడు ఈ త్రిమూర్తులయొక్క పనులు చేయాల్సిన అవసరమే లేదు. అందుకే పరమాత్మ ప్రకాశానికి, గురుమూర్తియొక్క తేజస్సుకి తేడా ఉంటుంది. పరమాత్మ ప్రకాశం జ్ఞానులలో, అజ్ఞానులలో సమానంగా, వ్యాపకమై ఉంటుంది. అజ్ఞానాన్ని జ్ఞానంగా మార్చవు. గురువు యొక్క తేజము పరిమితంగా, తనని వెంబడించినవాళ్ళకి శుశ్రూషద్వారా మమైకమైనవాళ్ళకి తన కృపకి పాత్రులైనటువంటి, యోగ్యత కలవారికి, అటువంటి సచ్ఛిష్యులకు, సాధకులకు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడిగా జ్ఞానాన్ని వారిలో సృష్టించి ఆ జ్ఞానాన్ని వారిలో పరిపోషించి, వారిలోనున్న అజ్ఞానమును లయం చేసేటటువంటి సత్తా (సాక్షాత్తు) పరబ్రహ్మ స్వరూపం అయినటువంటి గురువుకే వుంది. ఇదే గురుతత్త్వం.

**<u>గుకారో అంధకారస్య రుకారో తేజముచ్యతే</u>** : **'గు'** అంటే అంధకారము. శిష్యుని హృదయంలో గూడుకట్టుకున్న అజ్ఞాన ఆవరణ. **'రు'** అంటే జ్ఞాన ప్రకాశం. అది తేజమంటున్నాం. ప్రకాశమనటం లేదు. ఇదే గురుతేజం. జ్ఞాన ప్రకాశం. ఆ గురువు వ్యాపకమయ్యాడు. మాయావరణలోనే వ్యాపకం. నిరావరణమందు వ్యాపకం లేదు. అంతా ఘనం. గురు సాక్షాత్తు పరబ్రహ్మ. అంటే ఘన స్వరూపుడే. కానీ మాయావరణలో భ్రాంతిలో ఉన్న శిష్యుడిని కడతేర్చడానికి మాయావరణలోనికి వచ్చాడు కాబట్టి వ్యాపిస్తున్నాడు. ఆ వ్యాపకానికి కారణం మాయేకాని తాను కాదు. తాను అప్పటికి కూడా వ్యాపకం కాని ఘనుడే. ఆ వ్యాపకం శిష్యుని హృదయంలోకి వెళ్ళేసరికి అజ్ఞానాంధకారం పటాపంచలయ్యింది. దత్తాత్రేయులవారు కూడా అంతే.

నిన్న మొన్న చెప్పుకున్నాం. సృష్టి, స్థితి లయలు చెయ్యాల్సి వచ్చినపుడు త్రిమూర్తులు ఫెయిల్ అయినపుడు పురాణాలలో అత్రి స్థితిలో, త్రిగుణ రహిత స్థితిలో అనసూయ స్థితిలో, అభేద స్థితిలో ప్రార్థిస్తే వారి కుమారుడిగా దత్తాత్రేయులవారు వచ్చి వారి ప్రార్థనను అంగీకరించి చేసీ చెయ్యనివాడిగా సృష్టి, స్థితి లయలు చేస్తారు. అవసరం తీరగానే తాను తానైనటువంటి స్వస్వరూపమందు ఆత్మ స్వరూపమందు తనలో తాను రమిస్తున్నటువంటి స్థితిలో నిజ తపస్సులో ఉండిపోతారు. నిజ అనగా సహజమని అర్థము. అప్రయత్నంగా ఎపుడూ అలాగే శాశ్వతముగా నిత్యముగా సహజముగా ఉండేదే **'నిజ'**. నిజ గురుబోధ అన్నాము. అచల సిద్ధాంతంలో నిజ గురువు అంటే సహజమైనటువంటి గురుతత్త్వము అది. మిగతా గురువులు అష్ట విధగురువులున్నారు. 3 జీవ తనువులలో, 3 ఈశ్వర తనువులలో, 3 జీవావస్థలలో, 3 ఈశ్వరావస్థలలో గల శుద్ధ చైతన్య రూపమందు గురుతత్త్వమును నింపి, శిష్యులలో వ్యాపించిన గురువు, ఆ శిష్యుల లోపల ఉన్నటువంటి అజ్ఞాన సంబంధము నుండి జ్ఞాన సంబంధానికి మారేటట్లుగా ఒక పరివర్తన కలిగిస్తాడు.

**నిజాంశుకం :** నిజమైన అంశము. సహజమైనది. ఇక్కడ గురువు చేసేస్తూ ఉన్నాడు అన్నది ఏదీ లేదండి. గురువు ఆ తేజోరూపంలో ఉన్నాడు అంటే శిష్యుడి ఆర్తినిబట్టి గురుకృపతో అక్కడి వ్యాపకత్వం అంతా కూడా సహజంగానే, అప్రయత్నంగానే జరిగిపోతుంది. గురుకృప అంటే దయ చూపించమని కాదు. అది కర్త; కర్మ; క్రియగా ఉండదు. త్రిపుటి ద్విపుటిగా ఉండదు. గురుకృప కేవల తేజంగా, ప్రకాశంగా ఉంటుంది. చెప్పాల్సి వస్తే గురువు నిర్వికల్పముగా ఉన్నా పాత్రుడైన శిష్యునిమీద గురుకృప ఎప్పుడైతే కలిగిందో, దృష్టి సారించాడో, అటువంటి గురువుని బయలు స్థితినుండి ఘనరూప స్థితినుండి శిష్యుడు ఆర్తితో ఎప్పుడైతే మేల్కొలిపాడో, అపుడు కలిగే గురుకృపకి గురువు తరపున మాయ ఏది చెయ్యాలో అది చేస్తుంది. గురువు ఏమీ చెయ్యడు. గురువుకు కర్తృత్వము లేదు. గురువు ద్విపుటికి, త్రిపుటికి రాడు. ఇంతచేసినా కూడా ఆయన అచలము నిత్యము ఏకము సర్వకారణమీశ్వరం నిటలాంతరాళ విహారకం సర్వకారణములకు కారణము. అన్ని కారణములకు కారణమైనది. అన్ని లోకములను శాసించునది. శిష్యునియొక్క భ్రూమధ్యమందు తురీయ స్థితిలో విహరించునది. ఈ తురీయ స్థితిలో ఏ చైతన్యము విహరిస్తుందో అది నీదైనంతవరకు ఉపయోగము లేదు. నువ్వు అక్కడకి వచ్చినపుడు ఆ గురు తేజమే భ్రూమధ్య స్థానంలో చేతన రూపంలో ఉంటే, చైతన్య రూపంలో ఉంటే, గురుతేజ రూపంలో ఉంటే, అది ప్రకాశించి అలా అది సహజంగా కనుక అక్కడ ఉంటే దానియొక్క ఫలితంగా నువ్వు కడతేరుతావు. శ్రీ సద్గురు పాదుకా ద్వయములను ప్రతిదినము ఉదయముననే ధ్యానింపుము అంటే మాయ ఏకదేశీయంగా ఉన్నపుడు మాయావరణలో లభించినటువంటి పాదుకలవి. ఆయన సాక్షాత్తు పరబ్రహ్మ. నిరావరణ బ్రహ్మమే. ఈ జ్ఞానోదయం అయ్యేదాకా ప్రతిదినము ప్రాతః కాలంలో ధ్యానిస్తున్నాము. ప్రాతఃకాలము అంటే జ్ఞానోదయమవటానికి ముందు అని అర్థము. గురువుని ధ్యానిస్తే జ్ఞానోదయం అవుతుంది. అంతే!

**శ్లో॥ ఓం నమో బ్రహ్మాదిభ్యో । బ్రహ్మ విద్యా సాంప్రాయ కర్తృభ్యో ।**
**వంశఋషిభ్యో । మహాద్భ్యో । నమో గురుభ్యః ॥**

మొట్టమొదటి గురువు ఎవరండీ? ఆదిలో బ్రహ్మము ఒక్కటే. బ్రహ్మ తప్ప అన్యము లేవు. మరి గురువు ఎక్కడినుండి వచ్చేసారు. ఆ తరువాత సృష్టిలో బ్రహ్మమానస పుత్రులుగా, బ్రహ్మయొక్క మాయావరణమందు వ్యాపించిన ప్రకాశరూపంతో సనకసనందనాదులు లాంటివారు వచ్చారు. వారికి మొట్టమొదటి గురువు ఎప్పటికీ పరబ్రహ్మగా ఉన్న పరబ్రహ్మమే గురువు. అది మౌన వ్యాఖ్యతో అయిపోయింది. ఆ తరువాత బ్రహ్మనుంచి ఎవరు తీసుకున్నారు? విష్ణువు. ఘనీభవించిన చైతన్యము బ్రహ్మ అయితే, సర్వవ్యాపక చైతన్యము విష్ణువు. ఆ విష్ణువు తన వ్యాపక స్థితిని వదలి ఘనీభవించిన స్థితే కరెక్టు అని, శివుడి దగ్గర లేక పరబ్రహ్మ దగ్గర తెల్సుకున్నాడు. అక్కడ తపస్సు ద్వారా తెలుసుకుంటారు. అక్కడ గురువు ఎవరూ లేరు. తపస్సు ద్వారా గురుస్తుతి అందుతుంది. స్వరూపం పరబ్రహ్మమైనప్పటికీ మాయావరణలో సర్వవ్యాపక చైతన్యంగా ఉన్న విష్ణువుకు తాను మాయావరణలో ఉన్నానని తెలుసు. అటువంటి విష్ణువు ఏమి చేశారు? సృష్టికి రాగానే సూర్యునికి చెప్పాడు. సూర్యుడు తేజో రూపంలో ఉన్నాడు. మండుతూ ఉన్నాడు. సూర్యుని దగ్గర ఉన్నటువంటి జ్ఞానము యాజ్ఞవల్క్యునికి వెళ్ళింది. యాజ్ఞవల్క్యుడు మానవ శరీరంలో ఉన్నాడు. సూర్యుని దగ్గరకు వెళ్ళి బోధ వినాలి అంటే మాడిమసై పోతాడు. తపస్సుచేసి గాయత్రీ మాతను సాక్షాత్కరింపచేసుకొని, మాతకృపవల్ల ఒక శీతల రథాన్ని తీసుకొని సూర్యుడు ఉదయాస్థమానం తిరుగుతూ ఉంటే సూర్యునితోపాటు ఆ శీతల రథంలో తిరుగుతూ, సూర్యుడు కదిలే వేగంతో ఈ రథం కూడా కదులుతూ ఉంటే, ఆ సూర్యరశ్మి, ఈ శీతల రథంలో పరిహరించబడుతూ ఉంటే యాజ్ఞవల్క్యుడు నేర్చుకున్నాడు. యాజ్ఞవల్క్యునినుంచి ఎవరు నేర్చుకున్నారు? జనక మహర్షి. జనకులవారి నుంచి శుకుడు. శుకుడినుంచి సాందీపుడు. సాందీపునినుండి కృష్ణుడు, శ్రీకృష్ణ పరమాత్మ నుంచి ఉద్ధవుడు, అర్జునుడు ఇలా చాలామంది. ద్వాపర యుగం పోయింది. అన్నీ పోయినాయి. ఎవరెవరొచ్చారో, ఎవరు పోయారో తెలియదు. అందుకని మాధ్యమాం అని మధ్యలో శంకరాచార్యులు వచ్చారు. తర్వాత ఎవరెవరో శాఖోపశాలు వచ్చాయి.

ప్రస్తుతానికి మనకో గురువుగారు దొరికారు. నిర్భయానంద వీరంతా ఏమిటండీ? గురుశిష్య పరంపరగా గురువులై మళ్ళీ శిష్యులుగా వచ్చి జ్ఞాన పుత్రులయ్యారు. ఒక్కో గురువుకి రెండోవాళ్ళు శిష్యరత్నం జ్ఞానపుత్రుడయ్యేసరికి, అతనే మరల గురువయ్యే సరికి, అతనికో శిష్యరత్నమయ్యేసరికి, ఈ జ్ఞాన పద్ధతిలో తాతకి తండ్రి. తండ్రికి కుమారుడు. కుమారుడికి మనవడు వచ్చినట్లుగా గురువు యొక్క శిష్యులు మళ్ళీ గురువులౌతూ శిష్యులొచ్చినట్లుగా గురుశిష్య పరంపర. ఇదొక వంశమండి. అందుకని **వంశ ఋషిభ్యో** అన్నాము. ఋషి అంటే ఎవడు? తనకున్నటువంటి అనుభవ పాండిత్యాన్ని విపులంగా అందరికీ

అందించేవాడు ఋషి. అందించకుండా పోయేవారు మనకనవసరం. మనకందించేవాడే గురువౌతాడు. అందువల్ల వంశ ఋషిభ్యో అన్నారు. గురుశిష్య పరంపరగా ఉన్న వంశమిది. జ్ఞాన పుత్రుల యొక్క వంశమిది. ఆ వంశంలో ఋషులైన వాళ్ళు వేదాలు, ఉపనిషత్ సారాన్ని అవగాహన చేసుకున్నటువంటివారు. కాని పండితులు స్వానుభవం లేనివారు తిరిగి గురువు అవలేనివారితో ప్రయోజనము లేదు. అటువంటి వంశ ఋషిభ్యో, వారందరికీ కూడా నమస్కరిస్తున్నాడు. బ్రహ్మావిద్యా సాంప్రదాయం కావాలి. మళ్ళీ వేరే సాంప్రదాయమయితే మనకెందుకు? బ్రహ్మ విద్య సాంప్రదాయమే కావాలి. ఆ సాంప్రదాయంలో ఉన్న జ్ఞాన పుత్రులే గురువులై బోధించేవారు కావాలి మనకు. అక్కడ బోధ అనేటటువంటి కర్తృత్వం ఉండాలి. చేసీ చెయ్యనివాడుగా గాని ఎట్లా అయినా కాని, కర్తృత్వం ఉండాలి.

<u>**సాంప్రదాయ కర్తృభ్యోవంశ ఋషిభ్యో :**</u> వంశమంటే ఇదే గురుశిష్య పరంపరావంశం. మహద్భ్యో. మీరు మహత్తనే స్థాయిలో ఉండాలి. మహదహంకారం కూడా కాదు. త్రిమూర్తుల స్థాయి, ఈశ్వరుల స్థాయి కాదు. బ్రహ్మ నిష్ఠులై ఉండాలి. మహత్ బ్రహ్మలై ఉండాలి. మహత్తనే స్థానం దగ్గరే కేవల బ్రహ్మ నిష్ఠ ఉంటుంది. అక్కడ కొంత సగుణంగా వ్యవహారం చేసే అవకాశం మహత్ బ్రహ్మ దగ్గర ఉంటుంది. అవ్యక్తం దగ్గర నిర్గుణం అవుతాడు కాబట్టి అటువంటి గురువులవల్ల మనకు ప్రయోజనం లేదు. కాబట్టి మహత్తే హయ్యెస్ట్. అంతకంటే అధికంలేదు. **నమో గురుభ్యః** ఈ పరంపరలో అందుబాటైన గురుశిష్య పరంపరా వంశంగా ఉన్నటువంటి ఋషులు, పండితులు, పెద్దలు, అనుభవజ్ఞులు, వారందరికీ కూడా వరసపెట్టి నమస్కరిస్తున్నారు. కొంతమంది వారియొక్క ఆశ్రమాలలో ఒక 20 పద్యాలు గురుపరంపర చదువుతారు. మనం అదంతా తీసేసి బ్రహ్మ నుండి మొదలుపెట్టినవారంతా కూడా వంశ ఋషులుగా గురుపుత్రులుగా గురుపరంపర కొనసాగించేవారందరికీ నమస్కారం చేశాం. పూజ దగ్గరకి వెళితే శంకర మధ్యమాం అని, నీ గురువుని కూడా చెప్పుకోవచ్చు. అలా స్కిప్ అయిపోతావు కొన్ని పేర్లు. ఎందుకంటే గురుబోధకు టైము కావాలి. ఈ గురుపరంపర వంశాన్నే ఒక రోజంతా చెప్పుకుంటే రోజు చాలదు.

**శ్లో॥ అస్మద్గురు సమారంభాం । కృష్ణ సాందీప మధ్యమాం ।**
**ఓంకార పీఠపర్యంతాం । వందే గురు పరంపరామ్ ॥**

<u>**అస్మత్ గురుసమారంభాం :**</u> ఇంత దూరం వచ్చాక నీ గురువు దగ్గరకి వచ్చేయి. కృష్ణ సాందీపమధ్యమాం. మధ్యలో వాళ్ళొచ్చారండీ. బ్రహ్మాదిభ్యో అన్నపుడు వీళ్ళు. తర్వాత మధ్యలో సాందీపమధ్యమాం. ఆ తరువాత ఏముంది? ఏదో ఒక పీఠం పెట్టుకున్నారు. ఓంకార పీఠం పెట్టుకున్నాం మనం. ఓంకార పీఠపర్యంతాం వందే గురు పరంపరాం. ఇక్కడ కావాలంటే నిర్భయానంద, విజ్ఞాన స్వరూపం అని పెట్టుకుని ప్రార్థించవచ్చు. దీనిని సింపుల్‌గా అవగొట్టండి. ఎందుకంటే ప్రార్థనతోనే గడిచిపోతే, బోధ ఎప్పుడౌతుంది? క్లుప్తమైన ప్రార్థన బ్రహ్మానందం పరమసుఖదం అన్నపుడు సద్గురువు యొక్క గొప్పతనాన్ని ప్రార్థిస్తూ తర్వాత లక్ష్యాన్ని నెమరువేసుకున్నాం. అహం నిర్వికల్పో అంటే ఒక దూకుదూకి శిష్యుడు ఆ రకంగా తయారయ్యే లక్ష్యాన్ని పెట్టుకున్నాం. తర్వాత సాధనలో స్థూల సూక్ష్మ కారణాలు. విశ్వ తైజస ప్రాజ్ఞులు. సర్వకాల సర్వావస్థలలో సర్వ రూపాలలో అంతటకూడా నిండి నిబిడీకృతమైనటువంటి గురు తేజాన్ని మనము ప్రతి నిత్యమూ జ్ఞానోదయం కోసం ప్రార్థిస్తున్నాం. అక్కడికి అయిపోయింది. గురుపరంపర ప్రార్థన కోసము నమో బ్రహ్మాదిభ్యో అంటూ బ్రహ్మము మొదలైన వారినుంచి చివరికి నీ గురువుదాకా వచ్చావు.

**శ్లో॥ నమోదేవ దేవా । నమోదివ్య తేజా ।నమోఽద్వైత తత్వార్ధ బోధనాయ ।**

**మోక్షమొసగు శాస్త్రరూపమే నీవంచు । నాదు మనమునందు కొలుతునిన్ను ॥**

శ్రీ గురువును ప్రార్థిస్తున్నారు. అద్వైత తత్త్వమును, తత్త్వార్థమును ప్రబోధ చేసి, శిష్యుడిలోకి వ్యాపకమగుటద్వారా మోక్షములను ప్రసాదించే గురూత్తముడునూ వారి అనుభవమే శాస్త్రము కాగా, అట్టి శాస్త్ర రూపుడును అయిన నా గురువునకు నిత్యము ఆరాధించుచున్నాను.

**శ్లో॥ ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

పూర్ణమంటేనే రెండర్థాలున్నాయి. శూన్యాన్ని పూర్ణం అంటారు. అనంతాన్ని కూడా పూర్ణమంటారు. అనంతానికి అనంతం కలిపినా అనంతంలోనుంచి అనంతం తీసేసినా పూర్ణమే ఉంటుంది. సున్నాని తీసుకుంటే, సున్నాకి సున్న కలిపినా సున్నలోంచి సున్న తీసేసినా సున్నాయే. లెక్కలు అలాగే ఉంటాయి. ఇక్కడ పూర్ణము అంటే బ్రహ్మనిష్ఠలో ఉన్నవాడు పూర్ణుడు. ఈ ప్రపంచమంతా మాయాకల్పితంగా తోచింది. ఇక్కడ ఏమంటున్నామంటే సర్వం ఖల్విదం బ్రహ్మ అంటున్నాము. జగత్తు కూడా బ్రహ్మమే అంటున్నాము. మనకు నామ రూపాలుగా ఏదయితే కనపడుతుదో అదంతా బ్రహ్మ యొక్క విభూతిగా, నానా రకాలుగా ఉన్నప్పటికీ, అది అఖండముగా అవిభాజ్యముగా సగుణ బ్రహ్మే అని చెపుతున్నాం. కనుక అదీ బ్రహ్మమే ఇదీ బ్రహ్మమే, అదీ పూర్ణమే ఇదీ పూర్ణమే. ఇపుడు పూర్ణముగా ఉన్నటువంటి పరబ్రహ్మనుండి మాయాకల్పితం అనేటటువంటి ఈ సగుణ బ్రహ్మ కూడా మాయలోఉండబట్టి లేనివాడేగా. అందుకని వీడిని తీసేద్దాం. లేనిది లేకుండా పోయింది కాబట్టి పూర్ణమే. దీనిని కలుపుకోండి. కలుపుకుంటే మాత్రం ఏమిటి? 1కి సున్న కలిపితే ఒకటియే. ఈ రకంగా జగత్తు ఉందని ఒక లెక్క. లేదని ఒక లెక్క. ఉండి కూడా లేనిదని ఒక లెక్క. అంతా బ్రహ్మమే అని చివరి లెక్క. అన్ని లెక్కలుగాను దీనికి ఒకే అర్థముగా ఎన్ని రకాలుగా నయినా వస్తు నిర్ణయం చెప్పవచ్చు.

**శ్లో॥ భావశూన్యం బాహ్యశూన్య । మంతఃశూన్యం నిరామయం ।**
**ప్రభాశూన్యం జ్ఞానశూన్యం । సర్వశూన్యం నిరామయం ।**
**అప్రతర్క్య మవిజ్ఞేయ మవాంగ్మానస గోచరం ।**
**అమాత్రమవ్యయం దేవం । శివంతం నిష్కళోభవేత్ ॥**

పైన చెప్పిన శాంతి మంత్రం ద్వారా **భావ శూన్యం, బాహ్య శూన్యం, అంతః శూన్యం, నిరామయం**. భావనా మాత్ర సృష్టి కాబట్టి సత్యం కాదు. పరబ్రహ్మ భావశూన్యం. బాహ్యమనేది మాయాకల్పితమే కనుక బాహ్య శూన్యం. పరబ్రహ్మకు అంతరము బాహ్యము అనేవి రెండూ లేవు. **అంతర్ బహిశ్చ అచలోయంసనాతనః** లోపల బయట అనేటటువంటిది లేక ఒకవేళ ఉన్నా అంతటా అచల పరిపూర్ణమే నిండి నిబిడీకృతమై అద్వయమై రెండవది ఉండటానికి అవకాశం లేక నిరాకాశమైన ములుగ్రుచ్చ సందులేక నిరంధ్రమై ఉన్నది. బాహ్య శూన్యం. అంతః శూన్యం. నిరామయం. లోపల శూన్యమే బయటా శూన్యమే. పరబ్రహ్మమందు పరబ్రహ్మకంటె అన్యము లేదు. పరబ్రహ్మ వస్తువు కాదు. దేశము కాదు. నామరూపము కాదు. కాలము కాదు, అటువంటి పరబ్రహ్మ ఊహకందదు. సర్వవ్యాపకంగా ఉన్నదంతా కూడా విరమించి ఒక బిందు రూపముగా తీసుకెళ్ళి, ఆ బిందువు కూడా లేనిదే అయితే స్వస్వరూప సాక్షాత్కార అపరోక్షానుభూతిగా ఉన్నదేదో ఉన్నది. అపరోక్షానుభూతిగా ఉంటుంది. మోక్షస్థానంగా ఉంటుంది. పరమపదంగా ఉంటుంది. ఎలా ఉంటుందనేది స్వానుభవానికే తప్ప నిర్వచించడానికి వీలులేనిది.

దేశకాల వస్తువులుంటే వాటన్నిటిలో కూడా వ్యాపిస్తే ఆమయము. అన్నమయ కోశంలో వ్యాపిస్తే అన్నముగా అన్నమయముగా ఉన్నది. అంతా అన్నం వలన ఏర్పడినపుడు అన్నమయంగా ఉంది. శరీరం అంతా ప్రాణం వ్యాపించి ఉంది. కాబట్టి ప్రాణమయం. ఈ శరీరంతో కూడినటువంటి శవరూప అన్నమయాన్ని రెండింటిని కలిపి చేతనత్వముగా పొందినటువంటి, కనపడుతున్నటువంటి దాంట్లో మనస్సు వ్యాపించింది. అందుకని మనోమయం. దాంట్లో బుద్ధి వ్యాపించింది. అందుకని బుద్ధిమయం. ఆనందం వ్యాపించింది, ఆనందమయం. పరమాత్మ వ్యాపించాడు చిన్మయం. ఇవన్నీ పిండాండంలో బ్రహ్మాండంలో, దేశకాలాదులలో వ్యాపకత్వానికి ఆమయం అనే పదం వాడారు. ఇపుడు నిరామయం అంటే? ఏమీ వ్యాపించలేదు. ఎందుకు వ్యాపించలేదు? వ్యాపించటం, వ్యాపించకపోవడం ఆయనకు రెండున్నాయా ? మాయాకల్పిత దేశ కాల వస్తువులు లేనే లేవు కనుక వాటిలో వ్యాపించాడనే ప్రసక్తే లేదు. వాటియందు అంతర్యామిగా ఉన్నాడనే ప్రసక్తి కూడా లేదు. అణోరణియాన్ కూడా కాదు. అంతర్యామి కూడా కాదు. సర్వవ్యాపకత్వము కాదు. మహతో మహీయాన్ కాదు. ఇవన్నీ సృష్టిలో పదాలు. మాయా కల్పిత సృష్టి లేనిదిగా, భ్రాంతిగా పరిణమించి, మిథ్యగా చూచి దానిని తోచనే తోచకుండా ఉండేటటువంటి స్వరూప స్థితికి చేరినపుడు నీవు నిరామయం, ఆమయము కానిది నిరామయము.

**ప్రభాశూన్యం. జ్ఞాన శూన్యం.** ఒక జ్యోతి ఉంది. మాయావరణలోనే దాని ప్రకాశమంతా వ్యాపించింది. ప్రభాశూన్యం. ప్రభ అంటే ప్రకాశం. జ్యోతి కాదు. జ్యోతి యొక్క ప్రకాశం **నానాచ్ఛిద్ర ఘటోదరస్థిత** ప్రభాభాస్వరం. మహా దీపము యొక్క ప్రకాశము భాసిస్తోంది. **భా** అంటే భాసించుట, ప్రకాశము. **ప్రభ** అంటే ఉత్కృష్ఠముగా, ప్రకృష్ఠముగా అంటే మీ ఇంట్లో లైటు మీ ఇంటివరకే వ్యాపిస్తుంది. వీధిలో లైటు వీధి వరకే వ్యాపిస్తుంది. సూర్యుడు సూర్యమండలంలోనే వ్యాపిస్తాడు. పరమాత్మ ప్రకాశము అనంత కోటి బ్రహ్మాండాలలో వ్యాపిస్తుంది. ప్రకృష్ఠమైన ప్రకాశము ప్రభా శూన్యం అంటే పరమాత్మ ప్రకాశమే లేదంటున్నాడు. ఎందుకని?

అనుభవానికి కాని ఊహకు కాని, భావానికి కాని ఇంద్రియ గోచరంగా గాని ఉందంటే అది మాయే. లేనివాటినే ఉన్నట్లుగా చూపేది మాయ. కనుక అవన్నీ లేనివి కాబట్టి ప్రభ లేదు. ప్రకాశం లేదు. మాయలోనే ప్రకాశముంది. మాయ దాటితే ప్రకాశము లేదు. మహాదీప ప్రకాశము కుండలో ఉందిగా! కుండ వెలుపల ప్రకాశం లేదంటున్నారు కాని కుండ లోపల ప్రకాశం వుంది. అది స్వయం ప్రకాశం. స్వస్వరూపం. బయట ప్రకాశం లేదు. భావ శూన్యం. అంతః శూన్యం. దేశ కాలాదులు లేవు. ఆమయం కాదు. నిరామయం. ప్రకాశం శూన్యం, ప్రకాశమే జ్ఞానం. అందుకని జ్ఞానం శూన్యం. సర్వ శూన్యం నిరామయం. అంతా శూన్యమే. సర్వశూన్యమంటే బయలే. అ **ప్రతర్క్య మవిజ్ఞేయం**, అవాఙ్మానస గోచరం అంటే తర్కించటానికి విచారణకు కూడా కొంతవరకే అందుతుంది. ఆ లక్ష్యంలో పరమగమ్యంగా ఉన్నదేదో పరమ తర్కానికి కూడా అందదు. ఎంత తర్కించినా, ప్రకృష్ఠముగా తర్కము చేసినా అందదు. అవ్యయం, పెరగదు తరగదు. వ్యయం అంటే తరగటం. అవ్యయ మోక్షం అనుగ్రహించమని బాబా ప్రార్థన. అవ్యయమంటే తరగని మోక్షం. అవ్యయమంటే తిరిగిరాని మోక్షం, జన్మరాహిత్యం. ఏ లోకాన అయినా గాని జీవుడుగా, ఈశ్వరుడుగా ఆ లోకస్థులుగా ఏ లోకమందు కూడా రానివారు, ఉండనివారు, పుట్టనివారు. సదా శివునిచేత ఆ లోకములకు ఆకర్షింపబడనివారు. **'దేవం'** అంటే ప్రకాశించటం. ఇది స్వప్రకాశము. ఈ స్వప్రకాశమే అవ్యయము.

**శివంతం నిష్కళో భవేత్** శివుడికి అంతము అంటే – సృష్టిలో ఉన్న శివుడు అయితే ప్రకాశిస్తున్నాడు. సృష్టికి అతీతంగా ఉన్నవాడు ప్రకాశించడు. శివంతం అంటే శివస్వరూపానికి అంతమైనది. బాహ్య ప్రకాశానికి అంతమైనది. బాహ్య ప్రకాశము స్వరూపముగా లేనిది. స్వస్వరూప ప్రకాశముగా తాను తానై ఉండునది పరశివము.

**నిష్కళోభవేత్ :** ప్రకృతితో కూడినటువంటి చైతన్యము ప్రకృతియొక్క వికారాలచేత, కదలికలచేత ఆ ప్రకృతే, పరమాత్మ, చైతన్య ప్రకాశముచేత ప్రకాశించబడుతోంది. ప్రకృతిలోనే కదలికలున్నాయి కానీ, చైతన్యంలో కదలికలు లేవు. ఉదాహరణకి ఒక కొలనులో చిన్న రాయి వేస్తే తరంగాలు వచ్చినాయి. పున్నమి వెన్నెల ఉంది పైన. ఆ నీటిమీద వెన్నెల ప్రతిబింబిస్తూ వుంది. తరంగాలు కదులుతూ ఉంటే ఆ వెన్నెలలో ప్రకాశించేటటువంటి నీరు కనపడకుండా వెన్నెల యొక్క ప్రకాశం మాత్రమే కనిపిస్తూ, నీళ్ళు కదులుతూ ఉంటే, ప్రకాశం కదులుతూ ఉన్నట్లుగా ఉంది. నిజానికి వెన్నెల కదిలిందా? నీళ్ళే కదిలినాయి. అలాగే చైతన్యానికి కళలు లేవు. ప్రకృతి కళలతో చైతన్యం కలిసిపోతే, ప్రకృతి కళలని మనం విడగొట్టి చూడకపోతే, అవి చిత్కళలుగా కనపడుతాయి. ఇపుడు ప్రకృతి లేదనుకోండి. వెన్నెల యొక్క కదలికలు చూస్తారా? నీళ్ళు లేవు, వెన్నెల వెలుగుల యొక్క కదలికలు కనబడుతాయా? నీళ్ళు లేకపోతే కొలనులో నీళ్ళు తీసేసారు. అలాగే మాయ లేదు. చిత్కళలు లేవు. ప్రకృతి కళలని అధ్యాసగా, చిత్కళలుగా చూసుకుంటున్నాము తప్ప, చైతన్యము, వ్యాపకము కాదు. కదలికలు లేవు, వికారాలు లేవు. అందుకని కళ అంటే వృద్ధి క్షీణాలు. చంద్రకళలు అంటే పాడ్యమి నుండి పౌర్ణమి వరకు వృద్ధి, పౌర్ణమి నుంచి తిరిగి చతుర్దశి దాకా క్షీణము. అమావాస్యలో చంద్రుడే కనపడడు. చంద్రుడే కనపడనిది ఏమిటి అంటే నిష్కళ. కళ అనేది మాయావరణంలో ఉంటుంది. నిరావరణలో అది లేనిది. ఆవరణలో శివుడు, నిరావరణలో శివంతం పరశివం భవేత్.

**శ్లో॥ అబీజం వృక్ష సంపన్నం । శాఖాపల్లవ వివర్జితం ।**
**పుష్పం నాస్తి, ఫలం నాస్తి । సంపూర్ణం వృక్ష వర్జితం ॥**

అవ్యక్తము, మహత్తు, అహంకారము, పృథ్వీ, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము. ఇవి అష్టవిధ ప్రకృతులు. మహతత్త్వమే బ్రహ్మ మొదలుకొని గడ్డిపరక వరకు ఉండెడి సమస్త ఆకారములయ్యింది. బ్రహ్మము బీజరహితమైనచో వృక్షానికి గల కొమ్మలు, చిగుళ్ళు, పుష్పములు, ఫలములు ఎలా లేనివవుతాయో అలాగే సృష్టి బీజం పరబ్రహ్మామందుంటే, ఆ పరబ్రహ్మామే మూలం. ఆ

పరబ్రహ్మ యొక్క సృష్టి బీజంచేత అవ్యక్తము, మహత్తు, మహదహంకారము, పంచతన్మాత్రలతోటి 8 వచ్చినాయి. పంచ తన్మాత్రలు 5, మహదహంకారము, మహత్తు, అవ్యక్తము వెరశి 8 అష్ట ప్రకృతులయినాయి. ఎందుకని ప్రకృతులన్నాము బ్రహ్మణోరవ్యక్తః బ్రహ్మము బ్రహ్మముగానే ఉన్నాడు. బ్రహ్మము అవ్యక్తము. మహత్తు కాలేదు. బ్రహ్మము మరియు అవ్యక్తం మధ్యలో మాయ అనే తెర వున్నది. మాయ తెర ఇవతల అవ్యక్తం, మహత్తు అహంకారము, పంచతన్మాత్రలున్నాయి. మాయకు ఇవతలే అష్టప్రకృతులున్నాయి. మాయకు ఇవతల ఉన్నవన్నీ లేనివి. మాయకు ఇవతల ఉన్నవి లేకపోతే అవతల ఉన్న బ్రహ్మము శాశ్వతము నిర్వికారము అచలము, పరిపూర్ణము.

అష్ట ప్రకృతులను పరాప్రకృతి అంటారు. ఇది బ్రహ్మాండంలో చాలా సూక్ష్మంగా ఉన్నది. మీకు కనపడే ప్రకృతేమో పిండాండంలో నామరూపంగా ఉంది. దీనిని అపరాప్రకృతి అన్నాము. పరాప్రకృతిలో మహతత్త్వము, ఆ మహతత్త్వమే సృష్టికి మూలము, గడ్డిపరక మొదలు బ్రహ్మము వరకు. సృష్టి అంటేనే కల్పితము. కల్పించబడ్డాయి. ఈ సమస్త ఆకారాలైనాయి. అయితే ఆధ్యాత్మిక ప్రయాణాన్ని ఊర్ధ్వముఖం అందాం. ఉద్ధరించడం అంటే ఉత్ పైకి, పై దానిని ధారణ చేసి అనుభవం పొందటం (ఉత్ ధరించడం) ఆత్మానాం ఉద్ధరేత్ ఆత్మానం. ఉద్ధరణ అనే మాటను పైకి అనే మాటగా వాడుతున్నాము. పైకి అనేటువంటి ఆనవాయితీ ఉందిగా! పైకి వెళితే పరబ్రహ్మమని, కిందికి దిగిపోతే జీవుడని పరమపదసోపాన పటంలో కూడ పరమపదంపైనే ఉంటుంది. జీవస్థాయి క్రింద ఉంటుంది. వాడు పాములు కరిపించుకోకుండా జాగ్రత్తగా, నిచ్చెనలు ఎక్కుతూ పరమపద సోపాన పటంలో పైకి వెళతాడు. పరబ్రహ్మ పైన ఉన్నాడు. సృష్టి అంతా కిందకి దిగింది అనే లెక్కలో చూస్తాము. శక్తేమో భూమిలో ఉంది. కొమ్మలు, రెమ్మలు, ఫలాలు పైన ఉన్నవి. కాని బ్రహ్మమేమో పైన ఉన్నాడు. నామరూప సృష్టి క్రిందికి వచ్చింది. అందుకని, ఊర్ధ్వమూలం అథః శాఖా అంటున్నాము

చెట్టుతో పోల్చారు సృష్టిని. ఇక్కడ బ్రహ్మ దగ్గర అబీజం చెయ్యాలి : భూమిలో పాతిన విత్తనాన్ని లేక బీజాన్ని అబీజం చెయ్యటం అంటే అర్థం ఏమిటి? ఆ బీజంలో ఉన్న బీజశక్తి నశించాలి. వేయించిన విత్తనం ఉందనుకో, మొలకెత్తదు. విత్తనం వేయిస్తే బీజశక్తి మాడిపోయి అబీజం అవుతుంది. కనుక ఏ బ్రహ్మ నుంచి సృష్టి వచ్చిందో, ఆ బ్రహ్మ దగ్గరకి వెళ్ళి ఆ బ్రహ్మకు సృష్టి రావడానికి ఏది బీజరూపం ఉందో దానిని మనం విచారణ చేసి బోధను అందుకుని, అదంతా మాయ అనే గీతకు ఇవతలే ఉన్నది అని తెలిస్తే మాయలో ఉన్నదంతా లేనిది గనుక, మాయ ఆవల ఏది ఉన్నదో అదే నా స్వస్వరూపము. అదే నా పరమ గమ్యము, అదే నా లక్ష్యము. అది అవటమే అద్వైతము సిద్ధించుట అని నిర్ణయము.

మాయకు ఆవల ఏదైతే ఉన్నదో **'అది'** అయి వుండటమే మన లక్ష్యము. అద్వైత సిద్ధి అంటే రెండవది లేనిది. **ఏకమేవా అద్వయం బ్రహ్మ. నేహ నానా అస్తి కించనః** నానాత్వములనెడి భేదములనెడివి కొంచెము కూడా లేవు. అందుకని సగుణ బ్రహ్మనుంచి నిర్గుణ బ్రహ్మ కావడానికి ఏ బీజముచేత ఈ సృష్టి వచ్చిందో, సాధనచేత ఆ బ్రహ్మ వద్దకెళ్ళి, అక్కడ అబీజం చేసుకున్నపుడు, అక్కడ అచల పరిపూర్ణం సిద్ధిస్తుంది.

**శాఖాపల్లవ వివర్జితం :** ఇది చెయ్యాలంటే ఏమి చెయ్యాలి? కిందనుంచి నరుక్కుంటూ రావాలి. పుష్పం నాస్తి ఫలం నాస్తి, పాప పుణ్యాలు కానీ జన్మకర్మలు ఇవన్నీ లేవు అని నిర్ణయము.

**వృక్ష వర్జితం :** అసలు వృక్షమే లేదు. బీజమే లేదు. బీజమే మాయాశక్తి. మాయాశక్తి అవడం చేత మాయలేదు. లేని మాయ అయినపుడు లేని మాయ వలన వచ్చిన వృక్షము లేదు. లేని మాయ వలన వచ్చిన జగత్తు లేనిదే.

**శ్లో॥ సర్వం శూన్యమయం రూపం । జన్మ శూన్యం స్వభావతః ।**
**జన్మభావేన మృత్యుశ్చ । పరిపూర్ణం స్వభావతః ॥**

అచల పరిపూర్ణమనే నిర్ణయమందు, సర్వమూ శూన్యమే. కనిపించే రూపాలన్నీ పోతే, అంతా శూన్యమయమే. తన్మాత్ర సృష్టి ఎంతరకు సూక్ష్మ, స్థూల రూపాలుగా విస్తరించి ఉన్నదో, అదంతా మిథ్య గనుక, అంతా శూన్యమే.

బయలున్నదంటే, **జన్మ శూన్యము,** జన్మ ఉన్నదనే భావమే శూన్యము. మృత్యువు ఉన్నదనేది కూడా శూన్యమే. ఏమీ లేదనేది దాని స్వభావము. అదే సమయములో అచల పరిపూర్ణమే బట్టబయలై ఉన్నదనేది స్వతఃసిద్ధము. దీనియందు భావరూప, నామరూపమై యుండే ఎరుక ఉండే అవకాశమే లేదు. ఉందీ అంటే, అదంతా భ్రాంతి రూపమే గాని, విచారిస్తే ఏమీ లేదు.

**శ్లో॥ యథానాహం తథాశుద్ధం । తస్మాత్ శుద్ధే న నిర్ణయః ।**
**జగదస్తీతి కోఽ వేదః । నాస్తికో న చ నిర్ణయః ॥**

**యథానాహంతథా శుద్ధం :** నేను, నేను అనే ఎరుక ఏ ప్రకారముగా ఉన్నదో అదే ప్రకారము భ్రాంతి ఉంటుంది గాని, అచల పరిపూర్ణము ఎరుక పద్ధతిగా లేదు. కనుక నాహం అంటే నేననే ఎరుక లేదని నిర్ణయము. నేను లేకపోయిన వెనుక ఇది జగత్తు అని ఎవరికెరుక? నాహం అయితే జీవేశ్వర జగత్తులు ఎవరికెరుక? అవన్నీ లేవనే ఎరుక కూడా లేదనేది నిర్ణయము.

**శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మా । దేహోనాస్తి కదాచన ।**
**అస్తినాస్తీ తికోఽ వేదః । నిర్ణయమోనాస్తి సర్వదా ॥**

**ఆత్మాతీతం కేవలాత్మా :** ఆత్మ స్పందము ఉంటే అది ఎరుకే. ఆత్మ స్పందము ఆగిపోయి నిశ్చలమైతే అది ఆత్మాతీతం, అనగా కేవలాత్మ అట్టి కేవలాత్మకు అష్టతనువులు లేవు. ఉపాధులు లేవు. త్రిగుణాలు లేవు. ఆ కేవలాత్మను ఘనరూప అఖండ ఎరుక అంటారు. అది తిరిగిరాని ఆత్మాతీతమైతే, ఉన్నది బయలే.

విద్ అంటే తెలివి. **"బ్రహ్మ విద్ బ్రహ్మైవ భవతి"**. బ్రహ్మను తెలుసుకున్నవాడు బ్రహ్మమే అయివుంటాడు. తెలియకపోవడం వల్లనే అజ్ఞానంలో అనేకంగా ఉంటాడు. అనేకంలోనే ఇది కాదు, ఇది కాదు అనేటటువంటి, తన్నుతాను విడుదల చేసుకున్నటువంటి స్థితిలో, ఆవరణ దోషం పోయిన తరువాత, తాను ఏదై ఉన్నాడో, అదే అయివుంటాడు. తాను ఏదై ఉన్నాడో అనే ఎఱుక ఉంటేనేమో సోహం. ఇక్కడ ఎఱుకను తీసేసి, బయలు నిర్ణయం చేశాము కదా! కనుక ప్రపంచం ఉందా? ఎఱుక ఉంటే ప్రపంచం ఉంది అంటాం. నేతి నేతి ద్వారా ప్రపంచంలేదు. ఇంకేదీ లేదు అన్నావు కదా! లేదు అన్నవాడు ఎఱుకగా ఉన్నాడుగా! అందుకని ఉంది అనేవాడు, లేదు అనేవాడు కూడా ఎఱుకలో ఉన్నాడు కాబట్టి, ఉందనే ఎఱుక, లేదనే ఎఱుక లేవు. అంటే, ఎఱుక లేదు, బయలే ఉన్నది. వేదః అంటే ఎఱుక. వేదాంతము అంటే ఎఱుక యొక్క అంతము. ఎఱుక యొక్క అంతము బయలే. అందుకనే వేదములు చదివిన తరువాత, చివరకు వేదాంతములోకి వెళ్ళాలి. వేదములు అన్నీ ఎఱుకలో ఉన్నాయి. ఎఱుగబడేది లేనప్పుడు బుద్ధియే ప్రజ్ఞానం అయినది. స్థిర బుద్ధియే ప్రజ్ఞానం. అస్థిరమైన బుద్ధియే మనస్సు. మనస్సు పోతే నిర్ణయము చేయనటువంటి బుద్ధియే ప్రజ్ఞ. అట్టి ప్రజ్ఞ ఉన్నప్పుడు, చిత్ ఆనందమైనటువంటి లక్షణముచేత అది బ్రహ్మ. అందుకని **"ప్రజ్ఞానం బ్రహ్మ"** లక్షణవాక్యం. లక్షణాలను నీమీద ఆపాదించుకున్నప్పుడు, బ్రహ్మయొక్క లక్షణాలతో టాలీ అయినప్పుడైతే, **"ప్రజ్ఞానం బ్రహ్మ". "ప్రజ్ఞానం బ్రహ్మ"** అంటే ఎఱిగే ఎఱుక. ఎఱిగే ఎఱుక ఉందంటే, బయలు కాదు. కనుక వేదాలు చెబుతున్నాయంటే, ఎఱుక గురించే. కాని ఎఱుక యొక్క సమాప్తి గురించి చెప్పేది వేదాంతము. వేదాంతములో అచల పరిపూర్ణము నిర్ణయమై ఉంటుంది. వేదాంతంలో అస్తి, నాస్తి, ఇతికోఽ వేదః ఉన్నానని గాని, లేననిగాని ఎలా తెలుస్తుంది? నిర్ణయోనాస్తిః అంటే నిర్ణయించే ఎరుక కూడా లేదాయె.

**నిర్ణయోనాస్తి సర్వదాః** బయలు అయిన వాడు ఏ నిర్ణయం చేస్తాడు? నిర్ణయం చేయాలి అంటే ఎఱుకలో ఉండాలి కదా! ఎఱుకలో ఉంటే భ్రాంతేగా! సర్వ శూన్యములు లేవంటున్నాడు. జగతి అన్నది కూడా లేదని అంటున్నాడు. క్రిందటి శ్లోకములో నిర్ణయం ఎలా చేస్తాడు? అని అడిగారు. ఈ శ్లోకంలో నిర్ణయం ఎప్పటికీ ఉండదు అన్నారు. అక్కడ ప్రశ్నించాడు, ఇక్కడ నిర్ణయం చేసి వదిలేశాడు. నిర్ణయమై ఉండుట అంటే, బయలై ఉండుటే. ప్రకృతి ద్వయం అన్నారు. ఇదివరకు ఆత్మ అంటే పురుషుడు, అనాత్మ అంటే ప్రకృతి అన్నాము. ఆత్మని పురుషుడు అన్నాము. ఇప్పుడు పురుషుడు కూడా లేనివాడు అయితే, పురుషుడు కూడా మూడుగుణాలతో వచ్చినవాడే కదా! ప్రకృతి అంటేనే మూడుగుణాల సామ్యం. పురుషుడులో శుద్ధ సత్వగుణం ఉంది కాబట్టే, సత్ చిత్ ఆనందం అనే గుణం ఉన్నది. అదీ గుణమేగా! త్రిగుణ రహితంలో సత్ చిత్ ఆనందం పోతుంది. అహం అన్నా, ప్రజ్ఞానం అన్నా, ఎరిగే ఎఱుక అన్నా, బింబ ఎఱుక అన్నా, అంతఃకరణ ప్రతిబింబ ఎఱుక అన్నా, ఇవన్నీ నిజ ఉనికిలో లేవు. అందువలన ఇవన్నీ నిజానికి లేవు. నిజమునకు బయలే ఉన్నది. అప్పుడు నేను అదే అయిఉన్నాను అని కాదు. సోహం కూడా ఎఱుకే అయినప్పుడు, ఎఱుక లేకుండా పోయి, పరిపూర్ణమే ఉంటే, అనగా బయలై ఉన్నప్పుడు ఎరిగేవాడు లేడు, ఎఱుగ బడేదీ లేదు. అహం రూపంలో ఎఱుక, మాయ రూపంలో ఎఱుక, అజ్ఞాన దోషంలో ఎఱుక, చైతన్య రూపంలో ఎఱుక ఉన్నా, శుద్ధ సత్వంలో ఉన్న ఎఱుక, సత్ చిత్ ఆనందంలో ఉన్న ఎఱుక, ఇవన్నీ పరోక్షమే. ఉపాధి దోషమే. మాయోపాధిలో

ఉన్నవాడే, శుద్ధ సత్వగుణంలో ఉండి, సత్ చిత్ ఆనందం అనే అనుభవం పొందుతున్నాడు. వాటిని అధిగమిస్తూ, ఉపాధి దోషం పోతే, ఏ సచ్చిదానందం అనేటటువంటి పరోక్ష అనుభవం, మాయ ఆవరణయందు ఉన్నదో, అది శుద్ధ సత్వగుణం అయ్యిందో, అదే త్రిగుణ రహితం. శుద్ధ సత్వగుణం – విశుద్ధ సత్వగుణం అయ్యింది. విశుద్ధ సత్వగుణం అంటే, నిజానికి త్రిగుణ రహితమే. త్రిగుణ రహితమైనప్పుడు, సత్వగుణంలో ఉన్నటువంటి పరోక్ష అనుభవము, సత్ చిత్ ఆనందము అనేటటువంటి, పరోక్ష అనుభవము, గుణరహితము అయ్యేసరికి, అనుభవ రహితము అయ్యింది. సద్రూపము లేదు, చిద్రూపము లేదు, ఆనందము లేదు. ఈ మూడు లేకపోయినవి.

ఈ మూడూ లేకుండా పోతే, ఇంకా ఎవరు ఉంటారు? నిర్ణయం చేసేవాళ్ళు ఎవరు? ఎఱుక ఉంటే, ఎఱుకలో ఉన్నవాడే, సర్వమూ నిర్ణయము చేస్తాడు. ఎఱుక పోయి, బయలు అయ్యాక. నిర్ణయము నాస్తి. నిర్ణయము చేయడమంటే ఇది ఉన్నది, ఇది ఉన్నది అని కాని, ఇది లేనిది, ఇది లేనిది అని కాని బుద్ధిలో జరిగేటటువంటి నిర్ణయము, ఇవన్నీ ఎఱుకే కనుక, బయలైనటువంటి సందర్భములో ఎఱుక లేనే లేదు కాబట్టి, నిర్ణయము నాస్తి. బయలు శాశ్వతము కాబట్టి, సదాసర్వదా బయలే ఉన్నది. కనుక నిర్ణయాలు కూడా లేనివే. ప్రకృతి ద్వయం అయినప్పుడు అనాత్మ–ఆత్మ రెండూ లేవు. ఆత్మ కూడా ప్రకృతి అయిపోయింది. ఎందుకని? శుద్ధ సత్వగుణం కాబట్టి, ప్రకృతే. ప్రకృతి ద్వయం అని ఎందుకు అంటున్నాడు? ఇంతకు ముందు అనాత్మని మాత్రమే ప్రకృతి అన్నాము. ఇక్కడకు వచ్చేసరికి ఆత్మను కూడా ప్రకృతి అన్నాము. అంతకుముందు జడాన్ని ప్రకృతి అన్నాము. ఇప్పుడు చిత్‌ని కూడా ప్రకృతి అన్నాము. చిత్ జడములు రెండూ ప్రకృతి ద్వయం. ప్రకృతి ద్వయం నాస్తి. అందుకే ఆత్మ, అనాత్మ నాస్తి. అందుకే మనకి మంగళహారతిలో అజ్ఞానము లేదు, జ్ఞానము లేదు, దానికి అతీతము అన్నాము. **జ్ఞానమనుట అనరాదమ్మా! అజ్ఞానమనుట కది లేదమ్మా! జ్ఞానాజ్ఞానములోన ఒక్కటియు తానుగాక, శూన్యానికి మీరిన అశరీర గురువునకు మంగళమనరమ్మా!** మంగళం అంటే ఏమి చెబుతున్నాము? సర్వమూ శూన్యము చేయడమే! సర్వమూ లేకపోవడమే. సర్వమూ, శూన్యమూ – రెండూ లేకపోవుటయే, బయలై ఉండటము లేక మంగళము.

బయలై ఉండుటయే పరిపూర్ణము. బయలై ఉండటమే శుభప్రదము, మంగళకరము ఎందుకంటే, అది తిరిగి రాని మోక్షము కనుక.

**శ్లో॥ బిందువుః పూర్ణేలయం యాతి । నిర్బీజం భవతి ధృవం।**
**జ్ఞాతృజ్ఞేయాదికం నాస్తి । నాస్తి విద్యాత్మ నిశ్చయం ॥**

నాద బిందు కళల్లో బిందువు ఉంది. ఈ బిందువే పురుషోత్తముడు. ఈ బిందువులోనుంచే విశ్వము ఆవిర్భవించింది. ఈ బిందువే పూర్ణము. పూర్ణమనబడే బిందువు ఏదైతే ఉందో, అది లయం యాతి. అది కూడా లయం అయ్యే స్వభావం కలిగియుంది. ఎందుకని? మండల త్రయము ఏర్పడక ముందు, బిందువులు లేవు. ప్రకాశ బిందువు లేదు, విమర్శ బిందువు లేదు, మిశ్రమ బిందువు లేదు. చంద్రమండలము లేదు, అగ్ని మండలము లేదు, సూర్యమండలము లేదు. ఈ బిందు త్రయము త్రికోణాకారముగా కలిపినప్పుడు, దాంట్లో తోచినటువంటి ప్రజ్ఞ అనే ఎఱుక లేదు. ఎప్పుడైతే లేదో, మండలత్రయము అనే కళలు లేవు. మండలత్రయ ప్రకాశము లేదు. మండలత్రయ ప్రకాశములు మూడూ ఎప్పుడైతే లేవో, అప్పుడు నిష్కళ. నిష్కళ అంటే, ఎఱుక యొక్క లేనితనము. కళ అంటే ఎఱుక. గమ్యం చేరుకున్నప్పటికీ తనలో ఘనరూప ఎరుక అఖండంగా, అవ్యక్తంగా ఉన్నప్పటికి, అది మళ్ళీ విజ్ఞానరూప ఖండ ఎరుకలుగా ఎఱుకలోకి దిగే అవకాశం ఉంది. నిర్గుణంలో మూడు గుణాలు అవ్యక్తంగా ఉన్నాయి కనుక, అవ్యక్తానుభవము నిర్గుణము. అపరోక్షానుభూతిగా ఉంటుంది. అద్వైత మతస్థులకు నిర్గుణమే పరబ్రహ్మ. అద్వైత సిద్ధాంతులకు త్రిగుణ రహితమైనటువంటిది పరబ్రహ్మ. మత పద్ధతిలో నిర్గుణమే పరబ్రహ్మ. సిద్ధాంత పద్ధతిలో ఉన్నది త్రిగుణ రహితమైన పరబ్రహ్మ. అదే వస్తు నిర్ణయముగా, అచల పరిపూర్ణముగా ఉన్న పరబ్రహ్మ.

రెండవది ఏమిటంటే సచ్ఛిష్యుడు సాధన పద్ధతిలో, గమ్యం చేరిన స్థితిలో తిరిగి రానటువంటి పరిపూర్ణ బోధలో, గ్రహించినటువంటి, వర్ణించినటువంటి వార్తీక నిర్ణయ పద్ధతిగా, తాను లేనివాడుగా, లేనటువంటి శిష్యుడులో, ఈ నిర్గుణము, ఆ త్రిగుణ రహితము ఒక్కటే! అందుకని ఆ పరిపూర్ణబోధ లేకుండా, నిర్ణయమైనవాడు, నిర్గుణమైనవాడు తిరిగి వస్తాడు. నిర్ణయం నాస్తి. నిర్ణయాలు చేసే ఎఱుక లేనప్పుడు, అది బయలు కనుక ఇక తిరిగిరాడు. నిర్గుణానికి, త్రిగుణ రహితానికి ఉన్న తేడా ఏమిటంటే, అపరోక్షానుభూతిలో ఆ రెండూ సమానమైనప్పుడు సమానమే కాని, నిర్గుణములో సగుణం అయ్యే ఆస్కారము

ఉన్నది, కాని త్రిగుణ రహితంలో అది లేదు. శిష్యుడి యొక్క ప్రయాణంలో, సగుణ, నిరుణాతీతమైన త్రిగుణ రహితమును విడమర్చి చెప్పడమే పరిపూర్ణబోధ. ఇదే అచల సిద్ధాంతము. అచల సిద్ధాంతము మతాతీతము. అద్వైత సిద్ధాంతములో నిర్గుణమే ముగింపు. పరిపూర్ణబోధలో ఆ నిర్గుణ బ్రహ్మమే తిరిగి రాదు కనుక, తిరిగి సగుణము కాదు. గనుక ఆ త్రిగుణ రహితమైనటువంటి అచల పరిపూర్ణ పరబ్రహ్మ నిర్ణయము. మరి ఇప్పుడు నాదబిందు కళలు ఉన్నాయా? లేవా? నాదబిందు కళలు కూడా ఎఱుకలోనే ఉన్నాయి. బయలు కాదు.

సర్వము, అనంతమూ కూడా పూర్ణమే. శూన్యమైనది కూడా పూర్ణమే. పూర్ణమంటే, సున్నాని పూర్ణం అంటాం. అనంతాన్ని కూడా పూర్ణం అంటాం. అందుకని పరిపూర్ణం అనే నిర్ణయానికి వెళ్ళాలి తప్ప. ఇదీ పూర్ణము, అదీ పూర్ణము, ఈ పూర్ణములో ఆ పూర్ణము తీసేస్తే, పూర్ణమే ఉన్నది, ఆ పూర్ణమునకు ఈ పూర్ణము కలిపితే, పూర్ణమే ఉన్నది అనే లెక్కలను తీసేస్తే అదే బయలు. అప్పుడు పూర్ణముకంటే అతీతమైనది పరిపూర్ణము. పరిపూర్ణమందు, లయంయాతి – బిందురూపముగా ఉన్నపూర్ణము లయమైపోతుంది. ఇక్కడ లయం అంటే, మళ్ళీ పునరుత్పత్తి అవుతుందని కాదు, లేనిది లేకుండా పోతుంది. భ్రాంతి రహితమౌతుంది. **నిర్బీజం భవతి ధృవం**. ఎప్పుడైతే ఖచ్చితముగా నిర్బీజం అవుతుందో, ఎప్పుడైతే బయలు నిర్ణయాన్ని చేశాడో, అచల పరిపూర్ణ నిర్ణయాన్ని చేశాడో, అప్పుడు త్రిగుణములకు సంబంధించినటువంటి బీజావస్థ కూడా పోయి నిర్బీజం అవుతుంది.

నిర్బీజం అయినప్పుడు ఏమీలేదు. అయితే బీజం అనేది ఉంటేనే, గుణములు సామ్యానికి వచ్చి ప్రకృతి అవుతుంది. సామ్యస్థితి నుంచి మూలానికి వెళ్తే, మూల ప్రకృతి అవుతుంది. మూలప్రకృతిలో మూడు గుణములు బీజావస్థలో ఉన్నాయి. మూలప్రకృతిలో మూడుగుణములు నిర్బీజం అయితే మూలప్రకృతి లేదు. ఇది త్రిగుణ రహితం. త్రిగుణ రహితం అయితే ఉన్నది బయలే. బయలు త్రిగుణ రహితం. కనుక బయలే అన్ని కాలాల్లో ఉన్నప్పుడు, ఎఱుక లేనే లేదని అన్నప్పుడు, ఏదైతే లేనిది ఉన్నట్లుగా అయినప్పుడు, అనగా భ్రాంతిలో కారణాలు ఉన్నప్పుడు, భ్రాంతిలోనే ఎఱుకలోనే, మాయలోనే ఉంటాము. ఇంకా క్రిందికి దిగితే, అజ్ఞానంలో, అవిద్యలో మలత్రయ దోషాలతో ఉంటాము. ఆవరణ ఆధ్యాస విక్షేప దోషాలతో ఉంటాము. ఇంకా క్రిందికి దిగితే సంసారం ఉంటుంది. బంధం ఉంటుంది. దుఃఖం ఉంటుంది. మరీ క్రిందకి దిగవద్దు. మూలప్రకృతిలో ఉన్నటువంటి మూడు గుణాల బీజాలని నిర్బీజం చేద్దాము. ఆ నిర్బీజంగానే గనుక జరిగితే **ధృవం**. అంటే బయలే ఖచ్చితం. బయలే ఎట్టి సందేహము లేకుండా ఉంది. భ్రాంతిలో ఉన్నవాళ్ళకి చెప్తున్నాము. ఎఱుకతో వింటున్నారు మీరు. బయలే అని వినేవాడు ఏడి?

**జ్ఞాతృజ్ఞేయాదికం నాస్తి**. జ్ఞేయవస్తువు అయిన పరబ్రహ్మము, అది నేనై ఉన్నాను అనే జ్ఞాత, గురువుగారు ఉపదేశించినటువంటి బోధ, అహం బ్రహ్మాస్మి అనేటటువంటి మంత్రోపదేశంతో జ్ఞాత, జ్ఞేయమైన పరమాత్మ తానని ఆ జ్ఞేయమైనటువంటి పరబ్రహ్మ అద్వయమని, జ్ఞేయవస్తువే ఉన్నదని, జ్ఞాత జ్ఞేయవస్తు రూపమై, ఏ జ్ఞేయ వస్తువు రూపమైనటువంటి జ్ఞాతలో జ్ఞాతృత్వం పోయిందో, ఎప్పుడైతే జ్ఞేయవస్తువు కూడా లేకుండా పోయిందో, త్రిపుటిరూప ఎరుక లేదు. అది అవ్యక్తం. ఇప్పుడు మన లెక్కలో అది త్రిగుణ రహితం, అచలము, పరిపూర్ణము. జ్ఞేయవస్తువు ఎప్పుడైతే పరిపూర్ణం అయ్యిందో, అప్పుడు ఎఱుక లేదు. అంటే జ్ఞేయవస్తువు అనే ఎఱుక కాని, జ్ఞేయవస్తువుని నేను తెలుసుకుంటున్నాను అనే జ్ఞాతృత్వం కాని, జ్ఞాతృత్వంలో ఉన్న జ్ఞానము ఎప్పుడైతే లేదో, జ్ఞాతృజ్ఞేయాలు లేవు. జ్ఞాతృజ్ఞేయం నాస్తి. ద్విపుటి చెబుతున్నాడు ఇక్కడ. త్రిపుటి చెప్పడం లేదు. జ్ఞాతృం, జ్ఞేయం, జ్ఞానం సంగతి చెప్పడం లేదు. జ్ఞానం అంటే ఎఱుకే అన్నాముగా! అందువలన ఇప్పుడు జ్ఞానాన్ని విడగొడుతున్నాము. ద్విపుటి ఉంది. జ్ఞాతయేమో అహం బ్రహ్మ అంటున్నాడు. అహం బ్రహ్మని అచల నిర్ణయంగా, బయలు పద్ధతిలో నిరశిస్తున్నాడు గురువు. అటువంటి గురువు ఉపదేశంతో జ్ఞేయవస్తువు అనేటటువంటిది ఎఱుక లేని బయలే అయ్యేసరికి ఆ జ్ఞేయవస్తువు తానే అయ్యేసరికి, జ్ఞాత కూడా బయలే అయినప్పుడు జ్ఞాతృత్వం లేదు. జ్ఞాతృజ్ఞేయ మొదలైనటువంటివి లేవు. నాస్తి.

**<u>నాస్తి విద్యాత్మ నిశ్చయం</u> :** విద్యాత్మ అంటే జ్ఞానం. విద్యాత్మ అంటే ఎరుక బ్రహ్మము. అటువంటిది ఎఱుక పద్ధతిలో కూడా లేదు. జ్ఞానం కూడా భ్రాంతే. వేదాంతమందు ఎఱుక యొక్క అంతం బయలే ఉన్నది. కనుక విద్యాత్మ లేదనే నిర్ణయం.

**నాస్తి విద్యాత్మ నిశ్చయం**. ఇది జ్ఞాన రూప ఆత్మ కూడా లేనిదే. అంటే బయలు నిర్ణయమందు ఇవన్నీ కూడా లేవు కాబట్టి ఇవన్నీ లేనివి అయినవి. త్రిపుటి ద్విపుటి రహితం. త్రిగుణ రహితము. మాయా రహితము. ఎఱుక లేకపోవుట – ఎఱుక రహితము. ఇదీ బయలు నిర్ణయము.

**శ్లో॥ మూలచ్ఛేదో మహాపూర్ణః । కళాతీతో సదా౽మలః**
**మూలాభావమిదం దేహం । కిం నాస్తి త్యత్యననుస్మరేత్**

మూలము కానరానిది, మూలము లేనిది, మూలము ఉన్నదని ప్రయాణము చేశాము. లక్ష్యము మూలము మోక్షమని ప్రయాణము చేశాము. ఇక్కడ జ్ఞాతృ జ్ఞానము జ్ఞేయము ఎప్పుడైతే లేక, వాటి ప్రతీతియే లేక వాటి యొక్క ప్రాశస్త్యము లేక, బయలే ఉంటే, బయలందు ఎఱుక లేకపోతే, నీకు మూలమేది? త్రిగుణాత్మక మాయ వల్లనే సర్వమూ శూన్యమూ ఉన్నవి. త్రిగుణ రహితమైనప్పుడు సర్వ శూన్యములు లేనివే. నేను అనేటటువంటి ఈ ప్రకృతి లేనిదే.

ఈ ఎఱుక కూడా లేనిదే. ప్రజ్ఞానం అయినటువంటి ఈ బ్రహ్మ కూడా లేనిదే. బ్రహ్మ ఉన్నది కరక్టే, అయితే బయలే బ్రహ్మముగా ఉన్నది. బయలు అయినటువంటి బ్రహ్మ, తన్ను తాను ఎరుగడు. బయలు తనను తాను ఎరుగదు. మరి ప్రయాణం చేసేవాడు తన మూలానికి వెళ్తున్నాడుగా. ఇంతకుముందు చెప్పినటువంటి శ్లోకములో

**ఊర్ధ్వమూలం అథశ్శాఖః** అన్నాము. శాఖలు, పిందెలు, పళ్ళు, రెమ్మలు కాండానికి వెళ్ళి, కాండాన్నుంచి మూలానికి వెళ్ళాము. ఈ మూలం చెట్టుకి క్రింద ఉంది. సృష్టిలో పైన ఉంది. ఊర్ధ్వమూలం, శాఖలు క్రిందకి ఉన్నాయి. క్రిందవన్నీ అజ్ఞానమనే ఖండ ఎరుకలు. పైన ఉన్నది బ్రహ్మజ్ఞానమనే అఖండ ఎరుక. క్రింద, పైన అని చెప్పడము సాంప్రదాయము. అసలు దశ దిక్కులు ఉన్నాయా? దిగంబరమైనది అంటే దిక్కులు శూన్యమైనది. అంబరం అంటే శూన్యం, ఆకాశము. ఆకాశంలో దిక్కులు వున్నాయా? సూర్యునిబట్టో, దేనినిబట్టో ఉన్నాయి. సూర్యుడు లేకపోతే, సాపేక్ష నిర్ణయం లేకపోతే, దిక్కులు ఎలా చెప్తారు? భూమికి దిక్కులు ఉన్నాయి. సూర్యోదయం సూర్యాస్తమయం దానిని బట్టి తూర్పు పడమర అంటున్నాము. దిక్సూచిని బట్టి దిక్కులు చెబుతున్నాము. సర్వము శూన్యము. అప్పుడు ఆకాశమే ఉన్నది అనుకో. ఆకర్షణ వికర్షణల వల్ల కలిగే అనుభవాన్ని ఎఱుకే అంటాము. అప్పుడు ఎఱుక లేకపోతే దిక్కులు ఎక్కడ ఉంటాయి? దిక్కులు వస్త్రముగా కలవాడు దిగంబరుడు. అంటే బయలే అని అర్థము. దిగ అంటే క్రిందికి దిగడం. పైకి ఎక్కినవాడు క్రిందికి దిగడుగా. దిగాడు అంటే అంబరుడు. వస్త్రములను విడిచినవాడు. వస్త్రములు అంటే ఏమిటి? అష్టతనువులు, ఎనిమిది శరీరాలు. ఎనిమిదీ వస్త్రాలే. పరమాత్మ అనే వస్త్రం కూడా పోతే చివరకి ఏం మిగిలింది? బయలే. కనుక దిగంబరుడు అంటే బయలు.

పెదకందార్థాలలో గురువుగారు తమ గురువుని ప్రార్థిస్తాడు. దిగంబరేశుడనే గురువుకు మ్రొక్కుతాడు, స్తుతిస్తాడు. కందార్థాలలో ప్రారంభించేటప్పుడు గురుప్రార్థనలల్లో దిగంబరేశుడు అంటే అప్పుడు ఎవడయ్యాడు? బయలైనవాడే. ఈశ్వరుడంటే లేని ఎఱుకలో గురుడయ్యాడు. దిగంబరుడే ఈశ్వరుడై గురుడైనప్పుడు అశరీర గురువన్నమాట. దిగంబరేశ్వరుడు అంటే అశరీర గురువు. మరి మూలం ఉందా? బయలు నుంచి ఏదీ పుట్టదు. బయలు నుండి ఏదీ లయం కాదు. కనుక ఎఱుక ప్రయాణం చేసేవాడు. లేని వస్తువులను పరిత్యాగం చేసి, అప్పడే జ్ఞేయరూపమై బయలైనప్పుడు జ్ఞాత లేనప్పుడు, సర్వమూ శూన్యమైనప్పుడు, త్రిగుణ రహితమై, ఎఱుక రహితమై, ఈ పదాల యొక్క అర్థమేదో, ఆ అర్థమే బాహ్యమై, బాహ్యమే బ్రహ్మమై యున్నది. ఈ బ్రహ్మము అన్ని కాలాలలో ఉన్నది ఉన్నట్లు ఉన్నది. ఈ బ్రహ్మము కంటే అన్యము లేదు. బ్రహ్మములో సృష్టించే సామర్థ్యము లేదు. బ్రహ్మము అన్యము కాలేదు. అన్యము అనేటటువంటి ఎఱుకకు బ్రహ్మము మూలము కాదు. మూలచ్ఛేదో అంటే ఎఱుకచ్ఛేదో మూలము లేని గుర్తెరిగే శరీరాలు ఏమీ లేవు అని షోడశీ. **మూలచ్ఛేదోః మహాపూర్ణః** ఎరుక మూలమును ఛేదిస్తే అదే పరిపూర్ణం. **కళాతీతోః** కళలు ఎట్లా వున్నాయి? ఎన్ని కళలు ఉన్నాయి? కళలు అంటే ఏమిటి? చంద్రమండలములో ప్రకాశము యొక్క వృద్ధి క్షీణాలు చంద్ర కళలు. పరమాత్మ యొక్క ప్రకాశమే కళ. పరమాత్మ ప్రకాశం ప్రకృతితో కలిసినప్పుడు, ప్రకృతి యొక్క వికారాలు, ఆ పరమాత్మ నందు ఆపాదించబడ్డప్పుడు ఈ కళలు చిత్కళలై, చిత్కళా దర్శనాలు తారకంలో కొందరికి అనుభవానికి వస్తాయి. కళాతీతో అంటే ఏ కళాలేదు. చంద్రుడికి ఎన్నికళలు ఉన్నాయి?

పౌర్ణమి నుంచి పాడ్యమి దాకా పదిహేను కళలు. పౌర్ణమి పూర్ణ కళ. పౌర్ణమి నుంచి చతుర్దశి వరకూ మళ్ళీ పద్నాలుగు ఉన్నాయి. వృద్ధి చెందేటప్పుడు ఏవైతే ఉన్నాయో క్షీణించేటప్పుడు కూడా ఆ పద్నాలుగు కళలు ఉన్నాయి. పూర్ణకళ ఒక్కటే. అమావాస్య వచ్చేసరికి నిష్కళ. ఇప్పుడు ఎన్ని ఉన్నాయి? పద్నాలుగు కళలు పౌర్ణమి అమావాస్య. మొత్తం పదహారు కళలు అయినాయి, షోడశ కళలు. ఇప్పుడు కళాతీతో అంటే షోడశ కళలు లేవు. అంటే అమావాస్య అయినటువంటి నిష్కళ కూడా లేదు. ఎందుకంటే మళ్ళీ పాడ్యమితో కళలు ప్రారంభమై వృద్ధి చెందుతాయి. ఈ నిష్కళలో తిరిగి కళలు వ్యక్తమయ్యే అవకాశమున్నది. సహజంగా శాశ్వతముగా నిష్కళా రూపము అంటే బయలు.

బయలే నిష్కళ. అందువలన ఈ పదహారు కళలు లేనివి. బయలు నిర్ణయంలో నిష్కళ అంటే శాశ్వతము, ఎప్పటికీ దానినుండి సగుణమయ్యే కళలు తోచవు. బిందువు పోయింది. కళ పోయింది. చూడండి, నాద బిందు కళల్లో బిందువు తీసేశారు. **బిందువుః పూర్ణే లయం యాతి**. అది ఎట్లా పోయింది? బీజం ఏమిటి? మూలప్రకృతిలో ఉన్న మూడు గుణాలే బీజం. ఆ మూడుగుణాల బీజం నిర్బీజం అయితే తిరిగి సగుణం అయ్యే అవకాశం లేదు. మూడుగుణాలే ఎఱుకని పుట్టిస్తున్నాయి. నిర్బీజం అయినప్పుడు త్రిగుణ రహితం అయినప్పుడు ఎఱుకని పుట్టించేటటువంటి పద్ధతి పోయింది. అప్పుడు జ్ఞాతృజ్ఞేయం నాస్తి. జ్ఞాతృ అనే ఎఱుక, జ్ఞేయం అనే ఎఱుక పోయినాయి. మాయాశబలిత బ్రహ్మ పోయాడు. మాయాశబలిత బ్రహ్మ పోతే, మాయకు పరమై, ఎఱుకకు పరమై, త్రిగుణ రహితమై, ఉన్నది ఉన్నట్లు ఉండి, తిరిగి మళ్లీ ఎఱుకలోకి రాకుండా, మాయలోకి రాకుండా, తిరిగి సృష్టిలోకి రాకుండా, తిరిగి ఎఱుక పుట్టకుండా ఉంటే అది మాయాత్పరము అనగా బయలు.

తిరిగి మాయశబలిత బ్రహ్మ, లేక ఎఱుక బ్రహ్మగా కాకుండా ఉంటే, అది జ్ఞాతృ జ్ఞేయాదికం నాస్తి. ఏవిధమైన ఎఱుక లేనటువంటిది. **నాస్తి విద్యాత్మ నిశ్చయం**. జ్ఞానం, జ్ఞాత, జ్ఞేయము అనే త్రిపుటి ఉన్నది కదా! జ్ఞాతృ జ్ఞేయాలు పోయినాయి. ఇక నాస్తి విద్య అంటే, జ్ఞానము కూడా పోయింది. కనుక విద్యాత్మ లేదు. త్రిపుటిలో ఏ ఒక్కదానితో కూడా ఆత్మలేదు. ఆత్మ లేనప్పుడు మూడు విధాలైనటువంటి ఎఱుక శూన్యము. మూడు గుణాలు లేనప్పుడు బయలే ఉన్నది. కనుక విద్యాత్ముడు ఎక్కడ ఉన్నాడు? జ్ఞానాత్ముడు ఎక్కడ ఉన్నాడు? అందువలన జ్ఞానాతీతం. అంటే జ్ఞానానికి కూడా పరమైనది. జ్ఞానమే పరుడు అన్నప్పుడు పరమాత్మని సంబోధిస్తున్నాము. అజ్ఞానాన్ని సాపేక్షంగా చూస్తే, జ్ఞానమే పరము. కనుక జ్ఞానాతీతము అంటే పరాత్పరము. కనుక నాస్తి విద్యాత్మ అన్నప్పుడు అది పరాత్పరం, అంటే బయలు. పరమును కంటే పరమైనదేదో అది బయలు. అజ్ఞానానికి జ్ఞానం పరమైతే, జ్ఞానానికి పరమైనది బయలు. బిందువులో బీజం తోస్తోంది. దాన్ని నిర్బీజం చేశాం. ఇక ఎప్పటికీ అది రాదు. కూకటి వేళ్ళతో తీసేశాం. కాల్చేసిన విత్తులైనాక మరల మొలకెత్తవు. ఇక ఉత్పత్తి నాశనాలు ఉండవు. తెలుసుకునే వాడు జ్ఞాత లేడు. తెలుసుకునే ఎఱుక లేదు.

జ్ఞానమనే ఎఱుక లేదు. జ్ఞాత బయలే. జ్ఞేయము బయలే. జ్ఞానము బయలే. త్రిపుటి రహితమైతే బయలే ఉన్నది. త్రిపుటిలోని ఎఱుక మూడు విధాలైన ఎఱుక కూడా. దేనికి అదే బయలై ఉన్నది. కనుక త్రిపుటి రహితమైనది ఏదో ఆ బయలే శేషించినది. మూలచ్ఛేదో మహా పూర్ణః అన్నప్పుడు బయలు నిర్ణయంలో ఎఱుకపోయింది. అందుకే ఎరిగే ఎఱుకగా ఉన్న ప్రజ్ఞానం పోయింది. అహంబ్రహ్మలో అహం అనే ఎరుక పోయింది. పరమాత్మ జ్ఞానం పోయింది. ఇదం అనే ఎఱుక పోయింది. తత్వమసిలో త్వం అనే ఎఱుక, తత్ అనే ఎఱుక పోయాయి. త్వం ఎఱుకే, తత్ ఎఱుకే ఇక తత్వమసి వాక్యవల్ల ఏమి లాభం? ఒక ఎఱుకలో నుంచి మరొక ఎఱుకలోనికి వెళ్తాడు. త్వం అనేదేమో మాయావరణలో ఎఱుక. తత్ అనేది మాయలోనే ఘనరూపము. నిరావరణమందు త్రిగుణ రహితమై బయలే ఉన్నది. పునరావృత్తి లేకుండా చేసుకున్నప్పుడు ఏమి ఉన్నది ఇక్కడ? మూలచ్ఛేదమై మహాపూర్ణము ఉంది. కళాతీతం అయినది. శాశ్వత నిష్కళ అయినప్పుడు, నిష్కళ కూడా బయలైంది. అసలు కళలో మనయందు అవస్థలు ఎక్కడ ఉన్నాయండి?

జాగ్రత్‌లో జాగ్రదావస్థ– జాగ్రత్‌లో స్వప్నావస్థ, జాగ్రత్‌లో – సుషుప్త్యావస్థ, జాగ్రత్‌లో – తురీయం.

స్వప్నంలో జాగ్రదావస్థ – స్వప్నంలో స్వప్నావస్థ, స్వప్నంలో–సుషుప్త్యావస్థ, స్వప్నంలో–తురీయం.

సుషుప్తిలో జాగ్రదావస్థ – సుషుప్తిలో స్వప్నావస్థ, సుషుప్తిలో–సుషుప్త్యావస్థ, సుషుప్తిలో–తురీయం.

తురీయంలో జాగ్రదావస్థ – తురీయంలో స్వప్నావస్థ, తురీయంలో– సుషుప్త్యావస్థ, తురీయంలో తురీయం.

షోడశ కళలు కళాతీత స్థితి అంటే తురీయాతీతం కూడా లేదు. తురీయంలో తురీయం లేదు. తురీయాతీతమంటే నిర్గుణము. తురీయం అంటే సాక్షి. సాక్షిత్వం ఉన్నది. సాక్షిత్వంలో శుద్ధ సత్యగుణం ఉన్నది. ఏదైన సరే గుణం వుంది అక్కడ. తురీయాతీతంలో గుణం లేదు. సింపుల్‌గా చెప్తే, తురీయాతీతము నిష్కళ. బయలు నిర్ణయంగా చెప్తే, అక్కడినుంచి మళ్ళీ అవస్థలు వచ్చేటటువంటి ఆస్కారం లేదు. దానిని విడిచిపెడితే ఏమైంది? శుద్ధ సత్వగుణం లేకపోతే నిర్గుణం అయినప్పటికీ, ఆ తురీయాతీతములో సగుణం అయ్యే అవకాశం ఉన్నది. ఎరుక బీజావస్థలో ఉన్నది అవ్యక్తముగా ఉన్నది. నిర్బీజం అయితే త్రిగుణ రహితం అయ్యింది. ఈ త్రిగుణ రహిత స్థితిలో, ఈ కళాతీతము ఏదైతే ఉందో, అది శాశ్వతంగా నిష్కళే కనుక అది బయలు. **సదామలః** అన్నాడు. మలము అంటే మలత్రయము. ఆవరణ, ఆధ్యాస, విక్షేపం. నిర్మలము అంటే ఆ మలత్రయాన్ని నిర్మూలించుకున్నాము. అది నిర్మలం. శాశ్వతంగా నిర్మూలించాము, మళ్ళీ రాకుండా. అది వినిర్మలము. సాధకుడినిబట్టి,

మలత్రయమును నిర్మూలించి, తిరిగి రాకపోతే అప్పుడు వినిర్మలము అంటాము. మన నిజమైన లక్ష్యము ఏమిటి? బయలు. బయలులో మాలిన్యము తోచదు. బయలులో మాలిన్యాన్ని నిర్మూలించాల్సిన అవసరం లేదు. ఆ నిర్మూలించిన వాటిని తిరిగి రాకుండా చూసుకోవాల్సిన అవసరం లేదు. ఎప్పటికీ, ఎప్పటికీ దానికి మలినములేదు కనుక దానిని సదా అమలము అన్నాము.

ఈ తేడా చూడండి. మలము, నిర్మలము, వినిర్మలము, అమలము – అమలమేమో లక్ష్యరూపము, శాశ్వతము. వినిర్మలమేమో లక్ష్యంతో సమానమైంది, నిర్మలము కూడా లక్ష్యముతో సమానమైనదే, నిర్మలము లక్ష్యము కాకపోతే ఏమైంది? తిరిగి నిర్మలం కాస్తా, విక్షేపంలోకి, మలంలోకి వెళ్ళిపోతుంది. ఆవరణ, విక్షేప, ఆధ్యాసలలోనికి వెళ్ళిపోతుంది. విమలం అంటాము. విమలం అంటే మలినాన్ని విడుదల చేసేటటువంటిది. సచ్ఛిష్యుని ఉద్దేశ్యించి చెప్పినది. సచ్ఛిష్యుడే లేని వాడు. లేనివాడు లేకనే ఉన్నవాడు సాధకుడు. సాధన దాటినవాడు. మార్జాల కిశోర న్యాయంగా, గురుకృపగా వినిర్మలుడు అయ్యాడు. వినిర్మల స్థితిలో అమలుడు అయ్యాడు. తిరిగి వస్తేనేమో అమలంతో సమానమైనప్పటికి, మళ్ళీ మలినాలు అంటుకుంటున్నాయి. తిరిగి రాకపోతే ఈ వినిర్మలుడే అమలుడు, వినిర్మలత్వం – అమలినత్వం ఒక్కటే అన్నప్పుడు అక్కడ సాధన యొక్క అంతము. సిద్ధాంతము. వేదాంతము యొక్క అంతము. అతీత పద్ధతిగా నిర్ణయము. అదే సదా అమలము. అంటే ఒక నాటికి మలము వచ్చేది లేదు. ఎల్లప్పుడూ అమలమే. **మూలాభావమిదం** వీటన్నిటికీ మూలమే లేదు. మూలమున్నదని అంటే భ్రాంతే! కనుక అభావమే అచలము. **కిం నాస్తీత్వ అననుస్మరేత్!**

**స్మరేత్** అంటే – స్మరణ కొనసాగుతూ ఉంటుంది. అననుస్మరేత్ అంటే స్మరణ ఆగిపోతుంది. ఆ స్మరణ అంటే ఇక్కడ ఎఱుక. కనుక ఎఱుక ఆగిపోతుంది. స్మరణ రూపంగానే ఎఱుక వచ్చింది. అందుకే తాత్కాలికంగా స్మరణ ఆగిపోతే విస్మరణ. విస్మరణలో బీజం ఉంటే, మళ్ళీ సంస్మరణ కదిలితే, హిరణ్యగర్భుడిలో స్మరణ ఉంటే, ఎరుక వ్యాపిస్తుంది. ఊహామాత్రంగా ఉన్నా, భావమాత్రంగా ఉన్నా ప్రకృతి, నామ రూప జగత్తు, జీవేశ్వరులు తోస్తారు. అందుకని ఏమన్నారు?

**శ్లో॥ స్మరణ రూపుడన రాదమ్మా, విస్మరణ రూపుడది కాదమ్మా ।**
**స్మరణ విస్మరణ ఎఱుక లేని, ఈ గురునకు మంగళ మనరమ్మా ॥**

**'స్మరణ – విస్మరణ'ల మూలచ్ఛేదో** అంటే ఆ శాశ్వత విస్మరణే బయలు. విస్మరణే బయలు అనకూడదు. శాశ్వత విస్మరణ నిష్కళ. అందుకనే చూడండి. నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త అంటాము. అన్నింటిలోనికి నిత్యాన్ని పెట్టుకోవాలి. నిత్యశుద్ధ, నిత్యబుద్ధ, నిత్యముక్త – నిత్యవస్తువు చాలా ముఖ్యము. నిత్య లేకపోతే ఏమైంది? తాత్కాలికంగా అచల పరిపూర్ణం... ప్రమాణంగా ఉన్నప్పటికి, దానియందు ఎఱుక తోస్తోంది. ఎఱుక తోచడానికి బీజం ఉందిగా ! అందుకని ఎఱుక బయలందు తనకు తానే తోచినటువంటి దానిగా త్రిగుణాలు బీజరూపంలో ఉన్నాయి. అందుకని బీజరూపంలో ఉన్న మూలావిద్య శుద్ధ సత్వగుణంలోకి వస్తే, విజృంభిస్తే, మాయ తోస్తే దాని తరువాత తమో రజోగుణాలు విజృంభిస్తే, అదే అవిద్య. కనుక మాయకు, అవిద్యకి మూడు గుణాలు ఒక్కొక్కటి తోచడమే కారణం. ఉన్నాయి కాబట్టి, తోచాయి. లేకపోతే ఎక్కడ తోస్తాయి? విజృంభించినప్పుడు వచ్చాయి. విజృంభించకుండా అవ్యక్తంగా ఉన్నప్పుడు లేవు. అవ్యక్తంగా కూడా, ఏవీ లేకపోతే ఎలా విజృంభిస్తాయి? బీజం ఉంది కాబట్టే, అంకురించి విజృంభించింది. అందుకనే మూలచ్ఛేదం, మూలాభావం అంటున్నాడు. కిం నాస్తీత్య అనను స్మరేత్ – నువ్వు స్మరణ, అనుస్మరణ గనుక లేకపోతే ఇంకేమీ లేదుగా. బయలందు స్మరణ, అనుస్మరణలు నాస్తి. అంటే అననుస్మరణం, అంటే బీజం నాస్తి. స్మరణ మాయలోనికి వచ్చింది. అనుస్మరణ అవిద్యలోనికి వచ్చింది. స్మరణ ఈశ్వరుడిది. అనుస్మరణ జీవుడిది. ఆ రెండూ కూడా నాస్తి. ఇది అననుస్మరణ, కిం నాస్తి? అంటే, ఏమీ లేదనే నిర్ణయం.

పై నిర్ణయం అంతయు ప్రజ్ఞారూపముగా ఈ దిగువ నిరూపించబడుతున్నది. నీకు అర్థం కావాలి అంటే, కొన్ని గుర్తులతో చెప్పారు వినండి. మూలము కానరానిది, లేనిది, బయలు అంటాము. ఆ బయలు అంతటా నిండి ఉన్నది. కళా నిష్కళలకు అతీతమైనది. సగుణాది నిర్గుణములకు అతీతమైనది. అది బయలై యున్నది. సదా బయలైయున్నది. బయలందు సదా త్రిగుణములు లేవు. అమలము అంటే, త్రిగుణములు లేనేలేవు. మలము అంటే త్రిగుణాలే. గుణాలు ఉంటే కదులుతుంది. గుణాలు లేవు కాబట్టి, అది కదలదు కనుక అది అచలము. దేహమునకు మూలము లేదు. మూలము లేని గుర్తెరిగే శరీరము ఏమీ లేదు. మూలము లేనిది ఏమిటి? బయలంటే సర్వశూన్యములు కానిది. సర్వశూన్యములు అనేటటువంటి ఎఱుక కూడా లేనిది. కనుక దానికి బయలు అని నిర్ణయము.

బయలు అనే నిర్ణయము ఎవడికి కలిగింది? ఈ సచ్ఛిష్యునికి కలిగింది. అయితే బయలే ఉన్నది. ఎఱుక లేనిదని బయలును తెలుసుకున్నాడు. బయలు తెలుసుకున్నంత మాత్రాన బయలయ్యాడా? బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి అన్నప్పుడు బ్రహ్మము తెలుసుకున్నటువంటి ఎఱుకలో బ్రహ్మమే తానైనటువంటి ఎఱుకలో ఉన్నాడు. మరి ఇప్పుడు బ్రహ్మము తెలుసుకున్నవాడు, బయలౌతాడా? తెలుసుకుంటే ఎఱుక ఉంది. కాబట్టి, అది ఎఱుకే అవుతుంది. బయలందు ఎఱుక లేకనే ఉన్నది. కాని బయలందు ఎఱుకకు స్థానము లేదు, ఎఱుక రాదు, పోదు. బయలు ఎరుక లయ స్థానము కాదు. ఎఱుక నిలిచి ఉండడానికి బయలు స్థానము కాదు. బయలే అన్నికాలాలలో బయలుగానే ఉన్నది. అదే అమలము. కనుక ఎఱుకతో ఎవరూ బయలందు ప్రవేశించలేరు. ఎఱుక ఇక్కడే మూటగట్టి పారేసుకుంటేనే బయలై ఉంటావు తప్ప ఎఱుకతో బయలును అందుకోలేరు.

ఆధార ఆధేయ పద్ధతిలో జీవుడు, ఈశ్వరుడు అయ్యాడేమో గాని, ఈశ్వరుడే బ్రహ్మమై, బ్రహ్మమే పరబ్రహ్మమై యుంటే పరబ్రహ్మలోనేమో బీజాలు ఉన్నాయి. అవి నిర్బీజం చేస్తే, బయలు ఉన్నది. బయలు స్వతః సిద్ధమై ఉంది. సచ్ఛిష్యుని విషయంలో ఉద్దేశ్యించి చెప్పినప్పుడు, సచ్ఛిష్యుడు బయలై, తానే బయలుగా, స్వతఃసిద్ధముగా ఉన్నాడు. స్వతః సిద్ధమంటే అన్నికాలాలలో బయలై ఉన్నాడు.

లేనివాడే అజ్ఞాన, ఆవరణ, విక్షేపాల చేత ఎఱుకలోకి వచ్చేసాడు. అందుకే మాయ అన్నా, చైతన్యమన్నా, ఎఱుకన్నా, అహంకారమన్నా ఒక్కటే. ఈ అచల పద్ధతిలో కార్యకారణ నిరశన పద్ధతి, దృక్ దృశ్య నిరశన పద్ధతి, సదసద్ నిరశన పద్ధతి, చైతన్య నిరశన పద్ధతి, అహంకార నిరశన పద్ధతి అని చాలా ఉన్నాయి. ఈ పేర్లన్నీ ఎఱుకే కనుక ఇవన్నీ నిరశించబడాలి. మహావాక్యాలు కూడా ఎఱుకను నిలిపే పద్ధతే. మహావాక్య నిరశనచేత, అఖండ ఎఱుకగా ఉన్న పరబ్రహ్మజ్ఞాన నిరశనచేత, బయలును నిర్ణయించాలి. విజ్ఞానస్వరూపుడిగా ఉన్న దానిలో కూడా ఎఱుక బీజం ఉన్నది. బీజం అంకురించిన మళ్ళీ సగుణమై, ఈ సృష్టి స్థితి లయ విధానము కొనసాగుతుంది. ఇంత దూరం వచ్చి కూడా, మళ్ళీ అజ్ఞానంలోకి జారిపోవడం అన్నది జరుగుతుంది. దీనిని మనం అరికట్టాలి అంటే, మూడుగుణాలకి సంబంధించినటువంటి ఎఱుకని నిర్బీజం చేయాలి. ఆధార ఆధేయ పద్ధతి వదిలేసి, ఎఱుక విడిచే పద్ధతిలో బయలులోకి చేరాలి. జీవబ్రహ్మైక్య పద్ధతి, ఎఱుక బ్రహ్మైక్య పద్ధతి లేదక్కడ. జీవరూప ఎఱుక లేనిదే, ఈశ్వర రూప ఎఱుక లేనిదే, బ్రహ్మరూప ఎఱుక లేనిదే. ఎఱుక యొక్క అఖండత్వం, పరబ్రహ్మకూడా ఎఱుకే. ఎఱుక యొక్క అవ్యక్త స్థితిలో, అఖండ ఘన రూప ఎఱుక కూడా, తిరిగి ద్రవ రూపంగా అయ్యే అవకాశం ఉన్నది. వ్యాపకమయ్యే అవకాశం ఉన్నది. కనుక, నిర్బీజం అయినప్పుడు అఖండ ఎఱుక కూడా లేనిదే. ఘనరూప అఖండ ఎఱుక లేనిదే.

ఘన రూప ఎఱుక అని అద్వైత పద్ధతిలోనికి తీసుకొచ్చాం. ఘన రూప అఖండ ఎఱుక లేనిదని, తెలిశాక సృష్టి బీజం ఏదైతే ఉన్నదంటున్నామో అది నిర్బీజం అని తెలిసిన తరువాత అంతా ఉత్త బట్టబయలు ఏమీ లేదని– ద్వాదశీ.

ఈ ఘనరూప అఖండ ఎఱుక పరిపూర్ణ బోధచేత నిర్బీజమై, మూలచ్ఛేదమై, కళాతీతమై, బిందువు అనేటటువంటిది, పరిపూర్ణమందు లయమై, ఇవన్నీ తీసేస్తున్నామండి. జ్ఞాత, జ్ఞేయ, జ్ఞానము అనే త్రిపుటిలో ఉన్నటువంటి ఎఱుక పోగా బయలే ఉన్నది. కనుక ప్రణవము అనేది అవ్యక్తము. ఓం అనేది మహత్తు. ఓంకారము అనేది మహదహంకారములో పంచశక్తులతో కూడినటువంటి మహద్బ్రహ్మ. అతనియొక్క సంకల్పంచేత, ఈ మహాసృష్టి జరిగింది. ఈ సృష్టి జరిగితే బ్రహ్మమొక్కటే. పరబ్రహ్మమొక్కటే. అనే పద్ధతిలో ఓం ఉన్నది. ఈ ఓంకారేశ్వరుడే, ప్రణవ స్వరూపుడు. ప్రణవ స్వరూపుడంటే తనలో తానుగా ఉన్నవాడు. ఓంకారేశ్వరుడు సృష్టిలో సర్వమూ తానైనవాడుగా మారాడు. సర్వమూ తోచి, సర్వమూ తానైనవాడయ్యాడు. ప్రణవ స్వరూపుడు, సర్వ శూన్యాతీతమై, ప్రణవ స్వరూపుడై, అవ్యక్తంగా ఉన్నాడు. ఈ వ్యక్తా అవ్యక్తములు ఓం లో ఉన్నాయి. ఈ ఓం కి మూలం ప్రణవం. ఈ ప్రణవమే ఎఱుకకు మూలము. అది అఖండ ఘన రూప ఎఱుక. ఘన రూప అఖండ ఎఱుక ప్రణవం అయినప్పుడు ఎఱుక నిర్బీజం అయితే, ఏమైంది? ప్రణవమే బయలైంది. అప్పుడు దానికి ప్రణవము అనే పేరు తీసేసి, త్రిగుణ రహితమైన బయలని పేరు పెట్టాలి. త్రిగుణ రహితం అంటే ఏమిటి? దానికి మూలమే లేదు అని. మూలం మూడుగుణాలే కదా! మూడు గుణాలు భ్రాంతి కదా! మూడు గుణాలే లేకపోతే మూలం లేదు. మూలం లేనిది ఏది? అందుకని ఓం కి వెనుకపక్క సున్నా పెట్టండి. అది ఒక సంజ్ఞగా ఌం అవుతుంది.

# సంకల్పము

శ్లో॥ పూర్వమేవానిరాలంబం । ఆగ్నేయంచ నిర్గుణం తథా । దక్షిణే నిత్య శుద్ధంచైవ ।
నైఋత్యే నిరుప ద్రవం । పశ్చిమే నిష్కళంచైవ ।
ఉత్తరేచ నిరాకాశో । ఈశాన్యే నిర్మలోభవేత్ । ఊర్ధ్వశ్చ నిరాకారతః ।
అథశ్చ నిర్వికారతః । అంతర్బహిశ్చ సర్వత్ర అచలోయం సనాతనః ॥

**పూర్వమేవా నిరాలంబము** : ఇక్కడ నిరాలంబము అంటే తనకి మరొక ఆధారము లేదని, ఒక దీపంచేత రెండో దీపం ముట్టించాం. రెండో దీపం చేత మూడోదీపం ముట్టించాం. ఈ దీపం ఎలా వుందయ్యా అంటే చంద్రుడివలె ప్రకాశిస్తోంది. ఈ ప్రకాశం చంద్రుడివలన వున్నది. చంద్ర ప్రకాశం ఎక్కడుంది? సూర్య ప్రకాశం వలన ఉన్నది. సూర్య ప్రకాశానికి ఆధారము పరమాత్మ ప్రకాశము. ఈ పరమాత్మ ప్రకాశానికి ఆధారం ఏమిటి? ఏ ఆధారము లేదు. పరమాత్మ స్వయంగా ప్రకాశిస్తున్నాడు. అందుకని పరమాత్మ నిరాలంబుడు.

తూర్పు అని ఎందుఎకన్నారంటే సూర్యుణ్ణి పెట్టుకుంటారు మీరు. సూర్యుడికి ఆలంబన ఉంది. పరమాత్మ ప్రకాశము చేత పరమాత్మ సత్తాచేత సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. సూర్య ప్రకాశము చేత చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. చంద్రప్రకాశము చేత వెన్నెలొచ్చి వెన్నెల్లో ఓషధులు ఉత్పత్తవుతున్నాయి. ఓషధుల వల్ల అన్నం ఉత్పత్తవుతుంది. అన్నం వల్ల పురుషుదుత్పత్తవుతున్నాడు. ఇదంతా ఒకదానికొకటి ఆలంబనగా వస్తోంది. కిందనుంచి పైకెళ్తే పురుషుడికి అన్నం కారణం. అన్నమాధారం, ఆలంబన, అన్నానికి ఓషధులు ఆలంబన. ఓషధులకు పృథ్వి ఆలంబన, పృథ్వికి జలము, ఆ విధంగా వస్తే ఏమైంది? అన్నింటికి ఆలంబన ఆత్మ.

ఆత్మన్నా, బ్రహ్మమన్నా ఒక్కటే. బ్రహ్మకు ఆలంబన ఏమిటి? బ్రహ్మ నిరాలంబుడు. స్వతఃసిద్ధంగా స్వయంగా స్వప్రకాశంగా వున్నాడు. కనుక ఈ దీపానికి ఆ దీపం మూలం. ఆ దీపంచేత ఈ దీపం ముట్టించబడింది. అసలు మొదటి దీపం ఎవరు ముట్టించారు? మొదటి దీపము ఆ బ్రహ్మమే. స్వయం ప్రకాశం దాన్నెవరూ ముట్టించలేదు. అందుకని ఆ మొదటి దీపమే నిరాలంబము.

ఇన్ని విధాలుగా నిరాలంబం అంటే అర్థమయ్యింది.

**ఆగ్నేయంచ నిర్గుణం** మెల్లగా మనం ప్రదక్షిణం చేద్దాము. తూర్పు తిరిగి దండంపెట్టి, తూర్పు నుంచి ఆగ్నేయానికి, ఆగ్నేయం నుంచి దక్షిణానికి, దక్షిణం నుంచి నైఋతికి, నైఋతి నుంచి పశ్చిమానికి, పశ్చిమాన్నుంచి వాయువ్యానికి, వాయువ్య మూలం నుంచి ఉత్తర దిశకి, ఉత్తర దిశ నుంచి ఈశాన్యానికి, ఈశాన్యాన్ని దాటి మళ్ళీ తూర్పుకి ఒక ప్రదక్షిణ చేస్తే ఈ ఒక్కొక్క దిక్కులో ఏమున్నాయో చూస్తున్నాం. ప్రపంచంలో మీకు తెలుసు ఈ దిక్కుల్లో ఏమున్నాయో.

అయితే బ్రహ్మసత్యం జగత్ మిథ్య. ఈ చూసే దృష్టి అజ్ఞాన దృష్టిలో ప్రపంచం కనబడుతోంది. జ్ఞాన చక్షువుతో చూస్తే ఈ ప్రదక్షిణలో నీకు ఎటు చూసినా పరబ్రహ్మమే కనబడుతున్నాడు. ఎటు చూసినా పరబ్రహ్మమే అంటే తాను ఈ శ్లోకం ద్వారా పరబ్రహ్మ లక్షణాలను అలా చెప్పాలని అనిపించింది.

తూర్పు నుంచి ఆగ్నేయం వైపు తిరిగారంటే ఏమయింది. నిర్గుణం తథా. తథా అని ఎందుకన్నాడు? సగుణంనుంచే సృష్టి వస్తుంది. సగుణమే మాయ. మాయ త్రిగుణాత్మకము. నిర్గుణమైతే దాన్నుంచి ఏమీ రాదు. నిర్గుణ బ్రహ్మ నుంచి సృష్టి రాదు. సగుణ బ్రహ్మ నుంచే వస్తుంది. అయితే నిర్గుణబ్రహ్మ మహత్ అయితే మహత్ కాకముందు సృష్టికి బీజము ఆ పరబ్రహ్మయందు వున్నది. ఆ పరబ్రహ్మయందున్నటువంటి సృష్టి బీజము ఏదో అది ఉత్పత్తి కావాలంటే గుణం కావాలి. బ్రహ్మకి రజోగుణం వల్లనే సంకల్పం కలిగి సృష్టి చేశాడు. సత్వగుణం వల్ల ఆనందం కలిగి ఆనందానుభవాన్ని వ్యాప్తి చేశాడు. ఆనందము చేతనే సృష్టి చేశాడు. ఈ సృష్టంతా ఆనందమయంగా వుంది. ఎక్కడ చూసినా అందరూ ఆనందం కోసమే కర్మ చేస్తున్నారు. తిట్టడంలో కూడా వాడికి ఆనందం వుంది. కాబట్టి తిట్టావు. ప్రియం మోదం ప్రమోదమే ఇక్కడ ఆనందమయ కోశంలో మనకున్నది. కనుక ప్రపంచమంతా ఆనందమయంగానే వుంది. సరిగ్గా కనుక మనం విచారణ చేస్తే ఇవన్నీ సగుణం ద్వారా వచ్చినవని తేలుతుంది. నిర్గుణం ద్వారా ఏదీ రాదు. ఎందుకంటే ఒకటే బ్రహ్మమన్నారుగా! బ్రహ్మ కంటే అన్యము లేదుగా!

అటువంటి బ్రహ్మ నిర్గుణమైతే నిర్గుణం నుంచి ఏదీ రాకూడదుగా! సత్తునుంచి మరొక సత్తు పుట్టదు. ఎందుకంటే సత్ ఏకం, చిత్ ఏకం, తదేకం, సత్తే చిత్తు. చిత్తే సత్తు. అది ఏకత్వ రూపము. దానికంటే అన్యము లేదు. అందుకని ఇక్కణ్ణుంచి రెండోది లేదు. ఏకత్వం వుంది. సత్తునుంచి ఏదీ పుట్టదు. అసత్తు నుంచి ఏదైనా పుడుతుందంటే అసత్తు భ్రాంతి కనుక భ్రాంతి నుంచి అనేక భ్రాంతులు పుట్టొచ్చు. సత్ నుంచి అసత్ పుట్టిందా? సత్ నుంచి భ్రాంతి పుట్టలేదు. భ్రాంతి పేరే మాయ. మాయే లేని మాయ. మాయ అనిర్వచనీయం. అది వున్నట్లు లెక్క కాదు. అందుకని బ్రహ్మమొక్కటే. మరి తథా అని ఎందుకన్నాడంటే నిర్గుణం సగుణం అయ్యే ఆస్కారంము లేదని. బ్రహ్మ నిర్గుణం తథా. యథాతథంగా నిర్గుణమే. అన్ని కాలాల్లో శాశ్వతంగా నిర్గుణమే. అదీ మన లక్ష్యమైనటువంటి పరబ్రహ్మ మన లక్ష్యంగా వున్నటువంటి సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ. అది నిర్గుణం. నిర్గుణబ్రహ్మ ఎప్పుడూ నిర్గుణంగానే వున్నాడు. నిర్గుణ బ్రహ్మని మాయ ఆశ్రయించి ఆ నిర్గుణ బ్రహ్మనే సగుణ బ్రహ్మగా చూపిస్తోంది. మహాకారణంగా చూపిస్తోంది. అంతేకాని అటువంటి మాయద్వారా వచ్చినవన్నీ మాయ మర్మం తెలిస్తే విచారిస్తే లేనిదే.

కనుక నిర్గుణబ్రహ్మకి సంకల్పము రాలేదు. నిర్గుణ బ్రహ్మ ఎప్పుడూ నిర్గుణమే. యథాతథంగా నిర్గుణంగానే వున్నాడు. ఈ కన్ఫ్యూజన్ పోవాలంటే, నిర్గుణ బ్రహ్మ అని అనకుండా త్రిగుణరహిత బ్రహ్మ అటే కన్ఫ్యూజన్ వుండదు. ఎప్పటికీ ఎప్పటికీ ఆ బ్రహ్మ నిరాలంబంగా త్రిగుణ రహితముగా వుంటాడు. అదీ నిర్గుణం తాథా అంటే.

గుణములవల్లే కదలిక, గుణముల వల్లే భ్రాంతి. భ్రాంతిలోనే కదలికలు. భ్రాంతి రహితమైతే కదలికలు లేవు. గుణములవల్లే చలనము. గుణము లేకపోతే చలనము లేదు. చలనము లేకపోతే అచలము. అది శాశ్వత నిర్గుణము అన్నపుడు శాశ్వతంగా అచలమే. అచలమే మళ్ళీ ఎందుకు చలిస్తుంది? ఆ పరిపూర్ణత్వము, ఆ పరితృప్తి అందులో కొంచెం తరుగుదల కాని, అంతరాయం కాని వస్తే అది కదుల్తుంది. తరగదు, మొరగదు, తిరగదు, కదలదు. ఆ వున్నది ఎంతో ఆనందంగా, ఆనందకరంగా, ఆనందమయంగా, ఆనంద ఘనంగా వున్నదున్నట్లు నిత్యవర్తమానంలో నిత్యతృప్తమై చలించే అవసరము లేనిదై అంత గొప్పదై వుంటుంది. అంతకంటే గొప్పది దానికంటే గొప్పది లేనిదైనది. కనుక అచలమంటే పరిపూర్ణమే. సృష్టికి ఆధారమైనటువంటి బ్రహ్మకి నిర్గుణము అవ్యక్తమైతే, సగుణము మహత్తైతే, సగుణ సృష్టంతా కూడా ఈ సృష్టికి ఆధారమైనటువంటి, మహదహంకారము ఒకటొస్తే ఆ అహంకారమే అధిష్టానముగా, ఆ అధిష్టానమందున్నటువంటి సృష్టి వాసనలు తన్మాత్రగా ప్రారంభమై, అఖిల జగత్తయింది. దాన్ని విడగొట్టాలి. నిర్గుణం తథా అంటే విడగొట్టబడింది. శాశ్వతంగా అది నిర్గుణమే. అంటే త్రిగుణ రహితం.

ఆగ్నేయం నుంచి దక్షిణంవైపు తిరిగాడు. **నిత్యశుద్ధం చైవ**. త్రిగుణములు లేకపోవడం నిర్గుణము. త్రిగుణములు వుండడము మాలిన్యము. మాలిన్యాన్ని లేకుండా చేస్తే శుద్ధం తిరిగి మాలిన్యం వస్తే మళ్ళీ మాయే. గుణాలు లేకుండా చేసుకుంటే అవి అణగి కొంతకాలం నిద్రాణంగా వుండి కాల ప్రభావంతో గాని, దేని ప్రభావంతో గాని మళ్ళీ సగుణమైతే కనుక ఆ శుద్ధమైనటువంటిది ఏదో అది తాత్కాలికము, అనిత్యము. మనకు వస్తు నిర్ణయంలో ఏ పరబ్రహ్మ అయితే మోక్షధామమో, మోక్షరూపమో దాన్నిక్కడ చెప్పదల్చుకున్నాము. మీ సంకల్పంలో మీ లక్ష్యంలో దాన్ని పెట్టుకోమంటున్నాము. అందుకనే అది నిత్యము శుద్ధమై యున్నదే. ఒకానొక కాలంలో కూడ అశుద్ధము, మలినము కాదు.

నిత్య శుద్ధంచ ఇలా దక్షిణం వైపునుంచి నైఋతి మూలకి తిరిగాడు. **నైరుత్యో నిరుపద్రవం**. ఉపద్రవం అంటే ఏమిటి? భూకంపాలు, సునామీలు మొత్తం సృష్టంతా ప్రళయమైపోయి ఆ ప్రళయంలో వున్నటువంటి జీవులకు ఈ ఉపద్రవంలో, ఈ ప్రళయ కాలంలో తన ఉపాధులు బాధించబడుతాయి. కనుక తట్టుకోలేవు. కనుక అన్ని విపత్తులు పంచభూతాల యొక్క విజృంభణ వలన వస్తున్నాయి. తన్మాత్ర సృష్టిలో భాగంగా పంచభూతాలు, స్థూల భూతాలై ఒకానొక కాలంలో విజృంభిస్తున్నపుడు ఆ సమస్థాయి చెదిరినపుడు అక్కడున్నటువంటి జీవులు, ప్రాణులు తట్టుకోలేకపోతున్నారు. అదీ ఉపద్రవమంటే.

నిర్గుణ బ్రహ్మ ఈ సృష్టికి అతీతమై ఈ సృష్టి తనయందు లేనిదై శాశ్వతంగా నిరుపద్రవంగానే వున్నాడు. పంచభూతాలకంటే విలక్షణంగా, అసంగముగా ఉన్నప్పుడు ఆ పంచభూతాల కారణంగా ఉపద్రవం ఎలా కలుగుతుంది? పంచభూతాలు మిథ్య అని తెలిసినవాడు, కల్పితమని తెలిసినవాడు నిరుపాధికుడు.

ఈ ఉపద్రవము ఉపాధి ధరించినవానికే గాని ఉపాధి లేనివాడిని నిప్పు కాల్చదు, నీళ్ళు తడపదు, నానబెట్టదు, పాచిబట్టదు, గాలితో శోషింపబడదు. పృథ్విలో కుళ్ళదు. శస్త్రంచేత నరకబడదు. అటువంటి బ్రహ్మకదా. పంచభూతాల యొక్క ఎఫెక్టు లేనటువంటి బ్రహ్మ నిరుపద్రవమే. ఆ నిరుపద్రవమే లక్ష్యంగా మనం గనుక సాధన చేస్తే ఉపద్రవానికి సాక్షీభూతంగా ఉంటే ఉపద్రవాలు బాధించేది ఉపాధినే గాని ఆత్మనైనటువంటి నన్ను కాదని ఎవరైతే విడిపడి ఉపాధి పోయినా ప్రాణం పోయినా లెక్కచేయకుండా ఆత్మగా తాను చావనివాడు, పుట్టనివాడని, ఏ బాధ అనుభవించనివాడని, తర్వాత నిత్యము, సత్‌చిత్ ఆనంద రూపుడని, ఎవడైతే ఉంటాడో వాడికి ఉపద్రవాలేమీ చెయ్యవు. చేస్తే మహాపోతే ఉపాధి పోయింది. కాని ఆత్మ పోలేదు. ప్రాణం పోయింది కాని ఆత్మ పోలేదు. ఆత్మ పోయేది కాదుగా! అందుకని భ్రాంతిలో తోచిన ఉపాధి గతమైనటువంటివన్నీ ఉపాధులతో సహా ఏంపోయినా గాని తనకు పోయిందేమీ లేదు. ఆత్మ స్వరూపానికి పోయిందేమీ లేదు. ఇది సాధన. లక్ష్యంలో అటువంటి బ్రహ్మ నిరుపద్రవం.

నైఋతి నుంచి పడమర వైపుకి తిరిగాడు. **పశ్చిమే నిష్కళం చైవ**. నిష్కళ అంటే ఏమిటి? ప్రకాశం లేనిది. ప్రకాశం వున్నది పరమాత్మైతే, ప్రకాశం లేనిదంటే పరమాత్మ కూడా లేనివాడే. ప్రకాశము కానిది, ప్రకాశము లేనిది బయలు. బయలు జడం కాదు. బయలు చిత్తు కాదు. బయలు ప్రకాశం కాదు. బయలు అంధకారము కాదు. జ్ఞానము కాదు. అజ్ఞానము కాదు. వెలుగు కాదు. చీకటి కాదు. అది నిష్కళ అయితే అమావాస్యలాంటి నిష్కళ కాదు. మళ్ళీ చంద్రుడు పెరుగుతాడు. మళ్ళీ కళలు పెరుగుతాయి. కళలకు వృద్ధి క్షీణాలుంటాయి. ఓసారి పూర్ణకళ వుంటుంది. మళ్ళీ ఉండదు. నిష్కళ శాశ్వతం కాదు. అమావాస్య చంద్రుడు నిష్కళ అయ్యాడు. ఆ చంద్రుడికి నిష్కళ శాశ్వతం కాదు. ఇక్కడ నిష్కళ నిత్యమని చెప్పినప్పుడు ఆ బ్రహ్మ శాశ్వతుడు, నిత్యుడు. కనుక నిత్య అనే పదం ప్రతీదానికి మనం కలపాలి.

నిర్గుణం తథా అన్నప్పుడు అది కూడా నిత్యం క్రిందే లెక్క. యథాతథంగా ఎప్పుడూ అలాగే వున్నది. అలాగే నిత్య శుద్ధం చైవ అన్నపుడు కూడా అది త్రిగుణరహితమైనదేదైతో వుందో అది శాశ్వతమే. అలాగే ఆ నిత్యమనే పదం అక్కడ వాడినా వాడకపోయినా ఏం కాదు. నిష్కళమనేది శాశ్వతమైనప్పుడు అది బయలే. తాత్కాలికమైనప్పుడు అది పెను చీకటి. ఇంకా తాత్కాలికమైతే అది గాఢనిద్ర కాని, మరణకాలం కాని మరపుకానిది అవుతుంది. సమాధిలో కూడా నిజానికి ఈ ప్రకాశం వుంది. సమాధిలో ప్రకాశం ఉండొచ్చు. సమాధిలో శూన్యం ఉండొచ్చు. శూన్యము, ప్రకాశము రెండూ కాకుండా వున్నది, ఈ బ్రహ్మ బయలు. నిష్కళంచైవ అంటానికి బ్రహ్మని బయలు రూపంగా నిర్ణయిస్తున్నాము మనము.

**వాయువ్యేచ నిరంజనం** నిః+అంజనం = నిరంజనం. అంజనమంటే కాటుక, లేపనము, పై పూత. **అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా చక్షురున్మీలితం యేన తస్మైశ్రీ గురవే నమః** జ్ఞానమనేటువంటి కాటుకచేత అజ్ఞానం పోతుంది. కనుక అజ్ఞానాంధకారం పోతుంది. అంటే కన్నొకటుంది. కాటుక అనే లేపనం పూస్తున్నాం. ఇత్తడి గిన్నెకి కళాయి పూత. వెండి సామానుకు బంగారం పూత. ఇలాగ ఒక వస్తువుకి మరొకటి పైపూతగా వున్నది. బ్రహ్మమొక్కటే అంటే ఆ బ్రహ్మకి పైపూత అనే రెండవది వుంటుందా? ఆ మాట ఎందుకనాల్సొచ్చింది. బ్రహ్మ మీ ఒక ఆవరణ యున్నది. ఈ ఆవరణము వున్నప్పుడు బ్రహ్మకి అంజనం వుంది. ఈ ఆవరణే అంజనం అంటున్నాం. చూచేవాడికి బ్రహ్మ కనబడకపోవడం ఆవరణ కాని బ్రహ్మవైపు నుంచి చూస్తే బ్రహ్మకి ఆవరణ ఏముంది? సూర్యుడికి మేఘం కప్పింది అంటే మేఘం వలన సూర్యప్రకాశ ఏమన్నా మారిందా? పోయిందా? కనబడకుండా పోయిందా? సూర్యుడియొక్క సహజ ప్రకాశం సూర్యుడి యొక్క లక్షణంగా ప్రకాశిస్తోంది. మేఘం వలన సూర్యప్రకాశం కనబడకుండా చేసింది మరొకరికి. సూర్యుడికి కాదు. అజ్ఞానం, ఆవరణ అనేటటువంటిది వేరే జీవికి, బ్రహ్మకి కాదు.

**రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయాసమాచ్ఛదనాత్.** ఎలా అయితే రాహువు చంద్రుడిని సూర్యుడిని కనబడకుండా చేస్తున్నాడో అలాగే మాయ ఆచ్ఛాదించింది. దేనిమీద? **సన్మాత్రః,** కేవలం సద్రూపమైనటువంటి పరబ్రహ్మను మాయ ఆవరించింది. పరబ్రహ్మ ఏమన్నా ఆవరించబడ్డాడా. సూర్యచంద్రుల్ని చూసేటటువంటి వాడికన్నుకు ఈ ఆవరణ అడ్డొస్తుంది. మళ్ళీ ఆ రాహుగ్రస్తం పోంగానే మళ్ళీ ఆ సూర్యచంద్రుల ప్రకాశం యథాతథంగా వుంది. కొత్తదేం రాలేదు పాతది అక్కడే వుంది. కొనసాగుతూ ఉంది. కొంతకాలం మనకి కనబడలేదు గాని మనకి కనబడకపోవడం మన అజ్ఞానం. మన ఆవరణ దోషం ఆవరణ దోషం లేకపోతే ఎప్పుడూ కనబడుతూనే వుంటాడు. **సన్మాత్రః కరణోప సంహరణతో.**

ఆ మాయ ఏదైతే సమంగా ఆచ్ఛాదించబడిదో అది మళ్ళీ ఉపసంహరిస్తే అడ్డు తొలగితే ఆ సన్మాత్ర అనేటటువంటిది ఎప్పటివలె ప్రకాశిస్తూనే వున్నది. ఒక మేఘానికి అవతలికి వెళ్తే సూర్యుణ్ణి ఏదీ ఆవరించలేదు. మేఘానికి ఇవతల వుంటే సూర్యరశ్మి అక్కడ పడకుండా ఏదో ఒక అడ్డు వుంటే ఆ అడ్డున్నటువంటి స్థానంనుంచి సూర్యుడు కనబడడు. అలాగే అజ్ఞానావరణ యందు జీవుడికి ఆ పరబ్రహ్మము గోచరము కావట్లేదు, స్వ అనుభవానికి రావట్లేదు. ఆ ప్రకాశము జీవుని యొక్క ప్రకాశము ఆ బ్రహ్మ ప్రకాశము యందు లీనమై బ్రహ్మమే తానైనటువంటి అనుభవము కలగడానికి ఈ అజ్ఞాన ఆవరణ అనేది జీవుడికి అడ్డుగా వుంది. కనుక అంజనము అనేటటువంటిది ఒక మేఘము అనుకోండి. ఒక పూత అనుకోండి.

యదార్థ వస్తువు కనబడకుండా చేసేటటువంటి పూత కనుక బ్రహ్మకి ఆవరణ అనేటుటవంటిది బ్రహ్మ వైపునుంచి చూస్తే లేదండి! మనవైపు నుండి చూస్తేనే వున్నది. మనవైపు చూసే చూపులోనే దోషం ఉంది. ఆయనెప్పుడూ నిరంజనమే ఒకటే అయిన బ్రహ్మకి ఏదొచ్చి ఆవరిస్తుంది. గనుక బ్రహ్మకంటే రెండోది లేదుగా! బ్రహ్మ మొక్కటే పరబ్రహ్మమొక్కటే! కనుక ఆయన నిరంజనుడే! ఇంకొక అర్థం. రంజింపచేయడమంటే ఆనందం. నిరంజనమంటే ఆనందం లేకపోవడం. ఆనంద అనుభవము లేదు. ఆనందానుభవము లేనటువంటి బ్రహ్మ బయలు. ఆనందం అనేటటువంటి బ్రహ్మ అనుభవంగా చూస్తే ఎరుక. ఎరుక బ్రహ్మ. మనమిక్కడ నిష్కళంచైవ అంటున్నాం. నిష్కళంచైవ అన్నప్పుడుగాని, నిరంజనం అన్నప్పుడు గాని బయలునే నిర్ణయిస్తున్నాడు. సచ్చిదానందము ఎరుక బ్రహ్మ అయినపుడు, నిరంజన బ్రహ్మలో ఆనందం కూడా లేదని తీసుకుంటే, అది బయలై వుంది.

ఉత్తరంవైపు తిరగగానే, **ఉత్తరేచ నిరాకాశో.** ఆకాశమంటే ఏమిటండి? ఖాళీ. ఈ సృష్టి దేశకాల కలనా వైచిత్ర్య చిత్రీకృతమ్‌గా వచ్చింది. సృష్టికి పూర్వము దేశము లేదు. దేశమంటే అక్కడ చోటులేదు. ఆకాశమంటే చోటేగా. ఆకాశంలో అనేక గ్రహాలు, గోళాలు ఉండటానికి అవకాశం ఇచ్చింది. అవకాశమిచ్చే ఖాళీని ఆకాశం అంటారు. ఈ బయలందు ములుగ్రుచ్చ సందులేదు. అదే అంతా నిండి నిబిడీకృతమై వున్నది. ములుగ్రుచ్చ సందులేదు, చిన్న రంధ్రం లేదు, నిరంధ్రం. నిరంధ్రమంటే రంధ్రము లేదని అర్థము. అంటే మరొకటి ఉండే అవకాశం అది ఇవ్వదు. దేనికైనా సరే మరొకటి ఉండటానికి అవకాశమిచ్చేది ఆకాశము. ఇదీ ఆకాశముయొక్క నిర్వచనం. నిర్వచనం ప్రకారం నిరాకాశం అంటే తనయందు మరొకటి ఉండటానికి అవకాశం ఇవ్వదు. కనుక జగత్ జీవేశ్వరులు ముగ్గురూ ఉన్నారంటే వాటియొక్క వ్యవహారం కూడా మాయాకల్పితమేనని అనగా భ్రాంతిలో మాత్రమే ఉన్నదని, కలలో మాత్రమే ఉన్నదని, పరబ్రహ్మ స్వరూప జ్ఞానమందు అట్టి జ్ఞానమందు మేల్కొన్నవాడికి జీవేశ్వర జగత్తులు లేవని అర్థము. ఆ బ్రహ్మయందు జీవేశ్వర జగత్తులు ఉండేటటువంటి అవకాశం లేదు. కనుక అది నిరాకాశం.

ఉత్తరం వైపునుండి ఈశాన్యం మూలకి తిరిగాం. ఈశాన్యం మూల ఏముండాలి? ఏదో కనబడాలి. అక్కడ దేవుణ్ణి పెట్టాం. ఇది వ్యవహారం. ఈశాన్యం వైపుకి ఏం చేద్దామని తిరిగావో అక్కడ కూడా బ్రహ్మమే కనబడ్డాడు. బ్రహ్మ యొక్క లక్షణాలు విడివిడిగా చెప్తున్నాడు కాని అన్ని దిక్కులా ఆ పరబ్రహ్మమే ఉన్నాడు.

**ఈశాన్యం నిర్మలోభవేత్**. మళ్ళీ నిర్మలమన్నా నిత్య శుద్ధమన్నా ఒక్కటే. మాలిన్యం లేనటువంటిది. భవేత్ అంటే ఉన్నదున్నట్లున్నది. ఉన్నది ఉన్నట్లుగా వున్నది. అంతేగాని, వచ్చిందనీ కలిగిందనీ అనకూడదు.

**ఊర్ధ్వచ్చ నిరాకారతః** పైన ఆకాశం వుందా? కింద పాతాళం కూడా ఉందా? అక్కడ ఇక్కడ కూడా నిరాకార బ్రహ్మమే ఉన్నాడు. దేశ కాల వస్తువులుంటే ఆకారాలుంటాయి. దేశకాల వస్తువులు భ్రాంతిలో తోచాయి. కలనా అంటే? ఒక వస్తువు వుండుట అనేది కలన. ఒక వస్తువు లేకుండుట అనేది నకలన. దేశము, కాలము, వస్తు సముదాయము ఉండుట అనేది దేశ కాల కలనలు. ఇవి మాయా కల్పితము. నిర్గుణ బ్రహ్మయందు మాయా కల్పితములన్నీ విచారిస్తే లేనివిగా నిర్ణయమైతే ఆ నిర్గుణ బ్రహ్మ ఎలా వున్నాడు? నిరాకారంగా ఉన్నాడు. వస్తువైతే ఆకారం అవుతుంది. ఇక్కడ అక్కడ అన్నాము. అది కూడా ఒక ఆకారమే. కుండలో వున్న ఆకాశం కుండాకారంలో వున్నది. ఆకాశానికి ఆకారం లేకపోయినా కుండలో వున్న ఆకాశానికి కుండాకారం ఏ పాత్రలో ఉన్న ఆకాశానికి ఆ పాత్ర ఆకారంగా చెప్తున్నాం. చతురస్రంగా వున్నటువంటి పొలంలో నీళ్ళు పెడితే ఆ నీళ్ళు చతురస్రాకారంగా వుంటుంది. త్రికోణంగా గట్లు వేసిన పొలంలో నీళ్ళు పెడితే త్రికోణాకారంగా ఉంటుంది. ఇలా నీళ్ళకి ఆకారం లేకపోయినా సాపేక్షంలో ఒక ఆకారం, పాత్ర ఏ ఆకారం వుంటే ఆ ఆకారం వున్నదిగా కనబడుతుంది. అలా కూడా లేదు. మనకది బయలే. నిరాకారతః అంటే మళ్ళీ బయలే నిర్ణయము.

**అథశ్చ నిర్వికారతః :** క్రిందికి చూశాడు నేల భూమి పాతాళం అవేం కనబడలేదు. క్రింద కూడా పరబ్రహ్మమే వున్నాడు. ఎలా వున్నాడు. **నిర్వికారతః** నిర్వికారమైన పరబ్రహ్మమే వున్నాడు. నిర్వికారము, అచలము, త్రిగుణ రహితము, శుద్ధము, ఏకమేవా అద్వయము, నిరంజనము, నిరాకాశము, నిర్మలము, నిరాకారము. ఇలాగని పేరులో ఏమున్నాయో అవన్నీ కూడా పరబ్రహ్మమే. ఇక అన్నీ అయిపోయినాయి. దశ దిక్కులూ అయిపోయినాయి. అష్టదిక్కులు, పైన క్రిందతో దశదిక్కులైనాయి. ఇంకా ఏమి మిగిలాయి? ఇంక ఏమీ మిగలలేదు. కాని జీవుడేమనుకుంటున్నాడంటే, బహిర్ముఖము, అంతర్ముఖము అని రెండు పెట్టుకున్నాడు. ధ్యాన, ధారణ, సమాధిలో అంతర్ముఖమైతే అక్కడ బ్రహ్మ జ్ఞానం వస్తుందనీ, కళ్ళు తెరిస్తే ప్రపంచం వుంటుందనీ అనుకుంటున్నాడు. బహిర్ముఖంలో ప్రపంచం వుందనుకుటున్నాడు. జీవ ఈశ్వరునియొక్క వ్యవహారం వుందనుకుంటున్నాడు. కళ్ళు మూసుకొని సమాధికి వెళ్తే ఏమీ లేదు అనుకుంటున్నాడు. లోపల బయట అనేది సాధకుణ్ణిబట్టి చెప్పాల్సొచ్చింది.

**అంతర్ బహిశ్చ సర్వత్ర** లోపల బయట అనేటటువంటిది లేకుండా లోపల బయట అనే విభజన లేకుండా సర్వత్రా అంతటా **అచలోయం సనాతనః** అచలమే వున్నది. ఈ అచలమేమిటి? సనాతన : ముందే ఆద్యంతములు లేనిది. సనాతనమంటే కాలంలో ఎంత దూరంపోయినా ఆది లేనిది. అంతం లేనిది. మరి దశ దిక్కులూ అదే బ్రహ్మమైనపుడు ముందుకెళ్ళినా వెనకెళ్ళినా, గతానికెళ్ళినా, భవిష్యత్తులోకెళ్ళినా ఆది అంతము లేనివాడు. దేశానికి ఆది అంతముంటుంది. కాలానికి ఆది అంతముంటుంది. కాలానికి విభజనుంది. భూత కాలము, వర్తమాన కాలము, భవిష్యత్తని అనేక విధాల కల్పాలక్రింద లెక్కుంది. కాలగమనముంది. కాలము యొక్క మార్పులన్నాయి. దేశముయొక్క మార్పులున్నాయి. ఈ విధంగా వస్తువులున్నాయి. వస్తువుకి సరిపడే మార్పులున్నాయి. ఈ మార్పులన్నీ కూడా వికారం కాని పరబ్రహ్మ నిర్వికారం. అందుకనే దేశంగా చూసినా, కాలంగా చూసినా వస్తువుగా చూసినా ఆది అంతము లేని ఒక అనంతస్థితి. ఆ బ్రహ్మము అనంతుడు అనంతము. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ. సనాతనః అంటే ఆద్యంతములు లేని అనంతమైనటువంటి పరబ్రహ్మ.

## అంకురార్పణ

ఇపుడు సంకల్పం గట్టిగా చేశాం! ఏమని? మీ సంకల్పంలో ఏమయింది? ఎక్కడ చూసినా అక్కడ ఆ బ్రహ్మ యొక్క 12 లక్షణాలు. ఈ శ్లోకంలో చెప్పిన 12 లక్షణాలతోటి సమగ్రంగా విచారణ చేసికదా అవన్నీ నా లక్షణము అని సంకల్పం చేస్తున్నారు. విషయంగా మీ తెలివికి మీ మేధస్సుకి అందినంతవరకు ఊహకి అందినంతవరకు, ఆ లక్ష్యాన్ని సకల్పంగా ధృడంగా పెట్టుకున్నారు.

ఇక్కణ్ణుంచి గురుబోధ మొదలుపెడుతున్నాం. బోధకి ముందు ఈ సంకల్పం చేయాలి. చేశాము. తర్వాత ఇప్పుడేం చేయాలి? అంకురార్పణ చేయాలి. అంకురార్పణమంటే ఏంటి? యజ్ఞానికి వాటికి వీటికి అంకురార్పణ అని వుంటుంది. మనం ఇప్పుడు ఆత్మబోధ అనే యజ్ఞానికి దిగబోతున్నాం. దీనికి అంకురార్పణ కావాలి. కేవలాత్మ అనెడి లేనెరుకయే సర్వమైన అఖండ ఎరుక. ఈ అఖండ ఎరుకే అంకురం. అంకురం అంటే ఏమిటది? ఓ శనగ్గింజ నానబెడితే ఓ తెల్లటి అంకురం వస్తుంది. అంకురమంటే మూలమని అర్థం. అంకురం రాకపోతే ఆ గింజవల్ల శనగమొక్క రాదు. అంకురమొస్తే మొక్కొస్తుంది. అంకురం రానటువంటి శనగ్గింజ ఏదైతో ఉందో, అది కేవలాత్మ బయలు.

పరబ్రహ్మ అంకురం నుండి వచ్చేటటువంటి బ్రహ్మమే అవ్యక్తము, మహత్తు, మహదహంకారము కనుక అంకురంనుండి వచ్చేదంతా కూడా ఎరుకకు మూలం. అంకురంలో లేనిది బయలు. సృష్టికి పూర్వము కేవలము ఆత్మ మాత్రమే వున్నది. ఆ ఆత్మే అంకురము. దానివల్ల సర్వము తోస్తుంది. కనుక సర్వానికి ఆది అంకురము. సర్వము మిథ్య కనుక అంకురాన్ని కలిగి వున్నటువంటి బ్రహ్మ మిథ్యే. అంకురము లేని, అంకురము వచ్చే ఆస్కారము లేని, నిర్బీజమైనటువంటి బ్రహ్మ బయలు. సృష్టికి పూర్వము బ్రహ్మ మాత్రమే వుందనెడిది కేవలాత్మ. అది సృష్టికారణం. మహాకారణం. సర్వాధారం. అటువంటి కేవలాత్మ అనేటటువంటిది కూడా కల్పితానికి ఆధారమైందే తప్ప సత్యము కాదు. మాయాకల్పితానికి ఆధారమైనది కానటువంటి నిర్గుణ బ్రహ్మ ఎప్పటికీ కల్పితానికి ఆధారం కాలేదు. మరి ఈ కేవలాత్మ అనేటువంటిది ఆత్మన్నా ఎరుకన్నా, పరమాత్మన్నా, మాయన్నా, చైతన్యమన్నా ఒక్కటే. కనుక కేవలాత్మ మాయా కల్పితమే. కనుక కేవలాత్మ లేనిది. కనుక బయలే వున్నది.

ఈ కేవలాత్మని లేనెరుక అన్నాము. ఇది క్రిందినుంచి పైకెళ్తే కేవలాత్మ అనేది అఖండ ఎరుక. పైనుంచి క్రింది వస్తే అది ఖండ ఎరుకలు అయింది. ఒక్కటైనటువంటి బ్రహ్మ మాయద్వారాన్ని ప్రవేశించే సరికి పంచబ్రహ్మలైంది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు. కనుక ఒక్కటైనటువంటి బ్రహ్మ అఖండ ఎరుకైతే పంచ బ్రహ్మలు 5 ఖండ ఎరుకలు. అక్కణ్ణుంచి 5 మహత్ బీజాలు వచ్చినాయి. అక్కణ్ణుంచి 5 మాయాశక్తులు వచ్చినాయి. అక్కణ్ణుంచి 5 సూక్ష్మ భూతాలు అక్కణ్ణుంచి 5 స్థూల భూతాలు వచ్చినాయి.

స్థూల, సూక్ష్మ భూతాలకు సంబంధించి 25 తత్వాలు వచ్చాయి. 25 తత్వాల్లో గోళకాలు వచ్చాయి. ఎక్కణ్ణుంచి వచ్చాయి? ఒక్క రజోగుణం చేత మహదహంకారంలోని అధిష్టాన బ్రహ్మయే చివరకు 'నేను' అనేటటువంటిది స్ఫురణగా సర్వజీవులయందు ఆ నేను వ్యాపించి, జీవులయందు వాటియొక్క ఉనికిని స్ఫురణగా తీసుకొచ్చింది. ఆ జీవులకు ఉపాధి యొక్క తాదాత్మ్యత చేత ఈ నేను అసత్య నేనుగా వుంది. కనుక సత్యమైనటువంటి నేను ఎరుకే, అసత్య నేను కూడా ఎరుకే. అసలు ఎరుకే లేనిది, ఎరుకే భ్రాంతి. కేవలాత్మ అనెడి ఘనరూప అఖండ ఎరుక లేనెరుకే. అదే సర్వమూ అయినటువంటి అఖండ ఎరుకలో అవ్యక్తంగా వుంది. మార్పు కలిగి పంచ మాయాశక్తుల ద్వారా వాటి ప్రేరణతో ఒక ఆది శక్తి రూపుదైనటువంటి బ్రహ్మయందు సంకల్పము అనే ఎరుక కలిగి, అంతా ఎరుక మయంగా, ఎరుక యొక్క గొలుసుకట్టుగా, ఈ అంకురము శాఖోపశాఖలుగా ఫల పుష్పాదులుగా విస్తరించింది. ఈ మూలాన్ని అంకురాన్ని తీసేయాలి. ఉన్న అంకురాన్ని తీసేస్తారా? లేని అంకురం తీసేస్తారా? ఉన్నదైతేనేమో అది పోదు. ఈ చక్రభ్రమణంలో ఇలాగే వుంటుంది. లేనిది కాబట్టి తీసేస్తే పోతుంది. ఎలా పోతుంది? లేనిది లేకుండా పోతుంది. పోవడమంటే ఏమిటి? భ్రాంతిలో వున్నదేదో, భ్రాంతి రహితమైన వాడికి అది లేదు. పోవడమంటే పోవడం కాదు. ఇట్టి అంకురమును పరమ గురువునకు కైంకర్యము లేక అర్పణ చేయవలెను. అర్పణ చేసిన తరువాత ఉన్నదేదో ఉన్నది. అది బయలు.

ఈ కేవలాత్మ అయిన అఖండ ఎరుక అనేటుటవంటిది నిజానికి లేనెరుక గనుక భ్రాంతిలోనున్న శిష్యుడికది ఉండకూడదనుకుంటున్నాడు. కనుక ఈ భ్రాంతి పోతే అది లక్ష్యం గనుక ఈ భ్రాంతిలో ఉన్నదంతా కూడా ఆ సచ్ఛిష్యుడు, ఆ పరమ గురువుకి కైంకర్యం చేయాలి. కైంకర్యము అంటే ఏమిటంటే అదృష్టవంతుడగు బానిస తననుతాను యజమానికి అప్పగించుకొన్నట్లు. కింకరుడు అంటే శిష్యుడు గురువు విషయంలో బానిసగా మారడమే. కైంకర్యం అయ్యాక గురువు ఏది చెప్తే అది చేయడం. నిప్పుల్లో దూకమంటే దూకటం, నీళ్ళలో దూకమంటే నీళ్ళల్లో దూకడం, చచ్చిపో అంటే చచ్చిపోవడం. తల ఇచ్చేయమంటే తలకోసి ఇచ్చేయడం. అది కైంకర్యం. ఇంకను సర్వార్పణం. తను, మన, ధనాలను అర్పణం చేయడం. సర్వార్పణ చేయడమే కైంకర్యం. కైంకర్యమను పదము చాలా విశేషమైనది. నువ్వుండి ఇచ్చేదైతే కైంకర్యము కాదు. నిన్ను కూడా సమర్పించుకునేదే కైంకర్యము.

బానిసలు వాళ్ళని వాళ్ళే సమర్పించుకుంటారు. అన్ని పనులు చేసిపెట్టి జీతం తీసుకునేవాడు కాదు. జీతం లేకపోయినా చేసేవాడు. తిట్టినా, కొట్టినా కూడా చేస్తూ ఉండేవాడు. తన్ను తాను అర్పించుకున్నవాడు కింకరుడు. యమ కింకరులంటారు. ఆ యమునియొక్క ఆజ్ఞని శిరసావహించేటటువంటివాళ్ళు యమకింకరులు. గురువుయొక్క, పరమ గురువు యొక్క ఆజ్ఞని శిరసావహించేవారు శిష్యులు. ఆ శిష్యులు కైంకర్య పద్ధతిగా సర్వార్పణ పద్ధతిగా ఆ పరమ గురువుని ఆశ్రయించాలి. అప్పుడేమైపోయింది. నిన్ను నువ్వు కోల్పోయావు. నిన్ను కూడా ఇచ్చేసుకున్నావు. నీకున్నదేదో కాకుండా, నీ మనసులో ఉన్నది కాకుండా నీ సంపదలివ్వడం కాకుండా నిన్ను నువ్వు ఇచ్చేసుకున్నావు.

జనకుడు మనసును మాత్రమే ఇచ్చాడు. ఒక కాలు ఒక రికాబు మీద పెట్టి, రెండో కాలు రెండో రికాబు మీద పెట్టే లోపలే మనసు ఇచ్చేయాలని అష్టావక్రుడు జనకుని అడిగితే మనసు నిచ్చాడు. మనసునైతే ఇచ్చాడు. కాని తన్నుతాను ఇవ్వలేదు. కైంకర్యమంటే తన మనసునే కాకుండా తన తనువునే కాకుండా అందులో వున్న నేను, నేను అనేటటువంటి ఎరుకని గురువుకు అర్పణ చేయాలి. పరమ గురునికి అర్పణ చేయాలి.

బయలైనటువంటి గురువుకి నీ ఎరుకని ఇచ్చేస్తే ఆ బయలులో లేనెరుక లేకుండా పోతుంది. ఆ ఎరుక నీకు తిరిగి రాదు. అదే ఎరుకలో వున్న గురువుకు అర్పణ చేస్తే ఆ ఎరుక నీకు మళ్ళీ వస్తుంది. అదీ అక్కడ రహస్యం. అలాగ తను మన ధనాలన్నీ, ఆఖరికి నువ్వు కూడా లేకుండా చేసుకున్నప్పుడు కైంకర్యమనబడుతుంది. అలా సర్వమూ శూన్యమైతే ఏది ఉన్నదో అది వున్నదున్నట్లున్నది. అదే బయలు, బట్టబయలు. అండ పిండ బ్రహ్మాండములుగా, లేక పిండ బ్రహ్మాండ విశ్వాండములుగా, లేక జ్ఞాత కూటస్థ పరబ్రహ్మలుగా వివరించబడుతున్నవన్నీ కూడా ఎరుకయందు అభివర్ణమై వున్నవి. ఆ ఎరుక యొక్క అభివర్ణము, ఎరుక యొక్క మూలము, ఆ ఎరుక యొక్క మూలమే అంకురము. ఈ అంకురాన్ని అర్పణ చేయాలి. ఎరుక యొక్క మూలాన్ని అర్పణ చేయాలి. ఎరుక యొక్క మూలము, గుర్తెరిగే శరీరము ఏమీ లేదు.

అదీ అర్పణ అంటే. ఏమీ లేదని నిర్ణయమే గాని ఎరుక విడవలేదు. దానికి లోబడి వున్నావు. కనుక నన్నెవరు విడిపిస్తారాయని ఆర్తితో అశరీర గురువుని ఆశ్రయించావు. అశరీర గురువే ఇక్కడ పరమగురువు. ఆ పరమ గురువుని ఆశ్రయిస్తే ఆయనేం చెబుతున్నాడు? నీ తను మన ధనాలన్నీ నాకిచ్చేసేయ్ అన్నాడు.

అలా సర్వార్పణగా, కైంకర్య పద్ధతిగా ఆ గురువుకు కనుక అంతా ఇచ్చేస్తే నీవు లేనివాడవై ఎరుక పోయిందంటే అది నీ సామర్థ్యం కాదు. అలా సర్వార్పణతో నువ్వు సంసిద్ధం అవ్వడమే జరిగింది. ఆపైన గురు కృప.

జనకుడు కూడా తాత్కాలికంగా మనసు ఇచ్చాడు కానీ మనోనాశం కాలేదు. తరువాత అష్టావక్రుడు జనకుడికి బోధచేసి జనకుడికి నీకేమయ్యిందో చెప్పు అన్నాడు. అపుడు మనసు లేనిదయింది. అపుడు అన్నీచేసీ, చేయనివాడుగా వున్నాడు. రాజభోగాలు అనుభవిస్తూ కూడా అనుభవించని వాడుగా వున్నాడు. అంతకుముందు తాత్కాలికంగా మనసు ఇచ్చాడు. పూర్తిగా మనోనాశం తర్వాత బోధ ద్వారా ఎరుక లేనెరుక అయింది. అలాగే ఇక్కడ కూడా శిష్యుడి వలన కాదు. ఇవ్వడానికి సంసిద్ధంగా వుంటే చాలు. ఆ తర్వాత గురువే చూసుకుంటాడు, మార్జాల కిశోర న్యాయముగా.

శిష్యుడు అంటే గురువు యొక్క శిక్షణకి, గురువు యొక్క ఆజ్ఞలకి కట్టుబడి వుంటాను అని అర్పణమవ్వడమే. అంగీకారమవ్వడమే శిష్యుడు అనే పదానికి అర్థము. శిష్యుడు ఏమిటంటే గురుశిక్షణ ఎట్లైనా వుండనీ. గురు శిక్షణలో ఎన్ని పరీక్షలైనా పెట్టనీ. అంగీకారమై ఉండటమే శిష్య పదానికి అర్థము. మరి సచ్ఛిష్యుడంటే ముందు శిష్యరికం చేసినప్పుడు స్థూలంగా గురుసేవ చేస్తాడు. తరువాత సూక్ష్మంగా అంగ శుశ్రూష, స్థాన శుశ్రూష, భావ శుశ్రూష, ఆత్మ శుశ్రూష చేసి అంటే తానే లేకపోవడముగా జరుగుతుంది.

ఆత్మ శుశ్రూష అన్నప్పుడు గురువు తప్ప తాను లేనివాడు అని ఆ శుశ్రూషల ద్వారా సర్వ సమర్పణ సాధ్యమవుతుంది. అలా చేసినప్పుడేమయింది? పిండాండములో వున్న జీవుడు లేడు. బ్రహ్మాండములో వున్న ఈశ్వరుడు లేడు. విశ్వాండములో వున్న బ్రహ్మ లేడు. ఈ మూడిటికి అతీతమైనవాడు పరబ్రహ్మ బయలై ఉన్నాడు. గురువు ఆ బయలు రూపుడే.

ఈ పరబ్రహ్మ ఎరుకకి మూలము లేనివాడు. విశ్వాండములో వున్నా కూడా ఎరుకకు అక్కడ మూలమున్నది. విశ్వాండములో వున్నది కేవలాత్మ. అదే ఘన రూపము అఖండ ఎరుక.

అదే తరువాత అనేక ఖండ ఎరుకలుగా మారింది. సంస్కారము లెక్కడివి? ఈ సృష్టి కొన్ని లక్షలసార్లు జరిగినది. ఈ సృష్టి స్థితి లయముల కాలంలో సర్వ జీవులయొక్క సంచిత కర్మ రాశి అక్కడ వున్నది. అదే ప్రపంచమై సర్వజీవులకి అనుభవాల కొరకై ఈ ఉత్పత్తి స్థితి లయము జరుగుతోంది. కనుక విశ్వాండ అధిష్ఠానము బ్రహ్మ. బ్రహ్మాండ అధిష్ఠానము ఈశ్వరుడు. పిండాండ అధిష్ఠాన జీవుడేమో **"నేను, నేను"** అంటున్నాడు. అదీ సంగతి.

కనుక ఈ నేను ద్వారా ఈ మూడింటిని దాటాలి. పిండ, బ్రహ్మాండాల అవ్యక్త స్థితే విశ్వం. ఇన్ని రకాలుగా ఈ ప్రపంచం వుంది. వీటికి పిండాండ, బ్రహ్మాండ, విశ్వాండమందు అధిష్ఠానముగా ఎవరున్నారయ్యా అంటే జ్ఞాత.

పిండాండంలో జ్ఞాత 24 తత్వాల నుంచి విడిపడి తాను వేరై తాను మాత్రమే సంతృప్తుడుగా వుంటే వాడు కూటస్థుడు. పిండాండ కూటస్థుడిని కూటస్థ ఆత్మ అంటాము. విశ్వం అంతటా నిండి వున్నవాడు బ్రహ్మ అంటాము. విశ్వాతీతంలో వున్నవాడు, ఉన్నదున్నట్లున్నవాడు నిర్వికారుడు, అచలుడు, పరమైనవాడు, పరబ్రహ్మ.

ఇవన్నీ మనకు రాబోయే బోధలో వస్తాయి. ఈ పదాలన్నీ ఎరుకకే వున్నాయని చెబుతున్నాడు. పరబ్రహ్మ అంటే అఖండ ఎరుక అనొచ్చు. బయలు అనొచ్చు. కాకపోతే నిర్ణయం చేయాలి. ఆ పరబ్రహ్మకి సృష్టి బీజం వుంటేనేమో అఖండ ఎరుకే. సృష్టి బీజము లేనటువంటి పరబ్రహ్మ బయలు. సృష్టికి సంబంధించిన బీజము నిర్బీజమైనపుడున్న పరబ్రహ్మమే అచల పరిపూర్ణము. పరబ్రహ్మ ఉభయ తారకంగా వుంది. ఉభయ తారకంగా కాకుండా నిర్ణయంగా వుండాలి అంటే అచల పరిపూర్ణ పరబ్రహ్మయని పూర్తిగా నిర్ణయము అయితే నిర్దుష్టంగా వుంటుంది. కేవలం పరబ్రహ్మ అంటే ఒక్కొక్కప్పుడు దాన్ని బయలన్నా, ఒకప్పుడు కేవలాత్మన్నా, ఆ కేవలాత్మ అంటే లేనెరుకే. ఈ లేనెరుకే సర్వానికి అంకురం గనుక ఈ అంకురాన్ని అర్పించాలి పరమ గురునికి.

ఇదంతా బోధ ఎవడికి చెప్తున్నాడు. ఈశ్వరుడికా? బ్రహ్మకా? జీవుడికే! ఉపాధి ధరించినటువంటి జీవుడికి, జ్ఞాత, కూటస్థుడు అయినటువంటి జీవుడికి.

వ్యష్టి, సమష్టి భేదం అంతా కూడా జీవుడికే చెప్పి జీవేశ్వరైక్య పద్ధతిలో జీవుడే ఈశ్వరుడుగా వున్నాడని, ఈశ్వరుడిగా వున్న జీవుడికి జీవబ్రహ్మైక్య పద్ధతిలో బ్రహ్మగా వున్నవాడికే ఇదంతా చెప్తున్నాం. అంతేకాని ఈశ్వరుడు, బ్రహ్మకి మనం చెప్పటంలేదు. జీవుడికే చెప్తున్నాం. ఇంకా పరబ్రహ్మ అయ్యేదాకా చెప్తూనే వుంటాము. అవ్వడం కాదు, పరబ్రహ్మ తత్త్వము సిద్ధించేవరకు అని అనాలి. అయ్యేవరకు అంటే పొరపాటు వస్తుంది. అది సిద్ధ వస్తువు, సాధ్య వస్తువు కాదు. కనుక ఈ వేదాంతము, వేదము ఇదంతా కూడా విద్ అంటే ఎరుకే. విద్ అంటే తెలుసుకోవడం ప్రజ్ఞానం అంటే తెలుసుకునే తెలివి ఎరిగే ఎరుక కనుక వేదము అంటే విద్ అంటే ఎరుక. ఎరుక యొక్క మూలం వేద వేదాంతాలన్నీ కూడా ఎరుక గురించి ఎరుకైన ఆత్మ గురించి చెప్తున్నది. వేదాంతమందు బయలే వుందని నిర్ణయము. వేదాంతమేమో బయలున్నదనే నిర్ణయాన్ని అందించేది. నిజానికి బయలైన తర్వాత వేదము లేదు, వేదాంతము లేదు. ఈ రెండూ ఎరుకే కాబట్టి, ఎరుక లేదు, ఎరుక లేకపోతే బయలుని వేదాలు, వేదాంతము నిర్ణయిస్తాయా? బయలు బయలును నిర్ణయిస్తుందా. బయలందు ఎరుకే లేకపోతే అదేం నిర్ణయం చేస్తుంది? ఏది నిర్ణయం చేసినా ఎరుక పరిధిలోనే వుంటుంది గాని, ఎరుక ఎరుకగానే వుంటుంది గాని బయలుగా ఎందుకుంటుంది? అంటే విషయంగా ఎరుకనే దొకటి ఉన్నవని, అందులో ఎరుక లేకపోవడమనేదొకటి, ఎరుక లేకపోతే ఉన్నది బయలనేదొకటి సిద్ధమని పాఠంగా, బోధగా చెప్పడం జరుగుతున్నది. ముందుగా దానికి శిష్యులు సంసిద్ధమై అంకురార్పణము చేసి లేనెరుకని గురువుకు సమర్పణ చేస్తే, భ్రాంతి రహితమైతే, అపుడు మనం ఇక్కడ కూర్చున్నటువంటి లక్ష్యము నెరవేరినట్లే!

సంకల్పములో చెప్పాము లక్ష్యం. ఆ లక్ష్యం సిద్ధిస్తుంది. అదే ఇక్కడ మంగళకరం, పరిపూర్ణ పరబాహ్యమందు పరశివమై ఈ అంకురం లేనిది లేకుండా చేస్తుంది. ఈ సృష్టి రాకుండా చేస్తుంది. తిరిగి బ్రహ్మకి సంకల్పం రాకపోతే, నువ్వురావు. ఈశ్వరుడు లేకపోతే, జీవుడు లేకపోతే, నీవు లేకపోతే, ఇందులోనే యద్భావం తద్భవతిగా ఆ వున్నచోటికి భావనలో, ఊహల్లో వున్నవాటికి, తదాత్మ్యంగా అదో కారణంగా మహాకారణంగా వుంటే మళ్ళీ అవన్నీ తన స్వానుభవానికి రావటానికి ప్రారబ్దమొస్తే ప్రారబ్దమనుభవించటానికి పనిముట్టు ఒక ఉపాధి వస్తే వీటన్నిటితో ప్రపంచం ఉన్నది గాని, ప్రపంచం యొక్క అస్తిత్వము యద్భావం తద్భవతి అనే భావ మాత్రము. దానిని ఈ విధంగా అంకురార్పణ చేస్తే, అంతా లేనిదే అవుతుంది. ఉన్నదేదో ఉన్నది. ఆ వున్నది ఏమిటయ్యా అంటే పరిపూర్ణ పరబయలు, పరశివము. పరశివమన్నా, పరబయలన్నా, పరబాహ్యమన్నా ఒక్కటే. ఈ పరబాహ్యమందు పరశివమై ఏది ఉన్నదో అది శాశ్వతము, నిత్యము. అన్ని పరములకంటె పరము ఆ పర వస్తువు అచలమై, పరిపూర్ణమై ఎరుక లేనిదై ఎరుకకు మూలము కానిదై దానినుండి ఎరుక మళ్ళీ పుట్టనిదై వున్నది. కనుక ఎరుకయే జన్మాదులకు హేతువు కనుక అట్టి ఎరుక ఇక పుట్టదు. కనుక అజ్ఞాన మరణమే జనన మరణ రాహిత్యము. అది మాత్రమే జన్మరహితము. అది మాత్రమే అనంతము. అది మాత్రమే ఆద్యంతములు లేనిది.

సర్వము సంకల్పంలో లక్ష్యాన్ని చెప్పాము. అంకురార్పణలో లేనెరుక విషయం చెప్పాము. ఈ బోధ క్రమంలో ఏమేమి చెప్పబోతున్నాం? పిండాండ బ్రహ్మాండ, విశ్వాండముల గురించి జ్ఞాత, కూటస్థుడు, బ్రహ్మ, పరబ్రహ్మ, కేవలాత్మ గురించి ఈ కేవలాత్మే వీటన్నింటికి సకల ఎరుకలకు మూలమైన ఎరుకని, అంకురమని, ఎరుకలను ఎక్కడికక్కడే కొన్ని ఫలాలు కొన్ని ఆకులు, కొన్ని కొమ్మలు తీసేస్తే సరిపోదు. చెట్టు కొట్టేసినా సరిపోదు. దానికి దుంప ఉంటే, మళ్ళీ చెట్టొస్తుంది. ఆ అంకురముంటే ఏమీ లేనట్లుగా అంతా మాడిపోయినట్లుగా వున్నప్పటికీ వాతావరణ పరిస్థితులు అనుకూలిస్తే మాయయొక్క వీచికవల్ల అది తిరిగి అంకురిస్తుంది. కాలువలో గుర్రపుడెక్క చూస్తున్నాం. ఆ గుర్రపు డెక్కని అంతా తీసేసి కాలువలని ఎండబెడతారు. అలాగే, తామర తంపర తీగల్ని, ఆకుల్ని, అన్నీ తీసేసి బయట పారేసి చెరువుని ఎండబెట్టి చెరువులో వున్న మట్టిని కూడా బళ్ళతో తోలుకెళ్తారు. చెరువులో నీళ్ళు పెట్టగానే 5,6 మాసాల్లో మళ్ళీ తామర, తామరతంపరగా వచ్చేస్తుంది. ఎక్కడో అంకురం వుంది. పూర్తిగా పోలేదు. పొలాల్లో కలుపు ఎన్నిసార్లయినా తీస్తుంటారు. ప్రతీసారి తీస్తుంటారు. కానీ మళ్ళీ ఆ కలుపొస్తూ ఉంటుంది. ఆ కలుపు ఎంత తీసినా ఆ కలుపుయొక్క అంకురం వుంటోంది. తామర తీగ యొక్క అంకురం వుంటోంది. కనుక ఎరుక మొత్తానికి కేవలాత్మ అంకురం కనుక దాన్ని తీసివేయాలి. చివరికి కేవలాత్మ అఖండ ఘనరూప ఎరుకై ఆ కేవలాత్మలో వున్నటువంటి ఆ ఎరుకని కూడా, ఆ అఖండ ఎరుకని కూడా, నిర్మూలించాలి. తిరిగి రాకుండా నిర్మూలించాలి. నీవల్ల కాదు కాబట్టి, పరమ గురువుకి అంకురార్పణ చేస్తే ఆయన చూస్తారు.

కేవలాత్మ లేకుండా చేస్తే బయలే ఉన్నది. కనుక మన సమస్యేమిటంటే, ఈ ఎరుకే మనకు నేను అనే దాంతో ప్రారంభమైంది. ఉపాధిని ధరించి దేహమే నేనైనప్పుడు దేహాత్మ అయింది. కూటస్థ నిర్ణయంలో జీవుడు నేను అన్నపుడు జీవాత్మయింది. సమష్టిలో శివాత్మయింది. శివాత్మే కేవలాత్మయింది. ఘన రూపంలో కేవలాత్మయింది. ఈ ఘనరూపం దాన్నట్లా వుండనిస్తే ఎంత సాధన చేసి ఎన్ని పోగొట్టుకున్నా ఈశ్వరుడుగా, మళ్ళీ జీవుడుగా దిగివస్తాడు. పరమపద సోపానపటంలో పెద్ద పాము నోట్లోపడి కిందకొచ్చినట్లుగా వస్తాం. అలా రాకుండా వుండాలంటే కేవలాత్మ అనేటటువంటి అంకురాన్ని మూలచ్ఛేదో అన్నాము. అంకురాన్ని మూలం లేకుండా చేయాలి. ఆత్మ అనేటటువంటిదేదో దానియొక్క మూలం కనుక్కోవాలి. మూలం కనుక్కుంటే ఏమైంది? కేవలాత్మగా వుంటే నేనదై వున్నాను, **"సోహం"** అయింది.

నిర్గుణం తథానిత్యశుద్ధం చైవ, నిరాకాశో నిరాకారతః, నిష్కళం ఏవ, ఇవన్నీ అన్నపుడు ఏది నిర్ణయమో అక్కడ ఎరుక లేదు. కనుక కోహం నాహం అయింది. కోహం, సోహం రెండూ లేవు. రెండూ ఎప్పుడైతే పోయాయో అది నాహం. నాహం అయినప్పుడే బయలు. ఈ అహమనేటువంటిది మాయ. మాయా ప్రతిబింబంగా లేక మిథ్యా ప్రతిబింబంగా తోస్తుంది. ఆ పరమాత్మ యొక్క చైతన్యమే ప్రతిబింబ చైతన్యంగా నేనులో వుంది. ఆ చైతన్యంగాని, ఆ ప్రకాశం గాని బింబ ప్రకాశం కాదు. నేనులో ప్రతిబింబ రూపంలో వుంది. ముందు మనమేం చేయాలి. ప్రతిబింబ రూపాన్ని తీసేయడం కోసమని చెప్పి, బింబజ్ఞానము పొంది, ఆ బింబజ్ఞానంలో వున్న పరమాత్మ ప్రకాశం కళ కనుక, దాన్ని నిష్కళ చేసినపుడు కేవలాత్మ అనేటువంటిది మిగిలింది. అది కాస్తా అంకురార్పణైతే ఆ నిష్కళే శాశ్వతము.

ఆ కేవలాత్మలో వున్న పూర్ణకళ లేకుండా పోయినప్పుడు, అది బయలు. ఈ క్రమంలో ఆత్మ విచారణ. ఇదంతా అచల సిద్ధాంతానికి తగ్గట్లుగా ఈ అద్వైత సాంప్రదాయ బోధని, విచారణని ముక్తి మార్గంలో లక్ష్యాన్ని ముందే మనం పెట్టుకుని ఆ లక్ష్యం దిశగా మనం ప్రయత్నిస్తూ పోవాలి. అందుకని శరీరత్రయ విలక్షణము ఆత్మ, అన్నప్పుడు కూడా మొట్టమొదట సంకల్పంలోను అంకురార్పణకు ముందే నిర్ణయం తీసుకోవాలి.

అక్షరాభ్యాసం చేసుకుని ఓం నమః శివాయ సిద్ధం నమః అని ఆ చిన్న పిల్లాడికి చెబుతున్నాము. లక్ష్యాన్నిచ్చాము. అక్కడ సిద్ధవస్తువు యొక్క లక్ష్యాన్నిచ్చాము ఆ పిల్లవాడికి తెలియకపోయినా ఓనామాలు దిద్దినా. అలాగే ఇక్కడ ఇంకా బోధ ప్రారంభం కాలేదు. మీకొక డైరెక్షన్ ఇవ్వాలి. కేవలాత్మ లేనిది. నిర్గుణ బ్రహ్మము శాశ్వతమైనది. పరమపదము మోక్షమని, మోక్ష స్వరూపమని, దానికంటే ఏదైనా సరే మిగతావన్నీ తాత్కాలిక మోక్షాలని.

సార్ష్ణి ముక్తి, సామీప్య ముక్తి, సారూప్య ముక్తి, సాలోక్య ముక్తి, సాయుజ్య ముక్తి అని పంచ ముక్తులున్నాయి. పంచముక్తులు కూడా తిరిగి వచ్చేవే. భ్రాంతి కొంచెమున్నా గాని, భ్రాంతి పూర్తిగా రహితం కాకపోతే, ఈ కొద్ది భ్రాంతిలో అనేక భ్రాంతులు రావచ్చు. ఎరుక అంతా కేన్సరు రోగంలాగా ప్రమాదమైనది. కనుక దానియొక్క మూలము, అంకురము తీసేస్తే తప్ప కేన్సరు స్వస్థతకు రాదు. ఒకసారి దాని మూలం పూర్తిగా తీసేస్తే మళ్ళీ రాదు. డాక్టరు ఎంత చేసినా ఎక్కడో ఓ దగ్గర వుండిపోతే అది మళ్ళీ వస్తే, సెకండరీ వస్తే దాన్నింక ఎవ్వరూ ఏమి చేయలేరు. ఆ కేన్సరు ఇక ఆగదు. శరీరమంతా వ్యాపిస్తుంది. అందుకని దాని అంకురం తీసేస్తే శరీరంలో వ్యాపించదు.

ఎరుక కూడా కేన్సరు లాంటిదే. మూలాన్ని తీసేయాలి. మూలమే అంకురము. కనుక అంకురాన్ని తీసేయాలంటే శిష్యునివల్ల కాదు, కాబట్టి పరమ గురునికి అర్పణ చేయాలి. ఈ పద్ధతిలో మనం ఏం చేయాలి అనే దాంట్లో, ఎలా ఉపక్రమించాలో అనే దాంట్లో, ఒక ప్రతిపాదనగా ఒక పరిచయంగా చెప్పి గాని, అసలైన బోధ మొదలు పెట్టలేము. ఆత్మ విచారణ అంటే ఎరుక విచారణ. ఆత్మ విచారణ అంటే నేను విచారణే. నేనెవరు? అనే విచారణ, దాని సారము నేను అద్వై వున్నానని.

కోహం అని ఎక్కడికక్కడ విచారణ జరగకపోతే లక్ష్యం చేరలేము. తత్వమసి వాక్యమును 11 సార్లు చెబితేనే ఇది కాదు అది అని మళ్ళీ అది కూడా కాదు అని త్వం రూపంలోని వాచ్యార్థాన్ని వదలి, ఆ తద్రూపంలో కూడా మళ్ళీ వాక్యాన్ని విచారిస్తే ఆ లక్ష్యార్థంలో తత్ త్వంలు ఎరుకగా ఒక్కటే అని మళ్ళీ వాచ్యార్థాలు తీసేస్తే, అసి పదమే బయలై ఉంటుంది.

అలా శ్వేతకేతువుకి 11 సార్లు చెప్తే కాని అవ్వలేదు. హిరణ్యగర్భుడేమో మొట్టమొదట సృష్టిలో మొట్టమొదట వచ్చాడు. అతనికి ఒక్కసారి చెప్తేనే అయిపోతుంది. అలాగే ఇది కాదు, ఇది కాదని తత్వమసి వాక్యాన్ని ఎన్నిసార్లు అయినా చెప్పాల్సి వస్తుంది. చెప్పినప్పుడు వీటన్నింటికి ఏ నేను, ఏ వ్యవహారము, ఏ భావమో, ఏ అనుభూతి వున్నదో అదంతా ఎరుకే. దాన్ని దశలవారీగా పైకి నడపాలి. పైకి నడిపి చివరకు ఇది కాదు, ఇది కాదు అని చివరికి ఏదైతే మిగిలి వున్నదో అది అక్కడ అనుభవరూపంలో వుంటే మళ్ళీ ఇది కాదని, అలాగే ఇక్కడ ఆత్మ కూడా లేకుండా పోతుంది. ఆత్మ కేవలమై ఆ కేవలాత్మగా కూడా లేకుండా పోతుంది. కేవలాత్మని లేకుండా చేసేదాక ఇది కాదిది కాదని విచారణ చేయాల్సిందే.

కనుక ఆత్మ విచారణ అంటే నేను విచారణ. కోహం నుంచి సోహం దాకా. సోహం కూడా ఎరుకే కాబట్టి ఎరుక లేకుండా వుండడం నాహం. నాహమే బయలు. ఈ విచారణ చేయాలంటే ఏఏ ప్రాతిపదికలుగా వుండాలో తెలియాలి. విజ్ఞానము లేని విద్య, వివేకములేని విజ్ఞానము, లౌకికము లేని మనిషిని, ఇలాంటివి విచారిద్దాము. వివరంగా చెప్పుకుందాము.

## ఆత్మ విచారణ

సంకల్పము అయిపోయింది. సత్యాన్ని సాధించేటటువంటి దృఢమయిన సంకల్పముతో ఈ గ్రంథమును సత్సంగముగా ప్రారంభిచాము. ఆ సంకల్పము నెరవేరాలని బోధ కోసము సద్గురువును ఆశ్రయించాము. లక్ష్యమేమో బయలు, తొలగవలసినది యెఱుక. యెఱుక ఎన్ని విధాలుగా ఉంది? అజ్ఞానమనే యెఱుక, తమోగుణ యెఱుక, రజోగుణ యెఱుక, సత్వగుణ యెఱుక, జీవుడనే యెఱుక, ఈశ్వరుడనే యెఱుక, బ్రహ్మమనే యెఱుక, సచ్చిదానందమనే అనుభవరూప యెఱుక, ప్రజ్ఞానమనే ఎరిగే యెఱుక, ఉపాధిగతమయినటువంటి ఆధ్యాసగానున్న యెఱుక, విక్షేపమనెడి యెఱుక వీటన్నిటియొక్క ఆవరణ తొలగితే తప్ప బయలనే నిర్ణయము రాదు. ఈ యెఱుక ఎక్కడిదాకా ఉంటుందంటే సచ్చిదానందమనే యెఱుక కూడా సగుణమే. ఇదికూడా పోవాలి. సగుణము యొక్క యెఱుక. అవ్యక్తములో నిర్గుణముగా ఉంది. కాని నిర్గుణము సగుణము అయ్యేందుకు అవకాశము ఉంది. గుణములు అంకురించడానికి వీలుగా బీజముగా ఉన్న స్థితి. నిర్గుణముగా ఉన్నను, బీజము అంకురించగానే సగుణముగా మారే అవకాశముంది. దానిని సమూలముగా తీసివెయ్యాలి.

మళ్ళీ అంకురించకుండా నిర్బీజము చెయ్యాలి. మూలములో ఆ యెఱుక యొక్క పేరు కేవలాత్మ. ఈ కేవలాత్మ అంకురార్పణలో 'లేనెఱుక' అని చెప్పబడింది. మూలంలో ఇది అంకురించే స్థానంలోనే, దీనిని తొలగించాలి. మూలాన్ని నిషేధిచాలి. మూలాన్ని ఛేదించాలి. ఆ మూలంలో ఉన్న కేవలాత్మనే, కేవలంగా ఉన్న సగుణ బ్రహ్మమునే సమూలంగా తీసేయాలి. గుణములతో ఉన్నటువంటి యెఱుక బ్రహ్మమే మోక్షమని మనము కొంతప్రయాణము చేసినప్పటికీ అది సామీప్య, సాలోక్య, సారూప్య సాయుజ్య ముక్తులను అందించాయి. ఇవన్నీ తిరిగి వచ్చే మోక్షాలే. ఎందుకంటే యెఱుక రహితమయినటువంటి బయలే తిరిగిరాని మోక్షము గనుక. నిర్గుణము సగుణము అయ్యేటటువంటి అవకాశము లేనటువంటి బోధ కావాలి. అంటే శాశ్వత నిర్గుణమయిన, త్రిగుణ రహితమయిన పరబ్రహ్మ లక్ష్యము కావాలి.

ఒక నియమబద్ధంగా వచ్చిన సృష్టిలో జీవులకూ జీవులకూ బేధముంది. జీవులకూ, ఈశ్వరునకూ బేధమున్నది. ఈశ్వరుడికీ జగత్తుకూ బేధమున్నది. జగత్తులో వస్తువులకూ, మరికొన్ని వస్తువులకూ బేధమున్నది. ఇన్ని బేధములతో ఉన్నటువంటిదంతా కూడా 'జగత్తు'. 'జ' అంటే సృష్టించబడేది, సృష్టించబడ్డాక కనపడేది. 'గతి' అంటే గతిస్తూ ఉండేది. మార్పు చెందుతూ ఉండేది, రూపాంతరము చెందుతూ ఉండేది. చివరికి గతించిపోయాక లేకుండా పోయేది. జగత్తుకు రెండర్థాలున్నాయి. 'స్థితి, గతి' అంటాము. 'స్థితి' అంటే స్థిరముగా ఉండటము. 'గతి' అంటే కదులుతూ ఉండటము. చలిస్తూ ఉండటము. ఈ చలిస్తున్నది ఎలా తెలుస్తుంది అంటే తనయొక్క రూపాంతరము వల్ల భూత, వర్తమాన, భవిష్యత్తు కాలములలో లేకుండుటవల్ల, అనుభవాల భేదము వలన, ఆలోచనల బేధము వలన, శబ్ద, స్పర్శ, రూప, రసగంధాదులను గ్రహించుటలోని భేదముల వలన, ఇలా అనేక భేదములు తోస్తూ ఉన్నాయి. **'సమత్వం యోగముచ్యతే'** అన్నారు. ఇప్పుడు చెప్పినటువంటి అన్ని రకాల బేధములు కూడా, సమత్వము చెంది, అబేధమయిందో, అబేధమనే అర్థముతో 'అసి' పదము ఏదయితే ఉన్నదో, ఆ 'అసి' పదమే మోక్షము. **'సమత్వం యోగముచ్యతే'** అంటే 'అసి' పదమే మోక్షము అని అర్థం వస్తుంది. ఎన్ని రకాల భేదాలు పోవాలి? నానారకాలుగా ఉన్నవన్నీ కూడా, లేకుండా పోవాలి. అనేక భేదాలతో ఉన్నటువంటివి కూడా లేకుండా పోవాలి. మొదట్లో కొన్ని తీసివేసినా, చిట్టచివరికి పోవలసినదేమిటంటే జీవుడికీ, జీవుడికీ భేదము లేదు. జీవుడికీ, ఈశ్వరుడికీ బేధము లేదు అని, జగత్తు మిథ్య అని జీవేశ్వరైక్యము కావాలి.

అక్కడికి 'అసి' పదము అయిపోయింది. ఇంకా 'అసి' పదాన్ని 'తత్వమసి' వాక్యముతోటి పైకి తీసుకు వెళతాము. ఈ పైకి తీసుకు వెళ్ళాలంటే మన బుద్ధిలో విచక్షణా జ్ఞానము, వివేకము ఉండాలి. దానికోసం గురుబోధ శిష్యుడికి అందాలి. ఈ బోధ దేనిగురించి, ఆత్మవిద్య, బ్రహ్మవిద్య కోసము. ఆత్మవిద్యకీ, బ్రహ్మ విద్యకేమిటి తేడా? ఆత్మ అంటే 'నేను నేనైన నేను' 'కోహం' నేనెవరు అంటే నేను అదయి ఉన్నాను అనేటటువంటిది. జీవుడు ఒక ప్రత్యేకంగా, ఒక పరిమితమైనటువంటి శరీరంలో ఉన్నవాడు నేనెవరు అని తెలుసుకుంటూ నేను నేనయి ఉన్నాననే జ్ఞానం పొందటాన్ని ఆత్మవిద్య అన్నారు. పిండాండములో ఘటాకాశముగా ఉన్న ఆత్మను ఆయొక్క ఘటమును అనగా శరీరత్రయమును, పంచకోశముల యందు వాటిని అంటక విలక్షణమై, వాటికి ఆధారమై వీటిలో అది వ్యాపకమై, అది మాత్రము అంటక, సచ్చిదానందరూపమై, ప్రజ్ఞాన రూపమై, చైతన్య రూపమై, ప్రకాశ రూపమై, సర్వవ్యాపకమై ఉన్నటువంటిది ఆత్మ. ఈ విధముగా తన దేహమందు, ప్రతి ఒక్కరి దేహమందు, ఎవరికివారు శిష్యుడైతే ఆ శిష్యుని యొక్క దేహమందు, విచారణ జరపటము ఆత్మ విచారణ అన్నారు. స్థాలీ పులాక న్యాయములో, స్థాలీ అంటే అంటే భాండము. పులాకము అంటే మెతుకు. ఒక భాండమందు అన్నం ఉడుకుతూంటే, ఒక మెతుకు ఉడికితే అంతా ఉడికినట్లు ఎలా భావన చేస్తామో, ఘటమందు ఒక శరీరమందు, ఒక శిష్యునియందు విచారణ చేసి, ఆత్మయొక్క లక్షణాలను పట్టుకుంటే, అందరియందు కూడా ఆత్మ అదే లక్షణాలతో ఉన్నదని, అందరియందు అఖండముగా అవిభాజ్యముగా ఉన్నదని, అందరిలోనూ ఒకే ఆత్మ, అఖండాత్మ వ్యాపకమయి ఉన్నదని, అట్టి ఆత్మను కనుగొంటే అది 'బ్రహ్మము'. 'ఆత్మ' అంటే ఘటాకాశము. బ్రహ్మము అంటే మహాకాశము. ఆ పద్ధతిలో 'ఆత్మ విద్య' 'బ్రహ్మ విద్య' అనేది ఒకటుంది.

బ్రహ్మ విద్యేమో సృష్టి క్రమము, సృష్టి, స్థితి ప్రళయాలను, ఒక సైన్సులాగా ఎలా వచ్చిందీ, ఎలా పోతుంది అనేది చెపుతుంది. ఆత్మ విద్య అనగానే ఎవరికివారు ఆ తాను తానైనటువంటి వాళ్ళలో ఒక పరిమితముగా ఉన్న శరీరమేనేననే అనుభవంలో ఉన్నవారు ఆత్మను తెలుసుకునేది 'ఆత్మవిద్య'.

ఆత్మవిద్య కొంతవరకు తెలుసుకున్న తరువాత ఆత్మకు, బ్రహ్మకు తేడా లేదు అన్నప్పుడు ఆత్మని బ్రహ్మగా సమం చేసి ఒక పిండాండములో ఉన్నదే అన్నిటిలో సమష్టిగా అదే ఉన్నదని తెలుసుకుని, వ్యష్టి సమష్టి బేధము లేనటువంటి అఖండ, అవిభాజ్య, ఆత్మని మనం గ్రహించినప్పుడు ఆ సమష్టిగా, సర్వ వ్యాపకముగా ఉన్నటువంటి ఆత్మకంటే శ్రేష్ఠమైన పరమాత్మ, శుద్ధ చైతన్య ఆత్మ, సృష్టికి సర్వాధారమైన బ్రహ్మకు భేదము లేదని తెలిసేటటుంటి విద్య బ్రహ్మవిద్య. అటువంటి విద్య మనమీద ఆపాదించుకోబడాలి. ఉపాసనగా జరగాలి. యోగముగా జరగాలి. అనుష్ఠానముగా జరగాలి. ప్రపంచంలో అనేక విద్యలున్నాయి. 64 రకాల విద్యలున్నాయి. 63 విద్యలూ పొట్టకూటికే ఉంటాయి. లేక కేవలము తెలుసుకుని ఆనందించడానికుంటాయి. లేక తెలుసుకున్నవి మళ్ళీ జీవితంలో సుఖాన్ని పొందటానికి, సమాజంలో అందరూ సుఖాన్ని పొందటానికి పనికివచ్చే విద్యలున్నాయి. దుఃఖనివారణ, బాధ నివారణ విద్యలున్నాయి. ఏ విద్యైనాగాని, విజ్ఞానము లేని విద్య పనికిరాదు. విద్+జ్ఞానము= విజ్ఞానము.

జ్ఞానమును తెలుసుకున్న నేను జ్ఞానమంటే ఏమిటో, ఆత్మంటే ఏమిటో, బ్రహ్మంటే ఏమిటో, నేనంటే ఏమిటో, తెలుసుకోవటమే విజ్ఞానము. కనుక నువ్వు ఎన్ని విద్యలు నేర్చుకున్నా పాఠాలు అప్పచెప్పేసి పరీక్షలు రాసేసి, మార్కులు తెచ్చేసుకుని పాసయిపోయిన తరువాత ఆ విద్యని మర్చిపోయేటట్లుగా కాదు. ఆ విద్య నీకు సంబంధించే కనుక, నీ స్వరూపము ఇట్టిది అని తెలిసింది. భ్రాంతిలో ఉన్నటువంటి, శరీరానికి సంబంధించినటువంటి ఆలోచనలను, అభిప్రాయాలను నీవు కాదని, నీ స్వరూపము ఇట్టిది అని తెలుసుకోవటమే జ్ఞానము. ఎవరి గురించో కాదు నీ గురించే కనుక, నీ గురించి నీకు కలిగేటటువంటి దృఢమైన అభిప్రాయముతో కూడిన అనుభవము విజ్ఞానము. అందుకని విజ్ఞానము లేని విద్య పనికిరాదు. వివేకము లేని విజ్ఞానము పనికిరాదు.

విజ్ఞానముంది. నీమీద అప్లై చేసుకున్నావు. మళ్ళీ వివేకంతో ఏం పని? ఉన్న ప్రపంచాన్ని ఎక్కడికి పంపిస్తావు? ఉన్న సంసారము బాధ్యతనెక్కడికి పంపిస్తావు. ఈ శరీరానికి కూడు, గుడ్డ, నీడ, కావాలిగా! వాటికోసం ప్రయత్నం చెయ్యాలిగా! ఎట్లా? మానేస్తామా? ఇవన్నీ కాదు అనేది చెప్పినప్పటికీ, కాని దాంట్లో నుండి ఎలా వేరుపడతావు? కాని దాంతో ఎలా మేనేజ్ చేస్తావు? అక్కడొచ్చింది. కర్మయోగము, భక్తియోగము. **కుర్వన్నే వేహకర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః** అని ఈశావ్యాసోపనిషత్తు. పుట్టిన ప్రతివాడు కర్మ చేయకుండా ఉండలేడు. కర్మ చేయవలసిందే. ఆ కర్మ చేస్తూ నూరు సంవత్సరాలు జీవించమంటున్నాడు. ఆ తరువాత మోక్షం పొందమంటున్నాడు. ఆ విధంగా మానవునియొక్క ఆయుఃప్రమాణము నూరు సంవత్సరాలు. అయితే ఎట్లా కర్మ చేయాలి. **ఈశావాస్యమిదం సర్వం**. అంటే అంతా ఈశ్వరమయమే. ఈ కనబడేవన్నీ ఈశ్వర సృష్టి. పైగా ఈ కనపడేవన్నీ ఈశ్వరుడే. ఈశ్వరుని యొక్క విభూతి. అయినప్పటికీ ఈ కనపడేవాటిని, ఈ ఆకలి దప్పికలకు గాని, మరే అవసరాలకయినా సరే వాడుకోవాల్సినటువంటి అవసరం ఉన్నది. కనుక నీది, నాది అని అనకుండా, ఇదంతా ఈశ్వరుడే. ఈశ్వర కృపవల్ల మనకు లభించింది. పైగా ఈశ్వరుడే తన విభూతి స్వరూపంలో సర్వమూ తానైయున్న దాంట్లో ఆ సర్వములో కొన్ని మనం బ్రతకడానికి ఉపయోగించుకుంటున్నాం. కనుక అంతా ఈశ్వరార్పణంగా, ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలు చేస్తే కర్మ అంటదు. ఈ విధంగా నూరేళ్ళు బతకమన్నారు. ఈశ్వరుడు అనుగ్రహిస్తే, బ్రతకటానికి, నేను ప్రసాదంగా స్వీకరిస్తున్నాను అనేటటువంటి ప్రసాద బుద్ధితో జీవించమన్నారు. ఇదీ వివేకము. వివేకము లేని విజ్ఞానం పనికిరాదు. లౌకికము లేని మనిషంటే, కుండ పగలగొట్టినట్లు నేనంటే ఇంతేనండి అంటే చాలామంది, చాలా స్వభావాల్లో నేనంటే ఇంతే అని అందరూ అనుకుంటున్నారు. ఎవరికి వారు అలా అనుకుంటున్నారు. కాని అందరూ ఒక మాదిరిగా, ఒక స్వభావంగా లేరు. స్వభావరీత్యా ఒకసారి అనుకూలంగానూ, మరోసారి వ్యతిరేకంగా, వైరుధ్యంగా కూడా మనం ఉంటున్నాం. లోకంలో ఉన్న ఇతర వ్యక్తులతో, వాళ్ళతో ఎలా జీవించాలి అనే వివేకం ఉండాలి. ఆ వివేకాన్ని ఉపయోగిస్తే లౌకికం అంటాం.

నువ్వు ఆత్మ జ్ఞానివైనంత మాత్రాన, నువ్వు సత్వగుణంలో ఉన్నంత మాత్రాన ఎదుటివారు చాలామంది తమోగుణం, రజో గుణాలతో ఉంటారు కనుక, వాళ్ళతో ఎలా మెలగాలో తెలిసి మెలగటం అనేది ఉండాలి. మీరు ఎవర్నీ ఏమీ మార్చలేరు. ప్రతివాడి యొక్క స్వభావం **'పుట్టుకతో వచ్చినది పుడకలదాకా పోదు'** అనేటువంటిది సామెత. ఆ స్వభావము, ఆ వ్యక్తిత్వము, పూర్వజన్మ కర్మలని ఏ విధంగా సంపాదించాడో, అందులో అతనియొక్క గుణాలు ఏ రకంగా ఉన్నాయో, ఆ కర్మ వాసనలు, గుణాలు కలిపినటువంటిది సంస్కారము. ఆ సంస్కారము ఏ వ్యక్తియొక్క అహంతో కూడిందో అది వ్యక్తిత్వము. ఆ వ్యక్తిత్వాలు లక్షమందికి లక్ష రకాలుగా ఉంటాయి. మనం ఈ ప్రపంచంలో లక్షమంది మధ్య జీవించాల్సి రావచ్చు. ఉత్తములైనటు వారిలో కూడా మీరనుకున్నటువంటి ఉత్తమత్వం అతనిలో కనపడకపోవచ్చు. ముళ్ళకంచె మీద పంచె వేస్తే లాగితే చిరిగిపోతుంది. కనుక ఆ ముళ్ళలో పంచె చిరగకుండా ఎలా తప్పించి పంచెని బయటకు తీస్తామో, ఈ లోకంలో ప్రతివారి విషయంలో కూడా **'నొప్పించక తానొప్పక తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతి'** అన్నట్లుగా మెలగాలి. అట్లాని నువ్వు రాజీ ఏం పడక్కరలేదు. ఓర్పు, సహనము, త్యాగము ఉండాలి. ఇతరులను ఎలా మేనేజ్ చేయాలో తెలిసి ఉండాలి.

మనం అసత్యం చెప్పకూడదు. అసత్యం చెప్పాల్సి వచ్చినప్పుడు చావు కబురు చల్లగ చెప్పినట్లుగా, నిదానంగా చెప్పాలి. సాధ్యమయినంతవరకూ విసురుగా, రజోగుణంతో కాకుండా, సాత్వికంగా, ప్రేమపూర్వకంగా మాట్లాడాలి. అప్రియమైనటువంటి మాటలు మాట్లాడకుండా, ప్రియమైన మాటలు మాట్లాడాలి.

ఎవర్నీ, ఎవరూ ఇంకొకరు మారుస్తారు అనేటువంటి భావన లేకుండా అవసరమైతే నువ్వే మారాలి అనే పద్ధతిగా జీవించడం లౌకికం. కనుక ఇటువంటి లౌకికం లేని మనిషి అనేక ఆపదలు తెచ్చుకుంటాడు. అశాంతికి గురవుతాడు. లౌకికం ఉన్న మనిషి సమయ సందర్భాలనుబట్టి ఏదైతే మంచి లక్ష్యాన్ని, ఆదర్శాన్ని పెట్టుకున్నాడో దానిని కాపాడుకుంటూనే అనేక స్వభావాలతో ఉన్నటువంటి మానవులమధ్య ఒకోసారి నష్టపడ్డప్పటికీ, త్యాగం వల్ల శాంతిగా ఉంటాడు. లాభం తగ్గినప్పటికీ ధర్మంగా ఉంటాడు. తనయొక్క శీలాన్ని, ఆత్మ విద్య, ఆత్మానుభవానికి అనుగుణంగా ఏ విధంగా కాపాడుకోవాలో, ఆ రకంగా కాపాడుకోవాలి. కనుక నేనింత గొప్పవాడిని, ఆత్మ జ్ఞానిని అని ప్రకటించకూడదు. ప్రకటించవలసిన అవసరం లేదు. ప్రకటిస్తే అది కూడా అహంకారమే అవుతుంది. అహంకారమంటే రజోగుణమే. ఈ రకంగా సాధకుడు తనయొక్క స్వస్థితిని పెంపొందింపచేసుకుంటూ, ఆధ్యాత్మిక ప్రయాణంలో పురోగమనం చేసుకుంటూ లోకంలో ఎంతవరకు అవసరమో అంతవరకు మెలగుతూ ఉపయోగించుకుంటూ, దేనిమీదా సంగత్వం లేకుండా అప్పటికప్పుడు నటనగా, అవసరార్థంగా జీవించటమే లౌకికం.

తలపులలో గాని, మాటలలో గాని, చేతలలోగాని, ఇతరులకు ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని నీ కారణంగా వాళ్ళకి బాధ లేకుండా ఉండేలా మెలగాలి. ఇవన్నీ లౌకికం క్రిందకే వస్తాయి. మనిషి అంటే, మనసే తాను అని ఉపయోగించుకుంటూ జీవించేవాడు మనిషి. నిర్ణయాత్మక బుద్ధిని ఉపయోగించుకునేవాడు మనీషి. మనిషికి–మనీషికి ఏమిటి తేడా? **'మన ఏవ మనుష్యాణాం'** మనసుని ఉపయోగించుకుంటూ, మనస్సే తానైయుండి వ్యవహరించేవాడు మనిషి. **'మనసు సంశయాత్మకం, బుద్ధి నిర్ణయాత్మకం'** ఆ నిర్ణయాత్మక బుద్ధి దృఢంగా ఉండి, వివేకంతో ఉండి లౌకికంగా ఉండి, విజ్ఞానంతో ఉండి, అటువంటి బుద్ధిని దృఢముగా, చంచలము కాకుండా, స్థిరముగా ఎవరైతే నిలబెట్టుకుంటారో వాడు మనీషి. లౌకికము లేని మనిషి అంటే, మనసున్నటువంటి మనిషి లౌకికాన్ని పెట్టుకున్నప్పుడు అదికూడా ఒక సాధన అవుతుంది. ఇతరుల స్వభావములతో నవ్వు బాధపడకుండా సరిపెట్టుకోగలిగితే నీ స్వభావము సత్వ గుణంలోకి, ఆత్మ జ్ఞానానికి అనుగుణమైనటువంటి సాధనా సంపత్తిని సాధించడానికి పనికొస్తుంది.

ఏదైనా పని చేస్తే వివేకముతో, విచక్షణతో చెయ్యాలి. దాని ఫలితము ఎలా ఉంటుందో, ముందుగా ఆలోచించి చెయ్యాలి. ఆ పని చెయ్యటానికి తలకు మించిన భారంగా చెయ్యకూడదు. అప్పు చేస్తే తీర్చగలిగితేనే అప్పు చెయ్యాలి. అప్పు తీర్చలేనివాడు అప్పు చెయ్యకూడదు. వడ్డీకి చక్రవడ్డీ అయితే అసలుని మించిపోతే వాడు చాలా ఇబ్బందులలో పడతాడు. తన యోగ్యత, తన పాత్రత, తన యొక్క బలము గ్రహించి దానికి అనుగుణంగా అంతవరకే పనిని చేపట్టాలి. ప్రతిదానికి ఒక సాధికారత ఉంటుంది. సాధికారత లేనివాడు, ఆ పని తేలికైనా కూడా చెయ్యకూడదు. భగవద్గీతలో స్వధర్మము ఎంత కష్టమైనా చెయ్యమన్నారు. పరధర్మము ఎంత సుఖాన్నిచ్చినప్పటికీ వద్దన్నాడు. ఇదంతా విచక్షణ.

విచక్షణతో. ప్రణాళికా బద్ధంగా చేసేపని, అనుకున్న ఫలితాన్ని చక్కగా ఇస్తుంది. అలా ప్రణాళిక లేకుండా, విచక్షణ లేకుండా, యోగ్యత లేకుండా, పాత్రత లేకుండా సాధికారత్వం లేకుండా, నీ అర్హత లేకుండా, తలకు మించినటువంటి భారం పెట్టుకుని మధ్యలో వదిలేస్తారు. లేకపోతే పూర్తిచేయబోయి నష్టపడతారు. కష్టపడతారు. ఆ విధంగా విచక్షణ లేని పని చేపట్టకూడదు.

విజ్ఞత లేని పాండిత్యం, విజ్ఞత అంటే సమయస్ఫూర్తి ఉండాలి. సమయము సందర్భము ఉండాలి. సభా మర్యాద ఉండాలి. సమాజంలో ఏ టైములో ఏది అవసరమో అందరూ వింటున్నారా లేదా అని చూసుకోవాలి. అక్కరలేని చోట అనవసరమైన జోక్యం చేసుకోకూడదు. అవసరమైన చోటకూడా, నీకా బాధ్యత ఉంటేనే, నువ్వు, నీ జ్ఞానాన్ని, నీ పాండిత్యాన్ని, బయట పెట్టవచ్చు. అవసరంలేని చోట నీ పాండిత్యాన్ని బయటపెట్టకూడదు. ఒక పడవవాడి వద్దకెళ్ళి పండితుడు నీకదొచ్చా, ఇదొచ్చా అని అడిగాడు వాడు 'రాదు' అంటే, అయితే నీ జన్మ వ్యర్థం అన్నాడు. చివరికి ఆ పడవ నడిపేవాడు ఏం చెప్పాడంటే నీకు ఈత వచ్చా అని అడిగాడు. రాదు అన్నాడు పండితుడు. కాసేపట్లో పడవ మునగబోతోంది. నాకు ఈత వచ్చు, నేను తప్పించుకుంటాను, ఈత రాకపోతే మీరేం చేస్తారు? అని అడిగాడు. అది విజ్ఞతలేని పాండిత్యమంటే. పాండిత్యముంది గాని విజ్ఞత లేదు. ఎద్దుకేం తెలుసు అటుకుల రుచి అని సామెత. అలాగే మీరు పాండిత్యాన్ని ఎక్కడ వెలగబెట్టాలో, ఎక్కడ ప్రదర్శించాలో, అవతలివాడి వినే యోగ్యత, అర్హత, ఉందో లేదో తెలుసుకుని చెప్పాలి. వాడికి నువ్వు చెప్పాల్సిన బాధ్యత నీకు ఉందో లేదో తెలుసుకుని దాన్నిబట్టి నీ పాండిత్యాన్ని వినియోగించాలి. ప్రజా సేవగా వినియోగించాలి.

ఆత్మానాత్మ వివేకమే తెలియనివాడికి నిత్యానిత్య వివేకమే తెలియనివాడికి, పరమాత్మ, పరబ్రహ్మ, మోక్షము అంటే ఏమర్ధమవుతుంది? కొందరు పండితులు అలాగే చెప్పుకుంటూ, అనర్గళంగా ఉపన్యాసం చేసి చప్పట్లు కొడుతూ ఉంటే, దండలేయించుకుని వెళ్ళిపోతుంటారు. వాళ్ళేం చెప్పారయా అంటే విన్నవాళ్ళకు ఒక్కముక్క అర్థం కాదు. విజ్ఞత లేని పాండిత్యం. పాండిత్యమనంగానే మనమొకటి అర్థం చేసుకోవాలి. అనుభవం లేనటువంటి విషయంగా మాత్రమే తెలిసినటువంటిది పాండిత్యము. పండితుడు అంటే? బుద్ధియొక్క తెలివిని ఏడు దశల్లో చెప్పటం జరిగింది. పండ, మేధ, చార్వి, గృహీతి, శ్రౌతి, ప్రతిభ, చత్వ. పాండిత్యములో పండ అనేటువంటిది మొదటిది. బుద్ధికి సంబంధించినదే. మేధస్సుకు సంబంధించింది. అంటే బుద్ధిని దాటినటువంటి ఆత్మానుభవము, పండ కాదు. ఆత్మానుభవము గలవాడిని విద్వాంసుడు అంటారు. ఆత్మ జ్ఞానం లేక, శాస్త్రజ్ఞానం మాత్రమే ఉన్నవాడిని పండితుడు అంటారు. పండితులు కూడా కొంతమంది పనికి వస్తారు. బోధించడానికి, సాధనని నేర్పడానికి, సాధనను పర్యవేక్షించడానికి పనికివస్తారు. కానీ, ఆ పండితుడికి ఏముండాలి అంటే విజ్ఞత ఉండాలి. పండ అంటే తెలుసుకోగలిగినటువంటి బుద్ధి కలవాడు.

మేధ అంటే ఆ శ్రవణం చేసినటువంటి దానిని మర్చిపోకుండా ఉండేటటువంటి బుద్ధి. చార్వి అంటే ఈ బోధని అధ్యారోప అపవాదాల పద్ధతిలో బుద్ధికెక్కించుకోవాలి. అలా ఎవరయితే ఊహతో, అపోహతో తన బుద్ధియొక్క ప్రకాశాన్ని, ఆత్మ విద్య తెలుసుకుంటాడో వాడు చార్వి.

గురుబోధ వినటంలో విసుగు లేకుండా ఉండి, బుర్ర వేడెక్కకుండా ఉండి, ఒక గంట నేర్పారు. ఇక నావల్ల కాదు అన్నప్పుడు ఆ బుద్ధికి కొంత పరిమితులున్నాయి. ఈ చత్వా అన్నవాడికి, ఎన్ని గంటలు చెప్పినా, ఎన్ని రోజులు చెప్పినా నిద్రాహారాలు మానేసి ఏకధాటిగా ఒక వారం రోజులు చెప్పినా విసుగు లేకుండా వినగలిగేనటువంటి బుద్ధి చత్వా. 'గృహీతి', బోధింపబడిన దానిని తప్పక గ్రహించు బుద్ధి. గురువు ఏదైతే బోధిస్తున్నాడో, ఆ బోధించబడినదానిని అక్కడక్కడా మర్చిపోయి అక్కడక్కడా గ్రహించి ఏమరుపాటుగా ఉంటూ మరుపు కావచ్చు. కొంతమాత్రమే గ్రహించి అంటే చెప్పినదాంట్లో 50, 60 శాతం గ్రహించి మిగతాది గ్రహించలేకపోవడమనేది ఉంటుంది. అలా కాకుండా పూర్తిగా తప్పకుండా ఏమీ వదలకుండా గ్రహించేటటువంటి బుద్ధిని గ్రహీతి అంటారు.

శ్రౌతి : శ్రోత్రేంద్రియము ద్వారా, గురు బోధలయందు శ్రద్ధ, సహనము ఉన్నటువంటివాడు, అటువంటి బుద్ధి ఎవరికైతే ఉంటుందో వాడు శ్రౌతి. ప్రతిభ: ఈ శిష్యులలో కొంతమంది గురువనే ముద్ర పడకపోయినా గురువనేటువంటి స్థానంలో, తాత్కాలికంగా కూర్చొని, కొంతమందికి తిరిగి చెప్తున్నారు. ఎలా చెప్తున్నారు? ఒక గురువు దగ్గర విన్నది విన్నట్లుగా మళ్ళీ అదే పంథాలో, అదే పద్ధతిలో అదే యుక్తితో, అదే ఉపాయంతో, అదే దృష్టాంతాలతో అంతకంటే కూడా మిన్నగా, గురువుని మించిన శిష్యులుగా, ఎవరైతే తాను పొందినటువంటి జ్ఞానాన్ని మళ్ళీ ఉన్నది ఉన్నట్లు తేడా లేకుండా చెప్తారో, వాడియొక్క బుద్ధిని ప్రతిభ అంటారు. వాడియొక్క సామర్థ్యాన్ని ప్రతిభ అంటారు.

శ్రుతి, యుక్తి, ప్రజ్ఞ. ఈ మూడింటితో కూడినది. <u>శృతి</u> అంటే వేదాలు, వేద ప్రమాణం. <u>యుక్తి</u> అంటే ఇతరులకు ఏరకంగా చెబితే వారికి అర్థమవుతుందో, ఆ ఉపాయము. ఆ ఉదాహరణలు తెలిసి, అవి వాడటం ప్రజ్ఞ. అంటే ఒక అనుభవంగా ఉండి చెప్పడము. బుద్ధిని దాటినది, చంచల బుద్ధిలో ఉండేది ప్రజ్ఞ కాదు. స్థిర బుద్ధిలో ఉండేది ప్రజ్ఞ. ఆ స్థిర బుద్ధియందున్నటువంటి ప్రజ్ఞతో శ్రవణ మననములు చేసుకుని ముందు తనతో, ఆ గురువు దగ్గర విన్నది విన్నట్లుగా అదే ప్రకారము తిరిగి మరొకరికి బోధించి, నేర్పించే బుద్ధి ప్రతిభ.

కాబట్టి పండతో మొదలుపెట్టి బుద్ధిలో ఏడు మెట్టున్నాయి. ఏడో మెట్టుదాకా పోతే తరువాత వాడు గురువు అవుతాడు. మొదటి మెట్టువాడు పండితుడు గురువెట్లా అవుతాడు? ప్రతిభలో ఉన్నవాడే విద్వాంసుడు. అందుకని విజ్ఞత లేని పాండిత్యము పనికిరాదు. విజ్ఞతతో కూడినటువంటి పాండిత్యము కావాలి. పండితుడు అందరికీ, ఇలా చేయండి, అలా చేయండి అని చెబుతాడు. తానుమాత్రం చేయడు. అందరికీ కర్మయోగం, జీవన్ముక్తుని యొక్క కర్మ విధానం చెప్తాడు. తాను జీవన్ముక్త స్థితికి రాకపోయినప్పటికీ కూడా, నేను ఏ కర్మ చేసినా నన్ను అంటదు. మీరు మాత్రం జాగ్రత్తగా ఉండండి. నేను నా యిష్టమొచ్చినట్లుగా ఉంటాను అంటాడు. అది విజ్ఞతలేని పాండిత్యం.

అర్హతలేని అధికారి; సత్సంగంలో ఒకళ్ళకంటే నువ్వు బాగానే చెబుతున్నావు. వాళ్ళందరూ నిన్ను గురువు గారు, గురువు గారు అంటున్నారు. నీకు గురువనే ముద్ర, సాధికారత లేదు. ఆ సత్సంగంలో ఉన్నంతవరకే ఒకరికంటే ఒకరికి ఎక్కువ తెలిసినవాడిని గురువు గారు అంటే అది వాచా సరిపోయింది. అన్నంత మాత్రాన, అహంకారము వచ్చి తనకు గురువు అనే అధికారము వచ్చింది అనేటువంటి బుద్ధితో, అనేటటువంటి అభిప్రాయంతో, అహంకరించి ఉండకూడదు. ఇలా అధికారం లేనిచోట ఎంత గొప్పవాడైనా అది అక్కడ ప్రకటించకూడదు. నీ దగ్గర వినే నలుగురైదుగురు శిష్యుల వరకే నువ్వు గురువు. బయట ప్రపంచంలోకి వెళ్తే నీకంటే అనుభవజ్ఞులు చాలామంది ఉన్నారు. వాళ్ళ దగ్గర నువ్వు తేలిపోతావు. అందుకని వినయంగా ఉండాలి. నాకింత మాత్రమే తెలుసు. నాకు తెలిసినదాంట్లోనే నేను చెపుతున్నాను. అయినప్పటికీ తప్పులుంటే, పెద్దలు కొంచెం సవరించి తెలియచేస్తే నేను సరిదిద్దుకుంటాను అనే వినయంతో ఉండాలి. అధికారంలేని చోట అధికారిగా ఉండకూడదు. అర్హత లేని అధికారాన్ని వినయంగా తీసుకోవాలి. అది నీకు గురువు ఇవ్వాలి. గురువు నీకు అధికారమిచ్చినప్పుడే ఎంతవరకు నీకు అధికారమిస్తే అంతవరకు నువ్వు ప్రవర్తించవచ్చు.

సత్యము లేని వాక్కు అంటే నీవు అసత్యం మాట్లాడకూడదు. ఎగతాళిగా కూడా అసత్యం మాట్లాడకూడదు. ఎప్పుడయినా ఎగతాళిగానో, ఎవరినైనా ఆటపట్టించడానికో కూడా అసత్యమనేది మాట్లాడకూడదు. ఆపదలయందు కూడా అసత్యం మాట్లాడకూడదు. "ప్రాణ, మాన, విత్త భంగములందు బొంకవచ్చు' అని మనుస్మృతి. అక్కడ కూడా చూడండి. ధర్మాన్ని పాటించాలి. ఎంతవరకు అంటే, మరీ తప్పనప్పుడు ఆ పని చేయవచ్చు. ఒకవేళ చేయవలసి వచ్చినప్పుడు పశ్చాత్తాపపడాలి. అయ్యో ఈ పని చేయవలసి వచ్చిందే అని. అంతేగాని ఒకసారి చేసాంగదా అని పదిసార్లు చేయకూడదు.

మాధుర్యము లేని సంగీతము : శంకరా భరణంలో వాళ్ళెవరో పాడుతారు. శంకరశాస్త్రి గారు తప్పు పాడితే భరించలేకపోతారు. కనుక స్వరయుక్తంగా పాడినటువంటి సంగీతం ఎంత గొప్పదో, అంటే రాగము, తానము, పల్లవి ఈ మూడూ లేకుండా గందరగోళంగా చేసేటటువంటి సంగీతం కూడా పనికిరాదు. గొంతు కూడా బాగుండాలి.

భక్తిలేని పూజ : కర్మకాండగా చేసేది, దాంట్లో కూడా కనీసం ఏకాగ్రత లేకుండా, భక్తి లేకుండా చేస్తారు. సత్యనారాయణ వ్రతం చేస్తే ఆ పురోహితుడు లేట్ చేస్తే ఒంటిగంట అయింది. అతిథులకు భోజనాలు లేటవుతాయేమో తొందరగా కథలు చెప్పవయ్యా! ముగించవయ్యా అని ఆ వ్రతాన్ని తొందరగా ముగింపచేస్తారు. అంతేకాకుండా మనసేమో అతిధులమీద, భోజనాలు తొందరగా అవ్వాలనే దానిమీద ఉంటుంది. కర్మకాండయేమో యాంత్రికంగా చేస్తూ ఉంటారు. కర్మకాండ శ్రద్ధగా, భక్తితో చెయ్యాలి. మిగతాది ఒక ప్రక్క దృష్టి పెట్టినా, భక్తి పరిపూర్ణంగా ఉండాలి. ఏకాగ్రతగా, శ్రద్ధగా భగవంతునితో ఐక్యమయ్యే దానికి సమీపంగా ఉండేది భక్తి యోగము. భక్తంటే కర్మకాండగా కాకుండా, భక్తియోగంగా ఉండాలి. భగవదైక్యతా సిద్ధి పొందేలాగా ఉండాలి. అదీ భక్తి యోగము.

శీలము లేని మనిషి : మంచి కేరక్టర్ ఉండాలి. అప్పుడప్పుడు అది జారిపోకూడదు. ఒక్కసారి జారిపోయినా వీడు ఇట్టివాడు, అట్టివాడు అంటాం. మేము చాలా కాలము బుద్ధిగా ఉన్నాము. ఈ ఒక్కసారి అలా జరిగిపోయింది అంటే కుదరదు. ఈ సమాజంలో చాలామంది మధ్య మెలిగేటప్పుడు మనం ఈ కలియుగంలో బ్రతకలేము అంతా అవినీతి, అక్రమంగా ఉంది. న్యాయంగా ఉందామన్నా ఉండనీయటం లేదు. కాబట్టి నేను కూడా ఇక తప్పదు. అవినీతి మార్గంలో పోతాను. నాకు ఆ రకమైన వత్తిడిలున్నాయి అని అంటారు. ప్రయత్నం చెయ్యండి. మన శీలాన్ని, మన ధర్మాచరణని కొనసాగించేటప్పుడు వీలైనంతగా చెయ్యాలి, ప్రాణం పోయినా పర్వాలేదు అని. దానికేదో ఉపాయం వస్తుంది. తప్పకుండా ఉండగలము. అవినీతిపరుల మధ్యలో మనం ఒక్కళ్ళం కూడా నీతిగా ఉండగలము. ప్రయత్నం చెయ్యకుండా అలా అనేస్తాము. ఒక్కోసారి నీతికి నిలబడితే కొంత నష్టం వస్తుంది. కొంత కష్టం వస్తుంది. దాన్ని భరించాలి. తరువాత వీడింతేలే అని వాళ్ళే వదిలేస్తారు. ఉండదలచుకుంటే తప్పక ఉండవచ్చు. అలా ఉండటమే శీలము, ధర్మాచరణ. ప్రతి మనిషికి అది ఉండాలి. స్త్రీలలో పాతివ్రత్యాన్ని, ఒకే భర్తతో ఉండటమనే దాన్ని శీలము అంటారు. ఒక దేశంలో దేశ భక్తుడిగా ఆ దేశ గౌరవాన్ని, మర్యాదను కాపాడుతూ ఈ దేశముయొక్క రహస్యాల్ని ఇతర దేశాలకు చెప్పకుండా ఉండటం కూడా శీలమే. ఇవాళ పెద్దపెద్ద పోస్ట్‌లలో ఉన్నవాళ్ళు డబ్బుకు ఆశపడి దేశ రహస్యాల్ని విదేశీయులకు చెప్పేవాళ్ళు కూడా ఉన్నారు. ఇక్కడ శీలము లేదు.

వినయములేని విద్యార్థి : విద్యను అర్థించేవాడు విద్యార్థి. ఆత్మ విద్యని బ్రహ్మ విద్యని తెలుసుకోవాలి. ఇక్కడ వినయం ఎవరికుండాలి? ఎవరి యెడల ఉండాలి? గురువు ఎడల శిష్యునికి వినయము, విధేయత ఉండాలి. గురు శుశ్రూషలు చెయ్యాలి. గురువు చెప్పినప్పుడే వినాలి. గురువుని విద్యని చెప్పమని తొందరపెట్టకూడదు. గురువు ఎంతకాలం వేచియుండమంటే అంతకాలం ఓర్పుతో వేచియుండాలి.

గురువు కొందరు శిష్యులకు 5 లేక 6 సంవత్సరాలపాటు విద్య నేర్పకుండా సేవ చేయించుకుంటూ ఉంటారు. దాంట్లో పరమార్థముంటుంది. వారిలో అహంకారము ఎక్కువగా ఉంటుంది. దాస్యభావన లేదు. వినయం లేదు. విధేయత లేదు. బాగా వంగతీయాలి. అతనిలోని తమో రజో గుణాలను పోగొట్టాలి. సంస్కారానుభవాలను పోగొట్టాలి. పూర్వ జీవితంలో ఉన్నటువంటి పదవి, ఆ పదవిలో నేనున్నాను అనే అహంకరించడమనేది పోవాలి. నేనే ఉన్నానిపుడు. ఒకపెద్ద ఇంజనీరుగా చేసి ఒక రైతుగా ఉన్న గురువు దగ్గర జేరినప్పుడు నేను ఏ పదవినయితే అనుభవించానో ఆ పదవికి సంబంధించిన అహంకారాన్ని గురువుయొక్క పాదాలముందు పెట్టగలగాలి. అదీ వినయం. వినయంలేని విద్యార్థి పనికిరాడు.

సభ్యులను మెప్పించని ఉపన్యాసం : గురు పౌర్ణమికి చెప్పాము. కొంతమందిని పిలిచాము. కొంతమంది శిష్యులకు ఎలా కావాలో ఏం కావాలో చక్కగా అందించగలిగారు. కొంతమంది వారు చెప్పేది అర్థం కాకపోయినా సరే, మధ్యలో ఆపమంటే ఆపకుండా చెబుతూనే ఉన్నారు. సభ్యులను మెప్పించలేకపోయారు. మంచి సబ్జెక్టు తీసుకున్నా గాని, సభ్యులను మెప్పించే విధంగా చెప్పలేకపోయారు. వారివరకు వారు బాగానే చెప్పారు. కానీ ఇతరులకు ఉపయోగపడలేదు. అటువంటప్పుడు ఉపన్యాసం చెప్పటం మానేయాలి.

**పరనింద, ఆత్మస్తుతి ఉండకూడదు.** ఉపన్యాసంలో సభ్యులు ఏరకంగా చెపితే స్వీకరిస్తారో దానికి అనుగుణంగా మనం చెప్పాలి. దానికందుకే షడ్విధ లింగాలున్నాయి. ఉపక్రమణ, ఉపసంహరణము, దాని తరువాత సబ్జెక్టు గురించి చెప్పదలచుకున్నటువంటి విషయము, తరువాత మూడోది ఆ సబ్జెక్టులో ఉన్నటువంటి గొప్పతనము అపూర్వత, నాల్గవది అపూర్వత తెలిసిన తరువాత మొదట్లో చెప్పగానే వారు సరిగ్గా వినిఉండరు. ఆ గొప్పతనం తెలిసిన తరువాత గొప్పదైన బ్రహ్మ విషయము తెలుసుకుంటే నాకేం ప్రయోజనం అంటాడు. అనుబంధ చతుష్టయం ఒకటుంది. బ్రహ్మ విషయం గొప్పదే గాని నాకేం లాభం. నాకేం సంబంధం అంటాడు. నీకు సంబంధముంది. నీకు లాభం ఉంది. నీకు మోక్షమొస్తుంది. జన్మ రాహిత్యమవుతుంది. పునర్జన్మ ఉండదు. సంసార బంధముండదు. విముక్తి కలుగుతుంది. ఆనందంగా ఉంటావు. సచ్చిదానందంగా ఉంటావు, శాశ్వతంగా ఉంటావు అని నీకు సంబంధముంది. నువ్వు అదే అయి ఉన్నావు. అజ్ఞానం పోతే చాలు. నీకా ప్రయోజనముంది అని విషయము, సంబంధము, ప్రయోజనము మూడూ ముందే చెప్పాలి.

తరువాత ఎవరికి చెప్పాలి. అధికారికి చెప్పాలి. ఎవడధికారి? సాధనా చతుష్టయ సంపత్తి ఉన్నవాడే అధికారి. ఏమిటది? నిత్యానిత్య వస్తువివేకముని ఈ ద్వంద్వాలతో ఉన్న ప్రపంచంలో పరిశీలించేవాడు, తనయందు, తన శరీరమందు, ప్రపంచమందు పరిశీలించేవాడు, అనిత్యమైనటువంటి వస్తువులమీద ఆశ పెంచుకోనటువంటివాడు, నిత్యమైన వస్తువుకోసం తాత్కాలికంగా అయినాసరే అప్పటికప్పుడు లాభం వచ్చేది కాకుండా, దీర్ఘకాలంగా లాభంగా ఉండేదాన్ని మాత్రం గ్రహించి దానికోసం శ్రమపడేవాడు.

**ఇహాముత్ర ఫలభోగ విరాగము :** ఇహలోకం గానీ, స్వర్గలోకం గానీ, తిరిగి తిరిగి పునర్జన్మలకు వచ్చేటటువంటి పద్ధతిలో ఉన్నదాన్ని ఎంత సుఖమైనప్పటికీ కూడా దాన్ని ఆశించకుండా శాశ్వత సుఖాన్నిచ్చేటటువంటి బ్రహ్మవిద్యని, ఆత్మ విద్యని ఆశ్రయించటం. దానికోసం మనం ఏమి చేయాలంటే ఇహలోక, స్వర్గలోక భోగాల్ని త్యాగం చెయ్యాలి.

మూడవదేమిటి? ఎవరికి చెప్పాలి ఈ విద్య. ఓర్పు, త్యాగము, సహనము లేనివాడికి చెపుతామా?

**శమము:** ఎప్పుడు కూడా శమించి, సాత్వికంగా, ఇతరులు రెచ్చకొట్టినా అటు, ఇటు చెదరకుండా ఉండేవాడియొక్క గుణాన్ని శమము అంటారు. ఒకవేళ కాస్త చెదిరినా మళ్ళీ నిగ్రహించి వెనుక్కు లాక్కునేటువంటి దానిని **దమము** అంటారు.

**తితీక్ష :** ఏది వచ్చినా సరే అన్నిటినీ అంగీకరిస్తూ ఓర్పుతో సమత్వ భావన కలిగి ఉండటమే తితీక్ష. అంటే ద్వంద్వాలు తోస్తే ఇష్టాఇష్టాలు తోస్తే తన లక్ష్యానికి ఆ ఇష్టాఇష్టాలని అడ్డు రాకుండా, తన లక్ష్యానికి ఏది పనికి వస్తుందో దానిని మాత్రమే స్వీకరించేవాడు తితీక్షను పాటిస్తాడు. ఈ తితీక్షను సాధించాలంటే ఉపరతి ఉండాలి.

**ఉపరతి:** అంటే దేనివల్ల నువ్వు ఆనందపడుతున్నావో, ఆ ఆనందాన్ని, ఆ విషయం నుండి మరలించి, ఆత్మ విషయం మీద లగ్నం చెయ్యాలి. ప్రాపంచిక విషయాలమీద ఉన్నటువంటి సుఖాన్ని, ఆనందాన్ని, రతిని ఉపసంహరించి దానిని ఆత్మ రతివైపుకు మళ్ళించాలి. దానిని ఉపరతి అంటారు. ఈ ఉపరతివల్ల తితీక్ష సాధ్యమవుతుంది. దాని తరువాత ఏమి చెయ్యాలి?

**శ్రద్ధ :** శ్రద్ధంటే ఏమిటి? పైన చెప్పినటువంటి విజ్ఞానము, వివేకము, లౌకికము, ఇవన్నీ పెట్టుకొని నీకు కావలసినటువంటి ఆత్మ విద్యకు గురు శుశ్రూషలు చేసి వినయ విధేయతలతోటి ప్రాపంచిక విషయాలను ప్రక్కకు తోసేసి శమము, దమము, ఉపరతి, తితీక్ష నాలుగు వచ్చాయి కదా! ఈ నాలుగింటినీ ఆచరిస్తూ ప్రాపంచిక విషయాలను ప్రక్కకు తోసివేస్తే ఆ గురుబోధపై నీకు కలిగే ఏకాగ్ర పేరే శ్రద్ధ.

**సమాధానం :** నువ్వు ఎందుకోసం గురువు దగ్గరకు వచ్చావో ఆ లక్ష్యం నెరవేరటమే సమాధానము. ఎందుకోసం ప్రయివేట్ పెట్టించుకున్నావు? ఫలానా సబ్జెక్టులో ఎక్కువ మార్కులు రావాలి అని, తప్పకూడదు అని. సమాధానమేమిటి అనుకున్నట్లుగా మంచి మార్కులు రావాలి.

నేనెవరు? అనేటటువంటి ప్రశ్నకు, ఆత్మ విద్య ద్వారా నేనదైయున్నాను అనేటటువంటి లక్ష్యము, ఏదైతే నీ స్వానుభవానికి వస్తుందో చిట్టచివరికి అది సమాధానము, కోహం అనే ప్రశ్నకు, సోహం అనేది సమాధానం. ఈ విధంగా శమాదిషట్క సంపత్తి ఉండాలి. ఇందులో కొన్ని ఉన్నాకాని తెలివైనవాడు ఇవన్నీ చేస్తాడు. జీవితంలో కొట్టబడ్డ వాడికి అనుకోకుండానే వైరాగ్యం వస్తుంది. బలహీనుడికి అనుకోకుండానే వినయం ఉంటుంది. వృద్ధనారీ పతివ్రత అనే పద్ధతిలో చాలామంది శీలవంతులుగానే ఉంటారు. ఆ వాతావరణానికి, ఆ సమయానికి అతడు ఏమీ చేయలేని పరిస్థితిలో చాలా మంచివాడుగా అణిగిమణిగి ఉంటాడు. మళ్ళీ పరిస్థితులు మారి తనకు భోగం వచ్చి, సంపదవచ్చి, అధికారం వస్తే అప్పుడు కూడా అలాగే ఉండాలి కాని అహంకరించకూడదు.

**ముముక్షుత్వము :** స్మశాన వైరాగ్యము, ప్రసూతి వైరాగ్యము, పురాణ వైరాగ్యము అని మూడున్నాయి. అలా కాకుండా కేవలం ఆత్మజ్ఞానం కోసమే ఈ మిథ్యా జగత్తుమీద ఉన్న రాగాన్ని నేను ఉపసంహరించుకుంటున్నాను. ఈ ప్రపంచం నాకు అవసరం లేదు. విచారించితే ఈ ప్రపంచం లేనిది, లేని దానిగురించి నాకెందుకీ వెంపర్లాట. శాశ్వతమైనటువంటి ఆత్మ వస్తువు నేనెలా అయి ఉన్నానో, ఎట్లా సంపాదించాలో అటువంటి గురువుమీద విశ్వాసంతో, నమ్మకంతో, శ్రద్ధతో విడిచిపెట్టకుండా కోతిపిల్ల ఎట్లా అయితే తన తల్లిని గట్టిగా పట్టుకుంటుందో మర్కట కిషోర న్యాయంగా తీవ్ర తపనతో ఉండటమే తీవ్ర మోక్షేచ్ఛ.

మోక్షాలు మూడు రకాలు. మంద మోక్షేచ్ఛ, మధ్య మోక్షేచ్ఛ, తీవ్ర మోక్షేచ్ఛ. మంద మోక్షేచ్ఛ అంటే తాత్కాలికంగా ఉంటుంది. వెళ్ళిపోతారు. మధ్య మోక్షేచ్ఛ ఏమిటంటే పరిస్థితుల వల్ల వస్తాడు, చాలాకాలం ఉంటాడు. మళ్ళీ పరిస్థితులు అనుకూలంగా మారగానే వెళ్ళిపోతాడు.

తీవ్ర మోక్షేచ్ఛ ఏమిటంటే ఎంత సంపదొచ్చినా ఏమొచ్చినా కష్టాలున్నా లేకపోయినా నాకు మోక్షమే కావాలి అని అంటాడు. ఇవాళ చాలామంది డబ్బు, సంపద, అన్నీ ఉండికూడా నాకు మోక్షం కావాలి అని వచ్చారు. పరిస్థితులవల్ల రాలేదు. వాళ్ళకెందుకో పూర్వజన్మ సాధనవల్ల గాని, చేసుకున్న కర్మయొక్క సుకృత ఫలం వల్లగాని, భక్తియోగంలో ఈశ్వరానుగ్రహం వల్లగాని, ఒక గురువు దొరకటం గురువును పట్టుకొని నడవటమనేది గురు శిష్య న్యాయంగా జరుగుచున్నది. అటువంటివారు తీవ్ర మోక్షేచ్ఛతో ఉంటారు. ఈ నాలుగు ఉన్నవాడే అధికారి. బ్రహ్మ అనేటువంటి విషయం గొప్పది. అది జీవుడనేవాడికి సంబంధించినది. సంసార దుఃఖంనుండి, బంధంనుండి అది విడుదల చేస్తుంది కాబట్టి ప్రయోజనమున్నది. నాల్గవది ఇది వినటానికి దారిన పోయేవాడికి, బజార్న పోయేవాడికి వినీవినకుండా పోయేవవాడికి, విన్నదాన్ని తనమీద అప్లై చేసుకోనివాడికి, ఆచరించకుండా సాధన చెయ్యకుండా ఉండేవాడికి చెప్పరాదు. అందుకని ఈ సాధికారతే సాధనా చతుష్టయ సంపత్తి. ఈ నాలుగు ఉన్నవాడికే చెప్పాలి. కనుక అటువంటి వారికే నువ్వు ఉపన్యాసం చెప్పాలి. ఇతరులను నువ్వు మెప్పించే ప్రయత్నంలో కథలు, పిట్ట కథలు చెప్పే ప్రయత్నంలో వాళ్ళు బాగా చెప్పారు అని చప్పట్లు కొట్టినప్పటికీ శిష్యుడిలో పరిణామము, పరివర్తన రాకుండా శిష్యుడిలో అజ్ఞానమున తొలగి సాధనకు పురోగమించకుండా ఉంటే, అది ఏమి ఉపయోగం? అది రాణించదు. ఇవన్నీ రాణించవు.

వీటన్నిటివల్ల శ్రమతప్ప ఫలితం శూన్యం. శాస్త్ర జన్య జ్ఞానంతోపాటు ప్రతి ఒక్కరు కూడా అనుభవ జ్ఞానమును కూడా సంపాదించాలి. పండితులు అంటేనేమో శాస్త్రజ్ఞాన జన్యం. అనుభవం కూడా సంపాదిస్తే వారు విద్వాంసులై, చివరికి బ్రహ్మవేత్త లవుతారు. చివరికి ముక్తుడు అవుతాడు. అదీ మనకు కావలసిన ఫలితము.

అనుభవంలోనికి రాని విద్య : విద్య ఎంత నేర్చుకున్నా నీ స్వానుభవానికి రాకపోతే ఎట్లా? ఇతర విద్యలు నీకు స్వానుభవానికి రానవసరం లేదు. అవి పాసయితే చాలు. సంస్కృతం సబ్జెక్టు తీసుకుంటే మార్కులు బాగా వస్తాయని నూటికి 90 తెచ్చుకొని ఆపై క్లాసులోకి చేరగానే సంస్కృతం వదిలివేసి ఇంజనీరు డాక్టరు కాగానే మర్చిపోయాడు. అంటే అది ప్రయోజనానికి, అనుభవానికి రాలేదు. అలా 90 మార్కులు తెచ్చుకుంటే మాత్రం ఏమి లాభం?

బ్రహ్మ విద్యకు మాత్రం థియరీ, ప్రాక్టికల్‌లోనూ నూటికి నూరు మార్కులు రావాలి. రెండింటిలోనూ థియరీ, అనుభవం కూడా నూటికి నూరు రావలసిందే. ఆ తరువాత ఏ సాధన నీకెందుకు? అని వదిలివేసిన తరువాత ఇక శిష్యునియొక్క ప్రమేయం లేదు. గురువుని గట్టిగా పట్టుకుంటే చాలు. గురువే శిష్యుణ్ణి మార్జాల కిశోర న్యాయంగా నడిపి గమ్యానికి చేరుస్తారు. ఒకేమాట చివరిదాకా లేదు. కొంత దూరమే మర్కట కిశోర న్యాయం. ఆ తరువాత భ్రమర కీటక న్యాయం. ఆ తరువాత మార్జాల కిశోర న్యాయం. ఈ వరుస క్రమంలోనే పోతుంది. అనుభవం లోనికి రాని విద్య, విజ్ఞానము మొదలయిన వాటివంటివలన ఏమీ ప్రయోజనం ఉండదు. దీన్ని ఎందుకింత టైమ్ తీసుకొని చెప్తుతున్నామంటే ఈ సర్వ వేదాంత శిరోభూషణము దేనికది చెప్పేసుకుంటూ పోతోంది. మీకు శాస్త్ర వాసన లోక వాసన, దేహవాసన ఇవన్నీ చెప్పటం లేదు. పాఠాలున్నాయి. 10వ తరగతి పరీక్షకి నేరుగా వెళ్ళినట్లే 1 నుండి 8 వరకు గ్రహించే శక్తి ఉన్నవాళ్ళకి నేరుగా 10వ తరగతి పాఠాలు చెప్పినట్లే, పట్టుకోగలిగిన వాళ్ళకి సమయం వృథా కాకుండా చెపుతున్నాము. క్రిందినుండే చెప్పలేదు కాబట్టి ఇక్కడ వాటికి ప్రాధాన్యతనిస్తున్నాం. ఎందుకంటే బయలేమో లక్ష్యము. కేవలాత్మ అనే అఖండ ఎరుక పోవాలి. ఎక్కడినుంచో మొదలు పెడుతున్నాం.

చిన్న చిన్న పాఠాలు చెప్పకుండా వెళ్తున్నాం కాబట్టి ముందుగా నీ శీలమెట్లా ఉండాలి? నీ వివేకమెట్లా ఉండాలి? నీ లౌకిక జ్ఞానమెట్లా ఉండాలి. నీ విచక్షణ ఎలా ఉండాలి? భక్తిలేని పూజ, శీలము లేని మనిషి, వినయములేని విద్యార్థి, ఇవి కూడా చెప్తుకొస్తున్నాం. దీంట్లోనే మన శీలాన్ని మనం బాగుపరచుకొని లక్ష్యంలో ఏ శీలముండాలని గురువు చెప్పాడో ఆ దిశగా శీలిస్తూ ఉండండి. దానికి వ్యతిరేకముగా నీ స్వభావములో పనికిమాలినదేదయినా ఉంటే దాన్ని దూరీకరించుకోవాలి. అక్కరలేనిది దూరీకరించుకోవాలి. కావలసినదానిని శీలించాలి. ఇదే పాయింట్లో ముందుకెళదాం.

ఆత్మ జ్ఞానాన్ని వెనక్కి తీసుకువెళ్ళే దానిని దూరీకరించాలి. ఆత్మ జ్ఞానంవైపు ముందుకు తీసుకువెళ్ళే దాన్ని శీలించాలి. ఇంతే సంగతి! విషయాలను విషయాకరించుకోకూడదు. నిర్విషయము చేసుకోవాలి. మనలో నిలకడగా ఉన్న జ్ఞానము వృథా కాకూడదు. ఒక బ్యాటరీ చార్జింగ్ చేస్తే మళ్ళీ ఆ చార్జింగ్ అయినటువంటి బ్యాటరీ పూర్తిగా వస్తువులకు మీకు ఉపయోగపడాలి. ఈలోపే డిశ్చార్జ్ అయిపోయి ఈ చార్జింగ్ చేసినదంతా వృథా అవకూడదు.

అలాగే మీరు నేర్చుకున్నటువంటి జ్ఞానాన్ని ఈ చెవితో విని ఆ చెవితో వదలకుండా చెవిద్వారా విన్నప్పటికీ అనుభవాన్ని తీసుకునే పద్ధతిలో వింటే అది హృదయానికి చేరుతుంది. విషయంగా అర్థం చేసుకుంటే బుద్ధికెళుతుంది. ముందు బుద్ధికి, అక్కడినుండి హృదయానికి వెళ్ళాలి. అప్పుడు నువ్వు నేర్చుకున్న జ్ఞానము బ్యాటరీలో అయిన చార్జింగ్ నువ్వు ఎప్పటికయినా వినియోగించుకునేలా, వృథా కాకుండా డిశ్చార్జి అవకుండా చూసుకోవాలి. ఇది వట్టి పాండిత్యంగా మాత్రమే నిలిచిపోరాదు. బుద్ధి పరిధిలో విని నాకంతా వచ్చేసింది అనేటువంటిది కాకుండా ఆచరించి, సాధనచేసి, యోగ్యత సంపాదించి, యోగ పద్ధతిలో దాన్ని యోగించి, యోగించిన దానిని స్థిరంచేసుకుని, సిద్ధింపచేసుకోవాలి. దానినే అనుభవంలోనికి తీసుకోవాలి. అనుభవానికి తెచ్చుకొనడములోనే ఉన్నది మీ గొప్పతనము.

ఇంకనూ లోక కళ్యాణానికి వినియోగించినప్పుడే దాని సార్థకత. లోక కళ్యాణం అని చెప్తున్నాం కాని నువ్వు నేర్చుకుంది ఇతరులకు కూడా చెప్తే ఈ మార్గంలోకి ఇతరులను కూడా రప్పిస్తే నువ్వు ఎటువంటి వాడివి ఈ స్థితికి వచ్చావో, ఆ స్థితినుండే ఈ స్థితికి రావడానికి ఎంత కష్టపడ్డావో, ఎన్ని సమస్యలను ఎదుర్కొన్నావో, నీ సాధనలో ఎన్నిసార్లు పడిపోయి లేచావో, నీకనుభవవమేగా! అటువంటి దానిని నువ్వు మళ్ళీ గట్టిపరచుకుంటే జారిపోకుండా ఉంటావు. అలా గట్టిపరచుకోవాలంటే క్రొత్త శిష్యులను ఎవరినయినాసరే, స్నేహితులనయినా సరే కాస్త నీ మాట వినగలిగేవారు దొరికితే క్రమంగా వాళ్ళు అర్థం

చేసుకునే స్థాయిలోకి దిగి, ఒకేసారి నీ పాండిత్యాన్ని ఒలకపోయకుండా, చాకచక్యంగా, నైపుణ్యంగా వాళ్ళకు చెప్పగలిగితే వాళ్ళు మారారో లేదో నీకనవసరం గాని, ఆ ట్రైనింగులో వచ్చినటువంటి జ్ఞానము, స్థిరమై, నీకు ప్రయోజనమై నీ స్వానుభవానికి అది తప్పకుండా వస్తుంది.

అలా ఇతరులకు చెప్పడానికి లోక కళ్యాణమని పేరు పెట్టినప్పటికీ వాళ్ళనేదో నేను మారుస్తున్నాను అనేటటువంటి అహంకారం నీకు ఉండకూడదు. ఒక గురువు తన శిష్యుల ద్వారానే ఆపై స్థితిని అందుకుంటాడు. **'సహనావవతు, సహనౌ భునక్తు'** అన్నప్పుడు సహనౌభునక్తు అనే పదంలో శిష్యుడు, గురువు కూడా వారి స్థాయికి తగినటువంటి అనుభవాన్ని దాటి పై స్థాయికి వెళ్ళాలి అనేటువంటి ప్రార్థన ఉంది. కనుక కొంతమంది శిష్యులకు బోధించడం ద్వారా అక్కడక్కడా తన సాధనలో గురువు కూడా ఏదైనా లోపాలుంటే కొంతమంది శిష్యులయొక్క కష్టనష్టాలు, బాధలు, వాళ్ళ ఆచరణలో ఉన్నటువంటి సాధ్యాసాధ్యాలు, ఆ శిష్యులు గురువుముందు పెడితే వాళ్ళకు సలహాఇచ్చి, మళ్ళీ తన శక్తి, యుక్తి ఇచ్చి, ఆ శిష్యుణ్ణి ఆ సమస్య నుంచి అధిగమింపచేస్తున్నాడో అతడు చెప్పినప్పుడు, ఆ గురువు దారిలో ఉన్నటువంటి చిన్నచిన్న లోపాలను తను సరిదిద్దుకుంటాడు. అప్పుడు గురువు పునరంకితం చేసుకొని తానుకూడా అధిగమిస్తాడు. ఇదే సహనౌ భునక్తు అంటే. అందుకని లోక కళ్యాణమనేది ఒక మిష. ప్రజాసేవ అనేది ఒక మిష. ప్రజాసేవలో నువ్వు స్వార్థాన్ని పోగొట్టుకున్నావు. నిస్వార్థాన్ని పెంచుకుంటున్నావు. అంతమందిని మానేజ్ చేయడం ద్వారా నీ అహాన్ని తగ్గించుకుంటున్నావు. రజో గుణాన్ని తగ్గించుకుంటున్నావు. ప్రజాసేవ ద్వారా, సమాజ సేవ ద్వారా వ్యష్టినుంచీ సమష్టికెళుతున్నావు. అన్నదానాలు మొదలైనవి చేసినప్పటికీ, దానికంటే మిన్నగా జ్ఞానదానం గొప్పది. ఎంత ఉంటే అంతే. అయితే నీకు తెలిసిన దానిమీద నీకొక వివేకం ఉండాలి. నాకింతవరకే తెలుసు. తెలిసినంతవరకు నిర్దుష్టంగా తెలుసు. ఆపైది నాకు అనుమానంగా తెలుసు అని, నీకు ఏది తెలుసో, ఏది తెలియదో నీకు ముందు తెలియాలి. నీకు ఎట్టి అనుమానము లేకుండా దృఢంగా తెలిసింది మాత్రమే ఇతరులకు తెలియజేయాలి. నీకు అనుమానంగా ఉండి చెప్పకూడదు. అక్కడది నిర్ణయంగా చెప్పకూడదు. నాక్కూడ తెలియంది ఇది రైటేనా అని చెప్పి ఎవరి దగ్గరైనా కూడా నేర్చుకోవచ్చు. అటువంటి వినయం ఎప్పుడూ ఉండాలి. ఇంకనూ లోక కళ్యాణానికి వినియోగించినప్పుడే దాని సార్థకత. ఇట్టి అనుభవమును పొందుటకు మూడు దశలు దాటాలి. ఒకటి తెలుసుకోవటం, రెండు తెలుసుకున్న దానిని దర్శించడం, మూడవది దర్శించిన దానితో తాదాత్మ్యత చెంది దాంట్లోకి ప్రవేశించి, అదే తానవడము 'జ్ఞాతుం అంటే తెలుసుకోవడం', అంటే కని, ద్రష్టుం అంటే చేరి, ప్రవేష్టుం అంటే పొందవలెను.

**జ్ఞాతుం ద్రష్టుం ప్రవేష్టుం :** ఇప్పుడు ఆత్మ విద్యకి వెళ్తున్నాం మనం. ఆత్మంటే ఎలా ఉంటుందో జ్ఞాతుం తెలుసుకున్నారు. ఆ తరువాత ఏమి చేశారు. ఆత్మయొక్క సమీపానికి చేరారు. ఇది ద్రష్టుం. ఆత్మయొక్క సమీపానికి చేరడమే కాకుండా ఆత్మని నువ్వు పొందావు. అనాత్మ తాదాత్మ్యతనుంచీ వేరై ఆత్మ నిష్ఠని సంపాదించావు. ఆత్మ నిష్ఠని సంపాదించడాన్నే పొందుట అంటారు. ఆత్మలోకి ప్రవేశించి ఆత్మగానే అయిపోయావు. దేంట్లోకి ప్రవేశిస్తే అదయిపోతున్నావు నువ్వు. ఇది ప్రవేష్టుం విషయంలోకి ప్రవేశిస్తే విషయాంకారం చెందుతున్నావు. బ్రహ్మలోకి ప్రవేశిస్తే బ్రహ్మాకారం చెందుతున్నావు. ఈ విధంగా అజ్ఞానంలో దానిని తాదాత్మ్యత అన్నాం. జ్ఞానంలో దానిని పొందుట అంటే అన్నప్పుడది యోగం. ఆ యోగ స్థితిలో ఆత్మ నిష్ఠ కలిగింది. ఇంకాపైనుంది. పొందుట అనేసరికి ఏమయిందంటే యోగమంటే రెండు వస్తువులు కలవటం యోగం. నేనున్నాను, నేను దాన్ని పొందాను అంటున్నావు. అంతేగాని ఇంకా అద్వైతం సిద్ధించలేదు. అద్వైతమెప్పుడు సిద్ధిస్తుంది? పొందుట అనేదానికి కూడా నువ్వు సాక్షిత్వం అయి ఆపై స్థితిని తెలుసుకొని ఆపై స్థితిలో ఉండి ఆ స్థితికి కూడా సాక్షై విలక్షణమవ్వాలి. అందుకని అంది పొంది మీరాలి. అందడమేమో ద్రష్టుం పొందడమేమో ప్రవేష్టుం, మీరడమేమో అధిగచ్ఛతి.

జ్ఞాతుం అంటే శాస్త్రములో ఉన్న అమూల్యమయిన విషయాల గురించి గురువుల ద్వారా, పెద్దల ద్వారా, అనుభవజ్ఞుల ద్వారా తెలుసుకోవటం. అందువల్ల వాటియందు సహజముగా ఆసక్తి పుడుతుంది. అప్పుడు వాటిని ఎలాగయినాసరే పూర్తిగా తెలుసుకోవాలి లోతుగా తెలుసుకోవాలి అని అన్వేషించి, విచారణ చేసి దానియొక్క సమీపానికి వెళ్ళాలి. సమీపానికి వెళ్ళినప్పుడు అది దర్శనం. ఆ సమీపంలోకి చేరావు. దర్శనానికి ఒక అనుభవముంటుంది. ఈ దర్శనము, అనుభవము అనేటటువంటివి తారకం. విషయంగా తెలుసుకునేది 'జ్ఞాతుం'. జ్ఞాతుం దగ్గర సాంఖ్యం పూర్తయింది. 'ద్రష్టుం' దగ్గర తారకం మొదలయింది. ప్రవేష్టుం దగ్గర అమనస్కం అయింది. నువ్వు అదే అయిపోయావు, కాబట్టి ఇక నీకు మనస్సు లేదు. అంటే అమనస్కము. ఆ

స్థితిలో విక్షేపము పోయి, నీవు అదే అయివున్నావు కనుక నీవు నీవైన స్థితి నీ స్వానుభవానికి రావడమే 'ఆత్మనిష్ట'. అది ప్రవేష్టుం. అంటే మొదట్లో ప్రవేశము అని ఎందుకన్నాడు? ఆత్మని లక్ష్యంగా పెట్టుకుని ఆత్మలోకి చేరావు కాబట్టి 'ప్రవేష్టుం' అన్నాము. ఆత్మ వేరు, నువ్వు వేరా. 'నేనే' ఆత్మ స్వరూపుడను గనుక 'అహం బ్రహ్మ' కనుక ప్రవేష్టుం అనేటువంటిది ఆత్మ నిష్ఠగా బ్రహ్మ నిష్ఠగా, పదం మార్చి చెప్పుకోవలసి వస్తుంది. సాధనలో పొందాను ప్రవేశించాను అన్నప్పటికీ అప్పుడు లక్ష్యంగా చెప్పాము కాబట్టి లక్ష్యానికి దగ్గరగా వెళ్ళిందేమో దర్శనము. చేరి లక్ష్యమే తానయినది నిష్ఠ. లక్ష్యములోనికి వెళ్ళాం అంటే ప్రవేశించాము. ఈ పదాల క్రింద ఏదైతే వాడుతున్నావో బ్రహ్మ తప్ప రెండవది కాదు. బ్రహ్మమే సత్యము. అన్యము లేదు అన్నప్పుడు ప్రవేష్టుం ఉండదు. పైగా నువ్వే అది అయి ఉన్నప్పుడు ఆధ్యాత్మిక ప్రయాణంలో ప్రవేష్టుం అన్నప్పటికీ, నిజానికి మాయలో భ్రాంతిలోనే కొన్ని మజిలీలు దాటటంలో, ఈ ఆధ్యాత్మిక ప్రయాణము జరుగుతోందని అనుకున్నప్పటికీ, నిజానికి లేనిది లేకుండా పోతే, ఉన్నదేదో ఉంటున్నది. అది నీవే అయి ఉన్నావు అన్నప్పుడు అది ఆత్మ నిష్ఠ బ్రహ్మ నిష్ఠ. అప్పుడు 'జ్ఞాతుం' అనేది లేదు. 'ద్రష్టుం' లేదు ప్రవేష్టుం లేదు. ఇవన్నీ మాయను దాటే వరకూ ఒక భ్రాంతినుంచే మరొక భ్రాంతికి, మరొక భ్రాంతినుంచే మరొక భ్రాంతికి, ఆత్మకు సమీపంగా చేరే క్రమంలో, భ్రాంతులను క్రమక్రమంగా ఇది కాదిది కాదిదికాదని విడిచి పెట్టడంలో చాలా విడిచిపెట్టినప్పటికీ జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం అని మూడు స్థితులుగా చెప్పటం జరిగింది.

**'అధిగచ్ఛతి'** అని నాల్గవది చెప్పినా కూడా ఆ పరిపూర్ణత్వ మయినటువంటిది అది నీవే అయి ఉన్నది నీకు స్వతః సిద్ధించింది. స్వతః సిద్ధించింది అంటే నీవే అన్ని కాలాలలో అది అయి ఉన్నావు. ఈ ప్రయాణమంతా మాయలో జరిగింది కాబట్టి. తూచ్ ఈ ప్రయాణం ప్రయాణమే కాదు. రెండవ దర్శనములో అట్టి శాస్త్రములు, విశేషములు, ఎన్నెన్నో పరిశీలించాము. సాంఖ్యము అయిపోయింది. తెలిసిందంతే! సాఖ్యము నీమీద అప్లై చేసుకుంటూ, పరిశీలిస్తూ, విచారణ చేస్తూ, అన్వేషిస్తూ, సేకరించాలి. చదివి ప్రత్యక్షముగా చూడాలి. ప్రత్యక్షముగా చూడటమంటే దర్శనం. అమితమైన పట్టుదలతో విచారించి అవగాహన చేసుకోవాలి. అప్పుడు ఆనందిస్తారు. కొంతవరకు తృప్తి కలిగింది. ఇది ఉపరతి. తనలో తాను రమించటమనేది ఆత్మరతి. ఆత్మారాముడు కొంతవరకు తృప్తి కలిగిన దశలో ఉపరతి కలిగిన దశలో శాస్త్రజ్ఞానం లభించింది. దీనిని ద్రష్టుం అన్నాం. పై రెండు దశలలో సంతృప్తి చెందినా ప్రయోజనము చాలదు. దానిలో ప్రవేశించి దానిలో లీనమైపోయి ఆత్మ అనేటువంటి లక్ష్యములో ప్రవేశించి లక్ష్యములో లీనమై, నీవు ఆత్మవైపోవాలి. ఆత్మలో తన్మయత చెందాలి. అనగా తెలిసికొన్న దానిలో తెలుసుకున్న తరువాత చూచినదానిలో ఆ చూచిన దానిలో లీనమైపోయి దాంట్లో క్రొత్తగా ఏ అనుభూతి వచ్చిందో, ఆ అనుభవాన్ని ఆస్వాదించాలి. సాధనలో ఆస్వాదన ఉంటుంది. విషయ సుఖదుఃఖాలను ఆస్వాదించకూడదు గాని పొంగుట కృంగుట అనేది ఉండకూడదు గాని, ఇక్కడ ఉపాసన, అనుష్ఠాన పద్ధతిలో స్థిరతమయ్యేదాకా అప్పుడు ఆత్మనిష్ట వల్ల కలిగేటటువంటి ఆనందాన్ని ప్రశాంతతని ఆస్వాదించాలి. ఆ ఆస్వాదన యొక్క ఫలితంగా విషయములో ఉన్నటువంటి సుఖదుఃఖాల్ని, రాగద్వేషాల్ని, ఇష్టాయిష్టాల్ని జయిస్తాము. దేనివల్ల అది జరుగుతుంది? ఆహారము స్వీకరించి శారీరక శ్రమ చేసినప్పుడే, ఆహారము జీర్ణమై, రక్తరూపమై మానవుడికి కావలసినటువంటి శక్తినిస్తోంది. అట్లాగే ఆ ఆహారము శ్రమచేసి సంపాదించావు. తరువాత ఆహారం స్వీకరించి జీర్ణం చేసుకున్నావు. తరువాత జీర్ణమై రక్త రూపమై మానవునికి శక్తి వచ్చింది. మూడు దశలు. అలాగే జ్ఞాతుం దగ్గర శ్రమ చేసావు. ద్రష్టు దగ్గర జీర్ణమవుతోంది. ప్రవేష్టుం దగ్గర ఆ లక్ష్యం ఫలితాన్నిచ్చింది. ఫలితమైనటువంటి లక్ష్యము పొందావు. మానవునికి కావలసిన శక్తి ఎలా వస్తుందో, అటులనే తెలుసుకొని చూచిన విషయములను అనుభవంలోనికి తెచ్చుకొని ఆచరణలోనికి తెచ్చుకొని ఆ ప్రయోజనాన్ని సంపూర్ణంగా పొందాలి.

మానవ కళ్యాణానికి, దేశ పురోభివృద్ధికి, ఆత్మానుభవమునకు ఉపయోగించినప్పుడే ఆ ప్రయోజనము సంపూర్ణమవుతుంది. ఆత్మనిష్ఠ నీకొచ్చింది. అది దృఢపడి, సహజమై, గట్టిపడాలి. మళ్ళీ జారిపోకూడదు. అది సహజమయ్యేదాకా నువ్వేం చేయాలి? లోక కళ్యాణం కోసం, మానవ కళ్యాణం కోసం ఎవరో ఒకర్ని స్నేహపూర్వకంగా దగ్గరచేసి ముందు మంచీ చెడుగా చెప్పడం మొదలుపెట్టి, న్యాయాన్యాయాలు, ధర్మాధర్మాలు దగ్గర మొదలుపెట్టి ధర్మార్థ కామ మోక్షాలలో, అర్థ కామాల్ని ధర్మంగా ఆచరించే పద్ధతిగా మార్చి, ఆ ధర్మందాకా వచ్చినటువంటి వాడికి మోక్షం గురించి భక్తి భావనగా, పరిచయంగా చెప్పి, ఆత్మంటే ఏమిటో దారినపోయేవాడికి అర్థమయ్యే రీతిలో చెప్పి ఆ రకమయినటువంటి యుక్తి, ఉపాయము నీలో ఎప్పుడయితే ఉందో అప్పుడు నీకు కూడా స్పష్టత పెరుగుతుంది. నీకోసమది చెయ్యాలి. వాళ్ళకోసం కాదు.

## 'యద్భావం తద్భవతి'

**'అస్తంగతయా క్షీణయా, మనస్యాం జ్ఞానేన రాఘవ'** యోగవాశిష్టలో శ్రీరామచంద్రునికి, వశిష్టులవారు చెప్పారు. ఈ అవిద్య క్షయించి నాశనమొందుతుంది. దాని గుణమే నాశనం. దాని స్వభావమే నశించే స్వభావం. ఆ మూలావిద్య ఎట్లు కలిగెనో, ఎట్లు వృద్ధి చెందెనో, ఎట్లు నశించెనో అను అంశమును తెలుసుకొనగలమని వశిష్టులవారు శ్రీరాముల వారికి చెప్పారు. ముందు అవిద్య, ఆఖరుకి మూలావిద్య. 'అవిద్య' అంటే ప్రస్తుతం మనము ఉన్నటువంటి స్థితి. 'మూలావిద్య' అంటే సృష్టికి పూర్వం అసలెలా వచ్చాము. ఏ కారణంగా వచ్చాము. మానవుడిగా, జీవుడిగా మీరున్నారు, ఈ ఉపాధిలో. దీనికి మూలమేది?

ఈ శరీరమే నేను అనేటువంటి దాంట్లో ఆధ్యాస చెప్పి ఈ శరీరానుసారమైనటువంటి పంచభూతాల మయము, ప్రాకృతము అయినటువంటి శరీరాలకు బయటనున్న పంచభూతాలతోటి చలి, ఎండ, వానలనేటువంటివి ఒకసారి సుఖంగా, ఒకసారి తట్టుకోలేనట్లుగా, ఒకసారి బాధించేలాగా, ఒకసారి నశించేలాగా ఈ శరీర నిర్మాణం ఉంది. బాహ్యంగా ఉన్న పంచ భూతాలతో పోలిస్తే పంచ భూతాత్మకంగా తయారయినటువంటి ఈ మానవ శరీరము చలి, ఎండ, వానలకు ఒకసారి సానుకూలంగా, ఒకసారి సౌకర్యంగా, ఒకసారి ఆనందంగా, ఒకసారి తృప్తిగా, ఒకసారి ఇబ్బందిగా, ఒకసారి ఓర్చుకొనేలాగా, ఒకసారి ఓర్చుకోలేనిదిగా, ఒకసారి నశించేదిగా ఉన్నది.

ఆత్మ నీవైనప్పుడు శరీరానికి ఈ మాదిరిగా ఏదైతే ఉన్నదో ఇదంతా అవిద్య కారణం. నేను ఆత్మ అనే జ్ఞానం లేకపోవడము, నేను శరీరము అనేటటువంటి ఆధ్యాసతో, సంసారంతో, ఈ శరీరానుసారమైనటువంటి అనేక బాధలతో, ఆ బాధలను అధిగమించలేక, ఆ బాధలు తట్టుకోలేక, బాధ నివారణార్థము, పుణ్యకర్మలు చేస్తూ ఈ శరీరాన్ని సుఖపెట్టేటువంటి ఆశతో, ప్రియం, మోదం, ప్రమోదంతో కొన్ని కర్మలు చేస్తూ ఈ వ్యవహారమంతా కూడా అవిద్య కారణంగా ఉంది. అసలు ఈ మానవుడు రాకముందు ఈ సృష్టి ఎలా వచ్చింది? కేవలము పరబ్రహ్మ మాత్రమే రెండవది లేక ఒకటిగా ఉన్నప్పుడు ఇంతగా, నానా విధంగా, ఇన్ని భేదాలతో ఈ చరాచర జగత్తుంతా అనాత్మ శరీరాలతో ఈ ఆత్మ అనేటటువంటిది చేరి అందులో ఆత్మానాత్మల కలయికలో చిజ్జడముల సంధిలో ఈ నేను అనేది, ఏ రకంగా వచ్చిందనేటువంటిది, అనేటువంటి కథ ఈ క్రమము దీని మూలమెక్కడ అంటే మూలావిద్య. మూలావిద్య వల్లే ఇదంతా వచ్చింది అంటే అవిద్య ఎలా దోషమో, మూలావిద్య కూడా అలాగే దోషము. ఈ మూలావిద్య దోషాన్ని గనుక మనం నివారింపచేసుకుంటే కేవల పరబ్రహ్మగా శాశ్వతముగా, జన్మరాహిత్యముగా, ఆనంద ఘనముగా, స్వస్వరూపంగా ఉండిపోతాము.

అందుకని మనమేం చేయాలి? అవిద్యని తెలుసుకొని అవిద్యని పోగొట్టుకోవాలి. ఆ తరువాత మూలావిద్య ఎలాఉందో, ఎప్పుడు ప్రారంభమయిందో, దాని ప్రభావం మనమీద ఎలా వుందో, అవన్నీ తెలుసుకోవాలి. మాయామర్మం తెలిస్తే మాయ మాయమైపోతుంది. అట్లా మూలా విద్యని తెలుసుకున్నప్పుడు మాయ మర్మం తెలిసినప్పుడు ఇది లేనిది కదా! అది ఉంది కదా అన్నప్పుడు లేనిది లేకుండా పోయినప్పుడు ఉన్నదేదో ఉన్నది. ఇదే పరమపదము, ఇదే మోక్షము. కనుక ఈ అంశాలన్నీ కూడా యోగవాశిష్టంలో రాముడికి వశిష్టులు చెప్పారు. మనం కూడా ఇప్పుడు ఏం చేయబోతున్నామంటే అవిద్యని నాశనం చేసుకోవడం, నాలుగు మహా వాక్యాల ద్వారా జ్ఞానిగా ఉండటం, జ్ఞానిగా ఉన్నదాంతో తృప్తిపడకుండా, అసలు సద్వస్తువు ఏది? అచలముగా, పరిపూర్ణముగా, నిర్వికారముగా, శాశ్వతముగా ఉన్న వస్తువు ఏది? ఆ వస్తువునుండే ఇదంతా రాలేదు కదా!

ఆ వస్తువు ఉన్నదున్నట్లుగా నిర్వికల్పంగా శాశ్వతంగా ఉంటే మరి ఇదంతా ఎక్కడినుంచి వచ్చింది? మరి మూలావిద్య కారణంగా వచ్చింది అన్నప్పుడు ఆ మూలావిద్య యొక్క రహస్యాన్ని తెలుసుకుంటే ఈ జనన మరణ రహస్యము. ఈ భ్రాంతికి మూలము నీకు తెలిసినట్లే. అదే కనుక తెలిస్తే అన్నీ ఎగిరిపోతాయి. నీ స్వరూపము అదే అయి వుంటుంది. కనుక ఈ గ్రంథము యొక్క ఆరంభము నడక, ముగింపు ఎలా ఉంటుందంటే ముందు అవిద్యనీ, తరువాత మాయనీ అధిగమించి మూలంలో ఉన్న మూలావిద్యని తెలుసుకొని మూలావిద్య యొక్క మర్మాన్ని తెలిసినంతనే అద్వయ వస్తు నిర్ణయమవుతుంది. ఏకమేవా అద్వయం బ్రహ్మ అనేదాంట్లో నువ్వు స్థిరమై మూలావిద్య రహస్యము తెలిసినందువల్ల దీని కారణంగా ఉన్నటువంటి యావత్ ప్రపంచము కూడా **'నేహనానా అస్తికించనః'** కనుక ఈ కనపడేదంతా ఏమీలేదు. నేను బ్రహ్మమై నేను తప్ప అన్యము లేదు అనే స్థితికి ఈ మూలా విద్యని దాటినవాడు వస్తాడు. మూలావిద్యని దాటినవాడు **'ఏకమేవా అద్వయం బ్రహ్మ'** బ్రహ్మమే ఉన్నది. రెండవది లేదనే నిర్ణయానికి, తానే అద్వైయుండి, తాను తప్ప అన్యముగా రెండవది ఏమీలేదు. నానాత్వము లేదు. భేదములు లేవు. అని అఖండాకారము చెంది, బ్రహ్మ స్వరూపుడై యుంటాడు.

ఈ యోగ వాశిష్టలో ఆ దిశగా, భ్రాంతియొక్క అనేక రకాలు ఎలా ఉన్నాయో కథల రూపంలో వస్తు నిర్ణయంగా, వశిష్టుల వారు రాముడికి చెప్పినట్లుగా ఉన్నది. అయితే వారియొక్క లక్ష్యమేమిటి? ముందు అవిద్యని నశింపచేసుకోవాలి. తరువాత మాయని అధిగమించాలి. తరువాత 'మూలావిద్య' ఎలా వచ్చిందో, ఎలా ఉన్నదో, ఎలా వృద్ధి చెందిందో అది తెలియాలి. మూలావిద్య అంటే మూడు గుణముల బీజం. మాయంటే సత్వగుణం విజృంభించింది. అవిద్య అంటే తమో రజోగుణాలు కూడా విజృంభించాయి. ఇదీ క్రమము.

యోగ వాశిష్టమునందు వశిష్ఠులవారు శ్రీరామచంద్రునికి ఒక ఉపదేశం చేశారు. ఆ ఉపదేశంలో ఒక రహస్యమున్నది. మిటంటే అది ఈ ప్రపంచం. ఎక్కడ్నుంచి వస్తుంది. ఏ విధంగా ఏ క్రమంలో వస్తున్నది. దాని ఫార్ములా ఏమిటి? దాని పద్ధతి ఏమిటి అసలు దీని మొదలేమిటి? అని చాలామంది ఋషులు యుగయుగాలుగా తెలుసుకునే ప్రయత్నం చేశారు. అయితే భౌతికంగా మన బుద్ధికి మన మేధస్సుకు అందే పద్ధతిలో ఎంత తెలుసుకున్నా దాని మూలాన్ని కాని దాని పద్ధతిగాని పూర్తి వివరాలతో మనం తెలుసుకోలేము. సైంటిస్టులు, శాస్త్రజ్ఞులుకూడా కొంతవరకు తెలుసుకున్నామని అనటమే కానీ కొంతకాలానికి మరొక శాస్త్రవేత్త రాగానే కొంత తప్పు కొంత రైటు అనుకుంటూ ఉంటారు. ఇలా తెలుసుకోవటం వల్ల వచ్చే ప్రయోజనం ఏమీ లేదు. అసాధ్యం కూడా.

వేదాలే, అపౌరుషేయాలే, దర్శనాలుగా శ్రుతులుగా తెలియబడ్డాయి. దాని ప్రకారం ఏమిటంటే తాడుయందు పాము వున్నట్లుగా, తాడే సత్యము, పాము భ్రాంతి కనుక ఉన్నది తాడే కాని దానియందు సర్పము పుట్టిందా? పుట్టిందని అనుకుంటున్నారు. వారు బ్రహ్మము నుండి జగత్తు వచ్చిందనుకుంటున్నారు. **బ్రహ్మణో అవ్యక్తః అవ్యక్తో మహత్తు. మహతో మహదహంకారః మహదహంకారో పంచతన్మాత్రణి తన్మాత్రేభ్యో పంచభూతాని, భూతేభ్యో అఖిలం జగత్తు.** సూక్ష్మ భూతాల పంచీకరణతోనే స్థూల పంచ మహా భూతాలొచ్చాయి. సూక్ష్మభూతాలు జీవునియందు 25 తత్వాలుగా, గోళకాలుగా వచ్చాయని అవి స్థూల శరీరంలో కొన్ని స్థానాలుగా ఏర్పడి వున్నాయని ఎక్కడినుంచి వచ్చిందో గాని ఒక అహంకారం వచ్చింది. మొదట్లో అహంకారం అవ్యక్తంగా ఉంది. తర్వాత మహత్తుగా ఉంది. తర్వాత అధిష్టానంగా ఉంది. తర్వాత సమష్టిగా ఉంది. తర్వాత వ్యష్టిగా ఉంది. తర్వాత వ్యవహారంగా ఉంది. అహం స్ఫురణగా ఉంది. అహం భావనగా వుంది. అహంకారంగా ఉంది.

ఇదెక్కడ్నుంచి వచ్చింది? చిత్తు, జడము కలిస్తే చిత్‌జడ గ్రంధి అన్నారు రమణ మహర్షి. చిత్ జడ గ్రంధిలో, గ్రంధి అంటే ముడి. చైతన్యము జడము రెండూ కలిసినప్పుడు ఆ రెండింటియొక్క ముడియందు అహం అనే స్ఫురణ కల్గింది. నేనెవరు అంటే చిత్‌జడ గ్రంధి నుంచి తోచింది. నిజంగా వచ్చిందంటే తోచిందందామా? వచ్చిందంటే ఇప్పుడొచ్చింది కదా! అంతకుముందు లేదు గదా! మళ్ళీ చిత్ జడము వేరైపోతే మళ్ళీ ఉండదుగదా! మళ్ళీ కలిస్తే ఉందిగదా! కనుక ఒకప్పుడుండి ఒకప్పుడులేనిది. ఆది అంతములు కలది. ఇది అసత్తు. ఆది అంతములు లేనిది అన్ని కాలాలలోఉన్నది సత్తు. ఆ రకంగా చూస్తే నేను కూడా అసత్తే. ప్రకృతి అనేటటువంటిది పరిణామశీలి. పరిణామం చెందుతూ ఉంటుంది. ఎప్పుడూ వికారం చెందుతూ ఉంటుంది. కేవల చైతన్యము నిర్వికారము. అచలము. కాని చైతన్యము జడముతో కలిస్తేనే నేననే అహంకారం వస్తోంది. మహదహంకారం దగ్గర అధిష్ఠాన రూపంలో ఉంది. సమష్టి దగ్గర సమష్టి అహంగా, ఈశ్వరుడుగా ఉంది. జీవుడి దగ్గర వ్యష్టి అహంగా జీవుడిగా ఉంది. నేను అంటే ఏమిటంటే ఉనికి స్ఫురణ. ఉండుట అనేటటువంటి స్ఫురణ. మనో మాలిన్యంతో సంస్కారాలతో గుణాలతో కూడినప్పుడు ఈ నేను అనేది అసత్య నేను **యద్భావంతద్భవతి**గా అనుకుంటే అనుకున్న ప్రకారంగా ఉంది. ఏ వాసనయితే ఆ వాసన ప్రకారముగా ఉంటుంది. కాని ఏ వాసనా లేనివానికి నేను కేవల నేనుగా శుద్ధ నేనుగా ఎటువంటి మనో మాలిన్యము గాని, గుణ మాలిన్యము గాని లేని నేనుగా ఉంటుంది. ఈ నేనుని యదార్థ నేను అంటాము. మనసుతో కలగాపులగమైన నేనును అసత్య నేను అంటాము. మిథ్యాహం అంటాము. ఈ యథార్థ నేను ఏదైతే ఉందో వ్యవహారంలో అది ప్రశాంతినిస్తుంది. అహం అహం అని స్ఫురణనిస్తుంది. అహం స్ఫురణ అనేది నీ మనసునుంచి విడివడి సాక్షి, విలక్షణమైన వాడికి ఇది **"సోహం"**. కనుక నేను పరిస్థితి ఏమో అది చిత్‌జడ గ్రంధిగా ఆత్మానాత్మల కలయికలో అంతః కరణ ప్రతిబింబంగా తోచింది లేక మాయా ప్రతిబింబంగా తోచింది. దేని ప్రతిబింబంగా తోస్తే దానికా పేరు. ఇదంతా మాయలోనే. మాయ అనే ఆవరణలోనే జరుగుతోంది.

అసలు 3 గుణములవల్ల అందులో ఉన్న తమోగుణం చేత జడజగత్తు, ప్రకృతి మరియు రజోగుణముచేత జీవులు, ప్రాణులు ఉనికిలోకి వచ్చారు. సత్వగుణంచేత దివ్యత్వము, దేవతా స్వరూపాలు, త్రిమూర్తులు వచ్చాయి. 3 గుణాలు మాయ కనుక వచ్చినవన్నీ మాయా కల్పితమే. లేనివే ఉన్నట్లు కనపడేవే. అందువల్ల బ్రహ్మము ఒకటే, బ్రహ్మము కంటే అన్యము లేవు. జీవ ఈశ్వర జగత్తులు కూడా లేవు. జగత్తు ఎలా తోచింది అంటే తాడుమీద పాము తోచినట్లుగా తోచింది. జీవుడెలా తోచాడు? జీవుడు కూడా తాడుమీద పాము తోచినట్లే. దేవతలెలా తోచారు? త్రిమూర్తులెలా తోచారు? వాళ్ళు కూడా తాడుమీద పామువలెనే. తాడు అనేటటువంటి నిర్గుణ బ్రహ్మమీద త్రిగుణాత్మక మాయ ఆశ్రయాన్ని తీసుకొని, మాయ మాయ పనులు చేస్తూ ఉంటే తమోగుణం వల్ల జగత్భ్రాంతి, రజోగుణంవల్ల జీవభ్రాంతి, సత్వగుణంవల్ల ఈశ్వర భ్రాంతి కలిగింది. లేకనే ఉన్నట్లు తోచింది. దీనికి మూలం ఏ చూస్తాము? దీనికి మూలం తెలియదు మనకి. ఒకవేళ తెల్సుకోవాలనుకుంటే తెల్సుకునేవాడు కూడా లేకనే ఉన్నట్లు తోచాడు. జీవుడనేవాడు నేను నేననే అహంకారం కూడా ఎవడైతే నేను అనే సత్యాన్ని అన్వేషిస్తున్నాడో ఈ జగత్తుకు మూలాన్ని వెతుకుతున్నాడో వాడే లేనివాడు. వాడే లేకనే ఉన్నట్లు తోచాడు. అసలు వాడి మూలంకూడా కనుక్కోవాలి. సాధకుడియొక్క, జీవుని యొక్క, ఈశ్వరుని యొక్క మూలం కూడా కనుక్కోవాల్సిందే.

ఇవన్నీ చూచువాని యొక్క బుద్ధి దోషం. బుద్ధి దోషం లేకపోతేనేమో తాడే కనబడుతుంది. బుద్ధి దోషంతో కూడి ఉంటే పాము కనపడుతుంది. ఈ దోషం ఎక్కడ్నుంచి వచ్చింది? తోచేవాడు బ్రహ్మకంటే రెండోవాడు కాదు. బ్రహ్మయొక్క ప్రకాశము బ్రహ్మమొక్కటే ఉన్నపుడు అది స్వయం ప్రకాశంగా వుంది. అన్యము లేదు. బ్రహ్మయొక్క ప్రకాశము స్వయం ప్రకాశముగా ఉండగా మాయ అట్టి బ్రహ్మను అంతటా కాకుండా, కొంతమేరకు ఆశ్రయించింది. ఎక్కడ మాయ ఆశ్రయించలేదో అక్కడ స్వయం ప్రకాశంగా ఉంది. అన్యము లేదు. బ్రహ్మ యొక్క ప్రకాశము స్వయంప్రకాశముగా ఉండగా, మాయ అట్టి బ్రహ్మను అంతటా కాకుండా, కొంతమేరకు ఆశ్రయించింది. ఎక్కడ మాయ ఆశ్రయించిందో అక్కడ స్వయం ప్రకాశ బ్రహ్మ తనలోతాను ప్రకాశిస్తూ కూడా, మాయావరణలో కూడా అదే ప్రకాశము వ్యాపించింది. మాయవరణలో వ్యాపించినటువంటి ప్రకాశము ఇంకా సృష్టి ఏర్పడకముందు శుద్ధ చైతన్యము పరమాత్మ ప్రకాశమది.

మూల ప్రకృతిలో ఉన్నటువంటి సకల జీవరాశుల యొక్క అనేక జన్మల పరిణామ దశలలో సంపాదించినటువంటి సంచితకర్మ రాశి. అదే అవ్యక్తము. అదే మూల ప్రకృతి. మాయలో ఉన్న 3 గుణాలచేత మూల ప్రకృతి లేక అవ్యక్తము అనే పేరుతో అక్కడ ఉన్నాయి. మాయావరణలో పరమాత్మ ప్రకాశము యొక్క సత్తాచేత ఆ చైతన్యముచేత పరిణామాన్ని ఒక క్రమపద్ధతిలో క్రియారూపంలోకి తెచ్చుకుంది. చైతన్య సత్తా లేనపుడు పరిణామ శీలముగా ఉంది కానీ ఆ పరిణామము చెందటానికి సత్తా లేదు. చైతన్యము యొక్క వ్యాపకత్వమువల్ల ఆ సత్తాని పొంది, ఆ పరిణామ శీలత ఏదైతే ఉందో అది క్రియోన్ముఖమై దశలవారీగా నామరూప జగత్తుగా వచ్చేసింది. అనగా చూచేవాడియొక్క బుద్ధి దోషం కనుక ఈ దోషము ఎలా వచ్చింది? మాయతో ఉన్నటువంటి దోషం, మాయా ప్రతిబింబంగా ఉన్న ఈశ్వరుడికి వచ్చింది. అవిద్యలో ఉన్న దోషము అవిద్యా ప్రతిబంబంగా ఉన్న జీవుడికొచ్చింది. దోషాలు జీవుడిలో, ఈశ్వరుడిలో లేవు. మాయలో ఉన్నాయి. అవిద్యలో ఉన్నాయి. శుద్ధ సత్వగుణమాయ, మలిన సత్వగుణమాయ అని ఉన్నాయి. శుద్ధ సత్వ మాయ ప్రతిబింబముగా మాయావరణలో ఉన్న పరమాత్మ ప్రకాశము దాని అధిష్ఠాన ప్రకాశమంటారు. అధిష్టాన ప్రకాశము+ మాయలో ఉన్నటువంటి దోషాలు + మాయలో ఉన్న దోషాలతో కూడినటువంటి ప్రతిబింబ ప్రకాశము. ఈ మూడు కలిసి ఈశ్వరుడు. మలిన సత్వమాయలో తమోరజోగుణాలు విజృంభించగా అధిష్ఠాన పరమాత్మ ప్రకాశము + అవిద్యలో ఉన్న దోషము + అవిద్యా ప్రకాశంతో ఉన్నటువంటి ప్రతిబింబ ప్రకాశము కలిసి జీవుడు. కనుక వీళ్ళకి వృత్తి దోషాలు ఎక్కడినుంచి వచ్చాయంటే మాయనుంచి, అవిద్యనుంచి వచ్చినాయి. వీడు ప్రతిబింబంగా తోచటంచేత ఏ అద్దానికి ప్రతిబింబం అయ్యారో ఆ అద్దం యొక్క దోషంచేత దిగుతారు. నిజానికి జీవుడికి ఏ దోషము లేదు. అద్దము యొక్క దోషంతో ఉన్నట్లు కనబడుతున్నాడు. విచారిస్తే దోషము లేదు. విచారించనివారికి దోషం వుంది. విచారించని వారికి దోషం ఉంటే పునర్జన్మలున్నాయి. పాపపుణ్య కర్మలున్నాయి. ఫలితాలున్నాయి. విచారించిన వాడికి ఇది ప్రతిబింబమే కాని బింబమైనటువంటి నాకు ఈ 3 గుణాల దోషము లేదు. అవిద్యా దోషము లేదు. మాయా దోషము లేదు. అవన్నీ ఉన్నట్లుగా కనపడుతున్నాయి తప్ప నిజానికి లేవు. నేను పరిశుద్ధుడను అనుకుంటాడు.

ఇపుడు మనం ఉన్నటువంటి స్థాయి చూడాలి. ఈ మూలమేమిటో, జగత్తు ఎందుకొచ్చిందో, జన్మ ముందో, కర్మ ముందో వీటన్నిటినీ విచారిస్తూ ఎంతకూ తెగని సమస్య ఇది. చెట్టు ముందా విత్తు ముందా అనేది, తండ్రి ముందా, కుమారుడు ముందా అనేది, అనేటటువంటిది తెగే సమస్య కాదు. ప్రస్తుతం మనం ఏ ప్రమాదంలో ఉన్నామో ఏ బంధంలో ఉన్నామో మన పరిస్థితి విచారిస్తే పునర్జన్మలు పొందుతున్నామో, పొందటం సంగతి అలా ఉంచేసి జన్మకర్మ జన్మకర్మ అనే చక్రంలో తిరుగుతున్నాము. దీనికి అంతు కావాలి. మనము ఎక్కడో అక్కడ అంతం చూడాలి. ఈ చక్ర భ్రమణంనుంచి మనం వేరే ఉండాలి. చక్రంలో ఉన్నంతవరకు చక్రంతోపాటు తిరుగుతాము. ఈ చక్రాన్నే భవము అంటారు. గురువేమో దీనిని వదిలించేటటువంటి వైద్యుడు. భవరోగ వైద్యుడు. మనం ఉన్న స్థితి దగ్గరనుంచి ఎట్లా బయటపడాలో చూసుకోవలే కానీ దీనికి మూలమంటే ఎట్లా కుదురుతుంది.

అగ్నిప్రమాదం వచ్చింది. గబగబా మనం కాలిపోకుండా అగ్నియొక్క తాపం మనమీద పడకుండా సాధ్యమైనంతవరకు బయటపడే ప్రయత్నం చేస్తాం. అగ్ని ఎలా వచ్చింది? ఇంతసేపు వానకూడా పడిందే. ఎవరు పెట్టారు అని మూలాన్ని వెతుక్కుంటూ కూర్చుంటామా? ముందు బయటపడినాక అపుడు వెతుకుతాం కావాలంటే. అయిపోయాక వెతికేం లాభం? అటువంటి ప్రమాదం మరోసారి జరగకుండా జాగ్రత్తపడటానికి అది ఎలా వచ్చిందని ఆ మూలాన్ని కనిపెట్టాలి.

మూలం కనుక్కొని ఆ మూలం దగ్గరినుంచి అవరోహణా పద్ధతతిలో ఈ జీవుడు తానున్న స్థితికి ఎలా జారివచ్చాడో మరల సాధనచేత ఆరోహణ చేసి మరల మూలానికి వెళితే ఇది సాధనచేత పైకి ఉద్ధరించబడాలి. 'ఉత్' ధరించబడాలి. ఉద్ధరేత్ ఆత్మానాం. ఆత్మ ఆత్మచే ఉద్ధరించబడాలి. నిన్ను నీవు మోక్షస్థానానికి పైకి ఉద్ధరించుకోవాలి. కనుక ఎలా దిగావో తెలిస్తే అలాగే ఎక్కేసి వెళ్ళిపోవచ్చు. అందుకు తెలుసుకుంటున్నాము. అయితే ఒక మూలందాకా వెళ్ళటానికి తెలుసు మనకు. ఆ మూలం మాయలోనే ఉంది. మాయలోనే దిగి, మాయలోనే ఎక్కాము. మాయను దాటేటపుడు మాత్రం మూలంయొక్క విచారణ తప్పక చెయ్యాలి. మూలందాకా వెళ్ళేటటువంటిది జ్ఞానము. మూలాన్ని దాటి చివరకు, మూలం లేకుండా చేసుకుని, పైకెళ్ళి మళ్ళీ దిగజారకుండా ఉండేలా జాగ్రత్తపడినపుడు అది శాశ్వతమైనటువంటి స్థానము. పరమపదము. ఈ ముక్తే ముక్తి. పరమపద మార్గము. తిరిగిరాని ముక్తి, తిరిగిరాని మోక్షము.

ఇపుడు ద్వైతంలో కొంత నడిచి అద్వైతంలో చేరి సాయుజ్య ముక్తి పొందేటటువంటి ప్రయత్నం మనం ముందు చేస్తే, ఆపైన పరమపదం సంగతి మాట్లాడుదాము. తాడు స్థానమందున్నది బ్రహ్మము. ఇది ఉదాహరణ. ఉదాహరణగా ఇచ్చింది దృష్టాంతం అంటాం. ద్రాష్టాంతము అంటే బ్రహ్మము, ఆత్మ మొదలైన విచారణాంశాలు. దృష్టాంతమేమో అర్థం కావడానికి ఉదాహరణ. కనుక దృష్టాంత ద్రాష్టాంత పద్ధతిగా పోవాలి. ద్రాష్టాంతం చెప్పకుండా ఒట్టి ఉపమానాలు చెప్పుకుంటే బ్రహ్మ నిర్ణయం విషయంగా అవుతుంది. కానీ బుద్ధిలో పూర్తిగా నిర్ణయం అవటానికి ఈ బ్రహ్మము, ఈ జగత్తు తాడు పామువలె ఉంది అంటే దృష్టాంతం బాగానే ఉంది. కానీ నేను నమ్మొద్దూ! కనుక ద్రాష్టాంతాన్ని కూడా విడమర్చి చెప్పి ద్రాష్టాంతంలో ఉన్న బ్రహ్మ నిర్ణయానికి ఆ బ్రహ్మనుంచి జీవేశ్వర జగత్తు ఎలా వచ్చింది అనే పద్ధతిలో నిజంగా వచ్చాయా? భ్రాంతితో వచ్చాయా తెలియాలంటే ఇపుడు దృష్టాంతం పనికొస్తుంది. అనగా బ్రహ్మమునే మనము భ్రాంతివల్ల జగత్తుగా తలచి అనేకముగా వ్యవహరించుచున్నాము. ఇచ్చటకూడా చూచువాని యొక్క బుద్ధి దోషం ఉన్నది.

బుద్ధి దోషపూరితము అనక తప్పదు. బుద్ధికి దోషం ఎక్కడ్నుంచి వచ్చింది. మలత్రయము నుండి వచ్చింది. తమోగుణం వల్ల ఆవరణ వచ్చింది. మూలప్రకృతిలోని సకల జీవరాశుల సంచితకర్మ నీకు పంచబడగానే ఆకర్మ ప్రకారంగా ఒక ఉపాధి ఒక బుద్ధి వచ్చాయి. ఆ ఉపాధిలో ఉన్న బుద్ధికి పూర్వజన్మ సంస్కారాలతో కూడినటువంటి అధ్యాస వచ్చింది. ఈ అధ్యాసలో జగత్తు నిజము. ఉపాధియే బ్రహ్మమనే దానిని ఆవరించింది అని తెలియాలి. తనకి శాశ్వత ఆనందం కావాలంటే బ్రహ్మయొక్క లక్షణం ఆనందము. అది తానే అయి ఉన్నాడు కాబట్టి, విచారించి తెలుసుకుంటే జన్మ రాహిత్యము, దుఃఖరాహిత్యము, బంధ రాహిత్యము, ఆనందము అనేటటువంటి **స్వరూపము సిద్ధిస్తుంది**. ఆ పదాలు ఏది వాడుతున్నారో అది గమనించండి. బ్రహ్మ జ్ఞానము పొందేది కాదు. నువ్వు బ్రహ్మమే అయివున్నావు. భ్రాంతితో కాదన్నావు. విచారణచేత భ్రాంతి తొలగితే నువ్వు బ్రహ్మమే అయి వున్నావు. బ్రహ్మవేరు నువ్వు వేరయి, నువ్వు బ్రహ్మను పొందటము కాదు, అందుకోవటం కాదు. సాధన దశలో అంది పొంది మీరటం చెప్పినప్పటికీ క్రమక్రమంగా నువ్వు ఏది కాదో దానుండి విడుదల పొందుతున్నావు. విముక్తుడవుతున్నావు. దశల వారీగా కొంచెం కొంచెం అజ్ఞానము అధ్యాస భ్రాంతినుండి విడుదలవుతుంటే, సత్యము కూడా కొద్దికొద్దిగా ఆవిష్కరణ జరుగుతూంటుంది.

అయితే బుద్ధి పరిధిలో సత్యం యొక్క ఆవిష్కరణ పరిపూర్ణము కాదు. సత్యం యొక్క సమీపం దాకా వెళ్తాము. దానినే ఉపదేశము అంటారు. ఉపవాసము, ఉపరతి ఈ మాయావరణలతో పొందుతాం. మాయను దాటేసరికి సత్యము, జ్ఞానము, ఆనందము, అనంతము, సద్ఘనము, చిద్ఘనము, ప్రజ్ఞాన ఘనము, అనంతత్వము ఇవన్నీ ఆవలవి. సమీపము వరకు వెళ్ళేదాకానే ఈ సాధన, ఈ బోధ. ఆపై బోధ ఉన్నది. అది వస్తు నిర్ణయంగా చేసే బోధ, పరిపూర్ణబోధ. మనం తర్వాత చూద్దాం. ముందు వస్తు నిర్ణయం తాత్కాలికంగా అద్వైత పద్ధతిలో బ్రహ్మ సత్యం జగత్ మిథ్య అనే దాంట్లో తాడు, పాము అనే దృష్టాంతంతో భ్రాంతినుంచి విడుదలై కేవలం బ్రహ్మము అయ్యేటట్లుగా చూద్దాం. అపుడు బ్రహ్మము భ్రాంతికి మూలమా, బ్రహ్మము జగత్తుకు మూలమా? త్రిమూర్తులు జగత్తు యొక్క సృష్టి స్థితి లయలకు మూలమే. జగత్తు మిథ్య అన్నపుడు, ఈశ్వరుడు ఈ మిథ్యా జగత్తుకు మూలమన్నపుడు, ఈశ్వరుని యొక్క కార్యాలు కూడా మిథ్యయే అవ్వాలి. ఆ కార్యాలనుబట్టి సృష్టికర్త, పోషకకర్త, లయకర్త అయ్యారు. కార్యము మిథ్య అయినపుడు కర్తృత్వం లేదు. కర్తృత్వాన్ని బట్టి చెప్పే త్రిమూర్తులు కూడా భ్రాంతిలోనివారే. అందుకే పరబ్రహ్మ నిర్ణయానికి త్రిమూర్తులు సరిపోరు అని చెపుతూ ఉంటాం. పరబ్రహ్మ నిర్ణయం ఉంటే ఆ త్రిమూర్తులు సృష్టి స్థితి లయములు చెయ్యరు.

అసలు ఆ త్రిమూర్తులే లేనివారు. మాయలో ఉన్న సత్వగుణంచేత తోచారు. ఇలా చూసుకుంటే జీవుడి దగ్గర బుద్ధి దోషమని ఏదైతే అంటున్నామో బ్రహ్మదగ్గర మహత్తు అనేది దోషము. మహత్తంటే 3 గుణముల యొక్క సామ్యము. అవ్యక్తమంటే 3 గుణముల బీజావస్థ. 3 గుణాలు ఎక్కడున్నా మాయే కనుక అక్కడ ఏమీ లేదు. మహత్తనేటువంటిది లేదు. ఆ లేని దానివల్లనే బ్రహ్మము తోచాడు తోచిన బ్రహ్మమే సృష్టికి సంకల్పం చేశాడు. సృష్టికి సంకల్పం చేసిన బ్రహ్మమే త్రిమూర్తులుగా మారాడు. త్రిమూర్తులుగా మారినటువంటి ఈశ్వరుడే **'ఏకోహంబహుశ్యాం విప్రా బహుదా వదంతి'** అని లోపల ఒక సంకల్పము., ఒక భావన రాగానే తథాస్తు అన్నట్లుగా ఆ ఒక్క ఈశ్వరుడే అనేక జీవులుగా, నానాత్వంగా, భేదముగా మారాడు. ఇదంతా భ్రాంతిలో కలవలె బ్రహ్మ, ఈశ్వరుడు జీవుడు ఒకళ్ళకొకళ్ళు ఆధారమన్నట్లుగా వచ్చారు. అయితే సాధనలో జీవుడు ఈశ్వరుడవ్వాలి. ఈశ్వరుడు బ్రహ్మమవ్వాలి. బ్రహ్మము పరబ్రహ్మమవ్వాలి. ఆ కలలోనే ఈ అవరోహణ, ఈ ఆరోహణ.

అందుకే ఇంతవరకు సత్యమని చెప్పి ఇంతవరకే సాధన చేయించి ఆ తరువాత పరమ సత్యాన్ని బయటపెట్టాలి. అంతవరకు పరమ సత్యాన్ని రహస్యంగా ఉంచాలి. ఇది సాంప్రదాయము. మహా వాక్యలప్పుడే చెప్పకూడదు. చెపితే ఏమవుతుంది? ఈశ్వరుడే లేదు. భగవంతుడు లేడని భక్తి లేక నాస్తికుడవుతాడు. భక్తి అనేది ఒకటి పెట్టుకున్నపుడే ద్వైతమనేది ఒకటి పెట్టుకున్నపుడే, భక్తి యోగము ఉన్నపుడు సత్‌చిత్ ఆనందమనేటటువంటి లక్ష్యాన్ని భక్తి ద్వారా, భక్తి యోగము ద్వారా ఆ లక్ష్యాన్ని చేరతాము. అది మధ్యంతరము, తటస్థ లక్షణము. అక్కడిదాకా చేరేదాక అది నిజమని చెపితేనే అక్కడికి చేరతాడు. ఇది అబద్ధమైతే చెయ్యటము మానేసి, సాధన మానేసి, నాస్తికుడై ఉంటాడు. యోగాభ్యాసము చేసి యోగి అయినవాడికి ఆ చివరిదైన విడుదల మోక్షము, తన స్వరూపాన్ని యోగస్థితిలో పట్టుకుంటాడు. అందువలన కొంత రహస్యాన్ని ఆ చిట్టచివరిది ముందే చెప్పకుండా దాచిపెట్టాలి. కాని మీ అందరికీ బైట పెట్టేస్తున్నాం.

ఇట్టి బుద్ధి దోషం వలన భ్రాంతి వలన ప్రభవించినటువంటి విషయం ఎన్నటికీ సత్యము కాదు. భ్రాంతి నశించినపుడు దానితో తజ్జనితమైన దానివలన కలిగినటువంటి చీమలు కూడా నశిస్తాయి. పురాణాలలో చూస్తాం. కామరూపంలో మారీచున్నాడనుకోండి లేడి రూపంలో వచ్చాడు. రాముడు లేడిని కొట్టగానే లేడి మాయమై అక్కడ రాక్షసుడుంటాడు. కామరూపం ఆ కామరూప విద్య, బ్రతికున్నవాడికే. అతడికే ఆ కామరూపం కూడా ఉంటుంది. ఆ బ్రతికున్నవాడు కామరూపంలో గారడీగా తన రూపాన్ని మార్చుకున్నప్పటికీ అతను నశించగానే అతనియొక్క మాయ కూడా నశిస్తుంది. అలాగే భ్రాంతి మూలములో నీకు తాడు, పాము దృష్టాంతములో పాముకాదు అంటే తాడే ఉన్నట్లుగా జీవేశ్వర జగత్తు లేదు. అంటే బ్రహ్మమే ఉన్నది ఎలా అయితే నిర్ణయమయ్యిందో నీకు భ్రాంతి నశించిందో అపుడు భ్రాంతిలో తోచినవి ఒక్కటి కూడా మిగలదు. ఉండవు. తజ్జనిత విషయం కూడా నశిస్తుంది. విక్షేపంగా నిన్ను ఏదైతే బాధపెడుతుందో అది నశిస్తే ఇక బాధలేదుగా! బాధ లేకపోవడమే విముక్తి.

విక్షేపంగా తోచినటువంటిదేదైతే నశించిందో సత్యవస్తు సాక్షాత్కారానికి ఈ విక్షేపంతో ఉన్నటువంటి జీవుడు, ఈశ్వరుడు, జగత్తు అనేటటువంటి భావనలు ఆటంకము. వాటిని నిరోధించినపుడు ఏమైంది? ఆటంకం తొలగి తెర తియ్యగానే తెరవెనుక ఉన్నది ఎట్లా అయితే తెలియపడుతుందో సాక్షాత్తు బ్రహ్మము అయినటువంటి నీయందు ఈ తెర తొలగగానే నీవు నీవుగా వున్నటువంటి అపరోక్షానుభూతి కలుగుతుంది. యదార్థం గోచరిస్తుంది. ఇదీ వేదాంతసారమంటే.

అహం అజ్ఞం నేను అజ్ఞానినని ఎవరికి వారు ఒప్పుకొనక తప్పదు. ఇక్కడొక తమాషా ఉంది. అజ్ఞానము అంటే జ్ఞానం లేకపోవటము. ఎరుక లేకపోటం. తెలివి లేకపోవటం. తనను తాను తెలిసికునే తెలివి లేకపోవటం. అజ్ఞత అంటే తెలియలేని తనం. అస్సలు ఏమీ తెలియలేనితనం. ఏమీ తెలియనటువంటి తెలియని తనంలో తాను జీవుడని అనుకుంటున్నాడు. అంటే తెలుస్తోందిగా. తప్పో, ఒప్పో, రైటో, భ్రాంతో, సత్యమో, అసత్యమో తాను జీవుడని తెలుసుకుంటున్నాడుగా. తెలుసుకునేవాడు అజ్ఞానుడెట్లా అవుతాడు. ఏదో ఒకటి తప్పో రైటో తెలుసుకున్నవాడు అజ్ఞుడు కాదు. అనే శబ్దంతో తెలిసికొనగలిగినవాడే. అదే తమాషా. అదయితే ఇక్కడ తన స్వస్వరూపం తెలిసినవాడు జ్ఞాని. తన స్వస్వరూపం మరచినవాడు అజ్ఞాని. కేవలం మరచి రాయిలాగ, రప్పలాగ, జడత్వముగా ఉంటే అజ్ఞాని అనేమాట సరిపోతుంది. ఎరగనంతవరకు అలాగే ఉండకుండా, తాను అన్యముగా తననుతాను బ్రహ్మముకంటే అన్యమైనవన్నీ తాననుకుంటున్నాడు. జీవుడని, ఈశ్వరుడని, అనేక జన్మలలో స్త్రీ అని, పురుషుడని, ఒక జన్మలో బ్రాహ్మణుడని, క్షత్రియుడని, ఈ గోత్రమని, ఆ గోత్రమని, ఈ పేరని, ఆ పేరని ఇవన్నీ కూడా అనుకుంటున్నాడు. చూచి గమనించి, గ్రహించి తెలుసుకుంటున్నాడు. మరి తెలుసుకోవడమున్నపుడు వాడికి అజ్ఞః ఎట్లా అవుతాడు? సరే ఆ తమాషా పక్కన పెడితే తెలుసుకోకపోవటం అజ్ఞానము తెల్సుకోవటం జ్ఞానము.

ఇపుడు ఆ పాయింటులో మనం ముందుకెళదాం. నేను అజ్ఞానినని ఎవరికివారు ఒప్పుకోక తప్పదు. ఎందుకంటే తన స్వరూపము చావు పుట్టుకలు లేనిది. అనగా శాస్త్ర సిద్ధాంతమునుసరించి చూడగా బ్రహ్మమై ఉండియు అట్లు తెలియక, జీవుడని అనుకొనుచున్నాడు. నేను అజ్ఞానిని అని తెలియవచ్చింది. ఏమీ తెలియకపోవటం అజ్ఞానం కాని, మరి జీవుడని తెలిస్తే అజ్ఞాని ఎట్లా అవుతాడు? కాని మనం దానికి అజ్ఞానమని పేరు పెట్టుకున్నాం. పురుషుని చిత్తమును ఆశ్రయించి ఉన్న భ్రాంతివలన తన నిజ స్వరూపమును విస్మరించాడు. పురుషుడంటే ఎవరండీ? నవద్వార పురమందు వశించువాడు పురుషుడు. నవద్వారములతో ఉన్నటువంటి స్థూల శరీరమందు, స్థూల శరీరాన్ని క్రియా రూపంతో ఉంచగల ప్రాణమందు. ఆ క్రియకు మూలమైనటువంటి మనసునందు ఒక పద్ధతిలో ఒక నిర్ణయంగా ఆ మనసుని, ఇంద్రియాలని ఉపయోగించే నీయందు సుఖమే కావాలి. దుఃఖము వద్దు అనేటటువంటి ఆనందమయకోశం నుంచి అందేటటువంటి ప్రియం, మోదం, ప్రమోదమునందు ఆత్మగా, చైతన్యముగా, ప్రజ్ఞగా నిజమైన జ్ఞానముగా ఒకడున్నాడు. వాడిపేరు బ్రహ్మ. ఘటాకాశమున్నట్లుగా పిండాండమందు, నీయందు నీ శరీరమందు నీ పంచకోశాలయందు, నీ స్థూల, సూక్ష్మ, కారణ శరీరములయందు ఉన్నటువంటి బ్రహ్మనే మనం ఆత్మ అంటున్నాము.

మహాకాశము, ఘటాకాశములో కూడా మహాకాశమే అవిభాజ్యముగా ఉన్నది. ఘటము వలన ఆకాశము ఘట పరిచ్ఛేదముగా లేకుండా ఉన్నది. కాలము వలన కాల పరిచ్ఛేదము లేకుండా ఉన్నది. వస్తువు వలన వస్తు పరిచ్ఛేదము లేకుండా ఉన్నది. చోటువలన, దేశ పరిచ్ఛేదము లేకుండా ఉన్నది. ఇవి విడివిడిగా అనేక భాగాలతో నానాత్వముగా ఉన్నప్పటికీ వీటన్నిటియందు లోపల, బయట ములుగ్రుచ్చ సందులేక అంతటా వ్యాపించినటువంటి పరమాత్మ, శుద్ధ చైతన్యము, బ్రహ్మ చైతన్యము అఖండముగా అవిభాజ్యముగా ఉన్నది. పరిచ్ఛిన్నము కాకుండా ఉన్నది.

ఆ పురుషునియందు వ్యాపించినటువంటి చైతన్యము కొన్ని సంస్కారములచేత ముద్రించబడి యున్నది. అఖండముగా, అవిభాజ్యముగా, వ్యాపకముగా ఉన్న చైతన్యము మీద ఒక్కొక్క జీవునికి సంబంధించిన సంస్కారములు ముద్రించబడియున్నవి. ఏ చైతన్యం మీద ఈ సంస్కారాలు ముద్రించబడ్డాయో, అక్కడ ఎంతమేరకు ఆ సంస్కారాలు ముద్రించబడ్డాయో అంతవరకు అది చిదంశ. ఆ సంస్కారముతో కూడినటువంటి అనుభవము సంస్కారములు ఉన్నంతవరకే అవి అనుమతించినంతవరకే పరిమితంగా ఉంటాయి. ఆ సంస్కారములో ఉన్నటువంటి విషయాలు, విషయ తాదాత్మ్యత ఆ చిదంశతో ఉంటాయి. దానిపేరే చిత్తము. సర్వవ్యాపక చైతన్యంమీద అనేక జీవులకి సంబంధించి ప్రతిఒక్క జీవుని సంస్కారము ముద్రించబడి అందరి జీవులయొక్క సంస్కారాలు అన్ని రకాలుగా, అన్ని విధాలుగా విడివిడిగా ముద్రించబడితే ఆ సంస్కారములతో కూడినటువంటి అనుభవాన్నిచ్చేటటువంటి చిదంశలు ఆ జీవులయొక్క చిత్తములుగా తోచినవి. చైతన్యమే సంస్కారములచేత పరిమితమై

చిత్తములుగా పిలువబడుతున్నాయి. **చిత్తవృత్తి నిరోధః యోగః** అన్నపుడు చిత్తవృత్తులు చిత్త నాశనము చేసినపుడు అనగా చిదంశలో సంస్కారములు నాశనమయినపుడు, సంస్కార రహితమైనపుడు ఆ సంస్కారముల ప్రకారముగా అనుభవించాల్సినటువంటి అనుభవాలు తోచవు, ఏ విషయము తోచనపుడు, తాను తానైటువంటి శుద్ధ చైతన్యముగా అక్కడికక్కడే చైతన్యానుభూతిని పొంది, చైతన్యమే తానుగా అయి ఉంటాడు. చైతన్యమందు సంస్కారములు చిదంశగా వచ్చినపుడు ప్రతి చిదంశ ఒక్కొక్క చిత్తమైతే ప్రతి జీవుడు తనలోని చిత్తమును, చిత్త వృత్తులను నశింపచేసుకొని చిత్త వృత్తులను శాంతింపచేసి తుదకు చిత్తనాశనమైతే ఆ వాసనలు, సంస్కారములు, చిత్తములు అన్నీ తుడిచివేయబడితే అది తిరిగి శుద్ధ చైతన్యముగానే మిగిలి ఉన్నది. ఆ శుద్ధ చైతన్యముగా మిగిలి ఉన్నటువంటిది దానియందు ఆ చిత్తనాశనము ఏ జీవుని యందైతే అయ్యిందో ఆ జీవునికి సహజంగానే అపరోక్షము సిద్ధిస్తుంది. అది తానే అయివున్నాడు కాబట్టి తిరిగి తాను ఆ చైతన్యానుభవాన్ని తన స్వరూపముగా గుర్తిస్తాడు. అది కేవలం స్వానుభవం. ఈ శుద్ధ చైతన్యానుభూతియే ఆత్మ. కనుక తాను ఆత్మ అయి ఉంటాడు. ఆత్మానుభవములో నిష్ఠ చెంది ఉంటాడు.

చిత్తము పురుషునియొక్క చిత్తము నాశ్రయించి ఉన్న భ్రాంతివల్ల, మరి ఈ చిత్తముతో ఉన్న విషయాలన్నీ ఏమిటి? అనేక జన్మలతో తాను సంపాదించినటువంటి అనుభవాల సారము, జ్ఞాపకాలయొక్క సారము, విడిచి ఉండలేక అట్టిపెట్టుకున్నటువంటి విషయ వాసనలు, అవే పునర్జన్మలో చిత్తవృత్తులుగా మళ్ళీ ఆ జీవునికి కర్మానుభవముగా తోచి, కర్మానుభవము ఇచ్చి కర్మానుభవము అయిపోగానే అవి చెరిగిపోతున్నాయి. ప్రారబ్ధం భోగతో నశ్యతే, ప్రారబ్ధ కర్మ అనుభవించగానే రద్దయిపోతోంది. ఈ అజ్ఞానంగా ఉన్నవాళ్ళు, సంసారంలో ఉన్నవారు, సత్యము తెలియనటువంటివారు అగామికర్మ జోలికి వెళ్తున్నారు. ఓర్పు, సహనము, త్యాగము, తన స్వరూపమైనటువంటి ఆత్మ భావనతో ఉంటే సరిపోయేదే. అలా ఉండకుండా మాటకిమాట, చేతకి చేత, చర్యకు ప్రతిచర్య, స్పందనకు ప్రతిస్పందన ఆ జీవులలో కలగడంచేత ఆగామికర్మ ఏర్పడుతోంది. అందువల్ల భ్రాంతి కొనసాగుతోంది. ఇది **యద్భావం తద్భావతి**గా కొనసాగుతున్నాయి. గుర్తులు, జ్ఞాపకాలు, విడిచి ఉండలేనటువంటి పద్ధతిలో దాచుకోకుండా ప్రేమ, మమకారము, అహంకారము రాగద్వేషాలు, పగ, ప్రతీకారములు ఈ జన్మలో నువ్వు అన్నీ తుడిచేసుకుని అన్నీ అఖ్ఖర్లేదనుకొని పూర్తిగా విడుదలై ఉన్నవాడికైతే ఆ వాసనలన్నీ చెరిగిపోయి వాసనాక్షయమైతే మళ్ళీ పునర్జన్మగాని, చిత్తవృత్తులు కాని ఉండవు. అలా చెయ్యటంలేదు కాబట్టి ఆగామి కర్మ ఏర్పడి ఈ పునర్జన్మ వస్తోంది. ఏ విషయవాసనచేత ఈ పునర్జన్మ వస్తోందో ఆ విషయాలే చిత్తవృత్తులౌతున్నాయి. ఆ విషయ వాసనే ఇక్కడ చిదంశగా చైతన్యంమీద అద్దబడింది. అది అపరిచ్ఛిన్నం అయినప్పటికీ చిదంశ కారణంగా పరిచ్ఛిన్నమైనట్లుగా పరిమితమైనట్లుగా ప్రతి జీవుడికీ తోస్తోంది. ఏ మేరకు అతని సంస్కారాలున్నాయో ఆమేరకు అతను పరిమితమయ్యాడు. ఈ 5 అడుగుల శరీరం నేను అనేటటువంటి దానికి పరిమితమయ్యాడు. నేను బ్రాహ్మణుడ్ని, క్షత్రియుడను అనేదానికి పరిమితమయ్యాడు. నేను ఈ గోత్రికుడ్ని, ఆ గోత్రికుడిని అనేదానికి పరిమితమయ్యాడు. నేను భారత జాతీయుడ్ని, ఆంధ్రుడ్ని, తెలంగాణవాడిని అనేదానికి పరిమితమయ్యాడు. ఇవన్నీ ఆ సంస్కారాలే, వాసనలే.

నిన్ను నీవు విశాలపరచుకోవాలి. నీకు గుణబేధం ఉండకూడదు. జాతి భేదం ఉండకూడదు. గోత్ర భేదం ఉండకూడదు. స్త్రీ పురుష బేధం ఉండకూడదు. **సమత్వం యోగముచ్యతే**. భేదాలన్నీ సమసిపోతే అదీ సమత్వం. సమత్వమన్నపుడు సంస్కారాలన్నీ చెరిగిపోతాయి, రద్దయిపోతాయి. రద్దయిపోతే ఈ చైతన్యం మీద ముద్రించబడిన సంస్కారముల చేత చిదంశ ఏదైతే ఏర్పడిందో దానివల్ల పరిమితత్వం వచ్చిందో ఆ పరిమితత్వం పోతుంది. ఆ అంశలో ఉన్నటువంటి సంస్కారాలు చెరిగిపోతాయి. అన్ని సంస్కారాలు చెరిగిపోతే శుద్ధ చైతన్యమే అపరిచ్ఛిన్నంగా, సర్వవ్యాపకంగా ఉంటుంది. కనుక చిత్తంలో ఉన్న పరిమితత్వం పోతే సంస్కారాలు చెరిగిపోతే అదే చైతన్యం. అదే ఆత్మ. చైతన్యంమీద కొన్ని సంస్కారములచేత అద్దబడినపుడు ఆ చిదంశలో ఒక చిత్తము తోచి అది జీవుని చిత్తమై ఆ జీవునికి చిత్తవృత్తులు, తద్వారా మనసుయొక్క అనుభవాలు, ఇంద్రియ జ్ఞానము, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ విషయము ఆ విషయములతో తాదాత్మ్యత, క్షోభ, బంధము, దుఃఖము అన్నీ ఒక క్రమపద్ధతిలో వచ్చి కనబడుతున్నాయి. చెప్పేదేమిటంటే, ఇదంతా భ్రాంతి. ఒకపుడు ఇవన్నీ నిజమనుకుంటేనే మళ్ళీ వచ్చిపడ్డాయి మనకి. ఇదంతా మిథ్య, లేనిది, కల్పితం అనుకుంటే లేనివి లేనట్లుగా కనుక నువ్వు చూడగలిగితే నీ స్వరూపానికున్న అడ్డు తొలగితే నీ స్వరూప జ్ఞానం నీకు కలుగుతుంది. స్వరూప జ్ఞానం కలిగినపుడు తదితరమంతా కూడా లేనిదని ఈ ఆత్మలో నిర్ణయమవుతుంది.

శాస్త్రద్రష్టం, గురోర్వాక్యం, తృతీయం ఆత్మ నిశ్చయం, శాస్త్రాన్ని చెపుతున్నారు గురువుగారు ఇప్పుడేం జరగాలి? వినేకొద్దీ శ్రవణం చేసేకొద్దీ శిష్యులలో ఆత్మ నిశ్చయం కలిగింది. నీగురించి నీకు యదార్థంగా తెలిస్తే అసత్యం పోతుంది. తాడు సాక్షాత్కారం అయితే పాము ఎందుకుంటుంది? తాడు నీ స్వానుభవంలోనే ఉందికదా. అది ఎపుడైతే సిద్ధించిందో పాము అనేటటువంటిది ఏ కోశాన ఉండదు, తోచదు. అంటే భ్రమ వదులుతుంది. భ్రాంతి రహితమవుతుంది. మూలంలోనే భ్రాంతి పోతే భ్రాంతివలన పరంపరగా వచ్చిన అనేక భ్రాంతులు కూడా లేకనేపోతాయి. కానీ ఒక్కొక్క భ్రాంతి పోతే, జీవభ్రాంతి పోతే ఈశ్వరుడుంటాడు. ఈశ్వర భ్రాంతి పోతే బ్రహ్మముంటాడు. అలాకాకుండా బ్రహ్మ భ్రాంతి పోతే ఏకంగా జీవేశ్వరులిద్దరూ లేరు. జగత్తు లేదు. ఈశ్వరుడుంటేనే సృష్టి, స్థితి లయలు వాసనచేత ఈ జగత్తును సృష్టిస్తూ, పోషిస్తూ లయం చేస్తున్నాడు. ఆ జగత్తు వాసన లేనటువంటి ఈశ్వరుడు సృష్టి, స్థితి లయలు చేయడుగా. అలాగే ఉపాధి పంచభూతాలతో తయారైనటువంటి సప్త ధాతుమయంగా ఉన్న ఉపాధి తాను అనుకోవటం ద్వారా మళ్ళీ ఆ వాసనచేత ఆ సంస్కారముచేత తన చిత్తమును కొనసాగిస్తే పునర్జన్మలకెళ్తున్నాడు. శబ్ద, స్పర్శ, రూప, రస గంధాలు తనకు నిమిత్త కారణంగా ఎక్కడెక్కడనుంచి వస్తున్నాయో, ఏ వస్తువుద్వారా, ఏ ప్రాణిద్వారా, ఏ ఇతర జీవుడి ద్వారా వస్తున్నాయో వాటిని సత్యమనేటటువంటి భావన పెట్టుకున్నపుడు, **యద్భావం తద్భవతి**గా పునర్జన్మల కెళుతూ ఉంటాడు. ఈ విచారణవల్ల తాడు పాము అనే విచారణవల్ల భ్రాంతిని నిర్ణయించడం ద్వారా అవి లేనివే అనే మిథ్యా భావం కలగడం ద్వారా తాను దృశ్య తాదాత్మ్యత లేని కేవల దృక్కుగా మిగిలిపోతాడు. తన ఉపాధి కూడా తాను కాదని ఆత్మగా, బ్రహ్మగా మిగిలిపోతాడు. అదీ జరగాలి.

పురుషుని యొక్క చిత్తము నాశ్రయించినటువంటి భ్రాంతి అడ్డురాగా తన నిజస్వరూపమును విస్మరించాడు. తనను జీవునిగా భ్రమించాడు. కాని నీ స్వరూపముతో నువ్వు నిశ్చితమైతే, ఆత్మ నిష్ఠగా ఉంటే, బ్రహ్మ నిష్ఠగా ఉంటే, నువ్వే ఆనంద స్వరూపుడుగదా! అది తెలియక, అన్య వస్తువులనుంచి ఆ సుఖాన్ని నువ్వు సంపాదించాలి అని ఎప్పుడైతే భ్రమలో పడి ప్రయత్నం చేస్తూ కర్మ చేస్తూ కర్మ ఫలితాన్ని అనుభవిస్తున్నావో, అపుడు నీకు నువ్వే సంసారాన్ని ఏర్పాటు చేసుకుంటున్నావు. ఆ వస్తువుమీద వ్యామోహంచేత వస్తువుతో బంధాన్ని ఏర్పాటు చేసుకుంటున్నావు. సుఖమే నీ స్వరూపమైతే సుఖము లేదు అనే అజ్ఞానం చేతనే నీయందున్న సుఖానికి బదులు నీకంటే అన్యమైనటువంటి వస్తు విషయాలలో ఉన్న సుఖాన్ని కోరుతున్నావు. ఆ విషయం సుఖాన్ని ఇచ్చిందా? సుఖం కోరినా దుఃఖం వచ్చింది, బాధ వచ్చింది. సుఖం ఒకవేళ వచ్చింది కానీ అనుకున్నంత రాలేదు. సగమే వచ్చింది. మిగతా సుఖం రాలేదనే దుఃఖం వచ్చింది. ఒకసారి అనుకున్నంతా వచ్చింది. కానీ అది అనిత్యము. ఏ వస్తువు ద్వారా సుఖం వచ్చిదో ఆ వస్తువు అనిత్యము. ఒకవేళ నువ్వున్నంతకాలం ఆ వస్తువు నిత్యమై ఉందనుకో, నువ్వు నీ ఉపాధితో అనిత్యము. నీ ఉపాధి రాలిపోగానే నీ సుఖానికి ఆటంకం వచ్చింది. ఉపాధి రాలటం అలా ఉంచు. ఒక్కొక్కసారి ఆ సుఖాన్ని అనుభవించేటటువంటి ఇంద్రియము తన శక్తిని కోల్పోతుంది. వృద్ధాప్యములో గాని, వ్యాధి, బాధలోగాని కోల్పోతుంది. అపుడేం చేస్తారు? ఆ సుఖం వద్దంటాము. ఆ సుఖం కూడా బాధ అవుతుంది. కనుక ఆత్మ సుఖమనేది శాశ్వతము. తెంపు లేనిది, తిరిగి ఉపాధులు రానీయనిది తిరిగి మాయా అవిద్య దోషములను సంతరించుకొనదు.

అటువంటి స్వరూపము నీవై ఉండగా అజ్ఞానముచేత చిత్తము నాశ్రయించి ఉండటంవల్ల అటువంటి భ్రాంతితో స్వరూపంలో ఉన్నటువంటి శాశ్వత ఆనందాన్ని విస్మరించి మరచి ఆవరణ దోషం కారణంగా మరచి, విక్షేప దోషం కారణంగా జీవుడిగా భ్రమించి, సుఖమనునది అన్యములో ఉన్నదనే భ్రాంతితో వస్తువునాశ్రయించి వస్త్వాకారం పొందుతున్నావు. విషయాన్ని ఆశ్రయించి విషయాకారం పొందుతున్నావు. అఖండమైన నీవు ఖండ వస్తువులనాశ్రయించి ఖండాకారం పొందుతున్నావు. జీవుడు నిజమని జీవాకారం పొందావు. బ్రహ్మచింతన చేసి బ్రహ్మాకారం పొందవలసి ఉండగా, జీవచింతన చేసి జీవాకారం పొందుతున్నావు. లేడి గురించి ఆలోచించి లేడి ఆకారం పొందాడు జడభరతుడు. ఒక స్త్రీని ప్రేమించి స్త్రీని తలచుకుంటూ మరణించినవాడు మరొక జన్మలో స్త్రీగా పుడుతున్నాడు. ఒక పురుషుణ్ణి ప్రేమించి ఆ పురుషుడ్ని వదలి ఉండలేక ఆ పురుషుడినే ధ్యానం చేస్తూ మరొక జన్మలో పురుషుడుగా పుడుతోంది. హిరణ్యకశ్యపుడు పగతో ప్రతీకారంతో అయినాసరే శ్రీహరిని మరచిపోకుండా నిరంతరం ధ్యానంచేసి మరణించి శ్రీహరిలో ఐక్యం అయ్యాడు. కనుక చిత్తభ్రాంతులు ఎలా ఉంటాయో చూడండి. ఏది చింతనచేస్తూ మరణిస్తామో మరొక జన్మలో ఆ వస్తువే నువ్వవుతావు. ఇదీ వస్త్వాశ్రయము అంటే. వస్త్వాశ్రయము వలన సంసారమునపడి పరిభ్రమించుచున్నావు.

ఒక్కసారి తిరిగితే పరవాలేదు. 84 లక్షలసార్లు తిరుగుతున్నావు. ఈ పరిభ్రమణానికి అంతుపొంతు లేదు. ఎక్కడ మొదలయ్యాడో మళ్ళీ అక్కడికే వస్తున్నారు. అంటే అర్థం ఏమిటంటే ఒక జన్మలో పుట్టి పెరిగి పలువిధ వికారాలతో నశించావు. బాల్య, యౌవ్వన, కౌమార, వృద్ధాప్యాలు ప్రతి జన్మలో రిపీట్ అవుతున్నాయి. పునరావృత్తి అవుతున్నాయి. మళ్ళీ జన్మలో ఆకలి దప్పిక, భయం మైధునము వీటితోనే ఉన్నాము. మనము ఏమి సాధిస్తున్నాము ఉపాధితో వచ్చాం కాబట్టి ప్రకృతి సహజంగా ఇవన్నీ అవసరం కాబట్టి దానికోసం శ్రమిస్తున్నాము. తప్పేమీ లేదు? కానీ అదే పరమార్థమా? ఉపాధి రాకపోతే అక్కర్లేదుగా. కాబట్టి ఒక విషయాన్ని మనం సరిగా జాగ్రత్తగా గుర్తుపెట్టుకోవాలి. ఈ ఉపాధి వచ్చింది కాబట్టి దానికి తగ్గట్టుగా మనం ఉంటున్నాము కాని, ఈ ఉపాధే నేను కాదు గనుక ఉపాధి పోతే ఇవన్నీ నాకు అవసరం లేదు. ఈ అవసరాలన్నీ ఈ జన్మ వరకే. ఈ జన్మ తరువాత వీటితో నాకు పనిలేదు అని వీటిని అణచివేసే బుద్ధితో, అవసరార్థం మాత్రమే వాడి అవసరం లేనపుడు దానిని తలచకుండా విడుదలై, వైరాగ్యంతో ఉండాలి. అవసరానికి తెచ్చుకోవాలే గాని, కనపడింది కాబట్టి, బాగుంది కాబట్టి తెచ్చుకుంటాననేది అవసరం లేదు. పక్కింటివాళ్ళకుంది కాబట్టి నాకూ కావాలనే అవసరం లేదు. నీకు అవసరం అయితే నువ్వు తెచ్చుకో, పొందు, అనుభవించు. అవసరాన్ని మించినది త్యాగం చెయ్యి. దానం చెయ్యి. వదిలించేసుకో. ఉంటే ఉండనీ, దానిని మరచిపో. వారసులకుంటుందో, ఎవరికుంటుందో, దొంగలు దోచుకుంటారో, ప్రభుత్వం పన్నుగా తీసుకుంటుందో, యజమాని లేనటువంటి ఆస్థిని ప్రభుత్వం తనదిగా జప్తుచేసి తీసికెళ్తుందో నీవు బతికుంటేగదా నీకు తెలిసేది. నువ్వు చచ్చిపోయిన తర్వాత నీకేం తెలుస్తుంది? నీ సంపదేమయ్యిందో? మరొక జన్మకి ఇది గుర్తుంటుందా. ఒకవేళ కోటీశ్వరుడు మరల దరిద్రుడుగా జన్మిస్తే, పాత జన్మ గుర్తుంటే, ఆ కోట్లు నావని వెళ్ళి అడిగితే నీ సంతానం నీకిస్తారా, ఒప్పుకుంటారా?

మానవుడికి ధనేషణ ఎక్కువైంది. జంతువులకి పుత్రేషణ. పులులు, సింహాలు వాటి బిడ్డలతోటి గుహలో ఆనందంగా గడుపుతాయి. పక్షులకి మైధునం ఉంటుంది. జంట పక్షులుంటాయి. పక్షులకి దారేషణ. మృగములకు పుత్రేషణ. మానవులకి ఈషణాత్రయమున్నప్పటికీ అందులో ధనేషణ ఎక్కువ. డబ్బుకోసం ఇద్దరు ముగ్గురిని పెళ్ళి చేసుకుంటాడు. కట్నంకోసం ఒకడిని చంపేస్తాడు. ఇవన్నీ అవసరమా? ఇవన్నీ లేనివే. కానీ ఈ ఉపాధి ఎప్పుడైతే వచ్చిందో ఆకలి, దప్పిక, నిద్ర, భయము, మైధునము ఈ 5 మనకి తప్పటంలేదు. శరీర పోషణార్థము దానిని రక్షణ చేయాల్సి వస్తోంది. శరీరాన్ని రక్షించుకోవాల్సి వస్తోంది. ఈ శరీరాన్ని రక్షించుకొంటున్నాను అనే దానితోనే మనముండాలి తప్ప, శరీరమే నేనని గానీ, ఈ శరీరం శాశ్వతమని గానీ, ఈ శరీరానికి అవసరమైన భోగవస్తువులు నిత్యమని గాని, నువ్వు మరణించాక కూడా వస్తాయని గాని అనుకోకూడదు. అయినా నీ వారసులెవరంటా? కిందటి జన్మలో నీ శత్రువులే ఇవాళ బిడ్డలుగా పుట్టి ఉండవచ్చుగదా! అటువంటి వాళ్ళకి ఆ జన్మలో ఇవ్వను గాక ఇవ్వనన్నావు కదా! ఈ జన్మలో ఎందుకిస్తున్నావు? అసలు ఇచ్చేదేముంది. మనం చేసుకున్న కర్మనిబట్టి ఒకానొక కాలానికి ఏది రావాలో అది ప్రాప్తిస్తుంది. మళ్ళీ ఒకానొక కాలానికి ప్రాప్తికాలం నశించగానే ఉన్నవన్నీ అప్రాప్తిగా పోతూ ఉంటాయి. ఇవి అందరి విషయంలో గమనిస్తూ కూడా సత్యాన్ని ఒప్పుకోకుండా మునిమనవల దాకా సరిపడా సంపాదించి ఏం చేద్దామనుకుంటున్నారు? నీవు అనుభవించటానికి, జీవించటానికి సరిపడా ఉంటే ఆ మిగిలింది బ్యాంకుల్లోను, లాకర్లలోను, దస్తావేజులలోను చూసి మురిసిపోయి నాది నాది అనుకోవటం తప్పు. అవన్నీ నీవెంట వస్తాయా? వారసులకు ఇచ్చినా, వాళ్ళు నీవారా? ఇంకో జన్మకి నిన్ను గుర్తిస్తారా? వాళ్ళు పూర్వజన్మ శత్రువులు కారా?

ఈ విధంగా నీ సుఖస్వరూపాన్ని నీవు మరచి అన్యవస్తువు ద్వారా సుఖముందని వస్తువునాశ్రయించి సంసారమున పడిపోతున్నావు. సంసారమంటే ఏమిటి? అవినాభావ సంబంధం. అ+వినా+భావ+సంబంధం. వినా అంటే లేకుండా ఉండలేను అని అర్థము. అవినాభావము అంటే లేకుండా ఉండలేననేటువంటి భావము. ఆ భావంతో పెట్టుకున్న సంబంధమే సంసారము. అయితే నువ్వు విడిచినా విడవకపోయినా ఒకానొక కాలంలో అందరూ విడిచిపోవటంలేదా? దూరం అవటం లేదా? స్వంత మనుషులే శత్రువులవటంలేదా? మిత్రత్వం పోయి శతృత్వం రావటం లేదా! స్వంత మనుషుల్లో అపార్థాలు వచ్చి ద్వేషము, అసూయ, క్రోధము వచ్చినప్పుడు కూడా విడిపోవడమే. దేశాంతరం పోవడం కూడా విడిపోవడమే. ఉపాధి పరంగా మరణించడమూ విడిపోవడమే. ఇవన్నీ లోకంలో జరుగుతున్నట్లు మనము చూస్తున్నాము కదా! ఏది శాశ్వతమని చెప్పి అట్టిపెట్టుకుంటారు మీరు?

ఎంత బోధ విన్నా వైరాగ్యం లేనిదే మీరు మోక్షాన్ని పొందలేరు. నేను అనే భావాన్ని వదలకుండా ఎవ్వరూ మోక్షాన్ని పొందలేరు. ఈ సంసారమంతటా అవినాభావ సంబంధంగా ఫలానా ఫలానా అయితే నేను విడచి వుండలేను. ఇదిపోతే ఎట్లా? అదిపోతే నేను బాధపడతాను, దుఃఖిస్తాను. దుఃఖించినంత మాత్రాన పోయిన వస్తువు ఎవ్వడూ తిరిగి వెనక్కివ్వడు. ఆ పోయినదానిని నువ్వు అంగీకరించాల్సిందే. అది మళ్ళీరాదు. ఆ ప్రకృతే అంత. సృష్టి అంటేనే వైవిధ్యం. ప్రకృతి అంటేనే మార్పు చెందుతూ రూపాంతరం చెందేది. ఆ మార్పులన్నీ కూడా ఒక మాయలో ఉన్న నియతి ప్రకారంగా ఒక క్రమ పద్ధతిగా జరుగుతుంది. ఎవరి ఉపాధి అయినా సరే షడ్విధ వికారాలుగా ఉంటుంది. జన్మించాక చావకుండా ఉండేవాడు ఎవరూ లేరు. పూర్తి ఆరోగ్యంతో ఉన్నవాళ్ళని కూడా మనం ఎవర్నీ చూడం. ఇవే భావాలవల్ల తెంపు లేకుండా కొన్ని లక్షల జన్మలు పరిభ్రమిస్తూ ఉంటాం. ఈ పరిభ్రమించిన దానినే భవము అన్నాము. అజ్ఞానాన్నే భవరోగము అంటాము. కనుక వీటియందు విలక్షణంగా సర్వాధారముగా సర్వసాక్షిగా, అసంగముగా, సత్తామాత్రముగా ఏదయితే ఆత్మ అనేది, ఏదయితే ప్రజ్ఞ అనేది, ఏదయితే చైతన్యము అనేది ఉన్నదో దానిని కనిపెట్టు.తీరా కనిపెడితే అదే నీవయి ఉంటావు.

"నేను, నేను" అని చైతన్యం ఉన్నవాడు అంటున్నాడా, చైతన్యం లేనివాడు అంటున్నాడా? నేననే చైతన్యంతో "నేను, నేను" అనే స్ఫురణ ఉన్నవాడే చైతన్యం. జడముగా ఉన్న రాయికి నేను అనే స్ఫురణ ఉండదు కదా! ఎముకలకి, మాంసానికి, చర్మానికి నేను అనే స్ఫురణ ఉంటుందా? ఈ మనసుకి విషయాలుంటాయి. కానీ నేననే స్ఫురణ ఉందా. నీ బుద్ధికి విషయాలు నిర్ణయించడమే కానీ నేననే స్ఫురణ ఉందా? నీ చిత్తానికి చిత్త వృత్తులుంటాయే కానీ నేననే స్ఫురణ ఉందా? నేననేది స్ఫురణ మాత్రంగా తోచింది. కేవలం ఈ ఉపాధితో ఉండుట అనే ఉనికే ఆ స్ఫురణ. నేను అనేటటువంటి భాషకానీ, అర్థము కానీ దాంట్లో లేదు. ఉండుట అనే స్ఫురణని అహంస్ఫురణ అన్నాము. ఆ అహంస్ఫురణని స్ఫురణమాత్రంగా ఉంచుకుంటే మనసునుంచి వేరైనట్లే. మనసునుంచి వేరైతే అహం స్ఫురణమాత్రంగా ఉంటుంది. ఆ అహం స్ఫురణమాత్రంగా ఏ అనుభవం నిలిచిందో అది 'సోహం' అనేటుటవంటి జ్ఞానము.

ఆత్మని వెదికితే ఆత్మ దొరకదు. ఆత్మ నీవై ఉన్నట్లుగా స్వానుభవం కలుగుతుంది. ముందు ఆధార ఆధేయ పద్ధతిలో మనం ఎక్కడున్నాము? శరీరం నేను దగ్గరున్నాము. పూర్తిగా స్థూల శరీరం నేను అని అన్నమయకోశం దగ్గరున్నాము. కనుక విచారణ చేసుకుంటూ పోవాలి. పంచకోశాలు కాదు, మూడు శరీరాలు కాదు. వీటన్నిటికి ఆధారమైన చైతన్యము. విశ్వ, తైజస, ప్రాజ్ఞులము కాదు. చేతస. చేతస అంటే చైతన్యముతో కూడి ఉన్నది. అలాగే **స్థూల సూక్ష్మ సకారణాంతర ఖేలనం** అంటే ఆ చైతన్యమే స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలతో ఒక ఆట ఆడుతోంది, ప్రజ్ఞా విలాసం. చైతన్యమే ప్రజ్ఞ. చైతన్యం యొక్క విలాసం చిద్విలాసం. ప్రజ్ఞ యొక్క విలాసము ప్రజ్ఞా విలాసము. మాయయొక్క విలాసము మాయా విలాసము. భగవంతునియొక్క విలాసము భగవద్ విలాసము. విలాసమంటే ఏమిటి? కర్తృత్వ, భోక్తృత్వాలు లేకుండా కర్మ తనపాటి తాను జరుగుతూ ఉంటే అందులో తనకు తెలియకుండా తానే ఒక పాత్రధారియై ఉండుట విలాసం. పాత్రధారి అనేటటువంటి స్ఫురణ, భావన కూడా నీకు లేకపోతే ఆ రకంగా జరిగిపోయేదంతా కూడా విలాసము. ఇది అజ్ఞానియైతే కర్తృత్వ, భోక్తృత్వాలతో కర్మ చేస్తూ కర్మ ఫలితాలతో బాధించబడుతూ ఉంటాడు. విశ్వ తైజస, ప్రాజ్ఞులు ముగ్గురూ అలాగే ఉన్నారు. స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు నేను అనేటటువంటి అభిమాని అలాగే ఉన్నాడు. చిత్ స్వరూపుడు, చైతన్యము అనేటటువంటివాడు ఎవడైతే ఉన్నాడో ఆ స్థితిలో వాడు నిష్ఠుడైతే పంచకోశాలకి 3 శరీరాలకి విలక్షమయితే వాటియొక్క వ్యాపారమునకు వ్యవహారానికి సంగత్వం లేకపోతే, అపుడు అటువంటివాడిది చిద్విలాసము, ప్రజ్ఞావిలాసము. అటువంటి ఆత్మను వెతికి తెలుసుకొని కృతకృత్యుడవు కమ్ము. ధన్యుడవు కమ్ము అని వేదము బోధిస్తోంది.

అద్వైత ప్రబోధము నిజముగా అజ్ఞానమను ఒక వస్తువు కలదని ఋజువు చేసి నిరాకరించుటకు ప్రవర్థిల్లుట లేదు. జ్ఞానము, అజ్ఞానము రెండూ ఉన్నాయండీ! బ్రహ్మ సత్యము బ్రహ్మ మొక్కటే అన్నపుడు సత్యమన్నది ఒకటిగానే ఉంటుంది. మరి అజ్ఞానమన్నది రెండోదెక్కడ ఉంది? అందువలన వేదాలు జ్ఞానమనేది ఒకటి అజ్ఞానమనేది ఒకటి రెండున్నాయని చెప్పటంలేదు. జ్ఞానమే ఉన్నది భ్రాంతివల్ల జ్ఞానము యొక్క లేమితనాన్ని అజ్ఞానము అన్నాము. వెలుగే ఉన్నది. వెలుగులేని చోట ఆవరణ దోషంతో చీకటి కనపడితే చీకటనేది రెండో వస్తువు కాదు. వెలుగు యొక్క లేమితనమే చీకటి, ప్రకాశము, అప్రకాశము ఉంది. అంతేతప్ప అప్రకాశమనేది రెండో వస్తువు కాదు. జ్ఞానము, అజ్ఞానమనేవి కూడా అంతేకాని, అజ్ఞానమనేది రెండో వస్తువు కాదు. జ్ఞానము లేకుండుటనే అజ్ఞానమందురు. ఈ లేకుండుట అనేది దేనివలన వచ్చింది? ఆవరణ దోషంతో వచ్చింది. కనుక ఆవరణ అంటే ఏమిటి? భ్రమ, భ్రాంతి.

ఇపుడు తాడనేది పామనేది రెండున్నాయంటారా? తాడు పామును పుట్టించిందా. తాడే ఉన్నది. అన్ని కాలాలలో తాడే ఉన్నది. భ్రాంతిగా చూచేటటువంటి బుద్ధికి తాడు పాముగా గోచరించింది. అది తాడు తప్పా తాడేమైనా పాముని పుట్టించిందా? బుద్ధి దోషమది. వాడు విచారించి తన ఆవరణ దోషాన్ని, బుద్ధి దోషాన్ని నివారిస్తే, నిరోధిస్తే, పామనేటువంటి భ్రాంతి పోతే అక్కడ తాడు సాక్షాత్కారమయ్యింది. తాడు ఒక్కటే ఉన్నది. తాడుకంటే అన్యము లేదు. అన్యమంతా భ్రాంతిలోనే ఉన్నట్లుగా కల్పించబడి ఉన్నాయి. నిజానికి రెండో సత్యవస్తువు లేదు. రెండో వస్తువుని ఈ సత్య వస్తువు పుట్టించలేదు. ఇది గట్టిగా ఊహించుకొని విచారించుకొని ఈ పాయింటుని నీ బుద్ధిలో నిర్ణయంగా దృఢం చేసుకోవాలి. అజ్ఞానమనేది రెండవది కాదు. మాయ అనేది రెండోది కాదు. ఈ మాయ వలన, అజ్ఞానం వలన ఎన్ని రకాలుగా నామరూపాలుగా కనపడుతున్నా, మూడు అవస్థలలో ఎన్ని రకాలుగా అనుభవాలు వస్తున్నా, శబ్ద, స్పర్శ, రూప, రస గంధ అనుభవాలు వస్తున్నా, ఇవన్నీ మిథ్య, లేనివి. విశ్వ, తైజస, ప్రాజ్ఞ, అభిమానాలుగా 3 అవస్థలయొక్క 3 అవస్థా వాసులుగా అనేక అనుభవాలు నీవు గ్రహిస్తున్నా, ఇవన్నీ కూడా మిథ్య. ఆనంద స్వరూపమైనటువంటి ఆత్మ ఈ ఉపాధిలో ఉన్న సాధకుడికి ఆనందమనేటువంటి తటస్థ లక్షణములో భ్రాంతిరహిత స్థితిలో గోచరిస్తుంది. స్వరూప స్థితికెళితే గోచరించడం కూడా ఉండదు. ఆనందమనే అనుభవం కూడా ఉండదు. అప్పుడే వాడు మాయని దాటి ఉంటాడు. తాను తానైటువంటి స్వతః సిద్ధమైన పరిస్థితి ఏర్పడుతుంది. దానినే అద్వైతం సిద్ధించింది అంటాము. అద్వయ బ్రహ్మగా, అపరోక్షముగా ఉన్నదున్నట్లుగా ఉండిపోయాడనవచ్చు.

ఉన్నవాడికి ఉన్న తెలివి లేదు. ఉన్నవాడు అపరోక్షం. తెలివంతా మాయలోనే ఉంది. తెలివంతా అవిద్యలోనే ఉంది. తెలివంతా 3 గుణాలలోనే ఉంది. తెలివంతా భ్రాంతిలోనే ఉంది. మాయావరణ దాటితే, భ్రాంతి లేకపోతే, తెలివే లేదు. జ్ఞానము లేదు, అజ్ఞానము లేదు. ముందు అజ్ఞానము లేదు, తర్వాత జ్ఞానము కూడా లేదు. జ్ఞానము కూడా అజ్ఞానమే. ఎందుకంటే తానైన స్థితిలో, జ్ఞానమే తానైన అద్వైత స్థితిలో, జ్ఞానము ప్రకటము కాదు. జ్ఞానము ప్రకటము కానప్పుడు జ్ఞానానికి సంబంధించిన ఏ అనుభవము అక్కడ ఉండదు. ఏ అనుభవమున్నా అది పరోక్షమూ, ద్వైతమే. మన సిద్ధాంతం అద్వైతం కనుక పరోక్షం కాస్త అపరోక్షమవుతుంది. అనుభవం ఆగిపోయి ఘనరూపమైన స్వరూపమవుతుంది. అనుభవం బయటికి ప్రకటం కాదు. బయటికి ప్రకటించబడాలంటే మనసు ద్వారా, బుద్ధి ద్వారా అహం ద్వారా ప్రకటించబడాలి. మనం మనసుని, బుద్ధిని, చిత్తాన్ని, అహంకారాన్ని దాటి వెళ్ళిపోయాం. దేనిద్వారా ప్రకటించబడాలో ఇప్పుడవి లేనివి. లేనివని వెళ్ళిపోయాయి. వాటి వాటి ప్రభావాన్ని దాటాము. చివరకు అవే లేకుండా పోయినాయి. అంతఃకరణ చతుష్టయ ప్రభావాన్ని దాటి వెళ్ళిపోయాము. చివరకు అంతఃకరణ చతుష్టయమే లేనిదైంది. శరీరం పోలేదు కనుక ఏవైనా దానిద్వారా ప్రకటించబడ్డా, వాటియొక్క విమర్శ, అనుభవము ఇవన్నీ చెప్పాలి. ఇప్పుడు అహం అనేది లేనప్పుడు ఇంకేముంటుందండీ? ఏమీ ఉండదు. అదే లేకపోతే ఇంకేది మిగిలి ఉంటుంది? తాను తానైనట్టి స్వరూపస్థితి ఉంటుందంతే! స్వస్వరూప సాక్షాత్కారం ఉంటుంది. అద్వైత బ్రహ్మ సాక్షాత్కారముంటుంది.

అద్వైత ప్రబోధము. ప్రబోధమంటే ఏమిటి? బోధమంటే జ్ఞానము. గురువు చెప్పగా శిష్యుడు వినేది. ప్రబోధమంటే ఆ జ్ఞానము శిష్యుడికి అనుభవపూర్వకంగా తెలిసింది. అనుభవపూర్వకంగా తెలిసింది బాగానే ఉంది. శిష్యుడు గురువు వేరుగా ఉంటే గురుకృపతో శిష్యుడికి అనుభవపూర్వకంగా తెలిసింది. ఇంతవరకు అది బోధ. అద్వైత ప్రబోధమంటే ఇంక తెల్సుకోవడము అనేది లేదు. జ్ఞానమూ లేదు. జ్ఞానమే తానైనటువంటి అద్వయ స్థితి వచ్చింది. అద్వైత ప్రబోధములో నిజముగా అజ్ఞానము అనేటటువంటి రెండవ వస్తువు ఉండదు.

ఎల్లకాలము లక్ష్యమును కానక, నాకు సుఖము లేదు. ఇది కావలయును దానిని నేను సాధింపవలయును. అనుభవింపవలయును అనునట్టి బుద్ధియే జీవత్వము. ఇక్కడ ఆధార, ఆధేయ పద్ధతిలో తీసికెళ్ళటంలేదు. నిరపేక్ష పద్ధతిలో తీసికెళ్తున్నది. ఎందుకంటే చివరకు అచలం మన నిర్ణయం, పరబయలు మన నిర్ణయం. బయలు ఏ ఆధార ఆధేయ పద్ధతిలో అందేది కాదు, పొందేది కాదు. ఎరుకనే లేకుండా చేసుకుంటే ఉన్నది బయలే కనుక అటువంటి నిరపేక్ష పద్ధతిలో పోవాలి. నిరపేక్ష పద్ధతి కోసమే బోధ పద్ధతంతా కూడా మీకు తెలిసినట్లుగా కాకుండా మరొక పద్ధతిలో నడుస్తోందిక్కడ.

నాకు సుఖము లేదు. అంటే సుఖము దేనివల్ల వస్తుందో ఆ వస్తువు నీకు సుఖము కావలసి వచ్చినప్పుడు ఆ వస్తువుమీద ఉన్నది ప్రియం. ఇది కావలయును అన్నప్పుడు మోదం. దానిని సాధించి అనుభవించాలనేది ప్రమోదం. మనకి ఈ ప్రియం

మోదం ప్రమోదమనేది ఆనందమయకోశం యొక్క గుణం. ఈ ఆనందమయ కోశంలో ఉన్న గుణం విజ్ఞానమయ కోశం దగ్గరకు వ్యాపించేసరికి విజ్ఞానమయకోశంలో కర్త ఉంటాడు. ఆ కర్త కర్తృత్వం తోటి, ఆనందమయకోశం యొక్క ప్రియం, మోదం, ప్రమోదం అనేటటువంటి ప్రభావానికి లోబడి కదులుతాడు.

ఆ ప్రభావాన్ననుసరించి నాకు దుఃఖమొద్దు. బాధవద్దు. సుఖం మాత్రమే కావాలి అనే దిశగా నిర్ణయిస్తూ కర్మాచరణ చేస్తూ పోతూ ఉంటాడు. సుఖాభిలాషతో, మళ్ళీ ఏమంటున్నాడు? మిథ్యా వస్తువునాశ్రయించి తనకంటే అన్యమైన వస్తువునాశ్రయించి పొందాలనే ప్రయత్నం చేస్తూ ఉన్నాడు. వస్తువు ఒకచోట ఉంటే మరొకచోట వెతుకుతున్నాడు. ఆనందం నీలోనే ఉంటే బయట వస్తువులలో వెతుకుతున్నాడు. **బయట వెతికేవాడే అజ్ఞాని. తనలోనే ఉందని గ్రహించి తనలోతాను అంతర్ముఖుడైనవాడే జ్ఞాని. అంతర్ముఖత్వంలో అద్వైతాన్ని సిద్ధింపచేసుకున్నవాడే విజ్ఞాని.** కనుక ఈ రకముగా బుద్ధి, జీవత్వము, జీవుడంటే ఏమిటో తెలిసిపోయిందిపుడు మనకి. ఇట్టి బుద్ధి నేను సుఖ స్వరూపుడను. అప్రకాముడను అని తెలివిగా, సహజముగా పరిణమించాలి. ఏమనుకోవాలి? సుఖము అన్యముతో ఉందని కాకుండా నేనే సుఖస్వరూపుడనని, కోరికలతో బహిర్ముఖమై బయటి ప్రపంచంలో దేవులాడటం, అన్వేషించటం మానాలి.

పూర్తిగా కాముకత్వముగా ఉన్న బహిర్ముఖము నాకవసరం లేదు. అంతర్ముఖంలో నేను నేనైటువంటి స్వరూపమే ఆనందము కనుక, అప్రకాముడుగా ఉండాలి. ఇక్కడ జ్ఞానాజ్ఞానాల గురించి చెప్పాము. కొంచెంగా అద్వైత నిర్ణయం చేశాము. కొద్దిగా పంచకోశాలలో ప్రియం మోదం చెప్పాము. దాన్నే కాముకత్వం అన్నాము. నీ సుఖ స్వరూపము అప్రకాముకత్వము. నేను అప్రకాముడను. నేను సుఖ స్వరూపుడను. నాలో నేనుంటే చాలు. నేనెక్కడికీ బయటకు వెళ్ళనవసరం లేదు అనేటటువంటిది లక్ష్యంగా పెట్టుకోవాలి. తెలివి సహజంగా ఉండాలి. క్రమక్రమంగా పరిణామం రావాలి. ఏ లక్ష్యంగా పోవాలి అంటే జీవత్వ బుద్ధిపోయి జీవత్వ బుద్ధి అజ్ఞానమని, బయటవి అసలు అక్కరలేదని, నిర్వాసనగా మారి సుఖ స్వరూపుడు నేనే అని, సుఖం నాయందే ఉందని, నేను దేన్నీ ఆశించాల్సిన పనిలేదని అప్రకాముకత్వంగా ఉండాలనే లక్ష్యం పెట్టుకోమని ఇక్కడ చెప్పారు. అలా ఉండాలని నీ బుద్ధిలో నిర్ణయమైతే ఆ బుద్దే జ్ఞానం. **బయట వెదికే బుద్ధి అజ్ఞానము, నీలోనే వెదికే బుద్ధి జ్ఞానము.**

సంస్కారాలు వాసలు ఈ ప్రపంచాన్ని ఎంతమేరకు చూపిస్తున్నాయో, ఆ ప్రపంచమునకు సంబంధించినటువంటిది వ్యవహార జ్ఞానము. నా పరంగా మాత్రమే ఉందని, ఈ రకంగా జీవుణ్ణి పరిమితం చేశాయి. **నేను పరిమితుణ్ణి అనే బుద్ధి జీవత్వం. నేను అనంతుణ్ణి అనేటటువంటి బుద్ధి బ్రహ్మత్వం.** చిదంశలు కాకపోతే బ్రహ్మమే. చిదంశలే పరిమితుణ్ణి చేసినపుడు ఆ పరిమితత్వాన్ని తన స్వరూపంగా, తాదాత్మ్యంగా ఉన్నవాడు జీవుడు. చిదంశలు ఉన్నప్పటికీ కూడా కేవల చైతన్యానుభవాన్ని పొంది, ఈ ప్రారబ్దం శరీర ప్రారబ్దమేనని నేను, ఆత్మ స్వరూపుణ్ణి, సుఖ స్వరూపుణ్ణి. నాకు త్రివిధ కర్మలు లేవు అనేటటువంటి బుద్ధి, వ్యాపకమవుతుంది. కొంత సాధనలచేత, వైరాగ్యము చేత, కొంత వస్తు నిర్ణయము చేత, ఆత్మానాత్మ వివేకముచేత వ్యాపకత్వము కలిగింది. దేనికి కలుగుతుంది. బుద్ధికి కలుగుతుంది? మనసేమో కర్మేంద్రియాలను ఉపయోగిస్తోంది. జ్ఞానేంద్రియ జ్ఞానాన్ని స్వీకరిస్తోంది. జ్ఞానేంద్రయాలు? కర్మేంద్రియాలకు ఆధారంగా వాటికి అధిపతిగా, రాజుగా, మనసు ఉంది. మనసుయొక్క ఆదేశంతోటే ఇంద్రియాలు పనిచేసేటట్టుగా ఉంది. ప్రతి మనిషికీ ప్రారబ్ధం ఈ మనసు ద్వారానే అనుభవింపబడుతుంది. కనుక ఆ మనసుని ప్రక్కన పెట్టేసి, బుద్ధిని వేరుచేయి. మనసెప్పుడూ అలాగే ఉంటుంది. మనసుని ఆపటానికెవరూ ప్రయత్నం చెయ్యరు.

మనసుని దానిపని అది చేసుకోనివ్వండి. కానీ ఆ పని నీది అని అనుకోకు. నీ బుద్ధిలో ఉన్నటువంటి వివేకంతో, జ్ఞానంతో ఈ మనోవ్యాపారం నీదికాదు అన్నట్లుగా మనసునుంచి విడిపడ్డట్టుగా, సాక్షిగా, విలక్షణంగా ఉండే ప్రయత్నం చెయ్యాలి మనం. మనసు దాని ప్రారబ్ధ కర్మానుభవానికి ఏ కాలానికి ఏది జరుగుతుందో దానినట్లా వదిలేయండి. జీవత్వ బుద్ధిని బ్రహ్మత్వ బుద్ధిగా మార్చుకోండి. జీవత్వ బుద్ధి అంటే ప్రియంమోదం ప్రమోదము. దానికి వ్యతిరేకంగా అప్రియము మొదలైనవి సాధన చేసి ద్వంద్వాతీత స్థితిని సంపాదించండి. నేను సుఖస్వరూపుడను అనుకునేది **బ్రహ్మత్వ బుద్ధి ఎప్పుడు కలుగుతుంది అంటే, అవిద్యాదోషం పోతే. జీవత్వ బుద్ధి ఎపుడు కలుగుతుంది? అవిద్యా దోషం ఉంటే.** అవిద్యా దోషంవల్ల ఒక చిదంశ తన చిత్తముగా కలిగినవాడు జీవుడు. అవిద్యాదోషమువలన సర్వవ్యాపక చైతన్యం మీద, తనయొక్క సంస్కారాలు ముద్రించబడితే ఆ ముద్రించబడినటువంటి సంస్కారాలు చైతన్యమాధారంగా చిత్తవృత్తులుగా ఏర్పడ్డాయి. సంస్కారాలు చెరిగిపోతే చైతన్యమే అనుభవానికి వస్తుంది.

చైతన్యం మీద సంస్కారాలు ముద్రలొచ్చేసరికి, చైతన్యయొక్క సత్తా ఆధారగా, సంస్కారాలు నీకు అనుభవానికి రావడమనేది చిత్తవృత్తి. అటువంటి చిత్తవృత్తి సంస్కారాలతో కూడింది గనుక, ఎవరయితే సంస్కారాలనుంచి విడుదలవుతారో, ఆ చైతన్యంమీద ఈ ముద్రలను చెరిపివేసుకుంటారో, వారు సంస్కారాలకు సంబంధించిన అనుభవాలకు బదులు, చైతన్యానికి సంబంధించిన అనుభవంలో ఉంటారు. చైతన్యమే తానై యుండటంచేత, ఆ చైతన్యము స్వానుభవమై ఉంటుంది. ఎప్పుడు అంటే **'చిత్తవృతి నిరోధః యోగః'**. చిత్తవృత్తులు ఆగిపోయినపుడు, సంస్కారాలు తుడిచివేయబడినపుడు, చిదంశ, తన ఖండత్వాన్ని, పరిమితత్వాన్ని వదులుకున్నపుడు, తాను సర్వవ్యాపక చైతన్యమనే అనుభవం తప్పకుండా వస్తుంది. ఘటభావము ఉన్నప్పుడు నేను ఘటమును అనేటటువంటి సంస్కారము రద్దయ్యేసరికి, ఘటము విధ్వటనమయ్యే సరికి, ఘటములో బంధించబడినదిగా భావించబడుతున్న ఘటాకాశము, ఘట విచ్ఛిన్నానంతరము మహాకాశముగానే ఉన్నది గాని, లోపల వెలుపల రెండుగా లేదు ఆకాశం. దానికి విడిపోవటము, కలిసిపోవడము అనేది లేదు. అట్టి స్థితిలో మహాకాశమే తాను అనేటువంటి దృష్టాంతం తోటి, ద్రాష్టాంతమందు సర్వవ్యాపక చైతన్యమే తాను అనేటువంటి స్వానుభవం కలుగుతుంది. ఈ భేదాన్ని గమనించాలి.

ఇందులో ఎన్ని పాయింట్లు చెప్పాము. జీవునియొక్క పరిమితత్వపు బుద్ధి, జీవునియొక్క సంస్కారములతో కూడినటువంటి చిత్తవృత్తి. ఆ సంస్కారములు అనుభవానికి రావటానికి అవసరమయినటువంటి, ఆధారమయినటువంటి చైతన్యము, ఆ చైతన్యమే పరమాత్మగా, సర్వ వ్యాపకముగా, శుద్ధ చైతన్యంగా ఉంటే, ఆ సంస్కారములచేత, ఆ అఖండ చైతన్యము, అంశల మాదిరిగా చిదంశలుగా మారితే, ఒక్కొక్క చిదంశ ఒక్కొక్క జీవునియొక్క చిత్తముగా మారితే, ఒక్కొక్క జీవుడు తనయొక్క సంస్కారముల వలన ఏర్పడే చిదంశ రూపము, ఖండత్వము, పరిమితత్వము పోగా, తాను ఘటము అనేటటువంటి సంస్కారమునుండి విడుదలకాగా, ఆ సంస్కారములు ఏ చైతన్యం మీదయితే ముద్రింపబడ్డాయో, ఆ చైతన్యమే తాను అనేటటువంటి స్వానుభవాన్ని, మహాకాశంవలె ఉన్న చైతన్యాన్ని స్వానుభవంగా గుర్తించి, అప్పుడు **'నేను'** సుఖ స్వరూపుడను అనగలుగుతాడు. ప్రస్తుతానికి సుఖస్వరూపుడను నేను అనేటటువంటిది మనకు లక్ష్యం. నేను ఆత్మ స్వరూపుడను అనేటటువంటిది లక్ష్యం.

అయితే ఆ లక్ష్యం సిద్ధించినతరువాత అది జ్ఞానం. ఆ లక్ష్యానికి దూరంగా ఉన్నవాడు అజ్ఞాని. జ్ఞానాజ్ఞానాలు మీరాలి. అందుకే ఒక చిదంశ రూపంలో చిత్తవృత్తి కలిగినటువంటి జీవుడు కించిజ్ఞుడు. చిదంశలన్నీ తీసివేయబడగా అఖండ చైతన్యముగా అవిభాజ్యమైన చైతన్యముగా ఉన్నవాడు బ్రహ్మ. కాని అంశల మాదిరిగా సంస్కారములతో కూడినటువంటి అనుభవము పరమాత్మకు లేనందువల్ల ఆ పరమాత్మ సర్వవ్యాపకుడు. తన చైతన్యానుభవంచేత జీవుడు తాను బ్రహ్మమే అనేటువంటి జ్ఞానం పొందటం చాలా తేలిక. జీవుడేమో తన కించిజ్ఞత్వం పోగొట్టుకొని చిదంశను పోగొట్టుకొని తనయొక్క చిదంశ, ఇతరుల యొక్క చిదంశలు, నానారకాల జీవులు అనేటువంటిది వదిలి సాక్షీభూతమయినపుడు, ఆ చిదంశ వెనుక ఉన్నటువంటి చైతన్యము తన స్వానుభవంలోకి వస్తే, తాను పరమాత్మ అనేది ఈశ్వరుడనేది ఋజువయి, అన్ని జీవులు కూడా తనయందే, తనయొక్క విభూతిగా తోస్తూ ఉన్నాయనేది అనుభవానికి వస్తుంది.

ఈ అనుభవంలో ఉన్నవాడే పరమాత్మ, సర్వజ్ఞుడు. **పరిమిత స్వభావం ఉన్నవాడు కించిజ్ఞుడు. పరిమిత స్వభావం కోల్పోయినవాడు సర్వజ్ఞుడు**. సర్వజ్ఞత్వం ఎప్పుడు వచ్చింది. అవిద్యకు లోనుకాకుండా, జీవ సంస్కారాలు, జీవత్వబుద్ధి పోతే ఈశ్వరుడయ్యాడు. ఈశ్వరుడు జీవుడెపుయ్యాడు? తాను ఈక్షిస్తుండేటువంటి ప్రకృతిని ప్రతి చిన్న భాగాన్ని అనుభవించాలి అనేటువంటి కోరిక కలిగితే ఆ ఈశ్వరీయ అనుభవానికి ఆధారభూతమైనటువంటి చైతన్యమే అనేక చిదంశలుగా మారింది. అపుడు ఆ ఈశ్వరుడే అంశలవారీగా కించిజ్ఞుడయ్యాడు. దీన్నే వేదాంతం ఏం చెపుతుందంటే, **'ఏకోహం బహుశ్యాం విప్రా బహుదా వదంతి'** అని. ఆ ఒక్కటైన ఈశ్వరుడే అనేక జీవులయ్యాడు అని. చిదంశలు లేని చైతన్యం యొక్క స్వానుభవంతో చూస్తే ఈ జీవులన్నీ కూడా తనయొక్క విభూతులే అని వారికి తెలుస్తుంది. అన్ని జీవులూ తనయొక్క స్వంత శరీరంతో సహా అన్ని ఉపాధులూ, చరాచర జగత్తంతా కూడా తనయొక్క విభూతి స్వరూపమే. తానే అనేకముగా గోచరిస్తున్నాడు అని నిర్ణయమై ఉంటాడు. ఒక్క చిదంశగా చూస్తేనేమో జీవుడికీ, జీవుడికీ బేధముంది. ప్రపంచంలో చూస్తే అవే వస్తువులలో వస్తువుకి, వస్తువుకీ బేధమున్నది. చిదంశలుగా చూస్తున్నాడు కాబట్టి జీవుడు కించిజ్ఞుడై యున్నాడు. ఇతర జీవులు తనకంటే వేరైయున్నారు. ఎందుకంటే అంశవరకే తన బుద్ధి పరిమితమైంది కనుక.

చైతన్యము తానైన వాడికేమో ఈ అంశలన్నీ తనయందు విభూతి రూపంగా ఉన్నాయి. ఈ అంశాలన్నిటికీ నేను సాక్షిని; ఈ అంశలన్నీ కూడా జడమును ఆధారంగా, నా చైతన్యమాధారంగా మనుగడ సాగిస్తున్నాయి, వ్యవహరిస్తున్నాయి. కనుక వీటన్నిటినీ ఆదరించేవాణ్ణి నేను అని, జీవుణ్ణి ఆడించడం ఈశ్వరుడికి ఒక లీలా విలాసం. సంగత్వం లేదు గనుక లీలా విలాసం. **పరిమితం ఉన్నవాడికి సంగత్వం ఉంది. పరిమితత్వం లేనివాడికి సంగత్వం లేదు. సంగత్వం ఉన్నవాడికి సంసారం ఉంది, బంధం ఉంది. సంగత్వం లేనివాడికి లీలావిలాసంగా ఉంది.** ఇదే జీవుడికి ఈశ్వరుడికీ ఉన్న భేదం. బ్రహ్మత్వం అనేసరికి ఏమయింది? ఈశ్వరుడు కూడా సృష్టి, స్థితి, లయలలో మాయకు లోబడి మాయాకార్యాలు చేస్తూ ఉన్నాడు. ఈ మిథ్యా సృష్టికి, సృష్టి, స్థితి లయలు చెయ్యడం ఈశ్వరుడికి నిజం. జగత్తు మిథ్య అయినపుడు ఈ మిథ్యా జగత్తుకు నేను సృష్టికర్తను, నేను పోషక కర్తను, నేను లయకర్తను అనేది హాస్యాస్పదం. ఇది మాయయొక్క ఆభాస. కనుక ఈశ్వరుడు మాయయొక్క ప్రభావంలో ఉన్నాడు. ఈశ్వరుడు ఆ మాయ ప్రభావం నుంచి విడుదలైతే ఆ చైతన్య స్వరూపమే తానైయుంటాడు. ఆ సుఖస్వరూపుడే తానౌతాడు.

ఆ సుఖ స్వరూపమే తానైనది బ్రహ్మ. ఇపుడు సాధకుడికి ఆ సుఖస్వరూపుడే తాను అనేటువంటి బుద్ధి ఉన్నప్పుడు మెల్లిగా అజ్ఞాన కార్యానికి సాక్షి, విలక్షణమై, తాను జ్ఞాని అవుతాడు. కనుక అటువంటి బుద్ధి ఉంటే జ్ఞానం అబ్బుతుంది. **అజ్ఞానబుద్ధి పోయి జ్ఞానబుద్ధి రావాలి. పరిమిత బుద్ధి పోయి సమష్టి సర్వవ్యాపక బుద్ధి రావాలి. సుఖదుఃఖాల బుద్ధిపోయి నేను శాశ్వత సుఖ స్వరూపుడనేటటువంటి బుద్ధి రావాలి.** సుఖ దుఃఖాల కొచ్చేసరికి తనకంటే అన్యమైన వస్తువుల ద్వారా, వస్త్వాకారం పొందుతూ ప్రియం మోదం ప్రమోదం అనేటువంటి పద్ధతిలో సుఖాన్ని పొందుతున్నాడు. పొందే ప్రయత్నం చేస్తున్నాడు. ఎంత పొందిననూ పొందేది ఎంత కాలముందో నిత్యముగా ఉందో అనిత్యముగా ఉందో, తనకి తెలుసు. పూర్వజన్మ ప్రారబ్ధాన్ని బట్టి సుఖం కోరినాకూడా దుఃఖమొస్తోంది. సుఖం అంతంతమాత్రంగా వస్తోంది. సుఖం ఒకవేళ వచ్చినా, అనిత్యంగా ఉంటోంది. మళ్ళీ దాని తదనంతరం మళ్ళీ దుఃఖం వస్తోంది. మళ్ళీ బాధ కలుగుతోంది. నిరంతరాయమయినటువంటి ఆనందము, తైలధారవలె తెంపు లేనటువంటి సుఖము తనవద్ద లేనట్లుగా, ఆ జీవుడు అజ్ఞానం చేత, భ్రాంతిపడుతున్నాడు. తైలధారలాగా, నిరంతరాయంగా, నిరతిశయముగా పెరగని, తరగని మార్పు చెందనటువంటి సుఖం, తన సుఖమే. తనే ఆ సుఖ స్వరూపము. సుఖము వేరు తాను వేరు కాదు అనేటువంటి బుద్ధి జ్ఞాన బుద్ధి.

ఇక్కడ అప్రకాముడనే మాటకొస్తే కాముకత్వము అంటే కోరికలు. సృష్టికర్త బ్రహ్మ దగ్గర కూడా కాముకత్వం ఉంది. అందుకే ఆ కాముకత్వం వలన సృష్టి యెడల ఆనందం కలిగి, పూర్వసృష్టి జ్ఞానవాసన చేత మనకు చిత్త వృత్తి ఎట్లాగో ఆ బ్రహ్మకు సంకల్పం అలాగ. మన పూర్వ వాసన కారణముగా ఉన్నవి చిత్తవృత్తి ద్వారా, మన స్వానుభవానికి ప్రారబ్ధం ఎలా తీసుకు వస్తోందో, అలాగే సృష్టికర్త బ్రహ్మకు కూడా పూర్వసృష్టి జ్ఞానం వాసనా రూపంలో ఉండి, తనకు ఆనందం కలుగగానే, ఆ పూర్వ సృష్టి జ్ఞాన వాసన సంకల్పం రూపంలో సృష్టి చేయాలనే ఇచ్ఛతో కామ సంకల్పం జరిగి, సృష్టి చేయటానికి ఉపక్రమిస్తూ తరువాత సృష్టి ఒక క్రమపద్ధతిలో ఒక నియమంగా చేస్తున్నాడు. ఇక్కడ కామ అనే శబ్దం కామక్రోధలోభ మోహాలతో ఉన్నది కాదు. శబ్ద, స్పర్శ, రూప, విషయాలపై ఆసక్తి, కోరికలు కలిగినటువంటి కామం కాదు. ఈశ్వరుడికి సృష్టి చేయాలనేటటువంటిది కూడా కామమే. ఈ కామ సంకల్పాలన్నీ కూడా ఎరుకే. మళ్ళీ ఎరుక బయలు అనేటువంటిదానికెళితే పెద కందార్థాలలో

**కం॥ పరిపరి విధములు తానై । యెరిగింపుచు, నెరుగు గాని ।**
**గురుస్వామి నర్పించెడు । నరుడె పరిపూర్ణుడగును**
**నా మాట వినరా । రేచకమూని – ధీమంతుడగురా ॥**
**కామవికారము । ఖండించి, నెమ్మది ।**
**సోమసూర్యులనంటి । సూక్ష్మపూరకమందు ॥**
**నీ మనంబున నిజము గన్గొని । నిస్తరంగ సముద్ర కతమగు ।**
**ధామమున, పరహంస గూడుము । తాల్మితో కుంభించి ప్రభగను**
**నా మాట వినరా । రేచకమూని – ధీమంతుడగురా ॥**

**పరిపరి విధముల తానై** = అంటే అన్ని చిదంశలు కూడా తానే అయిఉండి, సర్వజీవులు తనయొక్క విభూతి స్వరూపముగా, తానే అయివుఉండి ఆ తానే ఒకభాగంలో ప్రజ్ఞానం బ్రహ్మగా. ఎరిగే ఎరుకగా ఉంటూ, జీవులను, తన సంకల్పంచేత చిదంశల వారీగా, జీవులయొక్క చిత్తములుగా వేరుపరచి, **'ఏకోహం బహుశ్యాం విప్రా బహుదావదంతి'** అనే సంకల్పం రాగా, తాను ఈశ్వరుడుగా ఉంటూ కూడా తాను అనేక జీవులుగా కూడా ఉంటూ ఉంటాడు. ఈశ్వరుడుగా ఉంటూ జీవులను ఆడిస్తూ ఉన్నాడు. జీవుడుగా ఉంటూ ఈశ్వరుడిలో ఉన్నటువంటి ప్రజ్ఞానము, తెలుసుకునే తెలివి, ఎరిగే ఎరుకను ఆధారం చేసుకుని, తనయొక్క ప్రారబ్ద కర్మలను అనుభవిస్తున్నాడు.

ఒక్కడే అయినటువంటి ఈశ్వరుడు అనేకమయినటువంటి జీవులై, ఈశ్వర స్థానంలో ఉండి జీవుల్ని ఎరిగిస్తూ ఆడిస్తూ, ఎరుక రూపంలో ఉన్న జీవులు శబ్ద స్పర్శ రూప రస గంధాల్ని వారియొక్క జ్ఞానేంద్రియాలతో గ్రహిస్తూ మనసుతో ఆస్వాదిస్తూ, బుద్ధితో నిర్ణయిస్తూ చిత్తముతో ఆ వాసనలను పోగుచేసుకొని మరొక జన్మలో చిత్తవృత్తుల వలన మళ్ళీ అనుభవిస్తున్నాడు.

ఎరిగించుచూ, ఎరుగుచూ ఒకే ఎరుక సమష్టిగా ఈశ్వరుడుగా ఉండి ఎరిగిస్తోంది. అదే ఎరుక చిదంశల వారీగా, ఖండత్వాన్ని పొంది పరిమితమై, జీవులుగా ఉంటూ ఎరుగుచూ ఆ ఎరిగేది, తన పూర్వజన్మ సంస్కారము చేత, నామరూప జగత్తుని, శబ్ద, స్పర్శ, రూప, రసగంధాల పద్ధతిలో స్త్రీ పురుష, రూప పద్ధతిలో ఎరుగుచున్నాడు, అనుభవిస్తున్నాడు. ఇలా ఏర్పడగా మళ్ళీ ఏంచేసాడట! **'బలిగా గురుస్వామికి'** అర్పించాడు. **'బలి'** అంటే తనుమన ధనాలన్నీ కూడా నీదగ్గర లేకుండా పోయి, కొంచెం కూడా అట్టిపెట్టుకోకుండా, పూర్తిగా గురువుకి సమర్పించి, త్యాగముగా కాకుండా పరిత్యాగముగా అర్పించాలి. ఏ నరుడైతే **'బలిగా'** అతని దగ్గర ఏమీ మిగలకుండా, నిశ్శేషముగా అర్పిస్తాడో, ఇక ఎరిగే ఎరుక అనే ప్రజ్ఞానము ఉండదు. ఎరిగించేవాడుగా సమష్టిగా ఈశ్వరుడుగా ఉండడు, ఎరుగుతూ ఉన్నటువంటి పరిమితంగా ఉన్న జీవుడిగా ఉండడు. ఇవన్నీ పోతే ఆ నరుడు ఏమవుతాడు. **'పరిపూర్ణుడగును'** బ్రహ్మత్వం పొందుతాడు.

నా మాట వినరా! అంటే గురువు యొక్క మాట వినాలి. వినటమే! శ్రవణమే! ఇక్కడ వస్తు నిర్ణయాన్ని బుద్ధి పరిధిలో చేసుకుని ఇంగిత జ్ఞానంతో, లౌకిక జ్ఞానంతో, జీవుడు లేడు, ఈశ్వరుడు లేడు. బ్రహ్మ లేడు ఇదంతా ఎరుక స్వరూపము. ఎరుకను విడిపించాలంటే, మనన నిదిధ్యాసల ద్వారా ఎరుకను పెంచుకునే పద్ధతిలో కాకుండా కేవలం విని, రేచకమూని విముక్తుడగురా! రేచకమంటే ఏమిటి? గాలిని నిశ్వాసగా వదలటం. కాని ఇక్కడ రేచకమంటే తాను జీవుడనీ, తాను ఎరుక స్వరూపుడనీ, తాను సుఖ స్వరూపుడనీ, తాను ఈశ్వరుడననీ, తాను బ్రహ్మమనే ఎరుకలన్నీ కూడా నిశ్వాసవలె విడిచిపెట్టటము. శ్వాసను ఎట్లా విడిచిపెడతామో, అట్లా జీవ భావాన్ని, ఈశ్వర భావాన్ని (బ్రహ్మ భావాన్ని), సచ్చిదానంద అనుభవాన్ని విడిచిపెట్టాలి. ఇదీ రేచకమంటే. ఆ విడిచిపెట్టేటువంటి పద్ధతిని పూని, ధీమంతుడవగురా! ధీమంతుడంటే ఎవరు? 'ధీ' అంటే మహత్తు. ఆ మహద్బ్రహ్మవు అవ్వు. సృష్టికి ఉపక్రమించకుండా ఉండేటటువంటి స్థిరమైనటువంటి, ఆ మహత్తనేటువంటిదిగా ఉంటూ, సృష్టిలో తరువాత మహదహంకారము, తన్మాత్రలుగా దిగిపోకుండా స్థిరంగా ఉండిపో.

ఎందుకు మహదహంకారమవుతావు? మళ్ళీ బ్రహ్మ, మళ్ళీ ఎరుక, మళ్ళీ ఈశ్వరుడు, మళ్ళీ జీవుడు అవటానికా? అవన్నీ వదిలేసి, రేచకం చేసి, అంటే వదిలేసి నువ్వు మహత్ బ్రహ్మగా, మహానుభావుడుగా ఉండమంటున్నాడు. ఉండి ఏం చేయాలి? **'కామవికారముల్ ఖండించి'** నీలో మళ్ళీ సృష్టి సంకల్పం అనేటటువంటి కామరూపంలో సంకల్పంగా పుట్టకూడదు. అటువంటి సంకల్పాలను ఖండించమన్నాడు. నిరశన చేయమన్నాడు. ఎరుక నిర్ణయాన్ని లేనెరుకగా నిరశనచేసి కామసంకల్పాల వలన మళ్ళీ సృష్టి జోలికి వెళ్ళకుండా, కామ వికారాలను ఖండించాలి. కనుక కామము అనేది జీవుల దగ్గర. 'ప్రకామము' అంటే బ్రహ్మ యొక్క సృష్టి సంకల్పం చేసేటటువంటి కామము. అప్రకాముడు అంటే, ఆ మహద్బ్రహ్మ అయినటువంటివాడు ఎవరో, ఎవరయితే తిరిగి సృష్టి జోలికి వెళ్ళకుండా, సృష్టిని మళ్ళీ కామించకుండా, సృష్టికోసం ఆనందం రాకుండా, సృష్టి కొరకు సంకల్పం చెయ్యకుండా ఉంటాడో వాడు అప్రకాముడు. ఈ అప్రకామత్వమే బ్రహ్మత్వ బుద్ధి. ఈ బ్రహ్మత్వ బుద్ధే జ్ఞానము.

ఈ అప్రకాముడను అనేటువంటివాడెవరో వాడు జ్ఞాని. అటువంటి బుద్ధిగలవాడు జ్ఞాని. ఆ బుద్ధిని దాటితే అప్రకామత్వం ఏది? అంటే ఆ పరబ్రహ్మమే. జీవుడు, సాధకుడు, శిష్య స్థాయిలో, అప్రకామత్వ బుద్ధి అంటున్నాం. ఆ బుద్ధిని అధిగమించినపుడు అప్రకామత్వమే సిద్ధించినపుడు ఆ అప్రకామత్వం పేరే పరబ్రహ్మ.

లేని చిక్కులు నెత్తిపై వేసుకుని దుఃఖమే స్వరూపముగా, గిలగిలా తన్నుకుంటున్నాడు. అవన్నీ అవిద్యా కల్పితం. కనుక ఈ చిక్కులు నిజం కాదు. అందుకని ఈ చిక్కులు లేనిచిక్కులే. ఇదంతా ఎరుకేగా. ఎరుక లేనిదని నిర్ణయమేగా! ఉన్నది బయలేగా! అదేగదా మన లక్ష్యం. సంకల్పంలో అంకురార్పణలో ఏమిటి? జీవరూప ఈశ్వర రూప, బ్రహ్మరూప, వ్యక్త, అవ్యక్త, ఎరుకలన్నీ కూడా లేనివే. కేవల పరబ్రహ్మలో ఉండేటువంటి, పరబ్రహ్మానందము అవ్యక్తంగా ఉన్నా మాయాకల్పిత సృష్టిలోకి, మాయావరణలోకి ప్రవేశించినటువంటి శుద్ధ చైతన్య పరమాత్మగా ఉండి సత్‌చిత్ ఆనందమనే ఎరుకలో ఉన్నా, అవ్యక్తంగా ఉన్న సచ్చిదానంద ఘనమైనా, ఇది ఘనరూప అఖండ ఎరుకే గాని, ఆ మూలంలో ఇలా జారిక్రిందకు వస్తే అనేక ఖండ ఎరుకలుగా అవుతుంది. ముందుగా, మూడు ఖండ ఎరుకలుగా ఉన్నది. జగత్తు, జీవుడు, ఈశ్వరుడు అని మూడు గుణాల ప్రకారం మూడుగా ఉన్నది. ఆ ఈశ్వరుడు 'ఏకోహం బహుశ్యాం' అనంగానే అనేక రకాల జీవులు, జీవరూప ఎరుకలు, కోటానుకోట్లుగా ఉన్నవి. ఈశ్వరుడి మాటకొస్తే అనంతకోటి బ్రహ్మాండాలలో అనంత కోటి ఈశ్వరులున్నారు.

వీరందరిలో ఉన్నటువంటి నానారూప ఎరుకలు, అసంఖ్యాకమయినటువంటి ఎరుకలు, ఇదంతా కూడా మూలంలోకెళ్ళేసరికి అది 'అఖండ ఎరుక'. ఆ అఖండ ఎరుకే సచ్చిదానంద స్వరూపము. ఈ అఖండ ఎరుకే అవ్యక్తంలో 'ఘనరూప అఖండ ఎరుక'. కనుక అవ్యక్తంలో ఉన్న ఘనరూప ఎరుక కాలప్రభావంతో కామసంకల్పం గనుక అతనిలో కలిగితే, మళ్ళీ సృష్టిలోకి జారిపోతాడు. ఆ స్థితిలో కామసంకల్పాన్ని లేకుండా చేసుకోమంటున్నారు. అప్పుడే నీవు పరిపూర్ణుడవు అంటున్నారు. అది గనుక ఒకసారి నిర్ణయమయితే, జీవుడికుండేటువంటి శక్తులు, చిక్కులు, బాధలు ఇవన్నీ ఏమిటట? లేనెరుకయింది. కనుక జీవ భావంలో లేనెరుకలో ఉండేటువంటి చిక్కులు కూడా విచారిస్తే లేనివే.

చిక్కులు ఉన్నాయనుకొని ఆ ముడి విడదీయాలని, ఆ ముడిని విప్పాలని అనుకుంటున్నావు. అవి నీతోపాటు కలిసిపోయి ఉన్నాయి. ఇప్పుడు నీగోరుంది, చిగురుదాటి ఉన్న గోరులు కత్తిరిస్తావు. చిగురుకి అంటిఉన్న గోరుకి ఏదైనా ఇన్ఫెక్షన్ వచ్చి బాధ కలిగితే ఆ గోరునెలా కత్తిరిస్తావు? ఆ చిక్కు కూడా నీకంటే అన్యంగా లేదు. నువ్వే ఆ చిక్కు స్వరూపమయి ఉన్నావు. చిక్కుని కాల్చేస్తే నువ్వు కూడా కాలిపోవాలి. చిక్కుకి మందేస్తే ఆ మందు బాధ చిక్కుకు మాత్రమే ఉండదు, నీకు కూడా ఉంటుంది. గోరు, చిగురు, దృష్టాంతం ఎందుచేతనంటే వస్తువుని ఆశ్రయించి వస్త్వాకారం పొందినప్పుడు శరీరాన్ని ఆశ్రయించి శరీరాకారం పొందినప్పుడు శరీరమే నేను అన్నప్పుడు, శరీరం కాలిపోతున్నప్పుడు, నేనే కాలిపోతున్నాను అనే భావం రావడం సహజమేగా. కాని ఇదంతా లేనెరుక గనుక, అవిద్యా దోషంచేత నెత్తినేసుకున్నావు. విచారిస్తే లేనిది. ప్రస్తుతానికి దుఃఖమే, బాధే. కాదనటంలేదు. ఇది ఎన్నో జన్మలనుంచీ సంక్రమించి వచ్చింది. ఈ అజ్ఞానాన్ని, అవిద్యని, ఈ జన్మలోనే పోగొట్టుకోవాలి. అప్పుడు మరో జన్మలో ఇవి ఉండవు. ఆ మాటకొస్తే మరో జన్మే ఉండదు. కానీ ఈ జన్మ సంధి. పుట్టిందేమో ప్రారబ్ధంతో, పనిముట్టేమో శరీరము, తాదాత్మ్యతేమో అజ్ఞాన కారణం. కాబట్టి బాధలుండక ఏమవుతుంది? ఇన్ని బాధలున్నప్పటికీ కూడా, ఇదంతా లేనిదే. ఇవ్వాళే నువ్వు జీవన్ముక్తుడివి కావాలి. అంటే ఇదంతా లేనిదనే నిర్ణయంతో, నీ బుద్ధిని సుఖస్వరూపం అనే దానితో పెట్టుకుంటే, ప్రారబ్ధం నిన్నెంత బాధించినా, నీళ్ళు ఆవిరయిపోయినటువంటి కొబ్బరి కురిడీలాగా స్థూల శరీరాన్ని, ఈ సూక్ష్మశరీరాన్ని వేరుచేసి, సూక్ష్మ శరీరంలో ఉన్నటువంటి బుద్ధికి, సుఖ స్వరూప బుద్ధి పెడితే, ఒకనాటికి ఆ సుఖస్వరూపమే నీవై, సూక్ష్మ శరీరమనే లింగశరీరం భంగమవుతుంది. చిక్కులున్నాయనేటువంటిది మానేయండి. చిక్కులు లేనివి అని భావన చేయండి. లేని చిక్కులు మీదేసుకుని అనవసరంగా బాదపడుతున్నారు. ఇదంతా జీవత్వ బుద్ధే. దానివల్ల గిలగిలా తన్నుకుంటున్నావు. బయట పడాలనే ప్రయత్నం చేస్తున్నావు. బుద్ధిలో బయటపడ్డావు గాని, శరీర తాదాత్మ్యత ఇంకా వదలలేదు. మరి ఆ శరీర బాధ ఉంటుందిగా! మరి ఆ గురువులు, జీవన్ముక్తులు కూడా లోపల ముక్త స్వరూపము, అపరోక్షానుభూతి ఉన్నప్పటికీ శరీర ప్రారబ్ధం ఆయుష్షు కాలమున్నంతవరకూ, ఈ శరీర బాధ అనుభవిస్తూ ఉన్నది మనము చూస్తున్నాముగా! విడిపడితే ఆ బాధ ఉండదు. కేవలం బ్రహ్మ నిష్ఠలో కూర్చున్న వారికి శరీరం ఎంత బాధపెడుతున్నా నొప్పి తెలియదు.

కాని అతడు గురువుయొక్క ఆజ్ఞ చేతగాని, దైవీప్రణాళికకు లోబడి గాని, అటువంటి జీవన్ముక్తులు, శరీర ప్రారబ్ధం బలీయంగా ఉన్నప్పుడు, కాస్త బహిర్ముఖానికి వచ్చి, అసంగత్వంతోనే అంటకుండానే సాక్షీ భూతంగానే, చేసీ చేయనివాడిగానే బ్రహ్మ నిష్ఠలో ఉంటూనే, జరుగుతున్న పనులకు కర్తాభోక్తా కాకుండానే ఉన్నప్పటికీ, ఆ బాధ కాస్త తీవ్రంగానే అతన్ని బాధించేటువంటిది మనం చూస్తూనే ఉన్నాం. కొందరు జీవన్ముక్తులు, కొందరు గురువుల విషయంలో ఈ ఒక్క జన్మ ఆ మాదిరిగా తప్పదు, అనుభవించాల్సిందే. అన్ని బాధలున్నప్పటికీ కూడా శరీరమనేది అబద్ధం. లోపల అది గట్టిగా నిర్ణయంగా పెట్టుకోండి. సంసారమనేది నువ్వు పెట్టుకున్నదే. చిన్న కందార్థాలలో దీన్నే **బీర చిక్కు** అన్నారు. ఈ సంసారాన్ని బీర చిక్కు

అన్నారు. చిక్కంటే బీరకాయని విత్తనాలకోసం ఆ తీగకే వదిలివేస్తే ఎండిపోతుంది. బాగా ఎండిపోయాక దాన్ని దులిపితే, కొంత దుమ్ము, ధూళి పోయినట్లుగా పోయి, వలలాంటి చిక్కు ఉంటుంది. ఆ చిక్కునెవరయినా సరే దారంలాగా దాన్ని విడదీసి, తెంపకుండా కత్తిరించకుండా ఒక దారపు ఉండలాగా చుట్టగలరా? ఈ సంసారం అట్లాంటిది. అది నిజానికి లేని చిక్కు. దాన్ని విప్పే ప్రయత్నం చేయడం అసాధ్యం. విప్పలేము. ఒక దారమే చిక్కు పడితే, జాగ్రత్తగా విప్పితే మళ్ళీ దారమొస్తుంది. ఈ సంసారాన్ని ఎవరయినా సరే ఇప్పుడున్న స్థితిలో వేరుచేయలేరు. ఏక మొత్తంగా ఈ సంసారం లేనిది. భ్రాంతిలో ఉన్నది అని భ్రాంతి విడవడం ద్వారా సంసారం పోతుంది తప్ప, ఇక్కడే కూర్చుని దీన్నేదో చేద్దామంటే అయ్యే పనికాదు. కాని అజ్ఞానంతో ఆ దారినే ఎంచుకొని, ఆ పనే చేస్తూ జన్మలెత్తే దిశగా పోతున్నాము మనం. ఇప్పటికెన్ని లక్షల జన్మలయినాయో! కర్మ యోగంలో సుకృతాన్ని సంపాదించి, భక్తి యోగంలో ఇష్టదైవం యొక్క అనుగ్రహాన్ని సంపాదించి, చివరికి గురువును సంపాదించి, గురుకృపకు పాత్రులైనప్పుడు మాత్రమే తాను ఎత్తవలసినటువంటి అనేక జన్మలు లేకుండా చేసుకోవచ్చు.

అన్ని లక్షల జన్మలూ తప్పనిసరేం గాదు. సుకృతము, ఈశ్వరానుగ్రహము, గురుకృప, ఈ వరుస క్రమంలో ఈ మూడూ గనుక ఉంటే, దీన్ని ఆఖరు జన్మ చేసుకోవచ్చు. సామర్థ్యాన్ని బట్టి విడిచి ఉండలేను అని అవినాభావత్వం ఉంటే జీవత్వ బుద్ధి ఉంటే, లేని చిక్కులు, నిజమనుకుంటే, లేని చిక్కులు విడదీయాలనే ప్రయత్నం చేస్తే, వస్తువు ఒకచోట పెట్టుకుని వేరొకచోట వెదుకుతుంటే, ఇది ఎప్పటికీ అయ్యేది కాదు. ఇప్పటికే అనేక జన్మలు ఈ ప్రయత్నమే చేశావు. మరిన్ని జన్మలకు వస్తున్నాము మనం. ఇది పనికిమాలిన పని. ఇంక ఆ పని, ఆ ప్రయోగాలు మొత్తాన్ని ఆపేసి లేనిది లేకుండా చేసుకునే ప్రయత్నం చేయాలి. ఇక్కడ మరికొత్తగా ఏమేమి చెపుతున్నాము? ఆత్మ – అనాత్మ ఉంది. ఆత్మ అనాత్మకి ఆధారంగా ఉంది. ఆధేయమయినటువంటి అనాత్మ నువ్వు కాదు. ఆధారమయినటువంటి ఆత్మ నీవు. నువ్వు చైతన్యానివి. నువ్వు ఆత్మవు. పరమాత్మవు అని ఇలా చెప్పుకుంటూ వస్తున్నాం. దీనికి సాక్షిగా ఉండాలి. నిరపేక్ష పద్ధతిలో ఇది మిథ్య, ఇది కాదిది కాదని, నా ఇతి, నా ఇతి అనే పద్ధతిలో కొంత ప్రయాణం చేద్దాం. ఆధార ఆధేయ పద్ధతిలో ఇదంతా ఉన్నది. ఇలాగే ప్రయాణం చేయాలి. కాని ఇలా అవ్వాలి అనేటువంటి భావమే అజ్ఞానం. నువ్వట్లా అనుకోవటమే అజ్ఞానం సుమా! అని నిరశించి నీ నిజ జ్ఞానమును కలుగచేయుటకై అద్వైత శృతులు ఉద్భవించినవి. శృతుల్లో ద్వైత శృతులు, అద్వైత శృతులు అని రకరకాలున్నాయి.

వేదాలేమిటంటే మనం బ్రతకటానికి కావలసినటువంటి ప్రకృతికి సంబంధించి మానవోపాధితో జీవించటానికి, సృష్టి క్రమంలో క్రిమికీటకాదులు, పశుపక్ష్యాదులు ఈ భూగర్భంలో ఉన్న ఖనిజాలు, వాటియొక్క ఉపయోగము, ఇవన్నీ కూడా వేదాల్లో ఉన్నాయి. ఉపవేదాల్లో వైద్యము, ధనుర్వేదము ఇవన్నీ ఉన్నాయి. గాంధర్వ వేదముంది. సంగీతము అన్నీ ఉన్నాయి. అంటే ఈ వేదాల్లో చతుర్విధ ఫలపురుషార్థాలకోసం ధర్మార్థ కామమోక్షాలలో ధర్మము, అర్థము, కామము విడిగా చెప్పి ధర్మయుతంగా కామార్థాలను తీర్చుకోమని, ఆ విధంగా ప్రయత్నం చేస్తే మోక్షమార్గంలో ఉంటామని మోక్షమంటే ఏమిటో ప్రతిపాదనగా ఉంది. ఆ ప్రతిపాదన సంగతి తెలిసిన తరువాత మళ్ళీ ఆ వేదాల్లోనే అనేక మహా వాక్యలు ఉన్నాయి. 'ఋగ్వేదంలో ఉన్నది ప్రజ్ఞానం బ్రహ్మ'. యజుర్వేదంలో ఉన్నది 'అహం బ్రహ్మాస్మి'. సామవేదంలో ఉన్నది 'తత్వమసి' బ్రహ్మ. అధర్వణ వేదంలో ఉన్నది 'అయమాత్మా బ్రహ్మ'. కేవలం బ్రహ్మ గురించి బ్రహ్మజ్ఞానం గురించి, బ్రహ్మ నిర్ణయం గురించి చెప్పేవన్నీ కూడా మహా వాక్యాలే. వాటిలో ఈ నాలుగు మహా వాక్యాలు చాలు మనకు.

ఆ ప్రజ్ఞానం పొందినటువంటి జీవన్ముక్తులు, విదేహ ముక్తుల గురించి చెప్పేవి కూడా మహా వాక్యాలే. వేదాలలో మామూలు వాక్యాలు, మహా వాక్యాలు కలిసే ఉన్నాయి. కేవలం మహా వాక్యాలు గనుక తీసుకుంటే బ్రహ్మ జ్ఞానానికి పనికివస్తాయి. జ్ఞానానికి బ్రహ్మ జ్ఞానానికి సంబంధించిన మహా వాక్యాలు మనం తీసుకుంటున్నాం. ఇక్కడ వాటినే అద్వైత శృతులు అన్నారు. ఇక శృతులలో ద్వైతము, అద్వైతము లేవు. అన్ని శృతుల యొక్క గమ్యము అద్వైతాన్నందించటమే. లక్ష్యము అద్వైతానికే. అయితే భ్రాంతిలో ఉన్నవాడికి క్రమక్రమంగా భ్రాంతిని విడిపించే పద్ధతిలో అన్నీ ఉన్నాయి. అర్థకామాలు తప్పట్లేదు కనుక ధర్మయుతంగా చెయ్యమని వేదాలు చెప్తున్నాయి. వివాహ వ్యవస్థ వచ్చింది. యజ్ఞ యాగాదులు వచ్చాయి. దైవ కార్యాలు, సత్కర్మలు వచ్చాయి. అష్టాంగ యోగ పద్ధతిలో సాధనలు వచ్చాయి. సాధన చతుష్టయ సంపత్తి విషయంలో పంచదశాంగాలు ఈ పుస్తకంలో వస్తుంది. పంచదశాంగాల పద్ధతిలో కూడా సాధన వస్తుంది. ఇదంతా బ్రహ్మ నిర్ణయానికి తీసుకు వెళ్ళేవి. అందాకా ఎలాగోలా నీవు బ్రతికి ఇవన్నీ ఒక్కసారి వదిలేసి నీవు బ్రహ్మవు అవు అంటే ఎవరికీ సాధ్యం కాదు. ఈ మానవోపాధి ఏదైతో వచ్చిందో అది సృష్టి పరిణామంలో వృక్షాలు, క్రిమికీటకాలు, జలచరాలు, జంతువులు వీటన్నింటినీ మార్చుకుంటూ వచ్చింది. ఉపాధి మానవోపాధి అయినా సంస్కారాలు వీటన్నిటివీ ఉంటాయి.

రాయిలా కఠినంగా ఉంటాడు. ఒక రసాయనంలాగా ఎగిరి గంతేస్తాడు. బుస్సుమని కోపం తెచ్చుకుంటాడు. వటవృక్షం లాగా మరొక మొక్కని మొలవనివ్వకుండా అంతా తానే ఆక్రమించుకుని సంపదలు అనుభవిస్తుంటాడు. ఆ వటవృక్షం క్రింద మొలిచిన చిన్న మొక్కలు ఎలా చచ్చిపోతాయో అట్లా వటవృక్షంలాంటి నాయకుడి దగ్గర బలహీనులు బలైపోతూ ఉంటారు. చేపలాగా ఈదుతాడు. పక్షిలాగా ఎగరాలని విమానమెక్కుతాడు. నక్కబుద్ధి, కుక్క బుద్ధి ఉన్నాయి. కుట్రలు, కుతంత్రాలున్నాయి. ఆవులాగా సాధు జంతువు, కోతిలాగా గంతులేస్తాడు. మానవునికి పరిణామ క్రమంలో అనేక ఉపాధుల యొక్క మార్పిడిచేత ఈ ప్రకృతిలో అనేకరకాల అనుభవాలు పొందుతూ ఇది కాదిది కాదనుకుంటూ సుఖాన్ని అన్వేషిస్తూ ఎప్పుడైతే సుఖం బదులు దుఃఖము బాధ వచ్చిందో కొంచెం తెలివినీ, గడుసుతనాన్ని పెంచుకుని దుఃఖమూ, బాధ లేనటువంటి పద్ధతిలో సుఖాన్ని సంపాదించడం కోసం స్వార్థంతో ఇతరులను బాధిస్తూ సుఖపడటం, నిస్వార్థమయినవాడు ధర్మంగా సుఖాన్ని సంపాదించటం, సుఖం లేకపోతే దుఃఖంతో సరిపెట్టుకుంటూ ఓర్పుతో, సహనంతో త్యాగంతో ఉండటం. ఇవన్నీ మానవ జన్మలో ఏంచేస్తున్నాడంటే ఆ పరిణామ క్రమంలో ఏర్పడిన సంస్కారాలనుండి విడుదల అవుతున్నాడు. లెక్కప్రకారం వాటినుండీ విడుదల అవ్వాలంటే 84 లక్షల మానవ జన్మలు ఎత్తాలి.

ఇదేం తప్పనిసరి కాదు. ఉద్దేశ్యం అర్థమయ్యింది. మానవ జన్మకీ రాకముందు అసలు చైతన్యమే లేనటువంటి స్థితిలో అచైతన్యం వికసించి, మానవ జన్మలో దాని వికాసం పూర్ణమయింది. ఇంతకంటే వికసించాల్సిన అవసరం లేదు. ఎందుకంటే ఈ వికసించినటువంటి చైతన్యము, సృష్టి పరిణామములో వచ్చిన సంస్కారములచేత చిదంశలుగా మారి, చిత్త వృత్తులుగా, జీవులు తన ఉపాధులు మార్చుకుంటూ, పునర్జన్మలలో ఆ పాత సంస్కారాలను ఖర్చు చేసుకోవడానికి ఆ ప్రకృతి సహజమైన ఏర్పాటు చేసింది. సహజంగా ప్రకృతి ఏర్పాటు చేసిన దానిని మనం తొందరగా, శీఘ్రంగా రాబోయే జన్మలను తగ్గించుకునే విధంగా చేసుకోవడానికి, భగవద్గీత, భక్తి యోగమని, ధ్యాన యోగమని, కర్మయోగమని, పురుషోత్తమ ప్రాప్తి యోగమని రకరకాలుగా మనకు అవగాహన పెంచుతున్నది. కొందరు మహా పురుషులు ఎందుకు అవతరిస్తున్నారంటే మనలను శీఘ్రముగా లక్ష్యము వద్దకు చేర్చడానికి కారణ జన్ములుగా, గురువులుగా కూడా ఈ సమాజంలోకి వస్తున్నారు. వాళ్ళవరకు వాళ్ళు ముక్త స్థితిలో ఉండి ఇదంతా మిథ్య అని వెళ్ళిపోకుండా తిరిగి ఈ మిథ్యా ప్రపంచంలోనే కొంతమందికి జ్ఞాన ప్రాప్తికి బోధ, ప్రబోధ చేయడానికి వాళ్ళలో గురుతత్వము అంతర్యామిగా పనిచేస్తున్నది. అన్ని రకాల సాధనా మార్గాలగుండా కూడా అనేకమంది పురుషులు, మహానుభావులు వచ్చి మనల్ని నడిపిస్తున్నారు. దీనికి ఒక దైవీ ప్రణాళిక ఉన్నది. ఇందులోని అంతర్యామియే గురుతత్వము.

ఏది ఎవరికి సరళంగా, పూర్వజన్మ ఆచరణ వలన తేలిగ్గా ఉంటుందో, దాన్ని అనుసరిస్తూ, ఆఖరికి తత్త్వ విచారణ చేసి ఆత్మ స్వరూపం అవ్వవలసిన ఆవశ్యకత ప్రతివారికీ ఉంది. ఇన్ని రకాల సాధనలు చేసియున్నాము. **'నదీనాం సాగరోగతి'** ఎన్ని సాధనల మార్గాలు అవలంబించినా చివరికి నదులన్నీ సముద్రంలో చేరి వాటియొక్క అస్తిత్వాన్ని కోల్పోయి సముద్రం యొక్క తత్వాన్ని పొందినట్లుగానే, అందరూ కూడా ఆ పరబ్రహ్మ తత్వాన్నే పొందుతారు. బైబిలులో కూడా దాన్నే లక్ష్యము, గురి అన్నారు. **అందరూ ఆ గురియొద్దకే పరుగెత్తుతున్నారు** అన్నాడు. ఒకరు ముందు, ఒకరు వెనుక. మనకు సహాయం చేయడానికి ఆ మహానుభావులు, మహాత్ములు, అప్పటికప్పుడు వస్తున్నారు. కర్మయోగానికి జైమినీ సూత్రాలున్నాయి. బ్రహ్మ జ్ఞానానికి, జ్ఞానయోగానికి బ్రహ్మ సూత్రాలున్నాయి. యోగాభ్యాసానికి పతంజలి యోగసూత్రాలున్నాయి. న్యాయము అంటే తర్కము. తర్కము వల్ల విచారణ, విచారణ వలన వస్తు నిర్ణయం చేయడానికి గౌతమ సూత్రాలున్నాయి. వైశేషికము మొదలగు ఆరు ఉపాంగాలున్నాయి. కర్మ పద్ధతి, జ్ఞాన పద్ధతి, న్యాయ పద్ధతి, వైశేషిక పద్ధతి, యోగ పద్ధతి, తర్క పద్ధతి. పంచీకరణ, పంచభూతాలు ఇవి ఎట్లా ఏర్పడిందీ, ఇవన్నీ కూడా సాంఖ్యము. దీనికి కపిల సూత్రాలు ఆధారము. బాదరాయణుడేమో బ్రహ్మ సూత్రాలు జెమినీ ఏమో కర్మసూత్రాలు, న్యాయానికేమో గౌతమ సూత్రాలు, సాంఖ్యానికి కపిల సూత్రాలు, పతంజలి యోగ సూత్రాలు. పూర్వమీమాంసేమో కర్మ భాగము-జైమిని, ఉత్తర మీమాంస జ్ఞానభాగము బాదరాయణుడు. ఇవన్నీ కూడా ఒక క్రమ పద్ధతిలో, ముక్తి మార్గంలో, సాధనా మార్గంలో ఉపయోగించుకుంటూ ఇప్పుడు చెప్పినదాంట్లో యోగస్థ స్థితిని సంపాదించాలి. యోగస్థితిని సంపాదించడం ద్వారా సాధకుడు ముక్తుడౌతాడు. కనుక అద్వైత వాక్యాలంటే చిట్టచివరికి వచ్చిందన్నమాట. వేదములయొక్క అంతములో ఉన్నది వేదాంతము. ఈ వేదాంత వాక్యాలు, మహా వాక్యలు బ్రహ్మ నిర్ణయంగా ఉన్నాయి. బ్రహ్మ నిర్ణయ వాక్యాలలో మరలా సగుణ వాక్యాలు, నిర్గుణ వాక్యాలు ఉన్నాయి. సృష్టియొక్క, సాధకుని యొక్క అహంకారము వరకు కలిపి తీసుకుంటే సాపేక్ష నిర్ణయంగా చెప్పేవన్నీ సగుణ వాక్యాలు.

ప్రకృతిని వదిలివేసి కేవలము బ్రహ్మ విషయమే ఘంటాపథంగా చెప్పేవన్నీ కూడా నిర్గుణ వాక్యాలు. ఉదా : ఇది కాదు, ఇది కాదు, ఇది కాదు. నేతి నేతి నేతి. ఇది నిర్గుణ వాక్యం. ఇక్కడ ప్రకృతి గురించి కాని, బ్రహ్మ గురించి గాని, ఏమీ చెప్పలేదు. నేతి వాక్యము ద్వారా, అన్నీపోతే ఏది ఉన్నదో అది బ్రహ్మము. ఇది బ్రహ్మ నిర్ణయం. జ్ఞాన దృష్టితో చూస్తే ఈ కనపడే ప్రపంచమంతా బ్రహ్మమే. అజ్ఞాన దృష్టితో చూస్తే బంధము. కనుక **'సర్వం ఖల్విదం బ్రహ్మ'** ఇది నిర్గుణ వాక్యము. **'అహంబ్రహ్మ'** అహమనే ప్రకృతి, బ్రహ్మ రెండూ సమానం చేసి చెప్తున్నాడు. ఇది సగుణ వాక్యం. నీవు అదై యున్నావు. **'తత్వమసి'** బ్రహ్మ. నీవు అంటే ప్రకృతిలో ఉన్న ప్రాకృతమైనటువంటి అంతఃకరణ ప్రతిబింబమైనటువంటి అహంకారమే బ్రహ్మ అంటున్నాడు. అంటే నేను బ్రహ్మమయ్యాను. దుర్గుణములతో, సంస్కారములతో, వాసనలతో ఉన్నవాడు బ్రహ్మవుతాడా? వ్యాచ్యార్థ లక్ష్యార్థాలతో వ్యాచ్యార్థాన్ని విడిచి లక్ష్యార్థంలో చూస్తే బ్రహ్మవుతాడు. కనుక ఒక లింక్ పెట్టి వాచ్యార్థాన్ని విడిచి, లక్ష్యార్థాన్ని అందించడానికి ఒక సూత్రాన్ని అందిస్తున్నాయి ఈ మహా వాక్యాలు. ఇవి సగుణ వాక్యాలు. **'ఏకమేవా అద్వయం బ్రహ్మ'**. ఇది నిర్గుణ వాక్యం. బ్రహ్మమే ఉంది. బ్రహ్మము తప్ప అన్యము లేదు. **'నేహ నానా అస్థికించనః'** ఇది కూడా నిర్గుణ వాక్యమే. ఈ విధముగా మహా వాక్యాన్ని పెట్టుకోవాలి. మహా వాక్యాలతో సగుణ, నిర్గుణ రెండు భేదాలున్నప్పటికీ ఇవన్నీ అద్వైత నిర్ణయ వాక్యాలు. అందుకని అద్వైత శృతులు ఉద్భవించినవి. విచారణలో ఈ వాక్యాలలో అద్వైత వాక్యాలను వేరు చేసుకుని బ్రహ్మ జ్ఞానం కావలసిన వారికి పరమాత్మ జ్ఞానం దాటినవాళ్ళకి కేవల మోక్షేచ్ఛ ఉన్నవారు వీటిని తీసుకోవాలి. సాధన మొదలుపెట్టినవారికి ఒకేసారి పిహెచ్‌డికి చెందినటువంటి మహావాక్యాలు చెప్పకూడదు కదా! అందుకని క్రమపద్ధతిలో బోధ చేయాలంటే మళ్ళీ కర్మ పద్ధతితో మొదలుపెడతాము. భగవద్గీత కర్మ యోగముతో మొదలుపెట్టింది. తరువాత భక్తి యోగము. తరువాత జ్ఞాన యోగము. తరువాత అక్షర పరబ్రహ్మ నిర్ణయము. తరువాత అచల పరిపూర్ణముగా పురుషోత్తమ ప్రాప్తి యోగాన్ని నిర్ణయంగా చెప్పింది. ఈ వరుస తప్పదు గదా!

చిత్ జడ గ్రంధి, ఆత్మా అనాత్మలయందు అంతఃకరణ ప్రతిబింబముగా ఆభాసగా నేను తోచింది. అవి కలవకపోతే, **'నేను'** లేదు. కలిస్తే **'నేను'** ఉంది. చూడండి. రెండూ కలిపితే నేనుంది. రెండు విడతీస్తే నేను లేదు. అందుకనే కందార్థమొకటి ఉంది. **ఈ మేనెరుకలు రెండెన్నడు కలియవో నాడు సున్నసుమ్మీ. ఈ రెండెన్నడు కలియవో నాడు సున్న సుమ్మీ.** చిత్ జడములు రెండు. ఆత్మాఅనాత్మలు రెండు, శరీరము, శరీరములో ఉండే ఎరుక ఎప్పుడు కలవవో, శరీరములో ఉండే ఎరుక చిత్, చైతన్యము. శరీరము జడము. ఎరుకేమో చైతన్యము, చిత్. శరీరము జడము. ఈ చిత్ జడములు, ఈ చిత్ అనే ఎరుక, శరీరము – ఇవి మేనెరుకలు. ఈ మేనెరుకలు కలిస్తే ఏమయింది? చిత్ ఆభాసుడు తయారయ్యాడు. వాడేగా నేను అంటే. నేను పోతే సర్వము పోయినట్లే. నేనెప్పుడు పోతాడు? పోయినా మరలా అవి కలిస్తే వస్తాడు. జరాసంధుణ్ణి వేరుచేసినా మరలా కలిసినట్లుగా జరాసంధుని యొక్క రెండు భాగాలు చిత్తు, జడము రెండూ కలిసిపోతే నేను వస్తుంది. వేరుచేసి విసిరేస్తే మళ్ళీ రెండు కలిపి నేను వస్తాడు. జరాసంధుడు మళ్ళీ వస్తూనే ఉంటాడు. వాటిని కలవకుండా చూడటమంటే ఉపాయం చూడాలి. రెండిటికీ అసలు సంబంధమే లేదని నిరశన చేసి, లేని జడమును లేనిదిగా చూసి **'కర్పూర దీపకళిక సంయోగము యథాతథా'** అనే సూత్రంతో కర్పూరము జడము. దీపమనే చైతన్యముతో కర్పూరము హరించిపోతోంది. కానీ కర్పూరంతోపాటు దీపం కూడా ఉండటం లేదుగా! అలాగే అజ్ఞానం నుంచి విడిపడటానికి జ్ఞానం అవసరమయింది గాని, అజ్ఞానము తొలగిపోయాక జ్ఞానము కూడా లేదు. కర్పూరం హరించిన తరువాత దీపం ఎలా ఉండదో, అజ్ఞానం నశించాక జ్ఞానం కూడా ఉండదు.

ఆ పద్ధతిలో చిత్తుని, జడముని రెండిటిని, అజ్ఞానాన్ని, జ్ఞానాన్ని రెండిటినీ నిరశించాలి. ఈ రెండిటిలో ఏ ఒక్కటి అట్టిపెట్టుకున్నా జ్ఞానాన్ని అట్టిపెట్టుకుంటే జ్ఞానము తన సంకల్పంచేత జడమును సృష్టించుకుని జడమునందు తాను ప్రవేశించి ఆ జడ చేతనాల సంధిలో చిదాబాసగా ఉన్న **'నేను'** కనుక తోస్తే ఆ తోచినవాడు జడమే నేనంటుంది. జడమైన అనాత్మ తదాత్మ్యతతో, అనాత్మ భావనతో ఉంటుంది. అసత్య నేనుగా ఉంటుంది. యదార్థ నేను, సత్య నేను అనేటువంటిది సాధనకు మజిలీకే గాని నిజానికి జ్ఞానము, అజ్ఞానము రెండూ లేవు. ఉంది అనుకున్నది అజ్ఞానము. దాన్ని పోగొట్టుకొనటమే జ్ఞానము. ఇందులో అజ్ఞానం పోగొట్టుకోవటము ముఖ్యము గాని జ్ఞానము సముపార్జించటము ముఖ్యము కాదు. ఇంతవరకూ జ్ఞానమంటే అజ్ఞానము కానిది అని చెబుతున్నాము కనుక అజ్ఞానం, అజ్ఞాన కార్యాన్ని, అజ్ఞాన వస్తు సముదాయాన్ని, వాటి తాదాత్మ్యత నుండీ విడివడటానికి ఈ జ్ఞానమే యుక్తిగా ఒక ఉపాయముగా, ఒక మజిలీని దాటించేంత వరకూ ఉపయోగపడుతుంది. ఆ తరువాత ఇదవసరం లేదు. చైతన్యమనేటువంటి దీప ప్రకాశాన్ని ఎలా చెబుతారంటే చీకట్లో ఉన్న వస్తువులు తెలియాలంటే చీకట్లో తెలియదు కాబట్టి ఒక దీపాన్ని వెలిగించి ఆ దీప ప్రకాశంలో కావలసిన వస్తువుని పట్టుకున్న తరువాత వస్తువు చేతికి

వచ్చిన తరువాత దీపంతో పనిలేదని దీపాన్ని వదిలేస్తాము. అలాగే అజ్ఞానము పోయేవరకూ జ్ఞానమనే దీపాన్ని వాడుకుంటే అజ్ఞానములో నీవు పరబ్రహ్మవి అనేటువంటి వస్తు నిశ్చయమయింది. అజ్ఞానమనే చీకటి పోతే ఆ వస్తువు నీ స్వంతమయితే దీపంతో పని లేనట్లుగా జ్ఞానాన్ని విడవాలి.

ఈ జగత్తు ఒకటి కలదని, ఇందుగల భోగ్య జాతములలో నేనొకడని, నేను జనన మరణాలు సుఖదుఃఖాలు కలవాడనని, అనుకొనుటే అజ్ఞానము. అసలు ఈ ప్రపంచం ఉందా? **యద్భావం తద్భావతి**గా ఈ ప్రపంచం ఉన్నదనేటువంటి వాసన ఈ ప్రపంచములో తాను భోగిస్తున్నానే వాసన, భోగానికి ఉపయోగపడే పనిముట్టులాంటి దేహాదులు, ఉపాధులు ఇవన్నీకూడా నిజమనుకునేటటువంటి భావన, ఇవే వాసనలు. భ్రాంతిచేత ఏది నిజమనుకున్నదో అది వాసనైతే ఆ వాసన ప్రకారమే పునర్జన్మలు, కర్మానుభవాలు, ప్రారబ్ధాలు వచ్చిపోతున్నాయి. కనుక ఇదే అజ్ఞానం కొనసాగిస్తే జనన మరణ చక్రంలో తిరుగుతాము. ఈ అజ్ఞానం తొలగితే, అసలు సంగతి తెలిస్తే, ఒడ్డున పడితే, అసలు ఇవన్నీ భ్రాంతి అని తేలిపోతాయి. అప్పుడు బంధము లేదు, మోక్షము లేదు. బంధమనేదే భ్రాంతి అయినప్పుడు, భ్రాంతి రహితమయితే బంధమనేదే లేదు. అందువలన బంధ మోక్షాలు లేవు. అజ్ఞానమనేది నిజమయితే మోక్షము కూడా నిజమే. అజ్ఞానమంటే అబద్ధం కనుక అబద్ధంలో ఉన్నంతవరకూ బంధ మోక్షాలున్నాయి గాని, సత్యాన్ని తెలుసుకున్న తరువాత బంధమెక్కడుంది? మోక్షమెక్కడుంది? **'కబంధః క మోక్షః'** ఈశావాశ్యోపనిషత్తు.

కనుక ఈ జగద్వాసన ఉండబట్టే ఇన్ని జన్మలెత్తుతున్నాము. జగత్తనేది అసలు ఉన్నదా? ఒకసారి జగద్వాసన కలిగితే జగత్తు తోస్తోంది. ఆ వాసనలో నుండే జగత్తు తోస్తోంది. ఈ అజ్ఞానము కొనసాగుతూ ఉంటే ప్రతి జన్మలో ఆ ఉపాధి ఈ జగత్తు రెండూ తోస్తూనే ఉన్నాయి. ఒకసారి మిథ్య అని తేలితే, జగత్తు తోచవలసిన పనిలేదు. ఉపాధి రావలసిన పనిలేదు. అదే ముక్తి, జన్మరాహిత్యము. ఈ తర్కము చేతనే **యద్భావం తద్భవతి** అనటం జరిగింది. అభావ స్థితిలో పూర్వ భావములయొక్క స్మృతి లేకపోతే, వాసన లేకపోతే, కారణము, మహాకారణము లేకపోతే, నీవెప్పుడూ శాశ్వత బ్రహ్మమే. సుఖస్వరూపుడవే. వాటివల్లే ఇవన్నీ వస్తున్నాయి. కల్పితమయిన వాటిని నిజమనుకుని నమ్మడము వలన వస్తున్నాయి. భ్రాంతి కొనసాగుతుండటము వలన మళ్ళీ మళ్ళీ వస్తున్నాయి. అవిద్యా దోషము ఉండటము వలన వస్తున్నాయి. మాయకు లోబడటం వలన వస్తున్నాయి. బ్రహ్మ సంకల్పం చేయడము ద్వారా వస్తున్నాయి. బ్రహ్మకు సంకల్పం లేకపోతే రానేరావు. మాయను అధిగమిస్తే రానేరావు. ఇది మాయగదా. ఇది లేనిదిగదా! అనుకుంటే లేనేలేదు. ఎరగబడేవన్నీ లేనెరుక గనుక లేనేలేవు. ఇదంతా త్రిగుణాత్మకం కదా అంటే లేనేలేవు. అవిద్య వలన తమోగుణ ఆవరణ, రజోగుణ విక్షేపము వలన లేనివే ఉన్నట్లున్నాయని ఒకసారి తెలిస్తే, ఇది లేనిదే అనేటువంటి మిథ్యాభావము వస్తే, లేనేలేదు. అన్నీ లేకపోతే ఏదిమాత్రం ఉన్నదో అదే ఎల్లకాలము ఉన్నది. అది ఎరుక కాదు. అది మాయ కాదు. అది సద్వస్తువు. ఆ సద్వస్తువువే తానైన దాంట్లో రెండవది లేదు. సద్వస్తువును నిర్ణయించేటటువంటి బుద్ధి లేదు, అహంకారము లేదు, మనసు లేదు. దానిని గుర్తించి వర్తించేటటువంటి చిత్తవృత్తి లేదు. మరి ఏమున్నది? అద్వయం సిద్ధించేసరికి అది అవ్యక్తంగా, అద్వయంగా స్వస్వరూపముగా, స్వస్వరూప సాక్షాత్కారముగా రెండవది లేక అపరోక్షమయి ఉన్నది. ఇన్ని పదాలతో దానిని నిర్ణయించినప్పటికీ అది స్వానుభవంలో ఎవరికి వారికే తెలియబడుతుంది. తెలియబడుతుంది గాని తెలియబడినా వ్యక్తం చేయలేడు ఎందుకంటే అది అవ్యక్తము గనుక.

ఊహాతీతము, భావనాతీతము, మనోగోచరముకాదు. వాక్కుకు వర్ణించడానికి వీలుకాదు. అవాంగ్మానసగోచరము, అనిర్వచనీయము. ఇన్ని చెప్పుతున్నా దానికి జగత్తు అనేది ఈశ్వరుడికుందా అంటే పుట్టించుకున్నవాడికి ఉంది. అందుకే కందార్థము **ఎరుగుచు, ఎరిగించుచు** అంటున్నాడు. **ఎరిగేవాడేమో జీవుడు, ఎరిగించేవాడేమో ఈశ్వరుడు. ఇద్దరు కూడా ఈ జగత్తుని కల్పించుకుంటున్నారు యద్భావంతద్భవతిగా.** అట్టి సృష్టిస్థితి లయలకు లోబడినటువంటి త్రిమూర్తులు పరమాత్మ స్వరూపం కాదు. అదే త్రిమూర్తులు వారియొక్క తురీయంలో శుద్ధ చైతన్యానుభవం వస్తే అప్పుడు వారు పరమాత్మ స్వరూపులు. అది సమష్టిలో పరమాత్మ, వ్యష్టిలో ప్రత్యగాత్మ. ప్రత్యగాత్మ పరమాత్మ ఘటాకాశము పటాకాశమువలె ఒక్కటే. అపరోక్షానుభూతిలో అది ఒకటే అయి ఉన్నది. ఘటపట భావనలు లేకపోతే ఉన్నదంతా అనంతమే. ఘటభావన వలననే వ్యష్టి భావన వచ్చింది. బేధ భావన వచ్చింది. లోపల వెలుపల అనేది వచ్చింది. లోపల జీవుడని, బయట పరమాత్మ అని భావన వచ్చింది. ఘటం మిథ్య అని లేక ఘటం పగులకొడితే ఖండత్వమే లేదు. మహాకాశమువలె అఖండత్వమే ఉన్నది. అది అవిభాజ్యము. జీవుడు లేడు, ఈశ్వరుడు లేడు. అంతా అద్వైతమే. అద్వైతంలో ఖండత్వం లేకపోతే ఏమీ లేదు. తాత్కాలికంగా అంతఃకరణ వృత్తులు లేకపోయినా, వాసనా రూపంలో, కారణ రూపంలో ఉండి కాలప్రభావాన అనుభవరూపం తోస్తే మరల సకలము వస్తాయి.

అందుకని మనం ఎన్ని వదులుకోవాలి? కారణాన్ని, మహాకారణాన్ని, జగత్తనేది ఒకటున్నదనే భావనను వదిలేస్తే చాలు. నువ్వు జీవుడుగా వదలనవసరం లేదు. ఈశ్వరుడిగాను వదలనవసరము లేదు. జగత్తు లేదని తెలుసుకుంటే చాలు. జగత్తు లేకపోతే నీకు వ్యాపారమేది? ఇంద్రియాలకు పనేది? ఇంద్రియానికి భోగమేది? జగత్తు యొక్క పంచీకరణతోనే గోళకాలు ద్వారానే ఇవన్నీ వచ్చినాయి యద్భావం తద్భవతిగా. వాసనలుంటేనేగా ఇవన్నీ. అసలు వాటి మూలం లేకపోతే, వాటి వార్తే లేకపోతే, ఉనికే లేకపోతే, అది ఒకప్పుడు ఉంది అనేది కూడా జ్ఞాపకంగా లేకపోతే, అసలు మొదలే లేకపోతే, స్మృతి కూడా లేకపోతే, వాసనలో కూడా లేకపోతే, కారణంగా కూడా లేకపోతే, ఆ జగత్తు యొక్క భావనే లేకపోతే, ఇదంతా ఎక్కడుంది? ఆ జగత్తును సృష్టించేటటువంటి ఈశ్వరుడెక్కడున్నాడు? జగత్తును భోగించేటువంటి జీవుడెక్కడున్నాడు? ఉపాధులు సృష్టించే ఈశ్వరుడెక్కడున్నాడు? ఈశ్వరుడు సృష్టి స్థితి లయలు చేస్తే జీవుడు కీలుబొమ్మలా అనుభవిస్తేనే కదా ఈశ్వరునియొక్క ఆధిపత్యము.

జీవులు లేనటువంటి ఈశ్వరుడేమి చేస్తాడు? ఆడించేవాడు లేడు, ఆడేవాడు లేడు. దీనంతటికీ కారణం ఒక్క జగద్వాసనయే. అందుకే ఈ జగత్తు లేకుంటే సరి. ముందే జగద్భావన లేకుండా చేసుకుంటే జీవుడు లేడు, ఈశ్వరుడు లేడు. వారిద్దరికీ పనిలేదు, భోగము లేదు. అవసరం లేదు. ఆ స్థితిలో వారే ఈ ఉత్త బట్టబయలు ఏమీ లేదు. ఒక్క జగత్తు లేకపోతే జీవరూప ఎరుక లేదు. ఎరిగే ఎరుక లేదు. బ్రహ్మరూప ఎరుక లేదు. సంకల్పము లేదు. సంకల్పించేది దేనికి? మళ్ళీ జగత్తు కోసమేగా! జగత్తు ఎందుకు? మళ్ళీ జీవుల కోసమే! జీవులెందుకు? ఆ ఈశ్వరునిచేత ఆడించబడడం కోసమే! జగత్తు లేకపోతే ఆట లేదు, విలాసము లేదు, సంకల్పము లేదు. అంతా నిర్వికల్పమే. అంతా అవ్యక్తమే. అంతా నిర్గుణమే. అంతా త్రిగుణ రహితమే. అదే పరబ్రహ్మ, అదే బయలు. ఒక్క జగత్తు గనుక ఉన్నది అంటే ఇందులోగల భోగ్య జాతములలో నేనొకడనని, అనేక జీవులలో నేనొకడనని నాకు జనన మరణాదులు ఉన్నాయని, సుఖదుఃఖాలు ఉన్నాయని, వాటిననుగ్రహించే ఈశ్వరుడు ఒకడున్నాడని, వాడిని ప్రార్థించి, వాడిని ఉపాశిస్తే నాకేదో సుఖం వస్తుందని, నా కోరికలు తీరుతాయని, **ఎట్లు తలచుకున్నా కూడా అట్లే అగుచుండును. 'యద్భావం తద్భవతి'.** కనుక నీ భావము, అజ్ఞానంలో అవిద్యా దోషంతో ఉంటే అదే అవుతోంది. తథాస్తు దేవతలని ఉన్నారు. నీకే భావముందో అదే అగును గాక. తథాస్తు అంటూ ఉంటారు. అందుకని అది అవుతుంది. అనుకోవడం మానివెయ్యి.

ఒకడు ఒక అడవిలో ప్రయాణిస్తూ అలసిపోయి, ఒక చెట్టు కనపడితే అక్కడ విశ్రమించాడు. మొదట సుఖంగా అనిపించినా కాసేపటికి నేల గుచ్చుకొంటోంది. ఇక్కడ మెత్తని పరుపుంటే బాగుండు అనుకున్నాడు. అప్పటికప్పుడే మెత్తటి పరుపు ఏర్పడి సుఖమనిపించింది. ఆకలయింది. ఏదయినా ఆహారము దొరికితే బాగుండు అనుకున్నాడు. అనుకోగానే తినుబండారాలు ప్రత్యక్షమయ్యాయి. హాయిగా భోంచేశాడు. కాసేపు విశ్రాంతి తీసుకున్నాడు. ఏమిటి? అనుకోగానే జరుగుతున్నాయి అనుకున్నాడు. అతనికేమీ తెలియలేదు. కాని అతడు పడుకున్నది కల్పవృక్షం క్రింద. కాబట్టి ఏమి కోరితే అది వచ్చేస్తోంది. అది తనకు తెలియదుగా! ఇంతకుముందు జరిగినవన్నీ **'యద్భావం తద్భవతి'.** తరువాత అర్థరాత్రి మెలకువ వచ్చినప్పుడు అరణ్యంలో చీకట్లో చెట్టుక్రింద నిర్మానుష్యంగా ఉన్న స్థితిలో ఏ క్రూర జంతువో వస్తే తనను తినేస్తుందేమో అనే భావన కలిగింది. అలాగే లేని పులి కల్పించబడి తినేసింది. ఇదీ అజ్ఞానమంటే. ఇది యద్భావంతద్భవతి కనుక అభావ స్థితిలో బయలున్నది. యద్భావం తద్భతి స్థితిలో నేఈశ్వరుడున్నాడు. యద్భావం తద్భవతి స్థితిలోనే జీవుడున్నాడు. యద్భావం తద్భవతి స్థితిలోనే నిర్వికల్ప బ్రహ్మమందు పునః పునః సృష్టి వస్తోంది. ఇది ఇంతే!

**బీజస్యాంతః ఇవాంకురోజగదిదం ప్రాజ్ నిర్వికల్పం పునః** ప్రాజ్ఞ్ నిర్వికల్పం మళ్ళీ మళ్ళీ అనేకసార్లు ఎందుకొస్తోంది? ఆ సృష్టికి సంబంధించిన బీజము మాయాశక్తి చేత అంకురిస్తోంది. మాయాశక్తి చేత అంటే పరాశక్తి ప్రేరణతో వస్తోంది. బ్రహ్మకు సృష్టి సంకల్పం ఎందుకొచ్చింది? పరాశక్తి ప్రేరణతో బ్రహ్మకు సృష్టి చేయాలని సంకల్పం వచ్చింది. పరాశక్తి ప్రేరణ ఉన్నంత మాత్రాన బ్రహ్మకు సంకల్పం వస్తుందా? నీకు వంట రాకపోతే వంట చేయాలనే సంకల్పం వస్తుందా! వంట చేసిన జ్ఞానము వాసనా రూపంలో ఉంటే వంట చేయాలనే సంకల్పం కలుగుతుంది. వంట రానివారికి వంట చేయాలనే సంకల్పం ఎలా వస్తుంది? అలాగే పూర్వ సృష్టి స్థితి లయ జ్ఞానం ఏదైతే వాసనా రూపంలో ఆ బ్రహ్మలో ఉన్నదో, దానిని జ్ఞాన వాసన అంటారు, ఈ జ్ఞానవాసన ఉన్నటువంటి బ్రహ్మకు పరాశక్తియొక్క ప్రేరణతో సృష్టించాలనే సంకల్పము వచ్చింది. జీవుడిలో ఎలా అయితే చిత్తవృత్తి ఉంటుందో, బ్రహ్మలో ఆ మాదిరిగా సంకల్పం వచ్చింది. మనకు చిత్తవృత్తి ఎలాగో బ్రహ్మకు సంకల్పం అలాగ. మనకు విషయ వాసనలే చిత్తవృత్తులుగా మనసుకు అందించబడితే, బ్రహ్మకు పూర్వ సృష్టి వాసనా జ్ఞానమే పరాశక్తి

యొక్క ప్రేరణచేత సంకల్పం కలుగుతోంది. మనకు కూడా పరాశక్తి యొక్క ప్రేరణతో వాసనలు, చిత్త వృత్తులవుతున్నాయి. సృష్టి, స్థితి లయ జ్ఞాన వాసన వలన నిర్వికల్పంలో ఉన్నటువంటి బ్రహ్మయందు పరాశక్తి ప్రేరణతో, బ్రహ్మకు మళ్ళీ సంకల్పం పుడుతోంది. సంకల్పం కలిగేంతవరకు నిర్వికల్పమే. సంకల్పం వచ్చేసరికి వాడు సంకల్ప బ్రహ్మమయ్యాడు. వాడు ఎరుక బ్రహ్మ కనుక పంచశక్తుల ద్వారా సంకల్పం వచ్చి సృష్టిక్రమం జరిగింది అంటే మాయవల్ల జరిగింది. పురుషుడి వలన జరుగలేదు. అప్పటికి పురుషుడు నిర్వికల్పుడే. మాయే నిర్వికల్పుడైన పురుషుణ్ణి సవికల్పుడుగా చూపించి, అతనిద్వారా సర్వము కలిగినట్లు చూపిస్తోంది. మాయంటే లేనివే ఉన్నట్లు కనబడేవన్నీ కూడా తోపింపచేసి చూపిస్తోంది. ఈశ్వరుడికి గాని, బ్రహ్మ సంకల్పానికి గాని జీవుడియొక్క పునర్జన్మలకు గాని ఈ చక్రం దేనిని ఆధారం చేసుకుందంటే, **'యద్భావతి తద్భవతి'**ని ఆధారం చేసుకుంది.

దీనిని గ్రహించి బుద్ధిని మార్చుకుని అజ్ఞానంతో ఆలోచించే బుద్ధియొక్క భావాన్ని విరమింపచేసి జ్ఞాన పద్ధతిలో పెట్టుకుని ఆ జ్ఞానాన్ని పెంపొందింపచేసుకుని అజ్ఞానం వల్లే ఇన్ని కష్టనష్టాలు, ప్రారబ్ధవశాత్తు వచ్చినప్పటికీ, దానికి సంబంధించిన భావనలోకి వెళ్ళకుండా, నేను సుఖస్వరూపుడను అనే భావంతో జ్ఞానాన్ని ఎరిగి, ఆ తరువాత నేను లేనివాడిని అనేటువంటి ఎరుకను, సకలము లేనెరుగా భావన చేస్తూ, గురు కృపతో అభావంగా ఉన్నప్పుడు, ఎరుక విడిచి, బయలై పరమపదమై ఉంటాము. **"యద్భావం తద్భవతి"** అనేటువంటి సూత్రాన్ని జీవ, ఈశ్వర, బ్రహ్మ స్థాయిలలో కూడా అవగాహన చేసుకుని నీ సాధనలో, సవికల్ప బ్రహ్మని నిర్వికల్ప బ్రహ్మగా ఎప్పుడయితే నువ్వు మార్చుకుంటావో ఈ పరిపూర్ణత చేత ఇదంతా లేనెరుక అని, ఉన్నది బయలే అనేటువంటి లక్ష్యంలో, నిరపేక్ష పద్ధతిలోకి పోతావో, అప్పుడు నువ్వు బ్రహ్మగా కూడా లేకుండా పోయి అచల పరిపూర్ణ పరబయలయినటువంటి పరబ్రహ్మగా ఉన్నదున్నట్లుగా ఉండిపోతావు. ఈ **యద్భావం తద్భావతి అనే సూత్రాన్ని పట్టుకొని సాధన చేయాలి**. ఎక్కడికక్కడ ఇది కాదిది కాదని విడుదలయ్యే పద్ధతిలో పోతున్నాము మనం. ఎంతవరకు విడుదలయినా, అది ప్రయాణంలో భాగమేగాని అన్నీ విడువవలసినవే. ఏరు దాటేవరకే తెప్ప ఉపయోగం. ఏరు దాటటానికి దాని ప్రయోజనమున్నప్పటికీ, దాటాక మరికొంత ప్రయాణమున్నప్పుడు ఆ తెప్ప బరువుగా ఉంది, దానిని మోయలేము. అందువలన ఆ తెప్పనక్కడ పడవేసి ముందుకెళ్ళిపోతాము. అలాగే జ్ఞానాన్ని సంపాదించేదాకా జ్ఞానమనే తెప్పతో అజ్ఞానమనే భవ సాగరాన్ని దాటుతాం. జ్ఞానమనే తెప్పకూడా అక్కడ పడవేసి పరిపూర్ణ బోధతో జ్ఞానాజ్ఞానాల రెంటినీ నిరపేక్ష పద్ధతిలో, **నేతి నేతి** వాక్యంతో, విడిచిపెట్టి చివరికి అన్నీ పోగా ఏది శేషించినదో అది బయలనే నిర్ణయంతో, గురువుని పట్టుకుని గురు కృపతో, ఆ గురువే ఆ ఎరుకను విడిపిస్తాడని ఎరుక విడిస్తే, ఆ బయలుగా నువ్వు స్థిరపడ్డప్పుడు అదే పరబయలు, పరమపదము.

అవినాభావంగా ఉన్నవన్నీ కూడా వాసనా రూపంలో అవ్యక్తంగా ఉన్నవి. ఉపాధి నిర్మాణానికి గుణములు వేరుగా వుండి, ఉపాధి పనిముట్టుద్వారా, ఒక్కొక్కరి యొక్క సాంగత్యములో, ఆయా వాసనలు, ఒక్కొక్కరికి ఒక్కొక్క ఉపాధి, ఒక్కక్కరికి ఒక్కొక్క లింగదేహము ఉండి, ఆ వాసనా రూపంగా ఉన్నవన్నీ కూడా ఆ ఉపాధి అనే పనిముట్టు ద్వారా అందులో ఉన్న లింగ శరీరానికి, భోగం కలుగుతుంది. భోగంలోనే ఉన్నటువంటి ఆసక్తి మరలా భోగమై, వాసనలై మళ్ళీ ఉపాధి నిర్మాణాన్ని చేసి, అందులో ఉన్న భోగి అయినటువంటి సూక్ష్మ దేహానికి మరలా భోగాన్ని ఇస్తుంది. వాసలు లేని వారికి, అవ్యక్త స్థితి కూడా లేదు. ఉపాధిగా, లింగశరీరముగా, ఇంద్రియ భోగముగా వ్యక్తమే కాదు. ఇది తెలియక అనేక జన్మలు పునరావృతంగా చక్రభ్రమణంగా ఈ జీవుడు అనేవాడు తిరిగాడు. యద్భావం తద్భవతి అని తెలియక తిరిగాడు. ఆ తిరగడంలో అజ్ఞానముతోటి మరలా మరలా ఇదే భోగలాలస వాసనగా ఉన్నటువంటి కారణ శరీరం ద్వారా, మరలా మరలా జన్మ, ఆ రకంగా కర్మగా పునరావృతమై, కొన్ని వరుస జన్మలు మానవుడికి వస్తున్నాయి.

ఆ మానవునికి ఆ రకంగా వచ్చిన స్వభావము మానవునికి నేరుగా వచ్చినదని చెప్పకూడదు. కాని కొన్ని మతాలలో ఐదు రోజులు సంకల్ప సృష్టి వచ్చి, ఆరవ రోజు మానవ సృష్టి వచ్చి, ఏడవ రోజు ఆ దేవుడు విశ్రాంతి తీసుకుంటాడు అని అంటారు. అలా అయితే మానవుడికి కుక్క, నక్క సంస్కారాలతో కూడిన స్వభావం ఉండవలసిన అవసరం లేదు. కాని, ఇక్కడ ఉన్నది కనుక పరిణామ సిద్ధాంతమే సరియైనది.

మానవుడు శిల, ఖనిజము, వృక్షములు, క్రిమి కీటకములు, జలచరములు, పక్షులు, జంతువుల యొక్క సంస్కారములతో కూడి ఉపాధులు మాత్రం పరిణామంలో మారుతూ ఉన్నప్పటికి, మానవోపాధిలో ఉన్నటువంటి ఆ సృష్టిక్రమంలో ఆయా జన్మల సంస్కారాలు కూడా ఉన్నవి. పేరుకు మానవ శరీరమే కాని, అన్నింటిలో ఉన్న సంస్కారాలు పరిణామ దశలో పోగుచేసుకుంటూ రాబడ్డాయి. ఈ సంస్కారాల చేతనే, ఈ ప్రపంచము నామ రూప జగత్తుగా కనబడుతుంది. ఈ సంస్కారాలను విడిచేస్తే శుద్ధ చైతన్యమే ఉంది.

**'ఏకం సత్ విప్రా బహుధా వదంతి'** – ఒక్కటే సత్ ఉన్నది. అంతకంటే అనేకం ఉన్నదనే మాట సరికాదు. **ఏకం సత్, చిత్తే సత్, సత్తే చిత్, చిదేకం సదేకం** – ఈ నాలుగు మాటలు కలిపి చూస్తే,

సత్తు చిత్తు విడదీయరానట్లుగా, సత్తు చిత్తు ఒకటే అయినట్లుగా ఆ సత్ చిత్ అనేటటువంటి స్వరూపము 'ఏకమేవాద్వియంబ్రహ్మ' అని తెలుస్తుంది. అంటే బ్రహ్మకంటే అన్యం లేనిదిగా ఉంది. ఆ పరిస్థితిలో సృష్టి ఏమిటి? ఉపాధులు ఏమిటి? పరిణామంలో ఉపాధులకు ఉన్న ధర్మం ఏమిటి? ఇప్పుడు ఉన్నటువంటి ధర్మము దేని వల్ల ఉందో, ఏ అజ్ఞానం వల్ల ఉందో, ఈ చక్రభ్రమణం నుంచీ తప్పించుకోవడం ఎలా? అనేది మాత్రం ప్రస్తుతం చూస్తున్నాం.

కొన్ని అధ్యాయాలు దాటిన తరువాత జన్మముందా? కర్మముందా? అనేది ఈ సృష్టికి మూలం లేదు అనేది, సాంఖ్యం ప్రకారం సృష్టికి మూలం ఏది? శంకరుల అద్వైత మత పద్ధతిలో సృష్టికి మూలం ఏది? అని అన్నీ విచారించాలి. ఆ జ్ఞానం ద్వారా (విచారణ ద్వారా) కొన్ని చాప్టర్స్ అయిపోయిన తర్వాత మనకి అవగాహనా శక్తి పెరుగుతుంది. కనుక అప్పుడు పట్టుకుందాం. ఇప్పుడు మనం జనన మరణ చక్రంలో ఉన్నాం. దీనికి కారణం యద్భావం తద్భవతి. అంతే!

ఆధ్యాత్మిక దృష్టి, శ్రద్ధ, భక్తి, ఈశ్వరానుగ్రహం – ఈ నాలుగూ లేనందువలన అజ్ఞానం సంప్రాప్తించబడుతోంది. జన్మజన్మలకు చక్రభ్రమణంగా అజ్ఞానం పెరుగుతోంది. వీటినుండి విడుదల కావాలి. విడుదలయితేనే ముక్తి. ముక్తే విముక్తి. దానినే మోక్షము అన్నారు. బంధం నుంచి విడుదలను ముక్తి అన్నాము. ముక్తి అనే పదానికి అంతకంటే ఏ అర్థమూ లేదు. ఏది దుఃఖమో, ఏది బంధమో, దేనితో పడలేకపోతున్నామో, దానినుండి శాశ్వతంగా విముక్తి అయ్యేది ఏదో, అది ముక్తి అని అర్థం. **"నీవు విడిపించుకుంటే ముక్తి. అదే విడిస్తే మోక్షం".**

నీవు విడిపించుకున్నప్పుడు ముందు ఆత్మ, అనాత్మ ఉన్నాయనుకుని, అనాత్మను విచారించి, అది లేనిదిగా నిర్ణయించి, ఆత్మను విచారించి, అది స్వరూపంగా నిర్ణయిస్తే, ఆ సాధన దశ అంతా నీకు ప్రాప్తింపచేసేది ముక్తి. **"ఏ సాధన నీకెందుకు, వీసానికి పనికి రాదు"** అని సాధన యొక్క అంతములో **'అహంబ్రహ్మాస్మి'**గా ఉండడంలో, జీవన్ముక్తావస్థలో నీవు తప్ప అన్యంలేదనే స్వానుభవ, అపరోక్ష నిర్ణయం కలగడంలో, ఏ సాధన అవసరం ఉండదు అప్పటికి. ఆ తరువాత అద్వైతం సిద్ధించి అపరోక్షమై అన్యము లేకుండా ఉన్నదున్నట్లుగా ఉంటుంది.

ఇప్పుడు ఆధ్యాత్మిక దృష్టి వేరు. ప్రాపంచిక దృష్టి వేరు. ప్రపంచం, నామరూపాలు, భూమి ఎలా ఏర్పడ్డాయి? కొన్ని కోట్ల సంవత్సరాల క్రిందట భూమి ఎలా ఉంది? సూర్యుడినుంచి విడిపోయిన ఒక రకమైన గోళమే, చల్లబడి భూమి అయ్యిందని, అలా సూర్యుడే మూలమని, శాస్త్రజ్ఞులు కనిపెట్టినా, పంచభూతాలకు మూలం ఏది? అణువుకు మూలం ఏది? పరమాణువుకంటే ముందన్నది ఏమిటి? ఆ పరమాణవును నిలబెట్టేటటువంటి ఫోటాన్స్ అనే శక్తి ఉందని, ఆ శక్తి పేరు "దైవకణం" అని పేరు పెట్టారు. ఇదంతా కూడా బహిర్ముఖంలో ఉన్నటువంటి ప్రపంచం యొక్క మూలాన్ని తెలుసుకునే వరకూ విజ్ఞానమే కానీ, ఇది ఆధ్యాత్మిక దృష్టి కాదు.

"బ్రహ్మణో అవ్యక్తః, అవ్యక్తో మహత్తు, మహదో మహదహంకారః" – అనే పార్టు తీసుకోకుండా, మహదహంకార రూపంలో ఉన్న, ఆదిశక్తి రూపం అయిన బ్రహ్మనుండి, పరాశక్తి యొక్క ప్రేరణ చేత, ఊహామాత్రముగా ఈ తన్మాత్ర ఉన్నది. పరమాణువు – అంతకు ముందు ఏముందని పరిశోధన చేసే శాస్త్రజ్ఞులకు అంతుపట్టదు. సాంఖ్యమతమేమో ఆ రకంగా తీసుకెళ్తుంది. మూలావిద్య దానికదే ఉన్నట్లు, కల్పించబడ్డట్లు ఉన్నది అని అద్వైత సిద్ధాంతము ప్రతిపాదిస్తుంది. కనుక ఇక్కడ అవ్యక్తము అంటే, బ్రహ్మాన్ని కనుక అవ్యక్తము అని చెప్పేటట్లయితే, బ్రహ్మము శాశ్వతము కాదు కనుక, ఉన్నదున్నట్లుగా ఉండేది కాదు కనుక, ఈ అవ్యక్తము అనే మాట కూడా తీసేయాలి. అసలు బ్రహ్మ ఎప్పటికీ వ్యక్తం కాడు. పరబ్రహ్మమే అవ్యక్తం. ఈ అవ్యక్తం శాశ్వతము. కనుక వ్యక్తమయ్యే ఆస్కారం లేదు. కాని అవ్యక్తముతోనే పదాన్ని ఎప్పుడైతే వాడామో, ఆ అవ్యక్త స్థితి కొంతకాలానికి వ్యక్తస్థితిగా మారుతుంది అని అర్థం వస్తుంది. ఇది సరికాదు.

కనుక వ్యక్తావ్యక్తములు లేనిది పరబ్రహ్మ. కనుక ఇక్కడ అవ్యక్తమనేది తాత్కాలికంగా వాడినా, శాశ్వత అవ్యక్తము, వ్యక్తము కానిది అనేటటువంటిది, ఒక పద్ధతిగా, పాఠంగా మనం చెప్పుకున్నాము. ఆ పదమే తీసేస్తే, పరబ్రహ్మ అనేది మాత్రమే సత్యం అవుతుంది. అయితే, సాంఖ్యమతంలో అవ్యక్తము అంటే ఒక పదార్థము యొక్క మూలము. స్థూలభూతాలకు మూలము సూక్ష్మభూతాలు. వాటి యొక్క మూలము తన్మాత్రలు. వాటి యొక్క మూలము మహదహంకారము. మహదహంకారము యొక్క మూలము మహత్తు. మహత్తు యొక్క మూలము అవ్యక్తము. ఇది సాంఖ్య పాఠం. అంటే, అవ్యక్తము మహత్తు అయ్యింది. మహత్తే మహదహంకారమయ్యింది. మహదహంకారమే తన్మాత్ర అయ్యింది. ఇక్కడ సాంఖ్య పద్ధతికి హద్దు వచ్చేసింది.

కాని, అద్వైత సిద్ధాంతం ప్రకారం, మహదహంకారంలో ఉన్నటువంటి, హిరణ్య గర్భుడిలోనున్న పూర్వసృష్టి జ్ఞానం వాసనగా ఉన్నది. పరాశక్తి యొక్క ప్రేరణ చేత, జ్ఞానశక్తి – ఇచ్ఛాశక్తి – క్రియాశక్తి అనే క్రమపద్ధతిలో, మయాశక్తి పనిచేయడం ద్వారా ఆ హిరణ్యగర్భుని యొక్క ఊహలలో, అతని యొక్క వాసనే, తన్మాత్ర యొక్క సృష్టిగా, లేకనే ఉన్నట్లుగా తోచింది. వాసనవల్ల లేకనే ఉన్నట్లుగా తన్మాత్ర సృష్టిగా గోచరించింది. అంటే అంతకు పూర్వము అనేక సార్లు చేసిన సృష్టి వాసనారూపం అయ్యింది. సృష్టి ముందా? వాసన ముందా? అంటే, సృష్టిని బట్టి వాసన, వాసనను తరువాత ఏం జరిగింది? వాసనను బట్టి తన్మాత్ర సృష్టి అయ్యింది. ఇది కూడా ఒక చక్రభ్రమణమే. ఈ చక్ర భ్రమణానికి కూడా యద్భావం తద్భవతి. హిరణ్యగర్భుని యొక్క భావము క్రమములో వాసన, ఆయన వాసనే తన్మాత్ర సృష్టి అయ్యింది. కనుక యద్భావం తద్భవతి అనే చక్రంలో అక్కడ కూడా ఉన్నాడు.

అంటే హిరణ్యగర్భుడు, లేక బ్రహ్మ లేక ఏఋకబ్రహ్మ, లేక మహదహంకార రూప బ్రహ్మ, లేక ఆదిశక్తి రూప బ్రహ్మ, చైతన్యబ్రహ్మ, మయాశబలిత బ్రహ్మ ఇవన్నీ ఒకే పదాలు, ఒకే అర్థం గలవి. సందర్భాన్ని బట్టి మనం ఏ విషయాన్ని ఏ కోణంలో సమీకరించి, అక్కడ ఋజువు చేద్దామనుకున్నామో, దానికి సంబంధించిన పదం అక్కడ ఉంది. ఏఋక అనే పదం వచ్చినప్పుడు ఏఋకబ్రహ్మ అయ్యాడు. మాయ అనే పదం వచ్చినప్పుడు మాయాశబలిత బ్రహ్మ అయ్యాడు. వ్యష్టి, సమిష్టికి అహంకారమునకు ముందుగా ఉన్నటువంటి అహంకారము, మహత్తును అభిమానించేదానికి మహదహంకారము అనే పేరు వచ్చింది.

ఈ సృష్టి, స్థితి, లయ జ్ఞానము వాసన రూపంలో ఎవని యందున్నదో, ఆ పరమాత్మ బంగారు వర్ణంలో, హిరణ్యవర్ణంలో ప్రకాశిస్తున్నాడు. ఆ హిరణ్యుడైనటువంటి పరమాత్మ యొక్క గర్భంలో, ఈ సృష్టి యొక్క మహాకారణము వాసనా రూపంలో ఉన్నది, కనుక హిరణ్య గర్భుడు అన్నారు. ఆయనలో అహం అనేటటువంటి స్థితి ఉన్నది. అప్పుడు మహదహంకారము అన్నారు. పరబ్రహ్మ స్వప్రకాశ రూపంగా ఉన్నాడు. ఆ ప్రకాశము మాయావరణలో పంచబ్రహ్మల ప్రకాశమై, ఇక్కడ అధిష్ఠాన ప్రకాశముగా అహము అనే తత్త్వముగా ఉన్నాడు. అహం అనే తత్త్వముగా ఉన్న దానిగర్భములో ఉన్నదంతా పూర్వసృష్టి జ్ఞానవాసన. ఆ జ్ఞానవాసనే యద్భావం తద్భవతిగా, క్రియోన్ముఖమై తన్మాత్ర సృష్టి జరిగింది. అయినా మాయ ద్వారం గుండా వచ్చిన, పంచబ్రహ్మల యొక్క ప్రకాశమే దీనికి మూలము, అధిష్ఠానము.

ఈ రకంగా చూస్తే, అష్ట ప్రకృతులు అనే మాట వచ్చింది. మహదహంకారము, మహత్తు, అవ్యక్తము కూడా ప్రకృతియే అని తేలింది. పంచతన్మాత్రలు + మహదహంకారము + మహత్తు + అవ్యక్తము కలిపి అష్టప్రకృతులు. అష్ట ప్రకృతులు సాంఖ్య మత నిర్ణయము. కనుక అక్కడ అవ్యక్తము అనేటటువంటిది, వ్యక్తము అవ్వడానికి ఆస్కారం ఉన్నటువంటి జడపదార్థమే సకల జీవరాశుల యొక్క సంచిత రాశియే కానీ వేరుకాదు. వాసనా రూపంగా ఉన్నప్పుడు అది అవ్యక్తం అని, ఉపక్రమించేటప్పుడు మహత్తు అని అహంకార స్థితి వచ్చేసరికి, ఈ వాసనలు తన యొక్క గర్భంలో ఉన్నాయని, ఈ అహంకారమే ఆది శక్తి అందురు. పరాశక్తి ప్రేరణ వచ్చేటప్పటికి, ఆ గర్భంలో ఉన్నది తన్మాత్రగా సృష్టిగా వ్యక్తమైందని చెబుతున్నారు.

అవ్యక్తం అనే పదాన్ని రకరకాలుగా చెప్పవచ్చు. మహదహంకారరూపంలో ఉన్న వాసన అవ్యక్తము. తన్మాత్రే వ్యక్తము. హిరణ్యగర్భుని యొక్క గర్భంలోనే, ఈ తన్మాత్ర సృష్టి అవ్యక్తంగా ఉంది. తరువాత తన్మాత్ర సృష్టి అతని యందు వ్యక్తమైంది.

సాంఖ్య మతంలో వస్తువును గురించి, దీని గురించి, దాని గురించి చెప్పారు. ఇక్కడ మతాలు అనగానే పూర్వమీమాంస, ఉత్తర మీమాంసా. పూర్వమీమాంసేమో – కర్మలు ధర్మము గురించిన సూత్రాలు, **'అథాతో ధర్మ జిజ్ఞాసా'**తో మొదలవుతాయి. జైమినీ మహర్షి దానికి సూత్ర కర్త. దాని వలన కలిగిన దర్శనము పూర్వమీమాంసా దర్శనము. ఉత్తర మీమాంసా అంటే

**'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా'**తో మొదలై బ్రహ్మజ్ఞానం గురించి చెప్పేటటువంటి బ్రహ్మ సూత్రాలు. వేదము యొక్క శిఖరముగా, వేదాంతముగా ఉండడంలో ఉపనిషత్తులలో ధర్మ, అర్థ, కామములను పక్కన పెట్టి, మోక్షము అనేటటువంటి దానికి, లక్ష్యవస్తువు అయినటువంటి బ్రహ్మవస్తువు గురించి, తేల్చి చెప్పేది బ్రహ్మసూత్రాలు. బాదరాయణుడు దీనికి కర్త.

ఈ షడ్దర్శనాలలో మూడవది న్యాయము. న్యాయము అంటే తర్క, వితర్కాలతో నిర్ణయించేది. ఈ తర్క, వితర్కాలతో నిర్ణయించేదాని యొక్క సూత్రాలు ఏ పద్ధతిలో, ఏ రకంగా తర్క వితర్కాలు చేయాలి? ఏ మార్గంలో చేయాలి? ఎలా వస్తు నిర్ణయం చేయాలి? అధ్యారోప అపవాదములు అన్నీ కూడా, ఈ న్యాయ శాస్త్ర ప్రకారంగా, న్యాయదర్శన ప్రకారంగా ఉంటుంది. గౌతమ ఋషి దీనికి కర్త.

నాలుగవది వైశేషికము. ఇది వస్తు విశేష పరిధిలో ఉంది. ఇది వస్తువును అణువులని, పరమాణువులని, పదార్థాన్ని విచారణ చేసి నిర్ణయము చేసేది. దీనికి కణాదుడు కర్త. కణాదుడు అంటే అణువు, కణము అనే సూక్ష్మాతి సూక్ష్మమైన పదార్థము యొక్క మూలతత్వము. ఆ మూలతత్వము యొక్క పేరుతోనే, ఆ కణాదుడు అనే నామం వచ్చింది. ఆ కణాదుడు ఏమి చేశాడంటే, ఈ నామరూప జగత్తుకు, మూలకారణాన్ని పరమాణు పద్ధతిలో నిర్ణయించాడు. అది కూడా మనకు ఉపయోగమే. ఈ కనపడేటటువంటి నామరూపాలు, పరమాణువులు తప్ప మరేది కాదు అని. ఇవన్నీ మనం ఉపయోగించుకుంటాం కానీ, ఆ కణాది మహర్షి చెప్పిన వైశేషిక దర్శనం ద్వారా బ్రహ్మవస్తు నిర్ణయం కావడం లేదు. అలాగే జైమినీ ద్వారా ధర్మసూత్రాలు, కర్మసూత్రాల ద్వారా కర్మఫలితమే ఉంటుంది కానీ, సిద్ధవస్తువు అయిన బ్రహ్మజ్ఞానము కలగడం లేదు అని తెలుస్తుంది. అలాగే సాంఖ్యము వచ్చేసరికి, ఆ అష్టప్రకృతుల దాకా నిర్ణయం అయ్యింది కానీ, ఆ అష్ట ప్రకృతులు జడం కదా! ఆ చైతన్యం సంగతి ఆయన చెప్పలేదు.

ఎందుకంటే, వాటిల్లో అనుస్యూతంగా, ఓతప్రోతంగా, సర్వాధారంగా, సత్తామాత్రంగా ఏదైతే వ్యాపించి ఉందో, అది బ్రహ్మమని, చైతన్యమని, కాని అష్టప్రకృతులలో ఉన్నది జడము మాత్రమేనని దానికి జ్ఞానము, చైతన్యము లేవని, ఆ చైతన్యము ప్రస్తుతంము మానవోపాధిలో **'నేను నేను'** అనే రూపంగా అహం స్ఫురణ రూపంలో ఉందని, తత్త్వమసి మహావాక్యార్థంగా, ఆ బ్రహ్మచైతన్యమును చైతన్యరూపంగా చూస్తే, లక్ష్యార్థంగా చూస్తే, నిరపేక్షంగా చూస్తే భేదము లేదని కనుక వ్యవహారమంతా వాచ్యార్థంలోనే ఉన్నది. ఈ విధముగా విచారణ చేసి వాచ్యార్థమును విడచి లక్ష్యార్థమును స్వానుభవానికి తెచ్చుకుంటే మోక్షమని నిర్ణయము.

ఇలాగ బ్రహ్మసూత్రాలలో లేక భగవద్గీతలో అక్షర పరబ్రహ్మయోగంలో చిత్ జడములను వేరుచేసినదే అద్వైతం సిద్ధాంతానికి విషయము. బ్రహ్మసత్యం-జగన్మిథ్య ప్రకారం క్షరములు లేకుండా చేస్తే అక్షరము అని సాపేక్షముగా ఉండేది ఏదో, అదే నిరపేక్షముగా ఉంటే సత్యమే పురుషోత్తమ ప్రాప్తియని, ఈ రకంగా ఈ అన్ని మతాల్ని మనం వాడుకున్నప్పటికీ, ఆ మతాల యొక్క అవధి, పరిధికి మించి మన జ్ఞానబోధకి ప్రాధాన్యాన్ని ఇచ్చాము. అజ్ఞాన దృష్టిలో ఉన్నవారు, కొంతవరకూ విచారించడానికి, సాధనకి పనికి వస్తుంది. చివరకు సత్యవస్తు నిర్ణయము చేసుకోకపోతే పూర్వ మీమాంసా దర్శనము వలన కాని, న్యాయదర్శనము వలన కాని, సాంఖ్యమత ప్రకారముగాని, పతంజలి యోగ సూత్రాల ద్వారా కాని, కణాదుని యొక్క పరమాణు పదార్థ నిర్ణయముగాని గాని, కొంత జ్ఞానం మనకు కలిగినా, ఇది లేనిది, ఇది కానిది, ఇది ఉన్నది అని మనకు తెలిసింది తప్ప, మోక్ష రూపమైన బ్రహ్మజ్ఞానం కలుగలేదు.

ఇది ఒక క్రమపద్ధతిలో 18 అధ్యాయాలుగా భగవద్గీత చెబుతోంది. శ్రవణానికి ఆచరణకు భగవద్గీత, మననానికి అవగాహనకు ఉపనిషత్తులు, ఉపనిషత్తుల యొక్క సారాన్ని క్రోడీకరించి, మనం మెదడులో పెట్టుకోగలితే అది నిదిధ్యాస. కనుక నిదిధ్యాసకు బ్రహ్మసూత్రాలు ఉపయోగపడతాయి.

కనుక ఈ షడ్దర్శనాలలో ఒక్క బ్రహ్మసూత్రాలు తప్ప, మిగితావి అన్నీ కూడా ఆ పరబ్రహ్మనిర్ణయాన్ని, ఆ పరబ్రహ్మ యొక్క అవగాహనని అందించ లేకపోయినవి. కొన్ని తర్కంతో వదిలేసేవి, కొన్ని పదార్థ జ్ఞానంతో వదిలేసేవి, కొన్ని యోగాభ్యాసంతోటి, ఆ పరబ్రహ్మను పొందడానికి, నిర్వికల్ప సమాధి వరకూ తీసుకువెళ్ళి, సంసిద్ధం చేయడంతో ఆ పతంజలి యోగసూత్రాల యొక్క అవధి పరిధి అక్కడితో ఆగిపోయింది. అట్లా అన్నిటికి అవధులు, పరిమితులు వచ్చేసినవి కానీ చివరిదాకా తీసుకెళ్ళేవి, కేవలం బ్రహ్మసూత్రాలు.

ఈ బ్రహ్మసూత్రాలే మళ్ళీ అనేకమంది మరలా మరలా వ్యాఖ్యానం చేశారు. మళ్ళీ ఎవరి మతం వారిది. బ్రహ్మసూత్రాల వ్యాఖ్యానం విశిష్టాద్వైత పద్ధతిలో చేసినవి దొరుకుతున్నాయి మనకు. బ్రహ్మసూత్రాలనే మధ్వాచార్యుల పద్ధతిలో ద్వైత సిద్ధాంతాన్ని బలపరిచేటట్లుగా వ్యాఖ్యానం చేసినవి దొరుకుతున్నాయి. శంకరాచార్య భాష్యంగా, అద్వైత నిర్ణయంగా వ్యాఖ్యానం చేసినవి కూడా దొరుకుతున్నాయి.

ఈ త్రిమతాలలో వరికి ఏది కావాలంటే అది తీసుకోవచ్చు. మూడూ కూడా రైటే. అయితే పరమగమ్యానికి చేర్చేది, అద్వైత బ్రహ్మసూత్ర భాష్యము మాత్రమే. మత పద్ధతికి అతీతమైనది సిద్ధాంతము. మతం అంటే మతి అంటే బుద్ధి, బుద్ధిగతమైనది మతం. మన అందరి బుద్ధి సరిగ్గా పనిచేయకపోయినా, ఒకానొకని యొక్క బుద్ధి ఈ బ్రహ్మవిషయంలో, ఈ మోక్షం విషయంలో తర్కించి, విచారణ చేసి, పరిశోధించి, నిర్ణయం చేసినటువంటిది. అందరి కంటే తక్కువ తెలివి ఉన్నవాడు, ఆయనతో ఏకీభవించి, కొంత విచారణ చేసి ఏకీభవించి, కామన్ సెన్స్‌తో ఏకీభవించి, ఇలా మనము ఆయనను అనుసరిస్తున్నాము. అట్లా మొట్టమొదట నిర్ణయము చేసినవాడు, అతనియొక్క అభిప్రాయము కనుక అది ఆయన మతం.

ఎవరి మతం వారిది. తన మతమేమో తనది, అన్యమతము తనకు పడదు, కనుక ఒక బుద్ధికి ఒక అవగాహన మేరకు పౌరషేయముగా, ఒక మానవమాత్రునిచేత నిర్ణయించబడింది మతం. తపోదర్శనాలుగా, శృతులుగా వినబడ్డదిగా, వేదవాణిగా వినేవన్నీ అపౌరుషేయాలు. కనుక అదే ప్రమాణము. ఇవాళ ఏమి చేస్తున్నారంటే, ఆ ప్రమాణాన్ని అన్ని రకాల మతాల వాళ్ళు అదే ప్రమాణాన్ని చూపిస్తూ వాళ్ళ మతాన్ని నిలబెట్టుకుంటున్నారు. కనుక మతాతీత పద్ధతిలో మన సిద్ధాంతాన్ని గ్రహించాలి. ఈ చెప్పిన ప్రకారంగా బాహ్యంలో అనేది ఆధ్యాత్మిక సాధనలో దానికి ఋజువులు ఉండవు. పెద్దలు, అనుభవజ్ఞులు, గురుతుల్యులు వారి యొక్క అనుభవాన్ని కొన్ని శాస్త్రాలలో పొందుబరచబడి యున్నట్టి, ఒక క్రమవిధానాన్ని మనం పరిశీలించాలి.

నీవు భక్తుడు కాకపోవచ్చు, దేవుణ్ణి నమ్మకపోవచ్చు. సాధన అక్కర్లేదు అనవచ్చు. అసలు ముందు అన్నింటికి ఏది మూలము అనే దృష్టి ఆధ్యాత్మిక దృష్టి. ఆ దృష్టి వస్తే సరిపోయిందా? ఆ దృష్టితో ఒక పరిశీలన చేయాలి. ఆ పరిశీలన చేయడానికి శాస్త్రద్రష్టం, గురోర్వాక్యం, ఆత్మనిశ్చయంతో జ్ఞానపరమైన ఇచ్ఛ కలుగుతుంది. శుభకరమైన, శుభమైన, శుభంకరమైన మోక్ష పదాన్ని పొందడానికి నీకు ఒక ఇచ్ఛకలిగింది. ఇచ్ఛకలిగింది కాబట్టి అది శుభేచ్ఛ. తరువాత ఆ శుభేచ్ఛ వస్తే సరిపోయిందా? ఈ అనుమానాలు తీర్చుకోవడం కోసం విచారణ ఇది. రెండవ జ్ఞానభూమిక. ఈ విచారణ చేయాలి అంటే 'శ్రద్ధ'గా చేయాలి. ఏదో తెలుసుకుందాం? ఏదో పరీక్ష రాసేద్దాం, ఏదో ముక్కున బట్టి పరీక్షరాసి పాస్ అవుదాం. పరీక్ష అయిపోయాక ఆ సబ్జెక్టుతో నాకు పనిలేదు అన్నట్లు కాకుండా, **శ్రద్ధావాన్ లభతే జ్ఞానం** అన్నారు. ఇవాళ ఆ జ్ఞానం కోసం – మానవుడికి మొదట్లో వచ్చిన జ్ఞానం, విచారణతో, పరిశీలనతో వచ్చిన జ్ఞానమే. నిజమైన జ్ఞానమునకు వెళ్ళాక, జ్ఞానమే నీవౌతావు. **బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి**. అది తెలుసుకుంటే బ్రహ్మవిషయంలో మాత్రం, ఆ బ్రహ్మను గురించి మూలం ఎవరైతే తెలుసుకుంటారో, ఆ తెలుసుకున్నవారే, బ్రహ్మము తప్ప, అన్యము లేదని తెలుసుకున్నారో, ఆ బ్రహ్మలో ఉన్న చైతన్యమే తాను, తానే ఆ చైతన్యము అని ఎవరు తెలుసుకున్నారో, అప్పుడు ఆ చైతన్యమే స్వానుభవానికి రాగానే వారే బ్రహ్మ. **బ్రహ్మవిద్ బ్రహ్మైవాహ భవతి** అన్నారు. బ్రహ్మము అయివున్నాడు. **అయినవాడే తెలిస్తే అయివున్నాడు, అజ్ఞానంలో అయినవాడే కానివాడుగా వున్నాడు.**

కాబట్టి, అటువంటి దానిని పరిశీలించడానికి శ్రద్ధ ఉండాలి. సాధన చేసినప్పటికీ వస్తు నిర్ణయం చేయడానికి పాజిటివ్‌గా ఉండాలి. నాస్తికవాదులు దానిని ఎగతాళిగానో, వారే గెలవాలనే తర్కంతోటి, కొన్నిటిని విస్మరిస్తారు. ద్వైతులు, విశిష్టాద్వైతులు వారికి అనుకూలము అయినటువంటి బ్రహ్మసూత్రాలను, ఉపనిషద్వాక్యాలను తీసుకుని, ద్వైతం, విశిష్టాద్వైత పద్ధతిగా బోధించారు. అలాగే అద్వైతులు కూడా అద్వైత నిర్ణయ వాక్యాలు మాత్రం తీసుకుని, అద్వైతమే కరెక్ట్ అని, బ్రహ్మసూత్రాలకు భాష్యం వాడారు. అద్వైతం మతంగా ఉన్నప్పుడు అది పరమపదాన్ని ఇవ్వలేదు. అద్వైతం సిద్ధాంతంగా అయ్యేప్పటికి అప్పుడు అది పరమపదానికి దారితీస్తుంది.

అయితే ఒకటి గమనించాలి. ఈ వేదాలు, ఉపనిషత్తులు కూడా కొంతకాలం కర్మయోగంలో గడిపి, చిత్తశుద్ధి కలిగించినవి. భక్తియోగంలో నడిపి మీకు యోగస్థ స్థితిని కలిగించాయి. జ్ఞానయోగంలో నడిపి అక్షరపరబ్రహ్మమును నిర్ణయించింది. ఆ పురుషోత్తమ ప్రాప్తి వచ్చేసరికి, అద్వైతం సిద్ధించింది.

కనుక మూడు మతాలు, ముగ్గురూ కూడా రైటే. మొదట్లో ద్వైతంతో స్టార్ట్ అయ్యి, తరువాత భగవదైక్యం అనేటటువంటి భక్తియోగంలో విశిష్టాద్వైతంగా వచ్చి, భగవంతుడైపోయినప్పుడు అది అద్వైతమేగా! మొదట్లో ద్వైతం ఉంటుంది. తరువాత విశిష్టాద్వైతం ద్వారా గమ్యం చేరితే, అద్వైతం సిద్ధించే సరికి, రెండవ వస్తువు ఎక్కడ ఉంది? బ్రహ్మ తప్ప అన్యము లేదు అన్నప్పుడు, ఆ బ్రహ్మకూడా నీవే అయినప్పుడు, నీకు ఆ స్వానుభవంలో, స్వస్వరూప సాక్షాత్కారంలో, తెంపులేని నిత్యవర్తమానంలో, పరిపూర్ణ స్థితిలో నిశ్చలంగా ఉండగా, తిరిగి మరలా పునరావిర్భవించాల్సిన అవసరము కాని, గొడవకాని లేదు. మూడు గుణములు నిన్ను కదిలించని స్థితిలో, గుణ రహిత స్థితిలో ఉండిపోతావు. దానికి ఏమి పేరుపెట్టుకుంటే ఎవరికి ఏమి కావాలి?

కనుక ఆ నిర్ణయాలన్నీ ఒక వరుసలో పెట్టుకునే ఆధ్యాత్మిక దృష్టి ఉండాలి. తరువాత శ్రద్ధ ఉండాలి. తరువాత భక్తిలో యోగస్థ స్థితి రావాలి. ఆ భక్తిలో ఈశ్వరానుగ్రహం కావాలి. ఈశ్వరానుగ్రహం చేత, ఈ మార్గంలోకి, జ్ఞానమార్గంలోకి పూర్తిగా ప్రవేశించిన సాధకుడు సచ్ఛిష్యుడు అవుతాడు.

మనం అంతా ఏమిటంటే, ఈ ప్రయత్నాన్ని, ఈ కష్టాన్ని మొదలు పెట్టకుండానే, అజ్ఞానంలో ఉంటూనే వాదోపవాదాలు కుతర్కాలు చేస్తున్నాము. ఈ కుతర్కాలలో జరుగుచున్నది యద్భావం తద్భవతి. సృష్టిలో జరిగేది కూడా యద్భావం తద్భవతి. దాన్ని యద్భావం తద్భవతి అని నీవు తెలుసుకున్న తరువాత ఈ చక్రాన్ని నేను ఎక్కడ బ్రేక్ చేయాలి? అనేది తెలుసుకోవాలి.

అంటే పరాప్రకృతి, అపరాప్రకృతి అని రెండున్నవి. పరా, అపరా భేదం తెలిసినప్పుడు అపరా ప్రకృతిని బ్రేక్ చేసేస్తే సరిపోతుంది. పరమును తెలుసుకుని, తానే ఆ పరమని నిర్ణయించుకుంటే, అపరం అనేది మిథ్య, లేనిది అవుతుంది. ఇలా చేస్తే అవుతుందని తెలిస్తే, అప్పుడు పట్టుదలతో సాధించాలి. ముందు తెలుసుకోవాలిగా! జ్ఞాతుం – ముందుగా తెలుసుకోవాలి, ద్రష్టుం అంటే అనుభవ పూర్వకంగా తెలుసుకోవడము. ప్రవేష్టుం అంటే అది తానై ఉండటము. అధిగచ్ఛతి అన్నింటినీ మీరి అంటే బయలు అయి ఉండటము. ఈ నాలుగూ తరువాత చూద్దాం. ముందు 'జ్ఞాతుం' దగ్గరే మాట్లాడుదాం.

పై విధముగా మానవుడు తనకు తానే అవరణలో ఉండి, ఆవరణ సహిత అజ్ఞానంలో కొనసాగుతూనే తనయొక్క భవాన్ని తానే స్వయంకృతంగా నిర్మించుకుంటున్నాడు. ఇందు ఏది లోపించినా కూడా అంటే, అధ్యాత్మిక దృష్టి లోపించినా, ఆ దృష్టి ఉండి శ్రద్ధ లేకపోయినా, శ్రద్ధ ఉండి భక్తి లేకపోయినా ముందుకు సాగదు. ఇవన్నీ ప్రాథమిక సాధనలుగా చేసుకుని, ఇవన్నీ వేటికవి పరిపూర్ణం అయినప్పుడే, ఈశ్వరానుగ్రహం కలుగుతుంది.

ఈశ్వరానుగ్రహం చేతనే, అంతః స్ఫురణ కలుగుతుంది. అంతః స్ఫురణ చేతనే, బాహ్య ప్రపంచంలో ఋజువులు, సాక్ష్యాలు, తర్కంతో అందనివి అన్నీ కూడా అంతఃస్ఫూర్తి చేత అందించబడుతాయి. ఈశ్వరానుగ్రహం చేత, గురుకృప చేత నీకు అందుతుంది. అప్పటి దాకా గురువు అనే భావం నీకు లేదు. అప్పటికింకా భక్తుడివేగా! అయినప్పటికీ ఈశ్వరుడి చేత ఇవ్వబడుతుంది. అప్పుడు సర్వత్రా సర్వవ్యాపకంగా ఉన్నవాడు, నీ అంతరాత్మగా అంతఃస్ఫూర్తిని కలిగిస్తాడు.

అంతః స్ఫూర్తిలో తోచి, నీకు స్వానుభవం ఎప్పుడయ్యిందో, బయటి ప్రపంచంలో ఉన్న, కార్యకారణ సంబంధంగా, విజ్ఞానశాస్త్ర సంబంధంగా, ఉన్నవన్నీ కూడా గాలికి ఎగిరిపోతాయి. నీ అనుభవమే ప్రత్యక్షప్రమాణంగా మారుతుంది. ఇక అనుమాన ప్రమాణములన్నీ కూడా మనం విచారణతో చేయక్కర్లేదు. అయినప్పటికీ కొంత దూరం వరకూ అనుమాన ప్రమాణమునకు అందేలాగానే మనం ఇంతకు పూర్వము చెప్పుకున్నట్లుగా, సాంఖ్యమతాన్ని, న్యాయమతాన్ని, తర్కవితర్కాల కోసం, మరి ధర్మార్థ కామ మోక్షాలలో ధర్మార్థాలు ఇవి అన్నీ చెప్పడం ద్వారా గుప్తంగా, చాపకింద నీరులాగా కొంత సాధనలో ముక్తి మార్గంలోనే ఉంటాడు. ఆ ముక్తి మార్గంలో ముక్తి అనేటటువంటిది కూడా ధర్మార్థకామమోక్షాలు చతుర్విధ ఫల పురుషార్థాలు అన్నీ కూడా, ముక్తి యొక్క లక్ష్యాన్ని వివరంగా కాకపోయినా, పైపైన అందించబడడం జరుగుతుంది.

కనుక మిగితా దర్శనాలు కూడా మనం వాడుకోవచ్చు. పూర్వమిమాంసా వాడుకోవచ్చు. అలాగే న్యాయం, తర్కం. విచారణ పాజిటివ్‌గా చేయాలి. ఇవన్నీ ఏమీ లేవు అనే నిర్ణయాన్ని, ఒక ఆధారంగా, ఒక నాస్తిక వాదంగా, నిన్నునీవు బలపరిచేదిగా, పక్షపాత బుద్ధితో విచారణ చేయరాదు. పాజిటివ్‌గానే విచారణ చేయాలి. అయితే అది అనుభవానికి వస్తేనే నిర్ణయం. కనుక పతంజలి యోగశాస్త్రాన్ని కూడా కొంతమేరకు అష్టాంగయోగాన్ని సంప్రజ్ఞాత, సవికల్ప సమాధులు దాటి, అసంప్రజ్ఞాత సమాధి అనే నిర్వికల్ప సమాధిలో దానిని సహజం చేసుకున్నప్పుడు, నీ మనోబుద్ధులు ఆగిపోతాయి. అలా ఆగడం అనేది సాధ్యం అయినప్పుడు, విషయవాసనలు అడ్డురానప్పుడు, ఎక్కడికక్కడ అందుబాటైనటువంటి, ఆ పరమాత్మ చైతన్యము,

అక్కడ ఒంటరిదిగా, ఏ అడ్డంకి లేకుండా అందుతుంది. దాన్ని గుర్తించాలిగా! పైగా అది అన్యవస్తువా? నీవే అది అయివున్నావు. కనుక అన్యవస్తువును గుర్తించడం తేలిక. నీకంటే అన్యవస్తువు ఏదో రకంగా నీ బుద్ధికి తోస్తుంది. ఇంద్రియానికి గోచరం అవుతుంది.

కాకపోతే చైతన్యరూపంగా ఉన్న, నిన్ను నీవు నీ ఇంద్రియాలతో చూడలేవు. మనసుతో ఊహించలేవు. బుద్ధితో భావన చేయలేవు. ఊహకి అందదు, భావనకు అందదు. అటువంటి బ్రహ్మ ఒక్కటే అయినది. నేను నేను అనే స్ఫురణలో కూడా చైతన్యంతో, ఆ స్ఫురణకు ఆధారమైన చైతన్యము, బ్రహ్మచైతన్యము ఒక్కటే కనుక నిన్ను నీవు ఎలా చూసుకుంటావు? నీవే అద్దై ఉన్నావు అనేటటువంటిది, నీ స్వానుభవంలోకి తెచ్చుకోవాలి. 'తెచ్చుకోవాలి' అనే మాట ఎందుకు? నీవు అజ్ఞానంలో ఉన్నావు కాబట్టి. నీవు అన్యవిషయములు, అన్యవస్తువులు సత్యమనే భ్రాంతిలో ఉన్నావు కాబట్టి. ఆ విక్షేపంలో ఉన్నావు కాబట్టి. దీనిని తెచ్చుకోవాలి అంటున్నాము. తెచ్చుకోవడమే అనుష్ఠానము, ఉపాసన.

తెచ్చుకోవడానికి వస్తుందా? అది? లక్షణాలచేత తెచ్చుకోవచ్చు. సత్ చిత్ ఆనందం అనే లక్షణం చేతగాని, నిర్వికల్పము, నిర్విశేషము అనే లక్షణం చేత గాని, అచలము – పూర్ణము అనే లక్షణం చేత గాని, ఆకాశ లక్షణం చేతగాని, అమనస్క లక్షణం చేత గాని. ప్రకృతులు అన్నీ కూడా లేకుండా ఉండేటటువంటి, ఒక వర్ణనతో కూడిన, ఒక పదాన్ని లక్ష్యంగా పెట్టుకుని, ఆ లక్షణయుతమైన పదాన్ని నీ లక్ష్యంగా పెట్టుకోవడంద్వారా అవాంగ్మానస గోచరము, ఊహాతీతము, భావనాతీతము అయినటువంటి, ఆ పరబ్రహ్మవస్తువును, సమీపానికి తెచ్చుకోవచ్చు. లేక ఆ సమీపానికి నీవు వెళ్ళవచ్చు. అదే నీకు స్వానుభవం వచ్చేదాకా, ఒక రకమైన ప్రక్రియ వేదాల్లో, వేదాంతంలో, ఉపనిషత్తులలో ఉన్నది. నీకు ఆధ్యాత్మిక దృష్టి, శ్రద్ధ ఉంటే, దానిని నీవు గ్రహించగలవు. ముందు ఆ రెండూ ఉండాలి. అంతర్ దృష్టితో, అంతర్ముఖంతో, అంతఃస్ఫురణగా సద్గురువు అందించిన దానిని గ్రహించాలి అంటే, భక్తి, భక్తి యోగములో ఈశ్వరానుగ్రహము కలగాలి. పతంజలి యోగసూత్రాల ద్వారా కొంత యోగభ్యాసం చేసి ఉండాలి. ఇవన్నీ నిన్ను సంసిద్ధపరచేవే.

సాధన చతుష్టయ సంపత్తి అంటే, ఆ పాఠంలో చెప్పినంత వరకే కాదు. అష్టాంగ యోగము కూడా తెలుసుకోవాలి. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి. యమము అంటే బహిర్ముఖ పదార్థము నందు ఆసక్తి కలుగకుండా చేసే సాధన. నియమము అంటే అంతర్ముఖ ప్రయాణానికి కావలసిన సాధన. నేను ఇలా ప్రవర్తిస్తాను, ఇలా జీవిస్తాను, నేను ఇన్ని గంటలకు నిద్ర లేస్తాను, నేను ధ్యానం చేస్తాను, ప్రాణాయామం చేస్తాను, విపస్సనా ధ్యానం చేస్తాను. ఆనాపానసతి చేస్తాను. కుండలినీ యోగం చేస్తాను. ఆ గురువుగారు ఇచ్చిన మంత్రోపదేశం మీదగానీ, ఓంకారం మీద గానీ, ఒక్కోగురి, గుర్తు మీద ధ్యానం చేస్తానని నియమం. నియమం పెట్టుకోవడం అనేది సత్కర్మాచరణకు గుర్తు. ఇచ్ఛాపూరితంగా లోక కల్యాణం కొరకు, ఏది చేసినా అది సత్కర్మే అవుతుంది. అలా చేయకుండా విచ్చలివిడిగా ఉండడం ఏదైతే ఉందో, అది బహిర్ముఖంలోనే అంతకంతకూ జనన మరణాలకు లోనయ్యే పద్ధతిని మానుకోవడం అవ్వదు. అంతర్ముఖ ప్రయాణానికి తోడ్పడే సత్కర్మాచరణ సాధనని ఒక నియమంగా, ఒక పద్ధతిగా అవలింబించడమే నియమము.

ఈ రెండిటి ఫలితముగా చిత్తశుద్ధి కలిగితేనే తప్ప, నీవు నీ స్వరూపాన్ని కనుక్కోలేవు, అనుభూతి చెందలేవు. నీకు ఆధ్యాత్మిక దృష్టి రావాలి అంటే, ఇదంతా జరగాలి. అందుకే మోక్షమును నిర్ణయంగా చెప్పట్లేదు కాని, లోకంలో శ్వాసమీద ధ్యాస అని నడిపిస్తున్నారు. దానికి అదే గమ్యం కాదు. అలా కొంతకాలం చేయగా, అంతఃస్ఫురణగా కొన్ని అనుభవాలు రావడం అనేది, స్థూలంగా కాకుండా, సూక్ష్మంగా, సూక్ష్మాతి సూక్ష్మంగా ఏదో ఒకటి ఉన్నది అనేటటువంటిది తెలియబడుతుంది. స్థూలంగా ఉన్న వస్తువుల మీద ఆధారపడకుండా నీవు ఉంటావు. దాని అనుభవం అక్కడికే. స్వరూపజ్ఞానం పొందడానికి నిన్ను నీవు ఖాళీ చేసుకునే వరకే, ఆ యోగ సాధన యొక్క అవసరం. అప్పటికైనా ఆధ్మాత్మిక దృష్టి రావాలి. ఆ తరువాత ఏమిటి? అని. దానిమీద శ్రద్ధ ఉండాలి. ఏదో ఇంజినీరింగుకు, డాక్టరుకు కొన్ని తెలుసుకుంటే, ఆ తెలుసుకున్న తెలివి నీవు ఉపయోగించుకుంటే కొంత డబ్బు వస్తుంది. పొట్టకూటి కొరకుగా తెలుసుకోవడం కాదు. అక్కడ కూడా శ్రద్ధ అవసరమే కాని, ఆ శ్రద్ధవల్ల బాహ్యప్రపంచ జ్ఞానం వచ్చింది. బాహ్యప్రపంచ జ్ఞానం వలన ఉపయోగం లేదు. పొట్టకూటి కొరకు ఉపయోగమే కానీ, స్వరూపసాక్షాత్కార జ్ఞానానికి పనికిరాదు. దీనికి ప్రత్యేక శ్రద్ధ కావాలి. భగవంతుడు ఉన్నాడు అని ఆస్తిక్యబుద్ధి ఉండాలి. ఆ భగవంతునిపట్ల భక్తి, ఐక్యతాసిద్ధిని పొందేలా యోగం పొందాలి. ఆ యోగస్థితి నుంచి, భగవదైక్య స్థితినుంచి ఆ ఈశ్వరానుగ్రహం కావాలి. ఆ వరుస చెబుతున్నారు ఇక్కడ. ఇందులో ఏది లోపించినా కాని, ఆ పరమార్థము మనకు అనుభవములోకి రాదు, అసంభవము.

మరి ఆసన ప్రాణాయామాలు అంటే ఏమిటి? ఆసనం అంటే యోగంలో కూర్చోవడమే ఆసనము. ధ్యాన సమాధికి మధ్యలో, కొన్ని ఇబ్బందులతో, కొంచెం అటు, ఇటు కదిలితే, అది ఫలితాన్ని ఇవ్వదు. నీవు కూర్చున్నటువంటి సుఖాసనంలో ఇబ్బంది కలుగకుండా ఉంటే, నీ ధ్యానానికి ఆటంకము లేకుండా ఉంటుంది. మరి యమనియమాలు పాటించినప్పటికీ, అదేదో కర్మకాండగా పాటించాడే తప్ప, చిత్తశుద్ధి కలుగలేదు. చిత్తశుద్ధి కలిగేదాకా మనసు పనిచేస్తూనే ఉంటుంది. ఈ మనసు పనిచేస్తుంటే ధ్యానం కుదరదు.

మనస్సుకు, ప్రాణానికి అవినాభావ సంబంధం ఉంది. ప్రాణచలనం నిదానంగా ఉంటే, మనస్సు నిదానంగా ఉంటుంది. ప్రాణచలనం వేగంగా ఉంటే, ఉచ్ఛ్వాస, నిశ్వాసలు వేగంగా ఉండి, మనసు కూడా వేగంగా పరిగెడుతుంది. పూరక రేచకాలలో నిదానాన్ని గనుక పాటిస్తే, మనసు విషయాలజోలికి వెళ్ళడం అనేది తగ్గుతుంది. దాని యొక్క చరమాంకంలో, ప్రాణాయామం యొక్క చరమాంకంలో, కేవల కుంభక యోగం కనుక లభిస్తే, మనస్సు అమనస్కమైపోతుంది. మనస్సు అమనస్కమైపోతే, నీ స్వరూప చైతన్యము, నీ స్వానుభవానికి రావడానికి ఏ ఆటంకమూ లేదు. దాని కోసం చేసే ప్రయత్నం అది. ప్రాణాయామము వల్ల మనసు కంట్రోల్‌లోకి వస్తుంది. అయినా నీ శరీర ప్రారబ్ధం, నీ మనస్సుని రాబోయే కర్మానుభవానికి, చేయబోయే పనులకు, అనుగుణంగా ఒక ఆలోచన తీసుకువచ్చి పెడుతూ ఉంటుంది. తాత్కాలికంగా ధ్యానంలో కూర్చొన్నప్పుడు పక్కకు నెట్టేస్తే వాయిదా పడుతుంది కాని, ఎప్పటికైనా అది వచ్చేదే. అయితే ముందు ఆ సమాధి స్థితి అభ్యాసం ద్వారా ఇది ఇట్టిదని తెలుసుకోవడానికి మాత్రం, తాత్కాలికంగా మనసును అవతలకి పంపడానికి, ఈ ప్రాణాయామం తోడ్పడుతుంది.

దీని తరువాత ఏం కావాలి? ప్రత్యాహారం. బహిర్ముఖమైనటువంటి విషయాలను ఆహార్యంగా అనుభవానికి, భోగానికి తీసుకోకుండా, దానికి ప్రతిగా అంతర్ముఖమై, తాబేలు ఎలా అయితే తన అవయవాలను, మెడను, తలను శతృవులు వచ్చినప్పుడు లోపలికి ముడుచుకుని, ప్రమాదం లేకుండా ఉంటుందో, అలాగే నీ ఇంద్రియ వ్యాపారాన్ని, నీ భోగాన్ని వైరాగ్యంచేత, తాత్కాలికంగా అయినాసరే, బహిర్ముఖంగా ఉపయోగించకుండా ఉండే స్థితిలో పెట్టేందుకు లోపలకు ముడుచుకోవాలి. ఇది ప్రత్యాహారం.

యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము ఈ ఐదు బహిరంగ సాధనలు. ఈ ఐదు బాగా ఉంటే, అప్పుడు ధ్యానం మొదలు పెట్టాలి. ఈ లోపే మొదలుపెడతాం, పడుతూ లేస్తూ ఉంటాం. కానీ, నిజమైన ధ్యానం ఈ అయిదింటి తరువాత వస్తుంది.

మరలా ఆ ధ్యానం ఎలా ఉంటుంది? స్వరూపం మీద చేసే ధ్యానముగా ఉండాలి. సోహం ధ్యానం ఉంది, నేను ఇది అయి ఉండాలి అని ఉంది. ఓం నమః శివాయ మంత్రం తోటి, ఓం అనేదాని మీద ఉంది. గురువు ఇచ్చిన మంత్రం మీద ఉంది. ఒక దీపం మీద ఉంది. ఆ జ్యోతి దర్శనం మీద ఉన్నది. ఒక చుక్కమీద ఉన్నది. దర్పణము మీద ఉన్నది. ధ్యాన వస్తువు అయితే ఉంది మొత్తం మీద. ధ్యాన వస్తువు మీద ఏకాగ్రత పొంది, ఇతర విషయాలు రాకుండా చూసుకున్నప్పుడు, మనస్సు నీ అదుపులోకి వస్తుంది. పరబ్రహ్మ జ్ఞానం తరువాత సంగతి. ఒక ధ్యాన వస్తువు, గురువుచే నిర్ణయించబడిన దాని మీద, ఏకాగ్రత నిలవడము ధ్యానము. ఈ ఏకాగ్రత నిలుస్తుందా? కాసేపు నిలిచి, కాసేపు పోతుంది. ఎంత సేపు నిలించిందో అంత వరకూ అది ధారణ. నిలవనప్పుడు మళ్ళీ కూడదీసుకుని, మరలా నిలబడుతాము. మళ్ళీ కొంతసేపు నిలబడితే, అది ధారణ. అంటే ధారణ ముక్కలు, ముక్కలుగా ఉంటుంది. అనేక ధారణల మధ్యకాలంలో మనస్సు మరలా పనిచేస్తూ ఉంటుంది. మళ్ళీ దానిని దారం కట్టి విషయం మీద నుంచి వెనక్కి తీసుకువచ్చి, ఎగిరే పక్షిని దాని కాలికి దారం కట్టి, మళ్ళీ క్రిందకు, నీ వద్దకు తెచ్చినట్లుగా తేవాలి. దారం లూజ్ అయితే, పక్షి మళ్ళీ పైకి వెళ్ళి పోతూ ఉంటుందని, మరలా దారంతో కిందికి లాగినట్లుగా ధ్యానాభ్యాసం కొనసాగుతుంది. ధారణ ఎక్కువ సేపు ఉంటే, పక్షి ఎగర కుండా ఉంటే, అది నిజమైన ధారణ. ముక్కలు, ముక్కల ధారణ ముక్కలు కాకుండా ఉంటే ఎక్కువ సేపు ఆ ధ్యాన వస్తువు మీద ఏకాగ్రత అలాగే ఉంటే అది ధారణ.

ధ్యాన, ధారణలు రెండూ అయిపోయాక, ధ్యానవస్తువు కూడా అక్కడ ఆగిపోవాలి. శ్వాస మీద ధ్యాస అనుకోండి. శ్వాస మీద ధ్యాస కూడా ఆగిపోతుంది. దానంతట అదే ఆగిపోతుంది. దానంతట అది ఎప్పుడు ఆగిందో, అప్పుడు సమాధి స్థితి వస్తుంది. ఆ సమాధి స్థితిలో మనసు పనిచేయదు. కానీ, కొన్ని సూక్ష్మ ప్రపంచ వాసనలు నీలో ఉండి, ఆ సూక్ష్మానుభవాలు, శక్తులు, అష్టసిద్ధులు లాంటివి, గతజన్మలు నీవీ, ఇతరులవి అన్నీ కూడా, భూత భవిష్యత్ వర్తమానాలు తెలియబడడం లాంటివి అన్నీ వస్తాయి. ఈ సిద్ధులు కూడా భ్రమే, భ్రాంతే. స్థూల ప్రపంచము ఎట్లా మిథ్యో, సూక్ష్మ ప్రపంచము కూడా అట్లాగే

మిథ్య. వాటిని పట్టించుకోకుండా, ఆ సిద్ధులు వినియోగించకుండా, అహంకరించకుండా ఇది కూడా కాదుగా, ఇది కూడా కాదుగా అనేటటువంటి నిర్ణయంతో కూడిన బుద్ధిని, నిరంతరం మీరు అట్టిపెట్టుకుంటే, ఆ సంకల్పం ఆగిపోయి, నిర్వికల్పం లోకి వెళ్తారు.

నిర్వికల్పంలోకి వెళ్తే, నీవు లేకుండా పోయావు తప్ప, అన్నీ లేకపోతే బ్రహ్మచైతన్యము ఏదో, అది నీకు అందుబాటులో ఉన్నప్పుడు గుర్తించాలి అంటే గురుకృప కావాలి. ఈ పద్ధతి అంతా అక్కడ ఉన్నది.

వాటి హద్దులు ఎక్కడి దాకా ఉంటాయి అనేది మనం తెలుసుకోవాలి. ఈ హద్దులు అన్నీ కూడా అజ్ఞానంలోనే, మాయావరణంలోనే జరుగుతుంది అని తెలుసుకోవాలి. ఈ అజ్ఞానాన్నే కొంచెం కొంచెం గాడాంధకారాన్ని, తక్కువ అంధకారంగా, తక్కువ చీకటిగా, వెలుగు చీకట్ల కలయికగా, మార్చుకుంటున్నాము. పూర్తి వెలుగు వస్తే, అసలు చీకటే ఉండదు. పూర్తి వెలుగే జ్ఞానము. జ్ఞానానికి ఒక లక్ష్యాన్ని పెట్టుకుని, పూర్తి వెలుగుగా ఉండడానికి అజ్ఞానాన్ని తగ్గించుకోవాడానికి, అంధకారాన్ని తగ్గించుకోవడానికి, ఎంత తగ్గింది? ఎంత తగ్గలేదో? అనేది సాధన యొక్క ఫలితాల మీద ఆధారపడి ఉన్నప్పటికి, అజ్ఞానం ఉంటూనే ఉంది. పూర్తి అజ్ఞానం పోతే, నీవు అదే అయివున్నావు.

ఈ విధముగా బాహ్యముగా ఉన్న, జీవజగత్తులను విచారించినచో, మానవుడు జీవుడు – వీళ్ళు ప్రస్తుతం ఏరకంగా ఉండి, ఆకలి నిద్ర భయం మైథునాదులతో సంసార సంబంధం పెట్టుకుని, మళ్ళీ తిరిగి, అన్ని జన్మలలో అదేగా ఉంటూ, చస్తూ, పుడుతూ ఉన్నారో, అది మనం విచారణ చేయాలి. ఎందుకంటే, జంతువుకు లేనటువంటి వివేకము, విచక్షణ, విచారణ అనేటటువంటిది, దానికి అనుగుణమైనటువంటి బుద్ధి మానవుడికి ఉంది.

మానవుడు బుద్ధి జీవి. ఆ బుద్ధిలోనే శ్రద్ధ, భక్తి కలిగే అవకాశాలు ఉన్నాయి. జంతువులకు శ్రద్ధ, భక్తి కలిగే అవకాశాలు లేవు. వాటి బుద్ధి కొన్నిటికే పరిమితము. కాని మానవుడు ఆ బుద్ధిని చచ్చి పుట్టడానికి, ఆకలి నిద్ర భయం మైథునం వంటివి, పశుతుల్యంగా అనుభవించడానికే కాకుండా అంతకంటే ఉన్నతమైనదేదో ఉన్నదని, దానికోసం ఉపయోగించాలి. ఆ ఉపయోగించే బుద్ధి ఉంది కాబట్టే, దానికి ఆధ్యాత్మిక దృష్టి, శ్రద్ధ, భక్తి, ఈశ్వరానుగ్రహం కోసం ప్రయత్నం చేసి, సాధన చతుష్టయ సంపత్తిని పూర్తి చేసుకుని, అష్టాంగ యోగం పూర్తి చేసుకుని, జనన మరణ రాహిత్యం కూడా చేసుకునే అవకాశం మానవుడికి ఉంది.

దాని కోసం ఈ జీవుడేమిటి? ఈ జన్మలేమిటి? ఈ జగత్తేమిటి? ఏది నిత్యము? ఏది అనిత్యము? చిన్న విషయాలకే కొంతమంది ఎందుకింత బాధపడుతున్నారు. కొందరు ఎంత పెద్ద విషయం వచ్చినప్పటికీ కూడా నిబ్బరంగాను, ధైర్యంగాను, శాంతంగాను ఎదుర్కొంటూ ఉంటున్నారు, ఇది ప్రయత్నించితే వచ్చేదా? నాలో ఉన్నదా? నీలోనే ఒక స్వభావంగా ఉంటే నీవు నిశ్చింతగా ఉండగలవా? బయటవి నిన్ను చెదరగొడుతున్నాయా? చెదిరే పద్ధతిలో నీవున్నావా? అనేవన్నీ విచారణ చేసుకోవచ్చు. చేస్తే ఏం తేలింది? ఈ లేని ప్రపంచము మన అజ్ఞానం వలన ఉన్నదనుకొని, యద్భావం తద్భవతి అని తెలుసుకున్నాముగా! కనుక దానిని బట్టి ఒక వాసన ప్రకారముగా ఇవి ఉన్నాయని, ఏ వాసనా లేనివాడికి ఏదీ లేదని తేలింది. ఇదంతా అజ్ఞానము వలనే ఉంది, నిజమనుకుంటేనే వాసనలు ఏర్పడుతున్నాయి.

మిథ్య అంటే అబద్ధమైనదానిని నీవు ఎందుకు ఆశిస్తావు? అది అబద్ధము అని ఎలా నిర్ణయం అయ్యిందో, ఆ వస్తువు మీద నీకు జ్ఞాపకం, అవసరం, ఉపయోగించుకోవడం, ఉపయోగించుకోకపోవడం, దాని మీద ఆసక్తి, ఇవన్నీ కూడా అబద్ధమే. మిథ్యావస్తువుపై భ్రమ అంటే, అది కూడా మిథ్య అనేటటువంటిది. కావున ఇంతటి భ్రమ నీకు 'నేను' అనుకొనుట, 'నేను' అనుకొనకపోవుటలో కూడా సాధికారత ఉన్నది. ఇక్కడ తమాషా చెప్పాను కదా! నేను ఏదైతే మిథ్య అనుకున్నానో, అజ్ఞానంలో అనుకున్నవన్నీ ఎక్కువగా ఉన్నాయి. జననమరణములు ఉన్నాయని అనుకుంటే ఉన్నాయి. నా ఖర్మ నా ఖర్మ అనుకుంటే, కర్మ ఉన్నది. అట్లా అననటువంటి ఆత్మజ్ఞానికి, నిర్ణయంగా ఏమీ లేవన్నవాడికి ఏమీ లేవు. అనుకొనడం వలనే ఉంది ప్రతీది. అనుకొనకపోవడం వలన లేకుండా పోయింది. కొన్ని ఇలా కావాలి అని అనుకోవడం వల్ల, ఆ కర్మ ఇలా వచ్చి, అలా వెళ్తుంది. ఇలా కావాలి అని లేకపోతే, ఎప్పుడూ అనుకోకపోతే, ఆ వాసనే లేకపోతే, అవి రావు. కొందరికి కొన్ని వచ్చి, కొన్ని రావడం లేదు. అందరికీ అన్నీ రావడం లేదు. వారి వారి సంస్కారాల బట్టి, వాసనలను బట్టి, భావాలను బట్టి, ఉన్నదనుకున్నదానికి అనుకున్నంత వరకూ వస్తుంది. ఎతవరకు అనుకోనివాడికి అంతవరకే రావు. పూర్తిగా ఏమీ లేవు అనుకున్నవాడికి ఏమీ రావు.

ఒకరికి ఈ ప్రపంచం విషయం. ఒకరికి ఈ ప్రపంచం కూపస్థ మండూకం. ఎవరెట్లా ప్రవర్తిస్తున్నారో, అట్లా ఆ ప్రపంచ వాసననిబట్టి, అతనికి జీవితం, వ్యవహారం ఉంటుంది. అతనికి ఆ రకంగా పెద్ద సంసారం ఉంటుంది. దానివల్ల బాధ్యతలు, బంధాలు ఉంటాయి. దానిని విడిచిపెట్టలేకపోతే పునర్జన్మలు. యద్భావం తద్భవతి. అనుకొనుట, అనుకొనక పోవుట మీద సర్వమూ ఆధారపడి ఉంది. ఇది చాలా చిత్రంగా లేదూ?

రజ్జుసర్పభ్రాంతి లాగా సృష్టి కలదు అనుకొనుట వలన కలిగి, లేదు అనుకొనుట వలన నశించగలదని, విచారణతో నిర్వచించగలము. దీనిని లోతుగా విచారించాల్సిన అవసరం ఉన్నది. జీవ జగత్తులు, ఒక్కచోట అసత్యముగా ఋజువగుచున్నది. జీవజగత్తులు, ఆత్మానుభవము పరమాత్మానుభవం ఉన్నచోట అసత్యంగా ఋజువగుచున్నది. అజ్ఞానంలో ఏమో జీవుడూ ఉన్నాడు, జగత్తూ ఉంది. కర్మలు ఉన్నాయి, పునర్జన్మలూ ఉన్నాయి. ఆత్మానుభవం ఉన్నవాడికి, పరమాత్మానుభవం ఉన్నవాడికి, పరమాత్మగా అద్వయంగా, అనన్యముగా తాను తానైనటువంటి సాక్షాత్కార జ్ఞానం తప్ప, ఇంకేదీ లేదు. జీవుడు లేదు, జగత్తు లేదు.

చీకట్లో కనిపించిన త్రాటిని అజ్ఞానం వలన, పాముగా భ్రమించినచో, అచ్చోట పాము కల్పించబడింది. కారణాంతరమున యదార్థము గోచరించగా, అనగా అనుమాన ప్రమాణము చేత విచారించగా, పాము మిథ్య అని తేలింది. అదే స్వస్వరూప జ్ఞానముగా చూస్తే, ఆ త్రాడే నీవై యున్నావు. ఆ బ్రహ్మమే నీవైయున్నావు. అనేది అనుభవానికి వచ్చి, ఆ బ్రహ్మ నేనై ఉన్నాననే స్వానుభవంలో, బ్రహ్మము అద్వయం కనుక నీ అనుభవం కూడా అద్వయమే. అద్వయానుభవము నందు అన్యము తోచదు, ఆ రకంగా జీవుడు, జగత్తు కనబడవు. జీవుని యొక్క ఉపాధులు కనబడవు. జీవుడు కేవల జీవుడుగా, కేవల చైతన్యంగా, పరమాత్మగా, అపరోక్షంగా, స్వప్రకాశంగా, స్వానుభవంగా, ఉన్నదున్నట్లు ఉండిపోతాడు. ఇక అతనికి కదలికే లేదక్కడ. అతనికి ఎట్టి ఇబ్బందీ లేదు. దాన్నుంచీ అటూ ఇటూ కదిలే పనే లేదు. ఇబ్బంది ఉంటే కదులుతాడు, ఇబ్బంది లేదు కాబట్టి, దానికి పరిపూర్ణం అని పేరు. కదలాల్సిన అవసరం లేనిది పరిపూర్ణము.

అందుచే అనుకొనుటలో సృజింపులు, వినాశములు జరుగుచున్నవి. అనుకోవడంలోనే పుట్టడం, చావడం జరుగుతుంది. సిద్ధాంతము, దృష్టాంతము మూలమున, కొంతవరకు సుబోధకమగును. ఈ సిద్ధాంతము కొన్ని ఉదాహరణలు చెబితేనే గానీ, మీకు లోపలికి ఎక్కదు. కావున ఈ ప్రపంచమంతయూ మనోవికార జాతమే. మనస్సు యొక్క వికారముల చేతనే, ఈ ప్రపంచం అంతా కూడా, ఈ మాదిరిగా కనబడుతూ ఉంది. ఎన్ని అవాంతర భేదములున్ననూ సూక్ష్మముగా విచారించినచో, తట్టుకోలేని శరీరబాధ, తల నొప్పి వచ్చినా, నేనీబాధతో బ్రతకలేను, చచ్చిపోవాలి అనుకుంటున్నప్పటికీ, అంతకు ముందు నీ విచారణ జ్ఞానం ఏదైతే ఉన్నదో, దానిని అక్కడ పెట్టాలి. నొప్పి లేదు అనడం లేదు. కాని నొప్పిని కలిగించే శరీరము లేదు. ఈ భ్రాంతిలో తోచిన శరీరము, భ్రాంతి రూపంగా అజ్ఞానిగా ఉన్నవాడికి, నొప్పి రూపంలో ఉండి, బాధ పెడుతోంది అనే అనుకోవాలి తప్ప, ఈ శరీరము నిజము, ఈ జగత్తు నిజము, ఈ నొప్పులు నిజమని, విచారించినవాడు అనుకోకూడదు.

అన్నియూ తలంపులే కదా! అన్నీ వాసనలే కదా! వాసనల వల్లనే కదా, క్రియారూపంలో, నామ రూపాలు తోస్తున్నాయి. విషయీకరించుకంటేనే అనుభవాలు వస్తున్నాయి. అనుభవానికి సంబంధించి, నీ సూక్ష్మ శరీరంలో వృత్తులు వస్తున్నాయి. వృత్తుల వల్ల జ్ఞానము. వాసన ప్రకారం వృత్తులు. వృత్తుల ప్రకారం విషయాలు వచ్చిపోతున్నాయి. ఏ వాసన లేనివాడికి చిత్త వృత్తి లేదు. చిత్తవృత్తి లేకపోతే ప్రపంచము లేదు. కనుక ఈ ప్రపంచము అంతా కూడా నామ రూప వృత్తి నటనా విశేషములే! నామ రూప వృత్తి నటనా విశేషములే ఈ ప్రపంచం. ఇట్టి తలంపులు స్వతంత్రముగా పుట్టుచున్నవా అనిన? మళ్ళీ తలచుకుంటే వస్తోంది. తలచకపోతే లేదు. అంటే అసలు తలపులు ఎక్కడి నుంచి వస్తున్నాయి? చిత్తవృత్తులు ఎక్కడి నుంచి వస్తున్నాయి? అజ్ఞానం చేత, కొన్ని జ్ఞాపకాలని వాసనలని, ఈ భోగానికి పనికొచ్చేది, ఈ భోగానికి పనికొచ్చేదానికి అడ్డుగా నిలిచేది, అడ్డుగా నిలిచేది రాకూడదని, పనికొచ్చేది రావాలని రెండు రకాల భావాలున్నాయి. కాబట్టి, రావాలి, రాకూడదు అనే ఈ రెండూ వాసనారూపంలో ఉన్నాయి కాబట్టి, ఆ రెంటికి సంబంధించిన ఆలోచనలు, చిత్త వృత్తులు నీకు వస్తున్నాయి. ఆలోచనే లేకపోతే, పూర్వజన్మలలో అటువంటి ఆలోచనే లేకపోతే, దానికి సంబంధించిన వాసనే లేకపోతే, నీకు ఇప్పుడిక చిత్తవృత్తే రాదుగా! అలాగైతే జన్మించేవాడవే కాదు కదా!

ఈ చిత్తవృత్తులు ఎలా వస్తున్నాయి?పూర్వజన్మ సంస్కారముల చేత, ఈ శరీర ప్రారబ్ధాన్నిబట్టి, ఏ కాలానికి, ఏ కర్మానుభవం రావాలో, ఆ కర్మకు అనుగుణమైనటువంటి చిత్తవృత్తి, మనసులో ఆలోచన, బుద్ధిలో నిర్ణయము కలుగుతుంది. అందుకని **బుద్ధి కర్మానుసారిణి** అన్నారు. అనురాగముచేత, కర్మఫల ప్రేరణ చేత ఆచరించిన పనులను, చక్రభ్రమణముగా అనుసరించి, తలపులు పుట్టుచున్నవి. జన్మ-కర్మ అనే చక్రంలో, కర్మ చేసినటువంటి ఫలితం, వాసన రూపంలో ఉంది. వాసన ఫలితానికి మళ్ళీ జన్మవస్తోంది. మళ్ళీ చిత్తవృత్తులు వస్తున్నాయి. ఇప్పుడు మనం ఏదో ఒక స్థానంలో ఈ చక్రభ్రమణంలో ఉన్నాము. ఆ రంగుల రాట్నం వంటి చక్రం నుంచి ప్రక్కకు దిగితే, ఆ రంగుల రాట్నంతో నీకు సంబంధం లేదు. నీవు సర్వ సాక్షివి అవుతావు. అది ఒక్క నీ స్వరూప జ్ఞానం చేతనే జరుగుతుంది. ఆ జనన మరణ చక్రం అనే రంగుల రాట్నం నుంచి, నీవు వేరు అయిపోతావు. ఈ రంగుల రాట్నంలో గిరగిరా తిరగడమే భవము, జనన మరణ చక్రము. అది అలా తిరగుతూనే ఉంటుంది. అందుకే వాసనాక్షయ అభ్యాసము చేస్తే, ఆ భవ సాగరాన్ని, ఆ భవము అనే చక్ర భ్రమణాన్ని నీవు దాట గలగుతావు. దాని నుండి విడివడగలుగుతావు.

తలంపులు ఎందుకు పుడుతున్నాయో తెలిసింది. జగత్తు సత్యము అనే భావముచేత, అజ్ఞానముచేత, నిత్య సుఖ స్వరూపమైన తాను, బ్రహ్మమే అయినప్పటికి, అజ్ఞానముచేత, అనిత్య సుఖ స్వరూపమును మరచి, తనకు నిరంతర సుఖ శాంతులు లోపించాయనే అజ్ఞానంచేత, ఆ సుఖశాంతులు మళ్ళీ కావాలి అని, ఆనందమయ కోశంలో ఉంటూ, ప్రియం మోదం ప్రమోదం కోసం ప్రయత్నం చేస్తూ, వాటికి అడ్డుగా ఉండేవాటి విషయంలో ఉన్నవాటి పట్ల జాగ్రత్తపడుతూ, తదనుగుణమైన కర్మ చేస్తూ, తలపులలో, మాటలలో, చేతలలో కర్మచేస్తూ, స్వార్థంతో ఇతరులను బాధిస్తూ, పుణ్యపాపములను చేయుచూ, వాటి ఫలితములను మళ్ళీ వాసనలుగా చేసుకుని, ఆ వాసనలలో ఉన్నవన్నీ కూడా ఆ పరాశక్తి యొక్క ప్రేరణ చేత, నీకు అనుభవానికి రావల్సిన అవసరము ఉన్నది. కనుక ఆ అవసరార్థము పనిముట్టు అయినటువంటి, ఈ స్థూలశరీరము వస్తున్నది. ఇంద్రియములకు గోళకములు, స్థానములు కలిగినటువంటి ఈ స్థూల శరీరము వస్తున్నది. ఈ జనన మరణములు వ్యష్టిగా ఎవరికి వారుగా ఎవరైతే ఉన్నారో, ఆ గుర్తుతో ఉన్న శరీరమే లింగ శరీరము. ఆ లింగ శరీరమే ఈ గోళకము నందు చేరి, ఆ జీవునియొక్క ప్రారబ్ధ కర్మని, బుద్ధి కర్మానుసారిణి అనే పద్ధతిలో అనుభవానికి తీసుకువస్తూ ఉంది, ప్రతీరోజు, ప్రతీక్షణము, ప్రతీ జన్మలో.

జగత్తు సత్యము అనే భావన చేతనే, అజ్ఞానము చేతనే, నిత్య సుఖ స్వరూపుడై ఉన్నటువంటి, బ్రహ్మమే నీవైయుండి కూడా, ఆ బ్రహ్మజ్ఞానమును మరచి, అజ్ఞాన కారణముగా, ఆవరణ విక్షేప కారణముగా, అవిద్యా దోషం చేత, నిరంతర సుఖ శాంతుల కోసము, ప్రియం మోదం ప్రమోదం అని, నీ ఆనందమయ కోశంలో ప్రేరణ కలుగుతూ ఉంటే, విజ్ఞానమయ కోశంలో దానికోసమే చేసే ప్రయత్నమే తప్ప, బుద్ధి కర్మాణుసారిణిలాగా ప్రవర్తిస్తుంటే, పునర్జన్మలకు వెళ్తున్నాము. విచారణా జ్ఞానముతో వివేకముతో, శ్రద్ధతో, బ్రహ్మ స్వరూప నిర్ణయము చేసి, కడదేరాలి.

**అహంకారము – ఆత్మ**

వేదాంతము ఏ సంప్రదాయకమునకును, ఏ తెగకును, ఏ జాతికిని, ఏ లింగమునకును చెందినది కాదు. అందుకే అక్కడ పురుషుడు అనే శబ్దాన్ని వాడారు, వివేక చూడామణిలో కాని, ఉపనిషత్తులలో కాని, ఎక్కడికక్కడ కులం అనే పదము లేదు, వర్ణము అన్నారు. వర్ణము అంటే మనం కులం క్రింద పెట్టాము. కొన్ని వృత్తుల వల్ల కులవృత్తులు అంటారు వాటిని. నేత పని చేసేవారిది ఒక కులం, కుండలు చేసేవారిది ఒక కులం, క్షవరం చేసేవారిది ఒక కులం, బట్టలు ఉతికేవారిది ఒక కులం. ఇలా వృత్తుల చేత వచ్చాయి కానీ, భగవంతుని చేత నాలుగే నాలుగు వర్ణాలు సృజించబడ్డాయి. అవి కులాలు కాదు, వర్ణములు. మరలా ఆ వర్ణములు నా చేత కల్పించబడ్డాయి అని శ్రీకృష్ణ పరమాత్మ చెబుతూ, ఎలా కల్పించబడ్డాయో కూడా చెప్పాడు. గుణ, కర్మ, స్వభావాన్ని బట్టి అన్నాడు. దీన్ని బట్టి ఏమైంది? ఎప్పుడూ దుఃఖపడుతూ, ఎప్పుడూ అజ్ఞానంలో ఉండి, ఎప్పుడూ వేదన పడుతూ, ఏ సాధన చేయకుండా, ఎవరు చెప్పిన మాటలూ వినకుండా ఉండేవానిని శూద్రః అన్నారు. వాళ్ళకు ఒక్కళ్ళకే బ్రహ్మవిద్యాధికారం లేదు.

పుట్టుకతో శూద్రులు కాదు. ఎప్పుడూ నిత్య దుఃఖితుడై, ఆ దుఃఖ నివారణార్థం, ఎవరు ఏం చెప్పినా వినకుండా, తమో గుణంతో తన కష్టాలను తానే తెచ్చుకునేటటువంటి స్వభావము, ఎవరికైతే ఉందో వారు శూద్రులు. ఆ స్వభావాన్ని అతను మార్చుకుని, శమదమాదులు పాటిస్తే ఆధ్యాత్మిక దృష్టి, శ్రద్ధ, భక్తి ఉంటే అతడు శూద్రుడు కాదు యోగ్యుడే.

అందువలన ఈ వేదాంతము, ఈ బ్రహ్మజ్ఞానము, ఈ సాధన ప్రతీ మానవుడికి, చేసుకోగలిగితే ప్రతీ జంతువుకీ లభిస్తుంది. గజేంద్ర మోక్షంలో లాగా ఏనుగుకు కూడా మోక్షం వస్తుంది చేసుకోగలిగితే. మానవ జన్మకు వచ్చి, మరలా వెనక్కు వెళ్ళిన జంతువుకి మోక్షం వస్తుంది. పరిణామంలో ఇంకా మానవుడు కాని జంతువుకు మోక్షం రాదు. ఎందుకంటే విచక్షణ, విచారణ, వివేకము, సాధన, అష్టాంగయోగము, సమాధి, సమాధిలో ఉన్నటువంటి తన చైతన్యాన్ని గ్రహించగలిగినటువంటి ఈ పరిణామ సిద్ధాంతం ద్వారా వచ్చిన చైతన్య వికాసము ఆ జంతువు స్థాయికి పూర్తికాలేదు. అది సరిపోదు. మానవ దేహం వచ్చాకే, ఆ చైతన్యవికాసం పూర్తి అయ్యింది. బుద్ధి జీవి అయ్యాడు. ఆ బుద్ధిలో వివేకము, విచారణ, విచక్షణ అన్నీ ఉన్నాయి. దాన్ని వినియోగించుకోకుండా మూర్ఖంగా ఉండే మానవులున్నారు. కేవలము ఆహారము, నిద్ర, భయ, మైథునములతోనే వెళ్ళబుచ్చుకుని పుడుతూ, చస్తూ ఉండే మానవులున్నారు. భోగిస్తూ వ్యసనపరులైనవారున్నారు. కష్టపడి సంపాదించి, తాను అనుభవించక, దాన ధర్మాలు చేయక కూడబెట్టి, వారసులనేవారికి వదిలిపోయేటటువంటి లోభులు ఉన్నారు. చివరకు అవి ఎవరికి చెందుతాయో, ఏమైపోయాయో కూడా ఎవరికీ తెలియని స్థితిలో కష్టపడుతున్నారు. ఇలాగే జరిగిపోతూ ఉంది.

మానవుడు బుద్ధి జీవిగా ఎప్పుడైతే ఏర్పడ్డాడో, అది ఈ రకంగా చక్రభ్రమణంగా చస్తూ పుట్టడానికి కాదు. దీని యొక్క ఉద్దేశ్యము వేరే ఉన్నది. ఈ చైతన్య వికాసాన్ని పరమశాంతిగా, పరమ ఆనందముగా, నిత్యానందముగా, సహజానందముగా మార్చుకునే అవసరానికి వినియోగించాలి. అది బాహ్య ప్రపంచంలో లేదని తెలిసిపోయింది. అంతర్ముఖంలో నీ స్వరూప జ్ఞానం ద్వారా వస్తుందని తెలిసింది. ఇలా అటునుండి ఇటు త్రిప్పుకోవడమే ఆధ్యాత్మిక దృష్టి. ఆ దృష్టితో శ్రద్ధ కలిగి, భక్తితో సాధన చేయాలి. ఇది అందరికీ సమానము.

నవద్వార పురమైనటువంటి ఈ శరీరమునకే లింగ భేదము కానీ, ఈ పురమందు నివశించే పురుషుడు అని పిలువబడేటటువంటి వానికి, జాతి కులము, మతము, స్త్రీ పురుష భేదము ఏవీ లేవు. అందరూ యోగ్యులే. చేసుకోవటం చేతైతే, అందరికీ ఆ సాధన చేసి, గమ్యం చేరడానికి ఏ అభ్యంతరమూ లేదు. అభ్యంతరం చెప్పారు అనేది పాత రోజుల్లో. మళయాళ స్వామిగాని, ఇంకొకరు గానీ, అన్నీ ఖండిస్తూనే ఉన్నారు. వివక్ష లేదని, ప్రమాణం కూడా చూపిస్తున్నారు.

వేదాంతమనగా జ్ఞానము, ఆత్మజ్ఞానము, తనను తాను తెలుసుకొనుట అనెడి తత్త్వజ్ఞానము. ప్రపంచ జ్ఞానము కాదు. శాస్త్రజ్ఞులు చాలా వస్తువులు కనిపెట్టినట్టి జ్ఞానము కాదు. చాలా లోతైనటువంటి పదార్థ తత్త్వమును తెలుసుకున్నట్టి వారు కూడా, బాహ్యప్రపంచంలో జ్ఞానులు అనబడుతున్నారు. కాని ఏది తెలుసుకున్నవాడు, అతడు దానియొక్క వేత్త. శాస్త్రము తెలుసుకున్నవాడు శాస్త్రవేత్త. బ్రహ్మమును తెలుసుకున్నవాడు బ్రహ్మవేత్త. కనుక జ్ఞానం అనేది బహిర్ముఖ జ్ఞానం కాకుండా, నేనెవరు అనే దానియొక్క జవాబుద్వారా, ఆ జవాబుకు తగినటువంటిదిగా వచ్చినదే జ్ఞానం. ఊరికే తెలిస్తే పాండిత్యము. అనుభవంగా వస్తే జ్ఞానము. తనను తాను తెలుసుకొనుటలో ఫలించేదే జ్ఞానము. ఇది మానవునికి తప్పని సరి.

ప్రతి మానవుడు చెప్పినమాట వింటాడో, వినడో, శిష్యరికం చేస్తాడో, చేయడో, భక్తి మార్గంలో ఇంకా ఉండి, జ్ఞానమార్గానికి తిరగలేదో, ఎవర్నీ ఏమీ అనదు శాస్త్రము. గురువులు అవతార పురుషుల కూడా అనరు. ఊరికే నిజాన్ని, సత్యాన్ని లాలింపుగా, బుజ్జగింపుగా చెప్పి, అవసరమైతే హెచ్చరిస్తూ, స్వర్గ నరకాలున్నాయని చెబుతూ, పునర్జన్మ సిద్ధాంతాన్ని చెబతూ, ఒక్కొక్కప్పుడు భయపెడుతూ, నిన్ను దారికి తీసకు వచ్చే ప్రయత్నం చేస్తారు తప్ప, బలవంతంగా ఎవరూ సాధన చేయించరు నీ చేత. చేసే వాళ్ళకు మాత్రము సహాయం చేస్తారు. బాహ్యంగా చేస్తారు, ఆంతరంగికంగా చేస్తారు. కారణం ఏమిటంటే, ఈ బుద్ధిని ప్రాపంచిక విషయాలనుండి మరల్చి, ద్వంద్వాతీత స్థితిలో, చంచల బుద్ధిని స్థిరబుద్ధిగా మార్చినప్పుడు ఆ స్థిరబుద్ధి రూపమే ప్రజ్ఞ. విషయములను నిర్ణయించకుండా స్థిరమై, స్థిర రూపంలో ఉండిపోవడమే, అటువంటి బుద్ధిరూపమే ప్రజ్ఞ. ఆ ప్రజ్ఞానమే బ్రహ్మ. ఇది వైరాగ్యం చేత, వివేకం చేత, సాధన చేత, శ్రద్ధ చేత, భక్తి చేత, ఎవరైతే గురువుకి నాలుగు విధముల శుశ్రూషలు చేస్తారో, వీటన్నింటికి వారికి స్వాతంత్ర్యం ఉంది. ఆ స్వాతంత్ర్యాన్ని ఈ రకంగా ఉపయోగించుకుంటే తప్ప, అతనికి ఆత్మజ్ఞానం రాదు. ఒకరు చెబితే రాదు, బలవంతం చేస్తే రాదు. ఈ వివేకాన్ని స్వతంత్రంగా ఆధ్యాత్మిక మార్గంలో ఉపయోగించుకున్నవాడికి తప్పక వస్తుంది.

ఎంత తెలివి ఉన్నా, ఎంత వివేకం ఉన్నా ఆధ్యాత్మిక దృష్టి లేకుండా, ప్రాపంచిక దృష్టితో చూస్తే, ఆ ప్రకృతే అతనికి గుణపాఠం చెబితే, కొట్టబడ్డటువంటి వాడు, ఆత్మహత్యా సదృశమైనటువంటి, నిరాశా నైరాశ్యములతో ఉన్నటువంటి వాడు, అప్పుడు ఎవరో పెద్దలు ఇచ్చిన సలహాను అనుసరించి, ఈ మార్గాన్ని తెలుసుకుందాము అనేదానికి ఉపక్రమిస్తాడు. ఈ ప్రకృతే గుణపాఠం చెప్పి, తన వైపుకు లాక్కుంటుంది ఏమీ ఫర్వాలేదని, అలా సహజంగానే పరిణామం చెంది, సాధన చేసుకోవాలి అని ఉపేక్షించరాదు. ఇవాళ ముస్లింస్‌లో నమాజు చేయాలి ఐదు సార్లు, రంజాను ఉపవాసం చేయాలి, అందర్నీ ప్రేమగా చూడాలి, రంజాను రోజున అందరిని కౌగిలించుకుని, అందరికీ మేలుకలగాలని, అల్లాను ప్రార్థించేవారు, తీవ్రవాదంతో ఎందుకు బలవంతం చేస్తారు? వాళ్ళ ఖురాన్‌లో బ్రహ్మజ్ఞానం లేదు. సూఫీమతంలో ఉంది కానీ, ఖురాన్‌లో బ్రహ్మజ్ఞానం లేదు. దేవుడున్నాడు, దేవుడు ఒక్కడే సర్వోన్నతుడు. వాడిని నమ్మండి, విశ్వసించండి, భక్తితో నమాజు చేయండి, ప్రార్థనలు చేయండి, ధ్యానం చేయండి, మనం కూడా ధ్యానం ఎందుకు చేస్తున్నాము? మనము ప్రార్థనలు చేస్తున్నాము, వాళ్ళు కూడా చేస్తున్నారు. అక్కడికి అది అంతే ఉంది కాని, వస్తు నిర్ణయంగా, మోక్షంగా నీకు అది లభించే అవకాశం ఉందని, ఖురాన్ ఎక్కడా చెప్పలేదు. బైబిల్ మాత్రం చెప్పింది. అందుకే బైబిలుకు వ్యాఖ్యానం వ్రాసాం. బైబిల్‌ను 'క్రీస్తు ఏసుగా ప్రకటితం' అనే గ్రంథ రూపంలో అందించడం జరిగింది. ఖురాన్‌లో ఆ ప్రయత్నం చేద్దామని చూశాం. అదేమీ లేనందున వదిలేశాం. అలా బలవంతంగా వచ్చేది బ్రహ్మజ్ఞానం కాదు. స్వతంత్రంగా తెచ్చుకునేదే బ్రహ్మజ్ఞానం. ఎందుకంటే చివరకు నీవు సర్వ స్వతంత్రమైన బ్రహ్మ స్వరూపమును అందిపుచ్చుకోవాలి.

ఆత్మయే సర్వ స్వతంత్రం. మనస్సే బంధము. మనస్సును అధిగమించాలి అంటే ముందు మనస్సే ఒప్పుకోవాలి. మనస్సు ఒప్పుకోవాలి అంటే, దానికి అనేక తర్కవితర్కాలతోటి, మంచి చెడులతోటి, దీర్ఘకాలికమైన ఆనందం కోసం, తాత్కాలికమైన ఆనందాన్ని వదులుకోవాలి అని చెప్పినప్పుడు మనస్సు వింటుంది. దీర్ఘకాలిక అనందం లేనే లేదు. మోక్షం లేనే లేదు. కేవలం భగవంతుని కృపే ఉంది. ఆయన కాళ్ళు పట్టుకోండి, ధ్యానం చేయండి, నమాజు చేయండి అని, అక్కడితో ఆపితే, మనం అక్కడి వరకే వెళ్ళేది. ప్రాపంచిక సుఖాలనుంచి బయటపడలేనట్లుగా, ప్రాపంచిక సుఖాలకు మరిగినటువంటి మనస్సు, ఒక ప్రక్కనుండి ప్రార్థన చేస్తుంది, ఒక ప్రక్క భక్తి ఉంటుంది. ఒక ప్రక్క దేవుణ్ణి కూడా కోరికలు తీరడానికి అడుగుతుంది. ప్రాపంచికంగానే, లౌకికంగానే, అజ్ఞానంలోనే ఉంటూ జనన మరణ చక్రంలోనే తిరుతుంది అది. బలవంతం చేసినా, ఏమైనా మోక్షం వచ్చిందా? అందుకని ఆ స్వేచ్ఛ మనకు ఉంది. అయితే దానిని బ్రహ్మ జ్ఞాన సముపార్జనకు ఉపయోగించాలి.

కర్మసిద్ధాంతంతో ఆ చక్రభ్రమణంలో ఇరుక్కు పోయినప్పుడు, నీకు ఎక్కడిదీ స్వేచ్ఛ? పసువులకైతే ఆ స్వేచ్ఛ లేదు. కర్మ-వాసన ప్రకారంగా, కర్మ-పునర్జన్మ సిద్ధాంతంగా, పాతకర్మే ప్రారబ్ధంగా వచ్చినప్పుడు, ప్రారబ్ధ కర్మలోనే అజ్ఞానం చేత మళ్ళీ ఆగామి సృష్టించుకుంటూ ఉన్నప్పుడు, ఎందుకు తిరుగుతున్నాను అనే ఒక ఆలోచన లేనప్పుడు వానికి స్వాతంత్ర్యము లేనట్లే. వానిని కర్మే నడుపుతోంది. కానీ, వారి బుద్ధికి స్వాతంత్ర్యం ఉంది. వాసనా క్షయం చేసుకోవచ్చు, వైరాగ్యాన్ని పెంపొందింప జేసుకోవచ్చు. సాధన చేసుకోవచ్చు. వివేకాన్ని ఉపయోగించి, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవచ్చు. ఇన్ని అవకాశాలు మానవుడికి ఉన్నాయి.

కర్మచేత కట్టబడిన వాడైనప్పటికి, కొంత స్వేచ్ఛ ఉంది. ఈ స్వేచ్ఛను మరింత పెంచుకోవాలి. ఏ కర్మ అయితే తనను బంధిస్తుందో, ఆ కర్మనుండి విముక్తికి ప్రయత్నం చేయాలి. ఒక పశువును ఒక కట్టుకొయ్యకు వేసి కడితే, యాభై అడుగుల తాడేసి కట్టామనుకో, యాభై అడుగుల వ్యాసార్థంలో ఉన్నటువంటి ఏరియాలో, అంటే వంద అడుగులు వ్యాసం ఉన్న ఏరియాలో వృత్తాకారంలో అది స్వేచ్ఛగా తిరుగగలుగుతుంది. అక్కడున్న పచ్చగడ్డి మేయగలదు. దాని అవతలకు అది పోలేదు. పూర్తిగా కట్టుకొయ్యను మెడకేసి, తాడుతో కడితే, దానికి స్వేచ్ఛ లేదు.

ఇక్కడ ఆధ్మాత్మిక స్వేచ్ఛ అన్నప్పుడు, పశువుకు లేదు. ఈ పశువుకు కట్టే తాడునే పాశము అంటాము. కట్టబడడము ఈ తాడుచేత కాబట్టి బంధము అంటాము. ఈ బంధాన్ని విడిపించేవాడు, ఆ పశువును ఆడించేవాడు పశుపతి. పశుత్వం ఉన్నవాళ్ళను ఆడిస్తాడు. పశుత్వం నుండి బయటపడే ప్రయత్నం చేస్తే, సహాయం చేస్తాడు పశుపతి. ఆ పశుపతే శివుడు. శివుడే మనకు లక్ష్యము, గమ్యము.

కనుక ఒక్క మాట ఇక్కడ తెలుసుకోవాలి. నీకు స్వతంత్రం ఉంది కదా అని, పొద్దున ఏడుగంటలకు నిద్ర లేవచ్చు ఎవరొద్దన్నారు? ఐదు గంటలకు లేస్తే మంచిది, మూడున్నర గంటలకు లేచి ప్రార్థన చేసుకుంటే మరీ మంచిది. ఏమి చేసినా నీ మంచి కొరకే అని చెప్పాం. **'చెప్పడం నా ధర్మం, వినకపోతే నీ ఖర్మం'** అని కృష్ణ పరమాత్మ చెప్పాడు ఏదో సినిమాలో. 'చెప్పడం నా ధర్మం, వినకపోతే నీ ఖర్మం'. ఇట్లా ఖర్మానికి ఎందుకు వదలాలండీ? ఖర్మానికి వదిలితే ఎట్లా?

సాధనలో చాలామంది ఉన్నారు. చాలామంది సాధనలు చేయిస్తున్నారు. ఆ పరమాత్మ, ఆ గురుతత్వం చేయిస్తోంది. లేకపోతే ఇంతమంది మహాపురుషులు అనేక రకాలైన మార్గాలు, లక్ష్యం దగ్గరకు కొంత దూరము వరకు సాధన చేసేవారు, చేయించేవారు కోకొల్లలుగా ఉన్నారు. అలాగే కోరికలతో అయినప్పటికీ కూడా భగవంతుడి దగ్గరకి వెళ్ళేటటువంటి భక్తులు, దేవాలయాలకి, పుణ్యక్షేత్రాలకు అమర్‌నాథ్ యాత్రకు వెళ్ళి, చనిపోయేవాళ్ళు కూడా చాలామంది ఉన్నారు. వాళ్ళకు ఎంత భక్తో మెచ్చుకోవాల్సిందే. అమర్‌నాథ్ యాత్రలో చనిపోతున్నారు అని తెలిసికూడా మరలా కొత్తబృందం బయలుదేరుతోంది.

ఆ కట్టుకొయ్యకున్న యాభై అడుగుల వ్యాసార్థం ఎలా వుందో, మానవుడు సాధనచేసి, విచారణ చేసి, తనను తాను ఎఱిగేటటువంటి పరమాత్మ తత్త్వాన్ని అనుసంధానం చేయడానికి, దానికి ఆటంకముగా ఉన్నటువంటి మిథ్యాజగత్తును విచారణ చేసి, వైరాగ్యంతో విడిచిపెట్టడానికి ఆ మాత్రం స్వాతంత్ర్యం అతనికి ఉంది. అది సద్వినియోగం చేసుకునే స్వాతంత్ర్యం ఉందని తెలిసి, వినియోగించుకోవాలి. ఎవరు వినియోగించుకుంటారు? గురువాక్యం మీద శ్రద్ధ, భక్తి ఉండి, సాధన చతుష్టయ సంపత్తి ఉండి, తీవ్ర మోక్షేచ్ఛ ఉండి, ఆధ్యాత్మిక దృష్టితో శ్రద్ధ కలిగి, ఈ ప్రపంచంలో అనేక యోగాభ్యాస పద్ధతులను, ఎవరికి ఎలా అనువుగా ఉంటుందో, పూర్వజన్మ సంస్కారం చేత, ఈ సాధనలకు అలవాటు పడి ఉంటారో, దాని ప్రకారం దానిచే ఆకర్షింపబడి, సులభంగా ఆ సాధనలు చేయగలుగుతారో, అటువంటి సాధనలు చేసుకుంటూ, చిట్టచివరికి స్వరూపాన్ని తెలుసుకుని, స్వరూప జ్ఞానంలో నిష్ఠ చెందడానికి, అన్ని రకాల ప్రయత్నాలు మనం చేయాలి. ఆ స్వేచ్ఛ మనకు తప్పకుండా ఉంది. భగవంతుడు మానవుని బుద్ధి జీవిగా పుట్టించి, ఒక పక్క బుద్ధి కర్మానుసారిణి అనేటటువంటి బంధము మనకు పెట్టినప్పటికీ, కొంత స్వేచ్ఛకూడా ఇచ్చాడు. దాన్ని వినియోగంచుకుంటే మనము ముక్తి పొందగలము.

ఈ వేదాంతమనేటువంటిది సర్వ మానవులకు అవసరమే. మానవులకు అవసరమే కాదు తప్పనిసరి. ఇక్కడ ఆప్షన్ లేదు. మానవునకిది తప్పనిసరి. తానేదైయున్నాడో అది తెలుసుకోకుండా, తాను కానివన్నీ తానుగా ఉండటమనేటువంటిది, ఎప్పటికైనా సరే తాను కాని దాన్ని, కానిదిగా నిర్ణయించుకొని, తాను తానైనటువంటి తత్వము తెలుసుకొని, ఆ తత్వరూపుడవ్వాల్సినటువంటి అవసరము ప్రతి ఒక్కరికీ ఉంది. ప్రతి మానవుడికీ ఉంది. ప్రతి మానవునికీ ఉంది అనటంలో అర్థం ఏమిటంటే ఇది ఒక సంప్రదాయానికే ఉంది, ఒక కులానికే ఉంది, ఒక జాతికే ఉంది, స్త్రీలకు లేదు పురుషులకే ఉంది, అనేటటువంటిది ఎప్పుడుకూడా ఈ వేదాలలో గాని, వేద ప్రమాణాలలో గాని లేవు. అపార్థాలు, పెడర్థాలు తీసి చెప్తే అది వేరే సంగతి. బ్రాహ్మణుడు అంటే బ్రహ్మజ్ఞానము ఉన్నవాడని, శూద్రుడు అంటే సంసార దుఃఖానికి, వేదనకు గురవుతూ, దాంట్లోనే పడి కొట్టుకుంటూ ఉండేవాడని అర్థము. అటువంటివాడు కూడా రక్షింపబడాలి. కాని అతను సానుకూలంగా ఉండి, విని, నేర్చుకొనేటువంటి శ్రద్ధతో కూడినటువంటి బుద్ధి అతనికి ఉండకపోతే, గురువు దగ్గర శుశ్రూషలు చేసి నేర్చుకోవాలనేటువంటి వినయము లేకపోతే, అంత అవగాహన చేసుకునే తెలివి లేకపోయినా, గురుభక్తి లేకపోయినా చెప్పడానికి కుదరదు. ఇవన్నీ లేనివాడు ఏ మానవుడైనా సరే శూద్రుడి క్రింద లెక్కే. **శ్రద్ధ, సబూరి** అంటారు. **'శ్రద్ధా వాన్ లభతే జ్ఞానం'** అంటారు. ఇది ప్రతి మానవుడికీ కూడా అవసరమయి ఉన్నది. తప్పనిసరి అయి వున్నది. తదనుగుణంగా సాధనా ప్రయత్నము, ఆచరణ చెయ్యటమనేటువంటిది మానవుని యొక్క ఇష్టాఇష్టాలమీద ఆధారపడి ఉంది. ఆ మాత్రం స్వేచ్ఛ మానవునికి ఇవ్వబడింది.

దీనిని అర్థం చేసుకోకుండా ముసలివారయ్యారనో, ఉద్యోగం నుండి విశ్రాంతి తీసుకున్నాకో, వ్యాపారము ఆపేసాకో దీంట్లో నేను దిగుతానండీ, ఇప్పుడు సమయం లేదు అంటారు. ఎన్నో జన్మలెత్తాము. అన్ని జన్మలలో సమయం కుదరలేదు. ఇంకెప్పుడు కుదురుతుంది? చేసుకున్నవారికి చేసుకున్నంత. ప్రారబ్ధ కర్మ ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. సముద్రంలో అలలు ఉన్నాయి కదా అని, సముద్ర స్నానము మానివేసినట్లుగా కష్టాలు, సమస్యలు ఉన్నాయని వేదాంత బోధ దగ్గరకు రాను అంటే అది మూర్ఖత్వం అవుతుంది.

శృతులు అంటే శ్రోత్రేంద్రియము ద్వారా, శబ్ద ప్రమాణముగా వినబడిన వాటిని శృతులు అంటారు. ఆ వినబడినవన్నీ కూడా విద్ అంటారు. 'విద్' నుండి వచ్చినది వేదము. కనుక తెలియబడేటువంటివన్నీ కూడా వేదాలు. ఏం తెలుసుకోవాలి? ఏది తెలుసుకుంటే సర్వమూ తెలుసుకున్నట్లవుతుందో, ఏ ఒక్కటి తెలుసుకుంటే మిగతావి తెలుసుకోనవసరము ఉండదో, దాన్ని విడమరచి చెప్పి సర్వమూ తెలుసుకున్నట్లయ్యేటటువంటి తెలివిని, జ్ఞానాన్ని తెలియజేసేది వేదము. వేదాంతమటే ఏమిటి? తెలుసుకుని ఉపయోగమేమిటి? ఈ చదువుకున్నది, ఈ తెలుసుకున్నది, విన్నది అంతా వస్తు నిర్ణయంగా అవ్వాలి. అన్యముతో కూడిన తాదాత్మ్యత నుండి విడివడాలి. దానికి కారణముగా ఉన్న అవిద్యనుండి విడివడాలి. నీవు నీవైన తత్వము తెలిసిన తరువాత ఆ తత్వంతో అనుసంధానం చేసి దానికి అడ్డుగా ఉన్నటువంటి త్రిగుణాలను రహితపరచుకోవాలి. బహిర్ముఖంలో ఉన్న విషయ వాసనలను క్షయం చేసుకోవాలి. రజోగుణముతో కూడిన అంతఃకరణ వృత్తులను నశింపచేసుకోవాలి. ఇవి చేస్తే, ఆ తత్వానుసంధానము పూర్తయితే బ్రహ్మము తప్ప అన్యము లేదు అనేటువంటిది అది నీవే అయి ఉంటావు. నీవు తప్ప అన్యము లేదు. నీవు నీవైనటువంటి తత్వంలో ఉంటే, అది నీ స్వరూపం, బ్రహ్మ తప్ప రెండవది లేదు అనేటువంటిది సిద్ధాంతం.

అది బ్రహ్మ నిర్ణయమయినా, నీవే ఆ బ్రహ్మ కనుక అది నీ నిర్ణయము. అది నిర్ణయమే గానీ, స్వానుభవం కాలేదు కాబట్టి తత్వానుసంధానం చెయ్యాలి. అలా చెప్పేవన్నీ శృతులు. వేదములు, వేదాంతము, శృతులు అంటే ఏమిటి మళ్ళీ? ఋషివర్యులు వారి స్వానుభవముతో తపస్సులో వెల్లడించిన ఉపనిషత్తులు గాని, వేద వాణిద్వారా, శబ్ద ప్రమాణముతో అందించబడినటువంటి శృతులు ఎవరూ చెప్పినవి కాదు గాబట్టి అపౌరుషేయములు. ఒక పురుషుని యొక్క అభిప్రాయముగా పురుషుడు చెప్పబడినట్లుగా రాలేదు కనుక అది అపౌరుషేయము. అందుకే ఈ వేదాలు సనాతనము. పూర్వముకంటే పూర్వము కంటే పూర్వమే ఉన్నాయి అని, మధ్యలో మరుగునపడ్డా, తెలుసుకునేవాడు ఉండీ గురుశిష్య పరంపరగా దానిని అందించక పోయినప్పటికీ తపస్సు చేసుకున్న వాళ్ళకు నేరుగా వాళ్ళకే వినిపించబడేవి, అపౌరుషేయాలు శృతులు. అటువంటి వాళ్ళు ఆచరించి సమాజానికి బాగా అర్థమయ్యే రీతిగా, ఏ ఉపాయముతో, ఏ యుక్తితో చెపితే అర్థమవుతుందో, ఆ పద్ధతిగా చెప్పేటువంటి ఋషి సాంప్రదాయంలో ఋషులచేత చెప్పబడినవన్నీ కూడా స్మృతులు. అంటే శృతులని నీయందు చేర్చుకొని స్మృతి రూపంలో అట్టిపెట్టుకొని ఆ స్మృతి రూపం నుండీ గురు స్ఫూర్తితో, తిరిగి శిష్య పరంపరకి, ఆ వచ్చింది వచ్చినట్లుగా అందించటం అనేది స్మృతి. స్మృతి అంటే తెలుసుకున్నదంతా దాగి ఉండటము. ఆ గుర్తు మళ్ళీ జ్ఞాపకమయినప్పుడు, అది ప్రకటమవుతుంది.

గురువుయందు స్మృతి రూపంలో వేదాలున్నాయి. తిరిగి శిష్య పరంపరకు అది వ్యక్తం చేస్తూ ఉంటారు. నీవు తెలుసుకున్న దానిని, జ్ఞాపకం పెట్టుకున్న దానిని తరువాత వ్యవహారములో దానిని మర్చిపోయినప్పటికీ అది స్మృతి రూపంలో ఉంటుంది. వ్యక్తియందు అది ప్రకటితమవుతూ ఉంటుంది. అలా వచ్చినదే కృష్ణపరమాత్మ రూపంనుండీ వచ్చినటువంటి భగవద్గీత స్మృతి. ఉపనిషత్తులేమో శృతులు. భగవద్గీతేమో స్మృతి. బ్రహ్మ సూత్రాలు అది కూడా స్మృతే. ఉపనిషత్తులను క్రోడీకరించి, అన్ని రకాలుగా తర్క వితర్కాలుగా సూత్రీకరించబడినాయి కాబట్టి అవి కూడా స్మృతుల క్రిందే వస్తాయి. కాబట్టి వేద ప్రమాణాలను, శృతులను ఉన్నదున్నట్లుగా సూత్రీకరించి చెప్పి, పూర్వ మీమాంస ఉత్తర మీమాంస, పూర్వపక్షము ఉత్తర పక్షము క్రింద సగుణంలో బ్రహ్మ సర్వాధారంగా, సర్వ కారణముగా ఉన్నదానిని, బ్రహ్మని సృష్టినుండీ వేరుపరచి, నిర్గుణ బ్రహ్మని శాశ్వత నిర్గుణ బ్రహ్మగా, నిర్ణయించేవన్నీ కూడా బ్రహ్మ సూత్రాలు. కనుక దీంట్లో కొంత ఎక్సర్‌సైజ్ ఉంది. స్మృతులు చాలా ఉన్నాయి. అనేక ఋషులు దాన్ని వేద ప్రమాణాన్ని ఆ కాలంలో నాగరికతకు, వారి జీవన వ్యహారానికి తగ్గట్టుగా, కొన్ని మార్పు చేర్పులు చేసి చెప్పింది. కనుక ఋషి సంప్రదాయము ఋషి ద్వారా శృతుల ప్రమాణాన్ని దేశ కాల పరిస్థితులకు అనుగుణంగా కొద్ది మార్పులతో చెప్పి అందించేది స్మృతి. ఇవి పౌరుషేయాలే. ఋషిప్రోక్తం. ఋషి ప్రోక్తం అంటే ఋషుల ద్వారా చెప్పబడినవి. ఋషుల ద్వారా చెప్పబడినవన్నీ స్మృతులు.

ఈ శృతి, స్మృతులయందు ఎవరికైతే విశ్వాసముంటుందో వారికి ఆత్మజ్ఞానమే నూటికి నూరుపాళ్ళు ఫుల్‌టైం చేయవలసినది. ఆత్మజ్ఞానం కోసమే ఫుల్‌టైమ్ ప్రయత్నం చెయ్యాలి. తెలియనివాడు ఎటూ చేయట్లేదు. తెలిసినవాడు ఇక ఆలస్యం చేయకూడదు. భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు, ఈ మూడూ కలిసి ప్రస్థానత్రయం అంటారు. స్థానము అంటే మోక్షము. ప్రస్థానము అంటే తిరిగిరాని 'మోక్షధామము'. ఆ తిరిగిరాని 'మోక్షధామము' ఏదయితే ఉన్నదో, అది ప్రస్థానము. ఆ ప్రస్థానమునకు తీసుకువెళ్ళేవి ఈ మూడు. ఈ మూడూ కూడా దానికే కేటాయించబడి ఉన్నాయి. పురాణాలు అంతవరకు కాదు. ధర్మార్థ, కామ మోక్షాలలో ధర్మార్థముల వరకు మోక్షాన్ని ప్రతిపాదించడము వరకే పురాణాలు, భారతము, ఇవన్నీ

ఉన్నాయి. ఈ మూడు మాత్రం భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు, మోక్షాన్ని లక్ష్యంగా పెట్టి చెప్పబడినవి. అందుకని ఈ మూడింటిని ప్రస్థానత్రయం అంటారు. వీటిమీద విశ్వాసము ఉన్నవారికి మాత్రమే గురుశిష్య న్యాయంగా మాత్రమే అది అందించటానికి అవకాశం వుంది. అంతర్ముఖ ప్రయాణములో ఎవరికైనా అనుభవం వస్తే కాని తెలియదు. కాని తెలిస్తే కాని ప్రయాణము జరగదు.

ఒక తెలిసినవాడు మార్గదర్శిగా ఉండాలి అంటే అది గురువే. కనుక ముందేమో శృతి, స్మృతులమీద విశ్వాసముండాలి. తరువాత ఒక గురువు ద్వారా బోధ ప్రబోధ పద్ధతిలో తెలుసుకోవాలి. జ్ఞాతుం, ద్రష్టుం ప్రవేష్టుం పద్ధతిలో తెలుసుకోవాలి. చివరికి గురువు యొక్క సహాయంతోటి, గురు కృపతోటి, అధిగచ్ఛతి. అన్నిటినీ కూడా అంది, పొంది, మీరి, చివరికి ఏదైతే పూర్తిగా మీరినటువంటి స్థితిలో సాక్షాత్కరము ఉన్నదో అదీ లక్ష్యము, గమ్యము. దీనికింత అవసరమున్నది. ఆషామాషీగా దారినపోయే వారందరికీ చెప్తే అది అబ్బదు. అందుకే దీనికేం చెప్పారు? ఈ బ్రహ్మ విద్యకు ఒక అధికారి కావాలి. సాధన చతుష్టయ సంపత్తి ఉండాలి. వివేక చూడామణిలో అయితే ఇంకా, ఊహ అపోహలతో చెప్పినదానిని పెంచుకోవాలని ఉంది. ఒక నూనె చుక్క ఒక పాత్రలోని నీళ్ళమీద వేస్తే ఆ చుక్క నూనె పాత్ర ఎంత విశాలంగా ఉందో, అంతటా ఎలా వ్యాపిస్తుందో, గురువు ద్వారా తాను విన్నదీ గ్రహించిందీ ఆ శిష్యుడు మనన నిది ధ్యాసతోటి విన్నది విన్నట్లుగా తిరిగి మళ్ళీ చెప్పగలిగే సామర్థ్యం పొంది మరొక పదిమందికి కనుక అతను చెప్పగలిగితే, వాడు తైలపాక శిష్యుడు. ఆ రకంగా ఇంత కష్టసాధ్యంగా ఉన్నది కాబట్టి నీకు తప్పకుండా గురువు యొక్క సహాయం కావాలి. ఈ శృతి – స్మృతులయందు విశ్వాసముండి కృషి చేద్దామనేటువంటి తపన కలిగి దానిని ప్రారంభం చేస్తే అది శుభేచ్ఛ. గురువుయొక్క పర్యవేక్షణలో దానిని విచారణ చేస్తే అది రెండవ జ్ఞానభూమిక. తనుమానసి – ఇది మూడవ జ్ఞాన భూమిక. ఆత్మా–అనాత్మ వివేకముతోటి, శరీరములు అనేటువంటివి అనిత్యములని తెలిసి వాటిని నిలబెట్టే వాటికాధారమైనవి ఉన్నా లేకపోయినా నీయందే ఉండి శాశ్వతముగా ఏదైతే ఉన్నదో దానిని పట్టుకొన్నప్పుడు అట్టి జ్ఞానము మూడవ భూమిక. ఆ విధంగా జ్ఞాన భూమికలలో ప్రవేశించాలి అంటే శుభేచ్ఛ కావాలి ముందు. ఆ శుభేచ్ఛ కావాలంటే శృతి – స్మృతులయందు విశ్వాసము ఉండాలి. సత్యమే చెపుతున్నాము. ప్రతి మానవుడికీ ఇది అత్యవసరము. ఇది తప్పనిసరి అని. ఎందుకంటే నీవు, నీవైన సంగతి నీకు తెలియాలి. ఆత్మ జ్ఞానము అంటే సెల్ఫ్ జ్ఞానము. సెల్ఫ్ జ్ఞానమంటే తనను తాను తెలుసుకొనుట అనే తత్వ జ్ఞానము. నిన్ను నువ్వు తెలుసుకోకుండా, నీ పేరు, నీ ఊరు, నీ అడ్రసు, నీ స్వరూపము, నీ స్వభావము, నీయొక్క సుఖ స్వరూపాన్ని నువ్వు తెలుసుకోకుండా భ్రాంతిలో అన్య స్వరూపాలు నేననుకొని, జనన మరణ భ్రాంతిలో ఉండి సంసారంలో ఉంటూ అనేక దుఃఖాలు, బాధలు, ఎందుకనుభవించాలి? ఎంతకాలము అనుభవించాలి? నువ్వు కానిది నువ్వే అయినట్లున్నా అది సుఖంగా ఉంటే ఊహాలోకంలో, స్వప్న లోకంలో విహరించవచ్చు. ఆ కల పీడకల అయినపుడు భయం వచ్చినప్పుడు, ఆత్మలో మేల్కొని, భయాన్ని పోగొట్టుకోవాలి గదా! కలలో ఉన్న భయం మేలుకొంటే పోతుంది గదా! కలలో ఉన్నటువంటి బంధము, సంస్కారము, ఆత్మలో మేల్కొంటే పోతుంది కదా!

సరే! ప్రారంబిద్దాము. ఎక్కడనుండి ప్రారంభించాలి? అందరూ నేను, నేను అంటున్నారు. ఆ నేను దగ్గర ప్రారంబిద్దాం. ఈ 'నేను'లు ఎన్నున్నాయి? రెండు 'నేను'లు అంటున్నారు. నిజానికి ఒక్క 'నేనే' ఉంది. దారి తప్పిన 'నేను'ని రెండవ నేనుగా చెపుతున్నాము. దారిలో ఉన్న నేను యదార్థ నేను, అది ఎప్పుడూ ఉంటుంది. ఒక నేను 'అసత్యనేను' ఒక నేను 'యదార్థ నేను'. శుద్ధోహం – మిథ్యాహం.

## అహంకారము

దీనినే దేహాత్మ అంటారు. కారం వచ్చి చేరితే దాన్ని అహంకారం అంటారు. అహం స్ఫురణకీ, అహం భావానికి, అహంకారానికి ఏమిటి తేడా? 'కారము' అంటే వ్యవహారములో కర్త, కర్మ, క్రియలో కర్మగా చేస్తూ కర్మ ఫలితాన్ని అనుభవించేది అహంకారము. అహంభావన అంటే నేను అనేటువంటి ఒక భావన. అహంభావన అంటే గర్వం కాదు. వాడికి అహంభావన ఎక్కువండీ అంటారు. అంటే వారికి గర్వం ఎక్కువని. ఇక్కడ ఆ అర్థంలో చెప్పడము లేదు. వీడికి అహంకారము ఎక్కువ అన్నప్పుడు కూడా గర్వమనే మాటే వాడుతున్నాము. గర్వమనేది వేరే ఉంది. దంభము, దర్పము, గర్వము ఇట్లాంటివి వేరే పదాలున్నాయి. ఇక్కడ అహంకారము అంటే విషయాలతో వ్యవహరిస్తున్నటువంటి **'నేను'** అహంకారము. అహంభావము అంటే 'నేను' అనేటువంటి ఒక భావన. అహం తత్వము అంటే అహానికి తత్వం లేదు. ఒకవేళ ఉంటే జీవుడు రాకముందు మహదహంకారములో ఉంది. అది అహంతత్వం. ఇప్పటి జీవుడియొక్క అహము మొదట తత్వ రూపంలో మహదహంకారంలో

ఉన్నది. కనుక ఈ **అహం అనేటువంటిది కేవలం ఉపాధిలో ఉన్న ఉనికి. అహంభావం అంటే ఆ ఉనికి తెలియబడినటువంటి బుద్ధి. 'అహం స్ఫురణ' అంటే బుద్ధికతీతంగా ఉన్నటువంటి ఒక ఉనికి జ్ఞానము.**

అహంలో ఉన్న చైతన్యంతో ఆత్మ అనేది ఒకటి ఉన్నదనే **"ఉనికి జ్ఞానము"** ఆ చైతన్యంలో ఏదైతే కలిగిందో, అది సత్, చిత్ ఆనందం అని పేరుపెట్టాలి. దుఃఖమయముగా ఉన్నదాని నుండి విడుదలయినప్పుడు, కేవల నేనుగా ఉన్నప్పుడు దుఃఖానికి వ్యతిరేకంగా ఆనందమని పేరుపెట్టినపుడు అది సత్ చిత్ ఆనందము అయింది. అయితే ఇప్పుడు సచ్చిదానందమనేటువంటి నేనేది? దేహాత్మ బుద్ధితో ఉన్న నేనేది? అని రెండూ విచారించాలి. ప్రస్తుతం భ్రాంతిలో ఉన్నాము కాబట్టి రెండు నేనులు ఉన్నాయని ఒప్పుకుందాము. భ్రాంతి విడిచేసరికి ఒక నేను పోతుంది. ఇంకొంచెం భ్రాంతి విడిస్తే అసలు 'నేనే' ఉండదు, బ్రహ్మమే ఉంటుంది. ఈ లేని నేనునే బ్రహ్మ జ్ఞానంతో పోలిస్తే రెండు నేనులూ లేనివే. కాబట్టి ఒక నేను మరీ ప్రమాదము, దేహాత్మ బుద్ధిగా ఉన్నది. రెండో నేను అహం అహం అని స్ఫురించేటువంటి నేను. ఈ నేను ఆ నేనంత ప్రమాదకారి కాదు. మొదటి నేనునే దేహాత్మ అంటారు. ఇది బహిర్ముఖంలో ఉన్న నేను – రెండవది అంతరాత్మ. అంతరాత్మ ఏమిటంటే ఆత్మయొక్క ప్రకాశముచేత అంతఃకరణ ప్రతిబింబముగా వచ్చినటువంటి నేను పేరు అంతరాత్మ. నిర్విషయాలుగా ఉన్నప్పుడు విషయాలపట్ల సంగత్వం లేకుండా విలక్షణంగా ఉన్న **"నేను"** పేరు 'అంతరాత్మ'. దీనినే ప్రత్యగాత్మ అని కూడా అంటారు. ఇది లోపలగల నేను. ఈ రెండింటికీ భేధము తెలియనివారు దేహాత్మే నేను అంటున్నారు. **దేహమే నేను అనేది దేహాత్మ భావన. జీవుడే నేను అనేది జీవాత్మ భావన. వాటికి విలక్షణంగా, సాక్షీభూతంగా, అసంగంగా ఉన్న నేను ప్రత్యగాత్మ.**

అన్ని విషయాలలోనూ వ్యాపిస్తూ ప్రతి విషయాన్నీ గ్రహిస్తూ ఒక విషయము తరువాత ఒక విషయానికి అల్లుకుంటూ ఊహించుకుంటూ ఉండేది మనస్సు. అవ్యభిచారిగా ఉండేది ఆత్మ. ఈ ఆత్మని ఎలా పట్టుకున్నాము? పంచీకరణలోని 25 తత్వాలలో 25వ వాడైనటువంటి జ్ఞాత, 24 తత్వాలనుండే వేరైతేనేమో ప్రత్యగాత్మ. 24 తత్వాలతోటి తానెవరో తనకు తెలియకుండా ఆ తత్వాలతోటి తాదాత్మ్యత చెందుతూ వ్యవహరించేవాడు దేహాత్మ భావనతో ఉన్నటువంటి నేను. విడివడిన వాడేమో ప్రత్యగాత్మ. ప్రత్యేకించాము, వేరుచేసి ప్రత్యేకంగా ఉంచాము. కనుక ప్రత్యక్ ఆత్మ. ఇది లోపలగల నేను. అదేమో బయటగల నేను. లోపల బయట అన్నాము. ఎందుకంటే ధ్యానంలో అది లోపల అనుభవంలోకి వస్తుంది కదా! ఉపాధినిబట్టి లోపల బయట, బ్రహ్మను బట్టి అయితే లోపల బయటా అనేది లేదు.

**అంతర్ బహిశ్చ సర్వత్ర అచలోయం సనాతనః.** ఏమీ లేదక్కడ. సనాతనమైనటువంటిది, అచలమైనటువంటిది, పరిపూర్ణమైనటువంటిది, అన్యము కానటువంటిది, అద్వయమైనది, నిర్గుణమైనది, ఉన్నది ఉన్నట్లున్నది. అది అద్వయం గనుక లోపల బయట లేదు. రెండుగా ఉంటే దానికి ఒక హద్దు, బయట ఉంటుంది. మూడు వస్తువులు ఉంటే ఒకదాని లోపల ఒక వస్తువు, బయట మరొక వస్తువు ఉంటుంది. లోపల, బయటా అనేటువంటి విభజన ఉంటే అది అవయవములతో కూడింది. ఈ బ్రహ్మ నిరవయవము; అఖండము, అవిభాజ్యము, నిరవయ పరమాత్మయందు లోపల, బయట అనేటువంటి రెండుగా విభజనగాని, భేదాలుగాని లేవు. ఈ దేహాత్మ 'నేను' ఏదైతే అనుకుంటున్నామో, అది సత్యం కాదు. అది ఆత్మ కాదు. దేహము 'నేను'కు పనిముట్టు. ఈ శరీరము 'నేను' యొక్క వ్యాపారానికి పనిముట్టు. అసలు 'నేను'కు వ్యాపారముందో లేదో తరువాత చూద్దాము. మనసుకే వ్యాపారము. 'నేను'–మనసులను విడగొడితే రెండు 'నేను'లు లేవు. యదార్థ నేను ఒక్కటే మిగులుతుంది. రెండవ నేను మనసవుతుంది. ఈ మనసే అసత్య నేను. కాని నేను, మనసు విడగొట్టుకుంటే అసత్య నేనుండదు. మనసుంటుంది. తరువాత 'నేనేమో' యదార్థ 'నేను'గానే ఉంటుంది. ఈ నేననే చైతన్యము, మనస్సులోని సంస్కారముల చేత ఈ శరీరమనే పనిముట్టును వినియోగించుకుంటూ, తన కర్మ ఫలితాన్ని అనుభవిస్తూ ఉంటుంది. అప్పుడిది పనిముట్టు అన్నప్పుడు దేహము వేరు, నేను వేరు. దేహము ఈ 'నేను'కు పనిముట్టు.

ప్రపంచంలోని నామరూపాలు, నీకంటే అన్యముగా ఎలా దృశ్యమవుతున్నాయో అప్పుడు దృక్కు వేరు. శరీరమనేటువంటిది దృక్కు కంటే వేరైనది. దృక్కు వేరుగా ఉన్నాడు. దృక్కు తెలుసుకుంటున్నాడు. అంటే ఇంద్రియ గోచరంగా ఊహగా ఒక భావనగా ఏదైనా తెలియబడుతుంది అంటే దృక్కుకంటే దృశ్యము వేరైనప్పుడు ఆ దృశ్యమే తెలియబడుతుంది. దృశ్యము తెలియబడుతున్నప్పుడు దృక్కు కంటే దృశ్యము అన్యము. మరి నీకాలు నీ చెయ్యి నీకు కనబడుతున్నప్పుడు 'నేను' అనే దృక్కు కంటే నీ కాలు, చెయ్యి వేరు. వేరు కాబట్టే దృశ్యమానవుతుంది. శరీరం నీకెప్పుడయితే దృశ్యమయిందో, అది నీకంటే వేరు

అనేటువంటిది నిర్ణయం. పదార్థము, నామరూపాలు నీకంటే అన్యముగా కనపడేవన్నీ కూడా దృశ్యాలయినప్పుడు అది ఎట్లా చూస్తున్నావో నీ దేహాన్ని కూడా అట్లాగే చూస్తున్నప్పుడు దేహమనే దృశ్యం కూడా తెలుసుకునే తెలివి రూపుడైనటువంటి 'నేను'కి ఇదంతా అన్యము. కావున దేహము నువ్వు కాదు. దేహాత్మ అయినటువంటి 'అహంకారము', అనగా దేహమే 'నేను', అనే అసత్య 'నేను' కూడా దృశ్యమే.

ఈ అహంకారము నిద్రలో ఉండదు. స్వప్నంలో నామమాత్రంగానే ఉంటుంది. వ్యవహారములో పాల్గొనేటటువంటిది, క్రియలో పాల్గొనేటటువంటి అహంకారము స్వప్నంలో లేదు. తైజసుడు వేరు, విశ్వుడు వేరు. అక్కడ కల ఏది వస్తే అది అనుభవిస్తావు. ఆ కలలో వచ్చినటువంటి అనుభవానికి నువ్వు స్పందిస్తావు. నీ ఇచ్ఛ వల్లనే, నీ పూర్వ వాసనవల్లనే, జాగ్రదవస్థలో ఉన్నటువంటి అనుభవం వాసనా రూపంలో ఉన్నదేదో స్వప్న దృశ్యమవుతుంది. నీ ఇచ్ఛయే దృశ్యమవుతోంది. కనుక అక్కడ ఇచ్ఛా శక్తి ఉంటే దృశ్యమవుతోంది నీ ఇచ్ఛ ఉంటేనే కల వస్తోంది గాని, గాఢ నిద్రలో ఇచ్ఛకూడా లేదు కాబట్టి ఏమీ తెలియని స్థితిలో ఉంది. స్వప్నంలో ఇచ్ఛ ఉంది కాబట్టి కేవలము స్వప్న పురుషుడు, నామమాత్రంగా ఉండి ఆ స్వప్నాన్ని అనుభవిస్తున్నాడు.

జాగ్రదవస్థలో వచ్చేసరికి క్రియ కూడా పని చేస్తోంది కాబట్టి కర్మ చేస్తూ కర్మ ఫలితాన్ని కూడా అనుభవిస్తున్నాడు. స్వప్నంలో హత్య చేసినా క్రియ లేదు కనుక, ఆ హత్యా దోషము, కర్మ ఫలితంగా ఉండదు. స్వప్నంలో దానం చేసినా పుణ్యం రాదు. ఎందుకంటే అక్కడ అహంకారం లేదు. కార్య రూపంలో లేదు. కరణ రూపంలో లేదు. క్రియా రూపంలో లేదు. జాగ్రదవస్థలో క్రియా రూపంలో ఉంది కాబట్టి పాపపుణ్యాలు, క్రియగా జరిగినప్పుడు నేను అనేవాడికి ఆ క్రియ ద్వారా కర్మఫలితం వస్తుంది. ఆ 'నేను' అనేవాడు దేహమే నేను అనే తాదాత్మతతో 'దేహాత్మ' భావనతో ఆ కర్మ ఫలితాన్ని అనుభవిస్తున్నాడు. దేహము పనిముట్టు అయింది. ఈ అహంకారము లేకపోతే ఏమవుతుందండి? పనిముట్టుతో తాదాత్మ్యత లేని 'నేను' ఉంటే ఏమవుతుంది. కొట్టినా దెబ్బ బాధనిపించదు. సుఖం కూడా తెలియబడదు. దేహముతో ఉన్న తాదాత్మ్యత వల్లనే సుఖదుఃఖాలు తెలియబడుతున్నాయి. కనుక తాను చేసిన పాపపుణ్య కర్మలయొక్క ఫలితము అనుభవించాలి అంటే ఈ నేనుకు దేహముతో తాదాత్మ్యత ఉండి తీరాలి. తాదాత్మ్యత లేనివాడికి దేహ సంబంధించిన ఈ కర్మ ఫలితం ఎలా వస్తుంది? 'నేను'కు దేహ తాదాత్మ్యత ఉన్నప్పుడే దానికి సుఖము, దుఃఖము అనే ఫలితం ఉంటుంది.

ఇప్పుడు విచారణ ఏమిటి? దేహము నువ్వు కాదు అన్నప్పుడు దేహముతో ఈ 'నేను' కు ఉన్న తాదాత్మ్యత వలన కలిగే కష్టసుఖాలు నీవి కాదు కనుక ఈ తాదాత్మ్యత ఎలా విడగొట్టాలో విచారించాలి. దేహ తాదాత్మ్యత పోతే సుఖదుఃఖాలు ఎవరికి? పనిముట్టు వేరైపోయిందిగా. తాదాత్మ్యత లేనప్పుడే కాదు. తాదాత్మ్యత ఉన్నప్పుడు కూడా పనిముట్టువేరే. అనేక జన్మలలో దేహమే నేను, దేహమే నేను అనేటువంటి అభిప్రాయంతో, సంస్కారముతో, చచ్చిపుడుతున్నావు కనుక ఆ దేహమనే పనిముట్టు వచ్చి మళ్ళీ తాదాత్మ్యత ఉన్న దేహమే వచ్చింది.

ఈ జన్మలో దేహము నేను కాదు అన్నప్పుడు దేహముకంటే వేరైనటువంటి ప్రత్యగాత్మ స్వానుభవానికి వస్తుంది. అది ముక్త స్థితి. దేహమే 'నేను' అనేది బంధ స్థితి. దేహమే నేననేది బంధము. దేహము కంటే నేను వేరైనప్పుడు ప్రత్యగాత్మ అనేది మోక్షము. వివరాలన్నీ మహా వాక్యాల బోధ వచ్చాక తెలుస్తాయి. నిద్రలో అహంకారము లేదు. స్వప్నంలో అహంకారము లేదు. జాగ్రదవస్థలో మాత్రమే ఉంది. జాగ్రదవస్థలోనే పుణ్య పాపాలు కర్మ ఫలితాలు అనుభవిస్తున్నాడు. సుషుప్తిలో ఏ కర్మ చేయట్లేదు. స్వప్నంలో కర్మ చేస్తున్నప్పటికీ అహంకారము లేనందువల్ల కర్మతో సంగత్వం లేదు. అందుకని కర్మ ఫలితం లేదు. త్రికాలములలో ఉన్నదియే సత్యము. మూడవస్థలలో మారిపోతున్నది సత్యము కాదు. త్రికాలములు అంటే భూత భవిష్యత్ వర్తమాన కాలములు. అలా చూసుకున్నా కాల పరిచ్ఛేదముతో ఉండేది అసత్యము. కాల పరిచ్ఛేదము లేనిది సత్యము. ఆత్మ తన స్వానుభవముతో ఉన్నదున్నట్లుగా ఉన్నదేదో, అది కాల పరిచ్ఛేదము లేకుండా నిత్య వర్తమానమై నిత్య తృప్తమై ఉన్నది. దానినే మనము నిత్యమని, శాశ్వతమని అంటున్నాము. కాల పరిచ్ఛేదము ఉంటే అది అశాశ్వతము, తాత్కాలికము, అనిత్యము. కాని ఈ దేహము రెండు కాలములలో ఉండుటలేదు. కావున సత్యమెట్లగును? ఈ విధముగా విచారణ సలిపి స్వప్నంలోనూ, సుషుప్తిలోనూ ఈ దేహము ఉండటంలేదు. 'నేను' అనేటువంటి ఒక భావన స్వప్నంలో కదలాడుతూ, చేస్తున్నట్లు, అనుభవిస్తున్నట్లు కనబడటం తప్ప. ఈ దేహం నీకెప్పుడయినా మళ్ళీ కనబడితే కనపడవచ్చు. ఈ దేహం నీకు కనపడకుండానే నేననే వ్యవహారం నీకు జరిగిపోతూ ఉంటుంది. క్రియా రూపంలో ఉంటేనే అహంకారముంటున్నది. మూడు అవస్థలలో అనుభవాలు మార్పు చెందుతూ ఉంటే ఏ అనుభవంలో నువ్వెక్కడున్నావో అప్పటికి ఆ అనుభవమే అనుభావ్యముగా ఉంటే నిజానికి అక్కడ ఏ అనుభవము సత్యము?

కనుక నీ విచారణ జ్ఞానాన్ని ఆ రకంగా అభ్యాసానికి, ఆచరణకీ, సాధనకి వినియోగిచాలి. ఎలా వినియోగించాలి? ఎలా సాధన చేయాలి? ఇంద్రియాలంటే ఏమిటి? కర్మేంద్రియాలంటే ఏమిటి? జ్ఞానేంద్రియాలంటే ఏమిటి? అంతఃకరణ చతుష్టయం అంటే ఏమిటి? పంచప్రాణాలు ఎలా వచ్చాయి? అసలు సృష్టి ఎలా వచ్చింది? ఇదంతా పాఠాలక్రింద ఉంది. ఆ పాఠాలు మీరు ఎంతకాలం నుంచో వినే ఉన్నారు. పాఠాలవల్ల జ్ఞానం రాదు. ఈ పాఠముయొక్క సారాన్ని విచారణలో చూసుకొని, వస్తు నిర్ణయంలో, బుద్ధిని ఆ నిర్ణయంపై పెట్టి గట్టిచేస్తే అది నిది ధ్యాసకెళితే అది ఆరూఢమైతే అప్పుడు స్వానుభవానికి అందుతుంది. ఇప్పుడు మనం చేసేపని డైరెక్టుగా, బోధతోపాటు అనుభవం కూడా రావాలనే చెబుతున్నాం. వినే వాళ్ళలో వివరంగా ఎరికైనా తెలియకపోతే విన్నది అట్టిపెట్టుకొని దీనిని మననం చేస్తూ, ఆ వివరాలకోసం దొరికిన పుస్తకాలలో అన్వేషణ చెయ్యండి. దానినిబట్టి మీకు స్పష్టత వస్తుంది. ఏ పుస్తకంలో దొరుకుతుందనేది గురువే స్ఫూర్తినిస్తాడు. ఏ పేజీలో దొరుకుతుందో నీకే అందుతుంది.

అంకురార్పణ అంటే **'కేవలాత్మే'**–లేనెరుక కనుక, దానిని తీసెయ్యాలి. లేనిది లేకుండా చెయ్యాలని. అలా దీక్ష పెట్టుకుని దిగాము. ఆ దిగిన తరువాత 'యద్భావం తద్భవతి' అనే సూత్రాన్ని తెలుసుకున్నాం. సృష్టికి ప్రారంభానికి కూడా బ్రహ్మయొక్క భావన, సృష్టికి సంబంధించింది జ్ఞాపకంగా స్మృతిగా ఉంటే, ఆ స్మృతి మాయా సంకల్పము చేత లేనివి ఉన్నట్లుగా కల్పితముగా ఈ సృష్టంతా వచ్చింది. జీవుడు కూడా అంతే చేస్తున్నాడు. అవిద్యాదోషం చేత ఇవన్నీ నిజమనుకొని వాటివల్ల సంసార, దుఃఖ, బాధ, బంధ, వాసనలన్నీ కూడా దాచుకున్నాడు. ఇవే భావాలు. **ఈ భావ రూపంలో ఉండేవే పునర్జన్మలో అనుభవానికి వచ్చాయి. ఇది జీవుడి దగ్గర 'భవతి' అనగా చిత్త వృత్తితో మొదలవుతోంది.** బ్రహ్మ దగ్గర 'భవతి' అనగా సంకల్పంతో సృష్టి సంకల్పంతో మొదలవవుతోంది. నువ్వే ఆ బ్రహ్మవి. అప్పుడు అలా సంకల్పం చేశావు. తరువాత ఈశ్వరుడవయ్యావు. మళ్ళీ సంకల్పం చేశావు అనేక జీవులయ్యావు.

ఒక సముద్రం నుంచీ వేరైనటువంటి బిందువు నేను ఈ బిందువు వరకే అనేటువంటి పరిమిత జ్ఞానం పొంది ప్రక్క బిందువు తనకంటే వేరు అనుకొని సముద్రము చాలా గొప్పదనుకొని సముద్రమే బిందువుల సముదాయమనేది తెలియక సముద్రమే మోక్షమని అనుకుంటోంది ఈ తుంపర. విచారణ చేస్తే అజ్ఞానమునకు ఈ పరిమితత్వమే కారణము. తత్త్వంగా చూస్తే ఒక నీటి బిందువులో ఏదైతే ఉన్నదో వేరొక నీటి బిందువులో కూడా అదే ఉంది. మహాకారణంగా కూడా అదే ఉంది. తత్త్వముగా అది ఒక్కటే అయివుంది. అట్లాగే ఆత్మగా, పరమాత్మగా అది ఒక్కటే. అజ్ఞానంచేత అవిద్యాదోషం చేత, జీవభావమే గానీ, పరిమిత భావమే గాని, అభేదమే నిశ్చయము. కెరటాలుంటాయి. మాయా కార్యంగా, చలించనటువంటి గంభీరంగా ఉన్న సముద్రమువంటి నీకు దానిలో అలల రూపంలో కదులుతున్నాను అనే భావన నీకొచ్చింది మాయవల్ల. అలాగ అనేక అలలు గుద్దుకోవడం ద్వారా ఈ అలలే అనేక బుడగలయినప్పుడు బుడగ వరకు ఒక పరిమిత భావం, బుడగ పుట్టడం, బుడగ ఉండటము, బుడగ చితికిపోవటంతోటి బుడగతో తాదాత్మ్యత ఉన్నటువంటి జీవుడు చచ్చిపుట్టేవాణ్ణి అనుకుంటున్నాడు. బుడగలో ఉన్నదీ నీరే, అలలలో ఉన్నదీ నీరే. గంభీరమైన సముద్రంలో ఉన్నదీ నీరే, అసలు సముద్రము అచలము, పరిపూర్ణము అని చూచినప్పుడు తత్త్వాన్ని పట్టుకున్నప్పుడు బిందు రూపంలో ఉన్న నీరు అచల పరిపూర్ణమే అలల రూపంలో ఉన్న నీరు, అచల పరిపూర్ణమే. మహాకారణంగా ఉన్నటువంటి గంభీర స్థితిలో ఉన్నటువంటి నీరు అచల పరిపూర్ణమే. మాయాదోషం వల్ల, అవిద్యా దోషంవల్లనే ఈ కదలికలు గాని, అనిత్యాలుగాని. ఈ రెండు దోషాలు పోతే అచలమే ఉన్నది. అది నిస్తరంగ సముద్రము.

అవిద్యాదోషం వల్ల, అనిత్యత్వం వచ్చింది. అనేకత్వం వచ్చింది. బేధం వచ్చింది. మాయాదోషం వల్ల కదలికలు వచ్చినాయి. ఈ రెండు దోషాలు జీవుడిలో ఉన్నాయి. ఈశ్వరుడిలో అవిద్య లేదుగాని, మాయ వుంది. జీవుడికొచ్చేసరికి మాయ+అవిద్య రెండూ ఉన్నాయి. తత్త్వ విచారణ చేస్తే బుడగ నేను కాదు అంటే అలవల్ల బుడగ పుట్టింది అన్నావు. అలలు గుద్దుకోవడం వల్ల అంటే ఈశ్వరుడినుండీ జీవులొచ్చాయి అని. మళ్ళీ అక్కడ తత్త్వం చూస్తే జలతత్వంలో కదలిక లేదు. తత్త్వం వస్తువు కాదు కనుక అది అచలమే. మానవుడు కదులుతాడు. మానవత్వం అనేది తత్వం. అది కదలదు. క్రియా రూపంలో శరీరం ద్వారా, పనిముట్టు ద్వారా కదలికలుంటాయి తప్ప మామూలుగా కదలదు.

ఈ విధముగా విచారణ ఎలా చేయాలో అందిస్తున్నాము. ఎవరికివారు చేస్తేనే వారికి అనుభవం. పుస్తకాలు, శాస్త్రాలు, రివిజన్ చేస్తే రాదు. ఇంద్రియములు, మనసు, బుద్ధి ప్రాణము, వాటియొక్క పుట్టుక, వాటియొక్క వ్యవహారము, వాటియొక్క

లయము, ఇవన్నీ ఉన్నా లేకపోయినా ఏది శాశ్వతముగా ఉన్నదో, దాన్ని వేరుపరచటం అనేటువంటిది మనకు తెలియాలి. అలా వేరుపరచి ప్రత్యేకించినపుడు అది ప్రత్యగాత్మ అంటున్నాం. ఎవరికివారే వేరుపరచుకోవాలి. ముందు బుద్ధి పరిధిలో విషయంగా వేరుపరచాలి. తరువాత అవగాహన చేసుకుని తాదాత్మ్యతనుండీ విడిపడటం చెయ్యాలి.

తాదాత్మ్యత అంత తేలికగా పోదు కాబట్టి, ఎంత బాధపెట్టినా అది వేరు ఇది వేరనే నిర్ణయముగా ఉండాలి. బాధ పెట్టేది కాబట్టి, కలిసిపోయింది కాబట్టి శరీరం నేను అంటే కుదరదు. విచారణలో శరీరం నువ్వు కాదని తేలాక, శరీరం నిన్ను ఎంత బాధపెడుతున్నా సరే, శరీరం నువ్వు కాదు. అంతే! మనసుకి ఎంత నొప్పి తెలుస్తున్నాసరే ఆ నొప్పిని గ్రహించేటటువంటి మనసు నువ్వు కాదు.

ఆత్మంటే ఒక ఉపనిషత్తులో చెప్పారు. వింటుంది, వినదు, ఆలోచిస్తుందీ. ఆలోచించదు. చూస్తుందీ చూడదు. అంటే ఏమిటి? ఆత్మ చైతన్యము ఆధారముగా ఆత్మలో ఉన్న ప్రజ్ఞానము ఆధారముగా వినుట, చూచుట, ఆలోచించుట, నిద్రపోవుట అన్నీ ఆత్మ చేస్తున్నట్లుగా ఉంది గాని ఆత్మ చేయదు. ఆత్మ ఆధారంగానే ఇవన్నీ జరుగుతున్నాయి. ఆత్మ అన్నింటికి సాక్షి. మనసే చూస్తోంది, వింటోంది, చేస్తోంది. మనసుమీద విచారణ చేస్తే ఏమయింది? మనసు పట్టించుకున్నదీ, జ్ఞానేంద్రియాలు గ్రహించినవీ తెలియబడ్డాయి. జ్ఞానేంద్రియాలు గ్రహించినప్పటికీ కూడా మనసు అన్య మనస్కంగా ఉన్నప్పుడు, తెలియలేదు. అంటే మనసే తెలుసుకుంటున్నది.ఇప్పుడు మనసు పెట్టినప్పుడు ఇంద్రియ జ్ఞానం మనసుదే అయింది.

అలాగే ప్రజ్ఞని పెట్టినప్పుడు, తెలుసుకునే తెలివిని పెట్టినప్పుడు ఆ ప్రజ్ఞానం లేకపోతే మనసు ఎలా తెలుసుకుంటుంది? తెలుసుకునే తెలివనేది ఒకటుంటే అది అన్నీ తెలుసుకుంటుంది. తెలుసుకునే తెలివి మనసు కాదు. మనసు జడము. తెలుసుకునే తెలివి ప్రజ్ఞానం. అది ప్రత్యగాత్మలో ఉన్నది. ఆ ప్రత్యగాత్మలో ప్రజ్ఞగా, తెలుసుకునే తెలివిగా ఉన్నదేదో దానివల్లనే ఇవన్నీ తెలియబడుతున్నాయి. కాబట్టి ఒక రకంగా అవే తెలుసుకుంటున్నాయి. అయితే విషయాసక్తి మనసుకుంది గాని ఆత్మకు లేదు కనుక ఆత్మ సాక్షీభూతంగా తెలుసుకుంటున్నది. సాక్షీభూతంగా ఉంటూ, విలక్షణంగా ఉంటూ, అంటకుండా ఉంటూ, తెలుసుకుంటున్నది. మరి ఆత్మ తెలుసుకుంటుందా అని మళ్ళీ అడిగితే ఆత్మకు, నేనుకు మధ్యలో ఇంకొక అంతరాత్మ ఉంది. ఆ అంతరాత్మే సాక్షీభూతంగా ఉండి తెలుసుకుంటుంది. దాంట్లోనే స్మృతిరూపం ఉంది. నిజాత్మ తెలుసుకోడానికి హేతువుగా, ఆధారముగా, చిన్మాత్రముగా, సన్మాత్రముగా ఉన్నదే తప్ప, దానియొక్క ఉనికిచేత ఈ వ్యహారాలు జరుగుతున్నాయి గాని స్వయముగా అదేదీ చేయట్లేదు. ఏదీ గ్రహించట్లేదు. అందుకని ఉపనిషత్తు ఏం చెపుతోంది అంటే చూస్తోంది కాని చూడటం లేదు. వింటోంది కాని వినటం లేదు అంటుంది. అంటే ఇంద్రియ వ్యాపారానికి మనో వ్యాపారానికి ఆధారంగా ఉన్నది. ఈ అంతరాత్మ అనేటువంటిది యదార్ధ నేనుగా ఉండేదే సాక్షిగా ఉంటుంది.

నిజానికి ఆత్మ సాక్షి కాదు. మిమ్మల్ని క్రమక్రమంగా తీసుకువెళుతున్నాం. ప్రస్తుతం ఆత్మ సాక్షి అన్నప్పటికీ నిజమైన ఆత్మ సాక్షికూడా కాదు. అది తరువాత బోధలో వస్తుంది. ఇక్కడ 'నేను' ఎవరు? అంతఃకరణ ప్రతిబింబముగా ఉన్న చిదాభాసాన్నే అంతరాత్మ అంటున్నాము. ఈ అంతరాత్మని నిర్విషయ స్థితిలో ఇంద్రియ జ్ఞానాన్నుంచి వేరుపరిస్తే ప్రత్యగాత్మ అంటున్నాము. అసలు నిజంగా ఇదేనా ప్రత్యగాత్మ అంటే ఇది కాదు. ఇది యదార్ధ 'నేను' మాత్రమే. వేదాలు, ఉపనిషత్తులు తెగ కన్ఫ్యూజ్ చేసేస్తాయి. ఆత్మే తెలుసుకుంటుంది అంటే చూడండి. ఎంత కన్ఫ్యూజనో. ఆత్మ సాక్షి అన్నా కూడా కన్ఫ్యూజనే.

ఆత్మ సాక్షి కూడా కాదు. ఆత్మనేది ఎరుక కూడా కాదు. ఆత్మ సర్వసాక్షికూడా కాదు. ఆత్మ 'బయలు'. కనుక సాక్షిత్వం కూడా ఎరుకే. ఆత్మంటే కేవలాత్మ అది కూడా లేనెరుకే. ఎరుకగా ఉంటే అది అబద్ధమే, లేనిదే, అసత్యమే. అయితే ఈ 'నేను'ని బయలుదాకా తీసుకువెళితే ప్రతిబింబ నేను పోతుంది. బింబ జ్ఞానంతో ఉన్న ఆత్మ–పరమాత్మ కూడా పోతుంది. ఈ పదాలనుబట్టి మీరు, గురువు గారు ప్రత్యగాత్మ అంటే వ్యష్టి అన్నారే అనుకుంటారు. పరమాత్మ కూడా బ్రహ్మజ్ఞానము పొందాలనుకున్నపుడు ఈశ్వరుడు కూడా బ్రహ్మజ్ఞానం పొందాలనుకున్నపుడు, ఈశ్వరుడు కూడా తన సరంజామానుంచి వేరుపరచుకొని ప్రత్యేకిస్తే అక్కడ కూడా ప్రత్యక్ ఆత్మ అంటారు. బ్రహ్మ దగ్గరకు వస్తే 'ప్రత్యక్ అభిన్న బ్రహ్మ' అంటాము.

ఈ పదాలను వాటియొక్క ఉత్పత్తి అర్థాలను బట్టి తీసుకోండి. ప్రత్యగాత్మని గురువుగారు చెప్పారు. ఇది వ్యష్టితోనే ఉంది. శరీరత్రయ విలక్షణము అవస్థాత్రయ సాక్షి, పంచకోశ లక్షణానికి వ్యతిరిక్త లక్షణంగా విలక్షణంగా ఏదైతే ఉన్నదో అదే ప్రత్యగాత్మ. అదే ఆత్మ. అనే పాఠం చెపుతున్నారని అనుకుంటాం. అసలు ప్రత్యగాత్మ అంటే అంతవరకేనా? అని అడుగుతాము. పాఠకులు ఎక్కడికక్కడ ఇది కాదు, ఇది కాదు అని తన్నుతాను వేరుపరచుకునేటువంటిది కూడా అక్కడక్కడ ప్రత్యగాత్మ అని అయిదారు దశలలో విడగొట్టినపుడు మళ్ళీ మళ్ళీ ప్రత్యగాత్ముడు వస్తూనే ఉంటాడు.

మాయావరణములో ఉన్న పరమాత్మ జ్ఞానము బ్రహ్మజ్ఞానము. బ్రహ్మకు సంకల్పము వస్తే సృష్టిలోకి వస్తాడు కాబట్టి వాడు మాయాశబలిత బ్రహ్మ. ఆ బ్రహ్మకు కూడా అతీతముగా పరముగా ఇదికూడా కాదు అని అన్నపుడు, మాయాశబలిత బ్రహ్మకూడా కాదు అన్నప్పుడు అక్కడ పరమాత్మే పరబ్రహ్మమై యున్నాడు. ఇక్కడ ప్రత్యగాత్మయే బ్రహ్మమై ఉన్నాడు. ఆ పరములో పరబ్రహ్మమై ఉన్నాడు. అదేమిటి ఇంతమంది లేరా ? అవిద్యా, మాయ, మూడు గుణాల దోషముచేత తాదాత్మ్యత చేత ఒక్కొక్కసారి ఒక్కొక్కటిగా అనుకుంటున్నావు. అధిగమించిన స్థితిలో నీకే ఒక కొత్తపేరు వస్తోంది. అంతే తప్ప ఇవన్నీ మాయద్వారం దాటేలోగా మాయావరణలో ఉన్నటువంటి స్థితిగతులు. అది ఒక్కటే నిజానికి.

ఈ మాయద్వారం దాటిన తరువాత అతీత పద్ధతిలో పూర్తిగా పరమైనటువంటిదేదో అది పరబ్రహ్మ అన్నప్పుడు ఈ ఆధ్యాత్మిక ప్రయాణమే జరగలేదు. ఎవరు ఎక్కడున్నారో అక్కడే భ్రాంతి రహితమై, భ్రాంతికి మూలమైన త్రిగుణాలు లేకుండా పోతే భ్రాంతిలో ఉన్న సంకల్పాదులు ఎరుకలు అన్నీ భ్రాంతి రహిత స్థితిలో లేనివై, ఎరుక లేనిదైపోతే, ఎరుక యొక్క లేమితనముతో ఏదైతే ఉన్నదున్నట్లుదో అదే బయలని, ఆ బయలే స్వతఃసిద్ధమైనదిగా ఆ లక్ష్యాలన్ని అందుకుంటాము. ఎప్పుడు కూడా ఈ వరుసలని గుర్తుపెట్టుకోవాలి గాని ప్రత్యగాత్మ అంటే వ్యష్ఠి అని పరమాత్మ అంటే సమిష్టి అని, ఒకసారి ఆ బోధ అట్లా చెప్పడం కూడా జరిగింది. గనుక అలాగే ఫిక్సు అయిపోకూడదు.

మన విచారణా పద్ధతిలో ఈ 'సర్వవేదాంత శిరోభూషణం'లో పూర్తిగా నిరపేక్ష పద్ధతిలో మార్చుకుంటూ పోతున్నాము. ఇక దేహము, మనస్సు, ప్రాణము నువ్వుకాకపోతే ఆత్మేది? రాకడ పోకడ లేనటువంటిది. చేతులు, కాళ్ళు మాదిరి అవయవాలు లేనటువంటిది. శరీరము కానప్పుడు అవయవాలు కూడా కాదు. సూక్ష్మ శరీరం నీవు కాదనపుడు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ జ్ఞానం నీకు లేదు. శుద్ధ సత్వగుణమేమో మాయ. మలిన సత్వగుణమేమే అవిద్య. అవిద్యలో ఏమున్నాయి? ఆవరణ. మాయలోనే ఆవరణొచ్చింది. ఆధ్యాస వచ్చింది. ఆ విద్యలో ఎక్స్ట్రా ఏమొచ్చినాయి? ఆవరణ, అధ్యాసలతో పాటు ఏమొచ్చింది? ఆ తరువాత, సంసారం, సంసారంతో ఏమొచ్చింది? విడచి ఉండలేని తనము. విడిచి ఉండలేని తనముతో ఏమొచ్చింది బంధము. బంధముతో ఏమొచ్చింది? దుఃఖము.

అణువున, అణువుగా, ఘనమున ఘనముగా ఆకాశమువలె అంతటా ఉన్ననూ ఆత్మ ఎట్లా ఉందండి? అణోరణియాన్‌గా మహతో మహియాన్‌గా ఉంది. అసలు చెప్పాలంటే అణువు కాదు, ఘనము కాదు. ఆకాశమువలె అంతవరకే. ఏమీలేనిది. విలక్షణమైన తరువాత ఏమీ లేవా?

ఈ ప్రత్యగాత్మ ఎప్పుడయితే నిరాకాశంగా మారిందో, మళ్ళీ తిరిగి సృష్టికి గాని, జన్మలకు గాని, మూడు గుణములతో కూడినటువంటి ఎరుకకు గాని, అవకాశమివ్వదు. త్రిగుణ మాలిన్యము అంటే అది. గుణములు ఏ రూపంలో ఉన్నా, విడివిడిగా ఉన్నా, రెండేసి మూడేసి గుణాలు ఏదో ఒక నిష్పత్తిలో కలిసి ఉన్నా, గుణమనేటువంటిది ఏ కొంచెమైనా ఉన్నా అదంతా కల్పితమే. అదంతా భ్రాంతిని పుట్టించేదే. జీవుడిలో ఉన్న గుణాలు, జీవుణ్ణి భ్రాంతికిలోను తెస్తున్నాయి. జగత్తులో ఉన్న గుణాలు తాడుమీద పాము తోచినట్లుగా ఈ లేని ప్రపంచాన్ని నామరూపాలుగా ఉన్నట్లుగా చూపిస్తోంది. అక్కడా మాయ ఉంది. ఇక్కడా మాయ ఉంది. దృక్కులోనూ మాయ ఉంది. దృశ్యంలోనూ మాయ ఉంది. దృక్కులోనూ పరమాత్మ ఉన్నాడు. దృశ్యంలోనూ పరమాత్మ ఉన్నాడు. చైతన్య రూపంలో వ్యాపించి ఉన్నాడు. కనుక త్రిగుణ మాలిన్యము లేనిదే బయలు.

అయితే క్రిందినుంచి ఒక ఆత్మ, ఒక బ్రహ్మ అని ఏదైతే అనుకుంటున్నామో ఆ పేరుతో బయలయితే మాత్రం అది సమన్వయం కాదు. విరోధమవుతుంది. కనుక ఎరుక అనే పదాన్ని తీసుకువచ్చి ఏ రూపంలో ఏ గుణమున్నా ఆ గుణ సంబంధంగా ఏ ఎరుక ఉన్నా, అన్ని రకాల ఎరుకలలో బంధించే ఎరుక, మోక్ష స్థితిని అనుభవానికి ఇచ్చేటువంటి ఎరుక, రెండూ కూడా ఎరుకే. మిమ్మల్ని బంధించి బంధము ద్వారా దుఃఖహేతువైన ఎరుక, బంధ రహితము చేసి, ఆనందమిచ్చేటువంటి ఎరుక. రెండూ ఎరుకలే. ఎరుకలోనే బంధమోక్షాలున్నాయి. అయితే ఎరుక పోతేనే నిజమైనటువంటి మోక్షము. ఎరుకలోనే ఉన్నటువంటి మోక్షము తిరిగి మళ్ళీ ఎరుకలోనికి తెచ్చేటువంటి మోక్షమే. ఎరుకలోనే తిరిగి తీసుకొచ్చినపుడు ఎప్పటికైనా మళ్ళీ బంధం కలుగుతుంది. ఈ మోక్షము శాశ్వతం కాదు. ఆత్మానుభవము, బ్రహ్మానుభవము అనేటువంటిది ఏదైతే అనుభవ రూపంలో ఉందో అదికూడా ఎరుకే కనుక అట్టి ఎరుక కూడా విడిచినప్పుడే తిరిగిరాని మోక్షము. దానిపేరే పరమపదము.

త్రిగుణ మాలిన్యము దగ్గర ఇవన్నీ చెప్పుకోండి ఒకసారి. ఇది అణువున అణువుగా ఘనమున ఘనముగా ఉన్నప్పటికీ, అసలు పరమాత్మ అణురూపం కాదు. అణువుతో చెప్పేదంతా పదార్థ జ్ఞానం. పదార్థ జ్ఞానమంతా కూడా అణువు కణము అని వాడుతూ ఆ కణముయొక్క అణువులయొక్క సముదాయముతో నామరూప జగత్తు వచ్చేసింది. పంచ భూతాలు వచ్చేసినాయి. జీవులయొక్క ఉపాధులు వచ్చేసాయి అనేటువంటి సిద్ధాంతం కణాది మహర్షి ద్వారా వచ్చింది. పదార్థమే బ్రహ్మకాదు. పదార్థ వాదము కణాదుడిది. పరమాణు వాదము కణాదుడిది. కణములు ఏకకణము, ద్వికణము, త్రికణము అనేటువంటి సిద్ధాంతములో వచ్చింది. కణాదుడియొక్క మతం. కణాదుడి వైశేషిక మతం తత్వాలుగా విభజన చేసింది. సాంఖ్య మతం ప్రకృతినే 25తత్వాలుగాను, అనేక తత్వాలుగాను విభజన చేసింది. ప్రకృతి అయితే విభజన అవుతుంది గాని, పురుషుడు విభజన అవుతాడా? పురుషుడు ఇవన్నీ చేస్తున్నాడా. కరంటే అన్ని పనులూ చేస్తోందా?

అన్ని పనులకూ కర్త వేరే ఉన్నాడు. కరంటు కేవలం ఉపాదాన కారణంగా ఉంది అంతే. కుండ తయారవటానికి ముందు మట్టిగా ఉంటుంది. మట్టి తానంతట అదే కుండయిందా? మట్టి కుండవడానికి ఇంకొక కారణం ఉంటుంది. ఒక్క కారణమేనా? తగినటువంటి నీళ్ళు పోయాలి. కుమ్మరివాడుండాలి. దాన్ని పిసకాలి. కుండ అవడానికి సరిపడేటువంటి నిష్పత్తులో బంకమట్టి, ఇసుక, నీరు, అంతేనా? ఒక బండి చక్రం ఉండాలి. ఒక కర్ర ఉండాలి. ఆ మధ్యలో ఆ కుండమట్టి పెట్టాలి. దాన్ని తిప్పాలి. దానికి చెయ్యి అడ్డం పెట్టాలి. ఏ ఆకారము చెయ్యాలనుకుంటే ఆ ఆకారం వచ్చేలా చేతులు మారుస్తూ ఉండాలి. ఇంత క్రియ చేస్తే మట్టి కుండయింది గాని మట్టి దానంతటదే కుండయిందా?

మరి ప్రపంచం బ్రహ్మవల్ల వచ్చింది అన్నప్పుడు బ్రహ్మ కారణంగా వచ్చిందన్నప్పుడు బ్రహ్మకంటే రెండవ వస్తువు లేనప్పుడు నామరూప జగత్తు, కణములతో, అణువులతో కూడినటువంటి జగత్తు ఎక్కడినుండి వచ్చింది? పరికరాలు లేవే. బండి చక్రం లేదు. నీళ్ళు లేవు. చెయ్యి పెట్టలేదు. కుమ్మరివాడు లేడు. కుమ్మరివాడు బ్రహ్మమే. నీళ్ళు బ్రహ్మమే. మట్టి బ్రహ్మమే. కర్ర బ్రహ్మమే. పరికరాలు బ్రహ్మమే. బ్రహ్మమపుడు ఇన్ని రకాలుగా ఉన్న బ్రహ్మమా? బ్రహ్మ నిరవయవము. బ్రహ్మలో ఇన్ని రకాల భాగాలు లేవు. అఖండము, అవిభాజ్యము, నిరవయము. నువ్వు నీకు శరీరము, ప్రాణము ఆ శరీరంలో మళ్ళీ అనేక రకాల అవయవాలు. అవి చేసే క్రియలు కనపడకుండా ఉండే సూక్ష్మ శరీరం. దాంట్లో మళ్ళీ కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలు అన్నీ కలిపి నేనొక్కణ్ణే అంటారు మీరు. ఒక్కళ్ళే ఎలా అయ్యారు. మీతోపాటు మీ అవయవాలు, మీ దేహాలు, మీ ఎముకలు, మీ మాంసం, మీ చర్మము, మీ సప్త ధాతువులు, మీ ఇంద్రియాలు, మొత్తం ఈ సరంజామా అంతా కలిపి ఒక సంఘాతంగా ఉంటే అది నువ్వయ్యావు. అప్పుడు నువ్వు అవయవాలతోనే ఉన్నావు. అంటే ఖండత్వంతోటే విభజనతోటే కొన్నిటియొక్క సముదాయము తోటి ఉన్నావు. నువ్వు ఒక్కడివే ఎట్లా అవుతావు. ఇందులో నేను అనేది ఎక్కడుందో చూడండి. ఇప్పుడు వీటిలో ఒక కన్ను తీసినా, కాలు తీసినా నువ్వు ఉంటున్నావు. రక్తం కొంతపోయినా నువ్వు ఉంటున్నావు. ప్రాణం పోయినా కూడా నువ్వు పునర్జన్మలో ఉంటున్నావు. ప్రాణము దేహము పోయినాకూడా ఆత్మగా నువ్వు ఉంటున్నావు. ఇంక నేనెవరు అనేది చూడాలిప్పుడు. నేనుని అలా వేరుచేస్తేనే ప్రత్యేక్ ఆత్మ. కనుక సాంఖ్యమతము, మట్టి నేరుగా కుండ అయినట్లు చెప్తోంది. వీటికాధారమయిన చైతన్యం మాట ఎత్తటం లేదు. బ్రహ్మవల్ల వచ్చింది అన్నప్పుడు బ్రహ్మ జడపదార్థమయ్యాడు. బ్రహ్మకు చైతన్యం ఉన్నట్లు చెప్పట్లేదు. జడము, చైతన్యము రెండూ వేరుచేసినట్లుగా సాంఖ్యమతము చెప్పట్లేదు, వైశేషిక మతము చెప్పట్లేదు.

న్యాయంగా ఉన్నటువంటి గౌతమ ఋషియొక్క తర్కమువల్ల ఈ ప్రకృతిలో మనకు గోచరించే దానినే విచారణ చేశాడు. న్యాయ మతంలో బుద్ధికి అతీతమైనటువంటి స్థితిని తానందుకోలేకపోయాడు. దారి చెప్పలేకపోయాడు. ఇవన్నీకూడా కొన్ని పరిమితులతో ఆగిపోయాయి.

నేను, నేను, అని మీరంటున్నారంటే ఒక్క చైతన్యమున్నటువంటిదే నేనంటుంది గాని, చైతన్యంలేని జడపదార్థం నేనంటుందా? మన రోమాలు నేనంటాయా? గోళ్ళు నేనంటాయా? నేను అని అనవచ్చు, అనకపోవచ్చు. నేననే ఒక భావన, నేననే ఒక చైతన్యము, ఈ జడమైన మనసు, ఇంద్రియాలు పనిచేయటానికి ఆధారమైనటువంటి చైతన్యము ఈ నేను ఆ చైతన్యము ఒక్కటే. చైతన్యము అనే పదం ద్వారా నేను చైతన్యము ఒక్కటే. ప్రతిబింబ చైతన్యమో, బింబ చైతన్యమో తరువాత చూద్దాం. మొత్తంమీద అది చైతన్య వస్తువు కనుక ఈ నేనుని దాదాపు బ్రహ్మయొక్క లక్షణాలతో పోల్చి చెప్పారు. బింబ, ప్రతిబింబాలు తరువాత చూద్దాం. ఎందుకంటే అదీ ప్రకాశమే. ఇదీ ప్రకాశమే. విడమర్చితే తప్ప, బింబ ప్రకాశం వేరు, ప్రతిబింబ ప్రకాశం వేరు అని తెలియదు. ప్రతిబింబ ప్రకాశమంతా మాయావరణంలో ఉంది. బింబ ప్రకాశం స్వయం ప్రకాశంగా ఉంది.

మాయకు అతీతముగా మాయకు పరముగా, నిరావరణలో ఉన్న ఆ ప్రకాశము. ఈ ప్రకాశము ఒక్కటే అని 'తత్త్వమసి' వాక్యం చెపుతుంది. మాయావరణమందున్న ప్రకాశము, నిరావరణలో ఉన్న స్వయం ప్రకాశము, ప్రకాశ రూపంలో లక్ష్యార్థంలో ఒక్కటే అన్నాం. వాచ్యార్థంలో ఉన్న మాయావరణని విడిచిపెట్టినప్పుడు అంతా నిరావరణమే. అంతా బ్రహ్మమే, బ్రహ్మము తప్ప అన్యము లేదు అనేటువంటి లక్ష్యాన్ని పెట్టకున్నప్పుడు ఆ ప్రతిబింబ ప్రకాశ జ్ఞానమే ప్రకాశము అనేటువంటి లక్ష్యార్థాన్ని ఒకటిగా పెట్టుకుంటే 'అసి' పదంగా పెట్టుకుంటే అభేదముగా పెట్టుకుంటే స్వయం ప్రకాశ బ్రహ్మ తానే అయి ఉంటాడు.

నేను, నాది అను భావము లేక అగ్నికి వేడిమివలె, సూర్యునికి ప్రకాశమువలె, ఎరుకయే 'సోహం'గా కలది ఆత్మ. అగ్ని, వేడి రెండూ వేరా? చంద్రుడు వెన్నుల రెండూ వేరా? సూర్యుడు, ఎండా ఆ రెండూ వేరా? జ్యోతి, జ్యోతియొక్క ప్రకాశము రెండూ వేరా? వేరు కాదనుకుంటాము గాని వేరుచెయ్యాలి. **అంతర్జ్యోతి । బహిర్జ్యోతి । ప్రత్యగ్జ్యోతిః । పరాత్పరః** వేరు చేసినప్పుడు లోపలి ప్రకాశము, బయటి ప్రకాశము అనే భేదము ప్రకాశము యొక్క వ్యాపకము వలన తోస్తున్నది. లక్ష్యార్థము జ్యోతి మాత్రమే స్వయంజ్యోతియై, ప్రత్యగ్జ్యోతియై ఉన్నదున్నట్లున్నది. దానియొక్క ప్రకాశము కానరాదు.

జ్యోతియొక్క ప్రకాశం మాయావరణలోనే ఉంది. దేశ కాలాదులు, మాయావరణ లేనిచోట నిరావరణయందు, జ్యోతియొక్క ప్రకాశం వ్యాపించటానికి చోటే లేదు. అప్పుడు ప్రకాశమే 'నేను' అనేటువంటి పరమాత్మ జ్ఞానం మాయావరణంలో ఏది ఉన్నదో మాయావరణ పోయేసరికి పరమాత్మ పోయాడు. అపుడు పరమాత్మకి ఆదీ అంతము ఉందిగా. ఇక పరమాత్మలో ఏ ప్రకాశముందో, జ్యోతి రూపంలో ఏది వెలుగొందుతుందో ఆ జ్యోతి కూడా వెలుగు ముద్దేగా. ఘనమైన ప్రకాశం. జ్యోతి అంటే ఘనమైన ప్రకాశము. ఘన రూపంలో ఉన్నటువంటి ప్రకాశము. స్వయం ప్రకాశమైతే, వ్యాపకమైనటువంటి ప్రకాశము, మాయావరణలో మాత్రమే వ్యాపించింది. కనుక లేనిది.

మాయావరణములో వ్యాపించిన ప్రకాశమంతా ఎరుక. కనుక పరమాత్మ అంటే ఎరుక. స్వయంప్రకాశమన్నప్పుడు స్వస్వరూపము అన్నప్పుడు ఎరుక లేదు. ఎరుక త్రిపుటిగా, ద్విపుటిగా ఉన్నప్పుడే ఎరుక. కేవలం ఘనరూప ఎరుకగా ఉండిపోతే అది నిర్గుణం అన్నట్లుగా ఉంటుంది. వ్యాపకం లేనట్టుగా ఉంటుంది. కాని ఎరుకలోనే ఉంది. దీన్నే ఘనరూప అఖండ ఎరుక అంటాం. 'ఘనరూప, అఖండ ఎరుక'. అఖండ ఎరుక అని ఎందుకనాలి? నువ్వు కొన్నివేల విషయాలు తెలుసుకుంటున్నావు. వేల విషయములయొక్క ఎరుక ఉన్నది. కాబట్టి ఎరుక కొన్ని వేలుగా, కొన్ని లక్షలుగా విభాగం చెందుతుంది. అనేక ఖండ ఎరుకలయ్యింది. గుణాలబట్టి మూడు గుణాలవల్ల మూడు ఎరుకలుగా ఉంది. విషయాలను బట్టి లక్షలాది విషయాలుగా ఎరుక ఉన్నది. తెలుసుకునేవాడిని బట్టి మూడవస్థలలో మూడు రకాలుగా ఉంది. మళ్ళీ జాగ్రదవస్థలోనే కొన్నిటిని తెలుసుకుంటుంది. రాత్రికి తెలుసుకోవటం లేదు. కనుక ఏ వస్తువయితే తానెరిగి జ్ఞాపకం పెట్టుకుంటున్నాడో అవగాహన చేసుకుంటున్నాడో అర్థం చేసుకుంటున్నాడో అది కూడా ఉదయం నుండి సాయంత్రం దాకా కొన్నివేల సార్లు, లక్షలసార్లు మారిపోతుంది. ప్రొద్దుట ఉన్న ఎరుక మధ్యాహ్నం లేదు. మధ్యాహ్నం ఉన్న ఎరుక రాత్రికి లేదు. జాగ్రదవస్థలో ఉన్న ఎరుక స్వప్నంలో లేదు. స్వప్నంలో ఉన్న ఎరుక సుషుప్తిలో లేదు. సుషుప్తిలో ఉన్న ఎరుక సర్వ అజ్ఞానము సర్వ ఎరుకలకూ ఆధారమైనది. తురీయంలో ఉండేటువంటి ప్రత్యగాత్మ అనే ఎరుక. ప్రత్యగాత్మ ఎరుకనే ఇప్పుడు వ్యవహారంలో ఉన్నప్పుడు వ్యాపకమన్నాం. ఇంద్రియాలతో, మనసుతో కూడినపుడు 'ప్రజ్ఞానం బ్రహ్మ' అన్నాం.

ఏ ఎరిగే ఎరుకైతే శబ్దాది విషయములను, శ్రోత్రాది ఇంద్రియముల ద్వారా ఎరుగుచున్నదో, ఆ ఎరిగే ఎరుకే ప్రజ్ఞానము, ఆ ప్రజ్ఞానమే బ్రహ్మ. ఎరిగే ఎరుకను వేరుచేసి క్రియా రూపంలో అనుభవ రూపంలో విషయాలు లేకుండా చేసుకుని, నిర్విషయమైతే నిర్విషయ స్థితిలో ఎరిగే ఎరుక ఘనరూపం. ఆ ఘన రూపమే 'ప్రత్యగాత్మ' ఆ ప్రత్యగాత్మయే 'బ్రహ్మ'. అయితే ఈ ప్రత్యగాత్మ ఎరుక కాదా! ఎరుక బయలవదు. బయలు ఎరుకవదు. ఎరుక పోతేనే బయలు. మరి సాక్షిరూప ఎరుక ఉందిగా ప్రత్యగాత్మలో. 'అవస్థాత్రయ సాక్షి' ఉన్నాడుగా! సర్వావస్థలకూ సర్వసాక్షిగా ఉన్నాడుగా! సాక్షి అనే ఎరుక ఉంది కాబట్టి ఎరుక ఎక్కడ ఉన్నా ఏ రకంగా ఉన్న అది లేనెరుకే. సర్వమూ మిథ్యా అనేటువంటి దృష్టితో చూచినపుడు ఆ సర్వసాక్షే కదలకుండా పూర్ణమైయుంటే అది అఖండ ఎరుక.

అఖండ ఎరుక యొక్క ఊహలో, ఎరుక పుట్టి అనేకమైతే అది అనేక ఖండ ఎరుకలవుతుంది. జీవస్థాయిలో ఖండ ఎరుకలు, నానారకాలుగా ఉన్నాయి. ఈశ్వర స్థాయిలో ఖండ ఎరుకలు, తన విభూతిగా ఉన్నాయి. పరమాత్మయందు ఎరుక శుద్ధ చైతన్యంగా ఉంది. 'పరబ్రహ్మ'మందు ఆ ఎరుక అఖండ ఎరుకగా ఉంది. ఘనరూపంలో ఉంది. ఈ ఘనము మళ్ళీ ద్రవము, వ్యాపకము అవదనే గ్యారంటీ ఎక్కడుంది? కనుక ఈ ఘనరూప అఖండ ఎరుక కూడా లేనిదే అని నిర్ణయించుకోవాలి.

మళ్ళీ ఎరుకను ఇంకొక విధంగా నాలుగు భాగాలు చేయవచ్చు. పిండ బ్రహ్మాండములు రెండు వాటికి సంబంధించిన అహములు రెండు. **పిండాండము – పిండాండ అహము, బ్రహ్మాండము – బ్రహ్మాండ అహము. వెరసి ఈ నాలుగు కూడా అఖండ ఎరుక కనరా మాతండ్రీ!** కనుక అఖండ ఎరుకే ఈ నాలుగూ కలిసివుంది. అంటే అవ్యక్తంలో ఏకంగా ఘనంగా ఉన్నప్పటికీ, ఇప్పుడు ఈ కనపడే రూపంలో ఖండత్వం లేకపోయినప్పటికీ, ఈ నాలుగూ ఖండ ఎరుకలుగా మళ్ళీ వ్యక్తమయ్యేటువంటి ఆస్కారం, ఆ ఘనరూప అఖండ ఎరుకలో ఉన్నది. ఆ ఘనరూప అఖండ ఎరుకలో మళ్ళీ వ్యక్తమయ్యే ఆస్కారం లేకుండా చేసుకునేటువంటి విచారణ, బోధ, అది పరిపూర్ణ బోధ. ఆ పరిపూర్ణ బోధతో అఖండ ఎరుకని లేనెరుకగా చూచినప్పుడే లేనిది లేకపోగా ఇంతకాలము భ్రాంతిలో ఏదైతే ఆవరించి ఉన్నదో ఆ ఆవరణ నిరావరణమై నిరావరణమందు సర్వకాలమందు సర్వదేశములందు ఉన్నదున్నట్లుగా ఉన్నది, అద్వయమయినది, ములుగ్రుచ్చ సందులేక, రెండవది అందులో ఉండనీయక నిరంధ్రమైనది, నిరాకాశమైనది, మరొకదానికి అవకాశమీయక, తనకుతాను ఉండక, అచలమైనది, పరిపూర్ణమైనది, నిర్వికారమైనది, తిరిగి ఏనాడూ సంకల్పము చేయనిది బయలు. అంటే జ్యోతియొక్క ప్రకాశము వ్యాపకము అయినపుడు ఆ ఎరుకయొక్క వ్యాపకము అసత్యము. అది స్వయం జ్యోతై యుండాలి. అది నిరావరణమై యుండాలి. దానికే దృష్టాంతం చెపుతున్నాడు. అగ్నికి వేడి ఉన్నట్లుగా సూర్యుడు ఉంటే సూర్యుడి ఎండ వేరు, సూర్యుడు వేరు అన్నట్లుగా చంద్రుడు వేరు వెన్నెల వేరు అన్నట్లుగా ఎరుకయ్యే స్వభావము కలది ఆత్మ. ఆత్మ ప్రకాశము లేకపోతే బయలు. ఆత్మ ఉండి ఆత్మ ప్రకాశము లేకపోత ఆత్మే బయలు. బయలే బ్రహ్మము.

ప్రత్యగాత్మను బయలాత్మ అని అనము. కేవలాత్మ, అఖండాత్మ, అయ్యాక ఇక బ్రహ్మనే పేరు మార్చుకోండి. అఖండాత్మ అఖండ ఎరుక, ఏదైనా గాని. **ఖండాఖండములు లేనిది ఉత్త బట్టబయలు ఏమీ లేదు** అనేదేదో ఆత్మపోతే ఉన్నదున్నట్లుంది. అంతకుముందు ఎన్ని రూపాలుగా ఉండి, చివరకు కేవలాత్మ అయ్యిందో, అవన్నీ లేనెరుకే. భ్రాంతిలోన అవన్నీ భ్రాంతి రహితమైతే బయలే ఉన్నదున్నట్లున్నది. ఆత్మ తన ప్రకాశమును విరమించుకుంటే అవ్యక్తంగా కూడా లేకుండా చేసుకుంటే ఆత్మ ఆవరణగా వ్యక్తం కాకుండా, నిరావరణగా ఉంటే అదే బయలు.

వేదాంతం ఈ రెండింటినీ సమన్వయం ఎలా చేసిందంటే, మూడొంతుల బ్రహ్మ సృష్టికతీంగా ఉన్నదున్నట్లుగా అచలముగా, పరిపూర్ణముగా నిర్వికారముగా ఉన్నాడు. ఒక వంతు బ్రహ్మను మాయ ఆశ్రయించి ఆ బ్రహ్మము నిజానికి అచలము, పరిపూర్ణము, నిర్గుణము అయినప్పటికీ, ఈ మాయ ఏ బ్రహ్మమునైతే ఆశ్రయించిందో ఆ బ్రహ్మమును సగుణముగా చూపించి, ఆ బ్రహ్మవల్ల సర్వమూ కలిగినట్లుగా సర్వకారణముగా ఉన్నట్లుగా చూపిస్తోంది.

పురుషుడు దేనితో కూడితే దానియొక్క గుణములబట్టి దానియొక్క నామముతో, రూపముతో, గుణముతో విశేషంగా చెప్పటం జరుగుతుంది. ఆ విశేషణంగా ఉన్నవన్నీ మాయా కల్పితములు. అవన్నీ తీసేసి చూస్తే, పురుషుడు మాత్రం ఎక్కడున్నాడు? పురుషుడు లేడు. ఆ పురుషుణ్ణి ఏమన్నారంటే ఉత్తమ పురుషుడని, పురుషోత్తముడని, దాన్నే ఘనరూప అఖండ ఎరుకని అంటాము. మరతను మళ్ళీ మాయావరణంలో ప్రకాశించాల్సిన పని లేకపోతే ఆ పురుషోత్తముడే అచల పరిపూర్ణము.

ఒకవంతు బ్రహ్మను మాయ ఆశ్రయించి ఈ సృష్టికార్యం చేసి ఆ బ్రహ్మనే సర్వకారణంగా చూపించినపుడు ఆ బ్రహ్మనే పొందటం వరకు ఒక ప్రయాణం. మూడొంతుల బ్రహ్మ దగ్గరకెళ్ళటానికి ఈ బ్రహ్మ జ్ఞానాన్ని కూడా విచారణ చేసి ఈ బ్రహ్మ ఎరుక బ్రహ్మే గాని, నిజమైన బ్రహ్మ కాదు. నిర్గుణమైన త్రిగుణరహితమైన ఉన్నదున్నట్లున్న అచల పరిపూర్ణమైన మూడొంతుల బ్రహ్మమే పరమపదము, మోక్షము అనేది ఈ పరిపూర్ణ బోధ ద్వారా పరిపూర్ణ బ్రహ్మ నిర్ణయాన్ని మనకు అప్పచెప్పాలి. గురువుద్వారా మార్జాల కిశోర న్యాయంగా, ఏ సాధన నీకెందుకు వీసానికి పనికిరాదు అనే పద్ధతిలో ఆ మూడు వంతుల బ్రహ్మము అనేటటువంటి అచలము సిద్ధిస్తుంది. ఈ సగుణ బ్రహ్మజ్ఞానం దాకా ఈ మాయావరణలోనే, మాయలో వ్యాపించిన బ్రహ్మను పట్టుకోవడమనేటువంటిది ఒక ప్రమాణం. ఇది సాధనతో కూడినది. అనుష్ఠానముతో కూడినది. ఉపాసనతో కూడినది. **'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి'**గా వస్తుంది. ఇది బ్రహ్మ చింతనచేసి బ్రహ్మాకారం పొందినట్లుగా వస్తుంది.

ఇప్పుడు మనం ఏం చేస్తున్నాము? దృక్కుకు దృశ్యం అన్యమని చెప్పి దృశ్యములేని దర్శనానుభవము లేనటువంటి దృక్కుని వేరుపరుస్తున్నాము. ఆ దృక్కే ఆత్మ అంటున్నాం. దృశ్యమునందు దృక్కుగా చూడబడే వస్తుజాలమునందు చూచువాడుగా ఉన్నదే ఆత్మ. చూచువాడే గానీ చూచికూడా చూడనివాడే. చూడటానికి ఆధారమైనవాడు. చూచి చూడనివాడు. చూచేది మళ్ళీ మనస్సు, బుద్ధి, ఇంద్రియాలే. ఇంద్రియాలకు సత్తా అందితే అవి చూస్తున్నాయి. అవి చేసేది నువ్వు కాదు. నీవు సత్తా మాత్రంగా చైతన్యం మాత్రంగా శుద్ధ చైతన్యంగా ఉన్నావు. కనుక దృక్కు దృశ్య వివేకాన్ని పైకి నడిపితే దృగాత్మగా ఏది ఉన్నదో అది బయలే. దానికి దృశ్యము దర్శనము అనేటువంటి అనుభవాలు లేవు. ఈ అనుభవాలతో కూడినటువంటి ఎరుక కాదు. దృశ్య దర్శనానుభవాలమీద ఏ ఆధారమువల్ల తాను ఎరుకలోకి దిగుతున్నాడో ద్రష్టత్వం సంభవిస్తోందో, అటువంటి దృక్కులో దృశ్యదర్శనాలు లేకపోతే ద్రష్టత్వంనుంచి విడుదలవుతాడు. ఎరుకనుంచి కూడా విడుదల అవుతున్నాడు. ద్రష్టత్వం పోయేసరికి తనలో ఉన్న ఎరుకనుంచి విడుదల అవుతున్నాడు. తనలో నుండి ఎరుక విడుదలవడానికే **'మూలం లేని గుర్తెరిగే శరీరం, గుర్తెరిగే దృక్కు ఏమీ లేదు'** అని చెబుతున్నాము. దృక్కుకు చెబుతున్నాం ఆ మాట. ద్వాదశిలో ఏమి చెబుతున్నాము. ఈ ఉత్త బట్టబయలు ఏమీలేదు అని దృశ్య రహితం, దర్శన రహితం చేస్తున్నాము. దృశ్యము రహితమయినపుడు అంతా ఉత్తదే అయినపుడు ఈ ఉత్త బట్టబయలు ఎరిగేది కాదు కదా. మరి ఎరిగే ఎరుక ఇంకెక్కడున్నాడు? ఎరిగే దృక్కు కూడా బట్ట బయలయ్యేసరికి, దృక్కుకు తన ఉనికి కలిగి ఉన్నట్లు భ్రాంతి ఇంకా ఉన్నది. దృశ్య రహిత స్థితిలో ఉన్నాడు. దర్శనానుభవం రహిత స్థితిలో ఉన్నాడు. మూడు గుణాలే దృశ్యానికి, దర్శనానికి, అనుభవానికి హేతువు కనుక అవన్నీ ఎప్పుడైతే లేవో, త్రిగుణ రహితమవుతున్నాడు. త్రిగుణ రహిత స్థితిలో నిజానికి ఎరుక లేదు. మరి సచ్ఛిష్యుడు ఎరుకతో ఉన్నాడు కదా! త్రిగుణ రహితము ఇంకా కావలసి ఉన్నది. బయలు నిర్ణయంగా ఉన్నాడు. కనుక ఎరుక విడిపించేటువంటి గురువు కావాలి. ఆ శిష్యుని ఉనికే బ్రహ్మ నిష్ఠగా ఉంది. అటువంటి ఉనికియే నిష్ఠగా ఉన్నటువంటి దృక్కుకు **మూలంలేని గుర్తెరిగ శరీరం ఏమీలేదనే** షోడశీ మంత్రంతో ఎరుక లేకుండా చేస్తున్నాడు గురువు.

ఇట్లా స్వయం ప్రకాశమైనటువంటిది, నిరావరణంగా ఉండి ఆవరణయందు ప్రకాశించకుండా ఉండేటువంటి కేవలాత్మ, ఆత్మ స్వరూపుడు కాదు. విషయ సమత్వం పొందిన సాధకుడు ఇట్టి ఆత్మ అల్పద్రష్ట కాదు, క్రమద్రష్టకాదు, అద్రష్టకాదు, అన్యథా ద్రష్ట కాదు. అంటే చూడండి. ఇందులోనే మొత్తం వేదాంతమంతా వచ్చింది.

అల్పద్రష్ట కాదు: అంటే కించిజ్ఞుడు కాదు. జీవుడు కాదు. క్రమద్రష్ట కాదు: క్రమ పరిణామము చెందుతున్నదని దర్శించేవాడు కాదు. అద్రష్ట కాదు: అద్రష్ట అంటే సుషుప్తి, మరణము, అజ్ఞానము లేనివాడు. అన్యథాద్రష్ట కాదు: తన్ను తానెరుగకుండా ఇతర విషయాలను ఎరిగే దాన్నుంచి విరమించుకున్నవాడు. ఇవన్నీ పోతే అంతఃకరణ సాక్షిగా ఉండి నిర్ణయించేవాడు. ఆ సాక్షికే ఈ పరిపూర్ణ బోధ. చివరికి ఆ సాక్షే లేనివాడైతే, వాడే బయలై సాక్షిరూప ఎరుక కూడా ఏమీలేక, అసలు ఎరుక రూపమే లేనివాడు.

ఆత్మ సూర్య ప్రకాశమైతే, బుద్ధి చంద్రప్రకాశము. ఎట్లా అంటే, సూర్యప్రకాశమే చంద్రుడు అనే గ్రహం మీద, గోళంమీద పడి, చంద్ర ప్రకాశం వెన్నెలగా మనకు వస్తుంది. సూర్య ప్రకాశం లేకపోతే చంద్రుడికి వెన్నల లేదు. సూర్యప్రకాశం యొక్క ప్రతిబింబ ప్రకాశమే, ప్రతిఫలించిన ప్రకాశమే వెన్నెల. అలాగే సూర్య ప్రకాశంలాంటి ఆత్మ, నీ యందు ప్రకాశిస్తూ ఉంది. ఒక గోళంలాంటి బుద్ధి, ఆ బుద్ధిమీద ఆత్మ ప్రకాశం పడి ప్రతి ఫలించి, ఆ ప్రతిఫలించిన ప్రకాశం తోటి, అహం అహం అనే స్ఫురణ కలిగింది కనుక, బుద్ధిలో ప్రతిబింబించిన ప్రకాశమే చిదాభాసుడు. చిదాభాసుడు అంటే, చైతన్య ప్రకాశము యొక్క ప్రతి బింబ ప్రకాశము. 'భాస' అంటే ప్రకాశము. 'ఆభాస' అంటే ప్రతి ఫలించిన ప్రకాశము. 'చిత్ ఆభాస' – చిత్ ప్రకాశము యొక్క ప్రతి బింబ ప్రకాశము. 'చిత్' ప్రకాశము యొక్క ప్రతి బింబ ప్రకాశమే నేను, నేను అనే 'అహం' స్ఫురణ, 'నేను' అనే ఉనికి. ఉనికే ఆ తరువాత 'నేను' అయ్యింది.

'ఉండుట' అనే ఈ నేను అనే అహం మానవునిలో ఉంది. పశుపక్ష్యాదులలో లేదు కాని, ఉన్నాయని వాటికి తెలుసు. ఉన్నాయని తెలియడమే ఉనికి. ఆ ఉన్నాయని తెలియడము బుద్ధి యొక్క ప్రతిఫలించిన ప్రకాశము. అట్లాగే ఆత్మని సూర్యుడితో, బుద్ధి యొక్క ప్రకాశాన్ని, చిదాభాసుడిని వెన్నెలతో పోల్చారు. మనలో కూడా అంతఃకరణ ప్రతిబింబ ప్రకాశమే నేను. అంతః కరణంలో ప్రముఖమైనది, ముఖ్యమైనది బుద్ధి. ఎందుకంటే, బుద్ధి నిర్ణయం ప్రకారమే అన్నీ జరగుచున్నవి కనుక. బుద్ధి నిర్ణయానుసారము అయినటువంటి జ్ఞానము, ప్రతిబింబ ప్రకాశ జ్ఞానము.

ఆత్మ ప్రకాశంలో ఏముంది? చిత్ జ్ఞానం ఉంది. తాను తానైనటువంటి జ్ఞానము ఉంది. బుద్ధి విషయాలతో కూడితేనేమో, బుద్ధి ద్వారా ప్రతిబింబించిన ప్రకాశములో, ఈ నేను అసత్యనేను, విషయాలతో కూడిన నేను అవుతుంది. అదే బుద్ధి శుద్ధమై, చిత్త వృత్తి లేక అంతఃకరణము నిర్మలమై ఉంటే, ఆత్మ ప్రకాశము అటువంటి బుద్ధి మీద ప్రతిబింబిస్తే అది యదార్ధ నేను. అహం అనే స్ఫురణ, సోహం అనే జ్ఞానము. అతి సమీపంగా ఉన్నందున ఆత్మ ప్రకాశానికి బుద్ధి అతి సమీపంగానే ఉండడము వల్లనే సూర్యరశ్మి ప్రతిఫలించిన ప్రకాశము, చంద్రుని యొక్క వెన్నెలలాగా ఎలా వుందో, బుద్ధి ప్రకాశము అలా ఉంది. బుద్ధి గతమైన జ్ఞానము ప్రతిబింబ జ్ఞానమే. అది నేను అనే దానితో కూడి ఉంటుంది. అప్పుడు నేను అసత్య నేను అవుతుంది. మిథ్యాహం. ఇక్కడ సమీప అనే పదం ఎందుకు వాడారు?

వెలిగించి ఉన్న స్టవ్ మీద, మంటమీద గిన్నె పెట్టారు. మంట, గిన్నె కలిసిపోయినాయా? ఆ గిన్నెకు అతి సమీపంగా ఈ మంట ఉన్నది. ఆ మంట యొక్క అగ్ని తత్త్వము గిన్నెకు తాకి, గిన్నె వేడెక్కింది. దూరంగా ఉంటే వేడెక్కలేదు. సమీపంగా ఉంటే వేడెక్కింది. గిన్నె మంట కలిసిపోయినాయా? అలాగే, బుద్ధి ఆత్మ కలిసిపోవు. ముఖ్యంగా ఆత్మ బుద్ధితో కలువదు.

ఆత్మ ప్రకాశము వల్ల, బుద్ధి ప్రతిఫలించి, ప్రకాశించి బుద్ధి కర్మానుసారణి అనే పద్ధతిలో, బుద్ధి కర్మల విషయంలో చేయాల్సిన విధంలో కర్మ అనుభవం వచ్చిన తరువాత దానిని ప్రియంగానో, అప్రియంగానో ఎలా స్వీకరించాలనే విషయాన్ని బుద్ధి నిర్ణయిస్తుంది. బుద్ధి నిర్ణయం చేసే జ్ఞానం ఏదైతే ఉందో, అది ఆత్మ ఆత్మప్రకాశం యొక్క ప్రతిబింబించిన ప్రకాశం. ఇక్కడ ప్రకాశము అంటే జ్ఞానము. అంటే ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞానము యొక్క ప్రతిబింబ జ్ఞానమే బుద్ధి జ్ఞానము. శుద్ధ బుద్ధి అయితే రెండూ ఒక్కటే. ఆత్మప్రకాశము, బుద్ధి ప్రకాశము, బింబ, ప్రతిబింబ ప్రకాశములలో ఏ భేదము ఉండదు. కాని, బుద్ధి విషయాలతో కూడినప్పుడు. బుద్ధి ప్రకాశము విషయానుభవాన్ని ఇస్తుంది కానీ, ప్రకాశ అనుభవాన్ని ఇవ్వడం లేదు. ఈ రెండూ సూర్యరశ్మి ప్రకాశ మాత్రమున జరుగుచున్నాయి కాని, సూర్యరశ్మికి ఏ మాలిన్యము అంటటడం లేదు.

ఇంకొక ఉదాహరణ. సూర్య ప్రకాశమువల్ల, సముద్రంలో నీళ్ళన్నీ ఆవిరై, మేఘమై, వర్షం పడుతోంది. సముద్రంలో ఉప్పునీరున్నా, ఉప్పునీటిలో కూడా మంచినీరే ఆవిరైనది. మురుగు గుంటలో నీరు కూడా ఎండ వేడికి ఆవిరైతే, మంచి నీరే లాక్కుంది. అది మేఘమై వర్షించింది. మంచి నీళ్ళు గాని, ఉప్పునీరు గాని, మురికి నీరు కాని, ఏ నీరైనా సరే, పేరుకు మలం ఉంది. మలము సూర్యప్రకాశముతో ఎండిపోయింది. ఆ మలంలో ఉన్నటువంటి ద్రవాన్ని కూడా ఆ సూర్యరశ్మి, ఆ సూర్య కిరణాలలో ఉన్నటువంటి వేడి, పీల్చి, ఆ శుద్ధ జలాన్ని మేఘరూపంలో పెట్టి, మళ్ళీ వర్షించింది. కనుక సూర్యరశ్మి ఉప్పునీళ్ళ మీద పడ్డా, మలినమైన నీళ్ళమీద పడ్డా, మలంమీద పడ్డా దేనిమీద పడ్డా వాటియొక్క మాలిన్యం సూర్యరశ్మికి ఎలా అంటలేదో, సూర్యుని యొక్క ఉష్ణత్వం వలన అన్ని పనులు ఎట్లా అవుతున్నాయో, అట్లా ఆత్మ వీటన్నింటికీ అసంగము. ఆత్మకు వీటన్నింటితో అంటు కానీ, సంగత్వం కానీ లేదు.

అందుకే సమీపం అనే పదం వాడారు. ఉప – అని వాడుతూ ఉంటాము వేదాంతంలో. ఉప వాసము. సమీపంలో వశిస్తున్నాము. ఆత్మకు సమీపంగా వశిస్తున్నాము. ఆత్మే అయ్యావు అనేది కరెక్టు కాదు. అయితే సమీపంగా వశిస్తున్నాము అనే మాట భ్రాంతిలోనే. ఆత్మ వేరు, నేను వేరు అన్నప్పుడే కదా ఉపవాసము. కాని నీవే ఆత్మవి అయినప్పుడు భ్రాంతి పోయినప్పుడు నీవు ఆత్మవి. నీవే ఆత్మవి అయినప్పుడు ఆత్మకు సమీపంగా ఉండేది ఏముంది? అంటే, భ్రాంతిలో ఉన్నాం కాబట్టి, అజ్ఞానంలో ఉన్నాం కాబట్టి, అజ్ఞాన నివృత్తి చేసుకుంటూ, భ్రాంతి రహితం చేసుకుంటూ, భ్రాంతిలో చేసే ప్రయాణంలో సమీపానికి వెళ్తాం. భ్రాంతి రహితం అయిన తరువాత, ప్రయాణమే లేదు. ఒక్క ముసుగు తొలగింది అంతే! ఒక తెర చినిగింది అంతే!

తెర ఉన్నంత వరకూ స్వప్రకాశము స్వానుభవానికి రాలేదు. స్వయం ప్రకాశము స్వానుభవానికి రాలేదు. అజ్ఞాన ఆవరణ అనే తెర తొలగేసరికి, స్వస్వరూపము ఉన్నది ఉన్నట్లుగానే సాక్షాత్కరించింది. ఎక్కడినుంచో వచ్చిందా? ఎక్కడి నుండి రాలేదు. అలాగే ప్రతిబింబ ప్రకాశము వల్ల, విషయాలు గ్రహించబడి, విషయ జ్ఞానంగా మారింది. ఈ ప్రతిబింబ ప్రకాశము, బుద్ధిమీద పడి ప్రతిఫలించిన ప్రకాశము. ఆ ప్రకాశంలో బుద్ధియొక్క దోషాలన్నీ ఉంటాయి. కర్మ దోషాలు, గుణ దోషాలు అన్నీ ఉంటాయి. బింబ ప్రతిబింబ ప్రకాశాలు ఎలా కలుస్తాయి?

సూర్యుని యొక్క వెలుగులో, చంద్రుని యొక్క వెలుగు తెలిపోయి లేనిదౌతుంది. అంటే, ఉన్నదేదో ఉంటుంది. లేనిది లేకుండా పోతుంది. కలవడం అనేది ఏమీ లేదు. ఆ ఏకం అవ్వడం, జీవేశ్వర ఐక్యము, బ్రహ్మైక్యము, కల్సిపోయింది అనే మాటలు వాడుతూ ఉంటాము. అయితే ఒకటి ఉన్నది, ఒకటి లేనిది. రెండూ కలిస్తే ఏమౌతుంది? ఉన్నదే ఉంటుంది, లేనిది లేకుండా పోతుంది. 'ఉన్నది' అనే సాక్షాత్కార జ్ఞానములో 'లేనిది' ఏదైతే ఉన్నదనే భ్రాంతిలో ఉందో, ఆ భ్రాంతి రహితమయ్యే సరికి అన్యము లేదు. లేనిది లేకుండా పోయింది. లేనిదే లేకుండా పోయింది. లేనిదానికి, ఉన్నదానికి ఐక్యత ఎలా కుదురుతుంది? కాని, భ్రాంతిలో చేసే ప్రయాణంలో ఐక్యత అనే మాట వాడుతారు. కనుక ఈ ఐక్యత అనే మాట వాడినంత మాత్రాన, ఆ పరమాత్మ ఈ త్రిగుణాత్మకమైన సృష్టికి అంటిలేదు, సంగమించి లేడు. అసంగడు గానే ఉన్నాడు.

అదే తానైన వాడికి, తాను తానైన జ్ఞానము ఉన్నవాడికి, తాను అద్వయము, అనన్యము కనుక, అన్యము లేదు కనుక, అతనికి ఈ ప్రపంచమే తోచదు. ప్రపంచమే లేనప్పుడు ఇంకా మాలిన్యం అంటుకునేది ఏమున్నది? ఇతర వస్తు సాన్నిధ్యమును బట్టే, సూర్యుడిని జగత్ చక్షువు అని చెప్పుచున్నారు. జగత్తు మొత్తానికి సూర్యుడు సాక్షిగా ఉన్నాడంటున్నారు. సూర్యుడు నిజంగా చూస్తున్నాడా? సూర్య ప్రకాశం యొక్క సత్తాచేత చూచుట అనేది జరుగుతోంది. అయినా సూర్యుడిని జగత్ చక్షువు అన్నాం.

సూర్యచంద్రుల సాక్షిగా, పంచభూతాల సాక్షిగా అని ప్రమాణాలు, ప్రతిజ్ఞలు చేయించుతూ ఉంటారు. అంటే, సూర్యుడు సాక్షిగా ఒక కన్నుబెట్టి చూస్తున్నాడా? లేక సాక్షిగా ఏమన్నా సాక్ష్యం చెబుతాడా? అది కాదక్కడ. సూర్యప్రకాశము ఎల్లెడలా ఉండి, ఆ సత్తా అందుబాటు అయినప్పుడు, జీవ సృష్టి అంతా కూడా సూర్యప్రకాశంలో ఉండే శక్తి చేతనే, మనుగడ సాగిస్తోంది. అయిన సూర్యుడిని కర్మ సాక్షి అని, జగత్ చక్షువుగా ఉందని అంటున్నాము. ఆ ప్రకాశమే జ్ఞానము కాబట్టి అది జ్ఞాన చక్షువు. సూర్యుడు అనేది ఒక ఉదాహరణ, సూర్యుడికి కూడా ఆత్మస్వరూపుడు అయినవాడు సూర్యనారాయణుడున్నాడు. సూర్యుడు వేరు, సూర్య నారాయణుడు వేరు. సూర్యుడు బయటకు మండేటటువంటి గోళం. అందులో ఉన్నటువంటి అంతర్యామి నారాయణుడు. అందుకని 'సూర్యనారాయణ' అంటూ ఉంటారు. ఆదిత్య హృదయం అంటారు. సూర్యుడిని కొలిచినా, సూర్యుడిలోపల ఉన్నటువంటి నారాయణుడిని కొలిచినా, బయటకి సూర్యుడే అయినప్పటికి అంతర్యామిని కొలుస్తున్నాము.

అలాగే గురువుగారి యొక్క శరీరానికి నమస్కారం పెట్టినా, ఆ గురువులో ఉన్నటువంటి అంతర్యామి అయినటువంటి, జ్ఞానస్వరూపానికి నమస్కరిస్తున్నారు మీరు. గురువుగారి శరీరానికైతే నమస్కారం పెట్టాల్సిన అవసరం లేదు.

సూర్యునకు నేను అని కాని, నాది అని కాని ఒక్క కోరిక గాని లేదు. అతని సాన్నిధ్యము మాత్రముననే చీకటి పోయి వెలుగు వచ్చి, సర్వము ప్రకాశించుట వలన, జీవజాలము మనుగడ సాగిస్తున్నాయి. ముందు సూర్యుడు లేకపోతే, అంతా చీకటిగా ఉన్నప్పుడు తరువాత ఆ సూర్యుని యొక్క ప్రకాశం చేత, చీకటి అనేది లేకపోయి, అంతా ప్రకాశముగానే ఉంటోంది. అలాగే సృష్టికి పూర్వము తమస్సుగా అజ్ఞానాంధకారముగా ఉండేటటువంటి గాడాంధకారమున్నది. అందులో పరమాత్మ ప్రకాశించే సరికి, ఈ జగత్తంతా కూడా ఆ గాడాంధకారము తొలగి, ప్రకాశవంతం అయ్యింది. ఈ ప్రకాశవంతమైన దానిలో, ప్రకాశము వరకే తీసుకుందాము. చైతన్యము కూడా ఉంది కాబట్టి, ఆ పరమాత్మలో సృష్టి అంతాకూడా చైతన్యవంతం అయ్యింది. ఆ పరమాత్మలో ప్రజ్ఞానం కూడా ఉంది కాబట్టి, ప్రజ్ఞానవంతం అయ్యింది. ఆ పరమాత్మ యొక్క సాన్నిధ్యము చేత, ప్రకాశవంతమైంది, చైతన్యవంతమైంది, ప్రజ్ఞానవంతమైంది.

లక్క, చెక్క చక్కగా అంటుకొనును. బుద్ధి, ఆత్మ అట్లు కాదు. రెండు చెక్కలకు మధ్యలో లక్క వేస్తే, బిగిసి పోతుంది. (లక్క అంటే ఇప్పుడు ఫెవికాల్ అంటాం) ఇవాళ కుర్చీలు, బల్లలు చేయాలంటే, సన్‌గ్లాస్ తీసుకువచ్చి, ఫెవికాల్ పెట్టి అతికిస్తారుగా! అది గట్టిగా అంటుకుపోతుంది. అంటే, లక్కకి, చెక్కకి అంటుకునేటటువంటి తత్వం ఉంది. మరి ఆత్మకి, బుద్ధికి ఉందా? అందుకే సాన్నిధ్యం అంటున్నాడు. దాని ప్రభావం బుద్ధి మీద పడ్డప్పటికీ, ఏమీ కలవడం లేదు. ఆత్మ, బుద్ధి రెండూ కలవడం లేదు. లక్క, చెక్క అంటుకుంటుంది. కాని బుద్ధి, ఆత్మ అట్లా కాదు. అవి భ్రాంతిలో కలుస్తాయి అంటున్నాము. కలుస్తుందని అంటే సాధనచేత విడదీస్తే లేనిది లేకుండా పోతుంది. భ్రాంతి రహితం అవుతుంది. సత్యవస్తువు సాక్షాత్కారం అవుతుంది. అంతకు ముందు ఉన్నవాడు, దీనిలో ఐక్యమయ్యాడని, ఇలాంటి ఒకమాట వేదాల్లో ఉంది. విచారించితే ఐక్యత అనేది లేదు.

నీళ్ళు నిప్పులో ఐక్యం అయినప్పుడు, నీరు ఆవిరియై నిప్పే ఉంటుంది. నిప్పు నీళ్ళలో ఐక్యం అయినప్పుడు, నీళ్ళల్లోని నిప్పు ఆరిపోయి, నీరే ఉంటుంది. అట్లా రెండవది లేనిది లేకుండా పోతుంది. ఉన్నది ప్రముఖంగా, ఘనంగా, గొప్పగా ఏదైతే ఉందో అది బ్రహ్మ అనేటటువంటిది అన్నిటికంటే, అన్నిటికంటే గొప్పదై, దానికంటే గొప్పది లేనిది. కోటానుకోట్ల రెట్లు, ఈ ప్రాపంచిక వస్తువుల కంటే ఎక్కువైనది. కనుక దానియందు ఏదైనా సరే, విలీనమైపోతుంది.

సూర్యగోళంలో ఉన్నటువంటి, లక్షల డిగ్రీల సెంటీగ్రేడ్‌లో లేక ఫారెన్ హీట్‌లో, ఉన్నటువంటి ఉష్ణములో ఎటువంటి వస్తువులైనా సరే, తమ అస్తిత్వాన్ని కోల్పోతాయి. ఆ నామరూపాల్ని కోల్పోతాయి. అదే విధంగా దానిని ఐక్యతగా తీసుకోకూడదు. మనస్సు వెళ్ళి ఆత్మలో కలిస్తే, మనోలయం అవుతుంది. ఆత్మే మిగులుతుంది. మనస్సే భ్రాంతికి మూలం. మనస్సే మాయ. మాయే లేని మాయ. లేని మాయ అంటే, లేని మనస్సే. లేని మనస్సే ఆత్మలో కలిసిపోయింది. ఆత్మలో మనస్సు విలయమైంది అన్నప్పుడు, మనస్సు యొక్క అస్తిత్వము లయం అయ్యింది అంటున్నాము. అసలు ఆ మనస్సే లేనిది అన్నప్పుడు, లయం అనే మాట ఎక్కడ ఉంటుంది అసలు? ఐక్యతా ఉండదు, లయము ఉండదు. లేనిది లేకుండా పోవడమే. ఉన్నది ఏదో దాని యొక్క సాక్షాత్కార జ్ఞానం. నీకు లభించిన తరువాత, ఆ జ్ఞానం ఎటువంటిది అంటే, **'ఏకమేవాద్వితీయం బ్రహ్మ'** – అనేటటువంటి జ్ఞానం. కనుక అటువంటి జ్ఞానంలో బ్రహ్మతప్ప రెండవది ఉండదు.

కనుక రెండవది ఉంది, ఉంది అనేటటువంటి భ్రాంతి ఏదైతే ఉందో, ఆ భ్రాంతి రహితమైతే ఇది సాక్షాత్కారమౌతుంది. లేక సాక్షాత్కారమైతే భ్రాంతి రహితమౌతుంది. తాడు మీద పాము తోచినప్పుడు, తాడు యొక్క సాక్షాత్కారము అయితే, తాడే అనేటటువంటి అనుభవం కలిగినప్పుడు, అది తప్ప రెండవది లేనప్పుడు, పాము అనే భ్రాంతి ఎక్కడ ఉంటుంది? పైగా పాము, తాడు. రెండూ ఎక్కడ ఉన్నాయి? భ్రాంతిలో తాడే. పాముగా కనబడింది. భ్రాంతి రహితం అయితే, పాము కనబడనే కనపడలేదు. ఆ స్థానంలో సత్యవస్తువు అయినటువంటి తాడు కనబడింది. ఇప్పుడు పాము, తాడులో లయం అయ్యింది అంటామా? అలాగే మనస్సు, బుద్ధి ఆత్మలో లయం అయ్యింది అంటామా? కానీ, ప్రతీతి. ఇలా అంటున్నారు. కాని మనం అవగాహన చేసుకోవాలి. అటువంటి ఐక్యత, నిజమైన ఐక్యత కాదని, మనోలయం అంటే, భ్రాంతి పోయిందని అర్థం చేసుకోవాలి. భ్రాంతి పోతే సత్యవస్తువు ఉన్నది ఉన్నట్లుగానే గోచరమౌతుందా? నీవే అది అయినప్పుడు గోచరం కూడా కాదు. సాక్షాత్కారం అవుతుంది. నీవే ఆ బ్రహ్మము అయినప్పుడు బ్రహ్మ కనపడేదేమిటి? తాడు, పాము రెండూ కనబడడం కాదు. అందులో తాడు నీవే అయివున్నావు. తాడు నీవైనప్పుడు, తాడు నీవనే అనుభవం నీకు ఉంటుంది కానీ, తాడు అన్యముగా ఉండదు కదా! తాడు పరోక్షము కాదు. అది అపరోక్షము. అలాగే బ్రహ్మ అపరోక్షము.

బాల్యంలో ఉన్నప్పుడు బాల్యానుభవం ఉంది. యవ్వనానుభవం లేదు. యవ్వనంలో యవ్వనానుభవం ఉంది. బాల్యానుభవం పోయింది. యెక్కడికి పోయింది. బాల్యానుభవం? యవ్వనానుభవంలో లయం అయ్యిందా? అట్లా అంటే అనవచ్చు కానీ, అది కరెక్టు కాదు. అదే మనోలయం అన్నా, జీవేశ్వర ఐక్యం అన్నా, జీవ బ్రహ్మ ఐక్యం అన్నా. జీవ భావము, అజ్ఞానము చేత ఒక భ్రాంతిలో పుట్టింది. అజ్ఞానం చేత అవిద్యచేత భ్రాంతిలో పుట్టింది. అజ్ఞానం తొలగగానే, భ్రాంతి రహితం కాగానే, పుట్టిందనే మాటే అబద్ధం. పుట్టిందే అబద్ధమైతే, మళ్ళీ లయమా ? పుట్టినదానికి లయం ఉంటుంది కానీ, పుట్టని దానికి లయమేమిటి? పుట్టటం అబద్ధమైనప్పుడు, లయం కూడా అబద్ధమే. ఐక్యత అనేమాట వాడినప్పటికిని, దానిని ఆ రకంగా తీసుకోకూడదు.

సూర్యునికి, 'నేను' అని కాని, 'నాది' అని కాని, ఒక్క కోరిక గాని లేదు. కాని సూర్యరశ్మివల్ల మొక్కలు పెరుగుతున్నాయి. పత్రహరితం అవుతోంది. పళ్ళు, కాయలు అన్నీ వస్తున్నాయి. చీకటి తొలుగుతోంది, ప్రకాశం ఉంటోంది. సూర్యుని యొక్క శక్తి చేత, జీవచైతన్యం అంతా కూడా, ఈ భూమి మీద ఉంటోంది. ఆ సూర్యుని యొక్క ఆకర్షణ, వికర్షణ చేత, మనకు అర్థం కాని శక్తి ఏదైతే ఉందో, దాని వల్ల భూమి సూర్యుని చుట్టూ తిరుగుతోంది. సూర్యునికి 'ఢీ' కొట్టకుండా, సూర్యునికి దూరంగా వెళ్ళకుండా, ఒక కక్ష్యలో భూమి తిరుగుతోంది. భూమిని తన చుట్టూ అలా తిప్పించుకునే శక్తి సూర్యుడిలో ఉంది. ఆ శక్తిగా అక్కడ ఉన్నాడు, అంతే! శక్తిని వినియోగించే కర్తగా లేడు. సూర్యుడు సహజంగా ప్రకాశిస్తున్నాడు. ఆ సహజ ప్రకాశంలో కొన్ని శక్తులు ఉన్నాయి. దానికి ఒక స్వభావం ఉంది. దానితో పాటు దానికి ఆ లక్షణం ఉంది. అది తీసేసేది కాదు. అది ఉన్నంత సేపూ దాని లక్షణం అలానే ఉంటుంది. ఆ లక్షణాన్నిబట్టి ప్రకృతిలో ఏమేమీ జరగాలో అవి జరుగుతున్నాయి. ఇవన్నీ ఆయన జరుపుతున్నాడా? ఆయనకు ఇచ్ఛా ప్రయత్నాలు లేవు.

కరెంటు ఏమైనా ఫ్యాన్‌ని త్రిప్పుతోందా? కరెంటు ఫ్యాను యొక్క నిర్మాణంలో, గోళకములో ఉనికి కలిగియున్నది. లైట్‌లో కూడా ఉనికి కలిగియున్నది. ఏసీలో ఉనికి కలిగియున్నది. ఏసీని చల్లబరిచేటటువంటి పని కరెంటుది కాదు. వేడి చేసే పనీ కాదు. ఫ్రిజ్‌లో చల్లగా ఉంచే పనీ కాదు, ఫ్యానుని త్రిప్పే పనీ కరెంటుది కాదు. అయితే కరెంటు లేకుండా అవుతుందా? అంటే, సాన్నిధ్యంచేత అవుతోంది. అది కర్త, భోక్త కాదు. అక్కడ నేను, నాది అనేది లేదు. దాని యొక్క సాన్నిధ్యంచేత, దానికి ఏ లక్షణాలు అయితే ఉన్నాయో, ఆ లక్షణాలు ఈ ప్రకృతికి సంబంధించిన వస్తువుల మీద పడి ప్రభావం చూపించినప్పుడు, ఆ ప్రభావానికి ఈ వస్తువులలో పరిణామం జరుగుతోంది. చూసేది ఉంటే కన్ను చూస్తోంది, వినేది ఉంటే శ్రోత్రేంద్రియము వింటోంది, ఆలోచించేది ఉంటే మనస్సు ఆలోచిస్తోంది. ఆత్మ ఆలోచించడం లేదు. ఆత్మ కేవలం సత్తా మాత్రంగా ఉండి, మనస్సుకు, బుద్ధికి ఇంద్రియాలకు సన్నిహితంగా, సాన్నిధ్యంగా ఉంది. అంటకుండా అసంగంగా విలక్షణంగానే ఉంది.

కాని, దాని చైతన్యంచేత, దాంట్లో ఉన్న ప్రజ్ఞానం చేత, దాంట్లో ఉన్న ప్రకాశం చేత, ఈ ప్రకృతిలో వ్యాపకత్వము, జడత్వానికి చేతనత్వాన్ని ఇవ్వడం, ఏ జ్ఞానము లేనటువంటి జడవస్తువులో జ్ఞానము కలిగించడము. మనసుకి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు ఎక్కడి నుంచి వచ్చినవి? జడమైన మనస్సు అది. కనుక 'ప్రజ్ఞ' మనస్సులోకి వచ్చేసరికి, ఈ రకంగా ఈ పనులన్నీ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులన్నీ గ్రహించగలుగుతోంది. ఆత్మకు కర్తృత్వము లేదు, భోక్తృత్వము లేదు. ఆత్మ సహజంగా ప్రకాశిస్తుంది. ఆ ప్రకాశ లక్షణంలో ఒక సత్తా ఉంది. ఆ సత్తా వలన ఈ ప్రకృతి యొక్క పదార్థాలు, పరమాత్మ యొక్క ప్రకాశానికి, అతి సన్నిహితంగా ఉండడంచేత, ఆ ప్రభావానికి లోనై, ఈ జడమైన ప్రకృతి చైతన్యవంతమై, నానా రకాలుగా పరివర్తనం చెందుతూ, పరిణామం చెందుతూ, వికారం చెందుతూ ఉన్నది.

అతని యొక్క ప్రకాశత్వములో కర్తృత్వము లేదు. సూర్యుడికి తాను ప్రకాశించాలి, ప్రకాశించకూడదు అని, రెండు రకాల ఆలోచనా కర్తృత్వము ఉంటే, ఇక్కడ ఈ దేశంలోనే ప్రకాశిస్తాను, నేను ఆ దేశంలో ప్రకాశించను అనవచ్చును. వర్షం ఉంది. అది నేను పొలాల్లోనే పడుతాను, సిమెంట్ రోడ్‌పైన పడితే లాభం ఏమిటి? 'నేను పడను' అంటోందా? ఆ వర్షం పడేదానికి కర్తృత్వం లేదు. ఆ విధంగా కొన్ని పరిస్థితులలో వర్షిస్తోంది. ఆ వర్షించేది రాళ్ళమీద పడుతోందో, పంట పొలాలకు అవసరంగా పడుతుందో తెలియదు దానికి. సూర్యుడు కూడా అంతే! ఎక్కడ ప్రకాశించాలి, ఎక్కడ ప్రకాశించకూడదు అనేటటువంటి ఇష్టాయిష్టాలు, ఇచ్ఛా ప్రయత్నాలు ఉన్నాయా? సూర్య ప్రకాశానికి ఒకచోట తక్కువ ప్రకాశించాలి, ఒకచోట ఎక్కువ ప్రకాశించాలి, ఒకచోట ప్రకాశించను, ఒకచోటనే ప్రకాశిస్తాను అనే ఇచ్ఛా ప్రయత్నంగాని, కర్తృత్వం గాని, సూర్యుడికి లేదు. అలాగే ఆత్మప్రకాశానికి, ఆత్మకి, పరమాత్మకి కూడా ఇవి లేవు. మరి జరుగుచున్నదానికి పరమాత్మదే బాధ్యత అంటారేమిటి? పరమాత్మ రక్షించాలని, పరమాత్మ అనుగ్రహించాలని అంటారేమిటి? పరమాత్మ కేవలం ప్రకాశ లక్షణంచేత ప్రకాశిస్తే, ఆ లక్షణంలో ఏవైతే ఉన్నాయో, అవి ఈ జడమైనటువంటి ప్రకృతిలో, దాని ప్రభావం వాటిమీద పడి, ఈ పరమాత్మ యొక్క ప్రకాశం, సాన్నిధ్యంచేత, అతి సాన్నిధ్యంచేత, వాటి ప్రభావాలకు లోనై ఇవి ప్రవర్తిస్తున్నాయి. అన్నీ ఒక్కతీరుగా ప్రవర్తిస్తున్నాయా? ప్రకృతిలో ఉన్న ప్రతీ వస్తువుకూ వేర్వేరు ధర్మాలు ఉన్నాయి. కంటికి చూసే ధర్మం, మనస్సుకు ఆలోచించే ధర్మం, ఇట్లా వేర్వేరుగా ఉన్నట్లుగానే, ప్రకృతిలో అనేక వస్తువులకి, అనేక రకాల ధర్మాలు ఉన్నాయి.

పరమాత్మ యొక్క సాన్నిధ్యము చేత, దేని ధర్మం ఎట్లా ఉంటుందో, ఆ ధర్మమే, ఆ వస్తువు ధర్మంగా, ప్రకటించబడుతుంది. అంతేగాని, చెవి చూడడం కానీ, కన్ను వినడం గానీ జరుగదు. అలాగే పంచభూతాలకి, వాటి యొక్క ధర్మాలు ఉన్నాయి. ఆకాశము బయలుగా ఉంటుంది. ఇతర పదార్థాలు ఉండడానికి అవకాశం ఇస్తుంది. వాయువు అట్లా అవకాశం ఇవ్వదు. వాయువుచే చలనాలు తెలుస్తూ ఉంటుంది అంతే! చలించటంవల్ల అది వ్యాపిస్తుంది. సంకోచిస్తుంది. అగ్ని ఎక్కువైనప్పుడు వ్యాపిస్తుంది, ఉష్ణోగ్రత తగ్గినప్పుడు కుంచించుకు పోతుంది. ఆ విధంగా ఋతుపవనాలు వస్తూ, పోతూ ఉంటాయి. జలం ఉంది. అది ద్రవత్వంగా ఉంటుంది. తక్కువ ఉష్ణోగ్రత ఉన్నప్పుడు ఒక్కోసారి గడ్డ కడుతుంది. ఎక్కువ ఉష్ణోగ్రత ఉన్నప్పుడు ఆవిరి అవుతుంది. ఆ జలము యొక్క ధర్మాలు అవి.

ఇవన్నీ పరమాత్మ చైతన్యము, పరమాత్మ ప్రకాశము ఉంటేనే ఆ సత్తాతోనే ఇవన్నీ జరుగుతున్నాయి. ఆ పరమాత్మ లేకుండా కేవలం ప్రకృతే ఉంటే, ఆ ప్రకృతి జడం కనుక దాంట్లో వికారాలు కాని, పరిణామాలు కాని, చేతనత్వం కాని, కదలికలు కాని ఏవీ ఉండవు.

అటులనే ఆత్మ కర్తృత్వ భోక్తృత్వ రహిత స్వయం ప్రకాశము. ఆత్మ స్వయం ప్రకాశము అంటే అర్థం ఏమిటి? ఆత్మని మరొకటి ప్రకాశింప చేస్తుందా? ఒక దీపం మరొక దీపాన్ని వెలిగిస్తుంది. ఆ మొదటి దీపం, రెండవ దీపాన్ని, రెండవ దీపం మూడవ దీపాన్ని వెలిగిస్తుంది. అసలు మొదటి దీపాన్ని ఎవరు వెలిగించారు? దానికి ఇంకో దీపం ఉందన్నామనుకో. మళ్ళీ దాన్ని ఎవరు వెలిగించారు అంటే, ఇంకో దీపం ఉంది అన్నాము. దీన్నే చక్రదోషం అని, అనవస్థాదోషం అని అంటుంది వేదాంతము. కనుక దీనికి ఎక్కడో అక్కడ ముగింపు ఉండాలి. కనుక ఆత్మ స్వయం ప్రకాశము. ఆ దీపమును వెలిగించే దీపం మరొకటి లేదు. స్వయంగానే వెలుగుతూనే ఉన్నటువంటి దీపము. ఆ ఆత్మకు ఆ ప్రకాశించుట అనే లక్షణము సహజముగానే ఉన్నది. 'దీపోదీపాంతరస్తథా' అంటే ఒక దీపము ఇంకొక దీపమును, ఈ దీపము ఇంకొక దీపాన్ని వెలిగిస్తుంది అని. ఆ మొదటి దీపాన్ని ఎవరూ వెలిగించరు. ఆ మొదటి దీపమే పరమాత్మ, పరమాత్మ ప్రకాశము స్వయం ప్రకాశము. ఇట్టి ఆత్మను మళ్ళీ సాక్షి అన్నారిక్కడ. సాక్షి అంటే ఏమిటి? అంటకుండా ఉండడము. ఈ వికారాత్మకమైన, చలనాత్మకమైనటువంటి ఈ ప్రకృతిలో ఆత్మ అతి సన్నిహితంగా ఉన్నా కూడా ప్రకృతియొక్క చలనాలు ఈ ఆత్మకు అంటవు. ఆత్మ అక్కడ ఉంటేనే జరుగుతోంది. కాబట్టి సాక్షిగా ఉంటోంది.

అందుకే జగత్ చక్షువు అన్నారు సూర్యుడిని. చూస్తున్నాడు. అది కూడా మళ్ళీ అంటకుండా చూస్తున్నాడు. అంటితే విషయాలున్నాయి. అంటకుండా చూసేవాడికి విషయాలు లేవు. ఇద్దరూ కొట్టుకుంటున్నారు. పోట్లాడుకుంటున్నారు. దెబ్బలు తగిలినాయి. అక్కడ ఒక సన్యాసి కూడా ఉన్నాడు. ఆ సన్యాసి వీరిద్దరిని చూస్తున్నాడేమోనని వాళ్ళు అనుకున్నారు. సన్యాసి, ఏదో ధ్యాన స్థితిలో ఉన్నాడు. వీరిద్దరూ కోర్టుకు వెళ్ళారు. ఇద్దరూ వాడిది తప్పంటే, వాడిది తప్పని చెబుతున్నారు. ఎదుటివాడి మీద. జడ్జిగారు దీనికి సాక్షి ఎవరూ అని అడిగారు. అక్కడ ఒక సన్యాసి ఉన్నాడు, అతను దీనికి సాక్షియే అన్నారు. ఆ సన్యాసి చూసాడా? వీళ్ళు అనుకుంటున్నారు వాడు సాక్షియని. వాడు ధ్యానస్థితిలో ఉన్నాడు. చూడనే లేదు. ఆ సన్యాసివలె వీటికి అంటకుండా, వ్యవహారం యొక్క జోలి తనకు లేకుండా, వ్యవహారం యొక్క బాధ తనకు లేకుండా, అంటకుండా అతి సాన్నిధ్యంలో విలక్షణంగా, ఉన్నప్పటికి తాను తానుగా ఉన్నవాడే సాక్షి.

ఇప్పుడు పరమాత్మ తాను తానుగానే ప్రకాశిస్తూ, సహజ ప్రకాశముగా, ఆ ప్రకాశమే సహజలక్షణముగా ఉన్నాడు. తన ప్రకాశము యొక్క సత్తాతో, ఏవైనా జరుగుతున్నప్పటికీ, తనకేమీ సంబంధం లేదు, కర్తృత్వం, భోక్తృత్వం లేదు. ఇచ్ఛా ప్రయత్నాలు లేవు. ఈ మాటలన్నీ దేనికి ఉపయోగిస్తామో దానికి సాక్షి అని పేరు. ఇచ్ఛ, ప్రయత్నాలు లేక, కర్తృత్వ భోక్తృత్వాలు లేక, నేను నాది లేక, గుణములు, స్వభావము లేక, చలనములు లేక విలక్షణమై, అంటకుండా, తనకూ, ఈ ప్రకృతిలో జరిగే పరిణామాలకు, ఏ ప్రమేయమూ లేకుండా, అప్రమేయంగా ఉండేవాడే సాక్షి. అటువంటి సాక్షి యగు ఆత్మకు ప్రమాణాలు లేవు. ప్రమాణాలు లేవు అంటారేమిటి? మళ్ళీ ప్రమాణం అంటూ ఉంటే, ప్రమాత, ప్రమేయం రెండూ ఉండాలి. అగ్ని కాలును అన్నప్పుడు, అగ్నిలో ఉన్నటువంటి ఉష్ణత్వము వలన, కాలుట అనేది జరుగుతుంది. కాలుట అనేది ప్రమాణము. అగ్ని అనేది ప్రమాత. అందులో ఉన్న ఉష్ణత్వము ప్రమేయము. ఉష్ణత్వము యొక్క ప్రమేయము చేత, కాలుట అనేది జరిగింది. లోకంలో అట్లా త్రిపుటులు ఉంటాయి.

జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము, ధ్యాత, ధ్యానము, ధ్యేయము, ప్రమాత, ప్రమాణము, ప్రమేయము ! జ్ఞాతకు జ్ఞానముంది. జ్ఞేయ వస్తువుకు సంబంధించి ఇక్కడ అద్వైతం వచ్చేసరికి ఏమైంది? మూడు ఉంటాయా? బ్రహ్మము ఒక్కటే అన్నప్పుడు, జ్ఞేయ వస్తువు ఒక్కటే ఉంది. అది కూడా బ్రహ్మమే అన్నప్పుడు, జ్ఞాత కూడా బ్రహ్మమే అయ్యాడు. అప్పుడు జ్ఞాత, జ్ఞేయ వస్తువు రెండూ బ్రహ్మమే. జ్ఞాత 'త్వం', జ్ఞేయ వస్తువు 'తత్'. తత్వమసి అనంగానే జ్ఞాత, జ్ఞేయముకు భేదం లేదు. అభేదం. అప్పుడు ఏమైంది? జ్ఞాత, జ్ఞేయ వస్తువు ఒక్కటే అయ్యింది. అది సిద్ధాంతం.

కాని, ఇక్కడేమిటి? అజ్ఞానంలో, భ్రాంతిలో జ్ఞేయవస్తువు అయిన పరమాత్మ జ్ఞానము జ్ఞాతకి లేదు. అజ్ఞానంలో లేదు. కనుక ఇప్పుడు జ్ఞానాన్ని సంపాదించాలి వీడు. సంపాదించి పరమాత్మ, పరబ్రహ్మ అవ్వాలి అన్నప్పుడు ఏమైంది? జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము ఉంది. ఇక్కడ జ్ఞాత ఎవరు? ప్రమాత. ప్రమాత ఎవరు? జీవుడు. జీవుడు ఎవరు? అవిద్యా ప్రతిబింబుడు. మరి ప్రమాణం ఏమిటి? జ్ఞానము. ప్రమేయము ఏమిటి? జ్ఞానమే తానైన వాడు. జ్ఞేయ వస్తువు ప్రమాణము కంటే, ప్రమేయము కంటే వేరే లేదు. అప్పుడు ప్రమేయము, ప్రమాణము ఒక్కటే. త్రిపుటి ఉన్నప్పడు అది వేరుగా ఉండేమో కానీ, వస్తునిర్ణయం

అయితే బ్రహ్మమొక్కటే, పరబ్రహ్మమొక్కటే! అంటే జ్ఞానమే తానైనటువంటి జ్ఞేయము. జ్ఞేయవస్తువు నీ కంటే వేరనుకుని, అనుష్ఠానము, ఉపాసన చేసావు. ద్వైత బుద్ధితో ఆరాధన చేసావు. భక్తితో పూజ చేసావు. మరి సిద్ధాంతము ప్రకారము త్రిపుటి లేదుగా! కనుక ప్రమాతే లేడు. ప్రమాతే జీవుడు. జీవుడు అవిద్యా కల్పితుడు. అవిద్యా కల్పితం అంతా భ్రాంతి. భ్రాంతి పోతే జీవుడు లేడు, ప్రమాతయే ప్రమేయమై అద్వైతము సిద్ధించింది.

ప్రమాత లేకపోతే ఈ జ్ఞానాన్ని సంపాదించేవాడు ఎవడు? ఈ జ్ఞానం ఎవరికి? జ్ఞానమే ఇక్కడ ప్రమాణము. వేదాలే జ్ఞాన విషయంలో ప్రమాణం. వేద ప్రమాణము జ్ఞానాన్ని నిర్వచిస్తోంది. మరి జ్ఞానం అనేది ఉంటేనే నిర్వచించిందా? లేకుండా నిర్వచించిందా వేదము? ఈ జ్ఞేయవస్తువు ఉంది. ఏ ప్రమాణం చేత తెలుసుకుంటారు? వేదాలు, వేదాంత ప్రమాణం ద్వారా బ్రహ్మను తెలుసుకున్నాము. వేదాల్లేకపోతే బ్రహ్మ తెలియదా? వేద ప్రమాణం కావాలా? ఇట్టి పరమాత్మకి అంటే ఎటువంటి పరమాత్మకి ? శరీరం నశించాక ఉండే పరమాత్మ కాదు. సాక్షియగు పరమాత్మ. సాక్షియగు పరమాత్మకి ఏ ప్రమాణము లేదు. ప్రమాతేమో అవిద్యా కల్పితం. వాడుంటే వాడికే జ్ఞానం కావాలి. అవిద్య పోవడానికి స్వరూప సాక్షాత్కార జ్ఞానం కావాలి. ప్రమాత ఉన్నాడనుకుని, జ్ఞానాన్ని సంపాదించుకుని, ప్రమేయమైనటువంటి బ్రహ్మను పొందాలి అని చూసాడు. పొందే ప్రయత్నంలో ఏం చేశాడు? బ్రహ్మోపాసన చేసాడు. దానికి ఆటంకముగా ఉన్నటువంటి అవిద్యా దోషం పోగొట్టుకుని, ఆటంకాలు తొలగించుకున్నాడు. అప్పుడు జీవుడు శుద్ధంగా మిగిలాడు. ప్రమాత, ప్రమేయానికి భేదం పోయింది. ప్రమాతే, ప్రమేయుడయ్యాడు. అప్పుడు ప్రమేయమనేది విడిగా లేకుండా పోయింది. ప్రమేయత్వము ప్రమాతత్వంగా వచ్చేసరికి, ప్రమేయము విడిగా లేకుండా పోయింది.

ప్రమేయం విడిగా ఉంటే, వేద ప్రమాణం, శాస్త్ర ప్రమాణం ప్రకారముగా ప్రమేయ వస్తువును తెలుసుకుంటాము. ప్రమాత, ప్రమేయం ఒక్కటయ్యాక ధ్యేయ వస్తువే ధ్యాత అయ్యాక ధ్యేయ వస్తువే పరబ్రహ్మ అయ్యాక ధ్యాత పరబ్రహ్మ ఒక్కటి అయ్యాక, ప్రమాత జీవుడనేది అవిద్యా కల్పితం కనుక ప్రమాత లేడుగా! ప్రమాతే ప్రమేయం అయ్యాడు కాని, ప్రమాత లేడక్కడ. ప్రమాత ఉంటే, వాడికి అజ్ఞానం కాబట్టి, జ్ఞానం కావాలి. ప్రమాణం కావాలి. ప్రమాత లేడు కాబట్టి, ప్రమాణం ఎవరికి? జ్ఞానం ఎవరికి? జ్ఞానస్వరూపుడనైన నాకు జ్ఞానంతో ఏం పని? జ్ఞాన స్వరూపుడయ్యాక నాకు మళ్ళీ జ్ఞానం కావాలా? ఇప్పుడు అప్రమేయుడు అనంగానే, ఎవరైతే పరబ్రహ్మమో, అతను పరబ్రహ్మము అని తెలుసుకోవడానికి మరొక ప్రమాణము అక్కర్లేదు. అది ప్రత్యక్షము.

దృష్టాంతాలతోటి, ఉదాహరణలతోటి ఎన్ని చెప్పినప్పటికి ఆయన అప్రమేయుడు. అప్రమేయుడికి ప్రమాణంతో పని లేదు. ప్రమాత అజ్ఞానంలో ఉంటే వాడికి కావాలి ఈ ప్రమాణాలు. ఆ ప్రమాణం ద్వారా కొంత సాధన చేసాడు. సాధన యొక్క చరమాంకానికి, చిట్టచివరికి వచ్చేసరికి, త్రిపుటి, ద్విపుటి రహితం చేసుకునే సందర్భంలో, ప్రమాతే ప్రమేయుడు అయ్యాడు. ప్రమేయుడికి, ప్రమాతకి భేదం లేదు. ప్రమేయత్వం ఎప్పుడైతే వచ్చిందో, అప్పుడు ప్రమాత లేనివాడయ్యాడు. అవిద్యాకల్పితుడు గనుక అవిద్య వల్ల ఉన్నవాడు కనుక జ్ఞానోదయం కాగానే అవిద్యాకల్పితము లేనిదౌతుంది. బ్రహ్మసాక్షాత్కారంలో లేకనే తోచిన ప్రపంచం లేకనే పోయింది. ప్రపంచమే తోచదు. జీవుడు కూడా అలాగే తోచడు. అప్పుడు ప్రమాత లేడు, ప్రమాణం యొక్క ఆవశ్యకత కూడా లేదు.

అద్వైత సిద్ధాంతంలో అప్రమేయుడు అనేవాడికి, ప్రమేయం అనే పదం ఎందుకు వచ్చింది? ప్రమాత, ప్రమేయం అనేది ఉంది కాబట్టి. ఆ ప్రమేయుడెవరో నిజానికి వాడు అప్రమేయుడే. సృష్టిలో భౌతిక వస్తువుల దగ్గర, ప్రమాత, ప్రమాణం, ప్రమేయం అనే త్రిపుటి ఉంటుంది. భౌతికమైన వస్తువుల మధ్య, కర్త, కర్మ, క్రియ ఉంటుంది. అద్వైతం సిద్ధించే సరికి, ప్రమాత లేడు, ప్రమాణం లేదు. ఆ రెండూ లేనందు వలన, ప్రమేయుడు కూడా అప్రమేయుడౌతాడు.

పరమేశ్వరుడు – సమష్టియగు బ్రహ్మమునకు మాయా సంబంధము లేకపోయినను, ఆధ్యాస ఉన్నట్లు భావించబడుతున్నది. సమష్టిగా ఉన్న బ్రహ్మకి మాయ సంబంధము లేదు. మాయ అంటే ఏమిటి? లేనిది ఉన్నట్లుగా తోపింప చేసేది. ఈ కనపడే వస్తువులు లేకనే ఉన్నట్లుగా తోచాయి. విచారిస్తే లేనివి. సత్యముగా లేనివి. అసత్యముగా భ్రాంతిలో చూస్తే, అవిద్యా దోషంతో చూస్తే, జీవభావంతో చూస్తే, పూర్వజన్మ సంస్కారాలకు అనుగుణంగా చూస్తే, నిజమనిపిస్తూ ఉన్నాయి. సంస్కారం నుండి విడుదలైనవాడికి లేదు. అవిద్య నుండి విడుదలైనవాడికి లేదు. సత్యసాక్షాత్కారం అయినవాడికి లేదు.

ఇప్పుడు ఇబ్బంది పెట్టేది ఏమిటి? మాయా కల్పిత ప్రపంచమే. అదేం చేస్తుందంటే, బ్రహ్మకు కూడా మాయా సంబంధం అంటకడుతోంది. మాయకి సంబంధం లేకపోయినా, సంబంధం ఉన్నట్లుగా అంటకడుతోంది. అప్పుడు బ్రహ్మ సృష్టికి కారణం అని చెబుతోంది. సృష్టికి కారణం కాకపోయినా కారణం అని చెబుతోంది. లక్షణంలో ఏం చెప్పాము? అది అసంగుడు, సాన్నిధ్యముగా ఉన్నాడు, ఏ మాలిన్యం అంటకుండా ఉన్నాడు. మాయకు తనకూ ఏ సంబంధము లేదు. సహజ ప్రకాశముగా ఉన్నాడు. ఆత్మకి ఆత్మ ప్రకాశం అనే లక్షణం, ఈ రెండు విడదీయడానికి వీలులేకుండా ఉన్నాయని చెప్పాము. అటువంటి వాడికి కర్తృత్వము, భోక్తృత్వము లేవు అన్నాము. వాడికి ప్రమాణము లేదు, అప్రమేయుడు అన్నాము. అటువంటి బ్రహ్మకు ఇవాళ అసలు ఏం చెబుతున్నారు? మాయా సంబంధమైన జగత్తు, ప్రకృతి అంతా వచ్చేసరికి, సంబంధం లేకపోయినా, సంబంధాన్ని ఎవరో అంటగట్టారు.

ఎవరు అంటగట్టారు? ఎవరైతే భ్రాంతిలో ఉన్నారో, వాళ్ళు సర్వసృష్టికి కారణం బ్రహ్మమే అన్నారు. సరే, అననివ్వండి! ఎందుకంటే మనం మూలం దాకా పోదాము. ఏ బ్రహ్మమైతే ఈ సృష్టికి మూలమో, అక్కడిదాకా పోదాము. అప్పుడు మూలచ్ఛేదో అని మనం చదువుకున్నాము గురుస్తుతిలో, ఆ మూలాన్ని మళ్ళీ పరిహరించాలి. ఎందుకంటే, మాయాశబలిత బ్రహ్మము, అయిఉన్నాడతను మూలంలో. మాయను అధిగమించినప్పుడు, బ్రహ్మముకు మాయకు ఎట్టి సంబంధము లేదు అన్నప్పుడు ఆ మాయకు సంబంధము లేనటువంటి, మాయకు పరమైనటువంటి, బ్రహ్మ అచల పరిపూర్ణమే.

ఇక్కడ నిర్గుణ బ్రహ్మని, అధ్యాసవల్ల సగుణ బ్రహ్మ అని చెప్పడం జరిగింది. సగుణ అంటే మూడు గుణాలతో కూడినది. త్రిగుణాత్మక మాయ. మాయ సంబంధం కాకపోయినా మాయ సంబంధం ఉన్నట్లుగా కల్పింప చేస్తుంది. కనుక నిర్గుణ బ్రహ్మ అయినటువంటిది కూడా 'మాయ శబలిత బ్రహ్మ' – అనే పేరుపెట్టి చెబుతున్నాము. భ్రాంతిలో ఉన్నవాళ్ళకి ముందు ఇది లక్ష్యం. ఈ లక్ష్యం తటస్థ లక్షణంగా తీసుకున్నాం. 'మాయ శబలిత బ్రహ్మ' లో ఉన్న సత్‌చిత్ ఆనందము అనే అనుభవాన్ని తటస్థ లక్షణంగా, ఇంటర్మీడియట్‌గా సగం ప్రయాణం దాకా దీనిని తీసుకున్నాము. మిగితా సగం ప్రయాణంలో ఇక మాయకు సంబంధం లేని, త్రిగుణ రహితమైనటువంటి బ్రహ్మని వేరు పరుస్తాం. వేరు పరచి ఈ బ్రహ్మమే ఉన్నాడని, వస్తు నిర్ణయం చేస్తాం. ఇప్పుడు ఈ వాక్యం ద్వారా ఏం తెలుస్తోంది? మాయకు సంబంధం లేకపోయిననూ, అధ్యాసతో ఉన్నట్లుగా భావించబడుతోంది. ఈ భావించబడే బ్రహ్మనే మనం మాయా శబలిత బ్రహ్మమని అంటున్నాము.

పరమాత్మ ప్రతిబింబంతో కూడి, మాయయే పాలు పెరుగుగా పరిణమించినట్లుగా, ఆకర్షణ శక్తిచే జగత్తుగా పరిణమించింది. పరమాత్మ యొక్క ప్రతిబింబముతో కూడి మాయే సృష్టించింది ఇదంతా. పరమాత్మ ప్రకాశాన్ని వాడుకుంది. పరమాత్మ ప్రకాశం సాక్షిత్వంగా, అప్రమేయముగా, త్రిపుటి, ద్విపుటి రహితముగా, నిర్వికల్పముగా, నిర్వికారముగా, అచలంగా, ఉన్నదున్నట్లుగా ఉంది. అయితే దాని లక్షణము. ఈ మాయా ప్రపంచములో వ్యాపకమై, అతి సాన్నిధ్యమయ్యే సరికి, ఆ ప్రభావానికి ఈ మాయయే పాలు పెరుగుగా మార్చినట్లుగా, తన్మాత్రలను సూక్ష్మభూతాలుగా, సూక్ష్మభూతాల్ని స్థూలభూతాలుగా అలా పరిణామాన్ని పట్టుకొచ్చింది. ఆకర్షణ శక్తిచే జగద్రూపముగా పరిణమించింది.

మాయలో ఒక ఆకర్షణ శక్తి ఉంది. ఆకర్షణ అనకూడదు. నన్నడిగితే అది **'కర్షణ శక్తి'.** అది ఆ...కర్షణ కావచ్చు, వి...కర్షణ కావచ్చు. కొన్ని వస్తువులకు ఒకదానికొకటి ఆకర్షణ ఉంది. కొన్ని వస్తువులకు ఒకదానికొకటి వికర్షణ ఉంది. కొన్ని వస్తువులకు రెండూ లేవు. ఇవి కొన్ని దూరంగా జరుగుతాయి, కొన్ని దగ్గరగా జరుగుతాయి. కొన్ని ఎంత దూరంలో పెడితే, అక్కడే ఉంటాయి గానీ, లాగబడవు, విడిచివేయ బడవు. ఈ మూడు రకాల శక్తిని కర్షణ శక్తి అంటాము. లాగినప్పుడేమో 'ఆకర్షణ' అంటాము. విడగొట్టినప్పుడు 'వికర్షణ' అంటాము. ఈ స్థితి ఎక్కడుంది అంటే, మాయలోనే ఉంది. మరి గోళాల మధ్యకూడా ఈ గోళాలు, గ్రహాలు. ఉపగ్రహాలు అదే కక్ష్యలో ఉంటున్నాయి. మరి ఆకర్షణ అనేది ఉంటే, ఈ భూమి వెళ్ళి సూర్యుడికి ఢీ కొట్టాలి. చంద్రుడు వెళ్ళి భూమిని ఢీ కొట్టాలి. వికర్షణయే ఉంటే చంద్రుడు భూమి నుంచి పారిపోవాలి, సూర్యుడి దగ్గర నుంచి భూమి పారిపోవాలి. ఈ రెండూ జరగడం లేదుగా! అది ఒక వింతైనటువంటి శక్తి. విచిత్రమైన శక్తి. ఇటు ఆకర్షణ, అటు వికర్షణ కాదు. ఎంతవరకూ ఆకర్షించాలో, అంతవరకూ ఆకర్షించింది. అక్కడినుంచి మరీ ముందుకు రానివ్వకుండా మళ్ళీ వికర్షిస్తూ ఉంటుంది. ఈ మాయలో ఆ వింత శక్తి ఉంది. దాన్ని 'కర్షణ శక్తి' అనాలి. ఆ శక్తితోనే జగద్రూపం వచ్చింది.

ఆకర్షణలు ఉన్నవన్నీ ఏమౌతున్నాయి? రెండు మూడు రకాల పదార్థాలు కలిసి ఒకే కొత్త పదార్థం అవుతున్నాయి. హైడ్రోజన్ రెండు పరమాణువులు, ఆక్సిజన్ ఒక పరమాణువు. ఈ రెండూ కలిసి, హెచ్‌టుఓ నీరు అని వాటర్ అయ్యింది. అట్లా కొన్ని అవుతున్నాయి, కొన్ని కావడం లేదు. కానివన్నీ ఏ పదార్థానికి, ఆ పదార్థం విడివిడిగా ఉన్నాయి. అయ్యేవన్నీ ఏమో, రెండు పదార్థాలు కలసి మూడవ పదార్థంగా రూపాంతరం చెందాయి. ఆక్సిజన్ వాయువే, హైడ్రోజన్ కూడా వాయువే. కొన్ని నిష్పత్తులలో ఆకర్షించబడి కలసిపోయినప్పుడు, జలం అనేది వచ్చింది. వాయువు నుండి జలం వచ్చింది. ఆ విధంగా ఆకర్షణ, వికర్షణ పనిచేస్తున్నాయి. ఈ ఆకర్షణ, వికర్షణ. మాయ యొక్క లక్షణమే. మాయ యొక్క లక్షణం అంతే కాదు, పాలు చెడి పెరుగయ్యింది. తండ్రికి బిడ్డ పుట్టాడు, తండ్రి చెడకుండా పుత్రుడు పుట్టాడు. తల్లి, తండ్రి చెడకుండానే, వాళ్ళు వాళ్ళుగా ఉండంగానే, వాళ్ళకి బిడ్డలు కూడా పుట్టారు. ఇక్కడ పాల విషయంలో ఏమైంది? పాలు పాలుగా ఉండి పెరుగురాలేదు. పాలే పెరుగుగా మారింది, పాలు చెడి పెరుగయ్యింది. తండ్రి చెడకనే పుత్రుడొచ్చాడు. ఇది కూడా మాయాకార్యమే.

ఇది మాయయే కాని, ప్రతిబింబము కలది కాదు. ప్రతిబింబము ఉందా? లేదా? మాయా అనే అద్దంమీద, మాయా ప్రతిబింబుడుగా ఈశ్వరుడు అంటున్నాముగా! మాయకు ప్రతిబింబము లేదు గాని, మాయవల్ల ప్రతిబింబము తోస్తోంది. లేదని ఎందుకు అంటున్నావు? మాయవల్ల నిజంగా లేని వస్తువులు రాలేదు. మాయవలన లేని వస్తువు ఉన్నట్లుగా కనబడ్డాయి. కనుక ప్రతి బింబము ఉన్నది అని కూడా అనడానికి లేదు. ప్రతిబింబమే చిదాభాసుడు. భ్రాంతిలో మాత్రం 'నేను' ఉంటుంది. భ్రాంతిలో ప్రతిబింబమూ ఉంటుంది. అట్లాగే భ్రాంతిలో ఈశ్వరుడు అనే ప్రతిబింబము ఉంటుంది. భ్రాంతి పోతే మాయకి ప్రతిబింబించేటటువంటి లక్షణం నిజానికి లేదు కనుక, మాయవల్ల లేనిదే ఉన్నట్లు కనబడుతాయి కనుక, ప్రతి బింబాలు కూడా లేనివే ఉన్నట్లు కనబడుతున్నాయి.

చిదాభాసుడు అనే నేను కూడా లేనివాడే ఉన్నట్లుగా కనబడుతున్నాడు. లేదు అంటే సత్యముగా లేదు అని అర్థము. అందుకనే మాయని, ఇట్టిది అట్టిది అని నిర్వచించడానికి వీలు లేదు. మాయ సత్తు కాదు, అసత్తు కాదు. మాయ అనాది. మాయకి అంతముంది. ప్రళయంలో మాయ యొక్క అంతముంది. మళ్ళీ మాయచే సృష్టి, మాయ కారణంగానే ప్రళయం. కాని మాయకు అంతము ఉంది. ముక్తుడి విషయములో మాయకు అంతమున్నది. పరబ్రహ్మమందు మాయలేదు. ఒక పాద బ్రహ్మమును మాయ ఆశ్రయించినా, ఆ బ్రహ్మ మాయకు అసంగుడు. మాయలో మూడుగుణాలు కూడా చైతన్యము లేనిదే పనిచేయవు.

ఒక పాదం బ్రహ్మనే మాయ ఆశ్రయించింది. ఆ ఒక్క పాదం బ్రహ్మే, మాయా శబలిత బ్రహ్మ. ముప్పావువంతు బ్రహ్మ, ఉన్నదున్నట్లుగా ఉన్న బ్రహ్మ. నిజానికి ఈ బ్రహ్మ కూడా, ఉన్నదున్నట్లున్న బ్రహ్మమే. బ్రహ్మకు అసలు నాలుగు వంతులు వేయడానికి కుదరదు. బ్రహ్మలో ఏ వికారము జరుగలేదు. ఒక వంతు బ్రహ్మలో వికారములు కలిగినట్లుగా, మాయ చూపించిందే తప్ప, అప్పటికి ఆ బ్రహ్మ నిర్వికారుడే. అయినా ఒక వంతుగానున్న పరబ్రహ్మకి మాయ తన స్వాధీనంలో ఉంటుంది. అందుకే **'ఏకామేవాద్వయం బ్రహ్మ'** గా **'నానా అస్తిన కించనః'** – తనకంటే అన్యము కొంచెము కూడా లేకుండా ఉంటుంది.

సాధకుడు కూడా సాక్షాత్కారం పొందితే, ఏదన్నా కొంత మిగిలి ఉన్నా కాని, ఆ సాక్షాత్కార జ్ఞానంయందు మొత్తం హరించిపోతాయి. లేకుండా పోతాయి. మాయకు ప్రభువు తానే. ఎవరూ? ఆ పరమేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు. జీవుడు ఈశ్వరుడు జగత్తు, భూతములు, నామరూప ప్రపంచము, తన్మాత్ర సృష్టి, పంచభూతములు, జీవోపాధులు అన్నీ కలిపి తమోగుణ సృష్టి, జీవులేమో రజోగుణ సృష్టి. ఈశ్వరుడు శుద్ధ సత్వ మాయా ప్రతిబింబుడు కనుక సత్వగుణ సృష్టి. మూడు తత్వములు అనంగానే, మూడు గుణములతో, ఆ గుణాల వల్ల జీవుడికి జీవతత్వం, ఈశ్వరుడికి ఈశ్వరత్వం, జగత్తుకు భూతతత్వం వచ్చింది.

ఇందులో ఏది ముఖ్యము? జీవులు లేకపోతే ఈశ్వరుడికి ఏం పని ఉంది? జీవుడికి ఉపాధి లేకపోతే, జన్మకు వచ్చే కర్మ ఎక్కడిది? జగద్వాసన, ప్రపంచ వాసన ఎక్కడిది? ఉపాధులు కూడా పంచభూతాలేగా! పంచభూతాలు లేకపోతే ఉపాధులు లేవుగా. ఉపాధులు లేకపోతే పనిముట్టు లేదుగా. పనిముట్టు లేకపోతే, కర్మ, కర్మ ఫలితము లేదుగా! సూక్ష్మ శరీరం ఉండి ఏం భోగిస్తుంది? అప్పుడు సూక్ష్మ శరీరం ఉండి కూడా లేనిదేగా! జగత్తు లేనప్పుడు జగద్వాసన లేదుగా! జగద్వాసన లేకపోతే కారణ శరీరం లేదుగా! స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు లేకపోతే, చైతన్యమే ఉందిగా! చైతన్యమే తాను అయినటువంటి

పరమాత్మ ఉన్నాడుగా! పరమాత్మే తాను అయినవాడికి జీవులను ఆడించాల్సిన అవసరము ఉండదుగా! జీవులు ఉంటే కదా, ఆడించేది. జీవుడే లేకపోతే ఏముంది? పంచభూతాలు లేకపోతే, జీవుడు లేడు, ఈశ్వరుడు లేడు. జీవుడు లేకపోయినా ఈశ్వరుడు లేడు.

ముగ్గురూ, మూడూ కూడా ఒకదాన్నిబట్టి ఒకటి అవినాభావ సంబంధముగా, ఒకదానిమీద ఒకటి ఆశ్రయించి, ఆధారపడి ఉన్నాయి. ఒకటి లేకపోతే రెండు లేవు. రెండు లేకపోతే మూడు లేవు. ప్రపంచం లేకపోతే జీవుడు లేడు, జీవోపాధి లేదు. జీవోపాధి లేని జీవుడు జీవుడే కాదు. జీవుడే లేనప్పుడు ఎవరిని ఆడిస్తాడు ఈశ్వరుడు? జగత్తే లేనప్పుడు దేనిని సృష్టి, స్థితి, లయలు చేస్తాడు? ఎవరి కర్మలని పంచి పెడతాడు? కర్మలు ఏమైనా చేసిన వాడుంటే, పంచిపెడతాడు.

జీవుడే లేకపోతే, కర్మలు చేసేవాడే లేకపోతే, ఆ కర్మలని, ఆ విధిని నిర్ణయించేటటువంటి విధాత ఎక్కడుంటాడు? ఆ విధాతగా ఉన్నటువంటి ఈశ్వరుడు కూడా లేనివాడౌతాడు.

అన్నీ మూడుగుణాల్లో తోచాయి కాబట్టి, మాయ లేనిది కాబట్టి, లేని మాయ వలన తోచినవన్నీ కూడా లేనివే. ఈ మాయ ఏమిటంటే మూలకారణాంశము. మూలకారణంలో మాయ లేనిదని తెలిసింది. కాబట్టి దాని అంశము కూడా మాయవల్లే ఉత్పత్తి అయ్యింది. మాయ యొక్క మూడు గుణాలు ఈ సృష్టి అంతా ఉన్నాయి. కాబట్టి, మాయా కల్పిత ప్రపంచము కూడా లేనిది. లేని ప్రపంచాన్ని చూస్తూ, లేని కర్మలు చేసి, లేని కర్మఫలితాలు పొందుతూ, పునర్జన్మలు పొందుతూ, లేని ఈశ్వరుడి యొక్క అనుగ్రహం కోసం ప్రాకులాడి, ముందు ఈశ్వరుడున్నాడని, జీవుడు లేడని, జీవేశ్వరైక్యం పొంది, 'బ్రహ్మసత్యం జగన్మిథ్య' అని జీవబ్రహ్మైక్యం పొంది, ఇన్ని చేస్తున్నాడు కాని, ఒక్కటి తెలియడం లేదు వాడికి. జగత్తు మిథ్య అని ముందే తెలిస్తే, జీవుడు, ఈశ్వరుడు, బ్రహ్మ కూడా లేరు. కేవల పరబ్రహ్మమే, మాయకు పరమై, మాయకు అతీతమై ఉన్నాడు.

మనం భ్రాంతిలో, మాయలో, మాయా ప్రభావానికి, అవిద్యా ప్రభావానికి, గుణాల ప్రభావానికి లోబడి, మనసులో ఉన్న గుణాలతో మళ్ళీ మనం ప్రవర్తిస్తున్నాము కాబట్టి, గుణాలు గుణాలతోనే ఒకరి యందున్న గుణములు, ఇంకొకరి యందున్న గుణములతో ప్రవర్తిస్తున్నాయి. ఇదే ఆట. గుణాల యొక్క ఆట. ఆ గుణాలు ఆడటానికి ఒక ఉపాధి కావాలి కాబట్టి, పనిముట్లు వచ్చాయి. నీ ఆటగా పనిముట్టు ద్వారా జరుగుతున్నట్లు ఉంది కాని, అసలు ఆట గుణాలదే. ఇక అసంగంగా ఉన్న చైతన్యానికి ఈ ఆటలేదు.

అసంగంగా ఉన్న చైతన్యము, ఆ చైతన్యమే ప్రకాశము. ఆ ప్రకాశమే జ్ఞానము అని ఏ సాధకుడికైతే, ఆ జ్ఞానం ఉన్నదో, ఆ జ్ఞానం ఉన్నవాడికి ఇదంతా చిద్విలాసం. 'చిద్విలాసం' అంటే చైతన్యం యొక్క సత్తా చేత, తన ప్రమేయం లేక, కర్తృత్వ భోక్తృత్వాలు లేక, నేను, నాది లేక. ఇచ్ఛ, ప్రయత్నాలు లేక, సంగత్వము లేక అచలముగా, పరిపూర్ణముగా, స్థిరముగా, నిర్వికారముగా ఉన్నటువంటి పరమాత్మ వలన జరుగుతున్నది. అట్టి చైతన్యమే, ఆ పరమాత్మయే శరీరము ధరించాడు అనుకోండి. అప్పుడతను ఈ ప్రపంచాన్ని ఎలా చూస్తాడు? 'చిద్విలాసం'గా చూస్తాడు. ఎవరికైనా ఇవన్నీ 'నిజం' అయితే విలాసం కాదు. ఇవన్నీ మిథ్యగా తోచాయి అనే దృష్టి ఉన్న జ్ఞానికి నిజం కాదు గనుక విలాసము, లీలగా చూస్తాడు. 'లీల' – అంటే అస్పష్టం. 'కల' – అస్పష్టంగా వస్తుంది. 'కల'వలె తోచేది అంతా కూడా లీల.

కర్తృత్వ భోక్తృత్వాలు ఇచ్ఛా ప్రయత్నాలు లేకుండా జరుగుతుంది. అయినప్పటికి, తన ప్రమేయం, తన సత్తా, తన లక్షణాలు వాటి యొక్క సాన్నిధ్యంలో ఉంటే, నీ సత్తా చేతే, నీకు తెలియకుండానే అవన్నీ జరుగుతూ ఉంటే, అది నీకు లీల. అది విలాసము.

ఈ మూడు తత్త్వములు జీవుని భోగార్థమై, ఈశ్వర సృష్టి ఏర్పడింది. జీవుడు అనేవాడు ఉంటేనే ఈశ్వర సృష్టి ఉంది. జీవుడు లేనప్పుడు, ఈశ్వర సృష్టిని ఈశ్వరుడే ఈక్షిస్తాడు. మాయకు వశుడు కాడు. ఎన్నాళ్ళు ఈక్షిస్తాడు? దాన్ని అట్లా చూస్తూ ఉంటాడు. చూడబడుతూ ఉంటుంది అంతేనా? ఏం పనీ లేనప్పుడు చూడడం దేనికి? చూడబడడం దేనికి? అలా ఉండిపోతాడు ఈశ్వరుడు. కొంత కాలానికి ఈక్షణ నిరీక్షణ అయి, పరమాత్మగా ఉండిపోతాడు. నిర్వికారంగా ఉండిపోతాడు. అప్పుడతడు పరబ్రహ్మమే. ఈశ్వరుడు, ఈశ్వరత్వము ఏమీ లేవు. జీవుడు జగత్తు ఉంటే ఆ పరమాత్మ ఎలా ఉన్నాడు? ప్రభువయ్యాడు, విభుడయ్యాడు, సర్వజ్ఞుడయ్యాడు, సర్వాంతర్యామి అయ్యాడు, సర్వవ్యాపకుడయ్యాడు, సర్వమూ ఉంది కనుక సర్వమందూ

వ్యాపించాడు. సర్వమందూ అణోరణీయాన్‌గా ఉన్నాడు కాబట్టి, అంతర్యామిత్వం వచ్చింది. సర్వమూ తనయందు కలిగి, సర్వమునకూ మించి ఉన్నాడు కాబట్టి, సర్వవ్యాపకత్వం వచ్చింది. మించి ఉన్నదేమో మూడు వంతుల బ్రహ్మ, పరబ్రహ్మ. సర్వము వరకూ ఒక పరిమితంగా ఉండేటటువంటి బ్రహ్మ మాయాశబలిత బ్రహ్మ. ఇది ఒకపాద బ్రహ్మ.

ఈశ్వరుడు ఆప్తకాముడు. జీవుడినిబట్టి తయారైనటువంటి ఈశ్వరుడు ఆప్తకాముడు. అంటే, ఆప్తులను రక్షించేవాడు. శరణార్థులను కాపాడేవాడు. ఆప్తకాముడంటే ఈశ్వరుడు తన భక్తులను తనలో ఐక్యం చేసుకునేవాడు. సృష్టియందలి సర్వభోగములు, ఈశ్వరుని నుండియే ఏర్పడుతున్నాయి.

కాసేపు ఈశ్వరుడు అంటారు, కాసేపు బ్రహ్మము అంటారు. ఏమైనా పర్వాలేదు. ఆ పేర్లు, ఆ బోధ చెప్పేటప్పుడు, ఆ సృష్టికి సంబంధంగా చెప్పేప్పుడు, ఈశ్వరుడికి, ఆ బ్రహ్మకు పేర్లు మారుతూ ఉంటాయి. సమష్టి అన్నప్పుడు ఈశ్వరుడు అంటాము. వ్యష్టి సమష్టి లేకుండా కేవల లక్షణం పెట్టినప్పుడు పరమాత్మ అంటాము. మూలకారణం అన్నప్పుడు 'బ్రహ్మ' అంటాము. కారణం కాని బ్రహ్మ అయినప్పటికి, ఆ బ్రహ్మకారణం అంటున్నాము కాబట్టి, ఆ బ్రహ్మను మాయాశబలిత బ్రహ్మ అన్నాము. ఇలా ఇన్ని పేర్లు వచ్చాయి.

మాయాశబలిత బ్రహ్మ కాకుండా నిజమైన బ్రహ్మ ఎవరయ్యా? అంటే, మాయకు అతీతంగా, మాయకు పరమైన, మాయకు అంటక, మాయకు సాక్షిగా, మాయాపదార్థాలలో బింబప్రకాశముగా ఉన్నప్పటికి, తానైతే ప్రతిబింబ ప్రకాశముగా కూడా లేనటువంటి వాడు. వాడు వాడుగా ఉండేటటువంటివాడు. స్వయం ప్రకాశరూపుడు ఎవడో, వాడు పరబ్రహ్మ.

**'పర'** అని ఎందుకు పెట్టాము? ఈ బ్రహ్మకు పరమై, అతీతమై, విలక్షణమై ఉన్నాడు కనుక. ఈ బ్రహ్మ యొక్క లక్షణాలు ఆ పరబ్రహ్మలో లేవు కనుక అక్కడ 'పర' అనే శబ్దము వాడాము. పర... పరి... పరమ అనేవి వాడుతూ ఉంటాము. ఆత్మ, పరమాత్మ, పరి అని ఎక్కడ వాడుతాము? 'పరి ప్రశ్నేన సేవయా' 'పరి' అంటే, ఆధ్యాత్మికంగా, జ్ఞానపరంగా, మోక్షాన్ని లక్ష్యంగా పెట్టుకుని వేసేటటువంటి చాలా గొప్ప ప్రశ్న పరిప్రశ్న. చాలా శ్రేష్ఠమైన ప్రశ్న. అందుకని పరిప్రశ్న అన్నాము.

నిజానికి శ్రమ, పరిశ్రమ. పరిశ్రమ అంటే, సాధకులు మోక్షం కోసం చేసేటటువంటి సాధన. కార్మికులు పనిచేసేటటువంటి పరిశ్రమలు ఇండస్ట్రీ కాదు. పరి అనే శబ్దంతో అది అట్లా వాడుకలోకి వచ్చేసినాయి. అలాగే త్యాగము, పరిత్యాగము.

**"ప్రవచనము"** మామూలుగా మాట్లాడేది వచనము, 'అంతర్యామి' యొక్క గొప్ప స్ఫూర్తితో, 'గురువు' యొక్క స్ఫూర్తితో, నీవు మాట్లాడకుండా, ఆ స్ఫూర్తే నీ చేత మాట్లాడించి, గురువాక్యమే, దైవ వాక్యమే, నీ వాక్యంగా ఉన్నప్పుడు, అటువంటి బోధ ప్రవచనం. అలాగే ప్రబోధ.

'ప్ర' పెట్టినప్పుడు, 'పర' పెట్టినప్పుడు అతీతము. దేనికైతే 'పర' పెట్టామో, అది కానిది. ఇహము ప్రక్కన 'పర' పెట్టాము అనుకోండి. ఇహము కానిది అని. జ్ఞానికి ఇహమే పరమై ఉంటుంది. ఇహము మిథ్య కదా! ఇహము కానిది పరమేగా. ఇహము యొక్క లక్షణాలు పరమందు లేవు. బ్రహ్మ యొక్క లక్షణాలు పరబ్రహ్మయందు లేవు. ఆత్మ యొక్క లక్షణాలు పరమాత్మ యందు లేవు. మామూలు ప్రశ్నలో విషయాలతో ఉంటే, పరి ప్రశ్న యందు విషయాలు లేవు. ఆత్మజ్ఞానానికి సంబంధించిన ప్రశ్న అది. 'ప్ర' అంటే ప్రకృష్ఠము. ప్రకృతిలో కృతి అంటే సంగీతంలో 'కృతులు' అంటారు. త్యాగరాయకృతి అలాగ. కృతి అంటే, కొన్ని స్వరాలయొక్క కూడికతో, అన్నీ కలిపి, ఒక పద్ధతిలో, శ్రావ్యంగా ఉండే దానిని కృతి అంటాము. కృతి అంటే చక్కగా చేయబడినది. సంస్కృతి అంటే చక్కగా చేయబడినది. ప్రకృతి అంటే ప్రకృష్ఠముగా, శ్రేష్ఠముగా చేయబడినది.

ఆధ్యాత్మికంలో పర అని, పరి అని, పరమ అని వస్తుంటాయి. ఆ విషయాల్లో అక్కడ వచ్చినప్పుడల్లా కూడా, అక్కడ ఉన్నదానికంటే కూడా, అతీతమని, పరమమని, ప్రకృష్ఠమని, ఆధ్యాత్మికంగా ఉపయోగం అని చెప్పుకోవాలి. భౌతికంగా, లోపభూయిష్ఠంగా ఉన్నటువంటి ఈ ప్రపంచంలో, ఇవి వాడము. అక్కడక్కడ ఇలా వాడే అలవాటు ఉన్నప్పటికి, ఇక్కడకు వస్తే, ఆ పర అనే శబ్దానికి ఈ రకంగానే తీసుకోవాలి.

సృష్టి యందలి సర్వ భోగములు ఈశ్వరుని నుండి ఏర్పడినవి కనుక, ఈశ్వరుడు కోరవలసినది ఏదీ కూడా లేదు. **'న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన'** (భగవద్గీత 3వఅ 22వ శ్లో), 'న – మే – పార్థాఅస్తి కర్తవ్యం – త్రిషు లోకేషు – కించన' అనగా, మూడు లోకముల యెడలా నాకు ఎట్టి కర్తవ్యము లేదు. మూడు లోకాలు అంటే ఏమిటి? జీవుల యందు

స్థూల ప్రపంచము, సూక్ష్మ ప్రపంచము, మానసిక ప్రపంచము. ఈ మూడు లోకాల్లో ఆత్మ, పరమాత్మకి ఎటువంటి కర్తవ్యము లేదు. నిజమే కదా! నీకు స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు ఉన్నాయి. ఈ సాధనలో సూక్ష్మంలో స్వప్నావస్థ ఉంది. కారణంలో ఏమీ తెలియని స్థితి వస్తోంది. జాగ్రదావస్థలో నామరూప జగత్తుతో వ్యవహారం ఉన్నది. ఈ మూడు లోకాల్లో కూడా ఆత్మ సత్తామాత్రంగా, సాక్షిగా కదలకుండానే ఉంది. అతి సాన్నిధ్యంగా ఉంది. ప్రమేయం లేకుండా ఉంది. ప్రమాణం కూడా కాకుండా ఉంది. ఆ సత్తా వలన ఏం జరగాలో అవి జరుగుతున్నాయి. జరిగే దానికి, ఆ పరమాత్మకి ఏమీ సంబంధము లేదు. ఆయన పని చేసేవాడు కాదు, పని చేయించేవాడూ కాదు. తన ప్రభావం వలన అన్నీ జరుగుతున్నాయి.

ఒక అసెంబ్లీలో స్పీకర్ కూర్చున్నాడు. అతనిని ఏమంటారు? అధ్యక్షులు అంటారు. అధ్యక్షులు ఏం చేస్తారు? మాట్లాడకుండా ఉంటారు. పక్షాలు, విపక్షాలు మాట్లాడుకుంటూ ఉంటారు, పోట్లాడుకుంటూ ఉంటారు, తీర్మానాలు చేస్తారు, చట్టాలు చేస్తారు. స్పీకర్ ఎప్పుడు మాట్లాడుతాడు? సాక్షిగా ఉంటాడు. అయినా స్పీకర్ లేకుండా సభ జరుగదు. స్పీకర్‌కు గౌరవం ఇచ్చి, వీళ్ళే అధ్యక్షా అంటూ మాట్లాడుతూ ఉంటారు. స్పీకర్ ఉన్న సభ ఎలా ఉంటుంది? అతను ఏ పార్టీకీ వకాల్తా తీసుకోడు. న్యాయంగా, ధర్మంగా, తటస్థంగా ఉంటాడు.

అలాగే ఆత్మ కూడా ఈ మూడు లోకాలలో, అక్కడ ఏమి జరుగుతున్నా, ఏం జరుగక పోతున్నా, స్థూల సూక్ష్మ మానసిక ప్రపంచాలలో జరుగుతున్న దానికి ఎటువంటి సంబంధము లేకుండా, చిద్విలాసంగా, వినోదంగా, అంటకుండా, సాక్షీ భూతంగా ఉంటాడు. అయినా తన వల్లనే సర్వము జరుగుతోంది. అధ్యక్షులు లేకుండా అసెంబ్లీ ఎలా జరుగదో, ఆ పరమాత్మ అధ్యక్షస్థానంలో లేకుండా ఏదీ జరుగదు. ఈ అధ్యక్షుడినే అధిష్ఠానం అంటాము. అధిష్ఠాన ప్రకాశం అన్నప్పుడు పరమాత్మ ప్రకాశము. 'అధిష్ఠానం' అని పేరు ఎందుకు పెట్టాము? అతను అసంగుడు, సాక్షీ భూతుడు, అతడు కర్తా, భోక్తా కాదు, అతని ద్వారా క్రియ జరగట్లేదు. కేవలం అతను ఉండుట వలననే సర్వమూ జరుగుతుంది.

ఫ్యాన్‌లో కరెంటు ఉండుట వలన ఫ్యాను తిరుగుతుంది. అదే కరెంటు లైటులో ఉండుట వలన లైటు వెలుగుతుంది. కరెంట్ లైట్‌ని వెలిగించడం లేదు, కరెంటు ఫ్యానుని త్రిప్పటం లేదు అని మనం గ్రహించాలి. కరెంటు యొక్క సత్తావల్ల, దేని ధర్మం ఏదో, అది అలా ఉంది. ఆ సత్తా ఇచ్చేదాని సాన్నిధ్యం వలన క్రియలు జరుగుతున్నాయి. దాని సాన్నిధ్యం లేకపోతే, ఈ జడవస్తువులు తిరుగుతాయా? కరెంటు యొక్క సాన్నిధ్యం, కరెంటు యొక్క ఉనికి ఈ ఫ్యానులో గనుక లేకపోతే, ఫ్యాను తిరుగుతుందా?

అలాగే ప్రకృతి యొక్క మనుగడే లేదు. సర్వ జీవరాశుల యొక్క చైతన్యము, పరిణామము నిమిత్తమే. వీటన్నిటికీ మూలం పరమాత్మ చైతన్యమే! ఆ కృష్ణ పరమాత్మ ఏ పరమాత్మ చైతన్యం గురించి చెబుతున్నాడో, ఆ పరమాత్మ చైతన్యమే మూలం. అది చేసేదీ కాదు, చెందేదీ కాదు. కానీ, ఈ చైతన్య ప్రభావంవల్ల, మిగితావన్నీ చైతన్యవంతమై, వాటి ధర్మాల ప్రకారంగా, ఆ ధర్మాన్ని బయటకు ప్రకటించే తరుణంలో, అవి తెలుస్తున్నాయి, ప్రవర్తిస్తున్నాయి, పరిణామం చెందుతున్నాయి. వికారం చెందుతున్నాయి. అవన్నీ నిమిత్తమే. తాను కర్మను సృష్టించుచూ, ఆజ్ఞాపించుచున్నాడు. మళ్ళీ ఇక్కడ కర్మను సృష్టిస్తున్నాడు, ఆజ్ఞాపిస్తున్నాడు అంటే, కృష్ణ పరమాత్మ అలా చెప్పాడు కాని, పరమాత్మయేమీ కర్మను సృష్టించడు. పరమాత్మ ఆజ్ఞాపించడు. మాయ తన స్వాధీనములో ఉండడముచేత అది పరమాత్మయొక్క ఆజ్ఞయేనని అనవచ్చు. ఇక్కడ అధిష్ఠానం అని, అధ్యక్షస్థానం అని చెప్పుకోవాలి. అక్కడ భక్తుల కోసం సగుణ బ్రహ్మ పనిగా ఆ రకంగా చెప్పారు, భగవద్గీతలో ఆయన. జ్ఞానుల కోసం మరొక రకంగా చెప్పారు. జ్ఞానంకోసం చెప్పినప్పుడు ఆయన కర్మను సృష్టించడం లేదు. ఇదంతా మాయా కల్పితం. చేసిన కర్మకు మంచి, చెడు ఫలితాలు ఇవ్వడం అనేది, ఆ కర్మ యొక్క ధర్మం. కర్మ జడం, చైతన్యంయొక్క సాన్నిధ్యం చేత, జడమైన కర్మలో చైతన్యం వచ్చి, చేతనత్వమై, అది ఉపాధులను సృష్టించుకుని, ఉపాధులనే పనిముట్ల ద్వారా సూక్ష్మశరీరాన్ని సృష్టించుకుని, సూక్ష్మ శరీరం ద్వారా కర్మఫలితాలు ఇస్తున్నది. ఆ ఫలితాలు పొందేక్రమంలో పొందనప్పుడు అది కారణ శరీరంగా ఉంటోంది. పొందినప్పుడు కార్యరూపంలోకి వచ్చి పొందుతోంది. ఇలా జరుగుచున్న మూడు లోకాలకి, పరమాత్మకి ఎటువంటి సంబంధము లేదు. కాని ఆయనయొక్క సాన్నిధ్యం చేత, ఇవన్నీ నిమిత్త కారణంగా జరుగుతున్నాయి. తాను కర్మఫల ప్రదాత. తాను అంటే ఇక్కడ ఎవరు? అవిద్యా శబలిత బ్రహ్మ, సగుణముగా పిలువబడే బ్రహ్మ. నిర్గుణమైనటువంటి పరమాత్మ అయినప్పటికీ కూడా మాయ సగుణంగా చూపించి, **'సర్వకారణ మీశ్వరం, నిటలాంతరాళ విహారకం'** అన్నట్లుగా ఈ బ్రహ్మను సర్వకారణంగా

చూపిస్తోంది. మాయ చూపించిన పద్ధతిలో మాట్లాడుతున్నాము. నిజానికి బ్రహ్మ కారణం కాదు, కర్మఫల ప్రదాత కూడా కాదు. కర్మలు వాటికి అవే ఫలములను ఈయ జాలవు. ఇదే చెబుతున్నాము. కర్మ జడము, దానికదే ఫలితమును ఇవ్వదు. చైతన్య సాన్నిధ్యము చేత, కారణ శరీరాలు, కర్మలు, వాసనలు ఉండబట్టి కర్మ ఫలితాలుంటున్నాయి. ఇది మాయలో ఉన్న నియతి.

వాసన ఎప్పుడూ కూడా నీకు అనుభవాన్ని ఇచ్చి ఖర్చు అయిపోవాలి, ఖర్చుకాని వాసన అలా ఉంటే, ఆ వాసన ఖర్చు అవ్వడం కోసం, జీవులయొక్క భోగం ద్వారా, భోగించడం కారణంగా, ఖర్చు అవ్వడంకోసం, దానిలో ఒక గుబులు, ఒక కదలిక వస్తుంది. ఆ కదలిక చైతన్య సాన్నిధ్యం చేత వస్తుంది.

తాను కర్మను సృష్టించుచూ ఆజ్ఞాపించుచున్నాడు. తాను కర్మఫల ప్రదాత. కర్మలు వాటికవే ఫలములనీయజాలవు. ఈ కర్మకు ఈ ఫలము అని జడమగు కర్మ, స్వయముగా వినియోగించుకొనజాలదు. మరి ఎలా వినియోగపడుతోందది? ప్రకృతి సిద్ధముగా వినియోగపడుతోంది. అది మాత్రం ఎలా అవుతోంది? ఆ పరమాత్మ చైతన్యం యొక్క అతి సాన్నిధ్యంచేత. పరమాత్మ చేస్తున్నాడా? ఆ పరమాత్మ యొక్క ప్రకాశంలో ఉన్న సత్తాచేత, పరమాత్మచేత మాత్రము కాదు. పరమాత్మ యొక్క ప్రకాశంలో ఉన్న సత్తాచేత, ఆ సత్తావల్ల దాని ప్రభావానికి లోనై, అవి చేసుకుంటున్నాయి. అంతేకానీ పరమాత్మ చేయడం లేదు. అది తెలియక కొంతమంది, ఆయనే చేస్తున్నాడు, ఆయనే సర్వకారణం, వాడే కర్మ ఫలితాన్ని ఇస్తున్నాడు అని అంటూ ఉంటారు. వాడే సృష్టి, స్థితి, లయకారుడు, తిరోధాన అనుగ్రహములు ఉన్నాయని, అనుగ్రహిస్తాడని, ఏదన్నా పోగొడతాడని, ఏదైనా సంప్రాప్తింప చేస్తాడని అనుకుంటారు. ఇది ఏ జీవికాజీవి చేసుకున్న కర్మలు పాప పుణ్య మిశ్రమ కర్మల ఫలితాన్ని, దేనికి ఎంత ఫలితం ఎప్పుడివ్వాలి? ఎక్కువా? తక్కువా? ఇప్పుడా? అప్పుడా? అనే ఇంకా రాబోయే నాలుగు జన్మల తరువాతా? అనేదానిమీద, ఆ విధాత కర్మనిర్ణయాన్ని చేస్తాడు. విధాత అంటే బ్రహ్మ, పరబ్రహ్మ కాదు. యోగ వాశిష్ఠంలో విధాతను పరబ్రహ్మ అనలేదు. కొంతమంది దేవుడే ఇవన్నీ చేస్తున్నాడు అంటే, దేవుడే విధాత అంటారు.

'విధాత' అంటే, విధిని వ్రాసేవాడు. 'విధి' ఎక్కడిది? మళ్ళీ జీవుడిదే! ఇది మళ్ళీ ఏమైంది? వాసనారూప కర్మ అయ్యింది. వాసనారూప కర్మ ఏమైంది? జడమయ్యింది. జడమైన కర్మ నీకు మళ్ళీ ఉపాధిని సృష్టించి, ఆ కర్మ యొక్క ఫలితాన్ని అనుభవింప చేయాలి అంటే, చాలా కాలం జరగాలి. ఈ పనంతా కర్మే చేస్తోందా? అంటే, చైతన్యం యొక్క సాన్నిధ్యంచేత, ఈ కర్మ జరుగుతోంది. అయితే, చైతన్యం యొక్క సాన్నిధ్యం చేత ఈ కర్మ జరుగుతోంది అంటే, మళ్ళీ ఈ మధ్యలో ఇంకొకటి పెట్టాలి.

కరెంటు ఉంటేనే ఫ్యాను తిరుగుతుంది అన్నప్పుడు, మధ్యలో ఇంకో అధిష్ఠాన దేవతను పెట్టాము. ఆ అధిష్ఠాన దేవత ఎవరూ అంటే, ఫ్యానును త్రిప్పే శక్తి. ఫ్యానును తిరిగేటట్లు చేసే శక్తి, అధిష్ఠాన దేవత. చైతన్యమేమో చైతన్యమే! ఫ్యానేమో తిరుగుతుంది. అధిష్ఠాన దేవత ఫ్యాను తిరగడానికి కావలసిన శక్తిని అందిస్తాడు. అప్పుడు ఫ్యాను తిరుగుతుంది. మన కన్ను సూర్యుడనే అధిష్ఠానదేవత ప్రేరణ చేత చూస్తుంది. మనస్సు చంద్రుడనే అధిష్ఠాన దేవత యొక్క ప్రేరణచేత ఆలోచిస్తుంది. ఫ్యాను త్రిప్పే శక్తి అనేటటువంటి అధిష్ఠానదేవత చేత తిరుగుతోంది. కాబట్టి, ఈ మధ్యలో ఒక అధిష్ఠాన దేవతను పెట్టాము. విధాత అనేవాడు, అధిష్ఠాన దేవతగా ఆ మధ్యలో వచ్చినవాడు.

నిజానికి డైరెక్టుగా పరమాత్మే చేస్తున్నాడు అనకూడదు కాబట్టి, పరమాత్మ లేకుండానే ఇది జరుగుతోందా? అంటే, పరమాత్మ యొక్క ఒకానొక శక్తి చేత జరుగుతోంది. ఆ శక్తేమో అధిష్ఠాన దేవత. అది పరమాత్మ యొక్క ఒకానొక శక్తి. పరమాత్మకు అసలు శక్తి ఉందా? ప్రకృతిలో అనేక ధర్మాలున్నాయి. ఈ పరమాత్మ చైతన్యముచేత ప్రకృతి యొక్క ఆ ధర్మము, అప్రకటితంగా ఉండగానే, ఈ పరమాత్మ చైతన్యం యొక్క సాన్నిధ్యం చేత, సత్తా చేత, అక్కడ ఒక శక్తి పుట్టింది. ఆ పుట్టినటువంటి శక్తిపేరే అధిష్ఠాన దేవత. ఇక్కడ ఆ అధిష్ఠాన దేవత పేరే విధాత. ఆ విధాతే కర్మ యొక్క ఫలితాలను, ఏ జీవుడికి ఎలా ఎంతెంత పంచి పెట్టాలో, అలా పంచిపెడుతాడు. నిజానికి ఈ అధిష్ఠాన దేవతలు అని మధ్యలో ఒకటి పెట్టాము కాని, సర్వకారణం ఎవరు? ఆ బ్రహ్మే.

త్రిమూర్తులు కూడా అలాగే అధిష్ఠాన దేవతలే, సృష్టి స్థితి లయలు చేసేది. కాని సృష్టి, స్థితి, లయలు ఆటోమేటిక్‌గా జరుగుతున్నాయి అనడానికి వీలు లేదు. పరమాత్మ యొక్క చైతన్య సత్తా చేత, సృష్టి స్థితి లయలు జరుగుచున్నాయి అంటున్నాము. నిజానికి అదే కాని, మధ్యలో మనం ఏం చేస్తున్నాము? ఈ సృష్టి అనేటటువంటి కార్యానికి, సరియైనటువంటి శక్తి ఒకటుంది. ఆ శక్తి పేరు బ్రహ్మ. పోషించే శక్తి పేరు స్థితి కారుడు విష్ణువు. లయకారుడు, ఆ శక్తి సహితుడు రుద్రుడు. బ్రహ్మ, విష్ణు,

మహేశ్వరులు ఏ పేరైనా పర్వాలేదు, రుద్రుడే అంటాను నేను. మహేశ్వరుడికి ఇంకోచోట వేరే అర్థంతో ఉంది. కాబట్టి అదిక్కడ వాడను. కనుక చైతన్యం నుండి జడపదార్థముల యొక్క వ్యవహారానికి మధ్యలో, ఒక శక్తి తయారై ఉంది. ఆ శక్తే ఆ పరమాత్మ ప్రకాశంలో ఉన్న సత్తా. ఆ సత్తాయే ప్రకృతి ఎన్ని రకాలుందో, అన్ని రకాల దేవతలుగా, అధిష్ఠాన దేవతలుగా, దేవతా శక్తులుగా చెప్పడమైంది. త్రిమూర్తులు గాని, విధాత గాని, పిండాండంలో 25 తత్త్వాల యొక్క అధిష్ఠాన దేవతలు గాని, వీళ్ళంతా కూడా ప్రకృతిలో శక్తిరూపులు. మరలా ఆ శక్తికి మూలం ఆ పరమాత్మ చైతన్యమే. కనుక త్రిమూర్తులలో అంతర్యామి పరమాత్మే. త్రిమూర్తులు వాళ్ళ వ్యవహారం కనుక ఆపితే, అంతర్యామి అయినటువంటి పరమాత్మయే ఆ త్రిమూర్తుల యొక్క తురీయస్థితి. ఆ తురీయజ్ఞానము శుద్ధ చైతన్యం, పరమాత్మ.

జడమగు కర్మ స్వయముగా వినియోగించుకొనజాలదు. కర్మకు ఈశ్వరుడేమో అధిష్ఠానము. అసెంబ్లీలో అధ్యక్షులవారి లాగా. మధ్యలో ఇంకా ఎవరు వచ్చారు? విధాత వచ్చాడు. ఆ కర్మను పంచిపెట్టేవాడు. కర్మ స్వయంగా అవుతుందా? కొన్ని శక్తుల ద్వారా జడమైనవి కదులుతాయి. ఆ శక్తికి మూలం చైతన్యం. 'శక్తి' ప్రకృతిలో అనేకంగా ఉంది కాబట్టి, లక్షలాది ప్రకృతి శక్తులున్నాయి. ఆ లక్షలాది ప్రకృతి శక్తులు కూడా నిజానికి శక్తులు కావవి. ప్రకృతి యొక్క ధర్మాలు, గుణాలు. అందులో చైతన్యం వ్యాపించేసరికి, ఒక్కొక్క ధర్మం ఒక్కొక్క ప్రకృతి శక్తి అయ్యింది. ప్రకృతి అంటే మళ్ళీ అది జడమే. జడమైన ప్రకృతికి, పరమాత్మ యొక్క అతి సాన్నిధ్యానికి, మధ్యలో పరమాత్మ యొక్క ప్రకాశ లక్షణం చేత, ఆ సత్తాతో ఇది ఏదైతే జరుగుతోందో, ఆ జరగడానికిన్నూ ఆ సత్తాకీ మధ్యలో, ప్రకృతి ధర్మాలతో తయారైన ఈ శక్తి కూడినప్పుడు, అవి ప్రకృతి శక్తులుగా మారి, ఆ శక్తి రూపములుగా అధిదేవతలయ్యాయి. అందుకనే హిందూ ధర్మంలో ముక్కోటి దేవతలున్నారు. దేవుడొక్కడే అని వేరే మతాలు చెబుతాయి. వీళ్ళకి ఇంతమంది దేవుళ్ళేమిటి? వీళ్ళది తప్పు అంటారు వాళ్ళు. ఈ దేవుడు బ్రహ్మజ్ఞానం దేవుడు కాదు. అతను సాక్షి, అసంగుడు, సత్తామాత్రుడుగా, తానుతానుగా, రెండోది లేకుండా ఉన్నవాడు ఎవరో, వాడిని దేవుడు అనడం లేదు మనం, బ్రహ్మము అంటున్నాము. ఆ బ్రహ్మము ఒక్కటే అంటున్నాము.

మనకున్నటువంటి ఉపనిషత్తులు, వేదాలు, వేదాంతంలో మనకి విన్నవిగా ఋషులు అందించినటువంటి విమర్శ, లోతైనటువంటి వివరణలు, తర్కానికి, విచారణకి నిలబడేది, శాస్త్రానికి ఋజువయ్యేది, శాస్త్రం ఎంతవరకు వస్తుందో, అంతవరకు ఋజువయ్యేది అందించాయి. అంతకంటే చెప్పలేనిచోట, అనిర్వచనీయంగా అందేటటువంటిది, ఇన్ని కాలాల్లో సైంటిస్ట్‌లు కనిపెట్టినా కూడా, ఈ వేద ప్రమాణానికి సరిపోయేది ఈ వేదాలలో ఉన్నది. ఎవరు ఏదన్నా చెప్పినా కాని, దీనిలో భాగంగానే. కొంతవరకే సరిపోయేటట్లు ఉంటాయి తప్ప, ఇంత పరిపూర్ణంగా ఉండేటటువంటిది, ఏదీ ఏ మతంలో లేదని, గర్వంగా చెప్పుకోవచ్చు. మతం అనవద్దు. ఈ వేద సాంప్రదాయంలో, ఈ సనాతన ధర్మంలో, ఉపనిషత్తులు ఋషిప్రోక్తంగా, ఏదైతే మనకి ఋక్కులుగా అందించబడ్డాయో, ఇంత సమగ్రమైనటువంటిది, ఈ ప్రపంచంలో ఎక్కడా లేదు. ఎవ్వరు ఏది చెప్పినా దీంట్లోనే ఉంది, అది ముందే చెప్పబడి ఉంటుంది. అది దొరుకుతుంది తప్పకుండా! ఇన్ని విభాగాలు లేకపోతే, అచల పరిపూర్ణంగా, సర్వసాక్షిగా ఉన్న పరమాత్మని త్రిగుణ రహితంగా, నిర్గుణంగా, మనం వస్తు నిర్ణయం చేయలేము. ఇన్ని స్టెప్స్‌గా చెబితే అది నిర్ణయం అవుతుంది అని మనం గమనించాలి.

పుట్టుక, సంస్కారము, వేదాధ్యయనము అనునవి ఏదియూ బ్రహ్మత్వమునకు కారణము కాదు. బ్రహ్మత్వానికి చావు పుట్టుకలతో ఉన్నది కారణము కాదు. వర్తనమే మూలకారణము. ఎప్పటికప్పుడు ఏది జరుగుతోందో అది అంతే. వర్తనం లేనప్పుడు వాసనారూపంలో నిష్క్రియా రూపంలో ఉంటాయి, కారణ రూపంలో ఉంటాయి. కారణరూపంలో ఉన్నదానికి ఏ అనుభవమూ లేదు, ఏ పరిణామమూ లేదు, ఏ వికారము లేదు. అయినప్పటికీ అది మోక్షంకాదు. కారణంగా ఉన్నది ఏదైనా సరే, అది మోక్షం కాదు. సర్వకారణమూ బీజరూపంలో ఉంటే, ఆ బీజం నిర్బీజమైనప్పుడే మోక్షం. అన్ని కారణాలు లేకుండా పోయినప్పుడు, కార్యకారణానికి ఏదైనా మూలం వుంటే, ఆ మూలచ్ఛేదో, మూలాన్ని ఛేదించాలి. ఆ మూలం అనేది ఏమైనా దొరికితే, కూకటి వ్రేళ్ళతో సహా తీసేయాలి. ఒక విత్తనంగా దొరికితే, దానిని నిర్బీజం చేయాలి. ఆ మూలాన్ని నిర్బీజం చేయాలి.

ఇక్కడే ఎప్పుడో ఒకప్పుడు మృతి నొందక తప్పదు. లోకమున ప్రతి నిమిషము ఎందరో పుడుతూ, గిడుతూ ఉన్నారు. పుట్టుక, మరణములు లేకుండా చేసుకొనుట యెట్లు? ముందు అసలు పాయింటు ఇది. చావు పుట్టుకలు లేకుండా, సంసారబంధము లేకుండా, దుఃఖమునుండి బయటపడడం అనేది కావాలి. ఈ ఆధ్యాత్మిక బోధ ఎవరికి? ఎందుకు కావాలి?

చచ్చి పుట్టేవాళ్ళు, ఈ చచ్చి పుట్టే స్థితినుంచి బయట పడటానికి సుఖదుఃఖాలని అనుభవిస్తూ, బాధపడుతూ ఉపాధికి సంబంధించిన వ్యాధి, బాధ పడలేక, ఓర్చుకోలేక, సంసారంలో ఉన్న నేను నాది ఇతరులు అనేదాని మధ్యలో, ఆ విభజనలో విడిచిపెట్టి ఉండలేక, ప్రియం మోదం ప్రమోదాలతో భోగాలు కోరుకుంటూ, అయినప్పటికి అది రాకపోతే చింతిస్తూ, విచారిస్తూ, నిరాశపడుతూ, అవమాన పడుతూ "ఇవన్నీ అవసరమా"? వీటినుంచి మనకు విముక్తి కావాలి. వీటినుండి విడుదల కావాలి.

విడుదల అయ్యే మార్గం ఉంటే, విడుదల కావాలి అన్నా పర్వాలేదు. విడుదలయ్యే మార్గమే లేకపోతే, చచ్చినట్లు అలానే అనుభవించాలి. పశుపక్ష్యాదులు ఏం చేస్తున్నాయి పాపం. కష్టసుఖాలు ఏది వచ్చినా బ్రతుక గలిగితే బ్రతుకుతాయి, బ్రతుక లేకపోతే చస్తాయి. వాటికి ఏమైనా మార్గం ఉందా? ఒక్క మానవుడే తప్పించుకుంటున్నాడు. మానవుడైనా పూర్తిగా తప్పించుకోగలిగాడా? కాని తప్పించుకోవాలనే ఆశ వచ్చింది. తప్పించుకోవాలనే ఆశయం కలిగింది. తప్పించుకునే ఉపాయం కోసం వెదుకుతున్నాడు. ఈ వేదాంతం తప్పించుకునే ఉపాయం కనిపెట్టింది. ఉపనిషత్తుల ఋషులు తపస్సు చేసి కనిపెట్టారు ఉపాయం ఉందని. ఉపాయం ఇచ్చి వాళ్ళు తరించారు. వాళ్ళకు జన్మరాహిత్యం అయ్యింది, బ్రహ్మజ్ఞానం కలిగింది. ఇలా వాళ్ళు శాస్త్రాన్ని తయారు చేశారు. వాళ్ళ అనుభవమే శాస్త్రమయ్యింది. శాస్త్రమై, ఆగమ ప్రమాణమయ్యింది. వాళ్ళ అనుభవమే వాళ్ళకు ప్రత్యక్ష ప్రమాణమైంది. ఆ ప్రతక్ష్య ప్రమాణం శాస్త్రమనే ఆగమ ప్రమాణం ద్వారా మనకు అందించబడింది. అందించబడినా కాని తీసుకోగలిగామా? అంటే ఒక గురువు మనకు సహాయం చేసి, నిరంతరము మనకు దగ్గరుండి కనిపెట్టి అందిస్తే తెలిసింది.

ఎందుకంటే, అజ్ఞానం నుంచి జ్ఞానానికి మార్గం లేదు కనుక. ఒక్కసారి ఇది విదిలించి, అది పట్టుకోవడం చేత కాదు కనుక, క్రమక్రమంగా చేయాలి కనుక, కొన్ని ఉపాయాలను ఆశ్రయించాలి. ఆ ఉపాయాల ద్వారా సాధనామార్గాలు, ఆ సాధనామార్గాలే ధర్మార్థ కామ మోక్షాలై, మోక్షం విషయంలో మహావాక్యాలు, ఇవన్నీ కూడా ఈ వేదాలు, వేదంతంలో మనకు అందుబాటు అయినవి. వాటిని వినియోగించుకోవాలి. అయితే వాటిని గుడ్డిగా నమ్మక్కర్లేదు.

**'శాస్త్ర ద్రష్టం, గురోర్వాక్యం, తృతీయం ఆత్మనిశ్చయం'** – శాస్త్రాన్ని పరిశీలించండి. దుఃఖాన్ని నివారించుకునే మార్గం ఉందని తెలుసుకోండి. వేదం చెప్పినటువంటి పద్ధతిలో, సాధనామార్గం తీసుకుని ఆచరించవచ్చు. మహావాక్యనిర్ణయ పద్ధతిలో బ్రహ్మజ్ఞానం పొందవచ్చు. అచల సిద్ధాంతం ప్రకారంగా ఎఱుక విడువవచ్చు. ఇవన్నీ చేయచ్చు అని అయిన వారు, చేసిన వారు చెబుతున్నారు కనుక, ఎవరికైతే తీవ్రంగా విడుదల కావాలి అనేటటువంటి తపన ఉందో, తీవ్ర మోక్షేచ్ఛ ఉందో, ఎవరైతే ఇన్ని జన్మలతో విసిగి వేసారారో, సర్వమూ నేను సర్వార్పణ చేస్తానో, త్యాగం చేస్తానో, ఇవి ఉండి నాకేం చేస్తాయిలే, మళ్ళీ మళ్ళీ జన్మకి తీసుకొస్తున్నాయి, నేనది ఒదిలేసుకుంటాను, అనేటటువంటి తీవ్రమైన స్థితిలో మన గురువుగారు చెప్తారు కొట్టబడ్డప్పుడే వస్తారిట్లా! అంతా బాగుంటే ఎవరూ రారు.

భక్తులు కూడా అలాగే చెప్తారు, కష్టాలు వస్తేనే దైవాన్ని తలచుకుంటారట! సుఖంగా ఉన్నప్పుడు దైవమును మరచిపోతారు. కనుక తన కష్టాలన్నీ కూడా దైవీ ప్రణాళికలో భాగంగానే ఉంటాయి. అందుకే కష్టం వచ్చిందని కృంగిపోకూడదు. ఏదైనా మన మేలుకోసమే అని స్వీకరించి దానినుంచి అధిగమించే ప్రయత్నం చేయాలి. మావన మేధస్సుకి, విచక్షణా జ్ఞానానికి, వివేకానికి, సాధన చేయగలిగినటువంటి శక్తియుక్తులు, ఇవన్నీ కూడా మానవజన్మలో మానవునికి వచ్చినాయి కనుక వాడికే ఆ యోగ్యత ఉంది. మరి ఆ యోగ్యతను తీసుకుని, నాకా యోగ్యత ఉంది, దీనిని వినియోగించుకోవాలి అని వచ్చిన వాళ్ళు ఎంతమంది? రానివాళ్ళు ఎంతమంది?

నరకానికి పోయేదారి హై వే లా ఉంటుంది, స్వర్గానికి పోయేదారి ఇరుకుగా, ఒక్కళ్ళు కూడా పట్టనట్లుగా ఉంటుంది. అందుకని లోకసంబంధముగా, అందరితో ఎప్పుడూ పోల్చుకుని, ఇలా అయితే మనం బ్రతుకలేమని, మనం అలా జారిపోకుండా, లక్షకో కోటికో ఒక్కరికే మోక్షం అంటున్నారు కనుక ఆ కోటికొక్కరు నీవే ఎందుకు కాకూడదు అనే పద్ధతిలో, గట్టిగా పట్టు పట్టాలి.

**పట్టు పట్టరాదు, పట్టినపట్టు విడువరాదు. పట్టిన పట్టు విడుచుటకంటే చచ్చుట మేలయా విశ్వదాభిరామ వినుర వేమ.** ఆ పట్టే పట్టేదో గట్టిగా పట్టండి. మధ్యలో సడలిపోతే రెంటికీ చెడడం అవుతుంది. ఇటు భౌతిక సుఖంలేక అటు ఆధ్యాత్మిక పురోగమనం లేక రెండిటికీ చెడతాము. పట్టకపోతే మానేయ్యండి. పడితేమాత్రం కడతేరేదాక వదిలిపెట్టకండి.

ఆత్మ ఎన్నడును పుట్టదు. పుట్టని ఆత్మకు మరణమే లేదు. పుట్టడమంటే ఏమిటి? కనబడకుండ ఉన్న రూపములో ఉన్నదేదో అదే కనబడే రూపానికి రావడము పుట్టడము. జీవుని విషయములో జీవోపాధికి పుట్టుట అనేది యున్నది. మామూలు మిగతా పంచభూతాలకి వాటికి, వీటికి పుట్టడమంటే సృష్టి తన్మాత్రలుగా వున్నప్పుడు కనబడుటలేదు. సూక్ష్మ భూత రూపమున్నప్పుడు శక్తి రూపంగా వుంది. స్థూల భూతమయ్యేసరికి కనబడుతుంది. ఎక్కడికక్కడ కనబడటము అనేది వస్తే సృష్టి అన్నమాట. కనబడటము మరుగైపోతే లయము. జీవుల యొక్క మానవుల ఉపాధి అయితే పుట్టడము అంటే నామరూపంగా ఒక పిండంగా కనబడుతుంది. చచ్చుట అంటే ఆ పిండము కనుమరుగైపోవుట. ఎలా అంటే? ప్రాణముతో కూడుకున్నది. ప్రాణము లేకుండా వుంటుంది. ఇంకా దాన్ని విచారణ చేయాలి. పుట్టుక అంటే ఎమిటో శరీరము, ప్రాణము, మనసు, బుద్ధి ఇవన్నీ విచారణ చేస్తే పుట్టుక అంటే ఏమిటో తెలుస్తుంది. అయితే జడమైనటువంటివన్నీ వాటికవే వాటికవే వ్యక్తమై అవ్యక్తమవుతాయా? మూలా ప్రకృతి రూపము నుండే ఈ నామరూప జగతి రావడానికి దానంతట అదే వచ్చిందా? నీళ్ళు వుంటే ఆ సహకారముతో కదా అన్నము వుడికింది. నీళ్ళు అగ్ని వుంటేనే అన్నము ఉడికింది. బియ్యము వేస్తే ఉడికిందా? అగ్నివల్ల వుడికింది.

అదే మాదిరిగా పుట్టుట, చచ్చుట అనేటటువంటిది, ఉత్పత్తి నాశనము అనేటటువంటిది దానికి నామరూప వస్తువులకు గాని, జీవుల యొక్క ఉపాధులకు గాని ఇవన్నీ ఆధారమైనటువంటి చైతన్యము తప్పనిసరిగా వుండాలి. ఆ చైతన్యమే బ్రహ్మాండ పిండాండమైన దానిలో ఉన్నది. ఆ చైతన్యమే ఆత్మ. బ్రహ్మ శాశ్వతము గనుక ఆది అంతము లేదు, ఆది మధ్యాంత రహితము గనుక ఆ బ్రహ్మమే సర్వదా సర్వత్రా వ్యాపించి వున్న బ్రహ్మ. ఆ మహాకాశమే ఘటాకాశముగా వున్నట్లుగా ఉపాధి వచ్చేసరికి అందులో ఆత్మ అనే పేరు పెట్టాము. ఘటాకాశానికి ఆత్మ అన్న పేరు పెట్టాము. ఘటాకాశానికి వెలుపల వున్న ఆకాశానికి మహాకాశమును బ్రహ్మ అన్నాము. ఈ బ్రహ్మ ఆది అంతము లేనిది, చావు పుట్టుకలు లేనిది. అందుకే ఆత్మకు కూడా మరణము పుట్టుక లేదు. మనము ధరించినటువంటి శరీరము ఏదైతే ఉందో దానికి పుట్టుక, మరణము వుంది. **జాతస్యమరణం ధృవం.** పుట్టిన ప్రతీది నశిస్తుంది. అలాగే సృష్టి అయిన ప్రతీది ఎప్పటికో అప్పటికి లయమవుతుంది.

ఉత్పత్తి అయినవన్నీ కూడా నశిస్తాయి. ఇవన్నీ అనిత్యములు. అసలు ఇవి ఎలా వస్తున్నాయి? కామ్యముతో కూడిన దేహమునకే మృత్యువు. దేహము ఎట్లా వస్తుంది? కామముతో వస్తుంది. సృష్టి ఆదిలో బ్రహ్మకు సంకల్పము కలగడమే కామము. సంకల్ప ప్రకారము వచ్చినవన్నీ ఊహా మాత్రమే. మన దగ్గరకు వస్తే ఎట్లా వుంది? కోరికలే పునర్జన్మకు హేతువు అని బౌద్ధ మతములో బుద్ధుడు చెప్పాడు. నిజానికి కామము ఎన్ని రకాలైన వుండవచ్చు. ఇష్టాఇష్టాలు అన్నీ కూడా, ఒకటి వద్దని ఒకటి కావాలని ఉన్నది కూడా కామమే. ఒకదానిమీద ప్రీతి, ఒకదానిమీద అప్రీతి వుంటే అది కూడా కామమే. కామ, క్రోధ, మోహ, లోభ, మద, మత్సరాలన్నీ కూడా ఒకే కామమనే హెడ్డింగు క్రిందే వస్తాయి.

ఈ కామము స్థూల దేహానికా? ఈ కామమనేది ఎక్కడ వుందీ? కామమనేది నేనులో వుంది. నేనులో వున్నంతకాలమేమైందీ? నేనులో వున్న కామము అనగానే నేను వేరు అయింది. కామము వేరు అయ్యింది. ఈ కామమంతా మనసుకు సంబంధించినది అయినది. 'నేను'ను గనుక వేరు చేస్తే, అసత్య నేనుగా వున్నప్పుడు నేనులోనే కామముంది. నేనుని, మనస్సును వేరుచేస్తే ఈ కామమనేది మనస్సు. ఈ మనస్సు గూడ జడమే. మనస్సులో ఆత్మ వ్యాపించి వుండటము వలన మనస్సు పనిచేస్తుంది. ప్రాణము గూడ జడమే. ప్రాణములో ఆత్మ చైతన్యము వ్యాపించి వుండటము వలన ఆత్మ సత్తాచేత ఈ ప్రాణము స్థూల దేహములో పనిచేస్తుంది. ప్రాణము స్థూల దేహములో పనిచేయడము వలన స్థూల దేహము శవము గాకుండ పనికొచ్చే పనిముట్టుగా అయింది.

ఈ సంఘాతములో నేను ఎవరు? అనేది తెలుసుకోవాలి. స్థూల దేహమా, ప్రాణమా, మనసా, ఆత్మా ఏది నేను? ఈ బోధ చెప్పేదెవరికి దేహానికా, ప్రాణానికా, మనసుకా, బుద్ధికా? నేనుకు. బుద్ధి ఇవన్నీ సహాయకారిగా వున్నాయి. నేనుకి మనసు, ఇంద్రియాలు సహాయకారిగా వున్నాయి. ఈ దేహము గూడ కోరికల వల్లనే పునర్జన్మగా వచ్చినటువంటి దేహమిది. ఒక జన్మము అంటే రాకడ అన్నమాట. ఆ జన్మలో అదే దేహముయొక్క పోకడ మృత్యువన్నమాట. మళ్ళీ రాకడ, పోకడ, అంటే, దేహానికే జననము, మరణము. మరి శరీరము నేనా? నేను అంటే శరీరత్రయ విలక్షణమని, అలాగే పంచకోశ లక్షణ వ్యతిరిక్త లక్షణమైనటువంటి ఆత్మ అని, అవస్థాత్రయ సాక్షి, ఈ మూడు విచారణలు చేస్తే దేహము నేను కాదు. నేను ఆత్మ అని తెలుస్తుంది. విచారణ చేసేది నేనన్నమాట. నేను యొక్క విచారణకు బుద్ధి సహకరిస్తుంది. మనసు సహకరించదు. మనసేమో

పూర్వజన్మల కర్మవాసనల ప్రకారముగాను, చిత్తమందు చిత్తవృత్తులు సహజంగానే వాటికవే వచ్చేస్తూ వుంటాయి. ప్రతి జీవికి ప్రతి మానవునికి చిత్తవృత్తి ప్రకారము వచ్చిన విషయాన్ని స్వీకరించాలా, నిరాకరించాలా, ఆస్వాదించాలా, ఆస్వాదించకూడదా, ఉదాసీనంగా ఉండాలా అన్నది బుద్ధిలో వున్నటువంటి వివేకాన్నిబట్టి వుంటుంది.

ప్రస్తుతము బుద్ధి ఏంచేస్తున్నది? అనేక జన్మలయొక్క అనుభవాలయొక్క సారముతో ప్రియం, మోదం, ప్రమోద పద్ధతికి కుదిరేవన్నీ కావాలనీ, అలా కుదరనివన్నీ బాధపెట్టేవన్నీ వద్దని బుద్ధి నిర్ణయిస్తున్నది. ఇక్కడ తాత్కాలిక లాభనష్టాలే చూస్తుంది. బుద్ధి మళ్ళీ ఒక్కొక్కసారి ఈ ప్రపంచములో కూడా దీర్ఘకాలిక లాభమే చూస్తుంది. కష్టపడి ఒకటి సాధించాలని, లేదా సంపాదించాలి అన్నప్పుడు తాత్కాలిక సుఖాన్ని మనము త్యాగము చేసి కష్టపడి సంపాదిస్తాము. వెంటనే వచ్చేటువంటి లాభము అనిత్యమని, కొంచెము టైమ్ తీసుకొని కష్టపడితే వచ్చే లాభము మన జీవితకాలము వుంటుందన్న దానిలో వుంటాము. మనము బుద్ధియొక్క వివేకాన్ని తక్కువ అనిత్యత్వము, ఎక్కువ అనిత్యత్వము, మధ్యలోనే వాడుకుంటున్నాము. అజ్ఞానముతోనే ఎక్కువగా అనిత్యమును వద్దంటున్నాము. నిత్యత్వము ఎక్కువున్న దాన్ని పొందాలనుకుంటున్నాము. కనుక బుద్ధి ఆ విధమైన నిర్ణయం చేయగలుగుతుంది. అటువంటి నిర్ణయం చేసే బుద్ధిని మానవుడు ఇప్పుడు పొందియున్నాడు. సృష్టి పరిణామములో మానవజన్మ వచ్చేసరికి అటువంటి బుద్ధి కలిగియున్నాడు. ఆ బుద్ధికూడా నేనుకు లోబడియున్నది. ఆనందమయకోశం వుంది. ఆనందమయ కోశము ప్రియం, మోదం, ప్రమోదం కావాలి, ఇతరమైనవి వద్దని దానిలో ఉంటుంది. విజ్ఞానమయ కోశంలో బుద్ధి ఆ ప్రభావానికి లోనై పనిచేస్తుంది. బుద్ధి అలా పనిచేస్తుంది కాబట్టి, బుద్ధి కర్త. నిజమైన భోక్తమో మనసులో వున్నాడు. అనగా బుద్ధిలో కర్త వున్నాడు, భోగానికి ప్రేరణగా ఆనందమయకోశము వుంది. భోగించినటువంటి దాంట్లో మనసుకి సుఖము, దుఃఖము అనేటువంటి భోగము మనోమయ కోశములో వుంది.

ఈ రకంగా విచారణ చేస్తే మనము ఇంతకుముందే నిర్ణయించుకున్నాము. **'యతే భావం తత్ భవతి'**. భావించినదే కారణ శరీరములోనున్న వాసన అవుతుంది. పునర్జన్మలో అదే మళ్ళీ తిరిగి అనుభవానికి వస్తుంది. ఇది **'యత్‌భావం తత్ భవతి'**. కాబట్టి భావాన్నిబట్టి వచ్చేది భావనా మాత్రమే. వాసనబట్టి వచ్చే అనుభవమంతా ఒకప్పటి భావనే. వాసనే పునర్జన్మలో ప్రారబ్ధము. కనుక వాసన లేనివాడికి ప్రారబ్ధము లేదు. నామరూప జగత్ మీద ప్రపంచ వాసన ఉంటే, ఈ ప్రపంచము ఉన్నది. వాసన లేనివాడికి జగత్తు లేదు. ఏదైనా సంసారానికి సంబంధించిన వాసన నీలో ఉంటే నీకోసం సంసారం వస్తుంది. ప్రతి జీవికి ఎవరి సంసారము వారికుంది. ఇతరుల సంసారము నీకు లేదు, నీ సంసారము ఇతరులకు లేదు. కారణం ఏమిటంటే **'యత్ భావం తత్ భవతి'** అన్న వ్యక్తికి ఇక్కడేముందో దాని ఫలితము అక్కడుంది. వేరేవాడియొక్క యత్‌భావం తత్ భవతి కొచ్చేవాసన ప్రకారము వాడి ప్రారబ్ధము వాడికుంది. లోకములో ఎంతమంది వున్నారో అన్ని కారణ శరీరాలు దానికనుగుణమైనటువంటి ప్రారబ్ధము వారికుంది. నీవనుకున్నది వాళ్ళు అనుకోవడము లేదు. వాళ్ళనుకున్నది నీవనుకోవటము లేదు. నీవనుకున్న ప్రకారము నీ సంసారము నీ ప్రారబ్ధముంది, ఇంకొందరనుకున్న ప్రకారము వారివారి సంసారములో ప్రారబ్ధము ఉంది. అసలు అనుకోకపోతే వాసనలే లేకపోతే ప్రారబ్ధముండదు. ప్రారబ్ధము లేకపోతే దేహము ఉత్పత్తికాదు. ఇప్పుడు భ్రమ అనే మాటకి అర్థమేమిటంటే **యత్ భావం తత్ భవతి** వల్ల వచ్చిందే భ్రమ. అభావ స్థితిలో ఏదైతే వుందో అది నిత్యము, శాశ్వతము, అది సత్యము. భావన మూలంగా వచ్చేవన్నీ భ్రమే. ఒక భావమునుబట్టి వాసన, వాసనబట్టి ప్రారబ్ధము, ప్రారబ్ధముబట్టి ఇంద్రియ గోచరమైనది వస్తుంది. అనుభవానికి రావడమంతాకూడా భావనామాత్రము, కాబట్టి భ్రమే. ఊహామాత్రము, కాబట్టి భ్రమే. భ్రమంటే అసత్యాన్ని సత్యం అనుకోవడము. భ్రమలేకుంటే అమృతత్వము. శరీరము నేను అనేది భ్రమ, సుఖదుఃఖాలు శరీరానుసారంగా ఉన్నాయనుకోవడము భ్రమే. ప్రియం, మోదం, ప్రమోదం, నీలోవున్న సుఖస్వరూపాన్ని కనిపెట్టకుండా బాహ్య ప్రపంచములో దేవులాడుట భ్రమే.

ఆ బాహ్య ప్రపంచములో మనము ప్రియం, మోదం, ప్రమోదం పద్ధతిగా విషయాల ద్వారా లభించే దానికి నీవు భోక్తవు కాకపోతే అంతా అభావమే. అభావములో ఏమైంది? ఏదైతే భావనామాత్రంగా వుందో అది లేకుండా పోయింది. వాసనా క్షయమైనా కూడా అంతే! లేనిది లేకుండా పోతుంది. భ్రాంతి రహితమైనపుడు కూడా, జగత్ జీవులయొక్క వ్యవహారమంతా కూడా, లేనివి లేకుండా పోతాయి. ఇవన్నీ లేకపోతే ఏదైతే వుందో అదే బ్రహ్మ. ఆ బ్రహ్మము పుట్టలేదు కాబట్టి ఆ బ్రహ్మము చచ్చేది కాదు. కాబట్టి ఆ బ్రహ్మానికి ఆది అంతము లేదు కాబట్టి, ఆ బ్రహ్మము అమృత స్వరూపము. బ్రహ్మ అంటేనే అమృతము. ఈ పిండాండములో నీయందే ఆత్మ అనే పేరుతో వుంది. కనుక ఆత్మే అమృతత్వము.

కామ్యముతో కూడిన దేహము వున్నప్పుడు కామ్యము కారణ శరీరములో వుంటుంది. ఆ కామ్యాన్ని పనిగట్టుకొని అనుభవించే సూక్ష్మదేహము వుంది. సూక్ష్మ దేహములో కారణ శరీరము వలన తోచినటువంటి చిత్తవృత్తుల ద్వారా ఏ అవసరాలు, ఏ కోరికలు, ఏ ఇష్టాఇష్టాలు వచ్చాయో దాని ప్రకారము నీవు చేసినప్పటికీ చేసేవాడు ఎక్కడున్నాడు సూక్ష్మ శరీరములో వున్నాడు. వాడు చేయాలంటే కేవలము సూక్ష్మ శరీరముగా వున్నవాడు ఎలా చేయగలుగుతాడు? అందుకే ఆ సూక్ష్మ శరీరానికి కావలసిన అనుభవాలకోసము అదే సూక్ష్మశరీరము ఒక స్థూల శరీరాన్ని పనిముట్టుగా వాడుకున్నది. కాబట్టి ఈ చేతలన్నిటికి స్థూల శరీరము పనిముట్టు. ఇదంతా చెప్పకుండా ఒక్కమాట ఏం చెప్పుచున్నాడంటే దేహమునకే మృత్యువు ఆత్మకు మరణము లేదు. కామముతో కూడుకున్న దేహమునకే మృత్యువు. దేహానికి కామమెక్కడుదండీ? అయితే దేహమనే మాటలో కారణ దేహము, సూక్ష్మ దేహము, స్థూల దేహము, మూడూ ఉంటున్నాయి. కాబట్టి ఇక్కడ దేహమంటే స్థూల దేహము ఒక్కటే అనుకోకూడదు. శరీరత్రయాన్ని దేహము అనాలి. కనుక శరీర త్రయము ఒక జట్టుగా పనిచేస్తున్నాయి. ఆత్మ సత్తాతో పనిచేస్తున్నాయి. ఆత్మ సత్తా లేకపోతే శరీరత్రయాది క్రియలు లేవు.

కాబట్టి ఈ శరీరము నేను అనేది అజ్ఞానము. శరీరానికి వచ్చే నాశనానికి మృత్యువు అని పేరు పెట్టినప్పుడు అజ్ఞానానికి మృత్యువున్నది. బ్రహ్మ అమృతము. నీవు శరీరము కాదు కాబట్టి అప్పుడు నీవు కూడా అమృతము. ఆత్మ మూలంగా నీవు అనాత్మకాదు కాబట్టి చచ్చిపుట్టని అమృతత్వము వస్తుంది. భ్రమ వల్లనే మృత్యువుంది. దేహము నేను కాదు, నేను ఆత్మను అన్నప్పుడు ఆత్మగా స్థిరమై కూటస్థుడై వుంటాడు. భ్రమ లేకుంటే అమృతత్వము. భ్రమ వుంటే మృత్యువు. ఈ శరీర త్రయము, అవస్థాత్రయము, విలక్షణత్వము, సాక్షిత్వము వీటన్నిటినుండి తీసుకెళ్ళి ఇదంతా బ్రహ్మ మూలం ఇదం జగత్. **బ్రహ్మైవాహం** ఈ నేను బ్రహ్మతో కూడినది. ఆ బ్రహ్మమే ఈ మాయా కల్పిత ప్రపంచములో చలామణి అవుతుంది. అట్టి భ్రమ గనుక వుంటే శరీరము నేను అనేది వస్తే శరీరము పుట్టింది కాబట్టి నశిస్తుంది. కాబట్టి భ్రమ వల్లే మృత్యువు. భ్రమరహితమైతే, భ్రమ లేకపోతే, శరీరము నేను అనేటువంటి భ్రాంతి లేకపోతే, భ్రాంతులన్నీ ఒక్కటి కూడా మిగలకుండాపోతే, ఉన్నటువంటి ఆత్మ స్వరూపము నువ్వే అయివున్నావు గనుక **అహం బ్రహ్మ** అనేదే అమృతత్వము. మృతి చెందేది దేహమే గాని ఆత్మ గాదు అని తెలిసినదే! చెప్పే పద్ధతిలో చూడండి. దేహము ఎప్పుడును మారుతూనే వుంటుంది. శుక్ల శోణితాల దగ్గరనుంచి గర్భములో వృద్ధిచెంది, పుట్టి పుట్టిన తరువాత మళ్ళీ వృద్ధిచెంది, మార్పుచెంది, క్షీణించి, నశిస్తుంది. కృశిస్తుంది, క్షీణిస్తుంది, నశిస్తుంది దేహమంటే అంతే!

స్థూల దేహము చెప్పాము. మరి సూక్ష్మ దేహము అదికూడా దేహమే కదా! ఏదైతే దహిస్తుందో ఏదైతే దాహకమో అదే దేహము. పొట్టలో వైశ్వానరాగ్ని వుంది. జఠరాగ్ని వుంది. అగ్ని వలన ఆకలి పుడుతుంది. కాస్త అన్నం వేయకపోతే ఏం చేస్తుంది? పొట్టలోపలి భాగాల్ని తినేస్తుంది. లోపలి భాగాల్ని దహింపచేస్తుంది. అన్నం వేస్తే ఏం చేస్తుందీ? అన్నాన్ని దహింప చేస్తుంది. అన్నము దహింపబడగా రూపాంతరము చెంది అన్నరసం రక్తంగా మారుతుంది. ఇదంతా దాహకము వల్లే అనగా దహింపబడే తత్వం వుంది కాబట్టి. స్థూల దేహం కూడా కాలిపోతుంది చివరికి. ఇక్కడ అన్ని రకాల అగ్నులు వున్నాయి. కోపాగ్ని కోపము అనే అగ్ని వుంది. అగ్నితత్వం అంటే ఏమిటీ? సోమరితనము, సంగత్వము, నిద్ర, ఆకలి, దప్పిక, ఇవన్నీ కూడా. దప్పిక అంటే ఏమంటాము? దాహము. దాహము అంటే ఏమిటి? లోపల వున్న అగ్నితత్వము వుండి దహింపచేస్తుంది. అందుకే దీనికి దేహమని పేరు.

కారణ దేహము అంటే అదికూడా అంతే. కర్మఫలంగా వస్తుంది. పూర్వజన్మ వాసనవలన వచ్చి కర్మానుభవము పొందుతుంది. కర్మ లేకపోతే కారణ శరీరము నశిస్తుంది. వాసనాక్షయమైతే కారణ శరీరము లేకుండా పోతుంది. ఏదైనాసరే లేకుండా పోవడమనేది **శీర్యతే ఇతి శరీరహః** దేనికైతే క్షీణించి నశించేటటువంటి గుణమున్నదో అది శరీరము. స్థూల శరీరము అలాగే నశిస్తుంది. వాసనా క్షయమైనప్పుడు కారణ శరీరము నశిస్తుంది. సూక్ష్మ శరీరము ఎలా నశిస్తుంది? దానికి ఒకే జన్మ, ఒకే మరణము అంటారు. సూక్ష్మ శరీరము ఎప్పుడు పుట్టిందో మనకు తెలియదు.

మూలానికి వెళ్దాము. జన్మ ముందా? కర్మ ముందా? ఏదైతేనేమి ఒకసారి వచ్చేసింది సూక్ష్మశరీరము. ఆ తర్కము పక్కనపెట్టి, సూక్ష్మ శరీరము అనేక సృష్టిపరిణామ దశలను దాటి, మానవ పునర్జన్మను దాటుతున్నాము. వీటిలో ఉపాధియొక్క మార్పులు వచ్చినప్పుడు 84 లక్షల జన్మలుగా ఉపాధులు మారిపోతున్నాయి. సృష్టి పరిణామములో కూడా అనేక ఉపాధులు రాలిపోతున్నాయి. సూక్ష్మ శరీరానికే జీర్ణమైన వస్త్రము తీసివేసి మళ్ళీ కొత్త వస్త్రము వేసినట్లుగా స్థూల దేహాలు పోతున్నయి,

వస్తున్నాయి. సూక్ష్మ శరీరము ఇన్ని లక్షల జన్మలలో కూడా నశించట్లేదు. ఎప్పుడైతే తనకి భ్రమ పోయిందో అప్పుడు తన స్వరూపము బ్రహ్మమైయుండి చావు పుట్టుకలు లేనటువంటి అమృతత్వమును పొందుతుంది. తన స్వరూపమే బ్రహ్మమని ఎప్పుడైతే జ్ఞానము కలిగిందో, భ్రమ పోయి భ్రమ కారణంగా కలిగిన అజ్ఞానము తొలగుతుంది. అప్పుడేమయ్యాడు? సూక్ష్మ శరీరము భంగమైయింది. లింగ శరీరము భంగమయింది. కారణ శరీరము సున్నా అవగానే సూక్ష్మ శరీరము లేకుండా పోయింది. సూక్ష్మ శరీరము కూడా నశించిందిగా! సూక్ష్మ శరీరానికి శరీరమనే అర్థము సరిపోయిందిగా. ఒకే జన్మ అనాది మాయచేత కలిగింది. ఒకే మరణము విదేహ ముక్తస్థితి రాగానే పోయింది.

విదేహ ముక్తుడికి ఇక సూక్ష్మ శరీరము లేదు కాబట్టి ఇంక స్థూల దేహాన్ని నిర్మించుకోవలసిన అవసరము లేదు. అవసరము ఎప్పుడు పోయింది? కారణ శరీరములో వాసనా క్షయము అయినప్పుడు పోయింది. కనుక ఏది ముందు? కారణ శరీరము సున్నా అయినప్పుడు సూక్ష్మ శరీరము భంగమైనప్పుడు ఈ రెండూ లేకపోతే స్థూల శరీరము రానేరాదు. ఆ రెండూ వుంటే వస్తుంది. ఏదైనప్పటికీ దేహము, శరీరము అనే పేర్లు మూడింటికి వున్నాయి. స్థూల, సూక్ష్మ కారణ శరీరాలు ఎప్పుడూ కూడా మారుతూనే వుంటాయి.

కారణ శరీరము మారటంలేదా? పశువుగా వున్నప్పటి కారణ శరీరానికి, అనాగరిక మానవునిగా వున్న కారణ శరీరానికి, వాడే కొన్ని లక్షల పునర్జన్మలు దాటి నాగరిక మానవునిగా వున్న కారణ శరీరానికి తేడాలేదా? మారుతుంది. అలాగే సూక్ష్మ దేహములో కూడా మార్పులొస్తున్నాయి. ఎక్కడున్నాయి మార్పులు? పశువు దగ్గరున్నటువంటి మనసు బుద్ధి ఎక్కువ జడత్వంగా ఉన్నాయి. మానవుని దగ్గర వచ్చినటువంటి బుద్ధి జడత్వము తగ్గి విచక్షణా జ్ఞానము పెరిగి, వివేకము పెరిగి, స్థూల దేహాన్ని పనిముట్టుగా వాడుకునేటటువంటి తెలివిగూడా పెరిగింది. అదివరకున్నటువంటి పశుపక్ష్యాదులకున్నటువంటి భోగము అంత విశ్లేషణగా లేదు. మానవ జన్మలో వచ్చినటువంటి శరీరానుసారమైన భోగము విశ్లేషించి జ్ఞాపకము పెట్టుకొని, మళ్ళీ ఇటువంటిది బాగుంటే మళ్ళీ మళ్ళీ రావాలని, బాగుండకపోతే ఇటువంటిది మళ్ళీ మళ్ళీ రాకూడదనేటువంటి వాసనతో కర్మ చేసుకుంటూ జాగ్రత్తపడుతున్నాడు. ఆస్వాదిస్తున్నాడు. అప్పుడున్నటువంటి సూక్ష్మ దేహము, ఆకలి, భయము, నిద్ర, మైథునముతో పరిమితమైనది. మానవ దేహము వచ్చేసరికి దానికి మించి, ఆకలి లేకపోయినా తినటమని, రుచికోసము తినటమని, ఇవన్నీ కూడా ప్రకృతి సిద్ధంగా జరిగేవాటిగా కాకుండా ప్రకృతి సహకరించకపోయినా, తనకు కావలసిన ఏర్పాట్లు చేసుకుంటూ కూడా భోగిస్తున్నాడు. ఈ విధంగా సూక్ష్మ శరీరములో పరిణామముంది. వాసనలలో మార్పుంది. సూక్ష్మ శరీరములో మార్పుంది. మనసులో నిరంతరము ఆలోచనలు వస్తూపోతూ మారిపోతున్నాయి. జన్మజన్మకి కూడా వివేకము, విచక్షణ, ఆలోచన, దాని పదును, దాని చురుకుతనము, దానియొక్క నిర్ణయములు, తెలివి, గడుసుతనము అన్నీ పెరగట్లేదూ? అందుకనే పుట్టింది ఎలా చస్తుందో, మార్పు చెందేది కూడా చిట్టచివరికి మార్పు చెంది ఇక మార్పు చెందడానికి ఏమీలేక నశిస్తుంది.

నాశము గల దేహము నేను అని భ్రమపడి జ్ఞానహీనుడైన నేను అనేదే అజ్ఞానము. అంటే ఆత్మ నేను అని మరచిపోయినవాడు, జ్ఞానహీనుడై మృతినొందును. మానవుడంటే ఏమిటంటే నేను నాది అనేటువంటి అహంకారముయొక్క అభిమానము ఎక్కువగా వున్నవాడు. మానము ఎక్కువగా వున్నవాడు. బహుమానము, అవమానము, అభిమానము ఎక్కువగా వున్నాడు మానవుడు. **నేను వేరు కాకుండా మనసే తాననుకునేవాడు మనుష్యుడు. నేను నాది అని అభిమానము కలవాడు మానవుడు. దహించేది, దహించబడేది దేహము. నశించేది, నశించే గుణము ఉన్నది శరీరము.** ఈ పేర్లు గుర్తుపెట్టుకోవాలి. శరీరము ఉన్నప్పుడల్లా ఇది నశించే శరీరము, అని రావాలి. దేహము నేను అన్నప్పుడల్లా, ఇది దహించబడేది, దహిస్తుంటుంది అని రావాలి. నిన్ను నువ్వైనా దహింపచేసుకుంటావు. లేక ఎదుటివాళ్ళనైన దహింపచేస్తావు.

అన్నాన్ని తీసుకొని నీ నోట్లో పడేసుకొని పొట్టలోవున్న జఠరాగ్నికి ఆహుతి చేస్తావు. ఆ రకంగా అన్నాన్ని గూడా దహింపచేస్తున్నావు నీవు. అలా ప్రతీది దహింపబడుతుంది. కర్మ చేస్తుంటే స్థూల శరీరములో వున్నటువంటి శరీర కణాలన్నీ దహింపబడుతున్నాయి. ఆ అన్నము వలన మళ్ళీ కొత్త కణాలు ఉత్పత్తి అవుతున్నాయి. పాత కణాలు దహింపబడుతున్నాయి. రాత్రిపూట కర్మ తక్కువవటము వలన కణాల యొక్క దహనము తక్కువవ్వడము వలన మన శక్తి వినియోగము తక్కువవ్వడము వలన, మళ్ళీ అలసట లేకుండా లేస్తున్నావు. రాత్రి పడుకోబోయముందు అలసటగా నిద్రలోకి జారిపోతున్నాము. పగలల్లా కర్మ

చేయడము వలన అలసట వస్తుంది. రాత్రి కర్మ చేయటము తగ్గింది. గుండె కొట్టుకోవడము, శ్వాసక్రియ జరగడము వంటి చాలా తక్కువపాటి కర్మ జరుగుతుంది. కాబట్టే అన్నము ద్వారా నీవు సంపాదించే శక్తి మిగులుతుంది. కర్మ తక్కువైతే శక్తియొక్క ఖర్చు తక్కువ. పగలేమో ఎంత తీసుకుంటే అంత కర్మచేసి కష్టపడి చేసేసరికి కణాలు దహింపబడుతున్నాయి. నశించబడుతున్నాయి. ఈ పేర్లు ఇలా గుర్తుపెట్టుకుంటే ఆత్మ దహించబడదు. ఆత్మ శోషించదు. ఆత్మ కాలదు. ఆత్మ కుళ్ళదు. ఆత్మ శస్త్రముచేత నరకబడదు అని భగవద్గీతలో చెప్పినట్లుగా ఎప్పుడూ గుర్తుపెట్టుకుంటే ఈ శవాన్ని దహిస్తున్నట్లుగా ఆవన చేస్తుంటే తప్పులేదు. నశించేదే నేను కాదని తెలుస్తుంది కాబట్టి ఆ పోయేకాలము వచ్చినప్పుడు ఇదంతా అనుకున్నదేగా, ఇప్పుడు పోతూ ఉంది అనిపిస్తుంది.

జీవుడు కర్మానుష్ఠానము చేసి జ్ఞానము వృద్ధిచేసుకున్న కొలది శరీరములు మారిపోతున్నాయి. కర్మానుష్ఠానము వలన ప్రతి జన్మలో చేసినటువంటి కర్మ ఫలితము వల్ల, ఆ కర్మ ఫలితాన్ని ఎక్కువ సుఖంగా అనుభవించటము చేతను, దుష్కర్మల వలన వచ్చేటువంటి కర్మ ఫలితము ఎక్కువ బాధించగలిగేదైవుంటే, దాన్ని తెలుసుకొని అటువంటి బాధ రాకుండా జాగ్రత్తపడటములోనే తన తెలివి పెరుగుతుంది. జన్మజన్మకి తన తెలివి పెరుగుతుంది. ఇది లౌకిక జ్ఞానము నీ ఉపాధికి ఇతరుల ఉపాధికి సంబంధించినటువంటి జ్ఞానమే. ఈ ఉపాధులను సుఖపెట్టేటువంటి జ్ఞానము. ఉపాధిని బాధపెట్టకుండా వుండేటటువంటి జ్ఞానము. ఇదంతా అజ్ఞానములోనే వుంది. అజ్ఞానములోవున్న జ్ఞానము పెరుగుతుంది, వృద్ధవుతుంది. చివరకు వృద్ధి అయ్యి అయ్యి ఏమవుతుంది? ఈ వృద్ధి అవ్వడమువలన శరీరాలు మారిపోతున్నాయి.

ఎందుకనీ? చీమకున్న శరీరము చీమకున్న మనస్సుకి సంస్కారానికి తగినట్లుగా వున్నది. పిల్లికున్న శరీరము పిల్లియొక్క సంస్కారానికి తగినట్లుగా వున్నది. ఈ పెరిగినటువంటి సృష్టి పరిణామములో, వృద్ధి అయినటువంటి జ్ఞానానికి తగినట్లుగా మానవ శరీరము వచ్చేసరికి, ఆ పరిణామములో వున్నటువంటి చాలాచాలా అనుభవాలు గుర్తించడము, తనకు కావలసిన అనుభవాన్ని పొందడానికి జాగ్రత్తగా కర్మ చేస్తూ ఆ కర్మ ఫలము కోసము ప్రయాసపడుతున్నాడు. అలాగే దుఃఖము బాధ రాకుండా వుండేందుకు ప్రయాసపడుతున్నాడు. ప్రతి జన్మకి ఎంత చేసినా కూడా ఎక్కడోఅక్కడ బాధలు వస్తూనే ఉన్నాయి. అనుకున్న సుఖము రావటము లేదు. కనుక అలా జన్మ జన్మకి బుద్ధ వికాసము పెరుగుతుంది. ఆఖరికొచ్చేసరికి ఇవన్నీ అనిత్యమేగా ఎంత ప్రయత్నించినా ఏమీ ఉపయోగము లేదు అని తెలిసింది. ఈ జ్ఞానముయొక్క వృద్ధి ఎక్కడిదాకా పోయిందంటే అనిత్యమైన వస్తువులతో మనము నిత్యమైనటువంటి సుఖాన్ని పొందలేము. ఎన్ని జాగ్రత్తలు తీసుకొని సుఖము పొంది బాధపడకుండా వుండేటటువంటి ప్రయత్నము ఎంత చేసినప్పటికీ, పూర్వజన్మ కర్మ ఫలితంగా ప్రారబ్ధంగా వుంటున్నాయి తప్ప మన చేతిలో ఏమీ లేదని, పురుష ప్రయత్నముతో ఎలాగో అలాగు జయించినప్పటికీ అది అనిత్యంగా వుంటుందని శాశ్వతముగా లేదని ఆ జ్ఞానము కూడా వచ్చింది.

ఆ జ్ఞానము వచ్చినవాడు శాశ్వత సుఖము కోసము తపస్సు చేశాడు. ఉపనిషత్తులు వచ్చాయి. మనకు అందించబడినవి. అందరు అంత దూరము పోలేరుగా. మొదటివాడు కష్టపడతాడంటే రెండవ వాడికి మొదటివాడు మార్గదర్శకమై అంత కష్టపడకుండా తేలిక ఉపాయాలు సుఖ స్వరూపమైనటువంటిది ఎక్కడుందీ, ఏమిటీ, ఎలా వుంటుందీ, నాకొచ్చింది అని సాక్ష్యముతో సహా చెప్పినప్పుడు ఆయన్ని వెంబడించిన వారికి ఏమిటంటే, కొన్ని లక్షల జన్మలు తగ్గిపోయి ఆ సుఖాన్ని పొందటానికి వీలవుతుంది. ఇది కూడా జ్ఞానవృద్దే, లౌకిక జ్ఞానవృద్ధి.

ఇక్కడ అనుష్ఠానము అనేమాట వాడారు చూడండి. కర్మానుష్ఠానములో తప్పనిసరిగా మొదటి స్థితికంటే ఉన్నత స్థితి వస్తుంది. ఈ కర్మాచరణలో కర్మానుష్ఠానములో కూడా అనేక బాధలు అనుభవించేవారు. మానవుడు అనేక సుఖములు పొందే మానవునిగా వృద్ధి చెందాడు. కనుక ఈ కర్మకూడా ఒక ఉపాసనా అనుష్ఠానమే. దాని ఫలితాన్ని చక్కగా మళ్ళీ శాశ్వతానందానికి నీవు నీవైనటువంటి ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోవడానికి వాడాలి. ఆ టైమ్ వస్తుంది. బాగా కొట్టబడినప్పుడో, వైరాగ్యమొచ్చినప్పుడో, కష్టాలు ఆత్మహత్యా సదృశ్యంగా వున్నప్పుడో, బంగారము ముట్టుకుంటే మట్టి అయిపోయిన పరిస్థితిలోనో, బంధువులను, తనవారిని సర్వాన్ని కోల్పోయి ఏకాకి అయినప్పుడో ఒక మలుపు వస్తుంది జీవితములో. ఆ మలుపులో ఒక గురువో నీకంటే ఉన్నత స్థితిలో ఉన్నటువంటి మానవుడో నీకు సలహా ఇవ్వడము సహాయము చేయడము జరుగుతుంది. అటువంటి అజ్ఞానములో

కూడా పోయింది ఏలాగో పోయింది. నేను ఏమీ చెయ్యాలో తెలియని స్థితిలో ఆయన చెప్పే సలహా పాటిద్దాము. అంతకంటే పోయేదేముంది? ఆయన చెప్పేది నిజమైతే పరవాలేదు. నిజము కాకపోయినా పరవాలేదు అని వింటాడు. మొదట్లో దానివల్ల అతని సమస్యకు పరిష్కారమొచ్చి సుఖమొస్తే ఇక పూర్తిగా వింటాడు. అలా వినటం అనేది ఎప్పుడైతే మొదలైందో గురువు దగ్గరకు చేరుతాడు. భ్రమనుండి విడుదలయ్యే ప్రయత్నము చేస్తాడు. కనుక జంతువు ద్వారా జంతువుదాకా వచ్చే పరిణామము, మానవ పునర్జన్మలన్నీ కూడా లౌకిక జ్ఞాన వృద్ధికోసమే పనికివచ్చాయి. ఈ లౌకిక జ్ఞానవృద్ధిలో కూడా కొన్ని నీచ సంస్కారాల నుండి విడుదలై, ఉన్నత సంస్కారాలన్నీ పోగుచేసుకుంటారు. దుష్కర్మ నుంచి విడుదలై సత్కర్మ ఆచరణ చేసుకుంటూ సత్కర్మ ఫలితాలని అనుభవిస్తాడు. ఇది కర్మానుష్ఠానము.

కర్మానుష్ఠానములో భాగంగా సత్కర్మ ఎప్పుడైతే చేశామో, అనగా ధ్యానము చేయడము, దైవ ప్రార్థన చేయడము, నవవిధ భక్తిమార్గాలు, ఇవన్నీ కూడా సత్కర్మలే. ప్రజాసేవ, ఇతరుల కోసము నీ స్వార్థాన్ని త్యాగము చేయడము ఇవన్నీ సత్కర్మలే. ఆ సత్కర్మల ఫలితము వలన నీ మనసుకు శాంతినివ్వడము, ఆ మనస్సు యొక్క శాంతిచేత సత్వగుణము వృద్ధి చెందడము, సత్వ గుణముచేత పెద్దల వాక్యాలని, సలహాలని జాగ్రత్తగా విని అవగాహన చేసుకొని, మేలైనవి స్వీకరిస్తూ మేలుకానివి పక్కన పడేసుకుంటూ ముందుకెళ్తాము. సత్వగుణమున్నవాడు అలా చేస్తాడు. కనుక జీవుడు మొదట్లో తమోగుణముతో వున్నాడు. కొంతకాలము పోయిన తరువాత కొన్ని జన్మల తరువాత రజోగుణము ఎక్కువ పాళ్ళతో వున్నాడు. కొన్ని లక్షల జన్మలయ్యే సరికి సత్వగుణ ప్రధానంగా వుండటము నేర్చుకున్నాడు. దానివల్ల మానసిక శాంతి వచ్చి ఆత్మ జ్ఞానాన్ని పొందటానికి అనుకూలమైనటువంటి వాతావరణము వచ్చింది. తన మేలు కోరేవారు ఎవరైనా చెబితే వినదగు నెవ్వరు చెప్పిన అని వినటం అంటూ మొదలైంది. పచ్చి చింతకాయలో వున్న బెరడు, ఈనెలు, గింజలు, గుజ్జు వేరుచేయలేము. అటులనే విషయాసక్తులకు, దేహాభిమానులకు జ్ఞానము అంటదు. ఆ పచ్చి చింతకాయ చింతపండు అయితే లోపల పండు ఏర్పడి ఆ పైనున్నది బెరడైపోయి ఊడిపోవడానికి వీలుగా గుల్లగా లోపలనున్న గుజ్జును అంటిపెట్టుకున్న ఈనెలు తీసివేస్తే అందులోనున్న చింతగింజ తీసివేస్తే ఇవన్నీ పక్వమయ్యాక జ్ఞానము సాధ్యమైంది. పచ్చిగా వున్నప్పుడు సాధ్యము కాలేదు. అలాగే మానవ దేహత్రయములో స్థూల దేహమేమో బెరడు, సూక్ష్మ దేహమేమో పీచు, గింజేమో కారణ శరీరము, గుజ్జేమో ఆత్మరసం. విషయాసక్తులకు, దేహాభిమానులకు జ్ఞానమంటదు. వాళ్ళంతా పచ్చి చింతకాయలాటి వాళ్ళు. పండిన చింతకాయలో బెరడు మొదలైనవన్నీ కూడా లోనున్న పండులోనే అక్కడికక్కడే విడివడే వుంటాయి. కొంచెము ప్రయత్నము చేత చింతపండును వేరుచేయానికి వీలవుతుంది. చింతపండును బెరడునుండి, పీచునుండి, గింజనుండి వేరుచేయవచ్చును. ఈ మూడింటినుండి వేరుచేసిన చింతపండే ప్రత్యక్ ఆత్మ. పండును వేరుచేసి ప్రక్కన పెడితే అది ప్రత్యగాత్మ అది మిగిలినవాటికి విలక్షణము. ఈ చింతపండుకి పీచు లక్షణాలు లేవు. గింజ లక్షణాలు లేవు. బెరడు లక్షణాలు లేవు. ఇదే ప్రత్యగాత్మ, సాక్షి, విలక్షణము. అదే విధంగా దేహాభిమానము ఆత్మను వదలిపోతుంది. ఆత్మ విక్షేప ఆవరణలు లేక కేవలముగా ప్రకాశిస్తుంది. ఇక్కడే శరీర త్రయము విలక్షణము అని చెప్పటము జరిగింది.

## ఉపాసనలు

సత్యవతీ, అంగవతీ, అన్యవతీ, నిదానవతీ అని ఉపాసనలు నాలుగు విధములు.స **సర్వవ్యాపిన మాత్మా సంక్షీరే సర్పివార్పితమ్** పాలల్లో నెయ్యి కలిసి ఉన్నట్లు ఆత్మ స్వరూపము ఉన్నది. నాలో ఆత్మ ఆ మాదిరిగా ఉన్నది. నేనే ఆ ఆత్మని. కనుక ఆత్మనైన నేను ఈ శరీరమును ధరించితిని. ఈ శరీరము నాకు పనిముట్టు అనే భావముతో చేసే ఉపాసనని సత్యవతీ ఉపాసన అంటారు.

**మాయాతీతమిదం సర్వం జగ దవ్యక్త మూర్తినా** నేను ఈ సమస్తములో అవ్యక్తముగా వ్యాపించి యున్నాను. ఈ మాయాకల్పిత జగత్తులో వ్యాపిస్తూ కూడా దీనికి మీరి నేను నేనుగానే ఆత్మనై యున్నాను. ఇది కూడా సత్యవతీ ఉపాసనయే.

నేను ఈ సమస్తములో కనబడకుండా వ్యాపించి, కనిపించే దానిలో కనబడని వాడిగా వుంటూ వ్యాపించియున్నాను. కనబడకపోవటమే అవ్యక్తము. ఇంద్రియ గోచరము కాకపోవడమే అవ్యక్తము. నాలోనే అంతటినీ చూస్తూ అంతట నేనే వున్నాను, నాలో అన్నీ వున్నాయి అని చూస్తే, అట్టి సత్యవతీ ఉపాసకుడు మాధవుడే. ఆ సర్వాత్మయైన నేనే అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, కనిపించే ప్రకృతిగా మొదలైనవన్నీగా ఉన్నాను అనే భావనతో చేయబడే ఉపాసన అంగవతీ ఉపాసన. ఆ సర్వాత్మ అయిన తాను సర్వమునందు ఉన్నానంటున్నాడు. ఆ సర్వము తనయందున్నాడు అంటున్నాడు. ఇది సత్యవతీ

ఉపాసన. ఆ సర్వము నాయొక్క శరీరాలే, అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు కనబడే ప్రకృతి అంతాకూడా నా ఉపాధులే, వాటిద్వారా ఆయా పనులు నేనే చేస్తున్నాను అనేటటువంటిది అంగవతీ ఉపాసన.

ఆ ప్రత్యగాత్మేగా సర్వవ్యాపకమై ఉన్నాడు. సర్వవ్యాపకమయ్యాకే కదా సర్వమందు నేనున్నాను, నాయందు సర్వమున్నది అన్నాడు. కనుక ఆ ప్రత్యగాత్మ యొక్క సర్వవ్యాపకమైన స్థితిలో పంచభూతాలను, ఇవన్నీ కనబడేటువంటి దాన్ని గూడా చరాచర జగత్తు అంతాకూడా తనయొక్క అంగములే అంటే విరాట్ భావన కలిగియుండి, సమష్టి శరీరము నాది అనేటటువంటి భావన రావాలి. అదే అంగవతీ ఉపాసనా. ప్రాణరూపమై అందరికీ ఆత్మరూపమైననుటవంటి నారాయణుడను. అన్నింటిని వెలిగించే అగ్ని రూపముగను, ప్రాణముగను జీవాధారమైనటువంటి అన్నమును ఉత్పాదనము చేయడానికి అవసరమైన వరుణదేవునిగాను, నేనే ఉన్నాను అనేటటువంటిది అంగవతీ ఉపాసన. అంతా వ్యాపించి అన్నిటిలోను తానుంటూ, అన్నీ తనలో వున్నటువంటి పరమాత్మ ఈ పంచ భూతాలకి, సూర్యుడికి, చంద్రుడికి, నక్షత్రాలకి, ప్రకృతి యావత్తుకి కూడా వాటియొక్క అసరాలు తీర్చేవాడుగా వుంటాడు. అన్నము అందించేటువంటివాడుగా వుంటాడు. వర్షము కురిపించేటట్టుగా వుంటాడు. ప్రకృతిలోని ప్రతి వస్తువు కూడా సర్వ జీవులకు ప్రయోజనకరంగా ఉండేలా ఉంటాడు అని ఆ పరమాత్మను ఎవరైతే కీర్తిస్తున్నాడో, స్తోత్రము చేస్తున్నాడో, స్తుతిస్తున్నాడో అటువంటి ఉపాసకుడు అంగవతీ ఉపాసకుడు. అతడు చివరకు ఆ ఉపాస్యరూపమవుతాడు.

**"శంఖ చక్ర గదా పాణి"** అని విష్ణువును, **"ఏకదంత గజాననా"** అని విఘ్నేశ్వరుని, **"శూలపాణి"** అని ఈశ్వరుని, **"కోదండపాణి"** అని శ్రీరాముని, **"శిఖిపింఛ మౌళి, మురళీధర"** అని శ్రీకృష్ణుని, **"వీణాపాణి"** అని సరస్వతీని, ఇలా అ దేవతల చిహ్నములను ఆ గుర్తులను సంజ్ఞాపూర్వకముగా, పెట్టుకొని మనస్సును తన్మయము చేసుకోవాలి. తన్మయము అంటే ఏమిటండీ? ఏది ధ్యానము చేస్తున్నామో ఆ ధ్యాన వస్తువు నీవయ్యావు. తత్+మయము, తత్ = ధ్యానవస్తువు. కనుక తన్మయము అన్నప్పుడు ఆ ధ్యాన వస్తుమయమవ్వడము అనగా ధ్యానవస్తువుతో తాదాత్మ్యము చెందడము. ధ్యానవస్తువు రూపము పొందడము.

రామకృష్ణ పరమహంస ఆంజనేయ ఉపాసన చేస్తే ఆంజనేయుడే అనేటువంటి భావన కలిగింది. ఏసుక్రీస్తు ఉపాసన చేస్తే తానే ఏసుక్రీస్తు అనే భావన కలిగింది. ఇదీ తన్మయము అంటే. అలా తన్మయము చేసుకొని, హృదయములో ఆరాధిస్తూ ఉండడము అన్యవతీ ఉపాసన అంటారు. ఈ ఉపాసనలు వేటికవేగా చెయ్యాలి. అన్యవతీ అంటే ఏమిటి? నీ కంటే అన్యముగా విఘ్నేశ్వరుడు వేరే వున్నాడని, కృష్ణుడు వేరే వున్నాడని, రాముడు వేరే వున్నాడని చేసేటటువంటి ఉపాసన అన్యవతీ ఉపాసస. అక్కడేమో పరమాత్మని ఉపాసన చేస్తున్నాము. ఇక్కడేమో అన్య దేవతలను ఉపాసన చేస్తున్నాము. దానివల్ల ఆ ఉపాస్య రూపము తానే అవుతున్నాడు.

సత్యవతీ ఉపాసన అంటే ఏమిటీ? నేను ఈ సమస్తములో అవ్యక్తముగా వ్యాపించి యున్నాను, ప్రత్యగాత్మగా నన్ను ఈ సృష్టిలో అంతటా చూసుకుంటున్నాను, ఈ సృష్టి అంతటా నేనే వున్నాను, నాలోనే ఈ సృష్టిఅంతా వుంది. కుండ వెలుపలా, లోపలా నేనే మహాకాశముగా ఉన్నాను అన్నట్లుగా చేసే ఉపాసన సత్యవతీ ఉపాసన. రెండవది అంగము చెప్పాము. సృష్టిలో వున్నటువంటి చరాచర జగత్తులో వున్నటువంటి సూర్యుడు, చంద్రుడు ఇవన్నీ వగైరా అంతా గూడా ప్రకృతియొక్క అంశాలు అని ఈ అంగాల్ని ఉపాసన చేసేది అంగవతీ ఉపాసన. ఈ అంగాలను ఎలా చూస్తున్నావు? నీవు 'సర్వేజనః సుఖినోభవంతు' కింద పంచ భూతాలన్నీ కూడా జనులకు ప్రయోజనకరంగా వుండాలని, ఆ పరమాత్మను ధ్యానిస్తున్నావు. ధ్యానించి పరమాత్మయే నీవవుతున్నావు. ఇక్కడకూడా పరమాత్మ ధ్యాన్యమే! ఇది అంగవతీ ఉపాసనా. అన్యవతీ అంటే నీకంటే అన్యముగా వున్న ఈ దేవతలు వేరని, ఆ దేవతల ఉపాసన చేస్తూ ఆ దేవతల స్వరూపమే నీవవ్వడము అన్యవతీ ఉపాసన.

ఇంతవరకు నువ్వు వస్తే, బ్రహ్మోపాసన చేసి బ్రహ్మ స్వరూపము నీవవ్వచ్చు. ముందు దేవత ఉపాసన చెయ్యి. ఎందుకంటే అందరు కోరికలతో వున్నారు కదండీ! ఒక్కొక్క దేవత ఒక్కొక్క కోరిక తీర్చడానికి ప్రతీకగా వుందిగా! ఆ కోరిక కోసము ఆ దేవతో ఉపాసన బాగా పనిచేస్తుంది. కోరికల కోసము చేసినా, ఉపాసనా బలము పెరిగింది. ఇప్పుడు కోరికలు మానేసి ఈ సంపాదించినటువంటి ఉపాసనా బలాన్ని బ్రహ్మోపాసనకు ఆత్మోపాసనకు వాడుకోండి. ఈ ఉపాసనా బలములో నువ్వే బ్రహ్మ స్వరూపము, ఆత్మ స్వరూపము అవుతావు. ఇదివరకు ఏ దేవతల ఉపాసన చేస్తే ఆ దేవతా స్వరూపమయ్యావు. బైబిల్‌లో కూడా వుంది **"నన్ను ఆరాధించువారు అట్టివారే కావలెనని తండ్రికోరిక"**. ఆరాధన అంటే ఇక్కడ ఉపాసన.

ఆ బ్రహ్మోపాసన చేసినవారు బ్రహ్మమే అవుతారని, ఆ పరబ్రహ్మ స్వరూపమైనటువంటి తండ్రి. తండ్రికోరిక ఆయనకు కోరిక వుందని మనకేమి తెలుసు. కుమారుడు వచ్చాడు, తండ్రిచేత పంపబడిన కుమారుడు తండ్రి కోరికను మనముందు పెడుతున్నాడు. **"బ్రహ్మవిత్ బ్రహ్మ వభవతి"** బ్రహ్మను తెలుసుకున్నవాడు బ్రహ్మమే అవుతాడు. బ్రహ్మచింతన చేస్తే బ్రహ్మకారమవుతాడు. బ్రహ్మచింతన చేయడము వలన మరొక చిత్తవృత్తి వచ్చింది. విషయ చింతన వలన విషయాకారము చెందినట్లుగా, బ్రహ్మ చింతనవలన బ్రహ్మాకారము పొందుతాడు. ఇవన్నీకూడా అన్ని మతాలలో కూడ సరైనటువంటి వాక్యాలు సమన్వయము చేసుకుంటే ఉంటాయి. కాకపోతే సమన్వయము చేసేటువంటి విచారణ, ఆ విశ్లేషణ వుంటే, సమన్వయమవుతుంది. వేరే భావన ఉంటే చెయ్యలేరు. సమన్వయము చేద్దామనేటువంటి పాజిటివ్ థింకింగ్ గనుక వుంటే సమన్వయమవుతుంది. ఇతర మతాలను ద్వేషిస్తే అవ్వదు.

శ్రవణం, కీర్తనం, విష్ణోః స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదనం, తన్మయాసక్తి, పరమ విరహాసక్తి అని పదకొండు భక్తి సాధనలున్నాయి. ఇవన్నీ నిదానవతీ ఉపాసన క్రిందికి వస్తాయి. ఒకే భావముతో అన్యదేవతల ఉపాసన చేస్తే అన్యవతీ ఉపాసనా. అన్య దేవతలను వదిలేసి ఒకే దైవాన్ని పెట్టుకోవాలి. రాముడైతే రాముడే ఇంకేమి లేదు. కృష్ణుడైతే కృష్ణుడే. అమ్మవారైతే అమ్మవారే. గణపతి అయితే గణపతే. ఇట్లా పంచాయితనము ఉన్నాయి. ఐదు, వీటన్నిటిలో ఏదో ఒక్కటే పెట్టుకోవాలి. అయిదూ కాదు ఒక్కటి అయితేనే ఉపాసన ఫలిస్తుంది.

శ్రవణానికి పరీక్షిత్ మహారాజు, కీర్తనము వలన తుంబురుడు, విష్ణుస్మరణ వలన నారదుడు, పాదసేవ వలన శ్రీ మహాలక్ష్మి, అర్చన వలన పృథు చక్రవర్తి, వందనము వలన అక్రూరుడు, దాస్యము వలన హనుమంతుడు, సఖ్యము వలన అర్జునుడు, ఆత్మ నివేదన వలన బలిచక్రవర్తి ముక్తి పొందారు. ఇక పదవది తన్మయాసక్తి. భక్తితో పారవశ్యము చెంది తన్మయమైపోయాక నీవే ఆ కృష్ణ పరమాత్మగా మారి చైతన్య ప్రభువు ఎలా గంతులేస్తున్నాడో, ఎలా తనకు తెలియకుండానే గీతాలు పాడుతున్నాడో, కవిత్వము రాకుండానే కవిత్వం చెప్తున్నాడో అది తన్మయాసక్తి. పరమ విరాహాసక్తి అంటే, భగవంతుని విడిచి ఒక్క క్షణము కూడా వుండలేను. ప్రియుని విడిచి వుండలేను అని ప్రియురాలు ఎలాగైతే విరహ వేదన అనుభవిస్తుందో, అలాగే ఆ కృష్ణ పరమాత్మను తలచుకోకుండ, పొందకుండ, చూడకుండ, కీర్తనము చేయకుండా, భజించకుండా, నిరంతరము ఆయన ఆలోచన లేకుండా నేను ఒక్క క్షణము గూడ వుండలేను అనేటటువంటిది. పొరపాటున ఒక్క 5 నిమిషాలు ఆ పరమాత్మను నేను స్మరించకుండా ఏదో అర్జెంటు పనిలో పడి తప్పనిసరి పనిలోపడి ఆ పనిమీద ధ్యాసపెట్టి ఆ 5 నిమిషాలు పరమాత్మను మరచిపోయానే అని ఎవరికైతే బాధ కలుగుతుందో, అది పరమ విరహాసక్తి. పరీ, పరా, పరమా, ప్ర ఇవన్నీ కూడా ఆధ్యాత్మికత్వానికి, శ్రేష్ఠమైనవాటికి వాడుకుంటాము. ఆత్మ, పరమాత్మ అన్నట్లుగా విరహము పరమ విరహము. పరమ విరహాసక్తి అంటే ఉత్కృష్టమై గొప్పదైన విరహము. అది భగవంతునిమీద ఉండేది. గోపికా భక్తి పరమ విరహాసక్తి అనే పదకొండవ ఉపాసన. పరమ విరహాసక్తి అంటే విరహాసక్తిలో పరాకాష్ట.

ఈ 11 భక్తి సాధనలు ఇవన్నీ కలిసి నిదానవతీ ఉపాసనలో ఉంటాయి. దానము, నిదానము. దానమంటే ఇవ్వడము లేదా పుచ్చుకోవడము. ఇక్కడ ఎవరు స్వీకరిస్తున్నారు? నవవిధ భక్తి సాధనలతో భగవంతుడు స్వీకరించినప్పటికీ తన్మయాసక్తి పరమ విరహాసక్తి ఈ రెండు వచ్చేసరికి, అప్పుడు స్వీకరించుటలేదు. దాదాపు అదే నేనైయున్నాను. అందుకే ని+దానము. నిదానము అంటే స్లో అనికాదు. నిదానమంటే నాలుగు ఉపాసనలు చెప్పారిక్కడ. సత్యవతి, అంగవతి, అన్యవతి, నిదానవతి ఉపాసనలు. ఒకదానికంటే మరొకటి అత్యుత్తమ స్థితికి కారకములై విశ్వనియంతతో తాదాత్మ్యకమై విశ్వనియంత అంటే ఎవరూ? మాయాశబలిత బ్రహ్మ. తాదాత్మ్యకమునకు గాని, ఉపాసనకు గాని, దొరికేది మాయా శబలిత బ్రహ్మమే. అనగా సగుణ బ్రహ్మ. నిర్గుణ బ్రహ్మను ఎవరూ ఉపాసన చెయ్యలేరు గాని, సగుణ బ్రహ్మ ఉపాసన నిర్గుణ బ్రహ్మ ఉపాసనకు దారితీస్తుంది. నిర్గుణ బ్రహ్మ అయ్యేసరికి ఉపాసన ఆగిపోతుంది. ఉపాసన ఆగిపోయి, ఆ నిర్గుణ బ్రహ్మమే నీవై స్వతస్సిద్ధమై నిలబడతావు. ఉపాసన సాధారణంగా నిర్గుణ బ్రహ్మకు కష్టము. బ్రహ్మోపాసన అంటే సగుణ బ్రహ్మోపాసనే. ఇక్కడ కృష్ణుడు, రాముడు, అవతార పురుషుల పేర్లు పెట్టారంటే ఇవన్నీ సగుణమేగా! భక్తంతా సగుణములోనే నడుస్తుంది. ఆ భగవంతునితో తన్మయము చెందటము కూడా సగుణమే. నువ్వే ఆ భగవంతుడవైతే నువ్వే ఆ భగవంతునితో తన్మయత్వము పొందావంటే ద్వైతముగా నువ్వు, ఆ భగవంతుడు అని రెండున్నాయని ఒప్పుకుంటున్నావు. పైగా ఆ తన్మయత్వస్థితి శాశ్వతముగా వుండదు కనుక ఉపాసకుడికి, ఉపాసకమైనటువంటి వస్తువుతో తాదాత్మ్యత అనగా యోగదృష్టిలో రెండుండి ఇదిపోయి అందులో కలిసింది అనే స్థితి వస్తుంది. కాని అద్వైతము సిద్ధించదు.

అద్వైతము సిద్ధించడము ఉపాసన వలన సాధ్యము కాదు. అద్వైతము అనేది నిర్గుణము. నిర్గుణోపాసన లేదు. పరబ్రహ్మోపాసన లేదు. ఇంకను మరికొన్ని ఉపాసనలు మతముగా చెప్పవచ్చును. మతమంటే ఏమిటో అనుకున్నాము. మతి అంటే బుద్ధి, మతము అంటే బుద్ధి పరిధిలో చెప్పింది. బుద్ధిపరిధిలో నిర్ణయించింది, బుద్ధి పరిధిలో బోధించేది. గురువు బుద్ధి పరిధిలో బోధిస్తాడు. శిష్యుడు బుద్ధి పరిధిలో ఆచరిస్తాడు.

కనుకనే ఆ మతాలు, మత పద్దతులు స్వరూప నిర్ణయాన్ని సమంగా అందించవు. తన మతమేదో తనది పరమతమసలే పడదు అంటే, నీ అభిప్రాయము నీదేగాని, ఒకరు చెప్పేది నీవు వినిపించుకోవు. మతమనేటువంటిది ఆ అర్థముతో తెలుసుకున్నప్పుడు, మరికొన్ని ఉపాసనలు మతముగా చెప్పబడినవి. మతాలన్నీ కొట్టిపారెయ్యడానికి లేదు. ప్రమాణముగా తీసుకున్నప్పుడు మాత్రము మత పద్ధతికి అతీతంగా మతాలకతీత పద్ధతిలో వున్నదే నిర్ణయము. వేద ప్రమాణాలన్నీ ఒక్కొక్క మతస్థుడు ఆ ప్రమాణాన్ని వాడుకొని అతడియొక్క మతాన్ని గొప్పగా, మిగతా మతాలు కావన్నట్లుగా ప్రతిష్ఠ చేస్తున్నారు.

విశిష్టాద్వైతము, అద్వైతము, ద్వైతమతము ప్రతిష్ఠించారు త్రిమతాచార్యులు. అంటే అక్కడ వ్యాఖ్యాత యొక్క బుద్ధి ఆ వ్యాఖ్యానములో నున్నది. వ్యాఖ్యాత సరిగ్గాను నిర్ణయించవచ్చు లేక కొంచెము వక్రీకరించవచ్చు. మతము ఒక్కొక్కసారి ప్రమాణమే గాని ప్రతిసారి అది ప్రమాణము కాదు. అందుకనే మత పద్ధతికీ, మతాతీత పద్ధతికి వేద ప్రమాణానికి, భేదము తెలియాలి. అంతకుముందే నీవు పరబ్రహ్మవే కాని అజ్ఞానముచేత, భ్రమచేత కాదనుకున్నంత మాత్రాన కాకుండపోలేదు. సాధన చేసి ఉపాసన చేసి మళ్ళీ ఏదో ఉపాయముచేత అయినా కాని ఉపాసనవల్ల ఫలితంగా మాత్రము అవ్వలేదు. నువ్వు అయ్యే వుండే అయ్యున్నావు. అయ్యేవుండే అవ్వడమును సిద్ధించడమని, సిద్ధవస్తువు గురించి చెప్పినప్పుడు సిద్ధాంతమని అంటాము. సాధనవల్ల బ్రహ్మను పొందుతామనేటువంటివన్నీ మతాలు అంటాము. ఇక్కడ ఏం చెబుతున్నారు? కొన్ని ఉపాసనలు మతముగా చెప్పబడినట్లుగా గలవు. ఉపాసన అన్నారు కాబట్టి అది మతము.

ప్రతీకోపాసన అంటే ఒక ప్రతిమను భగవంతునిగా అనుకొని, ఆ ప్రతిమలోకి భగవంతుని ఆవాహన చేసి, ఆ భగవంతునికి షోడశోపచారాలు చేసి నువ్వు ధ్యానము చేసుకొని ఆ భగవంతుడు అందులో వున్నాడనుకొని కోరికలు కోరుకొని, ఆ భగవంతునికే నివేదన చేసి, ఆ భగవంతుడినుండి ఏదొచ్చినా గాని, ఆ భగవతుని ప్రసాదమనుకొని భగవంతుని ప్రసాదముగా స్వీకరించి, కైంకర్యము చేసి చివరకు ఆ భగవంతుని ఆ ప్రతిమనుంచి ఉద్వాసన చేస్తాము.

అసలు భగవంతుడు నిర్గుణముగా, ఇంద్రియ గోచరము కాకుండా వున్నాడు. ఉపాసన కొఱకు ధ్యానించడానికి కూడా ఒక ఏకాగ్రత కోసము ఒక మూర్తి కావాలి గనుక ఒక విగ్రహమును లేక ఒక ప్రతిమను పెట్టుకొని అందులో ఆ దేవతా స్వరూపాన్ని ఊహించి ఉపాసన చేస్తారు. భగవంతుడు నిరయవుడు గనుక అవయవాలు లేని లింగరూపంగా ఏర్పాటు చేసినదే శివలింగము. ఒక రాయో, ఒక స్పటికమో తెచ్చి శివాభిషేకము, శివార్చన చేయాలంటే శివలింగాన్ని ప్రతీకగా పెట్టుకోవాలి. సత్యనారాయణ వ్రతము చేసేటప్పుడు పసుపు ముద్దను గణపతిగా తమలపాకులో పెట్టి పూజ చేస్తాము. ఆ పసుపుముద్ద కూడా ప్రతికే. పిండితో చేసినాకూడా ప్రతీకే. మట్టితో చేసినా కూడా ప్రతీకే. నవధాన్యాలు పెట్టుకొని నవధాన్యాలలో పరమాత్మని ఆవాహన చేసుకొని, ఆ నవధాన్యాల మీదే కలశంపెట్టి కలశంలో జలముపోసి, ఆ జలములోకి పరమాత్మ యొక్క కళల్ని ఆవాహన చేసుకొన్నప్పుడు, ఆ కలశం ప్రతీకే. నవధాన్యాలు ప్రతీకే. కొన్ని కొన్ని యజ్ఞాలలో, యాగాలలో కలశాన్ని నవధాన్యాల్ని ఒక వస్త్రముమీదే పరచి భగవంతుని వాటిలోకి ఆవాహన చేసుకొని, ఆ యజ్ఞ కార్యము చేయడమన్నది కూడా వుంది. ఇది ప్రతీకోపాసన.

సూర్యోపాసన ప్రతిరోజు సర్వసాక్షిగా జగత్ చక్షువుగా సూర్యుడు మనకు దొరుకుతూనే ఉన్నాడు. సూర్య ప్రకాశానికి, సూర్య బింబానికి ప్రకాశమనేటటువంటిది స్వయం ప్రకాశము కాదు. అన్ని ప్రకాశాలకి స్వయం ప్రకాశమైన పరమాత్మ నారాయణుడని, ఆ సూర్య గోళములో వున్నటువంటి అంతర్యామి పేరు నారాయణుడని, బయటికి సూర్యుడు ప్రతీకమైనా సూర్యునిలోనున్న అంతర్యామి అనేటువంటి సూర్యనారాయణ మూర్తిని మనము ఉపాసన చేస్తున్నాము. ఇదికూడా ఉపాసనే. ఒక భావన చేస్తున్నాము. గీతోపాసన గీత అంటే మనము భగవద్గీతే అనుకుంటున్నాము. చాలా గీతలున్నాయి. ఏ గీతైనా ఉపాసన చేయవచ్చు. గీత అంటే పాట అని కాదు, ఒక ప్రబోధ. మహానుభావులు, భగవంతులు, జీవన్ముక్తులు, ఋషులు చెప్పేవన్నీ కూడా గీతలే.

భిక్షుక గీత, హంస గీత, ఉద్ధవ గీత, అష్టావక్రగీత ఇలా చాలా గీతలున్నాయి. **"గాయితే ఇతి గీతః"** సామగానముతో, సామ వేదములో స్వరయుక్తంగా ఒక పాటగా పాడినట్లుగా వుంటాయి కాబట్టి దాన్ని గీత అంటారు. సంస్కృత శ్లోకాల్లో, కొన్ని శ్లోకాల్లో ఆ స్వరాలయొక్క ఉచ్చారణకు యతి, ప్రాస, ఛందస్సులు మనము పాటిస్తామో అది దాన్ని గీత అంటాము. ఒక పాటగా వుంటుంది అది.

పరబ్రహ్మోపాసన కూడా కష్టము. భావనచేసి అద్వైత వస్తువు పేరు బ్రహ్మ అని పేరుపెట్టి బ్రహ్మోపాసననే అద్వైతోపాసనగా చేయవచ్చును. బ్రహ్మ తప్ప అన్యము లేదు అంటూ సగుణ బ్రహ్మనే ఉపాసన చేస్తున్నాము. అన్యాన్ని పోగొట్టుకోవడానికి ఉపాసన వుండదు. సగుణోపాసన నిర్గుణోపాసనకి దారితీసినప్పుడు ద్వైతము నశించి ఉపాసన ఆగిపోతుంది. అందుకే మూడు భక్తులున్నాయి. నవవిధ భక్తులనేమో బాహ్య భక్తి అంటాము. రెండోది అనన్య భక్తి, పరమాత్మ కంటే అన్యము లేదు అని, అందరిలోనూ పరమాత్మను చూసేది అనన్యభక్తి. అయితే నువ్వుకూడా అదే అయివున్నావని చూచుకోవడము ఏకాంత భక్తి. నిన్ను కలుపుకోకుండా, అందరిలో భగవంతుని చూస్తున్నావు. నీలో భగవంతున్నాడని చూసుకోవడము లేదు. భగవంతునిమీద ఉన్న అమితమైన భక్తి, భగవంతుడిని తనకంటే గొప్పగా అనుకుంటాడు గనుక, తనలో ఆ భగవంతుడిని చూసుకోలేడు. నీలో కూడా భగవంతుడే ఉన్నాడని చూసుకున్న రోజున అది ఏకాంత భక్తి అవుతుంది. ఈ ఏకాంత భక్తియొక్క పరాకాష్టే పరాభక్తి. పరాభక్తి అంటే పరమాత్మకి నీకు భేదము లేదు. నీవు పరమాత్మవే అయివున్నావు. ఆ పద్ధతిలో పోతే అది అద్వైతోపాసన. రెండోది విశిష్టాద్వైతోపాసన. రామానుజాచార్యులు చెప్పినటువంటి మంత్రాలతో విశిష్టాద్వైతములో నేను జీవుడిని, అక్కడ బ్రహ్మ వున్నాడు. నేను పోయి ఆ బ్రహ్మలో ఐక్యము కావాలి అనేది జీవ బ్రహ్మైక్య భావముతో చేసేది విశిష్టాద్వైతోపాసన. జీవునిగా లేనివాడు కాని బ్రహ్మమే అద్వయముగా వున్నాడు. అన్నియు, అట్టి బ్రహ్మమే నేను అనేటువంటిది అద్వైతోపాసన.

నాకంటే అన్యముగా పరమాత్మ వున్నాడు. శ్రీమన్నారాయణుడు ఉన్నాడు నేను శ్రీమన్నారాయణుడు దగ్గరకు వెళ్ళాలి. శ్రీమన్నారాయణుడున్న లోకములోకి ప్రవేశించాలి. శ్రీమన్నారాయణుని లక్షణాలు నాలో వున్నాయి అని చేసేది ఉపాసన. శ్రీమన్నారాయణ లక్షణాలు నాలో వుంటేనేమో సారూప్యము, శ్రీమన్నారాయణుడి యొక్క లోకములో వుంటేనేమో సాలోక్యము, శ్రీమన్నారాయణుడు నా సమీపములోనే వున్నాడంటే సామీప్యము, శ్రీమన్నారాయణుడులో ఐక్యమయ్యాను అంటే సాయుజ్యముక్తి. ఇవి విశిష్ట ద్వైతములో వున్నాయి. విశిష్టా ద్వైతములో నేను ఆ భగవంతునిలో అంశీభూతమయ్యాను అని ఉంటుంది. అద్వైతములో 'నేను' అనే భ్రాంతి పోయి, బ్రహ్మము అనే సత్యములో ప్రవిలయమై పోయాను అని ఉంటుంది.

ద్వైతోపాసనలో ఆయన దగ్గరకు వెళ్తాను, ఆయనతోపాటు వుంటాను అంతేగాని ఆయనలా ఉండడములేదు. ఆయనలో కలిసిపోయాను అని లేదు. ఇది ద్వైతము. మధ్వాచార్యుల మతము. సాలోక్యము, సామీప్యము వుందిగాని సారూప్యము సాయుజ్యములు లేవు.

అద్వైతములో బ్రహ్మ సత్యము తదితరమంతా లేనిదే అని లేని జీవుడు ఐక్యతాసిద్ధి పొందగానే లేనివాడు లేకుండా పోయాడు. ఉన్నది బ్రహ్మమే అనే వివరణ ఎక్కడైతే వుందో అది అద్వైతోపాసన.

చైతన్య ప్రభువు తీవ్రంగా భావ సమాధిలోకెళ్ళి ఆ భావ సమాధిలో వున్న చైతన్యాన్ని పుణికిపుచ్చుకొని, తానే కృష్ణుడు అయిపోయినట్లుగా ఒక భావన చేస్తే తనకి తెలియకుండానే తను పాటలు పాడుతూ, గెంతుతూ, డాన్సు చేస్తుంటాడు. అది చైతన్యోపాసన. ఈ గౌఢీయ మతము కూడా ఆ చైతన్యోపాసన లాంటిదే. పాసుపతోపాసన పసుపతి అంటే శివుడు. శివుని ఉపాసన చేయడము పాశుపతోపాసన. పాశుపతమతము వేరే వుంది, శైవమతము వేరే వుంది, శివుడే దేవుడనేది. క్రైస్తవోపాసన, మహమ్మదీయోపాసన ఇలాంటివన్నీ చాలా ఉపాసనలున్నాయి. ఆయా మతములు ఎలా ఉపాసన చేయాలో చెప్పారు. చెప్పిన ప్రకారము చెయ్యాలి. అయితే ఆ మత గ్రంథము చెప్పినట్లు చెయ్యట్లేదు. మత గ్రంథాన్ని మళ్ళీ వక్రీకరించి అలా కాదు ఇలా అని ఇలా చేస్తే సరిపోతుందని, మోక్షము సంగతి చెప్పకుండా, భక్తివరకే దిగజార్చి ఉపాసన చెప్పడము జరుగుతుంది. అందుకే మీరు చేసేటువంటి ఉపాసనలన్నీ ఆ మతోపాసనలు కావు. వాళ్ళ మతగ్రంథములో మొట్టమొదట పూర్వము ఆది గురువులు వారికి ఏదైతే చెప్పారో దాన్నర్థము చేసుకుంటే అక్కడ కరెక్టుగా వాళ్ళు చెప్పినటువంటి ఉపాసన ఏ మత పద్ధతిలో నువ్వు చేసినా నువ్వు గమ్యము చేరుతావు. ఒక మతము ఎక్కువగాదు ఒక మతము తక్కువ కాదు, కాని ప్రస్తుతము హిందూమతం గొప్పదని, హిందువుల విషయానికొస్తే కూడా నానారకాల దేవతారాధనలన్నీ, పూజలన్నీ కూడా ఉపాసన అనే పేరుకే గాని ఉపాసన అనే

పద్ధతి లేదు. ఏదైతే నీవు ఉపాసన చేస్తావో ఆ ఉపాసకుడు ఆ ఉపాస్య దైవంగా మారిపోవాలి. అంత తీవ్రంగా ఎవరు ఎక్కడా చేయుటలేదు కాబట్టి, వేరే ఒకర్ని విమర్శించడము కాదు, మనము చేసేది కూడా అలాగే వుంది. కనుక మత పద్ధతిని మతాతీత పద్ధతిగా మార్చుకోవాలి. ఉపాసనల వరకు మత పద్ధతులు పనికొస్తాయి. అయితే సత్యంగా, జాగ్రత్తగా ఆ మతములో గూఢంగా ఉన్నటువంటిది ఎవరైతే మనకి వెలికితీస్తారో, తీసిచెప్పి ఇలా చేయండి అని చెబుతారో దాని ప్రకారము చెయ్యాలి.

మూఢ విశ్వాసాల ప్రకారము చేసేవి ఉపాసనలు కాదు. బ్రహ్మము అగ్నినుండి వచ్చిన విస్ఫులింగములు (నిప్పురవ్వలు) అగ్నికంటే వేరుకావో, అలాగే ఆత్మజ్ఞాని పరమాత్మ కంటే భిన్నము కాదు. తత్త్వంగా చూస్తేనేమో అభిన్నము. ఉపాసనగా చూసినప్పుడేమో భిన్నము. నిప్పురవ్వ పరిమితము, మంటేమో అపరిమితము. అలాగే అభిన్నమెప్పుడైందీ? ఉష్ణత్వము వల్ల ప్రకాశత్వము వల్ల మంటలో వున్నది, నిప్పురవ్వలో వున్నది ఒక్కటే అన్నప్పుడు అభిన్నమైంది.

వెయ్యి రూపాయిలలో ధనమనేటువంటి విలువ, రూపాయిలో వున్నటువంటి ధనమనే విలువ, ధనమనే పేరుతో చూస్తే అదీ ధనమే ఇదీ ధనమే అయితే రూపాయి అనేటువంటిది పరిమితంగా వున్నది. చిల్లర మార్చితే 1000 రూపాయలు. చిల్లర మార్చకపోతే 1000 రూపాయల నోటు. చిల్లరగా మారకుండా వున్నది అభిన్నము. చిల్లరగా మారితే వచ్చేదేమో భిన్నము. ఈ చిల్లరలోనున్న తత్త్వాన్ని చూస్తే మళ్ళీ అభిన్నము. ఈ ఒక్క వాక్యము చూడండి ఇక్కడ.

బ్రహ్మకు మూడవస్తలున్నాయా? ప్రతి అవస్థలోనూ బ్రహ్మ వ్యాపించి వున్నాడు. బ్రహ్మయొక్క ఆనందమనేటటువంటి అంశ. సుఖదుఃఖాలు, ఆశామోహాలు, భయలోభాలుగా, ఉపాధి దోషముచేత, గుణ దోషముచేత, సంస్కార దోషముచేత వ్యక్తమవుతున్నదే గాని, వీటన్నిటిలో నున్నది ఆనందమే. వీటన్నిటిలో ఆనందముందా అంటే ఆ అవ్యక్తంగా ఉన్నది. బ్రహ్మమే వింటున్నాడు. బ్రహ్మమే చూస్తున్నాడు. బ్రహ్మమే ఆలోచిస్తున్నాడు అని ఎందుకని? ఉపాధి దోషము కాబట్టి. మనసు జడము కాబట్టి మనసు ఆలోచించదు. నిజానికి దాని సత్తాలో ఇది జరుగుతుంది. దీనంతట ఇది చేయట్లేదు. అది సత్తామాత్రంగా వుందని ఎప్పుడో తెలుసుకున్నాము. అన్ని రూపములలో వుండి సమష్టి రూపములలో ఈశ్వరీయముగా జరుగుచున్నది గాని, వ్యష్టి అనేది లేదు. వ్యష్టి అజ్ఞానముచేత నేను చేస్తున్నాను అని అనుకుంటున్నాడు గాని, ఒక లెవలు బోధకి అట్లా చెప్తాము. అంతమాత్రము చేతనే ద్వైత సిద్దాంతాలు, విశిష్టాద్వైత సిద్ధాంతాలు పుట్టుకొచ్చినవి. మతమంటామందుకే. సిద్దాంతమైతే అది కరెక్టై వుండాలి. మతమంటే కొంచెము సిద్దాంతము కంటే తేడాగా వుండొచ్చు, ఉండకపోచ్చు. పొరపాటు జరగవచ్చు. భిన్నములు అభిన్నములు రెండున్నప్పుడు భిన్నమనే లెక్కలో పోయేవారు ద్వైతములో వున్నారు. తత్త్వాన్నిబట్టి అది అభిన్నమే, అన్నప్పుడు వారు అద్వైతములో వున్నారు. విస్ఫులింగాలలో వున్నటువంటి తత్త్వము అద్వైతము, ప్రజ్ఞానము, ప్రకాశము, పరమాత్మలో కూడా ఆ చైతన్యము, ఆ ప్రకాశమే ఉంది. అక్కడేముందో ఇక్కడా అదే వుంది.

ఘటాకాశాము, ఘటము అంటే లోపల కూడా ఆ మహాకాశమే చేరివుంది. కాని అసలు ఘటాకాశము వేరేగా లేనేలేదు. ఉన్నది మహాకాశమే, ఘటాకాశము, పరిమితము, మహాకాశము అపరిమితము. తత్త్వంగా చూస్తే ఆకాశతత్వముగా చూస్తే, ఘటాకాశములో నున్న ఆకాశతత్వము, మహాకాశములోనున్న ఆకాశతత్వము ఒక్కటే. అట్లాగే ఆత్మ పరమాత్మ ఒక్కటే. జీవుడు బ్రహ్మము, అభిన్నులును కాదు, భిన్నులును కాదు. వాచ్యార్థములో భిన్నులు. లక్ష్యార్థములో అభిన్నులు. తత్త్వమునుబట్టి ఏకత్వము వస్తుంది. లక్ష్యార్థముతో లక్ష్మణ వాక్యముతో ఏకత్వము వస్తుంది. కాని వాచ్యార్థముతో ఉపాధి దోషముతో త్రిగుణాల బేధముతో చూస్తే అది భేదమే గాని ఒకటెట్లా అవుతుంది? జీవుడు జీవుడే! శివుడు శివుడే! జీవబ్రహ్మల సంబంధము వాచ్యార్థములో ఏకత్వము కాదు కాని, అది కార్యకారణ సంబంధము. సగుణ బ్రహ్మ వచ్చేసరికి కార్యకారణ సంబంధము. ఎక్కడికక్కడే మనము విడగొట్టుకోవాలి. నిర్గుణ బ్రహ్మము కారణము కాదు. బ్రహ్మ సూత్రాలు నిర్గుణ సగుణ బ్రహ్మల అభిన్నత్వమును సమన్వయం చేస్తాయి. భేదాలను పోగొడతాయి. మనము కూడా అదే చేస్తున్నాము. భిన్నత్వాన్ని అవిరోధము అంటే విరోధాన్ని పోగొడుతున్నాము, సమన్వయము చేస్తున్నాము. ఎక్కడిక్కడ సగుణ బ్రహ్మ, మాయాశబలిత బ్రహ్మ అని, ఉపాసనకు అందుతాడని, నిర్గుణ బ్రహ్మ ఉపాసనకు అందడని, కాని నిర్గుణ బ్రహ్మమే ఉన్నాడు. అద్వైతమే నిశ్చయము. విశిష్టాద్వైతములో వీడు వున్నాడు, వాడూ వున్నాడు, వీడు ఉపాసన చేసాడు, వీడు వాడిలోకి వెళ్ళిపోయాడు. వాడిలోకి వెళ్ళినా వాడితో సమానము కాలేదు. వాడిలో అంశగా వుండిపోయాడు. ఆ పరమాత్మకు ఏంకర్మ? పునర్జన్మకు రావడానికి? అందువలన అంశగా వున్న జీవుడు ఆ పరమాత్మ నుంచి వేరై పునర్జన్మను పొందుతాడు, తిరిగి ఈ అంశము ఆ పరమాత్మలో ఐక్యమయ్యింది అని అంటారు.

పరమాత్మయొక్క అంశే జీవుడు. జీవుడు పరమాత్మలో ఐక్యమైనా కొంతకాలము అది ఇది ఒకటిగా వున్నప్పటికీ ఆ అంశే ఎప్పటికైనాసరే తన మాతృకనుంచి ఉపాధి ధరించి పునర్జన్మలను పొందే అవకాశముంటుంది. ఇంత చెప్పరు గాని విశిష్టాద్వైతము కూడా మోక్షమే చెప్తుంది. అంటే ఈ అంశ పోయి దాంట్లోనే కలిసిపోతుంది అని. ఈ నిప్పురవ్వ తీసుకెళ్ళి మళ్ళీ ఆ మంటలోనే కలిపి పడేశాము అంతే!

బ్రహ్మయొక్క అస్తిత్వములో జీవులు అంశగా ఉంటారు అంటారు విశిష్టాద్వైతులు. అద్వైతములో భ్రాంతివల్ల రవ్వ వేరైనట్లు ఉంది. ఎప్పుడు మంటే వుంది. రవ్వలు లేవు. మంటలో ఐక్యమైపోయినప్పుడు రవ్వ అనేటటువంటి భ్రాంతి పోయింది అనేటటువంటిది అద్వైత వాక్యము. రవ్వ నిజమని రవ్వ పోయి మంటలో కలిసిందనేది విశిష్టాద్వైత వాక్యము. జీవబ్రహ్మల సంబంధము కేవలము ఏకత్వము గాదు. కాని కార్యకారణ సంబంధము. అన్నప్పుడు సగుణ బ్రహ్మను తీసుకోవాలి. **సర్వకారణ మీశ్వరం నిటలాంతరాళ విహారకం.** మోక్షము పొందువరకు జీవుడు పరమాత్మ కంటే భిన్నుడు. మోక్షము పొందాక ముక్తావస్థయందు ఆ బ్రహ్మ కారణ శూన్యుడగుట వలన, సృష్టించే బ్రహ్మము తన భేదాన్ని తానే సృష్టించుకున్నాడా! బ్రహ్మ నిర్వికల్పుడు కదా! తన భేదాన్ని తానే సృష్టించుకోవడానికి  ఒక సంకల్పము కావాలి గదా. సంకల్పమొస్తే సంకల్ప బ్రహ్మ, నిర్వికల్ప బ్రహ్మ ఒక్కటి కాదు కదా! మొదట్లో వేరే అనుకున్నప్పటికీ నిర్వికల్ప బ్రహ్మ నిర్ణయము చేస్తే, సంకల్పము అంటే మాయా సంకల్పమే కారణము. సంకల్పము లేకపోతే ఈ సృష్టే లేదు. జీవుడు లేడు. ఈ మూడూ వచ్చాయి. అంటే ఇప్పుడెక్కడికెళ్ళాము? సంకల్ప బ్రహ్మలోకి వెళ్ళాము. కార్యకారణ సంబంధములోకి వెళ్ళినప్పటికీ, ముక్త స్థితిలో ఏమైంది? కార్యము లేదు కారణము లేదు. ఇంతకుముందు కారణబ్రహ్మ ఎవరైతే వున్నాడో వాడు సంకల్పబ్రహ్మ కాదు, వాడు సగుణబ్రహ్మ కాదు, వాడు నిర్గుణ బ్రహ్మమే. వాడు మాయాశబలిత బ్రహ్మ కాదు. వాడు మాయకు పరమైనటువంటి బ్రహ్మ, త్రిగుణ రహిత బ్రహ్మ. అన్ని కాలాలల్లో అట్లాగే ఉన్న బ్రహ్మ. దీనిని రహస్యముగా పెట్టి, చివరికి అప్పుడు చెప్పాము.

బ్రహ్మ శాశ్వతంగా నిర్వికల్పంగా వున్నాడు. బ్రహ్మ సంకల్పము చేయకుండా ఇవన్నీ ఎలా వచ్చాయి అంటే సంకల్పమే మాయ. తన సంకల్పమే తనకు బంధము అని కందార్థము. నిస్సంకల్ప బ్రహ్మ వున్నదున్నట్లు ఉన్నాడు. సంకల్పము తిరిగి ఎక్కడ ఆగిపోయిందో నిర్వికల్పమై పోయిందో అప్పుడా బంధము పోయింది. జీవబ్రహ్మలు బేదాబేధములు రెండునూ బంధముక్తావస్థలపై ఆధారపడియున్నవి. ఈ బంధ మోక్షాలు దేనిమీద ఆధారపడ్డాయి? బంధ మోక్షాలు భ్రాంతి. అట్టి భ్రమయే మృత్యువు. భ్రమరహితమే అమృతత్వము. ఆత్మ సత్యము, భ్రమగా వున్నది జీవుడు. జీవుడిలోనున్న జీవత్వమే భ్రమ. జీవభావమే భ్రమ. జీవుడిలో భ్రమ తీసేస్తే జీవత్వము పోతుంది. జీవభావము పోతుంది. జీవభావము పోయిన జీవుడు ఈశ్వరుడు అవుతాడు. ఈశ్వర భావన పోయిన, ఈశ్వరుడు బ్రహ్మ అవుతాడు. బ్రహ్మ భావన పోయిన బ్రహ్మ అభావమై పరబ్రహ్మ అవుతాడు. ఇవన్నీ భావనలనుబట్టి వున్నాయి. సంకల్పము బట్టి, భావన బట్టి వున్నాయి. ఆ భావ తాదాత్మ్యత ఉపాసన వలన కలిగినప్పుడు సగుణ బ్రహ్మమే అవుతాడు. నిర్గుణ బ్రహ్మము అవడు. అయితే సగుణ బ్రహ్మోపాసన వద్దందామా? ఈ సాధన కొంత దూరము ఉపాసనా మార్గములో జరగాలి కాబట్టి సగుణోపాసన, సగుణ బ్రహ్మోపాసన చేయాలి. సగుణ బ్రహ్మోపాసన చేయడానికి ఆ సామర్థ్యము నవవిధ భక్తులతోటి ఆ దేవతా ఉపాసనతోటి చెయ్యాలి. అంతకుముందు అనేక దేవతా ఉపాసనలు చేసి, ఆ దేవతా రూపాన్ని, ఆ దేవతా శక్తుల్ని పొందాలి. తరువాత ఆ పరమాత్మే అన్నిటికి మూలమని, ఆ పరమాత్మే సర్వ వ్యాపకుడని, ఆ సర్వవ్యాపక పరమాత్మ సృష్టిలో నున్నటువంటి పంచభూతాలు, వగైరా ద్వారా ఎటువంటి ప్రమాదాలు, విపత్తులు లేకుండా, ఉపద్రవాలు లేకుండా, నిరుపద్రవంగా, పోషించబడాలి, రక్షించబడాలి అని కోరుకోవాలి. అదొక ఉపాసన. ఆ పరమాత్మే సర్వవ్యాపకంగా వున్నాడు. సర్వము తానైయున్నాడు. సర్వమందు చేరియున్నాడు. సర్వములో నిలిచియున్నాడు. సర్వము తనయందు కలిగియున్నాడు. తాను సర్వముకంటే విలక్షణమై యున్నాడు. ఇవన్నీ ఉపాసనలే. ఏదో నాలుగు పేర్లు పెట్టారు గాని, విరాట్ ఉపాసన, హిరణ్యగర్భ ఉపాసన అని చాలా ఉపాసనలున్నాయి. ఆ ఉపాసన ద్వారా వ్యష్టి సమష్టి అవ్వడము. స్థూల వ్యష్టి స్థూల సమష్టిగా అవ్వడము. విరాట్ ఉపాసన. సూక్ష్మముగా నున్నటువంటి వ్యష్టి సూక్ష్మముగా వున్నటువంటి సమష్టి రూపముగా అవడము హిరణ్య గర్భోపాసన. ఆలాగు ఈ ప్రకృతిని నాలుగైదు భాగాలుగా, పంక్తులుగా, విభాగములుగా విభజించి ఈ నాలుగు భాగాలకే ఆ పరబ్రహ్మయొక్క అంగాలుగా ఆ యొక్క లక్షణాలుగా పేర్లు పెట్టి సాంఖ్యోపాసన చేస్తే ఆ లక్షణాలలో చేరి ఆ లక్షణాలలో వున్న బ్రహ్మగా అవ్వడమే సాంఖ్యోపాసన.

ఇవన్నీ బ్రహ్మోపాసన క్రిందకే వస్తాయి. అభ్యాసము, బ్రహ్మాభ్యాసము అంటే ఏమిటి? నీవు ఎవరై వున్నావో అదే అయివున్నావు గాని అయినట్లుగా తెలియదుగా! నీకు అయున్నావని గురువుగారు చెపుతున్నారుగా! అయ్యినట్లుంటే అదే ఉపాసనగా, నేనే బ్రహ్మ అన్నావు. మాట వరుసకు అనకూడదు, నేనే బ్రహ్మను అని బ్రహ్మ యొక్క లక్షణాలతో ఉంటూ జీవునియొక్క గుణాలతో వుండకుండ వుండటమే బ్రహ్మోపాసన. ఒకటి అనుకున్నది రెండోది లేనిది. అనుకున్నదంతా ఉపాసన. లేనిదంతా నివృత్తి. బ్రహ్మ లక్షణాలను నీమీద అప్లయి చేసుకోవడమే ఉపాసన.

లక్ష్యాన్ని పట్టుకొని బ్రహ్మానికి చేరడము అంతా ఉపాసన. లక్ష్యానికి భిన్నంగా వ్యతిరేకంగా వున్నవన్నీ నివృత్తి చేసుకోవడము సాధన. నివృత్తి సాధన కూడా ఉపాసన క్రిందికే వస్తుంది. కాని ఉపాసన బ్రహ్మను సగుణము చేసి ఉపాసన చేసుకొని అక్కడిదాకా ఉపాసనా పద్ధతిలో కొంత ఆధ్యాత్మిక ప్రయాణము అయిపోతే, ఆ తరువాత ఏ సాధనా నీకెందుకు వీసానికి పనికిరాదు అన్నట్లు తత్త్వానుసంధానము చేసుకోవాలి. నిర్గుణ బ్రహ్మ అయ్యేలోగా సగుణ బ్రహ్మ వరకు సాధన అవసరమే, ఏ సాధన నీకెందుకు అని ముందే అనుకోవడము మూరత్వము. నిర్గుణ బ్రహ్మ అవ్వడానికి ఏ సాధన చెయ్యకూడదని సగుణ బ్రహ్మ జ్ఞానము పొందకుండా సాధనలన్నీ మానేసినవాడు మూర్ఖుడు.

గురువే చూస్తాడు, గురువే గొప్పవాడు, గురువే పరిపూర్ణుడు, గురువు నన్ను తరింపచేస్తాడు, గురువే నా ఎరుకను విడిపిస్తాడు, దారినపోయే వారందరిని పిలిచి ఎరుక విడిపిస్తాను రండహో అని అంటారా? పాపము చెయ్యొచ్చు, పూజలు చెయ్యొచ్చు, కల్లు త్రాగొచ్చు, ఏమైనా చెయ్యొచ్చు. ఒక్కసారి జంపైపోయి ఎరుక విడచి బయలవుతాడా? ఎరుక విడిచే సాధన కూడా వుండాలి, నిగ్రహముండాలి, శమదమాలుండాలి. వస్తువు తెలుసుకోవాలి, సగుణముదాకా సాధన చేయాలి, చిత్తవృత్తి నివృత్తి దాకా సాధన చేయాలి. దుష్కర్మలు ఆచరించకుండా జయించాలి. సత్కర్మలు ఆచరించడానికి ఒక నియమము పెట్టుకోవాలి. బహిర్ముఖంగా చేయవలసినదంతా చేయాలి. అంతర్ముఖంలో నిర్మలీకరణ జరగాలి. చిత్తశుద్ధి జరగాలి. పవిత్రాత్మ అవ్వాలి. విచారణచేసి ఇదికాదు, ఇదికాదు, అనుకొని నిన్ను నీవు శుభ్రపరచుకోవాలి, మలత్రయము నుంచి పంచమలముల నుంచి విడుదల కావాలి. శుద్ధము పరిశుద్ధము అయ్యేదాకా సాధన వుంటుంది. నివృత్తికోసం సాధన వుంటుంది. ఉపాసన అనే సాధన కూడా వుంటుంది. నివృత్తి పూర్తి అయ్యాక ఉపాసన దానికదే ఆగిపోతుంది. నీవు నీవైనటువంటి స్వరూపము నీకు సిద్ధిస్తుంది. ఆ సిద్ధించినటువంటిది అద్వైత వస్తువు. నీకది అపరోక్షము అంటే నువ్వే ఆ వస్తువు.

## దృక్

బ్రహ్మము స్వయం ప్రభ, స్వయం ప్రకాశము. ఏ ఇతర చైతన్యమునకును విషయము కాదు. ప్రభకి, స్వయం ప్రకాశానికి తేడా ఏమిటి? రెండూ ఒక్కటే. జ్యోతి యొక్క స్వరూపానికి, జ్యోతి యొక్క ప్రకాశానికి ఏమి తేడా? ఒక దీపం వెలిగించి, దాని మీద బుట్ట బోర్లిస్తే ఆవరణ లేకపోతే జ్యోతి మాత్రమే ప్రకాశ ఘనముగా ఉంటుంది. ప్రకాశము ముద్ద అయినట్లు ఉంటుంది. బుట్ట తీసేస్తే, ఆ గది అంతా కూడా జ్యోతి యొక్క వెలుగు వ్యాపిస్తుంది. కనుక ప్రకాశం అంటే, వ్యాపకమైనటువంటి వెలుగు. ప్రభ అంటే ఒక ప్రభలాగా కనబడుతున్నటువంటి జ్యోతి రూపం.

చంద్రుడు, చంద్రుని వెన్నెల. సూర్యుడు, సూర్యప్రకాశం ఉన్నాయి. సూర్యబింబం అనేది స్వయం ప్రభ అయితే, సూర్యరశ్మి, ఎండ అంతా ఎక్కడైతే లోకమంతా వ్యాపించి ఉందో, అది వ్యాపకముగానున్న ప్రకాశము. స్వప్రకాశం అంటే ఏమిటి? స్వయం ప్రభే స్వప్రకాశం. రెండూ ఒక్కటే.

ప్రభ, ప్రకాశం విడివిడిగా చెప్పినప్పటికీ స్వయం ప్రభ అనేది పరబ్రహ్మ. ప్రకాశం అనేది మాయ వరణంలో వ్యాపించిన ప్రకాశము. మళ్ళీ స్వప్రకాశం అనగానే, అది కూడా పరబ్రహ్మే. "వెలుగు జ్యోతి" కూడా తనను తాను వెలుగించుకుంటూ ఉంది. ఆ వెలుగుతున్నటువంటి జ్యోతి ఆవరణలో ప్రకాశించినా, ప్రకాశించక పోయినా, తనను తాను మాత్రము నిత్యము ప్రకాశింప జేసుకుంటూ ఉంటుంది. కనుక స్వయం ప్రకాశం, స్వయం ప్రభ. ఈ రెండూ పరబ్రహ్మ నిర్ణయం. ఏ ఇతర జీవ చైతన్యమునకును ఇది విషయము కాదు. ఏ ఇతర చైతన్యము అంటే, జీవ చైతన్యము 'అహం' 'అహం' అనే వాడియొక్క చైతన్యము, బుద్ధితో మలినమైన చైతన్యము విషయాలతో మాలిన్యమైనటువంటి మనస్సు యొక్క చైతన్యము స్వయం ప్రభ అనేదానికి విషయం కాదు. ఎందుకు విషయం కాదు?

మనస్సు యొక్క ఆలోచనకి, బుద్ధి యొక్క భావనకి, ఊహకి అందేటట్లయితే అది విషయం. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలను గ్రహించే జ్ఞానేంద్రియాలకు ఆ శబ్దాదులే విషయమౌతాయి. ఐదు జ్ఞానేంద్రియాలు ఐదు విషయాలను తెలుసుకునేందుకు పరిమితమై ఉన్నాయి. ఐదు విషయాలు దాటిన దానిని, ఈ ఐదు జ్ఞానేంద్రియాలు ఏమీ తెలుసుకోలేవు. ఈ ఐదు జ్ఞానేంద్రియాలకి, మనస్సుకి, బుద్ధికి, శబ్దాదులు వాటి యొక్క రెండూ, మూడు, నాలుగు, ఐదు కాంబినేషన్స్‌గా కలిసిపోయినటువంటివి గూడా, వేరే అనుభవంగా మీరు చెప్పినప్పటికి అన్నీ వీటియొక్క కలయికతో కూడినటువంటి అనుభవాలే. మీ ఇంద్రియాల ద్వారా గోచరమౌతాయి. ప్రత్యక్ష్యంగా ఈ ఐదు ఇంద్రియాల ద్వారా గోచరమయ్యింది. వృత్తిలోకి వచ్చి, మళ్ళీ జ్ఞాపకానికి, గుర్తుకి, వచ్చినప్పుడు అవి విషయాలు. ప్రత్యక్ష్యంగా ఈ ఐదు లేకపోయినప్పటికీ, ఊహలో, భావనలో కూడా ఈ ఐదే వస్తాయి. చూసినటువంటి దృశ్యము ఎదురుగా ప్రత్యక్షముగా లేకపోయినప్పటికీ, ఊహలో ఆ దృశ్యము ఉంటుంది. ఊహలో ఆ శబ్దం ఉంటుంది. ఊహలో ఆ రుచి ఉంటుంది. అంటే జాగ్రదావస్థలో ప్రత్యక్షముగా అనుభవించినవన్నీ కూడా, వాసన రూపంలోకి వెళ్ళి, ఇష్టాయిష్టాలను, రాగద్వేషాలను అనుసరించి, ఊహించినప్పుడు ఊహలోనికి ఇవన్నీ కూడా రావచ్చు. అంటే, స్వయం ప్రభ అయిన బ్రహ్మకు ఇటువంటి విషయాలు ఊహలోకి రావు. **'యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ'** – పరబ్రహ్మను తెలుసుకోవడానికి, మనస్సు – వాక్కు రెండూ వెళ్ళి తెలుసుకోలేక, వెనక్కు తిరిగి వెళ్ళిపోతాయి. నివర్తంతే అంటే వెనక్కు తిరిగి వెళ్ళిపోతాయి. అంటే, వాక్కుకి అందదు, మనసు యొక్క ఊహకి అందదు. నివర్తతంతే అంటే ఇంకొక అర్థము ఉన్నది. ఇంద్రియాలన్నీ వర్తించడము మానేస్తాయి, ఆ పరబ్రహ్మ అయినవాడికి. స్వానుభవ సాక్షాత్కార జ్ఞానము ఇంద్రియ గోచరము కాదు. విషయము కాదు. ఊహాతీతము, భావాతీతము. అనిర్వచనీయము. కేవలము సచ్చిదానంద ఘనము. స్వస్వరూపము, అపరోక్షము.

పరబ్రహ్మము స్వప్రకాశము, స్వయం ప్రభ. అది ఏ ఇతర చైతన్యములకు విషయము కాదు. అంటే బుద్ధి గత చైతన్యానికి, ఇంద్రియగత చైతన్యానికి పార్థివ శరీరం లేని, యక్ష, కిన్నెర, కింపురుషాది దేవతలందరూ కూడా ఉన్నారు. వాళ్ళు దివ్య శరీరము కలిగిన వారు. ఆ దివ్య శరీరముగా ఉన్నవాళ్ళకి దివ్యత్వము, దైవీ చైతన్యము ఉంటుంది. ఆ దివ్య చైతన్యము కూడా పరబ్రహ్మకు విషయము కాదు. మానవ చైతన్యమనేదీ విషయము కాదు. జీవగత చైతన్యము కూడా విషయము కాదు. ప్రాణ చైతన్యము ఆ పరబ్రహ్మకు విషయము కాదు.

నేను అనేటటువంటి సాక్షి చైతన్యము కూడా విషయము కాదు. దృక్ దృశ్య వివేకాన్ని పొడిగిస్తే, ప్రతి బింబముగా అంతఃకరణ వృత్తులుగా, సాక్షి చైతన్యంగా ఉన్నప్పటికీ, అంతఃకరణ వృత్తులు ఆగిపోయి, కేవల సాక్షి రూపంగా ఉన్నటువంటి చిదాభాస చైతన్యము కూడా స్వయంభాస చైతన్యానికి దృశ్యమయ్యింది. స్వయం ప్రకాశ, స్వయంభాస చైతన్యం అనేటటువంటిది సాధకుడికి ఇప్పుడు ఆత్మ అయ్యింది. దేహాత్మ, జీవాత్మ, జీవచైతన్యములో ఉండేటటువంటిది, సాక్షి చైతన్యములో ఉండేటటువంటి ఆత్మ. ఇలా ఆత్మ అనేది మాత్రం విలక్షణం చేసి పట్టుకోవాలి. ఎందుకంటే నీవే ఆ బ్రహ్మవి. నీవు కాకుండా బ్రహ్మ ఎక్కడా లేదు. కాకపోతే నీవు చాలా అనుకుంటున్నావు. అవన్నీ ఆగంతుకములు. వచ్చిపోయేవి. అవి ఏవీ నీ సహజస్థితిని చెడగొట్టలేవు. ఆవరణ, విక్షేప దోషాల చేత, నీ సహజస్థితి చెడకనే, భ్రాంతిలో చెడినట్లు కనబడుతోంది. భ్రమవీడితే చెడినట్లు కనపడేది, చెడినట్లు కాదు. సహజంగా నీవు నీవుగానే ఉన్నావు. అందుకే నేను అనేటటువంటిది, ఆత్మను, సూత్రాత్మను పరమాత్మను అంటూ పోయి, బ్రహ్మమే ఉందంటే, నీకేమి ఉపయోగం? బ్రహ్మ ఎంతగా గొప్పదైనా, నీకేమీ లాభం లేదు. నువ్వే ఆ బ్రహ్మవు కాబట్టి, నీవు ప్రయత్నం చేస్తున్నావు.

**'ఆత్మానాం ఉద్ధరేత్ ఆత్మానం'** నిన్ను నీవు ఉద్ధరించుకోవడమే. ఉత్ అంటే పైకి ధరించడం అంటే ధారణ చేయడం. దేహాత్మగా ఉన్న నీవు దేహము నేను కాదని జీవాత్మనని జీవాత్మగా ఉన్న నీవు జీవుడివి కాదని యదార్థ నేనుగా ఉన్నటువంటి దృక్కుగా ఉద్ధరించుకో! ధారణ చేయి! ఆ ధారణగా ఉన్నదానిని దృశ్యాన్ని చేసి, బింబ చైతన్యంగా, బింబ ప్రకాశంగా ఉన్నటువంటి పరమాత్మని ధారణ చేయి. దృష్టిని పైకి తీసుకెళ్తున్న కొద్దీ, సాధకుడైనవాడు, వాడే పైకి వెళ్తున్నాడు. ఆ క్రిందివన్నీ దృశ్యమై, **యదృశ్యం తన్నశ్యమై**, కనపడుతున్నప్పటికీ, లేనివిగా, మిథ్యగా, చూడడం అనేది అలవాటు చేసుకుంటావు. లేని దానికి ఎందుకు తాదాత్మ్యత? అని విడిపోతావు. లేనిదానికి ఎందుకు వెంపర్లాట? అని వైరాగ్యాన్ని పెంచుకుంటావు. లేనిదాని గురించి

వచ్చిన ప్రారబ్ధ కర్మని, వైరాగ్యంతో, మిథ్యాభావంతో, ఆగామి జోలికి పోకుండా, ఆ జనన మరణ చక్రాన్ని అక్కడికి ఆపేస్తావు. పాతకర్మ అనుభవిస్తూ, కొత్తకర్మ జోలుకి వెళ్ళడు. కొత్తకర్మ అతనికి అంటుకోదు. కొత్తకర్మ అంటుకోని స్థితిలో, తను ఆత్మకు దగ్గరగా, సమీపానికి వెళ్తాడు. తన అనుభవంలో సాక్షి చైతన్యాన్నే అనుభవిస్తుంటాడు. విషయాకారం పొందక, ఆత్మాకారం పొంది, ఆత్మ చైతన్యాన్ని అనుభవిస్తుంటాడు. ఇది ఉద్ధరేతి ఆత్మానం అంటే!

ఈ దృక్ దృశ్య వివేకాన్ని ఇంకా పైకి తీసుకెళ్ళాలి. శరీరము ఆత్మ కాదు. దృశ్య విషయం అంతటికీ కూడా ఈ ఆత్మ విలక్షణం. ఆత్మ అనగానే, ఇదంతా అనుకోండి, మీ మీద అప్లై చేసుకోవాలి. సాధన ప్రతి దశలో పైకి ఎదుగుతున్న కొద్ది, ఆత్మకు నిర్వచనం పై మెట్టులో పెట్టుకోవాలి. జీవాత్మ సూత్రాత్మ దాకా ఎదిగితే, ఆత్మ అనేది సూత్రాత్మగా పెట్టుకోవాలి. సూత్రాత్మని, శుద్ధ చైతన్య స్వానుభవంలో ఉన్నప్పుడు, అది పరమాత్మ. అప్పుడు ఆత్మ అంటే, సూత్రాత్మ బదులు పరమాత్మ అని పెట్టుకోవాలి. ఇదే ఉద్ధరించుకోవడం అంటే! ఎవరూ ఉద్ధరించరు. నిన్ను నీవే ఉద్ధరించుకోవాలి. నేనైన నేనే అలా పైకి వెళ్తుంది. ఆ ప్రతిబింబముగా ఉన్న నేను కూడా బింబజ్ఞానం వచ్చేసరికి, ప్రతిబింబమే పోతోంది. అప్పుడు "నేను" కూడా ఏమయ్యాడు? పారమార్థికంగా మారినటువంటి నేనుకు, వ్యవహారికమంతా నటనగా మారింది. ఇప్పుడు వ్యవహారికంగా ఉన్న నేను నటిస్తోంది. నటన కాకపోతే మళ్ళీ వృత్తైపోతుంది. వృత్తైతే ఆగామి వస్తుంది. ఆగామి అయితే అజ్ఞానం. ఆగమి రాకుండా జాగ్రత్తపడ్డాడు కాబట్టి, వృత్తి రహితమై, వృత్తి నివృత్తి అవుతోంది గనుక, ఇప్పుడు ఈ నేను ఏమౌతున్నాడు? విషయాకారం పొందకుండా, వైరాగ్యంచేత, మిథ్యాభావంచేత, విషయాలపట్ల, ప్రారబ్ధంపట్ల, అవన్నీ బాధించినప్పటికీ కూడా, తాను విషయీకరించుకోకుండా, తాను అనుసరించకుండా, దానిమీద స్పందించకుండా, దాని మీద ఇష్టాయిష్టాలు చూపకుండా, వాటి మీద వైరాగ్యము, మిథ్యాభావము, అసంగత్వము పెంచుకుని, చివరికి ఆత్మాకారము పొందుతున్నాడు.

అప్పుడు తాను ఆత్మ అనేటటువంటి దానిని ధారణ చేశాడన్నమాట. ఉత్ ధారణ. ఉద్ధరణము. పై స్థితిని ధారణ చేశాడు. ధారణ అంటే కూడా మళ్ళీ అక్కడ తాదాత్మ్యతే. తాదాత్మ్యత అంతాకూడా ఇటు అవిద్యా దోషం ఉన్నా ఉంటుంది, అటు మాయా దోషం ఉన్నా ఉంటుంది. రెండవ వస్తువు లేనప్పుడు, దేనితోనూ తాదాత్మ్యత లేనప్పుడు, తాను తానైనటువంటి సహజస్థితి ఎప్పుడైతే వచ్చిందో, అది అద్వైతం. అక్కడ వృత్తి ఉండదు, ప్రతిబింబము ఉండదు, బింబ ప్రకాశము కూడా ఉండదు. ఆవరణ అనేది లేదు. కనుక వ్యాపకము ఉండదు. అది ఘనమై, స్వయం ప్రకాశమై ఉంటుంది. తనలో తాను రమించుకుంటూ, తనను తాను ప్రకాశించుకుంటూ, తానైనటువంటి స్వస్వరూప జ్ఞానంలో ఉంటాడు. స్థిరముగా, అచలముగా, పరిపూర్ణముగా, ఉన్నదున్నట్లు ఉండిపోతాడు.

ఇక్కడ ఈ దృక్‌ని ఆత్మగా, విలక్షణంగా తీసుకెళ్ళాడు. శరీరం ఆత్మ కాదు అన్నాడు. శరీరము అంటే? మీరు శరీరాల జోలికి వెళ్ళకండి. 'శీర్యతే ఇతి శరీరః' – నశించేవన్నీ కూడా శరీరాలే. అష్టతనువులు ఉన్నాయి కదా! పరమాత్మ దాకా కూడా నశించేదే. ప్రత్యగాత్మ, పరమాత్మలు కూడా బహిః ప్రకాశములే అంటే నశించేవే. స్వయం ప్రకాశం ఒక్కటే నశించనది. ఆత్మ అంటే, స్వయం ప్రకాశము, స్వయం ప్రభ. స్వప్రకాశము.

అందరిలో కామన్‌గా ఉండేది సూత్రాత్మ. చరాచరజగత్తు అంతా ఉండేది సర్వాత్మ. విశ్వమంతా ఉన్నది విశ్వాత్మ. విశ్వంతో తాదాత్మ్యత ఉండవచ్చు. అప్పుడు విశ్వాకారుడు అవ్వచ్చు. విశ్వంభరుడు కావచ్చు. విశ్వసాక్షి కావచ్చు. విశ్వానికి సాక్షి అనేటటువంటి, సాపేక్ష సాక్షి చైతన్యానుభవంలో ఉండవచ్చు. ఈ సాపేక్షాన్ని నిరపేక్షం చేసుకుంటే, నీకు అర్థం అవుతుంది, అవన్నీ మిథ్య అని. కనుక ఆత్మని ఎలా ఉపయోగించుకుంటున్నామో, జీవాత్మ నుండి ప్రత్యగాత్మకి, ప్రత్యగాత్మ నుంచి సూత్రాత్మకి, సూత్రాత్మ నుంచి సర్వాత్మకి, సర్వాత్మ నుంచి విశ్వాత్మకి, విశ్వాత్మ నుంచి శుద్ధ చైతన్యంగా ఉన్నటువంటి కేవల చైతన్యానుభవంలో ఉన్నటువంటి పరమాత్మకి, చివరికి పరమాత్మ కూడా సాపేక్షంగా, వ్యాపకంగా, వ్యాపక స్థితిలో ఉన్నదంతా మాయావరణే. కనుక నిరావరణ యందు వ్యాపక లక్షణం తనకు లేదని, ఘనమై, ఊరక ఉంటే, ఆ ఉన్నదున్నట్లున్నదేదో అది స్వయం ప్రభ, స్వయం ప్రకాశము స్వప్రకాశము. ఇలా ఆత్మని ఉద్ధరించుకుంటున్నాము.

కనుక ఆత్మ అష్టతనువులకి విలక్షణము. అష్టతనువులు కూడా శరీరాలు కనుక అవి క్షీణించిపోయేవే. నీకు శరీరాలు దృశ్యమే. దృక్కే నిత్యము. దృశ్యము నశ్యము. శరీరము నశ్యము. ఆత్మకి శరీరము దృశ్యము కనుక శరీరము నశ్యము. ఆత్మ నిత్యము. ఈ ఆత్మ యొక్క నిత్యత్వాన్ని ఇలా పైకి తీసుకెళ్తూ ఉంటాము. శరీరాల యొక్క దృశ్యత్వాన్ని, నశ్యత్వాన్ని, ప్రత్యగాత్మ, పరమాత్మల దాకా తీసుకెళ్ళి, ప్రత్యగాత్మ, పరమాత్మ కూడా నశించేవాళ్ళే, లేనివాళ్ళే, నశించడం అంటే, రాకడ పోకడ ఉన్నవాళ్ళని అర్థం. మరి నశించడం అని మీరు అనుకుంటున్నారు.

నాశనము అంటే న+అశనము. అశనము అంటే ఆహారము, అనుభవము. న అశనము అంటే అనుభవాలు పోయేవే. ఇదీ దానియొక్క అర్థము. స్థూల శరీరము నశించింది అంటే, స్థూల శరీరము యొక్క భోగము, స్థూల శరీరముతో కూడినటువంటి అనుభవము, తాదాత్మ్యత పూర్వకమైనటువంటి అనుభవము పోతాయి. సూక్ష్మ శరీర భోగము పోయింది, నాశనమయ్యింది. అంటే, సూక్ష్మ శరీరంతో తాదాత్మ్యత వలన కలిగే అనుభవం నశించింది. ఆ భోగము లేకుండా పోయింది. మళ్ళీ కారణ శరీరంతో ఉన్నదికూడా పోయింది. ప్రత్యగాత్మ అనుభవం కూడా నశించింది. లేనెఱుకలే పరమాత్మానుభవము లేనిది. అందువలన పరమాత్మ కూడా **శీర్యతే ఇతి శరీరః**. ఆ అనుభవాలన్నీ దాటిపోవలసినదే! పరమాత్మ దృక్కుగా కూడా మిగలదు. జీవతనువులలో నాల్గవది ప్రత్యగాత్మ, ఈశ్వర తనువులలో నాల్గొవది పరమాత్మ. వీటి అనుభవాలను అశనము అంటున్నాము. అది కూడా దృశ్యమే కాబట్టి నశ్యమే. కనుక అశనమును, భోగమును, అనుభూతిని విడిచిపెట్టవలెను. ఈ నాశనము అనే పదము, లోక సంబంధముగా, వ్యవహారముగా వాడేది కాదు ఇక్కడ. శరీరము అన్నప్పుడు నశించేది, పరమాత్మానుభవం కూడా రాకడ, పోకడ ఉన్నందున లేనిదే. నశించడం అంటే ఏమిటి? ఆ అనుభవం సత్యం కానిది అని. పరమాత్మానుభవం సత్యం కాదు అని. సత్యం కానివి అన్నీ కూడా రాకడ, పోకడ ఉన్నవే. ఆది అంతము ఉన్నవే. ఉత్పత్తి ఉన్నది, నాశనము ఉన్నది. అవన్నీ కూడా **యద్భావం తద్భవతి**గా కల్పించుకున్నవే.

పరమాత్మ కూడా కల్పితుడే. ప్రత్యగాత్మ కూడా కల్పితుడే. వీళ్ళందరూ మాయావరణంలో ఉన్నవాళ్ళే. మాయావరణ దాటితే శుద్ధ చైతన్యము ఘనరూపముగా ఉంటుంది. దేశకాలములు లేవు కనుక, మాయావరణ లేదు కనుక, ఆవరణయందే వ్యాపకం ఉంది గాని, నిరావరణయందు వ్యాపకము ఉండదు. కనుక, నిరావరణయందు ప్రకాశము ఘనమై, ఆ ప్రకాశమే పరబ్రహ్మ కనుక, ఆ పరబ్రహ్మమే స్వప్రకాశమై, స్వయం ప్రకాశమై, స్వయం ప్రభయై ఉన్నాడు. శుక్తి, రజితము వలె దృశ్యమాత్రములే. ముత్యపు చిప్ప ఎలాగైతే ప్రకాశిస్తుందో, దానిని చూసి, వెండి అని ఎలాగైతే భ్రాంతి పడుతున్నారో, ముత్యపు చిప్ప యొక్క ప్రకాశము, వెండి ప్రకాశము అని భ్రాంతి పడినట్లు అవుతుంది. పరమాత్మ ప్రకాశమును పరబ్రహ్మ ప్రకాశమని భ్రాంతి పడినట్లు ఇక్కడ దృక్ దృశ్య వివేకంతో ఎక్కడిదాకా ఉద్ధరించుకున్నావో, ఆ ఉద్ధరించినటువంటి ధారణ సహజంగా ఉందా? తాదాత్మ్యతతో ఉందా? తాదాత్మ్యతతో ఉంటే నాశనము. తాదాత్మ్యత లేకపోతే స్వయం ప్రకాశము. అక్కడ అశనము ఏమైంది? నాశనము అయ్యింది. అన్నీ నశిస్తే మిగిలినది స్వయం అనుభూతి అయ్యింది. అన్యము ద్వారా కాకుండా, స్వయమే అయ్యింది. అన్యప్రకాశముగా కాకుండా స్వయం ప్రకాశముగా ఉంది. అన్యప్రకాశమేమో మాయావరణములో ఉంది. అది శుక్తి వంటిది. నిరావరణంలో అన్యప్రకాశం అనేది లేక, స్వయం ప్రకాశమే స్వతఃసిద్ధమై ఉన్నది. అది వెండి వంటిది. ఏలయన, ఘటాదులవలె, స్థూల సూక్ష్మ కారణములుగా ఎఱుగబడుచున్నది.

నీ కళ్ళెదురుగా కుండ కనబడితే, ఇది కుండా అని ఎలా చూసావో, అపరోక్ష అనుభూతిలో, స్వయం ప్రకాశ రూపుడు అంతస్పష్టంగా, తాను తానైనటువంటి స్వస్వరూప సాక్షాత్కార జ్ఞానమును కలిగి ఉంటాడు అని అర్థము. ఇంకా కుండను కూడా మసక చీకటిలో గుర్తుపట్టవేమో, కుండని చూసి మరొకటి అని అనుకుంటావేమో, కాని స్వస్వరూప సాక్షాత్కార జ్ఞానములో, స్వప్రకాశ అపరోక్ష అనుభూతిలో, అంతకంటే మిక్కిలి స్పష్టంగా, ఎటువంటి ధోకా లేకుండా, నూటికి వెయ్యి శాతంగా, నిన్ను నీకు స్వయం ప్రకాశముగా, తనలో తాను రమించేటట్లుగా, చిత్ ఘనముగా, సత్ ఘనముగా, ఆనంద ఘనముగా, **సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ** అనేటటువంటి స్వరూప లక్షణముగా, అది నీవై ఉంటావు. ఎదురుగా చూసేటటువంటిది ఇది కుండ అనే జ్ఞానం కంటే కూడా, ఈ స్వయం ప్రకాశ, స్వ ప్రకాశ, సాక్షాత్కార, అపరోక్ష అనుభూతి ఏదైతే ఉన్నదో, దానికి వెయ్యి రెట్లు ఖచ్చితంగా, స్పష్టంగా, నిరంతరాయంగా, నిత్యవర్తమానంగా, పరిపూర్ణంగా ఉంటుంది. ఈ కుండని చూస్తే వచ్చే ప్రియా ప్రియములు అపరోక్షములో ఉండవు. కుండ పగిలిపోతే, దుఃఖం కలుగవచ్చు, కాని, స్వస్వరూప సాక్షాత్కారంలో,

నిత్యవర్తమానమైనటువంటి, సహజమైనటువంటి, ఆనందము అనేటటుంవంటిది ఘనమై, నీ స్వరూపమై ఉంటుంది. ఆ బ్రహ్మ, శాశ్వతము, సత్యము గనుక, ఆ అనుభూతి కూడా శాశ్వతము సత్యముగా, సహజముగా ఉంటుంది.

అది నీవే అయివున్నావు గనుక, నీకు అది సహజమై ఉంటుంది. తెచ్చుకున్నదైతే ఎప్పటికైనా పోతుంది. ఇది అర్థమవ్వడం కోసం, ఇదంతా చెప్పుకుంటున్నాము. అది నీవే కదా! బోధలో అది ఒకటి, ఇది ఒకటి అని, అదీ ఇదీ ఒక్కటే అని, అది నీకు సహజత్వమని చెబుతున్నాము కానీ, అపరోక్షానుభూతిలో ఈ మాటలు పనికి వస్తాయా? నీది కానిది, నీ స్వంతం చేసుకుని సహజం చేసుకోవడం అనేలాగా, సాధనతో వచ్చింది ఆ మాట, పరోక్షము ఉందని, అన్యమనేది పోయి, అనన్యము సిద్ధించిన తరువాత ద్వైతము నశించి, అద్వైతము సిద్ధించిన తరువాత, ఇక సహజము అనే మాట మాత్రము ఎక్కడుంది? మనకు సహజము అంటే ఏమిటంటే, నీ నుంచి విడదీయలేనిది అని అర్థము. అంటే వాక్యాలు ద్వైతాన్ని సూచిస్తున్నాయి. అందువలన ఏ వాక్యమూ సరిపోదు. కనుక అనిర్వచనీయము అంటున్నాము.

ఆత్మకు ప్రకాశము సహజము. ఆత్మ నుండి ప్రకాశము విడదీయలేము. అయితే మాయావరణలో ఉన్న ప్రకాశం, మాయావరణలో నుంచి నిరావరణగా ఉన్నప్పుడు, నీవు నీవుగా ఉన్నప్పుడు, స్వయంప్రకాశం మాత్రమే సత్యం. ఆత్మ తనకోసం తాను కేవలంగా ఉంది. ఎవరికోసమో లేదు. విషయ ప్రపంచము ఒకరికోసము ఒకరు ద్వంద్వముగా ఉన్నది. ప్రపంచము ఒకసారి ఊహించుకుంటే, ప్రపంచమంతా ఉంది. విషయాలన్నీ ఉన్నాయి. ఇతర జీవరాశులు లేవు. నీవు ఒక్కడివే ఉన్నావు అక్కడ. మరి నీ కోరికలు ఎలా తీరుతాయి? ఇంకేదోకావాలి. ఇచ్చేవాళ్ళు ఉండాలి. మమకారం కావాలి. బిడ్డలు పుడితేనే మమకారం. రాగం కావాలి, నిన్ను సుఖపెట్టేది ఉంటేనే రాగం. ద్వేషం కావాలి, నిన్ను దుఃఖపెట్టేది ఉంటేనే ద్వేషం. నీకంటే వేరే ఏదీ లేనప్పుడు మమకారం ఎక్కడిది? రాగద్వేషాలు ఎక్కడివి? అసలు నీకు పని చేయడానికి కర్తృత్వం ఎక్కడుంది? భోక్తృత్వం ఎక్కడుంది? నీవు తప్ప రెండవది లేదు. ఒక టన్ను బంగారం ఇచ్చా. ఏం చేసుకుంటావు నీవు? కొనుక్కోవడానికి మార్కెట్ లేదు. వస్తువులు లేవు. అమ్మేవాడు లేడు. కోటి రూపాయిలు ఇచ్చాము. ఏం చేసుకుంటావు? కోటి రూపాయిలు ఒక విషయం కాదు, బంగారం ఒక విషయం కాదు. అలాగే కేవలాత్మ తాను తప్ప రెండవది లేదు. తనకంటే అన్యము లేదు అనేది సిద్ధించినప్పుడు ఇంకా విషయాలు ఎక్కడుంటాయి? పోనీ, అసంతృప్తిగా, దుఃఖముగా, ఇబ్బందిగా, అసౌకర్యముగా, బాధగా ఉన్నాడన్న ఆ ఒక్కడే. అప్పుడు ఈ బాధ నివారణ ఎలా? కాని ఆ ఇబ్బందేమీ లేదు. అది నిత్యతృప్తము, పరమ ఆనందము, ఆనందమే తానై, అంతకు మించి మరొక విషయము ఎక్కడాలేదు. ఆ గొప్పదానికంటే గొప్పది లేదు. ఆ గొప్పదే తానైనటువంటి ఆనంద స్వరూపునికి, బయట వెతకాల్సిన అవసరం ఏమిటి? వెతికినా విషయాలు ఉండవు. కేవలాత్మ అనగానే, నేను అనేవాడు కేవలంగా ఉండే పరబ్రహ్మే. సాధకుడు ఈ ప్రపంచంలో ఎంతమంది ఉన్నా, ఇంతమందినీ పట్టించుకోకుండా, తానుతానుగా ఉంటే, తాను పరబ్రహ్మే. ప్రపంచంలో ఎన్ని విషయాలున్నా విషయీకరించుకోకుండా ఉంటే పరబ్రహ్మే. మూడు గుణాల వలన వికారము చెందకపోతే తాను పరబ్రహ్మే. నీవు తప్ప అన్యము లేనప్పుడు, ద్వంద్వాలు లేనప్పుడు, ద్వంద్వాతీతం గగన సదృశం అనగా ఆకాశమువలె నిర్మలమై, అసంగమై ద్వంద్వాలయొక్క విమర్శ లేనప్పుడు అసిపదం సిద్ధిస్తుంది. భేదాలు, నానాత్వం పోతే అసిపదం సిద్ధిస్తుంది. అసిపదమే పరబ్రహ్మ. విషయ ప్రపంచమంతా ఒకరికొకరు ద్వంద్వంగా ఉంది కనుక, మనకి బంధంగా ఉంది. అది లేకపోతే మోక్షమే.

కేవలాత్మ అంటే ఏమిటి? జగత్తు అంటే ఏమిటి? జగత్తు అంటే స్వయం సత్తా వంతము కాదు. నేను అనేటటువంటి సాధకుడు అక్కడ ఉన్నాడు. వాడి సత్తాతోటే ఇవన్నీ అవుతున్నాయి. వాడే బ్రహ్మ. ఆ బ్రహ్మ సత్తాతో, చైతన్యంతో అన్నీ అవుతున్నాయి. అయితే అవి ఆధార, ఆధేయంగా ఉన్నాయి కదా! జడమైనవి అన్నీ ప్రజ్ఞావంతము, చైతన్యవంతము, ప్రకాశవంతము అవుతున్నాయి కదా! ఈ ప్రజ్ఞానము, చైతన్యము, ప్రకాశము. ఆత్మలక్షణము కదా! ఆత్మ అంటే, నేను నేను అనే సెల్ఫ్ కదా! అది నీవై ఉన్నావు కదా! అది నీ సత్తా కదా! అది నీ ప్రకాశము, నీ ప్రజ్ఞానం, నీ చైతన్యం కదా! నిన్ను బట్టే ఇది అంతా ఉంది. నిన్ను బట్టే ఇది అంతా ఉంటే, నీవు వాటికి అతీతంగా ఉండాలి కదా! నీవు వాటికి విలక్షణముగా ఉండాలిగా! నీవు తెచ్చుకున్న కుండ నీకంటే వేరేకదా! కుండ పగిలిపోతే నీవు పగిలినట్లు కాదుగా! కుండ, నీవు ఒక్కటి కాదుగా! అలాగే నీ సత్తా చేత జగత్తు ఉంటే, జగత్తుకు స్వయం సత్తా లేకపోతే, నీ సత్తావల్లే, జగత్తు యొక్క ధర్మాలు, ఎప్పుడెప్పుడు ఏమేమి ఉన్నాయో అవి ప్రకటితం అవుతున్నాయి.

ఎప్పుడెప్పుడు ప్రకటితం అవుతుంది? సృష్టి ధర్మంగా, సృష్టిలో ప్రకటితం అవుతున్నాయి. యద్భావం తద్భవతిగా, ఇవన్నీ తానే జరిపించుకుంటున్నాడు ఆత్ముడు. తనచేత సృష్టించబడ్డ స్థూల సూక్ష్మ కారణ శరీరాలు తనకంటే వేరు. తనచేత తయారైన కుండ, తనకంటే వేరు ఎలాగో, ఆ స్వయం సత్తా కలిగిన బ్రహ్మ తనచేత సృష్టించబడిన, స్థూల సూక్ష్మ కారణ ప్రపంచాలు, స్థూల సూక్ష్మ కారణ దేహాలు, స్థూల సూక్ష్మ కారణ ప్రపంచ అనుభవాలు, తనవి కావు. తాను వాటి అన్నిటికి విలక్షణము. అవి బ్రహ్మము నుండి విడివడి, బ్రహ్మము పైనే ఆధారపడి ఉన్నవి. తనయొక్క స్వయం సత్తా వలన, బ్రహ్మము యొక్క ప్రకాశము. మాయావరణములోనే వ్యాపించి ఉన్నది. మాయావరణ యందు, ఈ జగత్తు, ఆ బ్రహ్మ సత్తా చేత సృష్టించబడి ఉంది. ఈ జగత్తు అంతా కూడా, **'అణోరణీయాన్, మహతో మహీయాన్'**గా వ్యాపించింది. ఆ ప్రకాశమే మాయావరణలో సాక్షి. ఆ ప్రకాశమే. సర్వ దృశ్యములకు దృక్కు. ఆ ప్రకాశమే. మాయావరణకు ఆవల, నిరావరణ యందున్న పరబ్రహ్మ, స్వయం ప్రభ, స్వయం ప్రకాశము. నిజమైన దృక్కువాడు. ఆ దృక్‌లో, దృక్‌స్థితిగాని, ద్రష్టత్వంగానీ లేదు. ఎందుకంటే, ఆ దృక్కుకంటే అన్యము లేదు కనుక. ఆ దృక్కు కంటే అక్కడ దృశ్యము లేదు కనుక. నిరావరణయందు దృక్కుకి దృశ్యము లేదు. దృశ్యత్వము, ద్రష్టత్వము లేనిది కనుక, ఆ పేరు తీసేస్తే, వాడే పరబ్రహ్మ. వాడే సన్మాత్రుడు, చిన్మాత్రుడు, ఆనంద మాత్రుడు. వాడే సద్ఘనము, చిద్ఘనము, ఆనంద ఘనము. వాడే సత్ స్వరూపుడు, చిత్ స్వరూపుడు, ఆనంద స్వరూపుడు. వాడే సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ.

ఇంద్రజాలకునిచే ఇతరుల కొరకు కల్పించబడిన వస్తు సముదాయము, ఎలాగైతే ఇంద్రజాలకుని బాధింపదో, అలాగే ఈ జగత్తు అనే మాయ, బ్రహ్మముచే కల్పింపబడినందున, బ్రహ్మమును బాధించదు. ఒక ఇంద్రజాలకుడు కప్పలను ఉన్నట్లుగా సృష్టించాడు. చుట్టూ ఉన్న ప్రేక్షకులకు కనికట్టు అయ్యింది. వాళ్ళకి ఈ కప్పలన్నీ, వాళ్ళ మీదకి గెంతుకుంటూ పోతే, వాళ్ళు ఒంటిమీద ఎక్కడ కప్పబడుతుందో, లేక కప్పమీద వాడి కాలు పడుతుందో అని భయపడి అందరూ అటూ ఇటూ దూరంగా వెళ్ళే ప్రయత్నం చేశారు. గారడీవాడు అక్కడే ఉండి నవ్వుతూ ఉన్నాడు. ఎందుకంటే, అవి మాయాకల్పిత కప్పలు. అవి సత్యం కాదు. అవి అతనిమీద పడడం లేదు. అలాగే ఈశ్వరుడు మాయకు వశుడు కాదు. కనికట్టులో ఉన్నటువంటి ప్రేక్షకుడు, ఎలా అయితే ఇంద్రజాలము యొక్క మాయకు వశులై, కప్పల విషయంలో, అటూ ఇటూ పరిగెత్తారో, ఈ నామరూప జగత్తు విషయంలో, అవిద్యా దోషం అనే కనికట్టు ఉన్నప్పుడు, అటూ ఇటూ చలిస్తూ ఉంటారు జీవులు. కేవలాత్మ మాయకు అతీతం కనుక చలించదు. కేవలాత్మయందున్నటువంటి మాయ, ఆ కేవలాత్మ స్వరూపుడైనటువంటి బ్రహ్మకు సంకల్పంగా తోచి, ఆ సంకల్పము యొక్క పరిణామముగా, ఇంద్రజాలమువలె వీక్షించబడినటువంటి, ఈ కల్పిత జగత్తు తోచింది. ఆ కేవలాత్మ స్వరూపుడైన బ్రహ్మకి, ఈ తోచిన ప్రపంచము బాధించదు. మరి ఎవరిని బాధిస్తుంది? మాయకు వశులైనవారు ఎవరైనా ఉంటే వాళ్ళను బాధిస్తుంది. ఇంద్రజాలకుని కనికట్టు ఎవరిమీద పనిచేస్తుందో, వారిని బాధిస్తుంది.

ఒకసారి గారడీవాడు, ఒకచోట గారడీ చేస్తే ఒక ఎత్తైనటువంటి చెట్టుమీద అప్పటికే ఒక కుర్రాడు ఆ చెట్టెక్కి పైన ఉన్నాడు. ఇంద్రజాలకుడు ఆ చుట్టూ ఉన్న ప్రేక్షకుల మీద కనికట్టు చేశాడు. ఆ కనికట్టుకి, ఆ ఇంద్రజాలకుని మాయకు అందరూ వశులయ్యారు. చెట్టుమీదెక్కి ఆ పై కొమ్మమీద ఉన్నవాడు, ఈ క్రింద జరిగేదంతా చూస్తున్నాడు. వాడి మీద ఈ కనికట్టు పనిచేయలేదు. ఎందుకంటే ఆ ఇంద్రజాలకుడు ఆ పైకి ఎక్కిన వాడిని చూడలేదు. చూస్తే, ఆ కనికట్టు వాడిమీద కూడా ఉండేది. అప్పుడు ఆ కప్పల విషయాన్ని చూచి ఆ చెట్టుమీద ఉన్నవాడు నవ్వుకుంటున్నాడు. వాడికి మిథ్యా భావము ఉంది. ఇంద్రజాలకునిచే ఇతరుల కొరకు కల్పింపబడిన ఆ వస్తుసముదాయము ఏ విధంగా అయితే, ఆ ఇంద్రజాలకుని బాధింపదో, అలాగే ఈ జగత్తు అనే మాయ, బ్రహ్మము చేత కల్పింపబడినందున ఆ బ్రహ్మమును బాధించదు.

బ్రహ్మ సంగతి చెబుతున్నానా? నీ సంగతి చెబుతున్నానా? నీవు ఉద్ధరించబడితే, నీకు ఆ స్థితి అయితే, నీవు ఆ స్థితిలో ఉంటావని తెలుసుకో! నీవే ఆ బ్రహ్మమైనప్పుడు ఈ ప్రపంచం నిన్ను బాధించదు. తెలిసిందిగా! ప్రపంచం బాధిస్తున్నప్పటికీ, ఈ ప్రపంచం బాధించదు అనే మాట మీద ఉండాలి. ఎవరికి ఈ ప్రపంచం బాధించదో, వాడు సాక్షి. ఎవరిని ఈ ప్రపంచం బాధిస్తుందో వాడికి తాదాత్మ్యత ఉంది.

తాదాత్మ్యత ఉన్నవాడే, ప్రపంచాన్ని బాధకంగా చూస్తాడు. కాని మిథ్యగా చూస్తూ ఉంటే, పోయిందేమీ లేదుగా! నేను ఆత్మను కదా అనుకుంటే, ఇదీ సాధన. ఆ సాధనచేత, వాడు సాక్షి చైతన్య స్వరూపుడై, కేవలాత్మ స్వరూపుడై, గురుకృపతో బ్రహ్మానుభవం పొందుతాడు. ఆ పొందిన వాడికి ఇది బాధించదు. నిజానికి పొందని వాడికి కూడా బాధించదు అనేది నిజము. బాధిస్తున్నప్పటికి ఈ బాధ లేదుగా! ఇది మిథ్యకదా! అని అనుకోవాలి.

అవస్థాత్రయముతో బ్రహ్మమునకు సంబంధం ఉన్నట్లు తోచుట, రజ్జువునందు సర్పదృశ్యము వలె భ్రాంతి. ఈ మాయను అసత్ అని చెప్పజాలము. అవస్థా త్రయము ఏమిటి? జాగ్రత్ స్వప్న సుషుప్తులు అవస్థాత్రయము. ఈశ్వరునికి కూడా అవస్థాత్రయము ఉంది. విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులు ఆ మూడు అవస్థలకు అభిమానులు. జీవుడి అవస్థలకు విశ్వ తైజస ప్రాజ్ఞులు అభిమానులు. ఈశ్వరుడికి ఈ మూడు అవస్థలు కల్పితం అని, ఇవి నన్ను బాధిస్తున్నాయి కానీ, విచారిస్తే, నేను వీటిచేత బాధింపబడని వాడిని అన్నప్పుడు, ఆ ఈశ్వరుడు సాక్షీ మాత్రుడైనప్పుడు, ఈ జగత్రయ సాక్షి యొక్క ఎఱుకలో ఉన్న, అవస్థాత్రయ సాక్షి పరమాత్మే. ఈశ్వరుడు కూడా సాక్షి పరమాత్మే. జీవుడు కూడా సాక్షి పరమాత్మే. మూడు అవస్థలు, మూడు శరీరాలు కలిపేసుకోండి. స్థూల సూక్ష్మ కారణ శరీరాలు మూడు అవస్థలలోనూ పనిచేస్తున్నాయి. జాగ్రదావస్థలో స్థూల శరీరం బాగా పనిచేస్తుంది. స్వప్నావస్థలో స్థూల శరీరం పనిచేయకుండా, సూక్ష్మ శరీరం పనిచేస్తుంది. సుషుప్త్యావస్థలో స్థూల సూక్ష్మాలు రెండు పనిచేయక, కారణం అజ్ఞతను కలిగిస్తుంది.

జాగ్రత్ శరీర అభిమాని, జాగ్రదావస్థ అనుభవాలు జాగ్రదావస్థ ఈ మూడు ఒక సెట్. సూక్ష్మ శరీరము, సూక్ష్మ శరీర అభిమాని, సూక్ష్మ ప్రపంచానుభవము. ఈ మూడూ ఒక సెట్. కారణ శరీరము, కారణ శరీరాభిమాని, కారణ ప్రపంచము యొక్క అనుభవము అంటే హాయి. ఏమీ తెలియకపోవడము, ఇది ఒక సెట్. ఈ మూడు సెట్‌లు త్రయముతో కూడా బ్రహ్మమునకు ఎట్టి సంబంధము లేదు. ఒక వేళ జగత్రయము తోస్తే, రజ్జువునందు సర్పము తోచినట్లు, సర్పభ్రాంతిలాగా ఉంటుంది. మాయ సత్ కాదు, అసత్ కాదు, శాశ్వతం కాదు. అసత్ యొక్క లక్షణాలు మాయకు లేవు. మాయాకల్పిత ప్రపంచానికి అసత్ లక్షణాలు ఉన్నాయి. మాయా కల్పిత జీవులకి అసత్ లక్షణాలు ఉన్నాయి. మాయాకల్పిత ఈశ్వరుడికి అసత్ లక్షణాలున్నాయి. పోనీ, మాయ ఇవన్నీ చేస్తుందా? అనంటే, మాయ సత్యమా? సద్వస్తువా? నిత్యమా? శాశ్వతమా? అంటే, మాయసత్యమైతే ఎవరికీ ముక్తి, మోక్షం లేదు. అందువలన మాయ సత్ కాదు. మాయ అసత్ కాదు, ఏమని నిర్ణయించాలి? ఏ నిర్ణయం చేయలేము కాబట్టి మాయ అనిర్వచనీయము. అన్‌డిఫైనబుల్. అయితే మాయకు ఆది అంతాలు ఉన్నాయా? అనాది మాయ అన్నాము. అనాది మాయ అంటే, మొదలు లేదని. మొదలు అంటే ఎక్కడుంది? సృష్టియొక్క మొదలు. మాయవల్లే సృష్టి వచ్చినప్పుడు, సృష్టి మొదలు కాకముందే మాయ ఉండాలిగా! మీకు పుత్రులు పుట్టినప్పుడు, పుత్రులు పుట్టకముందు మీరు ఉంటారుగా. మీ కారణంగానే కదా పుత్రులు పుట్టారు. మాయవల్లే ప్రపంచం వస్తే, ప్రపంచానికి ఆది ఉంది. మాయ కారణంగా ప్రపంచం ఉంది కాబట్టి, జగత్తుకంటే ముందు మాయ ఉండి, ఈ మాయే జగత్తుని కల్పించింది. ఈ కల్పిత జగత్తు ఎప్పుడు వచ్చిందో అది ఆది. అంతకంటే ముందు ఈ మాయ ఉంది కనుక, మాయా అనాది.

జీవుడికి అవిద్యా దోషం కూడా మాయారూపంలోనే ఉంది కనుక, ఈ దోషాలు ఎవరి వల్ల వచ్చాయో, వాడు మీ కంటే ముందున్నాడు. జీవుడికంటే ముందే మాయ ఉంది. ఈశ్వరుడికంటే ముందే మాయ ఉంది. సర్వకారణమైన బ్రహ్మకంటే కూడా మాయ ముందే ఉంది. అందుకని మాయ అనాది. మాయకు అంతముందా? ప్రళయకాలంలో మాయ అవ్యక్తంలోకి వెళ్తోంది. అది మూలా విద్యగా ఉంటుంది. మాయతో పాటు, మాయాకల్పిత ప్రపంచం అంతాకూడా లేకుండా పోతుంది. అప్పుడు మాయ మూలాప్రకృతి రూపంలో ఉంటోంది. గాఢ తమస్సుగా ఉండిపోతోంది. సర్వము అవ్యక్త రూపంలోకి వెళ్తున్నాయి. ముక్తాత్మలు మాత్రం లేకుండా పోతున్నాయి. ముక్తాత్మలు కాని వాళ్ళు, బద్ధాత్ములు, ప్రళయకాలంలో మైనపు ముద్ద మీద, బంగారు రజను అద్దితే, ఎలా ఉంటుందో, అలాగ గాఢ తమస్సుగా ఉన్నటువంటి మూలా ప్రకృతి, అనే ముద్దలో బంగారు రజను లాగా, అణువులు లాగా, రాబోయే సృష్టికి మహాకారణంగా ఉండిపోతారు. మళ్ళీ పునఃసృష్టి కాలంలో, ఎవరి సంస్కారానికి, ఎవరి వాసనలకి, తగినటువంటి జీవసృష్టి, ఈ భూమి మీద, ఈ గోళాల మీద జరిగినప్పుడు, తగిన సమయం ఆసన్నమయ్యేదాకా కూడా, బంగారు రజను రూపంలో ఉంటారు వాళ్ళు. ఆ సమయము ఆసన్నమైనాక, అక్కడి నుంచి ఆ బద్ధాత్మలు వ్యక్తమై, కొన్ని పునర్జన్మలలో, ఏదో ఒక జన్మలో, సాధనలోకి దిగి, ఏదో ఒక జన్మలో ముక్తులు అవుతారు.

ఇప్పుడు మాయ గురించి ఒక నిర్వచనాన్ని చెబుతున్నాను. మాయ అసత్ అని చెప్పలేము, సత్ అని చెప్పలేము. మాయ అనాది. అయితే మాయకు అంతము ఉంది. మాయ వల్ల కల్పించినటువంటి భ్రమ, నీ నుంచి తప్పుకుంటే, మాయకు అంతము ఉంది. మాయకు అంతము ఉంటే, నీవు బ్రహ్మము అవుతావా? మాయ అంతమైనంత మాత్రాన నీవు బ్రహ్మము అవుతావా? మాయతో కలసిపోయిన బ్రహ్మమైనప్పుడు, ఆ బ్రహ్మమును ఆశ్రయించిన మాయ, బ్రహ్మమునే ఈశ్వరుడిగా, జీవుడిగా, నానా రకాల జీవులుగా, క్రిమి కీటకాలుగా, పశుపక్ష్యాదులుగా, క్రిందికి దింపేస్తుంది. కనుక ఆ బ్రహ్మయొక్క మూలమేమిటో కనుక్కుని, ఆ కారణ బ్రహ్మకు ఆవల, మాయకు ఆవల, మాయకు పరమై, మూడొంతులు బ్రహ్మ ఏదైతే ఉన్నదో ఆ బ్రహ్మలో మాయ లేదు కనుక, ఆ మాయా రహిత స్థితిగా ఉన్న, మూడు వంతుల పరబ్రహ్మ స్థితి, మనకు లక్ష్యముగా, మోక్షముగా, గమ్యముగా ఉన్నది.

అక్కడికి వెళ్ళినవాళ్ళు, ఆ బ్రహ్మ స్వరూపముగా, నిత్యత్వంగా, సత్యముగా, శాశ్వతముగా, ఉన్నది ఉన్నట్లుగా ఉండిపోతారు. మాయ ఏం చేసింది అంటే, ఒకవంతు బ్రహ్మను సృష్టికి కారణంగా చూపిస్తోంది. నిర్గుణ బ్రహ్మని, సగుణ బ్రహ్మగా చూపిస్తోంది. కాబట్టి, వాడు నిజానికి నిర్గుణ బ్రహ్మే. భ్రాంతిలోనే, సగుణ బ్రహ్మ బాధించబడుతున్నాడు. భ్రాంతి రహితమైనప్పుడు సగుణ బ్రహ్మ బదులు ఎప్పటికీ బాధింపబడనటువంటి నిర్గుణ బ్రహ్మమే స్వతస్సిద్ధమై ఉంటుంది. సర్పముగా చూడబడినటువంటి రజ్జువు, భ్రాంతి నశించగానే అది సర్పము కాదని, ఎలా తెలియబడుతోందో, అలాగే ఈ కల్పిత ప్రపంచము ఆ విధముగా అదృశ్యము అవాలి. కాని అలా జరుగుటలేదు. అందుకే, ఎవరైనా, తన సాధనలో ముక్తుడు కాగానే ఈ ప్రపంచం అదృశ్యం కావడం లేదు. తన శరీరము డ్రాప్ అయ్యేవరకూ శరీర ప్రారబ్ధం ఉన్నంత వరకూ, జీవన్ముక్తుడుగా తన ఆయుష్కాలము పూర్తి అయ్యేదాకా, జీవించి ఉంటే, మళ్ళీ ఈ ప్రపంచము గోచరిస్తూనే ఉంటుంది. అయితే అతడు సాక్షి, విలక్షణుడు, అసంగుడు.

మాయతో సాన్నిధ్యంగా ఉన్నప్పుడు పురుషుడు అయ్యాడు. మహత్తు దగ్గరేమో, ప్రకృతిపురుషుడుగా శివశక్త్యాత్మకముగా ఉంటాడు. మహదహంకారం దగ్గరేమో, సంకల్ప బ్రహ్మగా ఉంటాడు. సత్ అంటే సత్యము. ఎప్పుడూ ఉండేది. అసత్ అంటే, ఎప్పుడూ ఉండేది కాదు అని అర్థము. అసలు లేదు అని కాదు. తాత్కాలికంగా ఉంటుందని అర్థము. సృష్టించబడుతూ, పరిణామం చెందుతూ మళ్ళీ అవ్యక్తంలోకి వెళ్ళిపోయి, మరలా సృష్టించబడుతూ, పరిణామం చెందుతూ ఉండేదానిని జగత్తు అన్నాము. ఈ జగత్తు లేకనే ఉన్నట్లు భ్రాంతిలో తోచింది. భ్రాంతి రహితమైతే ఉండనే ఉండదు. తాత్కాలికంగా ఉండుట అనేది కూడా, లేనిదానికే చెబుతున్నాము. శాశ్వతంగా ఉండేది మాత్రము ఉన్నదానినే చెబుతున్నాము. పరబ్రహ్మ సదసద్విలక్షణం. అసత్ నిజమనుకోవడము అజ్ఞానము. సత్ నిజమనుకోవడము జ్ఞానము. కాని జ్ఞానాతీతమైనది. సదసద్విలక్షణమైనది, స్వరూపమైనది పరబ్రహ్మము.

దేనికీ బాధ్యుడు కాకుండా, దేనికీ కారణం కాకుండా, తనకు తానే స్వతఃసిద్ధంగా ఉన్నటువంటి బ్రహ్మ. అటువంటి బ్రహ్మనే అధిష్ఠానము అంటాము. ఆ స్వయంప్రకాశ, స్వయంప్రభగా ఉన్న బ్రహ్మ మాయావరణయందు కూడా తన ప్రకాశం వ్యాపించగా, మాయ కారణంగా వ్యాపించగా అక్కడ మాయలో తోచినదంతా బ్రహ్మకి ఏమీలేదు. చిల్లుల కుండలో ఉన్నటువంటి, **మహాదీప ప్రకాశము** స్వయం ప్రకాశం గానే ఉంది. కుండకు ఉన్న చిల్లుల ద్వారా ప్రకాశం, బయటకు ఎప్పుడైతే వచ్చిందో, ఆ కుండకు వెలుపల అంతా మాయావరణ. ఆ మాయావరణ యందు చిల్లుల యొక్క ప్రకాశమంతా కూడా వ్యాపించింది. స్వయం రూపమైన బ్రహ్మకు హాని యేమొచ్చింది? ఆయన వికారం చెందాడా? **నానా ఛిద్ర ఘటోదర స్థితిగా**, స్వయం ప్రభగా ఉన్నటువంటి బ్రహ్మ, ఘటముయొక్క వెలుపల, ఆ రంధ్రముల ద్వారా, ఆ ఛిద్రముల ద్వారా వెలువబడిన బాహ్య ప్రకాశము కూడా, బ్రహ్మము యొక్క ప్రకాశ లక్షణమే అయ్యింది. ఆ ప్రకాశానికి కూడా కర్తృత్వాలు, భోక్తృత్వాలు లేవు. ఆ ఘటము యొక్క వెలుపల అంతా, మాయావరణం చేత, మాయ లేనిది ఉన్నట్లు చూపించడం చేత, ఆ వెలుపల ప్రకాశంగా ఉన్నటువంటి బ్రహ్మకి సర్వకారణత్వం ఆపాదించబడింది. సర్వ సాక్షిత్వం కూడా ఆపాదించబడింది. నిరావరణ బ్రహ్మయందు, సర్వ కర్తృత్వము, సర్వ సాక్షిత్వము, సంగత్వ అసంగత్వములు ఏవీ లేవు.

ఈ రంధ్రముల గుండా మాయావరణలోనికి వ్యాపించినటువంటి, శుద్ధ చైతన్య ప్రకాశమే బ్రహ్మము. ఆ మూలప్రకృతి అనే అవ్యక్త స్థితిలో, మాయావరణమునందు వ్యాపించిన బ్రహ్మ ఆ అవ్యక్త స్థితిని బాధించి, ఆ అవ్యక్త స్థితిలో ఉన్నటువంటి, రూపాలను, క్రమక్రమంగా, ముందు సూక్ష్మముగా, బ్రహ్మాండముగా వ్యక్తీకరించి, తరువాత స్థూలముగా పిండాండములుగా, జీవోపాధులుగా, జీవుడిగా, ఈశ్వరుడిగా, జగత్తుగా వ్యక్తం చేసింది. కనుక మాయావరణలో, కుండ లోపల ఉన్నటువంటి, ఆ స్వయం ప్రకాశము యొక్క ప్రకాశము, లోపల, వెలుపల కూడా ఉన్నప్పుడు, లోపలిదేమో సత్యమై, స్వయం ప్రకాశమై,

స్వప్రకాశమై ఉంది. కుండయొక్క వెలుపల ఉన్నటువంటి మహాదీపముయొక్క బాహ్య ప్రకాశము వ్యాపకమై, తమస్సుని, మూల ప్రకృతిని, అవ్యక్తాన్ని వ్యక్తముగా అయ్యే విధముగా చేసింది కాబట్టి, ఆ బాహ్య ప్రకాశము జగత్తుకి, బ్రహ్మాండానికి, పిండాండానికి కారణమే.

అయితే, మాయావరణలోనే ఆ కారణం ఉంది కనుక, మాయ అంటే ఏది లేదో దానిని చూపిస్తుంది కనుక, బ్రహ్మ పరోక్షముయొక్క కారణత్వము మాయాకల్పితమే కనుక, నిజానికి బ్రహ్మకు కారణము లేదు. అయితే సాధకులు, మాయావరణలో ఉన్నవాళ్ళు, మాయని దాటేదాకా, ఆ సర్వకారణమైనటువంటి బ్రహ్మని, ఆ బ్రహ్మ కారణంగా ఉన్నటువంటి అసద్రూప జగత్తుని, సద్రూప బ్రహ్మని ఒకటిగా చూడాలి. అప్పుడు జగత్తు కూడా బ్రహ్మమే. చూడబడే ఈ నామరూప ప్రపంచముగా ఉన్నటువంటి, జగత్తు కూడా సర్వమూ బ్రహ్మమే. సర్వం ఖల్విదం బ్రహ్మ.

ఈ చూడబడేదంతా బ్రహ్మమే. చిత్ జడములయందు, జడమును విస్మరించి, త్రిగుణాత్మక సృష్టియందు గుణములను విస్మరించి, సర్వవ్యాపక చైతన్యాన్ని మాత్రమే దర్శిస్తే, అప్పుడు సర్వం ఖల్విదం బ్రహ్మ. సర్వవ్యాపక చైతన్యమును దర్శించకుండా, గుణమయంగా, నామరూపమయంగా, అవిద్యాదోషముతో, విషయాసక్తితో చూచినప్పుడు ప్రపంచము నిజము. విషయాసక్తి లేకుండా, గుణములు విస్మరించి, నామరూపములు చూడకుండా, వాటికి ఆధారభూతమైన, కేవల బ్రహ్మచైతన్యాన్ని మాత్రమే చూడగలిగితే, అది సర్వం ఖల్విదం బ్రహ్మ. ఇలా చూడడం అనేది జ్ఞాన చక్షువుకే సాధ్యము. కాని అభ్యాసం చేస్తే, విషయవాసనలు కొంతకాలానికి క్షయమైపోయి, నామరూప ప్రపంచం తోచటమే ఉండదు, ఇంకా తోస్తూ ఉంటే ఆ ప్రపంచాన్ని మిథ్యాభావంతో చూడాల్సిన అగత్యం ఏర్పడుతుంది. ఒకవేళ కనబడితే, దానికి అసంగంగా ఉండడం అనేటటువంటి సాధన చేయాల్సి వస్తుంది. అసంగముగా, కేవల సాక్షిగా ఉండే సాధన చేయాల్సి వస్తుంది. పరబ్రహ్మ స్వరూప నిర్ణయం అయినప్పటికి, ఈ ప్రపంచము తోస్తూనే ఉంది, పోవటం లేదు. అప్పుడు ఏమిటి గత్యంతరం? జగత్తును కూడా బ్రహ్మగా చూచేటటువంటి దృష్టి ఉంటే సర్వం ఖల్విదం బ్రహ్మ. ఆ విధంగానే ప్రపంచాన్ని చూసే దృష్టి ఏర్పడాలి. మంచివారికి ప్రపంచమంతా మంచిగా కనిపిస్తుంది. చెడ్డవారికి ప్రపంచమంతా అవినీతిమయంగా కనబడుతుంది. దైవస్వరూపుడికి ప్రపంచమంతా దైవస్వరూపముగా కనబడుతుంది. బ్రహ్మచైతన్యానుభవంలో ఉన్నవాడికి, జగత్తు అంతా బ్రహ్మచైతన్య రూపముగా కనబడుతుంది. దీనికి మనము అభ్యాసం చేయవచ్చును. అసాధ్యమేమీ కాదు.

స్థూల శరీరానికి ఫోటో తీస్తే, నామరూపాలు, రంగులు, ఆకర్షణ ఉంటాయి. అదే సూక్ష్మ రూపానికి తీస్తే, ఒక చిన్న వెలుగు అనేటటువంటిది పడుతుంది. ఎక్స్‌రే ఫోటో తీస్తే, ఎముకలు మాత్రమే పడుతాయి. స్కానింగ్ తీస్తే మాంసము ముద్ద కనిపిస్తుంది. మామూలు కెమేరా అయితే, రంగురంగులుగా అందంగా, అలంకారంగా పడుతుంది. కిర్లియన్ ఫోటో తీస్తే, తేజోరూపం కనబడుతుంది. జ్ఞాన చక్షువు అనే కెమేరాతో చూస్తే, ఇవన్నీ కనబడకుండా, అంతటా ఆత్మే ఆత్మమయంగా కనబడుతుంది. ఇదీ జ్ఞాననేత్రంతో చూసే దృష్టి. ఆ దృష్టితో ఉన్నవాళ్ళే, సర్వం ఖల్విదం బ్రహ్మగా చూడగలుగుతారు. ఇది సాధ్యమే. మామూలు కెమేరాకి, రంగురంగులు కనపడ్డట్టుగా, కిర్లియన్ ఫోటోగ్రాఫ్‌కి, సూక్ష్మతేజమే కనపడినట్లుగా, ఋషులు భూత, భవిష్యత్, వర్తమాన కాలాలు కారణ, మహాకారణ శరీరంలో ఉండే వాసన రూపంలో ఉన్నదానిని దర్శిస్తున్నట్లుగా, జ్ఞాన చక్షువుతో ఉన్నవారు, అంతటా ఆత్మచైతన్యాన్నే దర్శిస్తారు. ఎందెందులో ఏమేమి ఉన్నాయో అవన్నీ మాత్రం కనబడవు.

ఒకవేళ కనబడితే అవన్నీ నేనే అన్నప్పుడేమో విభూతి స్వరూపము. వాటిన్నటిలో నేను ఉన్నాను అనేది సర్వాత్మభావము. వీటన్నటిని నేను చైతన్య స్వరూపముగా చూస్తున్నాను అనంటే, **సర్వం ఖల్విదం బ్రహ్మ**. అనేక మిఠాయిలు ఉన్నప్పుడు, మిఠాయిని కాకుండా, అందులో ఉన్నది పంచదార మాత్రమే అని చూచినప్పుడు, సర్వం ఖల్విదం బ్రహ్మ. పంచదార చిలకలు, నెమళ్ళు, బాతులు, కుందేళ్ళు, ఏనుగులు అన్నీ పంచదారతో చేసిన బొమ్మలు ఉన్నాయి. చిన్నపిల్లవాడికి, ఆ బొమ్మల రంగులు, సైజులు, ఆకారాలు కావాలి. పెద్దవారికి అది తినేపదార్థం. తీయగ ఉంటుంది అని తెలిసినటువంటి పెద్దపిల్లవాడు బొమ్మ బాగుండక పోయినాసరే ఏనుగును తీసుకుని తింటాడు. చిన్నపిల్లవాడేమో అందంగా ఉన్నటువంటి, చిన్న చిలకను తీసుకుని తింటాడు. ఈ పెద్దవాడి దృష్టి ఏమిటి? అంతా పంచదారేగా అని. చిన్నపిల్లవాడి దృష్టికి పంచదార కనబడడం లేదు. నామరూపాలు కనబడుతున్నాయి. కాసేపు ఆడుకుని, ఆడుకుని ఎప్పుడో తింటాడు. పెద్దవాడు వెంటనే తింటాడు, చూస్తూ ఆనందించడు. అలాగే సర్వం ఖల్విదం బ్రహ్మ అనేవాడు, వెంటనే స్వానుభవంలోకి వెళ్తాడు. నామరూప జగత్తు కనబడుతున్నప్పటికీ, వాటిని చైతన్యము యొక్క వికారాలుగా చూస్తాడు. ఆ పరమాత్మ యొక్క విభూతిగా చూస్తాడు. ఇన్ని రకాలుగా కనపడింది అంతాకూడా, ఆ పరమాత్మే కదా అని చూస్తాడు. ఇదే జ్ఞాననేత్రంతో చూసే దృష్టి. ఇదే సాధకులు అవలంబించవలసినది.

ఆ రకంగా అంతటా ఆ బ్రహ్మస్వరూపమే కనబడితే, 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని శంకరాచార్యులు పూరించారు. ఎందుకు పూరించారు? సత్ అసత్, జగత్తు, బ్రహ్మము, ప్రకాశము. ఇవన్నీ దగ్గర దగ్గర పెట్టుకుని, దేనివల్ల ఏది ఉంది? దేని కారణంగా ఏది ఉంది? అప్పుడు కారణం ఉందా? లేదా? అని మొత్తం చర్చ చేసి, వస్తు నిర్ణయం చేసిన తరువాత, సాధకులకి ఇన్ని రకాల ఉపాయాలు కూడా, అక్కడ అందించారు. కొన్ని మహావాక్యాలు వస్తు నిర్ణయం చేస్తాయి. కొన్ని మహావాక్యాలు ఉపాయంగా నిన్ను తరింపచేసేట్లుగా ఉంటాయి. నిన్ను భ్రాంతినుంచి విడుదల చేసేట్లుగా ఉంటాయి. జగత్తు కూడా బ్రహ్మమే అనేది తప్పు. జగత్తు మిథ్య, బ్రహ్మ సత్యం – అదే రైట్. మరి ఆ జగత్తును కూడా బ్రహ్మంగా చూడమంటున్నారేమిటి? ఇది ఉపాయము. జ్ఞాన దృష్టితో జగత్తుని, అన్ని ఆభరణాలలో బంగారమే ఉన్నదన్నట్లుగా, అన్ని పంచదార బొమ్మలలో పంచదారే ఉన్నదన్నట్లుగా, పంచభూతాత్మకమైనటువంటి, గుణమయమైనటువంటి, త్రిగుణాత్మకమైనటు వంటి, ఈ ప్రపంచంలో సర్వము, ఆ బ్రహ్మచైతన్యముతోనే, తయారైందని, దాని మూల పదార్థము, దానిలో వ్యాపకమైన పదార్థము, ఆభరణాలలో బంగారమే ఎలా ఉందో, వీటి అన్నింటిలో, ఈ బ్రహ్మమే, చైతన్యమే, బ్రహ్మ ప్రకాశమే ఉన్నది. అనే దృష్టితో చూస్తే, **'సర్వం ఖల్విదం బ్రహ్మ'**.

వాస్తవముగా మాయ బ్రహ్మము ఈ రెండింటికి సంగతియే లేదు. సంగతి అంటే ఏమిటి? సాంగత్యము అంటే స్నేహం. ఈ రెండింటికిని స్నేహం గాని, సాంగత్యం గాని, సంబంధం కాని లేదు. ఏలయన కూటస్థ సత్యము ఎప్పుడు ఛాద్యము కాదు. ఛేదించటం అంటే రెండు ముక్కలు చేయడం. ఛాద్యము అంటే ఖండములు కాదు. అలాగే మార్పు చెందదు. మాయ సత్ పదార్థం కాదు. దృశ్యమును కలిగించునది మిథ్యాజ్ఞానం మాత్రమే. కొన్ని వాస్తవాలు ఆ మూలస్థితిలో బ్రహ్మనుంచి సృష్టి వచ్చిందా బ్రహ్మ బ్రహ్మగానే నిర్వికారంగా శాశ్వతంగా ఉన్నప్పుడు సృష్టికి బ్రహ్మకి సంబంధం ఉందా లేదా అనే చర్చ ఇక్కడ చెప్తున్నాడు. మాయ అంటే 'యా' ఏది, 'మా' లేదో 'స' ఉన్నది అని మాయ యొక్క నిర్వచనము. 'యామాస' మాయ. 'యామాస' అంటే ఏది లేదో అది ఉన్నట్లుగా ఉన్నదో అలా ఉన్నట్లుగా ఉండటానికి కారణమైనది మాయ.

మాయ మనం అనుకొన్నట్లుగా గారడీ అని ఇంద్రజాలమని అనుకోవచ్చు. ఇంద్రజాలంలో కూడా అదే జరుగుతుందిగా. **మాయావీవ విజృంభయత్యపి.** ఈ మాయ ఇంద్రజాలమువలె విజృంభిస్తూ వున్నది. ఏమిటట? దేశ కాల కలన, దేశము కాలము కలన అంటే ఉండుట ఉనికి. ఉన్నాను అనేటువంటి ఉనికి స్ఫురణ. తనగురించి తనకు కలిగినటువంటి సంకల్పం. తాను ఉన్నాను అనేటువంటి తన ఉనికి స్ఫురణ మాత్రము. ఉన్నదాన్ని కలన అంటారు. గాఢ నిద్రలో కలన లేదు. నకలన. స్వప్న అవస్థలోను, జాగ్రత అవస్థలోను కలన, సుషుప్తి అవస్థలో నకలన. ఉండుట అనేటువంటి అనుభూతి ఉంటే అది కలన. ఆ అనుభూతి లేకపోతే నకలన. బ్రహ్మము అనేటటువంటి ఉండుట కూడా అవ్యక్తం కనుక అది నకలన. లేకుండుట నకలన మళ్ళీ ఉండుట అనేటువంటి స్ఫురణ లేకుండా ఉన్నటువంటి బ్రహ్మయందు స్ఫురణమే 'ఎరుక' అంటే ఎరుక లేకుండుటయే నిజమైన బ్రహ్మ. ఎరుక లేకపోవడానికి 'బయలని' పేరు. బయలే బ్రహ్మ. అంటే కలనా అంటే ఉనికి తోచుట. ఎవరిలో? బ్రహ్మలోనే! మొదట్లో బ్రహ్మమే ఉన్నాడు. ఆ బ్రహ్మకి ఉనికి తోచలేదు. తరువాత ఉనికి తోచడమే కలన. బ్రహ్మకి తాను ఉండుట తోచింది. దానితోపాటు ఎక్కడ ఉండుట? అప్పుడు ఆవరణ తోచింది. అంతకుముందు తోచలేదు. ఇప్పుడు తోచిందిగా! తోచనప్పుడు కాలమే లేదు. తోస్తుంటే ఏమైంది? వర్తమానం వచ్చింది. ఎప్పట్నుంచి తోస్తుందీ? కొలత వచ్చింది. ఆ కొలత పేరే 'కాలం'. ముందు 'కలన'. తరువాత దేశము తరువాత కాలము.

ముందు ఆలోచన వచ్చింది. ఆలోచన కొనసాగుతూ ఉంది. ఎంతసేపు కొనసాగిస్తూ ఉన్నదీ అనేటువంటి కాలము, ఆలోచన రావడానికి ఒకచోటు కావాలిగా? ఆలోచన ఉండటానికి ఒకచోటు కావాలిగా? ఎప్పుడైనా ఎవరికైనా ఆ ఉండుట అనేది ఎప్పుడైతే వచ్చిందో దాంతోపాటే ఆ ఉన్నదానికి చోటూ వచ్చింది. బ్రహ్మ సంకల్పంలో సర్వమూ ఉత్పత్తి అయ్యింది. సర్వమూ ఉండటానికి చోటుయే 'శూన్యం'. సర్వమూ లేనపుడు శూన్యం అన్నాము. సర్వమూ ఉన్నప్పుడేమో శూన్యాన్ని మరచి సర్వం అంటున్నాము. గాని సర్వం అక్కడ ఉండుటకు ఆస్కారం ఇచ్చినటువంటిది అక్కడ ముందుగా లేకపోతే సర్వం ఎక్కడ ఉంటుంది. ఈ అలమరా ఖాళీగా వుంది. అందులో నేను పుస్తకాలు పెట్టాను. ఖాళీ లేనిదే పుస్తకాలు ఎట్లా పెట్టాను? పుస్తకాలు పెట్టేసరికి ఖాళీ ఏమైంది? ఖాళీ వుంది. పుస్తకాలు ఉన్నాయి. అలాగే సర్వమూ ఉంది. శూన్యమూ ఉంది. శూన్యమే సర్వం యొక్క ఉనికికి ఆస్కారమిచ్చింది, అవకాశమిచ్చింది. కనుక సర్వానికి అవకాశం ఇచ్చింది కాబట్టి ఏదైతే అవకాశం ఇస్తుందో అది ఆకాశం అన్నారు.

ఈ ఆకాశలు ఎన్ని ఉన్నాయి? మీరు మనసుపెట్టి ఆలోచిస్తున్నారు. మీ ఆలోచనలో సప్త సముద్రాలు దాటి ఎక్కడెక్కడో తిరిగి వచ్చారు. ఆలోచనతో తిరిగారు. కాని నిజంగా తిరగలేదుగా! ఆలోచనలు తిరగడానికి ఉన్నటువంటి ఖాళీ ఎక్కడిది? ఖాళీ లేకుండానే తిరిగారా? మీ ఆలోచనలు లేకపోతే మీ కలలో ఎక్కడికెక్కడో తిరిగారుగా! ఎక్కడికెక్కడికో రెక్కలట్టుకు తిరిగారుగా! అంటే దేశం ఉంది. ఎక్కడికెక్కడికో తిరిగారు అంటే ఆచోటు శూన్యంగా ఉండి తరువాత ఆ తిరగడానికి అనుకూలంగా అవకాశం ఇచ్చింది. కనుక అక్కడ ఉంది. మేల్కొంటే అది నిజమేనా? లేదు. ఆలోచిస్తే ఊహిస్తే కలగంటే ఉంది. ఆ ఉండటానికి ఒక చోటుంది. ఆ చోటు పేరు ఆకాశం. అవకాశం కాబట్టి ఆకాశమనేటటువంటి పేరు వచ్చింది. మానసాకాశము అంటే మనసుయొక్క ఆలోచనలు ఉండటానికి అవకాశమిచ్చిన చోటు మానసాకాశము. భౌతికముగా కనబడే ఆకాశము కాదండీ! భౌతికంగా కనబడే ఆకాశం భూతాకాశము. సూర్యునినుండి సూర్యుని చుట్టూ ఉండే గ్రహాలన్నీ ఈ గోళాలన్నీ ఉండటానికి అవకాశం ఇచ్చిన దానిని భూతాకాశం అని అంటాము. మనసు ఆలోచిస్తున్నప్పుడు అణుమాత్రంగా ఉన్న మనసు ఎంత విశాలమైనటువంటి చోటుని ఆ కలగనేటువంటి సమయాన్ని, కాలాన్ని కలలో నామరూప వస్తువుల్ని, కొన్ని అనుభవాల్ని పొందుతుంది. వీటన్నిటికి అవకాశం ఇచ్చే ఆకాశం మానసాకాశము. చిత్తవృత్తులు రావడానికి అవకాశం ఇచ్చింది. చిత్తాకాశము, సృష్టి, స్థితి, లయ కారకులు వారి చైతన్యంతోసహా ఆ చైతన్యం యొక్క కార్యక్రమము చేయడానికి చిద్విలాసం చేయటానికి ఒకచోటు ఉంది. ఆ చోటు పేరు చిదాకాశము. ఆ ఈశ్వరునియొక్క పరమాత్మ యొక్క చిద్విలాసానికి అవకాశం ఇచ్చినటువంటిది ఏది? చిదాకాశము. మాయ, మాయ కారణంచేత నీకు అవకాశం ఇచ్చిందేది? దహరాకాశము. కేవలాత్మ అనేటటువంటి అపరోక్షానుభూతి పొందడానికి అవకాశం ఇచ్చింది ఏది? కేవలాకాశము. నామరూప జగత్ అంతా ఉండటానికి అనేకంగా నానాత్మకంగా కలిసిగాని, విడిగా గాని అవయవాలుగా ఉండేటటువంటిది ఏదయితే ఉందో దానికి అవ్యక్త రూపమే 'నిరవయవం'. ఈ బ్రహ్మాండ పిండాండాలు నానాత్వంగా అనేకత్వంగా, అనేక బేధాలతో ఉండటానికి ముందు అవ్యక్తంలో ఒక ముద్దగా, ఘనంగా, నిరవయముగా ఉన్నది. ఈ నిరవయంగా ఉన్నది అంటున్నాము కదా. ఈ ఉండుటకు అవకాశము ఇచ్చింది ఏది? నిరవయవాకాశము. ఇట్లా ఆకాశలు ఐదే చెప్తాం కాని ఎన్ని అయినా చెప్పుకోవచ్చు.

తీరాచూస్తే ఇవన్నీ మాయా కల్పితము. ఏవి లేవో అవి ఉన్నట్లు కనబడ్డాయి. తాడుయందుపాము తోచినట్లుగా మాయ కారణంగా తాడే పాముగా మారింది. ఎప్పుడు పాము కనబడుతుందో అప్పుడు అసలైన తాడు కనబడట్లేదు. అసలైన తాడే కూటస్థం. కూటస్థం అంటే ఏమిటి? వ్యాపకత్వం లేకుండా తాను తానుగా కదలక మెదలక మనోవ్యాపారం లేకుండా చిత్తవృత్తులు లేకుండా ఆత్మ నిష్ఠలో, లేక బ్రహ్మ నిష్ఠలో ఉండటం కూటస్థం. కూటస్థం అంటే బ్రహ్మనిష్ఠ. బ్రహ్మనిష్ఠలో ఏ అనుభూతి అయితే ఉందో అది తప్ప ఇంకోటి ఏదీ లేనేలేదు. అది కూటస్థం. మాయకి బ్రహ్మకి సాంగత్యం లేదు, సంబంధ లేదు. తాడుకి, పాముకి సంబంధం లేదు అంటే అర్థం ఏమిటి? తాడు పాముని పుట్టించిందా? పుట్టించిందే అనుకో. లేని పాము ఉన్నట్లుగా చూపిస్తుంది. లేనిదాన్ని ఉన్నట్లుగా చూపిస్తే అది భ్రాంతి కదా! భ్రాంతిలో ఉన్నవన్నీ అసత్యం కదా! అసత్యం అంటే మార్పుచెంది, కాసేపు ఉండిపోయేవే కదా! పైకి ఎలా ఉన్నా ఎంత బాధిస్తున్నప్పటికి కూడా దాన్ని తాత్కాలిక సత్యం అంటారు. అయినాసరే లేనిదే ఉన్నట్లు కల్పించి బాధిస్తున్నది. బాధ కారణంగా బాధిస్తున్న కారణంగా అది తాత్కాలిక సత్యముగా ఉన్నది. బాధ కారణంగా బాధిస్తున్న సమయంలో నిజంగానే బాధిస్తున్నది. కాబట్టి అది వ్యావహారిక సత్యం. కాని పరబ్రహ్మ ఈ కల్పిత వస్తువులచేత బాధింపబడడు. పరబ్రహ్మ నిష్ఠలో ఉన్న శిష్యుడు పరబ్రహ్మమే తానై యున్నవాడు సృష్టికి పూర్వం ఉన్నటువంటి పరబ్రహ్మ మాత్రమే. దానికీ మాయకీ ఎటువంటి సంబంధము లేదు. తరువాతైనా ఉందా? తాడుకి పాముకి ఎలా సంబంధం లేదో తరువాత కూడా లేదు.

బ్రహ్మ జ్ఞానిగా ఉన్నటువంటి తాను తానైనటువంటి స్వరూపమందు స్వరూప నిష్ఠలో నిత్య వర్తమానములో శాశ్వతంగా ఉంటుంది. మాయ కల్పించేవన్నీ కూడా దానియందు లేనేలేవు. దాని ఊహలో లేవు. దాని అనుభవంలో లేవు. ఆ మాయాకల్పిత వస్తువులచేత ఆ పరబ్రహ్మకి బాధ కూడా లేదు. ఈ తాత్కిలిక సత్యం పైన ఏదైతే చెప్పామో ఆ కేవల పరబ్రహ్మయందు పరబ్రహ్మమే ఉన్నాడు. అంతకుమించి అన్యముగా ఏమీలేదు. అందువల్ల బ్రహ్మకి మాయకి సంబంధము లేదు. అయితే మాయయే బ్రహ్మతో సంబంధం పెట్టుకొన్నట్లుగా ఏక దేశీయంగా ఒక వంతు బ్రహ్మయందు మాయచేరి ఆ బ్రహ్మను ఆశ్రయించి మాయ మాయ పనులు చేస్తూవుంటే ఆశ్రయించబడ్డ ఒకవంతు బ్రహ్మ నిర్గుణం అయినప్పటికీ, మాయయే ఆ బ్రహ్మను సగుణంగా చూపించింది. ఈ సగుణ బ్రహ్మే సర్వకారణంగా, సర్వాధారముగా మన విచారణలో తేలుతుంది. కార్యకారణంగా ఉంటుంది. ఆలోచించినప్పుడు ఒక తర్కాన్ని బట్టి తేలుతుంది. కొన్ని రుజువుల్ని బట్టి తేలుతుంది. పెద్దల వాక్యాలబట్టి తేలుతుంది.

కొంతమంది తపస్సు చేయడంవల్ల వారి తపస్సులో కూడా ఆ కారణ బ్రహ్మ ఎవరు? అని తపస్సు చేశారు. అప్పుడు ఆ కారణం అయినటువంటి బ్రహ్మ ఆ తపోదర్శనంగా అపౌరుషేయంగా తెలియబడింది. ఎప్పుడయితే శబ్ద ప్రమాణంగా, అపౌరుషేయంగా తెలియబడిందో, తెలియబడుట అనేదానికి వేదం అని పేరు. శబ్ద ప్రమాణంగా తెలియబడింది కాబట్టి, శ్రుతి అని పేరు. ఆ వేదాలు, శ్రుతులు, అపౌరుషయము ఎవరూ చెప్పలేదు. వేదాలలో వినబడ్డవి, కనబడ్డవి ఉన్నాయి. వినబడ్డవి, కనబడ్డవి అంటే శ్రోత్రేంద్రియములు, చక్షురింద్రియములకు కాదు. శబ్ద, స్పర్శ, రూప, రస గంధాలను అనుభవించేటువంటి పంచ జ్ఞానేంద్రియాలకు సంబంధించినటువంటి చక్షురింద్రియం, శ్రోత్రేందియములు కావు. ఈ కనబడటం దర్శనస్థితి. దర్శనంగా కనబడాలి. ఈ దర్శనం అనే పేరేమిటంటే నీయొక్క నీకంటే ఉన్నతమైనటువంటి స్థితి మాయా ప్రపంచానికి సంబంధము లేకుండా ఉన్న స్థితిలో కొన్ని అనుభవాలు రావడమే దర్శనం. దర్శన పద్ధతిగా తెలుస్తుంది.

మాయకి బ్రహ్మకి సంబంధం లేదు. ఎందుకంటే ఆ బ్రహ్మ అచలము, పరిపూర్ణము, కూటస్థుడు, కదలనివాడు, పరిపూర్ణము అంటే ఏమిటి? ఆ పరిపూర్ణత్వంలో పరిపూర్ణమైనటువంటి స్థితిలో అంతకంటే మించిన ఆనందం లేదు. అంతకంటే మించిన తృప్తి లేదు. ఆ తృప్తి నిత్యవర్తమానంగా ఎప్పుడూ ఉంటుంది. ఆ తృప్తికి పెరుగుదల, తరుగుదల లేదు. కొంత అసంతృప్తి వస్తే కదులుతాడు. కదలడానికి బ్రహ్మలో చోటు ఎక్కడ ఉంది? దేశ, కాలము, కలనాకంటే ముందు ఉన్నటువంటి బ్రహ్మకి కదలడానికి చోటు ఎక్కడ ఉంది? సృష్టిలో దేశము, కాలము వచ్చాక కాలములోను, దేశములోను కదులుతున్నాడు. కాలములో అంటే ఒకప్పుడు అవతార పురుషుడిగా శరీరం ధరించి కనబడుతారు. ఒకసారి శరీరం లేకుండా ఉంటాడు. ఒకసారి సర్వవ్యాపక శుద్ధచైతన్యంగా పరమాత్మగా ఉంటాడు. ప్రళయానంతరమూ ఆ వ్యాపకత్వమును మిరమించినటువంటి స్థితిలో ఘనమై కూటస్థమై ఉంటాడు. అవ్యాకృతుడై ఉంటాడు. ఇక్కడ కూటస్థమంటే సృష్టికిపూర్వం ఉన్న బ్రహ్మ. మాయకు సంబంధంలేని బ్రహ్మ. మాయ ఉన్నప్పటికీ మాయతో సంబంధంలేని బ్రహ్మ. మాయ మాయాకార్యం చేయటానికి ముందున్నటువంటి బ్రహ్మ. ఆ బ్రహ్మనే మనం 'తత్' అంటున్నాము.

ఆ బ్రహ్మని మాయా ఆవరణలోనే పట్టుకొని అనుభవం పొందేటటువంటిది పరమాత్మ. ఆ పరమాత్మ అనేటటువంటి 'సత్‌చిత్ ఆనందం' అనేటుటవంటి ఏ అనుభవమయితే మనం పొందామో అది 'త్వం' అంటున్నాము. మాయ ఆవరణలో పరమాత్మ అనుభవం, నిరావరణయందు పరబ్రహ్మ ఒక్కటే అని వాక్యం చెప్తుంది. అయితే వాచ్యార్థం విడచిపెట్టి లక్ష్యార్థం పట్టుకోవాలి. మాయావరణలో కల్పించినవన్నీ వాచ్యార్థంగా విడచిపెట్టి మాయావరణలో ఏ శుద్ధ చైతన్యమైతే ఉన్నదో అదే నిరావరణమందు వ్యాపకత్వం లేకుండా ఘనమై యున్నది. నిజంగా ఆ పరబ్రహ్మ ఎప్పుడూ ఘనమయ్యే ఉన్నాడు. కనుక రెండూ సమానమే. రెంటికీ భేదం లేదు. కూటస్థ సత్యవస్తువు నిర్వికల్పమే. మార్పు చెందదు. నిర్వికారమే, వికారం చెందదు.

వేదాంతం యొక్క సిద్ధాంతమునందు **ఏకమేవా అద్వయం** బ్రహ్మకు మాయ లేనిది. రెండోది ఉన్నది అంటే దోషం వస్తుంది. అందువలన మాయ సత్ పదార్థం కాదు అన్నప్పుడు అది లేని మాయ. లేని మాయ కాబట్టి దాన్ని రెండు అనటానికి వీల్లేదు అప్పుడు సత్యం ఒక్కటే అయ్యుంటుంది. ఆ సత్యం పరబ్రహ్మమే. అది గుర్తు చేయడానికి మాయ సత్ పదార్థం కాదు అని మళ్ళీ చెప్తున్నాడు. మాయతో సంబంధం ఉంది. అంటే రెండు సత్ పదార్థాలు ఉండాలి. అది తప్పు. ఎందుకంటే ఏకం సత్ అన్నారు. ఒకదానికొకటి సంబంధపడిలేవు. ఆ సత్ పదార్థం ఒక్కటీ బ్రహ్మ. అలానే అసత్ పదార్థం అంటలేదు. లేనిమాయ అంటున్నాము. లేని మాయ కాబట్టి ఉన్న బ్రహ్మతో సంబంధం లేదు. ఉన్న బ్రహ్మకు లేని మాయతో సంబంధం లేదు గాని, లేని మాయకు ఉన్న బ్రహ్మతో సంబంధం ఉంది. లేని మాయ బ్రహ్మమును పట్టుకుంది గాని లేనిది ఎలా పట్టుకొంటుంది? మాయ అంటే ఏమిటి? ఏది లేదో అది ఉన్నట్లుగా ఉన్నది. కనుక లేని మాయ ఉన్నట్లుగా ఉన్నదే పట్టుకొంటోంది. ఇక్కడే ఇలా ఆలోచిస్తే బ్రహ్మకి మాయకి సంబంధం లేదని తేల్చేసుకొంటే అప్పుడు జగత్ ఏమిటీ? **'బ్రహ్మ సత్యం జగత్ మిథ్య'** మూలం దగ్గర విచారణచేసి దీన్ని గట్టిగా అవగాహన చేసుకోవాలి. మాయ సత్ పదార్థం కాదు. కనుక దృశ్యము కలిగించునది. మిథ్యా జ్ఞానము మాత్రమే. చివరికి ఒక ఖచ్చితమైన నిర్ణయాన్ని ప్రకటిస్తున్నాడు. కేవల దృక్‌గా ఉన్న, కేవల ఆత్మగా ఉన్న, కూటస్థంగా ఉన్న నిర్వికల్పంగా ఉన్న బ్రహ్మకి మాయకి సంబంధం లేకుండా ఉన్నది.

పరబ్రహ్మమొక్కటే, పరబ్రహ్మ కన్నా అన్యము లేదు అన్నప్పుడు ఆ బ్రహ్మ విషయం కాదు అని ముందే చెప్పారు. బ్రహ్మని విషయీకరించి ఎవరూపట్టుకోలేరు అన్నాడు. అమానసగోచరం, అనిర్వచనీయము. అట్టి స్థితిలో అచలమై పరిపూర్ణమై, కూటస్థమై, నిర్వికల్పమై తాను తప్ప అన్యము లేక అద్వయమై ఉన్నటువంటి పరబ్రహ్మయందు మాయ అనేటటువంటిది రెండోది ఉంటుందా? ఉండదు. కనుక ఆ బ్రహ్మ కేవల దృక్. దృశ్యం లేని దృక్. మళ్ళీ ఆ దృక్ అనే దానిని ఎలా నిర్ణయించాలి?

రూపము కన్నుకి దృశ్యము. కన్ను దృక్. కన్ను మనసుకి దృశ్యము. మనసు దృక్. మనసు నేనుకు దృశ్యము. నేను దృక్. నేను కూటస్థ ఆత్మకి దృశ్యము. కూటస్థ ఆత్మ దృక్. కూటస్థ ఆత్మ అనేది అంతఃకరణ ప్రతిబింబముగా ఉన్నది కనుక అది దృశ్యము. బింబమైనటువంటి పరమాత్మ దృక్. బింబమైన పరమాత్మకి మాయా ఆవరణ అనేటువంటి దోషం వచ్చేసరికి అది దృశ్యం. నిరావరణ బ్రహ్మకు మాయ ఆవరణ అనేటువంటి దృశ్యము. నిరావరణ బ్రహ్మమేమో దృశ్యంతో సంబంధం లేకుండా తనకు తానే స్వతస్సిద్ధమైనటువంటి బ్రహ్మ దగ్గర బ్రహ్మం కంటే అన్యము లేదు. అద్వైతంగా సిద్ధించినది. సిద్ధ వస్తువుగా అద్వైతంగా శాశ్వతంగా తనకంటే అన్యము లేకుండా ఉన్నటువంటి బ్రహ్మయందు అటువంటి బ్రహ్మ నిష్ఠలో అపరోక్షంగా ఉంటుంది తప్ప తనకు అన్యము తోచదు. అన్యము తోస్తేనే దృశ్యము కనుక అట్టి బ్రహ్మ నిష్ఠలో అన్యము లేదు. అన్యము అనేదంతా దృశ్యము లేదు కనుక బ్రహ్మ తనకుతాను కూడా దృశ్యము కాదు. అందుకని దృశ్యము కలిగించినదంతా మిథ్యాజ్ఞానము మాత్రమే. పాము కనబడ్డానికి మిథ్యా జ్ఞానమే కారణం కాని తాడు కారణం కాదు. ఈ దృశ్యము ఏర్పడటానికి మిథ్యాజ్ఞానానికి మూల కారణం అయిన మాయ కారణం. కనుక పరబ్రహ్మ కారణం కాదు.

అదేమిటి? అన్నిటికి సర్వకారణం బ్రహ్మ అని చెప్పాం కదా? ఇక్కడ విడగొట్టుకుంటున్నాము సగుణానికి, నిర్గుణానికి ఏ పరిస్థితులలో సగుణమన్నాము? సగుణంగా ఉన్నప్పటికీ వాడు నిర్గుణుడే కదా! సగుణం నిర్గుణం రెండు ఉన్నా నిర్గుణమే సత్యము. సగుణం మాయ. అందుకని దృశ్యాన్ని మొత్తాన్ని విడగొట్టుకొని అంటే దేశము కాలము కలన కూడా దృశ్యమే. 'నకలన'గా దేశ కాలానికి అతీతంగా తాను తానైన ఒక అవ్యక్తరూపం ఏదైతే ఉన్నదో, వ్యక్తం అయిన అనుభవాలు దానియందు ఏవీ లేవో, ఏ దృశ్యంచేత అది బాధింపబడో, ఏ దృశ్యానికి కారణంగా లేదో, వికారం పొందక వికారాలను చేయించక కూటస్థంగానే ఉంటాడో అదే పరబ్రహ్మ.

సాధనలో కూడా అట్టి స్థితి సంపాదిస్తే మనమే ఆ పరబ్రహ్మ. ఈ మిథ్యా జ్ఞానము మాయా కల్పితమైనా ఆ సంగతి తెలిసిన ఈశ్వరుడు మాయకి వశుడు కాదు. అవిద్యా దోషం ఉన్నటువంటి జీవుడికి మాత్రమే ఈ మిథ్యా జ్ఞానం సత్యం అని అనిపిస్తుంది. ఇది మిథ్యా జ్ఞానం కదా అనేటువంటి ఆలోచన జీవుడికి రాదు. ఎందుకని? అవిద్యా దోషంతో మాయకు వశుడై ఉన్నాడు కనుక. అవిద్యా దోషం పోతే మాయకి వశం కాని స్థితిలో ఇది మిథ్యకదా! ఇది మాయ కదా! ఇది లేనిది కదా! అని కనబడుతున్నప్పటికిని లేనిదనే భావంతో దాన్ని అంటక ముట్టక, దాని గురించి ఆలోచించక ఊహించక, దానిచేత బాధింపబడినప్పటికీ అది బాధ కానేకాదు అనేటువంటి దాంట్లో నిర్ణయమై ఆ నిర్ణయంగానున్నవాడు వీటన్నిటినుంచి విడుదలపొంది, విడుదలై, తాను తానైనటువంటి స్థితిని సముపార్జించి, ఆ స్థితిలో కూటస్థమై నిలుస్తాడు.

ఎప్పుడు అయితే కూటస్థమై అచలమై పరిపూర్ణమై నిలుస్తాడో ఈ బాధించేది కూడా పోతుంది. ఈ మిథ్యా జ్ఞానం వల్ల తయారయినటువంటి పాము వగైరాలు కూడా తనను బాధించవు. కనుక ఇది మిథ్యా జ్ఞానము మాత్రమే అని ఎవరికి చెప్తున్నాడు? అవిద్యా దోషం ఉన్నవాడికి చెబుతున్నాడు. అవిద్యా దోషం ఉన్న జీవుడికి, సత్యం గురించిన జ్ఞానం కలగగానే దృశ్యము ఉండదు. దేశ కాలాలు ఉండవు. సత్ చిత్ ఆనంద రూపంలో ఒక అనుభవంలో శాశ్వతంగా ఉండిపోయే ఆనందం అనేది ఉంటుంది. ఇదియే కలన. చివరకు ఈ కలన కూడా ఉండదు. మాయాకల్పిత ప్రపంచము మాయ ద్వారానే వ్యక్తం అయ్యింది. మాయ కల్పిత ప్రపంచము మాయ ఆవరణయందే ప్రకటించబడింది. ప్రకటితమైనవన్నీ మిథ్యా జ్ఞానము అని అవిద్యా దోషంతో ఉన్నంతకాలము అనుకొన్నవాడు. అవిద్యాదోషం నుంచి బయటపడ్డవాడు మాయకి వశుడు కాడు కాబట్టి ఇవి అన్నీ లేనివి కదా అంటే అన్నీ లేకపోగా ఏది మిగిలి ఉన్నది? ఏది శేషించి ఉన్నది? అని చూస్తే తాను తానై ఉన్నటువంటి పరబ్రహ్మమే శాశ్వతముగా ఉన్నది.

ముందు వస్తు నిర్ణయం చెయ్యండి. తాను తానైనటువంటి పరబ్రహ్మగా ఉంటూనే ఎక్కడ ఉన్నాము? మాయా ఆవరణయందే ఉంటున్నాము. కనుక ఇది లేనిది అని అనుకొన్నప్పటికీ ఆ లేనిది అనే దాంట్లోనే మనం ఉంటున్నాము. అవిద్యా దోషం లేనివాడేమో ఇది కనబడుతున్నప్పటికీ లేనిదే అంటున్నాడు. అదీ తేడా. కనుక లేనిది లేకుండా మాత్రం పోలేదు. లేనిదే ఉంటోంది. లేనిది అనే నిర్ణయంలో చూస్తున్నాడు అవిద్యా దోషం లేనివాడు. అవిద్యాదోషం ఉంటే వాడిపేరు 'జీవుడు'. మిథ్యా భావంతో గట్టి నిర్ణయంతో ఆరూఢమైనట్టివాడు 'ఈశ్వరుడు'. జీవుడు కాదిక. ఎందుకని? ఈశ్వరునికి ఇంకా ఈ కల్పిత ప్రపంచం ఉన్నది? మరి ఈశ్వరుడు ఎప్పుడు బ్రహ్మమౌతాడు? మళ్ళీ ఈశ్వరుణ్ణి కూడా విచారించాలి. అంతా మాయా కల్పితమయినప్పుడు సృష్టి, స్థితి, లయలుగా కనబడేటటువంటి పిండ బ్రహ్మాండాలన్నీ కూడా చరాచర జగత్ అంతా కూడా ఇంకా చెప్పాలంటే జీవుడు, జగత్, ఈశ్వరుడైన తాను కూడా మాయా కల్పితుడే అని ఈశ్వరుడు తెలుసుకోవాలి. ఇదే సూత్రం. **తాను తప్ప అన్యం లేదు అనే సూత్రము.**

మిథ్యా సృష్టికి సృష్టికర్త యేమిటి? మిథ్యా సృష్టిని పోషించటమేమిటి? మిథ్యా సృష్టిని లయించటమేమిటీ? పిల్లలాటలాగ చిన్న చిన్న బొమ్మలు తీసుకొచ్చి పెళ్ళి కూతురిని, పెళ్ళి కొడుకుని పెట్టి, పెళ్ళి చెయ్యటం, వంటలు చెయ్యడం, విందులు చెయ్యటం, అప్పగింతలు బెట్టటం, ఇవన్నీ యేమిటి? పెద్దలకి ఎలా ఉంటుంది ఇది అంతా? పిల్లలాటల పోలికాయెను. ఈ పిల్లలకి అది నిజమే, పెద్దలకు మాత్రం నిజం కాదు. ఉత్తిత్తి పెళ్ళి కాని ఏమీ లేదు. **ఇల్లు బయలయి తెల్లనాయెను**. ఇల్లు అంటే ఒక పరమితత్వం. పరిమితత్వం అంటే ఎరుక. ఎరుకే నిన్ను పరిమితుడ్ని చేసింది. నీవు అనంతుడివి. అనంతంగా ఉన్నటువుంటి బ్రహ్మను ఎరుక పరిమితము చేసింది. జీవుడు, ఈశ్వరుడు కూడా పరిమితులే. శుద్ధ చైతన్య పరమాత్మ సర్వవ్యాపకంగా ఉన్నది మాత్రమే అపరిమితము. దాన్ని అఖండ ఎరుక అన్నాము. అఖండ ఎరుక అనంతమే కాని దాంట్లో ఎరుక మళ్ళీ వ్యాపించటానికి వీలు ఉన్నది. అఖండ ఎరుకను 'నిర్బీజము' చేస్తే అఖండ ఎరుక అనే పేరుపోయి బయలు అనిపేరు వచ్చింది.

అందుకని ఇల్లు బయలయి అంటున్నాము. ఎరుక పోతే బయలే ఉన్నది అని అర్థం. **పిల్లలాటల పోలికాయెను ఇల్లు బయలయి తెల్లవాయెను.** తెల్లదనాయెను అంటే తెలిసిపోయిందని, తెలిసిపోయిందేమిటి? తెలిసింది అని ఆపకుండా, తెలిసి పోయింది అంటున్నాము. తెలుసుకొంటే ఇంకా ఎరుక ఉంటుంది. బయలు ఉన్నదనే ఎరుకే బయలయినదని తెలిసి, ఆ తెలిసిన తెలివి పోయింది. ఆ ఎరిగిన ఎరుక పోయింది. ఎరిగే ఎరుకగా ఉన్న ప్రజ్ఞానం పోయింది. ఆ ప్రజ్ఞానం పోవడమే బయలు. తెలిసిందే అని ఆపకూడదూ, తెలిసిపోయింది అనాలి!

సత్యమును గురించిన జ్ఞానం కలగగానే తాడుయందు పాము ఉన్నదీ అని, తాడు సాక్షాత్కారం కాగానే పాము మిథ్యగా ఉన్నది. ఇదీ జ్ఞానము. తాడు సాక్షాత్కారమైనప్పుడు ఆ సాక్షాత్కార అపరోక్ష అనుభూతితో తాను తానైనటువంటి స్థితిలో కొనసాగుతుండగా అన్యస్థితి తోచదు కాబట్టి అప్పుడు పాము తోచదు. ఇది విజ్ఞానము. తాడును, పాముని చూడటము కాదు నీవే ఆ తాడై యున్నావు. నీవు అదయి ఉన్నావు. నీవు అదయి ఉన్నటువంటి అపరోక్షానుభూతి నీకు కలిగినప్పుడు ఆ అపరోక్షానుభూతిలో నువ్వు నువ్వైనటువంటి స్వతస్సిద్ధమైనటువంటి సచ్చిదానంద ఘనమైనటువంటిది, నిత్య వర్తమానంగా అద్వయంగా కొనసాగుతూ ఉంటే, ఆ నిశ్చల స్థితిలో రెండోది తోచదు కదా! ఈ పాము కూడా తోచదు కదా! అప్పుడు పాము అనేది పోవడమే కాదు, ఒకప్పుడు పాము ఉన్నదీ అనేటుటవంటి జ్ఞాపకముగా గుర్తు, వాసన కూడా ఉండదు. ఒకప్పుడు పాము అనేది ఒకటి ఉంది అనేటువంటి వార్త కూడా ఉండదు. వేదాంతంలో దాన్ని వార్త అంటారు. వార్త అంటే ఒకప్పుడు ఉన్నది అంటే జ్ఞాపకంలో ఉంటుంది. వాసనలో ఉంటుంది. వాసనలో ఉంటే రజోగుణం ఉన్నవాడికి ఆ వాసన క్రియారూపంలోకి వచ్చి ఆ కార్యంలో ఆ కార్యక్రమములో అనుభవానికి వస్తుంది. ఇంత చేస్తే ఏమి లాభం? మళ్ళీ ప్రపంచం అనుభవంలోకి వస్తే మాయలో పడ్డట్లే. అందుకని వార్త కూడా లేదు. పోడిమి ఏమీ లేదు. అంటే అది ఒకటి ఉందని దానియొక్క జాడ ఉండదు. కందార్థాల్లో పోడిమి అంటే జాడ, ఇవన్నీ వస్తాయి. దాని జాడే లేదు. దాని పోడిమే లేదు. దాని వార్తే లేదు. దాని వాసనే లేదు. దాని జ్ఞాపకమే లేదు. దాని గురుతేమీ లేదు. ఎందుకంటున్నాము ఇవన్నీ? ఎరుక సంబంధమే కాబట్టి. అందులో ఏమన్నాసరే అది ఎరుకకి సంబంధించినదే. పరిపూర్ణ బోధగా తెలుసుకుంటే పోతుంది.

సమూలంగా పోవాలి. అందుకే అంటారు పైసా అంత ఎరుకని ఉంచారా, అదే రూపాయంత చేసుకొంటుంది. ఎరుక నిశ్శేషముగా పోవలెను అంటారు. అవిద్య ఉన్నంతకాలమూ జీవుడు ఉంటాడు. ఎందుకంటే జీవుడే అవిద్యా కల్పితుడు. అంతః కరణ ప్రతిబింబుడే, చిదాభాసుడే, నేను నేను అనేవాడే జీవుడు.

కూటస్థుడు అనే పదం జీవుడు దగ్గర చెబుతున్నాము. 24 తత్వాలనుంచి వేరుచేస్తే అలా వేరుచేసి ప్రత్యేకంగా చెప్పినప్పుడు ఆ 25వవాడు కూటస్థ ఆత్మ, కూటస్తుడు అంటున్నాము. ఆ కూటస్థ స్థితి శాశ్వతంగా నిలబడితే, వాడు పరబ్రహ్మమే. పిండాండ పంచీకరణలో కూటస్థుడు, కూటస్థ ఆత్మ. బ్రహ్మాండ పంచీకరణలో ఉన్నటువంటి జ్ఞాతని అక్కడున్న ఇరవయి నాలుగు తత్వాలుగా ఉన్న అధిష్ఠాన దేవతలనుండి వేరుపడ్డటువంటి 25వవాడు కూటస్థ బ్రహ్మ. ఈ కూటస్థం అనేది సాధనలో లభించింది. ఈ కూటస్థుడికి ఇది సహజం అవ్వాలి. ఎప్పుడయితే ఈ కూటస్థ స్థితి సహజం అయ్యి తిరిగి ఇతర తత్వాలతో సంబంధము పెట్టుకోకుండా ఉంటాడో వాడు పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మమైనటువంటి వాడు ఏ కారణము చేతను మాయావరణలోకి జారిపోకుండా ఉంటే అది తిరిగిరాని 'ముక్తి'. సాధన విషయంలో శిష్యుని విషయంలో అది తిరిగిరాని 'ముక్తి'. వస్తు నిర్ణయంలో అది ఎప్పుడూ ఉన్నది ఉన్నట్లుగా ఉన్నది. అది నీవయి వున్నావు. కనుక ఉన్నదున్నట్లుగా ఏదైతే ఉన్నదో అదే నీవై వున్నావు. కనుక అనేక రకాలుగా ఉన్నటువంటి నీవు జీవభావము, కూటస్థ ఆత్మ, కూటస్థ బ్రహ్మ, వీటన్నింటికి అతీతమైనటువంటి కూటస్థము అచలము ఒక్కటే. ఆ పదాన్ని క్రింద వాడటములేదు. కూటస్థ అనే వాడుతున్నాము. పైకి వెళ్ళేసరికి ఈ కూటస్థ అనే పదానికి 'అచలం' అని పేరు పెట్టాము. అచలం అంటే యేమిటి? ఎప్పటికీ చలించనిది. నిశ్చలం అంటే ఏమిటి? చలించబడుతున్న దాన్ని చలించకుండా ఆపితే నిశ్చలం. అచలం అంటే అది ఎప్పటికీ చలించనది ఏనాడు చలించలేదు. అందుకని దానికి అచలం అని పేరు. జీవుడెక్కడున్నాడు? చలిస్తున్నాడు. చలించకుండా నిశ్చలం చేసుకుంటే కూటస్థ ఆత్మ అయ్యాడు. అప్పుడు ఈశ్వరీయ జ్ఞానం వచ్చింది. మళ్ళీ బ్రహ్మాండ పంచీకరణలో చలిస్తున్నాడు. బ్రహ్మాండ పంచీకరణలో దానిలోని చలనాలు నిశ్చలం కాగానే అక్కడ మళ్ళీ కూటస్థుడయ్యాడు. కూటస్థ బ్రహ్మము అన్నారు. మాయాశబలిత బ్రహ్మము, ఎప్పటికీ ఎప్పటికీ కదలని బ్రహ్మము. ఈ రెండింటి మధ్యా విచారణ చేసుకున్నాడు. విచారణ చేసుకొని ఎప్పటికీ కదలనివాడిగా నిశ్చలమయ్యాడు. ఈ నిశ్చల బ్రహ్మమే అచల బ్రహ్మము. తిరిగి రాకపోతే అచలము. తిరిగి వస్తే కొంత కాలము నిశ్చల బ్రహ్మమే. కాని మళ్ళీ చంచల బ్రహ్మమౌతాడు. కనుక చంచల బ్రహ్మ జ్ఞానాన్ని ఎరుక బ్రహ్మ జ్ఞానాన్ని మాయాశబలిత బ్రహ్మ జ్ఞానాన్ని ఫైనల్ అనుకోకుండా అదే లక్ష్యం అనుకోకుండా, అదే గమ్యం అనకుండా మత పద్ధతిగా కాకుండా అచల సిద్ధాంత పద్ధతిగా పరిపూర్ణ బోధని తెలుసుకొని చలాచలములు లేకుండా అనగా కాసేపు అచలంగా ఉండి, కాసేపు చంచలం కాకుండా వ్యక్తం, అవ్యక్తం కాకుండా, బాధ్యా, అబాధ్యములు కాకుండా బేధా, అబేధములు లేకుండా ఉన్నది ఉన్నట్లు ఉన్నటువంటి ఒక శాశ్వత స్థితియే పరమపదము.

శిష్యుడితో పోలిస్తే సహజస్థితి. శిష్యుడు లేకపోతే సహజం అనే మాట వాడక్కరలేదు. అదే మిగిలింది. అన్నీపోతే అదే మిగిలింది అదే శేషించింది. ఇది కాదు ఇది కాదు ఇది కాదు అంటూపోతే చివరికి అదే మిగిలింది. **ఇది కాదు ఇది కాదు ఇది కాదు అనగానే రకరకాల ఎరుకలన్నీ పోయాయి. ఆఖరి ఎరుకకు ఇది కాదనగానే అసలు ఎరుకే లేకుండా పోయింది. ఏ రకమైనా ఎరుక లేదు. ఏ రకమైన ఎరుక ఉన్నాకూడా అది అచలం కాదు. ఎరుక అంతా పోయాక ఇది కాదు అన్నవాడే లేడు. ప్రశ్నే ఎగిరిపోయింది. అనుభవాలే ఎగిరిపోయాయి. అనుభూతులు పోయాయి. పరోక్షం పోయింది. అపరోక్షం కూడా పోయింది. వ్యక్తం పోయింది, అవ్యక్తం పోయింది. ఏమయ్యావు? బయలై తిరిగి ఎరుకలోకి రానటువంటి బయట్టబయలయ్యావు. నేతి నేతి వాక్యం యొక్క గమ్యం అది. అటువంటి జ్ఞానం కలిగించేది పరిపూర్ణ బోధ.** పరిపూర్ణ బోధ ఎప్పుడూ కూడా అవ్యక్త బ్రహ్మ తిరిగి వ్యక్తం అయ్యేటువంటి ఆస్కారం లేకుండా ఎప్పటికీ వ్యక్తం కాకుండా ఉండే అచల బ్రహ్మమును నిర్ణయం చేస్తుంది.

మనము ఎట్లు చూస్తామో అది అట్లే ఉండును. ఈ మాయ ఏం చేస్తోందంటే **'యత్ భావం తద్ భవతి'** మనం ఎట్లా చూస్తే అట్లాగే ఉంటుంది. వెంటనే ఉండదు కానీ చూసి జ్ఞాపకం పెట్టుకొన్న వాసన తిరిగి పక్వమై మళ్ళీ దర్శనం అయ్యేటప్పుడు **'యత్ వాసనా తత్ దర్శనం'** వాసన ప్రకారమే దర్శనం అయ్యింది. వాసన నువ్వు నిర్ణయించిన నీ భావాల్ని బట్టి ఉంటుంది. ఈ ప్రపంచం చాలా బావుంది అనే బంధం ఉందనే అభిప్రాయంతోనే ఉంటావు నువ్వు. ఈ ప్రపంచం పుచ్చిపోయింది, కుళ్ళిపోయింది, పనికిరానిదయ్యింది, దీన్ని ఎవరూ రక్షించలేరు, ఏ అవతార పురుషుడో వచ్చి మళ్ళీ సమూలంగా మార్చాలనే భావంతో ఉన్నావనుకో. అది వాసనై పునర్జన్మలో మళ్ళీ అదే భావంతో పుడతావు.

మంచి చెడుల కలయికతోనే ఈ సృష్టి అంతా ఉంది. ధర్మ రాజైతే ఈ లోకాన్నంతా కూడా అంతా ధర్మంగానే నడుస్తున్నట్లుగా చూసివచ్చాడు. దుర్యోధనుడు అయితే లోకమంతా అధర్మంగా ఉంది. వీళ్ళకి కఠినమైనటువంటి చట్టాలు చేసి, శిక్షలు వేస్తే తప్ప ధర్మం జరగదు అని అనిపించింది. ఇద్దరు చూసిందీ ఒక లోకమే. మరి **మనం ఎట్లు చూతుమో అది అట్లే ఉండును**. దుర్యోధనుడు ఎట్లా చూచాడో అతనికి అలాగే వుంది. ధర్మరాజు ఎట్లా చూచాడో అతనికి అలాగే ఉంది. జిల్లెళ్ళమూడి అమ్మ అంటుంది. **అంతా మంచి చూచేవాడు మంచివాడయ్యే ఉంటాడు. అంతా చెడ్డ చూచూవాడు చెడ్డవాడయ్యే ఉంటాడు**. ఎందుకంటే నీ స్వభావంలో ఏముంటే దాన్ని పరిశీలించి చూస్తావు. నువ్వు చూసిన దాన్నిబట్టి చెప్పవచ్చు. నీ స్వభావం ఏమిటో అంతా మంచినే చూస్తున్నప్పుడు నీ స్వభావం కూడా మంచి అని చెప్తాం. **అంతా దైవాన్ని చూడగలిగినవాడు వాడే దైవం** అని కూడా చెప్తుంది అమ్మ. నువ్వు చూసే దృష్టినిబట్టే ఈ కనబడే దృశ్యము. ఎవరు ఎట్లా చూస్తే అట్లా వాళ్ళకి మాత్రమే అలా వున్నది. అలా చూచిన వాళ్ళకేమో కొందరికి బావుంది. అలా చూచిన వాళ్ళకి కొందరికేమో బాగాలేదు. ఒకే వస్తువు కొందరికి బావుంది, కొందరికి బాగాలేదు చూసే దృష్టినిబట్టి.

ఒక ఆవుని చూచి ఆవు జ్ఞానం ఉంది కనుక ఇది ఆవు అని ఊరుకున్నాడొకడు. ఇంకొకడు పాల వ్యాపారం చేసేవాడు. ఆవు అనగానే ఈ ఆవు జ్ఞానంతోపాటు కాస్త విమర్శ మొదలైంది. ఇది ఎన్ని పాలిస్తుంది? దీనివలన మనకెంత లాభం? ఎంత ప్రయోజనం? అని. ఇంకొక హిందువు ఆవును చూచాడు. తోకవైపు తిరిగి దండంబెట్టి వెళ్ళిపోతున్నాడు. ఇది ఆవు అని ఊరుకోలేదు. పవిత్ర భావన కలిగి నోట్లో అరటిపండు పెట్టాడు. తోకకి పసుపు, కుంకుమ పెట్టాడు. దండం బెట్టాడు, పోయాడు. ఇంకో గొడ్డు మాంసం అమ్ముకునేవాడు ఏం చేశాడు? ఈ ఆవు బలిష్టంగా ఉంది దీన్ని ఎట్లయినా కాజేయ్యాలి, లేకపోతే చచ్చిపోతే కొనుక్కోవాలి, తక్కువ రేటుకి. మాంసం అమ్మితే ఎంత వస్తుంది? అని చూచాడు. ఒక చర్మకారుడు చెప్పులు కుట్టుకోవడానికి ఆవు చర్మం పనికివస్తుందా? అని చూచాడు.

అలాగే ఒక స్త్రీని ఒక పురుషుడు చూసినప్పుడు కొందరికి చెల్లెలు అనే భావన కలిగింద. కొందరికి తల్లి అనే భావన కలిగింది. కొందరికి భార్య అనే భావన కలిగింది. కొందరికి పరస్త్రీ అనే భావన కలిగింది. కొందరు ఉదాసీనంగా ఉన్నారు. కాని స్త్రీని చూచినటువంటి జ్ఞానం మాత్రం వుంది.

మనము ఎట్లా చూస్తామో అది అలాగే ఉంటుంది. ఈ చూడటంలో నీవాసన అంతా పనిచేస్తుంది. పూర్వ జ్ఞాపకాలు, పూర్వ అనుభవాలు దానిమీద వున్న నీ ఇష్టాయిష్టాలు, లాభనష్టాలు, రాగద్వేషాలు అన్నీకూడా వాటితో కూడి కలగా పులగంగా అయినటువంటి చూపు అనే దృశ్యము నీలోనే వుంది. అప్పుడేమయ్యింది? యదార్థ వస్తువుని నీ అభిప్రాయం ప్రకారంగా నీ ఇంప్రెషన్‌బట్టి చూస్తున్నావు. ఇంప్రెషన్‌బట్టి, గుడ్ ఇంప్రెషన్ అయ్యింది. లేక బ్యాడ్ ఇంప్రెషన్ అయ్యింది. అంటే సత్యాన్ని చూడకుండా, నిష్పక్షపాతంగా చూడకుండా, చెడ్డదాన్ని గుడ్ ఇంప్రెషన్‌తో చూడటం, మంచిదాన్ని బ్యాడ్ ఇంప్రెషన్‌తో చూడటం కూడా జరుగుతుంది. అంటే సత్యము ఎప్పుడూ మన అభిప్రాయాన్నిబట్టి మారుతూ ఉంటుంది. పూర్వం ఉన్న అనుభవాన్నిబట్టి చూస్తున్నాము. ఒకడు చెడ్డవాడు. ఈవేళ మారాడేమో! ఎప్పుడూ అట్లాగే వుంటాడా? కానీ అదే దృష్టితో చూస్తున్నాము. మనం ఎట్లు చూతుమో అట్లే ఉంటుంది అది.

మళ్ళీ మనం బ్రహ్మ దగ్గరకి వెళ్తే, మాయ లేనిది ఉన్నట్లు చూపిస్తుంది అనుకుంటే నిజానికి దృశ్యమే లేదు. దానివల్ల ద్రష్టత్వం గాని దృగత్వం గాని లేదు. దృశ్యము, దర్శనము, దృగత్వము అనేటువంటి త్రిపుటేమీ లేదు. త్రిపుటికి అతీతమైన వస్తువు వున్నది. సాధకుడైనవాడు ఇప్పుడు దృశ్యాన్నిబట్టి దృక్ అయినాడు. దృశ్య రహితమైనటువంటి దృక్ స్థితికి వెళ్ళి దృగత్వాన్ని కూడా లేకుండా చేసుకున్నప్పుడు వాడే పరబ్రహ్మ. దృగత్వం కూడా పోతే ఏమీ మిగల్లేదు. దృశ్యం లేదు అనగానే ద్వాదశి వచ్చి ఉత్త బట్టబయలు ఏమీలేదు అంటుంది. దృగత్వం గురించి వచ్చేసరికి, మూలంలేని గుర్తు ఎరిగే దృక్ లేదంటుంది. నామరూప జగత్తుకీ జీవ ఈశ్వర తనువులకీ సంబంధించి, ఉత్త బట్టబయలు ఏమీలేదు అంది. ప్రత్యగాత్మ పరమాత్మ మిగిలాడు మూడు శరీరాలు ధరించినటువంటి ప్రత్యగాత్మ మూడు శరీరాలు ధరించినటువంటి పరమాత్మ మిగిలారు. ఈ పరమాత్మ కూడా దృశ్యంలేని దృక్ అయ్యాడు. తన మూడు శరీరాలకి విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృత శరీరాలకి సాక్షీ విలక్షణమై దృశ్య రహితమై దృశ్యాన్ని ఉత్త బట్టబయలుగా ద్వాదశీ మంత్రంచేత తాను దృగ్మాత్ర స్వరూపంగా ఉన్నాడు.

ఇప్పుడు వాడికేం చెబుతున్నాడు? దృక్ స్థితి కూడా లేదమ్మా, దృక్ అనేవాడు లేనేలేడు అని చెప్పేశాం. అంటే కేవల దృక్కులో దృక్ స్థితిని కూడా ఎగరకొట్టేశాము దృక్ స్థితిలో ఉన్న కేవల ఎరుకని ఎగరకొట్టాము. దృశ్యమందు ఎరుకలేదు. దృక్‌నందు ఎరుక లేదు. ద్విపుటిలో లేదు. త్రిపుటిలో లేదు. ద్విపుటి త్రిపుటి రెండుగాని, మూడుగాని, ఎరుకలే. ద్విపుటి రహితము త్రిపుటి రహితము అయినప్పుడు ఎరుకే లేదు. అప్పుడు శేషించి ఏమి మిగిలింది? అంటే ఉత్త బట్టబయలు ఏమీ లేనిది మిగిలింది. మూలం లేని గుర్తు ఎరిగే శరీరం ఏమీలేదు అన్నవాడు కూడా ఉత్త బట్టబయలై పోయాడు. షోడశీ భావంతో వాడికి కూడా ద్వాదశీ, సిద్ధించింది. దృశ్యం పోవడానికి ద్వాదశీ మంత్రాన్ని వాడాము. దృక్ స్థితి పోగొట్టేటప్పుడు షోడశీ మంత్రాన్ని వాడాడు. ద్వాదశీ మంత్రంతోటి ఏమయ్యింది? అంతా ఉత్తబట్టబయలైపోయింది. మొదట్లో దృశ్యం వరకే ఉత్తబట్టయలయ్యింది. తరువాత మూలం లేని గుర్తు ఎరిగే శరీరం లేదు అనేటువంటి షోడశీ మంత్రాన్ని పట్టుకొనేటప్పటికి ఆ దృక్ కూడా ఉత్తబట్టబయలై ఏమీలేదు అయ్యింది. మళ్ళీ ద్వాదశియే సిద్ధించింది. అందుకే మనం ముందు దృశ్యాన్ని కట్ చేసుకున్నాం. మనం అందరం కూడా ఒక దృశ్యాన్నిబట్టి దాన్ని ఆధారగా చేసుకొన్న దృక్‌గా ఉన్నాము. తరువాత దృక్‌గా కేవల దృక్‌గా అయినా ఉంటామో లేదో తెలియదు.

భార్యని బట్టి భర్తగా ఉన్నాము. పిల్లల్ని బట్టి తల్లిగా, తండ్రిగా ఉన్నాము. బంధువుల్ని బట్టి ఉన్నాము, ధనాన్ని బట్టి ఉన్నాము, ఇల్లుబట్టి ఉన్నాము, ఆస్తిని బట్టి ఉన్నాము. సంపదని బట్టి ఉన్నాము. ఏదో ఒకదాన్ని పట్టుకొని దానిమీద ఆధారపడి వున్నాము. శరీరాలబట్టి ఉన్నాము. అది లేకపోతే ఉండలేము అని ఉన్నాము. వాటివల్ల అయినటువంటి ఉనికి అన్నీ కూడా మాయాకల్పిత ప్రపంచంలో ఉన్నటువంటి వస్తువులమీదే తప్ప, ఉపాధుల మీదే తప్ప, మూడు గుణాలమీదే తప్ప, స్వభావాలమీదే తప్ప, కేవల బ్రహ్మనిష్ఠుడైనటువంటి పరబ్రహ్మమీద ఇవి అన్నీ లేవు. ఇవి అన్నీ పోవాల్సిందే! అందువల్ల దృక్‌స్థితి పోవడం తరువాత సంగతి గాని, దృక్‌గా ఉన్నటువంటివాడు దృశ్యాన్ని రహితం చేసుకొని దృశ్యానికున్నటువంటి సంబంధాన్ని కట్ చేయాలి. అలా కట్ చేసుకున్న తరువాత దృక్ అనుభవం ప్రత్యేకంగా ఎలా ఉంటుంది అనేది అనిర్వచనీయము.

మాయావరణలో మొదటి వ్యాపకమైతే మాయకి బ్రహ్మకి సాంగత్యమే లేదు. నీవే బ్రహ్మమయితే కనుక ఏమి చెయ్యాలి? మాయా కల్పిత దేశ కాల కలనా వైచిత్ర్య చిత్రీకృతమ్ అయినటువంటి వాటిని అన్నింటికి కూడా జీవుడు దగ్గరవున్నటువంటి సంసారంలో బంధము అనేటువంటి పేరుతో ఎన్ని అయితే ఉన్నాయో వాటినన్నింటిని కూడా కల్పితమని, తాను బ్రహ్మ అయినందుకు తనకు, మాయకు సంబంధం లేదు కనుక ఈ సంసారాన్ని, సంసార వస్తువుల్ని, సంసార రూపాన్ని, సంసారముతో ఉన్నటువంటి బంధాన్ని తెగనరికివేస్తే ఆ సంబంధాలన్నింటినీ కట్‌చేసి కేవల దృక్ స్థితిలో, కూటస్థ స్థితిలో ఉండేటువంటి సాధన చెయ్యాలి మనం. ఆ సాధన యొక్క పరాకాష్ఠలో నీవే ఆ పరబ్రహ్మ.

పరబ్రహ్మ యొక్క నిర్ణయము అది ఉత్తబట్టబయలు ఏమీలేదు. పై బోధకెళ్ళి తిరిగి సాధన దగ్గరకొచ్చాము. దృశ్యము బాధిస్తున్నంతవరకు స్వతంత్రము లేదు. **"యత్ భావం తత్ భవతి"**గా కనబడుతున్నది. భావించకపోతే లేదు కనుక దృశ్య సంబంధమంతా నిజ అస్తిత్వం కాదు. తాత్కాలిక ఊహల్లో డ్యూయెట్ పాడుకున్నారు. నిజంగా వాళ్ళు కలిసారో లేదో ఆ కథ తరువాత చెప్తోంది. ప్రస్తుతము ఊహలన్నీ నిజం కావచ్చు, కాకపోవచ్చు. కలలన్నీ నిజం కావచ్చు. కాకపోవచ్చు. కొన్ని ఊహలు నిజం కావచ్చు కానీ, ఊహిస్తూ ఉన్నటువంటి కాలంలో అది లేదుగా, కల కంటున్నంత కాలంలో అది కలేగా. నిజమైనప్పటిమాట! ఇక్కడ **సర్వమూ కలలో తోచినవి ఎలాగో అలాగే!**

మేలుకొన్నవాడికి కలలో తోచినవి ఎలా అబద్ధమో దీన్ని అలా లేనివిగా చూడు. తాత్కాలికముగా ఉన్నవే అయినా అవి బాధిస్తున్నాయిగా? అందువలన లేనిదిగా చూడటం అంటే ఏమిటీ? ఒక తాగుబోతు వచ్చాడు, తిట్టాడు వాడు. ఏమీ తెలియక ఒళ్ళు మరచి తిడుతున్నాడు. మనము ఏమీ పట్టించుకోము. మంచి స్పృహలో ఉండి తిడుతున్నాడు అప్పుడేమయ్యిందీ? మనకి కోపం వచ్చింది. లేనిదే ఉన్నట్లు తోచిన విషయంలో మనం పట్టిచ్చుకోము. ఆ ఉండుట నిజం అనుకొన్నవాడు మాత్రం పట్టించుకొంటాడు. **పట్టించుకోవడమే బంధము. పట్టించుకోకపోడమే మోక్షము.** ఏ స్థాయిలోనైనాసరే మీరు పట్టిచుకుంటే బంధము. పట్టించుకోకుంటే మోక్షము. అయితే పట్టించుకోకుండా పనులు అవుతాయా? ఇది లేనిదికదా అని పట్టించుకోండి. కర్తవ్యాన్ని బాధ్యతనూ నిర్వర్తించండి. అక్కడున్న సంబంధాన్ని మీకు ఇతరులకు రాగద్వేష యుక్తంగా గాని, యిష్టాయిష్టముల భావంతోగాని, కర్తృత్వ, భోక్తృత్వములతోగాని, దాని గుర్తులు మీలో అట్టిపెట్టుకోకండి. ఇది యిష్టము, అది అయిష్టము అని

గుర్తు వద్దు. దీనియందు రాగము, దీనియందు ద్వేషము అని గుర్తు వద్దు. ఇది లాభము, ఇది నష్టము అనే దాంట్లో పొంగుట, కృంగుట అనేదాంట్లో ప్రతిస్పందన లేకుండా ఉండు. మిథ్యా అన్నప్పుడు అదీ సంగతి. లేని డబ్బు లేకుండా పోతుంది. లేని మనుష్యులు లేకుండా పోతున్నారు. లేని జీవుడు లేకుండా పోతున్నాడు. లేని ప్రాణం లేకుండా పోతోంది. లేని శరీరాలు లేకుండా పోతున్నాయి. లేనివాళ్ళే ఉన్నట్లు కనబడి వ్యవహారాలు జరుగుతున్నాయి. ఈ విధముగా సదా నిర్ణయముతో ఉండాలి.

ఈ వ్యవహారం నిజం అనుకున్నవాళ్ళకే రాగద్వేషాలు మొదలైన ద్వంద్వాలు. ఇది లేదనుకున్నప్పుడు ద్వంద్వాలతో నీకేం పని? లేనివాడు ప్రేమిస్తుంటే రాగం ఎందుకు? లేనివాడు తిడుతుంటే ద్వేషం ఎందుకు? నిజంగా ఉన్నవాడు తిడితే రాగం ఉండాలి. నిజంగా ఉన్నవాడు పొగడితే పొంగాలి. నిజంగా ఉన్నవాడు సహాయం చేస్తే కృతజ్ఞత ఉండాలి. లేనివాడు చేసే దానిలో కృతజ్ఞత ఏముంది? అయినా వాళ్ళు అనుకొని చేస్తున్నారా ఏమిటి? నీ ప్రారబ్ధం ఎట్లా వుందో అట్లాగే జరుగుతున్నాయి. నువ్వు అనుకొన్నవి ఎట్లా ఉన్నాయో, అట్లాగే నువ్వు చేసిన కర్మ ఎట్లా ఉందో, ఆ ఫలితం కూడా అట్లాగే, ఆ కర్మ ఫలితాన్నిబట్టి నీకు సహాయం చేసేవాళ్ళు వస్తారు. ఫలితాన్ని బట్టి నీకు అపకారం చేసేవాళ్ళు వస్తారు. నీ కర్మ ఫలితంగా వచ్చారు గాని, అక్కడ కర్మ ఫలితంలో ఉపకారం ఉంటే వచ్చారు గాని, కర్మ ఫలితంలో అది లేకపోతే ఉపకారం చేసేవాళ్ళు కూడా వెనక్కి వెళ్ళిపోతారు. కర్మ ఫలితంలో నష్టబడేది ఉంది కాబట్టి అపకారం జరిగింది. కర్మ ఫలితములో లేకపోతే ఎవరైనా, ఎప్పుడైనా, ఎందుకైనా, అపకారముగాని, ఉపకారముగాని చెయ్యరు కదా! నిమిత్త కారణాన్ని పట్టుకోవద్దు. కర్మ ఫలితాన్ని ఆ రకంగా చూచినప్పుడు నిమిత్త కారణాన్ని ఎలా చూడాలి. ఇది మిథ్య కదా, లేదు కదా అని చూడటమే. దీనివల్ల కొంత బాధ ఉన్నప్పటికీ ఓర్పుతో, సహనముతో, ఆత్మ భావనతో, కర్మ నిర్ణయ పద్ధతిమీద ఏ దోషం పెట్టకుండా, రాగద్వేషాలు లేకుండా, పొంగకుండ, క్రుంగకుండ ఉండాలి. పట్టించుకోకుండా ఉండడమంటే ఇందులో ఏది వచ్చినా పట్టించుకోనట్లే లెక్క. **పట్టనట్టు ఉంటే విడుదల, పట్టినట్లు ఉంటే బంధము.**

జగత్‌కి జీవుడికి కూడా బ్రహ్మమే అధిష్ఠానము. ఈ మాయావరణలో బ్రహ్మయొక్క ప్రకాశమే అధిష్ఠానము. ఆ అధిష్ఠాన ప్రకాశమే మాయలో ప్రతిబింబమైన ఈశ్వరుడు. ఆ అధిష్ఠాన ప్రకాశమే అవిద్యయందు ప్రతిఫలించిన జీవుడు. జీవుడు, ఈశ్వరుడూ కూడా ప్రతిబింబ అస్తిత్వంగా ఉన్నారు. అధిష్ఠాన ప్రకాశం లేకపోతే జీవుడు లేడు, ఈశ్వరుడు లేడు. జీవుడు శాశ్వతమా? అధిష్ఠాన ప్రకాశముండి అవిద్య అనే అద్దం ఉంటే అదిష్ఠాన ప్రకాశము ప్లస్ అవిద్య అనే అద్దము ప్లస్ అద్దంలో ప్రతిబింబ ప్రకాశము. ఈ మూడూ కలిపి జీవుడు. అవిద్య అధిష్ఠాన ప్రకాశము లేకుండా ప్రతిబింబమైన జీవుడు ఎలా ఉంటాండీ? బ్రహ్మ ప్రకాశము లేకపోతే జీవుడు ఉంటాడా? జీవుడియొక్క సత్తా ప్రతిబింబ ప్రకాశముగా ఉన్నప్పటికీ, బింబ ప్రకాశము వల్లనే వచ్చింది. అధిష్ఠాన ప్రకాశము, అధిష్ఠాన చేతనము లేకపోతే నేనుగా జీవుడిగా జీవ వ్యాపారము చేసేటటువంటి సత్తా, జీవుడికి ఎక్కడిది? అయితే బింబ ప్రతిబింబ ప్రకాశములు ఒక తీరుగా ఉండాలిగా, ఎందులేవు? అంతఃకరణ దోషముచేత లేవు. అంతఃకరణము అనే అద్దములోని దోషాలు నివారిస్తే, తుడిచేస్తే, చెరిపేస్తే, అధిష్ఠాన ప్రకాశము, ప్రతిబింబ ప్రకాశము రెండూ ఒక్కటిగానే ఉంటాయి. ఇది సారూప్యము.

వాచ్యార్థము అవిద్యా కల్పితము, వాచ్యార్థము మిథ్యా. కనుక వాచ్యార్థమును విడిచిపెట్టేయి. లక్ష్యార్థములో ప్రకాశ అనుభవము ఏదైతే ఉన్నదో అది ఆత్మానుభవమే. యదార్థ నేను యొక్క అనుభవము అంతఃకరణ శుద్ధియైనప్పుడు ఉన్నటువంటి నేనుకొచ్చే అనుభవము అధిష్ఠాన బ్రహ్మప్రకాశ అనుభవము రెండూ ఒక్కటే. ఇది సారూప్యముక్తి. అది ఇదీ ఒక్కటే అన్నప్పుడు సారూప్యముక్తి. ఒకటే అంటే ఎట్లా ఉన్నాయి? ప్రకాశం అనే లక్షణంలోను (లక్షణవాక్యం చేత, లక్షణం ఏమిటీ 'సత్‌చిత్ ఆనందం' అనేటటువంటిది) రెండూ ఒక మాదిరిగానే ఉన్నది. లక్షణంచేత ఒక్కటి అన్నాడు గానీ, స్వానుభవంచేత ఒకటి అయ్యిందా? అవిద్యను దాటాడుగా! కాని ఇంకా మాయ ఉంది. మాయని దాటాలి. అప్పుడు అధిష్టాన ప్రకాశము మాయ అనే అద్దముపై ప్రతిఫలించినవాడే ఈశ్వరుడు. ప్రతిఫలించినవాడు ఈశ్వరుడు కాడు. ప్రతిఫలించిన ప్రకాశము, అధిష్టాన ప్రకాశము, మాయ ఈ మూడు కూడి ఈశ్వరుడు. మూడూ కూడే ఈశ్వరుడు. కేవల ప్రతిబింబ ప్రకాశంగా ఈశ్వరుడు లేడు. అధిష్ఠాన ప్రకాశం సున్నా అయితే ప్రతిబింబమెక్కడిదీ? ఈశ్వరుడెక్కడా? మాయ లేకపోతే ఈశ్వరుడున్నాడా? అద్దం లేకపోతే అధిష్టాన ప్రకాశం వుంది గాని, ప్రతిబింబము లేదుగా! అప్పుడు ఈశ్వరుడు లేడుగా! ఇది అంతా ఎందుకు చెబుతున్నామంటే, ప్రతిబింబ ప్రకాశముచేత అస్తిత్వము కలిగిన జీవుడు అవిద్యా కల్పితుడు. అలాగే ప్రతిబింబ అస్తిత్వంచేత కలిగిన ఈశ్వరుడు మాయా కల్పితుడు.

ప్రతిబింబము ఒకసారి ఉంటుంది, ఒకసారి ఉండదు. ఒక పరిస్థితిలో ఉంటుంది, ఒక పరిస్థితిలో ఉండదు. కనుక ఆ ఉండుట అనేది 'అసత్'. తాత్కాలిక సత్యము. జీవుడు, ఈశ్వరుడు ఇద్దరూ తాత్కాలిక సత్యమే. అధిష్టానమైనటువంటి బ్రహ్మ ప్రకాశమే పరమసత్యము. బ్రహ్మ సత్యం, జగత్ మిథ్యా అంటే అధిష్ఠాన బ్రహ్మ ప్రకాశములో మాయావరణలో ప్రతిఫలించిన ప్రకాశముగా తయారైనాడు. కొన్ని పరిస్థితులలో కొంత సహాయకారి కారణాలు ఉంటేనే వాళ్ళు అట్లా అయ్యారు. ఆ సహాయం కారణం ఉన్నంతవరకు కొంతవరకు మనం శుద్ధం చేసుకుంటే దాంతో ఆ సహాయ కారణము నశించగా అధిష్ఠాన ప్రకాశముతో సమానమైనటువంటి అనుభవాన్ని పొందుతున్నాడు. సహాయకారి కారణాలు లేనప్పుడు, ప్రతిబింబము లేనప్పుడు, జీవుడు లేడు, ఈశ్వరుడు లేడు. అందుకే మూలం లేని గుర్తు ఎరిగే జీవుడు లేడు. **మూలం లేని గుర్తు ఎరిగే ఈశ్వరుడు లేడు. మూలం లేని గుర్తు ఎరిగే జీవుడు లేడు. మూలం లేని జీవుడు ఉత్త బట్టబయలు. మూలం లేని గుర్తు ఎరిగే ఈశ్వరుడు ఉత్త బట్టయలు**, అప్పుడేమయిందీ! జీవుడు ఈశ్వరుడవ్వలేదు. జీవుడు లేకుండా పోయాడు. తరువాత ఈశ్వరుడు కూడా లేకుండా పోయాడు. అంటే అవిద్యా మర్మము తెలిగానే జీవుడు లేడు. మాయా మర్మమూ తెలిసాక ఈశ్వరుడు లేడు. తాత్కాలికముగా కొన్ని పరిస్థితులలో జీవేశ్వరులున్నారు. అవిద్యా దోషం మాయా దోషం రెండూ విడుదలైతే మనం ఆ బ్రహ్మతో సమానమయ్యాము.

జీవుడిగా ప్రతిబింబము ప్రతిఫలించిన ప్రకాశముగా వాడు వచ్చాడు. కొన్ని పరిస్థితులలో వాడు ఉన్నాడు. కొన్ని పరిస్థితులలో బంధం ఉంది, కొన్ని పరిస్థితులలో మోక్షం ఉంది, పరిస్థితులు మారితే బంధం లేదు, మోక్షం లేదు. జీవుడు లేడు. అలాగే ఈశ్వరుడు కూడా కొన్ని పరిస్థితులలో మాయ అనే అద్దం మీద ప్రతిబింబ ప్రకాశముతో కూడి ఉన్నాడు. మాయ అనే అద్దం యొక్క దోషంతో ఈశ్వర వ్యవహారం ఉంది. ఈశ్వర వ్యవహారం ప్రతిబింబ చైతన్యముతో ఉంది. ప్రతిబింబ చైతన్యము, బింబ చైతన్యము కన్నా వేరు కాదు. బింబ చైతన్యము కూడా అంతర్యామిగా ఉంది. ఈశ్వరుడి యొక్క అంతర్యామిగా ఉన్నది. మాయ అనే అద్దం యొక్క దోషం పోతే ప్రతిబింబ చైతన్యము, బింబ చైతన్యము సమానమైనది. జీవుని యొక్క ప్రతిబింబ ప్రకాశములో అంతఃకరణ శుద్ధి అయితే అలాగే ఈశ్వరునియొక్క ప్రతిబింబ ప్రకాశములో మాయ మర్మం వీడితే పరమాత్మయే నిజ అస్తిత్వముగా ఉండిపోయాడు. కాని స్వరూప జ్ఞానంలో పరమాత్మయే లేనివాడు. ఆ పరమాత్మ లేకుండా పోయాడు. లేనివాడు లేకుండా పోయాడు. అట్లా తీసుకోవాలి అదే మోక్షం. మోక్షం అంటే ఇక్కడ భ్రాంతిలోనే బంధం ఉంది. అందుకనే భ్రాంతిలోనే మోక్షం ఉంది. బంధ మోక్షాలు రెండూ భ్రాంతిలోనే ఉన్నాయి కాబట్టి నిజానికి బంధ మోక్షాలు లేవు.

నిరపేక్ష పద్ధతిలో ఏమి కావాలి? అధిష్ఠాన ప్రకాశాన్ని పట్టుకొని అంతఃకరణాన్ని శుద్ధం చేసుకొని మాయ మర్మాన్ని తెలుసుకుని, ప్రతిబింబ ప్రకాశం యొక్క అస్తిత్వం నిజ అస్తిత్వం కాదని అవి అవిద్యా మరియు మాయాకల్పితములనేటుటువంటి అస్తిత్వాలని ఆ దోషాలను పోగొట్టుకుంటూ చివరకు వారు లేనివాళ్ళని ఈ ఉపాధి పడిపోయేదాకా ఉపాధి ఉన్నట్లుగా ఉన్నప్పటికీ కూడా, నిజానికి లేని వాళ్ళేనని, లేని వాళ్ళనే నిర్ణయంతోటి, **మూలం లేని గుర్తు ఎరిగే శరీరాలు ఏమీ లేవనీ**, ఈ యొక్క వ్యవహారంలో, దృశ్యరూపంలో ఏదైయితే ఉందో అది **అంతా ఉత్త బట్టబయలు ఏమీ లేదని**, తన ఉపాధిగా ఉన్న నామ రూపాత్మకంగా ఉన్నటువంటి పంచ భూతాత్మకంగా ఉన్నటువంటివికూడా ఉత్త బట్టబయలు ఏమీ లేవనీ, దర్శనం లేని దృక్ మిగిలాడనీ, అట్టి దృక్ కూడా ఏమీ లేడనీ దృక్ అనే ఎరుక, దర్శనము అనే ఎరుక, రెండూ లేకపోతే ఇక ఏ ఎరుకా లేనటువంటి స్థితిలో తాను అదై వున్నాడని అది ఎరుక లేని స్థితి, ఎరుక లేకపోతే ఎరుక పుట్టకపోతే ఎరుకతో అందుకొనబడే బయలుకాక, ఏ బయలైతే ఉన్నదో, దానిలో ఎరుక నిలిచేందుకు స్థానం లేదు. ముల్లు గ్రుచ్చ సందులేక బయలే అంతటా నిండి నిమిడీకృతమై ఉన్నదీ అనే నిర్ణయంతో చూసుకోవాలి.

మరి ఆ నిర్ణయానికి సపోర్టు కావాలి. మరి గురువేమిటి? శిష్యుడేంటి? ఈ బోధ ఏమిటీ? ఈ సాధన ఏమిటీ? ఈ దాటటమేమిటీ? ప్రతిబింబాలమింటీ? ఏమిటి బాబూ! ఎప్పుడూ అదే కదా ఉంది అంటే సరిపోలేదా? అవునయ్యా ఎప్పుడూ అదే ఉంది! ఇవి అన్నీ లేకనే ఉన్నట్లు తోచినవి కనుక ఇవి అన్నీ లేనివేగా! ఇదంతా లేని ఎరుక. లేని ఎరుక అయితే ఇంత బాధించిందేమిటండీ? ఇన్ని లక్షల జన్మలెత్తాలా? నాకు స్వస్వరూప సాక్షాత్కారానికి ఇన్ని లక్షల జన్మలెత్తాలా? అబ్బే ఇన్ని లక్షల జన్మలున్నాయని గాని, ఇది మిథ్యా అంటే నేను నమ్మలేకపోతున్నాను. ఏదో తాత్కాలిక ముక్తి. ఇది కాదు అనంగానే పోతుంది. తాడుమీద పాము కనబడింది. కాసేపు విచారించాము. లైటు తీసుకొచ్చి చూసాం. పాము కనబడలేదు తాడే ఉన్నది. నేను తొందరగానే నమ్మాను పాము లేదని, కాని ఈ తాడే పాములా కనబడింది అని. ఇన్ని లక్షల జన్మలు బాధిస్తుంటే దీన్ని ఎలా నమ్మను? అంటున్నాడు. బోధ అంతా వంటబట్టింది కాని నమ్మకం కలగటంలేదు. అప్పుడు మూడో మంత్రం చెప్పాము.

కలలో తోచిన కూటస్థుడు కలలో తోచిన జీవుడూ, కలలో తోచిన బ్రాహ్మణుడు, కలలో తోచిన సచ్చిదాత్మ కలలో తోచిన విరాట్ పురుషుడు, కలలో తోచిన హిరణ్యగర్భుడు, కలలో తోచిన సూత్రాత్మా, కలలో తోచిన అవ్యాకృతుడు, కలలో తోచిన క్షేత్రమూ, కలలో తోచిన క్షేత్రజ్ఞుడూ, ఇవి అన్నీ కూడా కలలో తోచిన శరీరాలేలాగో అలాగే. కనుక పంచదశీ మంత్రమే సపోర్టు.

కనుక జగత్తుకి జీవునకు బ్రహ్మమే అధిష్ఠానము. జగత్ కూడా బ్రహ్మ యొక్క ప్రకాశంచేత గోచరమౌతుంది. జీవుడు కూడా బ్రహ్మయొక్క ప్రకాశం తోటే చిదాభాసగా, అహం స్ఫురణగా తోచాడు. ప్రతిబింబ ఛాయ అస్తిత్వమే గాని, నిజ అస్తిత్వం కాదు. అధిష్ఠాన బ్రహ్మమే ఉన్నాడు. బ్రహ్మము నిర్వికల్పము అనే అర్థంతో నిర్వికారము, కూటస్థము. అట్టి బ్రహ్మ మార్పు చెందుటకు ఏ కారణము లేదు. పోనీ మాయ ఏమైనా మారుస్తుందా? మాయ కూడా ఆ బ్రహ్మను ఏమీ మార్పు చెందించడము లేదు. మరి మార్పు లెక్కడ కనబడుతున్నాయి? నిజానికి మార్పులు లేవు. ఆ మార్పులున్నట్లు భ్రాంతి. ఆ భ్రాంతికి మూలము మాయ. అంతే! పాము అనే భ్రాంతి ఉన్నంతకాలము దాని మూల కారణం మాయ. భ్రాంతి రహితమైతే మూల కారణం కూడా లేదు. మాయ కూడా లేదు. లేని మాయే. అప్పుడు తాడే సాక్షాత్కారమయ్యింది. తాడే అన్ని కాలాల్లో ఉంది. కాబట్టి బ్రహ్మము మార్పు చెందనివాడే! మాయా కల్పితమైనవన్నీ కూడా మాయ కారణంగా మార్పు చెందుతున్నట్లుగా కనబడుతున్నాయి. మారేది ఒకటి, మారనిది ఒకటి అని రెండు లేవు. మారందే ఎప్పుడూ ఉంది. మార్పు చెందినట్లు కనబడటం భ్రాంతి.

అసలు మాయ సంగతి ఎత్తేయండి. మీరు భ్రాంతిలో ఉన్నట్లుగాగుర్తించి, భ్రాంతి వదలి ఊరక ఉండండి. ఇంతే సంగతులు! మాయ అని, అవిద్య అనిఅర్థం కానివన్నీ చెప్పి అదేదో సాధన కోసం క్రింది బోధగా చెప్పాము. ఇప్పుడు మీరు ఏమి చెయ్యాలి ఇక్కడ? మీరు భ్రాంతిలో ఉన్నారు, ఈశ్వరుడుగా ఉన్నా భ్రాంతే. జగత్ ఉన్నదనుకొన్నా భ్రాంతే. అష్ట తనువులు ఉన్నవి అనుకున్నా భ్రాంతే. ఈ ఉపాధి సత్యం అనుకుంటే భ్రాంతే. సచ్చిదానందము కూడా భ్రాంతే. భ్రాంతి రహితమయితే ఏదీ లేదు. ఎరుకంతా లేని ఎరుకే. భ్రాంతి రహితమైతే ఉన్నది బయలే. బయలే అన్ని కాలాల్లో ఉంది. బయలే శాశ్వతమై ఉన్నది. నీవు కూడా బయలే. నువ్వు అంటూ వేరే లేవు. బయలు అనేటువంటిది శాశ్వతంగా ఉన్నది. బయలు నేను నేను అనలేదు. బయలు ఈశ్వరుడవ్వలేదు, బయలు జీవుడవ్వలేదు, బయలందు ఎట్టి ఎరుక లేదు. బయలులోకి ఎరుక పుట్టలేదు. ఎరుక మళ్ళీ తిరిగి బయలులోకి లయంకాదు. అట్టి బయలే నీవయి వున్నావు. నేను నేను అనకుండా నీవయి వున్నావు. వ్యక్తం కాకుండా నీవయి ఉన్నావు. ప్రాశస్త్యం కాకుండా నీవయి వున్నావు. వస్తు నిర్ణయంగా నీవయి వున్నావు. ఆ వస్తు నిర్ణయం అనేటుటవంటి అనుభూతి కూడా నీకు లేదు. అనుభూతి వస్తే మాయలోనే రావాలి. మాయని దాటినవాడికి అనుభూతి లేదు. ఏదొచ్చినా మాయలోనే ప్రకటించబడాలి. ప్రకటించబడ్డవన్నీ పోతే మాయని దాటినట్లే. నీవు నీవుగానే ఉన్నావు. కాని నీవు నీవుగా ఉన్నటువంటి ఎరుక నీకు లేదు. బయలందు ఎరుక ఉండదు కాబట్టి నీవు నీవనే ఎరుక నీకు ఉండకూడదు. నీవు నీవైనటువంటిది బయలే అయి వున్నది. స్వస్వరూప సాక్షాత్కారం బయలే. స్వస్వరూప సాక్షాత్కారమందు అఖండ ఆత్మ జ్ఞానం లేదు. స్వరూప జ్ఞానం లేదు. స్వరూప జ్ఞానం అవ్యక్తం కూడా కాదు. అవ్యక్తము వ్యక్తం అయితే అది మోక్షం కాదు. వ్యక్తం అయ్యే ఆస్కారం లేని అవ్యక్తం అనుకో! భ్రాంతి తీరిపోయిన తరువాత, వస్తు నిర్ణయం అయిపోయిన తరువాత, ఎక్కిందీ లేదు, దిగిందీ లేదూ, వ్యక్తమూ లేదూ అవ్యక్తమూ లేదు. ఉన్నది ఉన్నట్లుగా ఉన్నది. దాని పేరే బట్టబయలు. దానియందు ఎరుక లేదు.

ఆ బయలుకు సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అని పేరు పెట్టుకోండి, లేకపోతే లేదు. ఆ బయలు తప్పనదు, ఒప్పనదు. బయలే బయలయినటువంటి బ్రహ్మ తాను బయలని తాను బ్రహ్మమని తనకు తానేమీ పేరు పెట్టుకోలేదు. **ఎరుకే తనకు తానే తోచి బయలుకు బయలని పేరుపెట్టి, బయలే బ్రహ్మమని, బయలే మోక్షమని, బయల్లో ఐక్యతాసిద్ధి పొందాలని బయలుతో లవ్వాడలేక ఎరుకా పారిపోయిందిరా! అప్పుడు బయలే శాశ్వతంగా ఉన్నది ఉన్నట్లుగా ఉందిరా!**

బ్రహ్మము జగద్దృశ్యమునకు అధిష్ఠానమైన పరమ సత్యం. అధిష్ఠానము, ఆధారము రెండూ ఒకటి కాదు. సాపేక్ష నిర్ణయంలో ఆధార, ఆధేయ పద్ధతిలో ఆధారము అంటాము. అధిష్ఠానము అంటే తనకు తానే స్వతహా సిద్ధమై ఉన్నది. మనకు సాధన చేతగాని, అనుష్ఠానము చేతగాని, పరోక్షముగా మొదట్లో గుర్తించబడి అది అద్వయ వస్తువు అవడంచేత నీవు కూడా అదే అవ్వడం చేత అపరోక్షానుభూతిగా స్థితమై ఉంటుంది. అంటే నిరపేక్ష పద్ధతిలో దొరుకుతుంది. నిరపేక్ష పద్ధతిలో దొరకటం ఏమిటి? అంటే అది నీవే అయి ఉంటావు. అపరోక్షము సిద్ధిస్తుంది. అద్వైతం సిద్ధిస్తుంది. ఇతరము ఉంటే అధిష్ఠానము అంటాము. కరెంటు వలన ఫ్యాను తిరుగుతోంది. లైటు వెలుగుతోంది అన్నప్పుడు కరెంటు ఆధారం. ఆధారం అన్నప్పటికీ కూడా కరెంటు యొక్క ఉనికి వల్లనే ఫ్యాను తిరుగుతోంది గాని కరెంటు స్వయంగా ఫ్యానును తిప్పుటలేదు. ఆ కరెంటుయొక్క

ఇచ్ఛా ప్రయత్నం వలన ఫ్యాను తిరుగుటలేదు. సూర్యుని యొక్క ఎండవలన నీరు ఆవిరై మేఘమై వర్షించుట లేదు. సూర్యునికి ప్రకాశించటం అనేది లక్షణం. ఆ ప్రకాశ లక్షణంలో ఆ ప్రకాశంయొక్క సత్తాచేత సూర్యునికి ఎటువంటి కర్తృత్వము, భోక్తృత్వము, ఇచ్ఛా ప్రయత్నములు లేకనే సూర్యరశ్మి ద్వారా జీవజాలము పరిణామం చెందుచున్నవి. ప్రతి వస్తువుకు ఒక రకంగా ఉండేటటువంటి ప్రవర్తించేటటువంటి ధర్మం వున్నది. తనకు తాను ఆ ధర్మాన్ని ప్రకటింపచెయ్యదు. ఆధారమైన సూర్యరశ్మి వలన ఆ ధర్మము ప్రకటింపబడుతుంది. ఆధారమైన సూర్యరశ్మి వలన ఆకులలో పత్రహరితము, మానవులలో జీవ చైతన్యము, ఎముకలలో విటమిన్-డి, సౌర విద్యుత్తైతే దానితోటి మనం ఏదైనా చేసుకోవచ్చు. సూర్యుని యొక్క ఎండ కాయడం అనేటటువంటి లక్షణంచేత, వాటియొక్క సత్తాచేత ఇవన్నీ జరుగుచున్నవి. అప్పుడు సూర్యరశ్మి ఆధారం. అలాగే బ్రహ్మ చైతన్యము ఆధారము. జగత్తు యొక్క పరిణామమంతా కూడా ఆధేయము. బ్రహ్మ ప్రభావము ఈ జడ వస్తువులలో పనిచేస్తుంది. అధిష్ఠానమని ఎప్పుడైతే అన్నామో అది పని చెయ్యడం లేదు. చిత్, జడము రెండు ఉన్నవి. చిత్తు అనేది ఆధారము. జడ వస్తువులకు జడ వస్తు తాదాత్మ్యత అజ్ఞానము. చిత్ స్వరూపమేమో స్వానుభవము.

ఆధార, ఆధేయ పద్ధతులలోనే జ్ఞానము, అజ్ఞానము రెండూ వున్నాయి. అధిష్ఠాన పద్ధతిలోకి వచ్చేసరికి ఏమైంది? జ్ఞానం లేదు. జ్ఞానము తరువాత తోచిన అజ్ఞానము లేదు. అజ్ఞానము నుండి విడుదల కాగానే సముపార్జించబడినటువంటి జ్ఞానము ఉండదక్కడ. అధిష్ఠానము అని ఎప్పుడైతే అన్నామో జ్ఞానాజ్ఞానములకు అతీతమైనది. ముందు ఆధారంగా కనిపెట్టి దాన్ని తరువాత మహా వాక్య పద్ధతిలో ఆధారముగా కనిపెట్టి, ఆ తరువాత తత్త్వమసి వాక్యాన్ని మళ్ళీ మరియొకసారి నిరపేక్ష పద్ధతిలో గనుక మనం బోధించుకుంటే, అపుడు 'త్వం' అనేటుటవంటి ఎరుక 'తత్'లో ఉన్న ఎరుక రెండూ ఎరుకే కాబట్టి తత్త్వమసి వాక్యంతో రెండూ సమానమైనప్పటికీ ఎరుక తనకు తానే పోతే బయలే ఉన్నది అనే అర్థంతో 'తత్'ని నిరూపించాలి. అపుడు తత్ అనే అఖండ ఎరుక, త్వం అనే సాధకుడిలో జ్ఞానమనే ఎరుక 'తత్', 'త్వం' రెండు కాకుండా నిరపేక్షంగా 'అసి'పదమే బయలై యుంటుంది. అధిష్ఠాన పద్ధతిలో వెళ్ళితే తప్ప బయలు నిర్ణయం కాదు. **ఆధార ఆధేయ పద్ధతులలో వెళితే 'తత్' నిర్ణయం అవుతుంది. అధిష్ఠాన పద్ధతిలో పోతే 'అసి' పదం నిర్ణయం అవుతుంది.**

బ్రహ్మము జగద్దృశ్యమునకు అధిష్ఠానమైన పరమ సత్యం. బ్రహ్మము అన్నప్పుడు ఆధార పద్ధతిలో జగత్తు దృశ్యమానం అగుటకు ఆధారము, అన్నప్పుడు ఆ బ్రహ్మ సగుణం అయ్యాడు. అధిష్ఠానం అనేసరికి ఆ బ్రహ్మ నిర్గుణ బ్రహ్మ అయ్యాడు. నిర్గుణం బ్రహ్మ ఆధారమా కాదా? ఆధారంగా కనబడుతోంది. కాని కాదు. ఎందుకని కాదు?

**'బీజస్వాంత రివాంకురో జగదిదం ప్రాజ్ నిర్వికల్పం పునః'** బీజమందు అంకురించే శక్తి ఏదైనా వుంటే అటువంటి బీజం నుండి ఆ బీజ స్థితిలో నిర్వికల్పం అయినప్పటికీ అంకుర శక్తి కారణంగా పునః అటే మళ్ళీ సృష్టి జరిగింది.

**'దేశ కాల కలనా వైచిత్ర్య చిత్రీ కృతమ్'**

దేశము, కాలము, వస్తువులయొక్క ఉనికి అన్నీ కూడా కల్పించబడ్డవి. చిత్ర విచిత్రములుగా కల్పించబడ్డాయి. కాని అంకుర శక్తి అనేది మాయాశక్తి. బీజము అన్నది పరబ్రహ్మ. సృష్టి బీజం పరబ్రహ్మయందు ఉన్నది. ఆ పరబ్రహ్మ అనే బీజమందు అంకురశక్తి ఒకటి వున్నది. ఈ అంకురశక్తి బీజంలో ఉండేటటువంటి అవ్యక్త శక్తి. ఈ అంకుర శక్తి క్రియోన్ముఖమై శాఖోపశాఖలైనట్టి వృక్షము పూత, పిందె, కాయ, ఫలము ఏవిధంగా వస్తాయో అలాగే నిర్గుణ నిర్వికల్ప బ్రహ్మమందు అంకురశక్తి మాయాశక్తి వలన సర్వం వస్తున్నాయి. ఈ మాయే బ్రహ్మను ఆశ్రయించి బ్రహ్మము నిర్గుణమైనప్పటికి కూడా బ్రహ్మమును సర్వాధారముగాను, సగుణముగాను ఈ మాయ చూపిస్తోంది. నిజానికి మాయ లేని మాయ. మాయ వలన కనబడేవన్నీ కూడా విచారిస్తే లేనివి. కనుక బ్రహ్మము సృష్టికి ఆధారమవునా? కాదా? ఇవన్నీ లేనివి కాబట్టి బ్రహ్మము స్వతః సిద్ధంగా తనకు తానే సిద్ధ వస్తువుగా ఉన్నదున్నట్లుగా ఉన్నాడు. ఆ బ్రహ్మం నుండి సృష్టి రాలేదు. వచ్చినా ఈ సృష్టి మాయాకల్పితము. ఆ బ్రహ్మ ఈ సృష్టి విషయములో కర్త కాదు, అసంగుడు. ఇదీ విచారణ. మనకు ఎలా కనబడుతోంది? బ్రహ్మ కారణంగానే జగత్తు వచ్చినట్లు కనబడుతుంది. అప్పుడు బ్రహ్మకు ఆధారం అనేటటువంటి పేరు తీసివేసి అధిష్ఠానము అని పేరు పెట్టాలి. అధిష్ఠానం అని ఎప్పుడైతే పేరు పెట్టామో, బ్రహ్మముయొక్క పాత్ర అక్కడ ఉండదు. అతడు అచలము, పరిపూర్ణము, త్రిగుణ రహితము,

నిర్వికారము. తన నుండి సృష్టి ఏదీ రాదు. సృష్టి తనలోకి లయం కాదు. అంకుర శక్తిగా ఏ శక్తి ఉన్నదో, అది మాయాశక్తి అనే పేరుతో ఉన్నది. దాని కారణంగా లేని జగత్తు ఉన్నట్లుగా తోచి బ్రహ్మ కారణంగా తోచినట్లు కనబడుతోంది. బ్రహ్మ ఆధారంగా కనబడుతోంది. ఇక్కడ ఏమి చెప్పుకున్నాము? ఆధారం అన్నమాటకు పర్యాయ పదంగా అధిష్ఠానం అనే పదం పెట్టాము. ఈ అధిష్ఠానం అనే పదంచేత బ్రహ్మ ఊరక ఉన్నాడు. బ్రహ్మ ప్రకాశిస్తున్నాడు. బ్రహ్మకు ప్రకాశం లక్షణం ఉంది. అది ఆధారం ఎప్పుడైంది? మాయాకల్పిత సృష్టి నిజమనుకొన్నప్పుడు అది ఆధారమే. మాయాకల్పిత సృష్టి అసత్యం. సృష్టి జరగనేలేదు అన్నప్పుడు అద్వయ బ్రహ్మ అద్వయంగానే తనకంటే అన్యము లేకుండా ఉన్నది ఉన్నట్లు ఉన్నాడు. అటువంటి బ్రహ్మను అధిష్ఠానం అంటున్నాము.

అధిష్ఠాన బ్రహ్మకి ప్రకాశము ఉంది. ఉన్నది అధిష్ఠాన ప్రకాశమే. అది అద్వయం కనుక స్వప్రకాశము, స్వయంప్రభ. అందువల్ల అధిష్ఠాన ప్రకాశము మాయ కారణంగా మాయా ద్వారంగుండా మాయావరణలో కూడా ప్రకాశిస్తున్నది. మాయావరణలో ఉన్న వస్తువులు అన్ని లేకనే ఉన్నట్లు తోచినవి. కనుక మాయావరణలో ఉన్నటువంటి పరబ్రహ్మ అధిష్ఠాన ప్రకాశం కూడా లేకనే ఉన్నట్లు తోచినట్లుగా తీసుకోవాలి. సృష్టి లేదు కనుక, ఆధారం అనే మాట లేదు. ఆధారం కాకపోయినా అది ఉన్నది. కనుక దాన్ని అధిష్ఠానము అన్నాము. అది అవుననదు, కాదనదు. సృష్టి చెయ్యదు, సృష్టిలోకి రాదు. తనలోకి దేనినీ లయం చేసుకోదు. అలా అధిష్ఠాన ప్రకాశం ఉన్నది.

ఆ ప్రకాశాన్ని వినియోగించుకొని ఏమైనా చేసుకుంటున్నారో ఆ అధిష్ఠానానికి ఏమీ తెలియదు. ఆధార, ఆధేయ పద్ధతులలో కూడా మాయావరణలో కూడా దానికి ఏమి తెలియదు. కాని జరిగిపోతున్నాయి. చిత్ జడములు రెండు కూడా కలిసి పరిణామం చెందుచున్నాయి. అధిష్ఠానం అయినప్పుడు ఏమి చేశాము? మాయావరణంలో దాని ప్రకాశం వల్ల ఆధార ఆధేయ పద్ధతిలో జరుగుచున్నది. కాని మాయావరణలో ఏ ప్రకాశం అయితే కనబడుతుందో ప్రకాశం అనేది సత్తాగా జరుగుతుంది. లక్ష్యార్థంగా తీసుకుంటే, నిరావరణ బ్రహ్మయందు కూడా అదే ప్రకాశం ఉన్నది. అందులోని సామర్థ్యం ఎప్పటికీ క్రియోన్ముఖము కాదు. 'త్వం'లో ఉన్నటువంటి మాయావరణ ప్రకాశానికి 'తత్'లో ఉన్నటువంటి స్వయంప్రభగా, స్వయంప్రకాశముగా, స్వప్రకాశముగా, అపరోక్షంలో ఉన్నటువంటి ప్రకాశానికి 'అసి' పదంచేత భేదము లేదని చెప్పుతున్నాము. అభేదమని చెప్పుచున్నాము. ప్రకాశము ఒకటే పెట్టుకుందాం. వాచ్యార్థంలో మాయావరణలో ఉన్న దేశ కాల కలనా వస్తువులను అన్నింటిని కూడా వాచ్యార్థంగా విడిచిపెట్టి, లక్ష్యార్థమైన 'త్వం' ప్రకాశాన్ని తీసుకుంటే 'తత్'లో ఉన్నటువంటి ఆధారంగా ఉన్న పరబ్రహ్మ ప్రకాశమునందు ఆధారము అనే వాచ్యార్థమును తీసివేసి అధిష్ఠానంగా ఉన్నదని క్రొత్తపదం పెట్టుకున్నది. అప్పుడు అధిష్ఠానం అంటే నిస్సంకల్పము, నిర్వికల్పము, అచలము, పరిపూర్ణము. అప్పుడు అధిష్ఠాన ప్రకాశము త్వం ప్రకాశము రెండూ ఒకటే. రెండూ ఒకటే అనే వాక్యంచేత సచ్ఛిష్యుడు ఒక ప్రకాశం అనేటటువంటి లక్ష్యార్థాన్ని మాత్రమే పట్టుకొని ఆధార, ఆధేయాలనే సాపేక్ష నిర్ణయాన్ని విడిచిపెట్టి, తనకు తానే అదే ప్రకాశ రూపంలో స్వతఃసిద్ధమైతే అప్పటికే తనకు తానే స్వతఃసిద్ధంగా ఉన్న స్వయం ప్రకాశంలో ఉన్న 'తత్'తో సమానమయ్యెడు. శిష్యుడు సాధన కాబట్టి సమానమవ్వాలి అంటున్నాము. వస్తు నిర్ణయంగా చూస్తే స్వయం ప్రకాశ బ్రహ్మమే ఉన్నాడు. ఆ స్వయం ప్రకాశ పరబ్రహ్మ ఎప్పుడూ ఉన్నాడు. అది అధిష్ఠాన ప్రకాశము.

జలధియందు జలచరములు ఉంటున్నప్పటికీ ఆ జలధి జలచరములను పుట్టించదు గదా! ఈ జలచరములు వాటికవే పుట్టి సంసారం చేసి పిల్లలను పుట్టించి చచ్చును గదా! కాని ఆ జలచరములు ఏమి అనుకుంటాయి అంటే, ఈ నీరు మాకు ఆధారం అని. నీటిలోనుండి బయట వేసిన చేపలు గిలగిలా కొట్టుకొని మళ్ళీ నీటిలో వెయ్యగానే అమ్మయ్య బ్రతుకు జీవుడా అనుకుంటాయి. అప్పుడు ఆ జలరాశి జలచరములకు ఆధారమయ్యింది. ఎప్పుడైతే ఆ జలరాశిని అధిష్ఠానం అన్నామో అప్పుడు ఏమైంది? అధిష్ఠానమైన జలరాశి తనకు తానే స్వతఃసిద్ధమై దేనికీ ఆధారంగా గాని, కారణంగా గాని లేదు. ఈ జలచరాలు ఆధారమని అనుకున్నా, జలరాశి మాత్రము వాటికి అసంగము. అలాగే ఎరుక తనకు తానే పుట్టి అనేక వికారాలు చెంది అనేకత్వం చెంది నానా భేదాలతో ఉండి, చివరకు తనకు తానే క్షీణించి నశించుతూ మళ్ళీ పునరావృత్తి కూడా అవుతూ ఉంటుంది. బయలుకు అట్టి ఎరుకతో ఎటువంటి సంబంధము లేదు. చేపను అది పుట్టించదు, చేపను అది చంపదు. అయితే తనయందు ఈ జలచరములు పుట్టి సంసారం చేసి సంతానం ఉత్పత్తిచేసి నశించుతూ ఉంటే సర్వసాక్షిగా ఈ జలరాశి ఉన్నది. ఈ జలచరములు లేని ఎరుక అని గనుక అనుకొంటే జలరాశిని బయలు అనుకునేటట్లయితే ఈ జల రాశియందు లోపల వెలుపల ముల్రుచ్చు సందులేక బయలే ఉన్నది. జలరాశియే ఉన్నది. ఈ జలచరములు లేని ఎరుక గనుక, లేని ఎరుకలోనే

ఈ పద్ధతి అంతా నడుస్తోంది. ఎరుక అన్నా, మాయ అన్నా ఒకటే. మాయలో జరిగేవన్నీ ఎలా అయితే మాయాకల్పితమో ఇంద్రజాలంవలె కల్పితమో, ఎరుకలో కలిగేవన్నీ కూడా ఇంద్రజాలంవలె కల్పితములే. అలా **'మాయాకల్పిత దేశ కాల కలనా వైచిత్ర్య చిత్రీకృతం'**

అంతా కూడా లేనిదిగా చూచినపుడు అధిష్ఠానమనేది బయలే. అందుకని ఇక్కడ పరబ్రహ్మ ప్రకాశాన్ని అద్వైత సిద్ధాంతానికి అచల సిద్ధాంతానికిని మనం సమన్వయం చేస్తున్నాము. అధిష్ఠానమైనటువంటి బ్రహ్మము పరమసత్యం. ఆధార ఆధేయ పద్ధతులలో సత్, అసత్ ఉన్నది. కాని పరమ సత్యం అన్నామంటే ఏమిటి? దానికంటే అతీతమైనది. సత్యము అంటే సాపేక్షము. పరమ సత్యం అంటే సదసత్ విలక్షణం నిరపేక్షము. పరివర్తనమున్ను నానాత్వమున్ను మాయవలన కల్గుచున్నది. సృష్టి బీజమైనటువంటి పరబ్రహ్మ దానియందున్న అంకుర శక్తి అనే మాయా శక్తి వలననే ఈ జగత్తు ఆవిర్భవించింది. మాయాశక్తి వలన ఆవిర్భవించినవన్నీ కల్పితమే, లేనివే. లేనివి విచారించి లేనివిగా చూస్తే, బ్రహ్మ ఒక్కటే పరబ్రహ్మ ఒక్కటే. కనుక బ్రహ్మము ఈ సృష్టికి బీజం కాదు. బీజము అనుకున్నప్పుడు ఆధార, ఆధేయ పద్ధతి ఉన్నది. బీజం కాదు అన్నప్పుడు అధిష్ఠాన పద్ధతి ఉంది. అధిష్ఠానమైనటువంటి పరమ సత్యము అన్నాడు. అధిష్టానము అంటే సాక్షిత్వం కూడా లేదు. సంగత్వం, అసంగత్వం అనేటటువంటి రెండూ కూడా లేవు. తనకు తానే స్వతస్సిద్ధమై అంతటా నిండి నిబిడీకృతమై తాను తప్ప రెండో వస్తువు లేక రెండోది. ఏదైనాసరే తనయందు యుండుటకు ముల్లు గ్రుచ్చ సందుకూడా లేక నిరంధ్రమై ఉన్నది. రంధ్రము కానిది నిరంధ్రము. నిరంధ్రము అంటే ముల్లుగ్రుచ్చ సందు లేకపోవడం. పరివర్తనం అంటే పరిణామంగాని, వికారాలు నానాత్వము గాని లేవు. ప్రపంచం అంటే కొన్ని లక్షలాది నామరూపాలుగా లక్షలాది స్వభావాలుగా, గోళములుగా కనబడుతోంది. ఇది అంతా మాయవలన కలుగుతోంది అనంగానే మాయ అంటే ఏమో తెలియనివాళ్ళకు దీనికి ఆధారం ఈ బ్రహ్మ అనుకుంటారు. మాయ అంటే తెలిసినవాళ్ళకి మాయ పద్ధతిలో ఉన్నవన్నీ ఎరుక పద్ధతులే కనుక ఎరుక లేనిఎరుక కనుక, మాయ కూడా లేని మాయ కనుక, ఈ కల్పితమంతా లేనిదే. ఈ కనబడుతున్నవన్నీ లేనివే. లేనిది లేకుండా పోగా ఉన్నది ఏదో ఉన్నది. అదే పరమ సత్యం. ఎరుగబడనప్పుడు అదిపరమసత్యము ఎరగబడితే అది మాయ. మరి సత్యం అంటే ఏమై ఉంటుంది? ఎరగబడకుండా ఉంటే అనిర్వచనీయమైతే, అనిర్వాచ్యమైతే, ఎరుక ద్విపుటిగాను, త్రిపుటిగాను లేకపోతే అదే బయలు.

**యతోవాచో నివర్తంతే । అప్రాప్య మనసాసహా ।** తెల్సుకుందామని వెళ్ళినటువంటి వాక్కు గాని, మనస్సు గాని తెల్సుకోలేక వెనుతిరిగి వెళ్ళిపోయినా లేక అక్కడికక్కడే సత్యసాక్షాత్కారమైతే అసత్యమైన మనస్సు, వాక్కు నిరశించబడితే లేనివి లేకుండా పోతే ఈ మాటలు అన్నీ మాయ నిర్వచనము క్రిందకు వచ్చినవన్నీ లేకపోతే ఏది ఉన్నదో అదే బయలు. మాయోపాధి వలన బ్రహ్మము జగత్తునకు ఉపాదాన కారణము. మాయను ఉపాధిగా ధరించినటువంటి బ్రహ్మకి మాయ అనేది బ్రహ్మ చుట్టూ వున్న ఒక ఆవరణము అయినపుడు ఆ బ్రహ్మ యొక్క ప్రకాశం మాయావరణలోని ప్రకాశం వ్యాపించినపుడు లోపల ఉన్న బ్రహ్మ ఏమో బ్రహ్మత్వము. బయట వున్నది మాయావరణ. మాయావరణయే బ్రహ్మ చుట్టూ ఉన్నట్టి తొడుగు, కంచుకము, జాకెట్టు. నీ ఆత్మకు తొడుగు నీ శరీరం. తొడుగే శరీరం. ఈ శరీరాన్ని ఉపాధి అంటాం. కనుక బ్రహ్మకు మాయే ఉపాధి. మాయే తొడుగు. మాయే ఆవరణ. మాయే శరీరం. శరీరం అంటే నశించేది. మాయలో ఉన్నవన్నీ నశించేవేగా! మాయ కూడా పోయేదేగా! బ్రహ్మ సాక్షాత్కారమందు, అపరోక్షానుభూతియందు మాయ కూడా పోయేదే. మాయ కూడా **శీర్యతే ఇతి శరీరః.** మాయకూడా నశించేదే. అందుకని ఇక్కడ మాయోపాధి అన్నాము. ఈ మాయోపాధిలో తోచినవాడు ఎవరు? ఆధారము ప్రకాశముగా తోచినవాడు బ్రహ్మ. దానికి ప్రతిబింబ ప్రకాశముగా తోచినవాడు ఈశ్వరుడు. అవిద్యోపాధిలో తోచినవాడు ఎవరు? ప్రతిబింబ ప్రకాశముగా తోచినవాడు జీవుడు. మాయ ఆవరణగా ఉన్న బ్రహ్మ సర్వసాక్షి, సర్వాధారము. మాయ లేనిది కదా అని, ఆ మాయలోనే అధిష్ఠాన బ్రహ్మ ప్రకాశాన్ని కనుక గురు కృపతో అందుకోగల్గితే అది తనకు తానే ఉండి తనకు వేరే క్రొత్త ఆధారము లేక, నిరాలంబయై దానినుండి నానాత్వం గాని, బేధాలు కాని కల్పించబడకుండా ఉన్నది. నిరావరణ బ్రహ్మ ప్రకాశము స్వయం ప్రకాశముగా సిద్ధిస్తుంది. అపరోక్షానుభూతిగా సిద్ధిస్తుంది. ఆ సిద్ధించినదే పరమ సత్యం.

తోచుచున్నది అనే పదం ఎప్పుడైతే వాడామో అది మాయాకల్పితం అని, విచారించితే లేనిదని తెల్సుకోవాలి. ఒక్కొక్క పదం ఎలా ఎందుకు ఎక్కడ తూకం వేసి వాడుచున్నారో తెల్సుకుంటే ఒక్క నాలుగు పేజీలు ఈ పుస్తం చదివితే చాలు. మీకే నిర్ణయం అయిపోతుంది. మీరు చదువుకొనడానికి మేము చెప్పడానికి తేడా ఏమీ లేదు.

జగద్దృశ్యమునకు అధిష్ఠానమైన పరమ సత్యము అంటున్నారా బ్రహ్మని. జగత్తు దృశ్యమయింది అంటే ఎక్కడ అయింది? దృశ్యమంతా కూడా మాయావరణలోనే దృశ్యముగా ఉంటున్నది. మాయ యొక్క ఆవరణ లేకపోతే పరబ్రహ్మము కేవలంగా ఉంటాడు. దానికి ఇక దృశ్యము వుండదు. దృశ్యాలన్నీ మాయావరణములోనే ప్రకటించబడుచున్నాయి. ప్రతీతియగుచున్నది.

**యద్ దృశ్యం తన్నశ్యం**. ఎందుకని? దృశ్యమంతా మాయలోనే ఉన్నాయి గనుక. నిరావరణ బ్రహ్మయందు దృశ్యమే లేదు గనుక. మాయను దాటిన వాడికి దృశ్యము లేదు. మాయలో ఉన్నవాడికి దృశ్యం సత్యం. అవిద్యలో ఉన్నవాడికి దృశ్యం బాధాకరం. మాయను దాటిన వాడికి దృశ్యం నశ్యం. మాయను ఎవరైతే దాటారో అధిష్ఠాన ప్రకాశమే తానై ఉంటాడు. అధిష్ఠాన ప్రకాశం అనేది అందుబాటుకోసం ఆ పదం వాడి, తత్త్వమసి వాక్యార్థలో ఆవరణయందు, నిరావరణయందు కూడా కామన్‌గా ఒకే ప్రకాశం ఉన్నదని. అది ఆవరణ ప్రకాశంలో త్వం అనే బ్రహ్మ జ్ఞానంలో ఉన్నది అని, తత్త్వమసి అనగా ఈ ప్రకాశము ఆ ప్రకాశము ఒక్కటే అయినప్పుడు, మాయావరణయందు కల్పించుకొన్నవన్నీ వాచ్యార్థముగా విడిచిపెట్టి, నిరావరణయందు అనగా మాయను దాటిన తరువాత ఏదైతే ఉన్నదో అదీ ఇదీ ఒక్కటే అని అసి పదం చెప్తుతోంది. కనుక ఇదీ అదీ ఒక్కటే అనేది పట్టుకోవడానికి పరబ్రహ్మ ప్రకాశమును అధిష్ఠానము అని పేరు పెట్టాము.

**అసంగుడైన బ్రహ్మమం దనాదిమాయ లేనిదై ।**
**ముసుంగు కప్పినట్లు మూలకారణాంశమై ।**
**పొసంగి విశ్వమందు జేరి భూతభౌతికాదులై ।**
**మసంగి చచ్చి పుట్టుచుండు మారులేక నంతటన్ ॥**

మసంగి అంటే మసలడం. మసలడం అంటే పరిణామము చెందుతూ ప్రవర్తించటం. తాను పరిణామము చెందుతూ ప్రవర్తించడాన్ని కదలడము, మెదలడము అంటే తేడా ఏమిటి? అని శిష్యుడు అడిగాడు. మెదలడం కూడా కదలటమే. పరిణామ శీలంగా కదలడం, మెదలడం. ఊరికే అలా కదిలి ఊరుకోవడం కదలడం. పరిణామ శీలంగా ఒక కదలిక అనేది అనేక కదలికలకు కారణంగా ఒక గొలుసుకట్టు కదలికలను మెదలుట అంటారు. కదలినా మెదిలినా ఒకటే అంటాము. ఒక కదలికకు కదలిక అంటాము. అనేక కదలికకు పరిణామంలో పరివర్తన అంటాము. అప్పుడు అది మెదలుట అంటాము. అందుకనే మసంగి చచ్చి పుట్టుచుండు మారులేక అంతటన్ అంటున్నాము.

పుట్టటము అంటే దృశ్యములోకి రావడము. చావడము అంటే దృశ్యం నశించడము. దృశ్యంలోకి రావడము దృశ్యము నశించడము. దృశ్యము నశించినపుడు అవ్యక్తంలోకి వెళ్ళుతుంది. దృశ్యం కనబడినప్పుడు అది సృష్టి అనే పేరుతో పిలువబడుతుంది. మసంగి చచ్చి పుట్టుచుండు మారు లేక అంతటన్. కనుక సృష్టి అంటే దృశ్యంలోకి రావడము మళ్ళీ పోవడము నిరంతరాయంగా అదే మళ్ళీ మళ్ళీ జరుగుతూ ఉంటుంది.

క్రొత్త రూపం దృశ్యం అవుతుంది. పాత రూపం లయం అవుతుంది. అలా బాల్యం లయం అయి, యవ్వనం వచ్చింది. యవ్వనం లయం అయి, వృద్ధాప్యం వచ్చింది. వృద్ధాప్యం లయం అయింది. అవ్యక్తంలోకి వెళ్ళింది. మరణం తర్వాత మళ్ళీ పుట్టాం. అవ్యక్తం నుండి పుట్టడం ద్వారా మళ్ళీ వ్యక్తమైనది. వ్యక్తమైన ప్రతీది కూడా దృశ్యం. అందుకని జగత్ దృశ్యం అనే పదం వాడడానికి కారణం. దృశ్యం అనగానే మనసులో ఇది నశ్యం వెంటనే గుర్తుకు రావాలి. అధిష్ఠానం అంటే తనకు తానే ఉన్నానని గుర్తుకు రావాలి. చేపలకు ఆధారం అనుకొన్నప్పటికీ అధిష్ఠానం ఉన్నది. కాని ఆధార ఆధేయ పద్ధతులలో లేదు. జలచరములకు ఆధారమే. అధిష్ఠాన పద్ధతిలో తనకు తానే స్వతసిద్ధమైన జలరాశికి చేపలయొక్క ఉనికి గాని, పరిణామాలు గాని తెలియదు. అయినా ఆ జలరాశి వుంది కదా! అది అచలమై, బయలై, పరిపూర్ణమై ఉన్నది ఉన్నట్లు ఉన్నది. **దేనికీ ఆధారం కాని దాన్ని అధిష్ఠానం అనడం ఆనవాయితీ**. మాయను గనుక ఒప్పుకుంటే బ్రహ్మము ఉపాదాన కారణము. మాయ లేనిదే అని విచారణ చేత, లేకుండా చేస్తే బ్రహ్మ ఉపాదాన కారణమూ కాదు. నిమిత్త కారణమూ కాదు. మూల కారణము కాదు. మూల కారణం యొక్క అంశీభూతము కూడా కాదు. ఇవన్నీ కాదు కాదు అని చెప్పి, ఏదైతే ఉన్నదో అది అధిష్ఠానము. అందుకని అధిష్ఠానము అనే మాట వాడాము. బ్రహ్మమునందు మాయ వచ్చేసరికి, మాయ ఎప్పుడైతే వచ్చిందో, అచల పరిపూర్ణ బ్రహ్మమందు జగత్తు మాయ కారణంగావచ్చి దానియందేయుంటూ, దానియందే లయించుచున్నది. మాయ బదులు బ్రహ్మను గనుక తీసుకుంటే వచ్చిపోయేది యేదయ్యా అంటే మాయాశబలిత బ్రహ్మ. కనుక ఎరుక బ్రహ్మకు రాకడ పోకడలున్నాయి.

అది అన్ని కాలాలలో ఉన్నది ఉన్నట్లుగా ఉన్నది. అందుబాటైనదే అధిష్ఠాన బ్రహ్మ. దొరకాలిగా! లేకుంటే ఎలా పట్టుకుంటారు? మాయ దాటితే అందరు పరబ్రహ్మమే. మాయలో ఆ పరబ్రహ్మను ఎలా పట్టుకోవాలి?

పరబ్రహ్మ యొక్క ప్రకాశము తనలోనూ ఉన్నది. మాయావరణలోను ఆ ప్రకాశమే ఉన్నది. అసిపదముచేత మాయావరణలోనున్న ప్రకాశమును పట్టుకుంటే, అది నిరావరణ పరబ్రహ్మ ప్రకాశమునకు అభిన్నము. ఆ దృష్టితో పట్టుకుంటే, అద్వైతము సిద్ధించినప్పుడు ఏ ప్రకాశమూ లేక, నిష్కళయై, బయలై ఉంటుంది.

బ్రహ్మము జగత్తునకు నిజమగు విరక్తి కారణం. తనలో తాను రమించడం అనేది రక్తి. బ్రహ్మము జగత్తునకు నిజమగు విరక్తి కారణం. బ్రహ్మకు ఆనందం కలిగితే జగత్తు వచ్చిందంటారు. బ్రహ్మకు ఆనందం రాకపోతే జగత్తు లేదు. బ్రహ్మలో ఒక ఆనందం ప్రకటించబడింది. బ్రహ్మములో ప్రకటించబడిన ఆనందం కారణంగా సృష్టి సంకల్పమై, ఆ సంకల్పంచేత సృష్టి కల్పించబడినది. అంటే ప్రపంచం కల్పించబడినది. తనలో తాను రమించకుండా తన ఆనందం ఈ సృష్టికి కారణం కాకుండా ఉన్నప్పుడు ఈ సృష్టి లేదుగా! మాయా సహకారి కారణం. బ్రహ్మయందు ఆనందం ఘనరూపంలో ఉన్నది. రక్తి అంటే అనుభవ రూపంలో ఉన్నది. అనగా సాధకుడికి అనుభవ రూపంలో ఉన్నది. అపరోక్షానుభూతి అన్నప్పుడు ద్వైతం లేదు. ద్వైతం లేనపుడు బ్రహ్మము యొక్క ఆనందమే స్వానందము. అది రక్తి. స్వానంద ఘనుడైన బ్రహ్మకు జగత్తుపై రక్తి లేదు. అనగా విరక్తుడు. జగత్సంకల్ప లేనందున విరక్తుడు.

**నిరావరణ బ్రహ్మము యొక్క తత్త్వాన్ని ఈ మాయ మాయావరణములోకి లాకొచ్చి ప్రకటించింది. ఆ ప్రకటించిన బ్రహ్మము ఆధార ఆధేయ పద్ధతిలో దొరుకుతాడు. అందుకనే మాయ మంచి పనే చేసింది. నన్ను దాటిపోతేనే అది ఉన్నది అంటే మాయను దాటడం ఎవరి వశం? మాయలో కూడా బ్రహ్మను చూపిస్తోంది. ఇదీ అదీ ఒకటేనంటూ దాన్ని పట్టుకోండి అని.** మొట్టమొదట మాయలోనున్న బ్రహ్మను పట్టుకోండి. మాయ నాకు సహాయం చేస్తోంది అని, తరువాత జగత్తుమీద విరక్తితో మాయను దాటినపుడు నిరావరణ బ్రహ్మయందు స్వరతి కలుగుతుంది. అదే అపరోక్షానుభూతి.

నేతి నేతి వాక్యంతో నిరపేక్షమైనటువంటి బ్రహ్మ స్వప్రకాశ బ్రహ్మగా అపరోక్షానుభూతిగా మిగిలిపోతాడు. శేషిస్తాడు. ద్రష్టత్వం లేని దృక్కు అవ్వాలి. ద్రష్టత్వం ఉంటే త్రిపుటిలోకి వెళ్ళిపోతాడు లేక ద్విపుటిలోకి వెళ్ళిపోతాడు. ద్రష్టత్వం కోల్పోయిన దృక్కు అయితే పరబ్రహ్మ అవుతాడు. జగత్తు బ్రహ్మయొక్క విలాసం. జ్ఞానాజ్ఞానాలనుండి విడుదలైన తరువాత కేవల బ్రహ్మము తానే అయినపుడు మాయను అధిగమించినపుడు ఈ స్థూల శరీరం మానవుడికి ఆయుష్షు కాలం పూర్తి అయ్యేదాకా వుంటుంది గనుక, శరీర ప్రారబ్ధం నడిపిస్తుంది కనుక, దృశ్యాత్మ నుండి విడివడి దృగాత్మగా ఎవరైతే ఉన్నారో ఆ దృశ్యాత్మకి ఈ దృశ్యమాన ప్రపంచం అంతా మాయా విలాసం చిద్విలాసం. విలాసం అంటే అడ్రస్. మాయలోనే బ్రహ్మకు అడ్రస్ ఉంది. నిరావరణమందు బ్రహ్మకు అడ్రస్ కూడా లేదు. ఉనికి ఉంటేనే అడ్రస్ ఉంటుంది. కాని ఉనికి లేదుగా! ఉనికే సత్‌చిత్ ఆనందం. ఉనికి లేకపోవడమే సత్యం జ్ఞాన అనంతం బ్రహ్మ. జగత్తు బ్రహ్మ యొక్క విలాసం. జగత్‌లో బ్రహ్మ యొక్క అడ్రస్ ఉంది. ఈ జగత్తులో వెతుక్కోండి, వెతకండి. చిత్తు జడమందు జడమును ఇది కాదు, ఇది కాదు అంటే చైతన్యమే ఆ బ్రహ్మ యొక్క విలాసం. దాన్ని ఆధారంగానే తీసుకున్నాము. దాన్ని అధిష్ఠానంగా తీసుకుంటే ఏమయింది? ఈ విలాసం కూడా కోల్పోయింది. అడ్రసు కూడా పోయింది. నిరావరణ బ్రహ్మయందు విలాసం లేదు. ఈ విలాసమంతా కూడా అవ్యక్త బ్రహ్మమందు సంకల్పం యొక్క అభివ్యక్తమే! ముందుగా దృక్ స్థితికి వచ్చి, విశ్వ రూపంలో అవ్యక్తంగా ఉన్నదంతా వ్యక్తరూపంలోకి తెస్తూ సూక్ష్మంలో బ్రహ్మాండంగాను స్థూలంలో పిండాండంగాను, తనకు తానే అభివ్యక్తమయింది. అభివ్యక్తం అంటే ఏమిటి? అభి అంటే తనకు తానే. అభిజ్ఞ అంటే తాను తానైనటువంటి జ్ఞానం. ప్రత్యభిజ్ఞ అంటే తాను తానైన జ్ఞానమే మధ్యలో భ్రాంతిలో కోల్పోయి, భ్రాంతి రహితం కాగానే, తిరిగి తనజ్ఞానం తనకే మళ్ళీ కలగడాన్ని ప్రత్యభిజ్ఞ అంటారు. అభిజ్ఞ అంటే తాను తానైన జ్ఞానము. ప్రత్యభిజ్ఞ అంటే మళ్ళీ తాను తానైనటువంటి జ్ఞాన స్వరూపము. మళ్ళీ అనడం వలన ఏమైంది? ఈ మధ్య కాలంలో భ్రాంతి వచ్చి, తరువాత పోయి, తాను పరబ్రహ్మనే, అనే అపరోక్ష జ్ఞానము.

ఒక రాక్షసుడు తనయొక్క స్వరూపాన్నే నాలుగు స్వరూపాలుగా చేసి వాళ్ళకు మనసు లేని వారిగా జేసి, కీలు బొమ్మలుగా జేసి, రోబోలుగా చేసి ఆ రాక్షసుడు తన సంకల్పం చేత నలుగురిని కూడా నాలుగు దిక్కులకు పంపించి యుద్ధములు చేయిస్తూ నడిపిస్తాడు. వాళ్ళకు స్వంత మనస్సు లేకపోవడం చేత వాళ్ళకు జాలి, దయ ఏమీ ఉండవు. ఆ రాక్షసుడి పేరు శంబరాసుడు. అతని శక్తి శంబరశక్తి అంటే మాయా శక్తి. అంటే తానే మరో నలుగురిగా అభివ్యక్తమైనాడు. మనసంతా తన దగ్గర పెట్టుకుని మిగిలిన నలుగురికి మనస్సు లేకుండా పంపించాడు. ఇది యోగవాసిష్ఠ కథ.

అలాగే బ్రహ్మ జగత్తుగా, జీవుడుగా, ఈశ్వరుడిగా, అభివ్యక్తమయ్యాడు. నిజానికి అభివ్యక్త మయ్యాడా! మాయావరణ యందు కల్పించబడ్డాడు. ఏ బ్రహ్మమైతే ఇన్ని రకాలుగా అభివ్యక్తమగుచున్నాడో ఆ బ్రహ్మము కూడా మాయాశబలిత బ్రహ్మమే. నిజం విచారిస్తే ఆ **బ్రహ్మకొచ్చిన సంకల్పమే మాయ కాని, బ్రహ్మ మాయ కాదు. మాయ బ్రహ్మ కాదు**. మాయాతీతమైనటువంటి పరబ్రహ్మమందు ఒక సంకల్పము మాయ కారణంగా కల్గింది. అంతేకాని బ్రహ్మకు సంకల్పం రాలేదు. బ్రహ్మలో వచ్చిన సంకల్పం మాయాకల్పితం. మాయ హద్దు ఎక్కడుంది? నిర్వికార బ్రహ్మమందు మాయే సంకల్ప రూపంగా నిర్గుణ బ్రహ్మను సగుణ బ్రహ్మగా, అభివ్యక్తం చేసింది. వెంటనే ఆ బ్రహ్మమందు మరో సంకల్పం వచ్చింది. నేనే నానాత్వం చెందుగాక! అని. ఆ బ్రహ్మమే నానా రూపాలుగా విశ్వ రూపాన్ని ధరించింది. తిరుగు ప్రయాణంలో ఈ విశ్వ రూపాన్నే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అంటున్నాం. తిరుగు ప్రయాణంలో విశ్వ రూపుడు అయ్యాడు. ఆ విశ్వ రూపంతో తాదాత్మ్యం చెందితే తానే విశ్వరూపుడు. ఆ విశ్వరూపం నుండి కూడా తాదాప్మ్యత విడివడితే తాను పరబ్రహ్మ. ఎక్కడికక్కడ దృక్కు తాదాత్మ్యత, దృశ్య తాదాత్మ్యత ఈ రెండు రకాలున్నాయి. దృక్కైనవాడు దృశ్యంతో తాదాత్మ్యం చెంది దృశ్యాకారం పొందుతున్నాడు. కాని తాదాత్మ్యత లేకుంటే, దృక్కు కూడా లేదు. అప్పుడు దృక్కు పరబ్రహ్మమే. ఆ దృక్ స్ఫురణ కూడా నిర్వికల్పమైతే ఆ పరబ్రహ్మయే అచల పరిపూర్ణ పరబ్రహ్మము. తాడు వస్తువు కూడా ఇంతకాలం తాడు ఆధారం అని పొరపాటు పడ్డాము. ఇప్పుడు తాడు ఆధారం కాదు, అధిష్ఠానం. అధిష్ఠానం అనే పదాన్ని ఎందుకు వాడారు? అనే దానికి దాన్ని చెప్పుకొచ్చాము ఇప్పటిదాకా!

## ప్రణవ ప్రకరణము




ఇక్కడ 'ఓం' బొమ్మలో 1,2,3,4,5 అంకెలు వేశారు.

శ్లో॥ **ప్రథమం తారకంచైవ, ద్వితీయందండ ముచ్యతే ।**
**తృతీయం కుండులాకారం చతుర్థంచ అర్థ చంద్రికం ।**
**పంచమం బిందు సంయుక్తం, ఓం ఇతి జ్యోతి స్వరూపం ॥**

**ప్రథమం తారకం చైవ :** తారకం అంటే తరింపజేసేది, అని ఒక అర్థం. ఇక్కడ '1' అంకె దగ్గర 'ఓం' బొమ్మ చూస్తే ఒక అర్థ చంద్రాకారంగా గొడుగులాగా ఉంటుంది.

**ద్వితీయం దండముత్యతే :** '2' అంకె దగ్గర నిట్టనిలువుగా గీత దండంలాగా ఒక కఱ్ఱలాగా ఉంటుంది.

**తృతీయం కుండలాకారం :** '3' దగ్గర చూస్తే కుండలాకారంగా. కుండకు ఏ కర్వు ఉంటుందో ఆ కర్వు '3' దగ్గర ఉంది.

**చతుర్థంచ అర్థచంద్రికం :** '4' దగ్గర ఏమో చంద్రుడు పూర్ణ చంద్రుడిపైన సగం తీసివేస్తే అర్థ చంద్రాకారం ఉన్నది.

**పంచమం బిందు సంయుక్తం :** దాని ప్రక్కన ఒక బిందువు పెట్టాం. బిందువు అంటే సున్నా.

**ఓం ఇతి జ్యోతి స్వరూపం :** ఇదే జ్యోతి స్వరూపం. జ్యోతి స్వరూపం ఎప్పుడు వచ్చింది? 'ఓ'కి పైన ఒక 'పొల్లు' పెట్టాం. అదే జ్యోతి.

'ఓ'కి పైన పొల్లుకు అంకె వెయ్యలేదు. పొల్లు లేదు. 1, 2, 3, 4, 5 చెప్పినప్పుడు పొల్లు చెప్పలేదు. అదే జ్యోతి స్వరూపం. ఈ జ్యోతి స్వరూపమే ప్రణవం. ప్రణవానికి **'ఓం'** కారానికి ఏమిటి తేడా? **'ఓం'** కారం యొక్క అవ్యక్త స్థితి ప్రణవం. ప్రణవం యొక్క వ్యక్త స్థితి **'ఓం'**కారం. **'ఓం'**లో **'అ'**కార, **'ఉ'**కార, **'మ'**కార మాతృకలున్నాయి. ప్రణవం దగ్గర ఏ మాతృకా లేదు. ఏ మాతృకా కాని ప్రణవం అమాతృక. ఒక రకంగా అమాతృకా ప్రణవం ఏమిటంటే, నాదము. నాదమంటే శబ్దము యొక్క అవ్యక్త స్థితి ప్రణవం. **'ఓం'** యొక్క అవ్యక్త స్థితి ప్రణవం. నిశ్శబ్దమే శబ్దంగా మారిందా? నిశ్శబ్దమే నిశ్శబ్దంగా ఉండగా, శబ్దాలు వచ్చాయా? మీరందరు ఆలోచించండి. నిశ్శబ్దం, నిశ్శబ్దంగా ఉండగా, నిశ్శబ్దమందు కొన్ని శబ్దములు వచ్చి, ఆ శబ్దములే ఆగిపోయినవా? ఎప్పుడూ నిశ్శబ్దమే రాజ్యమేలుతోంది. అప్పుడు సృష్టి లేదు. నిశ్శబ్ద బ్రహ్మమే శబ్ద బ్రహ్మగా మారాడు. అంటే శబ్దము నిశ్శబ్ద బ్రహ్మయందు అవ్యక్తంగా ఉన్నది. అప్పుడు నిశ్శబ్ద బ్రహ్మ నుండి శబ్దం వ్యక్తమైనది.

శబ్దం ఏ రకంగా ఉంది? ముందు **'ఆ...ఆ...ఆ..'** అని వ్యక్తమైనవి. నోరు సున్నా ఆకారంలో పెట్టితే **ఊ...ఊ...ఊ...** అని వ్యక్తమైంది. పెదవులు రెండు మూస్తే **'మ్'** అని వ్యక్తమైంది.

మూసి అలాగే ఉంచితే **'మ'** కారం కొనసాగేలా, **'మ్'** అనే శబ్దం వచ్చింది. **'అ'**లో ఒక శబ్దం ఉన్నది. **'ఉ'**లో కూడా శబ్దం ఉంది. **'మ్'** అనటంలో కూడా ఒక శబ్దం ఉన్నది. అకార, ఉకారం, మకారం అనడం అంతా పూర్తి అయిన తరువాత కూడా **'ఓ...మ్'** అని శబ్దం కంటిన్యూ చేస్తున్నాం. ఒక మూగవాడు **అ, ఉ, మ** అని అనగలడా? మూగవాడు అనలేడు. మాట బయటికి వ్యక్తం కానివాడు శబ్దం బయటకు వ్యక్తం చేయలేనివాడు అనలేడు. ఎవరైతే శబ్దం బయటకు వ్యక్తం చేయడో వాడికి మాటలు రావు. అప్పుడు ఎట్లా అంటాడు? అదే మాటలు వచ్చినవాడు ఎలా అంటాడు? **ఆఆఆ, ఊఊఊ మ్మ్మ్** అంటాడు. ఆ ఊమ్ అంటానికి ముందు వీటియందు అన్నిటిలో ఒక శబ్దం ఉంది. ఆ శబ్దమే తురీయం. ఈ శబ్దం అవ్యక్తంగా ఉన్నప్పుడు తురీయాతీతం. అందుకే ఇప్పుడు ఏమి చెయ్యాలి. ఆ...ఆ... అంటూ ఉలోకి మారండి. **ఆ..ఆ...ఊ..** అంటూ ఊలో నుండి మ్‌కు వెళ్ళి **ఊఊ....మ్** అనండి. మకారం అయిన తరువాత వట్టి శబ్ద కంటిన్యూ చెయ్యండి. **ఆ...ఊ...మ్...** అనేది ఆగితే కేవలం ఒక శబ్దం ఉంటుంది. అదే తురీయం. మాట మొదలు పెట్టాక ముందు ఏమున్నది? నిశ్శబ్దం. నిశ్శబ్దం శబ్దంగా మారలేదు. నిశ్శబ్దమందు వేరుగా శబ్దములు కలిగి మళ్ళీ ఆగినవి. శబ్దానికి శబ్దానికి మధ్య నిశ్శబ్దమే ఉన్నది. **నిశ్శబ్దం బ్రహ్మ ముచ్యతే.**

**'అ'**కారం అంటే స్థూలము, **'ఉ'**కారము అంటే సూక్ష్మము. **'మ'**కారం అంటే కారణము స్థూల, సూక్ష్మ, కారణాలే, అకార, ఉకార, మకారాలు. అఉమ్‌లో కామన్‌గా ఉన్న శబ్దమే తురీయం. శబ్దం యొక్క అవ్యక్త స్థితి ప్రణవం. అంటే ప్రణవంలో శబ్దం అవ్యక్తంగా ఉన్నది. కనుక ప్రణవము నిశ్శబ్ద బ్రహ్మ కాదు, శబ్ద బ్రహ్మమే. తాత్కాలికంగా శబ్దం అవ్యక్తంగా కలిగినవాడు ప్రణవ స్వరూపుడు. ప్రణవ స్వరూపుడు తాత్కాలికంగా నిశ్శబ్దంగా ఉన్నా, శబ్ద బ్రహ్మ అందులో అవ్యక్తంగా ఉండి వ్యక్తమయ్యేసరికి అ,ఉ,మ కారములుగా వ్యక్తమయ్యాడు. ఈ ఓంకారమునకు అంతరార్థము చెప్పుకుందాము.

**ప్రథమం తారకంచైవ:** తారక యోగంలోకి వెళ్ళామండి.

**ద్వితీయం దండముచ్యతే :** వెన్ను దండాన్ని వెన్నుపూసను నిట్టనిలువుగా ఉంచాము.

**తృతీయం కుండలాకారం :** నిట్టనిలువుగా ఉన్న వెన్ను పూసలో కుండలి శక్తిని మేలుకొలిపాము. మూలాధారం నుండి పైకి ప్రయాణం చేస్తున్నాము.

**చతుర్థకం అర్థ చంద్రికం :** అర్థచంద్రికం అంటే సహస్రారం పైన ద్వాదశాంతమున ఒక చంద్రకళా స్థానమున్నది. ఆ చంద్ర కళాస్థానమే అర్థ చంద్రిక.

**పంచమం బిందు సంయుక్తం :** బిందువుతో కల్సిపోయినది. బిందువుతో కలవడం వలన ఏమైంది. అర్థనారీశ్వరి యొక్క దర్శనం జరిగింది. శివుడు పార్వతి. అనగా ప్రకృతి పురుషులు కలయికగా ఉన్నట్టి చిత్ జడం, రెండు కల్సినటువంటి దర్శనం జరిగింది. ఓంకారం రూపంలో ఈ మాదిరిగా వచ్చింది. మళ్ళీ **'ఓ'**కి పొల్లుగా ఉన్నది ఏదో అదే జ్యోతి.

తారక యోగంలో ప్రవేశించి వెన్నుపూసను నిట్టనిలువుగా దండలాగా పెట్టి లోపల కుండలిశక్తిని జాగరణ చేసుకొని సహస్రారం దాకా ప్రయాణం చేసి అర్థనారీశ్వరుని దర్శించి, చంద్రకళా స్థానానికెళ్ళి జ్యోతి దర్శనం చేసుకోవాలి.

ఇప్పటివరకు చెప్పినది ఒకసారి చూస్తే, ప్రణవమందు శబ్దం అవ్యక్తంగా ఉన్నది. ప్రణవం నిశ్శబ్దం బ్రహ్మ కాదు. ప్రణవమందు శబ్దం అవ్యక్తంగా ఉన్నది. ప్రణవమునుండి నాదం వచ్చింది. ప్రణవనాదము బ్రహ్మనాదము అంటారు. ప్రణవం నుండి నాదం వచ్చింది. ఆ నాదంలో కళలు లేవు. అ,ఉ,మలు ఎప్పుడైతే వచ్చినవో ఆ నాదం కళలతో కూడినది. ఆ కళలు అవ్యక్తంగా ఉండి సృష్టి బిందువుగా ఏర్పడి ఉంది. ఆ బిందువు నుండి అకార ఉకారమకారమనే కళలు వ్యక్తమయ్యాయి. ఈ విధముగా నాద బిందు కళలు మూడు వచ్చినవి. సృష్టి బిందువే వ్యాపించి సృష్టి బిందువునుండి విమర్శ బిందువు వచ్చి ఆ విమర్శ బిందువు నుండి మిశ్రమ బిందువు వచ్చి మూడు బిందువులయందు ప్రకాశం, మండలత్రయ ప్రకాశమై, ఆ మూడు బిందువులు త్రికోణముగా, త్రిభుజముగా కల్సినపుడు, అంతర దీపికగా ఒక ఎరుక పుట్టింది. అదే ప్రజ్ఞ.

ఎరుక పోవాలంటే ఏమి కావాలి? నిశ్శబ్ద బ్రహ్మ కావాలి. ప్రణవం ఏమిటి? శబ్దంయొక్క అవ్యక్త స్థితి, వ్యక్త స్థితి ఎలా ఉన్నది? త్రిపుటులుగా దృక్కు, దృశ్యము దర్శనములుగా, జ్ఞాత జ్ఞానము జ్ఞేయముగా, ధ్యాత ధ్యానము ధ్యేయముగా, అకార ఉకార మకారములుగా, స్థూల సూక్ష్మ కారణాలుగా, విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతులుగా, విశ్వ తైజస ప్రాజ్ఞులుగా, అకార ఉకార మకారములును ఇన్ని రకాలుగా ఇన్ని త్రిపుటులుగా భావన చేస్తే ఈ మూడు రకాలుగా వచ్చిన యావత్ సృష్టియందు ప్రణవము సర్వ వ్యాపకముగా ఉన్నది. అందువలన ఈ సృష్టి యావత్తు ప్రణవాత్మకం. ఈ ప్రణవమే అన్నిటియందు వ్యాపించి ఆత్మగా, అన్నిటికీ కేంద్రంగా, అన్నిటికి అంతరాత్మగా ఉన్నది. అకార మాతృకలో ప్రణవం ఉన్నది. ఉకార మాతృకయందు ప్రణవం ఉన్నది. మకార మాతృకయందు ప్రణవం ఉన్నది. అర్థ మాతృకలో కూడా ప్రణవం ఉన్నది. అది అ మాతృక అయినప్పటికీ కూడా శబ్దం యొక్క అవ్యక్త స్థితి ఉన్నది.

అసలు బ్రహ్మ ఎలా ఉన్నాడు? ముందు నిశ్శబ్ద బ్రహ్మగా ఉన్నాడు. తరువాత నాద బిందు కళగా ఉన్నాడు. **'ఓ'**కి కుడి ప్రక్క సున్నాలో చేర్చితే ఓం అయినది. **ఓం** నుండి సృష్టి వచ్చినది. ఓం యే మహత్తు. మహత్తు నుంచే మహదహంకారం ద్వారా సృష్టి వచ్చింది. ఓం నుండి మూడు గుణాల సృష్టి వచ్చింది. అకార ఉకార మకారాలే మూడు గుణాలు. ఓం నుండి త్రిపుటి వచ్చింది. ఓం నుండి జ్ఞాత జ్ఞేయం జ్ఞానం వచ్చినవి. ఓం నుండి స్థూల, సూక్ష్మకారణ సృష్టి వచ్చింది. ఓం నుండి మూడవస్థలు వచ్చినవి. వ్యష్టిలో సమష్టిలో కూడా జీవుడికి ఈశ్వరుడికి కూడా ఓంయే మూలం. సృష్టికి ఓంయే మూలం. అప్పుడు ప్రవణము ఆధార బ్రహ్మ అయ్యాడు.

జగత్తుకు మూలం ఓంకారము. ఓం తనకు తానే పుట్టింది. నిశ్శబ్దంలోనుండి శబ్దం తనకు తానే వచ్చింది. నిశ్శబ్దం ఎప్పుడూ రాజ్యం ఏలుతుంది. అప్పుడప్పుడు శబ్దాలు వాటికవే వచ్చి మరల అణిగిపోతున్నాయి. శబ్దాలు పుట్టి అణిగిపోతున్నాయి. శబ్దాలు పుట్టి అణిగే లోపల మరో శబ్దం పుట్టేలోపు గ్యాప్‌లో నిశ్శబ్దమే ఉన్నది. శబ్దాలు ఎప్పుడూ లేనపుడు, శాశ్వతంగా నిశ్శబ్దమే ఉన్నది. త్రిపుటిలయొక్క ఎరుక, అనగా జ్ఞాత అనే ఎరుక, జ్ఞేయమనే ఎరుక, జ్ఞానమనే ఎరుక లేనపుడు బయలే ఉన్నది. జ్ఞాత జ్ఞాన జ్ఞేయముల యొక్క ఎరుకయొక్క గ్యాప్‌లో కూడా బయలే ఉన్నది. ఈ బయలంటే ఏమిటి? అన్ని రకాలుగా ఏమీ లేదు. ఏమీ లేదు. ఏమీ లేదు. బయలంటే ఎరుక పద్ధతిలో ఏమి చెప్పినా ఏమీలేదు. ఎరుక పద్ధతిలో చూసేవన్నీ ఏమీలేదు అనే దానికి సున్నా గుర్తు. కనుక బయలును ఎలా చూడాలి? నీకు తెల్సివన్నీ ఏమీలేవు అనే పద్ధతిగా చూస్తే సున్నా. కనుక ఈ ఓంకి వెనుక నిశ్శబ్ద బ్రహ్మ ఎలా ఉన్నాడు? సున్నాగా ఉన్నాడు? ఒకవేళ సున్నాయే నీవై నిశ్శబ్ద బ్రహ్మమే నీవై దృశ్య తాదాత్మ్యత లేకపోతే, దృశ్యాత్మ కాకపోతే, దృగాత్మ కూడా కాకపోతే, ఏమై ఉన్నావు? నీవు సున్నాగా ఉన్నావు. అంటే బయలుకు 'o' సంకేతం అయింది. అప్పుడు బయలైంది. గురువుగారు నీ వెనుక నీ మూలం ఏమిటి? అన్నారు. సున్నా! అంటే మూలం లేని గుర్తెరిగే శరీరం ఏమీలేదు అని. ఈ విధముగా బయలును సూచించడానికి "oఓం" అని సంకేతముగా చూపించడమైనది. నీ మూలం ఒకసారి చూసుకో అన్నారు. గొర్రాలి బిడ్డ సామెతగా నీకు తల్లి లేదు, తండ్రి లేరు. నీ మూలం సున్నా అన్నాడు. నీ మూలాన్ని ఎప్పుడైతే సున్నాగా చూచావో అప్పుడు నీవే లేకుండా పోయావు. నీకు మూలం లేదు. కాని ఉన్నానంటున్నావు. ఎలా వున్నావు? ఉన్నాననుకుంటే ఉన్నావు. లేననుకుంటే లేవు. **యత్‌భావం తత్ భవతి**గా ఉనికిలోకి వచ్చావు. నీవు అభావం అయితే లేనేలేవు. నీ సంగతి ఇది! ఉన్నానుకుంటే ఉన్నావు. లేదనుకుంటే లేవు కనుక ఉండడము కల్ల. ఉండడము భ్రాంతి. అనుకోకపోవడం వల్ల ఉండటం ఏమిటి? అది భ్రాంతి. అనుకోవడంవల్ల లేకపోవడం ఏమిటి? ఏమి అనుకోకపోతే నీవు ఏమి లేవన్నమాట!

ఏమి అనుకోకపోతే ఏమీలేదు అంటే నీవు నాదబిందు కళాతీతము. నీవు ప్రణవాతీతము నీవు నిశ్శబ్ద బ్రహ్మము. అదే బయలు. అందుకే ఓంకి వెనుక ప్రక్కన సున్నా పెట్టేసి, ఎడమ ప్రక్కన సున్నా పెట్టేసి నీకు మూలం లేదని నీ మూలాన్ని చూచుకో అని గురువుగారు పరబయలు చూపిస్తున్నారు. మూలం లేని గుర్తు ఎరిగే 'నేనే' లేనప్పుడు 'నేననే' ఎరుక మాయ. కనుక 'నేను' పోవాలి. నా అంతట నేను పోలేను. కనుక లేకనే తోచిన 'నేను' లేదని నిర్ణయమై నేను లేనని తెలిశాక భ్రాంతి రహితమై 'నేనే' లేకుండా పోవాలి. లేనిదే ఉన్నట్లు తోచింది. లేనిదే లేకుండా పోతుంది. దేనిలోనుంచి వస్తే తిరిగి దాంట్లోకి పోతుంది. దేంట్లోనుంచి రాలేదుగా! అష్ట ప్రకృతుల లయం అంటే ఏమి చేశాము? కర్మేంద్రియాలను, విషయాలను, జ్ఞానేంద్రియాలను, పంచ ప్రాణాలను, అంతఃకరణ చతుష్టయాన్ని, జ్ఞాతను, వీళ్ళందరిని సూక్ష్మ భూతాలలోకి లయం చేశాము. వాటిని మహదహంకారంలోను,

మహదహంకారంను మహత్‌లో, మహత్‌ను ప్రణవంలోను దానిని అవ్యక్తంలో లయం చేశాము. అవ్యక్తం మళ్ళీ తిరిగి వ్యక్తమవుతుంటే ఇక్కడే పరిపూర్ణ బోధ కావాలి. నీకు మూలం లేదని మహత్ వెనుక సున్నా చూపిస్తూ మహదహంకారమై, అష్ట ప్రకృతుల సృష్టి లేకుండా ఉండాలంటే తిరిగి రాకూడదు అంటే ఏమి చెయ్యాలి? మహత్‌గా ఉన్నప్పుడే నాకు మూలం లేదని షోడశి మంత్రం చెప్పుకోవాలి. అకార, ఉకార, మకార మాతృకల సృష్టి అంతా కూడా మిథ్య అని, ఓంకారం ద్వారా వచ్చిన సృష్టి అంతా మాయాకల్పితమని, లేకనే ఉన్నట్లు తోచినది తెలుసుకోవాలి. మూలంలో ప్రణవం కూడా ఈ రకంగా అభివ్యక్తమవుతుంది. కనుక అది కూడా మాయద్వారా కల్పితమే. కాబట్టి విచారిస్తే ఏమీ లేదు అనేది నిర్ణయం. ఏమీ లేదు. అనేదే బయలు.

ఓంకారేశ్వరుని ఓంకారాన్ని ఉపాసనగా చేసి ప్రణవోపాసన చేసి బ్రహ్మ జ్ఞానం పొందుతానంటే పొందవచ్చు. ప్రణవోపాసన, బ్రహ్మోపాసన అనేది చెయ్యవచ్చు, కాని అది ఎరుక బ్రహ్మమే. బయలు నిర్ణయం కాదు. పరబ్రహ్మ నిర్ణయం కాదు. పరబ్రహ్మ నిర్ణయం కేవలం శ్రవణ, మనన, నిదిధ్యాసల వల్లనే అవుతుంది. కుండలిని జాగరణ వలన కాదు, శ్వాసమీద ధ్యాస, ధ్యానం వలన కాదు. ఈ ధ్యానం అంతా కూడా ఒక ధ్యాన వస్తువుమీద పెట్టారు. ధ్యాన వస్తువు కూడా కల్పితమే. ఓంకారమే కల్పితం అయ్యాక, కల్పిత ఓంకారంతో ఉపాసన చేస్తే కల్పిత బ్రహ్మమే అవుతావు కదా! ఓంకారం వలన అకార, ఉకార, మకార శబ్దములు వస్తే శబ్ద బ్రహ్మమే అవుతావు గదా! నిశ్శబ్ద బ్రహ్మ అయినా గాని శబ్దము యొక్క అవ్యక్త స్థితిలో ఉన్న నిశ్శబ్దం అయితే, మళ్ళీ వ్యక్త బ్రహ్మలోకి శబ్ద బ్రహ్మలోకి వచ్చి ఎరుక బ్రహ్మ అవుతావు గదా! కనుక నీకు మూలం లేదనప్పుడు వెనుక సున్నా పెట్టుకుంటే వ్యక్తా వ్యక్తములు రెండు కానిది ఏదో, అది బయలు. ఆ బయలు నిర్ణయాన్ని మనం గురు కృపతో తెల్సుకొని దృఢం చేసుకోవాలి. కనుక ప్రణవ ప్రకరణం అని ఏదైతే చెప్పామో అది అచల పద్ధతికి తిప్పాము. ఈ అచల పద్ధతికి తిప్పితే ఓంకారోపాసన ప్రణవ బ్రహ్మ ప్రణవేశ్వరుడు అయ్యేదాకా పనికి వస్తుంది. కాని ఆ తరువాత పరిపూర్ణ బోధలో ప్రణవము కూడా లేనిది అని తెలియాలిగా! కనుక అమాతృక అంటే అకార మాతృక లేదు. ఉకార మాతృక లేదు. మకార మాతృక లేదు. తురీయంలో ఉన్న అర్ధ మాతృక లేదు. తురీయాతీతమైన అవ్యక్తము, లేక ప్రణవము లేదు. అది తిరిగి వ్యక్తం కాకపోతే అదే బయలు. అదే పరబ్రహ్మ. పరబ్రహ్మ నిర్ణయానికి ఓంకారమనేది ఒక సోపానము. **'ఓం'** యే మాయ ద్వారం. **'ఓం'** యొక్క అవ్యక్త స్థితి ప్రణవము. కనుక ప్రణవాతీత పరబ్రహ్మము అంటే బయలే. సాధనలన్నీ ప్రణవంతో ఆగిపోయినవి. ఆ పైన పరబ్రహ్మ అవ్వాలంటే **"ఏ సాధన నీకెందుకు వీసానికి పనికిరాదు"** అని మొదలుపెట్టాము.

ఇంతవరకు చెప్పిన బోధ అంతా శబ్ద ప్రమాణంగా జరిగింది. శబ్ద ప్రమాణమే శృతులు, శృతులే వేదాలు. కనుక వేదాలు వేదాంత పద్ధతిలో శృతి, స్మృతి పద్ధతిలో సాధనా పద్ధతులలో చేసిందంతా కూడా ప్రణవం వరకే. ప్రణవాతీత స్థితికి తీసుకెళ్ళాలంటే ఏ సాధన పనికిరాదు. గురుశిష్య న్యాయంగా జరగాలి. ఈ గురు శిష్య న్యాయంగా జరగాలంటే స్థూల దృష్టి, సూక్ష్మాతి సూక్ష్మ దృష్టిగా మారాలి. అప్పుడు చతుర్విధ శుశ్రూషలు స్థూలంగా కాకుండా సూక్ష్మంగా కూడా కాకుండా అశరీర పద్ధతిలో చెయ్యాలి. అశరీర పద్ధతిలో అంగ శుశ్రూష, అశరీర పద్ధతిలో స్థానశుశ్రూష, అశరీర పద్ధతిలో భావ శుశ్రూష, అశరీర పద్ధతిలో ఆత్మ శుశ్రూష చేసినప్పుడు అశరీరం పద్ధతిలో గురువులో మమైకం అవ్వడం ద్వారా, ఎరుక విడుస్తావు. దానికి ముందు గురువు పరబయలు దర్శింపచేసి ఎరుకను విడిపిస్తాడు. ఇక్కడితో ఈ జ్యోతి స్వరూపం అంతా కూడా ఎరుకే కనుక, జ్యోతికి పరమైనది పరంజ్యోతి. ఈ పరంజ్యోతి సంగతే పరిపూర్ణ బోధగా అచల సిద్ధాంతం అక్కడ మొదలవుతుంది. దీన్ని వేదాంతాతీత బోధ అంటారు. పరిపూర్ణ బోధను వేదాంతీత బోధ అంటారు. ఇంతవరకు జరిగినది **'ప్రబోధ'** అయితే ఆ వేదాంతాతీత బోధను **'నిజప్రబోధ'** అంటారు.

**'ప్రణవము'** అంటే అవ్యక్త శబ్దము. 'ఓం' అంటే శబ్దము ధ్వనిగా ఉన్నది. ధ్వని రూపములో బహిర్గతమైనది **'ఓం'**. బహిర్గతము కాకమునుపు ఉన్నటువంటిది అవ్యక్త శబ్దము అది. **'ప్రణవము'** వ్యక్తావ్యక్తములు రెండూ కాని నిశ్శబ్ద బ్రహ్మమే అన్ని కాలాల్లో మార్పు చెందకుండా ఉన్నది. నిశ్శబ్దమందు శబ్దములు ఉత్పన్నమై మళ్ళీ నశిస్తూ ఉంటాయి. శబ్దములు సృష్టించబడి లయం చెందుతూ ఉంటాయి. శబ్దములకే ఆది, అంతము ఉన్నది. నిశ్శబ్దము శాశ్వతము. నిశ్శబ్దము శబ్దముగా మారలేదు. నిశ్శబ్దము నిశ్శబ్దముగానే శాశ్వతముగా ఉండగా, ఒక శబ్దము ఉత్పన్నము కావడానికి ముందు అవ్యక్త స్థితిలో, తరువాత మహత్ స్థితిలో, తరువాత **'అ'**కార, **'ఉ'**కార, **'మ'**కారములుగా వ్యక్తమైనది. అవ్యక్తస్థితిలో ఉన్నదానిని **'నాదము'** అంటాము. దానినే **'ప్రణవము'** అంటాము, **'ప్రణవనాదము'** అంటాము. వ్యక్త స్థితిలో ఉన్నదేమో ధ్వని రూపంగా ఉన్నది. దానిని **'ఓంకారము'**

అంటాము. **'ఓం'** మహత్తు. **'మహత్తు'** నుండే సృష్టి ప్రారంభం అయినది. **'ఓం'** బిందువునుండి సృష్టి ప్రారంభమైనది. **'మహత్తు'** అన్నా **'ఓం'** బిందువన్నా ఒక్కటే! తిరుగు ప్రయాణంలో మనమందరం **'ఓం'** బిందువుకు చేరాలి. **'ఓం'** నుంచి **'అవ్యక్తం'** కావాలి. **'ఓంకారం'** నుంచి **'ప్రణవ స్వరూపము'** కావాలి.

**ఓం ఇతి జ్యోతి స్వరూపం 'జ్యోతి'** అంటే ప్రకాశిస్తుంది అని అర్థము. ప్రకాశము అంటే పరమాత్మగా ప్రకాశిస్తుంది. పరమాత్మ ప్రకాశమది. ఆత్మ ప్రకాశము, బ్రహ్మ ప్రకాశము, పరమాత్మ ప్రకాశము, అదీ జ్యోతి అంటే! ఇంకో శబ్దములో తరించాలి అంటే, వెన్నుపూసని నిట్టనిలువుగా పెట్టుకుని, కుండలనీ శక్తిని జాగరణ చేసి, సహస్రారమందున్నటువంటి సహస్రదళ స్థానానికి లక్ష్యం పెట్టుకుని, తురీయంలోకి వెళ్ళాలి.

మూడు అవస్థలలో ఉండి, మూడవస్థలకి అతీతముగా కూడా ఉండేది 'తురీయము'. నిశ్శబ్దము మూడు అవస్థలలో ఉంది. మూడవస్థలకి సాక్షిగా ఉంది. 'నిశ్శబ్దము' తనకు తానే నిశ్శబ్దముగా శాశ్వతముగా ఉంది. అదీ తురీయమంటే. 'శబ్దము' ఒకప్పుడు ఉంటోంది, ఒకప్పుడు ఉండడం లేదు. 'అ'కార, 'ఉ'కార, 'మ'కారములుగా మూడు రకాల శబ్దాలు ఉంటే, ఈ మూడు రకాల శబ్దాలకు మూలమైనది 'నాదం'. ఈ 'నాదమే తురీయము'. నాదాంతములో నాదము అంతమైతే 'నిశ్శబ్దము' ఉంది. నిశ్శబ్దమేమో శాశ్వతము. నిశ్శబ్దములో పరిణామము లేదు. నిశ్శబ్దములో వికారము లేదు. నిశ్శబ్దములోనుంచి ఏమీ పుట్టలేదు. నిశ్శబ్దములో ఏమీ లయం కాదు. శబ్దమే తనకు తానే పుట్టి, తనకు తానే కళల రూపములో ఉండి, ఆ ధ్వని తనకు తానే లయం అవుతూ ఉంటుంది. కనుక 'అ'కార, 'ఉ'కార, 'మ' కారములని ఎలా తీసుకున్నప్పటికీ, 'ధ్యాత' యొక్క ప్రకాశము, 'ధ్యానము' యొక్క ప్రకాశము, 'ధ్యేయవస్తువు'యొక్క ప్రకాశము. అలా తీసుకుంటూ విశ్వ, తైజస, ప్రాజ్ఞుల యొక్క ప్రకాశముగా తీసుకోవచ్చు. విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతుల ప్రకాశముగా తీసుకోవచ్చు. స్థూల సూక్ష్మ కారణ ప్రపంచాలుగా, స్థూల సూక్ష్మ కారణ శరీరాలుగా తీసుకోవచ్చు. ఈ **'అ'**కార, **'ఉ'**కార, **'మ'**కార మాతృకలు ఇప్పుడు చెప్పిన అన్నిటికికూడా సంకేతము.

**'లింగము', 'గుర్తు'** అంటే సంకేతము. ఈ సంకేతాలన్నీ కూడా ఈ గుర్తులు అన్నీ కూడా **'ఎఱుకే'**. **'గుర్తు'** లేకపోతే, **'ఎఱుక'** లేకపోతే, **'శబ్దము'** లేకపోతే, 'విశ్వ తైజస ప్రాజ్ఞుల అనుభవం' లేకపోతే, 'తరీయానుభవము' కూడా లేకపోతే అప్పుడు ఏ అనుభవము కూడా లేకపోతే, ఏ ప్రపంచానుభవము లేకపోతే, ఏ శరీర సంబంధానుభవములు లేకపోతే, ఏ ఇంద్రియ సంబంధ అనుభవములు లేకపోతే, ఊహ లేకపోతే, ఆలోచన లేకపోతే, సాక్షిత్వము లేకపోతే ఇవన్నీ లేకపోతే ఏదైతే ఉన్నదో, అది ప్రణవాతీతము. అది పరబ్రహ్మము. అది తురీయాతీతము. తురీయాతీతమే పరబ్రహ్మ. సాధనలో ఏమిటంటే, తురీయాన్ని దాటి, తురీయాతీత స్థితిలో మనం ఉంటే, మనం ఆ పరబ్రహ్మమే.

ఇక్కడ అతీతమైన మాట వాడుతున్నాము. తురీయాతీతము, ప్రణవాతీతము అని. వ్యక్తావ్యక్తములుగా ఉన్న శబ్దానికి కూడా అతీతము. ఆ అతీతస్థితినే పరము అంటాము. ఆ పరమైనదే పరబ్రహ్మ. ఆ పరమైనది ఉన్నది ఉన్నట్లున్నది. కనుక **'ఓం'**కి వెనుక ప్రక్క ఒక సున్నా పెడితే, ఆ సున్నాయే పరం. ప్రణవమే సృష్టికి మూలము, మూలాధారము, మూలకారణము, మూలకారణాంశము. ఈ సృష్టి అంతా కూడా మూలకారణమైన **'ఓం'** యొక్క అంశము ఉన్నది. అంటే, ప్రతీ దాంట్లో స్థూల సూక్ష్మ కారణాలు కలిసి ఉన్నాయి. స్థూలం ఏమో కార్యరూపంలో అనుభవానికి పనికి వస్తుంది పనిముట్టుగా! సూక్ష్మమేమో అనుభవిస్తుంది. 'కారణం' ఏమో ఏ అనుభవం రావాలో, ముందస్తుగా వాసనా రూపంలో ఉండి, ఆ కారణము. కార్యరూపము కాగానే, అనుభవాలు వస్తూ, పోతూ ఉంటాయి. కనుక కార్యకారణాలు ఉన్నంత వరకూ, అవి ప్రణవానికి, ఓంకారానికి లోబడి ఉన్నాయి.

కార్య, కారణాలకి అతీతమైనది, పరమైనది, ఈ ప్రణవానికి, ఓంకారానికి ఎట్టి సంబంధము లేకుండా తనకు తానే స్వతఃసిద్ధమై ఉండి, దాని నుండి ప్రణవము పుట్టలేదు. దాని నుండి ఓంకారము పుట్టలేదు. అందువల్ల ప్రణవ స్వరూపుడికి, ఓంకార స్వరూపుడికి ఆ పరబ్రహ్మము మూలము కాదు. ఇలా 'మూలం లేని గుర్తెరిగే శరీరము ఏమీ లేదు' అంటే, ఆ ప్రణవ స్వరూపుడికి చెబుతున్నమాట. క్రింద నుంచి చెబుతున్నాము. 'మూలం లేని గుర్తెరిగే స్థూల శరీరము ఏమీ లేదు', 'మూలం లేని గుర్తెరిగే సూక్ష్మ శరీరము ఏమీ లేదు', 'మూలం లేని గుర్తెరిగే కారణ శరీరము ఏమీ లేదు', 'మూలం లేని గుర్తెరిగే విశ్వ తైజస ప్రాజ్ఞులు ఏమీ లేరు', 'మూలం లేని గుర్తెరిగే విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతులు ఏమీ లేరు', 'మూలం లేని గుర్తెరిగే క్షరాక్షరులు ఏమీ లేనే లేరు'. ముందుగా సంకల్పమే అవ్యక్తముగా ఉండి, సంకల్ప రూపంలో తిరిగి వ్యక్తమౌతుంది కనుక 'విస్మృతి'గా

ఉన్నప్పటికీ, అవి అవ్యక్తముగా ఉన్నటువంటి స్మృతులే. స్మృతి రూపంలో వ్యక్త రూపంలో బహిర్గతమౌతున్నాయి. కనుక స్మరణ, విస్మరణలు లేవు.

క్షేత్రము, క్షేత్రజ్ఞుడు లేడు. క్షరము, అక్షరము లేదు. ఇట్లా అష్ట తనువులు లేదు. స్థూల, సూక్ష్మ, కారణాలే కాకుండా విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులే కాకుండా, తురీయంలో ఉన్న ప్రత్యగాత్మ, పరమాత్మలు కూడా ఈ తురీయమే సర్వకారణము. ఈ తురీయమే కారణము, మహాకారణము. కనుక స్థూల, సూక్ష్మ, కారణ సృష్టికి తురీయం మూలమైంది. ఆ తురీయంగా, మూలంగా ఉన్నటువంటి ప్రణవము. ఓంకారానికి అవ్యక్తంగా ఉన్నది. అనాహత శబ్దమే ప్రణవము, ఆ తరువాత ఉపక్రమించేటటువంటి, ఉపక్రమణకు, ఆ తరువాత విజృంభించేటటువంటి గుణమయ ప్రపంచానికి, నామ రూప వస్తువులకి కారణమైంది. కాని, దానికి కారణమేంటి? ప్రణవానికి కారణమేంటి? ఆ ప్రణవం పైన ఏదైతే ఉందో, అతీతంగా ఏదైతే ఉందో, **'పరం'** అనే పేరుతో ఏదైతే ఉందో, అది స్వతఃసిద్ధంగా, దానికదే ఉండి, **'ఏకమేవా అద్వయం బ్రహ్మ'**గా ఉండి, దానియందు **'నానా అస్తి న కించనః'** నానా రకాలుగా ఏదైనా కాని, ఏ ఒక్కటి కూడా అస్తిత్వాన్ని పొంది ఉండలేదు. కనుక ఈ అస్తిత్వము, నానాత్వము భేదాలతో వచ్చినటువంటివి అన్నీ కూడా ఓంకారము వల్లే స్థూల, సూక్ష్మ, కారణ సృష్టిగా, ఆ సృష్టియే స్థూల రూపం వచ్చేసరికి, నామ, రూప, వృత్తి నటనలుగా ఉంటున్నది. మోక్షము కావాలంటే, వీటి అతీత స్థితికి వెళ్ళాలి. అతీత స్థితి వీటికి మూలమా? కాదా? ఇంతసేపూ మనం చెప్పుకునేది ఏమిటంటే, దీనికి అతీతంలో మూలం లేదని, క్షేత్రజ్ఞుడు అయిన వాడు, అక్షర పరబ్రహ్మ అయినవాడు, ప్రత్యగాత్మ అయినవాడు, పరమాత్మ అయినవాడు ప్రణవ స్వరూపుడు అయినవాడు కూడా తనకు మూలంలేని గుర్తెరిగే శరీరం ఏమీ లేదని, తాను గొడ్రాలి బిడ్డ సామెతగా, తాను లేకనే ఉన్నట్లుగా తోచాడని, తాను కూడా మాయా కల్పితుడే అని తెలుసుకుని, తాను దృక్ మాత్రమయినటువంటి ఎఱుక, తాను దృశ్యమైన ఎఱుక దృశ్య తాదాత్మ్య రూప ఎఱుక, సకల ఎఱుకలనుండి అతను విడుదల పొందాలి.

ఎఱుకే లేక ఉన్నట్లు తోచింది కాబట్టి, ఎఱుకకు మూలం లేదు. ఎఱుక దృశ్యం కాదు. ఎఱుక దృశ్యం అయినదంటే అది భ్రాంతి. ఎఱుక దృశ్యం కాలేదు అంటే అది అవ్యక్తము, ఎఱుక యొక్క అవ్యక్త స్థితి. లేనెఱుకే అవ్యక్త స్థితిలో ఘన రూప అఖండ ఎఱుకగా ఉండి, వ్యక్త స్థితిలో ఖండ ఎఱుకలై, మూడు గుణాల చేత, మూడు ఖండ ఎఱుకలై, తమో గుణం చేత, జడజగత్తు అనే ఎఱుకయై, రజోగుణం చేత జీవుల, ప్రాణుల ఉనికిగా ఎఱుక పుట్టి, సత్వగుణ ఎఱుక త్రిమూర్తులుగా, అధిష్ఠాన దేవతలుగా, ఈశ్వరుని యొక్క ఇంద్రియాలైన అధిష్ఠాన దేవతలుగా ఉన్నది. ఈ సత్వగుణ ఎఱుకనేమో కేవలపుటెఱుక అంటారు. ఈ తమో గుణ ఎఱుకనేమో, మలినపుటెఱుక అంటారు. అసలు ఉన్నది తమోగుణం, సత్వగుణమే! రజోగుణం లేదు. ఆత్మయేమో సత్వగుణం, అనాత్మయేమో తమోగుణం. రజోగుణం లేదు. చిత్తేమో సత్వగుణం, జడమేమో తమోగుణం. అక్కడ కూడా రజోగుణంలేదు. చిత్ జడముల కలయికలో, చిత్ జడ గ్రంధిలో ఒక **'నేను'** అనేటటువంటిది రజోగుణ సంబంధముగా తోచింది. **'నేను'** అనేటటువంటి జీవుడు రజో గుణ సంబంధముగా తోచాడు. అంటే తమో సత్వ గుణముల యొక్క మిశ్రమముగా ఈ రజోగుణం ఆవిర్భవించింది. అందుకని ఈ రజోగుణాన్ని మిశ్రపుటెఱుక అంటాము. చిత్ జడముల యొక్క గ్రంధిలో పుట్టినది. అలాగే ఆత్మ, అనాత్మల యొక్క సందులో పుట్టినది. తమో, సత్వ గుణముల యొక్క సందులో పుట్టినది, వాటి యొక్క మిశ్రమము వలన కలిగినది, రజోగుణం కనుక రజోగుణాన్ని మిశ్రపుటెఱుక అంటారు.

ఇట్టి ఎఱుకకు మూలం లేదు. అన్ని కాలాల్లో ఏదైతే ఉందో, అది ఉన్నదున్నట్లున్నది. అది దీనికి మూలంకాదు. అది దేనికీ మూలం కాదు. కాని దాన్ని బయలు అనుకుంటే, బయలందు లేని ఎఱుక బయలులోకి చేరి, ఎఱుక తనంతట తానే లేకనే ఉన్నట్లు తోచినది. మళ్ళీ ఎఱుక లయమైనప్పుడు, లేనెఱుక లేకుండా పోయింది. అట్లాగే ఓంకారములో లేని శబ్దము ఉత్పన్నమై, ఓంకార రూపమై, అకార, ఉకార, మకార సృష్టి చేసింది. మాయ మూలకారణాంశము అవ్వడం వలన అకార, ఉకార మాతృకల చేత, సంకేతముగా ఉన్నటువంటి, స్థూల సూక్ష్మ ప్రపంచములన్నీ కూడా లేకనే ఉన్నట్లు కల్పించబడ్డాయి. మాయ యొక్క లక్షణాలు, మూడు గుణాలు ఈ మూడు ప్రపంచాలకు ఉన్నవి. మాయ లేనిది కనుక మూడు ప్రపంచాలు లేనివే. మాయ లేకనే ఉన్నట్లు ఉంది కాబట్టి, మూడు ప్రపంచాలు కూడా లేకనే ఉన్నట్లు ఉన్నాయి. కనుక 'ఓం' కి మూలం లేదు కాబట్టి, 'ఓం'కి మూలం సున్నా! ఈ 'సున్నా' అంటే ఎఱుక పద్ధతిలో 'సున్నా'! అంటే క్షేత్రజ్ఞుడు లేడని, అక్షర పురుషుడు లేడని, వ్యక్తావ్యక్తములు లేవని, మరి ఈ రకంగా కార్యకారణాలు ఏవీ లేవని, దానికదే ఉన్నదున్నట్లున్నదని, అవి స్థూల, సూక్ష్మ, కారణాలు కావని,

వీటన్నింటికి ఆధారమైనటువంటి ప్రణవ బ్రహ్మము, ప్రణవేశ్వరుడు కూడా కాదని, ఈ లేనివాటికి ఎవరైతే ఆధారమో వారున్నూ లేనివారే. ఈ లేని ప్రపంచానికి ఎవరైతే ఆధారమో, అట్టి బ్రహ్మకూడా లేనివాడే. ఇవన్నీ లేనెఱుక కాబట్టి, కారణ బ్రహ్మము కూడా లేనెఱుక. లేనెఱుక లేదు కనుక ఎఱుక బ్రహ్మము లేనివాడే. ఎఱుక బ్రహ్మము దాకా తెగ్గొట్టేస్తే, ఆ పైన ఎవరున్నారంటే బయలు. అన్ని రకాలుగా ఎఱుక సంబంధముగా ఉన్నవి ఏవీ లేవు అనేటటువంటి నిర్ణయంగా **'ఈ ఉత్తబట్టబయలు ఏమీ లేదు'** అని చెప్తున్నాము. దాన్ని **'సున్న'**గా పెట్టాము. ఆ **'సున్న'** ఎఱుకకు మూలం కాదు.

నువ్వు అనుకుని కలగన్నావా? ఫలానా కలరావాలని కలగన్నావా? కల రాకూడదని పడుకున్నా కూడా కల వస్తోంది కదా! నీ ప్రమేయం లేకుండా కల వచ్చినట్లుగానే, ఆ ప్రణవాతీతమైనటువంటి ఉత్తబట్టబయలందు, నాద బిందు కళాతీతమైనటువంటి ఉత్తబట్టబయలందు, ఈ ప్రణవమనేది ప్రణవనాదమనేది, ప్రణవ బ్రహ్మమనేది, బ్రహ్మనాదమనేది, కారణ బ్రహ్మ, సర్వకారణ బ్రహ్మ, సర్వ కారణ ఈశ్వరుడు, ఇవన్నీ కూడా మాయచేత, లేకనే ఉన్నట్లు తోచారు. కలలో తోచినట్లు తోచారు. మూలకారణ అంశము కాబట్టి, తోచినవాడు, వీడు వేరుకాదు, వీరు కూడా మాయా స్వరూపులే. ఓంకారేశ్వరుడు, ప్రణవస్వరూపుడు మాయా స్వరూపులే. వీరంతా లేనివారే. ఉన్నంత కాలము లేని వారిగా, ఉన్నట్లున్నారు కాబట్టి, వీళ్ళని లేనెఱుక అనాలి. కలనుండి మేల్కొంటే ఏమీ లేదు. అలాగే ఇది లేనెరుక. లేనెఱుక ఎలా పోతుంది? యద్భావం తద్భవతి. భావాన్ని బట్టి ఎఱుక ఉన్నది. ఎఱుకను బట్టే ఉండుట ఉన్నది. ఎఱుక ఎట్టిదో, అట్టిదిగా ఉండడం జరుగుతుంది. ఎఱుక జీవుడు అంటే జీవుడుగా ఉండడం జరుగుతుంది. ఎఱుక ఈశ్వరుడు అంటే ఈశ్వరుడుగా ఉండడం జరుగుతోంది. ఎఱుక స్త్రీ అంటే, స్త్రీగా ఉండడం జరుగుతోంది. ఎఱుక అక్షరుడు అంటే, అక్షరుడుగా ఉండడం జరుగుతోంది. 'యద్భావం తద్భవతి'. అభావమందు ఎఱుకేలేదు. ఎఱుకే లేనప్పుడు అవ్వడం కూడా లేదు, ఉండడం కూడా లేదు, కనుక లేకుండుట అనేదే సత్యం.

మరి ఉన్నది లేకుండా పోవాలంటే ఏమి చేయాలి? దాని మూలంలోకి వెళ్తే, ఇది లేకుండా పోతుంది. ఎలా? పృథ్వి జలంలోకి వెళ్తే, పృథ్వి లేదు. జలం అగ్నిలోకి లయమైతే జలం లేదు. అగ్ని వాయువులోకి లయమైతే అగ్ని లేదు. వాయువు ఆకాశంలోకి వెళ్తే వాయువు లేదు. అకాశము మహదహంకారములోకి పోతే ఆకాశము లేదు. మహదహంకారము మహత్తులోకి పోతే మహదహంకారము లేదు. మహత్తు అవ్యక్తంలోకి పోతే, మహత్తు లేదు. 'అవ్యక్తం' తిరిగి వ్యక్తం కాకపోతే, ఉన్నది బయలు. అదే పరమ పదము.

'అవ్యక్తం' తిరిగి మహత్తైతే అదే తిరిగి వస్తుంది. పునరావృత్తి కలిగి ఉన్నది. కనుక దీనికి చక్ర దోషం వచ్చింది. అవ్యక్తంలోకి తిరిగి వ్యక్తం అవ్వకూడదు. వ్యక్తావ్యక్తం కానిది ఒకటి పెడితే చక్రదోషం పోతుంది. ఆ చక్రదోషం పోవాలి అంటే, బయలే నిర్ణయం కావాలి. కనుక బయలు దేనికీ మూలం కాదు కనుక, ఎఱుకలో ఆఖరి మెట్టుగా, మలినపుటెఱుక పోగొట్టి, శుద్ధ చైతన్యానుభవంగా ఉన్న పరమాత్మ ప్రకాశానుభవం అన్న జ్ఞానాన్ని పోగొట్టుకుని, చివరికి విజ్ఞాన స్వరూపం కావాలంటే, ఆ విజ్ఞాన స్వరూపుడు బయలై ఉండాలి.

బయలు నిర్ణయం కాకుండా, విజ్ఞానస్వరూపుడు అయితే, మళ్ళీ అతడు జ్ఞాన స్వరూపుడై, జ్ఞానియై, జ్ఞానమై అజ్ఞానానికి మూలకారణమై, అజ్ఞానాన్ని సృష్టిస్తాడు. తాను సృష్టించిన దాంట్లో, తానే ప్రవేశించి, సృష్టి కర్త బదులు, సృష్టిగా ఉన్న నామ రూప ప్రపంచాకారమే తాను అవుతాడు. నామ రూప ఆకారాలు తాను చెందుతాడు. తాను ఏమేమో అనుకున్నది తాను అయిపోతున్నాడు. తాను ఊహించిన నామరూపాదులు తన ఊహామాత్రంగానే ఉండి పోకుండా, అవిద్యాదోషం చేత, తానే ఆ నామరూపాలు అవుతున్నాడు. కనుక ఈ బ్రహ్మ సంకల్పం చేసి, సృష్టి చేసినప్పుడు ఆ బ్రహ్మే అవిద్య కారణంగా సృష్టితో తాదాత్మ్యం చెందినప్పుడు ఆ నామరూపాలే తాను అవుతున్నాడు. ఆ ఈశ్వరుడే తాను అవుతున్నాడు. ఆ జీవుడే తాను అవుతున్నాడు. మెల్లిమెల్లిగా క్రమక్రమంగా తనలో కలిగిన సంకల్పాలనుబట్టి దిగజారిపోతున్నాడు. సంకల్పమే ఎఱుక, నిర్వికల్పమే బయలు. సంకల్పం ఆగిపోయి నిర్వికల్పమైనా, తిరిగి సంకల్పములు పుట్టరాదు. అప్పుడు శాశ్వత నిర్వికల్పమే బయలు అవుతుంది. ఓంకారము యొక్క అవ్యక్తమే ప్రణవము. ప్రణవములో అవ్యక్త స్థితి ఉన్నంత సేపు, అది ఓంకారాన్ని సృష్టిస్తుంది. అనగా మహత్తుని సృష్టిస్తుంది. మహత్తు నుంచి మహదహంకారము, తన్మాత్రల సృష్టి పునరావృతి అవుతుంది. అందువల్ల దీనిని మనం అధిగమించాలి.

ఈ చైతన్యానికి చలన గుణము ఉంది. వ్యాపకత్వము ఉంది. మళ్ళీ ఘన రూపము ఉంది. వ్యాపకత్వము కుంచించుకు పోవడము రెండూ ఉన్నవి. అసలు విశ్వమంతా కూడా బిందు స్వరూపం నుంచి వ్యాపకమై, కొంతకాలము వరకూ వ్యాపిస్తూనే ఉండి, కాల ప్రభావముచేత మళ్ళీ ఆ వ్యాపించినదంతా సంకోచిస్తూ, తిరిగి బిందురూపం అవుతుంది. వ్యాపకమౌతున్నంత సేపు సృష్టి జరుగుతూ ఉంటుంది. కుంచించుకు పోతున్నంత సేపు, సృష్టి మళ్ళీ లయమౌతూ, అవ్యక్తమౌతూ ఉంటుంది. కనుక ఉచ్ఛ్వాస, నిశ్వాసాల్లో నీ ఊపిరితిత్తులు ఎలాగైతే వ్యాకోచిస్తూ, సంకోచిస్తూ ఉంటాయో, విశ్వం కూడా విశ్వ ఆవిర్భావానికి ఏ విధమైనటువంటి పరమాణు రూపం కాకుండా, అత్యంత సున్నితమైనటువంటి వాయువులు విశ్వరూపమై, అవి వ్యాకోచిస్తూ, సంకోచిస్తూ ఉంటాయి. వ్యాకోచిస్తూ ఉన్నంత సేపూ సూక్ష్మమై, స్థూలమై నామరూపమౌతూ ఉంటుంది. సంకోచిస్తూ ఉన్నంతసేపూ నామరూపాలు స్థూలంనుండి సూక్ష్మంలోకి, సూక్ష్మాలు సూక్ష్మాతి సూక్ష్మమైనటువంటి మహాకారణమందు లయమౌతాయి.

ఈ మహాకారణము ఇవన్నీ కూడా వాయురూపమైనటువంటి మనస్సు, ఎందుకంటే బ్రహ్మమే మనస్సు. బ్రహ్మము నుండి మొట్టమొదటగా డైరెక్టుగా పుట్టినవాళ్ళు బ్రహ్మ మానసులు. అందుకని బ్రహ్మ మానసులు అంటే చైతన్యము ద్వారా నేరుగా వచ్చిన వాళ్ళు. చైతన్యమే తానై ఉన్నవాళ్ళు. చైతన్య నిష్ఠులు, బ్రహ్మనిష్ఠులు. ఆ చైతన్యమే అక్కడ దివ్యమనస్సు. వ్యష్టి మనస్సు రాక ముందు చైతన్యమే దివ్యమనస్సు. అదే బ్రహ్మమనస్సు. ఈ సృష్టి ఎలా వచ్చిందంటే, ప్రతీ దశలోనూ కొన్ని వ్యక్తమై సృష్టించబడ్డాయి. అన్నిటికి పరిణామం లేదు. బ్రహ్మం చైతన్యం అయితే, ఆ బ్రహ్మ యొక్క మనసైతే, ఆ మనసు ద్వారా బ్రహ్మమానస పుత్రులు బ్రహ్మనిష్ఠులుగానే పుట్టారు. దేహోపాధులు లేకుండానే పుట్టారు. ఆత్మ నుండి ఆకాశం వస్తే, ఆత్మ ఆత్మగా ఉండే ఆకాశంగా వచ్చింది కాని, ఆత్మ ఆకాశంగా మారలేదు. మళ్ళీ ఆకాశం నుండి వాయువు వస్తే, ఆకాశం అంతా వాయువు అవ్వలేదు. తొమ్మిది వంతులు ఆకాశంగా ఉండిపోయి, ఒక వంతు వాయువు అయ్యింది. వాయువునుండి అగ్ని వచ్చింది అంటే, ఒక వంతు వాయువు అగ్ని అయితే, తొమ్మిది వంతులు వాయువు, వాయువుగానే ఉంది. అలా మిగిలి ఉండకపోతే మోక్షానికి మీకు పరబ్రహ్మ దొరకదు. మాయా వరణములో పరబ్రహ్మ పరబ్రహ్మగా మూడు వంతులు వుంటే, ఒక వంతు బ్రహ్మ మాయావరణలో ఉంటాడు. అంతా మాయావరణలోకి దిగితే లక్ష్యమైన పరబ్రహ్మ ఉండదు. అప్పుడు మోక్ష ప్రసక్తియే ఉండదు. అటువంటి మూడు వంతులు బ్రహ్మ బ్రహ్మగా ఉంటే, ఒక వంతు బ్రహ్మము ఆకాశము అయ్యింది. ఆకాశం తొమ్మిది వంతులు అలా వుండగా, ఒక వంతు వాయువు అయ్యింది. అందుకే అపంచీకృతమైనవన్నీ కూడా ఉన్నాయి. అంతా ఆకాశములోకి దిగిపోతే అప్పుడు మోక్షం పొందడానికి ఏమి ఉందని? కొంత అలాగే ఉంటూ మిగతా సృష్టి పరిణామం చెందింది. కాబట్టి, ప్రతీ దశలోనూ దిగబడి ఉన్నాయి కొన్ని. ఆ దిగబడి ఉన్నటువంటివన్నీ మనకి ఇప్పుడు, తిరుగు ప్రయాణంలో అనుభవంలోకి వస్తే మనం పొందగలుగుతున్నాము.

ఆత్మ కూడా ఎఱుకే! పరమాత్మ కూడా ఎఱుకే. చైతన్యము కూడా ఎఱుకే! బ్రహ్మ నిష్ఠ అంటే ఎఱుక యొక్క స్థిరత్వము. ఎఱుక కాసేపు స్థిరంగా ఉంటుంది. కాసేపు వ్యాపకం అవుతుంది. కనుక ఆ స్థిరమైన ఎఱుకను, బ్రహ్మనిష్ఠ అన్నాము, ఆత్మనిష్ఠ అన్నాము. మళ్ళీ అది నిష్ఠ అన్నప్పుడు శాశ్వతముగా ఉండాలి. అంటే అచలం అవ్వాలి. నిష్ఠ అనే పేరే చెరిపేసి, అచలం అనే పేరు పెట్టాలి. అచలం అంటే, ఏమిటంటే ఎప్పటికీ, ఎప్పటికీ కదలదు. అచలం సిద్ధించకపోతే అవ్యక్తంగా ఉన్నప్పుడు బ్రహ్మనిష్ఠలో ఉండి, వ్యక్త స్థితిలోకి జారిపోతాడు. దిగజారిపోతాడు. అందువల్ల మనకు ఎప్పుడూ కూడా ఆధ్యాత్మిక దశల వారీగా, ప్రతీ దశలో కూడా ఆ దశకు సంబంధించినటువంటి అనుభవమును అనుభవించి, ఆ అనుభవాన్ని అనుభవింప చేసేటటువంటి గురుతత్త్వం సహాయముగా ఉంటూనే ఉంటాయి. అందుకే మెహెర్‌బాబా చెప్తారు. అన్ని భూమికలలోనూ, అన్ని భూమికలకు ఆవల కూడా ఉన్నారు, భూమికకు, భూమికకు మధ్య సందులో ఉండి, ఒక శిష్యుడు తన భూమికని, ఒకటో భూమికను అధిగమించి, రెండవ భూమికకు చేరాలంటే, ఒకటి – రెండు మధ్యలో ఉన్నటువంటి గురుతత్త్వము, అవతార తత్త్వము, భగవంతుడు క్రింది భూమికనుంచి, పై భూమికకు అనుభవానికి, అధిగమించడానికి అక్కడ సహాయపడుతాడు. గురువే ఉండక్కర్లేదు. ఆ భూమిక మధ్యలో ఆ భూమికానుభవం పొందుతున్నటువంటివారు ఉంటారు. అటువంటి వారిలో మమైకం అయినప్పుడు వారి అనుభవమే నీ అనుభవంగా నీకు సంక్రమిస్తుంది. ఇదీ వ్యవస్థ. ఆధ్యాత్మిక వ్యవస్థ.

అవతార పురుషుని యొక్క సచ్ఛిష్యులతో దశల వారీగా ఆ దిగువ వారికి పై వారు సహాయం చేసే పద్ధతిలో ఒక నెట్ వర్క్ ఉంది. దానినే మండలి సభ్యులు అంటారు. ఆ నెట్‌వర్క్ ద్వారా అవతార తత్త్వము, చైతన్యానుభవాలు, గురు తత్త్వము ఆ జ్ఞాన భూమికలని, చైతన్య భూమికలని అధిగమింపచేస్తూ, అనుభవాలు పొందిస్తూ, ఉద్ధరించబడడం అనేటటువంటిది ఈ

సృష్టితో పాటే అది కూడా వచ్చింది. ఈ సృష్టితో పాటే అదీ ఉన్నది. అది లేకపోతే ఎవరు అధిగమిస్తారు? అజ్ఞానంలో కూరుకున్నవారు ఎప్పటికీ అజ్ఞానంలోనే ఉంటారు. 'యద్భావం తద్భవతి'గానే ఉంటారు. జనన మరణ చక్రంలో తిరుగుతూనే ఉంటారు. తనని తాను ఉద్ధరించుకోలేడు. వీళ్ళని ఉద్ధరించేవాడు ఒకడు కావాలిగా! అందుకే మహత్తు అనేటటువంటి సృష్టి ఎప్పుడు కలిగిందో, ఆ మహత్తు నుంచి గురుతత్వం వచ్చింది. ఆ తరువాతే మహత్తు నుంచి ప్రకృతి శక్తులు వచ్చి, సృష్టి అంతా వచ్చింది. మొదట్లో వచ్చిన గురుతత్త్వంలో ప్రకృతి శక్తులు అన్నీ కూడా ఇమిడి ఉన్నాయి. ఆ ప్రకృతి శక్తుల కంటే, ఇంకా గొప్ప శక్తులు ఆ గురుతత్త్వం కలిగి ఉన్నది. కనుక ప్రకృతిని శాసించ గలిగేటటువంటిది గురుతత్త్వము.

ఎఱుక – బయలు అనేదానిని విడమరచుకోవాలి. అవ్యక్త స్థితిలో ఉన్నటువంటి ఎఱుక జ్ఞాన రూప అఖండ ఎఱుక వ్యక్త స్థితిలో ఉన్న ఎఱుక మూడు గుణాలచేత మలినపుటెఱుక, మిశ్రపుటెఱుక, కేవలపుటెఱుకగా జగత్తుగా, జీవుడుగా, ఈశ్వరుడుగా వ్యవహారం జరుగుతోంది. ఇది అంతా ఈ రకంగా ఎఱుక యొక్క లీలా విలాసం. మాయ యొక్క లీలా విలాసం. ఎఱుకన్నా, మాయన్నా ఒక్కటే. చైతన్యం యొక్క లీలావిలాసం, చిద్విలాసం. చైతన్యమన్నా, ఎఱుకన్నా, మాయన్నా ఒక్కటే. కనుక ఈ ఎఱుకకు మూలం లేదు అన్నప్పుడు, ప్రణవానికి మూలం లేదు అన్నప్పుడు, దేనికీ మూలంకాని బయలే ఉన్నది. అది ఉత్తబట్టబయలు ఏమీ లేదు. కనుక ఈ ప్రణవం దాకా ఎవరైతే సాధన చేత అధిగమిస్తారో, కుండలినీ చేత అధిగమిస్తారో, వేరే ఉపాయం చేత, అనుష్ఠానం చేత అధిగమిస్తారో, ఎఱుక బ్రహ్మమై ఉంటారు. ప్రణవ స్వరూపులై ఉంటారు. ఓంకార స్వరూపులై ఉంటారు. వారికే ఆ పరమపదమైనటువంటి ఉత్తబట్టబయలు, దానికి మూలం కాదని, షోడశి, ద్వాదశి మంత్రాలతోటి తన వెనుకున్నదంతా కూడా ఎఱుక పరంగా ఏమీ లేదని, సున్నా ని పెట్టుకుని, ఆ సున్నాని దర్శించి, ఆ సున్నా ద్వారా మనం రాలేదనుకుని, సున్నా ద్వారా రానప్పుడు గొడ్రాలి బిడ్డ అనుకుని, మనకు మనమే ఒక తల్లి ఉందనుకుని, ఒక మాతృక ఉందనుకుని, ఆ తల్లిదండ్రులున్నారనుకుని, దాని పేరే బ్రహ్మ అని పేరు పెట్టి, అటువంటి బ్రహ్మజ్ఞానాన్ని పొందాము. తీరా చూస్తే, ఆ బ్రహ్మ నీకు మూలం కాదు కాబట్టి, ద్వాదశి, షోడశి మంత్రాలచేత నేనే లేకుండా పోయే పద్ధతిలో పోవాలి. అంటే, నీకు అతీతంగా ఉన్నటువంటి, నాద బిందు కళాతీతంగా, ప్రణవాతీతంగా, సకల ఎఱుకలకు అతీతంగా ఉన్నటువంటి, ఉత్తబట్టబయలు అనే సున్నాని దర్శించడం ద్వారా గురువు దర్శింప చేస్తే, ఆ పరబయలు దర్శనమైనటువంటి నీవు, గురువు ద్వారా ఎఱుక విడిచి, మాయను దాటి, మాయకు పరమైన, మాయాత్పరమైన బయలు, ఎఱుకకు పరమైనటువంటి, చైతన్యానికి పరమైనటువంటి, చిత్పరమైనటువంటి బయలు, వ్యక్తమయ్యే ఆస్కారమున్న అవ్యక్త పరమునకంటే కూడా పరమైనది పరాత్పరమునకు లక్ష్యము పెట్టుకుని, అదిగా మిగిలి ఉంటాడు. దానిని లక్ష్యంగా పెట్టుకుని, గురువు ఎఱుక విడిపించగానే, శిష్యుడు పరబయలు దర్శించగానే తను గొడ్రాలిబిడ్డ సామెతగా, మూలం లేదని తెలిసి నాద బిందు కళా తీత స్థితిలో, ప్రణవాతీత స్థితిలో తాను బట్టబయలై ఉంటాడు. ఇదీ పరమపదము.

**"లోకంబులు, లోకేశులు, లోకస్థులు దెగిన తుది నలోకంబగు, పెం**
**జీకటి కవ్వల నెవ్వడు । నేనాకృతిగా వెలుగు నతని నే సేవింతున్ ॥**

అక్కడ అకార, ఉకార, మకారములు కూడా త్రిపుటిలో లోకములు, లోకేశులు, లోకస్థులు అనే పద్ధతిలో కూడా తీసుకోండి. ఈ మూడూ కూడా ఎఱుకే కాబట్టి, ఎఱుక లేనిది కనుక మూడూ తెగిపోవాలి. కానీ మూడూ జట్టుకట్టి ఒకదానిని మించి ఒకటి, ఒకదానిని బట్టి ఒకటి ఉంటోంది. లోకము ఉంటేనే ఆ లోకానుభవంలో లోకస్థులు ఉన్నారు. లోకేశ్వరుడైనటువంటి ఈశ్వర సంకల్పం చేతనే, ఈ లోకస్థులైనటువంటి జీవులు తోస్తున్నారు. లోకేశుడు లేకపోతే లోకస్థులు లేరు. లోకస్థులుంటే తనకు కారణం ఆ లోకేశుడనే అనుష్ఠానం చేసుకుంటాడు. లోకాలేమో నామ, రూప, ప్రపంచాలుగా లేక నామరూపాలు లేకపోతే సూక్ష్మ ప్రపంచాలుగా, లేక ఏడు అథోలోకాలు, అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళ లోకాలుగాను, ఊరనీర్ధ్వలోకాలు ఏడుగా భూలోక, భువర్లోక, సువర్లోక, జనలోక, మహాలోక, తపోలోక, సత్యలోకాలుగా ఈ పద్నాలుగులోకాలు సృష్టించబడ్డాయి.

ఎవరిచేత సృష్టించబడ్డాయి? సృష్టి అంటే కల్పితం అని గుర్తుపెట్టుకోవాలి. ఎవరి చేత కల్పించబడ్డాయి? పంచబ్రహ్మల చేత. బ్రహ్మ, విష్ణు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు. వీరిచేత కల్పించబడ్డాయి. వీరిలో ఈశ్వరుడు చేత లోకాలు కల్పించబడ్డాయి.

ఆ లోకానుభవం పొందడానికి, ఆ లోకానుభవ వాసన ఉన్నటువంటి జీవులు, ఆ లోకంలో తగినటువంటి అనుభవము పొందడానికి, అనుగుణమైనటువంటి శరీరాన్ని సృష్టి కర్త బ్రహ్మ సృష్టిస్తే, ఆ లోకానుభవం పొందేదాక, విష్ణువు ఆ ఉపాధులను పోషిస్తే, ఆ ప్రారబ్ధం, ఆ కర్మానుభవం, ఆ సాధనానుభవం. ఆ లోకానికి సంబంధించినది పూర్తికాగానే, ఆ లోకానికి సంబంధించిన ఉపాధిని రుద్రుడు లయం చేసుకుంటే, ఆ లోకములలో లోకానుభవానికి సంబంధించిన సంస్కారములు ఏ లోకస్థులకు ఉన్నవో ఆ లోకస్థులను ఆయా లోకాలలోకి ఆకర్షించేవాడు సదా శివుడు. ఇలా పంచబ్రహ్మలు లోకేశులు లోకస్థులను, లోకంబులను కల్పిస్తూ ఒక ఆట ఆడుతున్నారు. లోకమంటే మాయాకల్పితమైనది కనుక ఎఱుకే. లోకేశులు, కూడా ఎఱుకే. ఈశ్వరుడు కూడా ఎఱుకే. సచ్చిదానంద పరమాత్మ ఎఱుకే. లోకస్థులు 14 లోకాల్లో, ఊహాలోకాల్లో, స్వప్నలోకాల్లో ఎక్కడ ఉన్నా వారుకూడా ఎఱుకే. ఎఱుక మూడు రకాలుగా ఉన్నదని తెలిస్తే, ఆ ఎరుకపోతే అలోకంబగు, లోకం లేనప్పుడు లోకానుభవం లేదు. లోకానుభవం ఇచ్చేటటువంటి ఈశ్వరుడు లేడు. లోకానుభవాన్ని అనుభవంగా తీసుకునేటటువంటి లోకస్థులు లేరు. ముగ్గరూ లేకపోతే ఏమైందట? ముగ్గురి లేనితనమే పెంజీకటి. ఇక్కడ బయలు పెను చీకటి కాదు. బయలు వెలుగుకాదు. బయలు చైతన్యం కాదు. బయలు ప్రకాశము కాదు. బయలు చీకటి కాదు. చీకటి వెలుగులు రెండూ బయలు కాదు. కనుక పెను చీకటి అంటే గాఢ తమస్సు, మూలావిద్య, మూల ప్రకృతి. వీటికి ఆవల ఏదైతే ఉన్నదో, అది మాత్రమే ఉన్నదో, దేనికినీ మూలము కాదో అదే ఉత్తబట్టబయలు ఏమీలేదు.

ఆత్మ ప్రకాశము అంటున్నాము, పరమాత్మ ప్రకాశము అంటున్నాము. ఈ పరమాత్మ ప్రకాశము లేకపోతే, అది పెను చీకటి. పెనుచీకటి అంటే అర్థం ఏమిటి? సృష్టికి పూర్వం గాఢ తమస్సు ఉంది. లోకంబులు, లోకేశులు, లోకస్థులు లేనప్పుడు గాఢతమస్సే పెనుచీకటి రూపంలో ఉంది. ఈ త్రిపుటిని ప్రకాశింపజేసే ప్రకాశం పరమాత్మ ప్రకాశం ఎప్పుడైతే తురీయస్థితిలో ఉంటుందో, సర్వవ్యాపక స్థితిలో ఉంటుందో, దాంట్లో సృష్టిని సంకల్పించి, వ్యక్తం చేసేటటువంటి జ్ఞానవాసన ఉన్నదో, దాని ప్రకారం పంచబ్రహ్మల ద్వారా లోకంబులు, లోకేశులు, లోకస్థుల యొక్క సృష్టి జరిగింది. జరిగనవన్నీ ఆ ప్రకాశంలో తెలిసినాయి కాబట్టి, వీటియందు కూడా ఆ ప్రకాశం ప్రతిఫలించి ఉంటోంది. స్వయం ప్రకాశం, అక్కడ ప్రతిబింబ ప్రకాశంగా లేనప్పటికీ బింబప్రకాశం ఎప్పుడూ ఉంటుంది, అన్నిటిలో. కానీ, బింబ, ప్రతిబింబ ప్రకాశాలు రెండూ ఉన్నవి. ప్రతిబింబ ప్రకాశ వ్యవహారానికి, బింబ ప్రకాశము ఆధారము అధిష్టానము. ఆధారమైనప్పుడేమో ఎఱుక బ్రహ్మ ప్రకాశమైనది. అధిష్ఠానమైనటువంటిది తనకు తానై ఉన్న పరబ్రహ్మ ప్రకాశము అయి ఉన్నది.

ఈ మూడూ తెగాలి. ఈ మూడు తెగితే అలోకమైనది. ఆ లోకంబులు, లోకేశులు, లోకస్థులు మూడు లేవు. వాటి యొక్క అనుభవాలు కాని, వాటియొక్క ఎఱుకలు కాని, అవి అనుభవించేటటువంటి, జ్ఞాత అనేటటువంటి, జ్ఞాతగా ఉనికి అనేటటువంటి ప్రకాశము లేదు. జ్ఞేయ వస్తువు ప్రకాశము లేదు. జ్ఞాన ప్రకాశము లేదు. ప్రకాశమే లేదు అన్నిరకాలుగా. అందుకని అది పెనుచీకటి పెనుచీకటికావల ఏకాకృతిగా ఏదైతే ఉన్నదో అది ఉత్తబట్టబయలు ఏమీ లేదు. 'దానినే సేవింతున్' – నేను 'ఏకాకృతి వెలుగునతని' సేవింతున్" అతని అంటే ఆ పరమపురుషుడు, పురుషోత్తముడు, బయలే తానైనటువంటివాడు అచల పరిపూర్ణుడే తానైనటువంటివాడు, 'వాడిని నేను సేవింతున్' – వాడిని ఎలా సేవిస్తారయ్యా? ఎఱుకైతే అనుష్ఠాన పూర్వకంగా సేవించవచ్చు. బయలుని ఎలా సేవిస్తారు? బయలును సేవించడం కుదరదు.

కనుక బయలైనటువంటి అశరీర గురువును సేవించండి. అది మళ్ళీ ఎలా సేవిస్తారు? అశరీరి గురువు శరీరం లేనివాడు కాబట్టి, మీ భావనలో శరీరం లేనివాడుగా భావన చేసి సేవించాలి. సద్గురువుకి ఒక స్థానం లేదు గనుక బయలందు స్థానం లేదు కనుక ఎఱుకకి ఎఱుక విడిచే స్థానం ఉన్నది. ఆ స్థానాన్ని అదే కల్పించుకుంది. దేశ కాల వస్తువులని, దేశ కాల వస్తువులందు ఎఱుక ఆ స్థానమందు నిలిచి వున్నది. మళ్ళీ స్థానము, పదవి వీటిని వెనక్కి తీసుకుంటే, జీవుడికి జీవుడనే పదవి, ఈశ్వరుడికి ఈశ్వరుడనే పదవి ఉన్నది. ఏ పదవీ లేనిది పరమపదము. ఏ పదమూ, ఏ పదవీ లేనిది పరమపదము. కనుక ఈ పదవిలన్నీ కూడా ఎఱుకలోనే ఉన్నవి. అందుకని స్థానము లేదు అశరీర గురువుకి. ఎఱుకలోనే స్థానాలున్నాయి. బయలైన గురువుకు స్థానం లేదు. బయలైన గురువు అభావం. ఆత్మ కూడా శుద్ధ సత్వగుణం అని చెప్పాము. ఆత్మ – శుద్ధ సత్వగుణం. అనాత్మ – శుద్ధ తమోగుణం. రెంటియొక్క మిశ్రమం నేను, నేను అనే నీవు, ఈ రజోగుణం. ఆత్మ త్రిగుణ రహితం గనుక

శుద్ధ సత్వగుణం కూడా పోవాలి. శుద్ధ సత్వగుణం కూడా పోతేనే బయలు. మూడుగుణాలు లేకపోవడమే బయలు. రహిత పద్ధతిగా పోవాలి. మళ్ళీ వచ్చేపద్ధతిగా కాదు. వ్యక్తావ్యక్త పద్ధతి కాదు. రహిత పద్ధతి అన్నప్పుడు వ్యక్తావ్యక్తము కాదని, రహిత పద్ధతిలో ఏమీలేదు అనేది శాశ్వతము. అది 'పెను చీకటికి ఆవల ఏకాకృతిగా వెలుగు' – ఎవరు వెలుగుతున్నారు? అశరీరి గురువు వెలుగుతున్నారని, అటువంటి గురువును సేవించాలి. చతుర్విధ శుశ్రూషల ద్వారా, అంగ స్థాన భావ ఆత్మలు లేనివని, శిష్యుడు కూడా తన పరంగా అంగ, ఆత్మ, స్థాన, భావ, ఆత్మలు లేనట్టి పద్ధతిలో, ఆ గురువుని ఇంట, వెంట, జంట పెట్టుకుని వెంబడించి, గురుశుశ్రూష చేస్తే, అటువంటి గురువును సేవించినప్పుడు, శిష్యుడు లేకుండా పోతాడు. అప్పుడు ఉనికి నాలుగు విధాలుగా ఉండే అవకాశం లేదు. గురువును అశరీర పద్ధతిగా, అంగ రహిత పద్ధతిగా, స్థాన రహిత పద్ధతిగా, భావ రహిత పద్ధతిగా, ఆత్మ రహిత పద్ధతిగా, శిష్యుడు ఆ గురువుకి సేవ చేసినప్పుడు శిష్యుడు లేకుండా పోతాడు. అంటే, గురుసేవ అన్నా, గురుశుశ్రూష అన్నా, ఆ శుశ్రూష ద్వారా శిష్యుడు లేనివాడు అవుతాడు. నాలుగు పద్ధతుల్లో ఉన్నవాడు కాబట్టి, ఈ నాలుగు పద్ధతుల్లో గురుశుశ్రూష చేస్తే, ఆ శిష్యుడు నాలుగు పద్ధతుల్లో లేకపోతే, ఇక ఏ పద్ధతిగానూ ఉండడు. ఇక ఏ పద్ధతిగానూ లేకపోతేనే బయలే ఉన్నది.

**అంతర్జ్యోతి బహిర్జ్యోతి । ప్రత్యక్ జ్యోతిః పరాత్పరః ।**
**జ్యోతిర్జ్యోతి పరంజ్యోతిః । ఆత్మజ్యోతిః శివోస్మ్యహం ॥**

ఇది సాధన గురించి చెబుతున్నారు. బయట ప్రపంచం కనబడుతోంది బహిర్ముఖంగా ఉన్న ఇంద్రియాలకి. కాసేపు ధ్యాననిష్ఠుడై జ్యోతిని ధారణ చేస్తే, జ్యోతి ఆకారం చెందినటువంటి స్థితి అంతర్ముఖంలో కలిగితే, అంతర్జ్యోతి అయ్యింది. 'సర్వం ఖల్విదం బ్రహ్మం' గా అయినప్పుడు, బయట నామరూప ప్రపంచాన్ని కూడా, విశ్వరూపంగా, బ్రహ్మాకారంగా చూసినప్పుడు అది బహిర్జ్యోతి అయినది. బ్రహ్మనిష్ఠలో ఉన్నవాడు అంతర్జ్యోతి. 'సర్వం ఖల్విదం బ్రహ్మ'గా ఉన్న జ్ఞాన దృష్టిచేత బహిర్జ్యోతి. లోపల ఉన్నటువంటి, బయట ఉన్నటువంటివి రెండు ఉంటాయా? లోపల, బయట అనేటటువంటిది ఏదైతే విభజనగా ఉంటుందో, సాధకుడు లోపల బ్రహ్మనిష్ఠుడిని, ఇంద్రియముల యొక్క బయట వ్యాపారం చేత, బయట ప్రపంచం తోస్తుంది. అపుడు లోపల, బయట అనే పేరు పెట్టాల్సి వచ్చింది. ఈ లోపల, బయట అనేది లేదు కాబట్టి అలా లేకుండా పోవడం కష్టం. బ్రహ్మనిష్ఠలో, అంతర్ముఖ సాధనలో, లోపలిది జ్యోతి స్వరూపంలో గోచరించింది. బయట కూడా నామ రూప జగత్తులో, జగత్తు కూడా బ్రహ్మమే. ఆ బ్రహ్మమే జగదాకారుడు, విశ్వాకారుడు, విశ్వరూపుడు అయ్యాడని, విశ్వరూప సందర్శనం జరిగింది (అర్జునినికి) అంటే, బ్రహ్మం విశ్వరూపంలో ఉన్నాడు అనేటటువంటి జ్యోతి దర్శనం జరిగింది. బహిర్జ్యోతి దర్శనం జరిగింది. విశ్వాన్ని నామ రూపంగా కాకుండా, విశ్వాన్ని కూడా జ్యోతి రూపంగా చూడడమే జ్ఞాన నేత్రము, జ్ఞాన చక్షువు, జ్ఞాన దృష్టి. ఆ దృష్టిని ఇచ్చాడు విశ్వరూప సందర్శనానికి కృష్ణపరమాత్మ. అర్జునునికి ఆ దివ్య దృష్టిని ఇచ్చాడు. ఆ దివ్య దృష్టితో విశ్వాన్ని దివ్యత్వంగా, దైవీచైతన్యంగా, చైతన్య రూపంగా చైతన్యం యొక్క విభూతులే దానియందున్నట్లుగా చూచాడు.

అనేక ఆభరణాలన్నిటిలో కూడా విడివిడిగా ఆభరణాల యొక్క సొగసు, ఆకర్షణ చూడకుండా, ఆ ఆభరణాలలో ఉన్నది బంగారమే అనే దృష్టి తోచినప్పుడు, విశ్వసందర్శన, విశ్వరూప సందర్శన అలా చూసినప్పుడు బయట, లోపల కూడా జ్యోతి స్వరూపమే. అప్పుడు జ్యోతి స్వరూపం ఎప్పుడైతే బయట, లోపల దర్శనమైందో, వెంటనే లోపల, బయట అనే విభజన చెరిగిపోయి, ఒకే ఒక జ్యోతి ప్రత్యేకంగా, స్పెషల్‌గా కనబడుతోంది. అది ప్రత్యక్ జ్యోతి. ఈ ప్రత్యక్ జ్యోతియే పరాత్పరము. పరము అన్నప్పుడేమో అంతర్జ్యోతి, బహిర్జ్యోతి, అంతర్జ్యోతి ఎప్పుడైతే ఒక్కటి అయ్యిందో, అది ప్రత్యక్ జ్యోతి. ఈ ప్రత్యక్ జ్యోతిలో ఏముంది? బహిర్జ్యోతేమో అనాత్మప్రపంచము. అంతర్జ్యోతేమో, అనాత్మకి పరమైనది పరమాత్మ. బహర్జ్యోతి అనాత్మ సంబంధమైతే, అంతర్జ్యోతి పరమాత్మ. అనాత్మకి పరమాత్మ పరమైతే, పరమాత్మకి పరమైనది పరాత్పరం. కనుక ఈ ప్రత్యక్ జ్యోతి పరాత్‌పరం అయ్యింది. పరమునకంటే పరం.

అజ్ఞానమునకు పరమైనది జ్ఞానము. జ్ఞాన, అజ్ఞానములకు పరమైనది పరాత్పరం. అనాత్మ జడము. అనాత్మ భావన అజ్ఞానము. ఇలాగా పరము, పరము అని రెండు పరములు పెట్టాము. ఒక పరమేమో అనాత్మకంటే పరమైనది పరమాత్మ. రెండవ పరమేమో పరమాత్మ కంటే పరమైనది పరబ్రహ్మం. ఈ పరబ్రహ్మమే పరాత్ పరం. ఈ పరబ్రహ్మానికి సరిగ్గా నిర్వచనం చెబితే, ఆ నిర్వచనం ప్రకారంగా, పరాత్ పరం సరిపోతుంది. ఆ పరబ్రహ్మాన్ని సృష్టికి బీజ ప్రదాతగా పెట్టుకుంటే, మరి

పరాత్పార పరబ్రహ్మము అని మూడు పరాలు పెట్టాల్సి వస్తుంది. వీరు ఆ పరబ్రహ్మని బయలుగా నిర్ణయిస్తే, అదే పరాత్‌పరం. ఒక పరబ్రహ్మ తాను కారణమైతే సృష్టికి, కారణమైన బ్రహ్మకి పరమైనవాడు పరబ్రహ్మ. ఈ పరబ్రహ్మ దేనికీ కారణం కాదు అనగానే, అక్కడికి బయలు నిర్ణయం అయిపోయింది. ఇంకా ఏమీ అక్కర్లేదు. కొందరు ఏమంటున్నారంటే, ఆ పరబ్రహ్మ సృష్టికి బీజ ప్రదాత అంటున్నారు. అప్పుడు ఈ పరాత్పరుడే పరబ్రహ్మ అయినప్పుడు, సృష్టికి అతీతంగా దేనికీ సంబంధం లేకుండా, తనకు తానే స్వతఃసిద్ధమై ఉన్నవాడే, బట్టబయలై ఉన్నవాడే కదా ఆ పరబ్రహ్మ!! అందువలన పరాత్పర పరబ్రహ్మ అని పేరు పెట్టవలసి వచ్చింది.

ఎఱుక ఉన్నంతసేపూ ఒక పర చేర్చాలి. పరబ్రహ్మ జ్ఞానం నాకు అయ్యింది అన్నారంటే, దానికి పరమైనది బయలు అనాలి. జ్ఞానాతీతం అది. బయలు అనేది జ్ఞానాతీతం.

**'జ్యోతిర్జ్యోతి పరం జ్యోతిః'** – ఇక్కడేమయ్యింది? ఇన్ని జ్యోతులు కలిపి ఒకే జ్యోతి అయ్యింది. బహిర్జ్యోతి కూడా అంతర్జ్యోతి తోటి సమానం అయ్యింది. ఎప్పుడైతే సమానం అయ్యిందో, అది ప్రత్యక్ జ్యోతి అయ్యింది. అద్వయంగా ఉన్నది. రెండవది లేని, ఏకమేవాద్వయంగా ఉన్న జ్యోతి. ఆ జ్యోతియే పరాత్పరం. ఈ పరాత్పరమైనది. ఇక్కడ ఒకమాట చూడండి. బ్రహ్మ యొక్క లక్షణాలు పరబ్రహ్మయందు లేవు. ఆత్మయొక్క లక్షణాలు పరమాత్మయందు లేవు. ఆ బ్రహ్మము పరమాత్మ, సత్‌చిత్ ఆనందమైతే, పరబ్రహ్మమందు సచ్చిదానందము లేదు. కనుక పరాత్పర అనేదాంట్లో సచ్చిదానందము లేదు అనేటటువంటిది గ్రహించాలి.

పరుడు కాని వాడిలో అనృత జడ దుఃఖములు ఉన్నవి. పరుడైన వాడిలో సత్, చిత్, ఆనందము ఉన్నది. పరాత్పరుడైన వాడిలో సచ్చిదానందము లేదు. పరుడు కాని వాడికి అనృత జడ దుఃఖములు ఉన్నవి. పరుడైన వాడికి 'అనృత, జడ, దుఃఖములు' లేకపోగా 'సత్ చిత్ ఆనందము' ఉన్నది. పరాత్ పరడైనవాడికి 'సత్‌చిత్‌ఆనందము' కూడా లేదు. అది కూడా లేకపోవడమే త్రిగుణ రహితము.

ఎందుకని? ఆనందం అనేటటువంటిది సత్ అనేటటువంటి ఉనికి మాయావరణలోనే ఉన్నది. ఆ ఉనికి యొక్క అనుభూతి ఏదంటే, శుద్ధ సత్వగుణం. సత్‌చిత్‌ఆనంద అనుభవం అనేది శుద్ధసత్వగుణం వల్ల వచ్చింది. ఆ శుద్ధసత్వగుణం కూడా రహితమైతే, సత్‌చిత్‌ఆనందము కూడా ఉండదు. 'సత్' అనేటటువంటి, శాశ్వత ఉనికి అనేటటువంటి చైతన్యానుభవం ఉండదు. చైతన్యం ఉంటేనే అనుభవం. విడగొట్టి చెప్పినప్పటికి సత్‌చిత్‌ఆనందం అనేది ఒకటే రూపం, ఒకటే లక్షణం. సత్తేచిత్తు, చిత్తేసత్తు. **చిత్తు ఉన్నటువంటి ఉనికి యొక్క అనుభూతి ఏదో, అది ఆనందము**. మూడు కలసి ఒకటే లక్షణం. ప్రకృతిని బట్టి అనృత, జడ, దుఃఖములకు వ్యతిరేకార్థములో సత్ చిత్ ఆనందము సృష్టించబడింది. కనుక పరము అనేది సృష్టించబడినప్పుడు, అది కూడా కల్పితమైనప్పుడు సత్యవస్తువు పరాత్పరం అనబడుతుంది.

**'జ్యోతిర్జ్యోతి పరంజ్యోతిః'** – మరిక్కడ పరంజ్యోతికి ఏం చెప్పాలి? జ్యోతిలో జ్యోతి. జ్యోతియే తానైనటువంటి జ్యోతి. నేను నేనైన నేను, తనలో తాను రమించేటటువంటి బ్రహ్మము. ఇది జ్యోతిర్జ్యోతి. ఆ రమించుట ఆగిపోతే, అది పరంజ్యోతి. జ్యోతిలో ఉన్నటువంటి, తనలోతాను రమించుట అనేటటువంటి అద్వైత స్థితి ఏదైతే ఉన్నదో, జ్యోతికి పరమైనటువంటి పరంజ్యోతియని ఎప్పుడైతే అన్నామో, జ్యోతిలో ఉన్న తనలో తాను రమించుట అనేటటువంటిది కూడా పోయింది. దానికి కూడా అతీతం. దానికి కూడా విలక్షణం. పరంజ్యోతి అంటే బయలే. తనలోతాను రమించుట కూడా లేనిది పరంజ్యోతి. జ్యోతి అని పేరు పెట్టినప్పటికీ జ్యోతికి పరమైనది, జ్యోతి యొక్క లక్షణాలు లేనిది, ఆనంద లక్షణాలు లేనిది అని తీసుకోవాలి.

**'ఆత్మజ్యోతిః శివోస్మ్యహం'** – ఆత్మ అంటే ఇక్కడ ఎవరు? సచ్ఛిష్యుడే అటువంటి పరంజ్యోతి స్వరూపుడు అయ్యాడు. ఆ సచ్ఛిష్యుడు జ్యోతి స్వరూపాన్ని పొందినప్పుడు ఆ పరంజ్యోతియే ఈ జ్యోతి. ఆ జ్యోతి పరంజ్యోతియే! లోపలి జ్యోతియైనటువంటి సాక్షాత్కారము, బయటకూడా లోపలున్న జ్యోతినే దర్శించడము. ఈ దర్శించినటువంటి బయట, లోపల ఒకటే అనేటటువంటిది ఏదైతే ఉన్నదో, ఆ **అపరోక్షానుభూతి ప్రత్యక్‌జ్యోతి**. ఈ అపరోక్షానుభూతిలో ఉన్న **'సత్యం, జ్ఞానం, అనంతం, బ్రహ్మ'** అని ఏదైతే ఉన్నదో అది పరం. ఆ పరమునకు పరమైనది బయలు. పరాత్పరం. మళ్ళీ జ్యోతినుంచి క్రిందికి వచ్చాము. **'జ్యోతిర్జ్యోతి'** జ్యోతియే అంతరాత్మకూడా! జ్యోతి యొక్క అంతర్యామి కూడా జ్యోతియే.

మొదటి జ్యోతి ప్రకాశము, రెండవ జ్యోతేమో ప్రకాశ ఘనము. మొదటి జ్యోతి ఆవరణ ప్రకాశము. రెండవజ్యోతి నిరావరణ జ్యోతి. అసలు నిరావరణ జ్యోతియే సత్యం. మాయకల్పించిన ఆవరణలో ఉన్నటువంటి ప్రకాశము, మాయావరణలో ఉంది కనుక, మాయయొక్క నిర్వచనం చేత, ఆ ప్రకాశం లేనిది కనుక, ఆజ్యోతి లేదు. కనుక ఇప్పుడు ఒక జ్యోతి స్వరూపుడు మాయావరణలో ప్రకాశిస్తూ ఉన్నప్పుడు, ఆ మాయావరణ ప్రకాశమే పరమాత్మ అయినప్పుడు అది ఎనిమిదవ శరీరం అయినప్పుడు, ఆ శరీరం పేరు ఏమిటి? జ్యోతిర్మయ శరీరము. జ్యోతి యొక్క ప్రకాశం చేత వ్యాపకమైనది జ్యోతిర్మయం. ఆ జ్యోతిర్మయమే మాయావరణ యందు పరమాత్మ. ఆ పరమాత్మే అష్టతనువులలో ఎనిమిదవ శరీరము. కనుక జ్యోతిర్మయం అనేటటువంటి శరీరానికి అంతర్యామి, అంతరాత్మగా ఉన్నటువంటి జ్యోతియే ఆ పరబ్రహ్మ.

**'జ్యోతిర్జ్యోతి'** – ఈ పరబ్రహ్మ ఇప్పుడు ఏమయ్యాడు? పరంజ్యోతి అయ్యాడు. కనుక ఆ పరబ్రహ్మ పరాత్పరుడు అయ్యాడు. ఈ పరంజ్యోతి అనేటటువంటిది మీకు అవగాహన కోసం, ఏదైతే సబ్జెక్టుగా, విషయంగా చెప్పానో, ఇక మీమీద అప్లై చేసుకోండి, ఆత్మ అంటే, నేను నేనైన నేను. ఆత్మ అంటే సచ్ఛిష్యుడు. ఇప్పుడు సచ్ఛిష్యుడి మీదే అప్లై చేస్తున్నాము.

**'ఆత్మజ్యోతిః'** – ఇప్పుడు ఆత్మకి ఒక జ్యోతి అనేటేటటువంటి అనుభవం, అపరోక్షానుభూతి కలిగింది. ఈ అపరోక్షానుభూతి పైన నిర్ణయించిన నిర్ణయంగా, తత్వమసి వాక్యార్థంతోటి, ఆత్మజ్యోతి అనేటటువంటి 'త్వం', పరంజ్యోతి అనేటటువంటి 'తత్' అనేటటువంటి దానికి భేదం లేదు అనే పద్ధతిలో, ఆత్మజ్యోతి ఏమిటయ్యా? అంటే, 'శివోస్మ్యహం' – ఆ శివుడే తానై ఉన్నాడు, ఆ శివుడే బయలు. ఇక అంతకంటే ఏమీ లేదు.

'హంస' నే ప్రణవము అందురు. 'హంస' అంటే ఎఱుక. 'ప్రణవము' అన్నా ఎఱుకే. ఈ అనాహత శబ్దమగు ప్రణవమందు త్రివ్యాహృతులైన అకార, ఉకార, మకారములచే సృష్టి అయినది. ఈ ప్రణవము అనేటటువంటి, హంస అనేటటువంటి ఎఱుక, ప్రణవము అనేటటువంటిది, ఓంకార ధ్వనియొక్క అవ్యక్తస్థితి. ధ్వని ఎప్పుడొస్తుందండి? గంటకొడితే ధ్వని వస్తుంది. 'హత' – అంటే కొట్టడం. 'అనాహత' – కొట్టకుండా ఉండే ధ్వని. అంటే ధ్వని యొక్క అవ్యక్త స్థితి.

'అనాహత' మంటే ధ్వని గుణము. అదే నాదము.

గంట ఉందండీ, కొడితే 'ఓం' అని శబ్దం వచ్చింది. గంట కొట్టక ముందు 'ఓం' అక్కడ అవ్యక్తంగా ఉంది. అక్కడ ధ్వని లేదుగా, గంట కొట్టలేదుగా. గంట కొట్టలేదు అంటే అనాహతం. కొట్టడం అంటే హతం. కొట్టకపోతే అనాహతం. అనాహతంలో ప్రణవము నిశ్శబ్దము. మహత్తు బిందు రూపం ఆ బిందువు విస్తరించడము ఆరంభించింది. వ్యాహృతి అంటే విస్తరించడం. త్రివ్యాహృది అంటే మూడుగా విస్తరించడము. ఏమిటా మూడు? అకార, ఉకార, మకారములుగా. ప్రణవమందు అకార, ఉకార, మకారములు ఏకీకృతంగా ఉన్నాయి. శబ్దమేమో అనాహతంగా ఉంది. శబ్దము ఉత్పత్తి అయ్యింది. అవుతూనే త్రివ్యాహృతంగా అయ్యింది. అకార, ఉకార, మకార మాతృకలుగా, మూడు పద్ధతులుగా, మూడు చీలికలుగా, మూడు విభాగాలుగా స్థూల సూక్ష్మ కారణాలుగా, త్రిపుటులుగా, త్రివ్యాహృతులైంది. అకార, ఉకార, మకారాలనే సృష్టి అయ్యింది. 'ప్రణవం' విన్నవారికి, స్మరించు వారికి జన్మ ఉండదు. అనాహత శబ్దం, ఎవరికైతే వినబడుతోందో, శబ్దం చెవులకు వినబడే శబ్దం 'హత' శబ్దం. 'హత' శబ్దం నిన్ను బంధిస్తోంది. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలన్నీ కూడా శబ్ద రూపంలో అవి నిన్ను బంధిస్తున్నాయి. అవి విషయాలుగా ఉండబట్టి, విషయాసక్తిగా నీకు ఉండబట్టి, విషయాలు నీకు తెలియబడడం బంధమైనది. అనాహతం దగ్గర శబ్దం కూడా లేదు గనుక, అనాహత శబ్దాన్ని ఎవరైతే వింటారో, అంటే అక్కడ వినడం లేదు. తానే ప్రణవ స్వరూపుడై, తానే ఆ ప్రణవనాద రూపుడై ఉంటాడు. తానే ఆ ప్రణవనాద రూపుడౌతాడు.

ప్రణవ రూపుడు ఎవడైతే ఉన్నాడో, వాడు ఆ నాదరూప బ్రహ్మని స్మరించువాడు. ఈ స్మరణ అజపంగా, అప్రయత్నంగా జరుగుతుంది. స్మరించుట, అజపము, అప్రయత్నము, నిష్ఠ అన్నప్పుడు తదాకారమే, ఆ బ్రహ్మాకారమే తానైపోతాడు. ఏదైతే స్మరిస్తున్నాడో, ఆ స్మరణ రూపుడు అంటే తదాకారుడు. అట్టివారికి జన్మ ఉండదు. అంటే బ్రహ్మనిష్ఠుడై, చలించని వానికి జన్మ ఉండదు. అయితే ఈ జన్మ ఎటువంటిదో చెప్తాము. కేవలము అకార, ఉకారములతో ప్రణవము కాలేదు. మళ్ళీ దీనిని, ఈ మూడింటిని విభజన చేస్తున్నాడు. అకార, ఉకారాలతో 'ఓ' అయినది. 'మ'కారమను బిందువుతో చేరగా 'ఓం' అను అక్షరమైనది. 'ఓం' అన్నప్పుడే పెదవులు రెండూ కలిసి 'మ' కారం వచ్చింది, అప్పుడు 'ఓం' అను అక్షరమైంది. ఇక్కడ అక్షరం అంటే ఏంటి? క్షరము కానిది. 'ఓం' అనేది అక్షరమైతే, 'ఓం' ద్వారా ఓంకారేశ్వరుడి యొక్క, ఓంకార బ్రహ్మము యొక్క సంకల్పము చేత,

వచ్చినవన్నీ కూడా ఊహామాత్రం, సంకల్ప మాత్రం. భావనామాత్రం. కనుక ఊహలాగిపోతే అవి ఆగిపోతాయి. ఊహలు లయమైతే, అవి లయమౌతాయి. ఊహ ఎప్పుడొస్తే, అప్పుడు సృష్టించబడుతాయి. ఊహలు కొనసాగుతూ ఉంటే, అవి కూడా కొనసాగుతూ ఉంటాయి. ఊహలో మార్పు వస్తే, వికారం చెందుతూ ఉంటాయి. 'ఊహ' ఆగిపోతే అవి లయం చెందుతాయి కనుక 'ఊహ' ద్వారా వచ్చినవి మాత్రమే సృష్టి, స్థితి, లయలుగా ఉన్నాయి. 'ఊహ'కు ఆధారమైన ప్రణవము, సృష్టి స్థితి లయములకు అతీతంగా ఉంది. కనుక అది కూడా బ్రహ్మమే. కాకపోతే ఎఱుక బ్రహ్మ. మూలం ఉందిగా దీనికి! మూలం లేనిదైతే అచల బ్రహ్మ. మూలం ఉన్నది కనుక ఎఱుక బ్రహ్మ. ఇక్కడ అక్షరము. క్షర అక్షరుడనే ద్వంద్వంలో అక్షరము. ఇదే ప్రణవము. ఇది వర్ణత్రయంతో కూడి ఉన్నది. అకార, మకారములు రెండునూ బ్రహ్మసంబంధమైనవి. ఉకారము మాత్రము త్రిపుటిగా తెలుపు, ఎరుపు, నలుపు వర్ణములు కలిగియున్నది. కనుక ఉకారమే మాయ. ఉకారమే త్రిగుణములు. ఇది ప్రకృతి సంబంధమైనది. ఉకారము గుణరహితుడగు పరబ్రహ్మ సంబంధమైన 'అ', 'మ' వాటికి గుణ సహితమగు ప్రకృతి సంబంధమైన 'ఉ', దానికి తాదాత్మ్య సంబంధమైన బిందువుతో కూడిక కలిగి 'ఓం' అయినది.

## హంసతత్త్వము

హంసనే ప్రణవమందురు. హంస అంటే నేను; హంస అంటే ఉచ్ఛ్వాస నిశ్వాసములు. హంస అంటే 72వేల నాడులతో వ్యాపకమయినది. హంస అంటే అన్ని రకాల వృత్తులు. అధిష్ఠానము, క్షేత్రజ్ఞుడు, అక్షర పురుషుడు అన్నా హంసే. హంస అంటే ఎరుక. ఎరుకంటే మాయ. మాయంటే లేనెరుక. హంస అంటే లేనెరుక. హంసనే ప్రణవమందురు. అంటే శబ్దము కూడా లేనెరుకే. అనాహత శబ్దమే ప్రణవము. హతశబ్దమంటే కొడితే వచ్చిన శబ్దము. అనాహత శబ్దమంటే శబ్ద గుణము.

శబ్దము యొక్క అవ్యక్త స్థితిని అనాహతమంటారు. ఆ శబ్దము యొక్క అవ్యక్తం సూక్ష్మంగా శబ్ద రూపము. సాధకులకు దశవిధనాదాలుగా వినబడే అవకాశం ఉంది. అంటే నోటితో ఉచ్చరించినపుడు వచ్చే శబ్దం కాకుండా ఉచ్చరించకుండానే వినపడే శబ్దాన్ని అనాహత శబ్దం అంటారు.

వ్యాహృతం అంటే వ్యావృతం, వ్యాపించటం, త్రివ్యాహృతమంటే 3 శాఖలుగా 3 విధాలుగా అకార ఉకార మకారములుగా తమోగుణ రజోగుణ సత్వ గుణములుగా వ్యాపించటం. అకార ఉకార మకార త్రిపుటిచే సృష్టి ఏర్పడి వ్యాపకమయింది. ఈ ప్రణవము విన్నవారికి ధరించువారికి జన్మ ఉండదు. ఇక్కడ జన్మ ఉండదు అంటే ఏమిటి? అప్రయత్నంగా అజపంగా తానదై ఉన్నాననేటువంటి స్మృతివలన అంటే బ్రహ్మానుభవమే. అటువంటి వారికి జన్మ ఉండదు. అయితే ప్రణవము లేనెరుకగదా! ప్రణవంవల్ల జన్మ ఉండదంటారేమిటి? అంటే ఆ ప్రణవ స్వరూపులైనటువంటి బ్రహ్మయందు ఐక్యత పొందుతాడు. అటువంటి ఐక్యత పొందినవాడు బ్రహ్మయొక్క ఆయుష్షు కాలమున్నంత వరకు ఉంటాడు. బ్రహ్మకు కూడా నూరేళ్ళ ఆయుష్షు ఉంది. ఆ తరువాత అతను చనిపోయి లేకుండా పోయి మరొక బ్రహ్మ. లేక అదే బ్రహ్మ పునర్జన్మగా తోస్తాడు. అంతకాలం జన్మరాహిత్యమే కాని బ్రహ్మ ఆయుష్షు కాలం తీరాక కొత్త బ్రహ్మ రాగానే కొత్త కల్పంలో ఈ జీవుడు సృష్టించబడతాడు. కల్పించబడతాడు.

సృష్టి అంటే కల్పన. కేవలము అకార ఉకారములతో ప్రణవము కాలేదు. అకార ఉకారాలు కలిస్తే ఓ అయ్యింది. మకారమనే బిందువు చేర్చగా ఓం అయ్యింది. బిందువు అంటే సున్న. కుడిప్రక్కన సున్న చేరిస్తే ఓం అయింది. పెదాలు రెండూ కలిస్తే బిందువు వచ్చింది. కనుక పెదాలు రెండూ మూయటం ద్వారా అంతకుముందే ఉన్న శబ్దము 'మ్' అయ్యింది. పెదాలు మూయడం ద్వారా సున్న వచ్చి ఓకు కుడిపక్కన చేరింది. అప్పుడు ఓం అనే అక్షరమయినది. క్షరాక్షరములలో అక్షరమయినది. అక్షరమంటే ఒక లెటర్ అని కాదు. **'ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ',** ఏకాక్షరము 'ఓం' అనేది అయితే, అక్షరానికి రెండర్థాలున్నాయి. వాక్యాలు, అక్షరాలు అన్న పద్ధతిలో ఒకటి. అక్షరము అంటే క్షరము కానిది. కావున నశించనిది ప్రణవము.

ఇది వర్ణత్రయముతో కూడి ఉన్నది. ఏమిటా 3 వర్ణాలు? అకార, ఉకార, మకారములు. అందులో అకార మకారములు రెండు బ్రహ్మ సంబంధమైనవి. 'ఉ'కారము మాత్రము త్రిపుటిగా తెలుపు, ఎరుపు, నలుపులుగా నున్నది. తెలుపంటే సత్వగుణం, ఎరుపంటే రజోగుణము. నలుపంటే తమోగుణం. అంటే 3 గుణములు కల్గి ఉన్నది. ఇది ప్రకృతి సంబంధమైనది. ప్రకృతి అంటే, త్రిగుణాత్మకమైనదే ప్రకృతి. ప్రకృతి అన్నా మాయన్నా ఒక్కటే. ప్రకృతి ఎలా వచ్చింది? కృతి అంటే చేయబడినది. ప్రకృతి అంటే ప్రకృష్టముగా చేయబడినది. అంటే శ్రేష్ఠముగా గొప్పగా చేయబడినది. కుమ్మరివాడు కుండలు చేసినట్లు కాకుండా సృష్టి చాలా విచిత్రం. ఎందుకంటే కుమ్మరివాడు కుండలు చెయ్యాలంటే మట్టి కావాలి. ఇక్కడ ఉపాదాన కారణము నిమిత్త

కారణము సర్వమూ ఉండాలి. కాని బ్రహ్మమే తానైటువంటిది సృష్టి ఇది. కనుక సృష్టికర్త బ్రహ్మ సృష్టికర్తగా ఉంటూనే తాను చేసిన సృష్టిలో ఆ బ్రహ్మ వ్యాపకమై ఈ సృష్టించబడినటువంటి జగత్తు కాని నామరూపాలు కాని ఇదికూడా బ్రహ్మమే. ఆభరణాలలో బంగారమున్నట్లు, నామరూప జగత్తులో చైతన్యము అనేటువంటి చిత్ స్వరూపము ఏదైతే ఉన్నదో అది బ్రహ్మము. మరి నామరూపాలు కల్పితం కదా! ఒకవేళ నిజమైనప్పటికీ నామరూపాలు కూడా బ్రహ్మమే కదా! బ్రహ్మము ఉపాదాన కారణమైనప్పుడు జగత్తు కూడా బ్రహ్మమే అవుతుంది. ఎలా?

ఒక సాలె పురుగు నోట్లోంచి వచ్చిన జిగురుతో సాలెగూడు వచ్చింది. సాలెగూడు కంటే సాలెపురుగు వేరనిపించినప్పటికి, ఆ గూడుకు సంబంధించిన పదార్థం అంతాకూడా ఆ సాలె పురుగు కడుపులోనుంచి నోటిద్వారా వచ్చినటువంటిదే. కనుక సాలె పెరుగు ఉపాదాన కారణము. సాలెగూడు ఎలా తయారయ్యిందంటే అక్కడ సాలె పురుగులో ఉన్న పదార్థము తనలో నుండే వ్యక్తమై సాలెగూడు అయింది. సాలె పురుగుకంటె అన్య పదార్థము అక్కడ లేదు. ఆ రకంగా గూడు కట్టింది. కనుక సాలె పురుగు నిమిత్త కారణము. అక్కడ పదార్థమంతా కూడా దానినుండి వచ్చిన పదార్థమే గాని అన్య పదార్థం లేదు. కనుక సాలె పురుగు ఉపాదాన కారణము, నిమిత్త కారణము కూడా. అలాగే ఈ సృష్టికి ఉపోదాన నిమిత్త కారణములు రెండూ ఆ బ్రహ్మమే.

అందుకని అకార మకారములు రెండూ బ్రహ్మ సంబంధమైనవి. ఉకారం మాత్రము త్రిపుటిగా తెలుపు ఎరుపు నలుపంటే సత్వ, రజో, తమో గుణములు కలిగి ఉన్నవి, ప్రకృతి సంబంధమైనది. ప్రకృతి అంటే త్రిగుణ సామ్యమే ప్రకృతి గుణరహితుండగు బ్రహ్మ సంబంధములైన "అ,మ" అను వాటికి గుణసహితమగు ప్రకృతి సంబంధమైన 'ఉ' దానికి తాదాత్మ్య సంబంధమైన బిందువుతో కూడి 'ఓం' అయినది. ప్రకృతి సంబంధమంటే వేరే అర్థాలు చెపుతున్నారు. త్రిగుణాత్మక మాయచే కల్పింపబడినది, తోచినది అని. అకార మకారాలు బ్రహ్మ సంబంధమైతే ఉకారము మాత్రము, మాయ, త్రిగుణాలు, ప్రకృతి. ఇవన్నీ సందర్భాన్నిబట్టి వేరే పదాలు వాడినా, ఇవన్నీ ఒక్కటే. ఉకారము మాత్రము త్రిపుటిగా, త్రిగుణ సామ్యముగా ప్రకృతి సంబంధమైనదిగా ఉన్నది. ఈ సంబంధములు మాతృకలు అనే సంకేతంగా చెప్పబడినవి. అందుకు సంబంధం అనే మాట వాడాము. సంబంధమంటే అకార మాతృక. మకార మాతృక. ఇవి రెండూ బ్రహ్మ సంబంధములు. ఉకార మాతృక ప్రకృతి సంబంధము. గుణ రహితుడయిన పరబ్రహ్మ సంబంధములైన 'అ' 'మ' లకు గుణసహితమైన ప్రకృతి సంబంధమైన 'ఉ' తో తాదాత్మ్య సంబంధమైన బిందువు (ం)తో కూడిక గలిగి 'ఓం' అయినది. ఈ బిందువే తాదాత్మ్యతనిచ్చింది. అకార ఉకార మకారాలలో ఓంకారము కాలేదక్కడ. సున్న పెడితే బిందువు వస్తే అప్పుడు ఓంకారం వచ్చింది. సున్నా అనే తాదాత్మ్యత లేకపోతే ప్రకృతి పురుషులు కలిసేవారే కాదు. మాయ పురుషుడిని ఆశ్రయించకుండా ఉండేది. అప్పుడు సృష్టియే లేదు.

సాంఖ్యము తెలియనిదే ప్రకృతి ద్వయ దోషరహిత అచలురు కాలేరు. ఇపుడు సాంఖ్యం అంటే ఏమిటండీ? లెక్కలు కాదు. అందులో సగం. ఇందులో పరక, నాలుగోవంతు ఆ లెక్కలు కాదు. 96 తత్వాలు, 25 తత్వాలు, ఇది కూడా కాదు. ఇదో మేథమెటిక్స్ అంకెలు, లెక్కలు కాదు. సాంఖ్యమంటే కలుపుట, విడదీయుట. ఇపుడు బ్రహ్మని అకార, ఉకార, మకార 3 మాతృకల సంకేతముతో చెప్పినప్పుడు ఉకార మాతృక 3 గుణాల ప్రకృతి సంబంధమైతే అకార మకార మాతృక బ్రహ్మ సంబంధమైతే ఈ మూడు కలిసి ఓం అయితే ఓం అనేదే ఈశ్వరుడు. ఇలా విడగొట్టి కలిపి చెప్పేదే సాంఖ్యం. సాంఖ్యం తెలియనిదే ప్రకృతి ద్వయ దోషరహిత అచలులు కాలేరు.

ప్రకృతి ద్వయం అంటారేమిటి? ప్రకృతి ఒకటా? రెండా? బ్రహ్మ సంబంధమైన అకార మకారములు ప్రకృతి సంబంధముగా తాదాత్మ్యత అయినపుడు, అనగా ఉకారము అనే ప్రకృతితో తాదాత్మ్యము చెందినపుడు బ్రహ్మ ఏమయ్యాడు? ప్రకృతితో తాదాత్మ్యం చెందాడు. బ్రహ్మ నిర్వికల్పంగా లేడు. బ్రహ్మ సహజంగా బ్రహ్మగా లేడు. తాను తానైన బ్రహ్మగా లేడు. ప్రకృతితో తాదాత్మ్యము చెందిన బ్రహ్మముగా ఉన్నాడు. ప్రకృతి అంటే 3 గుణముల సామ్యము కనుక, 3 గుణములతో తాదాత్మ్యత చెందిన బ్రహ్మ. అంటే 3 గుణములు మాయ కనుక మాయశబలిత బ్రహ్మ, ఎరుక బ్రహ్మ. కనుక బ్రహ్మము కూడా ఎరుక బ్రహ్మ అయ్యాడు. బ్రహ్మ దేనితో తాదాత్మ్యత చెందాడో అది ప్రకృతి, మాయాకల్పితము. మాయతో తాదాత్మ్యత చెందిన సగుణ బ్రహ్మగా తోచాడు. కనుక సగుణ బ్రహ్మ కూడా ప్రకృతే అయ్యాడు. ప్రకృతి ఒకటి. సగుణ బ్రహ్మ ఒకటి. రెండూ ప్రకృతులే. అందుకని ప్రకృతి ద్వయం అన్నారు. ఎరుక బ్రహ్మ దోషమే, ప్రకృతి దోషమే. ఎరుక బ్రహ్మ అనేది ఒక ప్రకృతి. నామరూపములకు, 3 గుణములకు సంబంధించిన ప్రకృతి ఒకటి. ఇక్కడ రెండు ప్రకృతులున్నాయి. కాబట్టి ప్రకృతి ద్వయం. ప్రకృతి అనేటువంటిది

మాయాకల్పితం కనుక ప్రకృతి ద్వయం కూడా కల్పితమే. ప్రకృతి ద్వయం కల్పితమంటే అర్థమేమిటి? సగుణ బ్రహ్మ కల్పితము. కల్పితమైన సగుణ బ్రహ్మని కూడా లేనిదిగా దోషముగా తీసేస్తే, ఏదైతే ఉన్నదో అది నిర్గుణ బ్రహ్మ. నిర్గుణ బ్రహ్మం సగుణ బ్రహ్మ కాలేదు. ఉకార సంబంధము వలన సగుణమైనట్లుగా తాదాత్మ్యగా కనబడుతున్నాడు.

ఎవరికి కనబడుతున్నాడు? అవిద్యాదోషం ఉన్నవాడికి కనబడుతున్నాడు. మానవులలో అవిద్యాదోషము, మాయకి వశుడైనటువంటి దోషము ఉంటే, బ్రహ్మ సగుణముగా కనబడుతున్నాడు. బ్రహ్మ సగుణముగా ఉండకూడదా అంటే ఉండొచ్చు. నిర్గుణ బ్రహ్మము సగుణ బ్రహ్మము రెండూ ఒక్కటే. ప్రకృతితో బ్రహ్మకు నిజానికి తాదాత్మ్యత లేదు. ఇది ఓంకారం ద్వారా ప్రణవం ద్వారా తాదాత్మ్యం ఉందని చెపుతున్నామంటే ఇదంతా మాయాకల్పితమే. నిజానికి తాదాత్మ్యత లేదు. నిజానికి బ్రహ్మ నిర్గుణమే. భ్రాంతిలో ఉన్నవారికి సగుణ బ్రహ్మ అందుబాటులో ఉంటాడు. భ్రాంతి రహితమైతే నిర్గుణ బ్రహ్మ తానే అయి వుంటాడు. బ్రహ్మ తప్ప రెండవది లేదు అన్నప్పుడు నిర్గుణ బ్రహ్మమే ఉన్నది.

నిర్గుణ బ్రహ్మ అయ్యాను అంటే అయినవాడెవడు? చూచినవాడెవరు? రెండవ వాడున్నాడా? అసలు. బ్రహ్మమొక్కటే. బ్రహ్మకంటే అన్యము లేదు అన్నప్పుడు సాధకుడు కూడా బ్రహ్మమే అయినప్పుడు తననుతాను చూడటమేమిటి? తాను వేరెవరో బ్రహ్మని చూడటమేమిటి? అందుకని ఉపాధి సంబంధంగా జగత్తు సంబంధంగా నామరూప సంబంధంగా, ప్రకృతి సంబంధంగా, త్రిగుణముల సంబంధంగా, బ్రహ్మమే అయినప్పటికి త్రిగుణాత్మక ప్రకృతితో తాదాత్మ్యత చెందటం వల్ల అట్టి బ్రహ్మము, ఇట్టి ప్రకృతి రెండూ కలిసి ప్రకృతి ద్వయం. ప్రకృతి ఒక్కటే ఎలా దోషమో ప్రకృతి ద్వయం కూడా అలాగే దోషము. ప్రకృతి ద్వయ దోషమైతే ఏమవుతుంది? అచలులు కాలేరు.

బ్రహ్మసత్యం జగత్ మిథ్య అని ప్రకృతితో తాదాత్మ్యం ఉన్న సగుణ బ్రహ్మ సత్యము అంటే అచలులు కాలేరు అందుకని ప్రకృతి ద్వయదోషం అన్నారు. సగుణ బ్రహ్మే రెండవ ప్రకృతి. అందుకే ద్వయ దోషం. నిర్గుణ బ్రహ్మమే ఉన్నదున్నట్లున్నాడు. ద్వయదోషం పోతే ఎరుక బ్రహ్మజ్ఞానం కూడా పోతే, చైతన్య బ్రహ్మజ్ఞానం పోతే, జ్ఞానమే పోతే, అతీత స్థితిలో అచలమని సిద్ధాంతము.

ప్రణవము వనజ మధ్య 16 కళలనే భాగముగా ఉన్నది. వనజ అంటే పద్మము. ప్రణవము పద్మము యొక్క మధ్యలో, పద్మము ఎక్కడిదీ? సహస్రారమందు అష్టదళపద్మం ఉన్నది. అది వనజ. అంటే ఆ వనజమందు 16 కళలనే భాగములుగా ఉన్నది. ఈ 16 కళలని ఏమి చెప్పాం. 15 కళలు లోక కళలు, 16వ కళ అలోక కళ. అలోక కళ అంటే అసలు నిష్కళే. అమావాస్య వరకు 15 ఉన్నాయి. పౌర్ణమితో కూడా కలిపి 15 ఉన్నాయి. పాడ్యమి నుంచి పౌర్ణమి వరకు, పాడ్యమి నుంచి అమావాస్య వరకు మధ్యలో 14 ఉన్నాయి. పౌర్ణమి 15వది, పూర్ణకళ. అమావాస్య 16వది నిష్కళ. నిష్కళే అలోక కళ. మిగతా 15 కళలు లోకకళలు.

అదెట్లన, ఈ ప్రణవ బ్రహ్మము 8 తనువులతోనూ, 4 పాదములతోను ఉన్నాడు. ఈ ప్రణవ బ్రహ్మ 4 పాదాలు, విద్యాపాదము, అవిద్యాపాదము, ఆనంద పాదము, తురీయ పాదము. ఈ 4 పాదాలతోటి ఈ ప్రణవము అష్ట తనువులతో 4 పాదాలతో 3 స్థానములతో 5గురు అధిష్టాన దేవతలతో చేరి ఉన్నది. ఏమిటా అధిష్టాన దేవతలు? పంచకర్తలు. పేర్లేమిటి? సద్యోజాత, అఘోర, వామదేవ, తత్పురుష, ఈశాన. సరసిజమంటే సరస్సులో పుట్టినటువంటిది, పద్మము. సహస్రారంలో వెయ్యి దళాల పద్మము ఉంటుంది. అది రెండు దొంతరులుగా ఉంటుంది. రెండవ దొంతర క్రిందగా ఉన్నది. అది అష్టదళ పద్మము. సహస్రారంలో వెయ్యి దళాలుంటే దాంట్లో ఇంకో దొంతర 8 దళాల పద్మముంది. 8 దళాల పద్మములో ఒక్కొక్క దళ పద్మానికి 125 చొప్పున చిన్న చిన్న దళాలుంటాయి. 8 నూట పాతికలు వెయ్యి. ఈ వెయ్యి కూడా నూటపాతిక చొప్పున 8 దళాలలో విభాగమై మళ్ళీ ఈ 8 దళాలతో రెండో దొంతరగా అష్టదళ పద్మముంటుంది. ఎనిమిది దళాలయందు అష్టతనువులున్నవి. మళ్ళీ అష్టదళములు తూర్పు, నైఋతి, పశ్చిమ, వాయువ్యం, ఉత్తరం, దక్షిణం, ఆగ్నేయం, ఈశాన్యం అని ఇలా 8 దిక్కులుగా 8 దళాల పద్మం అక్కడున్నది. అష్టతనువులయందు దివ్యత్వంలో 4 దేహములుండగా, ఈ ప్రణవ బ్రహ్మమునకు 4 కారణ దేహములు. 4 కార్య తనువులు. కారణ తనువులేమో విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృత, ఈశ్వర తనువులు. 4 కార్య తనువులు స్థూల సూక్ష్మ కారణ ప్రత్యగాత్మ శరీరాలు. జీవుని పరమైన కార్యతనువులు, 4 ఈశ్వరుని పరమైన కారణతనువులు 4 వెరసి 4+4 కలిపి అష్టతనువులు. ఇదొక రకమైన విభాగము. ఈ ప్రణవ బ్రహ్మమునకు 4 కార్యతనువులు 4 కారణ తనువులు

ఉన్నాయి. మొత్తం అష్టతనువులున్నాయి. ఈశ్వర తనువులు నాలుగున్నూ కారణ దేహములని జీవతనువులు 4 కార్యతనువులని అన్నప్పుడు, ఈశ్వరుడు లేకపోతే జీవుడు లేడు, సమష్టి విరాట్ స్వరూపమైన ఈశ్వరుడుంటేనే అందులో వ్యష్టి స్థూల దేహమయ్యింది. సమష్టి హిరణ్య గర్భుడైన ఈశ్వరుడు ఉంటేనే వ్యష్టి సూక్ష్మ దేహం జీవుడయ్యింది. సమష్టిలో భాగంగానే వ్యష్టిలో అన్నీ ఉన్నాయి. సమష్టికంటే వ్యష్టి వేరేఉందా? అలాగే ఈశ్వరడికన్న జీవుడు వేరే ఉన్నాడా? సమష్టి రూపంగా ఉన్న ఈశ్వరుడియందు అనేక జీవులున్నారు. అనేక జీవులయొక్క సమష్టి రూపమే ఈశ్వరుడు. జీవుడికంటే ఈశ్వరుడన్యముగా లేడు. ఈశ్వరుడికంటే జీవుడన్యముగా లేడు. సమష్టి శరీరమందు ఎన్ని విభాగాలున్నాయి? అట్టి విభాగాలనే జీవులు అని పిలుస్తున్నాము.

కనుక ఆ సమష్టిరూపంగా ఎప్పుడు ఈశ్వరుడు తయారయ్యాడో, ఎపుడైతే ఆ కారణంలోవున్న ఈశ్వరుడే అనేకంగా అయ్యాడో, "ఒక్కటైనటువంటి నేను అనేకం అగుగాక" అని అవిద్యా దోషము ఈశ్వరునియందు కలిగిందో అప్పుడు జీవులేర్పడినవి. అవిద్యా దోషం లేనిచోట ఈశ్వరుడు అలాగే సమష్టి రూపంగా కనబడుతున్నాడు. చూసే దృష్టిలో భేదమేగాని ఈశ్వరుడు జీవుడవ్వలేదు. అనేక జీవులు అవ్వలేదు. అయినట్లుగా సంకల్పం వచ్చేసరికి సమష్టి రూపము అఖండముగా ఉన్నది కాస్తా ఖండత్వం చెంది, అదే ఇదయ్యింది. ఈశ్వరుడికంటె జీవుడు అన్యముగా తోచలేదు. ఈశ్వరుడు నిజముగా ఖండ స్వరూపుడయ్యాడా? అవిద్యా దోషంచేత అయినట్లు కనపడుతోంది కాని అవ్వలేదు. అవిద్యా దోషముచేత అనేక జీవులు అయినట్లుగాను ఉన్నట్లుగాను కనపడుతోంది. కాని నిజానికి అవలేదు. అవిద్యా దోషం పోతే అవలేదని తెలిసింది. అంతేకాని జీవేశ్వరైక్యం కాదు. జీవుడిలో అవిద్యాదోషం పోగానే ఆ జీవుడే ఈశ్వరుడు. జీవేశ్వర ఐక్యం అనటానికి లేదు. ఈశ్వరుడు సమష్టి రూపంగా అన్నీ తానై ఉన్నాడు. సర్వమూ తానై ఉన్నాడు. నానాత్వములుగా బేధములుగా భ్రాంతి కలిగింది. భ్రాంతి పోతే నానాత్వము లేదు. బేధము లేదు. అఖండమే ఉన్నది.

ఈశ్వర తనువులు 4న్నూ కారణ దేహములు. **"కారణోపాధిః అయం ఈశ్వరః కార్యోపాధిః అయం జీవః"** కారణోపాధులుగా ఉన్నవాడు ఈశ్వరుడు. కార్యోపాధిగా ఉన్నవాడు జీవుడు. కార్యములు చేయుచు కర్మకు బద్ధుడైనవాడు జీవుడు. కార్యములు చేయనివాడు ఆ కార్యములకు కారణమైనవాడు ఈశ్వరుడే. కర్మలు చేసీ చెయ్యనివాడు కూడా ఈశ్వరుడే. భావంలో ఉండాలి కాని, చెయ్యటం చెయ్యకపోవటంలో లేదక్కడ. నిష్కామం అన్నప్పుడు కర్మ చేసినా చెయ్యనివాడే. కామ్య కర్మలు చేసేవాడికి కర్మ అంటుతుంది. నిష్కామకర్మ చేసేవాడికి కర్మ అంటదు. నిష్కామకర్మ చేసేవాడు ఈశ్వరుడే. ఈశ్వరుడక్కడ ఉండబట్టే జీవులన్నీ ఇక్కడ ఉన్నాయి.

ఆ జీవతనువులకు స్థూలసూక్ష్మ కారణ మహాకారణ దేహములనియు, ఈశ్వర తనువులకు 1. ఆనంద అంటే విరాట్ 2. హిరణ్యగర్భ అంటే చిన్మయ 3. అవ్యాకృత అంటే చిద్రూపము 4. పరమాత్మ అంటే శుద్ధ చైతన్యము అని 4 తనువులు. జీవ తనువులు 4 ఏమి చెప్పాడు? స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ అని చెప్పారు. మహాకారణమే ప్రత్యగాత్మ. ఈశ్వర తనువులు విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృత పరమాత్మలు. మరొక పద్ధతిలో ఏమి చెపుతారంటే, ఆనందమయుడు, చిన్మయుడు, చిద్రూపుడు, శుద్ధము. శుద్ధమంటే మలిన చైతన్యం కాకుండా అవిద్యా దోషంతో కూడిన చైతన్యం కాకుండా ఉండేటువంటి చైతన్యం శుద్ధం. ఈ తనువులుగానున్న అష్టతనువులు అంటే, అష్టదళములే అష్ట తనువులు. అష్టతనువులలోనే 4 ఈశ్వర తనువులు 4 జీవ తనువులు ఉన్నాయి. పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తు, అవ్యక్తము అనేవి అష్ట ప్రకృతులు. అష్టదళాలకే ఒక దళము పృథ్వి రెండవ దళము జలము, మూడవది అగ్ని లేదా తేజస్సు, నాలుగవది వాయువు. ఐదవది ఆకాశము, ఆరవది మహదహకారము ఏడవది మహత్తు, ఎనిమిదవది అవ్యక్తము. ఈ అష్టదళములే అష్ట ప్రకృతులు. అష్టతనువులు, అష్ట ప్రకృతులు రెండూ సమానమైనాయి. ఇదివరకు వేరువేరుగా చెప్పి ఇప్పుడు సమానం ఎందుకు చేస్తున్నాం? ఇపుడు ప్రకృతి ద్వయ దోషం అన్నాం కాబట్టి. ప్రకృతి ద్వయ దోషం అన్నప్పుడు మనం ఇక్కడ ఏమి చేస్తున్నాము. విశ్వ తైజస ప్రాజ్ఞుల్ని స్థూల సూక్ష్మ కారణ శరీరాల తాదాత్మ్యత చేత వీళ్ళని కూడా ప్రకృతే అంటున్నాము. అప్పుడు ప్రత్యగాత్మ మహాకారణంగా ఉన్న ప్రకృతితో తాదాత్మ్యత చెందాడు. అందువల్ల అది కూడా ప్రకృతి ద్వయదోషమే. మొదట్లో ఆధార ఆధేయ పద్ధతిలో అనాత్మని తీసేసి ఆత్మని పెట్టుకొని మహావాక్యాలతో ఆత్మజ్ఞానం పొందిన తరువాత ప్రజ్ఞానం బ్రహ్మ అన్న తరువాత, అహంబ్రహ్మ అన్న తరువాత, తత్త్వమసి వాక్యంతో అయమాత్మ బ్రహ్మ అన్నప్పుడు, బ్రహ్మ సత్యం జగత్ మిథ్య అన్నప్పుడు, ఒక్క ప్రకృతి దోషం పోయింది. కాని ఆ ప్రకృతితో తాదాత్మ్యతము ఉన్న బ్రహ్మకూడా ప్రకృతే. రెండవ ప్రకృతియొక్క దోషం పోలేదు. అందుకని

ఇప్పుడు తాదాత్మ్యత కారణంగా రెండు ఒకటిగానే చెప్పటం జరుగుతోంది. కాబట్టి అష్టతనువులు = అష్ట ప్రకృతులయ్యింది. ఆధార ఆధేయ పద్ధతిలో అష్ట తనువులు వేరు. అష్ట ప్రకృతులు వేరు. ప్రకృతి ద్వయం దోషంగా చెప్పటం ఎప్పుడైతే మొదలు పెట్టామో, అష్ట ప్రకృతులు = అష్టతనువులు. అష్టతనువులు అష్ట దళముల కదలికతో ఉన్నారు. అష్ట ప్రకృతులు కూడా అష్టదళములయందు ఉన్నాయి. అష్ట దళములయందలి కదలికతో తాదాత్మ్యత చెందినవాడు అష్టతనువులు. ఆ తాదత్మ్యత విడిస్తే స్వతస్సిద్ధంగా అచలమై ఉంటాడు. లేకపోతే దళములు కదిలితే తాను కదులుతాడు.

ఈ అష్టతనువులు తనువు పైమెట్టులో నడిబాటలో ఉండును. ఈ రహస్యమును, కృష్ణ బిలమును తెలిసినవాడే సద్గురువు. ఇక్కడ కృష్ణబిలం అంటే ఏమిటి? ఎరుక యొక్క లేనితనం ఎరుక సంబంధమంతా కూడా లేనిది లేకుండా పోయినటువంటి స్థానం ఏదో, ఆ స్థానం పేరు కృష్ణబిలం. ఈ కృష్ణబిలం యొక్క ఈ రహస్యము తెలిసినవారికి ఈ కృష్ణ బిలంలోనే ఎరుక మాయమవుతుంది.

ఎరుక ఎపుడైతే మాయమయ్యిందో అక్కడే బయలున్నది, స్వతఃసిద్ధంగా ఉన్నదున్నట్లుగా. ఇది తెలిసినవాడే సద్గురువు. తనకు పై మెట్టులో ఉండే అష్టతనువులలో ప్రత్యగాత్మ తనువు, మహాకారణాన్ని కూడా తీసెయ్యండి. విరాట్, హిరణ్యగర్భ అవ్యాకృత తీసెయ్యండి. ఏది మిలిగింది? ఆ పరమాత్మ. అష్ట తనువులలో పై మెట్టంటే 8వ శరీరం. ఆ 8వదైన పరమాత్మ శరీరముగా ఉన్నటువంటి ఎరుక బ్రహ్మ, మాయాశబలిత బ్రహ్మ లేదా శుద్ధ చైతన్య బ్రహ్మ లేక తురీయంగా ఉన్నటువంటి బ్రహ్మ, దానియొక్క నడి బావిలో, దానియొక్క బావి అనేటువంటి బిలములో, ఆ కృష్ణబిలములో ఎరుక తప్పుకుంటుంది. కృష్ణ బిలములో నడిబావిలో ఎరుక తప్పుకుంటుంది. ఆపై మెట్టులో ఆ సగుణ బ్రహ్మకు పైన ఉన్న కృష్ణ బిలములో ఆ కృష్ణబిలమందు పరమాత్మ లేనివాడైపోతాడు. ఎరుక బ్రహ్మ లేనివాడవుతాడు. అనగా ఏ విధమైన ఎరుక ఉండదు.

సృష్టి కృష్ణబిలానికి దగ్గరగా వెళ్ళినపుడు లయమైపోతుంది. సృష్టి తిరిగి మళ్ళీ కల్పించబడ్డపుడు 'ఓం' అనే బిందువు నుండి వ్యక్తమవుతుంది. **ఎరుక పుట్టేచోటు ఓం. ఎరుక లయం అయ్యేచోటు కృష్ణబిలము**. సచ్ఛిష్యుడి దగ్గరకు వస్తే, ఆ సద్గురువు ఎరుక విడిపించటమంటే పూర్తిగా నీవు ఆ కృష్ణబిలమందు చేరితే ఎరుక రాహిత్యము, త్రిగుణరాహిత్యము జరుగుతుంది. అటువంటి సహాయం చేసే గురువే నిజమైన గురువు. అటువుంటి రహస్యాన్ని చెప్పినవాడే దేశికేంద్రుడు.

ఈ ప్రణవబ్రహ్మకు అవిద్యా పాదము, విద్యాపాదము, ఆనంద పాదము. తురీయపాదమని 4 పాదాలున్నాయి. ఈ మాయాకల్పిత బ్రహ్మకు 4 పాదాలున్నాయి. మొదట్లో అవిద్యా పాదము – జీవభావము, రెండు విద్యా పాదము – జ్ఞానము, శుద్ధ పరమాత్మ, 3వది కేవల బ్రహ్మము ఆనంద పాదము, 4వది తురీయ పాదము. తురీయమంటే సర్వసాక్షి. సర్వానికి అసంగుడు. సర్వసాక్షిత్వమనే ఎరుక ఉంది కాబట్టి, తురీయాతీతమే బయలు. తురీయము జీవుడి దగ్గరేమో ప్రత్యగాత్మ. తురీయము ఈశ్వరుడి దగ్గరేమో పరమాత్మ. ఆ తురీయము అనేటువంటిది కూడా ఈ 4 పాదాలుగా ప్రకృతితో తాదాత్మ్యత ఉన్నటువంటి బ్రహ్మయందున్నాయి. కనుక ఈ 4 పాదాలుగా ఉన్న బ్రహ్మ ప్రకృతి ద్వయ దోషము అన్నపుడు, ఆ సగుణ బ్రహ్మకే తురీయమున్నది. నిర్గుణమై త్రిగుణ రహితమైనటువంటి బ్రహ్మకు తురీయ పాదము కూడా లేదు, సాక్షిత్వము కూడా లేదు. తుదకు తాను ఉన్నాడనే ఉనికితో కూడా అసంగముగా విలక్షణముగా సాక్షిగా ఉన్నాడు. ఆ ఉన్నవాడు కూడా లేనివాడైనప్పుడు అదే తురీయాతీతము. ఎరుక విడిపించినపుడు లేనివాడయ్యాడు. ఈ కృష్ణబిలాలు ఎక్కడో సృష్టిలో కాదండి. మీలోనే ఓం ఉంది, మీలోనే కృష్ణబిలముంది. ఎరుక పుట్టే స్థానము మీలోనే ఉంది. ఎరుక లయస్థానము మీలోనే ఉంది. ఎరుక పుట్టే స్థానాన్ని ఓం అన్నాము. ఎరుక లయ స్థానాన్ని కృష్ణబిలము అన్నాము.

పైన 3 స్థానములు 5గురు అధిష్ఠాన దేవతలు, 8 తనువులు, 4 పాదములు, 3 స్థానములు ఉన్నాయి. అష్టదళాలకి, అష్ట ప్రకృతులకి, అష్ట తనువులకి వివరణ ఇచ్చాము. అవిద్యా దోషమున్నటువంటి బ్రహ్మ, అవిద్యా పాదము. అవిద్యా దోషము లేకుండా కేవలము సాక్షియైన బ్రహ్మ విద్యాపాదము. తర్వాత సగుణ బ్రహ్మగా సచ్చిదానందముగా తటస్థ లక్షణముగా ఉన్న బ్రహ్మ ఆనందపాదము. శుద్ధ చైతన్యముగా పరమాత్మగా తురీయముగానున్నవాడు తురీయ పాదము. ఒక వంతు సృష్టిగా జరిగినటువంటి ఒక పాదమందు మాయ ఏకదేశీయముగా ఉన్న ఒక పాద బ్రహ్మమును ఆశ్రయించగా ఆ ఒక్కపాద బ్రహ్మయందు ఈ 8తనువులు, ఈ 8 ప్రకృతులు ఈ 4 పాదములు ఉన్నాయి. 3వంతులు బ్రహ్మదగ్గరికెళితే అది తురీయాతీతమే. అనగా తురీయము, ఆనందము కూడా లేవు.

ఈ అవిద్యాపాదము అష్టదళ పద్మములో ఎక్కడుందండీ? ఒక పువ్వు తీసుకుంటే దానికి దుద్దు ఉంటుంది. కర్ణిక ఉంటుంది. దానికి కేసరాలుంటాయి. కేసరం చివరి పుప్పొడి ఉంటుంది. ఒక బంతి పూవు తీసుకోండి బాగా అర్థమవుతుంది. ఒక ఆకుపచ్చ తొడిమ ఉంటుంది. రేకులన్నీ వలిచేస్తే ఒక దుద్దు ఉంటుంది. దాని మధ్య ఉంటుంది కర్ణిక. మరి మందార పువ్వు తీసుకుంటే ఏమవుతుంది. ఆ కర్ణిక నుంచి ఒక పొడవాటి తీగలాంటి కేరసాలొస్తాయిా కేసరాల చివర పుప్పొడి ఉంటుంది. ఆ పుప్పొడే మళ్ళీ గాలికి అటో, ఇటో ఏ సీతాకోక చిలుక ద్వారానో వేరే పుష్పాలకు వెళ్ళి పరపరాగ సంపర్కము ద్వారా ఆ పూల మొక్కల యొక్క సృష్టి జరుగుతోంది. దానిని ఓసారి ఊహించుకోండి. ఇపుడు అష్టదళ పద్మముంది. ఆ పద్మానికి కేసరములయందు అవిద్యాపాదమున్నది. విద్యాపాదము దానియొక్క కర్ణిక యందుంది. ఆనంద పాదము లింగము అంటే గుర్తుగా ఉన్నది. తురీయ పాదము, మహాకారణము అతీతమందు స్థానములుగా చేసుకున్నాయి. ఈ మహా కారణం ఏమిటంటే ఆ భాగాలన్నీ కూడా తీసేస్తే, ఆకుపచ్చటి కవరుంటుంది. ఆ కవరులో ఏమీ లేదు ఉత్త బట్టబయలు. అయితే ఆ తురీయమే దుద్దు. లింగమే దుద్దు. తురీయమేమో మహాకారణం. వీటికి అతీతమంటే ఖాళీ. ఈ 4 పాదములు సహస్రారమందుగల అష్టదళ పద్మములో దాని మధ్య భాగమందున ఉన్నవి. కమలమందు కేసరములు, కర్ణిక, దుద్దు ఉన్నవి. కమలమధ్యమందు దుంప అనే సంచితమనే మహాకారణమున్నది. ఈ సంచితమే సర్వజీవులయొక్క అనేకే జన్మల పరిణామముల యొక్క అనుభవములయొక్క సంచిత కర్మ. అందుకని మహాకారణమన్నా సకల జీవుల యొక్క సంచిత కర్మరాశి అన్నా ఒక్కటే. మాయ అన్నా, మహా కారణమన్నా, సర్వ జీవుల సంచిత రాశి అన్నా ఒక్కటే. ఎట్లా అయితే ప్రకృతి ద్వయ దోషం దగ్గర సగుణ బ్రహ్మ ఒకటి. ప్రకృతి ఒక్కటి అని ఎట్లా వేరుచేసి చూశామో ప్రత్యగాత్మని మహాకారణంతో సమానంగా ఎలా చేశామో, అక్కడ పరబ్రహ్మ = మూల ప్రకృతి అవుతాడు. ఆధార ఆధేయ పద్ధతిలో పరబ్రహ్మ వేరు మూల ప్రకృతి వేరు. నిరపేక్ష పద్దతిలో మూల ప్రకృతన్నా, పరబ్రహ్మన్నా ఒక్కటే. ఎందుకంటే ద్వయ దోషం కనుక. పరబ్రహ్మకూడా ప్రకృతే కనుక.

ఇక్కడ మాయతో కూడిన పురుషుడు కూడా ప్రకృతిక్రింద పెట్టి ద్వయదోషం అంటున్నాం. ద్వయదోషం లేనటువంటి పురుషుడు పురుషోత్తముడు, పరమ పురుషుడౌతాడు. ఆ పరమ పురుషుడే బయలు. ఆ పరమ పురుషుడే అచలం. ఆ పరమ పురుషుడే ప్రకృతి ద్వయదోషం లేనివాడు. పురుషుడు అంటే ప్రకృతిలో తాదాత్మ్యము ఉంది. పూర్తిగా తాదాత్మ్యత చెందినటువంటిది, అవిద్యాపాదము. తాదాత్మ్యత నిలిచినది, సాక్షి అయినది విద్యాపాదం. ఇంకా మాయకు వశుడై ఉన్నది ఆనందపాదం. మాయకు వశుడు కాకుండా ఉన్నది తురీయ పాదం. అయితే తురీయ పాదంలో తిరిగివచ్చే అవకాశం ఉంది. తురీయాతీతం అయ్యే లోపల పరిపూర్ణ బోధ జరగాలి. అపుడు ఆ తురీయాతీతమే తిరిగిరాని మోక్షం. ఆధార ఆధేయ పద్ధతిలో తురీయాతీతం నిర్గుణమే గాని సగుణమయ్యే అవకాశం పునరావృతి వున్నది. పరిపూర్ణ బోధచేత ఆ తురీయాతీతమే త్రిగుణ రహితము. దానినుండి పునరావృత్తి లేదు.

ఈ 4 స్థానములు సహస్రారమందుగల అష్ట దళ పద్మమందు మధ్య భాగములో ఉన్నాయి. కమలమందు కేసరములు, కర్ణిక, దుద్దు ఉన్నాయి. కమల మధ్యమందు దుంప అనే సంచితము అనే అవిద్యా పాదంలో జాగ్రదవస్థని శ్రవణ కాలాన్ని ఒక గ్రూప్ చేశాడు. విద్యా పాదములో స్వప్న అవస్థ మనన కాలాన్ని ఓ గ్రూప్ చేశాడు. ఆనంద పాదంలో సుషుప్త్యావస్థని, నిది ద్యాసని ఒక గ్రూప్ చేశాడు. మరి గాఢ నిద్రానందము కూడా ఉందిగా. గాఢ నిద్రానందం నిజంగా నిర్విషయానందం అది. అపుడు విషయాలు లేవు. సుఖదుఃఖాలు, ఆరాట పోరాటాలు, ఆందోళనలు, వేదనలు, ఉద్వేగాలు లేవు. అవన్నీ ఆగిపోయినటువంటి స్థితి నిర్విషయము. ఇంకా పైకెళితే అది తురీయానందము. గాఢనిద్రలో, సుషుప్తిలో విషయాలు లేకపోవడమే ఆనందం. విరాట్ హిరణ్యగర్భ, అవ్యాకృత వ్యవహారము లేనటువంటి స్థితిలో అదికూడా అవ్యాకృత స్థితిలో ఆనందం. అవ్యాకృతుడు అంటే ఈశ్వరుని యొక్క గాఢనిద్ర. జీవుని యొక్క సుషుప్త్యావస్థలో ప్రాజ్ఞుడని పేరు ఈశ్వరుని యొక్క సుషుప్త్యావస్థలో అవ్యాకృతుడని పేరు. జీవుని యొక్క సుషుప్త్యావస్థలో ప్రాజ్ఞుడనే పేరులో ఉన్నటువంటి నిద్రాహాయి ఏదో సుషుప్తివల్ల కలిగే హాయి ఏదో ఈశ్వరునికి సమష్టిలో అవ్యాకృత స్థితిలో ఈశ్వరునియొక్క గాఢ నిద్రలో, ఈశ్వరునియొక్క సుషుప్తి కాలములో అక్కడ అభిమానియైన అవ్యాకృతునికి కలిగేటువంటి హాయి ఆనంద పాదము. ఇది నిదిద్యాసగా ఉంది. నిది ధ్యాసంటే ఏమిటండీ. తాను బ్రహ్మము అనేటువంటి గట్టి నిర్ణయమే నిది ధ్యాస. తాను బ్రహ్మము అని గురువు చెప్పగా విన్నది శ్రవణము. తాను బ్రహ్మమేనని అంతర్ విచారణా పూర్వకమైనటువంటి మననముతో అంతకంతకూ స్వానుభవానికి తెచ్చుకుంటూ ఉండేది. స్పష్టత తెచ్చుకుంటూ ఉండేది. విచారణ, తర్కము చేసుకుంటూ ఒకానొక స్థితిలో మననము విచారణ తర్కము ఆగిపోతే అది నిదిధ్యాస. తురీయ

పాదము చతుర్థావస్థ అయిన లక్ష్యార్థ స్వరూపుడై అలరు కాలముగానూ ఉన్నది. లక్ష్యార్థము, లక్ష్యార్థ స్వరూపుడయ్యాడు. ఇది అసి పదము. అసి పదము ఏదైతే ఉన్నదో మొదట్లో లక్ష్యముగా ఏదైతే ఉన్నదో ఈ సచ్ఛిష్యుడు అభేదమును పొందినపుడు లక్ష్యార్థ స్వరూపుడయ్యాడు. అలరు కాలమున లక్ష్యార్థ స్వరూపుడై ఉండుట లక్ష్యార్థ స్వరూపుడై స్థిరముగా ఉండుట అను అనుభూతి కలిగింది. ఆ కాలమందు 'ఉన్నవి' 'ఉండుట' అనే అనుభూతి కూడా పోయినదే తురీయాతీతము. ఈ 4 పాదాలు దాటినది తురీయాతీతము.

మళ్ళీ చెప్తున్నాడు. ఇది ఓంకారంమీద నడుస్తోంది గుర్తుపెట్టుకోండి. అకారము ఈశ్వరునకు ఉకారము జీవునకు, మకారము ప్రత్యగాత్మకు అయి ఉండుటచేత అక్కడేం చెప్పాడు? అకార మకారాలు, బ్రహ్మ సంబంధమని, ఉకారము ప్రకృతి సంబంధమని ఆ బ్రహ్మ ప్రకృతిచే తాదాత్మ్యత చెందితేనే ఓం అయ్యిందని, ఈ ఓంకారేశ్వరుడు సగుణమని, ప్రకృతిలో తాదాత్మ్యత కలిగినటువంటి ఈశ్వరుడని అక్కడ చెప్తున్నాం. ఇక్కడేం చెప్తున్నాము? అకారము ఈశ్వరుడికి, ఉకారము జీవుడికి, మకారము ప్రత్యగాత్మకి అయి యుండుటచే ప్రణవము త్రిస్థానములని చెప్పబడినది. అకారము శుద్ధ సత్వ మాయా ప్రతిబింబముగా ఉన్న ఈశ్వరునికి సంకేతము. ఉకారము మలిన సత్వమాయా ప్రతిబింబమునకు సంకేతము. మకారము ప్రత్యగాత్మకు సంకేతము. ఇక్కడ ప్రత్యగాత్మ అంటే మహా కారణము అయి వుండుటచేత ప్రణవమునకు త్రిస్థానములని చెప్పిరి. మళ్ళీ వెనక్కు వెళితే 8 తనువులు, 8 ప్రకృతులు, 4 పాదాలు, 3 స్థానాలు, పంచకర్తలు అన్నాడు. అధిష్ఠానాలు, త్రిస్థానాలు ఇప్పుడు ఏమిటయినాయి అకార, ఉకార, మకారాలకి ఈశ్వరుడు, జీవుడు, ప్రత్యగాత్మ ఈ మూడు 3 స్థానాలు త్రిస్థానాలు. ఈ ప్రణవమునకు బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర సదాశివ అని అధిదేవతలున్నారు. ఇక్కడ పంచ అధిష్ఠాన దేవతలన్నారు. అధిష్ఠాన దేవతలెవరు? సృష్టి చేసేటువంటి బ్రహ్మ పోషించేటువంటి విష్ణువు, లయం చేసేటువంటి రుద్రుడు, లోకాలు సృష్టించేటువంటి మహేశ్వరుడు, ఆ లోకాల అనుభవం కోసం జీవులను అందులోకి ఆకర్షించేటువంటి సదాశివుడు, ఈ అయిదుగురు పంచదేవతలు. యావత్ సృష్టికి అధిష్టానము. ఇక్కడ అధిష్ఠానము అంటే పంచబ్రహ్మలయొక్క ప్రకాశమే.

ఈ అధిష్ఠాన ప్రకాశాలెలా ఉన్నాయి? బ్రహ్మణో అవ్యక్తః అన్నపుడు బ్రహ్మము అవ్యక్తమునకు వచ్చాడు అనగానే బ్రహ్మ స్వయం ప్రకాశంగా ఉన్నవాడు మాయ అనే ద్వారం గుండా 5 ప్రకాశాలుగా వచ్చాడు. ఈ 5 ప్రకాశాలకి మాయయొక్క లక్షణాలు ఆపాదించబడి ఉన్నాయి. అపుడు ఈ పంచ బ్రహ్మలు సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణ అనేటువంటి ప్రకృతి శక్తులతో కూడి ఉన్నారు. కనుక వీరు అధిష్టాన దేవతలు. ప్రకృతి మొత్తానికి సృష్టి, స్థితి, లయ విస్తీర్ణ, ఆకర్షణ పద్ధతిగా ఏ సృష్టి అయితే ఇపుడు మనం చూసిన పద్ధతిగా వచ్చిందో, దీనికి మూలము ఈ పంచబ్రహ్మలు, ఈ అధిష్ఠానాలు. ఈ 5 రకాల ప్రకృతి శక్తులతో కూడినటువంటి బ్రహ్మ ప్రకాశము ఏదైతే మాయలోకి ప్రకృతిలోకి వ్యాపించినటువంటి ప్రకాశము ఉన్నదో అది 5 రకాల పంచ శక్తులతో కూడి ఉన్నది. పంచ శక్తులతో తాదాత్మ్యత చెందినటువంటి ఆ బ్రహ్మ ప్రకాశమే సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణ పద్ధతులుగా ఈ ప్రకృతికి సర్వకారణముగా, మహాకారణముగా, మూల కారణముగా, దుంపగా ఉన్నది.

5గురు దేవతలు మాయద్వారం గుండా బయటకు వచ్చిన ప్రకాశంలో ఈ 5 రకాల శక్తులతో కూడి ఉన్నవాడు కనుక ప్రకృతి అంతటికీ వీరు అధిష్ఠాన దేవతలు. మాయా ద్వారమునకు అవతలకి వెళితే ఈ 5గురు అధిష్ఠాన దేవతలూ లేనివారయ్యారు.

అక్కడున్న బ్రహ్మ ప్రకాశము స్వయం ప్రభ, స్వప్రకాశం అయివున్నది. ప్రణవానికి 5 కుంట్లంటే 5 కుంటలు. ఈ 5 కుంట్లు ఈ ప్రకృతికి 5 ద్వారాలైనాయి. 5 ద్వారాలే 5 కుంట్లు. ఒక ద్వారములో సదాశివ ఆకర్షిస్తున్నాడు. 2వ ద్వారములో ఈశ్వరుడు లోకాలు సృష్టిస్తున్నాడు. 3వ కుంటులో రుద్రుడు లయం చేస్తున్నాడు. 4వ కుంటులో ఈ విష్ణువు ప్రకృతిని స్థితి చేస్తున్నాడు. 5వ కుంటులో బ్రహ్మ సృష్టి చేస్తున్నాడు. బ్రహ్మ చైతన్యము ప్రకృతి ధర్మములలో వ్యాపించడము చేత ప్రకృతి శక్తివంతమై, ప్రకృతి శక్తులు అని పిలువబడుతున్నది. ఆ శక్తియొక్క ప్రేరణచేత సకలమూ నడుస్తోంది. చైతన్యము లేని ప్రకృతి శక్తులు అవ్యక్తంగా ఉంటున్నాయి. చైతన్యంతోకూడిన ప్రకృతి శక్తి రూపాన్ని దాల్చి క్రియారూప జగత్తులో ప్రేరణగా స్పందన కల్గించేదిగా ఉన్నది. ప్రేరణ కల్గిస్తుందే తప్ప అది కర్మ చెయ్యదు. అధిష్ఠాన దేవతలకి కర్మ అంటదు. అధిష్ఠాన దేవతలు కర్త భోక్తకాదు. కేవల శక్తి రూపాలుగా, ప్రేరణ రూపంగా, స్పందనని అందించే రూపంగా ఉంటారు. అలాగే అధిష్ఠాన దేవతలయొక్క శక్తి క్రియారూపంలో ఉన్న ఇంద్రియాలకి ప్రకృతి యొక్క పరిణామ రూపంగా పొందే నామరూప వస్తువులకి అందుబాటయ్యింది. ఎక్కడైతే ప్రకృతి శక్తులు అందుబాటయ్యాయో అక్కడ ఒక చక్ర భ్రమణంగా సృష్టి స్థితి లయ విధానము, జన్మకర్మ విధానము జనన మరణాల విధానము ఒక ప్రణాళికాబద్ధంగా జరిగిపోతూ ఉంటుంది.

అయిదు కుంట్లు అంటే మాయలో 5 కుంట్లున్నాయి. ఒక్కో కుంటులో ఒక్కో రకమైనటువంటి ప్రకృతి శక్తి ఉంది. 5 కుంట్లలో ఈ బ్రహ్మ చైతన్యం వ్యాపించి 5 కుంట్ల ద్వారా ప్రకాశిస్తూ వాళ్ళు పంచబ్రహ్మలయ్యారు. ఈ 5 కుంట్లలో ఉన్న 5 ప్రకృతి శక్తులు అప్రకటితముగా కేవలము ధర్మముగా ఉండి చైతన్యము యొక్క సాన్నిధ్యము చేత 5 శక్తులూ ప్రకటింపబడ్డాయి. ఏమిటా శక్తులు అంటే సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణ శక్తులు. దీనిచేతే ఈ ప్రకృతి అంతా జగత్తంతా పోషించబడుతోంది. పరిపోషించబడుతోంది, నిర్వహించబడుతోంది.

ఈ పంచ దేవతలకు ప్రణవమందున్న 5 కుంట్లు స్థానములు మరియు. 5 కుంట్లయందు 5 భూతములన్నవి. ఈ భూతముల కధిదేవతలు ఉన్నారు. అధిదేవతల ప్రేరణ లేక భూతజాలము పనులు చెయ్యజాలదు. కనుక భూతములకు అధిదేవతలున్నారు. అక్కడ భూతములంటే పంచతన్మాత్రలు. ఈ అయిదుగురు పంచబ్రహ్మలయొక్క సాన్నిధ్యము, సన్నిధానము చేతనే తన్మాత్రలు సూక్ష్మ భూతాలై, స్థూల భూతాలై పంచీకరణయై నామరూప జగత్తయ్యింది. ప్రణవమందలి సత్తా పంచభూతములందు ప్రాదుర్భావమైనది. పంచ భూతములేర్పడకముందది సత్తామాత్రముగా నున్నది. ఆ భూతము లేర్పడగా, ఆ సత్తా వాటిలో వ్యాపించి యున్నందున, ఆ సత్తాయే శక్తి రూపమై యున్నది. అది పంచభూతముల యొక్క శక్తిగా మారినది. అందువల్లనే ఇక్కడ ప్రాదుర్భవము అనే మాట వాడారు. ప్రకృతితో కూడనపుడు అక్కడ ప్రాదుర్భవము లేదు. శుద్ధ చైతన్యమే ఉన్నదునట్లుగానే నిష్క్రియగా ఉన్నది. సత్తా మాత్రముగా ఉన్నది. పంచభూతాలు, తన్మాత్రలు ఎపుడైతే వచ్చాయో ఆ తన్మాత్రలలో సృష్టి పరిణామము చెందే గుణాలు ఉండేసరికి ఈ సత్తా ఆ గుణాలలో చేరేసరికి అది క్రియారూపాన్ని సంతరించుకొని, క్రియాన్ముఖమై సృష్టి జరిగింది. కనుక ఈ ప్రణవమే సృష్టికి మూలము. ఇప్పుడు ఆ మూలాన్ని విచారణ చేస్తున్నాము. ఫ్యానులోకి కరెంటు వచ్చేసరికి ఫ్యాను తిరగడం మొదలుపెట్టింది. ఫ్యానులోకి రానంతవరకు ఫ్యాను తిరగకుండా ఉంది. అలాగే పంచభూతాలలోకి పంచ తన్మాత్రలలోకి ఈ పరమేశ్వరుడి సత్తా, ప్రణవమూర్తి యొక్క సత్తా ఎప్పుడైతే ప్రకృతితో తాదాత్మ్యత చెందిందో, అపుడు ఆ ప్రకృతిలో చలనాలు కలిగినాయి. దానికే అధిదేవతలయొక్క ప్రేరణ అని పేరు పెట్టారు. వీరు భూతములకు అధిదేవతలు కనుక అచ్చటనే ఉన్నారు. వారే బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివులు. అధిదేవతల ప్రేరణ లేక భూతజాలము పనులు చేయజాలవు. కనుక భూతములను అధిదేవతలన్నారు. కనుక ప్రణవమూర్తి సత్తా పంచభూతములందు ప్రాదుర్భవమైనది.

సృష్టి పూర్తి జడముగా, తనకు తాను కదలకుండా ఉంది. అసలు జడమంటే నిర్వచనము తనకు తాను చలించనిది. చైతన్యమంటే నిర్వచనము అది కూడా తనకు తాను చలించనిది, కాని చిత్ జడములయొక్క సాన్నిధ్యం ఎప్పుడైతే అయ్యిందో, చైతన్యము చలించకుండానే ఉంది. జడమేమో చలనశీలత కల్గి వుంది. చైతన్యము యొక్క సాన్నిధ్యంచేత చలించుట అనేటువంటి కార్యంలోకి దిగింది. ఎప్పుడైతే చలించనటువంటి జడవస్తువు చలించటం మొదలయ్యిందో అది ప్రాదుర్భవము. ప్రాదుర్భవమందగా ఆ సత్తాతో దేవతలైనారు. కనుక అప్పటికి వాళ్ళు దేవతలు కాదు. ఫ్యానును తిప్పే శక్తి లేదక్కడ. సత్తాయే త్రిప్పే శక్తి అయింది. ప్రణవసత్తా అలాగే దేవతలుగా ప్రాదుర్భవం చెందినది. ప్రణవసత్తా ప్రాదుర్భవము చెందగా వీళ్ళంతా అధిష్ఠాన దేవతలయ్యారు. కనుక పంచ భూతములను పంచ దేవతలనిరి. ఈ పంచ దేవతలు బ్రహ్మాండమున చైతన్య రూపముగా ఉన్నప్పుడు పంచబ్రహ్మలుగా ఉంది. పంచశక్తులుగా ఎప్పుడైతే ప్రాదుర్భవము చెందినదో అపుడు ఈశ్వరుడికి తన్మాత్రలుగా ఉన్నాయి. ఈశ్వరుడికి తన్మాత్రలుగా శబ్ద తన్మాత్రగా, స్పర్శ తన్మాత్రగా, రూప, రస, గంధ తన్మాత్రలుగా ఉన్నాయి. బ్రహ్మాండములో బ్రహ్మాండమునుండి, పిండాండము ఎప్పుడైతే ఆవిర్భవించిందో సూక్ష్మ తత్వాలన్నీ స్థూలంగా, నానాత్వంగా, అనేకంగా, నామరూపాలుగా ఎప్పుడైతే పరిణామం చెందాయో అప్పుడది పిండాండమయ్యింది. ఈ తన్మాత్రలే పిండాండమందు జీవునికి పంచ విషయాలయినాయి. శబ్ద, స్పర్శ, రూప, రస గంధ విషయాలైనాయి. పిండాండమందు జీవునకు శబ్ద, స్పర్శ, రూప, రస గంధములనెడి విషయములుగా ఉన్నవి.

ఈశ్వరుని దగ్గర ఏవి తన్మాత్రలో, జీవుడి దగ్గర అవే విషయాలు. జీవుడికి కర్తృత్వ, భోక్తృత్వాలెపుడైతే వచ్చాయో, ఆ తన్మాత్రలే జీవుడిపరంగా విషయాలైనాయి. వీటికి అధిదేవతలు బ్రహ్మ సంబంధమైన వారగుటచేత విషయములకు సత్తా జాస్తిగా ఉన్నది. బ్రహ్మాండంలో అధిష్ఠాన దేవతల దగ్గర ఈ ప్రేరణ శక్తి జాస్తిగా ఉన్నది. కాని భూతములకును, తద్ అధిదేవతలకును మరియొక్క భేదమేదియు లేదు. అది ఈశ్వరుడి యొక్క నడకలో వచ్చినపుడు ఒక పద్ధతిలో ఉన్నది. అక్కడ కర్మ జరగటము లేదు. కర్త, భోక్త లేడు. అక్కడ శక్తులు ప్రాద్భుర్భవించాయి, అంతే! అవే తన్మాత్రలు. పిండాండంలోకొచ్చేసరికి జీవుడి పరంగా

విషయాలుగా మారినపుడు ఏ విషయాలైతే ఆ జీవునికి విషయీకరించబడ్డాయో, అపుడా జీవుడు కర్త, భోక్త అయ్యాడు. ఆ భోక్తృత్వమును, విక్షేపముతో నిజమనుకొని అధ్యాస చెంది దానిని జ్ఞాపకం పెట్టుకొని స్మృతి రూపంలో దాచుకొని ఆ స్మృతి రూపంలో దాచబడ్డవే వాసనలైతే, ఆ వాసనలే పునర్జన్మ హేతువైతే అట్టి జీవులు జనన మరణ చక్రమందు తిరుగుచున్నారు. ఇదే బ్రహ్మాండానికి, పిండాండానికి ఉన్న తేడా. కేవలం చైతన్య రూపంగా ఉండి, తరువాత పంచశక్తులతో కూడి ఉన్నప్పుడు, ఆ పంచశక్తులు పిండాండం దాకా దిగివస్తే 25 అధిష్ఠాన దేవతలై ఆ ఈశ్వరునికి ఇంద్రియాలుగా ఉన్నాయి. ఈశ్వరుని యొక్క ఇంద్రియాలు ప్రేరణనందించేటువంటి శక్తి రూపంగా మాత్రమే ఉన్నాయి. ఆ శక్తి సద్వినియోగం కావచ్చు, దుర్వినియోగం కావచ్చు. కర్మలకు ఉపయోగపడవచ్చు, నిష్కామ కర్మకు ఉపయోగపడవచ్చు. సత్కర్మలకు ఉపయోగించవచ్చు, దుష్కర్మలకు ఉపయోగించవచ్చు. **యద్భావం తద్భవతి** క్రింద, అది జీవుడికే వదలివేయబడినవి. ఈశ్వరునికవి శక్తి రూపాల్లో ఉండి కర్తృత్వ భోక్తృత్వాలు లేకుండా మాయకి మాత్రమే వశుడై ఉండటంచేత ఈశ్వరుడికి కర్మ అంటటం లేదు. జీవుడికి ఏ కర్మ అయితే పిండాండమందు జరుగుతున్నదో ఈశ్వరునికి అదే కర్మ చిద్విలాసముగా జరుగుచున్నది. అసలు ఈశ్వరునియందు చిద్విలాసముగా జరిగేదే జీవునియందు కూడా జరుగుతుంటే జీవుడు తను అధిదేవతచేత తనయొక్క కర్తృత్వ, భోక్తృత్వాలని భావన చేస్తున్నాడు. కర్తృత్వ భోక్తృత్వాల ద్వారా ఏదైతే తను దాచుకుంటున్నాడో అది వాసనారూపంగా ఉన్నదో దానివలన జీవుడు జనన మరణాలను పొందుచూ ఉన్నాడు. జీవుడు స్వయంగా ఏదీ చెయ్యట్లేదు. ఈశ్వరుని యొక్క లీలావిలాసంగా జరిగేదే జీవునియందు క్రియారూపంగా జరుగుతున్నట్లుగా జీవుడు భావిస్తే, అతడు అవిద్యనుండి విడుదలవుతాడు.

ఈశ్వరునియొక్క ఇంద్రియాలు కేవల శక్తిరూపంగా, అధిష్ఠాన రూపంగా ఉంటే జీవునికి యొక్క ఇంద్రియాలు, జడమైనటువంటి ఇంద్రియాలు ఈశ్వరునియొక్క ఇంద్రియాలైనటువంటి అధిష్ఠాన దేవతలశక్తి యొక్క ప్రేరణవల్ల, చలించే ధర్మముండబట్టి చలిస్తున్నాయి. చలించే ధర్మమునుండి జీవుడు విడుదలైతే, అధిష్ఠాన దేవతల ప్రేరణ ఉన్నా చలించడు. అవిద్యా దోషముచేత చలించే ధర్మముగల ఇంద్రియాలు, ప్రాణము, మనసు, బుద్ధి కలిగినటువంటి జీవుడు వాటితో తాదాత్మ్యత కలిగినటువంటి జీవుడు చలనశీలముగా ఉన్నాడు కనుక అధిష్ఠాన దేవతలయొక్క ప్రేరణచేత చలించుట అనేది జరుగుచున్నది. సాధనచేత చలించకున్నా ఇంద్రియ నిగ్రహముచే శమదమాదులు తితీక్షని అవలంబించి, విషయ సమత్వాన్ని పొందిన జీవుడు అధిష్ఠాన దేవతలు ప్రేరేపించినప్పటికీ కూడా, ఆ ప్రేరణకు తాను లోనుకాకుండా తాను తానైటువంటి స్థితికి చేరి ప్రత్యగాత్మ స్వరూపుడౌతాడు. జీవభావంనుంచి విడుదలౌతాడు. అవిద్యాదోషం పోయింది కాని మాయాదోషం ఇంకా పోలేదుగదా!

అలాగే ఈశ్వరుడు కూడా సర్వశక్తిని వినియోగించని స్థితిలో నిర్వికల్ప స్థితిలో ఉంటే ఈశ్వరత్వాన్ని నుండి విడుదలవుతాడు. ఈశ్వరునకేమో 25 శక్తులున్నాయి. అవి పిండాండమందు జీవునికి 25 తత్వాల్ని ప్రేరేపిస్తున్నాయి. బ్రహ్మకేమో 5 శక్తులున్నాయి. సృష్టి, స్థితి లయ విస్తీర్ణ, ఆకర్షణ అనే శక్తులతో కూడినటువంటి బ్రహ్మ చైతన్యమే ఆ 5 అధిష్ఠాన దేవతలు. ఈ 5 అధిష్ఠాన దేవతలుకూడా వాటియొక్క అధిష్ఠానత్వాన్ని, వాటియొక్క ప్రేరణత్వాన్ని వినియోగించకపోతే వాడు అచలబ్రహ్మ అవుతాడు. ఈ 5 శక్తులు వినియోగిస్తే వాడు ఎరుక బ్రహ్మ అవుతాడు. కనుక జీవస్థితి, ఈశ్వర స్థితి, మాయాశబలిత బ్రహ్మ స్థితి. ఈ 3 దాటినపుడే వాడు అచల పరిపూర్ణుడవుతాడు. జీవస్థితి, ఈశ్వరస్థితి దాటినపుడు ఈ పంచ బ్రహ్మలయొక్క పంచశక్తులతో కూడిన అధిష్ఠాన దేవతా స్వరూపముగా ఉన్న బ్రహ్మము, ఎరుక బ్రహ్మము, మాయాశబలిత బ్రహ్మము అయి ఉంటాడు కనుక ఈ బ్రహ్మము కూడా ప్రకృతిలో ఈ విధంగా తాదాత్మ్యత చెంది ఉన్నాడు కనుక ఈ ప్రకృతి కూడా దోషమే కనుక ప్రకృతి ద్వయదోషము అనేటువంటి మాటచేత బ్రహ్మసత్యం జగత్మిథ్య అన్నచోట మిథ్యాజగత్తు ప్రకృతి పోయినప్పటికి, ప్రకృతి తాదాత్మ్యములో ఉన్న బ్రహ్మము సత్యము అనేది తప్పు. ప్రకృతితో తాదాత్మ్యం ఉన్న బ్రహ్మ మిథ్య కనుక ప్రకృతితో తాదాత్మ్యం ఉన్నటువంటి బ్రహ్మకూడా మరొక ప్రకృతి. ఈ రెండు ప్రకృతులు ప్రకృతిద్వయము. ఈ ప్రకృతి ద్వయదోష నివారణ ఎప్పుడైతే జరిగిందో అపుడు పరబ్రహ్మమే ఉన్నదున్నట్లు మిగిలాడు. వాడే ఈ ఉత్త బట్టబయలు ఏమీలేదు.

నాదబిందు కళలు. నాదమంటే ప్రణవనాదం, బ్రహ్మ నాదం. నాదం అంటే అవ్యక్తం. బిందువంటే ఓం. ఓం బిందువంటే మహత్తు. అవ్యక్తం మహత్తైతే నాదము బిందువయింది. ఈ మహత్తనేటటువంటి బ్రహ్మ బిందు రూపంలో వున్నాడు. ఈ బిందు చైతన్యము వ్యాపకం కాదు. ఈ బిందు చైతన్యము వ్యాపకం అవడానికి ఉపక్రమిస్తే, అకార ఉకార మకార మాతృక సంకేతంతో స్థూల సూక్ష్మ కారణ సృష్టిగా వ్యాపించింది. ఏ చైతన్యమైతే ఇలా వ్యాపకంగా వుందో దాంట్లో అనేకరకాలుగా చలనాలు ఉన్నాయో అవి కళలు. ప్రకృతి కళలే ప్రకృతితో కలసిపోయినటువంటి చైతన్యానికి, చైతన్యం నిష్కళైనప్పటికీ కూడా, ప్రకృతి

కళయే చైతన్య కళగా, చిత్కళగా భ్రాంతి కలిగిస్తుంది. అయితే ఒక సూర్యుడు ప్రకాశిస్తున్నప్పుడు ఎండ సూర్యకిరణాలుగా కాకుండా మొత్తం ఎండగా వున్నప్పుడు అది కళలుకళలుగా లేదు. అదే సూర్య కిరణాలు కొన్ని వేల కోట్ల కిరణాలుగా గనుక భావన చేస్తే ప్రకృతిని బట్టి కోట్ల కిరణాలుగా వుండొచ్చు . కిరణాలు కిరణాలుగా ప్రకాశిస్తాడా సూర్యుడు? కాని మనకి ప్రతీతి ఏమిటంటే సూర్య కిరణాలే అంటున్నాము. సూర్యుడి యొక్క ప్రకాశం అంతా కూడా కిరణాలు కిరణాలుగా కూడా విభజన కాలేదు. అంతా ఒకటిగానే వుంటుంది. ఎండంతా అలా పరిచినట్లుగా వుంటుంది. ముక్కలు ముక్కలుగా ఏమీ వుండదు. అఖండంగా అవిభాజ్యంగా వుంటుంది. అయినా సూర్య కిరణాలు అని ఎప్పుడైతే అన్నామో అవి కళలు. అంటే ఒక దైవీ చైతన్యము ప్రకృతి శక్తులతో కూడితే అవి కళలవుతాయి. ప్రకృతి శక్తులతో కూడనప్పుడు అది కేవలం సర్వవ్యాపక చైతన్యం. ఇప్పుడు కళలు అంటే అకార ఉకార మాతృకా సంకేతం అయినటువంటి స్థూల సూక్ష్మ కారణ సృష్టియే కళల రూపంలో వుంది.

ఇక కళలు ఎన్ని రకాలు వున్నాయంటే పదునారు. కళలలో విభజన అన్నది ప్రకృతి శక్తులతో వున్నటువంటి తేడా వలన అనేకత్వముగా వున్నది. ఈ కళలలో భేదం వున్నది. ఈ కళలు ఎక్కడికక్కడ కూడా ప్రకృతిలో గాని, మనలో గాని చూసుకోవచ్చు. మన అవస్థలు కూడా పదహారు కళలుగా వుంటుంది. జాగ్రత్‌లో జాగ్రత్, జాగ్రత్‌లో స్వప్నము, జాగ్రత్‌లో సుషుప్తి, జాగ్రత్‌లో తురీయము, స్వప్నంలో జాగ్రత్, స్వప్నంలో స్వప్నము, స్వప్నంలో సుషుప్తి, స్వప్నంలో తురీయము, సుషుప్తిలో జాగ్రత్, సుషుప్తిలో స్వప్నము, సుషుప్తిలో సుషుప్తి, సుషిప్తిలో తురీయము, తురీయంలో జాగ్రత్, తురీయంలో స్వప్నము, తురీయంలో సుషుప్తి, తురీయంలో తురీయం. ఇలా పదహారు కళలున్నాయి. ఈ పదహారు కళలలో కూడా 15 కళలేమో లోక కళలు, 16వది అలోక కళ. లోక కళలలోనేమో నానాత్వాలుగా, విభజనగా వుంటుంది. 16వది నిష్కళ, పూర్ణ కళ పౌర్ణమైతే, నిష్కళ అమావాస్య. అమావాస్య రోజు వెలుతురే లేదు కదా. వెలుతురుంటేనే లోకం. వెలుతురు లేకపోతే లోకం లేదుగా! లోకం వున్నా గాఢాందకారముగా దర్శనం అవుతుంది తప్ప, నామరూపాలుగా దర్శనం కాదు. పరమాత్మ ప్రకాశం ఎప్పుడైతే వున్నదో, ఈ తమో గుణ రూపముగా గాఢాంధకార రూపముగా వున్న ప్రకృతి పరమాత్మ ప్రకాశంచేత తెలియబడుతుంది. తెలియబడినప్పుడు నామరూపాలు గానూ, అనేకంగానూ తెలియబడుతుంది.

అయితే అలోక కళ నిష్కళ. నిష్కళలో ప్రత్యగాత్మ లీనమై, ఆ లీనమైనటువంటి స్థితిలో మోక్షం సిద్ధిస్తుంది. ప్రత్యగాత్మ అంటే ఏమిటి మరి? కళలరూపంలో వున్నది నిష్కళరూపంగా అయితే అది ప్రత్యగాత్మ. అంటే బాహ్య ప్రకాశంగా లేదు గాని, స్వయం ప్రకాశంగా వున్నదే ప్రత్యగాత్మ. ఇక్కడ ప్రత్యగాత్మ వ్యష్టిగా తీసుకోకూడదు. ప్రత్యక్ ఆత్మ అంటే అనేక ప్రకృతి కళలతో కూడుకున్నటువంటి చైతన్యాన్ని నిష్కళగా చూసినప్పుడు అనేక కళలుగా, అనేకత్వంగా, నానాత్వంగా చూడకుండా, నిష్కళగా చూసినప్పుడు, ప్రకృతే కనబడనప్పుడు, అది ప్రత్యగాత్మ. చిత్కళచేత, పరమాత్మ ప్రకాశముచేత గాఢ తమస్సుతో వున్నటువంటి ప్రకృతి ప్రకాశవంతమై ఆ ప్రకృతిలో వున్న నామరూపాలు అన్నీ కూడా గోచరిస్తున్నాయి. కళలున్నప్పుడు గోచరిస్తున్నాయి. ప్రకృతి చిత్కళలుగా వున్నప్పుడు గోచరిస్తోంది. పరమాత్మ ప్రకాశం వున్నప్పుడు ప్రకృతి గోచరిస్తోంది. ప్రకృతి గోచరించకుండా కేవలం పరమాత్మ మాత్రమే ప్రకృతినుంచి విడివడి విలక్షణమై వాటినుంచి ప్రత్యేకించబడినటువంటి ఆత్మ ప్రత్యగాత్మ. అంటే ఈ ప్రత్యగాత్మ స్వప్రకాశంగా వుంటుంది తప్ప, ఈ ప్రత్యగాత్మ యొక్క ప్రకాశము బహిర్ముఖంగా వుండదు. బహిర్ముఖంగా వుంటేనేమో పదిహేను కళలు. అవి లోక కళలు. అంతర్ముఖమైపోతే, అంటే బహిర్ముఖంలో వున్నటువంటి కళలన్నీ దాటిపోతే అంతర్ముఖంలో అది స్వయంప్రకాశం. అయితే బహిర్ముఖంలో మాత్రమే నిష్కళ. అంతర్ముఖంలో అది నిష్కళ కాదు. బహిర్ముఖంలోనే నిష్కళ. బహిర్ముఖంలో ప్రకాశం లేదు గనక అక్కడ లోకం కనబడదు. అలోక కళ అని దానికి పేరు.

బహిర్ముఖంలో అలోక కళ అయితే అంతర్ముఖంలో స్వప్రకాశం అన్నమాట. అంటే అంతర్ముఖంలో వున్నటువంటి పరమాత్మని మరియు బహిర్ముఖంగా వున్న సర్వవ్యాపక పరమాత్మ నుండి మాయా కల్పిత ప్రకృతిని, నామరూప జగత్తుని, వేరుచేసి, విస్మరించి, నిరశించి, మిథ్యగా చూసి, లేనిదిగా చూస్తే, ఏదైతే మిగిలి వున్నదో, ఏది తనకు తానుగా స్వతస్సిద్ధంగా వున్నదో, అది ప్రత్యగాత్మ. మనం ప్రత్యగాత్మ పరమాత్మ రెండూ కలిపే వాడుతున్నాము ఇక్కడ. మామూలుగా వేరే చోట ప్రత్యేకంగా ఒక జీవుడి దగ్గర వ్యష్టిలో ప్రత్యగాత్మ విలక్షణమని, సమష్టిలో పరమాత్మ విలక్షణమని చెప్తున్నాము. అయితే ఇక్కడ

ప్రత్యక్ ఆత్మ అంటే ప్రత్యేకింపబడిన విలక్షణమైన ఆత్మ. ఆత్మన్నా పరమాత్మ అన్నా ఒకటే. ఎలా విలక్షణమయ్యాడూ? 15 లోక కళల నుండి వేరై ప్రత్యేకించబడి విలక్షణమయ్యాడు. అయితే లోక కళలు నిష్కళ అయినప్పుడు అది అలోక కళ. అప్పుడు బహిర్ముఖం సున్నా అయింది. అలోక కళ ద్వారా బహిర్ముఖం సున్నా అయింది. సున్నా ఎప్పుడయిందో, మరుగు పోయిందో అప్పుడు ఎల్లప్పుడూ వుండేటటువంటి పరమాత్మ, ఎప్పుడూ వుండేటటువంటి ఆత్మ తనకు తానే స్వతస్సిద్ధమై వున్నది. తనకుతానే వుండటాన్ని, స్వతస్సిద్ధమై వుండటాన్ని ప్రత్యక్ ఆత్మ అంటారు. ఈ ప్రత్యగాత్మలో ఎవరైతే అలోక కళగా ఉంటాడో వాళ్ళకి అది మోక్షమే. లోకకళల నుండి విడుదలైనవారికి మోక్షమే. అలోక కళలోకి చేరినవారికి మోక్షమే. అలోక కళగా వున్నప్పుడు ప్రపంచము పోతుంది. లోకకళలలోనే ప్రపంచం తోస్తుంది. అలోక కళలో ఎప్పుడైతే ప్రపంచం బహిర్ముఖంగాను అంతర్ముఖంగాను కూడా లేదో అప్పుడు తానైనటువంటి స్థితి ప్రత్యక్ ఆత్మ. అటువంటి తనకు తానైనటువంటి స్థితే మోక్షం. మొత్తము పదునారు కళలు పదునారు భాగములుగా వున్నాయి.

ఈ కళలు అవస్థలకు సంబంధమైనవి. అనేక రకాల అనుభవాలకి సంబంధించినది అయివుంది. అనుభవం ఎన్ని రకాలుగా వున్నాయంటే, జాగ్రదావస్థగా, స్వప్నావస్థగా, సుషుప్త్యావస్థగా , తురీయావస్థగా నాలుగు రకాలున్నాయి. ఈ నాలుగు రకాలు కూడా మరలా వాటిలో విభాగం చేస్తే పదహారు అయినాయి. నాలుగు నాలుగులు పదహారు. ఈ అవస్థలు నాలుగైననూ, అంతర్భాగములతో చేరి పదహారు భాగములయినవి. ఒక్కొక్క అవస్థ నాలుగు అంతర్భాగములై, ఒకదానిలోనొకటి చేరుటచే , పదునారు అంతర్భాగములైనవి.

ఇలా విడగొట్టడాలు, కలపడాలు ఇవన్నీ కూడా సాంఖ్యం. సాంఖ్యం చేసేపని ఏమిటి? అంతా కలగాపులగంగా వున్నప్పుడు ఒక్కొక్కదానిని ప్రక్కనబెట్టి చూస్తాం. ఇవన్నీ దేనివలన వున్నాయని. ఇప్పుడు ఆత్మని ప్రక్కనపెట్టి చూస్తే ఏమయింది? స్థూల సూక్ష్మ కారణాలన్నీ జడమయినాయి. వాటంతట వాటికి ఏమీ తెలియదు, వాటంతట అవి కదలవు, వాటిలో ప్రాణం లేదు, వాటిలో ఆలోచన లేదు, ఊహ లేదు, అనుభవం లేదు, చైతన్యం లేదు, కదలిక లేదు, స్పందన లేదు. ఆ విధంగా ఆత్మతో కలిసిపోయిందానికి, ఆత్మ లేకుండా వున్నదానికీ తేడా విడగొట్టి పంచకోశాలు ఆత్మకాదు, పంచకోశాలకి అతీతమైనది ఆత్మని, ఈ పంచకోశ ధర్మాలు ఆత్మకి లేవని, ఆత్మకుండే ధర్మాలు పంచకోశ ధర్మాలకి వ్యతిరిక్త ధర్మాలని, అలాగే స్థూల శరీరం ఇలా వుంటుందని, సూక్ష్మ శరీరం ఇలా వుంటుందని, కారణ శరీరం ఇలా వుంటుందని, ఆత్మ అలా వుండదని, విశ్లేషణ చేస్తాము. స్థూల సూక్ష్మ కారణ శరీరాలు ఆత్మ సత్తా లేకపోతే, అవి అలాగే వుండిపోతాయి కాని దాంట్లో వ్యవహారం గాని చలనాలు గాని ఏదీ వుండదు.

ఎట్లాగయితే సూర్యరశ్మి లేనిదే జీవరాశియొక్క మనుగడ లేదో, ఎట్లా అయితే పొయ్యిలో అగ్ని లేకపోతే మనకి పాకం, వంట, కూర అవదో, అలాగే ఆత్మ లేకపోతే ఇవన్నీ కావు. ఇవన్నీ అవుతున్నాయి అంటే, వాటికవే అవుతున్నాయా? జడ వస్తువులు, వాటికవే ఏమీ చేయలేవు. వంట కూడా అన్నీ తీసుకొచ్చి పొయ్యి వెలిగించకపోతే వంట అవ్వదు. పొయ్యి వెలిగించాక అందులో మంటద్వారా వచ్చే ఉష్ణత్వంవల్ల, ఆ మంటయొక్క సాన్నిధ్యంవల్ల వంట అవుతోంది. అలాగే లోక వ్యవహారం అంతా. అలాగే మూడవస్థలూ కూడా. అలాగే అన్నీ. సాంఖ్యం అంటే ఈ మాదిరిగా కలిపి చూడటం విడదీసి చూడటం. అలా చూడటం వల్ల దేని ప్రభావం దేని మీద వుంది, దేని ప్రభావం దేనిమీద లేదు అనేది తెలుస్తుంది. అలా తెలుసుకున్నారు.

ఏమని తెలుసుకున్నారు? స్థూలంలో వుండేటటువంటి జీవితము కల. సూక్ష్మంలో వుండేటటువంటి జీవితం కల. **స్థూలంగా వుండేటటువంటి స్వప్నము జాగ్రదావస్థ. సూక్ష్మముగా వుండేటటువంటి జాగ్రదావస్థ స్వప్నము. ఉన్న వస్తువులు లేకుండా పోతే సుషుప్త్యావస్థ.** సుషుప్త్యావస్థలో జీవుడున్నాడా లేదా? కాసేపు లేక తెలియనట్లు వున్నాడు గాని వున్నాడు. జీవుడు లేకపోతే సుషుప్తి నుండి మరల జాగ్రదావస్థకి రాగానే నిన్న సగం పనిచేసి ఎక్కడైతే ఆపారో, నిన్న ఆపినంతవరకు నిన్న చేసినటువంటి పని జ్ఞాపకం వుండి, ఇవాళ అక్కడినుండి పని కొనసాగిస్తున్నాడు అంటే, నిన్నటివాడే నిద్రపోయాక ఇవాళ వున్నాడని తెలిపోతోంది. నిద్రలో లేడు అనుకుంటే, జాగ్రదావస్థలో మాత్రమే వున్నాడు అనుకుంటే , నిన్న జాగ్రత్ లో వున్న జీవుడు నిన్నటికే సరి. సుషుప్తిలో వాడు లేడు. ఇవాళ ఉదయం క్రొత్తగా ఒక జాగ్రదావస్థ వచ్చింది. కొత్త జీవితం రావాలిగా. కాని నిన్నటి జ్ఞాపకాలు వున్నాయంటే నిన్నటి జీవుడే ఉంటున్నాడు. అలా నెలల క్రింద సంవత్సరాల క్రింద వున్నటువంటి జ్ఞాపకాలు వాడికి వున్నాయంటే సుషుప్త్యావస్థలో జీవుడు కొనసాగుతున్నాడు. అక్కడ కేవలం నిర్వికల్పంగా, అక్కడ కేవలము నిష్క్రియగా వుంటున్నాడు.

ఈ రకంగా అవస్థలు సాంఖ్య పద్ధతిలో విడదీస్తే మనకి తెలిసినాయి. ఇలా సాంఖ్యపద్ధతిలో మూడవస్థలూ అనుస్యూతముగా దేనియందు అయితే వున్నాయో, అనగా ఏ తురీయమునందు జాగ్రదావస్థ కల్పించబడిందో, ఏ తురీయావస్థయందు స్వప్నావస్థ కల్పించబడిందో, ఏ తురీయ స్థితిలోనే సుషుప్తి కల్పించబడిందో, ఈ అవస్థలు వున్నప్పుడు కూడా ఆ తురీయం వుంటూ, ఈ అవస్థలు లేకపోయినా కూడా ఆ తురీయం వుంటోంది. కనుక తురీయస్థితి అవస్థలు వున్నప్పుడు లేనప్పుడు కూడా వుంటూ వుండంగా, అవస్థలు లేనప్పుడేమో దానికదే వుంది తురీయం. అవస్థలు వున్నప్పుడేమో మూడవస్థలకూ సాక్షిగా వుంది. ఇలా విడగొట్టుకుని విచారణ చేసి, రోజూ మీకొచ్చే అనుభవాలని ఏదో నిద్రపోయాను, ఏదో కలగన్నాను, ఏదో మేల్కొన్నాను, ఏదో పనిచేశాను, ఎలాగో జీవించేశాను అనుకోకుండా నీ జీవితాన్ని, ఈ అవస్థలని, జ్ఞాపకాలని, కలయొక్క జ్ఞాపకాలని, సుషుప్తిలో ఏమీ తెలియని స్థితిని మళ్ళీ ఇవన్నీ విచారిస్తే నిన్నటివాడే ఇవాళ వున్నాడని, సుషుప్తిలో మాయమైపోవడంలేదని, సుషుప్తిలో వుండి కూడా నిష్క్రియగా వున్నాడని, ఇవన్నీ ఇలా తెలుసుకుంటూ, ఇలా విడగొట్టి తెలుసుకోవడమే సాంఖ్య పద్ధతి. అలాగే ఈ పదహారు అంతర్భాగాల గురించి సాంఖ్యులు అనిరి.

లోకకళలేమో లోకాన్నీ ప్రపంచాన్నీ చూపిస్తాయి. అలోక కళ ప్రపంచాన్ని చూపించదు. ప్రపంచము తోచదు. ఎప్పుడైతే అలోక కళలో ప్రపంచము తోచదో అప్పుడు వాడు ప్రత్యగాత్మ. ఎప్పుడైతే అలోకకళలో ప్రపంచము తోచకుండా, తాను తానైనటువంటి ప్రత్యక్ ఆత్మగా మిగిలిపోయాడో అదే మోక్షం. అందుకని ఈ అలోకకళ ప్రత్యగాత్మ సంబంధం. ప్రత్యగాత్మ సంబంధమైన ఈ అలోకకళ బ్రహ్మానుభవమును పొందించును. అంటే లోకమే బ్రహ్మానుభవానికి ఆటంకంగా ఆవరణగా వున్నది. లోక కళలే లోకాన్ని చూపించి లౌకికమైన దృష్టిని కలిగిస్తున్నాయి. అలోక కళ ఏదైతే వున్నదో అక్కడ ప్రపంచాన్ని చూపించడం మానేసింది. అప్పుడు ప్రపంచం తోచుటలేదు. అలోక కళయందు ప్రపంచం తోచుటలేదు. బహిర్ముఖంగా ఎప్పుడైతే అలోకకళలో ప్రపంచం తోచట్లేదో, బహిర్ముఖం సున్నా అయింది. బహిర్ముఖం ఎప్పుడైతే సున్నాయో, తానుతానుగా ఎప్పుడూ వుండేటటువంటి ప్రత్యక్ ఆత్మ మిగిలి వున్నాడు. అలా మిగిలి వుండటమే మోక్షం. వాడు ఎప్పుడూ వున్నాడు. అలోక కళ ఎప్పుడూ వుంది. లోక కళ వుండనీ వుండకపోనీ అలోక కళ ఎప్పుడూ వుంది. అలోక కళే తురీయం. అయితే తురీయంలో తురీయం మాత్రమే అలోక కళ అయింది. జాగ్రత్‌లో జాగ్రత్, స్వప్నంలో స్వప్నం, సుషుప్తిలో సుషుప్తి. ఇవన్నీ విచారణ చేశాక, చివరికి తురీయంలో తురీయం. తురీయంలో తురీయమే అలోక కళ అయింది. వట్టి తురీయం లోక కళ అయింది. పౌర్ణమి కళ అయింది. తురీయంలో తురీయం ఏమో అమావాస్య కళ అయింది. అమావస్య కళ బహిర్ముఖానికేనండీ! ప్రకృతి, ప్రపంచం తోచకుండా వుండటానికే. నిజంగా పరమాత్మ నిష్కళకాదు. పరమాత్మ కళగా లేడుగానీ ప్రకాశ రూపంలో వున్నాడు. ఆ ప్రకాశం కూడా తననుతాను ప్రకాశింపజేసుకుంటూ వున్నాడు గాని, తనకంటే అన్యమును ప్రకాశింపజేయడం లేదు.

15 లోక కళలు బహిర్ముఖంగా వున్నప్పుడు మాత్రమే ఆ పరమాత్మ తనకంటే అన్యముగా వున్న లోకాన్ని నానావిధాలుగా, అనేకత్వంగా అనేక బేధాలుగా తోపింపచేస్తున్నాడు. తోపింప చేసేటటువంటి కళలన్నీ పోయి నిష్కళ అనే పదహారో కళ ఉన్నదో, అప్పుడు వాడు బహిర్ముఖాన్ని విరమించి అంతర్ముఖమై స్వప్రకాశరూపమై, ప్రత్యగాత్మ రూపమై వుంటున్నాడు. అలోక కళ బ్రహ్మానుభవాన్ని పొందించును. అంటే ప్రపంచం మాయమవగానే ఆవరణ తొలగుతుంది. ఆవరణ తొలగగానే బ్రహ్మానుభవం సిద్ధిస్తుంది అని అర్థము.

అంటే? ఆవరణ తొలగడం అనే కీ (Key) వుంది అక్కడ. అంతే తప్ప బ్రహ్మానుభవం వచ్చేదా? ఆవరణ పోగానే వున్నదేదో వున్నది, అద్వైత సిద్ధాంతంలో కనబడేదేముంది? క్రొత్తగా వచ్చేదేముంది? ఆ వున్నదేదో వున్నది అది నీవే అయివున్నావు, అది స్వానుభవం. అనుభూతి ఒకటి వున్నది కదా! అపరోక్షానుభూతి ఒకటి వున్నది కదా! అన్యము పోవడమే పరోక్షం పోవడం. పరోక్షముపోతే అనన్యము. అనన్యమైనదే అపరోక్షం. అపరోక్షం అనేటటువంటి జ్ఞానమే స్వయంప్రభ. స్వప్రకాశం. ఇదీ తురీయంలో తురీయం. అలోక కళ అంటే తురీయంలో తురీయం. అంటే తురీయంలో తురీయం ప్రత్యగాత్మ అయ్యాడు. అక్కడ ప్రకాశం ఎందుకు లేదు? ప్రకాశం వున్నది. కాని ఆ ప్రకాశమే తానై వున్నాడు. తురీయంలో తురీయం అంటే సాధకుడికి ఒక అనుభవ రూపంలో లేదు. అది అపరోక్షానుభూతి రూపంలో వుంది. తురీయం అంటేనేమో తురీయానుభవం వుంటుంది, ఆనందం వుంటుంది. తటస్థ లక్షణం కదా! తురీయంలో తురీయం అంటే తురీయాతీతమే. తురీయాతీతంలో ఆనందఘనం

అది. ప్రకాశ ఘనం. ప్రకాశ స్వరూపము, జ్ఞాన స్వరూపము, ప్రజ్ఞాన ఘనం. అందుకని ఇది పొందిస్తుంది అని అనకూడదు. అయితే, ఆ పొందటం అనేది ఏదైనా వుంటే దానికి హేతువు అలోక కళ. ప్రపంచము తోచకుండా వుండుట అనే అలోక కళ నిన్ను అంతర్ముఖంలో వుంచటానికి కారణం. అట్టి కారణంచేత అది పొందిస్తుంది అని ఇక్కడ అన్నాడు. అంతేగాని అది పొందించదు. ఆవరణ తొలగుతుంది అంతే! అలోక కళలో ఆవరణ తొలగుతుంది. ఆవరణ తొలగితే నీవు ప్రత్యగాత్మగా స్వతః సిద్ధమై వుంటావు. తనకు తానే అయి వుంటాడు.

తుర్యాతుర్యములకు శరీరము అథోభాగమున సంచారము వున్నప్పటికినీ, ఎల్లప్పుడూ ఊర్ధ్వమున అమల జ్ఞానము లోని తుర్యాతుర్యముల నెరుగవలయును. ఈ తుర్యాతుర్యము అనేటటువంటి పరబ్రహ్మ స్వరూపము బిందు స్వరూపము, నిజానికి బిందువు కూడా కాని స్వరూపము, నాద స్వరూపమైతే ప్రణవం, అలోక కళ నాదము కూడా కానటువంటి స్వరూపము. అలోక కళలో కళలు పోయినాయి. బిందు రూపంగా వున్నటువంటి చైతన్యము వ్యాపించి అనేక కళలుగా ప్రకృతి కళలుగా ప్రకృతిని విస్తరింపజేసినటువంటి, సర్వాధారమైనటువంటిది ఈ పరమాత్మ ప్రకాశం. అలా వ్యాపించడం మానేస్తే అదేమైంది? బిందు రూపం అయింది అని అంటున్నాము. బిందు రూపం ద్వారా ప్రపంచం వస్తోంది కాబట్టి ప్రపంచము పోయి తిరిగి అలోక కళలో బిందు రూపము అయ్యింది అంటున్నాము. ఈ మహత్తు రూపము, ఈ ఓం బిందువు అనేది ఆధారము. మూలము, కారణము. ఎప్పుడైతే ఈ జగత్తు మిథ్యే, మిథ్యా శక్తికి ఆధారమైన బిందువు కూడా మిథ్యే. మహత్ బ్రహ్మ లేదు. మహత్ బ్రహ్మకూడా సత్ చిత్ ఆనందమనే తటస్థ లక్షణముతో వున్నటువంటి అఖండ ఎరుకగా వున్నాడు. సత్ చిత్ ఆనందమనేటటువంటి తటస్థ లక్షణము ఏ అనుభూతినైతే ఇస్తుందో, అట్టి ఆనందముగా ఈ మహత్ బ్రహ్మ వున్నాడు. ఎప్పుడు? బిందు రూపంలో వుంటే. జగత్తు మిథ్య అయినప్పుడు జగత్తు కి మూల కారణమైన బిందువు కూడా మిథ్యయే. సత్య వస్తువునుంచి అసత్య వస్తువు రాదు. అసత్య వస్తువునించి అసత్య వస్తువు కూడా రాదు. ఒకవేళ అసత్య వస్తువు భ్రాంతి అయితే అసత్య వస్తువు నుండి అనేక అసత్య వస్తువులు రావడం అంటే ఒక భ్రాంతి నుండి అనేక భ్రాంతులు పుట్టుకొస్తున్నాయి అని అంటే సరిపోతుంది. నిజానికి అసత్య వస్తువు లేనిదే. దాని నుండి మళ్ళీ లేనివే వస్తాయి. అయితే లేని వస్తువునుండి లేని వస్తువు రావడమంటే, లేని వస్తువే వున్నట్లు తోచిన మొదటి భ్రాంతి నించి మరిన్ని లేని వస్తువులు మరిన్నిగా తోస్తున్నాయి అనేటటువంటి భ్రాంతియే. ఒక భ్రాంతి నించి అనేక భ్రాంతులు పుట్టుకొస్తున్నాయి. అంతేగానీ అసత్య వస్తువు లేనిదే కనుక కార్య కారణాలుగా లేవు.

మరి సద్వస్తువు వుందన్నామా? సద్వస్తువు తనకు తానే వున్నది, తాను తప్ప అన్యములేనిది. తను నిర్వికారముగా వుండి తను పరిణామము పొందట్లేదు. అటువంటి పరిస్థితిలో అది వ్యాపకమూ అవదు. ఓం కారము మూడు మాత్రుకల చేత స్థూల సూక్ష్మ కారణ సృష్టి అంతా వ్యాపకం అయింది కదా! స్థూల సూక్ష్మ కారణంగా వ్యాపకమైన సృష్టి మిథ్య కదా! విచారిస్తే లేనిది కదా! కనుక కారణమైన బిందువు కూడా మిథ్యే. ఓం బిందువు దేని వల్ల వచ్చిందంటే ప్రణవనాదం వల్ల వచ్చింది. కాబట్టి ప్రణవ నాదం కూడా మిథ్యే. అప్పుడు ప్రణవనాదము, ఓం బిందువు, 15 లోక కళలు మూడూ కూడా మిథ్యే. అవి లేవు. అవన్నీ లేకపోతే ఏం మిగిలింది? ప్రకృతిలో వ్యాపకం అయినటువంటి చిత్ ప్రకాశానికి సంబంధించి నిష్కళ మిగిలింది. నిష్కళ ఏం చేసింది? మిగతా 15 కళలను చూపించేటటువంటి ఆవరణని నిరావరణ చేసింది. ఈ అలోక కళ లేక నిష్కళ ఆ ఆవరణని నిరావరణ చేసేసింది. ఎప్పుడైతే ఆ ఆవరణ నిరావరణ అయిందో, నాద బిందు కళలు లేవు. ఎప్పుడైతే నాదబిందు కళలు లేవో స్వతస్సిద్ధుడైనటువంటి ఆ పరబ్రహ్మ నాదబిందు కళాతీతముగా వున్నాడు. నాద బిందు కళలకు అతీతముగా, నాద బిందు కళలు తనయందు లేనివిగా తనకు తానే వున్నాడు. ఇటు చూడండి బ్రహ్మణో అవ్యక్తః అవ్యక్తమే నాదము అవ్యక్తో మహత్తు. మహత్తే బిందువు. మహదో మహదహంకారః అహంకారము యొక్క సంకల్పముచేత స్థూల సూక్ష్మ కారణసృష్టి అంతా వచ్చింది, ఈ అహంకారమే ఓంకారేశ్వరుడు, వాడి వెనక వున్నదేమో అకార ఉకార మాత్రుకలు, సృష్టికి ఉపక్రమించేటటువంటి అకార ఉకార మాత్రుకలు సంకేతముగా కలసియున్న ఓంకారమే మహత్తు, మహత్తుగా వుండేటటువంటి అహంకారము యొక్క సంకల్పము ద్వారా ఈ అకార ఉకార మాత్రుక సృష్టి స్థూల సూక్ష్మ కారణ సృష్టిగా విస్తరించింది. ఇవే కళలు.

ఇటువంటి సృష్టి మిథ్యా గనుక మిథ్యా సృష్టికి హేతువైన బ్రహ్మ మాయాశబలిత బ్రహ్మమే. మహదహంకారముగా వున్నటువంటి హిరణ్య గర్భుడు మాయాశబలిత బ్రహ్మమే. ఆ మాయాశబలిత బ్రహ్మకి కారణమైనటువంటి మహత్తు , మహత్తనే ఓం బిందువు, ఆ బిందువు కూడా ఈ మిథ్యా సృష్టికి కారణం కనుక, కార్యము మిథ్య అయినప్పుడు కారణం కూడా మిథ్యే. ప్రణవ నాదము మిథ్య. ప్రణవనాదమే అవ్యక్తము కనుక అవ్యక్తము లేదు. ఎప్పుడైతే వ్యక్తా అవ్యక్తములు లేవో నాద బిందు

కళలు లేవు. నాద బిందు కళలు లేనప్పుడు అవ్యక్తం కూడా లేదు. అవ్యక్తం లేకపోతే మహత్తు లేదు. మహత్తు లేకపోతే మహదహంకారం లేదు. మహదకంకారం లేకపోతే మాయాశబలిత బ్రహ్మ లేడు. మాయాశబలిత బ్రహ్మ లేకపోతే అకార ఉకార మాత్రుక సృష్టి అయినటువంటి స్థూల సూక్ష్మ కారణ ప్రపంచం లేదు. బ్రహ్మ సత్యం జగత్ మిథ్య అన్నప్పుడు ఈ గొలుసు కట్టంతా లేనిదే, కల్పితం అన్నప్పుడు పరబ్రహ్మమే శేషించి వున్నాడు. బ్రహ్మమనగా మాయాశబలిత బ్రహ్మ, బ్రహ్మమనగా సృష్టికి మూలకారణం అంటున్నాం కనుక మూలకారణం కాని బ్రహ్మని, ఈ బ్రహ్మకంటే పరమైనవాడిని పరబ్రహ్మ అని పేరు పెట్టడం జరిగింది. ఈ కారణ బ్రహ్మకి పరమైనవాడు. ఈ బ్రహ్మకి అతీతమైనవాడు. ఈ బ్రహ్మయొక్క లక్షణాలు లేనివాడు, ఈ బ్రహ్మ సర్వకారణమైనప్పుడు, పరబ్రహ్మ సర్వకారణము లేని పరబ్రహ్మ. సర్వకారణత్వము లేనటువంటి బ్రహ్మ పరబ్రహ్మ. కార్య కారణానికి అతీతమైనటువంటి బ్రహ్మ పరబ్రహ్మ. ఈ విధముగా పరమునకు పరమైన బ్రహ్మ పరాత్పరము.

అవ్యక్తము ఈ పరబ్రహ్మకి సంబంధం లేకుండా అవ్యక్తరూపంలో ప్రణవ రూపంలో నాద రూపంలో అనాహత శబ్ద రూపంలో తోచింది. ఈ అనాహత శబ్దమే నాదం. ఈ ప్రణవ బ్రహ్మము, ప్రణవ నాదము, బ్రహ్మ నాదము ఇవన్నీ ఒకే పర్యాయ పదాలుగా చెప్పబడుతోంది. ఈ తుర్యాతుర్యతీతంలో ప్రకాశం వుందా లేదా? అది ప్రత్యగాత్మ స్వరూపం అయ్యాక స్వప్రకాశ రూపంలో ప్రకాశం వుంది. అలోక కళ అనగానే మాయ ద్వారా అవతలున్న ప్రకాశము నిష్కళ అయింది. అక్కడ ప్రకాశము లేనిదయింది. లోకంలో మాయావరణంలో నామరూప ప్రపంచంలో ఈ పరమాత్మ ప్రకాశమే వ్యాపించి వుంటే ఆ పరమాత్మ ప్రకాశముచేత ఆ పరమాత్మ జ్ఞానముచేత ఇవి అన్నీ తెలియబడ్డాయి. ఆ పరమాత్మ ప్రకాశము, పరమాత్మ జ్ఞానము ఆ మాయావరణలో అలోక కళ అనే పేరుతో నిష్కళా రూపంలోకి మారితే ప్రపంచము తెలియబడదు.

పూర్ణ కళలో వున్నటువంటి అనుభవమే తురీయము. తురీయంలో వుండే అనుభవమే తటస్థ లక్షణము. తటస్థ లక్షణమనగా సత్ చిత్ ఆనందము. ఇది పరోక్ష జ్ఞానము. అపరోక్షం కాదు. తురీయంలో తురీయం లేదా తురీయాతీతం అన్నప్పుడే అది అపరోక్ష జ్ఞానం అవుతుంది. ఇది అన్ని కాలాలలో వుంది. తాడుమీద పాము తోస్తే ఎక్కడ పాము తోచిందో ఆ పాము స్థానంలోనే భ్రాంతి రహితమైతే అక్కడే అచ్చోటనే తాడు వున్నది. నీకు తాడు కనబడకపోయినంత మాత్రాన పాము మాత్రమే కనబడుతున్నంత మాత్రాన తాడు లేదా? ఆ పాము స్థానంలో తురీయమనే జ్ఞాన ప్రకాశముంటే తాడు సాక్షాత్కరించింది. ఆ రకంగా ఈ ప్రత్యగాత్మ అన్ని శరీరాలలోనూ అష్టతనువులలోనూ అష్టప్రకృతులలోనూ నాద బిందు కళల్లోనూ కూడా వ్యాపకమై వున్నాడు.

ఇక్కడ ఏమంటున్నాడంటే తురీయాతుర్యములకు శరీరమునందు అథోభాగమున సంచారము వున్నప్పటికీ అష్ట తనువులలో అష్ట ప్రకృతుల్లో కూడా ఈ సంచారము వున్నప్పటికీ, ఎల్లప్పుడూ కూడా ఊర్ధ్వమున అమల జ్ఞానములోని తుర్యాతుర్యములను ఎరుగవలయును.

ఊర్ధ్వ ముఖము అంటే ఏమిటి? భ్రాంతి రహితమైనటువంటి స్థితి ఊర్ధ్వముఖం. అథోముఖం అంటే ఏమిటి? భ్రాంతిలో అంతకంతకూ కూరుకుపోవడమే అథోముఖం. పైన అనేది బ్రహ్మ అని, క్రింద అనేది ప్రపంచం అని సాంప్రదాయము.

కాబట్టి అథో ముఖము, ఊర్ధ్వముఖము అనేటటువంటివి నిజానికి లేవు. ఉత్త బట్టబయలు ఏమీ లేదు. దానికి దిశలు లేవు. దానికి దశ దిక్కులు లేవు. లోపలా బయటా అనేది లేదు. ఒక వస్తువుంటే ఒక వస్తువుకి లోపలా బయటా. శరీరాలుంటే శరీరం లోపల ఆత్మ అని, వెలపల పరమాత్మ అని. అసలు వస్తువే లేనప్పుడు వున్న వస్తువులన్నీ మిథ్య అయినప్పుడు, పైనా, క్రిందా అనేవి లేవు. ఒక మానవుడు వున్నాడు , వాడికి బయట బహిఃప్రజ్ఞ, లోపల అంతఃప్రజ్ఞ, వాడు వున్నాడు కాబట్టి వాడికి బయట లోపల వుంది. వాడే లేనివాడైతే బహిఃప్రజ్ఞ అంతః ప్రజ్ఞ కలిపి ఒకటే ప్రజ్ఞ. బహిర్ జ్యోతి అంతర్ జ్యోతి కలిపి ప్రత్యక్ జ్యోతి మాత్రమే. ప్రత్యక్ జ్యోతి అన్నప్పుడు ఏమైంది? లోపల వెలుపల లేక, దశ దిక్కులు లేక వున్నది. సరే అవన్నీ మనం ఈ భ్రాంతిలో ఈ ప్రపంచంలో ఈ దేహంలో వుండి పరిశీలిస్తున్నాం కాబట్టి మనకి అర్థం కావడానికి మన ఊహలోకి రావడానికి అథోముఖము ఊర్ధ్వముఖము అని వాడుకుంటున్నాము. వాడినంత మాత్రాన దిక్కులున్నాయని అనుకోకండి. దిక్కులన్నీ సాపేక్షం, ప్రకృతికి ప్రపంచానికి సంబంధించినవి. పరమాత్మకు సంబంధించి దిక్కులకు అతీతమైనది. దేశకాల వస్తువులకు అతీతమైనది. దేశమంటూ వుంటే దానికి దిక్కులుంటాయి. చోటుంటే దానికి ఈవైపు ఆ వైపు అని వుంటుంది. చోటే లేకపోతే , దేశము కాలము లేకపోతే దానికి ఊర్ధ్వము అథోముఖము అనే పేరే లేదు. మనం భ్రాంతిలో దేశకాలాదుల్లో వున్నాం కాబట్టి, ఆ మాటలు ప్రయోగిస్తున్నాము.

అమల జ్ఞానములోని తుర్యాతుర్యములను ఎరుగవలయును . అంటే ఇక్కడే దానిని తెలుసుకోవాలి. ఈ శరీరమునందే ఆ తుర్యాతుర్యములను, తురీయాతురీయములుగా వున్న పరబ్రహ్మమును ఈ ఉపాధియందే తెలుసుకోవాలి. ఈ దేశమందే తెలుసుకోవాలి. ఈకాలమందే తెలుసుకోవాలి. ఈ జన్మయందే తెలుసుకోవాలి. ఈ నామరూప జగత్తులోనే తెలుసుకోవాలి. విచారిస్తే తెలుసుకోగలరు. ఈ విచారణే సాంఖ్య విచారణ. పై విషయమును స్మరించినపుడు, ప్రణవోపాసనకు పూర్వమే ఈ క్రిందివాటిని అనుసరించి జీవించవలెను. ఈ పై విషయాన్ని తలచుకో అంటే స్మరణ రూపంలో లక్ష్యంగా పెట్టుకో అని అర్థము. ఎందుకంటే అది అవ్యక్తము, అవాంగ్మానస గోచరము, అనిర్వచనీయము. ఇంద్రియగోచరం కాదు, ఎలా పట్టుకుంటావు? ఇప్పటి వరకు చెప్పిన పాఠాన్నిబట్టి, ఈ సారాంశాన్నిబట్టి ఆ ప్రత్యగాత్మని అలోక కళ సంబంధంగా ఆ ప్రత్యగాత్మ అందించబడ్డప్పుడు ఆ ప్రత్యగాత్మే స్వప్రకాశరూపమైనప్పుడు అది అపరోక్షమైనప్పుడు తనకంటే అన్యములేనప్పుడు, ఈ వున్నదంతా తెలుసుకుని నాదబిందుకళాతీతమైనటువంటి పరబ్రహ్మము లక్ష్యముగా నీ స్మరణలో పెట్టుకో. దానినెప్పుడూ కూడా నిరంతరాయంగా స్మరించు. ఇదే అనుష్ఠానము. అలా స్మరిస్తూ వుండటమే అనుష్ఠానము. దానిని నువ్వు స్మరిస్తున్నావంటే నిన్నునువ్వే బ్రహ్మగా స్మరిస్తున్నావు. పరత్వాన్ని పైచెప్పిన పద్ధతిలో స్మరిస్తున్నావు అంటే నీమీద అప్లై చేసుకున్నావంటే ఏమైంది? నిన్నే పరబ్రహ్మ స్వరూపంగా స్మరిస్తున్నావు. ఈ స్మరణ చేసినటువంటి అనుష్ఠాన పద్ధతి, ఉపాసనా పద్ధతి ఏదైతే వుందో, ఆ ఉపాస్య దైవాన్ని ఎవడైతే ఉపాసిస్తున్నాడో ఆ ఉపాస్యమైన దైవమే తానైవుంటాడు. బ్రహ్మోపాసన చేసేవాడు బ్రహ్మమే అవుతాడు. చిట్టచివరికి బ్రహ్మని ఉపాసన చేసేటటువంటి ఉపాసకుడు ఉపాస్యమనేటటువంటి బ్రహ్మ తానే అయి ఉంటాడు.

భ్రాంతి కలిగినవారు పరబ్రహ్మ తాను కాదనేటటువంటి ఆవరణ దోషంతో ఎక్కడికెక్కడకో వెళ్ళిపోయి జీవులైన వాళ్ళంతా కూడా, ఈ ఆవరణ దోషం నుండి బయటపడి నిరావరణ స్వరూపమై తిరిగి బ్రహ్మయందు చేరాలి అనేటటువంటిది దైవీ ప్రణాళిక. పరబ్రహ్మ అద్వయం కనుక తనకంటే అన్యమును హరించే శక్తి దానిలో ఉన్నది. అందువలన ఎప్పుడో ఒకప్పుడు అందరూ ముక్తులు కావలసిందే.

ఉపాసన అంటున్నాము, బ్రహ్మ ఉపాస్య రూపంలో వున్నప్పుడు, ఉపాసకుడు ఆ బ్రహ్మని ఉపాసనగా చేస్తున్నప్పుడు, ఆ బ్రహ్మయొక్క సమీపానికి వెళ్ళి ఆ ఉపాస్య బ్రహ్మమే తాను అవుతున్నాడు. ఉపాసన అంటే సమీపంగా వసిస్తూ వున్నాడు అని అర్థము. సమీపంగా వుంటున్నాడు. సమీపంలో ఆసీనుడై వున్నాడు. ఎందుకని? సిద్ధవస్తువది. సాధ్య వస్తువు కాదు కాబట్టి, ఉపాసన అనే సాధనతో సమీపానికి మాత్రమే వెళ్ళాడు తప్ప పరబ్రహ్మగా సిద్ధమైపోలేదు.

శరీరమే నేను అంటున్నారు మీరు. విచారణ అక్కడనించి బయలుదేరాలి. ముందు పరబ్రహ్మయందు తన్మాత్ర సృష్టి జరిగితే ఆ తన్మాత్ర స్వరూపమే నీవై వున్నావు, తరువాత పంచభూతాలు వస్తే పంచభూతాల స్వరూపం నువ్వు అయ్యావు, తరువాత పృథ్వి నించి అన్నం వస్తే అన్నమయకోశం నువ్వు అయ్యావు. ఎక్కడినించి మొదలుపెట్టాలి? పృథ్వీ తత్వం నుండి మొదలుపెట్టి ఆకాశ తత్వానికి వెళ్ళి, ఆకాశ తత్వం నుండి ఇంకా పైకెళ్ళి, నీ లక్ష్యంలో పెట్టుకున్నటువంటి బ్రహ్మానికి వెళ్ళగలవంటే, మహత్తు దాకా పైకెళ్ళగలవు. మహత్తు తరువాత అవ్యక్తములోకి వెళ్ళకుండా, ఉపాసన అక్కడికే ముగిస్తాము. ఆ పైది ఉపాస్య వస్తువు కాదు. సిద్ధవస్తువు. సగుణ బ్రహ్మజ్ఞానం పొందటానికి ఈ ప్రణవోపాసన పెట్టాము. ప్రణవోపాసన చెయ్యడం వల్ల ప్రణవ బ్రహ్మమయ్యావు, నాదబ్రహ్మవయ్యావు. ఓంకారోపాసన ద్వారా ఓంకార రూపివి అయ్యావు. ప్రణవోపాసన ద్వారా ప్రణవరూపుడు అయ్యావు. ప్రణవరూపం ఎక్కడికయ్యింది అది? అవ్యక్తం దాకా వెళ్ళింది. అవ్యక్తం తరువాత బ్రహ్మకెళ్ళాలిగా! అందుకే సమీపానికి వెళ్ళారు మీరు. నిర్గుణ బ్రహ్మ సిద్ధ వస్తువు గనుక, బ్రహ్మ దగ్గరికి ఎవ్వరూ వెళ్ళలేరు. అంటే నీ దగ్గరికి నువ్వే వెళ్ళాలి. నీవే ఆ బ్రహ్మవి గనుక. బ్రహ్మ దగ్గరికి వెళ్ళడటం అంటే నీవే నీ దగ్గరికి వెళ్ళడము. నువ్వూ, నీ దగ్గరికి వెళ్ళేవాడు – ఇద్దరున్నారా? ఉపాసనా ఫలితంలో ఇద్దరుంటారు. ఇద్దరున్నప్పుడు పరోక్షం అది. అది నీవే అయివున్నావని ఆవరణ రహితమై, భ్రాంతి రహితమై, అద్వైతము సిద్ధించే సరికి పరోక్షము పోతుంది. అనన్యమవుతుంది. పరోక్షం పోయి అనన్యమయినప్పుడు అపరోక్షం సిద్ధిస్తుంది. అపరోక్షము సిద్ధించాలి గాని అపరోక్షాన్నీ ఉపాసన చేత సాధించుకోలేరు ఎవ్వరూ. అందుకే పరబ్రహ్మ ఉపాసన అని అనకూడదు. బ్రహ్మోపాసన అనొచ్చు. ప్రణవమే బ్రహ్మము. ఓంకారమే బ్రహ్మము. మహదహంకారమే బ్రహ్మము. ఆకాశమే బ్రహ్మము. వాయువే బ్రహ్మము. అగ్నీ బ్రహ్మమే. జలము బ్రహ్మమే. పృథ్వి బ్రహ్మమే. అన్నమూ బ్రహ్మమే. సర్వం బ్రహ్మ. ఇప్పుడేమయిందక్కడ? బ్రహ్మయొక్క వివర్త రూపాలే ఇవన్నీ.

ఏ బ్రహ్మ? పరబ్రహ్మ కాదు. అవ్యక్తము నుండి క్రిందికి వచ్చినటువంటి బ్రహ్మమే ఇన్నయ్యాడు. మనలో సంకల్పంలో ఊహామాత్రంగా వుండి చూస్తే ఏవైతే వచ్చాయో ఊహల్లో ఆ బ్రహ్మమే వ్యాపించి వున్నాడు. ఏ బ్రహ్మ అయితే సంకల్పం చేసి తన ఊహల్లో ఈ సృష్టినంతా కూడా ఊహామాత్రంగా సంకల్పించాడో, ఆ ఊహామాత్రమైన సృష్టిలో ఈ సంకల్పముతోనే వ్యాపించివున్నాడు. కనుక ఈ బ్రహ్మ తన్ను కాదని వేరే వస్తువుతో, వేరే పదార్థముతో ఈ సృష్టి చెయ్యలేదు. తన్మాత్రలు బ్రహ్మకంటే వేరుకాదు. బ్రహ్మకంటే వేరులేదు అన్నప్పుడు తన్మాత్రలు వేరే ఎక్కడున్నాయి? బ్రహ్మమొక్కడే అన్నప్పుడు "ఏకమేవాద్వయం బ్రహ్మ" అన్నప్పుడు ఈ సృష్టి చెయ్యడానికి ఈ తన్మాత్రలు పంచభూతాలు అనేవి రెండవ పదార్థమా? రెండోదుంటే బ్రహ్మమొక్కటే అన్నదానికి దోషమొస్తుందిగా! కనుక బ్రహ్మ యొక్క సంకల్పంలో తన్మాత్రలు తోస్తే ఆ తోచినటువంటి తన్మాత్ర స్వరూపం కూడా బ్రహ్మమే. తన్మాత్రనుంచి ఒక క్రమ పద్ధతిలో బ్రహ్మయొక్క వివర్త రూపంలో సూక్ష్మభూతాలు వస్తే సూక్ష్మ భూతాలు కూడా బ్రహ్మమే. ఆ సూక్ష్మ భూతాలు స్థూలభూతాలుగా పంచీకరణ అయి, నామరూప ప్రపంచము అయితే , ఈ నామరూప ప్రపంచము కూడా బ్రహ్మమే. ఈ రకంగా జగత్ బ్రహ్మము. ఈ రకంగా సర్వం ఖల్విదం బ్రహ్మ. బ్రహ్మకంటే అన్యము లేనప్పుడు ప్రపంచమును అన్యముగా చూడరాదు. ప్రపంచముకూడా బ్రహ్మమే. ఇక్కడ పరబ్రహ్మము కాదు. ఇటువంటి కారణ బ్రహ్మని పొందొచ్చు. ఇటువంటి బ్రహ్మని ఉపాసన చెయ్యొచ్చు. అన్నం పరబ్రహ్మ అని ఉపాసన చెయ్యండి. తరువాత ప్రాణం బ్రహ్మ అని ఉపాసన చెయ్యండి. తరువాత మనస్సే బ్రహ్మ అని ఉపాసన చెయ్యండి. తరువాత విజ్ఞానం బ్రహ్మ అని ఉపాసన చెయ్యండి. తరువాత ఆనందో బ్రహ్మ అని ఉపాసన చెయ్యండి. ఉపాసన అక్కడితో అయిపోయింది. ఆనంద స్వరూపమే నువ్వు అనేది ఉపాసనచేత అందేది కాదు. ఆ పరబ్రహ్మ సమీపానికి వెళ్తావు గానీ ఆ పరబ్రహ్మమే నీవు అవడం అనేది ఉపాసన వల్ల సాధ్యం కాదు.

అసలు మానవ జన్మ ఎలా వచ్చిందీ? సృష్టి పరిణామ దశలో తన్మాత్ర రూపమై పచభూతాల రూపమై అన్న రూపమై పరమాణు సృష్టిలో పరమాణువునందు అణోరణీయాన్‌గా వ్యాపకమై, ప్రతి అణువుయందు అంతరాత్మగా ఈ బ్రహ్మము వున్నాడు. ప్రతి పరమాణువునందు పరమాణువు యొక్క అంతరాత్మగా ఈ బ్రహ్మము వున్నాడు. రాయిగా, రాయిలో వున్నటువంటి అణువులో పరమాణువులో అంతర్యామిగా ఈ పరబ్రహ్మ వున్నాడు. ఏ ఉపాధిలో అయినా వుంటూ, ఆ ఉపాధితో సంగత్వం లేకుండా ఆ ఉపాధిని గురించినటువంటి జ్ఞానం లేకుండా, తాను తానైనటువంటి జ్ఞానంలో మాత్రమే వుండేటటువంటివాడు అంతర్యామి. సూర్యుడిలో వుంటూ సూర్యుడిని ఎరగక సూర్యుడియొక్క వ్యవహారానికి నియామకుడై అసంగుడై సాక్షి మాత్రుడై సాక్షి చైతన్య స్వరూపమై తాను కదలకుండానే తాను సంకల్పించకుండానే తనయొక్క సత్తా మాత్రముచేత సర్వమూ నియమించబడుతూ వున్నటువంటిది, అట్టి కేంద్రము అంతర్యామి.

రాయినుంచి జంతువు దాకా పరిణామము చెందినప్పుడు పశువులలో ఏమున్నాయి? ఆకలి నిద్ర భయము మైధునము – అంతకుమించి వాటికి వివేకము లేదు, అంతకుమించి చైతన్య వికాసము లేదు, అంతకుమించి బుద్ధి యొక్క వికాసము లేదు. వివేకము లేదు, విచక్షణాలేదు. ఈ మానవ జన్మకొచ్చిన మానవుడు బుద్ధిజీవి. వివేకమూ విచక్షణా వుంది. ఇటువంటి వారికి తగిన టైం వస్తే బ్రహ్మ విద్య నేర్పొచ్చు. అందుకని మనం విద్య ఎక్కడినించి మొదలు పెట్టాలి. పేరుకే మానవ దేహం గాని, ఆ పరిణామంలో పశుపక్ష్యాదుల, క్రిమికీటకాల యొక్క సంస్కారాల చేత అస్వతంత్రుడై మెలగుతున్నాడు. ఆ సంస్కారాలు ఎలా వున్నాయి? **"ఆహార నిద్ర భయ మైధునాని సామాన్యమే తత్పశుభిర్నరాణామ్! జ్ఞానో నరాణా మధికో విశేషో జ్ఞానేన హీనాః పశుభి స్సమానాః** "కొన్ని మానవ జన్మలు ఎత్తాడండి. వాడు అనాగరికంగానూ, రాక్షసుడిగానూ, స్వార్థపూరితంగా కొన్ని జన్మలు వెళ్ళమార్చాడు. తరువాత కుటుంబ వ్యవస్థ సమాజ వ్యవస్థకి చేరినప్పటికీ తన స్వార్థానికి ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇచ్చాడు. త్యాగం చెయ్యడం అనేది లేదు. త్యాగం ఎప్పుడు చేశాడు అంటే ఏ వస్తువు ద్వారా ఏ జీవి ద్వారా ఏ ప్రాణి ద్వారా సుఖం వస్తుందో అవసరమైతే ఆ సుఖం కోసం మాత్రమే కొంత త్యాగం చేశాడు తప్ప, ఎప్పుడూ త్యాగం చెయ్యాలనేది వాడికి లేదు. ఈ పశుపక్ష్యాదుల సంస్కారాలతో వాటియొక్క ఉపాధిని పరిణామ దశలో విడిచిపెట్టి, మానవ ఉపాధిలో పరిణామము చెందిన బుద్ధి మీరి ఆ సంస్కారాలతోటే ఆహార భయ నిద్రా మైధునాలు అని వుంటున్నాడు. అటువంటి మానవుడు పశువుతో సమానంగా వున్నాడు, తప్పేమీలేదు. కాని దానికంటే అధికముగా, ఆ పశుపక్ష్యాదులకంటే భిన్నముగా జ్ఞానం అనేది ఒకటుంది ఈ మానవులలో, ఈ నరులలో. అది అధికంగా విశేషంగా వున్నది.

మానవునిలో వివేక జ్ఞానము, విచక్షణా జ్ఞానము పశువుల కంటే అధికముగా వున్నది. అటువంటి వివేకాన్ని అటువంటి బుద్ధిని కేవలం వాటికే కాకుండా, కేవలం ఆ నాలుగైదింటికే కాకుండా, ఆ బుద్ధిని తన శాశ్వత సుఖము పొందేపద్ధతిని తెలుసుకోడానికి, శాశ్వతంగా సుఖంగా వుంటానికీ, దుఖము లేకుండా వుండటానికి ఉపయోగించాలి. కొన్ని జన్మలయిపోయాక, నాగరిక మానవుడు వచ్చాక బుద్ధి వికాసమైంది. కాని ద్వంద్వ భూయిష్టమైనటువంటి ఈ ప్రపంచములోనే ప్రియమోదప్రమోదాల కోసం కర్మలు చేస్తూ, బాధలు దుఖము రాకుండా వుండటానికి జాగ్రత్తపడుతూ కర్మలు చేస్తూ వున్నాడు. ఎందుకున్నాడంటే అటువంటి వివేకమూ, విచక్షణా జ్ఞానమూ తనకుంది కాబట్టి. అయినప్పటికీ పశుపక్ష్యాదుల సంస్కారాలు ఇంకా పోలేదు. తన సుఖానికే వివాహ వ్యవస్థ కుటుంబ వ్యవస్థకూడా పెట్టుకున్నాడు. బలవంతుడే రాజ్యమేలి బలహీనుడు అణిగిపోతూ వుంటే, మళ్ళీ సమాజాన్ని ఒకటి పెట్టుకుని, ఆ సమాజంలో కొన్ని నియమాలు, ధర్మాలు మానవుడే పెట్టుకున్నాడు. అందరూ సమానంగా సుఖపడాలి, ఎవరినెవరూ ఇబ్బంది పెట్టకూడదు, బాధపెట్టకూడదు, ఒకవేళ బాధపెడితే అటువంటి వాడికి శిక్షవెయ్యాలి, శిక్షవెయ్యడానికి మన సమాజంలో ఎవడినో ఒకడిని ఎన్నుకుందాం, వాడిని రాజు అందాం, లేకపోతే నాయకుడు అందాం, అని తనకి కష్టాలు బాధలు లేకుండా ఎప్పుడూ సుఖంగా వుందామని ఈ పనులన్నీ చేశారు. అయితే ఇంత చేసినా, ఈ సుఖమనేటటువంటిది ఈ ప్రపంచంలో దొరుకుతున్నదా? పశువులకంటే మనుషులయందు జ్ఞానమొక్కటే అధికం. అట్టి జ్ఞానమే లేనిచో మనుష్యుడు పశువుతో సమానము.

కనుక సర్వకాలము భగవత్ భక్తి కలిగి, గురువులయందును, పెద్దలయందును భక్తి కలిగి సేవలు చేస్తుంటే, శ్రద్ధ పుట్టును. నాగరిక మానవుడి దాకా చెప్పాంగా. సమాజ కుటుంబ వ్యవస్థ వచ్చేసిందిగా. అది కూడా ప్రియమోదప్రమోదం కోసమేగా. అదికూడా దుఖం రాకుండా, ఇతరులవల్ల నష్టం రాకుండా సాధ్యమైనంతవరకూ బందోబస్తు చేసుకున్నాడు మానవుడు. అయినా ఒక్కొక్కప్పుడు ఈ బందోబస్తు పనిచెయ్యడములేదు. మానవుల స్వార్థానికి ఈ బందోబస్తు పనిచెయ్యదు. దీనికి ఏమన్నా మందూ విరుగుడూ వుందా అంటే అప్పట్లో కొంతమంది ఎవరో మహానుభావులు అవతరించి, అవతారమెత్తి సరిచేయాలి అనుకునేవారు. ఆ సంకల్పబలంచేత అలాగే అవతార పురుషులొచ్చి ధర్మాన్ని ప్రతిష్ఠాపనచేస్తూ, అధర్మాన్ని శిక్షిస్తూ పోతూవుండేవాళ్ళు. అధర్మం పెచ్చుమీరినప్పుడు ధర్మంగా నడుచుకునేవాళ్ళు నానా ఇబ్బందులూ పడుతూ వుండేవాళ్ళు.

మానవులకు తన ప్రయత్నానికి తగినటువంటి ఫలితము రావట్లేదు. ఏ ప్రయత్నమూ చెయ్యనివాడికేమో సుఖము కలుగుతున్నది. ఇదేమిటి అని చూస్తే, పునర్జన్మలున్నాయని కనిపెట్టారు. ఒక భగవంతుడు వున్నాడని, ఈశ్వరుడున్నాడని, తనే ఒక ఈశ్వరుణ్ణి సృష్టించుకొని, ఈశ్వరుడు సర్వకారణమని, అతను అనుగ్రహిస్తాడని, అతనియొక్క ప్రతిమలని పెట్టుకొని, ఈశ్వరుణ్ణి భక్తితో పూజిస్తూ, ఈశ్వరానుగ్రహం కోసం ప్రయత్నం చేస్తున్నాడు. ఇది కూడా మానవుడు తనయొక్క బుద్ధి జ్ఞానంతోనే చేస్తున్నాడు. ఆ జ్ఞాన వికాసం చాలదు. ఇంకా జ్ఞానం పదునెక్కాలి.

గురువులంటే ఎవరు అప్పటికి? ఈ మార్గంలో శాశ్వత ఆనందం కోసం ప్రయత్నం చేసినవాళ్ళే గురువులు. ప్రయత్నంచేసీ శాశ్వత ఆనందం పొందినవాళ్ళే గురువులు. దుఖనివృత్తి చేసుకున్నవాళ్ళే గురువులు. వాళ్ళు అనుసరించిన మార్గాన్ని మనకి చెప్పేవాళ్ళే గురువులు. అటువంటి వాళ్ళని పట్టుకున్నారు. ఎందుకింత ఆనందంగా వున్నారు? మాకందరికీ సుఖం లేదేంటి? మాకులా మీకు కూడా సంసారం వున్నప్పటికీ వేదనా దుఖం ఎందుకు లేదు? ఆ రహస్యమేదో మాకు చెప్పండని, అటువంటి వాళ్ళని గురువులని వాళ్ళ దగ్గరికి వెళ్ళారు. పెద్దలు అంటే అనుభవజ్ఞులు. బ్రహ్మానుభవం వున్నవాళ్ళే పెద్దలు. ఇది బ్రహ్మ విద్యలో పెద్దలు అనే పదానికి ఇచ్చిన అర్థము. పరమాత్మ అనుభవం వున్నవాళ్ళని పెద్దలు అంటారు. పెద్దలందరూ గురువులు కానక్ఖర్లేదు. కాని పెద్దలు అప్పుడప్పుడూ తమ స్వానుభవంనుండీ ఒక్కొక్క వాక్యాన్ని వదులుతారు. ఆ వాక్యం నీకు ఉపయోగపడుతుంది. అది ఆప్త వాక్యంగా పనికొస్తుంది. అందుకని పెద్దలు గురువులు కాకపోయినప్పటికీ, గురుతుల్యులే. వాళ్ళు నిన్ను నడుపుతారు ఒక్కోసారి. తాత్కాలికంగా ఉపాయాలు చెప్తారు. వాళ్ళని ప్రార్థించినప్పుడో వెంబడించినప్పుడో చెప్తారు. గురువులంటే గురుశిష్యన్యాయంగా చెప్తారు. గురువు దగ్గర అనుభవం వుంటుంది. గురువు ఏ పద్ధతిలో ఏ మార్గంలో అంచెలంచెలుగా నిన్ను భ్రాంతి రహితుణ్ణిచేసి ముక్త స్థితిలో పెట్టాలనేటటువంటిది తెలిసి ఉంటాడు. పైగా దానిని ఉపాయంతో, ఉదాహరణలతో, నీ బుద్ధికి అవగాహన అయ్యేటట్లుగా చెప్తాడు గురువు. అంత శ్రమ తీసుకోరు పెద్దలు. ఆప్త వాక్యాన్ని అడిగిన వాళ్ళకి అందిస్తాడు అంతే! ఇద్దరూ కూడా పరమాత్మగా స్వానుభవంగా వున్నవాళ్ళే పెద్దలన్నా, గురువులన్నా. ముందు వాళ్ళ

మీద భక్తి కలగాలి. పెద్దలయందు, గురువులయందు భక్తి వుండాలి. గురువుగారు దొరికారు నాకో సమస్య వుంది చెప్పండి, చెప్పండి చెపుతారా లేదా అని మెడమీద కత్తిపెట్టి చెప్పించుకోవడం కాదు.

గురువుమీద భక్తి వుండాలి, గురువుకి శరణాగతి చేయాలి. గురువుని విసిగించకూడదు. నీ యోగ్యతనుబట్టి నీ అర్హతనుబట్టి సమయానుకూలంగా ఎలా చెప్పాలో అలా మధ్యలో నీకు ట్రైనింగ్ ఇస్తూ, టైం వచ్చినప్పుడు చెప్తారు. ఎన్ని సంవత్సరాలు బోధ చెయకుండా నీచేత సేవ చేయించుకున్నా కూడా గురువుమీద ద్వేషం పెంచుకోకూడదు, గురువుని విసిగించకూడదు. ఆయనకి నీకు ఎప్పుడు చెప్పాలనిపిస్తే అప్పుడు చెప్పేదాకా వేచి, నిరీక్షించి వుండాలి. అదీ గురుభక్తి అంటే. సేవలు అంటే శుశ్రూషలు, అంగ స్థాన భావ శుశ్రూషలు. గురువుకి స్థూలంగా తరువాత సూక్ష్మంగా చెయ్యాలి. తరువాత శిష్యుడు గురువులో మమైకమయే పద్ధతిలో ఈ గురుశుశ్రూషలు చెయ్యాలి. కనుక సర్వకాలమందూ భగవత్ భక్తి కలిగి గురువుల యందు పెద్దలయందు భక్తి శుశ్రూషలు కలిగియున్నచో అప్పుడు శ్రద్ధ పుడుతుంది. మీకు శ్రద్ధ పుట్టేదాకా గురువు చెప్పడు. శుశ్రూషలు చేయించుకుంటూనే ఉంటాడు. నీకెప్పుడు భక్తి, భక్తి ద్వారా శ్రద్ధ కలిగిందో ఆ శ్రద్ధ వున్నటువంటి శిష్యుడికే చెప్పాలి. ఎందుకని? **శ్రద్ధవాన్ లభతే** జ్ఞానం. ఎవడు శ్రద్ధావంతుడో వాడికి జ్ఞానం అబ్బుతుంది. శ్రద్ధలేనివాడికి ఎంత చెప్పినా అతడు మనో వ్యాపకంలో వుంటాడు గాని బుద్ధియొక్క వివేకాన్ని వినియోగించడు. శ్రద్ధ కలిగినవాడు మనోవ్యాపకాన్నీ కాసేపు ప్రక్కనపెట్టి, గురువాక్యాన్ని పెద్దల వాక్యాన్ని కాసేపు శ్రద్ధతో వివేకంతో ఏకాగ్రతతో వింటాడు. ఇవన్నీ అవసరం అని చెప్తున్నాము. ఇవన్నీ ఎందుకింత వివరణగా చెప్తున్నాము? గురువు దగ్గరికి వచ్చే పద్ధతి ఏమిటి? మంచి వాక్యాలు, అనుభవ వాక్యాలు, మార్గదర్శక వాక్యాలు అవసరం అయితే నిన్ను తిట్టి కొట్టి దగ్గరుండి నడిపించే గురువు నీకు కావాలి. **“బుద్ధి చెప్పేవాడు గుద్దితేనేమయా విశ్వదాభిరామ వినురవేమ”** అన్నారు నిన్ను నువ్వు గురువుకి సమర్పించుకోవాలి .

గురువుగారూ, నన్ను తిట్టండి, కొట్టండి, చంపండి, ప్రాణాలు తీసేయండి. నాకు మాత్రం ఈ పాఠం కావాలి. మీరు నా సంగతి పూర్తిగా చూసేదాకా మిమ్మల్ని వదలను. పూర్తిగా నన్ను నేను మీకు అర్పణ చేసుకుంటున్నాను. ఈ శరీరాన్ని ఈ ప్రాణాన్ని ఈ మనసుని పూర్తిగా మీ పరం చేస్తున్నాను. మీరు ఏం చేసుకుంటారో చేసుకోండి అన్నట్లుగా తయారవాలి. అదీ శ్రద్ధ అంటే. శిష్యుడు అంటే గురువుచేత శిక్షింపబడటానికి తను మన ప్రాణాలని సమర్పించేవాడు. శిష్యా అనే శబ్దానికి అర్థం ఏమిటంటే, గురువుచేత తన ఆత్మ జ్ఞానం కొరకు తను మన ధనాన్ని అర్పణచేసి దానిని గురువు ఏ రకంగా అయినా చేసుకోనీ అని గురువుకి పూర్తి హక్కులు దఖలు చేసేవాడే శిష్యుడు. అప్పుడు శిష్యుడి దగ్గర వున్న ఏ సంపదనైనా సరే గురువు అడక్కుండానే తీసుకోవచ్చు. శిష్యుడు దానిని ఆనందంగానే భావించాలి తప్ప, నన్ను అడిగితే నేనిస్తాను, అందరూ ఇంతిస్తే దానికి పదింతలునేనిస్తాను, ఏదిచ్చినా నేను లెఖ్ఖపెట్టి ఇస్తాను, నేనంత ఇచ్చానని నాకు పేరు రాకపోతే ఇచ్చేస్తే ఏమి లాభం? ఇన్ని అనుకునే శిష్యుడు పనికిరాడు. సమర్పణ అయ్యాక, నీవేమీ లేవు అక్కడ. అన్నీ ఆయన ఇష్టానికి వదిలేయగలగాలి. అంతటి గురుశిష్య న్యాయంగా అంతటి అవినాభావ సంబంధంగా శిష్యుడు గురువు దగ్గరికి వెళ్ళాలి. శ్రద్ధ వల్లనే సత్కర్మానుష్ఠానము చేయగలరు. ఎందుకని? ఆహార నిద్ర భయ మైథునాని అనేది నీలో వుంది. అవి ఆటంకపరచకుండా చూచుకుంటూ ఆత్మ జ్ఞానానికి చేయవలసిన సత్కర్మలను చేయాలి.

సంసారాన్ని కొనసాగిస్తూ పునర్జన్మలలోకి తీసుకొనివెళ్ళే కర్మలని అవి మంచివయినా సరే సమాజానికి, కుటుంబానికి, వ్యక్తిగతంగా ధర్మం అయినప్పటికీ కూడా అది సంస్కారాలు పోగుచేసి మళ్ళీ పునర్జన్మలను తీసుకుంటుంది. కాబట్టి దానిని దుష్కర్మలనే అంటున్నాము. పునర్జన్మ హేతువైనవి అన్నీ కూడా దుష్కర్మలే. పునర్జన్మ బంధంనించి విడిపించి ఆత్మజ్ఞానానికి, ఆధ్యాత్మిక పయనాన్ని, సాధనని కొనసాగించే కర్మలన్నీ సత్కర్మలు. ఈ సత్కర్మలు ఎలా చేయాలీ? ఓ పనైదన్నట్టు కాదు. అనుష్ఠాన పద్ధతిలో చెయ్యాలి. ఇప్పుడు శివుణ్ణి జపం చేస్తున్నాం ఓం నమశ్శివాయ అని. ఇది సత్కర్మ. ఈ సత్కర్మ ఎట్లా చెయ్యాలీ? అనుష్ఠాన పద్ధతిలో చెయ్యాలి. ఉపాసనా పద్ధతిలో చెయ్యాలి. చిట్టచివరికి శివుడే నువ్వయ్యే ఫలితం రావాలి. ఈ అనుష్ఠాన ఫలితం ఏమిటంటే చివరికి శివుడే నువ్వు అవ్వాలి. కొంతమంది రామకోటి పుస్తకాలు వ్రాస్తారు. అది అనుష్ఠానంగా లేదు. అనుష్ఠానంగా కనక వుంటే ఆ రాముడే తానవుతాడు. అనుష్ఠానంగా వ్రాయకపోతే పుస్తకాలు వ్రాయడం వరకే గానీ రాముడు వేరు నేను వేరుగానే వుంటాము. సత్కర్మానుష్ఠానం వలన జ్ఞానం కుదురుతుంది. సత్కర్మలు అంటే మోక్షమార్గానికి సాధనా పద్ధతిలో పెద్దలు నిర్ణయించినవి వున్నాయి. శ్వాస మీద ధ్యాస కావచ్చు, గ్రంధి భేదనం కావచ్చు, బ్రహ్మ గ్రంధి, విష్ణు గ్రంధి, రుద్ర గ్రంధి భేదనం కావచ్చు, కుండలినీలో మూలాధారం నుంచి సహస్రారం వరకూ నడుపుచూ, మూల బంధంతోటి

మూలాధారం కంటే క్రిందికి దిగకుండా ఆపడం, ఉడ్యాన బంధంతోటి మణిపూరకానికంటె క్రిందికి దిగకుండా ఆపడం, జాలంధర బంధంతోటి విశుద్ధినుంచి క్రిందకి జారకుండా చేయడం, ఇలా బంధత్రయాన్ని వాడుకుంటూ, ఆజ్ఞా చక్రానికి సహస్రానికి పైకి తీసుకెళ్తూ, సహస్రారం దాకా తీసుకెళ్ళాలి. ఆజ్ఞా చక్రందాకా నీ సాధన అవుతుంది. కనుక పట్టుఉంటే సహస్రారానికి చేరతావు.

సాధనకి సాధనా ఫలితాలు కొంతవరకే వుంటాయి. సిద్ధించాలంటే ఆపైన గురుకృప వుండాలి. ఈ సత్కర్మలవల్ల, సత్సంగంవల్ల, గురూపదేశం మార్గం ఆచరించడంవల్ల జ్ఞానం కుదురుతుంది. కుదురును అన్న మాట చూడండి. కుదురు అంటే ఏమిటి? నీళ్ళు తీసుకెళ్ళి ఒక గుంటలో పెట్టావు. అటూఇటూ పోకుండా ఏం చేశావ్, చుట్టూ గట్టు పెద్దది చేశావ్. అప్పుడు నీళ్ళు కుదిరి వున్నాయి అందులో. గండిపడి బయటికి పోకుండా చూడాలి. కుదరటం అంటే ఏమిటి? సమంజసంగా, అనుకూలంగా, ప్రయోజనకరంగా, స్థిరంగా వుందటమే కుదురు. ఫలానావాడికి కుదురు లేదురా ఊరికే కదిలిపోతూ వుంటాడు. వాడి మనసు చంచలంగా వుంది, కుదురు లేదు అంటుంటాం. కుదురు అంటే నిశ్చలము స్థిరము. జ్ఞానమంటే ఏమిటి అసలు? "నేను నేనైన నేను" అనేది జ్ఞానము. "నేను నేనైన నేను" అనేటటువంటి స్వానుభవం లేకపోవడం అజ్ఞానం. నువ్వు కానిది ఇంకా ఏదో ఏదో అనుకోవడమంతా అజ్ఞానం, నువ్వు ఏది అయివున్నావో అదే నీవు అయి వుండటం జ్ఞానం. ఇప్పుడు జ్ఞానము కుదురును అంటే నువ్వు ఏది అయివున్నావో అది, ఆ జ్ఞానము నీకు వచ్చాక ఆ జ్ఞానం నిష్ఠ రూపంలో నిత్యంగా శాశ్వతంగా నిరంతరాయంగా వుండటాన్ని కుదిరిక అంటారు. ఆ జ్ఞానం నిష్ఠగా మారటమే జ్ఞానం యొక్క కుదిరిక. జ్ఞాన నిష్ఠ వల్లనే ముక్తి చేకూరుతుంది.

**మనసే హేతువు మనుజుని మనుగడకును బంధమునకు మాన్యత కెల్లన్ ।**
**మనసే ముక్తికి మూలము, మనసే దుఃఖంబు దెచ్చు, మైమరపించున్ ॥**

మళ్ళీ ఇంకో పాయింట్ కి వస్తున్నాం మనం. పశువు దగ్గరినించి మానవుడి దగ్గరికి వచ్చాము. మానవుడి దగ్గరి నించి మళ్ళీ ఏం చేస్తున్నాం, ఆ బుద్ధిని వినియోగించాలి అన్నా, ఆ బుద్ధిని మోక్ష మార్గంలో వినియోగించాలన్నా, మోక్షమార్గంలో వినియోగించాలంటే భక్తి కావాలన్నా – గురు భక్తి, దానిద్వారా సత్కర్మాచరణ కావాలన్నా, శ్రద్ధ కావాలన్నా, ఆ సత్కర్మ వల్ల జ్ఞానం రావాలన్నా, ఆ జ్ఞానం కుదిరికయ్యి నిష్ఠ కావాలన్నా, జ్ఞాన నిష్ఠతో మోక్షం కావాలన్నా – అంటే నీ లక్ష్యాన్ని సాధించడానికి మూడునాలుగు స్టెప్పుల్లో ఇక్కడ అందించడమయినది. పశువులో వున్నటువంటి సంస్కారముతో కూడినటువంటి మానవుడిని, ఆ సంస్కారాలనుండి విడుదల చేయడానికి, ఆత్మానుసారము జీవించుటకు అవసరమైన సంస్కారానికి అనుగుణమైనటువంటి ప్రవర్తన, నడక ఇంకొక పద్ధతిగా మార్చాలి. దీనినే బైబిల్‌లో మారు మనస్సు అన్నారు. **మారుమనస్సు** అంటే ఏమిటి పాత పద్ధతిని మానటం, కొత్త పద్ధతులని నియమించుకోవడం. పాత పద్ధతి పునర్జన్మ హేతువైనది త్యజించడం, మానేయటం. ఆ పద్ధతిలో మనం విచ్చలవిడిగా ఎలాగ అబద్ధాలు ఆడుతూ స్వార్థంతో పరులకు తలపులలో మాటలలో చేతలలో బాధ కలిగిస్తున్నామో, ఆ పద్ధతిని మాని ఇతరులకు సుఖ సంతోషాలు కలిగించడము. ఎవరివల్ల నీకు బాధ కలుగుతుంది అనుకుంటున్నావో అటువంటి బాధ నీవు ఇతరులకి చేయకుండా వుండటమనేది చేయాలి. కోరికలతో చేసేటటువంటి కర్మలు పునర్జన్మ హేతువు, నిష్కామకర్మ యోగంగా చేస్తే అది మోక్షహేతువు. ఇప్పుడు సత్కర్మలంటే ఏమిటి నిష్కామ కర్మయోగం.

సత్కర్మలంటే ఏమిటి? భక్తి యోగం. సత్కర్మలంటే ఏమిటి? సజ్జన సాంగత్యం. ఇప్పుడు సత్కర్మలంటే ఏమిటి? జపతపాదులు, ఉపాసనలు. ఇవన్నీ దేనితో చేయాలండి? ఈ మనసు పాత సంస్కారాలకి అనుగుణంగానే వుంటుంది. అనుగుణంగానే ప్రవర్తిస్తుంది. బుద్ధి చెప్పిన మాట వినదు. అంతరాత్మ చెప్పిన మాట వినదు. శ్రద్ధ భక్తి గురువు యెడల వుంటే వింటుందండి!

ఈ మనసే వినాలి. కాని ఈ మనసే పోవాలి. బుద్ధికి మనసుకి వున్న తేడాని విడగొట్టి చెప్తున్నారు ఇక్కడ. ఏమని? మనసే హేతువు మనుజుని మనుగడకు. మనుష్యులు పశుపక్ష్యాదుల యొక్క సంస్కారాలతో పేరుకి మానవ శరీరం అయినా, కుక్క యొక్క విశ్వాసము, నక్క యొక్క కుయుక్తి, వటవృక్షముయొక్క ఆక్రమణ, ఆవుయొక్క సాధుత్వము, పులి యొక్క క్రూరత్వము, ఏనుగు యొక్క నిశిత బుద్ధి, ఇలాగ పరిణామ దశలో మన దగ్గర ఏవైతే కొన్ని సంస్కారాలు గడ్డకట్టి వున్నాయో, మానవోపాధిలో కూడా అటువంటి స్వభావాలతో మానవులుండటం మనం చూస్తున్నాము. అందుకని అక్కడేం చెప్పామంటే మనసును ద్వంద్వాతీత స్థితికి తీసుకెళ్ళాలి. మనస్సే ద్వంద్వాల రూపంలో వుంది. ప్రియమోద ప్రమోదం సాధించడానికి స్వార్థంగా వుంది. క్రూరంగా

కూడా వుంది. ఇతరులని హింసించి అయినాసరే, తన ఆనందాన్ని పొందేలాగా స్వార్థపూరితంగా కూడా వుంది. ఈ వున్నదంతా ఏదయ్యా అంటే మనస్సే. సంస్కారాలతో కూడింది మనస్సే కనుక, మనసు యొక్క ప్రవర్తన గతములోని సంస్కారయుతంగా వుంటుంది. ప్రస్తుతం అలా వుంది. మార్చలేమా? మార్చగలం. బుద్ధి వేరు మనస్సు వేరు. కనుక బుద్ధిని మనసుని వేరు వేరుగా విడగొట్టుకుంటే, వివేకంతో కూడిన బుద్ధి జయించాలి, మనసు ఓడిపోవాలి. అందుకని మనసు గురించి కాసేపు చెప్పుకోవాలి మనం. మనసే హేతువు మనుజుని మనుగడకి – ఏ రకంగా మనుగడ చేయిస్తున్నాడు? పూర్వ జన్మ సంస్కారాలతో పశుపక్ష్యాదుల సంస్కారాలతో, స్వార్థంతో, నేను నాదితో, అహంకార మమకారాలతో మనుగడ చేస్తున్నాడు. చివరికి అదే బంధమయింది. అదే సంసారమయింది. మనసే ముక్తికి మూలం మళ్ళీ. ముక్తికి కూడా ఆ మనసే మళ్ళీ. ఎట్లా? మనస్సు మారుమనస్సు అయినప్పుడు. ఆ మనసు శ్రద్ధకల బుద్ధితో చేరిపోయినప్పుడు. మనసే దుఖంబు తెచ్చు మైమరిపించున్. మనసు ముక్తికీ కారణంగా వుంది, మనసు దుఖానికీ కారణంగా వుంది, మనసు మానవ జీవితానికి, మనుగడకీ కారణంగా వుంది, మనసే బంధముగా వున్నది. మనసే సంసారాన్ని తయారుచేసింది. ఇటువంటి మనసుని మనం ఏమిచెయ్యాలో చూద్దాం.

**మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయో** మనసున్నవాడే మానవుడని, మనిషని పిలవబడుతున్నాడు, అతని యొక్క మనస్సు అతను చేసే పనులనిబట్టి కర్మలనిబట్టి తను ఏర్పాటు చేసుకున్న భోగవస్తువులనుబట్టి సంసారాన్నిబట్టి తనకుతానే స్వయంకృతంగా బంధాన్ని కొనితెచ్చుకుంటున్నది. కాని ఆ బుద్ధిలో వున్నటువంటి విచక్షణా జ్ఞానం చేత ఆ బంధాన్ని పోగొట్టుకునేటటువంటి సాధన చేసుకుని ముక్తి కూడా పొందవచ్చు.

మనసేం చేస్తుందంటే తన వర్తమానంలో వున్న విచక్షణా జ్ఞానాన్ని మైమరపించి దుఃఖాన్ని తెస్తుంది. మనసుయొక్క గుణము ఏమిటంటే శోకము, మోహము. ఈ మనసు శరీరమే నేను అనే తాదాత్మ్యతతో వుండటంవల్ల శరీరానికి సంబంధించినటువంటి వ్యాధి, ఈ శరీరమనే పనిముట్టు ద్వారా కలిగేటటువంటి ఇంద్రియ భోగము, ఇవన్నీ మనసుకి చేరి శరీర లక్షణమైనటువంటి చావుపుట్టుకులు, వ్యాధి, బాధ, ముసలితనము, ప్రాణానికి సంబంధించిన ఆకలి దప్పులు, పూర్వ జన్మ సంస్కారాలు, సృష్టిలో పరిణామ దశలో పోగుచేసుకున్న సంస్కారాలనుబట్టి ఆకలి, నిద్రా, భయ, మైధునాలు, మనసుయొక్క ధర్మమైనటువంటి శోకమోహాలు, ఇటువంటివి చాలా వున్నాయి.

దేహానికి సంబంధించి చావుపుట్టుకలు, ప్రాణానికి సంబంధించి ఆకలిదప్పికలు, మనసుకి సంబంధించిన శోకమోహాలూ కలిపి మూడు రెళ్ళు ఆరు షడూర్ములు. వీటితోటి కొనసాగుతూ వున్నాడు. అయితే సాధన ఎలా చెయ్యాలి? సాధన అంటే ఏమిటి అసలు? అనుకోగానే చెయ్యలేకపోతే, ఒక గట్టి ప్రయత్నం మీద మాత్రం చెయ్యగలుగుతున్నాం. తేలిగ్గా తీసుకుంటే మనం మారము. ఒక విషయాన్ని పట్టుదలగా తీసుకుని మారాలి అనుకున్నప్పుడు మారతాం. మారాలి అనుకోవడం మొదటి ఎత్తు, మారటానికి చేసే ప్రయత్నం రెండవ ఎత్తు. ఎంత మారాలనుకున్నా మారలేకపోవడంతో దానికి గట్టి ప్రయత్నం చేయడం కూడా వుంటుంది. అటువంటి గట్టి ప్రయత్నమే సాధన. ఏ సాధన చెయ్యాలి?

**త్యజ దుర్జన సంసర్గం భజ సాధు సమాగమం । కరుపుణ్య మహోరాత్రం స్మరన్నిత్య మనిత్యతామ్ ।** సంసర్గము అంటే కూడి వుండటము, స్నేహం చేయడము, సంగత్వం చెందటము, వాడిని విడిచి వుండలేను అనే పద్ధతిగా అవినాభావ సంబంధముగా, పైగా తాదాత్మ్యత కూడా చెందివుండటం. ఇది సంసర్గం. దుర్జనులతో సంసర్గాన్ని త్యాగము చెయ్యాలి. కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు ఈర్ష్యా అసూయ దంభము దర్పము అహంకారము ఇవన్నీ కూడి ఈ పదమూడు రకాలుగా నున్నవే నీలోవున్న దుర్జనులు. ఆ దుర్జనులతో వున్న సంసర్గాన్ని, అరిషడ్వర్గముతో వున్నటువంటి సంసర్గాన్ని, సంగత్వాన్ని, తాదాత్మ్యతని, త్యజించాలి, త్యాగం చెయ్యాలి, విడిచి పెట్టాలి, వదులుకోవాలి, విసర్జించాలి.

భజ అంటే సంగత్వాన్ని పెంచుకోవాలి, కలుపుకోవాలి, స్నేహం చెయ్యాలి. ఎవరితో? భగవంతునితో! ఏకత్వాన్ని పొందటానికి చేసేటటువంటి క్రియ–భజ అంటే ఐక్యం అవ్వడం. భజన అంటే ఐక్యం అయ్యే విధం. విభజన అంటే విడిపోవడము. భజన అంటే కలపడం. భజన నుండి వచ్చిందే భక్తి. ఎవరిని భక్తితో సేవించాలి? ఎవరితో సంపర్కం పెట్టుకోవాలి. ఎవరితో సంసర్గం చెయ్యాలి? ఎవరితో సాంగత్యం పెట్టుకోవాలి అంటే సాధు సమాగమం. సాధువులతో సంబంధం పెట్టుకోవాలి. ఎవరీ సాధు పురుషులు? సహజంగా సాధుత్వం వున్నవాళ్ళు ఎవరు? అరిషడ్వర్గం లేని వాళ్ళు, రాగద్వేషాలు లేనివాళ్ళు,

పక్షపాత బుద్ధిలేని వాళ్ళు, శరీరానుసారమైనవాటిని పట్టించుకోనివాళ్ళు **"సర్వే జనా సుఖినో భవంతు"** అనేవాళ్ళు సాధుపురుషులు. అటువంటి సాధు పురుషులతో సమాగమం చెందాలి. సజ్జన సాంగత్యం చేయాలి. సాధువులతోటి నిరంతరము సమయాన్ని గడపాలి. అటువంటి సాధువు గురువైతే నువ్వు శిష్యుడవైతే మరీ మంచిది. అటువంటి సాధువు గురువు కాకుండా కేవలం అనుభవజ్ఞుడైన పెద్దలు, అటువంటి పెద్దలైన సాధువుల దగ్గర కూడా ఆయననుంచి ముత్యాలలాంటి పదాలు ఎప్పుడో ఒకప్పుడు నోటి వెంబడి వసాయి. సమయము సందర్భాన్ని బట్టి మనిషినిబట్టి, అవసరాన్నిబట్టి దానికోసం వేచి వుండి ఆ మాటలని ఆ రత్నాలను ఏరుకోవాలి. ఆప్త వాక్యాలు వస్తాయి. దానితో నువ్వు సాధన చేసుకోవాలి. ఇక్కడ అనుభవం అంటే మనం పరిపూర్ణులైన వారినే అనుభవజ్ఞులు అంటున్నాం. మోక్షము పొంది కూడా తిరిగి మళ్ళీ జీవుడయ్యే అవకాశం వున్నవాడిని పరిపూర్ణుడని అనము. వాడిని పూర్ణుడు అంటాము. ఎవరయ్యా పూర్ణుడు అంటే ఆత్మానుభవం కలిగినవారు పూర్ణులు. సచ్చిదానంద బ్రహ్మని తటస్థ లక్షణంగా వున్న బ్రహ్మని అనుభవంగా గ్రహించిన వాళ్ళు బ్రహ్మజ్ఞానులు, పరిపూర్ణులంటే తత్త్వమసి వాక్యాన్నిబట్టి నిర్ణయం చేసుకుని బ్రహ్మమొక్కటే పరబ్రహ్మ మొక్కటే అని అన్ని కాలాలలో వెనకటి కాలం దగ్గరి నించి భవిష్యత్తు కాలంలో కూడా ఎప్పుడూ బ్రహ్మగానే వుంటాడు అనేదానిని, దాన్ని వివరంగా తెలుసుకోవడాన్ని పరిపూర్ణ బోధ అంటారు. ఆ విధముగా అద్వైతము సిద్ధించినవారు పరిపూర్ణులు.

పెద్దలు, గురువులు, సాధువులు దగ్గర మనం సన్నిహితంగా ఉంటూ సేవించడం వుండాలి. అరిషడ్వర్గము అనేటటువంటి దుర్జనుని యొక్క సంగత్వాన్ని దూరీకరించాలి. శమాది షట్క సంపత్తి వున్న సాధుజనులు, పరిపూర్ణ స్వానుభవ అనుభవజ్ఞులు ఎవరైతే వున్నారో వారి దగ్గరికి చేరాలి. అలా చేరాలంటే ముందుగా మనము కూడా శమాది షట్క సంపత్తిని పొంది, అరిషడ్వర్గాన్ని, రాగద్వేషాలని, పక్షపాతబుద్ధిని ద్వంద్వభూయిష్టమైనటువంటి విమర్శ ఇవన్నీ కూడా విసర్జించాలి. అప్పుడు పరిపూర్ణమైన సాధుపురుషులను సేవించాలి. సేవించుటలో స్థూల పద్ధతి సూక్ష్మ పద్ధతి ఐక్యతా సిద్ది పొందేటటువంటి పద్ధతి. ఈ మూడు పద్ధతులు వున్నాయి. స్థూల పద్ధతి అంటే అంగ శుశ్రూష అంటే కాళ్ళు పట్టడం. సూక్ష్మ పద్ధతి అంటే ఆ గురువుయొక్క పాదములమీద మనసుని బుద్ధిని కేంద్రీకరించి శరణాగతి పొందటం. స్థూలంగా బాహ్యంగా సేవ చేసినా చేయకపోయినా లోపల శరణాగతి భావము అంకిత భావము వుండటం అనేది సూక్ష్మ స్థితి. సూక్ష్మాతి సూక్ష్మ స్థితి ఏమిటంటే ఆ గురువుతో అన్ని విధాలా ఐక్యతా సిద్ధి పొందటము.

ఈ మూడో స్థితిలో శిష్యుడు లేకుండాపోతాడు. గురుసేవ సజ్జన సేవ చేసినప్పుడు, ఆ చేసినటువంటి భక్తుడు గాని శిష్యుడు గాని తనపరంగా తాను అనేవాడు లేనివాడవుతాడు. ఆ విధంగా సేవించి, సదా నిరంతరాయంగా, తెంపులేకుండా, గుణాతీతంగా ప్రవర్తించాలి. అంటే ఇక్కడ సాధన అంటున్నాం కాబట్టి గుణాతీత స్థితి రావాలి అంటే కొంత టైం పడుతుంది. కాని పట్టుదలతో చెయ్యాలి. సాధ్యమైనప్పుడు అది పెద్ద సాధన అనిపించుకోదు. అసాధ్యమైనదానిని సాధించుకోవడమే సాధన. గుణాతీతునిగా ఉండి చెయ్యాలి. అంటే సత్వగుణం కూడా వదిలెయ్యాలి. సత్వగుణం వదిలేటటువంటి సాధన ఏదీ? యశస్సు, కీర్తి కాంక్ష, పేరు ప్రతిష్ఠ లేకుండా, ఒకవేళ అవే వస్తే ఉదాసీనంగా ఉండాలి. తమో రజో గుణాలవల్ల సాధకుడికే నష్టం. ఇతరులకీ నష్టమే. సత్వ గుణంవల్ల ఇతరులకి నష్టం లేదు గాని తనకి మాత్రం నష్టమే. ఎందుకంటే అవి బంగారపు సంకెళ్ళు. రజో గుణం వెండి సంకెళ్ళు, తమో గుణం ఇనుప సంకెళ్ళు. సత్వగుణంలో వున్నప్పటికీ కూడా బంధం పోలేదు. పూర్తిగా బంధ రహితమే ముక్తి, మోక్షం. కనుక బంగారు సంకెళ్ళు కూడా పోతేనే విముక్తి. సత్వగుణం కూడా పోవడం అంటే గుణాతీతంగా ఉండడము. ప్రతిసారీ ఆ లక్ష్యాన్ని మర్చిపోకుండా ముందుకెళ్ళాలి.

క్రింది నించి మూడుశరీరాల గురించి చెప్పుకున్నప్పటికీ, పంచభూతాల గురించి చెప్పుకున్నప్పటికీ, మన దృష్టి మన లక్ష్యము ఎప్పుడూ కూడా గుణాతీతమైనటువంటి పరబ్రహ్మమీద, పూర్ణత్వము మీద, పరిపూర్ణమైనటువంటి అచల పరిపూర్ణమైనటువంటి పరబ్రహ్మము మీద ఉండాలి. గురి గుర్తు వుండాలి. గురేమో ఆ పరిపూర్ణం మీద, గుర్తేమో ఎరుక, మార్గము. అలాగ ప్రవర్తించి, అలాగ సాధనచేసి, అటువంటి పుణ్య బలముతో నిత్యుడవుకమ్ము. పుణ్యమంటే ఏమిటి, పాపమంటే ఏమిటి? పునర్జన్మ హేతువైనవన్నీ కూడా దుష్కర్మలు, పాపము. జన్మరాహిత్యానికి, విముక్తికి, అచల పరిపూర్ణ లక్ష్యముగా చేసేటటువంటి సత్కర్మాచరణ గాని సాధన గాని వీటన్నిటికీ కూడా దీనివల్ల వచ్చే ఫలితము పుణ్యము. ఇక్కడ పుణ్యమంటే అర్థము సత్కర్మాచరణ యొక్క ఫలితముగా మోక్షము, విడుదల. మామూలుగా పుణ్యము అంటే యజ్ఞయాగాదులతోటి, దాన

ధర్మాలతోటి చేసేటటువంటి పుణ్యము. దీనివలన మరొక జన్మలో సుఖం గాని స్వర్గలోక ప్రాప్తి గాని లభిస్తుంది. ఇహ లోకంలో గాని, ఆముష్మిక లోకంలో గాని, ఆముత్రమందు గాని, స్వర్గమందు గాని సుఖం లభిస్తుంది. ఆ పుణ్యం చెప్పట్లేదు ఇక్కడ. ఇక్కడ సత్కర్మాచరణ వలన వచ్చే పుణ్యమంటే అర్థం జన్మరాహిత్యమే, మోక్షమే. చెరువులు తవ్వించినా, చెట్లు నాటినా, సత్రాలు కట్టించినా, అన్నదానాలు చేసినా, ఈ పుణ్య కర్మలు కూడా పునర్జన్మ హేతువులే. పాపమంటే పునర్జనమే. కారణ శరీరం కొనసాగడమే పాపము. అందుకే బైబిల్ చెప్తుంది **"అందరూ పాపులే"** అని. అంటే విమోచన లేదని అర్థము.

పాపపుణ్యాలు రెండూ కూడా పునర్జన్మకి హేతువు కాబట్టి అందరూ పాపులే. మారు మనసు పొంది సత్కర్మాచరణ చేసి, లక్ష్యం కోసం ప్రయాణం చేసేవాళ్ళు ఎవరైతే వున్నారో వాళ్ళు చేసేటటువంటి సత్కర్మలన్నీ పుణ్యాలు అని అర్థము. అయితే పుణ్యకర్మల ఫలితాలిచ్చేటటువంటి బలముతో అరిషడ్వర్గాలు మొదలైన వాటిని జయిస్తావు. జయిస్తే ఏమవుతుంది? శాశ్వత బ్రహ్మ అవుతావు. త్యజదుర్జన సంసర్గం అంటే అరిషడ్వర్గాన్ని విసర్జించడం, భజ సాధుసమాగమం అంటే సాధు పురుషులతో, గురువులతో పెద్దలతో సమాగమం చెందటం, అంటే అర్షడ్వర్గాలను జయించడం కోసం శమాదిషట్క సమత్తి అనే సాధన చతుష్టయ సంపత్తిని పొందటం. ఇన్ని రకాలుగా చేసి, పరిపూర్ణులైన సాధుజనాలను సేవించి, ఈ సేవలో నిన్ను నీవు కోల్పోయే విధంగా, నిన్ను నీవు మరచిపోయేలాగా అనగా నేనును మరచడాన్ని మైమరపించుట అన్నారు. మైమరచుట అంటే నేను ను మరచుట. తన్ను తాను మరచిపోవాలి. పరవశత్వం కావాలి. అనగా తన్నుతాను మరచి, పరమైనటువంటి దానితో తాదాత్మ్యం చెందటం "పరవశం". పరవశత్వం. కురుపుణ్యం అహోరాత్రం అంటే సత్కార్మాచరణను సాధనగా రేయింబవళ్ళు చేయాలి. నిత్యానిత్య వివేకంలో, తీవ్ర మోక్షేచ్ఛతో చేయాలి.

**దేహము పాంచ భౌతికము, దేహము కూలగదప్పు దెన్నడు ।**
**దేహి నిరామయుండు, గణుతింపగ దేహికి చావుపుట్టుకల్ ।**
**మోహ నిబంధ బంధనల ముద్రలు లేవు, నిజంబు, జూడ ఆ**
**దేహియె దేవ దేవుడు, మదిన్ తలపోయగ ఆత్మ రూపుడౌ ॥** –బాబా

ఈ దేహమేమో పంచభూతాలతో తయారయింది. పిండాండ పంచీకరణ దగ్గరికి వెళ్తే ఆశ, క్రోధము, కామము, మోహము, భయము ఇలాంటివన్నీ నీలో ఆకాశ తత్వంగా వున్నాయి. ఈ అవయవాల యొక్క మనసుయొక్క బుద్ధి యొక్క ఇంద్రియాలయొక్క ప్రాణముయొక్క చలనాలు కదలికలు అన్నీకూడా నీలో వాయు రూపంలో వున్నాయి. ఆకలి, దప్పిక, సుషుప్తి, నిద్ర, సోమరితనము, సంగత్వము అగ్నితత్వముగా వున్నాయి. జల రూపములో రక్తము, శుక్లము, శోణితము, శ్లేష్మము ఇలాంటివన్నీ ఉన్నాయి. పృథ్వీతత్వములో మాంసము, ఎముకలు, నరములు ఉన్నాయి. కనుక మన దేహము పంచభూతాల యొక్క అంశతో తయారయింది. అంశ అంటే ఏమీ లేదు – మూలపదార్థ రూపంలో వుండకుండా, మరొక రూపంలో దానిని అంశ అంటారు. మూలపదార్థమైన మట్టిలాగా శరీరము వుండదు గాని, మట్టితో తయారైన శరీరమే ఇది. పార్థివ శరీరం అంటారు. అంటే శరీరములో పృథ్వీతత్వము నిండుగా ఎక్కువగా, దండిగా వున్నది కాబట్టి ఇది పార్థివ శరీరం. ప్రాణం పోయిన తరువాత శరీరాన్ని పార్థివ శరీరం అంటాము, మట్టిగావున్న శరీరం తిరిగి మట్టిలో కలసిపోవడానికి సంబంధించి. అర్జునిని పార్థా అన్నప్పుడు మానవ శరీరం అని అర్థము. అయినా మిగతా నాలుగు భూతాలు వున్నా, మట్టిపాళ్ళు ఎక్కువగా వున్నది కాబట్టి పార్థివ శరీరం అంటున్నారు. అగ్నియే శరీరంగా వున్నవాళ్ళు సూర్యమండలంలో వున్నారు. జలమే శరీరంగా వున్నవాళ్ళు తోకచుక్కలో వున్నారు. వాయువే శరీరంగా వున్నవాళ్ళు గంధర్వులు. వాళ్ళు వాయులోకంలో వున్నారు. అట్లా పంచభూతాలలో ఏదో ఒకటి ప్రధానంగా శరీరాలు ఉంటాయి. పంచభూతాలు పంచభూతాలుగా కనబడకుండా రక్తమాంసాలుగా కనబడుతున్నాయి అంటే ఈ రక్తమాంసాలు పంచభూతాల యొక్క సమవాయి. సమవాయి అంటే అదే తత్వము మరొక రూపంలో కనబడటాన్ని సమవాయి అంటారు. ఇటువంటి సమవాయిగా వున్నటువంటి దేహము కూలిపోగా, పడిపోగా, లేకపోగా, విడిపోగా, త్యజించబడగా, విసర్జించబడగా ఇందులో వున్న దేహి ఏమయ్యాడు? అజ్ఞాని దేహముచేత తాను బంధితుడిగా వున్నాడని అనుకుంటాడు. కాని దేహము ఎప్పుడైతే రాలిపోయిందో అందులో వున్న దేహి అపరిమితుడై నిరామయుడై వున్నాడు.

ఈ దేహి అనేటటువంటివాడికి ఆకాశతత్వములో వున్నటువంటి మోహము, ఆశ, భయములాంటివి గాని, వాయుతత్వములో వున్నటువంటి చలనాలు గాని, అగ్నితత్వములో వున్నటువంటి ఆకలి దప్పికలు గాని, జలతత్వములో వున్నటువంటి రక్తము, చెమటపట్టడం, శుక్ల శోణితాలు స్రవించటంలాంటివి గాని, ఈ ఆత్మకి లేవు. దేహియే ఆత్మ. ఆత్మకి ఈ లక్షణాలు లేవు. దేహియే దేవదేవుడు. ముద్రలు అన్నాడు. బంధాల ముద్రలు అంటే సంస్కారాలు. సంస్కారాలు, వాసనలు ముద్రించబడ్డాయి. అవి దేహికి లేవు, దేహానికీ లేవు, మధ్యలో ఎవరికున్నాయి? దేహమే నేననేటటువంటి అజ్ఞానంగా వున్నటువంటి 'నేను' అనేవాడికి చిదాభాసుడికి వున్నాయి అవన్నీ. జడమనే దేహానికి బంధ మోక్షాలు లేవు. దేహి అనేటటువంటి ఆత్మకి బంధ మోక్షాలు లేవు. మరి బంధమోక్షాలు ఎవరికున్నాయి? మనసే మనుజుని మనుగడకును బంధమునకును మాన్యతకును ముక్తికి దుఃఖానికి అన్నిటికీ మనసే మూలం అన్నారు. కనుక ఈ మనసే మాయ. ఈ మనసే మూలం. ఈ మనసువల్ల తోచిన చిదాభాసుడే అసత్య నేను. ఈ అసత్య నేనుకే బంధము. మనసునుండి వేరుపడినటువంటి "నేనే" ముక్తి. మనసునుండి విడిపడటం అంటే మాయ నుంచి, అవిద్య నుంచి విడిపడటమే. అలా విడిపడినవాడు ముక్తుడే.

కాబట్టి సాధన యందు మనసు పాల్గొనాలి. బుద్ధి అజమాయిషీ చేస్తుంది, పర్యవేక్షణ చేస్తుంది. సాధన చేసేది మనస్సే. ఏ సాధన చెయ్యాలి? మనసే చివరికి తానే లేకుండా పోయే సాధన చెయ్యాలి. చేస్తే ఏమయింది? ఆకాశంలో ఒక కుండ పెడితే ఏమయింది? కుండ లోపల ఆకాశం, కుండ వెలుపల ఆకాశం వుంది. కుండ పగిలిపోతే ఏముంది? అంతటా ఆకాశమే వుంది. కుండ వున్నప్పుడు కుండ లోపల వెలుపల అన్న విభాగము కుండ కారణంగా వచ్చింది తప్ప నిజానికి ఆకాశమునకు లోపల వెలుపల అన్న విభాగములు లేవు. అలాగే ఇక్కడ దేహం గనక పడిపోతే రాలిపోతే కుండ పగిలినట్లుగా పగిలిపోతే ఘటాకాశం ఎలా మహాకాశం అయిందో ఇందులో వున్నటువంటి దేహి నిరామయుడు అవుతాడు. ఈ నిరామయ అనే శబ్దం ఆత్మ లక్షణం. కనుక దేహియే ఆత్మ. ఆత్మకి చావు పుట్టుకలు లేవు కనుక ఇందులో వున్న దేహికి చావుపుట్టుకలు లేవు. ఇప్పుడు దేహి ఏ పేరుతో ప్రతీతి అవుతున్నాడు? **"నేను నేను"** అనే పేరుతో ఈ దేహి ప్రతీతి అవుతున్నాడు. ఈ **"నేను"** అజ్ఞానంలో వున్నప్పుడు బంధం వుంది ఈ **"నేను"** జ్ఞానం అయినప్పుడు మోక్షం. నిజానికి దేహి అనేది ఆత్మే. ఎక్కడ పొరపాటు జరుగుతోంది? దేహి అనేటటువంటి నేను ఆత్మను అనేటటువంటి జ్ఞానం పొందినప్పుడు విడుదలవుతున్నాడు. కాని ఈ దేహిగా "దేహి నేను" అని ప్రకటించబడ్డచోట, ఆ **"నేను"** "శరీరమే నేను" అన్నప్పుడు అది బంధము అవుతుంది. అనుకోవడంలోనే బంధం వుంది, అనుకోవడంలోనే మోక్షం వుంది. **శరీరం నేను అనుకోవడంలో బంధం వుంది ఆత్మ నేను అనుకోవడంలో మోక్షం వుంది. యద్భావం తద్భవతి**. కనుక ఈ **"నేను"**నే పరిణామం చెయ్యాలి.

నేను దేనికి లోబడిపోయాడు? మనసుకి లోబడిపోయాడు. మనస్సంటే ఏమిటి– దుర్జనులతో కూడినటువంటి అరిషడ్వర్గాలతో రాగద్వేషాలతో ద్వంద్వాలతో కూడుకున్నటువంటిది మనస్సు. కనుక అటువంటి మనస్సును దుర్జన సాంగత్యం నుంచి సజ్జన సాంగత్యానికి మార్చాలి. మార్చాలంటే సాధన చెయ్యాలి. సాధన చెయ్యాలంటే శమాది షట్క సంపత్తి ముందు సంపాదించాలి. అప్పుడే నీ సాధన. మోహ నిబంధ బంధనలు ఇది ఇట్టిదే, అది అట్టిదే అనేటటువంటి సంకెళ్ళు నీకు లేవు. అనగా దేహికి లేవు. ఇది నిజము. చూడ ఆ దేహియే దేవదేవుడు ఒకసారి విమర్శించి చూస్తే ఆ దేహి అనేవాడు, ఆత్మ, పరమాత్మ ఒక్కడే. దేవదేవుడే పరమాత్మ. ఆ దేవదేవుడు పరమాత్మ ఆత్మ ఒక్కడే కనుక ఆ దేహియే దేవదేవుడు. మదిన్ తలపోయగ ఆత్మరూపుడౌ – నీ మీద ఆపాదించుకుంటే ఏమైంది? నీలో వున్నటువంటి ఆత్మరూపమే, ఆ దేవ దేవుడే, ఆ పరమాత్మే అంతా ఒక్కటే. ఇదే అద్వైతము.

**బ్రహ్మమందు మీరు, మీలోన బ్రహ్మంబు, మీరె బ్రహ్మ మీరెయయ్యు ।**
**బ్రహ్మమయులు మీరు, బ్రహ్మమగుదురు, కాని మోహ వశత కానరైరి ॥** –బాబా

మీలోన బ్రహ్మంబు– మీ లోపల ఆత్మ అనే పేరుతో బ్రహ్మమున్నది. మీరే బ్రహ్మ. కుండయొక్క వెలుపల లోపల వున్నటువంటి బ్రహ్మ మీరే. బ్రహ్మ మీరే అయివుండీ అంతా బ్రహ్మమే నిండి వుంటే, బ్రహ్మమే ఆమయమై యుంటే మీరే ఆ విధంగా బ్రహ్మమయులై, బ్రహ్మ అయి వున్నారు. కాని మోహవశత శరీరం మీద, ప్రపంచం మీద, ఇంద్రియభోగం మీద పూర్వ జన్మ సంస్కారాలు నడిపించేటటువంటి పద్ధతిలో అజ్ఞానంలో ఏవైతే ఆ సంస్కారాలు అన్నీ ఏర్పడి ఆ పద్ధతి నీకు విక్షేపమయిందో ఆ పద్ధతిని విడిచిపెట్టక, ఆ పద్ధతిమీదే వ్యామోహంతో సత్యమును తెలుసుకోలేకపోతున్నారు. అనేక జన్మలలో పెళ్ళి చేసుకుని,

సంసారం, పిల్లల్ని కని, పెద్దచేసి అయ్యో నా బాధ్యతలు అయిపోయాయనో అవలేదనో అనుకుంటూ మరణించి, మళ్ళీ పుట్టి మళ్ళీ సంసారం – ఇలా తిరుగుతున్నాము. ఇది మోహం అంటే. అటువంటి మోహానికి వశులై వుండటంవల్ల మీరు బ్రహ్మమే అనే సంగతి కానరైరి. ఈ మోహకారణంగా మీరే బ్రహ్మమయ్యుయూ, బ్రహ్మమయులుగా వున్నటువంటి మీరు బ్రహ్మమయ్యేవుండి కూడా, ఈ శరీర ఈ లోక సంసార అజ్ఞాన సంబంధాన్ని విడిచిపెట్టలేక అటువంటి మోహంలో చిక్కుకొని మీరు బ్రహ్మ కాదు అనుకుంటున్నారు, మీరు బద్ధులు అనుకొంటున్నారు, మీకు మోక్షం కావాలి అనుకుంటున్నారు. మోక్షం వచ్చేదేంటి? మీరు బద్ధులు అనేటటువంటి అజ్ఞానం పోతే చాలు. మీరు బ్రహ్మమే అయివున్నారు. బ్రహ్మమయులు మీరు. అట్లాగే బ్రహ్మమందు మీరంతా వున్నారు. నశించే శరీరాలు మీరు కాదు.

మీలోన బ్రహ్మంబు– అన్ని కుండలలో వున్నటువంటి ఖాళీ కూడా ఆ ఆకాశమే అన్నట్లు మీలోను బ్రహమున్నాడు. మీరే బ్రహ్మము. ఇప్పుడు కుండ నేను అనుకోకుండా ఏమనుకోవాలి? కుండ లోపల వెలుపల వున్న ఆకాశం నేననుకున్నప్పుడు లోపల ఆకాశానికి బయట ఆకాశానికి బేధం లేదుగా! అటువంటి అబేధ స్థితిలో మీరే బ్రహ్మ. అఖండముగా అవిభాజ్యముగా వున్న అసంగముగా వున్న ఆకాశంవలె లోపలా బ్రహ్మమే. వెలుపలా బ్రహ్మమే. బ్రహ్మ లేనిచోటు లేదు. అంతా బ్రహ్మ మయమే. శరీరం మిథ్య గనుక బ్రహ్మ కంటే వేరే ఏమీ లేదు. అట్టి బ్రహ్మము మీరే కదా! అజ్ఞానముచేత కనిపెట్టరెందుకు? – ఇది తెలుసుకొని తరించండి.

## సృష్టి వివరము

**సీ॥ ఆత్మయందున నేకమాకాశముదయించె। నాకాశమద నిలంబు బుట్టె।**
**ననిలంబు వల్లను నగ్నిహోత్రుండు బుట్టె। నగ్నిహోత్రము వలన నప్పుబుట్టె।**
**నప్పువల్ల మహియవనీ స్థలియు బుట్టె। నవనియందోషధు లమరబుట్టె।**
**నోషధులం దన నొనరనన్నము బుట్టె। నన్నమందున నరులాది సకల।**
**జంతుజాలంబు లాయె। నీ జగయుగంబు లాయె నీ రీతి పరమాత్మ మాయవలన।**
**రమ్యగుణధామ భద్రాద్రి రామ పరశురామ। నరసింహ్మ దాస సంరక్షితాహ్వా॥**

ఓ ప్రక్కన జగత్తు కూడా బ్రహ్మమే అంటున్నాము, ఓ ప్రక్కన జగత్తు వేరు బ్రహ్మము వేరు అంటున్నాము. ఒక ప్రక్క తన్మాత్ర సృష్టి పంచభూతాలు కూడా బ్రహ్మమే అంటున్నాము. ఒక ప్రక్క పంచభూతల సృష్టిగా వున్నది దేహమని శరీరమని అందులో వున్న దేహి ఆత్మ అని, పరమాత్మ అని అంటున్నాము. సమయ సందర్భాన్నిబట్టి బోధనిబట్టి మీరు భ్రాంతిలో ఎంతలోతు కూరుకున్నారో దానినిబట్టి బోధ వుంటుంది. ఇది ఉపాయంగా మీకు అవగాహన అవడానికి, మీకు ఊహకి అందటానికే ఈ బోధ ఈ మాదిరిగా వుంది. ఈ మాదిరిగా బ్రహ్మ నిర్ణయాన్ని చేసినప్పుడు అంతవరకే ఆ నిర్ణయమే సత్యమని ఒక మతాన్ని స్థాపించడమనేది కుదరదు. అందుకే మతపద్ధతిగా కాకుండా సిద్ధాంత పద్ధతిగా వెళ్ళాలి మనం. అన్నమయ కోశానికి ఆత్మ ప్రాణం. ప్రాణమయకోశానికి ఆత్మ మనస్సు. మనోమయకోశానికి ఆత్మ బుద్ధి. విజ్ఞానమయ కోశానికి ఆత్మ ఆనందం. ఆనందో బ్రహ్మ అన్నప్పుడు అన్నమయకోశానికి ఆత్మ ప్రాణం అంటే ప్రాణమే ఆత్మ అంటే ఎట్లా కుదురుతుంది? మరల రెండో వాక్యం చూడాలి కదా! ఆ ప్రాణమే ఆత్మ అని ఏదైతే వుందో అది కూడా ప్రాణమయ కోశం అయింది. ఆ కోశంలో వున్న ఆత్మ మనస్సయింది. మళ్ళీ విచారిస్తే ఏమైందీ? మనో వ్యాపారమంతా మనోమయకోశం అయింది. ఆ కోశంలో వున్న ఆత్మ బుద్ధి అయింది. బుద్ధే ఆత్మ అంటే ఎట్లా కుదురుతుంది? ఆ బుద్ధి కూడా వ్యాపకమై విషయాలతో కూడి విషయాలని నిర్ణయించుకుంటూ వున్నది. బహిర్ముఖమై బాహ్య విషయాల పరంగా వున్నది. బుద్ధి కూడా బాహ్య విషయాలతో తాదాత్మ్యగా వున్నది. కాబట్టి బుద్ధి అజ్ఞానంలో వున్నది. బుద్ధి అజ్ఞానంలో వుంటే దానికి సుఖదుఖాలు ప్రియమోదప్రమోదం, అప్రియం, బాధలు అన్నీ వుంటాయి. లేకుండా ఎట్లా వుంటాయి?

మరి ఆత్మ లక్షణం విజ్ఞానమయ కోశంలో లేదుగా. కాబట్టి విజ్ఞానం ఆత్మ కాదు. విజ్ఞానమయం కూడా ఒక కోశమే. ఆ కోశం మధ్యలో ఒక ఆనందం అనేది వుంది. ఈ ఆనందం కోశం కాదు ఇది బ్రహ్మమే అన్నాము. పైబోధకి వచ్చేసరికి ఆనందమయం కూడా కోశమే, అయితే ఆ కోశం ఆవల బ్రహ్మ వున్నాడు అన్నాము. పరమాత్మ వున్నాడు అన్నాం. మళ్ళా అక్కడికి వెళ్ళాక ఆత్మ పరమాత్మ ఒక్కటే అంటే ఆత్మ వరకు పరమాత్మ వరకు అక్కడ సరిపోయింది. పరబ్రహ్మ నిర్ణయానికి

వెళ్ళేసరికి ఏమైంది? ఆ పరమాత్మ హిరణ్యరూపంలో సర్వత్రా వ్యాపించి ప్రకాశిస్తున్నాడు. కాబట్టి ఆ ప్రకాశ రూపమే హిరణ్మయ కోశం. ఈ హిరణ్మయ ప్రకాశం ఎక్కడుంది? ఒక జ్యోతినుండి ఒక ప్రకాశం వచ్చినట్లుగా – జ్యోతి వేరు జ్యోతి యొక్క ప్రకాశం వేరుగా వున్నట్లుగా – చంద్రుడు వేరు చంద్రుడు యొక్క వెన్నెల వేరుగా వున్నట్లుగా, జ్యోతి వేరు జ్యోతియొక్క ప్రకాశము వేరు. ఆ ప్రకాశము ఏ ఆవరణలో వ్యాపించిందో అది హిరణ్మయ కోశం. కనుక హిరణ్మయ కోశంలో కూడా ఆవరణ వుంది. నిరావరణమందు ప్రకాశము లేదు. స్వయంజ్యోతి పరంజ్యోతి అనేటటువంటిది స్వప్రకాశము స్వయంప్రభ అనేటటువంటిది పరబ్రహ్మ. కనుక ఇక్కడ హిరణ్మయ కోశం కూడా దాటితే పరబ్రహ్మ జ్యోతి స్వరూపంగా వున్నది. ఇలాగ విచారణలో అంచలంచెలుగా భ్రాంతి రహితం చెయ్యడం కోసం భ్రాంతిలో వున్న పదార్థాలు కాసేపు నిజమనుకొని దానికంటే లోపల ఇంకోటి వుంది అది నిజమని మళ్ళీ ఇది కాదని, దానికంటే లోపల ఇంకోటి వుందని అదే నిజమని మళ్ళీ ఇది కాదని, ఇట్లా ఇది కాదు ఇది కాదు ఇది కాదు అని, సత్యాన్ని అన్వేషిస్తూ ప్రయాణం చేస్తున్నాము.

ఎంత దట్టంగా భ్రాంతి వుందో అన్ని ఆవరణలుగా విభజన చేశాం. అయిదు ఆవరణలుగా విభజన చేస్తే పంచకోశాలు. ఆరు ఆవరణలుగా విభజన చేస్తే షట్ కోశాలు. ఏడు ఆవరణలుగా విభజన చేస్తే, సప్తావరణలు. సప్తావరణలు దాటితేనే నిరావరణం. ఏమిటా సప్తావరణలు? సమయం సందర్భం వచ్చినప్పుడు ఇక్కడ లేకపోయినా కొన్ని చెప్తూ వుంటాము. మీ బుద్ధిలోకి ఎక్కించుకుంటారనే. లేక ఇంతకుముందు ఎక్కించుకున్న దాంట్లో పొరపాట్లు ఏమైనా వుంటే సరిచేసుకుంటారని. పంచకోశాలంటే అన్నమయ కోశము, ప్రాణమయ కోశము, మనోమయకోశము, విజ్ఞానమయ కోశము, ఆనందమయ కోశము. షట్ కోశాలంటే ఇంకో హిరణ్మయ కోశము పెరుగుతుంది. సప్తావరణలు అంటే అజ్ఞానము, ఆవరణ, విక్షేపము, పరోక్షము, అపరోక్షము, దుఃఖ నివృత్తి, ఆనంద వాప్తి. బ్రహ్మ ఆనందస్వరూపం అయితే ఆనందం రావడం ఏమిటీ? ఆవరణ పోయింది. కాబట్టి దుఃఖం పోయింది, బావుంది. మళ్ళీ ఆనందం రావడం ఏమిటీ? ఆనందోబ్రహ్మ అనేది సిద్ధవస్తువు. ఆనందం ప్రాప్తించడం అనేది లేదు. దుఃఖం వున్నప్పుడు దుఃఖం పోవడమే ఆనందం రావడం అని చెప్పాము గాని అసలు ఎప్పుడూ ఆనంద స్వరూపులైన వారికి ఆనందం రావడం లేదుగా! ఏనాడూ దుఃఖం లేదుగా! అప్పుడు నాకు దుఃఖం పోయింది, నాకు ఆనందం వచ్చింది అనే ఈ రెండూ కూడా రెండు ఆవరణలు. ఆనందం రావటం కాదు, అది పరోక్షంలోనే వుంది, నిజంగా అపరోక్షంలో అపరోక్షానుభూతిలో పరబ్రహ్మ తత్త్వంలో సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ వుంది గాని ఆనందో బ్రహ్మ లేదూ అని చెప్పాం. తటస్థ లక్షణంలోనే సత్ చిత్ ఆనందం వుంది, అది పరోక్షానుభవం. అపరోక్షానుభూతిలో ఆనంద ప్రాప్తి అనే ద్వైతం పోవాలి. చిట్టచివరిలో లక్ష్యం వద్దకు పోయేసరికి ఇది పోయింది అది వచ్చింది అనేది కూడా భ్రాంతే. ఎప్పుడూ ఆనందమే వున్నది. అదే బ్రహ్మము. అంతేగాని బ్రహ్మకు వచ్చే ఆనందము కాదు. ఆనందం వుందా లేదా అని మొదలెడితే సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అన్నాము గాని సత్యం జ్ఞానం ఆనందం బ్రహ్మ అనలేదే! కనుక ఆనందం కూడా భ్రాంతే. ఆ రకంగా సప్త ఆవరణలు. ఇదంతా ఎందుకు చెప్పుకొస్తున్నామంటే అవి మనసులో పెట్టుకుని మళ్ళీ క్రిందికి దిగండి.

సృష్టిలో ఇలా వుంది. ఆత్మయందు ఒక ఆకాశము ఉదయించింది. ఆకాశమందు అనిలంబు పుట్టె. ఆకాశమంటే మిగతావాటికి అవకాశమిచ్చేది. ముందు అవకాశం ఇచ్చేది వస్తే, అది అవకాశమిచ్చినటువంటి ఖాళీలో మిగతావి వస్తాయి. అందుకని ముందుగా ఆకాశం వచ్చింది. తరువాత అనిలము, నిలకడ లేనిది, చలించేది, ఏదంటే వాయువు. ఆ అనిలము అనేటటువంటి వాయువునుంచి అనలంబు అనగా అగ్నిహోత్రుడు పుట్టె. ఆ అగ్నిహోత్రుడుని అనలుడు అంటారు. దక్షిణామూర్తి స్తోత్రంలో చూడండి – భూరంభాంస్య అనలో నిలోంబరం భూ అంటే భూదేవి అంభ అంటే జలము అనల అంటే అగ్ని అనిలుడు అంటే వాయువు అంబర అంటే ఆకాశం. భూరం భాంస్య అనలో అనిల అంబర – అయిదు చెప్పాం. అహర్నాథో అహమునకు నాథుడు, అహం అంటే పగలు. పగలుకి ప్రభువెవరు? సూర్యుడు. రాత్రికి ప్రభువెవరు? చంద్రుడు. అహర్నాథుడు అంటే సూర్యుడు. హిమాంశుః చల్లనివాడు – చంద్రుడు. పుమాన్ అంటే పురుషుడు. పురుషుడు అంటే ఇక్కడ మహత్ పురుషుడు, మహద్బ్రహ్మ. ఈ విధంగా అక్కడ అష్టమూర్తులు పెట్టాం.

అప్ అంటే జలము. అప్పువల్ల మహా అవనీస్థలియు పుట్టె జలమునుండి మనమంతా వుండేటటువంటి మన దృష్టిలో చాలా గొప్పదైనటువంటి ఈ కనబడేటటువంటి పృథివి పుట్టింది. అవనియందు ఓషధులు అమరబుట్టె. అక్కడక్కడ ఈ పృథ్విలో ఔషధ మొక్కలు పుట్టినాయి. వాటంతటవే వచ్చినాయి. ఔషధ మొక్కల నుండి ఒనర అన్నము పుట్టె. కొన్ని ఔషధ మొక్కలు వ్యాధి వచ్చినప్పుడే పనికివస్తాయి. దానినుంచి అన్నము అనేటటువంటిది పుట్టింది. అన్నము అంటే ఏమిటి ఇక్కడ? వరి, జొన్న

సజ్జ, రాగులు ఇటువంటివన్నీ కూడా అన్నము. అన్నము అంటే పాముకి కప్ప అన్నము, కప్పకి పురుగు అన్నం. పిల్లికి ఎలుక అన్నం. ఇవి కూడా అన్నాలే. అసలు అన్నము ఎక్కడవుందంటే పృథ్వినించి పుట్టినటువంటిది. ఈ కప్పలు పాములు పృథ్వి నుంచి పుట్టలేదా? మనం కూడా పార్థివులమేగా! పృథ్వీతత్వము మెండుగా వున్నది మన శరీరంలో. అన్నమందు నరులాది సకల జంతుజాలంబులాయే. ఈ అన్నము వల్ల ఏమైందీ. ఈ అన్నమువల్ల శుక్లశోణితములు ఏర్పడ్డాయి. స్త్రీ పురుష సంయోగము వల్ల శుక్లశోణితముల కలయికవల్ల, సంపర్కమువల్ల నరులు మొదలగు సకల జాతుల జంతుజాలంబులాయె. జగ యుగంబు లాయె. జగ యుగంబులంటే ఏమిటి? యుగమంటే జంట. యుగమంటే కాలం. కాలాన్ని కూడా యుగమంటాము. యుగమంటే జంట. ఏమిటా జంట? చిత్తు జడములు కలిసినటువంటిది జంట. జడమైన శరీరము, లోపల ఆ జడత్వాన్ని చైతన్యవంతము చేసేటటువంటి చైతన్యము. ఈ రెండూ కలిసి జగము. చైతన్యము లేకుండా పరమాణువు కూడా వుండదు. చైతన్యము వుంటేనే పరమాణువు. చైతన్యము వుంటేనే ఆకర్షణ వికర్షణ శక్తులు. ఆకర్షణ వికర్షణ వుంటేనే పదార్థము నామరూపాలుగా రూపాన్ని సంతరించుకుంటుంది. ఆ చైతన్యముంటేనే కదులుతాయి. చైతన్యముంటేనే మనసు చైతన్యవంతమై ఆలోచిస్తుంది. చైతన్యముంటేనే ఇంద్రియాలు చైతన్యవంతమై శబ్ద స్పర్శ రూప రస గంధాలు గ్రహిస్తున్నాయి. చైతన్యం వుంటేనే కర్మేంద్రియాలు కర్మలు చేస్తున్నాయి. చైతన్యం లేకుండా స్థూలంగా గాని సూక్ష్మంగా గాని ఏమీ లేదు, ఏమీ జరుగదు.

చివరికి కర్మ కూడా జడమే. జడమైన కర్మలో కూడా చైతన్యం వ్యాపించి వుండటం వల్ల ఆ కర్మలో వున్న కర్మ వాసనలు తిరిగి ఉపాధులను సృష్టించుకుని ఉపాధి అనే పనిముట్టు ద్వారా సూక్ష్మ శరీరము భోగిస్తుంది. ఇంత పని జరగడానికి కారణము యుగం అంటే చిత్ జడములు. చిత్ జడముల యొక్క కలయికే ఇదంతా. అదీ జగ యుగంబులు. ఈ రీతి పరమాత్మ మాయ వలన. ఈ విధంగా మళ్ళీ ఎవరిది ఇదీ? ఇదంతా కూడా మళ్ళీ తేలుస్తున్నాము. రెండుగా ఏదైతే వచ్చిందో, దేనివల్ల వచ్చింది? పరమాత్మ యొక్క మాయ వల్ల వచ్చింది. పరమాత్మ యొక్క మాయ అన్నాము. పరమాత్మ వేరు, పరమాత్మలో వుండే మాయ వేరు. అసలు పరమాత్మే మాయ. పరమాత్మ అనేది ఒకసారి ఒక నిర్వచనం కనుక తీసుకుంటే అణోరణీయాన్ గానూ మహతో మహీయాన్ గానూ తీసుకుంటే సర్వవ్యాపకం గా తీసుకుంటే సర్వాంతర్యామిగా తీసుకుంటే సర్వజ్ఞత్వంగా తీసుకుంటే ఆ పరమాత్మ తప్పకుండా మాయావరణంలోనే వున్నాడు. సర్వము వున్నప్పుడు సర్వముయొక్క తెలివి వుంటే ఆ తెలివే పరమాత్మ అయినప్పుడు ఆ ఎరుక రూపమే పరమాత్మ అయినప్పుడు పరమాత్మ కూడా మాయే.

పరమాత్మ ద్వారా పరమాత్మ కారణముగా పరమాత్మ వలన చిత్ జడ రూపములుగా ఈ జగంబులు తయారయినాయి. రమ్య గుణ ధామ భద్రాద్రి రామ పరశురామ నరసింహ్మదాస సంరక్షితాహ్వ. ఇది భద్రాద్రి రామశతకం. దీని విశేషార్థం నిర్వికార నిర్వికల్ప నిశ్చల పరిపూర్ణ పరబ్రహ్మమందు ఆ పరబ్రహ్మము వున్నదున్నట్లు వున్నాడండి! ఆయన వికారం చెందట్లేదు – నిర్వికారము. ఆయనకి సంకల్ప వికల్పాలు లేవు – నిర్వికల్పము. ఆయన నిశ్చలంగా వున్నాడు. సంకల్ప రూపంగా కూడా వికారంగా లేదు. ఇంకోరకంగా కూడా కదలటం అనేది లేదు. కదలికలు ఎన్ని రకాలు వున్నాయి? కర్మేంద్రియాలు కదులుతున్నాయి. జ్ఞానేంద్రియాలు కూడా కదులుతున్నాయి. మనసు కూడా కదులుతోంది. బుద్ధి కూడా నిశ్చలంగా లేదు, కదులుతోంది. ఆత్మ కూడా సర్వవ్యాపకంగా వ్యాపిస్తోంది. మళ్ళీ ప్రళయ కాలంలో మళ్ళీ వ్యాపకాన్ని విరమిస్తోంది. అంటే కదలికేగా. ఆత్మకి కూడా కదలిక వుంది.

ఈ ప్రకృతితో పోలిస్తే ఆత్మ కదలిక లేనిదని చెప్పినప్పటికి పరిపూర్ణ బోధ వచ్చేసరికి ఆత్మ కూడా కదిలేదే అయింది. కదిలేదానికి మూలకారణం అయింది. ఒకవేళ కదలదని అనుకున్నా, కదిలేదానికి చైతన్య సత్తా అందిస్తోంది. సత్తా మాత్రంగా వుంది ఆత్మ. ఆ సత్తా చేతే ఇవన్నీ జరుగుతున్నాయి. సూర్యకిరణంచేత ఒక భూతద్దము ఒక దూదిని కాల్చింది. భూతద్దం జడం. ఎలా కాల్చింది? పోని సూర్యరశ్మి కాల్చిందా అంటే సూర్యరశ్మివల్ల ఎక్కడా ఏదీ తగలబడటం లేదే? సూర్యరశ్మి భూతద్దం ద్వారా రావడంవల్ల కాలింది. అప్పుడు కాల్చినటువంటి కర్తృత్వం ఎవరిమీద పెట్టాలి? జడమైన భూతద్దం మీద పెడదామా? సూర్యరశ్మి మీద పెడదామా? సూర్యరశ్మి కాల్చడం అనే క్రియ చెయ్యలేదు గాని సూర్యరశ్మిలో ఈ జడమైన భూతద్దము ఉష్ణత్వాన్ని సంపాదించి దూదిని కాల్చడానికి అవసరమైన సత్తా ఆ సూర్యరశ్మిలో వుంది. కనుక సత్తా కూడా తనకంటే ఏదీ లేనప్పుడు సత్తా క్రియోన్ముఖం అవదు. ఆ సత్తా ప్రకటింపబడదు. సత్తా సత్తా మాత్రంగా వున్నదున్నట్లు వుండిపోతుంది. కాని ఇక్కడ సత్తా జడ రూప భూతద్దంలో వుపయోగపడుతోందిగా. ఉపయోగపడే సత్తానే పరమాత్మ అని మాయ అని అన్నాము. కనుక ఇక్కడ ఇది

మాయాశక్తే గాని పరబ్రహ్మ శక్తికాదు. ఆ పరమాత్మ సర్వవ్యాపకం అయేసరికి జడ వస్తువులు పరమమాత్మ సత్తాను ఉపయోగించుకున్నాయి. ఆ పరబ్రహ్మ కూడా సర్వవ్యాపకం అయినప్పటికీ అవి వుపయోగపడవు. అందుకే సామర్థ్యము చూపనివాడు అన్నారు. బయలు విషయంలో బయలే బ్రహ్మ అంటే సామర్థ్యమేమీ చూపదు అంటే ఏమిటి? సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణ అనే సామర్థ్యాలను చూపించదు.

ఈ పంచ బ్రహ్మలే మాయావరణంలో వున్నారు కాబట్టి సామర్థ్యాన్ని చూపిస్తున్నారు. మాయావరణకి అవతల వున్నటువంటి పరబ్రహ్మయందు ఈ సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణ అనే శక్తులులేవు. పంచ బ్రహ్మలలో ఉన్నాయి. ఈ సృష్టి శక్తి పేరు స్థంభన, పోషణ శక్తి పేరు మోహన లయ శక్తి పేరు మారణ, విస్తీర్ణకి ఉచ్చాటన. ఆకర్షణకి ఆకర్షణ శక్తే. స్థంబన మోహన మారణ ఉచ్చాటన ఆకర్షణ అనేటటువంటి సామర్థ్యాలు బ్రహ్మ విష్ణువు రుద్రుడు ఈశ్వరుడు సదాశివుడు అనేటటువంటి పంచ బ్రహ్మలయందు ఉన్నాయి. అవ్యక్తంలో ప్రకాశిస్తున్న వీళ్ళకి ఆ సామర్థ్యం వుంది, కాబట్టి సృష్టికి కారణమయ్యింది.

'పరమాత్మ మాయ' అన్నారు. మాయ ఎలా పనిచేస్తుంది? పరమాత్మ మాయతో కలిసి ఎలా ఉన్నాడు? మాయ పంచకంచుకాలు ఏమిటివి? కాలము కళ నియతి. కాలము అంటే కాలప్రభావం వుంది. ముందు కాలం రావాలి, కాలప్రభావం సృష్టి మీద పడాలి. ఒక బీజం మొలకెత్తడానికి ఒక మొక్కైతే ఒక రోజు పడుతుంది. ఇంకో మొక్కైతే రెండు రోజులు పడుతుంది. ఇంకో మొక్కైతే మూడు రోజులు పడుతుంది. ఒక చెట్టు బాగా పెరగాలంటే 100 సంవత్సరాలు పడుతుంది. మరో చెట్టు బాగా పేరగాలంటే మూడు సంవత్సరాలకే పెరుగుతుంది. కనుక ముందుగా కాలం తొయ్యాలి. కాలము తోచిన తరువాత కళ.

కళ అంటే ఏమిటిది? చైతన్యము ప్రకృతితో సమాగమయ్యాక ఆ చైతన్య సత్తాచేత ప్రకృతిలో వున్న ధర్మాలు ప్రకటితమయ్యాక ఆ ప్రకటితమైనటువంటి దానిలో వున్నటువంటి వికారాలన్నీ కూడా కళలు. కనుక ఈ కళలు ఆ వికారానికి ఆధారంగా కాలం నుండి కళలొచ్చాయి. కాలంలో కళలనుండి ఏమొచ్చింది? ఒక నియమం వచ్చింది. నియమం అంటే ఏంటి? వికారాలు కళలైతే ఆ వికారానికి ఒక కాలం అనే కొలత వచ్చింది. ఆ కొలతకి నియమం ఉంది. మనిషి ఎంతెత్తు పెరగాలి? అన్నం వల్ల పెరుగుతున్నాడు. అన్నంవల్ల అన్నమయకోశం ఏర్పడి అన్నంవల్ల పోషింపబడుతూ అన్నం వల్ల రక్షించబడుతూ అన్నము లేకపోతే నశిస్తున్నాడు అని చెప్పినప్పటికీ ఒక ఎత్తుగా పెరిగిన మానవ శరీరంలో ఎంత అన్నం వేసినా ఇంకా ఎత్తు పెరగదు. ఇది ఒక నియమం. మానవుడనంగానే రెండు కాళ్ళు రెండు చేతులు పొట్ట లోపల తీసుకున్న ఆహారం జీర్ణం అవడానికి, ఉఛ్వాస నిశ్వాసలు ఊపిరి పీల్చుకుని గుండె కొట్టుకోవడం, నరాలు, నాడులయొక్క వ్యవస్థ, వెన్నుపాము దాంట్లో కుండలినీ వ్యవస్థ, షట్ చక్రాల వ్యవస్థ, మనకి తెలిసినవీ తెలియనివీ సూక్ష్మంగా స్థూలంగా చాలా వున్నాయి. ఇదంతా కూడా ప్రతి మానవ శరీరంలో ఇదే లెక్కలో వున్నాయి. రెండు కళ్ళు రెండు చేతులు రెండు కాళ్ళు రెండు చెవులు – ఈ సంఖ్యా శాస్త్రం ఏదైతే వుందో అందరి మానవులలో సమానంగా వుంది. ఎప్పుడైనా ఒక కుండ తయారయినప్పుడు ఓటికుండ తయారయినట్లుగా ఒక వికలాంగుడు వుంటే వుండొచ్చు గానీ సామాన్యంగా మామూలుగా సృష్టి విధానం ఏమిటంటే ఒక నియమంగా ఒక లెక్కగా జరుగుతుంది. పంది కడుపున పందే, కుక్క కడుపున కుక్కే, మానవుడికి మానవుడే పుడతాడు. ఇదే సృష్టి నియమము. నూరేళ్ళో, నూటపాతికేళ్ళో బ్రతికి చనిపోవడం – ఇదీ ఒక నియమమే. శ్వాస మానవుడికి డెబ్భైఎనిమిది సార్లు జరగాలి, ఇదీ నియమమే. తాబేలు కి ఇంకా తక్కువ. కుందేలుకి ఇంకా ఎక్కువ. ఇవన్నీ నియమాలే. కళ, కాలము, నియతి. కాలానుగుణ్యమైన మార్పులు ఒక నియమంగా జరగడం.

ఆ మూడూ వుంటే అయిపోతుందా? ఒక పరమాణువు మరొక పరమాణువూ చేత ఆకర్షింపబడాలి. ఒక పరమాణువు మరొక పరమాణువు నించి వికర్షింపబడాలి. అంటే కొన్ని పదార్థాలు వేరు వేరుగానే వుంటాయి. కొన్ని పదార్థాలు కలిపితే కలిసిపోతాయి. మరి ఈ రకంగా వుండాలీ అంటే కలవాలని కలవకూడదని, ఇది చెయ్యాలనీ ఇది చెయ్యకూడదనీ, ఏదైనా చేస్తే ఇలానే అవ్వాలని జ్ఞానం వుండాలి కదా. ఆ జ్ఞానం పేరే విద్య. ఇది కొంతమంది విద్య అంటారు, కొంతమంది అవిద్య అంటారు. అంటే ఈ కల్పిత జగత్తులో ఇన్ని మాదిరిగా కార్యకారణాలుగా ఒక నియమంగా జరగాలి అనేటటువంటి దానిలో జ్ఞానం ఒకటి వుంది మనకి. ఈ జ్ఞానం వల్ల సంసారము పునర్జన్మలు వున్నాయి కాబట్టి ఈ జ్ఞానాన్ని కాసేపు అవిద్య అంటాం. ఇవన్నీ ప్రక్కన పెట్టి నీవు నీవైనటువంటి జ్ఞానాన్ని విద్య అంటాం. కాబట్టి విద్య అవిద్య రెండూ కూడా మాయ లక్షణాలే. ఈ రెండూ కలిసి ఒకటే వేసుకుందాం.

కళ కాలము నియతి విద్య లేక అవిద్య కలిపి నాలుగు. అయిదోది రాగము. శుక్లశోణితాలు కలవాలి అంటే లోపలికి పోయి దేనికదే వుంటున్నాయా లోపల గర్భంలో. శుక్లం మీద శోణితానికి, శోణితంమీద శుక్లానికి రాగబంధం వుంది అందుకే ఆ రెండూ కలిసినాయి. ఎలా కలవాలి అనే జ్ఞానం వున్నది, కలవటం కోసం ఒకదానిమీద ఒకటి రాగ బంధం వుంది. అందువల్లే ఆ శుక్లశోణితాలు కలిసినాయి. నియమం ఏమిటి? 9 నెలలు గర్భంలో వుండాలి. కళ ఏంటి ఇన్ని రోజులకి ఇంత అవ్వాలి, ఇన్ని నెలలకి ఇంత అవ్వాలి అని. 9వ నెలలో ఆకాశ తత్వం అందులో వుండనీయకుండా అవకాశం ఇవ్వకపోతే డెలివరీ అయిపోవాలి. నియమం వుందిగా. గర్భం ఒక నెల నుండి తొమ్మిదవ నెల వరకు పెరగడం అనే వికారం వుందిగా. 9 నెలలు అనే కాలం వుందిగా. కాల ప్రమాణం వుంది, కాల నియమం వుంది, వస్తువు యొక్క వికారం వుంది, వస్తువు ఎలా పరిణామం చెందాలి, ఎలా పెరగాలి ఎలా విడిపోవాలి అనే జ్ఞానం వుంది విద్య వుంది దాని వల్ల ఒక వస్తువు ఇంకో వస్తువుతో సంపర్కం చేయాలంటే ఆ రెండు వస్తువుల మధ్య రాగం వుండాలి. విద్యతో పాటు అవిద్య ఎలా వుందో, రాగంతోపాటు ద్వేషం కూడా వుంటుంది. రాగ ద్వేషాలు. ఇప్పుడు భూమి చుట్టూ సూర్యుడు తిరుగుతూ వుంటే రాగం వుందా ద్వేషం వుందా? ఆకర్షణ అయితే రాగం వుండాలి. వికర్షణ అయితే ద్వేషం వుండాలి. దూరంగా పారిపోవాలి. కాని అదే కక్ష్యలో తిరుగుతున్నాడుగా. కాబట్టి మాయలో విద్యావిద్యలు రెండూ కలిసి ఉన్నట్లే, రాగద్వేషాలు రెండూ కలిసి వున్నాయి. కనుక ఎంత దూరంలో వుంచాలో అంతదూరం వరకే దానిని వుంచేలాగా తక్కువ స్థాయిలో ఆకర్షిస్తూ మళ్ళీ దూరంగా పోకుండా వుండేలాగా తక్కువ స్థాయిలో వికర్షిస్తూ వుంటుంది. ఆకర్షణ వికర్షణ రెండు శక్తులయొక్క సమతూకం ఒకటి వుండబట్టి ఆ భూమి ఆ సూర్యుడు చుట్టూ అదే కక్ష్యలో వుంటూ తిరగటం జరుగుతూ వుంది. సూర్యుడు చుట్టూనే భూమి ఎందుకు తిరగాలి? అది కూడా రాగమే. ఒక పరమాణువులో న్యూక్లియస్ చుట్టూ ఎలెక్ట్రానులు తిరుగుతున్నాయి. అదీ రాగమే. గ్రహాలన్నీ సూర్యుడు చుట్టూ తిరుగుతున్నాయి. ఉపగ్రహాలన్నీ గ్రహాల చుట్టూ తిరుగుతున్నాయి. అలాగ తిరగాలనే జ్ఞానం వాటికుంది, జడ వస్తువులు కదా, వీటి కెక్కడిది ఆ జ్ఞానం అంటారేమో. జడ వస్తువులో కూడా జ్ఞానం దాని ధర్మంగా వుంది.

జగ యుగంబులాయె ఈ రీతి అన్నాడు అంటే చిత్ జడములు వచ్చినాయి. అంటే ఆ చైతన్యము యొక్క సత్తా చేత జడ వస్తువులో వున్న ధర్మాలన్నీ కూడా ప్రకటితమైనప్పుడు వ్యవహారం జరుగుచున్నది. అప్రకటితంగా వున్నప్పుడు అవ్యవహారంగా వుంది, ప్రకటితమైనప్పుడు వ్యవహారం జరుగుతూ వుంది. కేవలం జడము చెయ్యదు. కేవలం చైతన్యం చెయ్యదు. చైతన్యం సత్తా జడంలో వ్యాపకమైతే, జడంలో వున్న ధర్మాలు ప్రకటించబడుట ద్వారా ఈ సృష్టి యొక్క క్రమము జరుగుతోంది. ఈ హిరణ్యగర్భుడెక్కడున్నాడు, ఈ మాయయొక్క పంచకంచుకంలో బద్ధుడై వున్నాడు. అందుకే మాయాశబలిత బ్రహ్మ. కాలము కళ నియతి విద్య రాగము అనే అయిదు ఆవరణలచేత బద్ధుడైనవాడే ఈ బ్రహ్మ. ఈ బ్రహ్మ పేరే మాయాశబలిత బ్రహ్మ. అతనిచేత జీవోపాధులు క్రమముగా సృష్టి ఆయెను. మళ్ళీ ఎట్లా వచ్చినాయి ఇవన్నీ. ఒక సంకల్పం చేతనే.

సంకల్పమే మాయ. హిరణ్యగర్భుడనే బ్రహ్మమే సంకల్పముచే మరీచాదులు (మరీచము అంటే వాయువు) మొదలైనవి. అంటే వాయువే శరీరముగా కలిగినవారు మరీచాదులు. సనక సనందనాదులు అంటే హిరణ్యగర్భుని యొక్క ప్రకాశ రూపమే సనకసనందనాదులు. అంటే బ్రహ్మమానస పుత్రులు. బ్రహ్మ యొక్క ప్రకాశమే ఈ సనక సనందనాదుల యొక్క శరీరం. బ్రహ్మప్రకాశాన్ని జ్యోతిర్మయ శరీరం అంటాం. ఈ జ్యోతిర్మయ ప్రకాశంతో వున్నవాళ్ళే సనక సనందనాదులు. అంటే వీళ్ళు ఎట్లా వున్నారు ఇప్పుడూ? పరబ్రహ్మ ప్రకాశము అనేటటువంటి బ్రహ్మ నిష్ఠలో వుండి ఏ జ్యోతి ద్వారా అయితే ఈ ప్రకాశం వుందో ఆ ప్రకాశానికి జ్యోతి అనేటటువంటి ఒక ఆత్మ వున్నది. అటువంటి ఆత్మ పేరే పరబ్రహ్మ. పరబ్రహ్మ ప్రకాశ రూపంలో వున్నటువంటి వారు పరబ్రహ్మ తాననేటటువంటి అనుభవం లేదు వాళ్ళకి. పరబ్రహ్మ ప్రకాశమే తాననుకుంటున్నారు తప్ప ఈ ప్రకాశానికి ఆధారమైనటువంటి ప్రకాశ రూపమైనటువంటి ప్రకాశ స్వరూపమైనటువంటి తనకుతానే వున్నటువంటి స్వయంప్రకాశమై వున్నటువంటి తనకుతానే వెలిగిపోతూ వున్నటువంటి స్వయం ప్రభగా వున్నటువంటి పరబ్రహ్మ తాననే జ్ఞానం వాళ్ళకి లేదు. ఆ జ్ఞానం ఈ దక్షిణామూర్తి ఇస్తాడని ఆయన చుట్టూ చేరారు ఈ సనకసనందనాదులు. అంటే ఎక్కడ దాకా వచ్చారు వీళ్ళు? పుట్టుకతోనే ప్రకాశ రూపంగా, జ్యోతిర్మయ శరీరంతో వుండి ఈ జ్యోతిర్మయ శరీరమే నేను అంటున్నారు గాని ఆ జ్యోతిర్మయాత్మ ఏదైతే వుందో ఆ పరబ్రహ్మనే నేను అని అనుటలేదు. ఈ కాస్తా ఈ ఒక్క మెట్టూ ఎక్కడానికే అక్కడికి వచ్చారు వాళ్ళు, దక్షిణామూర్తి దగ్గరికి. మనం కూడా మన సాధనలో మనం బ్రహ్మ మానస పుత్రులం కాకపోయినప్పటికి, పార్థివ శరీరంతో వున్నప్పటికీ, మనంకూడా ఈ పంచకోశాలూ హిరణ్మయ శరీరం దాటినప్పుడు హిరణ్మయ శరీరంలో

వున్నటువంటి ప్రకాశమే జ్యోతిర్మయ శరీరం. ఆ శరీరమే నేను అనేవారే సనకసనందనాదులు. నువ్వు కూడా హిరణ్మయ కోశం దాకా పంచకోశ లక్షణాలు దాటాక హిరణ్మయ కోశంలో వున్నప్పుడు నువ్వు సనక సనందనాదులతో సమానం అవుతావు. అప్పుడు ఆ హిరణ్మయ కోశం దాటినప్పుడు నువ్వు కేవలం పరబ్రహ్మావి అవుతావు.

ఆ హిరణ్యగర్భుడనే బ్రహ్మ సంకల్పముచే మరీచాదులు ఇక్కడ వాయువు అంటే ఏమిటి? ప్రకాశము యొక్క చలనము. సనకసనందనాదులు సృష్టింపబడిరి. వీరంతా కూడా ఆ పరమాత్మ ప్రకాశ రూపులు. పరమాత్మ రూపులు కాదు గాని పరమాత్మ ప్రకాశ రూపులు. వీరు జ్ఞాన మార్గాన్నిబట్టి తరించారు, వారికది సాధ్యము గనుక. సృష్టి విధానమగు సంకల్పమును పాటించి వర్తించుటకుగానూ మరీచాదులు కర్మ మార్గమును బ్రహ్మ సృష్టి చెయ్యి అన్నాడు బ్రహ్మ మానస పుత్రులని. బ్రహ్మ మానస పుత్రులంటే ఏమీ లేదు స్వయం ప్రకాశ బ్రహ్మయందు మాయ కారణంగా మాయావరణ యందు పరమాత్మ అనే ప్రకాశంతో వ్యాపించి యుండేవాళ్ళు. మరీచాదులేమో వీళ్ళంతా ప్రజాపతులు. వీళ్ళందరికీ ఏమి చెప్పాడు? బ్రహ్మ? మిమ్మల్ని నేను ఎందుకు పుట్టించానంటే మీద్వారా సృష్టి జరగడానికి అని. సనక సనందనాదులు మేము సృష్టి చెయ్యము, మాది జ్ఞాన మార్గము అన్నారు. బ్రహ్మకి కోపం రాలేదు. సరే అని వదిలేశాడు. మరీచాదులను సృష్టించిన తరువాత సృష్టి చెయ్యమని ఆదేశించాడు. అప్పుడు వాళ్ళు మేము సృష్టి చేస్తాం అని ఒప్పుకుని సృష్టి చేశారు. కనుక ఈ మాయావరణ యందు వ్యాపకమైన పరమాత్మ ప్రకాశమే ఒక భాగము కర్మ భాగము తెలిసిన వారి పేరు మరీచాదులు, జ్ఞాన భాగము తెలిసినవారి పేరు సనక సనందనాదులు. కనుక ఈ కర్మ భాగములోని మరీచాదుల వల్ల పరమాత్మ సత్తా అక్కడ పనిచేసి ఆ సత్తాలో ఈ హిరణ్యగర్భుని యొక్క పూర్వ సృష్టి జ్ఞాన భాగముచేత, సృష్టి కమము క్రమశః కొనసాగటము జరిగింది.

సృష్టి విధానమగు సంకల్పమును పాటించి ఆ ప్రథమ సంకల్పముగా ఏ సంకల్పమైతే వచ్చిందో దాని తరువాత పిల్ల సంకల్పాలు మొదలుపెట్టి ఒకదాని తరువాత ఒకటి దొంతరదొంతరలుగా వచ్చాయి. దొంతర్లు దొంతర్లుగా వస్తాయి సంకల్పాలు. ముందు ఒక పెద్ద సంకల్పం సృష్టి అగుగాక. దాంట్లో పంచ తన్మాత్రలు వచ్చినాయి. మళ్ళీ పంచ తన్మాత్రలకి అయిదు భాగాలుగా సంకల్పాలుగా మారినాయి. మళ్ళీ పిండాండ పంచీకరణ వస్తే పాతిక భాగాలుగా సంకల్పాలు మారినాయి. నామరూప ప్రపంచాలు వస్తే లక్షలాది సంకల్పాలుగా మారింది. ఒక మనిషి తన మనసుగా వుండే సరికి ఆ మనసులోనే కొన్ని లక్షల సంకల్పాలు వ్యక్తిగా వుండి, అలా ప్రతి జీవిలో కూడా లక్షలాది సంకల్పాలు వచ్చినాయి. ఈ జీవులలో వున్న లక్షలాది సంకల్పాలు దేని వల్ల కలుగుతున్నాయో దాని పేరు మనసు. బ్రహ్మమువల్ల మొట్టమొదట ఏ సంకల్పం జరిగిందో అది కూడా బ్రహ్మ యొక్క మనసు. అదియే బ్రహ్మ ప్రకాశము. ఆ బ్రహ్మ ప్రకాశము సనక సనందనాదులుగా మరీచాదులుగా మారింది. కనుక వారిని బ్రహ్మ మానస పుత్రులు అన్నాము. బ్రహ్మయొక్క మనసే ఆ ప్రకాశము. ఆ ప్రకాశ రూపుల్లోనే ఒక ప్రకాశము జ్ఞాన మార్గ రూపంలో పోయింది, ఒక ప్రకాశ రూపము మాయా రూపమైనటువంటి హిరణ్యగర్భుడు అనేటటువంటి బ్రహ్మ యొక్క సంకల్పానుసారము కర్మ మార్గాన్ని చేపట్టింది. మరీచాదులు కర్మ మార్గమును, సనక సనందనాదులు కర్మ రహిత జ్ఞాన పద్ధతిని అవలంబించారు. ఈ పురాణాలలో మనకి చెప్తారు బ్రహ్మ యొక్క ఆజ్ఞ తిరస్కరించారని సనక సనందనాదులు, కశ్యప ముని ప్రజాపిత, మనువు వీళ్ళంతాకూడా బ్రహ్మయొక్క ఆదేశాన్ని పాటించి ఈ సృష్టిని, జనాభాని పెంచారని. జీవులు, జంతువులు, పాములు, పక్షులు, రాక్షసులు, దేవతలు, మనుషులు అందరూకూడా కశ్యప సంతానమే. అలా బ్రహ్మయొక్క ఆదేశాన్ని వాళ్ళు పాటించారు. అంటే ఒక బ్రహ్మ సంకల్పంనుండి చిన్న చిన్న సంకల్పాలు పుట్టుకొచ్చాయి. ఆ పుట్టుకొచ్చినవి అమలుచేయడనికి ఒప్పుకొన్న బ్రహ్మ మానస పుత్రులే మరీచాదులు. మరీచుడు, మనువు వీళ్ళంతా ప్రజాపితలన్నమాట. సకల సంతానానికి సృష్టి కి కారణభూతులు కాబట్టి వారిని ప్రజాపితలు అన్నారు. ఏ తత్వలమున సర్వ జీవులు ఉద్భవములై జ్ఞానాజ్ఞాన విస్తృతమాయెను. చూశారా జగయుగంబులాయెను అన్నారుగా చిత్ జడములాయెను అన్నారుగా. మరి ఇక్కడ జ్ఞానమంటే ఎవరూ? సనకసందనాదులదేమో జ్ఞానం. మరీచాదుల యొక్క కర్మమార్గం వచ్చేసరికి ఏమైంది? అది అజ్ఞానం అయింది. కనుక ఇక్కడ జ్ఞానము అజ్ఞానము రెండూ మిళితంగా వున్నాయి. కొన్నిచోట్ల సృష్టిలో ఆరంభంలో జ్ఞానం వేరుగా వుంది. సృష్టి వేరుగా వుంది.

మహత్తు నుంచి హిరణ్య గర్భుడి స్థాయి దగ్గరినుంచి హిరణ్యగర్భుని యొక్క సంకల్పము ద్వారా ఒకటి సృష్టి మార్గము ఒకటి జ్ఞాన మార్గము అయింది. ఈ జ్ఞాన మార్గంలో వున్నవారు ఏమి చేశారు – ఆ పరిపూర్ణ తత్వములో వున్న దక్షిణామూర్తి దగ్గరికి వెళ్ళి పరబ్రహ్మ ప్రకాశంగా వున్నవారు పరబ్రహ్మ ప్రకాశం నుంచి (పరబ్రహ్మ యొక్క ప్రకాశం మాయావరణంలోనే

వుంది, కనుక ప్రకాశం మాయ) ఆ ప్రకాశానికి అంతరాత్మగా ఆధారభూతంగా తనకు తానే స్వతస్సిద్ధమై ఏ బ్రహ్మమున్నదో ఆ బ్రహ్మమే పరబ్రహ్మ అని దక్షిణామూర్తి తన చిన్ముద్రచేత, సంకేతంచేత, మౌన వ్యాఖ్యగా చెప్పగా, ఈ బ్రహ్మనిష్ఠులు సనకసనందనాదులు వెంటనే పరబ్రహ్మ స్వరూపులు అయిపోయారు. ఇప్పుడు మనంకూడా మన జ్ఞాన సాధన మార్గంలో ఏ సాధన నీకెందుకు అనే స్థితికొచ్చేసరికి సనకసనందనాదుల స్థితిలో వున్నటువంటి బ్రహ్మనిష్ఠులు అయ్యి ఉండాలి. అక్కడినుంచి హిరణ్మయ కోశము లేక జ్యోతిర్మయ శరీరాన్ని ప్రకాశ రూపు శరీరాన్ని వదిలేసి ప్రకాశ రూపానికి ఆధార భూతమయినటువంటి అంతర్యామి అయిన పరబ్రహ్మ స్వయం ప్రకాశరూపుడుగా సిద్ధింపచేసుకోవాలి. అందుకనె చూడండి బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సాంప్రదాయ కర్తృభ్యో వంశ ఋషిభ్యో అన్నప్పుడు బ్రహ్మవిద్య కేవల బ్రహ్మ స్వరూపుడి దగ్గరినించి దక్షిణామూర్తి తత్త్వం నుండి సనకసనందనాదులకి వెళ్ళింది. బ్రహ్మ నిష్ఠులకి వెళ్ళింది. వీళ్ళు బ్రహ్మకి సమానమైనవాళ్ళు. అందుకని బ్రహ్మకి చెప్పాడు . ఆ బ్రహ్మ విద్య బ్రహ్మకి చెప్పాడు. ఎవరు? ఆ శ్రీమన్నారాయణుడు అనేటటువంటి వాడు కేవల పరబ్రహ్మ స్వరూపమైనటువంటి వాడు ఎవరికి చెప్పాడు? హిరణ్యగర్భులైనటువంటి వారికిగాని, బ్రహ్మ మానస పుత్రులైనవారికి గాని, జ్యోతిర్మయ శరీరులైనటువంటి వారికి గాని, బ్రహ్మనిష్ఠులైనటువంటి వారికి గాని, మాయావరణంలో పరమాత్మ ప్రకాశంగా వ్యాపకం అయినటువంటి వాళ్ళకి చెప్పాడు. ఆ బ్రహ్మ ఎవరికి చెప్పాడు? సూర్యుడికి చెప్పాడు. సూర్యుడు తేజో రూపంలో వున్నాడు. ఈ తేజస్సు అంటే జ్ఞానం. జ్ఞానం రూపంలో వున్నాడు. జ్ఞానాన్ని శుద్ధ చైతన్య ప్రకాశంగా మార్చి, శుద్ధ చైతన్య ప్రకాశాన్ని పరబ్రహ్మగా మార్చి – ఈ రెండు స్టెప్పులలో బోధ సూర్యుడికి నేర్పాడు. సూర్యుడు యాజ్ఞవల్క్యుడికి చెప్పాడు. ఈ కృష్ణ పరమాత్మ మళ్ళీ అర్జునుడికి చెప్తూ నేను ఒకప్పుడు బ్రహ్మకి, సూర్యుడికి చెప్పాను అంటున్నాడే, నువ్వు ఇప్పుడేగా పుట్టింది అంటున్నాడు అర్జునుడు నిన్నగాక మొన్న– భారతంలో. నేను సనాతన పురుషుడిని. యుగయుగాలు అవతరించడంకోసం శరీరాన్ని ధరిస్తూ వదులుతూ వుంటాను, నాకు అన్నీ తెలుసు. నేను అప్పటినించీ వున్నాను. ఇంకా నమ్మకం కలగలేదంటే విశ్వరూప సందర్శన అర్జునిడికి ఇచ్చాడు. అక్కడ స్టెప్పులు పెరిగినాయి. యాజ్ఞవల్క్యుడు దగ్గరినుంచి వచ్చేసరికి ఏమైంది? జనకుడి దగ్గర త్రేతాయుగం వుంది. కృష్ణుడి దగ్గరికి వచ్చేసరికి ద్వాపర యుగం వచ్చింది. ద్వాపర యుగంనుంచి గురుశిష్య న్యాయంగా చెప్పడం జరుగుతోంది. ఇప్పుడు తప్పనిసరిగా గురువులుండాలి, శిష్యులుండాలి ఈ సాంప్రదాయం ఇదంతా. మౌన వ్యాఖ్యగా చెప్పినటువంటివాడు మొదటి గురువైతే కొంచెం శ్రమపడి చెప్పినవాడు గురోరుచ్ఛిష్ట భోజనంగా శిష్యుడిలో తాను వ్యాపకమై గురు సాక్షాత్ పరబ్రహ్మగా శిష్యుడిలో వ్యాపకం కాగా శిష్యుడికి కూడా ఆ పరబ్రహ్మ సాక్షాత్కార జ్ఞానం అబ్బింది, సంక్రమించింది. ఆ పద్ధతిలో జరిగింది. ఇప్పుడు ఆ పద్ధతిలో జరగాలంటే మనం ఎన్ని మెట్లెక్కితే ఆ పద్ధతిలో జరుగుతుందో? ఇప్పుడు పద్ధతి, స్టెప్పులు పెరిగినాయి మన దగ్గరికి వచ్చేసరికి. ఏ తత్ఫలమున సర్వ జీవులూ ఉద్భవములై వీళ్ళంతా జ్ఞానము అజ్ఞానము అనే రెండిటికీ మిశ్రమంగా వున్నారు. నాలో ఆత్మ వుంది, నాకు అనాత్మ శరీరం వుంది. అనాత్మ శరీరం నేను అనుకోవడం అజ్ఞానం. దేహి నేను ఆత్మ నేను అనుకోవడం జ్ఞానం. జ్ఞానం మరుగునపడి కూడా జ్ఞానం వున్నది. అజ్ఞానం విజృంభించి విమర్శ చేస్తూ ద్వంద్వాలలో తిరుగుతూ అజ్ఞానం వుంది. అజ్ఞానకార్యం వుంది జ్ఞానకార్యం కూడా వుంది. జ్ఞానమే లేకపోతే అజ్ఞానం ఎక్కడుందీ? ఆత్మ లేకపోతే అనాత్మ ఎక్కడుంది? చైతన్యమే లేకపోతే జడం ఎక్కడుందీ? ప్రతిదానిలో కూడా సత్తా మాత్రంగా ఆత్మ అనేటటువంటిది దాని ప్రభావాన్ని చూపిస్తూనే వుంది. ఇది అజ్ఞాన జ్ఞాన బేధాలతో నడుస్తూనే వుంది. ఆవరణ దోషం వున్నవాళ్ళు అజ్ఞానంలో వున్నారు. ఆవరణ దోషం పోగానే అజ్ఞానం పోయి జ్ఞానులుగా వున్నారు. అంతే!

పై ఒక్క మాట చూడండి. జగయుగంబులుగా సృష్టి అయినది అన్నాడు. అంటే ద్వంద్వాలుగా సృష్టి అయింది. చిత్ జడములుగా సృష్టి అయింది. అదే మన దగ్గరికి వచ్చే సరికి జ్ఞాన అజ్ఞానములుగా వుంది. అంటే జ్ఞానము అజ్ఞానము రెండూ సృష్టించబడ్డాయి. రెండూ కల్పించబడ్డాయి. రెండింటికీ ఆది వున్నది. రెండింటికీ అంతమున్నది. అందుకని ముందుగా అజ్ఞానం పోవాలి, తరువాత జ్ఞానం కూడా పోవాలి. ఆ తరువాత అచల పరిపూర్ణమే నిర్విశేషంగా నిర్వికల్పముగా నిశ్చలంగా పరిపూర్ణంగా వుంటుంది. మానవుల దగ్గరికి వచ్చేసరికి ఆత్మ అనాత్మ అనే రెండు భాగములుగా వున్నవి. బొత్తిగా అనాత్మ అనేటటువంటి దోషాన్ని పోగొట్టుకుంటే జ్ఞానం వుంది. అవిద్యా దోషం పోగొట్టుకోగానే జ్ఞానం వచ్చింది. మాయా దోషం పోగానే జ్ఞానంకూడా పోయింది. జ్ఞానంకూడా పోతే ఈ కల్పితమైన సృష్టి అంతా కూడా లేనిదే అయింది. ఎప్పుడైతే ఇది లేనిది అయిందో అప్పుడు అలోక కళ అయింది. అలోక కళ ఎప్పుడయిందో లోకం పూర్తిగా తెగిపోయింది. లోకం పూర్తిగా ఎప్పుడైతే

తెగిపోయిందో తన్మాత్ర సృష్టి లేదు. తన్మాత్ర సృష్టి ఎప్పుడైతే లేదో అవ్యక్తము మహత్తు కూడా లేవు. సాధకులకి తన్మాత్ర సృష్టి ఎప్పుడైతే లేదో సాధకులకి జ్ఞానాజ్ఞానములు లేవు, ప్రపంచము లేదు, నేడే కాదు వెనుకటినుంచే లేదు, ఇక ఉండబోదు. సనాతనమైనటువంటి బ్రహ్మ జ్ఞానంతో బ్రహ్మ నిష్ఠతో నిత్య వర్తమానంగా, నిత్యతృప్తంగా, పరిపూర్ణంగా, అచలంగా వున్నది వున్నట్లుగా వుండి పోయినటువంటి స్థితి ఎప్పుడైతే వచ్చిందో ఆ స్థితిలో అదే అపరోక్షంగా వుంటుంది.

జ్ఞానాజ్ఞాన మిశ్రితమాయెను అనగానే అజ్ఞానము జ్ఞానము రెండూ సృష్టిలో వచ్చాయి. రెండూ కల్పించబడ్డవి. ఈ త్రిగుణాత్మక సృష్టి ఎలా వచ్చిందని చెప్పాం? బ్రహ్మణో అవ్యక్తః అవ్యక్తో మహత్ అనేటటువంటి లైన్ లో చెప్పాం. ఇప్పుడు మూడు గుణాలతో సృష్టి ఎలా వచ్చిందో చెబుదాం.

## త్రిగుణాసామ్య సృష్టి

మొదట్లో మూడు గుణములు ఎక్కువ తక్కువ లేకుండా సమానంగా ఉన్నాయి. అదీ సామ్యమంటే. మనం ప్రణవము. ఓం బిందువు గురించి మాట్లాడుతున్నాము కదా. అకార, ఉకార, మకారాలుగా మనం స్థూల, సూక్ష్మ, కారణ, సృష్టిగా చెప్పుకున్నాము. మూడు పద్ధతుల్లో, మూడు విధాలుగా, మూడు వృత్తులుగా విస్తరించేది గాబట్టి త్రివృత్కరణ అన్నాము. మూడు ఇంపార్టెంట్ ఏమిటంటే అకారం–అన్నము, ఉకారం–జలము, మకారం – తేజస్సు. పంచభూతాల్లో పృథ్వి, జలము, అగ్ని వరకే తీసుకున్నారు. త్రివృత్కరణలో వాయువు, ఆకాశం లేదు. ఆ రెండు పక్కనబెడితే, అగ్నివల్ల, జలమువల్ల, పృథ్వివల్ల మన శరీరమంతా కూడా అజ్ఞానముగా, అవిద్యతో, లోక వ్యవహారంగా శరీరానుసారంగా పనులు చేస్తున్నాయి. కర్మలు చేస్తున్నాయి. కర్మానుభవాలను ప్రతిఫలంగా పొందుచున్నాయి. ఈ మూడు మాతృకతలతోటి చలనాలొచ్చినాయి.

మన శరీరంలో అకారం – అన్నమయ కోశం –స్థూల శరీరం, ఉకారం ప్రాణము, మకారం జ్ఞానము, జ్ఞానమంటే అవిద్య కావచ్చు, విద్య కావచ్చు, జ్ఞానం కావచ్చు, అజ్ఞాం కావచ్చు. ఈ మూడు మన శరీరంలో ఉన్నాయి. జ్ఞానమే మనసునుంచి, బుద్ధినుంచి వ్యక్తమవుతుంది. ఇప్పుడు 'ఓం'కారాన్ని అకార, ఉకార, మకారాల్ని మూడు గుణాలుగా తీసుకుందాం. అకారం–తమోగుణము, ఉకారం–రజోగుణము, మకారం–సత్వగుణము ఓం బిందువునుండి సృష్టి ఇంకా ఉపక్రమించలేదు, విస్తరించలేదు. బిందు రూపంలో ఉంది. మూడు గుణాల వల్లనే సృష్టి వ్యాపకం కావాలి, విస్తృతం కావాలి. మూడు గుణాలు సామ్యంగా ఉన్నప్పుడు సృష్టి అంతా బిందురూపంగానే వుంది. ఓం బిందువందు అకార, ఉకార, మకార మాతృకల సంకేతంచేత సత్వ, రజస్, తమో గుణాలు సామ్యముగా ఉన్నాయి. అంటే ఒకటెక్కువ, ఒకటి తక్కు లేకుండా సమానముగా ఉన్నాయి. అవి బయలువెడలి అసమత్వమై సృష్టి అయినది. ఆ గుణ ప్రభావంతోటి ఆ గుణమయంగా సృష్టి ఏర్పడింది. మొదట్లో సత్వగుణం వచ్చింది. ఈ సత్వగుణమే 'మాయ'. ఈ సత్వ గుణమే 'చైతన్యం'. చైతన్యమన్నా, మాయన్నా ఒకటే. మొదట్లో ఎరుక అనేది సత్వగుణరూపంలో వచ్చింది. 'ఓం' బిందువులో ఎరుక అవ్యక్తంగా ఉంటే సత్వగుణం విజృంభించగానే సత్వగుణ ఎరుక వచ్చింది. తరువాత రజోగుణము తమో గుణము కలిసి విజృంభించినాయి. రజోగుణంవల్ల రజోగుణ సృష్టి తమోగుణము వల్ల తమోగుణ సృష్టి వచ్చింది. జీవులయందు ప్రాణులయందు తమో రజోగుణములు రెండు కలిసి అవిద్యా దోషాన్ని, అజ్ఞానాన్ని కలిగించాయి. తమోగుణ, రజోగుణాలు రెండు కలిసి ఆవరణ విక్షేప దోషంతోటి నేను ఆత్మని, నేను బ్రహ్మని అనేదాన్ని మరిపించి, ఆ మరుపులో ఉంచింది. మరుపులో వుండడమే అజ్ఞానం.

ఆ మరుపులో కలలో తోచినవెలాగో అలాగే ఈ జీవితము ఈ ప్రపంచం ఈ వ్యవహారమంతా వచ్చేసరికి ఇదంతా కూడా విక్షేపము. ఆవరణయందు తన్నుతాను మరిచాడు. అది తమోగుణ ప్రభావము, విక్షేపమందు సంసారంలో పడ్డాడు. ఇది రజోగుణ ప్రభాము. రజోగుణంవల్ల ముందు అధ్యాస కలుగుతుంది. అధ్యాస అంటే ఏది? నీ బుద్ధిలో ధ్యాస రూపంలో ఏది అందుతుందో అది ఆధ్యాస. ప్రపంచానికి సంబంధించింది వచ్చింది కాబట్టి అది మిథ్యా జగత్తే. ఈ మిథ్యా జగత్తే లేనిది ఉన్నట్లు వచ్చింది కాబట్టి అది ఆధ్యాస. లేనిది ఉన్నట్లుగా అనుకోవడమే అజ్ఞానం. నీ స్వరూపం నువ్వే మరచిపోవడమే అజ్ఞానం. కనుక ఆవరణ విక్షేపం రెండు కలిపి అవిద్యయితే అవిద్య వలన కలిగింది అజ్ఞానం. అసలీ జ్ఞానమంటే ఆత్మ స్వరూపం. అజ్ఞానమంటె ఆత్మ స్వరూపాన్ని మరచినది. అంతవరకే అయితే ఆత్మ స్వరూపాన్ని మరచిపోవడానికి రెండు కారణాలున్నాయి. సత్వగుణ మొకటి మాయా అనేటువంటి భ్రాంతి పుట్టింది. తమోగుణంవల్ల, ఆవరణ కలిగి, మాయా ప్రపంచం గోచరిస్తుంది. అందువల్ల

ఆధ్యాస కలిగింది. ఈ ఆధ్యాసవల్ల అసత్య వస్తువులు నిజమని తన శరీరోపాధి గూడ నిజమని ఉపాధితో తాదాత్మ్యం చెందటం వల్ల ఉపాధికి సంబంధించి చలి, ఎండ, వానకి తట్టుకోలేనటువంటి బాధొచ్చింది. క్షోభ వచ్చింది. ఈ క్షోభ పేరే విక్షేపం. క్షోభ అంటే విక్షేపం. ఈ తమో రజోగుణాలు రెండు విజృంభించకముందు కేవలం సత్వగుణం ఉన్నప్పుడు అది శుద్ధ సత్వ మాయ, తమోగుణం, రజోగుణం కూడా విజృంబించిన తరువాత ఈ రెండూ కలిసినటువంటి అవిద్యే మాలిన్యం. ఈ మాలిన్యంతో కూడిన సత్వగుణము మలిన సత్వమాయ. శుద్ధ సత్వమాయ, మలిన సత్వమాయ అని రెండొచ్చినాయి. శుద్ధసత్వ మాయకి ఆ బ్రహ్మ ప్రకాశము యొక్క ప్రతిబింబ ప్రకాశం ప్రతిఫలించింది. శుద్ధ సత్వ మాయయందు శుద్ధ సత్వ మాయ అనేటువంటి ఒక ఉపాధియందు మాయోపాధియందు అధిష్ఠాన బ్రహ్మ ప్రకాశం పడి ప్రతిఫలిస్తే ఆ ప్రతిఫలించినటువంటి సృష్టి అంతా మాయా సృష్టి. ఈ మాయా సృష్టి కధిష్ఠానం ఈశ్వరుడు. తమో రజో గుణాలు రెండూ కూడా విజృంభించినపుడు అది మలిన సత్వమాయ అయింది. ఈ మలిన సత్వమాయ అనేటువంటి ఉపాధి యందు అధిష్ఠాన బ్రహ్మ ప్రకాశము ప్రతిఫలించగా ఆ ప్రతిఫలించిన ప్రకాశములో అనేక 'నేను'లు అనేక జీవులు తోచారు. ఈ రకంగా మూడు గుణాలతో సృష్టి వచ్చింది.

సత్వగుణం విజృంభించకముందు మూడు గుణాలు సామ్యస్థితిలో వున్నవి. అది 'ఓం' బిందువు. ఓం బిందువు త్రిగుణ సామ్యంగా వుంది. త్రిగుణ సామ్యంలో మూడు గుణాలు ఒక్కొక్కటిగా విజృంభించడంతోటి సామ్యం చెదిరింది. సామ్యం చెదరి ఉండటంవల్ల మూడు గుణాల ఎఫెక్ట్ ప్రపంచంమీద పడింది. ప్రపంచమే మూడు గుణాలతో త్రిగుణాత్మక మాయవల్ల లేని ప్రపంచము ఉన్నట్లుగా తోచింది. అటువంటి ప్రపంచమే మరింతగా మళ్ళీ తమోగుణ రజోగుణాలవల్ల ఆవరణ విక్షేపంవల్ల వాటి ప్రతిబింబంగా వచ్చినటువంటి జీవులకు అవిద్యాదోషం కూడ పట్టుకొని వీళ్ళందరూ కూడా ఏదో ఒక గుణంయొక్క ప్రభావంతోటి వాళ్ళ ఉపాధులలో వాళ్ళు పనిచేస్తున్నారు. అలాగే ఏదో ఒక గుణం వాళ్ళలో స్వభావంగా మారి ఆ గుణ ప్రభావంగా వాళ్ళు ప్రవర్తిస్తున్నారు. ఇట్లా ఇది బయలువెడలి అసత్యమైన సృష్టి అయినది.

మూడు గుణముల యొక్క బీజావస్థ అవ్యక్తము ప్రణవము. బీజస్థితి అంకురమై సామ్య స్థితి తోచినప్పుడు ఓమ్ (ఓం). ఓంలో మళ్ళీ సత్వగుణ మొచ్చాక శుద్ధ సత్వ మాయ, తమో, రజో గుణాలొచ్చాక మలిన సత్వమాయ. ఈ శుద్ధ సత్వమాయ వల్ల కొంత సృష్టి జరిగింది. మలిన సత్యమాయ వల్ల కూడా మరికొంత సృష్టి జరిగింది. ఏదైనాగాని ఈ మూడు గుణాలవల్ల సృష్టి జరిగింది. ఈ మూడు గుణాలు కలిసి మాయ.

ఓం అన్నాగూడా మాయేగా. ఓంలో మూడు గుణాలు సామ్యంగా ఉన్నవి. మాయ కూడా త్రిగుణ సామ్యంగా ఉంది. కనుక ఓంయే మాయ. మాయయొక్క అవ్యక్త స్థితి మూలావిద్య. ఓం యొక్క అవ్యక్త స్థితి ప్రణవము. కనుక ప్రణవమే మూలావిద్య. ఓంయే మహత్తు. ప్రణవమేమో అవ్యక్తము. ఇక మాయ పద్ధతికొస్తే ఓంయే మాయ. ప్రణవమోమో మూలావిద్య.

ఓం అన్నా మాయ అన్నా ఒకటే. ఈ మాయవల్ల గూడా ఏమీ లేదు. మాయవల్ల సృష్టి ఏర్పడటానికి ఒక ఆరంభస్థితి ఉపక్రమణ స్థితి. తరువాత మూడు గుణముల సామ్యం చెదిరి సత్వగుణం ఒకటే విజృంభించింది. తరువాత తమో రజో గుణాలు కూడా విజృంభించాయి. ఈ రకంగా ఓంయే మాయాద్వారం. మాయాద్వారం గుండా సృష్టి వచ్చింది. లేనివి ఉన్నట్లు కల్పించడాన్ని సృష్టి అంటారు. ఎప్పుడైతే అన్నామో, దానికి సృష్టికి ఆది ఉంది. సృష్టికి పూర్వము ఆది లేదు. సృష్టిద్వారా సృష్టించబడినపుడు ఎప్పుడు సృష్టించబడిందో అప్పుడు మొదలు. ఆ మొదలే 'ఆది'. దేనికైతే ఆది ఉందో దానికి అంతముంది. ఆద్యంతములున్నదేదో సృష్టికి పూర్వము లేదు. సృష్టి పిదప లేదు. సృష్టికాలం మధ్యలో కల్పించబడి వున్నది. ఈ కల్పించబడి ఉన్నదే మిథ్య. ఆది ఉన్నది. గనుక ఆది ఉన్నదానికి అంతమున్నది. సృష్టియినదంతా కల్పితమైనది. విచారిస్తే లేనిది గనుక దేనికైతే ఆదీ అంతముందో దానికి మధ్యనేటటువంటిది వున్నప్పటికీ అది మిథ్య.

ఇక మూడు గుణాలు ఎలా ఉన్నాయో చూస్తే, సత్వగుణము జ్ఞానగుణములయందు ఇచ్ఛ పుట్టించును. జ్ఞానమంటే ఏమిటి? ఆ బ్రహ్మము ఆనంద స్వరూపం కనుక ఆనందం మీద ఇచ్ఛ కలుగును. ఆనందంకోసం ఇచ్ఛ కలుగుతుంది. ఆనందం సంపాదించడంకోసం ఇచ్ఛ కలుగుతుంది. ఆనందమనే అనుభవం అనుభవించడానికి ఇచ్ఛ కలుగుతుంది. కనుక సత్వగుణం అంటే సుఖాభిలాష. మరి ఆనందమయకోశంలో సుఖాభిలాషకు కలిగే ఇచ్ఛ, ప్రియమోద ప్రమోదములు. అదే ఇచ్ఛ. రజోగుణము రాగతృష్ణలయందు ఇచ్ఛ పుట్టించును. రజోగుణం అంటే సుఖాభిలాష ఉండగానే, ఆనందం కావాలనే కోరిక పుట్టగానే ఆనందం లభించలేదు. ఆనందం కావాలీ అంటే రజోగుణం కావాలి. ఈ రజోగుణం యొక్క ప్రభావం ఎలా ఉటుంది అంటే రాగతృష్ణగా ఉంటుంది. అంటే ఏ వస్తువుద్వారా నీకు ఆ ప్రియమోద ప్రమోదాలు అనే ఆనందం ఉంటుందో ఆ వస్తువుమీద రాగము కలుగుతుంది. రాగము కలగడమే కాకుండ ఆ వస్తువును పొందాలి అనేటువంటి తృష్ణ, కాంక్ష, వాంఛ

కలుగుతుంది. తృష్ణ అంటే మనం దప్పిక తీర్చుకోలేదా? దాహం కలగగానే నీళ్ళమీద రాగం కలిగింది. నీళ్ళు దొరక్కపోతే ఏమైంది నీళ్ళకోసం తపన పడ్డావు. నీళ్ళు ఎలా సంపాదించాలా అనేది తృష్ణ. దాహమేసినప్పుడు నీళ్ళమీద కలిగేది రాగం. నీళ్ళను సంపాదించాలనేటువంటి తపన పేరు తృష్ణ. తమోగుణము విపరీత జ్ఞానము. ఈ తమోగుణమేంటి? ఆనందం నీయందే ఉంటే ఆనందం ఎక్కడో ఉందని చెప్పుకోవడమే తమోగుణం. తమోగుణం విపరీత జ్ఞానాన్ని పుట్టించింది. సత్వగుణమేమో సరి అయిన జ్ఞానం. తమోగుణమేమో మోహముతో కూడిన జ్ఞానం. ప్రశాంత స్థితి లభించడంవల్ల నీలోనే నీకు ఆనందం పుడుతుంది. సత్వగుణం జ్ఞానానికి అతి దగ్గర అందుకే సత్వగుణంవల్ల జ్ఞాన గుణములందు ఇచ్ఛ పుడుతుంది అంటున్నారు.

భగవద్గీతలో గుణత్రయ విభాగంలో ఏమి చెప్పారు? సత్వగుణము వలన విషయములందు సుఖాభిలాష కలుగుతుంది. రజోగుణం వలన ఆ సుఖేచ్ఛ వలన కర్మచేసి, ఆ సుఖం పొందాలని ప్రయత్నం చేస్తాడు. తమోగుణం అంటే దేహమే తాననే అజ్ఞానము. ఆ శరీరము మీది వ్యామోహము. ఇప్పుడు సుఖాభిలాష ఏమయ్యింది? శరీర సుఖమునకు, ఇంద్రియ భోగములకు సంబంధించినదైనది. అదే సుఖం, శరీరానుసారమైనది కాకపోతే, సత్వగుణము వలన జ్ఞానం లభిస్తుంది. **"సత్వాత్ సంజాయితే జ్ఞానం"** అన్నారు.

సుషుప్తిని భగవంతుడు ఎందుకు ప్రసాదించాడు అంటే సుషుప్తి లేకుండా కేవలము జాగ్రదవస్థలో ఉంటే మనం చేసిన పాప పుణ్యాలయొక్క కర్మ ఫలితాన్ని అనుభవించేటప్పుడు ఒక్కోసారి సుషుప్తి ఊరటిస్తుంది. సుషుప్తి నిర్విషయం చేస్తుంది. సుషుప్తి నిర్విషయ స్థితిలో ఆత్మ సాన్నిధ్యానికి తీసుకెళుతుంది. ఆత్మ సాన్నిధ్యంలో ఉన్నటువంటి జీవుడికి తృప్తి కలుగుతుంది. ఆ నిర్విషయ స్థితిలో నిష్క్రియ స్థితిలో కర్మ జరగదు. కొద్దిపాటి కర్మ శ్వాస ప్రశ్వాసలుగా జరుగుతుంది గాని కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలుతోటి మనో బుద్ధులతో ఆలోచనలు, ఊహలు చేసేటువంటి కర్మ ఆగిపోతుంది. ఇలా కర్మ చేయడం ఆగిపోయేసరికి ఈశ్వర సత్తానుంచి ఈశ్వరున్నుండి వచ్చినటువంటి శక్తి, కర్మలు చేయటంవల్ల జాగ్రదవస్థలో ఎక్కువగా ఖర్చు అవుతుంది. స్వప్నావస్థలో తక్కువగా ఖర్చు అవుతుంది. గాఢనిద్రలో శ్వాస ప్రశ్వాసల రూపంలో, లోపలున్నటువంటి అవయవాల యొక్క సంచలనాలు. తిన్నటువంటి ఆహారము జీర్ణమవటములాంటివి కొన్ని కనీసంగా ప్రక్రియ జరుగుతూ వుంటుంది. నువ్వు తీసుకునే శ్వాసలో శక్తివస్తుంది. కర్మవల్ల, శక్తి ఖర్చు అవుతుంది. గాఢనిద్రలో ఖర్చు తగ్గుతుంది. అందువల్ల ఎంత అలసిపోయిన వాడైనాసరే కొంచెం బలం పుంజుకొని పొద్దున లేస్తాడు. కనుక ఈ ప్రకృతి సుషుప్తి అనేది ఎందుకు పెట్టింది అంటే కొంత శాంతంగా కొంత శక్తి పుంజుకోవడానికి మళ్ళీ జాగ్రదవస్థలో కర్మ చేయడానికి, అవసరమైన శక్తిని మళ్ళీ సంపాదించడానికి ఉపయోగపడుతుంది. పైగా నిర్విషయమైతే హాయిగా ఉంటుందని సుషుప్తి మనకు పాఠం చెప్తున్నది. జాగ్రత్‌లోనే నిర్విషయంగా ఉండేవాళ్ళు ప్రశాంతముగా ఉంటారు. ఏది ఏమైనా నిద్ర అనేటువంటిది తమోగుణ లక్షణమే. అది ప్రకృతి సిద్ధంగా ఎంతవరకుంటె అంతవరకు పరవాలేదు గాని, ఎక్కువగా నిద్రపోవడము. కర్మ చేయకుండ కూర్చోవడము, బద్ధకించడము. ఇవన్నీ కూడా తమోగుణ లక్షణాలు.

ఒక్కొక్క గుణాన్ని మూడు భాగాలు చేశాడండి. ఉత్తమగతి, మధ్యగతి, అథమగతి. మూడు గుణాలకి మూడు మూడులు తొమ్మిది రకాలు సృష్టి ఇక్కడ చెప్పడం జరిగింది. సత్వగుణం యొక్క ఉత్తమ గతివలన సృష్టికర్త బ్రహ్మ, ధర్మదేత, మహత్తు, అవ్యక్తములు కలిగెను. సత్వగుణము యొక్క మధ్య గతి వలన సోమయాజులు అంటే యజ్ఞ యాగాదులు చేసేవాళ్ళు ఋషులు అంటే తపస్సు చేస్తూండేవాళ్ళు సంపాదించిన జ్ఞానాన్ని ఇతరులకు అందించడం ఇతరులయొక్క జీవన విధానంలో విధి నిషేదాలు, సంప్రదాయాలు, ధర్మార్థ కామాలను ఏ విధంగా ఆచరించాలి, మోక్షమార్గంలో ఉండేటట్లుగ ఏ విధంగా ఆచరించాలి. చివరికి మోక్షాన్ని పొందాలి అనేటువంటి పద్ధతిలో ప్రజలందరికి కూడా ఒకే ప్రమాణంగా అందించేటువంటివాళ్ళు ఋషులు.

దేవతలు అంటే పరమాత్మ యొక్క చైతన్య ప్రకాశంచేత ఆ ప్రకృతిలో ఉన్నటువంటి ధర్మాలు. పరమాత్మలో ఉన్నటువంటి చైతన్యమే ఆ ప్రకృతిలో వ్యాపించి ప్రకృతి యొక్క ధర్మాన్ని శక్తిరూపంగా మారినప్పుడు ఆ శక్తులే దైవీశక్తులు. ఆ శక్తి కలిగినవాళ్ళే దేవతలు. ఈ దేవతలందు కూడా పురుషుడున్నాడు. ఆ శక్తేమో ఆ పురుషునియొక్క మాయాశక్తి. పురాణాల్లో పురుషున్ని భర్తగాను, మాయాశక్తిని భార్యగాను చెప్పడం ఆనవాయితీ. సృష్టికర్త బ్రహ్మశక్తి పేరు సరస్వతి. ఆ సరస్వతితో కూడి సరస్వతి యొక్క సృష్టి శక్తిని వినియోగించుకుంటూ బ్రహ్మ సృష్టి చేస్తాడు. పురాణాల్లో అలాగుంది. మామూలుగా అయితే బ్రహ్మ అనే పురుషుడు నిర్వికారుడు. పురుషుడియందు ఒక మాయాశక్తి ఉంది. ఆ మాయాశక్తిలో సృష్టి ఎలా చెయ్యాలనేటువంటి సృష్టిశక్తి, ఏ విధంగా సృష్టి జరగాలనేటువంటి జ్ఞానము. ఈ రెండు కలిసింది ఆ సరస్వతి. కనుక ఆ సరస్వతి అనే మాయాశక్తితో కూడినటువంటి పురుషుడే బ్రహ్మ. ఈ రెండింటిని విడగొడితే బ్రహ్మ పరబ్రహ్మమే అవుతాడు. మాయ కారణంగా పరబ్రహ్మ

సృష్టికర్త బ్రహ్మరూపంలో సృష్టి చేస్తున్నట్లుగా అనిపిస్తుంది. అలాగే మాయ కారణంగా లక్ష్మి అనే మాయాశక్తితో ఈ సృష్టి ఏదైతే ఉనికిలోకి వచ్చిందో దాని స్థితిగా, పోషణగా కొనసాగించేటువంటి శక్తి ప్రకృతిలో ఏదైతే ఉన్నదో ఆ శక్తి విష్ణు అనే పురుషుడ్ని ఆశ్రయించింది. ఈ విధంగా విష్ణువు యొక్క భార్య లక్ష్మి అని చెప్పడం జరిగింది. లక్ష్మి అంటే స్థితి కలిగించేది, పోషించేది. అనేక వస్తువుల్ని తయారుచేసి అందించేది. ఆ వస్తువులు అలాగ మనం అనుభవించేదాక మనకి అందుబాటుగా ఉంటాయి.

అంటే సృష్టించబడినవి వెంటనే లయం కాకుండా కొంతకాలం రూపాంతరం చెందుతున్నప్పటికి కూడా జీవులు వారి కర్మానుభవం కోసం తాత్కాలికంగా ఉండేలాగ దానికి స్థితి కలిగించి పోషిస్తూ ఉంటుంది. ఈ లక్ష్మీ శక్తి విష్ణువు అనే పురుషుణ్ణి ఆశ్రయించి, ఈ పని చేస్తుంది. కాని విష్ణువే లక్ష్మిని తన హృదయ స్థానంలో పెట్టుకొని, స్థితి కార్యము చేయుచున్నట్లు చెప్పుకుంటున్నాము. ఈ రకంగా ముక్కోటి దేవతలకి ముక్కోటి దేవతా శక్తులన్ని కూడా ఈ ప్రకృతి శక్తులే. ప్రకృతి అవ్యక్తంగా ఉన్నప్పటికీ ఆ శక్తి చైతన్యంతోకూడి శక్తి రూపంలో బైటకొచ్చినవే 'దేవతలు'. బ్రహ్మ–సరస్వతి, విష్ణువు–లక్ష్మి, రుద్రుడు–పార్వతి, ఈశ్వరుడు–ఆదిశక్తి, సదాశివుడు–పరాశక్తి, పురుషులందరూ గూడ నిర్వికారులే. శక్తితో కూడే సరికి సగుణమై సృష్టి, స్థితి, లయ విస్తీర్ణ ఆకర్షణ చేసేటువంటి దేవతలుగా మారారు. దేవతలు నిర్వికారమే వారిని, వారి శక్తిని విడకొడితే వారు పరబ్రహ్మమే. వారంతా కలిపి ఒక్కటైన పరబ్రహ్మమే. **బీజస్యాంతరివాంకురో జగదిదం ప్రాఙ్ నిర్వికల్పం** ఆ పద్ధతిలో బీజరూపంగా వున్నది అంకురించే శక్తి అనేటువంటి మాయా శక్తి ఎప్పుడైతే చేరిందో, ఆ పురుషుడు నిర్వికారుడైనప్పటికీ కూడా నిర్గుణుడైనప్పటికీ కూడా సృష్టికి ఎటువంటి సంబంధము లేకపోయినప్పటికీ సృష్టికర్తగా, పోషక కర్తగా, లయకర్తగా ఈ మాయ కారణంగానే లేకనే ఉన్నట్లుగా కనబడుతున్నారు. అందువల్ల ఉపాసనకి, భక్తికి నీలో ఉన్నటువంటి మూడు గుణాల్ని పునర్జన్మ హేతువైనటువంటి సంస్కారాలనుంచి విడుదల పొందటానికి ఈ సగుణ దేవతల్ని ఉపాసన చేయటం ద్వారా ఆ దేవతా స్వరూపం నువ్వే పొందుతావు. శుద్ధ సత్వ గుణానికి సంబంధించి కొన్ని కళ్యాణ గుణాల్ని సంపాదిస్తావు. అంతవరకు ఇది సాధనే. ఆ కళ్యాణ గుణాల్ని కూడా వదలిపెట్టాల్సి వచ్చినపుడు అక్కడ సాధన ఆగిపోయి, ఉపాసనలు అనుష్ఠానాలు ఆగిపోయి, గురుకృపతో మార్జాల కిశోర న్యాయంగా విడిబడాలి. అప్పుడది త్రిగుణ రహితము.

వేదాభిమానులు అంటే జ్ఞానాన్ని సముపార్జించాలి అనే దానిమీద తీవ్రమైన ఇచ్ఛ కలిగినవాళ్ళు వేదాభిమానులు. ధృవుడుంటే ధృవము అంటే కదలకుండా నిశ్చలముగా ఉండటం. ధృవుడంటే అచలుడే. ధృవ నక్షత్రం ప్రస్తుతానికి ఉంది. ఆ ధృవ నక్షత్రం చుట్టూ ఈ నక్షత్రాలతో సహా ఈ బ్రహ్మాండమంతా కూడా బ్రహ్మాండంలో పదార్థాలన్నీ కూడా ధృవనక్షత్రాన్ని కేంద్రం చేసుకొని గిరగిరా తిరుగుతున్నాయి. చంద్రప్రకాశం లేని రోజుల్లో ఒకసారి డాబామీదకెక్కి చూస్తే ధృవనక్షత్రం మన భూమిమీద ఉన్నటువంటి లాటిట్యూడ్‌బట్టి ఉత్తర ధృవంవాళ్ళకేమో ధృవనక్షత్రం నడినెత్తిమీద ఉంటుంది. భూమధ్యరేఖ మీద వున్నవాళ్ళకేమో ఆ ధృవ నక్షత్రం భూమికి తక్కువ ఎత్తులో కనబడుతుంది. ఆ ధృవ నక్షత్రం ఎప్పుడూ ఒక్కచోటే ఉన్నట్లు కనబడుతుంది. రాత్రివేళ చూస్తే దానిచుట్టూ సప్త మహర్షులు 7 నక్షత్రాలుంటాయి. నాలుగు మంచం కోళ్ళులాగా క్రమంగా గాకుండ కొంచెం వంకరగా ఉండి దానికి తోకగా మూడు నక్షత్రాలుండి వాటిని సప్త ఋషులంటారు.

ఆ తోకలో ఉన్న మూడు ఋషుల్లో మధ్య నక్షత్రమే వశిష్ఠులవారు. దాని ప్రక్కన మిణుకు మిణుకుమని కనబడీ కనబడకుండా ఉండేది అరుంధతీ నక్షత్రం. దీన్ని గనుక మీరు చంద్రప్రకాశం తక్కువగా ఉన్న రోజుల్లో ఏ అడ్డం లేనటువంటి చోటుకి, మేడెక్కి ఆకాశంవంక చూస్తే ధృవనక్షత్రాన్ని సప్త ఋషుల్ని చూస్తే రాత్రిపూట చూచినప్పుడు ధృవనక్షత్రం ఎప్పుడూ అక్కడే ఉంటుంది. సప్త ఋషులు ఎక్కడున్నారో అక్కడినుంచి తెల్లవారుఝామున చూసేసరికి ఇంకో పక్కకి వెళ్ళిపోయి వుంటారు. అంటే వాళ్ళు ధృవనక్షత్రం చుట్టూ తిరుగుతున్నారు.

ఈ బ్రహ్మాండం అంతా ధృవనక్షత్రం చుట్టూ తిరుగుతుంది అంటే ధృవనక్షత్రం ఇరుసులాంటిది. బండి చక్రానికి ఇరుసు కదలకుండ చక్రం ఎలా కదులుతుందో ఇరుసు గూడా కదిలితే ఇరుసుమీద కట్టినటువంటి బండిగూడ తలక్రిందులవుతుంది. బండి పైకే ఉంటుంది. ఎప్పుడు చక్రంతో పాటు బండి తిరగదు కదా! ఇరుసుమీద బిగించారు అంటే ఇరుసు తిరగదు. అలాగే ధృవుడు తిరగడు. ధృవుడు అచలం. **'అచలం ధృవం'** వీళ్ళు కూడా సత్వగుణం వల్ల వున్నారు. అచలం ధృవుడు కాని అచల పరిపూర్ణం కాదు. తాత్కాలికగా ఒక బ్రహ్మాండ కాలంలో ఒక సృష్టి కల్పంలో ధృవుడు కదలకుండా వున్నాడు. మరో సృష్టిలో ధృవుడు కదిలిపోతాడు. కొత్త ధృవుడొస్తాడు. కొత్త ధృవుడు మళ్ళీ ఆ బ్రహ్మ కల్పంలో కదలకుండ ఉంటాడు. మధ్యమగతి వలన యజ్ఞం చేస్తే సోమయాజులుగా, కొన్ని వ్రతాలు అవి చేస్తే వర్మ అంటారు. ఈ దేవతల్లో పితృ దేవతలు వేరు. వీరు ప్రేతాత్మలకు, అన్ని సూక్ష్మ శరీరాలకు అధిష్ఠాన దేవతలు.

సత్వగుణం యొక్క అథమగతివల్ల వానప్రస్థులు, సన్యాసులు, బ్రాహ్మణులు. బ్రాహ్మణులంటే కులాన్ని బట్టికాదు. బ్రహ్మజ్ఞానాన్ని బట్టి బ్రాహ్మణులు. విమాన సంచారులు. ఈ విమాన సంచారులు అంటే యక్షులు, నక్షత్రాలంటే సూర్యుడులాగ ప్రకాశించేవి. సూర్యప్రకాశం దానిమీద పడి తిరిగి ప్రతిఫలించి ప్రకాశించేవన్నీ గ్రహాలు. ఈ గ్రహాలకి సూర్యుడికున్నటువంటి స్వయం ప్రకాశం లేదు. సూర్యుడు గూడ నక్షత్రాల్లో ఒక నక్షత్రమే. సూర్యుడిలాంటి అనేక నక్షత్రాలు గూడ సత్వగుణం యొక్క అథమగతి వల్ల దైత్యులు అంటే రాక్షసులు మొదలైనవారున్నారు.

రజోగుణం యొక్క ఉత్తమ గతివల్ల గంధర్వులు, గుహ్యకులు అంటే బైటపడకుండా దాక్కుండేవాళ్ళు. యక్షులు, విద్యాధరులు, అప్సరసలు, మొదలగువారు కలిగారు. వాళ్ళు బాగా తీవ్రంగా స్పందిస్తే, ఇతరులను స్పందింపచేస్తుంటారు. ఈ భూమ్మీద, గ్రహాంతరాల్లో వేగంగా ప్రయాణం చేస్తుంటారు. రజోగుణం మధ్యగతి వలన రాజులు, క్షత్రియులు వీళ్ళకు రజోగుణం ఎక్కువ. రాజపురోహితులు. వాదాలు, తార్కాలు చేసేవాళ్ళు మొదలగు వారొచ్చారు. మానవుల్లో లాయర్లు గూడా రజోగుణం వల్ల వచ్చారు. వాళ్ళల్లో రజోగుణం పనిచేస్తుంది. రజోగుణం యొక్క అథమగతి వల్ల మల్లులు, నటులు, యోధులు, జూదరులు, త్రాగుబోతులు మొదలగువారు కలిగిరి. మల్లులు అంటే కుస్తిపట్లు పట్టేవాళ్ళు. అలాగే నటులు తమ స్వభావాన్ని ఉన్నది ఉన్నట్లు కాకుండా 'గోముఖా వ్యాఘ్రాలుగా' ఉంటారు. వాడు పులైనప్పటికి బైటకి ఆవులాగ సాధు జంతువులాగ నటిస్తుంటాడు. అటువంటి నటులు, యోధులంటే ఎవరు? ప్రాణాన్ని లెక్కచేయకుండా శరీరానికి ఎంత గాయమైనాసరే అవతలవాణ్ని శత్రువుని సంహరించే వారిని యోధులంటారు.

త్రాగుబోతులు మత్తు పదార్థాలను సేవించేవాళ్ళు. వీరంతా మత్తు అటే మనం తీసుకునే ఆహారంలో కూడా కొన్ని ఆహారాలు మత్తు కలిగిస్తాయి. కొన్ని ఆహారాలు మత్తు కలిగించవు. మత్తు కలిగించే ఆహారాలు అన్ని కూడా తమోగుణం యొక్క అథమ గతిలో ఉన్నవాళ్ళు స్వీకరిస్తారు. మాంసాహారం, గొడ్డు మాంసం తినేవారంతా కూడా తమోగుణ అథమగతి వల్ల సృష్టించబడ్డారు. వాళ్ళ తప్పేం లేదు. ఆ గుణంతో వారు సృష్టించబడ్డారు కాబట్టి వారలా ప్రవర్తిస్తున్నారు. అయితే సృష్టించబడ్డవారు అదే గుణంతో కొనసాగి అనేక జన్మలెత్తాల్సిన అవసరం లేదు. తమోగుణ అథమగతి నుంచి మధ్య గతికి, మధ్య గతినుంచి ఉత్తమ గతికి అక్కడ నుంచి రజోగుణ అథమగతికి, రజోగుణ ఉత్తమ గతికి, అక్కడనుండి తమోరజో గుణాలు రెండూ వదిలేసి సత్వగుణము యొక్క అథమగతి నుంచి మధ్యగతికి, మధ్య గతినుంచి ఉత్తమ గతికి, ఆ ఉత్తమ గతినుంచి కూడా శుద్ధ సత్వగుణం, శుద్ధ సత్వగుణం నుంచి విశుద్ధ సత్వగుణంకి, విశుద్ద సత్వ గుణంనుంచి త్రిగుణ రహితమైనటువంటి స్థితికి సాధనచేత గురువుయొక్క పర్యవేక్షణ చేత, గురుబోధ చేత మన ప్రయత్నం మనం చేసే అవకాశాలు మనకున్నాయి. ఆ రకంగా బుద్ధి వికాసము, విచక్షణా జ్ఞానము మానవ జన్మలో మనకనుగ్రహించబడింది. దాన్ని వినియోగించుకోవచ్చు. అదంతే, అదంతేలే అని వదలాల్సిన పనిలేదు. అదంతే అని ఎవరైతే దాన్ని పట్టించుకోరో వారు మరిన్ని జన్మలెత్తుతారు. అంతేగాని వాళ్ళని శపించేదెవరు లేరు. వాళ్ళని మార్చే వాళ్ళంతకంటే లేరు. అయితే సృష్టి విధానంలో వీళ్ళందరినీ మార్చటానికి అనుగుణమైనటువంటి వ్యవస్థ గురుతత్వము అవతార తత్వము అనే పేరుతో కారణ జన్ములు అనేటువంటి పేరుతో కొంతమంది ఉన్నారు. వీళ్ళు పరిణామము తొందరగా చెయ్యాలనేటువంటి పనిలో ఉన్నారు. అవి జరుగుతున్నాయి కూడా. అవి లేకపోతే మాత్రం 84 లక్షల జన్మలనేది ఎవరికి వాళ్ళే మోక్షం పొందడానికి పట్టేటటువంటి కాలం. దాన్ని తగ్గించడానికి ఇన్ని రకాలుగా కారణజన్ములు, రకరకాల అవతార పురుషులు, అలాగే సాధుపుంగవులున్నారు. అలాగే అనేక జ్ఞానభూమికల్లో ఉన్నవాళ్ళు తనకంటే రెండు జ్ఞానభూమికలకు అవతల ఉన్నవారు క్రిందనున్న వాళ్ళకి సహాయం చెయ్యగలిగిన స్థితిలో వుంటారు.

ఉదాహరణకి : ఆరవ జ్ఞానభూమికలో ఉన్నవాడు అయిదవ జ్ఞాన భూమికకి సహాయం చెయ్యలేడు గాని నాల్గవ జ్ఞాన భూమిక వరకు ఎవరికైనా సహాయమ చెయ్యగలడు. ఇంతమంది ద్వారా ఇది జరుగుతుంది. ఇదంతా ఎందుకు చెప్పుతున్నారనంటే ఈ మూడు గుణాలవల్ల తొమ్మిది రకాల సృష్టి జరిగింది.

వాళ్ళు పశుపక్ష్యాదులనుంచి సృష్టి పరిణామం నుంచి మానవులైనటువంటి స్థితిలో వీళ్ళంతా వున్నారు. దేవతా సృష్టి జరిగినపుడు కొందరు దేవతలుగా కొనసాగుచున్నారు. ఆ గుణముయొక్క విజృంభణలో సత్వగుణం మొట్టమొదట విజృంభించినప్పుడు ఉత్తమగతి వుంది. ఇంకా కొంచెం విజృంభించే సరికి మధ్యగతి చెందింది. ఇంకొంచెం విజృంభించేసరికి అథమగతి జరిగింది. ఆ తరువాత రజోగుణం విజృంభించడము మొదలు పెట్టింది. అదికూడ మొదట్లో విజృంభించేటప్పుడు

ఉత్తమగతి గానే ఉంది. రానురాను అధమగతి అయింది. ఇక్కడ తొమ్మిది చేశారు గాని 100ల భాగాలు కూడా చెయ్యవచ్చు. కాబట్టి గుణాలయొక్క మిశ్రమంగా ఉన్నారు అందరూ. కేవలం సత్వగుణంతో, కేవలం రజోగుణంతో లేరు. అందరూ అన్ని గుణాలయొక్క అనేక నిష్పత్తుల్లో మిశ్రమంగా వున్నారు. ఆ మిశ్రమమైనటువంటి స్వభావంతో ఉన్నవాళ్ళు ఒక్కొక్కసారి ఒక్కొక్క గుణ ప్రధానంగా పనిచేస్తాం. ఏ గుణ ప్రధానంగా మనం పనిచేస్తామో అప్పుడు మిగతా రెండు గుణాలు అణిగి వుంటాయి.

తమో గుణము యొక్క ఉత్తమగతి వలన చారణులు, పక్షులు, రాక్షసులు, పిశాచాలు వచ్చారు. తమోగుణం యొక్క మధ్యగతి వలన ఏనుగులు, గుర్రాలు, శూద్రులు వచ్చారు. శూద్రులు అంటే గుణ సంబంధంగా చూడండి మీరు. శమదమాదులు లేనివాళ్ళు సత్వగుణం లేనివాళ్ళు. పూర్తిగా తమోగుణంలో మునిగినవాళ్ళు అని చెబుతున్నాడక్కడ. తమోగుణం యొక్క మధ్యగతి వల్ల శూద్రులు వచ్చారు కాని శూద్రులు ప్రమోషన్ తీసుకోవచ్చు. తమోగుణం యొక్క మధ్యగతినుంచి ఉత్తమ గతికి అక్కడినుంచి రజోగుణంలోకి, అక్కడినుంచి సత్వగుణంలోకి ప్రయాణం చేసి శూద్రులు బ్రహ్మజ్ఞానం పొందే అవకాశం ఉంది. ఇది తల్లిదండ్రుల శుక్ల శోణితాలతో పుట్టినటువంటి శూద్రుల సంగతి మాట్లాడటం లేదు మనం. గుణకర్మ స్వభావాన్ని బట్టి అయినటువంటి శూద్రుల సంగతి చెప్తున్నాం. గుణకర్మ లెప్పుడు కూడా ఎవరైనాసరే తమకు తాము మార్చుకుంటూ సాధనచేసుకుంటూ శూద్ర స్థితినుంచి క్షత్రియ స్థితికి, క్షత్రియ స్థితినుంచి బ్రాహ్మణ స్థితికి ప్రమోషన్ తీసుకునే అవకాశాలున్నాయి. ఇది గుణాల్ని బట్టి చెప్పింది.

సత్యకాముడు శూద్రకులమే తన తల్లి జారిణి. దాసి అనే వృత్తిలో ఉండగా ఆ కాలంలో అతిథులెవరైనా వస్తే ఈ దాసీలని వారికి సేవచేయడానికి పెట్టినప్పుడు కొంతమంది అతిథులకి శృంగారం కావల్సి వస్తే ఈ దాసీలకు శృంగారాన్ని కూడా అందించేటటువంటి డ్యూటీ ఉన్నది. అందుకే భారతంలో ద్రౌపతి ఎప్పుడైతే దాసీ అయిందో ఆ దాసీని శృంగారానికి కూడ పిలవవచ్చు. అందుకే దుర్యోధనుడు పిలిచాడు. ఆ రోజుల్లో అది రైటే. అందులోని న్యాయాన్యాయాలు, ధర్మాధర్మాలు అది వేరే విచారిద్దాం. ఇక్కడ ఆ పద్ధతుంది కాబట్టి అలా పిలిచాడు దుర్యోధనుడు. అంటే అక్కడ క్షత్రియ కన్యగూడ దాసి అయ్యేసరికి వ్యభిచారం చేయాల్సి వచ్చింది బలవంతంగా. అటువంటి యుగాన్ని మార్చి నవయుగ నిర్మాణాన్ని చేయడానికే కురుక్షేత్ర యుద్ధము కావలసి వచ్చింది.

సత్యకాముడు అలా కాదు. జారిణికి పుట్టాడు. ఎవరివల్ల పుట్టాడో తెలీదు, ఇదే సంగతి చెప్పు నాయనా గురువు దగ్గరికెళ్ళి విద్యనర్థించు. నీ కులమేమిటి, నీ గోత్రమేమిటి అడుగుతారు. ఉన్న విషయం అబద్ధమాడకుండా నిజంగా ఇలా చెప్పు అంది. అప్పుడు ఆ సత్యకాముడు శ్వేతకేతుడు అనే గురువు దగ్గరకు వెళ్ళాడు. వెళితే అడిగితే అదే చెప్పాడు. నువ్వు నిజం చెప్పావు కాబట్టి ఎవరైతే నిజం చెప్తుతారో వాళ్ళు బ్రాహ్మణులే అన్నాడు. వెంటనే ఉపనయనం చేసి జంధ్యం వేసి బోధ ప్రారంభించాడు. అక్కడ పుట్టుకతో గాని, ఒక ధర్మంతోగాని శూద్రత్వం వచ్చినప్పటికీ, సత్యత్వంతో, సత్యాన్ని ధర్మాన్ని ఆచరించటంతో ఆ శూద్రత్వం పోయి బ్రాహ్మణత్వం వస్తుంది. బ్రాహ్మణత్వం ఎవరికివాళ్ళు సంపాదిస్తే వాళ్ళు బ్రాహ్మణులవుతారు. బ్రాహ్మణుల్లో గూడా ఈ బ్రాహ్మణత్వం లేనివాళ్ళు శూద్రులవుతారు. కనుక ఇక్కడ శూద్ర అనే పదంతోటి అపార్థం చేసుకోకుండ విపరీతార్థం చేసుకోకుండా మనం ముందుకెళ్ళాలి.

తురకలంటే మ్లేచ్ఛులు, మ్లేచ్ఛులంటే విదేశీయులు. సామాన్య పదానికి తురకలు అంటే టర్కీనుంచి వచ్చినవాళ్ళు. టర్కీ అనేటువంటి ముస్లిమ్ దేశంనుంచి వచ్చినవాళ్ళు. తురకలు అంటే వేద భూమిలో కాకుండా వేద పద్ధతిలో కాకుండా వేద విరుద్ధంగా వుండేవాళ్ళు అని తీసుకోవాలే గాని ముస్లింలని, క్రైస్తవులని అనుకోకూడదు. మ్లేచ్ఛులని, తురకలని కొంతమంది చరిత్రలో వాడుతున్నారీపదాలు. ఆ రకంగా చూసుకోకూడదు. ఎందుకంటే షిరిడీ సాయిబాబా తురకే. బాబా జాన్ తురకే. తాజుద్దీన్ బాబా తురకే. అయినా వాళ్ళు సద్గురువులవ్వలేదా! అందుకని గుణాన్ని బట్టి తీసుకోండి. మనం ముస్లిమ్స్ కాకపోయినా, క్రైస్తవులు కాకపోయినా గుణాల్ని బట్టి మనలో కూడా కొంతమంది తురకలున్నారు. సింగము అంటే సింహము. పులి మొదలుగునవి కలిగెను. తమోగుణము యొక్క అథమగతి వలన కొండలు, నదులు, సముద్రములు, వృక్షములు, పురుగులు, తేళ్ళు, చేపలు, తాబేళ్ళు, అనేక పశువులు సృష్టించబడ్డాయి. ఇప్పుడు 9 కేటగిరీలు చేశాడు. తొమ్మిదే రకాలు కాదు. వీటి మధ్యలో దాన్ని 9 భాగాలుగా కాకుండ 90 భాగాలు చెయ్యవచ్చు. 99 భాగాలు చెయ్యవచ్చు. చేస్తే ఈ మధ్యలో గుణములయొక్క మిశ్రమంతోటి ఈ సృష్టి ఉన్నది. ఈ సృష్టంతా మూడు గుణములవల్ల కలిగిందని ఇక్కడ తెలుస్తున్నాము. దీనిలోనే చరాచర జగత్ అంతా వుంది.

# సృష్టి వికాస వ్యావర్తనములు

సృష్టి ఆరంభం ఏ మాదిగా ఉంది? ఆరంభానికంటే ముందు సృష్టికి సన్నాహం ఎలా జరిగింది? నిర్వికార అద్వయ పరబ్రహ్మమునుండి ఆయన వికారం చెందకుండానే ఈ సృష్టి ఎలా వచ్చింది? అనేది తెలుసుకోవాలి. మానవ సృష్టి ఎలా జరిగింది? అతనిలో చైతన్య వికాసము ఏ విధంగా జరిగింది? అది మళ్ళీ వ్యావర్తనం ఎలా జరిగింది? ఈ పదాలకు అర్థం కూడా తెలియాలి.

కేవల పరబ్రహ్మమే అద్వయమై, పరిపూర్ణమై, అచలమై ఉన్నాడు. అప్పటికి దేశము, కాలము, పంచభూతాలు ఏమీ లేవు. పరబ్రహ్మకంటే రెండవది ఏదీ లేదు. ఆ పరబ్రహ్మమందు, ఆ పరబ్రహ్మకు సంబంధం లేకనే ఒక ఆది విలాసము ఉప్పొంగింది. దీనిని త్రిగుణాత్మకమైన మూలావిద్య అనవచ్చును. దీనిని ప్రథమ ప్రేరణ, ప్రథమ స్పందన, త్రిగుణముల బీజావస్థ, మూల ప్రకృతి అని పేర్లతో పిలుస్తారు.

ఈ స్పందన నిజానికి రాలేదు. మాయ లక్షణము వలన వచ్చింది కనుక పరబ్రహ్మకు ఏ సంబంధము లేదు. మాయ లేనిది కనుక, పరబ్రహ్మ ఒక్కటే అన్నదానికి భంగము లేదు. తదుపరి క్రమసృష్టికి బాధ్యత మూలా విద్యదే కాని పరబ్రహ్మది కాదు.

ఈ విధముగా సృష్టి రావడానికి ఆ మూడు గుణములే కారణము. ఈ మూడు గుణములతో కూడినదే మాయ. మాయ అంటే ఏది లేదో అది ఉన్నట్లు కనిపించేలా భ్రాంతి పుట్టించేది. మూడు గుణములు బీజస్థితిలో ఉన్నప్పుడు సృష్టి అవ్యక్తము. ఆ మూడు గుణములు సృష్టి చేయుటకు ఉపక్రమించినప్పుడు బీజావస్థ నుండి అంకుర దశకు చేరినవి. అక్కడ ఆ గుణాలు సామ్యముగా ఉన్నాయి. దీనిని సృష్టిపరముగా ప్రకృతి అనియు, ఈ ప్రకృతి ఏ బ్రహ్మనైతే ఆశ్రయించిందో, ఆ బ్రహ్మము మహత్ బ్రహ్మ అనియు అందురు. ఈ ప్రకృతి పురుషుల కలయికయే మహత్తు.

మహత్తునుండి సృష్టికి ఉపక్రమించిన పిదప, ప్రకృతి, పురుషుల కలయిక వలన మహదహంకారము పుట్టింది. ఈ మహదహంకారమే సగుణ బ్రహ్మ. ఈయన పేరే హిరణ్య గర్భుడు. ఈయన ప్రథమాత్మగా సృష్టిలోకి వచ్చాడు. ఈయనలో కలిగే సంకల్పం వలన తన్మాత్ర సృష్టి మొదలయింది. ఆ సంకల్పము అనేది పంచశక్తుల వలన కలిగింది. పూర్వసృష్టి జ్ఞానమననుసరించి, ఆయనలో ఉన్న సృష్టివాసన పరాశక్తి ప్రేరణ వలన, ఆయనకు సృష్టి చేయాలని సంకల్పము కలిగింది. సృష్టి ఏ విధముగా చేయాలనే జ్ఞానము, జ్ఞాన శక్తివలన కలిగింది. అది గుర్తుకు రాగానే సృష్టి చేయాలనే ఇచ్ఛ కలుగుటకు కారణము ఇచ్ఛాశక్తి. పిదప క్రియాశక్తి ప్రేరణతో సృష్టి కార్యము జరిగింది. ఎప్పుడైతే సగుణ బ్రహ్మమయ్యాడో, ఈ సృష్టికి ఆది పురుషుడవముచేత ఆది శక్తి రూపుడైనాడు ఆ బ్రహ్మ. ఈ విధముగ పంచశక్తుల ప్రమేయముతో సృష్టి జరుగుట ప్రారంభమై కొనసాగుచున్నది.

తరువాత త్రిగుణాత్మిక మాయలో గుణ సామ్యము చెదిరి, సత్వగుణము మాత్రమే విజృంభించగా, అది శుద్ధ సత్వమాయ అయినది. ఈ మాయయందు అధిష్ఠాన బ్రహ్మ ప్రకాశించగా, ఆ ప్రతిఫలించిన ప్రకాశములో శుద్ధసత్వ మాయ యొక్క గుణములతో కూడి ఈశ్వరుడు తోచాడు. తరువాత తమో రజో గుణములు జంటగా విజృంభించగా ఈ రెండు గుణములు కూడి అవిద్య అయింది. అధిష్ఠాన బ్రహ్మ అవిద్యయందు ప్రతిఫలించగా అనేక జీవులయ్యింది. సమష్టిలో ఈశ్వరుడే, వ్యష్టిలో జీవులుగా ఏక కాలములో ఉన్నారు.

మాయా ప్రతిబింబములు గనుక వీరికి మాయా ప్రపంచము తోచింది. అవిద్య ఉన్న జీవులకు ప్రపంచముతో సంగత్వము కలిగింది. అవిద్య దోషములేని ఈశ్వరుడు ఈ ప్రపంచాన్ని ఈక్షించి ఊరక ఉన్నాడు. కాలక్రమములో ఈ ప్రపంచము మాయాకల్పితము అయినప్పటికీ ఆయనలో కర్తృత్వ కలిగి త్రిమూర్తిత్వము కలిగి సృష్టి స్థితి లయ కారులుగా విభజించబడ్డాడు.

ఈశ్వరుని నుండి తన్మాత్రలు, సూక్ష్మ భూతాలు, స్థూల పంచ మహాభూతాలు క్రమ పరిణామముగా తోచి, నామ రూప జగత్తుగా ఆవిర్భవించింది. జీవులు (1) శిలలుగా (2) లోహములుగా (3) వృక్ష జాతిగా (4) క్రిమ కీటకాదులుగా (5) జలచరములుగా (6) వాయు చరములుగా (7) జంతువులుగా – ఏడు దశలలో పరిణామము చెంది మానవ జన్మలు మొదలైనాయి.

ఇక్కడ శిలలో అతి తక్కువ చైతన్యము ఉండి, మానవ జన్మకి వచ్చేసరికి ఆ చైతన్యము వికాసమై మానవుని బుద్ధి జీవునిగా పరిణమింపజేసినది. ఇదే సృష్టికి చైతన్య వికాసము.

ఎప్పుడైతే మానవుడు ఆధ్యాత్మిక ప్రయాణం మొదలుపెట్టి, స్థూల ప్రపంచానుభవాలను, స్థూల సంస్కారములను విడిపించుకొని, సూక్ష్మ ప్రపంచాన్ని అనుభవంలోకి తెచ్చుకున్నాడో, ఆ క్రమములో చైతన్య వ్యావర్తనము జరుగుచున్నది. సూక్ష్మ ప్రపంచానుభవములను, సూక్ష్మ సంస్కారములను వదిలించుకొని మానసిక ప్రపంచంలోకి ప్రవేశించి, అక్కడ కూడా మానసిక సంస్కారములు రహితమయ్యేసరికి, చైతన్య వ్యావర్తనము పూర్తి అయింది. వ్యావర్తనము అంటే ముకుళించుకోవడము.

మానవ జన్మ వచ్చేవరకు చైతన్య వికాసము పూర్తి అయింది. దానివలన బుద్ధిని ఉపయోగించగల మానవుడు తయారయ్యాడు. ఆ బుద్ధిని పునర్జన్మ హేతువుగా కాకుండా, బ్రహ్మజ్ఞాన సముపార్జన కొఱకు ఉపయోగించేసరికి, మాయతో, అవిద్యతో కలిసిపోయి ఉన్న చైతన్యము వ్యావర్తనమై, ముకుళించుకొని, చివరకు లేనిదైనది. ఎప్పుడైతే మాయ, అవిద్య ప్రభావము లేనిదైనదో, ఆ మానవుడు బ్రహ్మీభూతుడై యున్నాడు.

ఈ విధముగా సృష్టి వికాసము, వ్యావర్తనము స్పష్టీకరించదమైనది. ఈ రకమైన అవగాహనతో, మరింత లోతుగా తెలుసుకునే ప్రయత్నము చేద్దాము.

పరబ్రహ్మమందు ఆకస్మికముగా, ఆది విలాసము ఉప్పొంగగా, ఎఱుక అనే సృష్టి జీవేశ్వర జగత్తులుగా ఒక క్రమపద్ధతిగా తోచింది. పరశివ సత్తాగా ఉండిన శూన్యమునుండి, భగవంతుడు సర్వముగా తోచెను. శూన్యమే సర్వమైనది. ఎలాగంటే, భగవంతుడు ఒక్కడే గనుక ఆ ఒకటి ప్రక్కన, కుడివైపు అనేక సున్నాలు పెడితే ఆ ఒక్కటీ 10, 100, .... ఈ విధముగా లెక్క అధికమైనట్లు ఈ మాయాకల్పిత సృష్టి వికసిస్తూ విస్తరిస్తూ పోయింది. సున్నాల వల్లనే లెక్క పెరిగింది గనుక విచారిస్తే సర్వమూ శూన్యమే. అనగా 1కి కుడివైపు సున్నాల వలె మూల ప్రకృతి, మహత్తు, తన్మాత్ర సృష్టి జరిగి పెరిగింది. జగన్మిథ్య అన్నప్పుడు ఈ పెరిగినదంతా విలువ లేనిది.

పోనీ ఆ ఒక్కటీ సత్యమని అందామంటే, కుడిప్రక్క సున్నాల వలన వచ్చిన విలువతో ఉంటే, అది కూడా సున్నాయే. కుడివైపు సున్నాలుగా ఉన్నది సున్నాయేనని, దృశ్య రహితమై, దృక్ రహితమై ఉంటే ఆ ఒక్కటి కూడా లేనిదే. అది ఆ ఒక్కటైన సగుణ బ్రహ్మకి ఎట్లా తెలుస్తుంది?

ఆ ఒక్కటికి మూలం లేదని, తన ఎడమ ప్రక్క సున్నాని చూస్తే చాలు. తాను గొడ్రాలి బిడ్డ సామెతగా లేకనే ఉన్నట్లు తోచాడని తెలుసుకొని, గురు కృపతో తాను ఉన్నాడనే ఎరుకను విడచి, లేనివాడవగలడు. అంటే ఉన్నది బయలే.

**ఒంటుకుదాపల । బింద్వొక**
**టంటించిన కొలది । లెక్క యధికంబగు ।నా**
**వొంటుకు వలపల । బొంద్వొక**
**టంటించిన । లెక్క ఉళక్కొ గదనోయీ ।**
**ఒంటుండీ లేందౌ గదనోయీ ॥**

బ్రహ్మ స్వరూపమేలాగున వచ్చినది? పరబ్రహ్మమందున్న ప్రకాశ బిందువు అనే కళయే బ్రహ్మ స్వరూపము. ఇది 'అ'కార స్వరూపము, చంద్రమండలము. విమర్శ బిందువు శక్తి స్వరూపము, అగ్ని మండలము, 'హ'కారమనే బీజము. ఈ రెండింటి సామ్యము, సామరస్యమే 'అహం' అనే నాదము. ఈ నాదబ్రహ్మమే సృష్టికి ఆది. బిందుత్రయము, మండల త్రయము గురించి ఇంతకుముందు వివరముగా తెలుసుకున్నాము కదా!

ప్రకాశబిందువు, విమర్శ బిందువుల కలయికయే శివశక్తుల స్వరూపము. ఇదియే సృష్టికి కారణము. ఈ కలయికలో సామరస్యముగా నున్న "అహం" అనేది అన్ని ప్రాణులలో రహస్యముగా నున్నది. అదియే పరమాత్మ. జ్ఞాన దృష్టి కలిగినవారు దీనిని తెలుసుకొని "అహంబ్రహ్మ" అనే స్వానుభవమును కలిగి యుంటారు.

చంద్రమండల ప్రకాశమువల్ల 'అ' పుట్టింది. అగ్ని మండల ప్రకాశమువల్ల 'హ' పుట్టింది. ఈ రెండు కలవడం వల్ల 'అహం' పుట్టింది. మిశ్రమ బిందువులో అహం అనేది తోచింది. మిశ్రమ బిందు ప్రకాశమే సూర్య మండలంము. సూర్యమండల ప్రకాశమే 'అహం' అయ్యింది. 'అ', 'హ', రెండు మిశ్రమమైనవి గాబట్టి 'అ'కి, 'హ'కి, చివర 'సున్న' పెడితే 'అంహం' అయింది.

సున్నా ఎందుకంటే 'అహం'కు ఆది, అంతమున్నాయి. పైగా అది లేని అహం. అందుకనే అ,హ ప్రక్కన సున్నా చేర్చాము. ఈ అహమనే మిశ్రమ బిందువే అంతఃకరణ, అంతఃకరణ ప్రతిబింబ ప్రకాశమే అహం. ఈ అహమే చిదాభాసుడు.

సృష్టి వికాసం అంటే దేశము, కాలము, వస్తువులు అవ్యక్తముగా వున్నటువంటి విశ్వము, వ్యాపిస్తూ వ్యాపిస్తూ వ్యాపిస్తూ వుంటుంది. ఇది వికాసం. కోటానుకోట్ల సంవత్సరాలు పడుతుంది పూర్ణవికాసానికి. ఈ సృష్టిలో వున్నటువంటి ప్రాణులు జీవుల పరిణామము కూడా దాంట్లో భాగంగానే జరిగిపోతుంది. మానవులలో కూడా ఈ చైతన్యం వ్యాపకం అయినటువంటిది ఏదో, అది క్రిమికీటకాదులలో, పశుపక్షాదులలో చైతన్యం క్రమంగా వికసిస్తూ మానవ జన్మకి వచ్చేసరికి చైతన్య వికాసం పూర్తవుతుంది. చైతన్య వికాసం పూర్తవడానికి కొన్ని ఉపాధులు ధరించి (ఉపాధులంటే శరీరాలు) ఆ శుద్ధ పరమాత్మ చైతన్యము ఈ శరీరాల ద్వారా శరీరాలతో వున్న దోషాలతో కూడి బాహ్యానికి ప్రకటించబడుతుంది. ఈ ఉపాధులు ధరించినటువంటి జీవికి ఏ ఉపాధిగతమైన అనుభవము – పరిణామ దశలో నీచోపాధినుంచి పురుగు అనే ఉపాధినుంచి జంతువు అనే ఉపాధి దాకా– ఉపాధికి సంబంధించిన అనుభవాలు జరుగుతున్నప్పుడు ఆ అనుభవాలే వాసనలుగా సంస్కారాలుగా మారతాయి. కనుక ఈ చైతన్య వికాసానికి ఈ సంస్కారములు ఈ పరిణామము ఇవన్నీ దోహదపడ్డాయి.

ఇప్పుడు మానవ జన్మ వచ్చేసరికి చైతన్య వికాసం పూర్తయింది కనుక ఇట్టి చైతన్యము ఇట్టి వికాస స్థితిలో తానెవరో తాను తెలుసుకోవడానికి యోగ్యతని సంపాదించింది. అయితే ఈ పరిణామ దశలో పశుపక్ష్యాదుల సంస్కారాలన్నీ కూడా అవరోధంగా వున్నాయి. నేను ఆత్మను, నేను బ్రహ్మను అనే అనుభవం పొందటానికి ఈ సంస్కారాలతో కూడిన చైతన్యము అవరోధంగా వుంది. అనుభవం లేనప్పుడు సంస్కారాలు వాసనా రూపంలో కారణ రూపంలో వున్నాయి. అనుభవానికి వచ్చినప్పుడేమో అది కార్యరూపంలో జాగ్రత్ స్వప్నావస్థలగా వున్నది. ఈ విధంగా సంస్కారాలతో కూడినటువంటి అనుభవము వున్నప్పుడు శుద్ధచైతన్యానుభవం మరుగునపడింది. ఆ శుద్ధచైతన్యమే మనలో వుంది, కాకపోతే సంస్కారాలచే ముద్రించబడి వుంది. ఈ సంస్కారాలన్నీ చెరిగిపోతే శుద్ధచైతన్యమే స్వానుభవానికి వస్తుంది. సంస్కారాలతో కూడిన శుద్ధచైతన్యము మలిన చైతన్యము అయ్యేసరికి ఆ మలిన చైతన్యమే ప్రస్తుతానికి అనుభవంలో వుంది. కనుక దీనిని వడపొయ్యాలి. సంస్కారాలతో కూడిన అనుభవము దానిని విచారించి తొలగించుకుంటే, ఆ వడపోతలో ఏ శుద్ధచైతన్యము అయితే మిగిలి ఉంటుందో అది నీ స్వరూపం. అది నీ స్వానుభవం. ఈ వికసించిన చైతన్యము వికాసానికి పనికొచ్చేటటువంటి సంస్కారాలు ఇప్పుడు చైతన్యం వికసించిన తరువాత సంస్కారంతో కూడిన చైతన్యంనుంచి ఈ శుద్ధ చైతన్యాన్ని వేరుపరచి వాసనా క్షయం చేసుకోవాలి. సంస్కారాల ముద్రలని చెరిపేసుకోవాలి. ఈ సంస్కారాలతో కూడిన అనుభవమే అజ్ఞానం. సంస్కారాలు తొలగిపోయిన తరువాత, తుడిచిపెట్టుకు పోయిన తరువాత, అదే చైతన్యము శుద్ధ చైతన్యముగా వున్నప్పుడు, ఏ అనుభవం అయితే వుందో, అది జ్ఞానము. **సంస్కారాలతో కూడిన అనుభవం అజ్ఞానం, సంస్కారాలనుండి విడుదలైన చైతన్య అనుభవం జ్ఞానం. ఇదీ జ్ఞానాజ్ఞాన బేధము.**

చైతన్యమే నీవై వున్నావు. నీవైన నీ చైతన్యము మీద సృష్టి పరిణామంలో పశుపక్ష్యాదుల యొక్క ఉపాధిగతమైనటువంటి అనుభవాలు, ముద్రించబడ్డ సంస్కారాలు వున్నాయి. కనుక నీ చైతన్యము ఆ సంస్కారముల ద్వారా ప్రకటితమై సంస్కారానికి అనుగుణమైనటువంటి అనుభవం వస్తుంది. అనుభవించే సామర్థ్యం నీకు వుంది. అనుభవం ఎలా వుంటుందో మాత్రం తెలియదు. శరీరానుసారమైనటువంటి అనుభవాలు వస్తున్నాయి. శబ్ద స్పర్శ రూప రస గంధ అనుభవాలు లేకపోతే కూడా, ఒక అనుభవం ఎప్పుడూ వుంది. ఎందుకంటే ఆ అనుభవమే ఆధారంగా ఈ అనుభవాలన్నీ కలుగుతున్నాయి. జడమైన కర్మ, జడమైన సంస్కారాలు నీకు అనుభవం ఇవ్వవు. చైతన్యం మీద ముద్రించబడ్డప్పుడు చైతన్యానుభవంలో భాగంగా ముద్రతో కూడిన చైతన్య అనుభవాలు వస్తున్నాయి మనకి. ముద్రలు తీసివేస్తే కేవలం శుద్ధ చైతన్యానుభవం మిగులుతుంది. కాబట్టి జ్ఞానాన్ని ఎక్కడి నుండో సంపాదించనక్కర్లేదు. నువ్వు జ్ఞాన స్వరూపివే అయి వున్నావు. ఈ జ్ఞానం అనేటటువంటిది శుద్ధ చైతన్యానుభవం. శుద్ధ చైతన్యానుభవం వుండగానే కొన్ని సంస్కారాలు ముద్రించబడ్డాయి. ముద్రించబడినటువంటి సంస్కారాలు చెరిగి పోవాలి. వైరాగ్యంతో గాని, మిథ్యా భావంతో గాని, విచారణతో శుద్ధ చైతన్యం ఇలా వుంది, సంస్కారంతో కూడిన చైతన్యం అలా వుంది, ఆ సంస్కారాలు తీసేస్తే శుద్ధచైతన్య అనుభవం వస్తుంది అని తెలిస్తే చాలు. ఇక సాధన చేసుకుని చెరిపేసుకునే పని చేస్తాము. ఇదంతా కూడా అనాగరిక మానవుడు ఎప్పుడైతే తయారయ్యాడో, ఆ ఉపాధితో ఆ జీవుడు ఎప్పుడైతే వచ్చాడో, వాడికి ఇట్లా తుడిచేసుకోవాలి ఈ సంస్కారాలని అని తెలియదుగా! కనుక కొన్ని లక్షలాది పునర్జన్మల

ద్వారా, ప్రియమోదప్రమోదం అనేటటువంటి సుఖాభిలాషతో దుఃఖం రాకూడదని, తాపం కలగకూడదని, బాధ కలగకూడదని, రకరకాల ప్రయత్నాలు మనం చేస్తున్నాం. ఈ చెయ్యడంలో కూడా కొన్ని సంస్కారాలు నీకు ఉపయోగంగా లేవు. ఆ సంస్కారానికి సంబంధించిన అనుభవాన్ని నీ అంతట నీవే వదిలేస్తున్నాయి. తెలివి పెరుగుతోంది, బహిర్ముఖమైన బాహ్య తెలివి పెరుగుతోంది, గడుసుదనం పెరుగుతోంది, ఉపాయాలు పెరుగుతున్నాయి, శాశ్వత సుఖం కోసం ప్రయత్నం చేస్తున్నాము, దుఃఖం రాకుండా వుండటానికి ప్రయత్నం చేస్తున్నాము. ఈ తెలివి పెరిగీ పెరిగీ, ఎంత పెరిగినా గానీ శాశ్వత సుఖం రాలేదు, దుఃఖం మాత్రమే వస్తోంది.

ఇలా కొంతమందిలో ఆ తెలివి పెరిగితే, వాళ్ళు ఏమి చేశారంటే, ఈ ప్రపంచంలో ఏది చేసినా గాని అన్నీ అనిత్య వస్తువులే, కనుక అనిత్య వస్తువుద్వారా ఎంత ఆనందం కలిగినప్పటికీ, దానికి నిత్యత్వం లేనందువల్ల ఆనందం కూడా ఆగిపోతోంది. ఆనందానికి మరిగినవాడు ఆ ఆనందం ఆగిపోగానే దుఃఖపడుతున్నాడు. ఆనందానికి అలవాటుపడ్డవాడికి కాసేపు ఆనందం లేకపోయేసరికి ఆనందం లేదు అనేటటువంటి దుఃఖం వస్తోంది అతనికి. ఇవన్నీ తెలుసుకుని నిత్యమైనది ఏమిటి అని ప్రయత్నం చేసినప్పుడు , అటువంటి వాళ్ళు తపన పడినప్పుడు ఈ తపస్సు లో తెలియబడినటువంటిది ఈ బ్రహ్మ జ్ఞానం. అప్పుడు తెలిసింది శుద్ధ చైతన్యం వుందని, శుద్ధ చైతన్యం మీద ముద్రించబడ్డ సంస్కారాలు తుడిచేయాలని తెలిసింది. అప్పుడు దానికోసము సాధన చేసుకుంటున్నాడు. ఆత్మానాత్మ వివేకాన్ని తెలుసుకుంటున్నాడు, సంస్కారాలను తుడిచేసు కుంటున్నాడు. వైరాగ్యాన్ని పెంపొందించుకుంటున్నాడు. అనిత్య వస్తువులమీద భోగలాలస తగ్గించుకుంటున్నాడు. నిత్య వస్తువులు కొన్ని వున్నాయి. దీర్ఘకాలిక ఆనందానికి ప్రయత్నం చేస్తూ తాత్కాలిక ఆనందాన్ని అవసరమైతే త్యాగం చేసుకుంటూ పోతున్నాడు. తనకి తెలియకుండానే కొంత త్యాగం చెయ్యడం ఓర్చుకోవడంవంటి సాధన తనలో జరిగింది.

ఇలా తెలుసుకొని ముందుకు వెళ్ళినవాళ్ళు మార్గదర్శకంగా గురువులయ్యారు. అనుభవజ్ఞులయ్యారు. పెద్దలయ్యారు. వాళ్ళు చెప్పగా మళ్ళీ మనం మొదలుపెట్టాము. ఇప్పుడు చెప్పిన కథంతా కూడా మానవ పునర్జన్మలలో జరుగుతోంది. కొన్ని పునర్జన్మలయిపోయిన తరువాత నిజమైన సాధనలో ఇది ఆఖరిజన్మ అవాలనేటటువంటిది, శాశ్వత ఆనందం కావాలనేటటు వంటిది, దుఃఖ నివారణ కావాలనేటటువంటిది ఒక ప్రయత్నం మొదలయింది. దానికి శాస్త్రాలు మార్గదర్శకంగా వున్నాయి. గురువుయొక్క బోధతో శిష్యుని యొక్క సాధనతో శుద్ధ చైతన్యానుభవానికి ప్రయత్నము జరుగుతున్నది. అంతర్ముఖ విద్య బాహ్య విద్యల వంటిది కాదు. సందేహాలు అనుమానాలు తీరాలి. అసలు అంతర్ముఖం ఎలా వుంటుందో తెలియదు. చెప్పినా అర్థం కాదు. దీన్ని ఎంత నూరినా అది పట్టుబడేది కాదు. అందుకే ఇంద్రుడు, విరోచనుడు అనే రాక్షసుడు బృహస్పతి దగ్గరకు బ్రహ్మవిద్య కోసం వెళితే 12 సంవత్సరాలు పట్టింది. 12 సంవత్సరాలకి ఏమైంది ఇంద్రుడికి – అన్నమయ కోశం నేను కాదు, ప్రాణమయం నేను అని తోచింది. మరో 12 సంవత్సరాలకి ప్రాణమయ కోశం నేను కాదు, నేను మనోమయం అని తోచింది. అలా అయిదు పన్నెండులు – 60 సంవత్సరాల తరువాత నేను ఆనందమే బ్రహ్మ అన్నాడు. అంత సమయం పట్టింది. ఇంద్రుడికే అలాగైతే మరి మానవులకో? మానవులకు కూడా అంత టైం పడుతోంది. కాకపోతే ఇక్కడ పునర్జన్మలు అయిపోతున్నాయి. ఒకే జన్మలో అన్ని సంవత్సరాలు కాదు. కొన్ని పునర్జన్మలే అయిపోతున్నాయి. ఇంద్రుడికి 60 సంవత్సరాలు పడితే, మానవుడికి 60 లక్షల జన్మలు పట్టింది. దానంతట అది జరగటానికి.

కనుక గురువు యొక్క పర్యవేక్షణ, గురువు యొక్క బోధ, ప్రబోధ లేకపోతే తొందరగా కాదు ఇది. ముందుగా ప్రయాణం చేసిన వాళ్ళు మార్గదర్శకంగా వుంటే ఎప్పుడూ మంచిదే. ఏమీ తెలియనివాళ్ళు ఎక్కడికో వెళ్ళి, అన్నీ వెతుక్కుంటూ, మోసపోతూ, కష్టాలు పడుతూ, చెయ్యాల్సిన పని సూటిగా చెయ్యకుండా డొంక తిరుగుడుగా చేసుకుంటే కాలయాపన, బాధ వుంటుంది. ముందే తీర్థయాత్రలకి కాశీ, రామేశ్వరం బద్రీనాథ్ ఎవరైనా వెళ్ళారనుకోండి, ఒకసారి వెళ్ళొచ్చిన వాళ్ళని మనం గైడ్‌గా పెట్టుకుంటే మనకి తేలికగా అయిపోతుంది. ఎక్కడ దిగాలి, ఎక్కడ భోజనం చెయ్యాలి, ఏం చెయ్యాలి అనేది. ఈ బ్రహ్మ విద్యా బోధ, ప్రబోధలో కూడా అలాగే అవుతుంది. మొదట స్థూల ప్రపంచంలో, నామ రూపాలుగా వస్తువులకి సంబంధించి, స్థూల సంస్కారాలు ఏర్పడ్డవన్నీ కూడా తొలగించుకున్నాము. ఎప్పుడైతే స్థూలంనుంచి మనం బయటపడ్డామో మనము సూక్ష్మంలోకి ప్రవేశించాం. ఎందుకంటే బ్రహ్మ సంకల్పంతో ముందుగా మానసిక ప్రపంచం తయారయింది. ఆ మానసిక ప్రపంచంలో వున్నటువంటి మానసిక శక్తులతోటి కొన్ని కొన్ని మానసిక అనుభవాల తోటి సూక్ష్మంగా బ్రహ్మాండాన్ని తయారుచేశాడు. సూక్ష్మంగా బ్రహ్మాండాన్ని తయారు చేయడానికి అనేక శక్తులు వినియోగించాడు. ఆ శక్తుల ద్వారా స్థూల ప్రపంచం ఏర్పడింది.

ఆ సంకల్పంతో ఆ ఊహతో ఆ భావనతో తాదాత్మ్యత చెందిన బ్రహ్మముగా మారాడు. ఆ బ్రహ్మమే ఈశ్వరుడిగా మారాడు. ఆ బ్రహ్మమే అనేక జీవులుగా మారాడు. ఆ బ్రహ్మమే జగత్తుగా మారాడు. జగత్ రూపుడు బ్రహ్మమే. విశ్వము, విశ్వరూపుడు బ్రహ్మమే. అలాగే జీవుడు ఈశ్వరుడు కూడా బ్రహ్మమే అయ్యాడు.

బ్రహ్మము ఈ రకంగా తనుచేసిన సృష్టితో తాదాత్మ్యత చెందుతూ పోయి, ఆ బ్రహ్మమే జీవభావం పొందాడు కనుక ఇప్పుడు తిరుగు ప్రయాణంలో స్థూల సంస్కారాలు పోగానే సూక్ష్మంగా శక్తి రూపంలో వున్న ప్రపంచములోకి వెళ్ళాడు. అక్కడ ఆ సూక్ష్మ ప్రపంచాన్ని దాటాడు. ఆ సూక్ష్మ ప్రపంచంలోనే బ్రహ్మాండ సృష్టి చేశావు. ఆ శక్తులు నీకున్నాయి. తిరుగుప్రయాణంలో ఆ సూక్ష్మ సంస్కారాలు మరుగునపడి స్థూల సంస్కారాలు పనిచేసినాయి. స్థూల సంస్కారాల నుండి విడుదల కాగానే మళ్ళీ ఆ సూక్ష్మ సంస్కారాలకి టైం వచ్చింది. అవి పక్వానికి వచ్చినాయి. ఇప్పుడు అనుభవానికి వచ్చినాయి. ఆ అనుభవంలోనే అష్ట సిద్ధులు రకరకాలవన్నీ వచ్చినాయి. సవికల్ప సమాధిలో అనేక సూక్ష్మమైనటువంటి అనుభవాలు వచ్చినాయి. సూక్ష్మ ప్రపంచం దాటిన తరువాత మానసిక ప్రపంచంలోకి వెళ్ళావు. మానసిక ప్రపంచంలో వున్న చైతన్యమే ఆ బ్రహ్మ మనసు. బ్రహ్మ మానస పుత్రులు అంటే బ్రహ్మ చైతన్యంతో తయారయినవాళ్ళు. సనక సనందనాదులు పుడుతూనే ఆ చైతన్యానుభవంలో ఆ బ్రహ్మ నిష్ఠలో వున్నారు. ఇప్పుడు మనకి తిరుగు ప్రయాణంలో మానసిక సంస్కారాలు అవి. ఆ మానసిక సంస్కారాలు సృష్టికి ఉపక్రమించేవి కనుక ఆ సంస్కారాల నుండి విడుదల కావాలి. విడుదల కాకపోతే మళ్ళీ పునః సృష్టికి నువ్వే వస్తావు. పునః సృష్టి చేస్తావు, చేసిన సృష్టిలోకి నువ్వే ప్రవేశిస్తావు. ఏ సృష్టిలో ప్రవేశిస్తావో దానితో తాదాత్మ్యత చెందుతావు. బైబిల్‌లో కూడా అదే వుంది. **"ఆయనవల్ల సమస్తము కలిగెను. కలిగినదేదీ ఆయన లేకుండా లేదు"** అని. భగవంతుడు సృష్టిచేసి ఆ సృష్టిలో తానే వ్యాపకమై సృష్టితో తాదాత్మ్యత చెంది ఆ సృష్టి రూపుడు ఆ విశ్వరూపుడు అయ్యాడు భగవంతుడు. ఆ భగవంతుడే నానాత్వముగా అనేక జీవులుగా కూడా అయ్యాడు. ఇక్కడ కూడా అంతే. బ్రహ్మకి ఆనందం కలిగి ఆనంద కారణంగా సంకల్పం వచ్చి సంకల్ప కారణంగా ఊహ వచ్చి ఆ ఊహ కారణంగా సృష్టి జరిగింది. కాబట్టి మానసిక ప్రపంచంలో ఇప్పుడు చెప్పేది అంతా వుంది.

సంకల్పము, ఊహ, భావన, సృష్టి చేసే విధానము, ఒక ప్రణాళిక (ప్లాన్) అంతా కూడా భగవంతుని యొక్క దైవీ సంస్కారంలో వుంది. ఆ ప్లాన్‌తో వున్న శక్తి అంతా సూక్ష్మ శక్తి. అది సూక్ష్మ ప్రపంచంలో వుంది. ఆ శక్తి వినియోగం అంతా స్థూల ప్రపంచంలో వుంది. స్థూల సంస్కారాలు దాటగానే సూక్ష్మ ప్రపంచంలోకి వెళ్ళావు. నామరూపాలు, వ్యవహార స్థితి నుంచి శక్తి స్థితికి వెళ్ళాడు. సూక్ష్మ ప్రపంచంలో శక్తి స్థితినించి మానసిక ప్రపంచంలోకి వెళ్ళాడు. మానసిక ప్రపంచంలో ఈ సృష్టి యొక్క విధానము, దైవీ ప్రణళిక ఏదైతే వుందో ఆ ప్రణాళికా భాగానికి వెళ్ళాడు. ఆ ప్రణాళిక సృష్టి కోసమే వుంది కనక ఆ ప్రణాళికతో ఆగిపోతే మళ్ళీ పునః సృష్టి నువ్వే చేసి, చేసిన సృష్టిలో నువ్వే ప్రవేశించి, ఆ సృష్టితో నువ్వే తాదాత్మ్యత చెంది మళ్ళీ జీవుడై నానాబాధలూ పడతావు, పునర్జన్మని ఎత్తుతావు. కనుక ఇక్కడ ఏం చెయ్యాలి, ఆ మానసిక సంస్కారాలనుంచి విడుదల పొందాలి. ఇది ఎక్కడినుంచో రాలేదు. ఎందుకు చెప్తున్నాను ఇదంతా అంటే సృష్టిలో బ్రహ్మగా వుండి నువ్వే దిగావు నిర్వికల్ప స్థితినించి సంకల్పమాత్రం చేత ఊహామాత్ర ప్రపంచాన్ని తయారు చేస్తూ ఆ స్థితిలో మానసిక సంస్కారాలు ముద్రించుకున్నావు. మరల తిరుగుప్రయాణంలో నువ్వు ఆ మానసిక సంస్కారాలనుండి విడుదలపొందాలి. ఇదంతా ఎందుకు చెప్పారంటే ఇప్పుడు వికాసం అయిపోయింది ఇప్పుడు వ్యావర్తనం చెప్పాలి. వ్యావర్తనం అంటే ఏమిటి? ఏదైతే వికసించిందో తిరిగి ఆ వికాసాన్ని విరమించుకుంటూ విరమించుకుంటూ మళ్ళీ బిందుస్థానానికి వెళ్ళాలి. బిందువే వ్యావృతం అయింది. ఈ వ్యావృతం అయినది మరలా అనావృతం కావాలి. వికసించడము అంటే సంస్కారాల రాపిడిచేత బ్రహ్మను ఎఱిగే ఎరుకను సంపాదించుట కొఱకు జరిగేది. ఇక్కడ వికాసము వలన ఉపాధులకు సంబంధించిన చైతన్యము పెరిగింది. ఇప్పుడు సంస్కారాలను వదిలించుకోవడానికి పునర్జన్మల అవసరం కలిగింది. క్రమంగా సంస్కారాలనుండి విడుదలవుతున్న కొద్దీ అవిద్యా ముద్రిత చైతన్యము తగ్గిపోతున్నది. ఇలా తరిగిపోయే చైతన్యమును వ్యావర్తన చైతన్యము అంటాము. ఇది పూర్తిగా సున్నా అయితే, బ్రహ్మగా నీవు వుంటావు. ఎరుకతో బ్రహ్మ చైతన్యాన్ని అనుభవించి తృప్తి పడతావు. చివరకు ఆ పరితృప్తే నిర్వికల్పానికి దారితీసి పరిపూర్ణత్వమును సిద్ధింపచేస్తుంది.

అంటే విశ్వంలో మన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఎలా వున్నాయో నిశ్వాస రూపలో ప్రపంచం విస్తరించింది, ఉచ్ఛ్వాస రూపంలో ప్రపంచం బిందురూపం అయింది. ఉచ్ఛ్వాసంలో గాలి లోపలికి పీలుస్తున్నాం. అంటే ప్రపంచం లేకుండా పోయి నీలో అవ్యక్తం అవుతోంది. నిశ్వాస రూపంలో గాలి బయటకి వదులుతున్నాం, అంటే నీలోంచి ప్రపంచం వ్యక్తమై, వికాసమై

విస్తృతం అవుతోంది. కనుక బ్రహ్మకు కూడా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వున్నాయి. నిశ్వాసం ద్వారా సృష్టి వికసితం అవుతోంది. ఉఛ్వాసం ద్వారా బ్రహ్మ ఈ విశ్వాన్ని లోపలికి తీసుకుంటున్నాడు. ఈ వికాసంగా విస్తృతంగా వున్న విశ్వాన్ని క్రమముగా లోపలికి తీసుకోవడంద్వారా అది కృశించుకుంటూ పోయి చివరికి బిందురూపం అయింది. అనగా ప్రళయమైనది. మానవదేహంలో సాధన కూడా ఈ వికాస వ్యావర్తనాలే చేశాము. స్థూల సంస్కారాలనుండి విడుదలైనవాడు సూక్ష్మ ప్రపంచంలో ప్రవేశించే సరికి చైతన్యం ముకుళించుకుంది. స్థూల సంస్కారాల అనుభవాలన్నీ ఆగినాయి. స్థూలరూప ప్రపంచం అంతా కూడా పోయింది. స్థూలరూప ప్రపంచం ఎంతమేరకుందో అంతమేరకు విరమించుకున్నావు. అంత మేరకు నువ్వు ముడుచుకున్నావు. సూక్ష్మ సంస్కారాల అనుభవాలు వచ్చాయి. సూక్ష్మ ప్రపంచంలో సూక్ష్మ ప్రపంచ అనుభవాలు సూక్ష్మ సంస్కారాల ద్వారా పొందావు. సూక్ష్మ సంస్కారాల ద్వారా సూక్ష్మ ప్రపంచ అనుభవం పొందింది కూడా ఇది కాదు ఇది కాదు అనేటటువంటి దాట్లో ఇది కూడ భ్రాంతే, ఇది కూడా మిథ్యే అనేటటువంటిది తెలిసినటువంటి వివేకజ్ఞానంతోటి ఆ సూక్ష్మ ప్రపంచంలో వచ్చిన అష్టసిద్ధులని, శక్తులని ఈ మిథ్యాభూత ప్రపంచంలో వినియోగించరు. ఎందుకంటే ప్రపంచం నిజమైతే నువ్వు వినియోగించవచ్చు. ప్రపంచము మీద రాగము, ప్రపంచము మీద అనురాగము, ప్రపంచము మీద ఆసక్తి, ప్రపంచము నిజమనే భావన వుంటే ఆ శక్తులని వినియోగిస్తావు. ఉన్న శక్తులని జగత్ మిథ్య అన్న తరువాత, ప్రపంచము లేదు కనక, లేని ప్రపంచంలో, లేని జీవులకోసం, నువ్వు అక్కరలేని సహాయాన్ని చెయ్యాల్సిన పనిలేదు. దానికి నీ శక్తులు వినియోగించనక్కరలేదు. ఆ రకంగా శక్తులని కనుక వినియోగించకపోతే సూక్ష్మ ప్రపంచాన్ని దాటి మానసిక ప్రపంచానికి వెళ్తావు.

సూక్ష్మ ప్రపంచంలో వున్న అనుభవాలన్నీ ఆగిపోవటంతో ఇంకొంచం వ్యావర్తమయ్యావు. ఇంకొంచం ముకుళించుకున్నావు ఇంకొంచెం విరమించుకున్నావు వ్యాపకత్వాన్ని. మానసిక సంస్కారాలు కూడా పోయిన తరువాత నిర్వికల్ప బ్రహ్మ అయినప్పుడు చైతన్యం యొక్క వ్యావర్తనం పూర్తయింది. ముకుళించుకోవడం పూర్తయింది. మళ్ళీ బిందువయిపోయావు. ఈ బిందువు తిరిగి మళ్ళీ విసృతం కాకుండా ఆ బిందువు లేనిదైపోవాలి. ఆ బిందునాదం కూడా లేకుండా పోవాలి. ఈ బిందువే ఘనరూప అఖండ ఎరుక. ఈ వ్యాపకమే ద్రవరూప, వ్యాపక రూప ఖండ ఎరుకలు. మొదట్లో ఖండ ఎరుకలు మూడు గుణాలుబట్టి మూడుఖండాలుగా చెప్పాం. తరువాత అనేక సంస్కారాలు గుణముల యొక్క అనేక విభాగాలతోటి అనేక స్వభావాలతోటి, అనేక జీవులు అనేక తెలివితేటలతో అనేక ఉపాధులతో ప్రతిజీవి ఆయా ఉపాధిగతమైనటువంటి అనుభవంతో కొన్ని లక్షలు కొన్ని కోట్ల రకాలుగా ఈ వ్యవహారం జరుగుతోంది. కోట్ల రకాలుగా అనుభవాలు వస్తున్నాయి. కోట్ల రకాలుగా సంస్కారాలు పోగుపడుతున్నాయి. కోట్ల రకాలుగా ప్రతియొక్క జీవికి ఆ సంస్కారానికి సంబంధించిన పరిణామము, పునర్జన్మలు జరుగుతున్నాయి. ఇన్ని రకాలుగా వుండటమే వికాసం.

మొట్టమొదట మూడు గుణాలతో మూడు పద్ధతులే వచ్చాయి. ఆ తరువాత ఒక్కొక్క గుణము మూడు భాగాలై ఉత్తమ గతి, మధ్యమ గతి, అధమ గతి అని మూడు మూళ్ళు తొమ్మిది రకాలయింది సృష్టి. ఈ తొమ్మిది రకాలు కొన్ని లక్షల రకాలు అయింది. ఉపాధులకి సంబంధించి ఇంకా ఎక్కువే అయినాయి. గుణాలతో సంబంధించి మరిన్ని పెరిగాయి. ఈ సంస్కారాలు పోగుచేసుకున్న తరువాత, పాత సంస్కార వాసనచేత కొత్త అనుభవాలు వచ్చేసరికి అనేకంగా విభిన్నాలుగా అనుభవాలు వస్తున్నాయి. ఇదంతాకూడా బ్రహ్మయొక్క చైతన్యంయొక్క వ్యాపకత్వంలో ఈ సృష్టి పరిణామంలోని సంస్కారాలు పునర్జన్మలలో వున్న సంస్కారాలవి. ఈ మూడు గుణాలతో కూడినటువంటి సృష్టి యొక్క వికాసంలో ఏర్పడ్డవి అన్నీ కూడా నానారకాలుగా అనేక బేధాలుగా వున్నదంతా కూడా విస్తృతం అయింది. ఈ విస్తృతమైనది ఒక క్రమ పద్ధతిలో ఒక నియమానుసారంగా పోతోంది. పెరగటం ఎలాగ నియమంగా వుందో ముకుళించుకోవటం కూడా నియమంగానే వుంది. ఈ నియమం ఎక్కడిది? మాయలో కళ కాలం నియతి వున్నాయి కాబట్టి, అక్కడిది. మాయలో విద్య రాగము వుంది కనుక, ఏ రకంగా క్రమ వికాసం అవ్వాలి అనేటటువంటి జ్ఞానమే విద్య. ఇచ్ఛాశక్తియే రాగం. ఇట్లా చెయ్యాలని ఇచ్ఛ కలగకపోతే ఇదంతా లేదుగా!

పరిణామ దశలో ఒకసారి ధరించిన ఉపాధి మళ్ళీ ధరించకుండా జరిగిపోయింది. మానవ ఉపాధి వచ్చేసరికి మాత్రం తిరిగి తిరిగి మళ్ళీ మానవ ఉపాధినే ధరిస్తున్నాం. మానవ ఉపాధిలో పశుపక్ష్యాదుల సంస్కారాలనుంచి క్రమంగా విడుదల అవుతున్నాము. అయితే కార్యరూపంలో విడుదల అవుతున్నాము. వైరాగ్యరూపంలో విడుదల అవుతున్నాము. కానీ మూల కారణంలో వున్నవి విడుదల కావట్లేదు. మూల కారణంలో వున్నవి ఎప్పుడు విడుదల అవుతాయి? ఈ సూక్ష్మ ప్రపంచం మానసిక ప్రపంచం దాటినప్పుడు విడుదల అవుతాయి. ఎందుకంటే వాటి మూలాలు శక్తి రూపంలోనూ, సంకల్పం రూపంలోనూ సూక్ష్మ, మానసిక ప్రపంచాలలో వున్నాయి. అక్కడ మూలాలు తెగ్గొడితే మళ్ళీ పునరావృత్తిలేదు. కనుక ఆ మూలాలు అక్కడ

తెగ్గొట్టుకోవాలి. సూక్ష్మ ప్రపంచంలో కొన్ని మూలాలు , మానసిక ప్రపంచంలో అసలైన మూలాలు , అక్కడున్న బీజాలు నిర్బీజం కావాలి. కనుక అక్కడికి ప్రయాణం చేస్తున్నాడు వీడు. మోక్షం కోసం చేసే ప్రయాణమే వ్యావర్తనం.

చంద్ర మండలం సత్వగుణం. అగ్ని మండలం తమో గుణం. ఈ రెండూ కలిస్తే మిశ్రమం. ఈ మిశ్రమము రజో గుణము. ఈ అహం అనేవాడు రజో గుణము. జీవుడే రజో గుణం. జీవుడిలో వున్న అహంకారమే రజోగుణం. అహంకారంలో కారం అని ఎందుకు పెట్టాం ఇక్కడ? **వ్యవహారం వస్తే అహంకారం. వ్యవహారం లేకపోతే అహం భావము. అహం వ్యవహారం ఆగితే అహంభావము. భావం కూడా ఆపేస్తే అహం స్ఫురణ. స్ఫురణ కూడా ఆపేస్తే సోహం. సోహం పోతే నాహం.** మరి ఇప్పుడు అహం ఎట్లా పుట్టింది? విమర్శ బిందువుని మాయ అన్నాను. మిశ్రమ బిందువు దగ్గరేమో అంతఃకరణ అన్నాను. ఇప్పుడు చూడండి. మాయా ప్రతిబింబమేమో ఈశ్వరుడు. అంతఃకరణ ప్రతిబింబమేమో జీవుడు. జీవుడేగా ఇప్పుడు అహం అహం అంటున్నాడు. జీవుడూ అహం అనటానికి ఏమేమి కలిసినాయి? తనలో వున్న బ్రహ్మ ప్రకాశము, చంద్రమండల ప్రకాశము, మాయలో ప్రతిఫలించిన రెండవ ప్రకాశము, అగ్ని మండల ప్రకాశము ఈ రెండూ కలిసినటువంటి దానిలో ఒక మిశ్రమ బిందువు, ఆ మిశ్రమ బిందువే జీవునియొక్క అంతఃకరణ. అంతఃకరణ ప్రతిబింబమే అహంకారము. అక్కడ అది సూర్య మండలము. ఈ అహంకారమే జీవుడు. వీడే చిదాభాసుడు. మళ్ళీ – ఈ అహం అహం అనేది మూలంలో ఎక్కడుంది? నాదరూపంలో వుంది. ఇదే బ్రహ్మ స్వరూపం.

మాయాశక్తులు ఎప్పుడు వినియోగపడతాయి? స్థూల ప్రపంచం వచ్చిన తరువాత ఆ స్థూలం మీద వినియోగమవుతాయి? స్థూలాన్ని తయారుచేయడానికి వినియోగపడతాయి. స్థూలం యొక్క పరిణామానికి వినియోగపడతాయి. స్థూలం యొక్క వికారానికి, పరివర్తనకి, వ్యవహారానికి వినియోగపడతాయి. ఒకవేళ స్థూలమే లేదనుకో ఆ శక్తి బ్యాటరీలో వున్నటువంటిదిగా వుంటుంది. బ్యాటరీలో వున్నట్లుగా వుంటుంది. క్రియలోకి వస్తే ఏమవుతుంది? ప్రకాశ రూపంలో, శబ్దస్పర్శరూపరసగంధ రూపంలో , కర్మ రూపంలో, కర్మచేసే రూపంలో, కర్తృత్వరూపంలో, భోక్తృత్వరూపంలో ఉంటుంది. క్రియలోకి రాకపోతే అది ఒక బ్యాటరీలో పెట్టినటువంటిది. బ్రహ్మాండములో ఉన్నది. అది క్రియలోకి వచ్చేసరికి పిండాండం వచ్చి ఆ పిండాండమందు వ్యవహారంగాని, పరిణామంగాని, పరివర్తనగాని, వికారాలు గాని వున్నాయ్యో, వాటికి హేతువైన శక్తిగా మారుతుంది. బ్రహ్మవద్ద ఉన్న చైతన్యమే, అధిష్ఠాన దేవతల యొక్క శక్తిగా రూపాంతరము చెందింది. ఆ శక్తియొక్క ప్రేరణతోనే పిండాండములు ఏర్పడి, వాటిలోని జీవజగత్తులు స్పందించి వ్యవహరిస్తున్నాయి. ఈ మూడు అంచెలు గమనిస్తే, పిండాండమందు ఆధి భౌతిక క్రియా రూపంలో ఉన్నది. బ్రహ్మాండంలో ఆధి దైవిక ప్రేరణాశక్తి రూపంలో ఉన్నది. ఆధ్యాత్మికముగా చూస్తే ఒకే ఒక్క అంతర్యామి చైతన్యమున్నది. ఈ యావత్తు ఇదే పద్ధతిలో ఉన్నదనే భావంతో మనము ఆధి భౌతికము నుండి ఆధి దైవిక స్థాయికి, అక్కడినుండి అంతర్యామి చైతన్యానుభవానికి ప్రయాణము చేయవలసి యున్నది.

## బిందు త్రయం

ప్రకాశబిందువు, విమర్శ బిందువు, మిశ్రమ బిందువు, ఇవే బిందుత్రయము.

3 బిందువులను కలిపి ఒక త్రిభుజం తయారుచేసుకొని, మూడు భుజాలు కలిసేచోట 3 కోణాలు వస్తాయి. అనగా త్రిభుజాలు, త్రికోణాలు వస్తాయి. ఈ త్రికోణం మధ్యలో 3 మండల ప్రకాశాల యొక్క కదలికలో, 3 ప్రకాశముల యొక్క స్వభావంతో కూడి, నాలుగవ బిందువు తయారయ్యింది. నాల్గవ బిందువే సంవిత్ బిందువు. నాల్గవ బిందువును కలిపి బిందు చతుష్టయం అంటారు. ఈ బిందు చతుష్టయము సృష్టికి పూర్వం ఉన్నటువంటి అవ్యక్తము. బిందు చతుష్టయము అంటే అవ్యక్తము, బిందు త్రయాన్ని మరొక పద్ధతిలో వివరిస్తున్నారు.

ప్రకాశ బిందువు, విమర్శ బిందువు ప్రకాశాలు 2 కలిపితే బ్రహ్మ, మాయ కలిసినటువంటిది. అవ్యక్త స్థితిలో శివశక్త్యాత్మకం, వ్యక్త స్థితిలో శివుడు శక్తి వేరుపడ్డారు. వేరుపడ్డప్పుడు శివుడు నిర్వికారం అయినప్పటికీ, ఈ వేరుపడ్డ శివుడిని మాయ వికారంగా చూపిస్తుంది. శివుడు వికారి కాలేదు, నిర్వికారమే, వికారం అయినట్లుగా మాయ చూపిస్తుంది. ఈ మాయ త్రిగుణ రహితమైన బ్రహ్మను ఆశ్రయించి, ఆశ్రయ కారణంగా ఆ బ్రహ్మను చూసే వారికి త్రిగుణాత్మకంగా ఉన్న బ్రహ్మగా కనబడేలా చేస్తుంది.

ఈశ్వరునికి పరమైనవాడు పరమేశ్వరుడు. ఈ పరమేశ్వరుడు వేదానికి మొదటిదైన అకార రూపుడైతే వేదాలు తరువాత వచ్చినవి. వేదాలు రాకముందు ఏమి వచ్చింది? అకార, ఉకార, మకార మాతృకలతో ఉన్న "ఓం"వచ్చింది. ఓం తర్వాత అనేక అక్షరాలు వచ్చినవి. అన్ని రకాల అక్షరాలతో కూడి మంత్రాలైనవి. ఋగ్వేదం మంత్రయుక్తం. మంత్రంలో మంత్ర శక్తి ఉంటుంది. మంత్రంలో మంత్రార్థం ఉంటుంది. మంత్రం ఒట్టి అక్షరాలు కాదు. ప్రాణం ఉన్న అక్షరాలు. ప్రాణం ఉన్న అక్షరాలకే వాటి సముదాయాలకే అర్థం ఉంటుంది. అర్థంలేని పదాల కూడిక వ్యర్థం. అర్థం ఉన్న పదాలతో కూడినది ఒక అర్థాన్ని ,ఒక భావాన్ని, ఊహను అందిస్తుంది. దానిని బట్టి ఈ వేదాలు తయారయ్యాయి. ఈ పరమేశ్వరుడు ప్రకాశ బిందు రూపుడు, విమర్శ బిందువు యొక్క ప్రకాశంతో కూడినపుడు, శివశక్త్యాత్మకమైనపుడు అటువంటి పరమేశ్వరుని దగ్గర నుండి వేదాలు ఉత్పన్నమైనవి.

పరమేశ్వరుడు వలన సృష్టించబడిన సకల ప్రపంచానికి స్థానమైన ఆత్మశక్తియందు ప్రవేశించి, శుక్లబిందు రూపమును పొందెను. ఇదియే పురుషుడయ్యింది. విమర్శ శక్తి శుక్ల బిందువందు జేరి, రక్తబిందు భావమును పొందినది. శుక్ల రక్త బిందువుల కలయిక వలన ఏర్పడిన మిశ్రమ బిందువు వలన నాదము పుట్టెను. నాదము వలన షోడశ కళలు ఉత్పన్నమైనవి. ఆ కళలే కళాతత్వ రూపమైన పదునాలుగు భువనములను సృష్టించినది.

ఈ బిదు నాదములు అహం అనే రెండక్షరాలకు శరీరముగా ఉన్నాయి. రక్త బిందువు అగ్ని బిందువైనది. శుక్ల బిందువు చంద్ర బిందువైనది. ఈ రెండింటి మిశ్రమ రూపమైన బిందువు సూర్య బిందువైనది. ఈ బింద్రత్రయముల త్రిభుజమందు శ్రీ (యోని) చక్రము ఆవిర్భవించెను. ఆ చక్ర మధ్యలో నున్నది సంవిద్బిందువు అనే ఎరుక. ఈ సంవిద్బిందువే పరాశక్తి. ఈ నాల్గు బిందువులు కలసిన ఆవరణయే భ్రమణ వేగముతో కదలి, సర్వము అయినది.

ప్రకాశ బిందువు, విమర్శ బిందువు, మిశ్రమ బిందువు – ఈ మూడు బిందువులను మూడు కోణములుగా చేసి త్రిభుజమును తయారుచేస్తే ఈ మూడు బిందువులను కలుపుతూ ఒక వృత్తము గీస్తే ఆ వృత్తమే శ్రీచక్రము.




## పంచభూతోత్పత్తి

వికాసము పొందినటువంటి రక్త బిందువు వలన, ఆ బ్రహ్మమే అంకురముగా గల శబ్ద బ్రహ్మముగా ఆవిర్భవించింది. రక్త బిందువనగా మాయాశబలిత బ్రహ్మము. ఆ బ్రహ్మమునుండి అనాహత శబ్దము పుట్టింది. అదియే నాదబ్రహ్మ. ఆ నాదము వలన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అనబడే పంచభూతాలతో కూడిన ప్రకృతి జనించినది. అకారాది హకారాంతము అంటే అ నుండి హ వరకు గల 56 అక్షరాలు ఉత్పన్నమైనాయి. పంచభూతాలేమో రూపాలైనాయి. అక్షరాలు నామాలైనాయి. ఈ విధముగా నామరూప జగత్తు ఏర్పడినది.

## మహత్తత్వ స్వరూపము

ఈశ్వరుడు అనేటటువంటి మాయా ప్రతిబింబ శక్తి కారణమై, రజోగుణముతో ఉద్రిక్తము అయ్యింది. అప్పుడు మహత్ అని ప్రసిద్ధమై, అందులో విక్షేపశక్తి విజృంభించినది. ఆ విక్షేప శక్తి యొక్క ప్రతిబింబ రూపమే హిరణ్యగర్భుడయినది. ఇతడే దృశ్య – అదృశ్యమైన రూపము కలిగి, మహతత్త్వమునకు అభిమానిగా ఉన్నాడు. అందువలన ఆ హిరణ్యగర్భునికి మహత్ అహంకారము అని పేరు కలిగినది.

## అహంకార స్వరూపము

హిరణ్య గర్భునితో కూడి విక్షేపశక్తి తమోగుణ సహితమై, అహంకారమనే స్థూలరూపశక్తిగా మారిపోయాడు. ఈ అహంకారము మహతత్త్వమునకు అభిమానియగుట వలన మహదహంకారము అని ప్రసిద్ధము.

అందులోగల ప్రతిబింబము సర్వ జగత్పాలకుడైన విష్ణువు అనెడి ప్రధాన పురుషుడైనాడు. అందువలన హిరణ్య గర్భుడే విష్ణువు. అవతారములన్నీ ఈ హిరణ్య గర్భుడు అనే ప్రథమాత్మనుండియే వచ్చుచున్నవి. అనగా విష్ణువే అవతరించుచున్నాడు.

## పంచదశావిర్భావము

ఆత్మ బ్రహ్మమయ్యింది. అవ్యక్తమే మహత్తు అయ్యింది. అనుకుంటూ వస్తున్నాము. ఇంకొకసారేమో 3 వంతుల బ్రహ్మము అలాగే ఉంటే, ఒక వంతు బ్రహ్మము అవ్యక్తమయ్యింది. అవ్యక్తములో ఏవైతే ఉన్నాయో, అన్నీ మహత్తు అవ్వలేదు. పదవ వంతు మహత్తు అయ్యింది. 9 వంతులు కాలేదు. మహత్తు అయిన దాంట్లో 10 వంతులలో 9 వంతులు మహత్తుగానే ఉంది. ఒక వంతు అహంకారమయ్యింది. మీరు ఈ తేడా గమనించుకోండి. బ్రహ్మవలన అవ్యక్తం అంటున్నారు. బ్రహ్మమే అవ్యక్తం అయ్యిందని అనడం లేదు. కనుక బ్రహ్మను విడగొట్టుకోండి.

ఎందుకు విడగొట్టుకోవాలి? అసలు ఆ వాక్యాన్ని అలానే మనం ఎందుకు పరిశీలించకూడదు? అక్కడ ఏముందో అదే ఎందుకు చెప్పుకోకూడదు? ఎందుకు చెప్పుకోకూడదు అంటే, బ్రహ్మ నిర్విశేషము, నిర్వికల్పము, అచలము, పరిపూర్ణము. ఉన్నది ఉన్నట్లు ఉన్నాడు. బ్రహ్మను ఏదనీ చెప్పలేము. బ్రహ్మలో ఏదీ లయము కాలేదు. బ్రహ్మము అద్వయము. ఏకామేవాఽద్వయం బ్రహ్మ, నేహనా నాస్తి కించనః. ఈ పదాలు బ్రహ్మను గట్టిగా నిర్ణయిస్తుంటే, బ్రహ్మము నుంచి వచ్చింది అంటారేమిటి? బ్రహ్మము నిర్వికారమైనప్పుడు బ్రహ్మ రూపాంతరము చెందదు, వికారము చెందదు.

బ్రహ్మ సృష్టికి మూలం కాదు. బ్రహ్మ నుండి ఏదీ పుట్టదు, బ్రహ్మలోకి ఏదీ లయం కాదు, అని బ్రహ్మ నిర్ణయం. కొన్ని నిర్గుణ వాక్యాల ద్వారా మనకు నిర్ణయం అయ్యింది కదా! దానికి దోషము రాకుండా ఆలోచించాలి. అది ఏ బ్రహ్మమునైతే, అన్ని రకాలుగా వేదాంతములో ఉన్న నిర్గుణ వాక్యాలు, బ్రహ్మ యొక్క లక్షణాన్ని నిర్ణయముగా చెప్పాయో, దానికి తిరుగులేదు. కనుక మీరు ఏం చేయాలంటే, ఇక్కడ ఏ వాక్యం చెప్పినా, ఏ విధంగా చెప్పినా, అదే ఇదయ్యింది అన్నా, దాంట్లో నుంచి వచ్చిందన్నా, ఎలా ఉన్నా, దాని యొక్క అర్థాన్ని, మీరు వేరు చేసుకుని, బ్రహ్మ యొక్క నిర్గుణ వాక్యాలలో, ఏదైతే వివరించబడి ఉందో, దానికి దోషము రాకుండా, దానికి భిన్నం కాకుండా, దానిని పరిపూర్ణముగా, సత్యం అనే ప్రమాణమును పెట్టుకుని, మిగితావి మీరు ఎలా ఆలోచిస్తారో, అలా ఆలోచించాలి. ఈ పదాలన్నీ విభక్తి ప్రత్యయాలు. విభక్తి ప్రత్యయాలవల్ల ఒక రకమైనటువంటి అర్థము వస్తుంది. దానిని అలాగే ఎందుకు కన్ఫ్యూజన్‌గా వాడారు అంటే, ఒక పరబ్రహ్మ ఉన్నాడు. మాయ ద్వారం గుండా ప్రకాశం బయటకు వచ్చినప్పుడు, బ్రహ్మ విషయంలో ఇంకో బ్రహ్మ ఉన్నాడు. ఈ రెండవ బ్రహ్మ, మాయ ద్వారం నుండి వచ్చాడు కాబట్టి లేనివాడు.

కాని మీరు ఇప్పుడు ఆధ్యాత్మిక ప్రయాణంలో పురోగమించుకుంటూ, మెట్లు ఎక్కుతూ, ఎక్కుతూ ఈ భ్రాంతిని కొంచెం కొంచెం తొలగించుకుంటూ, బోధనా పద్ధతిని విభజన చేసి, పంచకోశాలు అని విభజన చేసి, పంచకోశాలు దాటి, ఆరు కోశాలు దాటుకుంటూ, సప్తావరణలను విభజన చేసి, ఏడింటిని అధిగమిస్తూ పోతున్నారు. ఇక్కడ పంచదశ ఆవిర్భావము అన్నారు. అంటే 15. ఈ 15 మెట్లు ఎక్కుతూ పోవాలి. 15 మెట్లూ దిగటము, ఎక్కటమూ అంతా మాయావరణములోనే. వెనక్కు తిరిగి మాయ ద్వారాన్ని దాటేస్తే, అక్కడ కేవల పరబ్రహ్మమే ఉన్నాడు. అతను ఉన్నది ఉన్నట్లు ఉన్నాడు. అచలమై, పరిపూర్ణమై ఉన్నాడు. దాంట్లో ఆరోహణ, అవరోహణలు లేవు. ఈ పంచదశాంగాలలోనే సృష్టియొక్క అవరోహణ ఉంది. సాధకుల విషయంలో అరోహణ ఉంది. మోక్షం కూడా ఉంది. కనుక గీత ఒక్కటి పెట్టుకున్నాము. మాయకు ఈవల, మాయకు ఆవల అని. మాయకు ఆవలనేమో వస్తు నిర్ణయంగా, నిర్విశేష, నిరంజన నిరాకార నిర్వికార నిశ్చల నిరామయ అచల పరిపూర్ణమైనటువంటి పరబ్రహ్మము ఉన్నది ఉన్నట్లు ఉన్నాడు. దేశ పరిచ్ఛేదము లేదు. కాల పరిచ్ఛేదము లేదు. వస్తు పరిచ్ఛేదము లేదు. సజాతీయ భేదము, విజాతీయ భేదము, స్వగత భేదము లేవు.

దానికి అవతల ఏమీ లేదు కనుక, ఆత్మ వలన అవ్యక్తం అంటే, మాయద్వారం ఇవతల ప్రకాశిస్తున్నటువంటి ఆత్మ. మాయ కావల ఆత్మ తనలో తాను రమిస్తూ, తననే తాను ప్రకాశింపచేసుకుంటూ తానుతానైనటువంటి, స్వస్వరూప జ్ఞానముగా, విజ్ఞానముగా ఉంది, స్వరూప లక్షణముతో ఉన్నది. పైగా అద్వయమై ఉన్నది. అదే సత్యము.

కనుక అదే అయి ఉండడమే మోక్షము. అక్కడ అవరోహణ లేదు, ఆరోహణ లేదు. కాని మాయావరణలో ఉన్న ప్రకాశమే ఆత్మ. ఆత్మ బ్రహ్మ ఒక్కటే. బ్రహ్మోణో అవ్యక్తః – అన్నా, ఆత్మనో అవ్యక్తః అన్నా ఒక్కటే. అటువంటి ఆత్మ వలన అవ్యక్తము ఏర్పడింది.

ఇది మాయావరణములో ఉన్న ఆత్మ కాబట్టి, ఈ ఆత్మ లేనిదే. ఈ ఆత్మ, ఈ బ్రహ్మ, లేనివారే. ఆ లేని బ్రహ్మములోనే అవ్యక్తము వచ్చింది. కనుక ఈ కథంతా మాయకు ఈవల పెట్టుకోండి. అంతే! లేని ఆత్మ వలన లేని అవ్యక్తము, లేని అవ్యక్తము వలన లేని మహతత్త్వము, లేని మహతత్త్వము వలన లేని అహంకారము ఉత్పన్నమయ్యాయి. అలా పెట్టుకోండి. నిజానికి ఆత్మ స్వప్రకాశమే గాని, దానికి బయట ప్రకాశము అనేదే లేదు. ఆత్మ అనే పదాన్ని, అన్యములేకుండా అనన్యముగా తీసుకున్నప్పుడు, అవరోహణ, ఆరోహణ లేనప్పుడు, ఆత్మ తప్ప రెండవది లేదు అనే వాక్యంతో చూస్తే, ఆత్మ సత్యము, ఆత్మ నిత్యము. ఆత్మ నుండి వచ్చినటువంటి సత్వరజస్తమో గుణములు అన్నప్పుడు "ఆత్మ నుండి" అంటే ఏమిటి? సత్యాత్మ, నిత్యాత్మనుండి రాలేదు. విచారిస్తే రాలేదు. ఆత్మ మాయాశబలితము.

రెండు పక్షాలున్నాయి ఇక్కడ. ఒక సారి మాయా శబలితము. మాయాశబలితమైనా ఆత్మ కదలలేదు. ఆత్మ ఆత్మగానే ఉంది. కాని దాని ప్రకాశ లక్షణమును మాయ ఆశ్రయించి, ఆ ప్రకాశానికే మాయ అని పేరుపెట్టి, దాంట్లోనుంచి సత్వగుణం ముందుగా వచ్చింది. ఆ తరువాత రజోతమోగుణాలు వచ్చాయి. ఇదంతా మాయా కార్యం. దానికి, దీనికి ఇప్పుడు మ్యాచింగ్ చేయాలి. బ్రహ్మణో అవ్యక్తః, అవ్యక్తో మహత్, మహతో మహదహంకారః అనేవాటికి మూడు గుణాలతో కలిపి, మ్యాచింగ్ చేయాలి. ఆత్మ మాయకావల ఆత్మ త్రిగుణ రహితం, మాయకీవల ఆత్మ నిర్గుణము అంటే, తాత్కాలికముగా గుణములు అవ్యక్తము. ఆ గుణములు విజృంభించే అవకాశము ఉంది. కాని, ఆ స్థితిలో కూడా ఆత్మ సత్యము, నిత్యమే. విజృంభించినప్పటికి కూడా ఆత్మ ఆత్మగానే ఉంది. గుణాల విజృంభణతో కలిగినదంతా మాయాకార్యం. కనుక కలిగినదంతా లేనిదే. కనుక బ్రహ్మ యొక్క సత్యత్వానికి, నిత్యత్వానికి ఏ ఢోకా లేదు. అక్కడ నిలబెట్టుకున్న తరువాత, సృష్టి క్రమం చెప్పారు.

మాయకు ఈవలనున్న బ్రహ్మనుండి ఏ ప్రకాశము మాయావరణలో వ్యాపించిందో అది అవ్యక్తము. దానినుంచి వచ్చిన మహత్తత్త్వము, ఈ మహత్తత్త్వానికి అస్పష్టము అని పేరు. అస్పష్టము అంటే, వాడు వచ్చాడు, వాడెవడో వాడికి తెలియదు. ఏం చేయాలో తెలీదు. అహంకారంగా వచ్చాడు. అహంకారం కంటే ముందు మహత్తత్త్వం ఉంది. మహత్తత్త్వము కంటే ముందు మూడు గుణాలు సామ్యముగా ఉన్నాయి. ఏదైనా తెలియాలి అంటే ఒక గుణం బయటకు వస్తేనే తెలుస్తుంది. మూడు గుణములు విజృంభించకుండా, సామ్యంగా ఉంటే ఏమీ తెలియదు. ఏదో ఒక గుణం ఉంటేనే, ఏదో ఒక అనుభవం ఉంటుంది. కనీసం సత్ చిత్ ఆనందం అనే ఉనికి, ఏ చైతన్యానికైతే ఉన్నదో, ఆ ఉనికి యొక్క అనుభూతి ఆ చైతన్యానికి శుద్ధ సత్వ గుణం వలన వచ్చింది. ఉనికి పేరు సత్. ఈ సత్ అంటే ఏమిటి? చిత్ యొక్క ఉనికి. చైతన్యము యొక్క ఉనికే సత్. చిత్తే ఉన్నది. ఉన్న చిత్‌కి ఉన్న అనుభవం ఉండాలి. అందువలన సత్తే చిత్తు, చిత్తే సత్ అంటారు. ఉన్న చైతన్యానికి, ఉన్న చిత్ స్వరూపానికి, ఉన్నది కాబట్టి ఉన్నాను అనే అనుభవం ఉంటుంది. ఉన్నాను అనే అనుభవమే, కేవలంగా ఉండుట అనే అనుభవమే ఆనందము. అది సచ్చిదానంద రూపముగా ఉంది. గుణ సామ్యంగా ఉండడం వలన, ఏ గుణమూ విజృంభించ లేదు కనుక, అక్కడ అనుభవము కూడా లేదు. అది ఒక అయోమయము, అది ఒక అస్పష్టము. కాని అది సత్ చిదానంద రూపము.

కోహం? కోహం కి ఇంకొక పేరు అస్పష్టము. దీని వలన కలిగినది అహంకారము. మహత్తు వలన అహంకారము ఉత్పన్నమయ్యింది. ఇప్పుడు ఈ అహంకారానికి ప్రశ్న వచ్చింది. ఈ నేను అనేవాడికి ప్రశ్న వచ్చింది. కోహం? ఆ అస్పష్టతే ప్రశ్నగా మారింది. ఇది వరకూ ఏ ప్రశ్న లేదు మహత్తులో. అహంకారం వచ్చాక అహంకారానికి వచ్చింది ప్రశ్న. అందుకే అహం అనే అధిష్ఠానము వస్తే, అధిష్ఠానానికే ఇవన్నీ అంటగడుతాము. అలాగే మీరు కూడా నేను నేను అంటే, మీకు అవన్నీ అంటగట్టబడుతాయి. నేను అనే వాడే లేకపోతే, పాప పుణ్యాలు ఎవరివి? ఈ మాయాకార్యమునకు ఒక లెక్క ఉంది. ఆ లెక్కకు నేను అనేవాడు ఉంటే, వాడి లెక్కలో అంటగడుతున్నాము. నేనే లేకపోతే లెక్క ఎవరికి అంటగట్టాలి? ఎవరూ లేరు కాబట్టి, ఆ

మాయ వల్ల బాధ లేదు. మాయ వల్ల బాధ లేనప్పుడు, మాయ ఉంటే ఏమిటి? లేకపోతే ఏమిటి? నేను అనేవాడు ఒకడు వచ్చాడు కాబట్టి, ఈ మాయాకార్యము వాడిని బాధించింది. మాయాకార్యము అంటే గుణాలు వస్తే బాధ. గుణాలు లేనప్పుడు ఏ బాధా లేదు. గుణాలు లేనప్పుడు గుణాలు సామ్యంగా ఉండడం వల్ల కూడా అది అస్పష్టము.

గుణసామ్యం చెదిరి శుద్ధ సత్వ గుణం వచ్చేసరికి, మొదటి అస్పష్టత, కోహంగా మారింది. అక్కడ అహంకారము పుట్టేసరికి, ఈ కోహం అనేది వాడికే. మహత్తులో తన ఉనికి తెలియనివాడికి అహంకారము పుట్టగానే తన ఉనికి తెలియగానే, ఆ తెలియనితనమే, ఆ ఉనికికి ప్రశ్న అయ్యింది.

ఈ ప్రశ్నకు జవాబుగానే సృష్టి, పరిణామము, సంస్కార సహిత వికాసము మరియు సంస్కారములనుండి విడుదలయ్యే క్రమములో వ్యాపవర్తనము, చివరకు తాను తానైనటటువంటి ఉనికితో తృప్తిపడుటయే సోహం అనే జవాబు.

ఎరుకలేని బ్రహ్మ, తాను బ్రహ్మమని ఎరుగుటకు, ఎరుకను దానికనుగుణముగా పొంది, చివరకు ఆ ఎరుకతోనే తాను బ్రహ్మమని ఎరిగి తృప్తిపడి **"అహంబ్రహ్మ"** అని ఊరకున్నాడు. ఇదియే కోహం నుండి సోహంకు ప్రయాణము.

సర్వకారణ రూపమైనటువంటి ఆత్మ వల్లనే అవ్యక్తము. మహతత్త్వ అహంకారములు కలిగినవి. ఈ నాలుగు బిందువులకు ఒకటి, ఆత్మ అనేది ఒక బిందువు. అవ్యక్తము రెండు, మహతత్త్వము మూడు, అహంకారము నాలుగు. ఈ విధముగా నాలుగు బిందువులు వచ్చాయి. ఈ నాలుగు బిందువులకు కలిపి ఆత్మ అని సంకేతము. ఇది తురీయకూటమి. ఒకే ఒక్క ఆత్మ వేరే ఉంది అన్నప్పుడు అది పరబ్రహ్మమే.

ఏ ఆత్మ అయితే, అవ్యక్తము, అవ్యక్తము వల్ల మహత్తు, మహత్తు వల్ల అహంకారమైనదో వాటిని విచారిద్దాము. అవ్యక్తములో ఏమీ లేదు. మహత్తత్త్వములో అస్పష్టముగా ఉన్నది. అహంకారంలో అది స్పష్టమైంది. వీటన్నింటికి మూలాధారమేది? ఆత్మ. కనుక ఆత్మ ఆత్మగా ఉంటే సమస్య లేదు. అవ్యక్తంగా ఉన్నప్పుడేమో, సమస్య ఉన్నా తెలియదు. మహత్తత్త్వముకి వచ్చేసరికి, సమస్య అస్పష్టంగా ఉంది. మహదహంకారముకి వచ్చేసరికి, అహంకార రూపము స్పష్టమయ్యింది. కాని ప్రశ్న వచ్చింది ఆత్మ వల్లే వీరందరూ వచ్చారు కనుక. ఈ నాలుగు బిందువులు, నాలుగు మజిలీలు, నాలుగు స్థితులుగా ప్రయాణం జరిగింది. అంటే ఇదంతా అవ్యక్తములో ఉన్న ప్రయాణమే. ఈ మహదహంకారము లోపల జరిగిన పరిణామము. మహదహంకారము పుట్టేసరికి, మహత్ అహంకారము స్పష్టమయ్యేసరికి, స్పష్టమైన అహంకారం పుట్టడానికి, అస్పష్టమైన మహత్తు కారణం. ఇవన్నీ అవ్యక్తంలోనే కారణ రూపముగా ఉన్నాయి. ఈ నాలుగు, నాలుగు బిందువులుగా పుట్టి, ఈ నాలుగు బిందువులు బిందు చతుష్టయమై అది తురీయకూటమి అయ్యింది. ఆత్మ పేరేమిటి? ఈ నాలుగు కలిపిన దానికి ఆత్మ అని పేరు. ఈ బిందు చతుష్టయానికి ఆత్మ అని పేరు. దీని సంకేతమే లింగము. లింగము అంటే ఏమిటి? ఎక్స్ అనుకుందాము. ఆత్మ ఎక్స్ అనుకుందాము. చివరకు ఎక్స్ అంటే సున్నా అయితే, ఆ ఎక్స్ మాయ కావలిదైన పరబ్రహ్మము.

భ్రాంతిలోనున్న బ్రహ్మకు పెట్టిన పేర్లు ఒక్కొక్కటి ఇది కాది కాదని మార్చుకుంటూ పోతే, ఆ కాని పేర్లే సాపేక్షముగా ఆ పరబ్రహ్మకు లక్షణాలైనవి. ఇవే ఇప్పుడు పరిపూర్ణమని, అద్వయమని, సర్వ వ్యాపకమని, అసంగమని, నిశ్చలమని, శుద్ధమని, నిరాకాశమని, నిరంజనమని, దృక్ అని, చిత్స్వరూపమని, బ్రహ్మమని, సచ్చిదానందమని, ఇలా అనేక పేర్లు పెట్టుకున్నాము.

అఖండ సచ్చిదానంద పరబ్రహ్మమునందు రజ్జు – సర్పము అనే దృష్టాంతముగా, కోహం అనే ఒక మహాశక్తి కలిగింది. దీనినే ఆవరణము లేక మూలప్రకృతి అంటారు. పరబ్రహ్మ అలాగే ఉండగా, మూల ప్రకృతిగానున్న మాయాశక్తి కారణముగా అహంకారము అనే పురుషుడు కోహంకు జాబు వెతుకుతూ పోయినదే సృష్టి క్రమము. అది సోహం అనే జ్ఞానముతో ఆగిపోయింది.

చంద్రుడు – వెన్నెల రీతిగా, జ్యోతి – ప్రకాశములంటే, సోహం అనే జ్ఞానము ప్రకాశము వంటిది. జ్యోతి స్వరూపమును సిద్ధింపచేసుకుంటె సోహం కాస్తా నాహం అయ్యింది. అప్పుడు కేవల పరబ్రహ్మమే అచలమై, పరిపూర్ణమై ఉన్నదున్నట్లున్నాడు.

నీకు సహాయం చేసేది మాయే. మాయ అపకారమూ చేయదు, ఉపకారమూ చేయదు. నేనెవరు అనేటటువంటి ఒక రూపాన్ని ఇచ్చేటప్పటికి, ఆ నేనెవరనేది మాయాశక్తి కారణముగా, తన ఆధ్యాత్మిక ప్రయాణము మొదలు పెట్టింది. కనుక మాయ కల్పించిన అనుభవాలన్నీ భ్రాంతులు. ఇది కాదు, ఇది కాదు, ఇది కాదని ఎగబాకాడు. సృష్టి అథోముఖమైనప్పుడు, సాధకుడు ఊర్ధ్వముఖమయ్యాడు. అలా ఎగబాగాకాక మెల్లిగా మాయద్వారం దగ్గర నిల్చున్నాడు. ఇటు అటు రెండువైపులా చూస్తున్నాడు. ఇటు పరమాత్మగా ఉన్న తాను, అటు పరబ్రహ్మగా ఉన్న తాను ఒక్కటే అన్నాడు. సాపేక్షంగా ఒక్కటే అన్నవాడు,

వాచ్యార్థములో ఉన్నాడు. నిరపేక్షంలో ఇక ఒక్కటే అని అనక్కర్లేదు. అది అయిపోయాడు. అందుకే ఇది భిన్నమూ, అది అభిన్నమూ అనదు. ఈ అభిన్నశక్తే ముక్తికాంత. అదే మోక్షానికి దారి చూపిస్తుంది. అదేంచేస్తుందంటే, నీకు పరమాత్మ అనేటువంటి అద్వైతానుభూతిని ద్వైతంలోనే ఇస్తుంది. తరువాత అద్వైతం సిద్ధించడానికి, అదిగో నీ తండ్రి అని చూపిస్తుంది. తండ్రి కనపడగానే నీవే ఆ తండ్రి అయివుంటావు. కాని, మాయ చూపించగానే అవుతావా? అంటే, చూపించగానే ఎవరూ అవరు. మాయ తప్పుకుంటుంది. అప్పుడు భ్రాంతి పోతుంది. అప్పుడు నువ్వు అది ఔతావు. మాయ అదిగో నీ తండ్రి అని చూపించి, ప్రక్కకు తప్పుకుంటుంది. అలా ప్రక్కకు తప్పుకునేటటువంటి మాయను ముక్తికాంత అంటారు. ఆమె ముక్తిని అందిస్తుంది. ఎఱుకే ఎఱుక లేకుండా పోయే పద్ధతికి సహాయం చేస్తుంది. మాయే మాయ లేకుండా పోయే పద్ధతికి సహాయం చేస్తుంది. మాయ ఈ పద్ధతిలోనే, ద్వైత భ్రాంతిని పోగొట్టి సహాయం చేస్తుంది. అప్పుడు అద్వైతం సిద్ధిస్తుంది. మాయకు ఈవలే ప్రయాణము. మాయకు ఆవల ప్రయాణం లేదు. గేటుకు ఇవతలిది, అవతలిది ఒక్కటే అనుకోవడం ద్వారా, గేటు అవతలిది నువ్వే అయిఉంటావు. లేకపోతే గేటు ఇవతలే ఉంటావు. ఏమిటి తేడా? గేటు ఇవతల ఉంటేనేమో సాపేక్షంగా ఉంటావు, గేటు అవతల ఉంటే నిరపేక్షంగా అవుతావు. అది ఇది ఒక్కటే, సాపేక్షం పోయి నిరపేక్షం అయితే.

ఒక ఆకాశం ఉంది. నేను అన్ని కుండలలో ఉన్నాను, కుండలకు సాక్షిగా ఉన్నాను. అసంగముగా ఉన్నాను అనుకుంటుంది. అదే ఆకాశము, కుండ మిథ్య అనేటటుంవంటి ఆకాశము, కుండలకు సాక్షి అనే ఆకాశము, కుండలకు అసంగము అనేటువంటి ఆకాశము, కుండలే లేవు అన్నప్పుడు, కుండలు లేకుండా పోయి, కుండలు తోచకుండా చేస్తుంది. కుండలకు కుండలే తోచకుండా ఎప్పుడైతే మాయ నీకు సహాయం చేసిందో, అది ముక్తికాంత. అటు కుండలు తోచనప్పుడు, కుండలనుబట్టి అన్ని కుండలలో ఏది ఉన్నదో, ఒక్కొక్క కుండలో ఏది ఉన్నదో, కుండ ఉన్నా లేకపోయినా ఏది ఉన్నాదో, కుండ పగిలిపోయినా ఏది ఉన్నదో ఈ కబర్లు అన్నీ మాని కుండలే తోచనప్పుడు, నేను నేనై ఉన్నాను అనే అపరోక్ష అనుభూతిని ఇస్తుంది ఆకాశానికి. ఇది ఉదాహరణ. అందుకని ప్రపంచ మిథ్యాభావం నుంచి నిజంగా మిథ్యాత్వం కలిగితే, సాపేక్ష జ్ఞానం పోయి, నువ్వు నిరపేక్షంగా, నువ్వు ఏదై ఉన్నావో, అదై ఉన్నావు అంతే!

ఈ మలిన సత్వ ప్రధానం సత్వ రజస్తమోగుణములతో కూడి అవిద్య అనబడెను. సత్వమేమో మాయ. సత్వగుణము విజృంభించి, శుద్ధ సత్వగుణము వచ్చేసరికి, శుద్ధ సత్వగుణ మాయ అయ్యింది. తరువాత తమో, రజో గుణములు వచ్చేసరికి మలిన సత్వమాయ అయ్యింది. తమో రజోగుణాలు ఆవరణ విక్షేప దోషాలను తెచ్చిపెట్టాయి. ఆవరణ శక్తి, విక్షేప శక్తి జీవుడిని బద్ధుడను చేశాయి. ఆ విధంగానే పురుషుడిని బద్ధుడిని చేశాయి. అందులో ఉన్న నేనేమో అసత్య నేను అయ్యింది. అందుకని సత్వరజస్తమో గుణములు మూడును కూడి బయలుదేరాయి. సత్వగుణము ముందే వచ్చింది. తరువాత తమో, రజో గుణాలు విజృంభించాయి. అంటే ఇప్పుడు మూడూ విజృంభించి ఉన్నాయన్నమాట. అందుకని సత్వరజస్తమోగుణాలు మూడూ కూడి, అవిద్యానుభవం అయ్యింది. సత్వగుణంలోనేమో ఆనంద స్వరూపుడను అనేది ఉంది. సత్‌చిత్ ఆనందమనే అనుభవము సత్వగుణములో ఉంది. శుద్ధ సత్వమాయలో, సాధకుల విషయంలో అక్కడిదాకా ఎవరైతే వచ్చారో, వాడు సచ్చిదానందుడు. అజ్ఞాన ఆవరణ వచ్చేసరికి, సత్వగుణం ఏం చేసింది? సుఖాభిలాషను కలిగింప చేసి, ప్రియం మోదం ప్రమోదం అనే వృత్తిని కలిగిస్తుంది అజ్ఞానంలో. అజ్ఞానావరణలో రజోగుణము ఏం చేసింది? ప్రపంచము నిజమని విక్షేపముగా చూపించి, దానితో తాదాత్మ్యత సంగత్వాన్ని పెట్టింది. తమోగుణము ఏం చేసింది? నామరూప ప్రపంచము, తన శరీరము, ఉపాధి కూడా నిజమనుకోవడమే కాకుండా, దానిమీద మోహం కలిగించింది. కనుక తమస్సువల్ల 'శరీరమే నేను', అని, రజస్సు వలన ఈ శరీరాన్ని కాపాడుకోవాలి, ఈశరీరాన్ని సుఖపెట్టాలి అని కర్మకు దిగుతూ ఈ శరీరాన్ని సుఖపెట్టాలనేటువంటి సుఖాభిలాష సత్వగుణం అయితే, అజ్ఞానంతో సంసారం, బంధం వచ్చింది.

పరబ్రహ్మ వ్యాపించదు. పరమాత్మ వ్యాపిస్తాడు. **వ్యాపించే పరబ్రహ్మ పేరు పరమాత్మ. వ్యాపించకుండా ఉండే పరమాత్మ పేరు పరబ్రహ్మ.** వ్యాపించకుండా ఉన్న పరమాత్మ అయితే మాయను దాటాడు. వ్యాపించే పరబ్రహ్మ మాయలోకి వచ్చాడు. మాయలో ప్రకాశిస్తున్నాడు అంతే తేడా!

జీవాత్మలు సుఖ దుఃఖాది భోగములను, స్వరూప జ్ఞాన పరిణామమును అనుభవించుటకు గాను భగవంతుడు ప్రపంచమును సృష్టించుటకు సంకల్పించి, రజోగుణ ప్రధానమగు విక్షేపశక్తి వీక్షింపగా, తక్షణమే ఆ విక్షేపశక్తి నుండి త్రిగుణాత్మకమైన శబ్ద తన్మాత్ర వచ్చింది. అంటే సత్వగుణ సృష్టి, రజోగుణ సృష్టి, తమోగుణ సృష్టి మూడు రకాలుగా సృష్టి వచ్చింది. దీనివల్ల శబ్ద తన్మాత్రగా ఉండే సూక్ష్మాకాశం పుట్టింది. కనుక ఈ సూక్ష్మాకాశం ఎలా ఉంది? సత్వగుణ ఆకాశం, రజోగుణ ఆకాశం, తామసిక ఆకాశం. ఆకాశం నుంచి వాయువు వచ్చింది. మళ్ళీ సత్వగుణ వాయువు, రజోగుణ వాయువు, తమోగుణ వాయువు. అట్లా త్రిగుణాత్మకమైనటువంటి పంచభూతాలు వచ్చాయి. శబ్ద తన్మాత్రలుగా అంటే శబ్దము అనేది ఒక గుణము. అవ్యక్త రూపములో శబ్దము అనేటటువంటి తత్వము వచ్చింది. తత్వ రూపంలో ఉంటే శబ్దము వినబడదు. శబ్దం చేసేవాడు రావాలి. శబ్దము వినేవాడు రావాలి. అప్పుడు శబ్దము, వాగింద్రియము, శ్రోత్రేంద్రియము ఉండేటటువంటి జీవుడు వచ్చేసరికి, ఈ శబ్ద తన్మాత్ర అనే గుణము ఏదైతే ముందే పుట్టిందో, అది విషయంగా మారి అనుభవానికి వస్తుంది. అనుభవానికి వచ్చినప్పుడు దానికి శబ్దమనే విషయజ్ఞానము వస్తుంది. అనుభవానికి రాకముందు అది శబ్ద తన్మాత్ర లేక, శబ్ద గుణము. మహదహంకారము దగ్గర కూడా ఆ అహము అనేటటువంటి, తత్వము పుట్టింది. వాడినే హిరణ్యగర్భుడు అన్నాము. ముందు తత్వాలు పుట్టాయి. తరువాత సూక్ష్మాలు వచ్చాయి, తరువాత స్థూలాలు వచ్చాయి.

విక్షేపశక్తిని వీక్షింపగా తక్షణమే ఆ భగవంతుడే ఈశ్వరుడు అయ్యాడు. ఆ విక్షేప శక్తి నుండి త్రిగుణాత్మకమైన శబ్ద తన్మాత్రగా, ముందు సూక్ష్మాకాశము పుట్టింది. సూక్ష్మాకాశము నుండి త్రిగుణాత్మకమైన, శబ్ద స్పర్శ తన్మాత్రలు వచ్చినాయి. దాని నుండి సూక్ష్మవాయువు వచ్చింది. సూక్ష్మవాయువు నుండి శబ్ద, స్పర్శ, రూప, తన్మాత్రలు వచ్చినాయి. దానినుండి అగ్ని తన్మాత్ర పుట్టింది. దానినుండి సూక్ష్మ అగ్ని పుట్టింది. సూక్ష్మ అగ్ని నుంచి శబ్ద, స్పర్శ, రూప, రస తన్మాత్రలు పుట్టాయి. దానినుండి సూక్ష్మజలం పుట్టింది. దానినుండి శబ్దం, స్పర్శ, రూప, రస, గంధ తన్మాత్రలు పుట్టాయి. దానినుండి సూక్ష్మ పృథివి పుట్టింది.

ఈ రకంగా సూక్ష్మ పంచభూతాలు వచ్చాయి. సూక్ష్మ పంచ భూతాలు మళ్ళీ పంచీకరణ అయ్యి స్థూల భూతాలు, సూక్ష్మ భూతాలు ఇంకోరకంగా పంచీకరణ అయి 25 గోళకాలు అయినాయి. ఈ 25 గోళకాలు స్థూలదేహమందు స్థానాలు కలిగి వున్నాయి. ఆ స్థానంలో అధిస్థాన దేవతల యొక్క సమష్టి రూపంనుంచి వ్యష్టి ఇంద్రియాలు వచ్చి ఆ గోళకాలలో చేరి వ్యవహారం చేసినాయి. ఓషధులవల్ల అన్నము , అన్నమువల్ల శుక్ల శోణితాలు ఉత్పత్తి అయినాయి. ఆ శుక్ల శోణితాల ద్వారా 84 లక్షల జీవరాశులు వచ్చాయి. ఇక్కడ కూడా చాలా రకాలు వున్నాయి. కొందరు చెప్తారు 84 లక్షల శిలారూపాలు, 84 లక్షల లోహరూపాలు, 84 లక్షల క్రిమికీటకాదులు, 84 లక్షల జలచరాలు, 84 లక్షల వాయుచరాలు, 84 లక్షల పశువులు, 84 లక్షల మానవ పునర్జన్మలు అని చెప్తున్నారు. కాని ఇక్కడేం చెప్తున్నారో చూడండి. ఆ 84ని డివైడ్ చేసేశాడు. అందులో నాలుగు లక్షలు నరులు, 30 లక్షలు మృగములు, 10 లక్షలు పశువులు, 20 లక్షలు వృక్షాది స్థావరములు, 9 లక్షలు మాత్రమే జలచరములు, 11 లక్షలు క్రిమికీటకాది పురుగులు – ఇవన్నీ కలిసి 84 లక్షల రకాలైనటువంటి చరాచర జగత్తు మొత్తం వచ్చింది. ఇక్కడ చూడండి అన్నీ చరములే చెప్పాడు ఇక్కడ. ఖనిజాలు గానీ శిలారూపాలు గానీ చెప్పలేదు. మరి డార్విన్ సిద్ధాంతం అది కూడా చెప్పింది. మెహెర్ బాబా ఏమో ఏడు దశలలో శిల దగ్గరి నుండి జంతువు దాకా పరిణామం అయ్యారని చెప్పారు. కొందరేమో 84 లక్షలు మానవ జన్మలు ఉంటాయి అని అంటున్నారు, జన్మల సంగతి అటుంచండి అసలు నరులు నాలుగు లక్షలు అన్నారు, నాలుగు లక్షలే వున్నరా నరులు? 250 కోట్లు వున్నారు ఒక్క భారతీయులే. ప్రపంచం ఇంకా ఎక్కువ ఉన్నారు.

ఈ పంచభూతముల నుండి సత్వ గుణ సూక్ష్మ ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివిలు చీలిపోయి సూక్ష్మ పంచభూతములయ్యెను. ఇవి ఈ పంచభూతాలకి అధిష్ఠాన దేవతలు. భూదేవి అంటామండి. భూమి అంటే మట్టి మశానం. కాని భూదేవి భూమియొక్క అధిష్ఠాన దేవత. తమోగుణం వల్ల పృథివి వస్తే సత్వగుణం వల్ల పృథివి యొక్క అధిష్ఠాన దేవత భూదేవి వచ్చింది. తమోగుణము వల్ల జలము వస్తే, సత్వ గుణము వల్ల వరుణ దేవుడు వచ్చాడు. స్థూల రూప అగ్ని తమో గుణము వల్ల వస్తే, సత్వం నుండి అగ్నిదేవుడు అనేటటువంటి అధిష్ఠాన దేవుడు వచ్చాడు. అట్లా మూడు గుణాలతో సృష్టి వచ్చింది. భూమి జడం కదా, భూమి తొక్కకూడదు అంటారు. భూదేవి శ్రీదేవి విష్ణుమూర్తి యొక్క భార్యలంటారు. భూదేవికి క్షమాపణ చెప్పాలి పొద్దున లేవగానే నీమీద నడుస్తున్నాను నిన్ను తొక్కుతున్నాను నీమీద మలవిసర్జన చేస్తున్నాను నన్ను

క్షమించు నాకు తప్పట్లేదు అని భూదేవిని ప్రార్థించాలట. ఈ భూమిని మట్టిని ప్రార్థిస్తున్నారా? భూమి యొక్క అధిష్ఠాన దేవతని ప్రార్థిస్తున్నారు. కనుక ఈ సృష్టిలో సత్వగుణ పంచభూతాలు వున్నాయి, రజో గుణ పంచభూతాలు వున్నాయి, తమో గుణ పంచభూతాలు వున్నాయి. సత్వగుణ భూతాలేమో స్థూలపంచభూతాలకి అధిష్ఠాన దేవతలు. రజోగుణ సూక్ష్మ ఆకాశము, వాయు, అగ్ని, జలము, పృథివిలు చీలిపోయి రజో గుణ సూక్ష్మ పంచ భూతములయ్యెను. ఈ రజో గుణ సూక్ష్మ భూతాలే పంచీకరణ అయినాయి. తమోగుణ సూక్ష్మ ఆకాశము, వాయు, అగ్ని, జలము, పృథివిలు చీలిపోయి తమోగుణ పంచ భూతములయ్యెను. ఆ తమోగుణ సూక్ష్మ భూతాలే స్థూలంగా మనకి కనబడుతున్నాయి.

ఈ సృష్టికి ఒక కారణముంది. ఒక ప్రయోజనము వుంది. ఈ జీవులు అవిద్య నుంచి అజ్ఞానము నుంచి బంధం నుంచి విముక్తి పొంది సాధకులై సద్గురువుని అవతార పురుషుని ఆశ్రయించి  ముందు వారిలో వున్న స్వభావాన్ని మార్చుకుంటూ తమోగుణమునుంచి రజో గుణమునకు తమో రజో గుణాలనుంచి విడుదలై సత్వగుణానికి వచ్చి, సత్వ గుణంనుంచి శుద్ధ సత్వ గుణంలోకి, శుద్ధ సత్వ గుణంలో సచ్చిదానంద అనుభవం పొంది జ్ఞానులై తరువాత విశుద్ధ సత్వ గుణము ద్వారా విజ్ఞాన స్వరూపం అయేటటువంటి పరమపద సోపాన పటము ఇక్కడ వున్నది. మెట్లెక్కాలి. ప్రతివాడూ ఖచ్చితంగా ఈ మెట్లు ఎక్కి ముక్తిని సాధించాలి. ఆ ముక్తి పొందటానికి అనుగుణమైనటువంటి జన్మలుకర్మలు ఉపాధుల యొక్క మార్పిడి సంసారము మిమ్మల్ని ప్రేమించేవారు మిమ్మల్ని ద్వేషించేవారు మిమ్మల్ని కష్టపెట్టేవారు మిమ్మల్ని బాధించేవారు ఇంతమందిని తీసుకు వచ్చి నీ బుద్ధి కి పదునుపెట్టి చివరికి ఈ మూడు గుణాలనుండి విడుదలయ్యేటట్లుగా ఇక జన్మ వద్దురా బాబోయ్ అనేటట్లుగా చేసి సంస్కారాల నించి విడుదల అయ్యేటట్లుగా చేస్తున్నాడు. దీంట్లో మీ అందరిలో కూడా శుద్ధ సత్వ గుణం వుంది. అది అంతరాత్మగా పనిచేస్తోంది. అంతరాత్మ ప్రబోధని బట్టి దేవుడున్నాడో లేడో అని నమ్మని వాళ్ళని కూడా ఒక భక్తి విశ్వాసం కలిగేటట్లుగా అందరిలోను సత్వగుణం పనిచేస్తోంది. కొన్ని జన్మలు వెనకబడ్డ వాళ్ళకి తక్కువగా పనిచేస్తోంది. కొన్ని జన్మలు ముందుకెళ్ళినవాళ్ళకి ఎక్కువగా పనిచేస్తోంది.

బైబిల్‌లో చెప్పినట్లుగా **"అందరూ గురియొద్దకే పరిగెత్తుతున్నారు"**. గురి అంటే మోక్షం. ప్రతి జీవి కూడా ముందో వెనకో పరుగుదీస్తున్నారు. అనేక జన్మలు పునర్జన్మలతో, అనేక సంసారాలలో పడుతూ, కొట్టుకుంటూ, క్రిందపడుతూ, ఈత ఈదుకుంటూ, గమ్యం కోసం ప్రయత్నిస్తూ ఫెయిల్ అవుతూ మరొక జన్మకి వెళ్తూ, చిట్టచివరికి వీళ్ళ ప్రయాణం అంతా కూడా ఆ గురి దగ్గరకే ఆ మోక్షానికే చేరుతుంది. ఇలా జరగాలని ఈ జగత్తు సృష్టించకముందు **ఈ జగత్తుకు పునాది వేయకముందే ఒక ప్రణాళిక రచించబడింది** అని బైబిల్లో వుంది. కనుక ఆ ప్రణాళికే ఈ సృష్టి కర్త బ్రహ్మ మనందరి కోసం చేశాడు. మనల్ని కష్టపెట్టడానికి కాదు, మనల్ని ఉద్ధరించడానికి చేశాడు ఈ సృష్టి. దానిని అర్థం చేసుకున్నవాళ్ళు సద్వినియోగం చేసుకుని తొందరగా  గమ్యం చేరుతున్నారు.

అర్థం కానివాళ్ళు నాస్తికులై భక్తులు కాకుండా  అవిశ్వాసులై చార్వాకుల వలే స్వార్థపరులై  ఇహలోక సుఖమే సత్యమని, స్థూల శరీరానికి ఒకే జన్మ అని, ఒకే మరణమని, మరణించడమే మోక్షమని జీవించి వుండగానే సుఖపడాలని అది నీచేతిలోనే వుందని స్వార్థంగా ఎవరినైనా సరే బాధించి అయినా నీ సుఖం నువ్వు పొందాలి అని చార్వాక సిద్ధాంతం. ఇవన్నింటిలో చాలా చర్చ జరిగింది.

ఎంతమంది మతస్థులు వున్నా సరే కాస్త వాళ్ళు వివేకము విచారణ ఉపయోగిస్తే ఏ మతంలో వున్నవారైనా గానీ దీనిని అర్థం చేసుకుంటే, అందరూ మోక్షమార్గానికి వెళ్తారు అంతే! కనుక ఆ భగవంతుడు నీ సాధన కోసం పనిముట్టుగా ఈ ఉపాధిని ఇస్తున్నాడు  మీలో సత్వ గుణం పెంపొందించి ఆత్మ జ్ఞానం కలగడానికే పునర్జన్మ ఇస్తున్నాడు అని మనం అర్థం చేసుకోవాలి.

భగవంతుడు స్థూల శరీరము ధరించగల జీవులకు వారివారి కర్మానుసారము పరిణామము చెందుటకుగాను (పరిణామము చెందాలి మీరు) తమోగుణ సూక్ష్మ భూతములను రెండు భాగములు చేసి మొదటి భాగమును పధ్నాలుగు లోకాలు చేశాడు, రెండో భాగాన్ని జీవుల యొక్క శరీరాలు చేశాడు. ఇవి భూలోక భువర్లోక సువర్లోక మహాలోక జనలోక తపోలోక సత్యలోకములని ఏడు ఊర్ధ్వ లోకాలుగాను, అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళములని  ఏడు అధోలోకాలుగా చేశాడు. రెండవ అర్థభాగాన్ని 84 లక్షల జీవరాశులకు ఉపాధులను స్థూల శరీరాలుగా చేశాడు. అది ఎట్లనగా ఈ స్థూల పంచభూతాలను సమష్టి వ్యష్టి అని రెండు భాగాలుగా చేశాడు. మొదటి అర్థభాగము సమష్టిలో పంచభూతాలు అయినాయి. రెండవ అర్థభాగము

వ్యష్టిలో జీవులయొక్క ఉపాధులు అయినాయి. ఆ పంచ భూతాలుగా వున్నదే ఈ పధ్నాలుగు లోకాలు. సత్వ గుణ ఆకాశము, రజో గుణ ఆకాశము, తామసాకాశము అనిమూడు చెప్పాం. రజోగుణ సంబంధంగా సూక్ష్మ భూతాలు అయినాయి అని చెప్పాం. సత్వగుణ సంబంధంగా అధిష్ఠాన దేవతలు అయ్యారు అని చెప్పాం. ప్రకృతిలోని ప్రతిదానికీ ఒక అధిష్ఠానం వున్నాడు. ప్రకృతిలోని ప్రతి శక్తికీ ఒక అధిష్ఠానం వుంది. స్థూలంలో కదిలే ప్రతిదానికీ ఒక అధిష్ఠానం వున్నది. ఈ అధిష్ఠానంగా వున్నవాళ్ళంతా సత్వ గుణ దేవతలు. అధిష్ఠాన దేవతలు.

ఇప్పుడు తామసాన్ని పట్టుకుందాం. తమోగుణ పంచ భూతాలని పట్టుకుందాం, వరుసపెట్టి తీసుకుందాం. తామసాకాశము వ్యష్టి సమష్టి అని రెండు భాగాలు. సమష్టి భాగము హృదయస్థానము అయింది. అదే హృదయాకాశము. వ్యష్టి భాగము నాలుగు భాగములై అందులో మొదటిభాగము తామస వాయువుతో కూడి మనసయింది. రెండవ భాగము తామస అగ్నితో కూడి బుద్ధి అయింది. మూడవ తామస ఆకాశము తామస జలముతో కూడి చిత్తమయింది. నాలుగవ తామస ఆకాశము తామస పృధివితో కూడి అహంకారం అయింది. ఇవన్నీ ఇంద్రియాలు కాదు. ఆ ఇంద్రియాలకు స్థానమైన గోళకాలు తయారయినాయి. ఈ గూళ్ళు ఎక్కడున్నాయి? మానవునియొక్క స్థూల దేహంలో వున్నాయి.

జంతువులయొక్క స్థూల దేహంలో కూడా వున్నాయి. సర్వ జీవరాశుల స్థూల దేహాల్లో కూడ వున్నాయి. కాకపోతే తమోగుణ జీవులు, రజో గుణ జీవులు, సాత్విక జీవులు అని మళ్ళీ వున్నాయి. మానవులలో కూడా తామసిక మానవులు, రాజసిక మానవులు, సాత్విక మానవులు వున్నారు. తామసిక జీవులలో పురుగులు క్రిమికీటకాదులలో ఇదే పంచీకరణ అయినప్పటికీ అక్కడ అన్ని ఇంద్రియాలయొక్క గోళకాలు స్పష్టంగా లేవు. కొన్ని క్రిములు స్పర్శనిబట్టే పోతాయి. వాటికి కళ్ళు వుండవు. అవి శబ్దాలు వినవు. కొన్ని కీటకాలు శబ్దాన్ని బట్టి ఆ శబ్ద తరంగాలు తాకేసరికి పరిగెడతాయి. అది స్పర్శ జ్ఞానం. శబ్దముయొక్క స్పర్శ గానీ, వేరే వస్తువు యొక్క స్పర్శని బట్టి గానీ పనిచేస్తాయి కొన్ని. కొన్ని జీవరాశులేమో శబ్ద స్పర్శ రూపాలు గుర్తిస్తాయి. కొన్ని ఆహారముయొక్క రుచిని గుర్తిస్తాయి. కొన్ని వాసనని గుర్తిస్తాయి. కొన్ని వాసననే ముందుగా గుర్తిస్తాయి, శబ్దాన్ని రూపాన్ని గుర్తించవు. పొలుసులు వుంటాయి. పొలుసులయొక్క సంకోచ వ్యాకోచాలతోటి భూమిమీద వ్యాకోచించి ముందుకెళ్ళి సంకోచించి ముందుకు లాక్కుంటూ మళ్ళీ వ్యాకోచించి ముందుకు వెళ్తూ వుంటుంది. దానికి ఇది కర్మేంద్రియమునకు గోళకము. ఆ భూమి మీద ఇతర జీవరాశులు, మానవులు నడిచినప్పుడు చేసినప్పుడు ఆ భూమిమీద ఆ చప్పుడువల్ల ఆ ధ్వనివల్ల తను ప్రాకేచోట క్రింద వున్నటువంటి భూమిలో చాలా సున్నితంగా కదలికలు వస్తాయి. తన స్పర్శ జ్ఞానం వల్ల ఆ కదలికలను గ్రహించి ఎవరో మానవులు వచ్చారని ఇది గ్రహిస్తుంది. అట్లా జీవులకు కూడా కొన్ని గోళకాలు వున్నాయి. మానవులలోనే కాదు అన్ని జీవులలో వున్నాయి. కొన్ని గోళకాలు సక్రమంగా పనిచేయనందువల్ల, ఫలానా ఇంద్రియం ఆ గోళకంలో వుండి పనిచేసే అవకాశం లేనందువల్ల వాటికి అయిదు రకాల జ్ఞానాలూ లేవు, కొన్నే వున్నాయి. మానవులకి వచ్చేసరికి అయిదు రకాల జ్ఞానాలూ వున్నాయి. మానవులలో శబ్ద స్పర్శ రూప రస గంధ అయిదు జ్ఞానాలూ వున్నాయి. అయిదు జ్ఞానాలనీ సంపాదించడానికి అయిదు ఇంద్రియాలు వున్నాయి. అయిదు ఇంద్రియాలూ వుందటానికి అయిదు రకాల గోళకాలు కూడా చక్కగా తయారయినాయి ఈ పంచీకరణలో. ఈ గోళకాలయొక్క స్థానము మానవుని స్థూల దేహంలోనే వుంటాయి. స్థూల దేహంలోనే రెండు కళ్ళ స్థానములు రెండు చెవుల స్థానములు అలాగే అన్ని ఇంద్రియాలకు ఉంటాయి.

గోళకముఅంటే స్థూల శరీరంలో ఒక భాగంగా ఒక స్థానముగా ఒక అమరికగా వున్నది. దాని యందు రజో గుణంగా వున్నటువంటి అధిష్ఠాన దేవతల దగ్గర నుండి సమష్టి రూపం నుండి గోళకాలు గనుక సక్రమంగా వుంటే, స్థూల దేహం సక్రమంగా తయారై వుంటే, ఆయా గోళకాలలోకి సమష్టి ఇంద్రియాలుగా వున్నటువంటి అధిష్ఠాన దేవతల దగ్గరనుండి వచ్చి వ్యష్టిగా ఈ గోళకాలయందు చేరి వ్యష్టి ఇంద్రియముగా వచ్చి పనిచేస్తాయి.

తామస ఆకాశము వ్యష్టి సమష్టి రెండు భాగాలై సమష్టి భాగం హృదయ స్థానమయింది, హృదయాకాశమయింది. వ్యష్టి తామస ఆకాశం నాలుగు భాగాలై ఒక భాగము తామస వాయువుతో కూడి మనసుకు గోళకము అయింది. రెండవ భాగమైనటువంటి తామస ఆకాశము తామస అగ్నితో కూడి బుద్ధికి గోళకం అయింది, మూడవ భాగమైనటువంటి తామస ఆకాసము తామస జలముతో కూడి చిత్తానికి గోళకమాయెను. నాలుగవ భాగము అయిన తామస ఆకాశము తామస పృధివితో కూడి అహంకారమునకు గోళకమాయెను. గోళకమన్నా స్థానమన్నా ఒకటే. గోళకము అనే పేరు ఎందుకు చెప్పామంటే అక్కడ ఇంద్రియాలు పనిచేయడానికి ఒక అమరిక, ఏర్పాటు, ఒక విధానము, ఒక పద్ధతి ఉన్నది.

మెదడులో న్యూరాన్లు శబ్ద స్పర్శ రూప రస గంధాలని గ్రహించడానికి అయిదు కంపార్ట్‌మెంట్స్ వుంటాయి. అయిదు కంపార్ట్‌మెంట్సులో ఈ గ్రహించినటువంటి జ్ఞానము అక్కడికి వెళ్ళి అది ఉత్తేజితము అయినప్పుడు ఆ శబ్ద స్పర్శ రూప రస గంధ జ్ఞానము ఆ జీవుడికి ఆ మనసులో కలుగుతుంది. మరల మనసు కూడా గోళకమే మెదడు అనే స్థానంలో ఆ గోళకము ఉన్నది. కాని అది పనిచేసేది ఎక్కడినుంచి అంటే కంఠస్థానం నుండి పనిచేస్తుంది. ఇది చాలా తమాషాగా వుంది. ఇక్కడని చెప్పడానికి లేదు. ఆత్మ సర్వవ్యాపకమైనా హృదయాకాశంలో ఆత్మ వుంది అంటాము. ఎందుకంటే హృదయాకాశంలో ఆత్మ తప్ప రెండవది లేనిదిగా అద్వయంగా ఉండి అక్కడికి వెళ్ళినవాడికి అనుభవముగా దొరుకుతుంది కనుక అట్లా చెప్పాం. కాని మోకాలులో కూడా ఆత్మ వుంది. మోకాలులో బుద్ధి లేనందువల్ల అక్కడ అనుభవంరాదు కాబట్టి మోకాలులో వున్న ఆత్మని మనం పట్టించుకోము. కాలిగోళ్ళల్లో, వెంట్రుకలలో కూడా ఆత్మ వుంది, పట్టించుకోము. హృదయాకాశంలో వున్న ఆత్మని పట్టుకుంటాము. పట్టుకునేవాడు బుద్ధిలో భ్రూమధ్య స్థానంలో ఏకాగ్రత పెట్టి ధ్యానం చేస్తే దొరుకుతుంది. కాబట్టి భ్రూమధ్య స్థానంలో ఆత్మ వుంది అంటారా? భ్రూమధ్య స్థానంలో వున్న బుద్ధి అక్కడ ఏకాగ్రత చెంది ఆత్మని అందుకుంటుంది. ఆత్మ ఎక్కడుంది? హృదయాకాశంలో వుంది. అనాహత చక్రం దగ్గర ఆత్మ వుంది. అందుకని ఆత్మ ఫలానాచోట వుంది ఫలానా చోట లేదు అని అనుకోవద్దు. భ్రూమధ్య స్థానంలో వుండి బుద్ధిగా నిశ్చయిస్తున్నాడు. మరి ఆ బుద్ధి స్థానంలో భ్రూమధ్య స్థానంలో బుద్ధిని నిశ్చల బుద్ధి గా చేసుకుని నిర్విషయం చేసుకుంటే ఆ ఏకాగ్రత లభించినప్పుడు ఆయన హృదయాన్ని చూడగలిగాడు. అక్కడ ఫాల నేత్రం అన్నారు, జ్ఞాన నేత్రం అన్నారు, మూడవ నేత్రం అన్నారు. ఆ ఫాల నేత్రంనుండి మూడవ కన్నుద్వారా హృదయంలో వున్న ఆత్మని చూశాడు.

తామస వాయువు వ్యష్టి సమష్టి అని రెండు భాగాలు అయింది. సమష్టి భాగము వ్యాన వాయువునకు సర్వ శరీరము గోళకమయింది. వ్యష్టి తామస వాయువు రెండవ భాగము నాలుగు పరకలయింది. అందులో మొదటి తామస వాయువు తామస ఆకాశముతో కూడి సమాన వాయువుకి గోళకము అయింది. రెండవ తామస వాయువు తామస అగ్నితో కూడి ఉదానవాయువుకు గోళకము అయింది. మూడవ భాగమైనటువంటి తామస వాయువు తామస జలముతో కూడి ప్రాణ వాయువునకు గోళకము అయింది. నాలుగవ తామస వాయువు తామస పృథివితో కూడి అపాన వాయువుకి గోళకం అయింది. ఇవన్నీ గోళకాలే. ఈ విధముగా పంచ ప్రాణాలకి గోళకాలు అయినాయి.

తామస అగ్ని వ్యష్టి సమష్టి రెండు భాగాలు అయింది. తామస అగ్ని ఒక భాగము సమష్టి చక్షురింద్రియానికి గోళకము అయింది. రెండవ భాగము వ్యష్టిగా మారి నాలుగు భాగాలయింది. ఒక భాగము అయినటువంటి తామస అగ్ని తామస ఆకాశముతో కూడి శ్రోత్రేంద్రియమునకు గోళకము అయింది. రెండవ భాగము తామస అగ్ని తామస వాయువుతో కూడి త్వగింద్రియ గోళకము అయింది. మూడవ భాగమైన తామస అగ్ని తామస జలముతో కూడి జిహ్వేంద్రియ గోళకము అయింది. నాలుగవ భాగమైన తామస అగ్ని తామస పృథివితో కూడి ఘ్రాణేంద్రియముకు గోళకం అయింది.

తామస జలము వ్యష్టి సమష్టిగా రెండు భాగాలయింది. తామస జలము సమష్టి భాగము రస విషయానికి గోళకము అయింది. రస విషయమని ఎందుకన్నాం ఇక్కడ? రస తన్మాత్రేమో సృష్టికి ముందు గుణముగా వున్నది. గుణము ప్రకటించడానికి ఉపాధి లేదు. సృష్టిలోకి వచ్చే సరికి ఇప్పుడు ఉపాధులు తయారయినాయి. ఆ ఉపాధులలోనే గోళకాలు తయారయినాయి. గోళకాలలో అధిష్ఠాన దేవతల యొక్క సమష్టి భాగమునుంచి వచ్చిన ఇంద్రియాలు గోళకాలలోకి చేరి అక్కడ స్థానాన్ని చేసుకున్నాయి. ఇప్పుడు రసమనేటటువంటి విషయము జిహ్వేంద్రియానికి అనుభవ పూర్వకంగా తెలుస్తోంది. అనుభవ పూర్వకంగా తెలిసినప్పుడు అది విషయం, తెలియనప్పుడు అవి తన్మాత్రగా లేక గుణముగా వున్నాయి. తన్మాత్ర అనేది ఇక్కడ వాడకూడదు. తన్మాత్ర అక్కడ వాడామంటే అప్పుడు సృష్టి ఇంకా కాలేదు. తన్మాత్రలు సూక్ష్మ భూతాలై పంచీకరణై సృష్టై నామరూపా ప్రపంచమై సమష్టి భాగాలన్నీ కూడా బ్రహ్మాండంలో వుండి వ్యష్టి భాగాలన్నీ కూదా పిండాండంలోకి వచ్చినప్పుడు సత్వ గుణంగా వున్నవి అధిష్ఠాన దేవతలగా వుండి, రజో గుణంగా వున్నవి ప్రేరణ స్థితిగా వుండి తమో గుణంగా వున్నవి గోళకాలుగా వున్నప్పుడే, ఈ పని జరుగుతోంది. కనుక మూడు గుణాలతోటి ఈ పంచీకరణ చెప్పాలి.

తామస జలము సమష్టి వ్యష్టి రెండు భాగాలై సమష్టి రస విషయానికి గోళకం అయింది. వ్యష్టి నాలుగు భాగాలై వ్యష్టి తామస జలము వ్యష్టి తామస ఆకాశముతో కూడి శబ్దమనే విషయానికి గోళకమయింది. రెండవ భాగము తామస జలము తామస వాయువుతో కూడి స్పర్శ విషయానికి గోళకమయింది. మూడవ భాగము తామస అగ్నితో కూడి రూప విషయమునకు గోళకమయింది. నాలుగవ భాగము తామస పృథివితో కూడి గంధ విషయమునకు గోళకము అయింది.

తామస పృథివి రెండు భాగములై ఒకటి వ్యష్టి రెండు సమష్టి అయింది. సమష్టి భాగము పాయురేంద్రియానికి గోళకమయింది. వ్యష్టి తామస పృథివి నాలుగు భాగాలై, ఒక భాగము తామస పృధివి తామస ఆకాశముతోకూడి వాగీంద్రియమునకు గోళకము అయింది. రెండవ భాగమైనటువంటి తామస పృథివి తామస వాయువుతో పాణీంద్రియమునకు గోళకమయింది. మూడవ భాగమైనటువంటి తామస పృథివి తామస అగ్నితో కూడి పాదేంద్రియానికి గోళకమయింది. నాలుగవ భాగమైనటువంటి తామస పృథివి తామస జలముతో కూడి గుహ్యేంద్రియ స్థానమునకు గోళకమయింది.

ఈ విధంగా స్థూల శరీరానికి 25 గోళకాలు ఈ పంచీకరణ వల్ల ఆ ఇంద్రియాలు పనిచేయడానికి అనుగుణమైనటువంటి అమరికతో, ఏర్పాటుతో తయారయ్యాయి. స్థూల దేహమే కనుగుడ్డు రూపంలోనూ స్థూల దేహమే కర్ణభేరి రూపంలోనూ స్థూల దేహమే నాలుకమీద వున్నటువంటి గ్రంథుల రూపంలోనూ స్పర్శని ఎరిగేటటువంటి పొలుసుల రూపంలోనూ ఈ విధంగా గోళకాలన్నీ కూడా స్థూల దేహాన్ని ఆశ్రయించి స్థూల దేహంలో భాగమై, ఎక్కడైనా కూడా వాటి యొక్క నిర్మాణము రక్తమాంసాలతోనే సప్తధాతువుతోనే అయింది. స్థూల దేహం ఎలా తయారయిందో గోళకాలు కూడా అలాగే తయారయినాయి. ఇవన్నీ కూడా తామస పంచభూతాల యొక్క పంచీకరణతో అయింది.

అధిష్ఠాన దేవతలుగా వున్న సమష్టి ఇంద్రియాలు, ఇవన్నీ ఈశ్వరునియొక్క ఇంద్రియాలు అయితే అనేక జీవుల యొక్క స్థూల దేహములందు గోళకములలోకి ఆ గోళకము సిద్ధమయ్యేసరికి అటువంటి స్థానానికి ఆ సమష్టి రూపంలో వున్న అధిష్టాన దేవతలు వ్యష్టి రూపమై వ్యష్టి ఇంద్రియాలుగా అక్కడికి వచ్చి జీవుని యొక్క కర్మానుసారము ఆ కర్మ ఫలితాన్ని అనుభవించడానికి కర్మ చెయ్యడానికి అనుగుణంగా ఈ కర్మేంద్రియాలు ఈ జ్ఞానేంద్రియాలు పనిచేస్తున్నాయి.

అంతరేంద్రియాలు, ప్రాణేంద్రియాలు – ఇవి సమష్టి రూపములు. ఈ శరీరమందు స్థాన బేధముచేత వృత్తి బేధము చేత అయిదేసి రకాలుగా వున్నప్పటికీ అంతఃకరణము ఒక్కటే, అలాగే ప్రాణము ఒక్కటే. మనకి పంచీకరణలో హృదయాకాశము అని చెప్పాం. హృదయాకాశమందు చేరాడు గురుమూర్తి. ఆయనే అంతరాత్మగా, అంతర్యామిగా సుఖాభిలాష కలిగిస్తూ అంతరాత్మ ప్రబోధం మేరకు అజ్ఞానంలో ప్రియ మోద ప్రమోద అనే వృత్తులుగా జ్ఞానంలో సచ్చిదానందముగా ఆ హృదయాకాశంలో అనుభవం ఇచ్చేదానికి వీలుగా ఒంటరిగా ఖాళీగా దేనితో కలిసి లేకుండా వున్నాడు. కనుక మనమందరం కూడా దేనితోనూ కలిసి వుండని స్థానానికి వెళ్ళి వున్నప్పుడే అక్కడ ఆత్మ చైతన్యము మన స్వానుభవానికి వస్తుంది. ఏకాగ్రత ఏమో భ్రూమధ్య స్థానంనుంచి చెయ్యాలి. అనుభవమేమో హృదయాకాశంనుంచి పొందాలి. ఆత్మ నఖశిఖ పర్యంతము అంతటా వ్యాపించి వున్నప్పటికీ అన్ని ప్రదేశాలూ జ్ఞానానికి సంబంధించిన సాధనకి పనికిరావు. ఆసనానికి, ప్రాణాయామానికి కొన్ని పనికొస్తాయి. ధ్యానానికి కంఠ స్థానంలో వున్న మనసు పనికొస్తుంది. ఏకాగ్రతకి భ్రూమధ్య స్థానంలో వున్న బుద్ధి పనికొస్తుంది. నిర్విషయం కంఠ స్థానంలో చెయ్యాలి. బుద్ధి యొక్క నిశ్చలత్వం భ్రూమధ్య స్థానంలో చెయ్యాలి. ఏకాగ్రత లభించినప్పుడు ఆ బుద్ధి స్థానంలో వున్నవాడికి హృదయాకాశంలో వున్న పరమాత్మ గోచరిస్తాడు. కనుక బుద్ధిస్థానం ఫాల భాగంలో వున్న మూడో నేత్రాన్ని శివుడుకి కూడ మూడో నేత్రాన్ని ఏదైతే చెప్తున్నారో ఆ దృక్ స్థానంద్వారా దర్శనం జరుగుతుంది, దర్శనం స్థానం మాత్రం హృదయస్థానమే. హృదయాకాశంలోనే ఎందుకొస్తాడు అంటే అక్కడ కలగాపులగం లేదు, నిర్విషయంగా వుంది, అక్కడ మనసు లేదు మనోవ్యాపారం లేదు అక్కడ జడత్వం లేదు. అందువల్ల అక్కడే గోచరిస్తారు. ఆత్మ నఖశిఖ పర్యంతము, లోపలా వెలుపలా బ్రహ్మాండమంతా వ్యాపించి వున్నప్పటికీ, జ్ఞాన నేత్రం వుండేటటువంటి స్థానంలో బుద్ధియొక్క నిశ్చలస్థితిలో జ్ఞాన నేత్రము ద్వారా హృదయాకాశమునందు మాత్రమే లభిస్తుంది. కనుక అవాఙ్మానస గోచరమైనటువంటి బ్రహ్మని మనం గ్రహించడానికి ఈ గోళకలుగానీ, ఈ స్థానాలుగానీ, సత్వ గుణంతో ఉన్న అదిష్ఠాన దేవతలు గాని, ఉన్న మనం గ్రహించడానికి ఈ ఏర్పాటు అంతా సాంఖ్యం.

సాంఖ్యం అంటే ఏమిటంటే కలగాపులగమైన దానిని దేనికది విడగొట్టి, విడగొట్టినప్పుడు దేని తత్వం ఏది? దేని గుణం ఏది? ఏది జడము? ఏది చైతన్యము? అనేది విడమర్చి చెప్పడానికే ఈ సాంఖ్యం పనిచేస్తుంది. సాంఖ్యం అంటే కేవలం గుణకారాలు, కూడికలు తీసివేతలూ కాదు. సాంఖ్యము అంటే ఆత్మని, అనాత్మని విడగొట్టడానికి, జీవునియొక్క ఉపాధులైన స్థూల సూక్ష్మ కారణ శరీరాలు విడగొట్టడానికి, సర్వవ్యాపక చైతన్యము దాని వల్ల వీటి యొక్క వ్యవహారం దేనివల్ల జరుగుతుంది అని, అవి కలిపితే వ్యవహారం వుందా? విడదీస్తే వ్యవహారం వుందా? అని చూస్తే విదదీసినప్పుడు జడమైన వాటివల్ల ఏదీ లేదని తెలుస్తుంది. కర్మ కూడా జడమని, కర్మలో కూడా పరమాత్మ వ్యాపించివున్నాడని అందువల్ల జడమైన కర్మ కూడా ఆ పరమాత్మ చైతన్యమే కర్మానుభవానికి కారణమని, ఆ కర్మనుభవం పొందే భాగంలో అధిష్ఠాన దేవతల సహాయం వుందని, అధిష్ఠాన దేవతలు సత్వగుణాంశతో తయారయారని ఇన్ని రకాలుగా వున్నటువంటి సాంఖ్యం తెలిస్తే తప్ప, మన సంకెళ్ళు విడవవు. ఈ విధముగా భూతములయొక్క భాగములలో ఇతర భూతములు చేరడంవలన సంయోగ వియోగాలవల్ల ఈ స్థూల శరీరము. గోళకములు, ఈ 25 న్ను కలిగెను అని తెలుసుకుంటున్నాము. ఇదీ విచారణ.

ఇక్కడ అధ్యాత్మికం, ఆధి భౌతికం, ఆదిదైవికం మూడూ చెప్పాలి.ఆధ్యాత్మలన్నీ కూడా నీ స్వరూపం. ఆధి భౌతికం అంతా కూడా తామసిక సృష్టిలో వున్న గోళకాలు. ఆధి దైవికం అంతా కూదా అధిష్ఠాన దేవతల రూపంలో వున్నటువంటి శక్తి స్వరూపంలో వున్న ఆ శక్తులయొక్క ప్రేరణ. ఈ మూడూ కలిసి పనిచేస్తే ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధి భౌతిక త్రయము అనే త్రిపుటి పోయినప్పుడు జీవుడు తానెవరో తాను తానైనటువంటి స్థితిలో వుండగలుగుతాడు. కనుక సాంఖ్యం ఈ విధంగా పద్నాలుగు లోకాల గురించి పంచభూతాల యొక్క సమష్టి వ్యష్టి భాగాలయొక్క సంయోగ వియోగాలుగా వున్న పంచీకరణ గురించి మొత్తం తేటతెల్లంగా విడమర్చి చెప్పింది. ఈ వివరణ వలన వివేకము కలుగుతుందే గాని మోక్షానికి తీసుకొని వెళ్ళదు. ఇప్పుడు నువ్వు దేనిని పనిముట్టుగా వాడుకుంటావో, ఏది నువ్వనుకుంటావో, ఏది నువ్వు కాదనుకుంటావో, ఆ తరువాత వచ్చే బోధలో చెప్తారు. తరువాత వచ్చేదాంట్లో ఆత్మ విలక్షణం అని చెప్తారు. ఇక్కడ మూడు గుణాల సృష్టితోటి పంచీకరణ జరిగి గోళకాలు వచ్చినాయి అని చెప్పడం అయింది. ఇంతవరకు తమోగుణ పంచీకరణమే మనం చెప్పుకున్నాము. ఇప్పుడు రజోగుణంతో ఏర్పడిన సూక్ష్మ పంచభూతాలు సమష్టి వ్యష్టియై, సమష్టిలో అంతరింద్రియములైనటువంటి మనసు బుద్ధి చిత్త అహంకారములు అయినాయి. రజో గుణ సృష్టి అంతా ఇంద్రియాలు అయినాయి. పంచ జ్ఞానేంద్రియములైన శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వా, ఘ్రాణములు వరుసగా వ్యష్టి సూక్ష్మ ఆకాశ, వాయు, అగ్ని, జల పృథివిల వలన కలిగినవి.

పంచీకరణ అంతా చెప్పుకొచ్చాము. అపంచీకృత భూతాలు కూడా వున్నాయి. ఆకాశమంతా కలసి అందులో సగము, మిగతా సగము నాలుగు భాగాలు అవలేదు. ఎంతోగా ఉన్న ఆకాశములో కొంత ఆకాశము తీసుకున్నాడు దాంట్లో సగము అర్థ భాగము జ్ఞాతకు గోళకము అయితే రెండో అర్థభాగము అంతఃకరణ చతుష్టయానికి గోళకాలు అయినాయి. అపంచీకృత ఆకాశము చాలా ఉంది. దీనినే వేదాంతంలో పదో భాగం పంచీకరణ అయింది అంటాడు. మిగతా తొమ్మిది భాగాలు అపంచీకృతంగా వుంది. వాయువు కూడా తొమ్మిది భాగాలు అపంచీకృతంగా వుంది, పదో వంతు భాగం వాయువు పంచీకరణలో పాల్గొంది. ఆ పంచీకరణలో పాల్గొన్నదాంట్లో అర్థ భాగము వేరయింది మిగతా అర్థభాగము నాలుగు పరకలయింది. ఈ విధంగానే ఐదు సూక్ష్మ భూతాలున్నూ, అసలు సృష్టిలోకి వెళ్తే మూడొంతుల బ్రహ్మ సృష్టిలోకి రాలేదు ఒకవంతు బ్రహ్మే మాయాశబలిత బ్రహ్మగా సృష్టిలోకి వచ్చాడు. దీనిని దశాంగుళ న్యాయం అంటారు. ప్రతి స్థితిలో కూడా ఓ పది భాగాలు చేసి తొమ్మిది భాగాలట్లుండగా ఒక భాగం సృష్టిలోకి వచ్చింది. మొత్తం సృష్టి ఆకాశంనుండి పృథివి వరకు వచ్చాక, ఆకాశం వుండకూడదు, వాయువు వుండకూడదు. మొత్తం సృష్టిగా మారితే పృధివి వచ్చిన తరువాత ఆ పై నాలుగు భూతాలు వుండకూడదుగా. కాని అవి వున్నాయి. అంటే సృష్టి లో కొంత భాగం అక్కడ మిగతా భాగం పంచీకరణతో క్రిందకి వచ్చిందని తెలుసుకోవాలి.

అసలు మొత్తం సృష్టి వస్తే, బ్రహ్మ కూడా సృష్టిలోకి వస్తే, మోక్షానికి పనికొచ్చే పరబ్రహ్మ ఎక్కడా లేడుగా? అందుకని మూడొంతుల పరబ్రహ్మ సృష్టికతీతంగా వున్నదున్నట్లు వున్నాడు, ఒక వంతు బ్రహ్మ మాయాశబలిత బ్రహ్మ అని బ్రహ్మణోరవ్యక్త, అవ్యక్తో మహత్, మహతో మహదహంకారః అని, మహదహంకారంనుంచి మూడు గుణాలతోటి సృష్టి అంతా కూడా తన్మాత్రలు వచ్చి, తన్మాత్రలనే గుణములద్వారా సూక్ష్మ భూతాలు వచ్చి, సూక్ష్మ భూతాలద్వారా ఆ గుణములు తదుపరి సృష్టిలో విషయాలైనాయి. ఇంత క్రమ సృష్టి వచ్చింది. మరి వచ్చినప్పుడు వెనక ఇవి ఉండకూడదుగా! అంటే కొంత భాగం మిగిలే వుంటున్నాయి అన్నమాట.

అలాగే మాయకు ఆవల పరబ్రహ్మ ఉంటే, మాయలో ఆ ప్రకాశమే ఆత్మగా ఉన్నది. అలాగే దేవతలు, అపంచీకృతముగా మిగిలిపోయిన వాళ్ళు. అవ్యక్తం దగ్గర తత్వ విచారకులు, మహత్తు దగ్గర ఆగిపోయిన వాళ్ళు యోగాభ్యాసకులు, మహదహంకారము దగ్గర ఆగినవాళ్ళు మత పద్ధతిలో సాధకులు, తన్మాత్రదాకా వచ్చినవాళ్ళు భక్తులు, సూక్ష్మభూతాలలో వున్నవాళ్ళు మంత్రాక్షరాలు వాడుకునే మంత్రోపాసకులు. పూర్తిగా అనాత్మగా వుండేవాళ్ళంతా మానవులు. అయితే ఈ మెట్లు ఎక్కి మానవులు గురువు దగ్గర మంత్రం తీసుకుని మంత్రోపాసన చేసుకోవాలి, భక్తి యోగంలో భక్తులు కావాలి, మాయ శక్తిని దాటడానికి మతపద్ధతిలోకి వెళ్ళాలి, అవ్యక్తం దగ్గరికి వెళ్ళి తత్త్వ విచారణ చెయ్యాలి, మాయాశబలిత బ్రహ్మ దగ్గరినుండి పరిపూర్ణ బోధచేత త్రిగుణ రహితమైన బ్రహ్మ జ్ఞానానికి వెళ్ళేవాళ్ళు తత్త్వ విచారకులు. యోగాభ్యాసకులు ఎంతవరకు వస్తారు అంటే తత్త్వాన్ని అందుకునే వరకు వస్తారు. మాయాశబలిత బ్రహ్మజ్ఞానంలో వుండి ఆ బ్రహ్మ ఆయుష్కాలం ఎంత కాలం వుంటే, ఆ బ్రహ్మతోపాటు వుండి, ఆ బ్రహ్మకు మోక్షం వస్తే నీకూ మోక్షం వస్తుంది. దీనిని క్రమ ముక్తి అంటారు. ఆ బ్రహ్మకు మోక్షం లేకపోతే మళ్ళీ ఆ బ్రహ్మ యొక్క పునః సృష్టిలో వేరే కల్పంలో వారుకూడా మళ్ళీ దిగొచ్చి మళ్ళీ జీవులౌతారు. ఈ విధంగా యావత్తు సృష్టంతా మనం చెప్పిన విధానంలో అవలేదు. ఎక్కడికక్కడ దిగబడి మిగతావి అపంచీకృతంగా ఉన్నాయి అని మనం అర్థం చేసుకోవాలి. కనుక ఇక్కడ అపంచీకృత భాగాలు కూడా ప్రతి దశలో వున్నాయని తెలుసుకోవాలి.

త్రిగుణాత్మకమైన సృష్టిలో సత్వగుణ రజోగుణ తమోగుణ పంచభూతాలు ఒకేసారి అలా వచ్చాయి. సత్వగుణ పంచభూతాలు రజోగుణ పంచభూతాలు తమోగుణ పంచభూతాలు జట్లు జట్లుగా ఏర్పడ్డాయి. సత్త్వగుణ సూక్ష్మ కాశము సత్వగుణ సూక్ష్మ వాయువు సత్వగుణ సూక్ష్మ అగ్ని, సత్త్వగుణ సూక్ష్మ జలం, సత్వగుణ సూక్ష్మ పృథ్వి ఇవి సత్వగుణ సూక్ష్మ పంచభూతాలైనాయి. రజోగుణ సూక్ష్మ ఆకాశము వాయువు, అగ్ని, జలము పృథివి – ఇవి కూడా చీలిపోయి రజోగుణ సూక్ష్మపంచభూతాలైనాయి. అలాగే తమోగుణ సూక్ష్మ భూతాలు తమో గుణాల తోటి అయినాయి. పంచభూతాలు ఎలా వచ్చినాయి అసలు?

ముందు తన్మాత్రలొచ్చి,తన్మాత్రల ద్వారా సూక్ష్మ భూతాలు వచ్చాయి. తన్మాత్రలు అన్నీ ఒకేసారి వచ్చి, సూక్ష్మ భూతాలు అన్ని తరువాత వచ్చాయా అంటే కాదు. శబ్ద తన్మాత్ర వచ్చి, శబ్దతన్మాత్ర నుండి సూక్ష్మ ఆకాశం వచ్చి సూక్ష్మఆకాశం నుండి శబ్దస్పర్శ తన్మాత్రలు వచ్చి, ఆ తన్మాత్రలనుండి సూక్ష్మ వాయువు వచ్చి, సూక్ష్మవాయువు నుండి శబ్ద స్పర్శ రూప తన్మాత్రలు కలిగి, ఆ తన్మాత్రల నుండి సూక్ష్మ అగ్ని వచ్చి ఆ సూక్ష్మ అగ్నినుండి శబ్ద స్పర్శ రూప రస తన్మాత్రలు పుట్టి, ఆ తన్మాత్రల నుండి సూక్ష్మ జలము పుట్టి, సూక్ష్మజలమునుండి శబ్ద, స్పర్శ రూప రస గంధములు అనే ఐదు తన్మాత్రలు పుట్టి ఆ 5 తన్మాత్రల ద్వారా సూక్ష్మ పృథ్వి పుట్టి ఇలా చూసుకోవాలి. ఒకేసారి తన్మాత్రలు దానినుండి సూక్ష్మ భూతాలు రాలేదు.

చెప్పేటప్పుడు ఎలా చెప్తున్నాం? "పంచ తన్మాత్రాణి పంచభూతేభ్యో అని చెప్తుతున్నాము. ఏదైనా బోధ పడాలంటే ముందు పైపైన తెలియాలి, తరువాత వివరంగా తెలియాలి. పైపైన చెప్పినప్పుడు అట్లా చెప్పాం. ఆత్మనుండి ఆకాశం పుట్టింది. ఆకాశము నుండి వాయువు పుట్టింది. వాయువు నుండి అగ్ని. ఇలా వరుసగా చెప్పాం. అలా పుట్టినప్పుడు తన్మాత్ర లేవీ?

ఇంకోచోటేమో **"బ్రహ్మణోఅవ్యక్తః , అవ్యక్తో మహత్తు, మహతో మహదహంకారః, మహదహంకారో పంచతన్మాత్రాణి, పంచ తన్మాత్రేభ్యో పంచభూతాని.** పంచతన్మాత్రలనుండి పంచభూతాలు ఇలా వచ్చాయని అక్కడ చెప్తున్నాం. ఇక్కడేమో ఆత్మనుండి డైరెక్టుగా ఆకాశం వచ్చిందంటున్నాం. ఇక్కడ ఆత్మ అంటే ఆత్మను కడగాపెట్టి ఆత్మ ప్రకాశము మాయలో ఉంటే మాయలో ఉన్నటువంటి ఆత్మ ప్రకాశం వల్ల అవ్యక్తము, దానివలన మహత్తు దానివలన మహదాహంకారము వచ్చాయి అని చెప్పాలి. అవ్యక్తము, మహత్తు, మహదహంకారము, సంవిత్ బిందువు అనేటటువంటి నాలుగు బిందువులు కలిపి అవ్యక్తం అని కొత్త పేరుపెట్టాం. దీనినే తురీయకూటమి అన్నాము. ఈ తురీయ కూటమినే ఆత్మ అన్నాము. అంటే ఈ ఆత్మనుండి ఆకాశం వచ్చిందనుకోవాలి డైరెక్టుగా ఆత్మనుండి కాదు. ఆత్మనుండి అవ్యక్తం, అవ్యక్తం తరువాత మహత్తు, తరువాత మహదహంకారం తరువాత తన్మాత్రలు తరువాత సూక్ష్మభూతాలు రావాలి. కాని ఆత్మనుండి సూక్ష్మ భూతాలు వచ్చినట్లుగా వున్నది. ఇదేమిటి? కనుక పైపైన ఒక వరుసలో చెప్పి, తరువాత వివరాలతో కూడిన బోధ ఉంటుందన్నమాట.

తామసాకాశము వ్యష్టి, సమష్టి అయింది. సమష్టి తామసాకాశము హృదయాకాశము అయ్యింది. వ్యష్టి తామసాకాశము పంచీకరణలో చెప్పుకున్నట్లుగా పంచీకరణ జరిగి, అంతఃకరణ చతుష్టయానికి, జ్ఞాతకి కలిపి 5 గోళకాలు వచ్చాయి.

మొదటి గోళకమునకు హృదయాకాశంలో జ్ఞాత అని పేరు. జ్ఞాతకుఒక గోళకము, అలాగే మిగతా అంతఃకరణ చతుష్టయానికి వెరసి అయి దగోళకాలు. వీటిలో ఆయా ఇంద్రియాలు చేరి ఉంటాయి. అవి అధిష్ఠాన దేవతల ప్రేరణతో పనిచేస్తాయి.

ఇంద్రియాలు శక్తి పరిధిలో పని చేయడానికి సంబంధించినటువంటి ఏర్పాటు. ఎలాగుంటుందో చూద్దాము. తెల్లగుడ్డు, నల్లగుడ్డు, సునీలము, పాప, కళ, నిష్కళ ఇవన్నీ కన్నులోఉంటాయి. సైన్సు ప్రకారం దాని వెనుక ఒక రెటినా ఉంటుంది. ముందేమో లెన్సు ఉంటుంది, కనుపాప నుండి రెటీనామీద ముద్ర పడుతుంది. ఇంతవరకు కెమెరాలాగే ఉంది. జడం అయితే కెమెరాయే. కాని దీనిలో చైతన్యము వ్యాపకం అయ్యింది. కెమెరా అయితే ఫోటో తీస్తుంది. కాని ఆ ఫోటో ఆ కెమెరాకి తెలియదు.కానీ కన్నుకి తెలుస్తుంది. ఎందుకంటే దీనితో చైతన్యము మిశ్రమమై ఉంది. అంటే రెటీనా నుంచి ఒక నరం మెదడులోకి వెళ్ళి, అక్కడ ఉన్నటువంటి న్యూరాన్లను ఉత్తేజపరుస్తుంది. (యాక్టివేట్ చేస్తుంది) అప్పుడు రూపజ్ఞానము కలుగుతుంది. అన్ని ఇంద్రియాలకు ఇలాగే జరుగుతుంది.

శబ్ద స్పర్శ రూప రస గంధాలన్నీకూడా ఆయా ఇంద్రియముల ద్వారా మెదడులోకి వెళ్ళే న్యూరాన్స్ యాక్టివేట్ అయితే ఆ శబ్దం స్పర్శ రూప రస గంధాలు తెలియబడుతాయి. మెదడులో ఆ రకంగా ఉండటం ఏమిటి? అదికూడా గోళకం.

అక్కడ మనస్సు అనే ఇంద్రియానికి ఇవి తెలుస్తాయి. విడివిడిగా ఏ ఇంద్రియము తెలుకోలేవు. వాటిద్వారా మనస్సుకి తెలుస్తాయి. బుద్ధిలో నిర్ణయంగా తెలుస్తాయి. అందుకే 5 జ్ఞానేంద్రియాలు మనస్సు కలిపి మనోమయ కోశము అన్నాము. అలాగే బుద్ధి, 5 జ్ఞానేంద్రియాలు కలిసి విజ్ఞానమయ కోశము అన్నాము. అంటే ఈ మనోబుద్ధులు జ్ఞానేంద్రియములు అనే పనిముట్ల ద్వారా తెలుసుకుంటాయన్నమాట.

శరీరము సప్తధాతువులుగా అంటే రక్తం, మాంసం, మెదడు, చర్మము, కొవ్వు, ఎముకలు, మూలిగ ఇలాంటివి 7 ధాతువులు కలిపి స్థూలశరీరం. కన్ను ముక్కు చెవి అనేవి కూడా ఆ ధాతువులతోనే ఉన్నాయి. ఆ ధాతువులు కూడా పంచభూతాల నుంచి ఏర్పడి ఉన్నాయి. కనుక బయటికి కనబడే కన్ను, ముక్కు, చెవులు అన్నీ అవయవాలే. అవే ఇప్పుడు గోళకాలైనాయి.

కనుక వ్యష్టిలో మానవుని యొక్క దేహంలో సప్తధాతు మయ శరీరంగా ఈ పంచభూతాలు మారి అందులో కొన్ని అవయవాలు ఏర్పడితే అందులో కొన్ని అవయవాలు ఈ శబ్ద స్పర్శ రూప రస గంధాలను ఎరుగగలిగినటువంటి, కర్మలు చేయగలిగినట్టి గోళకాలైనాయి. ఈ విధంగా అక్కడ కొన్ని స్థానాలు అవయవాలలో ఏర్పడి ఆ స్థానంలో ఇంద్రియం పని చేయడానికి అనుకూలమైన గోళకాలు ఎలా తయారయ్యాయో ఈ పంచీకరణలో చెప్తున్నాము.

తామసాకాశాన్ని వ్యష్టి సమష్టి అని రెండు భాగాలుగా చేస్తే సమష్టి హృదయ స్థానమైంది. అక్కడ జ్ఞాత ఉన్నాడు. వ్యష్టితామసాకాశము 4 భాగాలైంది. ఆ నాలుగు భాగాలలో మొదటి పరక భాగము వాయువుతో కూడి మనస్సుకు గోళకము అయింది. తామసాకాశము యొక్క రెండవ పరక భాగము అగ్నితోకూడి బుద్ధికి గోళకం అయ్యింది. మూడవ తామసాకాశ భాగము తామసిక జలంతో కూడి చిత్తానికి గోళకం అయింది. నాలుగవ భాగమైన తామసిక ఆకాశము తామసిక పృథ్వితో కూడి అహంకారానికి గోళకము అయింది. ఇక్కడ ఇవన్నీ సూక్ష్మ భూతాలు. ఈ రకంగా జ్ఞాత ,అంతఃకరణ చతుష్టయానికి గోళకాలు వచ్చాయి.

అదే మాదిరిగా తామసిక వాయువు వ్యష్టి, సమష్టి రెండు భాగాలైంది. సమష్టి వ్యాన వాయువునకు గోళకము అయింది. అది శరీరం సర్వాంగములు అంతా వ్యాపించి ఉంది. మిగిలిన అర్థభాగములో తామసికమైన సూక్ష్మ వాయువు నాలుగు భాగములు అయినవి, అందులో ఒక భాగం తామసిక సూక్ష్మ ఆకాశముతో కలసి, సమానవాయువుకు గోళకం అయ్యింది. ఒక భాగం తామసిక సూక్ష్మ అగ్నితో కూడి ఉదానవాయువునకు గోళకము అయ్యింది. రెండవ పరక తామసిక సూక్ష్మ వాయువు తామసిక సూక్ష్మ జలముతో కూడి ప్రాణ వాయువునకు గోళక మయింది. మూడవ పరక భాగము పృథ్విని గూడి అపాన వాయువునకు గోళకమయ్యెను.

తామసిక సూక్ష్మ అగ్నివ్యష్టి సమష్టి అని రెండై, సమష్టిలో చక్షురింద్రియానికి గోళకం అయింది. ఆ తామస అగ్ని రెండవ అర్థభాగం 4 పరకలై ఒక పరక ఆకాశముతో కూడి శ్రోత్రేంద్రియానికి గోళకం అయ్యింది. రెండవ పరక తామస సూక్ష్మ అగ్ని తామస సూక్ష్మ వాయువుతో కూడి త్వగింద్రియానికి గోళకం అయ్యింది. మూడవ పరక తామస సూక్ష్మ అగ్ని తామస సూక్ష్మ జలముతో గుహ్యేంద్రియానికి గోళకమయింది. తామస సూక్ష్మ అగ్ని నాలుగవ భాగము తామస సూక్ష్మ పృథ్వితో కూడి ఘ్రాణేంద్రియముకు గోళకమయ్యింది.

ఆ తరువాత తామస సూక్ష్మ జలము వ్యష్టి సమష్టి రెండు భాగములై, సమష్టిలో రసము అనే విషయమునకు గోళకమైంది. రెండవ అర్థభాగం 4 భాగములై, ఆ నాలుగు భాగాలలో మొదటిభాగము తామస సూక్ష్మ ఆకాశముతో కలసి శబ్ద విషయమునకు గోళకము అయింది. తామస సూక్ష్మ జలము రెండవ భాగము తామస సూక్ష్మ వాయువుతో కూడి స్పర్శ విషయమునకు గోళకం అయ్యింది. తామస సూక్ష్మ జలము మూడవభాగము తామస సూక్ష్మ అగ్నితో కూడి రూప విషయమునకు గోళకమయింది. తామస సూక్ష్మ జలము నాలుగవ భాగము తామస సూక్ష్మ పృథ్వితో కూడి గంధ విషయమునకు గోళకం అయ్యింది.

తామస సూక్ష్మ పృథ్వి వ్యష్టి సమష్టి అని రెండు భాగాలు అయింది. సమష్టి భాగము పాయురింద్రియములకు గోళకం అయింది. వ్యష్టి భాగము 4 భాగాలై, మొదటి భాగము తామసిక సూక్ష్మ ఆకాశముతో కూడి వాగింద్రియమునకు గోళకం అయింది. రెండవ భాగము తామస సూక్ష్మ వాయువుతో కూడి పాణీంద్రియమునకు గోళకం అయ్యింది. మూడవ భాగము తామస సూక్ష్మ అగ్నితో కూడి పాదేంద్రియమునకు గోళకం అయ్యింది. నాల్గవభాగము తామస సూక్ష్మ జలముతో కూడి గుహ్యేంద్రియమునకు గోళకము అయింది.

ఈవిధంగా ఒక్కొక్క భూతంయొక్క భాగములు వ్యష్టి సమష్టిగా మారి అర్థభాగం సమష్టి రూపంలో పంచీకరణ పటంలో మూలగా క్రాస్‌గా ఉన్నవన్నీ ఎర్ర అక్షరాలతో వ్రాసినవన్నీ సమష్టి భూతాలు. మిగతావన్నీ వ్యష్టిగా నాలుగు భాగాలుగా మారాయి. ఆ వ్యష్టి అంతా ఆయా ఇంద్రియాలకు గోళకాలుగా తయారయిన విధానం పంచీకరణగా చెప్పాం.

గోళకాలు అంటే ఏమిటో చెప్పాం.

రజోగుణ సూక్ష్మ పంచ భూతములు: వీటియొక్క సత్వాంశలో ఇవికూడా సమష్టి వ్యష్టి అయి సమష్టిలో అంతరింద్రియ ములైనటువంటి మనస్సు, బుద్ధి చిత్తం, అహంకారం అంతఃకరణ చతుష్టయం అయ్యింది. సమష్టి జ్ఞాత అయ్యింది.

అలాగే రజోగుణ వ్యష్టి లో పంచ జ్ఞానేంద్రియాలు శ్రోత్రేంద్రియము, త్వగింద్రియము, చక్షురింద్రియము, గుహ్యేంద్రియము ఘ్రాణేంద్రియము కలిగినవి. రజోగుణ సూక్ష్మ భూతాలయొక్క రాజసాంశలో సమష్టిలో పంచ ప్రాణాలయినాయి. వ్యష్టిలో పంచ కర్మేంద్రియాలు అయినాయి. తమోగుణంతో ఏర్పడిన గోళకాలలో ఈ ఇంద్రియాలు ఉన్నాయి. ఈ ఇంద్రియాలకు ఆ గోళకాలు స్థానములు.

చెవి దగ్గరే వినబడుతుంది, శరీరంలో ఇంకెక్కడా వినపడదు. కన్ను దగ్గరే చూడబడుతోంది. శరీరంలో ఇంకెక్కడా చూడబడదు. ఎక్కడ వినపడుతుందో ఎక్కడ కనపడుతుందో ఆయా ఇంద్రియాలకు అవి గోళకాలు. అక్కడే వుండి అది పనిచేస్తుంది కాబట్టి అది స్థానం. పనిచేసేవి ఇంద్రియాలు కాబట్టి ఇవి ఆధ్యాత్మలు. ఏదైతే కర్త భోక్త అయిందో అది ఆధ్యాత్మ. ఏ క్రియ వలన అనుభవం పొందిందో అది ఆధిభౌతికం. ఇవన్నీ తమోగుణంలో తమో గుణం, తమోగుణంలో రజోగుణం తమోగుణంలో సత్వగుణంగా విభజించి చెప్పుకోవాలి.

అసలు సత్వగుణం ఎవరు అయ్యారు? త్రిమూర్తులు, అధిష్టాన దేవతలు అయ్యారు. మరలా త్రిమూర్తులలో మూడు గుణాలు ఉంటే ఏమైంది? రజోగుణంతో బ్రహ్మ సృష్టికర్త అయ్యాడు, సత్వగుణంతో విష్ణువు పోషక కర్త అయ్యాడు, తమోగుణంతో రుద్రుడు లయకర్త అయ్యాడు. ఈ అపంచీకృత సూక్ష్మ భూతాలు ఇక్కడ మిగిలాయి. పంచీకరణ అయిపోయింది కదా! మొత్తం భూతాలు అన్నీ కూడా పంచీకరణ అయిపోయినాయా? కొన్ని భూతాలు అపంచీకృతంగా మిగిలిపోయినవి. ప్రతి భూతంలో కూడా కొంత భాగము అపంచీకృతంగా వుండి కొంత భాగమే పంచీకరణ అయినది.

కన్ను చూస్తోంది. చూడటం అనేది ఆదిభౌతిక క్రియ. శ్రోత్రేంద్రియం ద్వారా వినడం జరుగుతుంది. వినుట అనేది ఆధిభౌతికము. ఆ క్రియ పేరు ఆధిభౌతికం. క్రియ జరపడానికి అధిష్టాన దేవతల ప్రేరణ ఉంటుంది. అధిష్టాన దేవతలు కూడా సత్వగుణ సూక్ష్మ పంచభూతాలతోనే అధిష్ఠాన దేవతలయ్యారు.

అధిష్టాన దేవతలు సమష్టి జ్ఞాత అయిన ఈశ్వరునికి ఇంద్రియాలు. సమష్టి జ్ఞాత ఈశ్వరుడు, వ్యష్టి జ్ఞాతజీవుడు. జీవునికి ఇంద్రియాలు వ్యష్టిగా ఆ గోళకాల్లోకి వచ్చి కూర్చుని జీవులు చేస్తున్న పాపం పుణ్య కర్మానుభవానుసారము ఇంద్రియాలు పని చేస్తూ, కర్తృత్వం వహిస్తున్నాయి. నిజమయిన కర్త ఎవరో తరువాత చూద్దాం.

ముందు కన్ను చూస్తోంది అన్నాం, కన్నే ఆధ్యాత్మ. మనసు చూస్తేనే కన్ను చూసేది, అప్పుడు మనస్సు ఆధ్యాత్మ, కన్నుకాదు. బుద్ధి నిర్ణయిస్తేనే చేసినట్లయింది. అప్పుడు బుద్ధి ఆధ్యాత్మ. మనస్సు కాదు. ఇదంతా దృక్ దృశ్య వివేకంలో ఇలా

వెళ్తాము. ముందు మనం ఏ స్థాయిలో ఉన్నామో ఆ స్థాయిలో చెప్పాలంటే ఆధ్యాత్మ లంటే ఇంద్రియాలే. అవి చేసే క్రియల పేరు ఆధిభౌతికము.

మొట్టమొదట్లో సత్వగుణం యొక్క ప్రేరణ వలన అధిష్ఠాన దేవతలు సమష్టిగా ఉంటూ ఉంటే, వ్యష్టి ఇంద్రియాలను ప్రేరేపింప చేసేటటువంటి శక్తి ఆ అధిష్టాన దేవతలలో ఉంది.

ఈ అధిష్ఠాన దేవతలు సమష్టి ఇంద్రియాలు. ఈశ్వరునియొక్క సమష్టి చక్షురింద్రియం సూర్యుడు. ఈశ్వరుని యొక్క సమష్టి మనసే చంద్రుడు. ఈశ్వరునియొక్క సమష్టి బుద్ధి బృహస్పతి. ఈ చంద్రుడు బృహస్పతి జీవుడిలో మనస్సుకు బుద్ధికి ప్రేరేపణ ఇస్తున్నారని అంటున్నాము. అసలు నిజానికి ఈశ్వరుడు, చంద్రుడు అనే సమష్టి మనస్సుతో ఆలోచిస్తుంటే, జీవులందరి యొక్క వ్యష్టి ఇంద్రియాలు ఆలోచిస్తూ ఉన్నట్లు ఉంటుంది.

ఇంకో రకంగా చెప్పాలంటే ఒక జీవుడు పుట్టి స్థూల శరీరంతో వచ్చి, దానిలో 25 గోళకాలు ఉండి వాటిలో ఏవి సక్రమంగా పనిచేస్తున్నాయో అక్కడికి ఈశ్వరుని దగ్గర ఉన్నటువంటి సమష్టి ఇంద్రియాలైన అధిష్టాన దేవతాశక్తులు వచ్చి చేరాయి. అంటే ఏక కాలంలో సమిష్టి వ్యష్టి పనిచేస్తున్నాయి. నిజానికి సమష్టి మాత్రమే పనిచేస్తుంటే సమష్టిలో భాగంగా వ్యష్టి కూడా పని చేస్తుంది. వ్యష్టి స్వతంత్రముగా పనిచేయుటలేదు.

నిజానికి ఈశ్వరుడే అసలు కార్యక్రమం అంతా జరుగుతూ వుంటే ఈశ్వర కార్యక్రమంలో భాగంగా జీవుని వ్యవహారము జరుగుచున్నది. జీవులకు ప్రత్యేకంగా, భిన్నంగా ఏ కార్యక్రమం జరుగుటలేదు. అది బ్రహ్మాండ పంచీకరణలో తెలుస్తుంది. ప్రస్తుతం మనం పిండాండ పంచీకరణలో ఉన్నాం.

ఈ విధంగా పంచీకృత భూతాలున్నాయని తెలుసుకున్నాం కదా ! ఈ పంచీకృత సూక్ష్మ పంచ భూతములను మళ్ళీ సత్వ, రజోగుణ, తామోగుణ సూక్ష్మ భూతములుగా సూక్ష్మ శరీరము లేక లింగ శరీరము వర్తించుచున్నది. ఈ మొత్తము 19 తత్వములతో కూడిన సూక్ష్మ శరీరంతో జీవుడు సకల భోగములను అనుభవించుచూ, పుణ్య పాప కర్మలు చేయుచు స్థూల శరీరమును విడచును. ఈ సూక్ష్మ శరీరానికే స్థూల శరీరంలో ఉన్నప్పుడు దానికి సూక్ష్మశరీరం అని పేరు.

లోకాలు లోకాంతరాలు పునర్జన్మలలోకి వెళ్ళినప్పుడు, అవి పోవు మార్గాలు విశ్వయానము, దేవయాన మార్గము, ధూమ్రయాన మార్గము, స్వర్గము నరకము ఈ లోకాలకి, ఈ జీవుడు వెళ్ళేటప్పుడు మార్గాలలో ఎలా ప్రయాణం చేస్తూ వెళ్తున్నాడో, తెలుసుకుంటే ఆ ప్రయాణంలో అనేక కష్టాలు పడుతున్నాడు. మరల ఆ లోకాలలో చేరి ఆ లోకాలలో ఉన్న మార్గాలలో అలా ప్రయాణం చేసేటటువంటి శరీరాన్ని యాతనా శరీరం అంటారు.

సూక్ష్మశరీరం అన్నా యాతనా శరీరం అన్నా ఒకటే. ఒక్క మానవ దేహంలో ఉన్నప్పుడు దానికి సూక్ష్మశరీరం అని పేరు. ఈ దేహాన్ని విడిస్తే లోకాంతరాలలో ప్రయాణం చేస్తే, వేరొక దేహంలోని వెళ్ళేటపుడు అలా ప్రయాణం చేస్తూ ఉన్న సూక్ష్మ శరీరానికి యాతనాశరీరం అని పేరు. జీవులలో ఎన్ని యాతనా శరీరాలు సూక్ష్మ శరీరాలు ఉన్నాయి?

అనేకమంది జీవులు ఎవరికివారు పునర్జన్మలు పొందుతూ ఉన్నప్పుడు ఏ జీవుడు ఏ కర్మ వాసనతోటి పునర్జన్మ పొందుతున్నాడో ఆ లెక్కన ఆ జీవుడి పరంగా వ్రాయాల్సి వస్తుంది. కనుక ఆ జీవుడి యొక్క సూక్ష్మ శరీరాన్ని లింగ శరీరము అంటారు, ఫలనా జీవుడిది అని గుర్తుకోసము లింగం శరీరం అంటాము. లింగ శరీరం అని, యాతనా శరీరం అని కూడా పేర్లు ఉన్నాయి. ఉపాధి మార్పులలో ప్రయాణం చేసినప్పుడు యాతనా శరీరం అన్నాం. ఎవరి సూక్ష్మశరీరం వాళ్ళదే అన్నప్పుడు దానికి గుర్తు పెట్టాం, కాబట్టి లింగ శరీరం అన్నాం. ఎవరు చేసిన కర్మ వాళ్ళే అనుభవించాలిగా. ఒకరు చేసిన కర్మ ఇంకొకరు అనుభవించకూడదుగా. ఎవరో చేసిన పుణ్య పాప ఫలం మనం అనుభవించడం కుదరదుగా. ఎవరి పుణ్యఫలితంగా వాళ్ళే సుఖపడాలి. ఎవరు చేసిన పాప ఫలితంగా వాళ్ళే దుఃఖపడాలి, బాధపడాలి. అట్లా ఎవరికి వారికే గుర్తు ఒకటి ఉంది కాబట్టి వారి వారి సూక్ష్మ శరీరాలను లింగ శరీరాలు అని కూడా అంటాము.

ఆత్మ అంటూ వచ్చేసరికి అనేక ఆత్మలు లేవు. అనేక కుండలలో ఘటాకాశం ఉన్నట్లుగా అందరిలో అపరిచ్ఛిన్నంగా ఉంది. అసంగంగా, అవిభాజ్యంగా, అపరిచ్ఛిన్నంగా ఉంది. మరి పరిచ్ఛిన్నంగా ఉన్న జీవాత్మలలో ఉన్నటువంటి సూక్ష్మ శరీరాలు అన్నీ కూడా ఆ జీవుడు ముక్తుడైనప్పుడు ఆ లింగ శరీరం భంగం అవుతుంది. భ్రాంతిలో అనేక లింగ శరీరాలు, భ్రాంతిపోతే అసలు లింగ శరీరాలే లేవు. అందుకని ముక్త దశలో లింగశరీరం భంగమైంది అని అంటున్నాము.

ఒక సూక్ష్మ శరీరం ఉంది. దానికి పాపపుణ్యాలు పునర్జన్మలు అని ఒక ఎకౌంటు ఉంటుంది. మన లెక్కలో చిత్రగుప్తుడు వ్రాసినట్టు చెప్తున్నాము. ఇప్పుడు ఆ లింగమే భంగమైంది. ఇప్పుడు చిత్రగుప్తుడు ఎవరికీ వ్రాస్తాడు లెక్క? కాబట్టి ఇక ఆ లెక్క లేదు. అంటే వాడు ముక్తుడు. లింగ శరీరం భంగం అవడం అంటే ముక్తుడవడమే.

నీ సూక్ష్మ శరీరానికి నీ స్థూలశరీరం పనిముట్టు అయ్యింది. ఆ పనిముట్టుకు ఈ పనిముట్టుకు తేడా ఏమిటి? అక్కడ గడ్డపారతో తాదాత్మ్యత చెందలేదు. గడ్డపారకు ఏమైనా, మనకి ఏమి బాధ లేదు. కానీ ఇక్కడ స్థూలశరీరం పనిముట్టు అయింది. స్థూల శరీరానికి ఏ బాధ వచ్చినా సూక్ష్మ శరీరం లోనే ఆ ఫీలింగు ఉంటున్నది.

సుఖం వచ్చినా దుఃఖం వచ్చినా, బాధ వచ్చినా, చలి ఎండ వానలు తపింపజేసినా, ఒకసారి ఊరటనిచ్చినా, ఒకసారి హాయిగా ఉన్నా, ఇదంతా సూక్ష్మ శరీరానికే స్థూల శరీరం అనే పనిముట్టు ద్వారా తెలుసు. స్థూల శరీరం తన కంటే వేరుగా అతుకు బొతుకు లేకుండా ఉంటే తెలుస్తుందా? తాదాత్మ్యత కలిగి అతుకు బొతుకుగా కలిసి ఉంది కాబట్టే దాన్నే తాదాత్మ్యత అంటాం. తాదాత్మ్యత కారణంగా స్థూల శరీరానికి కలిగిన బాధను సూక్ష్మశరీరం అనుభవిస్తుంది.

ఈ సూక్ష్మ శరీరం ఎంతకాలం ఉంటుంది? ప్రతి జన్మలో సంపాదించినటువంటి కర్మలు ప్రారబ్దంగా కొన్ని ఖర్చు కాగా, ఆగామి కర్మగా మరల సంపాదిస్తే, వాటి యొక్క అనేక జన్మలలో పోగుబడి ఉన్న వాటి పేరు సంచితకర్మ. ఈ సంచితమే కారణశరీరం. దానిలో కొంత భాగం ప్రారబ్దంగా ప్రతి జన్మలో శరీరం అనే పనిముట్టు ద్వారా ఈ సూక్ష్మ శరీరం అనుభవిస్తూ ఉంటుంది.

వాసనాక్షయం అయితే కారణశరీరం సున్నా అయితే సూక్ష్మ శరీరానికి ఇంకేం పని లేదు. అప్పుడు సూక్ష్మ శరీరం భంగం అవుతుంది. వాసనలు ఉన్నంతవరకు వాసనాక్షయం కానంతవరకు అజ్ఞానం కొనసాగుతున్నంతవరకూ, ఇవన్నీ కల్పితం మిథ్య అనేటటువంటి గట్టి నిర్ణయం కానంతవరకు, వాడు పునర్జన్మలు పొందుతూనే ఉంటాడు, సూక్ష్మ శరీరం కారణ శరీరం జంటగా కొనసాగుతూనే ఉంటాయి. అవి ఎప్పుడూ కొనసాగుతూ ఉంటాయి. సూక్ష్మ శరీరము కారణమున్నంత వరకు స్థూల శరీరాన్ని సంపాదించుకుని మళ్ళీ వదిలేస్తూ ఉంటుంది. స్థూలశరీరానికే జన్మలు, మరణాలు. సూక్ష్మ శరీరానికి ఒకే జన్మ, ఒకే మరణం. సూక్ష్మ శరీర మరణం అంటే ఆత్మ సామ్రాజ్యంలో ప్రవేశం. సూక్ష్మ శరీరం అనేది లేదు అప్పుడు. సూక్ష్మ శరీరం ఎంత కాలం ఉంటుందంటే, కారణం ఉన్నంత వరకు అది ఉంటుంది. కారణంపోతే ఇక ఉండదు. అది ముక్త దశ. పంచీకరణ భాగంలో వచ్చినటువంటివన్నీ అపంచీకరణ చేసుకుంటూ పోతాయి. అపంచీకృత భాగంలోకి వెళ్ళి ఉంటాయి, తిరిగి మళ్ళీ పంచీకరణకి వస్తూ ఉంటాయి. ఈ సూక్ష్మశరీరం వాటిని పంచీకరణ చేసుకుని కొన్ని ఉపాధులను ధరిస్తూ ఉంటుంది, వదిలేస్తూ ఉంటుంది. ప్రతి జీవుడు ఎవరి శరీర సృష్టికి వారే కారణం. అలాగే వ్యష్టి జీవులందరూ వారివారి ఉపాధులను పొందటానికి, పోషించుకోవడానికి ప్రారబ్దం ఖర్చు కాగానే వదిలేసి, మళ్ళీ ఆ ఉపాధులను లయం చేసుకోడానికి, సృష్టించుకోవడానికి ప్రతి జీవుడు తనకు తానే కర్త. అలాగే అనేక జీవులు అనేక వ్యష్టి కర్తలు చేసేటటువంటిది, సమష్టిలో ఈశ్వరుడు చేసిన దానిలో భాగంగా జరుగుతోంది. కనుక ఇదంతా ఈశ్వర విలాసమే కాని జీవుడిది ఏమీ కాదు. అజ్ఞానములో జీవుడు తనది అని కర్మ చక్రంలో పడిపోయాడు.

ఈ స్థూల శరీరము 84 లక్షలసార్లు పడిపోతూ ఉన్నప్పటికీ కూడా సూక్ష్మ శరీరము నశించకుండా కొనసాగుతూ ఉంటుంది. స్థూల శరీరం సంపాదించినప్పుడు దానితో తాదాత్మ్యత చెందుతుంది. తాదాత్మ్యతతో కూడినటువంటి పనిముట్టు ఇది. తాదాత్మ్యత లేకపోతే కొట్టినా తిట్టినా బాధ ఉండకూడదుగా. తాదాత్మ్యత ఉండబట్టే బాధ. ఎవరినో తిడితే ఎవరినో కొడితే నాకేం అన్నట్లుగా లేదు గదా ! శరీరం వేరు నీవు వేరు అయినప్పటికీ శరీరానికి కలిగిన బాధ నీకులాగే ఉందిగా. అది తాదాత్మ్యత అంటే.

ఈ పుణ్య పాప కర్మలు, మిశ్రమ కర్మలు చేస్తూ మరణకాలమున స్థూల శరీరమును ఈ సూక్ష్మ శరీరం విడుస్తుంది. అంటే స్థూలశరీరం దానికదే రాలిపోతుంది. సూక్ష్మ శరీరము స్థూల శరీరాన్ని ఉంచుకోవాలన్నా ఉండదు, అది పోవాలన్నా అది పోదు.

**'హరిహరాదులు వచ్చి నిలచిన ఆగదీ తనువూ"** అని మేల్కొలుపు. పంపించాలని లయకారుడు అనుకున్నా అది పోదు. విష్ణువు పోషక కర్త ఉపాధులను మరికొంతకాలము ఉంచాలన్నా ఉండదు. ప్రారబ్దం ఖర్చు అయితే అది పోతుంది. ఖర్చు కాగానే దానికదే పోతుంది. అందుకే ఈ తనువు హరిహరాదులు వచ్చి నిలచినా ఆగదు అన్నారు. అది ఎంత ప్రారంబ్దము తెచ్చుకున్నాడో అంత ప్రారంబ్దము అయ్యేవరకూ అది పొమ్మన్నా పోదు. ప్రారబ్దం తీరిపోగానే ఆగమన్నా ఆగదు. ఆ రకంగా మరణకాలమున సూక్ష్మ శరీరము స్థూల శరీరమును వదలి యాతన శరీరంగా మారి స్వర్గ నరకాది లోకాలకు తిరుగుతూ ఉంటుంది. కర్మశేషము ఉంటే మరల భూలోకమందు జన్మ పునర్జన్మలు ఎత్తుతూ ఉంటుంది.

స్థూల సూక్ష్మ శరీరములు కార్యములు కాగా కారణము ఉండాలి కదా? కనుక అనాది అయిన తనకుతానే తోచిన కారణశరీరం ఒకటి ఊహించబడుతున్నది. ఇది మహా కారణమునుండి వ్యష్టిగా విభజింపబడి వచ్చుచున్నది.

అంటే కార్యరూపంలో సూక్ష్మశరీరం పనిముట్టు చేసుకుని తాదాత్మ్యత కూడా పెట్టుకున్న సూక్ష్మశరీరం ఈ పని ముట్టు ద్వారా కర్మలు చేస్తూ మళ్ళీ అదే పని ముట్టు ద్వారా కర్మ ఫలితాన్ని అనుభవిస్తున్నది. ఒక దేహంతో చేసిన కర్మ మరణానంతరం మరొక దేహం తీసుకుని, కర్మ ఫలితాన్ని కొత్త దేహంతో అనుభవిస్తోంది. ఈ దేహంలో భక్తులు కూడా మంచివాళ్ళు కూడా కష్టాలు పడుతున్నారు అంటే, వేరే శరీరంతో వేరే జన్మలో చేసినటువంటి పాపకర్మ ఫలితం ఇది. అలాగే దుర్మార్గులు కూడా ఆనందంగా సంతోషంగా ఆరోగ్యంగా అన్ని భోగాలు అనుభవించే స్థితిలో ఉన్నారు అంటే గతజన్మలో చేసిన పుణ్య కార్యముల యొక్క ఫలితమును ఈ శరీరంతోటి అనుభవిస్తున్నారు.

దీనికి కారణాలు ఉండాలి. స్థూల సూక్ష్మ శరీరాలు రెండూ పనిచేస్తున్నాయి ఇక్కడ. కలసి కర్మ చేసి కలసి కర్మానుభవం పొందుతున్నాయి. సత్తు అసత్తు కానీ, చిత్ అచిత్ కాని అనిర్వచనీయమైనటువంటి అనాదియైన తనకు తానే కల్పితమైన కారణశరీరం ఒకటి ఉన్నదని, అనుమాన ప్రమాణం తో ఒప్పుకోవాలి. ఇది ఊహించబడుతోంది.

జ్ఞాతలో ఉన్న ఎరుక జ్ఞాతలోనే వుండి మనసులోనూ, బుద్ధిలోనూ, చిత్తంలోనూ, అహంకారంలోనూ వ్యాపించకపోతే వాటిలో ఎరుక లేకుంటే ఇవి పని చేయవు. ఎరుక అన్నా, శక్తి అన్నా, చైతన్యం అన్నా ఒకటే. వాటికి పనిచేసే శక్తి కావాలి. ఆ పని చేసిన దానిలో ఎరుక కావాలి. ఆ ఎరుకలో కర్తృత్వ భోక్తృత్వాలున్నాయి. అప్పుడే ఈ మనసు బుద్ధి ఆధ్యాత్మలు అయినాయి. దానిలో ఉన్న శక్తితో క్రియలు జరిగినప్పుడు ఆ క్రియలు ఆధిభౌతికములు అయినాయి.

ఒక ఆధ్యాత్మికం ఉంది, ఒక శక్తితో ఆధిభౌతిక క్రియ జరుపుతోంది, అంటే ఆ జడమైన ఇంద్రియాలకి తామసిక పంచభూతాల యొక్క పంచీకరణతో, వచ్చినటువంటి గోళకాలలో రజోగుణంతో వచ్చిన ఇంద్రియాలు సత్వగుణంతో వచ్చిన అధిష్టాన దేవతల ప్రేరణతో కలిసి వ్యవహారము జరుగుతున్నది. దేవతలలో ఏ చైతన్యం ఉందో ఆ చైతన్యాన్నిబట్టి, ఆ దేవతా శక్తి ప్రకటితమవుతుంది. అది స్పందన శక్తిరూపంగా ఉంది. సృష్టిలో ప్రకృతికి, ఇంద్రియాలకు ఆ స్పందన శక్తి అందించబడుతోంది. తదనుగుణంగా ఇవన్నీ చలిస్తున్నాయి. ఆ విధంగా చైతన్యం అనేది వాటన్నింటిలో కూడా వ్యాపించి ఉన్నది. కనుక ఇవి చైతన్యవంతమై పనిచేస్తున్నాయి. వీటన్నింటిలో కూడా జ్ఞాతలో ఉండేటటువంటి ఎరుక, లేక చైతన్యము, లేక జ్ఞానము మిగిలిన వాటియందు వ్యాపించి ఉండటం చేతనే ఇవన్నీ ఎరుకతో పని చేస్తున్నాయి.

ఏ ఎరుక కలిగింది? 5 జ్ఞానేంద్రియములకు 5 విషయాల యొక్క ఎరుక కలిగింది. అవి ఎరుగగలవా అంటే జ్ఞాత 24 తత్వాలలో వ్యాపకమై ఉన్నాడు కాబట్టి, జ్ఞాతలో ఉన్న ఎరుక లేక జ్ఞానము వీటియందు కూడా వ్యాపకమైతే, ఇవి చైతన్యవంతమై శక్తివంతమై, ప్రజ్ఞానవంతమై ఏది ఏ పని ఎలా చేయాలో అలా చేస్తున్నాయి.

మహా కారణం అనేది ఈశ్వరుడు నుండి వ్యష్టి కారణాలుగా జీవుడికి పంచబడింది. ఈ మహా కారణమే మాయ. మాయ అన్నా మహా కారణం అన్నా, వ్యష్టి కారణం అన్నా కూడా ఇవన్నీ సదసత్ కాదు, చిదచిత్తు కాదు, నిర్వచనీయము కాదు. దీనికి మొదలు ఎక్కడ ఉందో ఎవరికీ తెలీదు. ఇది అనాది.

ఈ కారణ శరీరము అనగా చిత్తము జ్ఞాతతో కూడినది. చిత్తము జడము. జ్ఞాతతో కూడితే చిత్తం క్రియా రూపంలోకి వచ్చింది. ఎప్పుడు క్రియా రూపంలోకి వచ్చిందో అప్పుడు అది ఆధ్యాత్మ అయ్యింది, ఆ క్రియ ఏమో ఆదిభౌతిక క్రియ. చిత్తంలో ఆది భౌతిక క్రియ ఏది?– చిత్త వృత్తులు. చిత్తంలో చింతన జరుగుతుంది. చిత్తము నుంచి చిత్తవృత్తులు కలుగుతాయి. వృత్తులు కలగడము, చింతన చేయడం అనేది ఆదిభౌతికం. చిత్తమేమో ఆధ్యాత్మికం.

అందుకే పంచీకరణలో ఏమి చెప్పామంటే స్తబకము అంటే వ్యవహారం చెప్పాము. వ్యవహారం ఎలా జరుగుతుంది? జ్ఞాత మనోరూపుడై, జ్ఞానం బుద్ధి రూపుడై, జ్ఞాత చిత్తరూపుడై అని అంటాము.

మొదలు ఎక్కడ చెప్పాం జ్ఞాతం చిత్త రూపుడై అని. అందుకే జ్ఞాతతో కూడిన చిత్తమే చైతన్యవంతమై, ఎరుక కలిగితే, చిత్త వృత్తులు దానినుండి వెలువడినప్పుడు అది 'చిత్తం యొక్క చింతన' అన్నాము

జీవేశ్వర సమాధియే కారణశరీరం. జీవుడు, ఈశ్వరుడు కలసి ఉన్నదే కారణ శరీరం. మనం విడగొట్టి కారణము మహా కారణం అని రెండు చెప్తున్నప్పటికీ సమష్టి అన్నప్పుడు ఈశ్వరుడు అని, మహాకారణం అని అంటున్నాం. వ్యష్టి అన్నప్పుడు జీవుడు వ్యష్టికారణం అంటున్నాం. కానీ అంతా సమష్టి స్థానంతోనే నడుస్తోంది. వ్యష్టి నడుస్తూ ఉందా అంటే సమష్టిలో భాగంగా నడుస్తోంది.

ఒక బస్సు పోతుంది అంటే ఆ బస్సు యొక్క నాలుగు చక్రాలు కూడా తిరుగుతూ ఉంటాయి. ఇంజన్ బస్సు మొత్తాన్ని కదిలిస్తోంది. దానితో నాలుగు చక్రాలు కదులుతున్నాయి. ఒక చక్రం నేనే కదులుతున్నాను, నేను నా ఇష్టం, కదలను అని మిగతా మూడు చక్రాలు కదులుతుంటే నాలుగవది కదలకుండా ఉంటే సరిపోతుందా? బస్సు కదులుతూ ఉంటే ఈ నాలుగు చక్రాలు కదలనని మొరాయించినా,  కూడా అది కదిల్తూనే ఉంటుంది. కనుక కదలడం అనేది నీ చేతిలో లేదు, అది మహా కారణంలో ఉంది, అది కదిలిస్తోంది.

వ్యష్టికారణము సమష్టిలో భాగంగా కదులుతోంది తప్ప ఆ సమష్టినుంచి నీవు వేరై, నేను కదలను అంటే కుదరదు. మూడు చక్రాలు కదులుతూంటే ఆటోమేటిగ్గా 4 వ చక్రంకూడా కదలాల్సిందే. ఈశ్వరుడు అలా చేస్తూవుంటే జీవుడు కూడా వ్యష్టిలో అలా చేస్తూనే ఉన్నాడు. ఈశ్వరుడు చేయకుండా ఉంటే, జీవుడేమీ చేయడు.

ఈశ్వరుడి యొక్క మహా కారణము మారిపోతూ ఉంటుంది. జీవులందరి ప్రారబ్ద అనుభవముల వలన ఖర్చైనది తగ్గుతూ ఉంటే, జీవులందరి ఆగామి కలుస్తూ ఉంటే, కారణ శరీరాలయొక్క సంచితము పెరుగుతూ, తరుగుతూ ఉంటే, మహాకారణము కూడా తదనుగుణముగా మారుతూ ఉంటుంది. ప్రళయ కాలములో, సకల జీవుల సంచిత రాశి మైనపు ముద్దలో అద్దబడిన రజనువలె ఉండి, పునఃసృష్టిలో మరలా ఆ మహాకారణము వ్యష్టి కారణములుగా ప్రారంభమవుతుంది.

వ్యష్టి కారణం దగ్గర కనుక చూస్తే ఆ మహా కారణంలో భాగంగా ఈ  వ్యష్టి కారణం ఏర్పడి, ఆ ప్రకారంగా జరుగుతోంది. కారణం కూడా సంచితం అంతా, చాలా ఉన్నప్పటికీ, ఒక ఉపాధికి అనుగుణమైన ప్రారబ్ధం, ఒక చిన్న కొలత ఎప్పుడైతే వచ్చిందో, ఆ కొలతలో ఉన్న ప్రారబ్ధంలో, ఉన్నటువంటి కర్మ ఫలితాలు మాత్రమే కాలానుగుణ్యంగా కర్మచక్రం ,కాలచక్రం రెండూ  కలసినప్పుడు, ఏ కాలానికి ఏ కర్మానుభవం రావాలో, అప్పుడు ఆ కర్మ అనుభవానికి వస్తుంది. ఒక జ్ఞాని మాత్రం దానిని అవుననక కాదనక అనుభవిస్తాడు. అజ్ఞాని ఏమో బుద్ధి కర్మానుసారిణి అని ఆ కర్మ ఎలా ఉంటే అలా ఆ నిర్ణయం చేస్తాడు. తప్పు అయినా, రైట్ అయినా వివేకంతో గాని, వివేకం కోల్పోయి గాని అటువంటి నిర్ణయాలే  తీసుకుంటాడు.

## మహాకారణ దేహ నిర్ణయము

జీవుడిలో తురీయముగా ఉండే ప్రత్యగాత్మయే మహా కారణము. ఈ మహాకారణము ఈశ్వరుని యొక్క అవ్యాకృతరూపము. ఈ విధముగా ఈశ్వరుడికీ, జీవుడికీ అవినాభావ సంబంధము కుదిరింది. ఈశ్వరుడు నిష్క్రియాపరుడు, మహాకారణ రూపుడు. జీవుడు క్రియారూపుడు, కారణ రూపుడు. ఈశ్వరునియొక్క మహాకారణమే జీవుడిలో ప్రత్యగాత్మగా ఉంటూ, ఆ జీవునియొక్క అవస్థాత్రయమును కార్యరూపముగా జరుపుతూ ఉంటుంది.

అందుకే **'కారణోపాధి రయం ఈశ్వరః కార్యోపాధిరయం జీవః'** అంటున్నాము. కనుక మహాకారణమే జీవుల ద్వారా, కార్యమును జరుపుతున్నది. అందువలన జీవుల తురీయములలో మహాకారణము అవ్యక్తముగా నున్నది. ఆ అవ్యక్తములో కూడా 25 తత్త్వాలుగా ఉండి, జీవులలో అనుభవ రూపంగా వ్యక్తమగుచున్నాయి. అనగా వ్యక్త రూపముల లక్షణాలను అవ్యక్తంలో ఉంటే తత్త్వాలుగా ఉంటే ఏమో ఆ పదాలతో 25 తత్త్వాలతో కూడిన మహాకారణ దేహ నిర్ణయమును చెప్తున్నారు ఇక్కడ.

సత్యము అన్నామనుకోండి. సత్యము యొక్క అవ్యక్తం ఎలా ఉంటుందంటే, సత్యత్వము. పూర్ణము అన్నాము. వ్యక్తమైనది ఆకాశము. అవ్యక్తములో అది కార్యరూపంలో ఏదైతే పూర్ణంగా నిండుగా ఉందో, కారణంలో పూర్ణత్వము అనాలి.

ఆకాశతత్త్వము. అలాగే అన్నీ కూడా. ఇక పంచీకరణ చూద్దాము.

కేవల ఆకాశతత్వము పూర్ణకత్వం అయినది. ఆకాశతత్వములో వాయువు తత్వము అసంగత్వం, ఆకాశతత్వములో అగ్నితత్వము వ్యాపకత్వం, ఆకాశ తత్వములో జల తత్వము, సర్వబీజకత్వం, ఆకాశ తత్వములో పృథ్వీతత్వం అఖండత్వం.

వాయువు తత్వములో ఆకాశ తత్వము, అఖండత్వం, కేవల వాయుతత్వము అభేదత్వం, వాయువు తత్వములో అగ్నితత్వము పరాత్పరత్వము, వాయువుతత్వములో జలతత్వము నిర్మలత్వం, వాయువుతత్వములో పృథ్వీతత్వము అజరత్వం. అజరత్వము అంటే ముసలితనము లేకపోవటము.

అగ్నితత్వములో ఆకాశ తత్వము, అదాహ్యత్వం, అగ్నితత్వములో వాయుతత్వము ఊర్ధ్వపదత్వము. కేవల అగ్ని తత్వము ప్రకాశత్వం. అగ్నితత్వములో జలతత్వము చైతన్యత్వం, అగ్ని తత్వములో పృథివీతత్వము అనఘ్యత్వము. అనఘ అంటే ఏ పాపం చెయ్యకుండా పవిత్రంగా ఉండటము.

జలతత్వములో ఆకాశ తత్వము అక్లేద్యత్వం, జలతత్వములో వాయుతత్వము జగజ్జీవత్వం, జలములో అగ్నితత్వము పరంజ్యోతిత్వము, కేవల జలతత్త్వము అమృతత్వము, జలతత్వములో పృథ్వీతత్వము కారుణ్యత్వం.

పృథ్వీతత్వములో ఆకాశ తత్వము అశోష్యత్వం, పృథ్వీతత్వములో వాయుతత్వము కారణత్వం, పృథ్వీ తత్వములో అగ్నితత్వము పావకత్వం, పృథ్వీతత్వములో జలతత్త్వము సమృధ్యత్వం, పృథ్వీతత్వములో పృథ్వీతత్వము సర్వదాతృత్వం.

ఈ లక్షణాలన్నీ కూడా కలిగియున్నది మహా కారణం. మానవ దేహంలో మూర్ధ్నిస్థానము, ప్రణవంలో అర్థమాత్ర ప్రమాణము. మహాకారణ శరీరంయొక్క వర్ణం నీలవర్ణం, ఆకాశం రంగు. మహాకారణంలో ఉన్న జీవుడి పేరు ప్రత్యగాత్మ అభిమాని. మహాకారణంలో ఉన్న జీవుడు సగుణంగా ఉంటాడు. అక్కడ వివేక జ్ఞానం ఉంటుంది. అక్కడ ద్రష్ట రూపం ఉంది. దృశ్య తాదాత్మ్యత లేదు.

మహా కారణం అంటే అక్కడ కార్యం లేదు కనుక కేవల ద్రష్ట రూపం ఉంటుంది. కార్యరూపంలోకి వస్తే, ఉపాధి వస్తే, ఉపాధితో తాదాత్మ్యత వల్ల శరీరం నేను అనేటటువంటి జీవుడు అవుతాడు. శరీరమే నేను అనంగానే ద్రష్టరూపత్వం కాదది. దృశ్యరూపత్వం అయ్యింది. ఉపాధి రూపత్వం అయింది. అనగా శరీరానికి ద్రష్ట. మహా కారణంలో అది ద్రష్ట రూపత్వము.

ఓంకారంలో అర్ధ మాత్రకలో ఏ భోగం ఉందో, అనగా వ్యష్టితురీయములో ఏ భోగముందో అది వైభోగిక భోగము అన్నారు. మహాకారణ శరీరంలో ఆనందము ఉంది. సమష్టి స్థూల సూక్ష్మ కారణములు విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులు సంకేతముగా అకార ఉకార మకారములయితే అది మహా కారణం. ఇది వ్యష్టిలో అర్థమాత్రక అనబడుతుంది.

నాలుగు వేదాలలో మహా కారణం అధర్వణ వేదం. పరావాక్కు , పశ్యంతీ వాక్కు , మధ్యమా వాక్కు, వైఖరి వాక్కు అని. నాలుగు వాక్కులున్నాయి. వాటిలో మహా కారణం పరావాక్కు. మహా కారణంలోని యొక్క ప్రేరణతోనే సర్వము పనిచేస్తున్నాయి. అంటే అది పరాశక్తి యొక్క ప్రభావము. ఈ మహా కారణశరీరం ఎక్కడ వుంది అంటే వాయు మండలంలో ఉంది. వాయు భువనంలో ఉంది. మహా కారణం వాయుతత్వంగా ఉంది.

ఇది మన కంటికి కనపడేటటువంటి పంచభూతాలలోని వాయువు కాదు. వాయుతత్వం అక్కడ అది. వాయువు వేరు. వాయువు పుట్టకముందు వాయుతత్వం ఉన్నది. శబ్దము విషయము కాకముందు శబ్ద తన్మాత్ర పుట్టింది. జీవుడు రాకముందు మహత్తత్వం ఉంది. అలా ఇవన్నీ మహాకారణమందు తత్వాలుగా ఉన్నాయి.

వాయువు యొక్క ప్రత్యేక కళలు తీసుకుంటే గాలియొక్క వేగాన్నిబట్టి, వేగంయొక్క మార్పు చేర్పులనుబట్టి వచ్చే కదలికలను కళలు అంటారు. కదలికలు అవ్యక్తంగా ఉంటే వాటిని కళలు అంటాము. కదలిక కనపడితేనేమో అది స్థూలంలో. సూక్ష్మంలో ప్రేరణగా ఉంది. ఇది కార్యరూపం లేనిది కాబట్టి, అక్కడ కదలికలూ లేవు. కదలికలు అయ్యేటటువంటి ఆస్కారమున్న ఒక అవ్యక్త స్థితి పేరు కళలు. దీనిని చలనాంశము అనవచ్చును.

ఈ మహా కారణశరీరంలో, మిగతా శరీరాల నుండి విడివడి ఇక్కడ ఎవరైతే ఉంటారో, వారు వైరాగ్యం కలిగినవారుగా, తీవ్ర ముముక్షుత్వం ఉన్నవారుగా ఉంటారు. ఆత్మత్వపద దర్శనము ఉంటుంది. ముముక్షుత్వమే ఉంటుంది కానీ, మోక్షం కాదు. మహా కారణం నశిస్తేనే మోక్షం. అదికూడా త్వం పదంగానే ఉంటుంది. మహా కారణం కూడా పోయినపుడు, అది తత్ పదం అవుతుంది. తురీయావస్థ అనేది వాయువు తత్వములోని నాల్గవకళ. వాయువు తత్వముయొక్క ప్రత్యేక వైరాగ్యము, ముముక్షుత్వం, ఆత్మత్వపద దర్శనం, తురీయావస్థ. ఈ నాలుగు వ్యష్టికి సంబంధించినవి

## కైవల్య దేహ నిర్ణయము

(మహాకాశము – భూతాకాశ భువనము)

దేహం అంటే దహింపబడేది. కైవల్యం అనే పదం ఎలా వచ్చింది? కేవలము అనే దాన్నుండి వచ్చింది. కేవలత్వమే కైవల్యం. అంటే అన్నిటి నుంచి ఇది కాదు ఇది కాదు అని వేరుపరచినటువంటిది, చివరకు ఏది మిగిలి ఉంది అంటే కేవలమై ఉన్నది. అది మాత్రమే ఉన్నది. కేవలం అంటే మాత్రమే అని. ఏది అంటే పరబ్రహ్మ. పరబ్రహ్మ మాత్రమే. పరబ్రహ్మ తప్ప అన్యము లేదు అనే అర్థంతో కేవలాత్మ. కేవలాత్మత్వము అనే పదాలు వచ్చాయి.

ఈ కైవల్య దేహం నిర్ణయం అంటే, అక్కడ దహించబడేది ఉండకూడదు కాని దేహం అంటే దహించబడేది. మరి కైవల్యదేహము అంటారేమిటి? ఆ కేవలాత్మజ్ఞానం కూడా అఖండ ఎరుకే కనుక లక్ష్యంలో అది కూడా పోవాలి. కైవల్య దేహం కూడా పోయేదే. మహా కారణం కూడా పరమపదం సిద్ధించినప్పుడు నశిస్తుంది. నశించే దానిలో భాగాలే ఇవన్నీ. ఇవి కూడా ఒక పంచీకరణలో భాగాలే. ఈ కైవల్య దేహ నిర్ణయం కూడా పంచీకరణ లోనిదే. ఈ కేవలాత్మకు పునరావృత్తి ఉన్నది. అందువలన దీనిలో ఏమేమి ఉన్నాయో తెలుసుకొని నిరశించాలి. అప్పుడే పునరావృత్తి లేని పరమపదము.

ఈ పంచీకరణలో పంచభూత తత్వాలు ఉన్నాయి. ఆకాశ తత్వము అంటే, వ్యష్టి అంతఃకరణ యొక్క నిర్వికల్పమైనది. కాని తిరిగి వికల్పము చెందే అవకాశమున్నది. వాయుతత్వమంటే, వ్యష్టిలో సమానాది ప్రాణముల చలనములు లేనిది. కాని పునరావృతిలో పనిచేసే అవకాశము పోలేదు. అగ్నితత్వమంటే వ్యష్టిలో రూపాదులు తోచని స్థితి. కాని మళ్ళీ తోచే ఆస్కారమున్నది. జలతత్వమంటే జీవులలో ఉండే విషయాదులు నిర్విషయమైనట్టిది. అయినా విషయములు తోచే బీజమున్నది. పృథివీతత్వము అంటే కర్మేంద్రియాలు నిష్క్రియ అయినటువంటిది. అయినప్పటికీ వాటిని క్రియోన్ముఖము చేసేటటువంటి అవ్యక్త స్థితిలో ఉన్నది. ఈ విధముగా సర్వము జీవులలో పునరావృతి అయ్యే అవకాశాలు ఈ కైవల్య దేహములో ఉన్నాయి. కనుక ఈ కేవలాత్మ అనే అఖండ ఎరుక లేనిదేనని విచారణ చేసి, నిరశించాలి. అందుకే ఈ కేవలాత్మ యొక్క పంచీకరణము. ఈ కేవలాత్మలో నిర్విషయ అంతఃకరణము, నిశ్చల సమానాదులు, నిరూపాధులు, అరసాదులు, నిర్గంధాదులు ఉన్నవి.

కాని అవి తిరిగి తన్మాత్రలు, విషయాలుగా వ్యక్తమయ్యే ప్రమాదము ఉన్నది. ఆకాశతత్వము మహాకాశమయ్యెను. ఆకాశతత్వము వాయుతత్వముతో కూడి ఆత్మారామత్వమయ్యెను. ఆకాశతత్వము అగ్నితత్వముతోకూడి స్వయంజ్యోతిత్వమయ్యెను. ఆకాశతత్వము జలతత్వముతో కూడి పరామృతత్వమయ్యెను. ఆకాశతత్వము పృథివీతత్వముతో కూడి భేదాభేదా తీతత్వమాయెను.

కేవల వాయుతత్వము అనామృత చైతన్యత్వమయ్యెను. వాయుతత్వము ఆకాశతత్వముతో కూడి దహరాకాశమయ్యెను. వాయుతత్వము అగ్నితత్వముతో కూడి పరంజ్యోతిత్వమయ్యెను. ఆకాశతత్వము జలతత్వముతో కూడి సమరసత్వమాయెను. ఆకాశతత్వము పృథివీతత్వముతో కూడి అభేదాభేదత్వమాయెను.

కేవల అగ్నితత్వము జ్యోతిర్మయత్వమాయెను. అగ్నితత్వము ఆకాశతత్వముతో కూడి నిరవయాకాశమయ్యెను. అగ్నితత్వము వాయుతత్వముతో చేరి చిదీశ్వర భావ మఖిల లీనత్వమాయెను. అగ్నితత్వము జలతత్వముతో కూడి తత్వామృతత్వమాయెను. అగ్నితత్వము పృథ్వితత్వముతో కూడి భేదాభేదత్వమాయెను.

కేవల జలతత్వము అమృతత్వమయ్యెను. జలతత్వము ఆకాశతత్వముతో కూడి సూర్యాకాశమయ్యెను. జలతత్వము వాయుతత్వముతో కూడి సత్యం జ్ఞానమనంత లక్షణ పరత్వమయ్యెను. జలతత్వము అగ్నితత్వముతో కూడి ఆపోజ్యోతిత్వమయ్యెను. అగ్నితత్వము పృథివీతత్వముతో కూడి అఖండత్వమయ్యెను.

కేవల పృథివీతత్వము ద్వయత్వమయ్యెను. పృథివీ తత్వము ఆకాశతత్వముతో కూడి భూతాకాశమయ్యెను. పథివీతత్వము వాయుతత్వముతో కూడి అంతర్బాహ్య స్ఫూర్తి రహితత్వమయ్యెను. పృథివీతత్వము అగ్నితత్వముతో కూడి జగజ్జ్యోతిత్వమయ్యెను. పృథివీతత్వము జలతత్వముతో కూడి బోధామృతత్వమయ్యెను.

ఈ విధముగా కేవలాత్మయందు పునరావృతికి హేతువైన తత్వములున్నవి. ఈ తత్వములన్నీ నిరశించబడినప్పుడు కేవలాత్మ నశించును. అనగా అఖండ ఎరుక లేకపోవడమే! అపుడు సిద్ధించేది పరమపదము. కేవలాత్మ యొక్క అపంచీకృతమైనది నిరాకాశము మరియు అచల పరిపూర్ణము.

ఈ కేవలాత్మ లక్షణములు ఏవి? ఆకాశతత్వము, వాయుతత్వము, అగ్నితత్వము, జలతత్వము, పృథివీతత్వము అనేవి అస్పష్టము, లీలామాత్రము. అవ్యక్తములో ఉంటూనే, వ్యక్తము కాబోయే వాటికి సూచకములు. అవ్యక్తమును సున్నా చేస్తే ఇక వ్యక్తమయ్యేవేవీ ఉండవు. కనుక ఈ లక్షణాలను గ్రహించి, నిర్బీజము చేయవలసి యున్నది. కనుక కైవల్య దేహములోని సూచనలను విమర్శించుకొనుటకు గాను ఈ కైవల్య దేహమును ముందుగా స్వానుభవములోనికి తెచ్చుకొనవలెను. ఇవన్నీ విషయముగా చెప్పినప్పటికి బుద్ధికి గ్రాహ్యము కాదు. ఆ కైవల్య దేహమునందే దర్శించదగును. అక్కడనే ఇవి అనుభవనీయము.

మహాకారణ దేహము ఉత్త బట్టబయలు ఏమీలేదు. కైవల్య దేహమునకు మూలము లేదు. మూలములేని గుర్తెరిగే కైవల్య దేహము ఏమీ లేదు. ఇంతవరకు విచారించినవి, అనుభవించినవన్నీ కూడా లేని ఎరుకే. అట్టి ఆధ్యాత్మిక స్థితిగతులన్నీ కలలో తోచినవేలాగో అలాగే ! **స్వస్తిః**

**శ్రు॥ ఆచార్య స్వరూపో వేదాఅహింసా ప్రథమం పుష్పం । పుష్పమింద్రియ నిగ్రహం । సర్వ భూత దయా పుష్పం । క్షమా పుష్పం విశేషతః । శాంతి పుష్పం తపః పుష్పం । ధ్యాన పుష్పం తథైవచ । సత్యమష్టవిధ పుష్పం । విష్ణోః ప్రీతికరం భవేత్!!**

అష్ట పుష్పాలను ఇక్కడ పెట్టారు. ఆచార్య స్వరూపం వేదా అంటే ఆచార్యుడు వేద స్వరూపుడు. ఆ వేద స్వరూపునికి 8 పుష్పాలు సమర్పిస్తే, ఆ విష్ణువుకు ప్రీతికరమౌతుంది. కైవల్య పదాన్ని ఇస్తుంది. కైవల్యపదము వరకే ఏ ప్రార్థనలైనా. బట్టబయలవడానికి ఏ ప్రార్థన లేదు, ప్రార్థన స్వీకరించేవాడు లేడు, ప్రార్థన చేస్తే కూడా అది ఎరుకే. ఎరుక రూపంలో ఉన్న ప్రార్థన ఎరుకలేని బట్టబయలుకు చేర్చదు. అందుకనే **"విష్ణుః ప్రీతికరం భవేత్"** సర్వవ్యాపక చైతన్య రూపుడైనటువంటి, విష్ణువుగావున్న చైతన్యంలో కానీ హిరణ్యగర్భుడులో గాని మనం చేరుతాం ఎందుకని? ఇది సగుణ అనుష్టానం. ప్రార్థనలు అన్నీకూడా ఎక్కడవరకు ఎరుక ఉంటుందో, అక్కడివరకూ అది తీసుకువెళుతుంది. ఎరుక విడిచినవాడు, లేని ఎరుకగా ఉన్నవాడు, అటువంటి విష్ణు స్వరూపుడు అయినటువంటి, ఆచార్య దేవునికి ఈ పుష్పాలు సమర్పిస్తున్నారు.

అహింస, ఇంద్రియనిగ్రహము, సర్వ భూత దయా, క్షమా, శాంతి, తపస్సు, ధ్యానం, సత్యం, అనే అష్టవిధ పుష్పాలను సమర్పిస్తున్నాడు అంటే అర్థం ఏమిటి? దేనినుండి విడుదల అవుతున్నారు? హింస వదలి అహింసకు వచ్చారు, ఇప్పుడు అహింసను కూడా వదిలేస్తున్నారు. తరువాత ఇంద్రియనిగ్రహము– శమదమాదులు కూడా వదిలేస్తున్నారు, వాటితో పని అయిపోయింది. సర్వ భూత దయా పుష్పం వదిలేశారు, క్షమా పుష్పం వదిలేశారు.

నేను ఆత్మస్వరూపుణ్ణి, నేను బ్రహ్మను అనేటటువంటి విశేషాన్ని వదిలేశారు. శాంతిని వదిలేశాడు, పరమ శాంతి మోక్షం అన్నారు, కాబట్టి అటువంటి శాంతిని వదిలేశావు. తపస్సును వదిలేశావు. ధ్యానాన్ని వదిలేశావు. సత్యాన్ని వదిలేశావు. ఇలా అష్టవిధ పుష్పాలను నీవు వదిలేశావు అంటే, అష్టవిధ ఎరుకల నుండి బయట పడ్డావని. చివరికి నీవు బయలు అయ్యావని అర్థము. ఇవన్నీ ఎలా వదిలావు అంటే, ఆచార్య స్వామికి సర్వార్పణగా వదిలేశావు. ఇక అవన్నీ నీకు లేవు.

మన గురుపరంపరలో "ఓం నమో బ్రహ్మాదిభ్యో"అన్నప్పుడు ఆ పరంపరలో ఏమి వచ్చింది? బ్రహ్మ విష్ణువుకు చెప్పాడు. విష్ణువు సూర్యుడికి చెప్పాడు. సూర్యుడు యాజ్ఞవల్క్యుడికి చెప్పాడు. యాజ్ఞవల్క్యుడు చెప్పిన బోధే అచల సిద్ధాంతము.

అంటే ఆ యాజ్ఞవల్క్యుడు అనేటటువంటి అశరీర గురువు చెప్పినట్లుగా తను మనధనాలన్నీ కూడా సమర్పించినప్పుడు మనం విడుదల అవుతున్నాము. ఇక్కడ విష్ణువు కూడా అశరీరి గురువే. యాజ్ఞవల్క్యుడు అశరీరిగా ఉన్నప్పుడు యాజ్ఞవల్క్యుని యొక్క గురువు సూర్యుడు. సూర్యునియొక్క గురువు విష్ణువు. అటువంటి విష్ణువుకి తను మన ధనాలు, ఈ 8 పుష్పాలు, తపస్సు ధ్యానం మొదలైనవన్నీ కూడా అర్పించేసావు. ఎందుకంటే బయలు తపస్సువల్ల అందదు, ధ్యానంవల్ల అందదు, అహింస అనే వ్రతంవల్ల అందదు. అవన్నీ కొన్నికొన్ని దాటటానికే పనికివస్తాయి. చివరకు ఎరుకను మిగిలిస్తాయి. కనుక సాధనలను, సాధ్యములను వదలివేయాలి. అష్టవిధ పుష్పలన్నీ అష్టవిధ ఎరుకలు. వీటిని అశరీరి గురువైనటువంటి విష్ణు స్వరూపునికి వారియొక్క ప్రీత్యర్థం వదిలేశాం.

ఆయనకి ప్రీతి కలిగితే, కృప కలిగితే నీకు ఎరుక విడిపించితే, నీవు బయలు అవుతావు. ఇదీ ముగింపు.

మూడు గుణాలతో వచ్చినటువంటి సృష్టిని, మూడు గుణాలతో పంచీకరణ క్రిందిస్థాయిలో పిండాండ బ్రహ్మాండ స్థాయిలో, మహా కారణం దగ్గర, కైవల్యదేహము దగ్గర కూడా అలాగే ఉంటుంది అని తెలుసుకున్నాము.

ఎందుకంటే అనిర్వచనీయమైనటువంటి వస్తువుని ఊహలో కూడా మీరు అందుకోలేరు కనుక, పైపైకి తీసుకెళ్ళి ఒకానొక అవగాహనను పెంచడం కోసమే ఇదంతా. పంచీకృత భాగాలన్నీ కూడా ఏమీ లేదు. అపంచీకృత భాగానికి వెళ్తే మరల అక్కడ కూడా ఒక పంచీకరణ తీసుకొస్తుంది, మహా కారణం దగ్గర. అదికూడా ఏమీ లేదు అని కేవలాత్మ దగ్గరకు వెళ్తే, కైవల్యం దేహం దగ్గర పంచీకరణ పెట్టాము. ఇక్కడ కూడా ఏమీ లేదని తెలిసింది. అన్ని పంచీకరణలలో ఏమి లేదన్నప్పుడు పంచీకరణ కాకుండా ఉన్నదున్నట్లుగా ఉన్నది. కట్ట కడపటి అపంచీకృతమే బయలు. అది బట్టబయలు తప్ప ఇంకేదీ లేదు.

"పూర్వమేవా నిరాలంబం" అని ప్రారంభంలో ఏదైతే సంకల్పం పెట్టామో అది కేవలాత్మగా మిగిలి ఉంటుంది. అంకురార్పణలో ఏదైతే మనం సమర్పించాలి అనుకున్నామో, ఆ కేవలాత్మ కూడా లేనిదని తెలిసి అశరీరులైనటువంటి, ఆ విష్ణు స్వరూపానికి ఆయన యొక్క ప్రీతి కొరకు ఆయన యొక్క కృపతో ఎరుక విడుచుటకు, ఈ ఎనిమిది రకాలైన ఎరుక పుష్పాలనికూడా ఆయనకు సమర్పించుకున్నాము. ఇంక ఏమీ మిగలలేదు. ఉత్త బట్టబయలే స్వతఃసిద్ధము !

సమాప్తము.

**శివ పంచాక్షరీ**

కం॥ **పంచాక్షరీ బోధించియు చాంచల్య మడంచివైచె సద్గురువర్యుల్ ।**
**అంచిత శ్రీకృష్ణనెంచగ వశమవునె ధరలో నెవ్వరికైనన్ ॥**

పంచాక్షరి అంటే "నమశ్శివాయ". 'ఓం' కలపకుండానే ఐదు. (అష్టాక్షరీ మంత్రము ఓం నమో నారాయణాయ, ఓం తో కలిపి 8.) పంచాక్షరీ ఎవరు బోధించారు? అశరీరి గురువు పంచాక్షరీ మంత్రాన్ని సచ్ఛిష్యులకు బోధించారు. బోధించితే ఏమైంది?–సచ్ఛిష్యుడు తన చంచలత్వాన్ని అణచివేసి అచల స్థితిని అందుకున్నాడు సద్గురు వర్యుని కృపచేత. దేశికేంద్రులైనట్టి, అశరీరి గురువులలో ఎవరైతే శ్రేష్ఠుడో, ఆయన ఎరుక విడిపిస్తే ఈ చంచలత్వం పోయి అచల పరిపూర్ణం సిద్ధించింది. కనుక ఈ పంచాక్షరీ పుణ్యం అంటే ఇక్కడ మోక్షప్రదము.

చంచలత్వాన్ని గురువు అణగగొట్టాడు. చంచలత్వానికి ఆస్కారమున్నట్టి అవ్యక్త స్థితిగాని, అవ్యక్తంలో ఉన్నటువంటి చంచలస్థితికి కారణమైన ఘనస్థితిలో ఉన్న తత్వాన్ని కూడా పోగొట్టాలి. కదిలే దాన్ని పోగొడితే సరిపోదు. భవిష్యత్తులో కదలకుండా చేయాలి దాన్ని. పిండాండంలో కదిలేది వుంటే బ్రహ్మాండంలో కదిలించే శక్తి, స్పందశక్తి ఉంది. ఆ స్పందన శక్తి కూడా విశ్వాండంలో అవ్యక్తంగా ఉంది. విశ్వాండంలో అవ్యక్తంగా ఉన్నది కూడా అంతకుముందు మాయే.

విశ్వాండ బ్రహ్మాండ పిండాండములలో వరుస క్రమంలో కనిపించినటువంటిది పిండాండం ఏమో భూతాకాశ సంబంధము. బ్రహ్మాండం ఏమో సూర్యాకాశ సంబంధము, విశ్వాండం ఏమో నిరవయవాకాశ సంబంధము. అక్కడ అన్నీ అవ్యక్త రూపంగా ఉన్నాయి. ఈ అవ్యక్త స్థితికూడా, విశ్వాండమునకు కారణము కూడా మాయ. దహరాకాశముగా నున్న మాయ కారణంగా నిరవయవాకాశము విశ్వాండ పద్ధతిలో వస్తే, దానినుండి సూర్యా కాశం బ్రహ్మాండ పద్ధతిలో వస్తే, భూతాకాశం పిండాండ పద్ధతిలో వచ్చింది.

కనుక దహరాకాశం దాటితే, ఈ మహాకాశం. నేను బ్రహ్మము అనేటటువంటి ఆ బ్రహ్మ జ్ఞానానికి అవకాశం ఇచ్చేదే మహాకాశం. ఈ మహాకాశం నిరాకాశం అయినప్పుడు బ్రహ్మజ్ఞానం అనేటటువంటి ఎరుక విడిపోతుంది.

ఎవరు విడిపిస్తారూ అంటే **'అడంచి వైచె సద్గురువర్యుల్'** ఆ ఎరుకను సద్గురువులు అణిచారు, దేనితో? శివపంచాక్షరీ మంత్రాన్ని బోధించి, ఆ బోధించినటువంటి అశరీరి గురువు చంచలత్వానికి ఆస్కారంగా వున్న ఎరుకని మూలముతో సహా బోధవల్ల తొలగించి వేస్తాడు.

**"అంచిత శ్రీకృష్ణనెంచగ వశమవునె ధరలో నెవరికైనన్"** అంచిత అంటే అంచితముగా అంటే పవిత్రముగా, పాప రహితముగా 'శ్రీకృష్ణనెంచగ వశమవునె,

కైవల్య నిర్ణయంలో **"విష్ణుః ప్రీతికరం భవేత్"** అన్నారు. ఎరుక విడవటానికి అశరీరి గురువైన విష్ణువుకు సర్వ సమర్పణ చేసాం. ఎందుకని? ఈ విష్ణువు త్రిమూర్తులలో విష్ణువు కాదు. అంటే బ్రహ్మ విష్ణువుకు, విష్ణువు సూర్యునికి, సూర్యుడు యాజ్ఞవల్క్యునికి బోధించారు అన్నాం కదా! ఈ విష్ణువు సర్వవ్యాపక చైతన్యంగా ఉన్న విష్ణువు అయినప్పటికీ, తొలిగా పరబ్రహ్మ

వద్ద మౌన వ్యాఖ్యగా అందుకొన్న అచల పరిపూర్ణత్వమును పరిపూర్ణ బోధ ద్వారా ఎరిగి, అశరీరి గురువైనవాడే, ఆ విష్ణువు. ఆ విష్ణువే అవతరించినప్పుడు, శ్రీకృష్ణునిగా ఉద్ధవునికి, అర్జునునికి అచలబోధ చేసాడు. కృష్ణుడంటే అశరీరి గురువే. అటువంటి బయలు అనేటటువంటి కృష్ణుని ఎరుకతోనే గుర్తించుట ఎవరి తరము? అందువలన విఫలం అవుతున్నాము. అంటే గుర్తెరిగే ఎరుక లేదక్కడ. అంతా బట్టబయలే ఉంది.ఎటువంటిది? ఎరుకలేదు, బట్టబయలు ఇట్టిది, అట్టిది అనరానట్టిది.

ధరలోన ఎవ్వరికైనను–ధరలోన అంటే భూమి మీద అని కాదు. మనం ఎక్కడున్నాం ఇపుడు ఈ పంచీకరణ పటంలో? – కైవల్య పంచీకరణ కంటే ఇంకా దిగి, మహాకారణ దేహ పంచీకరణ కన్నా ఇంకా దిగి, బ్రహ్మాండ పంచీకరణ లోకి దిగి, పిండాండ పంచీకరణ లోకి వచ్చి, అక్కడ కూడా పంచీకరణ తెలీనట్టి పరిస్థితిలో ఉన్న జీవులు ఈ బట్టబయలు ఎలా కనుక్కొంటారు?

ముందు పిండాండ పంచీకరణ యెరిగి, తన స్వభావం బ్రహ్మాండమందు ఎలా వుందో గుర్తుపెట్టుకుని, ఆ గుర్తు పోగొట్టుకోవడానికి బ్రహ్మాండ పంచీకరణ ఎరిగి, ఆ గుర్తుపోయి, మరొక గుర్తును మహాకారణశరీరంలో అవ్యక్తంగా వాసనా రూపంలో ఉంటే, అక్కడ కొన్ని కష్టాలకు కారణం అయినా ఆనందపడుతూ ఉంటే ఆ ఆనందం అనే ఎరుక పోగొట్టుకోవడానికి, కైవల్య దేహ నిర్ణయంలో ఉన్న పంచీకరణలోకి వెళ్ళి, అన్నిరకాల అవకాశాలను నిర్బీజం చేసి నిరాకాశం చేసినపుడు తిరిగి వచ్చే అవకాశాలులేనివాడై పునరావృత్తి లేనటువంటి పరమపదాన్ని పొందగలుగుతున్నాడు. అందుకని ఇక్కడ కృష్ణుడు అంటే అశరీరి గురువే. ధరలోనే అంటే ఇక మన స్థాయి ఎక్కడో చూసుకోవాలి.

భూమిమీద పాకేది చీమ. మనిషి కంటే అల్పమైనది చీమ. అందుకే ఈ పరిపూర్ణ బోధ గురించి అయితే చిన కందార్థాలలో చివరకు ఇలా చెప్పారు. **ఈ భూమిమీద పాకేటటువంటి చీమ చంద్రుడి వద్దకెళ్లి చంద్రుడిని ముద్దాడిందట.**" ఇది సాధ్యమేనా? ఎంతటి అసాధ్యమైనా పరిపూర్ణ బోధను ఈ గురువు శిష్యునికి చెప్పారు. శిష్యుడు గ్రహించి ఉత్తీర్ణుడయ్యాడు. ఎంత గొప్ప విషయము!

అటువంటి శిష్యుని గురువుకు గురుదక్షిణగా ఏమిస్తావు అని అడిగాడు. సచ్ఛిష్యుడు 'నన్నే"నని పలికె. అంతా ఉత్త బట్టబయలు ఏమీలేదు అన్నప్పుడు ఏమిస్తాడు? ఇవ్వడానికి ఏముంది అక్కడ? కానీ భ్రాంతిలో ఇంకా తానున్నాడు, ఉండి మూలం లేని గుర్తెరిగే శరీరం ఏమీలేదని తెలుసుకున్నాడు. బోధ పూర్తయ్యేసరికి తెలిసింది. అయితే తనంతట తానే లేనివాడు కాలేదు కాబట్టి, మూలం లేని గుర్తెరిగే శరీరం ఏమీ లేదు అనే నిర్ణయానికి సంబంధించి, తను ఉన్నాను అనేది లేనెరుక అని తెలిసినప్పటికీ ఆ లేనెరుక పోవటం లేదు. అందుకని అశరీరి గురువుకు ఆ లేనెరుకని దక్షిణగా ఇచ్చాడు. అట్లు గురువు యొక్క కృపతో లేనెరుక లేకుండాపోతే శిష్యుడు బయలయి ఉన్నాడు.

మరి శరీర ప్రారబ్ధం ఉందిగా. అందుకని గురువు శిష్యుడికి ఏం చెప్పారు అంటే, "నీ ఎరుక నాకు ఇచ్చేసావు కదా! నీ పరంగా ఎరుక లేదు. కాబట్టి శరీర ప్రారబ్ధం పూర్తయ్యేవరకూ, గురువు ఆజ్ఞచేత ఇతరులకు ఈ బోధ అందించడం కోసమైనా, నా ఎరుకను నీకిస్తున్నాను, నీపరమైన ఎరుక లేదు, నీవు బయలయి పోయావు. నీకు నా పరమైన ఎరుకను ఇస్తున్నాను, ఇక నీపరంగా అది లేని ఎరుక అవుతుంది. ఈ లేని ఎరుకలోనే నీ జీవితాన్ని వెళ్ళమార్చి నిజానికి రాయి మాదిరిగా జడునివలె నీవు పట్టించుకోకుండా ఉండు. ఇప్పటికే నీవు అశరీరివి. కనుక ఈ శరీరం ఉందో లేదో నీకు అనవసరము. ఎప్పుడు పోయేది, ఎంతవరకూ ఉండేది నీకు అనవసరం. అందువల్ల ఆ ఎరుక జోలికి వెళ్ళకు" అని హెచ్చరించారు.

**శ్లో॥ పంచాక్షర మిదం పుణ్యం పవిత్రం పాపనాశనమ్ । సర్వసిద్ధికరం శుభం, సాక్షాన్మోక్షైక సాధనం ॥**

ఇక్కడ పుణ్యపాపాలు అంటే, ఇతరులకు శాంతి కలిగించేవి బాధ కలిగించేవి కాదు. ఈ పంచాక్షరీ మంత్రం ఏదైతే ఉన్నదో, ఆ మంత్రం గురువుద్వారా తెలుసుకొని మంత్రోపదేశం పొంది, మంత్రార్థాన్ని ఎరిగి, ఆ మంత్రార్థం ఏదైతే ఉందో దాని ప్రకారము ఎలా నీవు లేనివాడవని షోడశీ భావన ఇస్తోందో ఆ ప్రకారంగా నీవు లేనివాడవు లేకుండా పోవడమే పుణ్యం. ఆ పంచాక్షరీ మంత్రం నిన్ను బయలుగా నిర్ణయించి ఎరుక పోగొట్టుతుంది. అదే పుణ్యం ఇక్కడ.

అక్కడిదాక వస్తే ఎరుకతో ఉండటమే మహా పాపం. ఈ పంచాక్షరీ మంత్రం ఎరుకలో ఉన్న పాపాత్ముడికి మంత్రము ఇచ్చి, మంత్రార్థము తెలిపి, మంత్రాతీత స్థితి కలిగించి, పాపనాశనం చేస్తోంది. అంటే ఎరుక నాశనం చేస్తోంది. పవిత్రమైనటువంటి పంచాక్షరీ మంత్రము ద్వారా కలిగే పరిపూర్ణ బోధ అనే పుణ్యంచేత అపవిత్రంగా ఉన్న ఎరుక నాశనం అవుతుంది.

**సర్వసిద్ధికరం శుభం** అంటే సర్వం శూన్యం అయింది. సాధనలో అనేక సోపానాలు దాటేటప్పుడు ఎక్కడికక్కడ క్రిందిస్థితి పోయి, పై స్థితికి వస్తున్నారు. ఇది కాదు ఇది కాదు అని నిరపేక్షంగా వెళ్ళిపోతూ ఉన్నావు. ఆధార ఆధేయ పద్ధతిలో పోవటం లేదు, అంటే పైది, ఆ పైది సిద్ధిస్తూ ఉంటే ఒక్కొక్కటీ లేకుండా పోతున్నది. ఆ లేకపోవడమే శుభం. సర్వసిద్ధి కరం అంటే ఏమిటి? – మొదటి భూమిక నుండి రెండో భూమికలో చేరేసరికి, ఆ రెండో భూమికలో సిద్ధించింది. అలా ఆ చివరి వరకూ పోతే అన్ని సిద్ధించాయి. సిద్ధించితే ఏమైంది? పంచాక్షరీ మహామంత్రం మహిమచేత గురు కృపచేత సర్వము శూన్యమైతే చివరిగా సిద్ధించింది. ఎక్కడికక్కడ నిరపేక్ష పద్ధతిలో సిద్ధి పొందుతున్నాము, అన్నింటినీ వదిలేస్తున్నాము. చివరి సిద్ధిలో ఇంతకుముందు సిద్ధించినవి కూడా వదిలేస్తున్నాము. ఇదీ సర్వసిద్ధికరము అంటే!

ఆధార ఆధేయ పద్ధతిలో సిద్ధి అనరు. జీవేశ్వరైక్యం, జీవబ్రహ్మైక్య ఇలా అంటారు. జీవుడు ఈశ్వరుడిలో లయం అయ్యాడు. జీవుడు బ్రహ్మములో లయం అయ్యాడు అని అంటారు.

నిరపేక్ష పద్ధతిలో ఈశ్వరుడే ఉన్నాడు జీవుడుగా లేడు అని. తరువాత బ్రహ్మమే ఉన్నాడు. ఈశ్వరుడు లేడని ఆ తరువాత బ్రహ్మ లేడని సత్యం జ్ఞానం అనతరం బ్రహ్మ కూడా లేడని, ఈ లేకపోవడంలో దానిపై స్థితి ఏది కలిగిందో అదే సిద్ధి. కనుక ఇన్నిరకాల సిద్ధులు ఉన్నాయి కాబట్టి సర్వసిద్ధికరం. ఎన్ని విభాగాలు చేస్తే అన్ని విధాలుగా ఉంటుంది కనుక సర్వసిద్ధికరం.

కొందరు రెండు మూడు పద్ధతుల్లో చెబుతున్నారు, ఇక్కడ మనం 5 పద్ధతుల్లో చెబుతున్నాం. పిండాండ, బ్రహ్మాండ, ఈశ్వర పంచీకరణ, మహాకారణ దేహ పంచీకరణ, కైవల్య దేహ పంచీకరణ ఇలా 5 పద్ధతులలో చెబుతున్నాం. కనుక ఐదుసార్లు సిద్ధించాలి.

కూటస్థ ఆత్మగా మొదటి సిద్ధి, కూటస్థ బ్రహ్మగా రెండవ సిద్ధి, పరబ్రహ్మగా మూడవ సిద్ధి, పూర్ణత్వముగా నాల్గవ సిద్ధి, పరిపూర్ణత్వముగా అయిదవ సిద్ధి. ఇలా 5 సిద్ధులు పొందుతున్నాం.

**సర్వసిద్ధికరంశుభం**– శుభం అంటే ఏమిటి ?– శుభం అంటే ఆనందాన్ని వదలడము.

**"శుచిః సాక్షాన్మోక్షైక సాధనం"**– శుచిః అంటే ఏమిటి? మాలిన్యాన్ని పోగొట్టుకోవడం. అంటే సాధనవల్ల శుచి అయింది. అంటే ఆ శరీరానికి ఉన్న మట్టి దుమ్ము మాలిన్యం పోయింది. ఇక్కడ మాలిన్యం అంటే ఎరుక. ఎరుక అనే మాలిన్యం పోయి ఉత్త బట్టబయలు సిద్ధించింది. అది శుచిః అంటే.

**'సాక్షాన్మోక్షైక సాధనం'** – ఏది మోక్షైక సాధనం? పంచాక్షరీ మంత్రమే మోక్షైక సాధనం. **"ఓం నమశ్శివాయ".** ఇక్కడ ఓం నమశ్శిఆయ అన్నప్పుడు 6 అక్షరాలైనాయి. ముందు 'ఓం' చేర్చారు. ఈ 6లో ఐదు అక్షరాలు మాత్రమే ఉచ్ఛరించేది పంచాక్షరీ మంత్రము. వేద మంత్రాన్ని చదువుతూ, ఒక పదములోని అక్షరమును గాని, ఒక పద సమూహములోని ఒక పదమును గాని, ఎడమవైపు తొలగిస్తూ, కుడివైపు కలుపుతూ, అలా పునరుక్తము చేస్తూ ఉచ్ఛరించే పద్ధతిని ఘనాపాఠం అంటారు. ఇలా స్వరయుక్తముగా మంత్రాలను ఉచ్ఛరించే నైపుణ్యం ఉన్నవారిని ఘనాపాఠి అంటారు.

ఓం నమశ్శివాయ అనే 6 అక్షరాలలో ఐదింటిని మాత్రమే ఉండేలా చూడాలి. కనుక వీటిలో మొదటి 5 అక్షరాలను ఉంచి, చివరి ఒక అక్షరము వదలాలి. అలా ఒక్కొక్క మొదటి అక్షరం తొలగించి, చివరి అక్షరమును కలుపుతూ, ఎప్పుడూ కూడా అయిదే అక్షరాలు ఉండేటట్లుగా చూచుకుంటూ ఉచ్ఛరించేదియే శివ పంచాక్షరీ. ఇప్పుడు చూడండి!

**మంత్రం : ఓం నమశ్శివాయ । నమశ్శివాయ ఓం**
**ఓం నమ శ్శివా । ఓం నమశ్శివా**
**నమ శ్శివాయ । నమశ్శివాయ**
**మశ్శివాయ ఓం । మశ్శివాయ ఓం**
**శ్శివా య ఓం న । శ్శివాయ ఓంన**
**వాయ ఓం నమ । వాయ ఓం నమ**
**య ఓం నమశ్శి । య ఓం నమశ్శి**
**ఓం నమశ్శివా । ఓం నమశ్శివా**
**నమశ్శివాయ । నమశ్శివాయ**

ఇదీ ఘనాపాఠముగా చదివే మంత్రము.

అలా ఘనాపాఠం పద్ధతిలో శివ పంచాక్షరిని చెప్పారు ఇక్కడ. ఓం నమశ్శివాయ మంత్రమునకు అర్థం ఓంకారం పంచభూతాత్మకం. ఓం అనే ద్వారం నుండి పంచభూతాలు వచ్చినాయి. ప్రణవం పంచభూతాత్మకం. ఓం నందు 3 మాతృకలున్నాయి. అమాతృక 3 మాతృకలలో వ్యాపకమైంది. వ్యాపకమై విస్తరించింది. విస్తరించిన దానిలో పంచభూతాలు వచ్చినాయి. పంచభూతాలలో ఓంకారం అనుస్యూతంగా ఉంది. దేని నుండి పంచ భూతాలు వచ్చాయో వాటియందు అది నిక్షిప్తమయ్యే ఉంటుంది. బంగారం నుండి ఆభరణాలు వస్తే, ఆభరణాలన్నింటిలో కూడా బంగారం అనుస్యూతంగా ఉంది. అలాగే పంచభూతాత్మకమైన యావత్ సృష్టిలో కూడా "ఓం" అనుస్యూతంగా ఉంది.

పంచభూతాలు జడము 'ఓం' చైతన్యము, తాను అనేటటువంటి ఎరుక. ఈ ఎరుక జడమైన పంచభూతాలలో వ్యాపించడం వలన పంచభూతాలలో చలనాలు వచ్చాయి.

నమశ్శివాయలో **న**కారము అనే బీజమువలన పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు వెరసి దశేంద్రియములు కలిగెను. **మ**కారము అనే బీజము వలన మనస్సు పుట్టెను. **శి**కారము అనే బీజమువలన బుద్ధి జనించెను. **వా**కారము అనే బీజము వలన ఉపవాయువులతో కూడి దశ వాయువులు పుట్టినవి. **య**కారము అనే బీజము వలన సత్వరజస్తమో గుణములు పుట్టినవి.

**ఓం** అనే ఎరుకనుంచి పంచభూతాలు పుట్టాయి. ఓంకారం పంచభూతాత్మకం. మూడు గుణాలచే త్రిమూర్తులు పుట్టిరి. ఇదియే త్రిగుణాత్మకమైన మాయా ప్రపంచము. త్రిగుణాత్మక స్వరూపుడగు పరమశివుడు ఈ పంచాక్షరీ మంత్ర రాజమును, సద్గురు దక్షిణామూర్తి స్వరూపమున చనుదెంచి, బ్రహ్మాది దేవతలకు (శబ్ద బ్రహ్మమును) ఉపదేశించిరి. మొదటి బ్రహ్మ ఎవరు? శబ్ద బ్రహ్మ. శబ్ద బ్రహ్మకి **"నిశ్శబ్ద బ్రహ్మముచ్యతే"** అని లక్ష్యములో ఆ నాలుగు మాత్రలకు అతీతమైన స్థితి అనే లక్ష్యాన్ని, నిశ్శబ్దాన్ని బోధించారు. నాలుగు మాత్రలంటే అకార, ఉకార, మకార, అర్ధమాతృకలు.

**య**కారం అనే బీజం వలన మూడు గుణములు పుడితే ఆ త్రిగుణములచే త్రిమూర్తులు పుట్టారు. ఈ త్రిమూర్తులకు ఇప్పుడు బ్రహ్మజ్ఞానం ఉందంటారా, లేదంటారా? బ్రహ్మ జ్ఞానం ఉంది. ఎందుకంటే ఇదంతా ఓంకారం నుండి వచ్చింది. ఓం అనే ఎరుక మీ అందరిలో చైతన్య రూపంగా, పై స్థితికెళ్తే, బ్రహ్మ నిష్ఠలో అవ్యక్తంగా, ఘనంగా ఉంది. బ్రహ్మలోని ఎరుక ఘన రూపంలో ఉంది. తటస్థ లక్షణంలో ఆనందంగా ఉంది, సత్ చిత్ ఆనందముగా నున్నది.

సృష్టిలోకి వచ్చింది త్రిమూర్తులైతే, ఇక్కడ విష్ణువు శ్రీమన్నారాయణుడు కాదు. ఈ త్రిమూర్తులలో విష్ణువు జీవుల పోషక కర్త మాత్రమే. ఈ త్రిమూర్తుల ద్వారా మిగతా ప్రపంచం అంతా వచ్చింది. ఇది ఎవరి ద్వారా వచ్చింది? ఓం నమశ్శివాయ మొత్తం కలిపితే, మూడు గుణాలతో ఈశ్వరుడు వచ్చాడు. ఇది ఈశ్వర పంచీకరణ.

అటువంటి ఈశ్వరుడు త్రిగుణాత్మకమై, త్రిమూర్తులు అయ్యాడు. త్రిమూర్తుల వల్ల సృష్టి స్థితి లయలు అవుతున్నాయి. ఈ త్రిగుణాత్మక స్వరూపుడగు పరమశివుడు ఈ పంచాక్షరీ మంత్ర రాజమును బోధించారు.

త్రిగుణాత్మక స్వరూపుడు అంటే ఏమిటి? మూడు గుణాలు స్వరూపంగా ఉన్నాయి. మూడు గుణాలు విజృంభించి లేవు. అయినా పరమేశ్వరుడు అంటే ఎవరు? మాయకి కూడా అధిష్ఠానమైనవాడు. అదేసమయంలో మాయను తన చేతిలో ఎలా వీలయితే అలా వాడుకోవడానికి వీలుగా ఆ మాయకు అధిష్టానమై ఉన్నాడు. తన స్వ ఇచ్ఛచేత మాయా విలాసం జరుపగలిగినటువంటివాడు, వాడిని పరమేశ్వరుడు అన్నాము. ఈశ్వరుడు అన్నా మాయకు లోబడ్డవాడే. వాడు త్రిమూర్తులయి పోయాడు సృష్టి స్థితి లయలు చేయడానికి. కాని పరమేశ్వరుడు అలా కాదు. మాయకు ప్రభువు.

ఈశ్వరుడికి పరమైనవాడు పరమేశ్వరుడు. మాయని తన చేతిలోకి తీసుకుని మాయా కార్యం చేయగలిగినటువంటి సమర్థుడు. అందుకే గురువు కూడా పరమేశ్వర స్వరూపమే.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః గురు సాక్షాత్ పరబ్రహ్మ- అంటే అర్థం గురువు సాక్షాత్తు పరబ్రహ్మమే అయివుండి కూడా, త్రిమూర్తుల యొక్క కార్యక్రమాలు తాను కూడా చేయగల సమర్థుడు. అటువంటి సమర్థుడే మాయనుండి నిన్ను విడిపించగలడు. అలాంటి సమర్థుడే నిన్నుఎరుకనుండి విడిపించగలడు.

వారు మాయను అధిగమించి మాయను స్వాధీనంలోకి తీసుకుని ఆ మాయా విలాసం అనేటటువంటి దానికి సర్వాధిష్ఠానమై ఉన్నారు.

ఇప్పుడు మనం చెప్పుకునే పద్ధతిలో ఉన్నటువంటి సృష్టి క్రమంగా కాకుండా, సచ్ఛిష్యుడి విషయంలో ఈ త్రిమూర్తిత్వము ఏమిచేయగలదో, సచ్ఛిష్యుడికి జ్ఞానోపదేశంచేసి ఎరుకను విడిపించడానికి, ఏమి కావాలో ఆ సచ్ఛిష్యుడిలో ఏది సృష్టించబడాలి? ఇవన్నీ ఆ సద్గురువుయందున్నాయి. మాయ నుండి తప్పుకొనుటకు పరిపూర్ణ బోధ జ్ఞానము సృష్టించబడాలి. అచల పరిపూర్ణ నిర్ణయము పోషింపబడాలి. ఎరుక సంపూర్తిగా లయం కావాలి.

ఆ విధంగా త్రిమూర్తిత్వము పరమేశ్వరుని దగ్గర ఉన్నది. అయితే ఆ ఆ పరమేశ్వరుడు సృష్టికి అతీతమైన పరమేశ్వరుడే గదా! సృష్టికి అతీతుడైన పరమేశ్వరుడు అయితే, అశరీరి గురువే. గురుస్సాక్షాత్ పరబ్రహ్మ.

ఆ పరమేశ్వరుడు ఏం చేసాడు? దక్షిణామూర్తి రూపంలోకి వచ్చి ఆ బ్రహ్మనిష్ఠలో ఉన్నటువంటి సనక సనందన సనత్కుమార సనత్సుజాతులకు చేరువై, బయలే ఉన్నదని ఆ బ్రహ్మ నిష్ఠ అనే అఖండ ఎరుకలో ఉన్నటువంటి లక్షణాలనుంచి, అవ్యక్తంగా ఉన్న తత్వాల నుంచి విడుదల చేసాడు. లయింప చేశాడు.

ఆ సద్గురువే దక్షిణామూర్తి స్వరూపమున చనుదెంచి, బ్రహ్మాది దేవతలకు త్రిమూర్తులకు ఇతర అధిష్టాన దేవతలకు అందరికీ 'నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే" వరకు బోధించారు.

బ్రహ్మ నిష్ఠలో కూడా బ్రహ్మనిష్ఠ అనేటటువంటి ఘన రూప అఖండ ఎరుకను విడిపించాడు మౌనవ్యాఖ్య ద్వారా. వారిద్వారా సర్వ ఋషీశ్వరులు, వారిద్వారా పరంపరగా వచ్చిన పెద్దలు పూర్వమే గ్రహించి సులభముగా ఈ మాయను దాటి, ధన్యులైరి.

మాయను దాటి వెళ్ళారంటే అర్థమేమిటి? ఎరుకన్నా, మాయన్నా, చైతన్యం అన్నా ఒకటే. మాయను దాటారంటే దక్షిణామూర్తి అనేటువంటి స్వరూపంలో పరమేశ్వరుడు వచ్చి బ్రహ్మాది దేవతలకు కూడా ఉపదేశించాడు. నరులకు నారాయణుడు బోధించారు. అయితే పరంపర ఎలా వచ్చింది? ఓం నమో బ్రహ్మాదిభ్యో. పరమేశ్వరుడే దక్షిణామూర్తి స్వరూపంలోకి వచ్చి మొట్టమొదట బ్రహ్మకు చెప్పాడు, ఆ బ్రహ్మ విష్ణువుకు చెప్పాడు, ఆ విష్ణువు సూర్యుడుకి చెప్పాడు. అ సూర్యుడు యాజ్ఞవల్క్యుడికి చెప్పాడు. అలా వరుసలో యాజ్ఞవల్క్యుడు, జనకుడు, సాందీపుడు, కృష్ణుడు వచ్చారు. కృష్ణుడు కూడా ఆ వరుసలో వచ్చాడు కాబట్టి ఆయన కూడా అశరీరి గురువే. **"అంచిత శ్రీకృష్ణుని ఎంచగా ధరలో ఎవరికైనన్"** అన్నాము, అక్కడ కృష్ణుని అందుకు పెట్టాము. అక్కడ గోపికా లోలుడైన కృష్ణుడు కాదు, వెన్నదొంగ కృష్ణుడు కాదు, దేవకి వసుదేవులకు పుట్టిన వాసుదేవుడు కాదు. ఈ కృష్ణుడు అశరీరి గురువు. ఆ ఉద్దేశంతో ఇక్కడ కృష్ణుడు అని పెట్టాం.

ప్రణవ పంచాక్షరీ ద్వారా ఈ మాయను సులభంగా దాటి, ఎరుక విడిచి, బయలై ఉన్నారు. అదీ ధన్యత్వం అంటే. ఈ ప్రణవ పంచాక్షరీ మహామంత్రం సద్గురు స్వామిద్వారా ఉపదేశింపబడి, సర్వేంద్రియములకూ రాజయిన మనస్సును లయింపజేసి, దేహ త్రయంబు నేను కాదు, అవస్థాత్రయంబు నాది కాదు, రాగద్వేషాలు నాకు లేవు, ఈషణాత్రయములతో నాకు సంబంధములేదు, **"అది"**యే నేను, నేను **"అది"**యే అని నేను విలక్షణమైన సర్వసాక్షిని అని ఒక క్రమంలో చెప్తున్నారు.

ఈ క్రమంలో చెప్తున్నది అప్పుడే బయలు కాదు. ప్రణవ పంచాక్షరీ మంత్రమును పైన చెప్పినట్లు ఓం నమశ్శివాయ, నమశ్శివాయ, మశ్శివాయన, శ్శివాయనమ, వాయనమశ్శి, యనమశ్శివా, నమశ్శివాయ అని చెప్పారుగా !

ఈ ఐదు అక్షరాలు 5 పంచీకరణలు. 5 అక్షరాల ద్వారా 5 పంచీకరణలు తెలుసుకొని, ఎరుక నుంచి విడివడాలి. ఇదీ దీని సారం. ఇటువంటి ప్రణవ పంచాక్షరీ మంత్రం చెప్తున్నాము ఇక్కడ.

మంత్రం వల్ల ఏమి ఒరిగింది? **'న'**కారం అనే బీజం వల్ల పుట్టిన పంచజ్ఞానేంద్రియాలు పంచ కర్మేంద్రియాలతో వాటి వల్ల ఏర్పడినవన్నీ విడవాలి. **'మ'**కారం అనే బీజం వల్ల మనస్సు పుట్టింది, మనసును పోగొట్టుకోవాలి. **'శి'**కారం అనే బీజం వలన బుద్ధి పుట్టింది, గనుక బుద్ధి అనే ఎరుక పోవాలి. **'వా'**కారం అనే బీజం వలన ఉపవాయువులతో కూడి దశ వాయువులు పుట్టాయి, దశ వాయువులు వలన నేను రక్షింపబడుతున్నాను అనేటువంటి ఎరుక పోవాలి. **'య'**కార బీజం వలన సత్వరజస్తమో గుణములు పుట్టాయి, కనుక **'య'**కార బీజంతో పాటుగా మూడు గుణాలు పోయి త్రిగుణ రహితం కావాలి.

త్రిగుణ రహితం అయితే ఏమయింది? మూడు గుణములతో వున్న త్రిమూర్తులు పోతారు. త్రిగుణాత్మకమైన మాయ పోతుంది. త్రిగుణాత్మక స్వరూపము అయిన శివుడు కూడా పోతాడు. అయితే ఆ త్రిగుణాలు తన అదుపాజ్ఞలో పెట్టుకున్నట్టి వారు అంటే అశరీరి గురువులు ఉంటారు. బయలు అయినప్పటికీ కూడా, లేని ఎరుకని తన అధీనంలో పెట్టుకుని, ఆ లేని ఎరుకతోనే శిష్యుడికి కలలో ముచ్చట లాడినట్లుగా, ఈ పరిపూర్ణ బోధ బోధిస్తారు. కలలోనే గురువు కలలోనే శిష్యుడు కలలోనే బోధ. కలనుండి మేల్కొంటే, బోధ లేదు, శిష్యుడు లేదు, గురువు లేడు, ఏమీ లేదు, అంతా ఉత్త బట్టబయలు ఏమీలేదు. ఇక్కడ దానికి మొదలుపెట్టాము.

'య'కారంతో మూడు గుణాలు పోవాలి. సర్వేంద్రియాలకు కూడా రాజు అయిన మనసు పోతే ఇక ఇంద్రియాలతో పని ఏముంది? ముందు మనసు పోగొట్టుకొని ప్రజ్ఞ స్థితిలో ఉండాలి. **"ప్రజ్ఞానం బ్రహ్మ"**. ప్రజ్ఞా స్థితిలో వుండి, దేహ త్రయం నేను కాదు, అవస్థ త్రయం నేను కాదు, రాగద్వేషాలు నాకు లేవు,ఈషణత్రయము నాకు లేవు, షడూర్ములు నాకు లేవు, ఇవన్నీలేవు. ఇవన్నీ పోతే చివరకు ఏం మిగిలింది? **'అది'** అన్నాం. **'అది'** అని పేరెందుకు పెట్టాం. **'అది'** అనిర్వచనీయము. నామరూపాలు లేనిది. అందుకని **'అది'** అని పేరు పెట్టాం. ఇదీ అని ఎందుకు పెట్టకూడదు. దూరంగా ఉంది కాబట్టి **'అది'** అంటున్నాం. లక్ష్యం సిద్ధిస్తే అప్పుడు కూడా "ఇది అది" అని అనము. ఏదో ఒకటి అనే భావన లేకుండా **అయం – 'ఈ'** అంటాం. **"తత్త్వమసి"** అదే ఇది, ఇదే అది. **"అయమాత్మా బ్రహ్మ"** ఈ ఆత్మే బ్రహ్మ. **'అది'** అనేది **'ఈ'** అయిపోయింది. తత్వమసిలో **'అది' అయమాత్మా బ్రహ్మ** లో **'ఈ'** అయ్యింది. అంటే లక్ష్యం సిద్ధించిందన్నమాట.

**"నేను అదియే", "అదియే నేను"**గా విలక్షణమైన సర్వసాక్షి అవ్వాలి. కాలత్రయాబాధ్యుడై భూత భవిష్యత్ వర్తమాన కాలములచేత బాధించబడనివాడు అయి ఉండాలి. అంటే భూతకాలం తలచుకొని దుఃఖించకూడదు, భవిష్యత్తు తలచుకుని ఆశ పడకూడదు, అవుతుందా లేదా? అనే ఆందోళన పడకూడదు, చివరికి వర్తమానంలో కూడా లేనివాడవు అవ్వాలి.

**భూతకాలం వద్దు ఆలోచనలు వద్దు, భవిష్యత్తు వద్దు ఊహలు వద్దు, నిత్య వర్తమానములో ఉండు** అని ఒకసారి చెప్పాం.

ఇప్పుడే మంటున్నారు? వర్తమానంలో కూడా ఉండకూడదు అంటే నీవు లేనివాడివి కావాలని అర్థం. త్రికాలాబాధ్యుడై, ఆ పరమ శివుడే, ఆ సద్గురువే, ఆ అశరీరి గురువే, ఆ దేశికేంద్రుడే, శివుడు అని ఎందుకంటున్నారు? **ఆ శివుడే గురు రూపమై, చెప్పకున్న ఎవ్వడెరుగు ఈ బోధ?** అన్నారు.

అందుకని ఆ పరమ శివుడే **'నేను'** అను భావము పొందెదనని సర్వదా మననము చేయవలెను. దీనివలన ఏమి అవుతావు అంటే, ఘన రూప అఖండ ఎరుక అవుతావు. మననం చేయడంవల్ల ఎరుకే ఉంటుంది. మననము, నిదిధ్యాస మానేస్తే, బయలు అవుతుంది. మననం చేస్తే ఏ వస్తువును నీవు మనం చేస్తావో ఆ వస్తు రూపం అవుతావు. అది ఎరుకేగా!

**'నమ శ్శివాయ'** అంటే **'య'** – ఆకాశబీజము, **'వా'** – వాయు బీజము, **'శి'** – అగ్నిబీజము, **'మ'** – జల బీజము, **'న'** – పృథ్వీ బీజము. పిండాండములో చెప్పినప్పుడు **'నమశ్శివాయ'**ను పంచభూతాలతో పోల్చి, పంచభూతముల యొక్క తత్వములలో నుండి క్రమక్రమముగా విడుదల చేసి, అది **'ఓం'**గా చెప్పాము. **'ఓం నమః శివాయ'** – ఈ సృష్టికి **'ఓం'** – కారణం కనుక, ముందుగా ఆ **'ఓం'**కారరూప బ్రహ్మ జ్ఞానము పొందాలి. ఇక్కడ **'ఓం'** అనేది ప్రక్కన పెట్టి, ప్రారంభంలో చెప్పినా, **'నమః శివాయ'** లోని ఐదు అక్షరాలు, **'ఓం'**తో కలిపి ఆరు అక్షరాలు అవుతాయి. ఐదు అక్షరాలతో పంచాక్షరి అన్నారు. ఈ పంచాక్షరిలో మంత్రము, మంత్రార్థము, మంత్రాతీతము ఉండాలి. మంత్రాతీతము అనేది ఎక్కడా అద్వైతంలో లేదు. **'మననాత్ త్రాయతే ఇతి మంత్రః'** – గురువుగారు ఉపదేశించిన మంత్రమును మననము చేస్తే, రక్షింపబడుతాడు. అని ఈ లక్షణాలతో మోక్షం వస్తుందో లేదో తెలియదు. కాని ఇక్కడ మంత్రాతీతము అన్నాము గనుక మననము మానాలి.

ఈ అచల సిద్ధాంతమునకు వచ్చేసరికి, ఇప్పుడు చెప్పే మంత్రము **'ఏ సాధన నీకెందుకు వీసానికి పనికి రాదు'** – అనే విషయంతో చెబుతున్నారు. కనుక ఎఱుక నుంచి విడుదల పొందాలి. **'ఓం'** లోకి వెళ్తే, **'ఓం'** కూడా ఎఱుకే కదా! ప్రణవము, నాదము, ఓం బిందువు – ఈ నమఃశివాయ అనేటటువంటిది కళలు. నాద బిందు కళలు. ఇప్పుడు ఆ పద్ధతిలో చెప్పడం లేదు. ఇప్పుడు ఏం చెబుతున్నాము అంటే, **'న'**కారము అనేటటువంటి బీజము వలన పంచ ప్రాణేంద్రియములు, పంచ కర్మేంద్రియములు పుట్టాయి. **'న'**కారము నుండి పుట్టినవి అంటే వీటికి **'న'**కారము సంకేతము. దీనికి రీసెర్చ్ అవసరం లేదు. అక్షరాలన్నీ కూడా

మంత్రాలతో కూర్చినటువంటి సంకేతాలు. **'న'** అనేటటువంటిది, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు, దశేంద్రియములకు సంకేతముగా చెప్పారు. **'మ'**కారము అనే బీజము వలన మనస్సు, **'శి'**కారము అనే బీజము వలన బుద్ధి, **'వా'**కారము అనే బీజము వలన దశ ప్రాణములు అంటే పంచ ప్రాణములు, ఉపప్రాణములు కలిపి దశ ప్రాణములు. **'య'**కార బీజము చేత సత్వ, రజస్తమోగుణములు వచ్చాయి. ఇప్పుడు ఇదికాదు, ఇది కాదు అనే నిరపేక్ష పద్ధతిగా మనం ప్రయాణం చేయాలి. కనుక ఇప్పుడు ఏమి చెయ్యాలి అంటే, పంచాక్షరి మంత్రం అనేటటువంటి **'నమఃశివాయ'**లో **'న'** అనేదానికి మంత్రార్థమేమంటే, దశేంద్రియములు. మంత్రాతీతము అంటే దశేంద్రియములను అధిగమించడము. దశేంద్రియముల యొక్క వ్యాపారమును, జ్ఞానమును, కర్తృత్వ భోక్తృత్వములను విడిచిపెట్టాలి.

**మ**కారము మంత్రము. మనస్సు మంత్రార్థము. మనస్సనే ఎరుక లేకపోవడము మంత్రాతీతము. **శి**కారము మంత్రము, బుద్ధి మంత్రార్థము. బుద్ధి అనే ఎరుక లేకుండా పోవడము మంత్రాతీతము. **వా**కారము మంత్రము, దశ వాయువులు. మంత్రార్థము. దశ వాయువు చలన పద్ధతి లేకుండా పోవడము మంత్రాతీతము. **య**కారము మంత్రము, త్రిగుణములు, త్రిపుటులు మంత్రార్థము. ఆ త్రిగుణములు, త్రిపుటులు లేకుండా పోవడము మంత్రాతీతము.

ఈ విధముగా ఇదంతా అతీత పద్ధతి. **ఓం**కారము మంత్రము. నాద బ్రహ్మము మంత్రార్థము, నిశ్శబ్ద బ్రహ్మ మంత్రాతీతము. ఈ విధముగా సకల ఎరుకలనుండి విడుదలై, అతీత పద్ధతిలో బయలై యుండుటే పరమపదము.

**సోహం హంసః శివః సోహం సోహం హంస దేవాయ నమః ॥** సోహం, సోహం అనేటటువంటి హంస నీ అంతఃకరణ ప్రతిఫల ప్రకాశముగా ఏదైతే ఉందో, నేను అదై ఉన్నాను అనేటటువంటి ఉనికిని చాటుకుంటూ, తనకు తానైనటువంటి ఉనికి స్ఫురణమాత్రముగా ఉన్నదేదో, అదీ సోహం. అంతకు మించి ఇక దిగలేదు. దిగితే అసత్య నేను అయిపోతుంది. అలా **శుద్ధ అంతఃకరణలో, ఒక ఐడియల్ కండిషన్‌లో, ఒక మానవదేహములోనికి వచ్చేసరికి, శుద్ధమైన చైతన్యము ఆ అంతఃకరణ ప్రతిబింబములో సోహం, సోహం, సోహం అని అజపా పూర్వకమైనటువంటి స్ఫురణ, తన ఉనికిగా తాను ఉన్నట్లుగా ఉండేటటువంటి స్ఫురణ. అదే సోహం జ్ఞానము.**

ఈ జ్ఞానము ఎవరిది అంటే హంసది. ఈ హంస నిజానికి శివ స్వరూపుడే. నిజానికి మహాకాశమే ఉంది. కుండలో చేరి ఘటాకాశమే తాను అనుకుంటున్నాడు. ఘటాకాశమే నేను అనుకునేవాడే, సోహం, సోహం అంటున్నాడు. మహాకాశంగా ఉన్నవాడు సోహం అని అనడం లేదు. వాడు శివుడే అయివున్నాడు. ఘట, మఠ, మహాకాశములను విచారిస్తే, ఘట, మఠాలు మిథ్యాసృష్టి వలన లోపల, వెలుపల అనేది కలిగింది కాని, నిజానికి మహాకాశమే స్వతఃసిద్ధమై, అన్ని కాలాలలోనూ ఉంది. అనంతమై ఉన్నది. ఘటాకాశ, మఠాకాశము వలె, పరిమితమై అనేకముగా లేదు. ఘటముతో సాపేక్ష జ్ఞానము లేదు. మఠముతో సాపేక్ష జ్ఞానము కూడా లేదు. మఠము అంటే సత్రము. సత్రము అంటే అనేక గదులు. అనేక గదులు కట్టకముందు అంతా ఆకాశమే. అనేక గదులతో కట్టినటువంటి సత్రము, దాంట్లో నిండి ఉన్నటువంటి ఖాళీ, మహాకాశమే అయినప్పటికి, మఠాకాశముగా పిలువబడుతోంది. అలా మఠాకాశముగా ఉన్న గదులకు వంటగది అని, హాలు అని, పూజగది అని, పడక గది అని పేర్లు పెట్టాము. ఈ మహాకాశమే శివుడు. ఆ శివుడనే నేను. ఈ సోహం అనేది హంసే. ఆ హంస ఎప్పుడూ ఉంది. అంతః కరణ ఉన్నప్పుడు ఏది 'సోహం' అనే అజపముగా ఉన్నదో అదే అంతఃకరణ లేనప్పుడు అట్టి అజపము లేకుండా పోవును. సోహం అనే అజపము ఉండదు. అదే శివస్వరూపము.

హంస అంటే ఏమిటంటే, **'హ'** అనే పురుషుడు, **'స'** అనే ప్రకృతి, **'0'** అనే లేనిదానితో కలిసి, మాయకారణముగా చిత్ జడములుగా ఏవి ఉన్నాయో అవి కలిసిపోయాయి. ప్రకృతి పురుషులు కలిసిపోయారు. శివ, శక్తులు కలిసిపోయాయి. దానికి సంకేతముగా **'హ'**, **'స'** కలిసిపోయాయి, దేని చేత అంటే **'0'** చేత. **'0'** అంటే ఏమీ లేదు. ఏమీ లేదనే దృష్టితో చూస్తే, సోహం అనే జ్ఞానం వచ్చింది. అహం, అహం అనే స్ఫురణ వచ్చింది. అహం అనేటటువంటి స్ఫురణ సత్యమా? అసత్యమా? సున్నతో కలిస్తే వచ్చింది కాబట్టి అసత్యమే. లేనెఱుకే. అహం అనే స్ఫురణ లేనెఱుకగా వచ్చింది.

నిజానికి మహాకాశము ఘటము చేత అవచ్ఛిన్నము కాలేదు. అలా ఉత్తబట్టబయలు ఏదైతే ఉన్నదో అదే పరమశివుడు. అది ఘటాకాశ, మఠాకాశాలుగా కాని, లోపల, వెలుపలగా కాని లేదు. క్రింద, పైన అని గాని, అష్ట దిక్కులుగా గాని, ఏ విధముగాను మారలేదు. కాని అసత్యమైనవి కల్పించబడితే ఆ విధముగా అనిపించేటటువంటివన్నీ వచ్చాయి సృష్టిలో. సృష్టి

మిథ్య గనుక దానికి విభాగములు లేవు. ఎందుకంటే కుండ తయారు కాకముందు పూర్వ అభావము, కుండ పగిలి పోయాక ప్రధ్వంసాభావము, కుండ మిథ్య గనుక, కుండ ఏనాడూ లేదు అంటే అత్యంత అభావము. అత్యంతాభావము అన్నప్పుడు మహాకాశమే అన్ని కాలాల్లో ఉంది. అది తప్ప రెండవది లేదు. ఈ మహాకాశ దృష్టాంతము తోటి, బట్టబయలే ముల్లు గ్రుచ్చ సందులేక, అంతటా నిండి నిబిడీకృతమై ఉంది అనేది ద్రాష్టాంతము.

బట్టబయలందు లేనెఱుక లేకుండా తోచింది. అది లేనిది కనుక, లేకుండా చేసుకుంటే బట్టబయలుకు ఏదోషమూ రాలేదు. లేనిదే ఉన్నట్లుగా తోచి, వాటి యొక్క కార్యక్రమాలు జరిగాయి. దాని వలన బంధము కలిగింది. దాని వలన సాధన చేశాము. దాని వలన బంధాన్ని తొలగించుకున్నాము. తరువాత ముక్తులయ్యాము. బట్టబయలుకు ఇవన్నీ తెలియవు. నిజానికి నీవే ఆ బట్టబయలై ఉన్నావు. ఈ సృష్టి స్థితి లయలు కాని, ఈ ఉపాధులతో ఉండడము కాని, ఈ ఉపాధులు లేకుండా ఉండడం కాని, ఇవన్నీ కూడా మాయాకల్పిత సృష్టిలో సాపేక్షంగా దానిని అనుసరించి చెప్పిన మాటలే ఇవన్నీ. సృష్టే లేదు అన్నప్పుడు ఏముంది? సంసారముందా? దుఃఖముందా? బాధ ఉందా? ఉపాధులున్నాయా? పంచభూతాలున్నాయా? తన్మాత్రలున్నాయా? అంటే కట్టకడపటికి ఇవన్నీ కూడా ఎఱుక సంబంధమే. ఎఱుకను పుట్టించే విషయమే. దీనిని హంస మంత్రము ద్వారా చెబుతున్నాము.

**దేవాయ నమః** – దేవ శబ్దము చేత ప్రకాశము యొక్క వ్యాపకత్వమును చెబుతున్నాము. పరమాత్మ ప్రకాశమే వ్యాపిస్తే **'దేవా'** అంటాము. ఏ ప్రకృతి శక్తిలో వ్యాపిస్తే ఆ ప్రకృతియొక్క చైతన్యం శక్తిగా రూపాంతరము చెందినప్పుడు అది దేవత అయ్యింది. ఆ దేవ అనే శబ్దంతో, దేవుడు, దేవత రెండూ వచ్చాయి. దేవుడు యొక్క శక్తి దేవత. వినాయకుడి యొక్క శక్తి సిద్ధి బుద్ధి. సృష్టి కర్త బ్రహ్మయొక్క శక్తి సరస్వతి. పోషక కర్త విష్ణువుయొక్క శక్తి లక్ష్మి. లక్ష్మి ప్రక్కకు తప్పుకుంటే విష్ణువు పరమశివుడే. పార్వతి ప్రక్కకు తప్పుకుంటే శివుడు పరమశివుడే. బ్రహ్మ నుండి సరస్వతి ప్రక్కకు తప్పుకుంటే ఆ బ్రహ్మకూడా పరమశివుడే. ఎందుకంటే ఆ ప్రకృతి శక్తివల్ల వాళ్ళు సృష్టి స్థితి లయలకు కర్తలయ్యారు. ఆ ముగ్గురమ్మల మూలపుటమ్మ అయినటువంటి ఆది పరాశక్తి లేకపోతే, ఈ త్రిమూర్తులు ఆ పరమశివుడితో సమానము. పరమశివుడే వీరయ్యాడు. మీరు కూడా మాయను దాటే సరికి ప్రతి ఒక్కరూ కూడా, సాధకులు, సచ్ఛిష్యులు అందరూ కూడా మాయను అధిగమిస్తే అంతా పరమశివ స్వరూపులే. వీరంతా అచల పరిపూర్ణులే. ఈ దేవ అన్నప్పుడు అది మాయావరణలో ప్రకాశిస్తూ ఉంది. ప్రకృతిలో ప్రకాశిస్తుంది. అందుకు **'దేవా'** అనే శబ్దము వచ్చిందపరి.

ఈ ప్రకృతి మూడు గుణాలే కదా! మూడు గుణాలతో ఉన్న ప్రకృతి లేనిది. మిథ్య కదా! అప్పుడు ఈ **'దేవా'** అనే ప్రకాశము ఎక్కడుంది? నేను ప్రకాశిస్తున్నాను అనేది, **'దేవాయ'** అంటే అర్థము. **నమః** – నేను లేనివాడిని. **మః అంటే నేను. ఉనికి, ఎఱుక. న అంటే లేదు**. ఎటువంటి ఎఱుక లేనివాడిని. వ్యాపకత్వంగా ఉన్నాను అనే ఎరుక లేదు. అంశగా లేనివాడిని. సోహంగా లేనివాడిని. శివుడుగా కూడా లేనివాడిని. ఎలా ఉన్నాడంటే, ఉన్నాను అనేటటువంటి ఎఱుక కూడా లేదు. అంటే బట్టబయలుగా ఉన్నాడు. ఈ ప్రణవాక్షరములలో నమఃశివాయ అనే ఐదు అక్షరములు ఉన్నవి. ఇవన్నీ కలసి శివశక్త్యాత్మకము అయినటువంటి పంచాక్షరి మంత్రము నమక మంత్రమని, శివగాయత్రి అని అంటారు. ఇది యజుర్వేదోక్తమైనది.

పరమశివుని పంచముఖములనుండి పుట్టి, పంచభూతాలైన పంచకర్తలకు, పంచ కృత్యములకు, పంచశక్తులకు, ప్రపంచమునకు, పంచగోత్రములకు, పంచసూత్రములకు మూడు అవస్థలకు ఆదియై, పంచ ప్రాణాధారమై, మోక్షప్రదమై, ఈ పంచాక్షరి వెలయుచుండును. ఈ పంచాక్షరిని విశ్లేషణ చేస్తే, క్రిందనుంచి పైకి వెళ్తే, పంచావస్థలకు ఆది అయ్యింది. ఆది అయ్యాక, పంచప్రాణాల మీద ఆధారపడింది. అన్నీ ఐదు ఐదులుగా ఉన్నాయి. పంచముఖములనుండి పంచభూతాదులై, పంచకర్తలతో సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశన వీరు పంచకర్తలు. పంచకృత్యములు అంటే సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణలు. పంచశక్తులంటే పరాశక్తి, ఆదిశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి. ప్రపంచము అంటే ఐదు ఐదులతో కూడినటువంటి పంచీకరణతో వచ్చిన ప్రపంచము. దీంట్లో ఏమి వచ్చాయి అంటే, పంచభూతాలు, పంచసూత్రాలు వచ్చాయి. ఋషి పరంపరలో, వంశాలలో, గోత్రాలలో ఐదు ఐదులుగా వచ్చింది. ఆపస్తంభ సూత్రామని కొన్ని సూత్రాలున్నాయి. కొంతమంది ఋషుల పేరుతో సూత్రాలున్నాయి. పంచావస్థలు, జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయము తురీయాతీతము.

తురీయాతీతము కూడా అవస్థక్రింద పెడితే పంచావస్థలు. నిజానికి పరిపూర్ణ బోధ వింటే తురీయాతీతమే బట్టబయలు. తురీయాతీతమే పరబ్రహ్మ. అది అచల పరిపూర్ణము అవునో కాదో తెలియదు కాబట్టి, దానిని కూడా అవస్థ అన్నారు. ఆదియై, పంచప్రాణాధారమై, మోక్షప్రదమై పంచాక్షరి వెలయుచున్నది. ఆది అంటే ప్రణవము. పంచ ప్రాణములు అంటే పంచ విశ్వప్రాణ శక్తి బీజములు అనగా మహత్తు. ఈ పంచాక్షరి నమఃశివాయ అనే ఐదు అక్షరములతోటి వెలయుచున్నది. పైన కొన్ని చెప్పాము. ఇంద్రియములని, మనస్సుని, బుద్ధి అని, దశవాయువులని, మూడుగుణాలని చెప్పాము. ఈ నమఃశివాయను సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన అనే పంచకర్తలుగా చెప్పవచ్చు. ఈ ఐదు అక్షరాలనే సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణ అనే పద్ధతిగా చెప్పవచ్చు. ఈ ఐదింటినే పరాశక్తి, ఆదిశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తులుగా చెప్పవచ్చు.

పంచప్రాణములు అంటే **అం యం రం వం లం** అనే ప్రాణ బీజములు. తురీయాతీతము ఎఱుక యొక్క అవ్యక్త స్థితి. తురీయము ఎఱుక యొక్క వ్యాపక స్థితి. ఈ అవస్థలు ఎఱుక యొక్క ఐదు విధాలైనటువంటి పరిమిత, అపరిమిత స్థితులు. పంచావస్థలు ఐదు కూడా ఎఱుకే. దానికి ఆధారము పంచసూత్రాలు. దానికి ఆధారము పంచభూతములు. దానికి ఆధారము ప్రపంచము. ఆ ప్రపంచము పంచభూతాలుగా, పంచ తన్మాత్రలుగా, పంచ స్థూల భూతాలుగా, చిత్ జడములుగా ఉన్నది. ఇవన్నీ ఎఱుకే. ఆ పంచశక్తుల వల్లనే కదా, ఈ సృష్టి అంతా జరిగింది. ఆ పంచశక్తులు మాయా శక్తులేగా! ఈ పంచశక్తులు బీజావస్థలో కలిసే వున్నాయిగా. ఈ పంచశక్తులు ఎలా వచ్చాయి? పంచకర్తల యొక్క పంచకృత్యముల ద్వారా, పంచశక్తులు ఆవిర్భవించాయి. ఆ పంచశక్తులు మాయా శక్తులు. దాని వలన కల్పించబడినది అంతాకూడా లేనెఱుకగా ఉంది. చైతన్యమన్నా ఎఱుకే, జడమన్నా ఎఱుకే. అందుకే **పిండ బ్రహ్మాండములు రెండూ, రెండు అహములు. ఈ నాలుగు కలిసి అఖండ ఎఱుక కనరా మాతండ్రీ!** అన్నారు. ఖండ ఖండాలుగా ఉన్నటువంటి అనేక జీవులు, జీవోపాధులు, జీవులలో ఉన్న అహంకారము, అలాగే సమష్టిగా ఉన్న బ్రహ్మాండమందు, సమష్టి అహంకారమైన ఈశ్వరుడు, అక్కడి అహము ఈశ్వర అహము. జీవోహములు, పిండాండములు, బ్రహ్మాండము. ఇవన్నీ కలిపి ఈ నాలుగు ఖండ ఎఱుకలు. ఒక్కొక్క ఖండ ఎఱుకలో, మళ్ళీ అనేకమైనటువంటి ఎఱుకలు ఉన్నాయి. ఆ విధముగా అఖండ ఎఱుకలో సృష్టి లేనప్పుడు, ఈ నాలుగు కలిసి, అవ్యక్తంలో మూల ప్రకృతిలో ఒకటిగానే ఉంది. ఒకటిగా ఉన్నా, అనేకముగా ఉన్నా, చైతన్యముగా ఉన్నా, జడముగా ఉన్నా, ఇవన్నీ కలిపి ఎఱుకే గనుక ఆ ఎఱుక లేనిది.

లేనెఱుకగా ఉన్న ప్రపంచము, ఈ ఐదు అక్షరములలో ఉన్నట్లుగా తోచుచున్నది. దీనిలో **'న'**కార, **'మ'**కారములలో సాకారము సగుణముగను, **'శి'**కారము, **'వా'**కారము అనునవి నిరాకారము, నిర్గుణము అయివున్నవి. మొత్తం ఐదు అక్షరాలలో రెండు అక్షరాలు తీసుకుని, ఆ రెండు సాకారము, సగుణమన్నారు. ఇంకోరెండు అక్షరాలు తీసుకుని, ఆ రెండు నిరాకారము, నిర్గుణము అన్నారు. సాకారము, సగుణము రెండు అక్షరాలు, నిరాకారము, నిర్గుణము రెండు అక్షరాలు. రెండు అక్షరములకు రూపము ఉండి, తక్కిన వాటికి రూపము లేకపోవుటకు కారణమేమనగా, **'న'**కార, **'మ'**కారములు రెండునూ కళ రహితమైన శిష్యునిగా ఉన్నవి. నిర్గుణముగా ఉన్నటువంటి **'శి'**కార, **'వా'**కారములు గురువుగా ఉన్నాయి. **'య'**కారము అసిపదముగా ఉన్నది. గురువు, శిష్యుడు ఒక్కటే. అజ్ఞాన దోషముచేత రెండుగా ఉన్నా, వేరుగా ఉన్నా వస్తు నిర్ణయముగా చూస్తే, గురువు శిష్యుడు వేరు కాదు. **'య'**కారము అసిపదము. ఈ అసిపదముచే గురుశిష్యులిద్దరూ అభేదము.

**'య'**కారము అసిపదానికి సంకేతముగా తీసుకున్నప్పుడు, మూడుగుణాల భేదాలన్నీ సమసిపోతాయి. కనుక సగుణానికి, నిర్గుణానికి కూడా ఈ అసిపదము కనెక్షన్ పెడుతోంది. ఎలా?

తత్త్వమసి వాక్యము ఎప్పుడూ కూడా వాచ్యార్థ, లక్ష్యార్థాలుగా ఉంటుంది. మాయావరణలో ఉన్నటువంటి ప్రకాశము ఏదో, లక్ష్యార్థముగా ప్రకాశము మాత్రమే తీసుకుని, మాయలో కల్పించబడినటువంటి ఇతర పదార్థాలను వాచ్యార్థముగా వదలివేస్తే, ఇతర అనుభవాలను విస్మరిస్తే, పంచావస్థలలో ఉన్నటువంటి ఎఱుకను నిరశిస్తే, నిరావరణ బ్రహ్మమందున్నటువంటి, స్వప్రకాశ స్వయంప్రభగా ఉన్నటువంటి ప్రకాశము తత్పదము. అదే ఇది. రెండూ ఒక్కటే. త్వం అన్నప్పుడు నీ మీద అప్లై చేసుకోవాలి. ఇదొకటి, అదొకటి కాదు. నీదేగా ఆ ప్రయాణం! నీవు మాయావరణలో ఉన్న ప్రకాశముగా ఉన్నావు. మాయావరణలో ప్రకాశముగా ఉన్న ప్రకాశ అనుభవము ఏదో, మాయావరణ దాటిన తరువాత కూడా, ఆ ప్రకాశము, ఈ ప్రకాశము ఒక్కటే. ఇక్కడ ప్రకాశమే లక్ష్యార్థము. ఆ ప్రకాశము స్వస్వరూప సాక్షాత్కార అపరోక్షానుభూతి. ఈ ప్రకాశమేమో తటస్థ లక్షణముగా

ఉన్నటువంటి సత్‌చిత్ ఆనందమనే ఎఱుకను కలిగియున్నది. ఇది లేనెఱుక కనుక వాచ్యార్థములో లేనెఱుకను విడిచిపెడితే, లక్ష్యార్థములో స్వయం ప్రకాశకుడు ఒక్కడే సత్యము. ఆనందము వాచ్యార్థములో విడిచినప్పుడు, లక్ష్యార్థముగా ఆనంద ఘనమవుతామని ఎవరు చెబుతున్నారు? **య**కార సంకేతముగా ఉన్న అసిపదము చెబుతుంది. కనుక మళ్ళీ తత్త్వమసి వాక్యము వచ్చింది. 'న'కార, 'మ'కారములు రెండూ నిష్కళ, జీవుడిలో ఉండేవి. నిష్కళవైపు ఉండే శిష్యుడు వాచ్యార్థమును విడిచిపెట్టినప్పుడు స్వయం ప్రభ అనే పూర్ణకళ అయ్యాడు.

గురువేమో ఆ పరమశివుడు. **'య'**కారమే అసిపదము. **'న'**కార, **'మ'**కారములు జీవుడుగాను, **'శి'**కార, **'వా'**కారములు ఈశ్వరుడుగాను, **'య'**కారము ఈ రెండింటి ఐక్యస్థానముగా, అసిపదముగా ఉన్నది. **'న'**కార, **'మ'**కారములు జీవుడుగా, **'త్వం'**గా, **'శి'**కార, **'వా'**కారములు ఈశ్వరుడుగా **'తత్'**గా, **'య'**కారము జీవేశ్వరుల యొక్క అభేదమును సూచిస్తోంది. జీవేశ్వరుల ఐక్యము ప్రణవముతో కూడినదే. ఐక్యత అనేమాట ఎప్పుడైతే చెప్పామో, అది ప్రణవానికే వాడబడింది. ఐక్యత అనేమాట ఎఱుకలోనే వాడబడింది. ఉత్తబట్టబయలులో ఏమీ లేదు. ఎఱుకలే అనేక రకాలున్నాయి కాని, బయలులో విభజన ఎక్కడుంది? అందుకని బయలులో ఐక్యత అనేమాట లేదు. అందుకే **గురుతెఱుక బాయెన్** అన్నాము. గురుడు శిష్యుండేకమాయను అన్నప్పుడు లేనెఱుకలో ఏకమయ్యారు. లేనెఱుకలో ఏకమైనప్పుడు, శిష్యుడికేమో ఉన్న ఎఱుకే, గురువుకేమో లేని ఎఱుకే, అయినప్పటికి, శిష్యుడు గురువులో మమైకమయ్యాడు. ఎప్పుడైతే మమైకమయ్యాడో, గురువు బయలు కనుక శిష్యుడు కూడా బయలే అయ్యాడు. ఐక్యమయ్యేదాకా ఎఱుకలో ఉన్నాడు. ఐక్యమైన తరువాత బయలైయ్యాడు. బయలయిన తరువాత ఐక్యత అనేమాట వాడకూడదు. **గురుడు శిష్యుడు ఏకమాయెను, కుడి ఎడమలు సమము ఆయెను**. గురువు శిష్యుడు అనేటటువంటిది లేదక్కడ. తరువాత కులము, గోత్రము లేకపాయెను. కుడి ఎడమలు సమమే ఆయెను, కులము గోత్రము అంటే, పైన చెప్పిన పంచసూత్రాలు, పంచగోత్రాలు. ఇవి లేకపోతే గురుతెఱుక బాయెన్. గుర్తుంటే ఎఱుకే. గుర్తులేక పోతే ఎఱుక లేదు. అంతా మర్చిపోతే, నిన్ను నువ్వే మర్చిపోతే ఎఱుకే లేదు. మరిచిపోతే మరలా జ్ఞాపకము వస్తుంది. మరచిపోతే చాలదు, నిరశించి, లేనిదని చెప్పి, దానిమీద రాగాన్ని, దానియొక్క అస్తిత్వమును వదులుకున్నప్పుడు ఏమీ లేనిదౌతుంది. అయినా జ్ఞాపకములో ఉన్నదానిని, జ్ఞాపకములోనుండి ఎలా తీసివేస్తారు? కష్టము కదా! ఎఱుకను మీ అంతట మీరు విడువలేరు. గురువు విడిపించాలి.

ఇది లేనెఱుక అని, నేతి, నేతి అని, ఇది కాదు, ఇది కాదు అని నిరశన చేసి ఉండగలరు. లేనెఱుకగా, మిథ్యాభావనగా, ఉండగలరు తప్ప, లేనిది లేకుండా ఎలా పోతుంది? స్థూలంలో పోగొట్టాలి, సూక్ష్మంలో పోగొట్టాలి. కారణ మహాకారణాలలో వాసనారూపంలో ఉన్నది, ఎప్పటికో మరలా జ్ఞాపకము వచ్చే అవకాశము ఉన్నది, ఎలా పోగొట్టుకుంటావు? ఏమీ లేదనే మిథ్యాభావన ఉంటుంది. గుర్తు వచ్చినప్పటికీ ఇది నిజమనే గుర్తుగా రాదు. గుర్తుతో పాటు, ఇది లేనిది అనేదికూడా ఉంటుంది. లేనిది అనేటటువంటి భావము కూడా ఎఱుకే. అయితే శిష్యుడు ఇంతవరకు రావాలి. **ఇది లేనిది, ఇది లేనిది, ఇది లేనిదని ఎరుకనెరిగి, ఇది ఉన్నది, ఇది ఉన్నది, ఇది ఉన్నదని బయలునెరిగి, ఆ ఎరిగిన రెండెరుకలను మానప్పా!** కాని ఎరుకను ఎవరూ మానివేయలేరు. కాబట్టి కనబడుతున్నప్పటికీ లేనిది అనే మిథ్యాభావము ఉంటే చాలు. ఆ కనబడేదానికి నీవు ఏ విధమైనటువంటి ప్రత్యేకత ఇవ్వకపోతే చాలు. నా భార్య, నా పిల్లలు, నావారు అనే ప్రత్యేకత పోతే చాలు. అసిపదము చేత, అన్నీ సమానముగా చేసుకుని, దేనికీ చర్చ లేకుండా చేసుకుంటే చాలు. ఆ ఎఱుక ఉన్నా నీకు ప్రమాదము కాదు. అంతవరకూ నీవు వస్తే, గురువు నీకు ఎఱుక విడిపిస్తాడు. గుర్తు అంటే అది. **గురుతెరుక బాయెన్**

**ఎరుకను విడిపించలేరెవ్వరు ధాత్రిన్, ఒక్కగురుండు తప్ప**

అట్టి గురువే అశరీరి గురువు, నిజ గురువు, దేశికేంద్రుడు.

గుర్తుంటే అది ఎఱుకే. ఇట్లా శిష్యుడనే గుర్తు, గురువు అనే గుర్తు ఉన్నాయి. ఈ బోధ, ప్రబోధ సమయంలో గురువు, శిష్యుడు, ప్రబోధ మూడూ ఉన్నాయి. ప్రబోధ యొక్క సమాప్తములో గురువు, శిష్యుడు ఏకమై, బయలందు ఏకమై, బయలుగా ఉన్నారు. ఏకమయ్యేదాకా ఎఱుకగా ఉండి, ఎఱుకలో ఏకమయ్యారు. గురువు బయలై ఉండడంచేత, శిష్యుడు కూడా ఎఱుక విడిచి, బయలై ఉన్నాడు. ఆ ఏకత్వ స్థితిలో ఇది గురుశిష్య ఉభయ రహితము. బయలు సిద్ధించింది. బయలు అందుకోగలరా? బయలును ఎవరూ అందుకోలేరు. నిరపేక్ష పద్ధతిలో ఎఱుకను వదులుకుంటూ పోతే, చివరికి ఏమి మిగిలిందంటే, ఏమీ మిగలలేదు. అదే ఉత్తబట్టబయలు ఏమీ లేదు.

ప్రణవముతో కూడినది అంటే, ప్రణవమే అఖండ ఎఱుక. అఖండ ఎఱుకలో భాగముగానే ఇవన్నీ ఉన్నాయి. మరియు ఆదిశక్తికి అవయవములుగా ఉన్నవి. ఈ జీవేశ్వరుల ఐక్యము, ప్రణవముతో సంబంధపడినటువంటి పంచాక్షరి. అయితే ప్రణవములో ఉన్న పంచాక్షరిని ఎంచుకున్నాము. 'నమఃశివాయ' అని ఎఱుకలో ఉన్న దానిని ఎంచుకున్నాము. ఈ నమః శివాయ కు సంకేతాలు ఇచ్చి, ఎఱుక ఏ రకముగా వచ్చిందో, దానికి ప్రతిక్షేపము చేశాము. లెక్కలలో ప్రతిక్షేపము అంటారు. అంటే కొన్ని సంకేతాలతో ఎక్స్, వై, జెడ్ లను పెడుతాము. చివరికి అసలు దానిని కనుగొని, మధ్యలో ప్రతి క్షేపించినవన్నీ తీసివేస్తాము. అలా పంచశక్తులు, పంచకృత్యాలు, పంచకర్తలను, పంచబ్రహ్మలను అన్నిటిని కూడా ప్రతిక్షేపించి, నిరశించాము. నిరశన పద్ధతిగా పోవాలంటే, **'న'**, **'మ'** అనే జీవస్వరూపము, **'శి'**, **'వ'** అనేటటువంటి ఈశ్వర స్వరూపము, **'య'**కారము రెండింటికి అనుసంధానము అయ్యింది. **'య'**కారమే హంసలోని పూర్ణము, సున్న. తత్త్వమసి వాక్యములోని అసిపదము. **హ** అంటే గురువు. **స** – అంటే శిష్యుడు అయినటువంటి జీవుడు **ం** సున్నా అంటే ఏమీ లేదు. **హంస** అనేసరికి గురు శిష్య ఉభయ రహితము. జీవుడిలోని ఎఱుకను నిరశించాలి, శివుడిలోని ఎఱుకను నిరశించాలి. **అసి** పదముతో గురుశిష్యులు ఒక్కటై, గురువనే గుర్తు, శిష్యుడనే గుర్తు లేకుండా **గురుతెరుకబాయెన్** లాగా అవ్వాలి. ఇక్కడ వాచ్యార్థాలనే కాదు లక్ష్యార్థాలను కూడా గురుకృపతో వదిలించుకోవాలి.

**ఓంకారే వదనా దేవీ । వా,య కారౌ భుజద్వయే ।**
**శి కారో దేహ మధ్యేచ । న,మ కారౌ పదద్వయే ।**
**పంచాక్షరీ పరావిద్యా । సతారా లింగ రూపిణి ।**

**ఓం**కారమే ఆ మాయాశక్తి యొక్క ముఖము. **వా, య** రెండు భుజాలు. రెండు చేతులు. **శి** కారో దేహ మధ్యేచ, పొట్ట అనేటటువంటిది వృక్షము యొక్క కాండముగా ఏదైతే ఉన్నదో, అది **శి**కారము. **న, మ** కారౌ పద ద్వయే. **న, మ** అనే రెండూ కలిపి క్రింది పాదాలు. **ఓం** అనేది వదనంగా ఇచ్చాము. **వా** య అనేవి భుజములుగా, **వాగ్భవ కూటమిగా** వ్రాశాము. మధ్యలో **శి** అనేది హృదయస్థానము. **న, మ** కారములు ఎడమ, కుడి, క్రింది పాదములుగా **శక్తి కూటమిగా** ఉన్నాయి. పంచాక్షరములు సర్వ దేహములయందు సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములకు ఆధారమై ఒప్పుచున్నవి. ఈ పంచాక్షరములే ఐదురకములుగా ఉన్నటువంటి అఖండ ఎఱుకే, వాటియొక్క తత్త్వాలతో కూడి, సృష్టికి దిగేసరికి, సృష్టికర్త బ్రహ్మ దగ్గర నుంచి, క్రిందివరకూ, పిపీలకాది బ్రహ్మపర్యంతము అన్ని దేహములయందు, అన్ని జీవులయందు కూడా, ఈ ప్రణవము ఓంకార రూపముగా, ప్రణవ రూపముగా, **ఓం**కారమే ముఖ స్థానముగా, **వా,య** కారములు రెండూ భుజములుగా, **న,మ**లు రెండూ పాదద్వయముగా, **శి** కారము హృదయముగా ప్రతి జీవియందూ కూడా ఆ ప్రణవము పనిచేస్తోంది. సర్వ దేహములయందు సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములకు ఆధారమై ఒప్పుచున్నది. ఈ ప్రణవ నాదమే. కనుక ఇటువంటి నాదాను సంధానము చేయాలి.

ఈ విధముగా ఏకత్వము సిద్ధించినప్పుడు, ఈ ఐదు రకాలైన విభజన కలుగజేసిన దానిని వాచ్యార్థముగా వదలాలి. కాని పెట్టుకున్నంత వరకూ, ఆ ఏకత్వం పొందలేదు. వాచ్యార్థములో ఈ విభజనను సూచించేటటువంటి దానిని **శి** కారములోని హృదయస్థానానికి చేర్చి, వాచ్యార్థమును నిరశించినప్పుడు, శికారమే ఉత్తబట్టబయలు ఏమీ లేదు అవుతోంది. ఎఱుకే విభజన చేసింది. ఎఱుక లేకపోతే విభజన ఎక్కడుంది? ఎఱుకే ఐదు రకాలుగా విభజన చేసింది. హృదయస్థానమును, హృదయాకాశమును, ఉత్తబట్టబయలుగా తీసుకుని, ఆ ఉత్తబట్టబయలులోకి మిగితా నాలుగు అక్షరముల యొక్క సంకేతాలను విభజనను, ఎఱుకను నిరశిస్తే, వాచ్యార్థము పోయి, లక్ష్యార్థమైన ఉత్తబట్టబయలే మిగులుతుంది. అప్పుడు అక్కడ **శి**కారము అనే గుర్తు కూడా ఉండదు. **గురుతెరుక బాయెన్**. హృదయస్థానముకు వెళ్ళాక **శి**కారము అనే గుర్తు వుంటే అది అద్వైతము. **శి**కారమనే గుర్తుకూడా తుడిచి వేస్తే, అది అచల సిద్ధాంతము. ఇదే అద్వైతానికి, అచలానికి ఉన్న భేదము. ఈ సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములన్నిటికి కూడా ఈ పంచాక్షరములే ఆధారముగా ఉన్నవి. లక్ష్యార్థము మిగిలితే అద్వైతము. లక్ష్యార్థము కూడా పోతే అచల సిద్ధాంతము.

పైన చెప్పిన 16 కళలు ఊర్ధ్వ అధోభాగములు. ఈ రెండు మార్గముల ద్వారా సంచారము చేయుచుండును. అంతా కూడా ఈ పదహారు కళలు గానే సంచారముంది. ఈ పదునైదు కళలు కూడా నిష్కళలో అవ్యక్తముగా ఉన్నాయి. నిష్కళారూపము శూన్యరూపముగా ఉన్నదాంట్లోనే, ఈ పదిహేను కళలు ఉన్నాయి. శూన్యరూపము, నిష్కళారూపముగా కనిపించిన దానినుండి ఈ సర్వమూ ఉత్పన్నమై ఉనికి కలిగియున్నవి. ఒక అల్మరాలో ఒక వస్తువో, ఒక పుస్తకమో పెట్టాలంటే, ఖాళీ ఉంటే పెడతావు. ఖాళీ లేకపోతే పెట్టలేవు. పుస్తకము పెట్టగానే ఖాళీ జరిగిందా? ఖాళీ యందు, ఖాళీలోనే పుస్తకము పెట్టావు. అలాగే శూన్యమందు, శూన్యములోనే సర్వమూ తోచింది. సర్వమూ, శూన్యములోనే ఉనికి కలిగివుంది. శూన్యముతోపాటు సర్వమూ ఉనికి కలిగివుంది. సర్వమూ ఉన్నా లేకపోయినా కూడా, శూన్యము ఎప్పుడూ ఉంది. అలాగే ఎఱుక ఉన్నా లేకపోయినా బట్టబయలు ఎప్పుడూ ఉంది.

బట్టబయలందు ఎఱుక సర్వముగా తోచి, ఆ ఎఱుకే శూన్యమై, ఎఱుక పోతే సర్వమూ శూన్యమైతే, ఈ బట్టబయలే సర్వ కాలాలలో ఉంది. బయలు ఎప్పుడూ శూన్యము కాదు, ఎప్పుడూ సర్వము కాదు. బట్టబయలు అంటే దేనికీ అవకాశం ఇచ్చేది కాదు. బట్టబయలు నిరాకాశము. బట్టబయలే స్వతఃసిద్ధము. బట్టబయలే అంతటా నిండి నిబిడీకృతమై ఉంది. బట్టబయలందు మరొక వస్తువు ఉండడానికి అవకాశము లేక ములుగ్రుచ్చ సందులేక ఉన్నది. లేనెఱుకే భ్రాంతి రూపంలో ఉంది అని లెక్కవేశాము. లేనెఱుకే మనలను బాధించి, జనన మరణాలకు తెచ్చి, దుఃఖపెడుతోంది. కాబట్టి నిజానికి దుఃఖమునకు కారణము లేనెఱుక. కనుక లేనెఱుకను, లేనెఱుకగా గుర్తించి, ఈ లేనెఱుకను నిజమనే ఎఱుకగా భావించక, భ్రాంతి రహితమై, గురుకృపతో, ఆ ఎఱుకను ఎప్పుడైతే విడిచామో, ఈ ఉత్తబట్టబయలు ఏమీ లేదు అని గురువు చూపించినప్పుడు, అదే పరమపదము. ఉన్నదానిని ఏమీ తీసేయటము లేదు. ఎటు తిరిగి అది లేనిదే కాబట్టి, వదలమంటున్నారు.

లేని దానిని వదలడమేమిటి? పట్టుకోవడం ఏమిటి? ఇది భ్రాంతిలోనే ఉంది, అది భ్రాంతిలోనే ఉంది. భ్రాంతిలో ఉండి చూస్తే, రెండూ నిజమే. కలలో ఉన్న కలపురుషునికి కల సత్యమే. కలలో జరిగిన కథ, కల ప్రపంచము అంతా నిజమే. కలలోని పురుషుడు మాత్రమే సత్యమై, కలలోని కథ, కల ప్రపంచము మిథ్య అంటే, మేల్కొంటే ఏమైంది? కలతోపాటు కలపురుషుడు కూడా లేడు. ఉదాహరణ: కలపురుషుడు గుఱ్ఱమెక్కి సముద్ర తీరానికి వెళ్ళాడు. కానీ జాగ్రదవస్థ పురుషుడు కాలు బెణికి, నడవలేని స్థితిలో ఉన్నాడు. జాగ్రదవస్థ పురుషుడు విశ్వుడితో పోల్చితే కలపురుషుడు మిథ్య. కల పురుషుడు లేనివాడు. కనుక శూన్యమే సర్వమునకు కల మాదిరి అవకాశము ఇచ్చింది. శూన్యము, సర్వమూ రెండూ కూడా కలవలె లేనివే. ఉత్త బట్టబయలు స్వతఃసిద్ధము.

మరొక పద్ధతిలో నిష్కళ ఏదైతే ఉన్నదో, అది మిగితా 15 కళలకు ఆస్కారమిచ్చింది. కనుక 15 కళలతో పాటు, 16వ కళ ఎప్పుడూ ఉంటుంది. అటు ద్వంద్వాల రూపంలో కళలు నిష్కళ కాకుండా, కేవల నిష్కళ స్వతస్సిద్ధమైతే అది బట్టబయలే. ద్వంద్వాలు లేకుండా సర్వ శూన్యాలే కాకుండా, కేవలము ఏమీ లేనిది ఒకటుంది. అదే బట్టబయలు. కనుక బట్టబయలు శూన్యం కాదు. ఆకాశము కూడా కాదు. చిత్ కళలకు ఊర్ధ్వముగా సంచరించినప్పుడు, విజ్ఞాన కళయని, అధోభాగమున సంచరించినప్పుడు, అజ్ఞాన కళయని, జ్ఞానాజ్ఞానములు మీరినప్పుడు నిష్కళయని అంటారు. ఈ షోడశ కళ అయినట్టి తురీయము ప్రత్యగాత్మకు స్థానము. అద్వైత సిద్ధాంతములో ప్రత్యగాత్మయే షోడశ కళ. ప్రత్యగాత్మయే షోడశ కళ కాదు. ప్రత్యగాత్మ షోడశ కళకు స్థానము.

15వ కళ ఉండడానికి 16 వ కళ స్థానము కల్పించింది. సర్వం ఉండడానికి శూన్యం కల్పించినట్లుగా, ప్రత్యగాత్మ అనే పూర్ణకళ ఉండడానికి నిష్కళారూపముగా ఉన్న బయలు అవకాశమిస్తుంది. విచారిస్తే కళలన్నీ మిథ్య కాబట్టి, అవకాశమిచ్చేది ఏదీ లేదు. నిష్కళగా తోచినప్పుడు అది శూన్యము. శూన్యమే సర్వము యొక్క ఉనికికి అవకాశమిచ్చింది. శూన్యం లేకపోతే సర్వం ఎక్కడుంటుంది? సర్వం రాగానే శూన్యము పోలేదు. కాని, నీ భావనలో అల్మరా ఖాళీలో వస్తువులు పెట్టగానే, ఇక ఖాళీ లేదు అంటున్నావు. నీ భావన అది. ఖాళీలోనే వస్తువుంది. ఖాళీ, వస్తువు రెండూ కలిసే ఉన్నాయి. శూన్యములోనే సర్వమూ ఉంది. సర్వమూ, శూన్యము రెండూ కలసే ఉన్నాయి. శూన్యము అనే నిష్కళ సత్యము కాదు. బయలు అనేటటువంటిదే సత్యము. అందుకని 16 కళలు లేనివే, కానీ షోడశ కళకు తురీయము, ప్రత్యగాత్మకు స్థానముండదు. ప్రత్యగాత్మ యొక్క ఉనికి, ప్రత్యగాత్మ ఏ చైతన్యము యొక్క అనుభవము పొందుచున్నాడో, అట్టి ప్రత్యగాత్మ ఉనికికి అవకాశమిచ్చినటువంటిది, ప్రత్యగాత్మకు స్థానం ఏదైతే చెప్పబడిందో, ప్రత్యగాత్మకు సచ్చిదానందానుభవము పొందడానికి అవకాశమిచ్చిందేదో, అది చిదాకాశము అవుతుంది. కనుక ప్రత్యగాత్మ స్థానము చిదాకాశము. ఇప్పుడా చిదాకాశము లేనిది గనుక ప్రత్యగాత్మ నిలిచేందుకు స్థానము లేదు. మూలము లేని ప్రత్యగాత్మ ఏమీ లేదు.

వాగ్భవ కూటమి అన్నారు. వాక్కు అంటే ఇక్కడ మాట్లాడడము కాదు. వాక్కు అంటే పరావాక్కు. పరావాక్కు, పశ్యంతీ వాక్కు, మధ్యమా వాక్కు, వైఖరీ వాక్కు అని ఉన్నాయి. సృష్టియొక్క నామరూప ప్రపంచమంతా కూడా వైఖరీ వాక్కు. పరావాక్కేమో అవ్యక్తాన్ని కదిలించి, వైఖరీ దాక క్రిందికి తీసుకువచ్చింది. వాగ్భవము అంటే, ఈ నాలుగు వాక్కులు పుట్టినవి. భవము అంటే రెండు అర్థాలున్నాయి. భవతి అంటే కలిగినవి, పుట్టినవి, అయినవి అని. జనన, మరణ చక్రాన్ని కూడా భవ అంటాము.

కనుక సృష్టి అంతాకూడా పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరిగా విశ్వమంతా కూడా బ్రహ్మాండ పిండాండాలుగా ఏర్పడ్డాయి. మానవులలో కూడా కారణములోనున్న వాసనలయందు పరాశక్తియొక్క ప్రేరణ ఫలితముగా చిత్తవృత్తి కలుగగానే పరావాక్కు పశ్యంతి వాక్కుగా మారింది. మనస్సు దగ్గర తన స్వభావమును, గుణమును, పూర్వ కర్మ నిర్ణయానుసారమైన దానికి ఒక ప్రక్రియ జరుగుతుంది. అది మధ్యమా. అంటే మధ్యమా వాక్కుగా మారింది. ఆ ప్రక్రియ చివరికి బుద్ధియొక్క నిర్ణయముగా ఎప్పుడైతే జరిగిందో, బుద్ధి నిర్ణయము దగ్గర వైఖరి. వైఖరి అంటే స్పష్టముగా తెలియబడుతుంది. బుద్ధి నిర్ణయించిన తరువాతే అది స్పష్టముగా తెలుస్తుంది. ఇక్కడ మధ్యమా వాక్కు వైఖరీ వాక్కుగా మారింది. మనసులో ఆలోచనలు కొంచెం తెలిసి, తెలియనట్లు ఉంటే అది మధ్యమా. పూర్వము తనకు తెలిసినదానితో క్రొత్తగా తెలిసినదానిని సాపేక్షంగా, విమర్శగా గ్రహించే ప్రయత్నం జరుగుతుంది. అదే మధ్యమా వాక్కు. అలా తెలిసిన దానిలో తనదైనటువంటి పూర్వజ్ఞానమునుబట్టి ఒక ఇంప్రెషన్, గుడ్ ఇంప్రెషన్, బ్యాడ్ ఇంప్రెషన్ ఎట్లానో, అట్లా ఒక ఇంప్రెషన్‌తో ఆలోచిస్తుంది మనస్సు. నిష్పక్షపాతముగా మనస్సు ఎప్పుడూ ఆలోచించదు. తెలిసిన దానినిబట్టి, తన అనుభవమునుబట్టి, మూడుగుణములలో ఉన్న స్వభావాన్ని బట్టి, రాగద్వేషాలు, స్వార్థాన్నిబట్టి, మనకు జరుగబోయే మేలు, కీడు ఇన్ని రకాలుగా మనసు ఆలోచిస్తుంది. ఆలోచన చివరికి వచ్చేసరికి బుద్ధి నిర్ణయిస్తుంది. బుద్ధి నిర్ణయాన్ని అనుసరించియే ఏదైనా జరుగుతుంది. ఈ చివరిది వైఖరి, అంతకు ముందుది మధ్యమా. చిత్తవృత్తులు రావడమే పశ్యంతి. కారణ శరీరంలోని వాసనలను ప్రేరేపించడమే పరా!

అలాగే పరాశక్తి మూలప్రకృతిగా ఉన్న విశ్వాండాన్ని ప్రేరేపించడము పరావాక్కు. విశ్వాండము బ్రహ్మాండముగా రావడము సూక్ష్మము. ఆ సూక్ష్మముగా రావడము పశ్యంతి వాక్కు. పిండాండముగా మారడము మధ్యమా వాక్కు. పిండాండము నామ రూపాలుగా సకల జీవరాశుల యొక్క ఉపాధులతోటి, జీవులతోటి, వ్యాపారము, వ్యవహారము, స్థూలరూపములో నటనలతో జరిగేదంతా వైఖరీ వాక్కు. ఈ నాలుగు స్థితులు సృష్టిలో ఉన్నాయి. జీవులలో కూడా ఉన్నాయి. ప్రతిచోట ఈ నాలుగూ ఉంటాయి. కనుక వాగ్భవ కూటమి అంటే, ఈ సృష్టికి సంబంధించినది. మానవులలో కూడా, మానవుని యొక్క కారణ శరీరము ద్వారా జరిగేది. సృష్టేమో మూలాప్రకృతి, మూలావిద్య ద్వారా జరిగేది. ఇంతవరకు ఇది వాగ్భవ కూటమి.

ఈ పాదద్వయము ఎప్పుడైతే వచ్చిందో, అది శక్తి కూటమి. శక్తి కూటమి అంటే పరాశక్తి, ఆదిశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి అనే పంచశక్తులు. ఆది శక్తి అనే రూపానికి, మిగిలిన నాలుగు శక్తుల ద్వారా నాలుగు అంచెల ఎరుక క్రమముగా వ్యాపకమవుతుంది. ఆదిశక్తి రూపుదైన బ్రహ్మయందు పరాశక్తి ప్రేరణ వలన ఇచ్ఛాశక్తి అనే సంకల్పము కలుగగా, జ్ఞానశక్తి వలన పంచతన్మాత్రలు పంచీకరణమై క్రియాశక్తి మూలమున నామరూప ప్రపంచము ఏర్పడెను.

పరాశక్తి ప్రేరణయే ఆ బ్రహ్మమందు పరావాక్కు. బ్రహ్మ సంకల్పమే పశ్యంతీ వాక్కు. పంచీకరణమే మధ్యమా వాక్కు. నామరూప జగత్తే వైఖరీ వాక్కు. ఈ విధముగా వాగ్భవ కూటమికిని, శక్తి కూటమునకు అనుసంధానమైనది. ఈ అనుసంధానము 'శి'కారము వలన కలిగినది.

పిపీలకాది బ్రహ్మ పర్యంతము కూడా, సర్వ దేహముల యందును, సృష్టి స్థితి లయ, అనుగ్రహ తిరోధాన పద్ధతిలో జరుగుతూ ఉంటుంది. ఏమి జరిగినా కాని, ఈ ప్రణవము, ఈ నమఃశివాయ అనేటటువంటిది ఆధారముగానే ఉంది. ఈ ఆధారాన్ని ముందుగా చెప్పుకుందాము. 'మ'కార బీజము వలన పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియముల యొక్క సమష్టి ఈశ్వరుడి దగ్గర, వ్యష్టి జీవుడి దగ్గర ఉంది. సమష్టిలో ఈశ్వరుడి దగ్గర జ్ఞానేంద్రియులు అన్నీ కూడా జ్ఞానశక్తిగా ఉన్నాయి. కర్మేంద్రియములు అన్నీకూడా క్రియాశక్తిగా ఉన్నాయి. అక్కడ జ్ఞానశక్తి, పిండాండము దగ్గరకు వస్తే జ్ఞానేంద్రియములు, అంతఃకరణ చతుష్టయము, అలాగే అక్కడ క్రియాశక్తి అంటే పిండాండములో పంచ ప్రాణములు, పంచకర్మేంద్రియములు. ఈ 'మ'కారము అనే బీజము వలన మనసు పుట్టి, ఈ మనసు కర్మేంద్రియములచేత పనిచేయిస్తే, జ్ఞానేంద్రియములచేత, శబ్దస్పర్శరూప రసగంధాలను గ్రహిస్తూ, ఆ మనోవ్యాపారము అలా జరుగుతూ ఉంటుంది. కర్మేంద్రియముల వలన జరిగిన పనికి కర్మఫలితము,

ఆ ఫలితములు సుఖదుఃఖములుగా అనుభవించడము, దాంట్లోనే ప్రతిష్ఠంభనగా రాగద్వేషాలు, కామక్రోధాలు, కర్మ చేయడానికి ఆధారముగాను, కర్మ అయిపోయాక కూడా కొన్ని స్పందనలు, ప్రతి స్పందనలు ఉంటాయి. ఆ స్పందన, ప్రతి స్పందనలతో కూడినటువంటి కర్మఫలితమే బంధము. కర్మకు స్పందిస్తే ఫలితము వస్తుంది. ఏ స్పందన లేకపోతే ఇంద్రియ స్పందన, మనః స్పందన, లేకపోతే చేయబడిన కర్మ వలన బంధముండదు.

'వా'కార బీజము, పంచప్రాణములు, ఉపవాయువులు. 'య'కార బీజము సత్వరజస్తమో గుణములతో కూడి, ఐదు బీజాలతో ఏర్పడి, సమస్త సృష్టి త్రిమూర్తులతో సహా ఒక పద్ధతిగా జరుగుతుంది అని చెప్పాము. ఇక్కడ ఇంకొక పద్ధతిలోనేమో, ఓంకారము వదనాదేవి అనే పద్ధతిలో చెప్పుకొచ్చాము. దీనిని మంత్రము, మంత్రార్థము, మంత్రాతీతము అనే పద్ధతిలో చెప్పినప్పుడు మంత్రాతీతము అనేది మామూలుగా లేదు. అద్వైతములో స్వరూప సాక్షాత్కారానికి, మంత్రము, మంత్రార్థముతో అపరోక్షానుభూతి ఉంది. అచల సిద్ధాంతము వచ్చేసరికి, మంత్రాతీతమందు అపరోక్షానుభూతిని కూడా బయలుగా మార్చివేయడముగా ఉన్నది. ఈ తిరోధానము క్రిందకి వచ్చేసరికి ఏమౌతుంది? మళ్ళీ పైన చెప్పినటువంటి పదునారు కళలు, ఊర్ధ్వ అధోభాగములు రెండూ రెండు మార్గములుగా వచ్చాయి.

పదహారు కళలలో ఏడు కళలు ఊర్ధ్వభాగములు. ఏడు లోకములు అయినవి. అధోభాగములో ఏడు కళలు ఏడు లోకాలైనవి. అధోభాగములో మానవ దేహములో ఉన్నవన్నీ జ్ఞాన కళలు. మానవుని యొక్క దేహంలో, పాదాలు, పిక్కలు, తొడలు, తొంటి నుంచి క్రింద దాకా అధోలోకాలు, తుంటి దగ్గర మూలాధారముతో మొదలు పెట్టి, పైన ఉన్న ఏడు చక్రములు, ఏడు లోకములు. మూలాధారము – భూలోకము. స్వాధిష్ఠానము – భువర్లోకము, మణిపూరకము – సువర్లోకము, అనాహతము – జనలోకము, విశుద్ధము – మహాలోకము, ఆజ్ఞా చక్రము – తపోలోకము, సహస్రారము – సత్యలోకము. అలా మానవ దేహములోనే పద్నాలుగు లోకాలున్నాయి. ఈ పద్నాలుగు లోకాలకు పద్నాలుగు కళలు. పూర్ణ కళా అన్నప్పుడేమో, సహస్రారములో జ్ఞానము. జ్ఞానము పొందటము అంటే అది పూర్ణకళ. పదిహేను కళలు లోక కళలు. 16వ కళ అలోక కళ. అలోక కళలో ప్రపంచము తోచినప్పటికి, దాని మీద మిథ్యాభావన కలగడము, లేకపోతే ప్రపంచమే తోచకుండా పోవడము జరుగుతుంది. ఈ అలోక కళద్వారా అన్యము తోచలేదో ఉన్నదున్నట్లున్నటువంటి బ్రహ్మసాక్షాత్కారము ఆవిర్భవిస్తుంది.

ఇక్కడ కళలను, లోకములను సమన్వయము చేస్తున్నాము. వేరే వేరే పాఠాలు ఒక చోటకు తీసుకువచ్చి సమన్వయము చేస్తున్నాము. నిష్కళ అనేది ఏదైతే ఉందో అక్కడ వ్యవహారము లేదు. కారణము నశించింది. కాని మహాకారణము అక్కడ ఉంది. ఆ మహాకారణమే ప్రత్యగాత్మ – తురీయము. ఇది తురీయానికి స్థానము. ఈ ప్రత్యగాత్మ తురీయస్థానము మహాకారణము కూడా. స్థూల సూక్ష్మ కారణములు దాటిపోయిన తరువాత తురీయములోకి వెళ్ళినప్పుడు అక్కడ మహాకారణము ఉంటుంది. ఆత్మ పరముగానేమో తురీయమంటే ప్రత్యగాత్మ. సృష్టి పరముగా తరీయము మహాకారణము. మహాకారణమే ఈశ్వరుడు.

ఈశ్వరుడికి మళ్ళీ స్థూలసూక్ష్మకారణాలున్నాయి. విరాట్ హిరణ్య గర్భ అవ్యాకృత అవస్థలు. ఆ అవస్థలు, ఆ శరీరాలు వాటికి అతీతమైనది, వాటికి సాక్షి రూపమైనది పరమాత్మ. ప్రత్యగాత్మ, మహాకారణము ఒక్కటే అయ్యింది. మహాకారణము ఈశ్వరుడు అన్నాము. ఈశ్వరుడులో మళ్ళీ మూడు అవస్థలు, మూడు శరీరాలు చెప్పాము. అక్కడ మరలా ఈశ్వరుని యొక్క తురీయస్థితి చెప్పాము. ఈశ్వరునియొక్క తురీయ స్థితే కేవలాత్మ. కనుక మహాకారణ శరీరానికి ఉన్నటువంటి లక్షణాలతో ఎవరైతే జీవుడిగా, అవస్థాత్రయ సాక్షిగా, తురీయంలోకి వెళ్ళాడో, వాడు అపుడు మహాకారణముగా ఉన్నాడు. వాడి పేరు ప్రత్యగాత్మ. రెండు పద్ధతులలో చెబుతున్నాము. ప్రత్యగాత్మ అంటున్నాము, మరలా మహాకారణము అంటున్నాము. ఈ మహాకారణము అనేది ఈశ్వరుని ఎఱుక. మహాకారణము ఈశ్వరుడు ఒక్కటయ్యారు. మరలా ఆ ప్రత్యగాత్మ, పరమాత్మ తురీయానుభవములో ఒక్కటే. అయితే ఈశ్వరుడు కూడా వ్యవహారము చేస్తున్నాడు కదా! సృష్టి, స్థితి, లయలు చేస్తున్నాడు, అనుగ్రహ తిరోధానాలు చేస్తున్నాడు. ఇవన్నీ మహాకారణములో జరుగుతున్నాయి. వ్యష్టి కారణములో జరగడం లేదు. అంటే, మహాకారణములో సమష్టిగా జరుగుతున్నాయి.

'అ'కార రూపుడైన తాను, 'ఉ' కారముతో కలియక, 'మ'కారమను బిందువుతో చేరి, చలనము లేక, అచల హంసయై, ప్రజ్ఞాన స్వరూపుడై, ఆత్మానాత్మలను విచారించి, ఆత్మయేదో, అనాత్మయేదో తెలుసుకుని, మహాకారణమే ఉపాధియై ఉండి, ప్రత్యగాత్మనే (ప్రత్యగాత్మ యొక్క ఉపాధి మహాకారణము) లక్ష్యముగా ఎంచగా, ఆ ప్రత్యగాత్మయై యుండేటటువంటి స్థితినే తురీయము అని చెప్పాము. తురీయము, ప్రత్యగాత్మ, మహాకారణము ఒక్కటిగా చేసేశాము. ఆ ప్రణవ బ్రహ్మము కమల మధ్యమందు ఉండును. మళ్ళీ ఈ కమలమెక్కడ?

సహస్రారములో వెయ్యి రేకులున్నాయి. వెయ్యి రేకులలో మళ్ళీ అక్కడ రెండవ దొంతరగా 8 రేకులున్నాయి. ఆ వెయ్యి రేకులను 8 భాగములు చేస్తే, అష్టదళ పద్మములో ఉన్న ఒక్కొక్క దళమునకు 125 దళాలున్నాయి. ఈ అవ్యక్తము ఎక్కడ ఉందీ అంటే, అష్టదళ కమల మధ్యమందు ఉంది. ఇదంతా షట్చక్రములు, హంస పద్ధతిలో ఉంటుంది. దీనిని అనుసరించేవారు తక్కువ. థియరీగా చెబుతున్నాము. యోగవాసిష్టలో భృశుండుడు అనే కాకి, యోగపద్ధతిలో చిరజీవి అయ్యింది అని చెప్పారు. భగవద్గీతలో కూడా 18 అధ్యాయాలలోను యోగము అనే మాట వాడారు. కాని, దానియొక్క వివరణ ఉత్తర గీతలో ఉంది. మరల యుద్ధము పూర్తైన తరువాత, అర్జునుడు ఆ బోధ నువ్వు చెప్పావు గాని, చెప్పినట్లు ఆచరించలేదు. ఇప్పుడు మోక్షం కోసము, ఆ భగవద్గీతను మరలా చెప్పమన్నాడు. యోగపద్ధతిలో చెప్పిందే ఉత్తర గీత. ఉత్తర అంటే తరువాత చెప్పింది అని అర్థము. పూర్వము అంటే ముందు చెప్పింది అని అర్థము. సాంఖ్య తారక అమనస్కాలలో, తారక పద్ధతిలో ఈ హంస యొక్క సంచారము కాని, కుండలనీలో మూలాధారము దగ్గరనుండి, సహస్రారము వరకూ, ఆ పైన ద్వాదశాంతము. సగుణ సాక్షాత్కారము ఇలాంటి పేర్లు ఎన్నో ఉన్నాయి. దాని తరువాత మండల త్రయము దాటటము, మండల త్రయమునకు అతీతముగా శింశుమారక చక్రము దగ్గర, ఈ మిథ్యా ప్రపంచము జీవేశ్వరులు అంతాకూడా ఏ మూలములో అయితే తోచిందో, ఆ మూలము దగ్గర చేరితే, ఈ తోచినది, తోచకుండా పోతుంది. లేనిదే ఉన్నట్లు తోచింది ఏదో, అది ఈ విధంగా లేనిది లేకుండా పోయేటట్లు చేసే స్థానము, శింశుమారక చక్రము. తోచుట అక్కడే. లేకపోవుట అక్కడే.

ఆ శింశుమారక చక్రమునుంచి కొంచెం దిగితే ప్రకాశబిందువు, విమర్శబిందువు వాటియొక్క కలయికలో మిశ్రమ బిందువు, ఈ మూడిటివలన మండల త్రయము. ఆ మూడు మండలాలు ఏ కోణములో, ఏ బిందువుగా వచ్చిందోమో ఆ త్రికోణాంతర్గత దీపికగా ఒక ప్రత్యగాత్మ, లేక సంవిత్ బిందువు ఈ నాల్గవ బిందువుతో కూడి బిందు చతుష్టయము నుంచి సృష్టి అవ్యక్తము అని చెప్పాము. ఈ బిందు చతుష్టయమునే ఆత్మ అనికూడా చెప్పాము. శింశుమారక చక్రమువద్ద సృష్టి మొదలయ్యింది. మహత్తులోని త్రిగుణాలు విజృంభించగానే సృష్టి మొదలయ్యింది. ఈ శింశుమారక చక్రమే మాయ ద్వారము. ఆత్మ అనేటటువంటి ఎఱుకతో సృష్టి మొదలైంది. ఎఱుక యొక్క అవ్యక్త స్థితియే ప్రణవము, ఆ ఎఱుకయొక్క వ్యక్త స్థితి ఓంకారము. అలాగే వ్యక్త స్థితి మహత్తు, మహత్తును అభిమానించేవాడు తోచాడు. ఆ తోచినవాడే మహదభిమాని లేక మహదహంకారము.

ఆ ప్రణవ బ్రహ్మము కమల మధ్యమందు ఉంటాడు. అష్టదళ పద్మము మధ్యలో ఉంటాడు. మధ్యలో అంటే రేకుల మధ్యలో ఉంటాడు. ఏ దుద్దుని ఆశ్రయించి, ఈ ఎనిమిది రేకులు ఉన్నాయో, ఆ దుద్దులో ఉంటాడు. ఆ పదహారు కళలు ఏవైతే ఉన్నాయో, అవి నాడుల ద్వారా దేహమంతా వ్యాపించి వున్నాయి. ఆ ప్రణవము చైతన్య స్థాయిలో ఘంటిక యందు చిన్నాద, చిద్బిందు, చిత్కళలుగా ఉంది. ఘంటిక అంటే, వెన్నుపూస ఏదైతే ఉన్నదో, క్రింది నుంచి పైకి, భూమా దగ్గర వెన్నుపూస యొక్క చివర ఉంటుంది. ఆ వెన్నుపూస యొక్క చివర నుండి అన్ని నాడులు కూడా ప్రారంభమౌతాయి. ప్రారంభమై, పైనుంచి క్రిందిదాకా వెన్నుపూస చుట్టూ జడలాగా అల్లుకుంటాయి. అల్లుకుని ఒక్కొక్క చక్రము దగ్గర, ఆ నాడి యొక్క మూలము అంటుకుని ఉంటుంది. అతుకు ద్వారా ఈ చక్ర ప్రభావముతోటి, అన్ని నాడులు పని చేస్తాయి. ఈ ఎఱుకనే హంస అంటున్నాము.

పదహారు కళలు ఉన్నాయి కదా! ఇవన్నీ హంస కళలు. హంసయొక్క పదహారు కళలు మానవుని యొక్క దేహములో, సకలనాడులలో నిండి వుంటాయి. అవి సుషుమ్నలో నెలవైయుండి, సుషుమ్న యందు వెన్నుపాములో సూక్ష్మ సుషుమ్న అంటాము. సుషిరము అంటే సూక్ష్మ రంధ్రము. సూక్ష్మ రంధ్రమునందు ఏమీ ఉండదు. శక్తి ఉంటుంది అంతే! కుండలినీ శక్తి, మాయాశక్తి ఉంటుంది. ఆ సుషుమ్నలో నెలవైయుండి, అదే శక్తి 72 వేల నాడులలోకి, ఉపనాడులలోనికి కూడా ఆ నాడులద్వారా దేహమంతటా కూడా హంస అనేటటువంటి ఎఱుక వ్యాపిస్తుంది. ఈ నాడుల పుట్టుక స్థానము ఘంటిక. నాడుల పుట్టు స్థానము, సుషుమ్న యొక్క పై భాగములో, ఆఖరున అంటే సుషుమ్న ఎక్కడినుంచి వెన్నుపాములో ప్రారంభమయ్యిందో, ఆ పుట్టినటువంటి చోటు పేరు ఘంటిక. ఘంటిక అనగా నాడుల ముడి.

హంస సహస్రారమందున్న అష్టదళ పద్మములో కదలక నిశ్చలమై యున్నది. దానిపేరు అచల హంస. అష్టదళ పద్మములో తూర్పు దళము, ఈశాన్య దళము, ఆ రెంటికి మధ్యలో, అనగా ఎనిమిది దళాలను 360 డిగ్రీలుగా విభాగము చేస్తే, దళానికి ఎన్ని డిగ్రీలుంటాయి? 45 డిగ్రీలు. తూర్పు దళానికి, ఈశాన్య దళానికి మధ్యలో 45 డిగ్రీలున్నాయి. ఆ నలభై

అయిదు డిగ్రీలను 22.5 డిగ్రీలుగా విభజన చేస్తే, తూర్పు ఈశాన్య దళములకు మధ్య, 22.5 డిగ్రీలతో ఒక స్థానము వస్తుంది. ఆ స్థానము నుంచే ఈ సహస్రారములో ఉండేటటువంటి అష్టదళ కమల మధ్యమున, ఉన్నటువంటి హంస, ఈశాన్యమునకు తూర్పునకు మధ్యలో 22.5 డిగ్రీల తేడాతో మొదలై, ఆజ్ఞాచక్రము దగ్గరకు వచ్చి కలుస్తుంది. ఆజ్ఞాచక్రమునకు ఆజ్ఞలు అందించబడుతూ ఉంటాయి. అందువలన దానికి ఆజ్ఞా చక్రమని పేరు.

ఆ ఆజ్ఞలను పంచకర్తలు పంచశక్తులతో కూడి అందుకుంటూ ఉంటారు. ఇక్కడ ఘంటిక అనేమాట మళ్ళీ వేరే ఎందుకు తీసుకువచ్చారు అంటే, ఇడనాడి, పింగళనాడి, సుషుమ్న నాడులు ఘంటిక స్థానము దగ్గర ప్రారంభమైనాయి. అచట నుంచి అంతర ఇడ, పింగళ, సుషుమ్న నాడులు అనేటటువంటివి కొంతదూరము వచ్చాయి. ఘంటిక అనేటటువంటిది ఏమంటే, మన కొండనాలుకకు పై స్థానము. కొండ నాలుక ఎక్కడైతే మన గొంతులో కనబడుతూ ఉందో, దాని వెనుక కొండనాలుకకు మూలస్థానం ఘంటిక. ఈ షట్చక్రముల సాధనలో, అమృతబిందువు ఆ కొండనాలుక స్థానం నుంచి ఘంటికల ద్వారా వస్తుంది అని అంటారు. ఆ అమృత బిందువును యోగి అయినటువంటివాడు పానము చేస్తాడు. దానివలన ఆయన ఆయుష్షు పెరుగుతుంది, ఆరోగ్యము పెరుగుతుంది. ఈ ఘంటిక ఎక్కడైతే మొదలయ్యిందో, అక్కడ అంతర ఇడ, పింగళ నాడులు వచ్చాయి. బాహ్య ఇడ, పింగళ నాడుల వలన శ్వాస ఆడుతుంది. అంతర ఇడ, పింగళ నాడులలో శ్వాస ఆడదు. కాని, శక్తి ఉంటుంది.

అంతర ఇడ నాడిలో చంద్రమండల ప్రభావము ఉంటుంది, అంతర పింగళ నాడిలోనేమో సూర్యమండల ప్రభావము ఉంటుంది. అందువల్లనే వీటిని చంద్రనాడి, సూర్యనాడి అంటారు. సుషుమ్న నాడిని అగ్నినాడి అంటారు. ఈ సుషుమ్న నాడిలో అగ్నిమండలము యొక్క ప్రభావము ఉంటుంది. మండల త్రయం దాటేటప్పుడు, ఆ మూడు మండలాల ప్రకాశముల యొక్క ప్రభావాన్ని ఈ మూడు నాడులు పంచుకున్నాయి. సహస్రారము దగ్గర అష్టదళ పద్మము యొక్క మధ్యమందు శ్వాస లేనందువలన అక్కడ కదలికలు లేవు. అందుకనే అది అచల హంస.

ఈ కదలికలు లేనందువలన, ఈ ప్రణవనాదము చైతన్యముతో కూడి ఉంది కనుక శ్వాసతో కలిసిన చైతన్యము, ప్రాణము అని పేరుమార్చుకుంటుంది. శ్వాసతో కలియక మునుపు అది చైతన్యము. శ్వాసతో కలిసిపోయాక అది ప్రాణము. చైతన్యమే స్థాన భేదాన్ని బట్టి, ప్రాణమయ్యింది. సహస్రారములో ప్రాణవాయువు యొక్క చలనము లేనందువలన అక్కడ అచలము ఉన్నది. కాని అక్కడినుంచి అంతర ఇడ పింగళ నాడులలో గాలి లేదు, ప్రాణవాయువు లేదు, అక్కడ నాదము వినబడదు, చైతన్యముతో కూడి ఉండుట వలన చిన్నాద, చిద్బిందు, చిత్కళలు అంటారు. ఈ త్రివిధములు విని, కనేవాడు మరియు ఈ వివరములు ఎవడైతే తెలుసుకుంటున్నాడో, వాడు సాంఖ్యుడు. సాంఖ్యుడు అంటే హంసే.

ఇది ఆగ్నేయమందు చేరి, ఆగ్నేయము అంటే ఘంటికాస్థానము, ఆజ్ఞాచక్రము దగ్గరకు వచ్చేసరికి స్థానభేదముచే ప్రణవము శరీరమంతా వ్యాపించుట వలన అన్ని స్థానములు ప్రణవాత్మకమే. స్థానభేదము చేత ప్రణవమునకు ఇన్ని పేర్లు. ఆ ఘంటిక స్థానము దగ్గర దానిపైన అష్టదళ పద్మ మధ్యమున, చిన్నాద, చిద్బిందు, చిత్కళలు ఉంటే, ఆజ్ఞాచక్రము దగ్గరకు వచ్చేసరికి, భ్రూమధ్య స్థానమునకు ఒక అంగుళము పైన ఫాలభాగమువద్ద అక్కడ ఉంటుంది ఆజ్ఞాచక్రము. అక్కడికి వచ్చేసరికి చైతన్యము ప్రాణముగా మారింది. ప్రాణము జడమే. చైతన్యముతో కూడే ప్రాణము చలిస్తోంది. హంస ఆగ్నేయమందు చేరి, నాద బిందు కళలుగా ఉన్నది. నాదబిందు కళలు అనేది ఆజ్ఞాచక్రము దగ్గర. సహస్రారములో అష్టదళ కమలము మధ్యమున ఉండునదేమో చిన్నాద, చిద్బిందు, చిత్కళలు. సహస్రార మధ్యమున చేరి, మరలా పైకి వెళితే, ఉకార, మకారములుగా ఉన్నది. అకారము లేదక్కడ. ఉకార, మకారములగా ఉన్నది.

ప్రణవస్థాన భేదముచే ఇది త్రివిధములుగా ఉన్నది. సహస్రారమందున్న ప్రణవము, ఘంటికయందు చేరగా, ప్రాణవాయువుతో కలియుటచేత, శబ్దము కలుగగా అది నాదబ్రహ్మము అయ్యింది. అంతర ఇడ, పింగళ నాడులు బ్రహ్మ దండికి (బ్రహ్మదండి అన్నా, వెన్ను పూస అన్నా ఒక్కటే) కుడి, ఎడమ పార్శ్వములనుండి హృదయము వరకూ వచ్చి, ప్రాణవాయువును తీసుకుని, ఊపిరితిత్తుల యొక్క కదలికచేత, వ్యాకోచము, సంకోచములచేత, ఆ బాహ్య ఇడ, పింగళ నాడిలో, ప్రాణచలనము కలిగింది. ఈ ప్రాణవాయువును కుడి, ఎడమ పార్శ్వములనుండి హృదయము అంటే ఊపిరితిత్తుల వరకూ వచ్చి, ప్రాణవాయువును తీసుకుని ఘంటికయందు ప్రణవ బ్రహ్మమును కలిసింది. మరలా వెనక్కు వెళ్ళింది. ఆజ్ఞా

చక్రమునుంచి క్రిందకు దిగి, హృదయ స్థానమునకు వచ్చి, హృదయస్థానము నుంచి మళ్ళీ పైకి వెళ్ళింది. పైకి వెళ్ళి, అక్కడ ఘంటిక దగ్గరకు వెళ్ళి, ఘంటిక యందలి ప్రణవ బ్రహ్మమును కలువగా, హృదయమునందలి ప్రాణవాయువునకును, ఘంటిక యందలి ప్రణవమునకును, సంబంధము కలిగినది. ఘంటిక సూక్ష్మశరీర సంబంధము. అచ్చటి మార్గము సూక్ష్మము. ప్రాణవాయువు అచ్చట విజృంభించుటకు వీలులేక, అష్టదళ పద్మ మధ్యస్థానమునందు ప్రాణవాయవు సంచారము లేకపోవుటచేత, అక్కడ ప్రణవము సూక్ష్మబ్రహ్మ నాదము అయ్యింది. అందుకే అది చిన్నాదము అన్నాము. ఆగ్నేయము దగ్గరకు వచ్చేసరికి, ఆజ్ఞాచక్రము దగ్గర నాడులు స్థూల దేహ సంబంధము అగుటచే విశాలముగా ఉన్నవి. విశాలముగా ఉండుట చేత ప్రాణవాయువు విజృంభించింది. అందువలన స్థూల నాద, బిందు, కళలు అయినాయి. కమల మధ్యమున ప్రాణవాయు సంచారము లేకపోవుట వలన, అది అనాహత శబ్దముగా నున్నది. అచటనుండి రావమును వినవలయును.

ప్రాణవాయువు మలిన ప్రకృతితో కలవటము చేత, కమల మధ్యమందున్న బ్రహ్మమందు యుండుట చేత, బ్రహ్మయుండే స్థానమునుకు మలిన ప్రకృతికి చేరదు. అక్కడికి వెళ్ళడానికి మలిన ప్రకృతికి సత్తాలేదు. అందువలన ప్రాణవాయువుకు అక్కడ సంచారము లేదు. అందువలన అది చిన్నాద, చిద్బిందు, చిత్కళలుగానే ఉంది. అక్కడ శుద్ధ వాయువు ఉంది. ఈ శుద్ధ వాయువు పేరే చైతన్యము. బాహ్య ఇడ, పింగళ నాడులలో ఉన్నటువంటి, వాయువులు స్థూల వాయువులు. ఇవి పరమాణు సముదాయముతో ఏర్పడినవి. దీనికి చలన గుణము ఉంది. పరమాత్మ ప్రకాశము, చైతన్యము, శుద్ధవాయువు అనేవి పర్యాయ పదాలు. ఆజ్ఞాచక్రమునకు, సహస్రారమునకు ఉన్న భేదమును చెబుతున్నారు. అక్కడైతే ఎలా ఉంది, ఇక్కడైతే ఎలా ఉంది అని.

ఆజ్ఞాచక్రం దగ్గర స్థూలదేహంతో సంబంధించిన నాడులతో, సంబంధము ఉండడం చేత, నాడులు వెడల్పుగా ఉండడం చేత, ప్రాణవాయువు అక్కడ విజృంబించుచున్నది. శుద్ధ వాయువు ఉన్నచోట, కేవల చైతన్యము ఉన్నచోట, ప్రాణవాయువు సంచారము లేకపోవటం చేత, అక్కడ వేయి హంసలు అజపముగా జరుగుచున్నది. ప్రణవము అనే సగుణ బ్రహ్మకు, వేణునాద వినోదుడు అనేపేరు కలదు. ఆ ప్రణవ స్థానములో, ఏ జీవుడైతే హంస రూపముగా అక్కడకు చేరాడో, అచల హంసగా ఉన్నాడో, వాడు స్థూల శరీరంలో ఉంటూ, సాధనచేత అక్కడకు వెళ్ళాడో, వాడు ఆ ఘంటికా స్థానములలో ఉన్నటువంటి, ఈ ఓంకారము నాద, బిందు, కళా రూపములో వ్యాపించి ఉండడంచేత, ఈ వెన్నుపూస ఒక మురళిలాగా, ఒక వేణువులాగా, డొల్లగా ఉండి, చక్రములలో ఆయా శక్తి కేంద్రముల దగ్గర, పైకి, క్రిందకి వెళ్ళే మార్గము ఉండడంచేత, ఆ వేణువును, ఆ మురళిని, ఎలాగైతే ఊదుతారో, దానిద్వారా ఎలాగైతే రకరకాల స్వరాలు బయటకు వస్తాయో, ఆ రకముగా సహస్రారమందున్నటువంటివాడు, వేణునాద వినోదుడిగా ఉండి, ఈ షట్చక్రాలు, ఈ ఆరు రంధ్రాలద్వారా, ఆరు శక్తి కేంద్రాలలో, ఈ జీవుడిలో జరిగేటటువంటి, వ్యక్తరూప నాద బిందు, కళలయొక్క శబ్దమును చక్కగా వింటాడు. వాడు శబ్దాలు చేయడు. కాని, శబ్దములను వింటాడు. అందుకే ప్రణవం అనే సగుణ బ్రహ్మకు వేణుగాన వినోదుడు అనే పేరు ఉంది. ఈ సగుణ బ్రహ్మను తెలిసి, ఆ నాద బ్రహ్మలో ఐక్యం అయిన వారే ముక్తులు. ఇదీ నాదానుసంధానము.

శంకారభరణములో "ఓంకార నాదానుసంధానమౌ గానమే, శంకరాభరణము" అని ఉంది. ఈ నాదమే శంకరుని యొక్క ఆభరణము. ఈ వెన్నుపాము అనేటటువంటి పిల్లన గ్రోవిలో, ప్రాణవాయువు సంచారము వలన, ఈ స్వరాలన్నీ వినబడుతూ ఉంటాయి. లాహిరీ మహాశయులు కూడా, క్రియా యోగములో నాదానుసంధానము గురించి ఆ నాదం అంటే ఏమిటో, దానియొక్క పరిచయం ఎలా ఉంటుందో, ముందు ఆ శక్తిని తనయొక్క శిష్యులలో ప్రవేశపెట్టి, ఎలా చేయాలో నేర్పుతారు. కొన్నాళ్ళు అభ్యాసము చేస్తే, ఆ నాదానుసంధానము జరిగి, షట్చక్రాలను ఒక్కొక్కటీ దాటకుండా, నేరుగా, ఈ అష్ట కమల మధ్యమందున్నటువంటి, అచల స్థానాన్ని చేరుతారు. అది లాహిరీ మహాశయులు, నాదానుసంధానము ద్వారా నాదవిద్య మనకు అందిస్తున్నారు. ఆ నాదబ్రహ్మములో ఐక్యము అయినవారే ముక్తులు.

సగుణ బ్రహ్మ, సురంధ్ర, సుషుమ్న అనే పిల్లన గ్రోవిలో, నాదమును పూరించగా, ఈ నాదము పిల్లనగ్రోవి గుండా బహిర్గతము కాగా, దానిని ఆనందించుటచే, ఆ సహస్రారములో ఉండే అచల హంసకు, వేణునాద వినోదుడు అనే పేరు కలిగింది. తాను కొండమీద వెళ్ళుదారిలో అంతర్వేదియందు ఆ వేణునాద వినోదుడు ఉన్నాడు. ఈ వేణునాద వినోదుడు పూర్తిగా అష్టదళ పద్మంలో లేడు. కొంచెం క్రిందికి వస్తే, సూర్యనాడి, అగ్నినాడి, చంద్రనాడి మూడూ ఎక్కడైతే కలుస్తాయో, ఆ త్రివేణీ సంగమము ఎక్కడైతే ఉన్నదో, అక్కడ అంతర్వేది అని ఒక చోటు ఉంది. ఈ అంతర్వేది బయట ప్రపంచంలో నరసాపురం

దగ్గర ఉంది. అక్కడ కృష్ణానది సముద్రంలో సంగమించే ముఖద్వారము. ఆ వేణుగానాన్ని పూర్తిగా సహస్రారములో ఉండే వినడు. కొంచెం క్రిందకు దిగితే అక్కడ ఆ స్థానమును అంతర్వేది అంటారు. కొండ అంటే ఏమిటి? ఆ సహస్రారమే కొండ. ఆ కొండమీదికి వెళ్ళే దారిలో అంతర్వేది ఉంది. ఆజ్ఞాచక్రానికి సహస్రారానికి మధ్యలో అంతర్వేది ఉంది. ఈ అంతర్వేది యందు ఆ వేణునాద వినోదుడు ఉన్నాడు. త్రివేణీ సంగమము బయట అలహాబాదువద్ద ఉన్నది. మనలో ఇడా పింగళ సుషుమ్నానాడులు కలిసేచోటు భ్రూమధ్య స్థానములో ఉన్నది.

అచల హంసను కారణహంస అనికూడా అంటారు. ఘంటిక యందు సూక్ష్మప్రణవముగాను, అక్కడ కారణ ప్రణవముగాను ఉంది. ఎక్కడైతే సూక్ష్మ ప్రణవము ఉందో, ఆ ఘంటిక చిన్నాద, చిద్బిందు, చిత్కళలు అన్నాము. ఎందుకని అన్నాము అక్కడ శుద్ధవాయువు నందు, ప్రకృతి యొక్క మాలిన్యము లేదు కనుక, అది శుద్ధ చైతన్యము అనబడుతుంది. అందుకని ఈ చైతన్యము వలన కలిగిన ఈ నాద బిందు కళలు, చిన్నాద, చిద్బిందు, చిత్కళలు అయినాయి. ఆగ్నేయమున స్థూల ప్రణవముగా నుండును. ఆజ్ఞేయమునకు ద్విదళ స్థానము అని పేరు.

ఆజ్ఞా చక్రము దగ్గర రెండు దళముల పద్మము, విశుద్ధ చక్రము దగ్గర 16 దళముల పద్మము. అనాహత చక్రము దగ్గర 12 దళముల పద్మము, మణిపూరక చక్రము దగ్గర 8 దళముల పద్మము. స్వాధిష్ఠానము దగ్గర 6 దళముల పద్మము, మూలాధారము దగ్గర 4 దళముల పద్మము ఉన్నాయి.

ఆజ్ఞాచక్రము దగ్గర ఉన్న ద్విదళ స్థానములో, ఒక దళము మీద 'హం' అని, రెండవ దళము మీద 'క్షం' అనీ ఉంటుంది. సహస్రారము నుంచి, శివశక్త్యాత్మకముగా ఉన్నటువంటి ఆ ప్రణవ స్వరూపుడి నుండి ఇతనికి ఆజ్ఞలు అందుతున్నాయి కాబట్టి, ఈ ఆజ్ఞలు అందుకునే స్థానాన్ని ఆగ్నేయమని, ఆజ్ఞా చక్రమని అంటారు. ఈ ఆగ్నేయమే ద్విదళ స్థానమని, వ్యవహార స్థానమని, ఇంద్ర యోనియని, ఓంకార గృహమని, శుద్ధ యోనియని, అనేక పేర్లతో ఉంది. ఒకే స్థలమునకు ఇన్ని పేర్లు ఎట్లా వచ్చాయి అనంటే, వాటియొక్క వ్యవహారమునుబట్టి, వృత్తి భేదమునుబట్టి, ఇన్ని పేర్లు చెప్పవలసి వచ్చింది. సంకల్ప, వికల్పములనెడివే, 'హం', 'క్షం' అనే ద్విదళములు. హం దగ్గర సంకల్పము, క్షం దగ్గర వికల్పము ఉంటుంది. సంకల్ప వికల్పాలు అనేవి రెండు ఉన్నాయి కాబట్టి, రెండు దళములు ఉండడంచేత, ఈ రెండు దళములు ఆజ్ఞేయమందుండి, ప్రపంచమును సృష్టించుటచే తన కర్మానుభవానికి, తనే ప్రపంచాన్ని సృష్టించుకుంటున్నాడు.

ఈ పంచకర్తలు ఆజ్ఞేయమందుండి, అచల హంస దగ్గరనుంచి, సహస్రారము దగ్గరనుంచి వచ్చే ఆజ్ఞలను, ఈ పంచకర్తలు స్వీకరించి, పంచకృత్యములు చేయుచున్నారు. ఆ ఆజ్ఞలను అందుకుని ఈ ఐదుగురు పంచకర్తలు ఆ ఆజ్ఞానుసారము, సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణ అనేటటువంటి పంచకృత్యములు చేయుచున్నారు. ఈ ఆజ్ఞేయమందుండి సర్వేంద్రియములతో, సకల పనులను చేయుటచేత, ఈ పనులు జరిగేదానికి, వ్యవహారమనే పేరు గనుక వ్యవహార స్థానము అనిరి. బ్రహ్మాది పంచకర్తలు, ఆజ్ఞేయమందు ఎల్లప్పుడు ఉండుటచేత, బ్రహ్మాదులు అన్నారు కాబట్టి వారి పేర్లు, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానులు. వేరే సందర్భములో వారే సదాశివ, ఈశ్వర, బ్రహ్మ, విష్ణు, రుద్రులు పంచకర్తలు. వీరు చేసే పంచకృత్యములు ఏమిటంటే, సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణలు. ఈ సర్వేంద్రియములతో సకల పనులు చేయించుచున్నారు. మూలములో ఐదులుగా చెప్పినా కానీ, ఇది స్థానభేదము చేత, షట్చక్రాలలో ఉన్నటువంటి, ప్రారబ్ద సంస్కారముల యొక్క కదలికచేత, దళముల కదలికచేత, ప్రారబ్ద కర్మ అనుభవించబడుతుంది. కదలికలు, ప్రేరణలు, ఇవన్నీ ఒకే ఒక్క అంతర్యామియొక్క సత్తాచే జరుగుచున్నవి.

బ్రహ్మాది పంచకర్తలు, ఆజ్ఞేయమందు ఎల్లప్పుడు ఉండుట చేత, ఇంద్ర యోని అనిరి. ఈ పంచకర్తలు మొట్టమొదట వచ్చినటువంటి అధిష్ఠాన దేవతలు. సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణలకు అధిష్ఠాన దేవతలు. కనుక వీరి తరువాత అనేకమంది ముక్కోటి దేవతలు వచ్చారు. ఈ దేవతలకు రాజు ఇంద్రుడు. వీరి పంచకృత్యముల చేత ఈ సృష్టి జరుగుతోంది కాబట్టి, సృష్టికి మూలము మూలావిద్య కనుక ఆ మూలావిద్యకు యోని అని పేరు. అధిష్ఠాన దేవతలు సృష్టికి మూలమైతే, ఆ అధిష్ఠాన దేవతలలో శ్రేష్ఠుడు ఇంద్రుడు. ఆ ఇంద్రుడు అనేటటువంటి సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణలుగా జరిగే సృష్టి అక్కడినుంచీ మొదలైంది కాబట్టి అది యోని స్థానము. అక్కడ ఇంద్రుడు అనే దేవత ఉండటము వలన ఇంద్రాణి సృష్టికి మూలము అవ్వడము వలన ఈ ఆగ్నేయానికే ఇంద్ర యోని అని పేరు వచ్చింది.

ప్రణవము ఆగ్నేయమందుండి, ఈ నాదబిందు కళలతో కూడి, ఆగ్నేయము దగ్గరకి వచ్చేసరికి, చిన్నాద చిద్బిందు, చిత్కళలుగా కాకుండా, కేవలము నాద బిందు కళలుగా స్థూలరూపములో ఉంది. ఈ నాదబిందు కళలతో కూడి దివారాత్రములు ప్రణవ ధ్వని ఘోషిస్తోంది. రేయింబవళ్ళు ఈ నాదబిందు కళలతో కూడి ఒక ప్రణవ ధ్వని ఘోషిస్తోంది. ప్రణవము నాదరూపముగా ఉండి, ఇక్కడికి వచ్చేసరికి ధ్వని రూపముగా మారింది. ఈ ధ్వని ఎట్లా ఉంది? అకార, ఉకార, మకార రూపముతో కూడి ఉంది. అ, ఉ, మ. అనేటటువంటి ధ్వని ఇది. దీనిని ఓంకార ధ్వని అంటాము. సూక్ష్మముగా ఉన్నప్పుడు నాదము, స్థూలముగా ఉన్నప్పుడు ధ్వని అన్నాము. సూక్ష్మముగా ఉన్నప్పుడు ప్రణవనాదము అని, స్థూలముగా ఉన్నప్పుడు ఓంకార ధ్వని అని అంటాము. సూక్ష్మముగా ఉన్నప్పుడు అచల స్థానము అన్నాము. ఘంటికా స్థానము అన్నాము. పూర్తిగా అచల స్థానము కాకుండా కొంచెము దిగువకు వచ్చి, అంతర్వేది అనే స్థానము దగ్గర, చిన్నాద, చిద్బిందు, చిత్కళలు అన్నాము. అక్కడ మలిన ప్రకృతి యొక్క ప్రవేశము లేదు. శుద్ధ వాయువే చైతన్య రూపంలో ఉంది కాబట్టి, చిన్నాద, చిద్బిందు, చిత్కళలు అన్నాము. ఆ అంతర్వేది అనే స్థానమువద్ద దగ్గరికి వస్తే, ఇది బాహ్య ఇడ, పింగళ నాడుల ద్వారా ప్రాణ వాయువు యొక్క సంచారాన్ని కలిగివుంది కనుక స్థూలదేహమంతా వ్యాపించి ఉన్నటువంటి, స్థూల నాడులతోటి సంబంధము పెట్టుకుంది కాబట్టి, స్థూల నాద బిందు కళలుగా తోస్తున్నాయి. ఆజ్ఞేయము నుంచి, ఈ స్థూలనాద బిందు కళలతో కూడి, రేయింబవళ్ళు ఆ ప్రణవము ధ్వనిరూపముగా మారింది. ఈ ప్రణవ ధ్వని పేరే ఓంకారము. ఈ ధ్వని అక్కడ ఘోషించుచున్నది కనుక ఓంకార గృహము అనిరి. కనుక ఈ ఆజ్ఞాచక్రమునకు ఓంకార గృహము అని పేరు.

సిద్ధ దేవతలంతా ఇక్కడ రమించుట వలన సిద్ధిపొందినటువంటి దేవతల స్థానమది. వాళ్ళు మనని ప్రేరేపిస్తూ, మన అజ్ఞానంలో మన కర్మలను అనుభవించేటట్లు చేస్తున్నారే కాని, వారు ఆ కర్మ పద్ధతికి, కర్మ ప్రపంచానికి, కర్మ వివరాలకు ఎటువంటి సంబంధము లేకుండా, మంచికి, చెడుకి, జ్ఞానానికి అజ్ఞానానికి ఇంద్రియములకు, మనోబుద్ధులకు సంబంధించి కేవల ప్రేరణాశక్తులుగా ఉన్నారు. కాబట్టి వారు సిద్ధులు.

స్పందింపజేసేటటువంటి లక్షణము కలిగియున్నప్పటికీ, వారిలోని అంతరాత్మ తనలో తాను రమించేటటువంటి బ్రహ్మానందములో ఉంటుంది. సిద్ధుల స్పందన ఎక్కడనుండి అందుతుందో ఆ స్థానము పేరు సిద్ధయోని అనిరి.

సహస్రార కమలమందుండి, సహస్రార కమలమందున్నటువంటి చిత్ శక్తి, చైతన్యంలో ఉన్నటువంటి శక్తి దిగి వచ్చి, సర్వక్రియలు చేయించుటకు, పంచకర్తలను ఆజ్ఞాపించు స్థలమగుట చేత, దీనిని ఆజ్ఞేయ మనిరి. ఆజ్ఞలు ఇక్కడ లేవు, అంతర్వేది నుండి వస్తున్నాయి. ఇక్కడ ఆజ్ఞలన్నీ కూడా అందుకుంటున్నారు. పంచకర్తల స్థానమే, వారు పై నుంచి ఆజ్ఞలు అందుకుని, ఆ ఆజ్ఞల ప్రకారముగా ప్రవర్తిస్తున్నారు. పంచకృత్యములు చేస్తున్నారు కనుక దానిని ఆజ్ఞేయము అన్నారు. ఆజ్ఞలు అందుకుని సగౌరవముగా, పంచకృత్యములు. సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణలు చేస్తున్నారు. కాబట్టి దానికి ఆజ్ఞేయమని, ఆజ్ఞాచక్రమని పేరు.

ఒక ప్రారబ్ద కర్మ అనుభవిస్తూ కూడా ఆగామి కర్మ చేయనివాడు ఎవరైతే ఉన్నారో, వారి విషయంలో ఇవి షట్చక్రములు కాదు. షట్కమలములు. అంటే, అక్కడ గిరగిరా తిరుగుతూ ఉండేచక్రము ఎప్పుడైతే ఆగిపోయిందో, అది కమలమయ్యింది. ఆత్మజ్ఞానములో ఉన్నవాడికి, జీవన్ముక్తులకు శరీర ప్రారబ్దము ఉంటుంది కదా! ఈ దళముల యొక్క కదలికచేత శరీర ప్రారబ్దము తనచేత అనుభవింపబడుతుంది. కాని జీవన్ముక్తుడు అసంగుడు. అజ్ఞానికి ఇవి విసిరి, విసిరి కొడుతున్నట్లుగా, అతన్ని చలింపచేస్తూ ఉంటే, కొన్ని పనులు చేయకుండా ఉండలేను, ఆపుకోలేను, నిగ్రహించుకోలేను, అనే పద్ధతిలో ప్రేరేపిస్తుంది కాబట్టి దానిని చక్రము అని అన్నారు. చక్రములకు, కమలములకు ఉన్న తేడా అది.

**పుణ్యపాప కర్మ విచారణ**

అష్టదళ పద్మములోని ఎనిమిది దళములయొక్క కదలికలచేత మానవుడిలో ప్రేరణలు కలిగి, ఆ మానవుడు అనుగుణమైనటువంటి కర్మలను చేస్తూ ఉంటాడు. ఈ పుణ్య పాప కర్మల విచారణ ఎలా ఉంది? అంటే,

**శ్లో॥ పూర్వ దళే పుణ్యమతి, ఆగ్నేయే నిద్రాలస్యం, దక్షిణే క్రూరం,**
**నైఋతి పాపం, పశ్చిమే క్రీడాశక్తిః, వాయువ్యే గమనం, ఉత్తరే రతిప్రీతిః**
**ఈశాన్యే ద్రవ్యదానం, మధ్యే వైరాగ్యం, కేసరే జాగ్రత్తః, కర్ణికాయాం స్వప్నం**
**లింగే సుషుప్తిః, పద్మత్యాగే తురీయం**

ఈ ఎనిమిది దళములకు మధ్యలో కేసరము ఉంది. ఈ కేసరములు ఎక్కడైతే పుడుతాయో అక్కడ కర్ణిక ఉంది. ఈ కర్ణికకు అడుగున లింగము ఉంది. ఆ లింగమును పట్టుకుని ఒక ఆకుపచ్చని తొడుగు ఉంటుంది. మందారపువ్వును చూడండి, క్రింది నుంచి కాడ ఉంటే, ఒక ఆకు పచ్చ తొడుగు పువ్వును పట్టుకుని ఉంటుంది. లింగ స్థానమునంటి కర్ణికా స్థానముగా, ఆ కర్ణికనుండి కేసరములు, దాని ప్రక్కనుంచి చుట్టూ అష్టదళములు ఉంటాయి. ఆకాడ చివర ఆకుపచ్చగా ఈ పువ్వును పట్టి ఉంచిన దాంట్లో ఒక ఖాళీ స్థలము ఉంటుంది. అంటే ఈ పద్మము ఇన్ని రకములుగా వర్ణించబడినది ఆ ఖాళీలో ఉండదు. అందువలన దానిని పద్మత్యాగము అంటారు.

హంస ఈ పద్మముయొక్క అన్ని భాగాలమీద సంచరిస్తూ ఉంటుంది. హంస సంచారము వలన దళములు కదులుతూ ఉంటే, హంస ఆ కదలిక వలన ప్రేరణను పొందుతూ, తదనుగుణముగా కర్మ చేస్తూ ఉంటాడు. జీవుడే హంస. భ్రూమధ్య స్థానంలో ఉన్న, జీవుడి యొక్క వ్యవహార స్థానములో, తను చేయవలసినటువంటి ఒక వ్యవహారమునకు ఈ ప్రేరణ అందుతుంది. తూర్పు వైపు ఉన్నటువంటి రేకు యొక్క కదలిక వలన, పుణ్యం చేయాలి అనిపిస్తుంది. అటునుంచి ప్రదక్షిణ చేయండి. ప్రదక్షిణ కుడిప్రక్కనుంచి చేయాలి. మీ కుడిచేతి వైపు చూస్తే ఆగ్నేయ దళము. అది కదలితే అక్కడ నిద్రపోవాలని, విశ్రాంతి తీసుకోవాలని, బద్ధకముగా ఉండాలనే ప్రేరణ కలుగుతుంది. దక్షిణ దళము కదలితే ఊరక ఉండకుండా ఏ చీమనో, దోమనో, ఇంకా పెద్దవి పక్షులనో, దేనినో దానిని హింసించాలని అనిపిస్తుంది. అకారణముగా చంపాలని అనిపిస్తుంది. క్రూర స్వభావము ప్రేరేపించబడుతుంది. నైఋతి దళము కదిలితే, పాపము చేయాలని అనిపిస్తుంది. పశ్చిమ దళము కదిలితే క్రీడలయందు ఆసక్తి కలుగుతుంది. వాయువ్య దళము కదిలితే ప్రయాణం చేయాలని అనిపిస్తుంది. తీర్థయాత్రలు చేయాలని అనిపిస్తుంది. ఉత్తర దళం కదిలితే రతియందు ప్రీతి, శృంగారం చేయాలని అనిపిస్తుంది. ఈశాన్యమున ఉన్న దళము కదిలితే ద్రవ్యమును దానము చేయాలని అనిపిస్తుంది. తన దగ్గర ఉన్నటువంటి వస్తువులు, బట్టలు, నగలు తనకు అవసరం లేనివి, తనకు కావలసినవి కూడా కొన్ని త్యాగంచేసి అయినాసరే, ఎవరికైనా దానధర్మాలు చేయాలని అనిపిస్తుంది.

ఆ దళములలో ఎప్పుడూ కూడా ఒకే దళము కదలదు. దళములు ఒక్కొక్కటిగాని, రెండు రెండుగాని కదులుతుంటే, మిగితావి కదలకుండా ఉంటాయి గనుక మానవుడు రోజూ ఒకే పనిలో ఉండడు. ప్రతిపూట ఆడుతూ ఉండడు. ప్రతీపూటా పుణ్యం చేయడు. ప్రతి పూటా పాపం చేయడు. దళముల కదలికలనుబట్టి ఆయా పనులలో ఉంటాడు.

దళ మధ్యమున వైరాగ్యముంది. అక్కడికి చేరిన హంసకు వైరాగ్యము కలుగుతుంది. ఈ దళాలన్నిటిలో ఒక మధ్య స్థానము ఉంది. ఇంకా దుద్దులు చేరలేదు. దుద్దు చుట్టు ఉన్న మధ్య స్థానానికి వెళ్ళాడు. దళములు ఒక పువ్వు యొక్క దుద్దును పట్టుకుని, ఎనిమిది ప్రక్కల ఎనిమిది దళాలు విస్తరించి ఉంటాయి. దళము యొక్క కొనయందేమో కదలిక ఎక్కువగా ఉంటుంది. దుద్దు దగ్గర మూల స్థానములో కదలిక తగ్గుతుంది.

ఇక్కడ హంస సంచారము చెబుతున్నాడు. ఈ జీవుడనేటటువంటి హంస, ఆ దళముల యొక్క కదలికల వల్ల, ఆ దళము మీద ఉండి తాను కదులుతూ ఉంటే, దళముల యొక్క కదలిక తనను ప్రేరేపిస్తే, హంస అనే జీవుడు కదులుతున్నాడు. దళముల యొక్క కొన స్థానమునకు కాకుండా, దళముల యొక్క మూల స్థానానికి వెళ్తే, కదలకుండా వైరాగ్యములో ఉంటాడు.

కేసరములు ఎక్కడినుంచి పుట్టుకొస్తున్నాయో, అక్కడ ఒక చిన్న దుద్దు ఉంటుంది. ఆ దుద్దు స్థానాన్ని, ఆ దుద్దుయొక్క వ్యాపక స్థితిలో ఎన్ని కేసరాలు ఉన్నాయో అన్ని ఖండాలతో, వాటి యొక్క మూలమును, వాటి కుదురును కలిగినటువంటి దానిని కర్ణిక అంటారు. ఆ కర్ణిక క్రింద బంతిపూవు రేకులన్నీ తీసేస్తే, అక్కడ తెల్లని కర్ణిక ఉంటుంది. ఈ కర్ణికలోనే రేకులు గుచ్చబడి ఉంటాయి. స్థిరముగా ఏ ఖండములు లేకుండా ఉండేది దుద్దు. ఆ దుద్దు అడుగున ఖాళీ స్థలము, కేసరములందు హంస గనుక అక్కడికి చేరితే, జాగ్రదవస్థలో ఉంటాడు. కర్ణిక దగ్గరకు వెళ్తే, స్వప్నావస్థలో ఉంటాడు. లింగమందు జేరితే సుషుప్త్యావస్థలో ఉంటాడు. లింగం అంటే దుద్దు. పద్మత్యాగమందు ఉంటే అది ఖాళీ. కాబట్టి దాని పై భాగాన దుద్దు ఉంటుంది. దుద్దు పై భాగాన కర్ణిక ఉంటుంది. కర్ణిక పై భాగాన కేసరాలు ఉంటాయి. దాని చుట్టూ 8 దళములు, విస్తరించి, వ్యాపించి కదులుతూ ఉంటాయి. అన్నీ ఒక్కసారి కదలవు. ఒకటిగాని, రెండుగాని, విడివిడిగాగాని కదులుతూ ఉంటాయి. పద్మత్యాగము అనేది ఖాళీ కాబట్టి, తురీయ స్థితిలో ఉంటాడు. ఆ జీవుడిని దళములు ఆ రకంగా ప్రేరేపిస్తున్నాయి. జీవుడంటే ఇక్కడ హంస.

పుణ్యపాప కర్మలు దళముల కదలికలచే కలుగుచున్నవి. అట్టి దళములందు పడునట్టి సత్తా బహిర్గతమై, స్థూలములో ఉన్నటువంటి నాడులతో సంబంధపడి, పనిముట్లతో చేరగా, వాటితో పనిచేయు జీవుడు అక్కడున్నాడు. అదే హంసయొక్క వృత్తి. ఈ జీవభావము భ్రూమధ్యస్థానములో కలిగింది. అంతఃకరణ లేకపోతే జీవుడు ఉండడు. ఈ ప్రేరణని అందుకునే స్థానము, చిత్తముతోటి చిత్తవృత్తులు, మనసుతోటి ఆలోచనలు, బుద్ధితోటి నిర్ణయాలు, అహంకారం చేత కర్తృత్వ భోక్తృత్వాలు ఈ నాలుగు లేకపోతే జీవుడు ఎక్కడున్నాడు? జ్ఞాత అంతఃకరణ చతుష్టయాన్ని త్యాగం చేస్తే, తాదాత్మ్యత విడిస్తే, మనోబుద్ధి చిత్త అహంకార రూపుడు కాకుండా ఉంటే, ఆ జ్ఞాతయే కూటస్థుడు, అదే పద్మత్యాగ స్థానము.

కనుక జీవుడే పుణ్యపాపములను అనుభవిస్తున్నాడు. అంతఃకరణ ప్రతిబింబమే జీవుడు. మళ్ళీ ఎక్కడ ముడిపెట్టాడు? మూడు గుణాలతో ఉన్నటువంటి, అవిద్యా దోషముతో ఉన్నటువంటి, అంతఃకరణయొక్క ప్రతిబింబ ప్రకాశమే జీవుడు. అంతః కరణ లేనిచోట జీవుడుండడు. అంటే మానవదేహము రాకపోతే అక్కడ జీవుడుండడు. ఎప్పటికీ శరీరము రాకపోతే, ఆ జీవుడే శివుడు. మానవులలో హృదయాకాశములో శివుడు బింబప్రకాశ రూపుడై, అంతఃకరణ అనే మలిన అద్దంమీద ప్రతిఫలించినప్పుడు, సోహం జ్ఞానంతో జీవుడు ఉత్పత్తి అవుతున్నాడు. సంస్కారములచేత అసత్య నేను అయ్యాడు. అసత్య నేనుగా ఉన్నప్పుడు జీవుడు శివుడుగా లేడు. అంతఃకరణ ప్రతిబింబుడు అయినప్పటికి, సంస్కారములనుంచి, గుణములనుంచి, విడుదల చెందినటువంటివాడు, జీవుడిలో ఉన్న శుద్ధోహం – బింబ ప్రకాశముగా ఉన్న శివుడు రెండూ ఒక్కటే. అందుకే **"అహంబ్రహ్మ"** అన్నారు.

మానవ దేహంలో ఉన్నటువంటి షట్చక్రాలు, నాడులు, స్థానాలు, కుండలిని, ఈ హంస, ఈ వ్యవహారమంతా కూడా, శాస్త్రాలలో ఉన్నాయి. ప్రతిబింబము లేకపోతే జీవుడుండడు. కనుక మలిన అంతఃకరణమే పుణ్యపాపములను అనుభవించుటకు కారణము. అంతఃకరణమంటే మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం. కాని అంతఃకరణము జడమగుట వలన అది అనుభవించదు. అది అద్దము లాంటిది, ఏ పనీ చేయదు. జ్ఞానము అనే కళ దానియందు చేరగానే, ప్రతి బింబమే ప్రజ్ఞానముతో కలిగిన సత్తాతో చేరి, జీవుడనబడి, పుణ్యపాపములు చేసి, అనుభవిస్తుంది. అంటే హృదయాకాశమందు ఈ మానవదేహమందు చేరినటువంటి, శివచైతన్యమే, బ్రహ్మ ప్రకాశమే, అంతఃకరణ మీదపడి ప్రతిబింబిస్తే, జీవుడు తయారయ్యాడు. అంతఃకరణ యొక్క మాలిన్యము చేత, జీవుడు ఆ జీవభావము పొంది, సకల వ్యవహారములు చేస్తున్నాడు. దానికి పుణ్యపాపాలు కలుగుతున్నాయి. అంతఃకరణ జడము కనుక, అంతఃకరణలో జరిగేటటువంటి అనుభవాలన్నీ కూడా, ఆ బ్రహ్మప్రకాశము యొక్క సాన్నిధ్యముచేత, బింబ ప్రకాశము యొక్క సాన్నిధ్యముచేత, ఈ ప్రతిబింబ రూపములో ఉన్న జీవుడు, పాపపుణ్య కర్మలను చేస్తూ అనుభవిస్తున్నాడు. ప్రతిబింబమునకు బింబ ప్రకాశములేనిదే అస్తిత్వము లేదు. అంతఃకరణ జడమవ్వడముచేత, స్వతంత్రముగా దానికి పాప పుణ్యములు లేవు. అధిష్ఠాన బ్రహ్మప్రకాశమునకేమో పాప పుణ్యములకు సంబంధము లేకుండా, తనకు తానే స్వతః సిద్ధమై, లక్షణంగా ప్రకాశిస్తోంది.

చిత్తవృత్తుల యొక్క, భావముల యొక్క, మనోవ్యాపారము యొక్క, ఆలోచనల, వృత్తుల యొక్క ప్రవాహము అక్కడ ఉంది కాబట్టి, ఇడ పింగళలోనేమో, శ్వాస యొక్క ప్రవాహము ఉంది సుషుమ్నలోనేమో కుండలిని యొక్క ప్రవాహము ఉంది. కనుక, ప్రవాహము అనే దానిని వినియోగించుకుంటే, ఆ మూడు నాడులను గంగ నాడి, యమునా నాడి, సరస్వతీ నాడి అంటున్నాము. ఈ మూడు నాడులలో సరస్వతీ అనేటటువంటిది అంతర్వాహిని. బయటకు కనిపించదు. అంతర్వాహిని అయినటువంటి, సరస్వతీ అనే పేరుతో ఉన్నది సుషుమ్న నాడి. కుడి ఎడమ ముక్కుల ద్వారా, బాహ్య ఇడ పింగళ నాడుల ద్వారా, శ్వాస యొక్క ప్రవాహము ఉండడము చేత, ఇది స్థూలరూపముగా ఉండడంచేత, గమనించేటట్లు ఉంటుంది గనుక, గంగా, యమునా అన్నాము. ఈ మూడూ అలహాబాద్‌లో కనబడుతాయి. పుణ్యక్షేత్రాలకు అక్కడకే వెళ్ళనవసరం లేదు. మనలోనే ఉన్నాయి.

అంతర్వేదికి వెళ్ళడం అంటే, ఆజ్ఞాచక్రందాటి సహస్రారానికి వెళ్ళే మార్గమధ్యములో ఉన్నటువంటి ఒక స్థానము పేరు అంతర్వేది. త్రివేణి సంగమ స్నానము అంటే, ఆజ్ఞాచక్రాన్ని దాటి, ఘంటిక స్థానము పైకి వెళ్ళి, నాడులయొక్క ముడి స్థానము దగ్గరకు వెళ్ళి, అక్కడ మూడు నాడులు కలిసి ఉన్నటువంటి చోటు, త్రివేణి సంగమము. త్రివేణి సంగమ స్థానము అంటే అక్కడకు వెళ్ళడం అన్నమాట.

మూలాధారము దగ్గర గంధ సంబంధమైనటువంటి, ప్రారబ్ద కర్మలు అనుభవిస్తూ, మరలా కర్మ చేస్తే అక్కడ జమ చేసుకుంటూ ఉంటుంది. అదే మాదిరిగా స్వాధిష్ఠానము దగ్గర రస సంబంధమైనటువంటి ప్రారబ్ధాన్ని, దళముల యొక్క ప్రేరణ చేత కదలికలను పొందుచూ, బుద్ధి కర్మానుసారముగా నిర్ణయిస్తే, ఆ ప్రేరణని అందుకుంటూ నిర్ణయిస్తూ, ఆ ప్రారబ్ద కర్మను రస సంబంధముగా అనుభవిస్తూ ఉంటుంది. ఇదే విధముగా మణి పూరకము దగ్గర, రూప సంబంధ ప్రారబ్ధాన్ని అనుభవిస్తూ, నిర్ణయిస్తూ, మరలా రూప సంబంధ ఆగామిని జమచేస్తూ ఉంటుంది. అనాహత చక్రము దగ్గర స్పర్శ సంబంధ ప్రారబ్దమును అనుభవిస్తూ, స్పర్శ సంబంధ ఆగామి కర్మలు జమచేసుకుంటూ ఉంటుంది. విశుద్ధ చక్రం దగ్గర శబ్ద సంబంధ ప్రారబ్ధాన్ని అనుభవిస్తూ, శబ్ద సంబంధ ఆగామిని సంచితములోనికి చేర్చుకుంటూ ఉంటాడు. ఈ సుషుమ్న నాడిలో ముఖ్య ప్రాణము అని ఒకటి ఉన్నది. ఈ పంచప్రాణముల యొక్క కదలిక కాకుండా, ముఖ్య ప్రాణము అనేది ఒకటి ఉన్నది. ఈ ప్రాణ సత్తా అనేది, అగ్నినాడిలో శక్తి రూపములో ఉంటుంది. ఈ ప్రారబ్దము ఎప్పుడైతే ఖర్చు అయ్యిందో, అయిదు చక్రాలవద్ద, ఐదు బోర్లించిన గిన్నెలులాగా ఉంటాయి. అక్కడినుంచి ఈ ఐదు చక్రాలు, ఆ విశుద్ధచక్రం పైనుండి ఐదు నాడులచేత, బోర్లించిన గిన్నెలతోటి, క్రిందికి దిగువకు వ్యాపించి ఉంటుంది. ప్రారబ్దము ఖర్చు అవుతూ ఉంటే, బలంగా ఉన్న ఆ నాడులు సడలి, బలహీనపడుతూ ఉంటాయి. ఆగామి కర్మ ఆవిరి రూపముగా ఉండడంచేత, బోర్లించిన పైగిన్నెలోకి చేరి, అక్కడ అంటుకుని ఉంటుంది.

నాడులలోని ముఖ్యప్రాణము ప్రారబ్దము పూర్తి అయ్యేవరకూ బలంగా ఉంటుంది. ప్రారబ్దము ఖర్చు అవుతున్నకొద్దీ, ముఖ్య ప్రాణముయొక్క బలము తగ్గిపోతూ ఉంటుంది. ముఖ్యప్రాణము యొక్క బలము తగ్గేసరికి, శబ్ద స్పర్శ రూప రస గంధములుగా నీచేత అనుభవించబడేటటువంటి ఐదు బోర్లించినటువంటి గిన్నెలు, ఆ నాడులు బలహీనపడగానే తిరగబడుతాయి. వెల్లకిలా పడుతాయి. వెల్లకిల పడేసరికి ఆవిరి రూపంలో, శబ్ద స్పర్శరూప రూప గంధములు అనెడి ఆగామి కర్మ వాసనలు, ఏవైతే అంటుకున్నాయో, ఆ గిన్నెలనుండి, ఆవిరి పైకిపోతుంది. ఒక ఆరవ గిన్నెపైన ఉంటుంది. ఈ ఆరవ గిన్నెలోకి చేరుతుంది. అక్కడ ఉన్న సంచితము దీని చేరికవలన పెరుగుతుంది. ప్రారబ్దము ఖర్చు అయిపోవడము వలన, తగ్గిన సంచితము ఆరవ గిన్నెలోకి చేరిన ఆగామితో కలిసినందువలన సంచితము మళ్ళీ పెరుగుతుంది. ఆ సంచిత రాశిని పట్టుకొని ఉదాన వాయువు ద్వారా హంస ప్రయాణిస్తుంది, నిష్క్రమిస్తుంది. అర్చిరాది, ధూమ్రాది మార్గములలో ప్రయాణిస్తుంది. పాపము ఎక్కువ అయినప్పుడు ధూమ్రాది మార్గములోకి వెళ్ళి, నరకలోకానికి వెళ్తుంది. పుణ్యం ఎక్కువగా ఉంటే అర్చిరాది మార్గములో పయనిస్తుంది.

తారకామృత సారము అనేటటువంటి గ్రంథములో మనకు ఇవన్నీ వివరముగా ఇవ్వబడినవి. దానినుండి సేకరించి, ఇక్కడ పంచాక్షరీ మంత్రానికి ఒక రూపాన్ని ఇచ్చాము. ఇది ప్రణవోపాసకులకు, షట్చక్రములమీద సాధనచేసి గ్రంధి భేదనము చేసుకునేవారికి ఎంతో ఉపయోగముంటుంది. మోక్షానికి గొనిపోవుటకు ఇక్కడ లక్ష్యమును అందించడమైనది.

## సాధన చతుష్టయ సంపత్తి

సాధన చతుష్టయ సంపత్తి ప్రారంభంలో నిత్యానిత్య వస్తు వివేకము, ఇహా ముత్రార్ధ ఫలభోగ విరాగము , శమాది షట్క సంపత్తి, ముముక్షుత్వం వీటన్నింటినీ అంతిమ లక్ష్యానికి ముడిపెట్టి చెప్పాలి.

నిత్యానిత్య వస్తు వివేకము : నిత్యానిత్య వస్తు వివేకాన్ని ఎలా ముడిపెట్టారు? ఇది నిరూపించాలంటే ఈ శరీరము ఈ ప్రపంచము అనేవి ఎలా  అనిత్యమో తెలిశాక విచారణ అయిపోయాక, **బ్రహ్మసత్యం జగన్మిథ్య** అని తేలిపోయింది.

బ్రహ్మమే సత్యము, ఇతరమంతా అన్యమంతా కూడా ఉన్నప్పటికీ లేనిదే. అనిత్యము అంటే తాత్కాలికంగా ఉంటుంది అని అర్థము. అసత్పదార్థము కాబట్టి అనిత్యము, అసత్ అంటే ఏమిటి? ఆది అంతము ఉన్నది అసత్పదార్థము.

ఆది అంతము ఉన్నప్పుడు అది ఎక్కువ కాలము లేనిది. ఒకానొక కాలంలో ఉన్నది, దాన్ని ఆది అన్నాము, మరలా అది అంతమైపోయింది అతము అన్నాము. ఆది, అంతముల మధ్యలో ఉన్నది అంతా కూడా చాలా స్వల్పకాలము. అంతమైపోయిన తరువాత చాలా కాలము లేనిది అయ్యింది. అనంతకాలములో కుండ తయారు కాకముందు లేదు, కుండ పగిలిన తరువాత లేదు, ఆది అంతముల మధ్యలో మాత్రమే ఉంది. తాత్కాలికంగా ఉంది. అంటే అనిత్యం అవుతుంది. శరీరమునకు సంబంధించి ఆయుష్కాలానికి ఆది, అంతం ఉంది. మధ్యలో ఉన్నది కూడా పరిణామం చెందుతూ, మార్పు చెందుతూ ఉంటుంది.

స్థూలశరీరం బాల్యాది అవస్థలు మొదలుకుని, షడ్విధ వికారాలు చెందుతూ, చివరకు నశిస్తుంది. అలాగే సూక్ష్మశరీరం కూడా దానిలోని జ్ఞానాన్ని బట్టి, అజ్ఞానాన్ని బట్టి, దాని యొక్క స్వభావాన్ని బట్టి మార్పు చెందుతూ ఉంటుంది. కారణ శరీరంలో చూస్తే, సంచిత కర్మరాశిలో ప్రారబ్దం తగ్గిపోతుంది, ఆగమి కలుస్తోంది, కనుక ఆ సంచిత కర్మరాశి ఎప్పుడూ ఒక మాదిరిగా లేదు. అదికూడా మార్పు చెందుతూ ఉంది.

ఈ ప్రపంచము నిత్యంగా కనబడుతోంది. ఒక నది దగ్గరకు వెళ్తే, నదీ ప్రవాహాన్ని నిన్నటి రోజున చూసి, ఈ రోజున మళ్ళీ అదే నదిని చూశాం అంటున్నాము. ఆ మాదిరిగా జగత్తు కొనసాగుతోంది. కాని విచారించుకుంటే, నిన్నటి నీరు సముద్రంలోకి వెళ్ళిపోయింది, మళ్ళీ నాలుగు రోజుల తరువాత కొత్తనీరు వచ్చి చేరుతున్నది, అప్పుడు ఆ నది కాదు, వేరే నది. అలాగే నీ దేహం కూడా బాల్యం నుండి వృద్ధాప్యం దాకా పరిణామం చెందుతోంది. కాని, ఈ శరీరాన్ని చూసుకుని నిన్నటిదే ఈ రోజు ఉంది, ఈ రోజుదే రేపు ఉంటుంది. క్రిందటి సంవత్సరము కూడా ఈ శరీరమే ఉంది అనుకుంటున్నారు. కాని ఆ శరీరము మారిపోయిందని, ఇది కొత్తశరీరము అని తెలియడంలేదు. ఏడేళ్ళకు ఒకసారి ఈ శరీరమంతా మారిపోతుంది. కొన్ని కణాలు క్షీణిస్తూ ఉంటాయి, కొన్ని కణాలు పుడుతూ ఉంటాయి. అలా కొత్త కొత్త కణాలతోటి తయారౌతుంది. ఆ విధంగా విచారణ చేస్తే, ఇది అనిత్యము.

ఈ నిత్యానిత్యాలు ఏ ప్రాతి పదిక మీదుగా, ఏ లక్ష్యంగా తీసుకుని మనం విచారణ మొదలు పెట్టాలి? అంటే, **"బ్రహ్మ సత్యం, జగన్మిథ్య"** అనే మహావాక్యాన్ని, **'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ'** అనే మహా వాక్యాన్ని, **'సర్వం ఖల్విదం బ్రహ్మ'** అనే మహావాక్యాన్ని, ఇలాంటి కొన్ని వాక్యాలను పూర్వపక్షంగా స్వీకరించాలి. పూర్వ పక్షం అంటే ఏమిటి? ఈ వాక్యాల యొక్క అర్థం తెలుసుకుని అక్కడ మొదలుపెడుతున్నాము. అంటే, అనుభవంగా తెలియక్కర్లేదు, విషయంగా తెలిస్తే చాలు. మీకు ఋజువు అవ్వక్కర్లేదు, అనుభవం అక్కర్లేదు. బ్రహ్మ ఒక్కటే అన్ని కాలములో త్రికాలాబాధ్యముగా ఉన్నది. ఇతరమునకు ఆద్యంతములు ఉన్నవి. అన్ని కాలములలో కూడా విచారణచేస్తే, మార్పు చెందుతూ ఉన్నది. అనిత్యంగా ఉంది. కనుక నిత్యానిత్య వస్తు వివేకము వస్తే, నిత్యమైన బ్రహ్మను గ్రహించి ఇక ఏదైనాసరే అనిత్యమనే సంగతి, ఆ విధమైన అవగాహనతో, పూర్వపక్షంగా మొదలుపెట్టాము.

**బ్రహ్మసత్యం, జగన్మిథ్య** అనగా బ్రహ్మమే సత్యము, దానికి వ్యతిరేకమైన దేహేంద్రియాలు కాని, ప్రాణము, మనోబుద్ధులు కాని పంచభూతాత్మకమైనటువంటివి ఏ మాదిరిగా ఉన్నా గాని, అది అసత్యము. అసత్యము అంటే, తాత్కాలిక సత్యము అని అర్థము. మార్పుచెందుతూ ఉంటుంది అని అర్థము. అసలు లేదు అని కాదు, అంటే కలలో చూసినది కలలో నిజం, మెలకువలో చూసినది మెలకువలో నిజం. గాఢనిద్రలోనిది, గాఢనిద్రలో నిజం. అవస్థలలో అనుభవించేవన్నీ అనిత్యం అని అంటున్నాము.

అయితే జగత్తు అనే పదానికి అర్థం ఏమిటి? జ – అంటే ఒకప్పుడు కానిది, ఇప్పుడు అయినది అనడానికి బదులు, పుట్టింది అంటున్నాము. విచారణ చేస్తే, నీరు గడ్డకట్టిన తరువాత మంచుగడ్డ పుట్టినది అంటున్నాము. మంచుగడ్డ కరిగిన తరువాత నీళ్ళు పుట్టాయి అంటున్నాము. మంచుగడ్డ లయం అయ్యిందని అంటున్నాము. మళ్ళీ నీళ్ళు ఆవిరి అయ్యేసరికి, ఆవిరి పుట్టింది అని అంటున్నాము, జలము నశించిందని అంటున్నాము. కాని, ఏదో ఒక రూపంతో ఆ జలతత్త్వం ఉంటూనే ఉంది. అలాగే ఏదో ఒక రూపంలో ఈ ప్రకృతి ఉంటూనే ఉంటుంది. ఎప్పటి వరకు ఉంటుందంటే, మాయావరణంలో ఉన్నంత వరకూ ఉంటుంది. విక్షేపంలో ఉన్నవాళ్ళందరికి ఈ ప్రపంచం ఉంది. ఎవరికి ఉండదు? మాయను దాటినవారికి, మాయావరణను నిరావరణ చేసుకునే వారికి, ఈ ప్రపంచము ఉండదు. తానే బ్రహ్మమైన వాళ్ళకు, ప్రపంచము తోచదు. తాను తానైనటువంటి బ్రహ్మనిష్ఠలో తెంపులేకుండా కొనసాగుతూ స్వస్వరూప సాక్షాత్కారంగా ఉంటాడు అతడు. విజ్ఞాన స్వరూపంగా ఉంటాడు. అన్యము లేనటువంటి అపరోక్షముగా ఉంటాడు. **'ఏకామేవాద్వితీయం బ్రహ్మ'**గా, బ్రహ్మకు లక్షణమైన బ్రహ్మానుభవంతో, అపరోక్షానుభూతితో ఉంటాడు. అతనికి ఇక ప్రపంచమే లేదు. ఆ బ్రహ్మ సత్యము కనుక, ఆ బ్రహ్మజ్ఞానములో ఉన్నవాడు ఆది, అంతము లేకుండా, వికారము లేకుండా, మార్పు చెందకుండా, నిర్వికారంగా, అచలముగా, పరిపూర్ణముగా, తిరిగి మాయలోకి ప్రవేశించే ఆస్కారము లేకుండా ఉంటాడు.

పరిపూర్ణము అంటే, అర్థం ఏమిటంటే, ఆ స్థితిలో తృప్తిగా ఉంటాడు. ఏమాత్రము అసంతృప్తి ఉన్నా, మరలా మాయద్వారం గుండా బయటకు వచ్చి, తన అసంతృప్తిని తీర్చుకోవలసి ఉంటుంది. పరిపూర్ణుడికి ఇలా అసంతృప్తి ఉండదు. నిత్యతృప్తే ఉంటుంది. సౌకర్యంగా ఉంటుంది. అసౌకర్యంగా ఉండదు. ఇబ్బంది, దుఃఖము ఉండవు. కాలక్షేపం ఉంది, లేదు అనే మాటలుండవు. తనకంటే అన్యము ఉండదు. తనకు అన్యము ఉంటే ఏమౌతుంది? అజ్ఞానములో ఉన్నవాళ్ళకి కాలక్షేపము లేదని, చిరాకుగా ఉండి, ఏమీ తోచట్లేదు అంటారు. తోడు కావాలని, ఏదో ఒక వస్తువో, ఒక వ్యక్తో, ఒక స్నేహితుడో, సంసారములో ఉన్నట్టి పిల్లలో, బంధువులో ఉండాలి. అదంతా ఖాళీ అయి, ఏకాంత స్థితి వస్తే, ఆ ఏకాంత స్థితిని నీవే ఒక రోజు ఎంచుకున్నప్పటికి, కొంతకాలము పోయిన తరువాత, తోచటము లేదు, కాలక్షేపము లేదు అనుకుంటావు. ఏదీ కూడా నిన్ను దుఃఖ పెట్టే సమస్య లేదు. అయినప్పటికి కూడా బోర్ కొడుతుంది అంటాము.

పరిపూర్ణము అంటే ఇప్పుడు చెప్పినవేవీ ఉండవు. ఆ ఉన్నది ఉన్నట్లుగా ఉన్నదాంట్లో కదలడు, వికారము చెందదు, అది పరిపూర్ణ స్థితి. ఆ పరిపూర్ణ స్థితియే అచలము. ఆ పరిపూర్ణ స్థితి నుండి కదలాలి అంటే, మాయలోకి వచ్చి, కదలాలి తప్ప, మాయను దాటినవాడు కదలడు. మాయావరణలో కదలవచ్చు, కదలకుండా ఉండచ్చు. సగుణంగా ఉండచ్చు, నిర్గుణంగా ఉండచ్చు. కాని మాయను దాటినవాళ్ళు అక్కడ నిర్గుణము, త్రిగుణ రహితం అయి ఉంటారు. ఆ స్థితి మాయకు పరమైనటువంటి స్థితి. మాయకు అతీతమైన స్థితి. అక్కడ ఎప్పుడూ కూడా అచలమే, పరిపూర్ణమే. ఈ బోధలో, పరిపూర్ణత్వము సంగతి చెప్తున్నాము. ఎవరు ఆ పరిపూర్ణులు? ఆ శిష్యుడే అచల పరిపూర్ణుడు. శిష్యుడే భ్రాంతిలో, మాయలో కదులుతున్నాడు కాని, అచల పరిపూర్ణుడే. భ్రాంతి పోతే, అచల పరిపూర్ణమే ఉన్నది.

ఆ విధంగా కదిలిన తరువాత వచ్చిన అనుభవానికి ఆది, అంతం ఉంది కనుక అనిత్యం. అనిత్యం అనే మాటకు, అసత్ అనే మాటకు, తాత్కాలికం అంటాం. ఆ విధంగా కలలో ఉన్నంత వరకూ కల సత్యం, మెలకువలో ఉన్నంత వరకూ మెలకువ సత్యం, బాల్యంలో ఉన్నంత వరకూ బాల్యం సత్యం. యవ్వనంలో ఉన్నంత వరకూ యవ్వనం సత్యం. ఇప్పుడు బాల్యం లేదు ఇక. ఆ వర్తమానంలో ఉన్న యవ్వనమే సత్యం. వృద్ధాప్యం వచ్చే సరికి ఈ రెండూ అసత్యం. గతం గతః. వృద్ధాప్యంలో ఉన్నదే సత్యం. అంతకు ముందున్నవి ఊరికే వాసనారూపంగా స్మృతిలో ఉన్నాయి తప్ప, వర్తమాన అనుభవంలో లేదు. అలా ఉంటే దానిని అసత్ అని, అనిత్యం అని అంటాము.

ఈ జగత్తు నామరూప క్రియలతో కూడి, ప్రత్యక్షముగా కనిపించుచూ, సత్యముగా తోచుచున్నది. మాయ అనే ఉపాధి ద్వారా, మాయ యొక్క గుణములతో తోచుచున్నది. పరబ్రహ్మ నిరుపాధికంగా ఉన్నప్పుడు, తానైనటువంటి పరబ్రహ్మగా, స్వయం ప్రకాశంగా ఉన్నప్పటికీ, మాయ అనే ఆవరణ ఎప్పుడైతే తోచిందో ఆ స్వయం ప్రకాశముగా ఉన్న ప్రకాశము, మాయావరణములో వ్యాపించే ప్రకాశముగా కనబడుచున్నది. స్వస్వరూప ప్రకాశముగా, స్వయం ప్రకాశంగా ఉన్న బ్రహ్మకి ఇదంతా ఏదీ తెలియదు. తాను తానుగా ఉన్నాడు. అయితే సాధకుడు ఒకడు, సాధనతో జీవన్ముక్తుడు అయితే మాయను దాటితే, ఆ స్థితిలో బ్రహ్మనిష్ఠలో ఉంటూనే, మాయద్వారం నుండి బయటకు తాను ప్రకాశిస్తూ, ఆ ప్రకాశం కూడా మిథ్య అనేటటువంటి నిర్ణయముతో, అసత్యం అనేటటువంటి భావముతో, అసంగంగా, సాక్షిరూపంగా ఉంటాడు.

జ – అంటే దానికి ఉత్పత్తి అర్థము తోచడము. ఆ తోచినది అనిత్యంగా ఉంటుంది. మార్పు చెందుతూ ఉంటుంది. గతి–అంటే కదులుతూ, పరిణామం చెందుతూ ఉంటుంది. కనుక జగతి అంటే ఒకప్పుడు ఉండి, ఒకప్పుడు లేక, మధ్యలో ఉంటూ, మార్పు చెందుతూ, చివరకు పోయేది అని అర్థము.

మనం శరీరాలు ధరించి ఉన్నాము. ఇవి షడ్విధ వికారాలాలతో, ఆది–అంతం ఉంటూ, ఎప్పటికైనా నశించేవే. మరల కొత్త శరీరం పుట్టి అది కూడా నశిస్తుంది. అట్లా లక్షలాది పునర్జన్మలలో ఈ శరీరాలు లక్షలసార్లు వచ్చి, లక్షలసార్లు నశిస్తూనే ఉంటాయి. అటువంటి శరీరం అనేటటువంటి అర్థంతో మనం ఈ తొడుగును పెట్టుకున్నాము. ఎప్పుడూ కూడా నా శరీరము అనాలి కాని, నేనే శరీరము అనకూడదు. నా శరీరము అన్నప్పుడు కూడా దాని అర్థము ఏమిటి? ఇవి క్షీణిస్తూ, నశిస్తూ ఉండేవే. వ్యాధి, బాధలు, నాశనం ఉంది. కాబట్టి, శరీరం అన్నప్పుడల్లా ఇది పోయేదే, ఇది పోయేదే అనే గమనింపు ఎప్పుడూ ఉండాలి. జగత్తు, జగత్తు అన్నప్పుడు నిన్నటిది ఇవాళ్టికి, ఇవాళ్టిది రేపటికి ఉండదు. ఇది గతిస్తూ ఉంటుంది అని భావన చేస్తూ ఉండాలి. జగత్తు ఎప్పుడూ ఉంది, ఎట్లా ఉంది? అంటే, నదిలో నీళ్ళు ప్రవహిస్తోంటే, రోజూ అదే నదిని చూశాం అన్నట్లుగా, జగత్తు ఉంది. కొంచెం లోతుగా చూస్తే ఏమైంది? నిన్నటి నీరు ఇవాళ లేదు, కొత్త నీరు వచ్చింది, పాత నీరు నశించింది. అలా తెలియని వాళ్ళు, ఏమనుకుంటారు? నేను ఎన్నిసార్లు చూసినా అదే నది అనుకుంటారు.

సూక్ష్మంగా చూస్తే, ఆ నదిలో, ఆ ప్రవాహంలో, కొన్నిచోట్ల కొట్టుకుపోయింది, ఆ ఒడ్డు విరిగి పడింది, కొన్నిచోట్ల మేట వేసింది, ఈ తేడాలున్నాయి. అలాగే మనం పుట్టి, బుద్ధి ఎఱిగిన తరువాత, చనిపోయేదాకా కూడా, కొన్ని తేడాలు ఉన్నాయి. ఏ రోజుకారోజు మర్నాటికి ఏమీ తేడా లేనట్లు అనిపిస్తుంది. ఓ పది, పదిహేను ఏళ్ళు గడిచాక తేడా చూసుకుంటే, అది కనిపిస్తుంది కాబట్టి, నిరంతరం ఇది మార్పు, వికారం చెందుతూ ఉంటుంది. కాని అప్పటికి అది ఉన్నట్లు ఉంది కాబట్టి, అనిత్యంగా ఉంది, అసద్రూపంగా ఉంది. నామరూప క్రియలతో కూడి, ప్రత్యక్ష్యంగా కనిపించుతూ, తాత్కలిక సత్యంగా ఉన్నట్లు తోచుచున్నది. కనుక జగమునకు ఉత్పత్తి నాశనములు ఉన్నవి కనుక ఇది అనిత్యము.

ఈ విచారణా పద్ధతి చూడండి. కొందరు సత్యమే అన్న యెడల, అదెట్లనిన, మహానదియందు జలము ప్రవహించిననూ, పోయిననూ మరల నూతన జలము వచ్చిచేరినట్లు, ఈ సృష్టి లయించినప్పుడు కూడా పునః సృష్టి అగుచున్నది. కనుక వ్యావహారిక సత్యమైననూ, అది పారమార్థిక సత్యము కాదు.

విచారిస్తే పారమార్థిక సత్యము కాదు. ఎలా విచారించాలి? **'బ్రహ్మసత్యం – జగన్మిథ్య'** అని మనసులో పెట్టుకొని విచారణ చేయాలి. **'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ'** – అనేది లక్ష్యంగా పెట్టుకుని విచారణ చేయాలి. ఈ ప్రపంచం కూడా కేవలం బ్రహ్మ స్వరూపమే, కాని మాయ అనేటటువంటి ఉపాధి కారణముగా, నామరూపాలుగా ప్రత్యక్షం అవుతున్నది. ఈ నామరూపంగా కనబడేది ఏదైతే ఉందో అది మాయకారణంగా అలా కనబడుతుంది. మాయ అంటే లేనిది కనుక, ఈ కనబడేది మిథ్య. కనుక ఇదంతా కూడా పాము కాదు, తాడే అన్నాము. అలా నామ రూప జగత్తు కాదు, బ్రహ్మమే అన్నట్లుగా ఎవరైతే ఇలా జ్ఞాన దృష్టితో చూస్తారో, జ్ఞాన చక్షువుతో చూస్తారో, అప్పుడు ప్రపంచము కూడా బ్రహ్మమే.

**'సర్వం ఖల్విదం బ్రహ్మ'** – ఈ కనిపించేదంతా కూడా బ్రహ్మమే. అందుకని ఆ మూడు వాక్యాలు మనం పూర్వపక్షంగా పెట్టుకుని కొనసాగించాలి. నిత్యానిత్యా వస్తువివేకాన్ని నిరూపించుటకు, ఈ వాక్యాలు **'సర్వం ఖల్విదం బ్రహ్మ'**, లక్ష్యంగా, **'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ'**గా, విచారణ, సాధన అంతాకూడా **'బ్రహ్మ సత్యం – జగన్మిథ్య'** అనే కోణంలో, నిత్యానిత్య వస్తు వివేకాన్ని మనం విచారణ చేయాలి. ఈ కనబడేది లేనిది అయినప్పటికీ కనబడుతోంది అంటే, 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని చూడాలి. మీరు అధిగమించేందుకు అనిత్యం నుంచి నిత్యానికి వెళ్ళాలి. అసత్తు నుంచి సత్తుకు వెళ్ళాలి. **'అసతోమా సద్గమయా'** – అసత్తు నుంచి సత్తుకు ప్రయాణం చేయాలి.

దానికి **బ్రహ్మసత్యం–జగన్మిథ్య** అనేదానిని సాధనగా, విచారణ చేయాలి. లక్ష్యం ఏమో, **'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ'**. ఈ కనబడే ప్రపంచం అంతా అలా కనబడుతోంటే, ఎలా స్థిరం చేసుకోవాలి అంటే, **బ్రహ్మసత్యం – జగన్మిథ్య** అనే దానిని ఆధారం చేసుకుని, ఈ కనబడే ప్రపంచము అంతా కూడా బ్రహ్మమే అని ఉండాలి. బంగారం ఎట్లా అయితే ఆభరణాలుగా అయ్యిందో, వాటిని ఆభరణాలుగా కాకుండా, బంగారంగా చూసే జ్ఞాన దృష్టి కావాలి. అలా చూసినప్పుడు **'సర్వం ఖల్విదం బ్రహ్మ'**.

కనుక ఆ మూడు మహావాక్యాలు పట్టుకుంటే, పారమార్థిక సత్యం తెలుస్తుంది. ఆ మూడు మహావాక్యాలు పట్టుకోక, సామాన్యంగా లోకంలో విచారణ చేస్తే, ఏది సత్యం, ఏది అసత్యం అనంటే, తాత్కాలిక సుఖదుఃఖాలు అసత్యమని, ఎంత కష్టబడ్డాకానీ, మంచి చదువు చదివి, మంచి ఉద్యోగం సంపాదించి, మంచి ఫలవంతుడుగా సుఖంగా జీవించడం అనేది, ఆ లక్ష్యంలో అది సత్యమే అయ్యింది. దానికోసం తాత్కాలిక కష్టాన్ని మరిచాడు. అసలు అంతా అసత్తే, అంతా తాత్కాలికమే, అంతా అనిత్యమే. ఆత్మానాత్మవివేకం కూడా లేనివాడికి చెప్పినప్పుడు, నిత్యానిత్యవస్తు వివేకము అదొక పద్ధతిగా చెప్పాము.

ఇక్కడ నాలుగు మహావాక్యాలు పూర్వపక్షంగా, ప్రాతిపదికగా పెట్టి, ఒక వాక్యాన్నేమో సాధనకి, మరొక వాక్యాన్నేమో లక్ష్యానికి, మూడవ వాక్యాన్నేమో మాయావరణంలో ఉన్న బ్రహ్మ, నామరూపాలుగా తోస్తున్నాడు కాని, నామరూపాలు మాయకారణంగా తోచినవి కాని, విచారిస్తే అవి కేవలం బ్రహ్మమే అని, మాయ లక్షణాలను, మాయ గుణాలను, వాచ్యార్థంగా వదిలేసి, లక్ష్యార్థమైన బ్రహ్మను పట్టుకుంటే, **సర్వం ఖల్విదం బ్రహ్మ**. అలా పట్టుకోవడం అనేది సాధనగా చేసుకోవాలి. అలా అయితే అప్పుడు జ్ఞానచక్షువు తెరుచుకుంటుంది. తెరుచుకున్నప్పుడు అన్ని ఆభరణాలలో కూడా బంగారమే ఉన్నది అన్నట్లుగా కుండలన్నింటిలోనూ మట్టే ఉన్నది అన్నట్లుగా మనకు అది **'సర్వం ఖల్విదం బ్రహ్మ'** అన్నట్లుగా తోస్తోంది. పారమార్థిక సత్యం అంటే అది.

ఎట్లాగంటే, దృష్టాంతము. ఇంద్రజాలికుడు చేయు విచిత్రములు ఒకప్పుడు మిథ్యయైనట్లుగా తెలిసినమీదట, అవి మరలా కనిపించినయెడల, అట్టి ప్రత్యక్షమై తోచిన వస్తువును అసత్యమందురు. ఒకసారి ఇంద్రజాలికుడు లేని వస్తువును సృష్టించి చూపించాడు. ఇంద్రజాలము సంగతి మీకు తెలియదు. కనుక మీరు భ్రమపడ్డారు అంటే, ఆ ఇంద్రజాలికుడు తయారు చేసిన వస్తువులు అన్నీకూడా, లేకనే ఉన్నాయన్నట్లు తోచాయని మీకు తెలియక, నిజం అనుకున్నారు. ఆయనకు కనికట్టు తెలుసుకాబట్టి, ఇది మాయ అని, మరల నీ ఎదురుగుండానే కనికట్టు జరిపి, మరల ఆ వస్తువులు కనిపించేటట్లు చేశాడు. అట్లా రెండుసార్లు చేస్తే, మూడవసారి ఏమైంది? ఈయన లేని వస్తువులను ఉన్నట్లు చూపిస్తున్నాడు. ఈ వస్తువులు నిజంకాదు అని తెలుస్తుంది. రూపాయి బిళ్ళలు తయారు చేసి, అట్లా పోస్తాడు. రోడ్డు మధ్యలో ఇంద్రజాలం, గారడి చేస్తుంటాడు. ఆ రూపాయిలు, అదే నిజమన్నట్లు ఆ గారడి చూసిన అందరికీ కూడా ఆశ్చర్యం కలిగి అద్భుతం అనగానే, ఆ రూపాయిలు మాయం అయ్యాయి. మళ్ళా మీ దగ్గర, పావల అర్థణా తీసుకుంటాడు. అట్లా గారడి చేస్తే, కొత్తవాడు చూస్తే, రోడ్డుమీద అద్భుతంగా ఉంది. రెండు మాడు సార్లు చూసినవాడికి ఆ డబ్బు నిజం కాదని తెలుస్తుంది. ఆ డబ్బేనిజం అయితే అతను ఎందుకు అడుక్కుంటాడు? వాడికి మనం ఇచ్చిన డబ్బు నిజం కాని, గారడిలో లేకనే వచ్చినట్లు తోచినది అసత్తు అని తెలుస్తోంది.

స్వప్న ప్రపంచము స్వప్నములో మాత్రమే సత్యముగా తోచిననూ, మేల్కొన్నవారికి సత్యము కాదు కదా! స్వప్నమున అజ్ఞానమందుండు వానికి స్వప్న జగత్తు సత్యముగానే ఉండును. కానీ, జాగ్రత్త యందు జ్ఞానము కలవానికి, స్వప్న జగంబు అసత్యమగును కదా!

స్వప్నము తాత్కాలిక ప్రపంచము. జాగ్రదావస్థ నిజంగా ఉంది అనుకుందాము. నిద్రపోతున్నప్పుడు, గాఢనిద్రలో ఉన్నప్పుడు ఏమీ లేదు. ఒకడేమో కల కంటున్నాడు. వాడి కల వాడికే కాని, వాడి కల వీడికి లేదు. మెలకువలో ఉన్నవాడు, జాగ్రదావస్థలోనే ఉన్నాడు. కల కనేవాడు లేచి, కలలో చూచింది నిజం అనుకుంటూ లేచాడు. మెలకువలో ఉన్నవాడు నవ్వుతూ, నీవు కల కన్నావయ్యా! ఇక్కడ ఏమీ జరగలేదు అంటాడు. కలలో ఉన్నవాడు, కలలో నేను నీకు వంద రూపాయిలు ఇచ్చాను అన్నాడు, మేల్కొన్నవాడితో. కలనుండి లేచి మెలకువలోకి వచ్చి, నా దగ్గర వంద రూపాయిలు అప్పు చేశావు, అంటే నేను ఎప్పుడు అప్పుచేశాను? కలలో కనపడ్డానేమో కాని, నేనేమీ నీ కలలోకి రాలేదు. నేను అప్పు తీసుకోనూ లేదు, ఇవ్వాల్సిన పనీలేదు అంటాడు కదా! ఆ మేల్కొన్నవాడు. అలాంటి ఉదాహరణలో కల అబద్ధం అయ్యింది.

జాగ్రదావస్థ మాత్రం అబద్ధం కాదా అని చూస్తే, నిన్నటి వస్తువులే, నిన్నటి జ్ఞాపకాలే, మరల జ్ఞాపకం చేసుకుని చూస్తున్నాము. నీ చిన్నప్పుడు జరిగిన సంఘటనలలో ఉన్నట్టి వారు, పెద్దయ్యాక మరల వారే, స్నేహితులుగా, బంధువులుగా, నీ దగ్గరకు వచ్చారు. అప్పుడు పాత జ్ఞాపకాలన్నీ, ఒక్కసారి తెరుచుకున్నట్లు అవుతాయి. నీకు వాడికి కూడా జ్ఞాపకము ఉంది కాబట్టి రైట్ అంటున్నాము. దానిని ఋజువుగా తీసుకున్నాము. కనుక జాగ్రదావస్థలో వచ్చినటువంటివి ఆయుష్కాలము అంతాకూడా పుట్టిన దగ్గర నుండి మరణించేంతవరకూ, జీవించిన జీవితం అంతా జ్ఞాపకం ఉన్నంత వరకూ నిజం అనుకుంటావు. మధ్యలో అప్పుడప్పుడు గుర్తులో లేనిదిమాత్రం అబద్ధం అనుకుంటావు.

పునర్జన్మల దగ్గరకు వెళ్ళేసరికి, ప్రతీ జాగ్రదావస్థలో ఉన్న, ప్రతీ జీవితం కూడా మిథ్యే. పారమార్థిక సత్యం అంటే ఇలా విచారణ చేసినప్పుడు, అది మిథ్య అని తెలిసింది. ఇది పారమార్థిక సత్యం.

ఎట్లనగా దృష్టాంతము. ఇంద్రజాలికుడు చేసింది. అలాగే స్వప్న ప్రపంచము, స్వప్నములో మాత్రమే సత్యంగా తోచిననూ, మేల్కొనిన వానికి సత్యము కాదు. ఒక ఇద్దరు కల కంటున్నారు. ఇంకో ఇద్దరు మేల్కొని ఉన్నారు. ఇంకో ఇద్దరు గాఢనిద్రలో ఉన్నారు. వారందరిని పెట్టుకుని ఏక కాలంలో, వారు ఎలా ఉన్నారో చూస్తే, ఇది సత్యమో, అది సత్యమో తెలుస్తుంది. అందుకే ఆత్మలో మేలుకో అంటున్నాము. జీవా మేలుకో, ఆత్మా మేలుకో అనేవి ఇందుకోసమే! ఇదంతా కలలాంటిదే. **కలలో తోచిన శరీరాలు ఎలాగో, ఆలాగే.**

స్వప్నమున అజ్ఞానమందుండ స్వప్నపు జగత్తు సత్యముగనే యుండును. కాని జాగ్రత్తయందున జ్ఞానము కలవానికి, స్వప్న జగత్తు అసత్యమగును కదా! అదెట్లనగా, స్థూలదేహము ఉండు వరకూ, జాగ్రత్ప్రపంచము సత్యముగనే ఉండును.

ఈ స్థూల శరీరము ఉన్నంత వరకూ, జాగ్రదావస్థ అంతా కూడా ప్రతిరోజుది కూడా ఆ జాగ్రత్ అభిమానియైన విశ్వునికి సత్యంగానే ఉంటుంది. సూక్ష్మదేహం ఉండు వరకూ, స్వప్న ప్రపంచము తత్కాలమున సత్యముగనే ఉండును. సూక్ష్మ దేహాభిమానియైన తైజసునికి ఎప్పుడు కూడా తత్కాలమున సత్యముగనే ఉన్నాడు. ఈ రెండింటికి కారణము ఉండుటచేత, అవిద్యయే కారణ శరీరము అన్నాము.

జాగ్రదావస్థ తోచడానికి కాని, స్వప్నావస్థ తోచడానికి కాని, అసలు ఆయా అనుభవాలు ఉండడానికి కూడా, కారణ శరీరంలో ఉన్న వాసలనే కారణం. కొన్ని వాసనలు స్వప్నంలోకి వచ్చినప్పుడు అసత్యం అంటున్నాము. కొన్ని వాసనలు జాగ్రదావస్థలోకి వస్తే మాత్రం అసత్యం అని అనడం లేదు. స్వప్నంలో అసత్యంలా తోచేది, జాగ్రత్తలో ఎందుకు తోచదు? కారణ శరీరమే కదా రెండింటికి కారణం, కారణ శరీరంలోని వాసనలే కదా స్వప్నానికి జాగ్రత్‌కి కూడా కారణం !

ఒక్క స్వప్నాన్ని మాత్రమే తోసేస్తున్నామే అబద్ధమని! జాగ్రత్ ని ఎందుకు తోసేయడం లేదు? స్వప్న కాలంలో స్వప్నము సత్యముగానే ఉన్నది. జాగ్రత్ కాలములోనే స్వప్నము అసత్యమని తెలుస్తున్నది.

ఎందుకు తోసేయడం లేదు అంటే, అంతటితో ఆగిపోక కంటిన్యూ అవుతోంది. నిన్నటి జాగ్రదావస్థ ఇవ్వాల్టి జాగ్రదావస్థ కి, లింకులు ఉన్నాయి. కాని నిన్నటి స్వప్నావస్థ ఇవ్వాల్టికి లింకు లేదు. నిన్నటి కల అక్కడికక్కడే వచ్చింది, తోచింది, పోయింది. ఇలా చాలా అర్థం పర్థం లేకుండా వస్తుంది. మరల కలలో మీకు తెలిసినవాళ్ళే కాకుండా తెలియని వాళ్లు కూడా వస్తున్నారు. మేలుకుంటే ఆ తెలిసినవాళ్ళు కంటిన్యూ అవ్వడంలేదు. అందుకని కల అంటున్నాం. కలలోది కూడా కంటిన్యూ అయితే అప్పుడు అది నిజమా! కల ఎలా ఉన్నా అబద్ధమే.

కల కంటిన్యూ అయితే, యోగవాసిష్టంలో ఒక కల కన్నవాడు. ఆ కలలో వున్నవాడు మెలకువ వచ్చి చూస్తే, ఆ కలలో ఉన్నవన్నీ ఉన్నాయి. అతనికి కల అనుభవం ఇంకావుంది. ఎక్కడో జరిగేది కూడా కలలో తెలుస్తుంది. అలాగే భవిష్యత్తు కూడా కల ద్వారా తెలుస్తుంది. ఆ రకంగా కలలు సత్యం మవుతాయి.

అంటే ఈ మూడు అవస్థలయొక్క అభిమానులను సాపేక్షంగా చూసి నిర్ణయించుకుంటున్నావు. ఒకసారి అసత్యం అన్నావు, ఒకసారి సత్యం అన్నావు. పారమార్థిక చింతన చేస్తే, **"బ్రహ్మసత్యం జగన్మిథ్య"** అనేటటువంటి నిత్యానిత్య వస్తు వివేకాన్ని, ఆ లక్ష్యంతో చూస్తే నీకు పారమార్థిక సత్యం తెలుస్తుంది.

ఈ రెండింటికీ కారణమైన అవిద్య కారణశరీరము అనబడును. ఈ కారణ శరీరము ఉండువరకు స్థూల సూక్ష్మ దేహములును, జాగ్రత్ స్వప్న అవస్థలును, సత్యముగానే ఉంటాయి. ఈ రెండు రకముల అవస్థలు ఒక కాలమున ఉండి మరొక కాలమున లేకపోవుటచే, ఇవి రెండూ అసత్యములే అని విచారించవలెను. స్వప్నావస్థకు జాగ్రదావస్థకు కారణము అవిద్య. ఈ కారణ శరీరం అన్నా, అవిద్య అన్నా, అజ్ఞానం అన్నా ఒకటే.

అజ్ఞానంలో కనపడేవన్నీ సత్యం కాదు. జ్ఞానంలో గోచరించేది స్వానుభవము, సత్యము. అది గోచరించదు కాని స్వానుభవ రూపము. అజ్ఞానంలో ఉన్నవన్నీ కూడా, నీకంటే అన్యముగా తోచి, నిన్ను బాధించేవి. ఒకసారి ఆనందం, ఒకసారి దుఃఖం, ఒకసారి పడిపోవడం, ఒకసారి లేవడం, ఓసారి దెబ్బలు తినడం, ఓసారి భయపడటం ఉంది. జాగ్రదావస్థలో అలాగే ఉంటుంది. కార్యకారణాలుకూడా కనిపిస్తాయి. ఇదంతా బ్రహ్మ జ్ఞానంచేత దహించి పోయింది.

జాగ్రదావస్థ గాని స్వప్నావస్థ గాని అది అవిద్యా దోషం కనుక, నీ స్వరూపం, అనగా నేను అదే అయి ఉన్నాను అనే జ్ఞానము సత్యము. అటువంటి బ్రహ్మ జ్ఞానంచేత, అటువంటి ఆత్మానుభవం చేత, ఈ అజ్ఞానం పోతుంది. అజ్ఞానం పోయినప్పుడు ఈ జీవితం అంతా కూడా, అజ్ఞాన కార్యమని, అజ్ఞానంతో కూడినదని తెలుస్తుంది. దానికి ఇప్పుడు నీవేం చేస్తావు?

సాక్షీభూతంగా, అంటకుండా అసంగంగా, ఏమి జరిగినా పట్టించుకోకుండా నీ స్వరూపంలో, నీ ఆత్మనిష్ఠలో నీవు ఉండి, ఆనందానుభవంలో ఉండాలి. అందుకే ఈ అజ్ఞానకార్యం అంతాకూడా జ్ఞానంచేత దహించిపోతూ ఉంటుంది. కావున బ్రహ్మమే మిగిలి ఉండును. ఆత్మ అనే తురీయ జ్ఞానంలో మేల్కొంటే మూడు అవస్థలు కూడా అసత్యమేనని తెలుస్తుంది.

ఇప్పుడు సాక్షి ఎక్కడున్నాడు?– ఆత్మజ్ఞాని, బ్రహ్మజ్ఞాని జాగ్రదవస్థలో స్వప్నావస్థలో సుషుప్త్యావస్థలో కూడా సాక్షిగానే ఉన్నాడు. అట్టి పరిపూర్ణమైన ఎరుకతో, శుద్ధచైతన్య అనుభవంతో ఎవేర్నెస్ తోటి, దానిలో ఉండే అనుభూతిని తెంపులేకుండా కొనసాగించుకుంటూ, ఈ జరిగేటటువంటి 3 అవస్థల యొక్క వ్యవహారాన్ని, ఉపాధిని, ఉపాధికి కలిగే సుఖదుఃఖ బాధలను కూడా, ఉదాసీనంగా సాక్షీభూతంగా చూస్తూ ఉంటాడు. ఇదే అవస్థా త్రయ సాక్షి, ఆత్మా సాక్షి అంటే. అట్టి స్థితిలో ఎవరైతే ఉంటారో, ఆ స్థితి మార్పు చెందక ఉండే తురీయ స్థితి. దానిని పారమార్థిక సత్తా అన్నారు.

కావున బ్రహ్మమే సత్యము, జగత్తు మిథ్య అగుచున్నది. మిథ్య యనగా విచారణ చేసి నిర్ణయించినచో, లేనిదే ఉన్నట్లు తోచి నందున, అట్టి జగత్తును కల్పితమైనదనే భావంతో, ఆ అభిప్రాయంతో ఉంటాడు. ఈ ప్రపంచాన్ని పిల్లల్లాటలగా, బొమ్మలాటలాగా, ఇంద్రజాలములాగా, గారడీలాగా ఆ చూసే దృష్టితో ఉన్నవాడు సాక్షి.

ఒకచోట ఒకరి విషయంలో సత్యమైనప్పుడు అందరి విషయంలో అది సత్యమే. ఒక సామాన్యుడు బోధచేత తురీయానుభవం పొంది సద్గురుస్థితి పొందితే, అందరూ అటువంటి సామాన్యులేగా! ఆయన అవగా లేంది నీవెందుకు అవ్వవు?– నీవు కూడా అవుతావు. ధైర్యం తెచ్చుకొని ఉపాయంతో సాధన చేయాలి.

ఒకడు డాక్టర్ కోర్స్ చదివాడు. శవాన్ని కోసి అందులో భాగాలన్నీ చూసి, ఏ భాగానికి ఆ భాగం వేరుచేయడం నేర్చుకుని, డాక్టర్స్ ఆపరేషన్స్ చేస్తున్నప్పుడు చూస్తూ ,సహాయం చేస్తూ, కాస్త నేర్చుకుని, మరల స్వంతంగా ప్రాక్టీసు పెట్టుకుని, ఆ డాక్టర్ కూడా అదే ఆపరేషన్ చేస్తున్నాడు. మొదట్లో శవంలో ఏమి చూశాడో డాక్టర్స్ దగ్గరుండి ఏది చూశాడో, ఆ శరీరంలో ఉన్న భాగాలు కాని అన్నీ అట్లాగే ఉన్నవి అందరికీ. ఒకరికి ఫ్యామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చేయడం చేతయితే, ఎంతమందికైనా అదే విధానముతో చేస్తాడు.

అలాగే ఒకడు పారమార్థిక సత్యాన్ని గ్రహించి, జీవన్ముక్తుడై సద్గురువు అయితే 1000 మందైనాసరే సద్గురువులు కాగలరు. ఎంతమందయినా జీవన్ముక్తులు కాగలరు. అదీ సిద్ధాంతం. నీకు ప్రస్తుతానికి తెలియనంత మాత్రాన, నీకు రుజువు కానంత మాత్రాన, అది సత్యం కాదనడం సరికాదు. కనుక స్థూలదేహము మరలా మరలా నశించుచున్నది. అలాగే జగత్తు లయించును.

**బ్రహ్మసత్యం జగత్తు మిథ్య**. ఈ జగత్తును మిథ్య చేసుకోవడం ఎలా? ఈ రకమైన విచారణతో ఈ శరీర ప్రారబ్ధం ఉన్నంతకాలం, పారమార్థిక సత్యాన్ని పట్టుకుని, వ్యవహారికంగా విక్షేపంలో ఏదయితే నిజం అనుకుంటున్నావో, దాన్ని మిథ్యా, మిథ్య అనుకుంటూ, ఒక బొమ్మలాటలాగా పిల్లలాటగా, అలా మీరు వెళ్ళ మార్చుకుంటూ పోవాలి. నిజం తెలిసిన వారు అలాగే ఉంటారు.

ఈ కల్పిత ప్రపంచం నిజమని కర్మానుసారం వచ్చిన శరీరాలు నిజము అని, అనుకునేవాళ్లకు ఇది బాధించే టటువంటి జీవితమే. పారమార్థిక సత్యం తెలిసిన వారికి, తదనుగుణంగా ఉంటుంది గనుక, ఈసాధన చేత దీనిని విస్మరిస్తూ, సాక్షిగా అసంగంగా ఉంటూ, పిల్లలాటల పోలికగా చూస్తూ, ఉన్నవాడికి ఏమయింది? పారమార్థిక సత్యం తెలిసిపోయింది. ఇదంతా లేనిదని తెలిసింది. లేని దాంట్లోనే నామరూప నటనలు జరుగుతున్నాయి అని తెలిసింది.

జగత్తు, స్థూలదేహం ఉంటేనే వుంది. స్థూలదేహం లేకపోతే లేదు. అంటే అజ్ఞానంతో చచ్చి పుట్టేవారికి వారి జీవితకాలంలో ఈ ప్రపంచము నిజం. చచ్చి పుట్టనివారికి ఇవి లేవు. చచ్చి పుట్టనివాడు ఇక్కడకు రాడు. ఒకడు జ్ఞానముచే చచ్చిపుట్టనివాడు ఉన్నాడనుకుందాము. వాడికి వేదాంతం ఎందుకు?

ఆ రకంగా ఆ భావంతో ఆ అభిప్రాయంతో వ్యవహరించాలి. అప్పుడు కర్మ చేసినా చేయనివాడు అవుతావు. ఆ కర్మ నీకు అంటదు. పారమార్థిక సత్యాన్ని గ్రహించినవాడు , విక్షేపాన్ని పోగొట్టుకున్నవాడు జగత్తును నాటకంగా చూసేవాడికి ఎన్ని కర్మలు చేసినా అంటవు.

సూక్ష్మ దేహము భంగమై ప్రకృతియందే ఉండును. సూక్ష్మ దేహం నశిస్తుందా? స్థూల దేహం నశిస్తుంది, తగలబెడతాం పాతిపెడతారు, కుళ్ళిపోతుంది. అజ్ఞాన కార్యం ఉన్నంతవరకూ, సూక్ష్మదేహం సంస్కారయుతంగా ఉంటుంది. జ్ఞానం ఎప్పుడైతే తన స్వానుభవంలో ఉందో, ఎప్పుడైతే అజ్ఞాన కార్యం అవిద్య దోషం పోయిందో, సూక్ష్మ దేహము నశిస్తుంది.

సూక్ష్మ శరీరంగా ఉండకుండా విశ్వ ప్రాణశక్తిగా ఉంటుంది. విశ్వ ప్రాణశక్తియందు ఇవన్నీ లయమై పోతాయి. ఇతరుల సూక్ష్మ శరీరాలు అవ్యక్తంగా ఉండి, పునర్జన్మలు పొందేవారికి అక్కడినుంచి మళ్ళీ వస్తున్నాయి. జీవన్ముక్తులకు ఇదే ఆఖరి జన్మ అయినప్పుడు, విశ్వ ప్రాణశక్తిలో కలసిపోయి, వ్యష్టిగా విభాగం కాకుండా ఉంటుంది.

ఒక పొలముకు చుట్టూ హద్దు రాళ్ళు వేసి ఇద్దరికీ భాగం చేసి, మధ్యలో కూడా రాళ్ళు వేశారు అనుకోండి. ఒకడు తన భాగం, ఆ ప్రక్కవాడికి అమ్మేసి, మధ్యలోని రాళ్ళు తీసివేస్తే ఆ పొలం అంతా ఒక్కటే అయి ఉన్నది. కాని అమ్మినవాడికి వాడి పేరుతో పొలం లేదు. అయినా అతని పొలం అక్కడే ఉంది. అలాగే సూక్ష్మ శరీరము నశించడము అంటే, అది తనపరంగా లేదు గాని, విశ్వ ప్రాణశక్తిలో ఎవరిదీ కానిదిగా ఉన్నది.

అందుకే సూక్ష్మశరీరం నశించక, భంగమై పోయింది అంటారు. నిజమైతే అది నశించడం కూడా నిజమే అవుతుంది. అది అబద్ధం అయినప్పుడు నశించింది అని ఎట్లా అంటారు? అది ప్రకృతియందే వుంటుంది. విశ్వప్రాణశక్తి అని దేన్నయితే అన్నామో, ఆ ప్రకృతిలో లయమై పోయి ఉంటుంది.

ముక్తులైనవారికి సూక్ష్మశరీరం ప్రకృతిలో లయమైపోతుంది. అంటే నేను అనే జీవుడు ఉండడు. వాడు పరబ్రహ్మ స్వరూపుడే అయి, మళ్ళీ పునర్జన్మలు లేకుండా ఉంటాడు. అలా ముక్తులు కానివాళ్ళు ఏమవుతారు?ప్రళయకాలమందు స్థూలదేహములు ఏర్పడటానికి తగిన స్థితి లేదు. ప్రళయ కాలంలో మానవులు స్థూలదేహముతో తిరిగి పుట్టటానికి, అక్కడ తగిన వాతావరణం లేదు. మళ్ళీ పునః సృష్టి జరిగినప్పుడు, తగిన వాతావరణం వచ్చినప్పుడు, ఈ ముక్తులు కాని జీవులయొక్క సూక్ష్మ శరీరాలు లేక, లింగ శరీరాలు మైనపు ముద్దలో అద్దబడినటువంటి, బంగారు రజనులా ఉంటాయి.

స్థూల దేహమునకు బీజమైన కారణశరీరము, అజ్ఞానం అవిద్య యందు ఉండుటచేత ఆ అజ్ఞానము వలన, బీజంవల్ల వృక్షం ఎలా వస్తుందో, అలాగే మళ్ళీ స్థూలశరీరాలు పునస్సృష్టి కాలంలో వ్యక్తమవుతుంటాయి.

## బ్రహ్మాగ్ని దహితే కర్మ

ఇది భగవద్వాక్యం కనుక, దగ్ధమైన జీవునివలె, వేరు నరకబడిన వృక్షము వలె ప్రారబ్ధ అధీనమైన దేహో ఉపాధి ఉండు వరకు దగ్ధ పటలమై ఉండును. చనిపోయిన తరువాత మోక్షం వస్తుందా? మోక్షం వచ్చాక చనిపోతారా? ఈ చావటం మోక్షం రావటం ఒకేసారా? ఎంత వయసు ఉన్నా, మోక్షం రాగానే అదేరోజు శరీరం పడిపోతుందా?

జీవన్ముక్తుడుగా తన ఆయుష్కాలం ఉన్నంతవరకూ, చనిపోయేలోపే మోక్షం రావాలి, ముక్తుడు కావాలి, ముక్తుడైన పిదప మరికొంత కాలము జీవించాలి. ఆ మరికొంత కాలము జీవన్ముక్తావస్థలో జీవిస్తాడు. అంతేకానీ చనిపోగానే మోక్షం కాదు. బ్రతికుండగానే ఆ జ్ఞానాన్ని ఆర్జించి ఆ జ్ఞాన స్ఫూర్తితో ఉన్నవాడు జీవన్ముక్తుడు అనబడతాడు.

అది సాధనచేత గురు కృపచేత తత్త్వవిచారణ చేత ఆయుష్షు దీరేలోపు ఆ స్థితిని పొందాలి. ఆ స్థితిని పొందినప్పుడు ముందే నిర్ణయించబడ్డ ఆయుస్సు ప్రకారం శరీరం ఉంటుంది. ఆ శరీరానికి శరీర ప్రారబ్ధం ఉంటుంది. శరీర ప్రారబ్ధాన్ని పట్టించుకోకుండా, జీవించినా చచ్చిన వానివలే, మెలుకువతో ఉన్నా కల కంటున్న వానివలె, ఏ పని చేస్తున్నా పిల్లలాటలాగా కాసేపు, సుషుప్తి దృష్టి కాసేపు ఇలా మూడు రకాల దృష్టితో, జీవన్ముక్తుడు కొనసాగుతూ ఉంటాడు. ఈ శరీరం పడిపోయింది కూడా తెలియదు.

పాము కుబుసం విడిస్తే, ఆ కుబుసం ఎలా వేరైందో, అలాగే జీవన్ముక్తుడు శరీరంనుండి కూడా, శరీరంతో నాకు సంబంధం లేదని, అసంగంగా ఉండి, శరీర భావన లేక ఉంటాడు. శరీరం పోయింది అనేది కూడా పట్టించుకోడు. మరణ కాలములో కూడా అదే ఆత్మ నిష్ఠలో కొనసాగుతూ ఉంటాడు. అదే మోక్షం.

ఈ ప్రారబ్ధ అధీనమైనటువంటి, దేహోపాధి ఉన్నంతవరకూ, దగ్ధ పటలములాగా ఉంటాడు. దగ్ధ పటలం అంటే ఏమిటి? కాలిన కాగితాలు, పుస్తకాలు వస్త్రాలు. కాలిపోయిన తర్వాత కూడా, వస్త్ర రూపంలోనూ కాగితం రూపంలోనూ వుంటాయి. కాని అవి పనికిరావు.

ఒక ఇల్లు తగలబడింది. ఆ ఇంట్లో బీరువాలో పట్టు చీరలు ఉన్నాయి. ఆ బీరువా కాలి ఆ సెగవలన లోపలకూడా ఆ వేడికి చీరలు కాలాయి. బయట ఉంటే గాలికి బూడిద ఎగిరిపోతుంది. ఇక్కడ బీరువాలో గాలి లేనందువలన, ఆ వేడికి క్రమంగా దహించబడి, ఆ పట్టు చీర ఏ మడతలో ఉందో, అదే మడతలో వుంది. అగ్నిమాపక దళం వచ్చాక, చూస్తే ఏమున్నాయి? చూడటానికి పట్టుచీరలుగా వున్నాయి, చెయ్యి తాకగానే అది బూడిద అయిపోతుంది. ఇదీ దగ్ధపటలము అంటే. కనుక ప్రపంచంగాని, ఈ స్థూలదేహం గాని, జీవన్ముక్తులకు శరీరరాకారం మాత్రముగా ఉంటుంది గాని, అది బూడిదే. ఆకారంగా పట్టుచీర ఉంటుంది గాని కట్టుకోడానికి పనికిరాదు, అన్నట్లుగా, జీవన్ముక్తుడికి ఆ దగ్ధ పటలములాగా ఈ ఉపాధి గాని, ప్రపంచంగాని ఉంటుంది.

ప్రారబ్ధము తెగిన వెంటనే మోక్షము పొందుదురు. అంటే ముక్తికి మోక్షానికి తేడా ఉంది. దేహము ఉండగానే ముక్తుడవుతాడు. శరీరం దగ్ధ పటలం లాగా ఉంటుంది. శరీరం రాలిపోయిన తర్వాత ఆయుష్షు తీరిపోయిన తరువాత అది మోక్షం. ముక్తి అంటే నీవు విడుదల అవుతావు. మోక్షం అంటే అదే నిన్ను విడుదల చేయడం. నేను వదిలించుకోవడం ముక్తి, దానికి అదే లేకుండా పోవడం మోక్షం.

ఈ దేహ త్రయములు లేనివారు సద్యో మోక్షమునే పొందుచున్నారు. సద్యో మోక్షము అంటే ఏమిటి? అతడు ఏ లోకములోను, ఏ శరీరముతోను ఇకముందు జన్మించడు. కారణ, మహాకారణ శరీరములు నశించినవారు ఈ సద్యోముక్తిని పొందుతారు.

**"ఇందుకు శ్రుతి త్వమేవం విద్వాన్ అమృత యిహ భవతి"** అనగా ఆ పరబ్రహ్మమును ఎరిగిన బ్రహ్మనిష్ఠుడు ఈ దేహమునందే, ఎక్కడ ఉన్నవాడు అక్కడే, ఏ క్షణములో ఉన్నవాడు, ఆ క్షణమునందే, ఉన్నచోటనే ముక్తుడవుతున్నాడు. క్రమముక్తి సాధించినవారు మండలాలను దాటి బ్రహ్మలో ఐక్యమై, ఆ బ్రహ్మ ఉన్నంతవరకు ఉండి ఆ బ్రహ్మతోపాటు ముక్తులవుతారు.

**'విద్వాన్'** అంటే స్వరూప సాక్షాత్కార జ్ఞానము పొందినవాడు. 'అమృతం'– అమృత స్వరూపుడయాడో, ' ఇహ భవతి'– ఇక్కడే ఇచ్చోటనే, ఈ శరీరంలో ఉండగానే, ఎక్కడా లోకాంతర ప్రయాణం చెయ్యకుండానే, ఇక్కడికిక్కడే, సద్యోముక్తి పొందుతాడు. ఎక్కడ వున్నవాడు అక్కడే! కాశీలో చావక్కర్లేదు. ఉత్తరాయణ పుణ్యకాలము కోసము ఆగనవసరములేదు.

దక్షిణాయనమైనా, ఇంట్లోనైనా ప్రమాదం లో నైనా ముక్తుడు ఎలా పోయినా పెద్ద లెక్క ఏమీ లేదు. ఏ రోజు ఏ కాలంలో చనిపోయినా పర్వాలేదు.

కావున సాధకుడు నిత్యానిత్య వస్తు వివేకం అభ్యాసముచే తాను నిత్య మైనటువంటి స్వరూపుడైనటువంటి బ్రహ్మము అని భావించి, దానికి వ్యతిరేకమైన అసద్రూపమైన, తాత్కాలిక సత్యమైన, ఇంద్రజాలమువలే తోచినటువంటి, అవిద్యా ఉపాధులను లేనివి లేనట్లుగా, చూసుకోవాల్సిన అభ్యాసము చేయాలి. దానిద్వారా వచ్చే వ్యవహారాలు, వికారాలు నిరశించాలి. మిథ్యా భావంతో చూడాలి. అదీ ఇప్పుడు నీ సాధన.

**ఇహాముత్రార్థ ఫల భోగవిరాగము:** ఇహము అంటే ఈ ప్రపంచము. ప్రస్తుతము భూలోకము. ఆముత్రము అంటే ఆముష్మికము, వేరే లోకముగానీ పై లోకాలుగానీ. ఏమున్నాయి పైలోకాలు? భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములు. ఇవి ఆముత్రములు, ఆముష్మికములు. ఇహములో ఉన్నవన్నీ కూడా ఒక వర్గముతో, ఒక సమూహముతో ఇంద్రియ సమూహముతో వస్తు సమూహముతో సంపర్కంపెట్టి, పెద్దగా సంసారంగా, బంధంగా ఉంది. ఇది ఒక వర్గం.

అపవర్గం అంటే ఈ వర్గం లేకపోవడం. ఏకంగా ఉండి అనేకత్వము లేకపోవడమే అపవర్గం. కొంతమంది స్వర్గాన్ని అపవర్గం అంటారు. కొంతమంది మోక్షాన్ని అపవర్గం అంటారు. కనుక ఈ వర్గాన్ని స్వర్గంగా తీసుకోవచ్చు. యజ్ఞ యాగాదుల వల్ల స్వర్గలోక సుఖం కలుగుతుంది. యజ్ఞం వలన యజ్ఞ ఫలితంగా స్వర్గలోక భోగం కలుగుతుంది. అదీ ఆ ముత్ర ఫలభోగ ఫలితం. ఇటువంటి భోగాన్ని వైరాగ్యముచేత విడిచిపెట్టాలి.

అనగా ఇహలోకమందు కర్మ జన్యములైన, అనిత్యములైన స్రక్చందన వనితాది భోగములందు వైరాగ్యం ఉండాలి. స్రక్చందనం అంటే– అత్తరు సెంట్లు గంధము సువాసనలు మొదలైనవి. వనితాది– స్త్రీ వలన సంసార భోగంతో స్త్రీలు అయితే వనితాది అన్నప్పుడు దానికి వ్యతిరేకం తీసుకోవాలి.

పురుషులకు వనితలతో ఉన్న సంబంధం గాని ఎవరైతే స్వచ్ఛందంగా భోగాలుగా తీసుకుంటున్నారో, అటువంటి విషయభోగములందు, అంటే శబ్ద స్పర్శ రూప రసగంధ, స్త్రీ – ఈ రకాల భోగాలయందును, స్వర్గలోకమును కూడా వైరాగ్యముతో విడువవలెను. యజ్ఞయాగాదులవల్ల, క్రతువులవల్ల కలిగే భోగమును వైరాగ్యముతో విడువవలెను.

అనిత్యములైన రంభాది అప్సరస స్త్రీల సంభోగాల యందునూ, ఎలా చూడాలి అంటే? 'వమనాన్నము'వలె తిన్న తరువాత వికారం కలిగి వాంతి చేసుకున్న అన్నమువలె, దానియందు ఇచ్ఛ లేనట్లుగా, అలాగే మూత్ర పురీషాదులయందు మలమూత్రాలు విసర్జన చేశాడు, ఆ మలమూత్రాలు వదిలేస్తాం. అలా వదిలేదే వైరాగ్యము.

ఇది ఇహాముత్రార్థ ఫల భోగ విరాగము. ఇట్టి వైరాగ్యము లేనిచో జనన మరణములు ఉండును కాని మోక్షము లభించదు. అనగా నిత్యమగు బ్రహ్మ జ్ఞానము ఉండదు. అంటే **"క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి"** పుణ్యం కనుక క్షీణిస్తే, పుణ్యం ఎంత పరిమాణంలో ఉందో, అంత పరిమాణం స్వర్గంలో ఉండి, అనుభవించి, మరలా మర్త్య లోకానికి భూలోకానికి పంపబడతాడు.

త్రిశంకుడిని భూలోకానికి పంపితే, స్వర్గమునుండి నేను పోనని కూర్చున్నాడు. త్రిశంకుడు స్వర్గంలో ఆ సుఖభ్రాంతిలో ఉన్నాడు. కానీ అది ఎంత కాలం? మరల ఈ లోకంలో పడి పునర్జన్మ పొందాడు.

అరిష్టనేమి అని ఒకడున్నాడు. అతడు గొప్ప సాధకుడు, విరాగి, మోక్షేచ్ఛ గలవాడు. ఇంద్రుడు అది తెలిసి అరిష్టనేమిని స్వర్గానికి రప్పించుకుందామని మాతంగుడు అనే రథసారథిని రథముతో సహా పంపించాడు. ఆ మాతంగుడు అరిష్టనేమి వద్దకు వచ్చి విషయము చెప్పాడు.

అక్కడ స్వర్గంలో ఏముంటుంది? ఎంతకాలం ఉండవచ్చు? అని అడిగాడు. అరిష్టనేమికి మాతంగుడు స్వర్గలోక సుఖాలను వివరించి, ఆ పుణ్య ఫలితము ఖర్చుకాగానే మళ్ళీ భూలోకానికి పంపిస్తారు అని చెప్పాడు.

అంత మాత్రానికి ఎందుకు నా టైమ్ వేస్ట్ చేసుకోవడం? నేను అక్కడకు రాను, ఇక్కడే నా సాధన నేను చూసుకుంటాను అన్నాడు అరిష్టనేమి. రథాన్ని మరలా వెనక్కి తిప్పి పంపించాడు ఇదీ కథ.

ఎందుకని? పుణ్యం నశించగానే మరల మర్త్యలోకమునకు వచ్చి మరల జననమరణాలు పొందాలి. ఈ మానవజన్మ ఉత్కృష్టం. ఇది కర్మభూమి. ఈ ఉపాధితో కర్మ చేయొచ్చు. సాధన అనే కర్మ చేస్తూ జ్ఞానాన్ని సంపాదించవచ్చును. ఆ అవకాశం పశుపక్ష్యాదులకు లేదు. దేవతలకు కూడా లేదు. దేవతలకు కూడా మోక్షంరావాలంటే మానవ జన్మ ఎత్తాలి. అటువంటి మానవజన్మ వదులుకుని స్వర్గలోకంలో కాలక్షేపం చేస్తే టైం వేస్ట్ చేసుకున్నట్లే కదా! ఈ జన్మను పూర్తిగా దీనిని వినియోగించాలి. కనుక ఆ రకంగా ఆ స్వర్గలోక సుఖం కూడా శాశ్వతము కాదు.

నిత్య వర్తమానంగా, నిత్యతృప్తంగా ఉండే శాశ్వతమైనది ఆ బ్రహ్మానందమే గొప్పది. బ్రహ్మజ్ఞాని అయినప్పుడు అదీ మోక్షం. అంతేకానీ ఈ తాత్కాలిక ఇంద్రలోకం గాని, స్వర్గలోకం కాని, బ్రహ్మలోకం గాని ఇలా లోకాలన్నీ కూడా ఇహ, ఆ ముత్ర ఫలభోగం క్రిందికే వస్తాయి.

**లోకంబులు లోకస్థులు లోకేశులు తెగిన తుది నలోకంబగు పెంజీకటి కావల** అన్నారు. 7 ఊర్ధ్వలోకాలు దాటి, ఏ లోకము లేనట్టి స్థితి అలోకము. అలోకములో ఏమయింది? పెను చీకటి అనే గాఢ తమస్సు. దానికి కూడా ఆవలది పరమపదము.

చతుర్విధ గురుశుశ్రూషల ద్వారా, నీవులేని పద్ధతిలో సేవచేసి, ఆ సేవద్వారా నీవు లేనివాడవై, ఆ లేని అశరీరి గురువులో మమైకమవాలి. అదీ సేవ. అక్కడికెళ్లాలి. దాన్ని అలోకము అంటారు. ధామము అంటారు. దానిని వైకుంఠధామము అంటే, ఒప్పుకుంటాను. వైకుంఠ లోకం కాదు. సామీప్య, సాలోక్య ముక్తులు కూడా భోగము కిందకే వస్తాయి. కనుక ఇది కాదు ఇది కాదు అని, విరాగముతో వదిలి, అన్నింటిని అధిగమించినటువంటి స్థితిలో, నీవు నీవైనట్టి, అపరోక్షానుభూతిలో ఉంటావు.

**శమాది షట్క సంపత్తి :** ఇది శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము. క్రింది పాఠాలే పై పాఠాలుగా చెప్పడం జరుగుతోందిక్కడ. 1. శమమనగా అంతరింద్రియములైన, మనస్సు బుద్ధి చిత్తము అహంకారములను, విషయములందు పోనివ్వక, నిగ్రహించి సద్గురు చరణాలయందు నిలుపుట. సద్గురు చరణాలు అంటే సృష్టిలోకి వచ్చిన ఒక వంతు బ్రహ్మను కాకుండా సృష్టిలోకి రాని 3 వంతుల బ్రహ్మజ్ఞానం ఎవరికైతే ఉందో అట్టి సద్గురువు అతడు మూడు వంతుల బ్రహ్మజ్ఞానంతో ఉంటూ, మాయావరణలో సృష్టిలోకి వచ్చి శిష్యునికి అందుబాటు అయ్యాడు. ఈ మాయలో దొరికిన గురుచరణాలను పట్టుకుంటే, మాయకు అవతలి దాకా వున్నటువంటి "గురుస్సాక్షాత్పరబ్రహ్మ"అన్న అనుభవంలో ఉన్న గురువును పట్టుకుంటే, ఆ గురువులో మమైకమయితే నీవుకూడా గురుస్సాక్షాత్పరబ్రహ్మ అనేటటువంటిదే! గురుచరణాలను పట్టుకోవడం అంటే ఆ అర్థంతో పట్టుకోవాలి.

అశరీరి గురువుకు శుశ్రూష ఎలా చేస్తారు? శరీర భ్రాంతిని వదలి చేయాలి. స్థానమే లేని గురువుకు ఏ స్థానంలో ఉండి చేస్తావు? ఏ లోకంలో ఉండి చేస్తావు? ఏ స్థానము లేదు అనేటటువంటి భేదాలు లేని స్థితిలో, గురు శుశ్రూష చేయాలి. నీకే స్థాన భేదం ఉండకూడదు. అలాగే నీకు ఏ భావమూ ఉండకూడదు. అలాగే నీలో "నేను నేను" అనేది రాకుండా చూచుకోవాలి. ఆత్మ శుశ్రూష అంటే శిష్యుడుగా "నేనుగా" లేకుండా పోవాలి. అట్లా చతుర్విధ శుశ్రూషలను అంతరార్థముగా చేయాలి. అది చేయాలి అంటే శమము ఉండాలి.

**శమము:** మనకొక లక్ష్యం ఇచ్చారు, ఏమని? “సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ” అని ఇచ్చారు. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అనేదానితో నీవు ఉండాలి. అక్కడ సౌకర్యంగా వుండాలి. ఆ లక్షణ యుతుడై ఆ లక్షణంతో కూడి ఉండాలి. ఆ లక్షణాలతో ఉన్న అపరోక్షానుభూతిలో ఉండాలి. ఇదీ లక్ష్యం. శమం అంటే అలా ఉండిపోవడం. అలా ఉండలేకపోతే ఏమవుతుంది? మళ్ళీ శమాన్ని సాధన చేయాలి. ఆ లక్ష్యంతో ఉండే సాధన చేయాలి. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అనే దానిలో ఉండటానికి అలవాటు పడాలి. అది శమం. దీనినే తత్త్వానుసంధానము అంటారు.

**దమము:** ఒకవేళ లక్ష్యంనుండి జారిపోయావు అంటే జారిపోకుండా నిగ్రహించాలి. లక్ష్య స్థితినుండి జారిపోకుండా నిగ్రహించడమే దమము. ఇక్కడ దమము అంటే అంతరింద్రియ బాహ్యేంద్రియ నిగ్రహం కాదు. ఇక్కడ దమము అంటే నీ స్వరూపమునుండి జారిపోయే పరిస్థితి రాగానే వెంటనే సాక్షిగా దానిని గ్రహించి, వెంటనే నీ ధ్యాననిష్ఠని, సమాధినిష్ఠని, అనుసంధించి జారిపోకుండా తీసుకునే జాగ్రత్తలను దమము అంటున్నాం.

**ఉపరతి తితిక్ష :** సాధన కాలంలో ఆ బ్రహ్మ నిష్ఠలో ఉండటాన్ని ఆస్వాదించటం ఉపరతి. ఈ ఉపరతి అనే పద్ధతిలో ఆ బ్రహ్మనిష్ఠని ఎవరయితే ఆస్వాదించగలుగుతారో, నిత్యము ఆనందానికి మరుగుతారో, ఇది ద్వైతమే, అయినాగాని అటువంటి ఆస్వాదనను అడ్డం పెట్టుకుని, ప్రపంచంలో ఉన్న ద్వంద్వాలు, వాటివల్ల కలిగిన బాధలను ఓర్చుకోవడం, సహించడము తితిక్ష.

**శ్రద్ధ సమాధానము :** శమదమాలు ఉపరతి తితీక్ష,ఈ నాలుగు అయిన తరువాత తత్త్వానుసంధానము చేయడానికి, 4 మహావాక్య అర్థాలను, గురువుద్వారా శ్రవణం చేసి, మననం చేయడానికి శ్రద్ధ తోడ్పడుతుంది. ఈ శ్రద్ధవల్ల కలిగిన ఏకాగ్రతతో బ్రహ్మ నిష్ఠలో ఉండేది సమాధానము. ఈ బ్రహ్మ నిష్ఠలో ఉండిపోవడం అనేది సమాధానం.

ఇలా వరుసగా ఆరింటిని చెప్పినప్పటికీ, శ్రద్ధగా చేయాలి. సమాధానంలో కలిగిన బ్రహ్మ నిష్ఠలో శమించి ఉండాలి. జారి పోకుండా ఉండాలి అంటే దమాన్నిపాటించాలి. శమదమాలు వచ్చాయి అంటే, దీన్ని ఏదో శాస్త్రం చెప్పిందని ఏదో గురువు చెప్పారని నిగ్రహించడం మొదలుపెట్టి, నిగ్రహించడం నావల్ల కావడం లేదు అంటారేమోనని ఉపరతి చేర్చారు

గురువు నీకు అర్థమయ్యే రీతిగా చెపుతూ ఉంటే, అటువంటి గురు దర్శనంతో ఆనందపడిపోతూ ఉండాలి. అదీ ఉపరతి. దాన్ని మీరు కన్వీనియంట్‌గా తెచ్చిపెట్టుకోవాలి. అవసరార్థం తెచ్చుకోవాలి. అలా చేయాలి అంటే అందరికి రాదు. ప్రీతితో తెచ్చుకోవాలి. బ్రహ్మానందంలో మనం, ఆనందం తెచ్చుకుని ఆనందపడాలి. అది ఉపరతి అంటే.

**శ్లోకం: యతో యతోనిశ్చరతి, మనశ్చంచలమస్థిరమ్!**
**తథాస్తు తో నియమ్యై తదాత్మన్యేవ నసంశయేత్!!**

మనస్సు వేదాంత శ్రవణమునకు బదులుగా, వ్యతిరిక్తమైన విషయాదులందు పోవుచుండిన, దానిని మరల్చి వేదాంత శ్రవణమునందు నిలుపుట.

ఆ నిలపటంకోసం ఆ మనస్సుకు ఈ విధమైన గట్టి సంకల్పం ఉండాలి. అంతర్ ఇంద్రియములు అనగా మనసు సంకల్పిస్తుంది. అంటే కోరికలు పుట్టిస్తుంది. బుద్ధి నిశ్చయిస్తుంది. చిత్తము చలిస్తుంది, సందేహాలు పుట్టిస్తుంది. అహంకారం కార్య ఫలము ఎట్లగునో కదా! అని, విచారమునకు ఎడమీయక, మూర్ఖముతో ఆ కార్యమును చేయించును. కాని జగమొండిగా ఆ నాలుగు అలా చేయకుండా పట్టుబట్టాలి. ఇవియే అంతర్ ఇంద్రియములు, వాని విషయములు.

**“పట్టుపట్టరాదు పట్టిన పట్టు విడువరాదు, పట్టినపట్టు విడచుట కంటే, చచ్చుట మేలయ్యా”**

ఈ శమదమాల విషయంలో అంత మంకుపట్టు ఉండాలి. జగమొండి అయిపోవాలి. ఎందుకంటే ఆ మనస్సు అంతమొండిది. దానికంటే నీవు జగమొండి అయితే తప్ప, అది నీ మాట వినదు.

ఇట్లెరిగి చంచలమైన మనస్సు విషయములందు సంచరించుచున్నది. దానిని ఆయా విషయములనుండి మరలించి గురూపదిష్ట మార్గముగా, అంటే ఒక హంసమంత్రం ఇచ్చి హంస స్వరూపమును తెలిపి, హంసయొక్క భేదాలు తెలిపి, పరమహంస యొక్క శక్తి ఎలా చూపించారో, ఆ పరబ్రహ్మ లక్ష్యములో ఈ శమదమాదులు పాటించాలి. అది గురూపదిష్ట మార్గము.

ఎందుకంటే గురువుగారు మొదట హంస మంత్రం ఇచ్చారు కదా! ఆ హంస ద్వారా హంస యొక్క భేదాలను నిరశించి యోగసాధన ద్వారా గ్రంధి త్రయ భేదనం చేసి, షట్చక్రాలను షట్కమలాలుగా మార్చుకుని, ఆజ్ఞా చక్రమును చేరి అక్కడనుండి శ్రీవిద్యా చక్రంతో భూమా ద్వారా, సహస్రారంలో దర్శించి, చివరకు ఆ దర్శనంలో నిన్ను నీవు కోల్పోయినప్పుడు, ఆ దర్శన రూపమే, మీ దృక్స్వరూపంగా తత్, త్వంలకు భేదం లేనిస్థితికి నీవు వెళతావు. అభేద స్థితే పరమహంస కనుక, అదీ గురూపదిష్ట మార్గం.

అనేక మార్గములు చెప్పారు గురువు. తత్త్వ విచారణ మార్గం, కుండలినీ మార్గం, గ్రంధి త్రయ భేదనం, నాదాను సంధానమార్గం, క్రియాయోగం చెప్పారు. మీకు ఎవరెవరి పూర్వజన్మ సంస్కారంబట్టి, ఏది సులభంగా మీకు అబ్బిందో, ఆ తేలికైనది కొనసాగించుచూ, అభ్యాసము చూసేది గురూపదిష్ట మార్గం.

ఆ గురువు ఉపదేశించిన చూపించిన మార్గంలో, ఆయన పర్యవేక్షణలో, క్రిందపడిపోయినప్పుడల్లా ఆ గురువు నిన్ను రక్షిస్తూ ఉంటే, ఆ గురు బోధకు పాత్రులై ఉండాలి. అది గురూపదిష్ట మార్గంలో వెళ్ళడం అంటే,

ఇవన్నీ శమము దమము అన్నీ ఒకేసారి చెప్పేశాము, నీలో పట్టుదల పెరగాలి అంతే. కష్టమైనది అంతా తేలిక అయిపోయింది. లక్ష్యాన్ని పెట్టుకోండి. ఏ లక్ష్యాన్ని పెట్టుకోవాలి? ఆ లక్ష్య సాధన ఎంత తీవ్రంగా ఎంత పైస్థాయిలో పెట్టుకున్నారో, అప్పుడు ఈ క్రింది స్థాయి వన్నీ, వదిలేస్తారు. సాధన అంటే ఎంత సేపు క్రిందే చూస్తారు, సాధనాచతుష్టయాన్ని క్రిందే చూసి నాకు రజోగుణం పోలేదు అంటారు. అలా కాదు.

కనుక ఏ స్థాయిలో సాధన చేస్తున్నారు? ఆ స్థాయిలో కూడా చేయాల్సిందే, కాదనటము లేదు. కాని ఇప్పుడు బోధ ఈ సర్వ వేదాంత శిరోభూషణము లో **"బ్రహ్మసత్యం జగన్మిథ్య"** అనేదాన్ని పెట్టుకుని, లక్ష్యంగా **"సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ"** అని తీసుకుని, ఈ కనపడేదంతా **"సర్వం ఖల్విదం బ్రహ్మ"** అనేది, ఈ కనపడేది నామరూపం కాదు బ్రహ్మమే అని తీసుకుని, భోగాలన్నీ కల్పితమని ఎంచి, వైరాగ్యాభ్యాసము చేయాలి. ఎంతటి వైరాగ్యం రావాలంటే ఇహలోకంలో గాని 7 ఊర్ధ్వ లోకాలలో గాని, ఎక్కడ ఎటువంటి ఆనందం కలిగినా, దాన్ని కూడా ఆపై దానిలో వచ్చే ఆనందాన్ని కూడా, కాకి రెట్టలాగా వమనాన్నంలాగా, విసర్జించిన మలంలాగా మరల వాటివంక చూడకుండా ఎలా అయితే ముఖం ఉంచామో, అలా ఆ ప్రపంచంవైపు చూడకుండా ఆ ముఖాన్ని బ్రహ్మ జ్ఞానం అనే లక్ష్యంవైపు త్రిప్పాలి. ముఖం అలా చెప్పడమే ఉపరతి.

ప్రపంచంవైపు ఉన్న దృష్టిని బ్రహ్మవైపు తిప్పడమే ఉపరతి. మీ లక్ష్యం దగ్గర మిమ్మల్ని పెట్టుకొని ఈ ప్రపంచాన్ని మీకు క్రింద ఉన్నట్లుగా భావించి పైనుండి కిందకు చూస్తే ఈ సాధనలు అన్ని అల్పమై ప్రాధాన్యత లేనివిగా ఉంటాయి.

ఒక బాణాన్ని ఒక పక్షిని కొట్టడానికి ఎంత దూరంలో ఉన్నదో చూసి ఇక్కడినుండి బాణం తగిలి పడిపోవాలి అనే లక్ష్యంతో, గురిపెడతాము. ఎలాగైనా పక్షికి బాణం తగలాలి. బాణం పక్షికి తప్పనిసరిగా తగలాలి అంటే బాణం యొక్క వేగం కొంచెము ఎక్కువ ఉండాలి. పక్షికి తగిలిన తరువాత కూడా కొంత దూరం ఆ పక్షి బాణంతోపాటు పోయి క్రింద పడుతుంది.

అలాగే ఉపరతికి కూడా ఎంతవరకు? అంతవరకే కాకుండా కొంచెం ఎక్కువగా పెట్టుకోవాలి. ఎక్కువగా పెట్టుకున్నప్పుడు ఖచ్చితంగా ఆ పక్షికి బాణం తగిలి బాణంతో సహాపక్షి కొంతదూరంలో పడుతుంది. మన సాధనలో కూడా లక్ష్యానికంటే ఎక్కువగా పెట్టుకోవాలి.

అందుకని ఆ ఉపరతి అనేది ఆ బ్రహ్మ వైపు పెట్టిన దాన్ని, ఎంత ఎక్కువగా పెట్టుకున్నారో, దాన్నిబట్టి ఆ లక్ష్యాన్ని సాధించడంలో, మనం ఉత్తీర్ణులను కాగలము. శ్రద్ధ అంటే ఆ పక్షికి గురి తప్పకూడదు. శ్రద్ధ ఏకాగ్రత వల్లే ఆ పక్షికి గురి సరిగా ఉంటుంది. నీవు ఎంత వేగం పెట్టినా గురి తప్పితే ఎలాగా? శ్రద్ధ, వేగం రెండూ ఉండాలి. ఉపరతి వల్ల ఆ లక్ష్యాన్ని ఛేదించడానికి మరింత దూరాన్ని లక్ష్యంగా పెట్టుకున్నావు. శ్రద్ధవల్ల గురి తప్పకుండా చేసుకున్నావు. సమాధానం ఏమిటి అంటే బ్రహ్మ జ్ఞానం. పక్షిని కొట్టేశావు. అది సమాధానం.

నీ ఆలోచన, నీ భావాలు, నీ అభిప్రాయాలు అనిత్యమైనటువంటి ప్రపంచంమీద, అనిత్యమైనటువంటి నీయొక్క ఉపాధుల మీద, అనిత్యమైనటువంటి ఇంద్రియ భోగాలమీద పెట్టకుండా, దానిని వెనక్కి త్రిప్పడం అంటే ఉపరతి. వెనక్కి త్రిప్పి, శాస్త్రముయందు శాస్త్ర వాక్యములయందు, గురువుయందు, గురువాక్యములయందు అభిలాష కలిగించుకోవడం ఉపరతి. దాని మీద అభిలాష పెంపొందింప చేసుకోవడం ఉపరతి. ఒక ప్రక్క ఉపరతి పెట్టుకుని, రెండవ ప్రక్క బాహ్య ప్రపంచ ఇంద్రియ భోగాల విషయంలో దమించటం, నిగ్రహించటం, చేయాలి. బాహ్యంలో ద్వంద్వాలుంటాయి. ద్వంద్వాల విషయంలో విషయ సమత్వం పాటించాలి. విషయ సమత్వమే తితీక్ష. విషయ సమత్వము పాటించడంలో నీ యొక్క ఓర్పు, సహనముతో ఉంటూ, కలిగే భోగమును వైరాగ్యముతో విడువవలెను. అయితే అయ్యిందిలే, పోతే పోయిందిలే అనే త్యాగము. ఇవన్నీ కూడా తితీక్ష క్రిందకి వస్తాయి. **"యదా సంహరతే చ అయం కూర్మోంగానీవ సర్వశః। ఇంద్రియాణి ఇంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా"** ఏ విధంగా అయితే తాబేలు, తన అవయవాలని, తన ముఖాన్ని బయటకున్నవాటిని, బయటకు ఉండేటటువంటి వ్యాపారాన్ని విరమించి, అన్నీ లోపలకు ముడుచుకుంటుందో, ఆ విధంగా మనం బహిర్ముఖ వ్యాపారాన్ని, ఇంద్రియ భోగాల్ని, విషయాల్ని, విషయీకరించుకోవడాన్ని కూడా ఆపి, వెనక్కి మరల్చి, జ్ఞాన నిష్ఠలో అంతర్ముఖం కావాలి.

అట్టివాని బుద్ధియే స్థిరబుద్ధి. మనం చేయాల్సింది ఏమిటంటే, ముందు మనస్సుని వైరాగ్యంతోటి, బాహ్య విషయాలనుంచి వెనక్కి మరల్చాలి. అందుకే మొట్టమొదట ఏం చెప్పాం? నిత్యానిత్య వస్తు వివేకం. దాంతో నీ లక్ష్యం తెలిసింది. నిత్యమైనదానిమీద పెట్టాలి, అనిత్యమైనదానిమీద నుంచి వెనుకకు మరల్చాలి అని. రెండవది ఇహ ఆముత్ర ఫలభోగ విరాగము. భోగ విషయాలమీద ఉన్న రాగాన్ని వదలిపెట్టాలి. దానిపై అపేక్షని వదిలెయ్యాలి. దాన్నే వైరాగ్యం అంటున్నాము. వైరాగ్యం అభ్యాసం అయిన తరువాత అప్పుడు శమాది షట్క సంపత్తికి వచ్చాము. అయితే వైరాగ్యం పరిపూర్ణంగా అభ్యసించి, చివరికి ఏ రాగము లేని పరిస్థితికి వచ్చామా? అంటే, వైరాగ్యం ఉండాలి, విడుదల పొందాలి అని తెలిసింది. కొంత కొంత విషయాలమీద తూష్ణీభావం వచ్చింది. దాన్ని పట్టించుకోకుండా ఉండడాన్ని తూష్ణీభావం అంటారు. పట్టించుకోకుండా ఉండేదానికి వచ్చావు. అయినా కాని, నీ ఇంద్రియాలు ఊరుకోవుగా! అంతకు ముందు ఉన్న అలవాటు ప్రకారము, రాగద్వేషాలు ద్వంద్వాలలోకి వెళ్తాయి. అప్పుడు మూడవది ఏమిటంటే శమము, దమము, తితిక్ష. ఈ ఆరింటినీ విడివిడిగా చెప్తున్నాము గాని, ఈ ఆరూ కలిసే జరుగుతాయి. స్థిరంగా ఉండడము, స్థిరత్వం పోయినప్పుడు మళ్ళీ దానిని నిగ్రహించి, స్థిరత్వానికి వెనక్కి లాక్కురావడము. స్థిరత్వం అంటే ఏమిటి? ఆత్మ నిష్ఠలో ఉండడమే స్థిరత్వము. ఆ స్థిరత్వము చెడకుండా ఉండడమే శమము. స్థిరత్వం చెడిపోతే వెనక్కు లాక్కోవడమే దమము.

వెనక్కి లాక్కోవడం ఎప్పుడు సాధ్యమౌతుంది? ద్వంద్వాలుగా, సుఖదుఃఖాలుగా, రాగద్వేషాలుగా ఉన్నదానిని విచారణ చేసి, దీనికి ఇంతరాగమెందుకు? దీనికి ఇంత ద్వేషమెందుకు? ఇది వరకులాగా, నా మనసు అటు పరుగెడుతోంది, ఇప్పుడు నిత్యానిత్య వస్తువివేకము, లక్ష్యము తెలిసిందిగా! వదలాల్సింది తెలిసిందిగా! దానిమీద వైరాగ్యం వచ్చింది. దాని థియరీ ప్రకారం వచ్చింది. ప్రాక్టికల్ చేయాల్సి వచ్చేసరికి, శమదమాలు చేయాల్సి వచ్చింది. కాబట్టి, ఆ భావంతో నువ్వు నిగ్రహిస్తే, నిగ్రహం సాధ్యమౌతుంది. అనిత్యవస్తువును అపేక్షించడము నుంచి నేను దూరం కావాలి అనే దానిమీద, అనిత్య వస్తువుమీద వైరాగ్యాన్ని పెంపొందించుకోవడం ద్వారా, బహిర్ముఖమైన, ఇంద్రియ భోగ సంబంధమైనటువంటి వస్తువులు, విషయాలు, మనుషులు వానిమీద ఉండే రాగద్వేషాలు, మమకారాలు, అభిమానాలు ఇవన్నీ కూడా పూర్తిగా విసర్జించాలి.

ద్వంద్వాలలోకి మనసుపోయే దానిని న్యూట్రల్ చేయాలి, తటస్థం చేయాలి. విషయాల్ని రెండుగా విమర్శించడం మానేసి, రెండు రకాలుగా ఉన్న విషయాల్ని ఒక్కటిగా చూసే దృష్టి రావాలి. సుఖాన్ని, దుఃఖాన్ని ఒక్కటిగా చూసే దృష్టి ఉండాలి. అంటే ఆపదలందు క్రుంగక, సంపదలందు పొంగక ఉండాలి. ఒకదానిమీద రాగము, మరొక దాని మీద ద్వేషము అనేటటువంటి తేడాలు ఉండకూడదు. పక్షపాత బుద్ధి ఉండకూడదు. నిష్పక్షపాతంగా ఉండాలి. బుద్ధిలో ఏ వృత్తి అయినా ఒక్కటిగానే ఉండాలి. ఆహారంలో ఏ ఆహారమైనా ఒక్కటిగానే ఉండాలి. ఒక వేళ ఆప్షన్ వస్తే, ఆరోగ్యానికి పనికి వచ్చేది, దానికే ఈ ఆప్షన్. అంతేగాని ఇష్టాయిష్టాలను బట్టి కాదు. ఆపేక్షను బట్టి కాదు. ఆస్వాదించడాన్ని బట్టి కాదు. ఇవన్నీ తితీక్ష క్రిందకు వస్తాయి. ఈ తితీక్ష సక్సెస్ కావాలంటే, ఉపరతి కావాలి. చిన్నపిల్లవాడు ఒక వస్తువు వదిలేయాలి అంటే, ఇంకొక ఆకర్షణ ఉన్న రెండవ వస్తువు ఇస్తే, ఆ వస్తువు వదిలేస్తాడు. ఆ విధంగా ఉపరతి ద్వారా వదలాల్సింది తెలిసిన తరువాత తితీక్ష ద్వారా వదులుతూ ఉన్నప్పుడు, వదలడంలో కొంచెం కష్టం వచ్చింది కాబట్టి, ఇదంతా మనం దేనికి చేస్తున్నాము? మోక్షం కోసం. మోక్షం అంటే ఏమిటి? బ్రహ్మని పొందడం. దానికి ఏం చేయాలి?

బ్రహ్మకాని ఇతరములన్నీ కూడా వదిలేయడం. బ్రహ్మకాని వస్తువులన్నీ కూడా వదిలేయడం. మన లక్ష్యం అదేగా! వదిలేయాలన్నదానిమీద వైరాగ్యం పెరగాలి. రెండవ ప్రక్క మోక్షముమీద ఇంకా ఇంట్రస్ట్ పెంచుకుంటే, అన్యము పోతుంది. రెండవ ప్రక్క ఆసక్తి ఇక్కడ ఏముంటుందని అసలు?

ప్రపంచం విషయంలో ఒకదానిబట్టి, మరొకదాని మీదకు ఆసక్తిని మార్చుకోవచ్చును గాని, అసలు ప్రపంచమే వద్దంటే దేని మీద ఉంటుంది ఆసక్తి? దేనిమీద ఆసక్తి ఉంటుందంటే, బ్రహ్మ విషయమే. బ్రహ్మ విషయం ఎక్కడ దొరుకుతుంది? శాస్త్రంలో దొరుకుతుంది.

ఆ శాస్త్రం నీకు అర్థమయ్యే రీతిలో, నీకు తెలిసిన భాషలో, నువ్వు చదువుతూనో, ఎవరైనా చెప్తుంటే వింటూనో, శ్రవణం చేస్తూనో దాన్ని సాధించాలి. అది మొదట్లో కష్టంగా ఉంటుంది. ఎన్ని సార్లు చెప్పినా నిద్ర వస్తుంది, చెప్తుంటే వినేవారికి. గురుబోధ వినేప్పుడు నిద్రలోకి వెళ్ళిపోతారు. ఎందుకని?

బహిర్ముఖ విద్య అంటే మీకు ఆసక్తి ఉంది కాబట్టి నిద్ర రాదు. అంతర్ముఖ విద్య మీకు తెలియదుగా! తెలియని దానిని ఎప్పుడైనాసరే చెబుతూవుంటే, నిద్ర వస్తుంది. మనసు ఎప్పుడూ తెలుసుకున్నదే, తెలుసుకుంటూ ఉంటుంది. పాత తెలుసుకున్నదానిమీద విషయము ఒక వాసనగా ఉంటుంది. ఆ వాసనే ప్రేరేపించినప్పుడు చిత్తవృత్తి అయ్యి, మళ్ళీ విషయమౌతుంది. ఆ విషయం కొత్తది రాదు. పూర్వ అనుభవ జ్ఞానమే వాసనారూపంగా ఉండి, చిత్తవృత్తిగా మారి, నువ్వు పుట్టిన తరువాత ఆ విషయం కొత్త కావచ్చేమో, నీవు పుట్టిన తరువాత, నీ సంస్కారాన్ని బట్టి వచ్చే విషయము, పాత జన్మలో పాతదే, నీ అనుభవములో ఉన్నదే. అదే వాసన ఇప్పుడు. ఈ జన్మలో ఆ వాసనకు సంబంధించిన విషయం ఎదురు రాలేదు. మొట్టమొదటగా ఇప్పుడే ఎదురొచ్చింది. నువ్వు కొత్తది అంటావు గాని, నా దృష్టిలో అది పాతది. ఎందుకంటే పాతదే వాసనారూపంలో ఉండి, ప్రస్తుతం అనుభవానికి వస్తున్నది. దానినిబట్టి మనస్సు, తెలిసిన విషయాలనే తెలుసుకుంటుంది. అంతకు ముందు తెలిసిన విషయం మీదనే ఆసక్తిగా ఉంటుంది. తెలిసిన విషయం మళ్ళీ, కొత్తగా చెబితే, అన్ని రకాలుగా వింటుంది. తెలియని విషయం చెబితే నిద్రపోతుంది. మనసు తెలియని విషయం క్రొత్తగా వినాలి అంటే, పాత విషయాల్ని, పాత విషయాసక్తిని కట్టిపెట్టి, కొత్త విషయాన్ని వినడానికి నువ్వు శ్రద్ధ, ఏకాగ్రత సంపాదించాలి.

**శ్రద్ధ** – అంటే ఏమిటి? ఏ విషయం చెబుతున్నానో, ఆ విషయంమీదే గురిపెట్టి ఉండాలి. నీ మనసుని ఇతర విషయాల మీదకు పోనీయకుండా ఆపాలి. ఒక కొత్తవిషయం తెలియాలి అంటే, నీకు తెలిసిన విషయాలు, ఆలోచనలు, ఊహలు శ్రవణానికి దానికి అడ్డురాకుండా పక్కకు పెడితే అదే శ్రద్ధ. శ్రద్ధతోటి, తెలుసుకోవాల్సిన విషయం మీద శ్రద్ధ కలగాలి అంటే, అంత తొందరగా కలుగుతుందా? ముందు దానిమీద ఇష్టం పెంచుకోవాలి.

చిన్నపిల్లలు స్కూలుకు వెళ్ళను అంటే, చదువు సంగతి తరువాత, ముందు స్కూలుకు వెళ్ళిరావడం మీద ఇష్టం పెంచుకోవాలి. రోజూ స్కూలుకు వెళ్తానంటే, ఒక చాక్లెట్ ఇస్తానంటే, చాక్లెట్ కోసం వెళ్తాడు. అక్కడికి వెళ్తే, వెంటనే పాఠాలు చెప్పకుండా, కాసేపు తోటి పిల్లలతో ఆటలు ఆడించి, మధ్యలో వాళ్ళకేదన్నా తినడానికి ఇచ్చి, అక్కడ సాటి పిల్లలతో స్నేహం కలిగిస్తే, ఆ పిల్లలతో ఆడుకోవడానికి వాడికి ఇష్టం వస్తుంది. అది ఉపరతి అంటే. అలాగే శాస్త్రం అర్థమైనా అర్థం అవ్వకపోయినా, ఆ శాస్త్రం మీద అపేక్ష, ప్రియము పెంచుకోవాలి. అది ఉపరతి. ఉపరతి అంటే, విషయాలమీద ఉన్న రతిని ఉపసంహరించి, వెనక్కి మరల్చటం. మరల్చి, బ్రహ్మ విషయంలో, ఆత్మ విషయంలో రతిని పెంచుకోవడం. ఉప అంటే సమీపము. అప్పుడే బ్రహ్మను తెలుసుకుంటే, జ్ఞానమేగా, మోక్షమేగా! అప్పుడే తెలుసుకోలేము. బ్రహ్మయొక్క సమీపానికి వెళ్తాము. సత్సంగము ద్వారా, గురుబోధ ద్వారా, శ్రవణము ద్వారా ఆ పక్కకు వెళ్తాము. ఆ పక్కకు వెళ్ళాలంటే ముందు ఇష్టపడాలి. రోజూ సత్సంగానికి రావాలి. అప్పుడు గురువుగారు ఏం చెప్తారు? ఈ సాధన చతుష్టయ సంపత్తినే, కింది స్థాయిలో చెప్తారు. ఇవాళ మనం లక్ష్యం కోసం పై స్థాయిలో చెప్పుకుంటున్నాము గాని, కింది స్థాయిలో చెప్తారు.

మిడత దీపం అనే రూపాన్ని చూసి, ఆ దీపానికి అంటుకుని మాడి చచ్చిపోయింది. చేప తన జిహ్వాచాపల్యం చేత ఎరను చూసి గాలానికి చిక్కుకుని చచ్చింది. ఏనుగు స్పర్శ జ్ఞానం కోసం, ఆడ ఏనుగు కోసం వెళ్ళి గోతిలో పడింది. రూపాలు చూసి పోయింది మిడత. స్పర్శను చూసి పోయింది ఏనుగు. శబ్దాన్ని చూసి పోయింది లేడి. వేణుగానాన్ని చూసి, వేటగాడి వెంటపోయి, వేటగాడికి చిక్కింది. తుమ్మెద అడవి సంపెంగ పూవులో ఉండి, మకరందం గ్రోలాలనుకుని వెళ్తే, దానితో పాటు విషం గ్రోలింది, అది రాత్రిపూట ముడుచుకునే సరికి, అందులోపడి ఊపిరాడక చనిపోయింది.

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు మనల్ని ఎట్లా బాధిస్తాయో ఐదు ఉదాహరణలు చెప్పాము. ఇక నిద్రపోయి వింటారా? కథలు కదా! చక్కగా వింటారు. కనుక అది ఉపరతి. ఆ గురువు కూడా మిమల్ని ఎలా నడుపుతారంటే, ముందు కథలతో తీసుకెళ్తారు, ఉపమానములతో తీసుకెళతారు. పురాణాలలోని పాత్రలను ఆ కథతో సహా ఉదహరిస్తారు. ఉపరతి కోసమే! రాగము, ద్వేషము, అరిషడ్వర్గము, అహంకారము, అసూయ, ఈర్ష్య, అసూయ, అహంకారము, దంభము, దర్పము 13 ఉన్నాయి. ఆ పదమూడింటికి 13 కథలిచ్చాము. బిగినర్స్‌కి, అప్పుడే వచ్చేవాళ్ళకి. ఆ పిల్లలకి రైంస్ చెప్పి, బట్టీపెట్టించి, సంభాళించినట్లుగా. అయితే ఇందులో మాత్రము పనికొచ్చేదాంట్లో దింపాము. పనికిరానిదాంట్లో దింపలేదు. అక్కడ స్కూల్లోకూడా రైంస్‌లో, వాటిల్లో వీటిల్లో కూడా, ఉచ్చారణ కాని, స్పష్టంగా మాట్లాడడం కాని, ఇవన్నీ కూడా వస్తాయి, ఎందుకు రావు? అంతా ఉపయోగపడేదే. అక్షరాభ్యాసం లేనిదే అవ్వదు. అక్షరాలు నేర్వందే అవ్వదు. గుణకారాలు చేయందే అవ్వదు. ఇవాళ కంప్యూటర్ వచ్చినా, కాల్క్యులేటర్ వచ్చినా, చిన్నప్పుడే కాల్క్యులేటర్ నేర్పకూడదు. వాళ్ళకి బుద్ధి పదును పెట్టాలంటే అవన్నీ చెప్పాలి. అలాగే, అంతర్ముఖ విద్యలో కూడా.

ఆత్మజ్ఞానం కావాలి అంటే, ఉపరతి – దాని మీద ఇంట్రెస్ట్ కలిగించాలి. అసలు గుడిలోకి వెళ్తే భక్తి లేనివాళ్ళు, ప్రసాదం కోసం వస్తారు. అదే ఇంట్రెస్ట్. చేతులతో భజన చేస్తుంటే, ఒకే నామాన్ని చేస్తారు. ఒకే నామం అయితే నీకు ఉపరతి, అర్థం అవ్వాల్సిన అవసరం లేదు. దాని మీద ఆసక్తి కలుగుతుంది. దానికి తప్పెట్లు తాళాలు పెట్టి మ్యూజిక్ కూడా వేస్తారు. అదే భక్తి అనుకుంటున్నారు. అది ఉపరతి, భక్తిలోకి ప్రవేశించడానికి ఉపరతి. నిజమైన భక్తిలోకి ప్రవేశించాలి అంటే, కోర్కెలతో రాకూడదు, అప్పుడు జపం చేయాలి, అసలు మౌనంగా ఉండాలి. అసలు భగవంతుడు అంటే ఏమిటో తెలుసుకోవాలి. అసలు భగవంతుడు కోర్కెలు తీరుస్తాడా? తీర్చడా? తెలుసుకోవాలి. భగవంతుడు ప్రసాదం తింటాడో, తినడో తెలియాలి. ప్రసాదం అంటే ఏమిటో, నివేదన అంటే ఏమిటో, నైవేద్యం అంటే ఏమిటో తెలియాలి. అవన్నీ తరువాత ఎప్పుడో చెబుతాము.

కాబట్టి మన వాళ్ళు, భక్తి పేరుతోటి అక్కడే ఆగిపోయారు. ఉపరతినే భక్తి అనుకుంటున్నారు. ఉపరతి దగ్గర ఆగిపోయారు. ఉపరతి తరువాత శ్రద్ధ, సమాధానం కావాలి. ఆ సమాధానం ఏమిటి? అంటే, లక్ష్యం. లక్ష్యంలోకి చేరడమే, లక్ష్యం గురించి అవగాహన పెరగడమే సమాధానం. ఎవడు ఇంద్రియములను మరల్చి ఆత్మయందే ఇముడ్చుకొనుచు ఉన్నాడో, అతనియొక్క బుద్ధియే మిక్కిలి స్థిరమైనది. బుద్ధి ఎప్పుడు స్థిరమైంది? మనసే విషయాలవెంబడి పోతోంది. ఈ మనసుకే రాగద్వేషాలు. మనసులోనే ఈర్ష్య అసూయలు. మనసులోనే అరిషడ్వర్గాలు. ఈ విషయాలు ఎప్పుడైతే మనసు బుద్ధికి అందించిందో బుద్ధి ఏం చేస్తుంది? నీకు ఏది ప్రియం, మోదం, ప్రమోదమో, ఏది అప్రియమో, ఆ రకంగా నిర్ణయించి, ఉన్నంతలో ఏది ఎక్కువ లాభమో, ఏది తక్కువ లాభమో చూసి నిర్ణయిస్తూ ఉంటుంది. బుద్ధి యొక్క నిర్ణయాలు అలా ఉంటాయి.

మనసేమో ప్రపంచంలో ఉన్న విషయాలతో ద్వంద్వాలతో ఉంది. దానిని బట్టి బుద్ధి నిర్ణయిస్తోంది. ఇప్పుడు నిశ్చల బుద్ధి అంటున్నాడు. స్థిరమైన బుద్ధి అంటున్నాడు. మనస్సు సమస్యను అప్పజెప్పితే బుద్ధి నిర్ణయించాల్సిందేగా. మనసేమో అప్పజెప్పకపోతే, బుద్ధి నిర్ణయించాల్సిన అవసరం లేదు. అప్పుడు స్థిరబుద్ధి వస్తుంది.

కాని మనసు ఎప్పుడూ విషయాలను అప్పజెపుతూనే ఉంటుంది కదా! బుద్ధిలో నిత్యానిత్య వస్తు వివేకము ఉంది. బుద్ధిలో తీవ్రమోక్షేచ్ఛ, మోక్షం ఎట్లా అయినా పొందాలని అనేటటువంటి కాంక్ష ఉంది. దానిని బట్టి, ప్రాపంచిక విషయాలనుండి దూరం జరగడాలు, అందుకు ఆ రాగాన్ని తగ్గించుకోవడం అనేటటువంటి ప్రయత్నం చేస్తున్నాడు. బుద్ధిలో వివేకము, వైరాగ్యము ఉన్నాయి. బుద్ధిలో వివేకము, వైరాగ్యము ఉంటే, మనసు ఇష్టం వచ్చినట్లు, అల్లరి చిల్లరిగా అది కావాలి, ఇది కావాలని అల్లరి చేస్తే, ఏం చేస్తుంది బుద్ధి? మనస్సుకి ఒక మొట్టికాయ మొట్టి, ఇప్పుడు కాదు, తరువాత చూద్దాము, అని వాయిదాలు వేస్తూ ఉంటుంది. పూర్తిగా ఆపితే మనసు వినదు. వాయిదా వేస్తేనే కాస్త వినవచ్చు. మొదట్లో అన్నీ వాయిదాల పద్ధతిలోనే పోతాయి. పోనీ అంతకాదులే కాని, కొంత అనుభవించు అంటాము. కొంత కన్సెషన్. నాలుగైదు సార్లు అయ్యాక, దానికి బ్రేకు వేస్తాము. మళ్ళీ బ్రేకు తీసేస్తాము. ఒక పదిసార్లైతే అసలు వాయిదాలు కూడా ఒప్పుకోము. ఎవరది? బుద్ధి. బుద్ధే మనసుని కంట్రోల్ చేసుకోవాలి. వివేక వైరాగ్యాలతో కూడిన బుద్ధి మనసుని కంట్రోల్ చేసుకోవాలి. మనసు కంట్రోల్‌కి వస్తే, అప్పుడు బుద్ధి స్థిర బుద్ధి అవుతుంది. స్థిరబుద్ధి అయితే మోక్షం వస్తుంది. బుద్ధి చంచలంగా ఉంటే మోక్షం రాదు. బుద్ధి విషయాల మీద మనసుతో జతకట్టి, మనసునుంచి వేరుకాకుండా ఉంటే, అది నిశ్చల బుద్ధి కాదు.

బుద్ధి కర్మాణు సారణి అని బుద్ధి నిర్ణయాన్ని బట్టి కర్మలు జరుగుతాయి. కాని, ప్రారబ్ధం బుద్ధి నిర్ణయాన్ని తన చేతులలో పెట్టుకుంటుంది. దీనిని జయిస్తూ లక్ష్యంవైపుకు అనుగుణమైన నిర్ణయాలు చేసుకుంటూ ఆ బుద్ధి సత్కర్మాచణ చెయ్యాలి. బాహ్యమైన ద్వంద్వాలను అతిక్రమించిన బుద్ధియే స్థిరబుద్ధి అవుతుంది. కర్మ చేసే కర్త ఎక్కడున్నాడు? బుద్ధిలో ఉన్నాడు. బుద్ధి ఎక్కడుంది? ఏ కోశంలో ఉంది బుద్ధి? విజ్ఞానమయ కోశంలో ఉంది. విజ్ఞానమయకోశంలో బుద్ధి కర్తృభావం పొందుతోంది. ఆనందమయకోశం నుండి వచ్చే ప్రియం మోదం ప్రమోదం అనే ప్రభావానికి బుద్ధి లోనయ్యింది. అనుభవం వచ్చేసరికి, మనసులోకి వచ్చింది. బుద్ధిలో కర్త ఉన్నప్పటికి, అనుభవం మనసులోకి వచ్చింది. అనుభవాన్ని మనసు పట్టించుకుని మళ్ళీ బుద్ధికే అప్పజెప్పింది. అంటే ఇది సుఖమా? దుఃఖమా? ఏడ్వాలా? నవ్వాలా? అని అడుగుతుంది మనసు. ఇది సుఖమే అని నిర్ణయిస్తే బుద్ధి, అప్పుడు మనసు సుఖము అనుభవిస్తుంది.

బుద్ధి నిర్ణయాన్నిబట్టి, కర్తభోక్త మనసే అయ్యింది. మనసుని, బుద్ధిని వేరుచేస్తున్నామనుకో అది బుద్ధియోగం. మనోవ్యాపారాన్ని చూసి, మనసు వెంబడి బుద్ధి పరుగెత్తలేదనుకో, అప్పుడు బుద్ధియే సాక్షి, విలక్షణం. ఎవరు సాక్షి, విలక్షణం? బుద్ధియే సాక్షి, విలక్షణం. మనసునుంచి వేరైనప్పుడు దానికి వివేక వైరాగ్యాలు ఎక్కువ ఉన్నాయి. నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్ర ఫలభోగ విరాగము. ఈ రెండూ వివేక వైరాగ్యాలు. అవి బుద్ధిలో ఎప్పుడైతే ఉన్నాయో, బుద్ధియోగంలో బుద్ధి విలక్షణము, సాక్షి మనసునుంచి వేరుపడిందో, అప్పుడు తాత్కాలిక సుఖదుఃఖాల కోసం కాకుండా, శాశ్వత ఆనందం అనేటటువంటి మోక్షం కోసం, బ్రహ్మానందం కోసం, బుద్ధి ఆ లక్ష్యంగా పని చేస్తుంది. ఇక మనసు దాని ఆటలు సాగక, పూర్తిగా బుద్ధియొక్క అదుపు ఆజ్ఞలలోకి వస్తుంది. దానినే బుద్ధి యోగం అన్నారు.

ఉపరతి కావాలి. అది ఎలా వస్తుంది? ఉపరతి అన్నప్పుడు ఏమైంది? ఆ బ్రహ్మకు దగ్గరగా వెళ్తే, కొంత ప్రశాంతత వచ్చింది, అదే ఉపరతి. బ్రహ్మ విషయాన్ని వింటేనే, ఆనందపడే స్థితి వచ్చింది, అది ఉపరతి. గురువు ఇంకా విషయం చెప్పకుండానే, గురువు వస్తే నాకిది చెప్తారు కదా అని ఆనందం వేసి, గంతులేసింది అది ఉపరతి. సత్సంగానికి వెళ్ళాలి అంటే, ఎన్ని ఆటంకాలు వచ్చినా పక్కకి తోసేసి, ఆ అపేక్ష, ఆసక్తి అంత ఎక్కువగా ఉంటే, అప్పుడు అంతర్ముఖ విద్యని వినడానికి, సానుకూలం అవుతుంది. ఉపరతి లేనివాడికి అది సానుకూలం కాదు. అందుకని విడివిడిగా చెప్పినప్పటికి, ఆరు కలిపి షట్క సంపత్తి ఒకేసారి పనిచేస్తాయి.

బుద్ధి స్థిరమైతే ఏమైంది? **శాస్త్ర ద్రష్టం, గురోర్వాక్యం** శాస్త్రాన్ని తెలుసుకునేప్పుడేమో నిత్యానిత్య వస్తువివేకాన్ని సంపాదించడం, గురువాక్యాన్ని వినేసరికి, ఆ నిత్యానిత్యవస్తువివేకంతోపాటు దానిని నీమీద అప్లై చేసుకుని, వైరాగ్యాన్ని సంపాదించావు. వైరాగ్యం ఎప్పుడైతే సంపాదించావో, విషయాలపట్ల ఆసక్తి తగ్గిందో, వ్యామోహం తగ్గిందో, పూర్తిగా పోలేదు కాని తగ్గింది. ఆ తగ్గడం ద్వారా ఈ సత్సాంగత్యం మీద, ఆత్మజ్ఞానం మీద ఉపరతి కలిగింది. ఈ ఉపరతిని వాడుకుంటూ తితీక్షను పాటించాలి. తితీక్ష అంటే ఏమిటి మళ్ళీ? విషయసమత్వం. ద్వంద్వాలలో అదీ ఇదీ నాకు రెండిటిలో ఏదైనా ఒకటే అనే పరిస్థితికి వెళ్ళాలి. అట్లా వెళ్ళలేనప్పుడు ఓర్పు, సహనము, త్యాగము సాధించాలి. ఆత్మ లక్ష్యంలో, బ్రహ్మజ్ఞాన లక్ష్యంలో ఇవన్నీ పాటించాలి. ఊరకే పాటించడం కాదు.

అసెంబ్లీలో మంత్రులను తిట్టారనుకోండి ప్రతిపక్షం వాళ్ళు, వాళ్ళు దులిపేసుకుని నవ్వుతూ ఉంటారు. కాని లోపల కుతకుతలాడుతారు, తిట్టుకుంటూను. అట్లా నవ్వుతూ ఉంటారు. ఒక్కసారి కోపం బయట పడదు. వారు తితీక్ష పాటిస్తున్నారు. కాని ఆత్మజ్ఞాన లక్ష్యంగా, మోక్ష లక్ష్యంగా పాటించడం లేదు. బాహ్యంగా, ఒక పదవిని కాపాడుకునే లక్ష్యంగా తితీక్ష పాటిస్తున్నారు. మనం కూడా బలవంతంగా తితీక్ష పాటిస్తున్నాము. బలవంతుడి దగ్గర తగాదా వచ్చినప్పుడు, వాడు కొడితే చస్తానని ఓర్చుకుంటున్నాడు. అప్పుడు కూడా తితీక్ష పాటిస్తున్నాడు. వాడివల్ల నష్టం వచ్చినా, వాడితో నెగ్గలేక, వాడితో ప్రమాదం అని చెప్పి, త్యాగం చేస్తున్నాడు. అయితే ఇదంతా కాదనలేక కాని, పూర్తిగా వదులుకున్నాడా? పూర్తిగా వదులుకోలేదు కాబట్టి, నాకే కనుక శక్తి ఉంటే, వాడికంటే నాకే కనుక బలం ఉంటే, వాడి సంగతి చూసేవాడిని. అని లోపల అనుకుంటాడు. బయటకి నిగ్రహించినా, తితీక్ష పాటించినా. అప్పుడేమైందంటే, ఆ క్రోధంతో కూడినటువంటి ఆలోచన, మళ్ళీ వాసన, సంస్కారమై, పునర్జన్మకు హేతువై, కారణ శరీరంలోకి చేరింది. ఈ విధముగా మనం ఇన్ని సాధనలు బలవంతంగా చేస్తున్నాము ఇప్పటికే. కాకపోతే ఆత్మజ్ఞాన లక్ష్యంగా చేయట్లేదు. ఆ లక్ష్యంగా చేసేటట్లయితే, ఈ పాత అలవాటు ఎప్పటికైనా మంచిదే. కనుక మీ కుటుంబంలో ఎవరైనాసరే నీకు కోపం తెప్పిస్తే, వాళ్ళు నీకు గురువులన్నమాట. తితీక్ష పాటించడానికి, శమదమాలు పాటించడానికి, వాళ్ళు నీకు పరీక్ష పెడుతున్నారు కాబట్టి, దాన్ని పరీక్షలాగా తీసుకున్నప్పుడు వాళ్ళు గురువులౌతారు.

వివేక వైరాగ్యాలు రెండూ వచ్చిన తరువాత అప్పుడు శమాదిషట్కం సాధించాలి. అప్పుడు బుద్ధి యోగంలో, బుద్ధి నిశ్చలమైంది. **'శాస్త్ర ద్రష్టం, గురోర్వాక్యం, తృతీయం ఆత్మనిశ్చయం'** – బుద్ధి యొక్క నిశ్చల స్థితే, ఆత్మనిశ్చయం. **చతుర్థం సంశయచ్ఛేదం**. బుద్ధి నిశ్చలంగా ఉంటే, ఇంక ఏ అనుమానాలు ఉండవు. కాని సాధన దశలో కొన్ని ఉంటాయి. ఈ ప్రపంచము ఒకవేళ నిజమైనదేనేమో? మా అమ్మానాన్న నిజమేనేమో? నా భర్త, పిల్లలు నిజమేనేమో? పూర్తిగా అబద్ధం అని నేను అనుకోలేకపోతున్నాను. అది సంశయం. శాస్త్రం ఎంత తెలిసినా, గురువు ఎంత చెప్పినా, ఎంత అర్థమైనా, నీకు ఎంత వివేకం ఉన్నా, ఎంత తెలివైనవాడివైనా, ప్రతీ వాళ్ళకు కూడా ఇదే ఉపదేశం గంటాపథంగా, వస్తు నిర్ణయంగా నువ్వు చెప్పగలిగినా, నీ కుటుంబ విషయం, నీ సంసార విషయం వచ్చేసరికి, కొంచెం అనుమానం ఉంది. ఇంకా కొంత రజోగుణం ఉంది గురువుల్లో కూడా. కొంత కొంత అటాచ్‌మెంట్ ఉంది. కొందరు శిష్యులను పక్షపాతంతోటి ఎక్కువ తక్కువలుగా చూస్తుంటారు. ఈ మాదిరిగా ఎందుకంటే సంశయచ్ఛేదం అవ్వలేదు. ఇంకా సంశయాలున్నాయి. పూర్తిగా బ్రహ్మసత్యం, జగన్మిథ్య అవ్వలేదు.

ఉపాధికి సంబంధించింది, స్వభావాలకి సంబంధించింది, గుణాలకి సంబంధించింది, విషయాలకు సంబంధించినది ఎంతోకొంత ఉండటమే సంశయం. పూర్తిగా లేకపోవడమే సంశయచ్ఛేదం. ఈ సంశయం గనుక పోతే **పంచమం ముక్తి దాయకం**. ఐదవ స్టెప్‌లో మోక్షం. ఇట్టి సంపత్తి గలవాడే యోగాభ్యాసముతో, ఇంద్రియముల సహాయము లేకనే, జ్ఞాననేత్రము నందు సర్వమూ గ్రహించగలరు. అప్పుడు ఇంద్రియాలను ఉపసంహరించావు. ఇంకేం కనబడుతుంది నీకు? ఇంకేమీ కనబడదు. అప్పుడు జ్ఞాన నేత్రం తెరుచుకుంటుంది. జ్ఞాన నేత్రం ఎప్పుడు పని చేస్తుంది? నిర్విషయ స్థితిలో. నిశ్చల బుద్ధి స్థితిలో. నీకు ప్రపంచమే మనసుకి తోచని స్థితిలో. తోచినా దానిమీద ద్వంద్వాతీత స్థితిలో ఉన్నప్పుడే నీకు ఆ జ్ఞాన నేత్రం తెరుచుకుంటుంది. ఆ జ్ఞాననేత్రమందు మళ్ళా అక్కడా ప్రపంచం కనబడుతుంది. ప్రపంచం అక్కడా కనబడుతుంది కాని, అనెఫెక్టడ్‌గా ఉంటాడు. విలక్షణంగా ఉంటాడు. సాక్షిగా ఉంటాడు. అఖండంగా ఉంటాడు. అంటకుండా ఉంటాడు.

సకల పాప కార్యములలోనికి మనస్సుని ప్రవేశింప నీయక, శాస్త్రముల యందు తెలుపబడినటువంటి పుణ్య కర్మలు చేయుచు, ఫలమును అపేక్షించక, నిష్కామ కర్మగా చేయాలి. తీర్థయాత్రలకు వెళ్ళమని, గురువుగారు ఒకసారి చెప్పినా, అది విహార యాత్ర, వినోద యాత్ర అవ్వకూడదు. ఆ స్థల పురాణాన్ని, ఆ స్థల మహత్యాన్ని తెలుసుకుని ఆనంద పడాలి. అటువంటి ఉపరతితో ఆ దర్శనం చేసుకోవాలి. అప్పుడు భక్తి పెరుగుతుంది. ఒక స్టెప్‌లో భక్తి కూడా ఉండాలిగా! తరువాత కదా జ్ఞానము. ఫలమును అపేక్షించకుండా చేయాలి. సత్కర్మాచరణ చేయాలి. జపతపాలు చేయాలి. సత్యవ్రతం పాటించాలి. మౌనవ్రతం పాటించాలి. నిష్కామంగా యజ్ఞయాగాదులు కూడా చేయొచ్చు. లోకకల్యాణం కోసం ఏమైనా చేయొచ్చు. ఇవన్నీ ఉపరతి క్రిందకే వస్తాయి. ఫలమును అపేక్షింపక, భగవంతునికి అర్పణ చేయడం మెయిన్. ఫలమును అపేక్షించకుండా ఉండడం చేయగలిగితే మంచిదే, ఒక్కొక్కళ్ళు ఫలాన్ని అపేక్షించకూడదు అనుకున్నా, కొంత లోపల కదలిక వచ్చి, ఆ ఫలాన్ని ఆస్వాదిస్తారు. అప్పుడు భక్తులనే వాళ్ళు, పరమాత్మకు అర్పణ చేయాలి. సత్సంగం చేస్తున్నటువంటి శిష్యులు గురువుకి అర్పణ చేయాలి. అపేక్షించకుండా ఉంటే మంచిదే. కొంత చలనం కలిగి, సాధనలో అపేక్షించడం అనేది నూటికి నూరుపాళ్ళు కాకుండా, ఏ దెబ్బయ్యో, తొంభయ్యో శాతం మాని, మిగితాది మళ్ళీ సంగత్వం చెందివుంటే, ఆ సంగత్వం చెందాను అనే సంగతి నీవే సాక్షిగా తెలుసుకుంటే ఆ సంగత్వం వలన వచ్చినటువంటి అనుభూతిని గురువుకి, ఇష్టదైవానికి అర్పణ చేయాలి.

మరింత కర్తృత్వ, భోక్తృత్వాభిమాన ఫలకాంక్ష కలుగకుండా, అర్పణ చేయాలి. అప్పుడప్పుడు పడిపోతాం అండీ! పడిపోగానే గురుదేవా! అని గురువుకు అర్పణ చేస్తూ ఉండాలి. అలా కర్తృభావం వచ్చినప్పుడు గురువుకు అర్పించాలి. భోక్తృభావం వచ్చినప్పుడు గురువుకు అర్పించాలి. అభిమానం కలిగినప్పుడు గురువుకు అర్పించాలి. ఫలంమీద నీకు కాంక్ష కలిగినప్పుడు గురువుకు అర్పించాలి. అలా గురువునో, ఇష్టదైవాన్నో, పెట్టుకొని వారిపై శరణాగతి అనేది పెట్టుకుని, ఆ శరణాగతిని యోగ పద్ధతిలో పెట్టుకోవాలి. శరణాగతి మాటవరుసకు కాదు. శరణాగతి అనేది స్థూలం కాదు, కాళ్ళు పట్టుకోవడం కాదు, శరణాగతి అనేది గురుసేవ బాహ్యంగా చేసేది కాదు, శరణాగతి అనేది మనసుయొక్క సూక్ష్మ స్థితిలో, మనసుని గురువును ఇంటా, వెంటా, జంటా పెట్టుకోవడమే శరణాగతి యోగం. శరణాగతి కూడా ఒక యోగం. ఆ శరణాగతి యోగంలో, ఆ యోగాభ్యాసాన్ని ఒక ఆరు నెలలకో, సంవత్సరానికో, ఏడాదికో, రెండేళ్ళకో, 10ఏళ్ళో, పన్నెండేళ్ళకోకాక తరువాత ఈ జన్మంతాకూడా ఆ పని చేస్తూనే ఉండాలి. అప్రయత్నంగా ఉండాలి. అదే శరణాగతి యోగం.

**శ్లో॥ కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠంతి తస్కరాః**
**జ్ఞాన రత్నాపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రతా ॥**

రెండుసార్లు చెప్పాడు జాగ్రత అని. కామ, క్రోధ, లోభ అని ఇట్లాంటి ఆరుగురు దొంగలున్నారు. అరిషడ్వర్గమనేటువంటిది. మన శరీరంలో ఆరుగురు దొంగలున్నారు. అవి ఏమిటంటే కామము (కోరిక), క్రోధము (కోపము) లోభము (పిసినిగొట్టు తనము), మోహము (కాంత, కనకములపై ఉండెడి తీవ్ర ఇచ్ఛ), మదము (ధనము, విద్యా, రూపము, అధికారము, తపస్సు, బలము, కులము, యవ్వనము అను అష్ట మదములు) చాలామందికి ఉన్నాయి. నా మతం గొప్పది, నా కులం గొప్పది. నిష్పక్షపాతంగా ఉండాల్సిన చోట, కుల మదం ఉన్నవాడు ఎట్లా ఉంటాడు? మావాడు తప్పు చేసినా, మావాడే రైట్. ఇతర కులస్థులు మంచి చేసినా, తప్పులు వెదుకుతారు. తన కులస్థుడు తప్పు చేసినా, ఆ ఎవడుమాత్రం చేయడం లేదులే! అని సమర్థిస్తారు. అదీ కుల మదము. నీకు నిజమైన మేలు చేసేవాళ్ళవైపు వెళ్ళకుండా, కీడు చేసినాసరే, మా కులము, మా మతము అన్నవాళ్ళందరికీ కూడా కుల మదమే. ఇలాగే అష్ట మదాలన్నమాట. అంధకార రూపమైన దురహంకారము, మోహం ఎక్కువై పోయినప్పుడు ఏమౌతుందంటే, గుబులైపోతుంది.

ఇప్పుడు ప్రేయసి, ప్రియులున్నారండీ, వారిద్దరూ రహస్యంగా ప్రేమించుకుంటారు, పెళ్ళి చేసుకున్నారనుకోండి, రహస్యంగా సంసారం చేస్తారు, మోహం ఎక్కువున్నవాళ్ళు ఏం చేస్తారు? బజారులోను, పార్కులో కూడా ప్రేమించుకుంటూ ఉంటారు. అందరి కళ్ళా పడుతుంటారు. అసభ్యంగా ఉంటారు. అంటే ఏమిటి? అసభ్యం అని వాళ్ళకి తెలియదా? వాళ్ళకి అక్కడ గుడ్డితనం వచ్చింది, ఆ మోహమే అంధకారాన్ని ఇచ్చింది. పనికివచ్చే అహంకారము దురహంకారము కాదు. పనికిరాని అహంకారాన్నే దురహంకారము అంటాము. కనుక జాగ్రత్త పడవలెను. రెండు సార్లు చెప్పాడు, జాగ్రత్త, జాగ్రత్త. మెలకువతో ఉండవలెను. మెలకువ అంటే, మోహముతో కళ్ళు కమ్మేసి, గుడ్డైపోతారే అలా కాకుండా మెలకువతో ఉండమన్నారు. మెలకువ అంటే ఇక్కడ జాగ్రదావస్థ కాదు, కామాంధుడు అంటారు చూడండి, ఆ కోరిక కలిగినప్పుడు వాడికి అంధత్వం వస్తుంది, చుట్టు ప్రక్కల ఎవరు ఏమనుకుంటారో అనికూడా, ఒక లౌక్యం గాని, ఒక సభ్యత గాని పాటించడు. మెలకువ అంటే ఏమిటంటే, చుట్టూరా వాళ్ళున్నారే, వీళ్ళున్నారే, వాళ్ళున్నారే, వీళ్ళు చూస్తారే అనేటటువంటి స్పృహని మెలకువ అంటాం ఇక్కడ. ఆ మెలకువతో ఉండాలి. దాని వలన కూడా కొంత నిగ్రహం ఉంటుంది.

ఎప్పుడు ఏమి తోస్తే అది చేయడం కాదు, సమయము, సందర్భము, రహస్యము ఉంటాయి కదా! ఆ సమయ, సందర్భాలు, ఒకచోటు, ఒక దాపరికము అన్నీ ఉంటాయి. విధినిషేధాలున్నాయి. పాటించవలసిన సమయంలో పాటిస్తూ! నిషేధ సమయంలో, నిషేధ సందర్భంలో, నిషేధస్థానంలో ఇష్టం వచ్చిన రీతిగా, ప్రవర్తించకుండా ఉండటము అనేది పాటించాలి. దానినే మెలకువ అన్నాము. కావున మనస్సు విషయ సంగత్వముతో అథోముఖ వ్యాప్తి అవుతుంది. ఊర్ధ్వము అన్నప్పుడు సాధన చేత సహస్రారానికి వెళ్ళడము, ఊర్ధ్వలోకాలకి వెళ్ళడమూ, ఆ పైన పరబ్రహ్మ స్థానము అనేది ఒక ఆనవాయితీగా చెబుతున్నారు. పైకి అన్నప్పుడు మోక్షానికని, బ్రహ్మజ్ఞానానికి అని, క్రిందికి అంటే మోహానికి, తమోగుణానికి, జనన మరణ హేతువుకి అని అర్థము.

బ్రహ్మజ్ఞానం కావాలి అంటే, అనేకత్వము, నానాత్వము అనే భేదాలు పోయి, చివరికి ద్వంద్వాతీత స్థితిలోకి పోయి, మళ్ళీ ఏకత్వం రావాలి. త్రిపుటి వ్యవహారం అంతా పోవాలి. కర్త, కర్మ, క్రియగా జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయముగా చూచేవారు, చూడబడేది, చూచుట అనేదానిమీద స్పందించి, ఆ చూచిన విషయాన్ని విషయీకరించుకుని, ఒక వాసనను, ఒక సంస్కారమును ఎలా పోగుచేసుకుంటామో, అటువంటి త్రిపుటి పోవాలి. ఆ తరువాత ద్విపుటి పోవాలి. ద్విపుటి అంటే దృక్కు, దృశ్యము అంతే, దర్శనము లేదు. త్రిపుటిలోనేమో దృక్కు, దృశ్యము, దర్శనము ఉంది.

**శ్లో॥ "పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుప హృత మశ్నామి ప్రియతాత్మనః ॥ - భ.గీ. 9-26**

ప్రతిఫలాపేక్షలేక తానుచేయు సర్వ కర్మలను పరమపురుషుని కొరకు అనన్య భక్తితో చేసినచో తాను స్వీకరించునని భగవానులు నుడివిరి. భగంతునికి పూజ చేస్తున్నప్పటికీ కూడా ప్రతిఫలాపేక్ష లేకుండా చేయాలి. నేను చాలా సంవత్సరాల నుండి నిన్నే పూజిస్తున్నాను, నాకెందుకీ కష్టం తెచ్చిపెట్టావు, నేను ఏం పాపం చేశాను, అని కోరికలతో చేసేవారి పూజ అలా

వుంటుంది. ఇంతకాలం పూజించాను అంటే అది కర్మే అయింది. అలా చేస్తే భగవంతునిలో ఐక్యత రాదు. ప్రతిఫలాపేక్ష లేకుండా చేయాలి. ప్రతిఫలాన్ని ఆశించకుండా చేసినప్పుడు ఏది జరిగినా దైవేచ్ఛ అని వుంటావు. దైవేచ్ఛ అంటే ఏమిటి? నీ కర్మను బట్టే దైవేచ్ఛ వుంటుంది. నీ కర్మ ఫలాన్ని యథాతథంగా నిష్పక్షపాతంగా ఇచ్చేదే దైవేచ్ఛ. అంతేగానీ నీ కోసం ప్రత్యేకంగా వుండేది గాని, ఒకళ్ళని నష్ట పెట్టేది గాని, కష్టపెట్టేది గాని శిక్షించేదిగా గాని వుండదు. శిక్ష రక్ష అన్నీకూడా మన కర్మ ఫలితమే. అందుకని భక్తి కోసమే భక్తి. కోరికలతో భక్తి కాదు. అందుకని భగవంతునికి నీవేమిస్తావు. పత్రం పుష్పం ఫలం తోయం – శివుడికి ఏమిస్తావు, బిల్వ పత్రం ఇస్తావు. భగవంతునికి ఏమిస్తావు – పూలు పెడతావు. ఒక అరటిపండు నైవేద్యం పెడతావు. నీటితో అభిషేకం చేస్తావు. దీనికెంత ఖర్చు అవుతుంది. అన్నీ ఫ్రీగానే దొరుకుతాయి. తక్కువ ఖర్చుతో దొరుకుతాయి. అందుకని భగవంతుని కోసం నీవు ఏమీ చేయనవసరం లేదు. కష్టపడనవసరం లేదు. కష్టపడి చేయకూడదా అంటే చేయవచ్చు. కాని కష్టపడి చేస్తే కర్తృత్వం వస్తుంది. కర్తృత్వం రాగానే ఇంత కష్టపడి చేశాను అనేటటువంటి ఒక భావంతో భోక్తృత్వం వస్తుంది. పూజ చేసినా సరే ఏమీ కోరిక లేకుండా చేయాలి. అలా చేసినటువంటి భక్తుడు ఎవరైతే వున్నాడో అటువంటి భక్తుడు, నాలో చేరుతాడు. నాయందు ఐక్యము అవుతాడు. ఆ భక్తునిలో వున్నటువంటి అహంకారం, భగవంతుడు భక్తుడు రెండుగా వున్నప్పుడే వున్నది. భగవంతునిలో ఐక్యం అయినప్పుడు భక్తి ఎక్కడున్నది? భక్తి అనేది ఐక్యత కలిగించి ఊరుకుంది. త్రిపుటిలో భక్తి వుంది. భగవంతుడు, భక్తి, భక్తుడు అనేటటువంటివి భగవంతునిలో ఐక్యము అయితే భక్తుడనేవాడు లేదు. సిద్ధి అయ్యేదాకా ఐక్యత కోసం చేసే పూజ. అయిపోయిన తరువాత ఇక పూజ ఏమిటి? పూజ ఆగిపోయింది.

**తదహం భక్త్యుప హృత మశ్నామిప్రియ తాత్మనః** – అటువంటి భక్తుడంటే నాకు ప్రేమ. అటువంటివారిని నాయందు చేర్చుకుందును అంటున్నారు. తాను స్వీకరింతును అని భగవంతుడు నుడివెను. అనన్యభక్తి అనేమాట వాడాడు. అనన్య భక్తి అంటే ఏమిటి? రెండర్థాలు వున్నాయి. అనన్య భక్తి అంటే భక్తి తప్ప రెండవది లేదు అని. కోరికతో భక్తి కాదు. ఏ కారణంతోనూ చేసే భక్తి కాదు. నిన్ను నువ్వు మరచినటువంటి భక్తి. ఆ భక్తిలో నువ్వు తన్మయత్వం చెందాలి. అది అనన్య భక్తి. ఇంకొక అర్థం ఏమిటి అంటే ఒకే ఒక్క భగవంతుని మీదే ఆ భక్తి వుండాలి, అనేక దేవతల మీద వుండకూడదు. అది అనన్య భక్తి. ఇంకొక అర్థములో చూస్తే, నువ్వు చూసేటటువంటి మానవులందరిలో కూడా సకల జీవరాశిలో కూడా ఆ జీవరాశుల యొక్క నామరూపాలు గాని గుణాలు గాని స్వభావాలు గాని వారివల్ల వచ్చేటటువంటి కష్టనష్టాలు గాని తీసుకోకుండా ఆ పరమాత్మ సర్వవ్యాపి అని అందరియందు వున్నాడని ప్రతివారియందు ఆ భగవంతుడే వున్నాడనే భక్తి అనన్య భక్తి.

మనసుని అభ్యాస యోగముద్వారా నిలిపి అభ్యాసయోగమని ఎందుకంటున్నారు? ఈ సృష్టిలో వున్నట్లుండి కొన్ని అకస్మాత్తుగా జరిగిపోతాయి. భక్తులందరూ భగవద్గీతలో 26 వ శ్లోకం చదవగానే భగవంతునిలో ఐక్యమైపోతారా? అవదు. ఇలా వుంటుందని తెలుసుకుంటాడు. ఇలా తెలుసుకున్నవాడు ప్రాణక్రియ చేశాడు. ఊర్ధ్వముఖం వెళ్ళాడు. అథోముఖం పోలేదు. ఇంద్రియాలని తాబేలు ముడుచుకున్నట్లుగా అంతర్ ముఖానికి తీసుకువెళ్ళాడు. బహిర్ ముఖం నించి విరమించాడు. ఇది చేయడానికి మళ్ళీ మళ్ళీ దమించాడు. మళ్ళీ మళ్ళీ శమించాడు. మళ్ళీ ఓర్పు సహనము తితీక్ష పాటించాడు. మళ్ళీ ద్వంద్వాలు తోచాయి. మళ్ళీ ఓర్చుకున్నాడు, తితీక్ష పాటించాడు. కొన్నాళ్ళు సత్సంగము లేదు. మరల సంసారం వచ్చేసింది. కొందరికి కష్టాలు, కొందరికి రోగాలు వచ్చాయి. ఊపిరాడకుండా సంసారంలో వున్నాడు. గురుబోధ అంతా పోయింది. ఒక్కసారిగా పడిపోయమని అనిపించింది. మరల గురువు గారి వద్ద సత్సంగం జరుగుతుంది. మరల పైకి లేస్తాడు. ఇదంతా కూడా ఒక్కసారిగా అకస్మాత్తుగా అయ్యేది కాదు. ఇలా అభ్యాసం చేయాలి. దీనినే అభ్యాస యోగము అన్నారు. నిరంతరాయంగా ఎన్ని సార్లు అలా అవుతున్నా గాని అన్ని సార్లూ పూనుకుని కూడదీసుకొని మళ్ళీ మళ్ళీ అభ్యాసం చెయ్యాలి. సాధనకి పునరంకితం అవుతూ ఉండాలి.

ఒక సాలె పురుగు తననోటి నుండి వచ్చే చొంగతోటి గూడు కట్టడానికి ఈ మూలనించి ఆ మూలకి ఆ దారాన్ని తీసుకుని అతుకులు వేస్తుంది. ఆ దారంతోపాటు ఆ సాలె పురుగు వేళ్ళాడుతూ వూగుతూ ఈ గోడనించి ఆ గోడకి అతుకు వేస్తుంది. వేసిన అతుకు ఒక్కోసారి ఊడిపోతుంది. ఒక దారాన్ని తీసుకుని గోడకి అతుకు వేయడానికి ఇరవైసార్లు ప్రయత్నిస్తుంది. అంత కష్టపడి పూర్తిగా గూడు కట్టిన తరువాత ఆ గూడు ఎంత పొడవు వుంది, ఎంత వెడల్పు వుంది ఎన్ని చుట్లు చుట్టింది ఎంత కష్టపడింది అని చూస్తే గూడు పూర్తయేదాకా అది చేస్తూనే వుంది. కష్టమైనాసరే మళ్ళీ మళ్ళీ చేసి నావల్ల కాదని ఆపకుండా ఆ సాలె పురుగు గూడుని పూర్తి చేసుకుంటుంది. అది అభ్యాసయోగమంటే.

సాధనలో అభ్యాస యోగమంటే రాగద్వేషాలని పోగొట్టుకుని అరిషడ్వర్గాలను జయించడం. అష్టమదాలని పోగొట్టుకోవడం. శ్రద్ధతో బ్రహ్మ మీద ఏకాగ్రత పెట్టడం. తీవ్ర మోక్షేఛ్ఛతో వుండటము. ఉపరతిని మాటిమాటికి పునరంకితముగా గురువు మీదనో ఇష్ట దైవము మీదనో పెట్టడం. ప్రారబ్ధం అడ్డు పడినా సరే పక్కకు తప్పుకోకుండ తీవ్రమైనటువంటి సాధనలు చేసి మళ్ళీ సత్సంగములోకి రావడం. పట్టువదలకుండా మళ్ళీ మళ్ళీ చేయడమే అభ్యాసము. మధ్యలో విసుగు చెందకుండా మళ్ళీ మళ్ళీ చేయడమే యోగం. ఇది అభ్యాస యోగము.

మనసు ఉదాసీనమై అభ్యాసయోగము ద్వారా బుద్ధిని నిలిపిన తోడనే స్వప్రకాశము అనెడి శుద్ధమగు తెలివి, లేక ప్రజ్ఞానము జ్ఞాన దృష్టిగా ఏర్పడుతుంది. అదియే చిత్ ప్రకాశము. అదియే ఆపోజ్యోతి, అదే ప్రజ్ఞానం బ్రహ్మ, అదే మూలా ప్రకృతి, అదే సర్వ సాక్షి అని పెద్దలు చెప్పారు.

పెద్దలు ఎవరంటే, ఈ దిశలో ప్రయాణం చేసి అనుభవం పొందినటువంటి అనుభవజ్ఞుడిని బ్రహ్మ విద్యలో పెద్దలు అంటారు. ఈ పెద్దలు గురువులు. వారు ప్రయాణం చేసి అనుభవం పొంది మార్గదర్శకంగా నీకు చెప్తున్నారు అంటే వారు చెప్పిన దాంట్లో ఇక తిరుగులేదు. మారుమాట లేదు. నీకేమో అంతర్ ముఖ ప్రయాణం తెలియదు. వారేమో ప్రయాణం చేసి సాధించి అనుభవంలో వున్నవారు. నేనిలా అధిగమించాను, నేనిలా వదిలేశాను, నేనిలా త్యాగం చేశాను, నేనిలా సాధన చేశాను , ఇలా తట్టుకున్నాను, ఇలా పొందాను, ఇలా అందాను అని వారు చెప్తారు. అంది పొంది మీరినటువంటి పద్ధతి అంతా తాము ఏ రకముగా చేశారో దశలవారీగా వారు చేసిందే నీకు చెప్పుతున్నారు. ఒకరికి అయినప్పుడు అది ఎట్లా అయిందో మనకి కూడా అలాగే అవుతుంది కదా! ఆయన చేసినట్లు చేస్తే మనకూ అవుతుంది. అట్లా అయినవాడే గురువు. వారినే పట్టుకుందాము. **అన్నది అనుమానము, అయినది ప్రత్యక్షము**. అందుకని పెద్దలమాట వినాలి.

ఉపరతి యొక్క పరాకాష్టలో మనసు స్వాధీనమై ఆ మనసు ఆత్మయందు లయమవుతుంది. ఆత్మ జ్ఞానం కలుగగానే మనసు అమనస్కము అయింది. మనసు లయమయింది అంటే మనసు తన అస్తిత్వాన్ని వుంచుకుని లయమవడం కాదు. లయ పద్ధతిలో మనసు తన అస్తిత్వాన్ని కోల్పోతుంది. మనోనాశ్ అవుతుంది. ఇట్లు మనసు స్వాధీనమై ఆత్మయందు నిలిపి మనోలయమవగానే తాను తానైనటువంటి ఆత్మయందు క్రీడిస్తూ వుంటాడు. తనలో తాను క్రీడిస్తూ రమిస్తూ వుంటాడు. ఇది ఇందలి అంతరార్థము. ఉపరతికి బాహ్యార్థమంటే గురువుమీద శాస్త్రముమీద అభిమానము పెట్టుకోవడం సత్సంగము మీద అభిమానం పెట్టుకోవడం – ఇవన్నీ చేస్తూండటం ఉపరతి అన్నాం. దానికొరకు బయటకి పోకుండా ఇంకా పై అర్థం వచ్చే సరికి ఏమైంది – మనసు ఆత్మ యందు లయమయితే తాత్కాలికముగా అయినా, చివరకు పూర్తిగా అయితే మోక్షమే.

తాత్కాలికముగా అయితే అది ఉపరతి. ఆ ఉపరతిలో సమాధి సిద్ధిస్తుంది. సమాధిలో ఆనందం వస్తుంది. ఆ నిర్వికల్ప సమాధిలో మనోలయం కాగానే ఆనందం కలుగుతుంది. అద్వైత పద్ధతికి వస్తే దానినే అందరూ తురీయం అంటారు. తురీయానందం కలుగుతుంది. ఈ తురీయానందం పేరే ఉపరతి. తురీయాతీతం అంటే ఆనందం కూడా లేనిస్థితి, పరబ్రహ్మ.

నాల్గవది తితీక్ష. ప్రారబ్ధ కర్మ వశముచేత ఏఏ కాలమునకు ఏమి సంభవించునో అది అంతయూ అనుభవించుచూ సమస్త భోగభాగ్యములు కలిగినప్పుడు సంతోషపడక అది విడిచినపుడు దుఃఖపడక మనసుని నిలకడచేసి వివేక వైరాగ్యాలతో కూడినటువంటి బుద్ధియందు ఈ మనసుని నిలిపి, పరాత్పరునియందు లగ్నం చేయడమే తితిక్ష. తితిక్ష యొక్క అంతమే శ్రద్ధ. శ్రద్ధలో బుద్ధి పరత్పారునియందు ఉంటుంది. మనస్సును లగ్నము చేయుటయే తితీక్ష. ఇందులో శ్రద్ధ కూడా ఉంటుంది. ఇందులో శమము దమము కూడా ఉంటాయి. తితీక్షలో శమము దమము ఆ పైన చెప్పిన ఉపరతి కూడా వుంది. ఆ పరాత్పరునియందు మనసుని లగ్నము చేయడము శ్రద్ధ అనబడుతుంది. ఏ లక్ష్యంతో ఇవన్నీ చేస్తున్నామో ఆ లక్ష్యం పేరు సమాధానం.

లక్ష్యాన్ని విడిచి చేయడానికి లేదు.  తాత్కాలిక లక్ష్యమైనా వుండాలి. తాత్కాలిక లక్ష్యము ఆఖరి లక్ష్యము అని రెండు వున్నాయి. తాత్కాలిక లక్ష్యమంటే షట్ చక్రాలు దాటి ఆజ్ఞా చక్రములోకి రావడం తాత్కాలికము. తురీయం కూడా దాటి తురీయాతీతము ఆఖరి లక్ష్యము. మధ్యంతరంగా చేరే లక్ష్యాన్ని తటస్థ లక్షణము అంటాము. నీ స్వరూపమైనటువంటి పరబ్రహ్మగా మిగిలి వుండటాన్ని స్వరూప లక్షణం అన్నాము. లక్ష్యాలు రెండూ పెట్టుకోవచ్చు, మూడు పెట్టుకోవచ్చు, అనేకం పెట్టుకోవచ్చు. మూలాధారంలో వున్నవాడు స్వాధిష్టానంలోకి వెళ్ళడం ఒక లక్ష్యము. అక్కడున్నవాడు మణిపూరములోకి వెళ్ళడం రెండవ

లక్ష్యము. అనాహతముకెళ్ళడం మూడవ లక్ష్యము. విశుద్ధమునకు వెళ్ళడం నాల్గవ లక్ష్యం. ఆజ్ఞా చక్రమునకు వెళ్ళడం అయిదవ లక్ష్యము. సహస్రారమునకు వెళ్ళడం ఆరవ లక్ష్యము. లక్ష్యాలు ఎన్నైనా పెట్టుకోవచ్చు. ప్రతి లక్ష్యము కూడా సమాధానమే అన్నమాట. దేనికోసం చేస్తున్నాము, ఏ ప్రయోజనం ఆశించి చేస్తున్నాము, ఆ ప్రయోజనం అనుకున్నది అనుకున్నట్లుగా జరిగినప్పుడు కలిగే తృప్తిగాని, సహజత్వము గాని సమాధానమనబడుతుంది. అట్లా జరగాలంటే చక్కటి పద్ధతి ప్రకారం నడవాలి. ఏ ఆటంకాలూ రాకుండా చూచుకోవాలి. ఒకవేళ ఆటంకాలు వస్తాయేమో అని అవి రాకుండా ముందస్తుగా గ్రహించి అటువంటి ఆటంకాలు రాకుండా చూసుకుని ఒకవేళ వస్తే ఎలా అధిగమించాలి అనేది అంతా ఈ తితీక్షలో వుంటుంది.

ఇంత పద్ధతి ప్రకారం నడవాలి అంటే మనిషి సత్వగుణంలో వుండాలి. తమో గుణంతో సాధన చేసే వాడు మధ్యలో ఆపేస్తాడు. రజో గుణంతో సాధన మొదలు పెట్టినవాడు సాధించలేక చతికిలపడతాడు. నాకీ జన్మకిక మోక్షము రాదు, నేనేమీ సాధించలేను, సాధన చెయ్యలేను ఇంట్లోనే కూర్చుంటారు, గురువుగారూ! నేనిక సత్సంగానికి రాలేను, ఇంతకాలము నేనేమి చేశాను? నాకేమీ రాలేదు అని విరమించుకుంటారు. అలా వుండకూడదు. అలా చెయ్యకూడదు అనేదే తితీక్ష. పై లక్ష్యంగా చెప్పినప్పటికీ మధ్యంతరంగా అనేక లక్ష్యాలు దాటాలి. అప్పుడే శమ దమాలు అవుతాయా. ఆధ్యాత్మికత అంటే నీకు ఒక సరియైన స్థితిలో సరియైన ప్రయోజనం ఇచ్చేలాగా వుండాలి. అంటే సాధన తీవ్రంగా చేస్తే 12 సంవత్సరాలు పడుతుంది. ఇంద్రుడు కూడా పంచకోశాలు దాటడానికి 60 సంవత్సరాలు తపస్సు చేసుకుంటూ బృహస్పతి చుట్టూ తిరిగాడు. అలా పడుతుంది. ఒక్కనాటికి అయ్యేది కాదు. సుకృతము, పూర్వజన్మ సాధనా ఫలితముంటే ఈ జన్మలోనే సిద్ధిస్తుంది.

ఇవన్నీ అవకుండానే మీకు మహావాక్యాలు చెప్పేస్తున్నాము అంటే సాధన చతుష్టయ సంపత్తి పూర్తయితే నీకు మహావాక్యాలు చెప్పే పని ఏముంది? అసలు సాధన చతుష్టయ సంపత్తి పూర్తయితే వాడు బ్రహ్మజ్ఞానే ఇక. కొంత అయినా, అవకపోయినా మీకు చెప్పేస్తూ వుంటాము. నాలుగు మహావాక్యాలు. ఎందుకంటే అసలు లక్ష్యం **బ్రహ్మ సత్యం జగత్ మిథ్య** అనే వాక్యం పెట్టుకుని మొదలు పెట్టినప్పటికీ లక్ష్యం అర్థం కావాలంటే మళ్ళీ మహావాక్యాలు తెలియాలి. మహావాక్యాలు తెలియాలి అంటే దారిన పోయేవారికి చెప్తే తెలుస్తాయా? కుదరదుగా! కుర్చోవాలి, శ్రద్ధగా వినాలి, బహిర్ముఖాన్నించి విరమించాలి, గురువు గారు చెప్పింది చెప్పినట్లుగా వినాలి, అంతర్ముఖానికి వెళ్ళాలి, దానికి నీ ఇంద్రియాలు సహకరించాలి, శమదమాలు పాటించాలి, అందుకే సాధన చతుష్టయ సంపత్తి వున్నవాడే అధికారి అంటున్నాము. ఆ అధికారికే నాలుగు మహావాక్యాలు చెప్పాలి. చెప్పనిదే ఎట్లా తెలుస్తుందండి? మీరు చెప్పండి నేను సాధన చేస్తాను అంటారు. సాధన చేస్తే గాని నీకు అర్థము కాదు. నువ్వు సాధన చేసుకురా, అప్పుడు నేను చెప్తాను అంటాను. ఇదెట్లా కుదురుతుంది? లక్ష్యం గొప్పదని అతను నమ్మితే అతనికి నచ్చితే, నేను వస్తాను అంటే, అప్పుడు పైపైన బ్రహ్మ జ్ఞానం ఇలా వుంటుంది అని చెప్పిన తరువాత సాధన చతుష్టయ సంపత్తి సాధన చేయించాలి. ఇది చేస్తే గాని అది చెప్పనంటే ఎట్లా కుదురుతుంది?

ఒక గురువు గారు ఇది రహస్యం, నువ్వు ఉపదేశం తీసుకుంటేనే చెప్తాను అంటారు. ఉపదేశం తీసుకుంటే నాకేమి లాభము, నాకు ఏమి చేస్తే దుఃఖం పోతుంది, ఏమి చేస్తే మోక్షం వస్తుంది, ఏమి చేస్తే ఆనందం కలుగుతుంది మీరు చెప్పండి మేము చేస్తాము అంటారు. అది రహస్యము, ఉపదేశము తీసుకున్నవారికే చెప్తాము అని కొందరు గురువులు అంటున్నారు. అటువంటి చిక్కు సమస్య వుండబట్టి ఇప్పుడు ఏం చేస్తున్నారంటే **బ్రహ్మ సత్యం జగత్ మిథ్య** అని క్రింది స్థాయిలో నుంచి నిత్యానిత్య వస్తు వివేకముతో పై స్థాయిదాకా పట్టుకెళ్తారు. అలాగే ఈ మిథ్యా జగత్తు విషయాల మీద మీకు ఆసక్తి వుంది. ఈ ఆసక్తి ఎందుకో మీకు తెలుసు. కష్టాలు పడినాక సుఖము అడుగుతున్నారు. అక్కడితో ఆగలేదు. ఇంకా సుఖం కావాలి ఇంకా సుఖం కావాలి అంటున్నారు. మీరు సుఖంగా వున్నా మీ పిల్లల సుఖం అడుగుతున్నారు. పిల్లలు సుఖంగా వున్నా మనవళ్ళ సుఖం అడుగుతున్నారు. దుఖమేమో రాకూడదంటారు. చేసే కర్మలేమో చేశారు. ఫలితం దగ్గర దుఖం వస్తే ఆ ఫలితాన్ని బట్టి కలిగే దుఖం వద్దని, ఎప్పుడూ సుఖమే రావాలని అంటారు. సత్యసాయి బాబా అన్నట్లుగా **పాప కర్మలు నవ్వుతూ చేస్తారు , ఆ కర్మ ఫలితం కష్టాలు అనుభవించవలసి వచ్చేసరికి ఏడుస్తూ అనుభవిస్తారు.** ఇటువంటి పరిస్థితి మనది.

క్రింది స్థాయినుంచి పై స్థాయిదాకా అంచలంచెలుగా ఇక ఆముత్ర ఫలభోగ విరాగము, విషయాలపట్ల సుఖమే కాకుండా ఏ సుఖమయినా మరలా పోయేదే అనుకుని శాశ్వతగా వుండే సుఖం బ్రహ్మానందమే అని తెలుసుకున్నాం. నాలుగు మహావాక్యాలు చెప్పకుండానే లక్ష్యాలు చెప్పేశాము. కనుక ఆ లక్ష్యాలు అంత వరకే పెట్టుకోవాలి. పూర్వము ఏమి చెప్పారు?

**సర్వ ఖల్విదం బ్రహ్మ** అన్నారు. లక్ష్యమేమో **సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ** అన్నారు. ఈ చాప్టర్ మొదలు పెట్టేటప్పుడే ఆ వాక్యాలతో మొదలు పెట్టాము. దాని అర్థము ఇప్పుడే అర్థంకాదు గాని, దానిని గమనంలో పెట్టుకుని క్రిందినించి పైదాకా సాధన చేయాలి. సాధన చతుష్టయ సంపత్తి వున్నవాడే అధికారి. అయితే ఇక్కడ అనుబంధ చతుష్టయం చెప్పారు. ఏమిటంటే విషయము, సంబంధము, ప్రయోజనము, అధికారి. ఈ నాలుగు కలిసి అనుబంధ చతుష్టయము. ఈ అనుబంధ చతుష్టయము ఎందుకు? బ్రహ్మ జ్ఞానం చెప్పే ముందు ఈ నాలుగు చెప్పాలి.

విషయం బ్రహ్మ జ్ఞానము. బ్రహ్మ అనేది చాలా గొప్పగా వుంది. ఆ బ్రహ్మ జ్ఞానం వున్నవాడు మళ్ళీ పుట్టడు. బ్రహ్మ జ్ఞానం వున్నవాడికి సంసారం వుండదు. దుఃఖము వుండదు. బంధము వుండదు. శాశ్వత ఆనందం వుంటుంది. బ్రహ్మ అంటే శాశ్వత ఆనందమే, అయితే నాకేంటి అంటాడు? అంటే నీవే ఆ బ్రహ్మవి, నీకూ ఆ బ్రహ్మకూ సంబంధం వుంది. నాకు సంబంధం వుంటే మాత్రం ఈ ప్రపంచములో కోటానుకోట్ల జీవులున్నారు. ఒక్కడిని మోక్షం పొందినవారిని చూపించండి. ఎందుకీ నా టైం వేస్టు, నాకక్కరలేదు అంటారు. లేదు బాబూ తెలికే , వాడికయింది, వీడికయింది అని పదిమంది పేర్లు చెప్పి వేమన యోగి నీలాంటివాడే అనేక వ్యసనాలు వున్నవాడు అయినా బ్రహ్మజ్ఞాని అయ్యాడు. ఈ మోక్షానికి అందరూ అర్హులే. ఏ కులం వారైనా, పురుషులైనా , స్త్రీలైనా అందరూ అర్హులే అని కొన్ని ఉదాహరణలు చెప్తే అయితే ప్రయోజనం వుందన్నమాట అని వస్తాడు. ఇప్పుడు వాడికి మోక్షం అంటే ఏమిటో జన్మరాహిత్యం అంటే ఏమిటో చెప్పాలి.

నేను బ్రహ్మనా? అయితే ఏమిటి? నాకిప్పుడు బాగానే వుందిగా అంటాడు. జన్మలు పునర్జన్మలన్నీ తీయని బంధాలతో ఆనంద పడుతున్నానుగా అంటాడు. సంబంధం వుంటే వుంది నాకేమీ అక్కర్లేదు అంటాడు. కాని ఈ తీయని బంధాలు ఇవన్నీ తాత్కాలికము అని, ఇహ, ఆముత్ర ఫల భోగ విరాగము అని అక్కడ చెప్తే ప్రయోజనము వుంది కాబట్టి ఇక వస్తాడు. ఇప్పుడు చెప్పాలి సాధన చతుష్టయ సంపత్తి వుండాలని. షట్క సంపత్తి వుండాలి అని. అనుబంధ చతుస్టయములో మూడూ అయ్యాక అధికారి అవాలి. సాధన చతుష్టయ సంపత్తి వున్నవాడే అధికారి.

అధికారి అయ్యాక మళ్ళీ ఏం చెప్పాలి – వివేక వైరాగ్యాలు చెప్పాలి. అవి రెండూ చెప్పాక నువ్వు సాధన చెయ్యాలంటే శమదమాలు రెండూ లేకపోతే బ్రహ్మజ్ఞానము నీకు చెప్పేమి లాభము? గురువుకి కంఠ శోష. అయితే శమాది షట్క సంపత్తి పాటించాడు. ఇంతా పాటించి తీవ్ర మోక్షేచ్ఛ లేకపోతే ఎట్లా? ఒకడు ఓర్చుకుంటున్నాడు కాని శాస్త్రం గురించి అడగట్లేదు, మోక్షంమీద తీవ్రమైన కాంక్ష లేదు. అప్పుడు నాలుగవది కావలసి వచ్చింది. అందుకే చివరి చాప్టర్లో నాలుగూ కావాలా, ఒకటి వుంటే చాలదా, రెండు వుంటే చాలదా, మూడు వుంటే చాలదా అనే ప్రశ్నలకి కూడా జవాబు వుంది.

శ్రద్ధ అనగా వేద శాస్త్రముల లక్ష్యార్థమయిన పరబ్రహ్మయందు అధికమయిన విశ్వాసము కలిగి ఉండుట. (ఈ అధికమయిన విశ్వాసమే ఉపరతి) లేక అప్పుడప్పుడూ వాత పిత్త శ్లేష్మాది మలినములు కలిగిన ఈ దేహము వలన ఋగ్మత కలుగుచున్నను – అనగా మూడు గుణాలు వున్నాయి. వాటిలో ఒక గుణము వల్ల వాతము, ఒక గుణము వల్ల పిత్తము, వేరొక గుణము వల్ల శ్లేష్మము కలుగుతాయి. ఈ మూడు గుణాలూ కూడా ఈ రూపంలో శరీర ఆరోగ్యంమీద పనిచేస్తాయి. ఆయుర్వేద వైద్యములో ఈ రోగి ఈ మూడు గుణాలూ వున్నటువంటి దానికి సాత్విక రాజసిక తామసిక ఆహారము అని మూడున్నాయి. పిత్త వాత శ్లేష్మాలని మూడున్నాయి. ఏ గుణానికి ఏ మందో ఏ ఆహారం తింటే ఈ శ్లేష్మం పెరిగిందో ఆ అహారం మానివేసి వేరే ఆహారాన్ని కనుక మారిస్తే అంటే రాజసిక తామసిక ఆహారము తీసివేసి సాత్విక ఆహారము తీసుకుంటే ఆ రకంగా మనో బుద్ధులలోని గుణం మారుతుంది. ఆయుర్వేద వైద్యములో ఆ విధమైన దినుసులు పాటించవలసిన పత్యము ఇవన్నీకూడా చెప్తారు. మూడు గుణాలకి సంబంధించిన ఆహారాన్ని మారుస్తారు. వాత పిత్త శ్లేష్మాలకి వారు వైద్యం చేస్తారు. వైద్యాన్ని మనస్సు మీద చేస్తారు. అప్పటికి గాని అది తగ్గదు. మనసు మారాలి.

ఈ దేహము వలన అనేక వ్యాధులు బాధలు వస్తున్నాయి. దేహభావమునందు వుండక బ్రహ్మ నిష్ఠయందు వుండుట. పామరుడు ఏ విధముగా భౌతిక విషయములందు కూరుకుని పోవునో అంతటి తీవ్రముగా భౌతిక దేహ సంబంధముల వృత్తి పరమైన వ్యతిరేకమైనటువంటి బ్రహ్మనిష్ఠయందు మునిగి వుండుటయే శ్రద్ధ. శరీరము నిన్ను వ్యాధి బాధలతో వాత పిత్త శ్లేష్మాలతో ఎంత బాధిస్తున్నప్పటికీ ఇట్టి శరీరము నేను కాదు అని బ్రహ్మ నిష్ఠలో వుండుటయే సమాధానము.

ఒక నవాబుగారు రోడ్డుమీద వెళ్తుండగా నమాజు సమయమునకు, మసీదునుండి మైకులో వినబడింది. వెంటనే ఆ రోడ్డుమీదే నమాజు చేసుకుంటుండగా, ఒక స్త్రీ, ఆపదలో ఉన్న తన భర్తకోసం పరుగెడుతూ, చూచుకోకుండా పోతుంటే, ఆమె కాలు నవాబుగారికి తగిలింది. నవాబు గారికి కోపం వచ్చి, ఆమెకు మరణశిక్ష వేశాడు. ఆ స్త్రీ ఆ శిక్షకు ఒప్పుకుంటూనే ఇలా అడిగింది.

“అయ్యా! నేనేమో నా భర్త విషయంలో శ్రద్ధ కలిగి మిమ్మల్ని పట్టించుకోలేదు. నేను అజ్ఞానిని. మరి మీరేమో, అల్లామీద శ్రద్ధతో నమాజు చేస్తున్నారు. మరి అంత శ్రద్ధ ఉంటే నన్ను పట్టించుకొనేవారు కాదుగా” అని అంది. ఇదీ కథ. ఆ స్త్రీ ప్రాపంచికమైన శ్రద్ధగా ఎలా ఉందో, సాధకుడు అంతే శ్రద్ధతో బ్రహ్మనిష్ఠయందు మునిగి ఉండాలి. అన్యము తెలియని విధముగా ఉండాలి.

**యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు,యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా** అని భగవద్గీత శ్లోకం. యుక్తాహారము అంటే తామసిక రాజసిక ఆహారాలు కాకుండా సాత్విక ఆహారమే వుండాలి. వివిక్తో ఉపవాసః : ఉపవసించడం అంటే దేని సమీపంలో వశించాలి? ఉప అంటే సమీపము. వశించుట అంటే వుండటము. ఎక్కడ దేని సమీపంలో వుండాలి? సజ్జన సాంగత్యంలో సుజనుల సమీపంలో వుండాలి. దుర్జన సాంగత్యం పనికిరాదు. సత్ సాంగత్యములో సజ్జనుల సమక్షంలో వుండాలి. పానశాల మధుశాలలో వుండకూడదు. గుడిలో బడిలో వుండాలి. ఇది **వివిక్త ఉపవాసః** అంటే అర్థము. ఇంద్రియములను జయించిన వాడిని జితేంద్రియుడు అంటారు. ఇంద్రియములు ఎవరి చెప్పుచేతలలో వుంటాయో వాడు జితేంద్రియుడు. విహరించడము అంటే మూడు గుణాలూ చూసుకోవాలి. తమో గుణ రజో గుణ సాత్విక సంబంధాల వ్యవహారములున్నాయి. ఈ మూడు సంబంధాల విహారాలున్నాయి. ఈ మూడు సంబంధాల స్థానాలున్నాయి. కనుక వాటి విషయంలో తమో రజో గుణాలనుంచి విడుదల అయి సాత్విక విషయంలో గాని ఆహార విషయంలో గాని నియమంగా వుండాలి. అన్నముయొక్క సూక్ష్మాంశము మనస్సు గనుక సాత్విక ఆహారము వలన మనస్సు సత్వగుణంలో ఉంటుంది.

మోక్షం వస్తుందా లేదా అనే సందేహం వుండకూడదు. సంశయము లేకపోవడమే సమాధానం. ఏమిటీ ఇక్కడ సంశయం? మోక్షం అనేది వుందా లేదా? వుంటే నాకు వస్తుందా రాదా? నాలాంటి పామరుడికి పాపాత్ముడికి వస్తుందా? నిన్నటి వరకు ఎన్నో తప్పులు చేశాము. వున్నట్లుండి నాకెలా మోక్షం వస్తుంది. నాకంత అర్హత వుందా? భగవంతుడు నన్ను ఒప్పుకుంటాడా? ఇరవై ముప్పై సంవత్సరాలనుండి సాధన చేసేవారు వున్నారు. వారికే రాలేదు. నాకు వస్తుందా అని అనుకుంటాడు. అటువంటి సంశయము లేకపోవడమే సమాధానము. ప్రతి దినము ఆ బ్రహ్మ చింతనయందు కాలము గడుపుతూ వుండగా ప్రారబ్ధ వశమున వచ్చే ప్రతిబంధకాలని లెక్కచేయకుండా ఆ వచ్చినటువంటి సుఖదుఃఖాలకి పొంగకుండా క్రుంగకుండా, నిమిత్త కారణాన్ని ఎవరిమీదా మోపకుండా, నిన్ను సుఖపెట్టిన వారిమీద రాగము లేకుండా, నీకు నష్టము కలిగించిన వారి మీద ద్వేషము లేకుండా, శత్రువుమీద కూడా కోపము లేకుండా ఇదంతా పూర్వ జన్మప్రారబ్ధ ఫలితమని, అన్ని సమస్యలకు పూర్వ జన్మలో తన అజ్ఞానమే కారణమని వీరు వారు అనేవారు కారణం కాదని, వారిద్వారా జరుగుతున్నట్లు అనిపించినా అవన్నీ నీ కారణంగానే జరుగుతున్నాయి. కాని ఇతరులమీద దోషాన్ని ఆరోపించకుండా వుంటే సమాధానము పొందవచ్చును. అలా లెక్కచేయకపోతే అలా లెక్కచేయని స్థితిలో నీ మనసును ఉదాసీనముగా ఉంచి బుద్ధిని స్థిరంగా పెట్టుకుంటే, కాని అలా పెట్టుకోలేనప్పుడు పెద్దలు చెప్పిన ఆప్త వాక్యాలను విని వారిద్వారా వచ్చినటువంటి రహస్యాలని తెలుసుకుని వాటియందు ఆసక్తి వుండేటట్లుగా మీ బుద్ధిని నిలుపుదల చేయడమే సమాధానము. సమాధానము శ్రద్ధ కలిసి పోయాయి. శ్రద్ధ సమాధానము అంటే ఒకటే. అర్థమేమిటంటే ఈ లక్ష్యము విషయంలో అనుమానము వుంటే సమాధానము లేదు. అనుమానము లేకపోతే సమాధానము ఉంది. ఈ అనుమానము తీరాలి అంటే ఇప్పుడు నీవున్నటువంటి స్థితిలో అనుమానము తీరదు. నీ స్థితి మారాలి. అందుకని జితేంద్రియః అంటున్నారు.

చతుష్టయ సంపత్తిలో మోక్షేచ్ఛ నాలుగవదిగా వుంది. ఇవన్నీ జరపడానికి చాలా ప్రతిబంధకాలు వున్నాయి. మోక్షం వుందా లేదా, వుంటే నాకు వస్తుందా రాదా? అని అనుకోవడం కూడా ప్రతిబంధకమే. అప్పుడప్పుడూ ప్రతిబంధకాలు వస్తూ వుంటాయి. నా సాధన బాగానే వుందని ఉత్సాహపడతారు. కాని తమోగుణం ఆవరిస్తుంది. జడత్వం వస్తుంది. అక్కడ చిక్కుకుంటారు. గురువుల పెద్దల సలహాలు తీసుకోరు. కొంతమందికయితే గురువే వుండడు. ఉన్నా సమష్టిగా అందరికీ

కామన్‌గా చెప్పే గురువు వుంటాడు. వ్యక్తిగతంగా శ్రద్ధతో సందేహాలు తీర్చే గురువు వుండడు. అప్పుడు నిరుత్సాహపడతాడు. జడత్వం వస్తుంది. నిరుత్సాహపడి నావల్ల కాదని, కాడి క్రింద పడేస్తారు. అలా చేయకుండా వుండటమే సమాధానం. అలా చేస్తే సంశయం వున్నట్లే.

వేదాంత శాస్త్రములయందున్న సంగతులను, స్థితి, యుక్తి, అనుభవములతో అంతరమున మనసును సమాధాన పరచుటయే దీనికి ఫలము. అప్పుడు ఎక్కడికి వెళ్ళాలి? పెద్దల దగ్గరికి వెళ్ళాలి. గురువులు తమాషా చేస్తారు. సాధన ముందుకెళ్ళకపోతే నిరుత్సాహ పడుతుంటే ప్రోత్సహించి నీవు చాలా మంది కంటే సాధనలో ముందున్నావు, నీది అయిపోయింది, నువ్వు పరిపూర్ణమయిపోయావు అంటాడు గురువు. ఇంకేముంది అయిపోయింది, పరిపూర్ణమయిపోయాము అనుకుంటాము. కాని సందేహం వస్తుంది. నేను పరిపూర్ణుడని ఎక్కడయ్యాను? ఆ రుజువు కావాలి, ఆ తృప్తి కావాలి అంటాడు. అయితే ఏమి? నిరుత్సాహం పోయిందిగా!

ఇంకొకడు బాగానే వున్నాడు, ఉత్సాహంగానే వున్నాడు, కాని ఏవో కొన్ని అనుభవాలు వచ్చాయని గురువుకి సాటి శిష్యుడికి పదేపదే చెప్తూ వుంటాడు. కొందరు మాకు రాలేదు, నీకెలా వచ్చింది? అని అడుగుతూ వుంటారు. వాడిక తన అనుభవాలు చెబుతూ వుంటాడు. ఈ క్రమములో అతనికి అహంకారం పెరుగుతుంది. అహంకారం పెరగకుండా వుండటానికి గురువు వచ్చి, నీ అనుభవము సరిపోలేదు, నీకు అవలేదు, ఇంకా చాలా చెయ్యాలి, చాలా వుంది, అది వుంది ఇది వుంది అని హింస పెట్టి, అహంకారం పోయేటట్లుగా, గర్వభంగం జరిగేటట్లుగా గురువు చేస్తాడు. అయినవాడికి అయిందనీ చెప్పడు, కాని వాడికి కాలేదనీ చెప్పడు. కానివాడు నిరుత్సాహపడితే అయిపోయిందని చెప్తాడు. అయినవాడికి అహంకారం పెరుగుతుందని, అయినా అవలేదని చెప్తాడు. ఎందుకంటే శిష్యుని అహంకారం పెరిగితే మళ్ళీ పడిపోతాడు. శిష్యుని మేలుకోరే ఇదంతా. అందుకే గురువు కేవలం బోధించడము కాదు, కేవలం మార్గదర్శకం కాదు, అప్పుడప్పుడూ మీరు నిరుత్సాహంగా వున్నప్పుడు మేల్కొల్పడం, ఉత్సాహం పరచడం, ఆప్త వాక్యాలు చెప్పడం చేస్తాడు. సిద్ధాంత వాక్యాలు అందరికీ సరిపోతాయి. అక్కడికక్కడే ఏ శిష్యునికి ఆ శిష్యునికి సరిపోయే వాక్యాలు ఆప్త వాక్యాలు.

నాలుగవది ముముక్షత్వము. ఎవరికైనా ఒక లక్ష్యం పెట్టి అది కావాలి అన్నప్పుడు ఆ కావాలి అనేది తీవ్రంగా తపనగా వున్నప్పుడు, గురువుకు శరణాగతి అయినప్పుడు, ప్రాణం పోయినా పర్వాలేదు, ఈ లక్ష్యం మాత్రం సాధించి తీరాలి అని అన్నీ వదులు కోవడానికి రెడీగా వుండేవారికి బోధ చెప్పవచ్చు. అధికారి కావడానికి ఇప్పుడు నాలుగవది అయిన ముముక్షుత్వము గురించి చెప్తున్నారు. సిద్ధ పరచుకోవాలంటే శ్రద్ధ ఏకాగ్రత వుండాలి. మనసు అటూ ఇటూ పోకుండా వుండాలి. వాసనాత్రయము, ఈషణాత్రయము లేకుండా పోవాలి. నీకు అవసరమైన దానిమీద మనసు పెట్టి వినాలి. ఆ వినడానికి చెప్పబోయే విషయం నీకు ఇష్టమైనట్లుగా ఆ ఇష్టాన్ని కలుగజేసుకొని, శాస్త్రముమీద, గురువుమీద శ్రద్ధ కలిగి వుండాలి. ఈ రకంగా బ్రహ్మజ్ఞానానికి మోక్షానికి నిన్ను నీవు సంసిద్ధపరచుకుంటున్నావు. ముముక్షుత్వము అంటే మోక్షం కావాలని అపేక్ష, తపన కలిగి వుండటం. ధర్మార్థ కామములు పదార్థ భోగములనియు, మోక్షము పరమ పురుషార్థమని శృతివాక్యము. ఇక్కడ నాలుగు పురుషార్థాలు వున్నాయి. ధర్మము, అర్థము, కామము, మోక్షము. పుట్టిన ప్రతివాడూ కూడా కర్మ వాసనచేత మూడు గుణాలచేత ఒక స్వభావంతో ఒక వ్యక్తిత్వంతో పుడుతున్నాడు. మోక్షానికి వచ్చేసరికి, ఇవన్నీ కట్టకట్టుకుని లేకుండా చేస్తేనే వీలవుతుంది. అంత తేలికగా అవిపోవు. కనుక మామూలు బోధ ఎలా చెప్తారు?

ధర్మార్థకామాలను వరుసగా చెప్తారు. ధర్మమంటే ఇది చెయ్యాలి ఇది చెయ్యకూడదు అని, ధర్మమంటే పుణ్యమే చెయ్యాలని పాపం చెయ్యకూడదని చెప్తారు. మరి అర్థ కామాలు వచ్చినాయిగా! అర్థమంటే కోరికలు ఉండడము. కామాలంటే కోరికలను తీర్చుకోవడము. అర్థమంటే డబ్బు కావచ్చు, ఏ వస్తువు అవసరమో ఆ వస్తువు పేరు అర్థం. ఆ వస్తువును పొంది కోరిక తీర్చుకోవడము. ఆ వస్తువుతో నువ్వు పొందాలనుకున్న సుఖం పేరు కామం. ఈ అర్థ కామాలు అధర్మంగా అన్యాయంగా చేసుకోవాలా? ధర్మముగా చేయాలా? న్యాయంగా చేయాలా? ఎప్పుడు చేయాలి? ఎప్పుడు చేయకూడదు? అవసరాలు ఎలా తీర్చుకోవాలి? బ్రతకడం కోసమే తినడంగానీ జిహ్వా చాపల్యం కోసం తినడం కాదు అన్నట్లుగా అర్థకామాలని ధర్మంగా ఆచరించాలి. అవసరం వరకే ఆచరించాలి. అవసరాన్ని మించితే నిగ్రహించాలి. ఇలా చేస్తే అర్థకామాలను ధర్మంగా భోగిస్తూ, ఒకవేళ అధర్మం జోలికి వెళ్ళవలసినప్పుడు నిగ్రహిస్తూ వుండాలి. అంతవరకూ నీకు తెలియకుండా చేసే సాధన. నాలుగవది

మోక్షం. అప్పుడే మోక్షం గురించి చెప్తే ఎవరు వింటారు? ధర్మంగా అర్థ కామాలు ఆచరించినపుడు వారికి ఓర్పు సహనము త్యాగము వుంటాయి. పెద్దలయందు భక్తి వుంటుంది. వినయం విధేయత వుంటుంది. అతడు సత్వ గుణంలో వుంటాడు. అప్పుడు చెబితే వింటాడు. మిగతావాళ్ళు ఎవరూ వినరు. అప్పుడు మోక్షం సంగతి, ఆత్మానాత్మ వివేకం గురించి చెప్తారు. కావాలంటే దానికోసం ప్రయత్నం చేస్తాడు, లేకపోతే లేదు. మోక్షం కోసం ప్రయత్నం చేయకపోయినా అర్థకామాలు ధర్మంగా నెరవేర్చుకుంటూ ఉంటే అధర్మంగా నెరవేర్చకుండా నిగ్రహించుకుంటూ ఉంటే అట్టివారు సాధనకి పనికివస్తారు. ఏకపత్నీవ్రతం నెరవేర్చుకోవడం. ఇతరముల మీద కామ మోహాలను తగ్గించుకోవడం. ఇదంతా మోక్షమార్గం కోసము చేసే సాధనే.

పూర్వం గురుకులంలో ధర్మార్థకామ మోక్షాలు నాలుగూ చెప్పి బ్రతకడానికి కావలసిన విద్యకూడా నేర్పి గృహస్థాశ్రమం చేసి రమ్మనిపంపిస్తారు. వందమంది శిష్యులలో 90 మంది గృహస్థాశ్రమంలో చేరిపోతారు. నీతిగా నిజాయితీగా జీవితాన్ని గడుపుతూ వుంటారు. తరువాత వానప్రస్థాశ్రమానికి వెళ్ళి, మళ్ళీ గురువు దగ్గరికి వచ్చి మోక్షంకోసం ప్రయత్నం చేస్తూ బోధ విని వెళ్తూ వుంటారు. గృహస్థాశ్రమంలో సంతానం కన్నాక వాళ్ళ బాధ్యతలు తీరిపోయాక సత్సంగాలలో పాల్గొనడం గురువును ఆశ్రయించడం చేస్తారు, గృహస్థాశ్రమంలో వుంటూనే. పూర్వం గురుకులంలో ఏం చేస్తారంటే ఇలా గృహస్థాశ్రమంలోకి వచ్చి తిరిగి వచ్చాక మోక్షం కావాలనుకున్నప్పుడు తిరిగి గురువు దగ్గరికే వెళ్తారు. గురువు అనేక పరీక్షలు పెట్టి నెగ్గితే, మోక్షమార్గాన్ని బోధించి అనుభవం వచ్చేదాకా తన దగ్గర పెట్టుకుంటాడు. బ్రహ్మచర్యం చేసి ధర్మార్థ కామమోక్షాలు విషయంగా తెలుసుని ధర్మముగా వుండేటటువంటి జీవితాన్ని జీవించి, ఇంటికెళ్ళి గృహస్థాశ్రమాని స్వీకరించినవారు మోక్షమే కావాలనుకునే పెళ్ళి చేసుకోకుండా వచ్చేవాళ్ళు వున్నారు. వాళ్ళందరికీ పరీక్షపెట్టి గురువుగారు చెప్పేవారు. కొంతమంది గృహస్థాశ్రమంలో కొట్టబడ్డాక, **ఇంటిలోని పోరు ఇంతింత కాదయా విశ్వదాభిరామ వినుర వేమ** అన్నట్లుగా వున్నప్పుడు మోక్షం కావాలని మరలా గురువు దగ్గరికి వెళ్తారు. లేకపోతే వ్యాపారంలో నష్టం వస్తే మోక్షం కావాలని గురువు దగ్గరికి వెళ్తాడు. ఎందుకంటే సాధన చతుష్టయ సంపత్తి విని వున్నాడు. ధర్మార్థ కామ మోక్షాలు నాలుగు గురించీ విని ఉన్నారు. ఇంట్లో నించి పారిపోవడానికి ఈ ఆశ్రమాలే శరణాలయాలు. గురువుగారి భార్య వండి పెడుతుంది, తింటూ వుంటారు. బాధ్యతగా అవసరాలలో గురుపత్నికి సహాయం చేస్తూ వుంటూ వుండవచ్చు. మళ్ళీ పోయిన నష్టమంతా పోయినదాని కంటే ఎక్కువగా వస్తే, లేకపోతే భార్యాపిల్లలు వచ్చి బ్రతిమలాడి ఇంటికి రమ్మంటే ఇంటికెళ్ళిపోతారు. ఇది మంద మోక్షేచ్ఛ.

మంద మోక్షేచ్ఛ ఎలా వుంటుందంటే ప్రసూతి వైరాగ్యము, పురాణ వైరాగ్యము, శ్మశాన వైరాగ్యము వచ్చినప్పుడు మాత్రమే ఉంటుంది. తీవ్ర మోక్షేచ్ఛ అంటే నాకు మోక్షమే కావాలి, నాకు బ్రహ్మ జ్ఞానం కావాలి, దానికోసం ఏదైనా త్యాగం చేస్తాను అంటారు. మా గురువుగారు ఏం చెప్తారంటే అలాంటి వాళ్ళు సంసారం చెయ్యాలి, నీ స్థితిని నువ్వు కాపాడుకుంటూ వైరాగ్యాన్ని పాటిస్తూ, నీ ఉద్యోగములో సంసారములో కలిగే ఇంద్రియ భోగాలు గాని ప్రయోజనాలు గాని వైరాగ్యంతోటి వదిలి పెడుతూ కేవలం కర్తవ్యంగా చేసుకుంటూ, ఎటువంటి ఇబ్బంది ఎదురైనా కూటస్థ స్థితిలో బుద్ధి నిశ్చలంగా పెట్టుకుని వాటినన్నిటినీ పట్టించుకోకూడదు. అయినప్పటికీ బాధ్యత నెరవేరుస్తూ సంసారం చెయ్యి ఉద్యోగం చెయ్యి అంటారు. ఎందుకంటే, అటువంటి వారే నీయొక్క నిశ్చల తత్వాన్ని నీవు పరీక్షించుకోవడానికి ఉపయోగపడతారు. వాళ్ళే నీ గురువులు అంటారు.

ధ్వజ స్తంభం గుళ్ళో పాతినప్పుడు లోతుగాపెట్టి పాతినతరువాత ఊపేవాళ్ళు. ఊపిన తరువాత మళ్ళీ మట్టివేసి పూడ్చేవారు. మళ్ళీ ఊపేవారు. అట్లా కదలకుండా వుండేదాకా మళ్ళీ మళ్ళీ మట్టివేసి పూడ్చేవారు. గడ్డపార వెనక్కి తిప్పి కూరేవారు. ఈ సంసారంలోని కుటుంబ సభ్యులు వీరంతా కూడా అలా కదిలిస్తారన్నమాట. ధ్వజస్థంబం ఊగకుండా నువ్వు గట్టి చేసుకోవాలి. నువ్వే ఆ ధ్వజస్తంభానివి. నువ్వు స్థిరంగా వున్నవా? లేదా? చుట్టూ వున్నవాళ్ళవల్ల కదులుతున్నావా? కదిలితే మళ్ళీ శమదమాదులు పాటించి మళ్ళీ గట్టిపడితే ఆ ధ్వజ స్థంభంలాగా స్థిరమైతే నువ్వు కూటస్థుడివే, కూటస్థ ఆత్మవే. తీవ్ర మోక్షేచ్ఛ వుందో లేదో అని పరీక్ష, ఆ మాదిరిగా ఉంటుంది.

అందుకే గృహస్థుగా వున్నవాళ్ళకే తొందరగా మోక్షమొస్తుంది. బలవంతంగా సన్యాసం తీసుకున్న వాళ్ళకి పరీక్షలు లేవు. అందువల్ల సాధన లేదు. మానసిక సంసారం ఉంటుంది. ఎప్పుడో ఒకప్పుడు భ్రష్టులవుతావు. అందుకే సన్యాసం తీసుకోవడానికి ఓ పద్ధతుంది. పూర్తిగా సన్యాస భావం వచ్చాకే సన్యాసం అనేటటువంటి దీక్ష తీసుకోవాలి. దీక్ష తీసుకున్నాక ఏ సాధనా చెయ్యకూడదు. సాధనంతా పూర్తయ్యాక నాకు దీక్ష ఇవ్వండి, నేను సన్యసించి వుండగలను, ధ్వజస్తంభం లాగా కదలకుండా వుండగలను అన్నవాడే సన్యసించాలి. వాడికి ఇక ఎటువంటి వికారాలూ కలుగకూడదు ప్రకృతిని చూస్తే.

మోక్షము పరమ పురుషార్థమని శృతి వాక్యము. కావున ఆ మోక్షమే కావలెనని చెప్పినంత మాత్రమున మోక్షేచ్ఛ కానేరదు. తీవ్ర మోక్షేచ్ఛ కు ఉదాహరణ చెప్పారు. ఇల్లు కాలిపోతున్నప్పుడు అగ్ని ప్రమాదం జరిగినప్పుడు ఆ మంటలు మీది మీదికి వస్తున్నప్పుడు ఎలా అయితే అన్నీ వదిలివేసి నిన్ను నీవు రక్షించుకుంటావో అలాగే నీ మోక్షం కోసం నిన్ను నువ్వు సిద్ధపరచుకుంటావో నీ విడుదలకోసం నిన్ను నీవు ఎలా సిద్ధపరచుకుంటావో అగ్ని ప్రమాదములో ఇంట్లోనించి బయట పడటానికి ఎట్లా పరిగెడతావో, ఎంత తపన పడతావో మోక్షం కోసం కూడా విముక్తి కోసం కూడా అంతటి తపన వుండాలి. పుత్ర మిత్ర కళత్రాదులు ధనధాన్యాదులు అన్నీ ఏమైపోయినాయి అని విచారించకుండా వాటన్నిటినీ విడిచి తాను మాత్రము శీతలమునందు ప్రవేశించుటకై తీవ్రముగా ప్రయత్నించినట్లుగా ఆ తరువాత అవకాశము వుంటే ఎవరో ఒకరిని రక్షిస్తావు. ముందు నీవు బయటపడతావు. చుట్టూ నాలాగా ఇంతమంది వున్నారు, వీళ్ళని రక్షించాలనేది వుండదు.

సంసారమందు కూడా ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక తాపాలున్నాయి. తాపత్రయము అంటాము దీనిని. ఇల్లు ఎలా అయితే తగలబడుతుందో అగ్ని ప్రమాదంలో మనము కూడా మన మనసుతో ఈ తాపత్రయము అనేటటువంటి అగ్ని చేత తప్తులై – పూర్తిగా దానితోటి సంగత్వము చెంది సంసార సాగరమును పోగొట్టునట్టి సద్గురువులు ఎక్కడ వున్నారా? అని వెతికి అందుకు సాధనాలేమిటి? అని తెలుసుకుని గట్టిగా ప్రయత్నించేటటువంటి చిత్తవృత్తియే తీవ్ర మోక్షేచ్ఛ. దానినే ముముక్షుత్వం అంటారు. ఈ విధంగా సాధనా చతుష్టయమును వేదాంత శ్రవణమును చేయడానికి సంపాదించుకోవాలి. నాలుగు మహావాక్యాలే నిజమైన వేదము. నాలుగు మహావాక్యాలు వినడానికి యోగ్యతను సంపాదించాలి అంటే నిజమైన బ్రహ్మ విద్య అక్కడినుండి మొదలవుతుంది. నిన్ను నీవు ఆయత్త పరచుకోవాలి. ఆ బ్రహ్మ విద్య బోధిస్తే వినడానికి నీకు అర్హత రావాలి. ఇది ఎంట్రెన్స్ టెస్ట్ లాంటిది. ఎంసెట్ , లాసెట్ ఈసెట్ ఎంట్రెన్స్ టెస్ట్‌లవంటిది. ఇందులో పాస్ అయినవారికి మెరిట్‌నిబట్టి సీట్లు వుంటాయి. తక్కువ రాంకు వస్తే సీటు కూడా వుండదు. అలాగే బ్రహ్మ విద్య నేర్చుకోవడానికి నాలుగు మహావాక్యాల ద్వారా శ్రవణ మనన నిది ధ్యాసలు చేసుకుని ముక్తి పొందాలి అంటే ముందస్తుగా నిన్ను నీవు సంసిద్ధ పరచుకోవడానికి సాధనా చతుష్టయ సంపత్తి కావాలి. ఇందులో ఆఖరిదైనటువంటి తీవ్ర మోక్షేచ్ఛ వుండాలి. విడగొట్టి చెబుతున్నప్పటికీ ఈ నాలుగూ కూడా ఒకదాని తరువాత ఒకటి కాదు. అన్ని సాధనలు సందర్భాన్నిబట్టి చేస్తూ ఉండాలి. ఒక సాధనలోనే మిగిలినవన్నీ ఇమిడి ఉంటాయి.

గురుకులంలో శిష్యులను వేరే కార్యక్రమాలకు, ఆశ్రమ నిర్వహణకు, గురువుకి పాదాలు పట్టడంలాంటి శుష్రూషలు చేయించుకుంటారు. అతనిలోని తమో రజో గుణాలు తగ్గి గురువును ఇష్టదైవం కంటే ఎక్కువగా ప్రేమించేదాకా గురువు గారు తిట్టినా కొట్టినా అవమానించినా ఉక్రోషం రాకుండా అహంకారం రాకుండా ఉండడానికి ఇవన్నీ చేయిస్తూ ఉంటారు. అహంకారం తగ్గేదాకా శుశ్రూషలు చేయించుకుంటారు. శిష్యులని అనడం లేదు. గురువులలో కూడా అష్ట మదములు ఉన్నాయి. కుల మదము, ధనమదము, విద్యామదము ఇవన్నీ వున్నాయి. ఈ అష్టమదములలో ఇరుక్కున్నవారు చాలామంది వున్నారు. ఇవన్నీ వదులుకుంటేనే సాధన చతుష్టయ సంపత్తి మీకు కలిగినట్లు. లేకపోతే లేనట్లు. నూటికి నూరుపాళ్ళు కాకపోయినా మహావాక్యాలు చెప్పగా గురువు హెచ్చరించగా గురువు పర్యవేక్షణలో నువ్వు శిక్షణ పొందుతూ వుంటే, గృహస్థాశ్రమంలో నిన్ను అటూ ఇటూ కదిలించేవాళ్ళు నీకు గురువులై, వారు పెట్టే పరీక్షలలో నీవు నెగ్గితే, నువ్వు స్థిరంగా వుంటావు. నువ్వు స్థిరంగా స్థిర బుద్ధిని కాపాడుకోగలిగితే అప్పుడు నాలుగు మహావాక్యాలూ చెప్తారు. ఈ విధముగా సాధనా చతుష్టయము వేదాంత శ్రవణము చేయక మునుపే సంపాదించుకోవాలి.

అటువంటి అధికారిత్వం వున్నవాడికి గురుముఖమున వేదాంత శ్రవణం ప్రారంభిస్తారు. ఇది దీనియొక్క ఔన్నత్యాన్ని బ్రహ్మ విద్య యొక్క ఔన్నత్యాన్ని తెలుసుకోవడం కోసం ఇంత తీవ్రంగా చెప్తున్నాము. అలా వచ్చిన వాళ్ళకే చెప్పాలి అంటే ఈ రోజుల్లో వచ్చేవాళ్ళే లేరు. గురువుగారే వలేసి పట్టుకుని శిష్యులను విన్నా వినకపోయినా సరే వినిపిస్తూ గురువు తన ఆకర్షణ శక్తితో శిష్యులమీద ప్రభావం చూపుతూ ఎంతో కొంత పని జరిగితే, అక్కడికీ మధ్యలో జారిపోతున్నారు. కొంతమంది ఎలాగయితే 1 నుండి 10వ తరగతి వరకు పరీక్ష పెట్టకుండా, నేరుగా టెన్త్ పరీక్షలు పెడుతున్నామో అలాగే మీకు ఇప్పటిదాకా సాధన చతుష్టయ సంపత్తి లేకపోయినా మీకు ప్రమోషన్ ఇచ్చి బ్రహ్మవిద్యే చెప్తున్నాము. ఏమీ పర్వాలేదు. ఇప్పటికైనాసరే వెనకవి నేర్చుకొని, ట్యూషన్ పెట్టించుకొని కోచింగ్ తీసుకొని సీటు సంపాదించుకున్నట్లు తనని తాను రెడీ చేసుకుంటాడు. అలాగే మీకు నాలుగు మహావాక్యాలు చెప్పినప్పటికీ ఇంకా శమదమాలు పాటించడము, కోపతాపాలు రజో గుణం ఇలాంటివి, వస్తు వ్యామోహము ఇవన్నీ తగ్గించుకుంటే ఈ నాలుగు మహావాక్యాలు తత్త్వమసి వాక్యంతో వచ్చే అనుభవానికి మీరు దగ్గరవుతారు. శ్రవణ మనన నిది ధ్యాసలతో అనుభవానికి దగ్గరవుతారు. ఈ విద్య అనేటటువంటిది తప్పకుండా ప్రయోజనం కలిగిస్తుంది.

ఈ జన్మలో కాలేకపోయినా సరే నువ్వు సముపార్జించినటువంటి జ్ఞానము మరో జన్మకు కొనసాగుతుంది. డబ్బు వగైరా అయితే మళ్ళీ జన్మలోకి రావు. ఈ జన్మలో కోటీశ్వరుడు మరో జన్మలో దరిద్రుడు కావచ్చేమో. కాని బ్రహ్మజ్ఞానం విషయంలో నువ్వు ఎంతయితే సంపాదించావో మరు జన్మకి తగ్గకుండా అంతే వుంటుంది నీతో. అందువలన సాధనల వలన గురుబోధ వలన నష్టమేమీ లేదు. మిగతా వాటిల్లో వ్యవహారంలో లాభమూ వుంటుంది నష్టము కూడా వుంటుంది. దీనికి వుంటే లాభము వుంటుంది. నష్టము మాత్రం వుండదు.

గురుముఖతా వేదాంత శ్రవణం చేయమన్నారు. గురుముఖతా అని ఎందుకన్నారు? పుస్తకాలు చదువుకోవచ్చుగా. యూట్యూబ్‌లలో ఇంటర్నెట్లలో కనబడుతూనే వున్నాయి. టీవీలలో ప్రవచనం చేస్తూనే వున్నారు. అవి చాలు కదా! చాలదు. ఎందుకంటే వారు చెప్పేవి వినడమే కానీ ఒక క్రమము వుండదు. ఎక్కడ ప్రారంభించాలో నీ ప్రయాణం ఎలా సాగాలో వ్యక్తిగతంగా ప్రతివారికీ కూడా ఒక మార్గం వుండాలి. అందరికీ కామన్‌గా ఒకే మార్గం సరిపోదు. ఎందుకంటే ఎవరి సంసారము వారిది. ఎవరి కష్టాలు వారివి. ఎవరి స్వభావం వారిది. వారి వారికి అనుగుణంగా చెప్పాలి. క్లాసులో నలభై మంది పిల్లలకి చెప్పినట్లు కాకుండా కొంతమందికి ట్యూషన్ ఎలా చెప్తామో, ట్యూషన్ పద్ధతిలో చెప్పాలి. ఈ ట్యూషన్ పద్ధతే గురుముఖతా. అంటే వ్యక్తిగత శ్రద్ధ వుంటుందన్నమాట. సంస్కారములేని విజ్ఞానవంతుడు, చందస్సు తెలియని కవీశ్వరుడు ఎట్లు వ్యర్థమో అటులనె సాధనాచతుష్టయ సంపత్తి లేనివాడికి జ్ఞానము సిద్ధించదు. ఎంత తెలివైన వాడైనా వాడికి సంస్కారము లేకపోవచ్చును. రాకెట్ కనిపెట్టేంత తెలివి వున్నవాడికి ఆ రాకెట్ ఎలా కనిపెట్టారు అనేటటువంటి రహస్యాన్ని డబ్బుకి ఆశపడి విదేశాలకు అమ్మేశాడనుకుందాం. వాటివల్ల ప్రయోజనం ఏమిటి? పైగా నష్టం జరుగుతుంది.

సంస్కారం లేని విద్య: విద్యతో పాటు వినయము నమ్రత పెద్దలయందు గౌరవము అన్నీ వుండాలి. శ్వేతకేతువు ఉద్ధాలకుడి కొడుకు. వెళ్ళి విద్య నేర్చుకుని వచ్చాడు. ఈయన గురువుల వద్దకు వెళ్ళి విద్య నేర్చుకుని వచ్చాడని ఊరంతా తెలిసి ఆయనని గౌరవిస్తున్నారు. ఈయనకు నా అంతటి వాడు లేడనే గర్వము కలిగింది. నాకే వచ్చు జ్ఞానము , ఇంకెవరికీ రాదు అనుకొంటున్నాడు. అతని తండ్రి నువ్వేమి నేర్చుకున్నావు? నీవెవరో నీకు తెలిసిందా? అని అడిగాడు. మా గురువుగారు అన్నీ చెప్పారు గాని ఇది చెప్పలేదు అన్నాడు. అప్పుడు తనకొడుక్కి తనే చెప్పాడు. కొడుకైన శ్వేతకేతువుకు కొంచెమైనా తెలిసిందో లేదో కాని అందరికంటే నేను గొప్ప నేను విజ్ఞానవంతుడను అనుకున్నాడు. ఇప్పుడతనికి విద్యామదం వచ్చింది. అష్ట మదములలో విద్యామదము ఒకటి. అందుకని విజ్ఞానవంతుడికైనా సంస్కారము వినయ సంపత్తి వుండాలి.

ఛందస్సు తెలియని కవీశ్వరుడు : ఒక పద్యము ఏదైనా ఆశువుగా రాసినా చెప్పినా, అది ఛందోబద్ధంగా వుండాలి. ఇట్లా ఎంత తెలుసుకున్నా ఎలా వ్యర్థమో అట్లాగే సాధన చతుష్టయ సంపత్తి లేకుండా బ్రహ్మవిద్య ఎంత చెప్పినా వ్యర్థమే. మీ సాధనా చతుష్టయమందు నిత్యానిత్య వివేకం ఒక్కటే వుంటే, మిగిలినవి లేకపోతే సరిపోతుందా? ఈ లోకంలో చాల మంది శాస్త్రజ్ఞులకు వారి యొక్క మేధాసంపత్తినిబట్టి ఏది నిత్యమో ఏది అనిత్యమో తెలుసు. కాని వారు ప్రాపంచిక భౌతిక విషయముల మీదే ఆసక్తి కలిగి వున్నారు. కామ్యక కర్మలే చేస్తున్నారు. వైరాగ్యాదులులేవు. కనుక వారలకు అధికారము లేదు.

రెండవ సాధనమైన ఇహ ఆముత్ర ఫల భోగ విరాగము ఉండి, శమాదిషట్క సంపత్తి ముముక్షత్వము లేకపోతే అదెట్లా? అంటే ఋషీశ్వరులు వైరాగ్యంతో వున్నారు. జింక చర్మం చంకన పెట్టుకుని దండకమండలాలు పట్టుకుని తపస్సు చేస్తున్నారు. ఏది అనిత్యము అనేది వారికి తెలుసు. ధనాన్ని వైరాగ్యంతో వదిలేశారు. దేనిమీదా ఆశ లేకుండా దానప్రతిగ్రహణాలు లేకుండా సంచరిస్తూ వుంటారు. కాని కొందరికి కోపతాపములు అధికమై వుండుటచేత, శమదమాలు లేకపోవడం వల్ల, శాపాలు ఇస్తూ వుంటారు. శమదమాలు లేని వారు బ్రహ్మవిద్యకు అధికారులు కారు. కనుక శమాది షట్క సంపత్తి కూడా వుండాలి. పై మూడూ వుండి ముముక్షత్వము లేకపోయినా బ్రహ్మవిద్యకు పనికిరారు.

ముముక్షత్వము లేనివారు బ్రహ్మ విద్య వినరు. వినడానికి ఇష్టపడరు. రామలింగడి పిల్లి ఒకసారి మూతి కాలిందని చల్లని పాలు కూడా త్రాగటం మానివేసినట్లుగా ఇలా వుండవచ్చు వాళ్ళు. అది నిజమైన వైరాగ్యం కాదు. మోక్షం కోసం ఈ మూడూ చేయాలి గానీ మోక్షేచ్ఛ లేకుండా ఈ మూడూ చేసి ప్రయోజనం లేదు. కనుక తీవ్ర మోక్షేచ్ఛ కూడా వుండాలి. పాలు తాగని పిల్లికి వైరాగ్యముందా? కొన్ని కారణాలవల్ల అది అట్లా తయారయింది. పాల మీద దానికి వైరాగ్యము లేదు, మూతి కాలుతుంది కాబట్టి తాగదు అంతే! మోక్షేచ్ఛ లేకుండా అలాగే తయారైన వాళ్ళు వుంటారు. శ్రవణాదులు కలచోట చేరరు. కనుక వారికిన్నీ  అధికారము గానము.

**కం॥ దయయు, జుగుప్సయు, మోహము, భయమును, సం**
**శయము, గులము, బలశాలములన్నియు గూడి**
**నష్టపాశములయి వెలయును**
**వీనినాత్ముడంటక యుండున్ ॥**

జుగుప్స అంటే, ద్వేషము, ఎవరినైనా చూస్తే అసహ్యము, ద్వేషము, అసూయ, ఈర్ష్య, ఇవన్నీ కలిపి జుగుప్స. మోహము. తమో గుణ లక్షణము. భయము కూడా తమో గుణ లక్షణమే. సంశయము రజో గుణ లక్షణము. కులము తమో గుణమే. సంశయము అంటే, అనుమానించడము. భార్యను అనుమానించడంలాంటి అనుమాన పిశాచము అంటామే, అది. కరుణ, దయ – ఇవి సత్వగుణ లక్షణాలు. బలశాలములు రజోగుణము. ఇవన్నీ కలిపి అష్ట పాశములు. ఈ ప్రకారము కొందరు ఈ మూడు గుణములతో కూడియున్న అష్టపాశములను తగలుకొని దరికానక పరితపించుచున్నారు. ఈ బంధములను తొలగించుకొనవలెను.

**శ్లో॥ ఉత్తమాత్తత్త్వ చింతాచ । మధ్యమం శాస్త్ర చింతనం ।**
**అథమా మంత్ర చింతాచ । తీర్థం భ్రాం త్యథమాథమః ॥**

తీర్థయాత్రల వలనను మంత్రానుష్ఠానము వలనను, శాస్త్రములు చదువుట వలనను ముక్తి లేదని నిర్ణయము. కేవలము తత్త్వ జ్ఞాన ఫలమైన అపరోక్ష సాక్షాత్కార స్వానుభవము చేతనే ముక్తి సిద్ధము.

సంస్కారము వదిలించుకోవడానికి తీర్థ యాత్రకు వెళ్ళి మరల రెండవసారి తీర్థ యాత్రకి వెళ్ళాలనే కోరిక పుట్టకుండా ఆ తీర్థ యాత్రలో ఏ ప్రయోజనముందో ఆ విషయమేమిటో అన్నీ సున్నితముగా, సూక్ష్మముగా, లోతుగా పరిశోధించి విడుదల పొందాలి. తీర్థ యాత్రకు వెళ్ళవలసి వచ్చి ఒకరు గురువుగారిని అడిగారు. నీకు సంస్కారముందేమో వెళ్ళిరా! అన్నారు. మరో నాలుగుసార్లు తీర్థ యాత్రకు వెళ్ళి నాకు సంస్కారము వుండటము వల్లనే వెళుతున్నాను అన్నారు. అందుకని దానిని అథమాథమం అన్నారు. **దేహో ప్రోక్తో దేవాలయః జీవో దేవో సనాతనః** దేహమునే దేవాలయముగా చూసేటట్లయితే అందులోని జీవుడే సనాతనమైన పురుషుడు, బ్రహ్మము అని చెప్తుంటే ఎక్కడో తీర్థాలలో దేవుడున్నాడని వెళ్తావెందుకు? అది అథమథమం కాక మరేమిటి?

మూడవది మంత్ర చింతాచ. మీకో మంత్రం చెప్పారు. హంస మంత్రమిచ్చాము తీసుకున్నారు. అక్కడే ఆగిపోయారా? మళ్ళీ కారణ మంత్రం ఇచ్చారు. ఇప్పుడు రెండూ చేయాలా గురువుగారూ అని అడిగారు. అవసరం లేదు, కారణ మంత్రం చేయి, హంస మంత్రం వదిలేయి అన్నారు. దాని తరువాత మూడవ మంత్రం, త్రయ మంత్రం ఇచ్చారు. దీనినేమి చెయ్యమంటారూ? అన్నారు. ఏమీ చేయవద్దు, అసలు తలచుకోవద్దు అన్నాము. త్రయ మంత్రం ఇచ్చాక, ఆ మంత్రాన్ని మాటిమాటికి తలవద్దు అన్నాము. మూడవ స్టెప్ లో మంత్రాన్ని మననము చేయవద్దని అని చెప్పేశాము. ఒకరు వచ్చి నాకు మంత్రమివ్వండి అన్నారు. మంత్రమిస్తే గురువుకి శిష్యుడికి ఒక అనుబంధం ఏర్పడటానికే ఈ మంత్రం తప్ప. ఆ మంత్రానికి ఆ మంత్రాక్షరాలకి ఆ మంత్రపదాలకి కొంత శక్తి వుంటుంది. ఆ శక్తి శిష్యుడిలో వ్యాపకమయి మాంసపిండము మంత్ర పిండముగా తయారవుతుంది. ఆ మంత్రము అంతవరకే. అది మోక్షమిస్తుందా? ఆ తరువాత గురువుతో అనుసంధానం అయినప్పుడు గురువుకి నాలుగు విధాలా శుశ్రూషలు చేసినప్పుడు ఆ శిష్యుడు గురువును వెంబడిస్తాడు. గురువుని ఇంటా వెంటా జంటా పెట్టుకుంటాడు.

శాస్త్రంమీద అపేక్ష వుంటుంది. శ్రద్ధగా వింటాడు. చక్కగా అవగాహన చేసుకుంటాడు. శ్రవణ మనన నిది ధ్యాసలు చేసుకుంటాడు. ఇక మంత్రంతో ఏమి పని.

కొంతమంది మంత్రాన్ని రోజుకు 21 సార్లు అలాగే రోజుకు రెండు మూడు సార్లు చేయమంటారు. మేము పదకొండు సార్లు చేయమంటాము. ఎందుకనీ? ఆ మంత్ర జపములో చిక్కుకు పోతారు కొందరు. ఒకరు గురువుగారి దగ్గరికి వెళ్ళి ఏమండీ నేను మంత్రం తీసుకుందామని అనుకున్నాను అన్నారు. నీకెందుకు మంత్రం? నీవు అయిపోయావు కదా! నీకు అవసరం లేదు అన్నారు. అంటే మంత్రం ఎవరికి కావాలి? గురువుమీద గురి లేనివాడి కోసం మంత్రం. ఎక్కడో అబ్బాయి, ఎక్కడో అమ్మాయి పెళ్ళి చేసుకున్నారు. మొదట్లో పెళ్ళి తంతు అనేది లేకుండా కలిసివుంటామన్నారు. మళ్ళీ కోపతాపాలు వస్తే నీ దారి నీది నా దారి నాది అన్నారు. అదే పెద్దల సమక్షంలో మంగళ సూత్ర ధారణలో ఒక్కటైతే వంద మంది అక్షింతలు వేస్తే

అయిదు వందల మంది భోజనం చేస్తే ఇప్పుడు విడిపోవడం చాలా కష్టం. కొంచెం ఓర్చుకుని విడిపోకుండా కలిసి వుండటానికే ప్రయత్నిస్తారు. ఆ నలుగురు పెద్దలు కూడా ఎందుకు విడిపోతున్నారు అని అడిగితే వాళ్ళకు జవాబు చెప్పవలసిన బాధ్యత వుంటుంది. దానివల్ల వారు ఇష్టం వచ్చినట్లు వుండటానికి కుదరదు.

గురువు తన సమక్షంలో శిష్యునికి దీక్ష ఇస్తే, ఇక గురువుని విడిచి పారిపోవడానికి కుదరదు. ఒకవేళ అంత శరణాగతి లేకపోయినా, ఎంతో కొంత అనుసంధానం జరుగుతుంది. గురువు గారిని గౌరవించాలి, గురువు గారి మాట వినాలి. గురువుగారికి కోపమొచ్చిందేమో అన్న భయము, భక్తి అన్నా మీకు కలగాలి. అందుకోసమే దీక్ష తీసుకోవాలి. తీవ్ర తపన తీవ్ర మోక్షేచ్ఛ వుండి, గురువు దగ్గర మంత్రోపదేశము లేకుండానే అంతా వింటూ సాధన చేసుకుంటుంటే వారికి మంత్రోపదేశంతో పనిలేదు. ఎవరో శిష్యులు వచ్చి ఏమండీ నాకుకూడా మంత్రం కావాలా అని అడిగారు. కావాలా అనే సంశయము వుంది కాబట్టి వద్దన్నాము. నాకు కూడా ఇవ్వండి అని అడిగినవాళ్ళకి కూడా ఇవ్వలేదు. మంత్రమిచ్చి ఏమి లాభం. మీకు తీవ్ర మోక్షేచ్ఛ వుందా? చెప్పేది అర్థం చేసుకుని చేస్తావా? మధ్యలో మానేస్తావా? అని తేల్చుకున్నాక దీక్ష ఇస్తారు.

అందుకే మొదటి మంత్రము ఇవ్వగానే గురువుగారు బోధించాలి. కొందర గురువులు ఉంటే వుంటాడు పోతే పోతాడు అని డింగీ మంత్రము ఇస్తారు. శిష్యుడు ఒక ఏడాది రెండు ఏళ్ళు సత్సంగం చేసి పోయినవాళ్ళు పోగా మిగిలినవాళ్ళు ఎవరైనా వుంటే వారి స్థితినిబట్టి మంత్రమిస్తారు. మంత్రము మరీ అంత ఇంపార్టెంట్ కాదు. ఆ మంత్ర శక్తి ఎవరైతే గ్రహించగలుగుతారో వారికే అది ఇంపార్టెంట్. మంత్రశక్తి మీద ఆధారపడకుండా జ్ఞానంకోసం వచ్చినవాళ్ళకి మంత్ర దీక్ష అవసరం లేదు. అయితే సాంప్రదాయము కొఅకు మంత్రదీక్ష అవసరముత.

శాస్త్ర చింతనం అంటే ఏమిటి? ఎంతసేపూ శాస్త్రమే చదువుతుంటాడు. శాస్త్రం సూచించినటువంటి సాధన చెయ్యడు. శాస్త్రం ఏమి చెప్పింది? నాలుగు పురుషార్థాలలో ధర్మ అర్థ కామాల వరకు శాస్త్రం చెప్పింది. మోక్షం గురించి కూడా చెప్పింది. ధర్మార్థ కామాల విషయంలో తీవ్రంగా సాధన చెయ్యడు గాని శాస్త్రం చదువుతూనే వుంటాడు. ఆ శాస్త్రం తత్త్వాన్ని అందిస్తుంది, కాని ఆ తత్త్వాన్ని వాడు అందుకోలేడు. అందుకోలేని వాడు గురువు దగ్గరికి వెళ్ళి వివరించి చెప్పమని అడగాలి. అసలు గురువు దగ్గరికే వెళ్ళడు. తత్త్వ చింతన చేసేవాడే గొప్పవాడు, ఉత్తముడు. ఒక ఋషి మూడు వేదాలూ చదివేశాడు. నాలుగవది దొరకలేదట. ఎవర్నో అడిగి నాలుగవ వేదం లేదు, వుంటే అది కూడా నేను చదివేస్తాను అన్నాడట. నాలుగు మహా వాక్యాలూ నాలుగు వేదాలలో వున్నాయి. మూడు వేదాలు చదివితే చాలు. ఒక్కటి చదివినా చాలు. ఒకే ఒక్క మహా వాక్యాన్ని పట్టుకున్నాచాలు. అందులో వున్నటువంటి **తత్వమసి** వాక్యము చాలు. ఉత్తమం తత్త్వ చింతాచ అంటే తత్వమసి వాక్యాన్ని విచారించడమే. నాలుగవ వేదంలో కూడా అదే వుంది. నాలుగవ వేదం చదవకపోతే ఏమైంది? అని ఎగతాళి చేస్తారు. శివుడి గారి సభలోకి వచ్చినటువంటి వారితో వుండి అది వ్యక్తం చేశాడు. తన దగ్గరున్న మూడు శాస్త్రాలు కూడా ఒక నదిలో పడవేసి, ఆ శివుడి దగ్గర తత్త్వము నేర్చుకుని తత్త్వాన్ని చింతన చేసి, ఆ తత్ స్వరూపుడు అయ్యాడు.

తీర్థ యాత్రల వలన మంత్రానుష్ఠానము వలన శాస్త్రములు చదువుట వలన ముక్తి లేదని నిర్ణయము. కేవలము తత్త్వజ్ఞాన అపరోక్షానుభవ సాక్షాత్కారము చేతనే ముక్తి సిద్ధిస్తుంది. సిద్ధిస్తుందని ఎందుకంటున్నాడు? నీవు అదే అయి వున్నావు కాబట్టి, అడ్డు తొలగితే చాలు, ఆవరణ పోతే చాలు, ఆ నిరావరణలో నీవు అదే అయివున్నావు. ఏ శాస్త్రమైనా అదే చెప్తుంది. నీవు అదే అయివున్నావు అని. ఈ సాధన చతుష్టయ సంపత్తి మొదట్లోనే బ్రహ్మ సత్యం జగత్ మిథ్య అన్నాము. బ్రహ్మమొక్కటే, బ్రహ్మ తప్ప అన్యము లేదు అన్నాము. మరి శాస్త్రాలు ఏమి చెప్తున్నాయి? దానినే బలపరుస్తున్నాయి. అంతకంటే ఏముంది అక్కడ. నాలుగు మహావాక్యాలు విన్నావు, ఒక స్థితికి వచ్చావు. నువ్వదె వున్నావని సంశయము లేకుండా తెలిసింది. దానిని శ్రవణంచేసి మననం చేసి నిదిధ్యాస చేసి ఆరూఢమై అనుభవానికెళ్ళి అపరోక్షానుభూతి పొందాలి. అదీ వరుస. కాని ఇంక పుస్తకం పట్టుకుంటే ఏమొస్తుంది నీకు.

అలాగే ఒక ముసలి పండితుడు రోజూ అరుగు మీద కూర్చుని శాస్త్రాలు వల్లె వేస్తున్నాడు. చదివిందే చదువుతున్నాడు. శాస్త్రాన్ని అధ్యయనం చెయ్యాలి. అట్లా చదవటం లేదు. చదివిందే మళ్ళీ మళ్ళీ వల్లె వేస్తున్నాడు. శంకరాచార్యుల వారు రోజూ ఆ దారిన నదికి స్నానానికి వెళ్ళి వస్తూ ఆయనని గమనిస్తున్నాడు. ఆయనకేమో వయసైపోయింది. ఏదో ఒకరోజు మరణిస్తాడు. ఇట్లా వల్లె వేయడం వలన అతనికి ఏమి లాభము? అని అతనికి భజగోవింద శ్లోకాలు చెప్పారు. స్త్రీ ధనము వ్యామోహము

ఇట్లాంటివన్నీ వదిలివేయి. నువ్వది అయి వున్నావు అని భజగోవింద శ్లోకాలలో చెప్పారు. మూఢమతే అంటే ఎవరా మూఢమతి? ఎంతసేపూ శాస్త్ర చింతన చేసేవాడే మూఢుడు. తత్త్వానికి ఎప్పుడు వెళ్తావు? మంత్రాన్ని పట్టుకుని జపం చేయడమనే కర్మ నుండి ఎప్పుడు విడుదలవుతావు? మొదట్లో మంత్రం అవసరమే, మంత్రం కావాలి. శాస్త్రము కావాలి. చివరికొచ్చేసరికి మంత్ర మననం ఆగిపోవాలి. త్రయ మంత్రం మననం చేయనవసరం లేదు. అలాగే శాస్త్ర చింతన కూడా ఎంతకాలం? నీ గురువు కొంత చెప్పి కొంత చెప్పకపోతే శాస్త్రాల ద్వారా మరికొంత తెలుసుకో. దేశాటన చేసి మహానుభావులను కలిసి వాళ్ళందరినీ **ప్రశ్నించి పరిప్రశ్న సేవయా**, ప్రశ్నించి తెలుసుకో. నీ గురువే నీకు గొప్ప. ఇతర గురువులు నీ గురువులు కారు. అయినా వారిని అడగవచ్చు. పెద్దల దగ్గర నీ సంశయాలు తీర్చుకోవచ్చు. చెప్పినవన్నీ వింటే నీలో స్పష్టత పెరుగుతుంది. నీ గురువుకంటే ఇంకా లోతుగా చెప్పే గురువులు దొరికినప్పటికీ, నీ గురుపరంపరా సాంప్రదాయం మాత్రం, నీకు మంత్రమిచ్చినటువంటి గురువే నీకు వుండాలి. ఆయననే పెట్టుకోవాలి. ఆయనను విడువకూడదు. పరంపరా పూజా సాంప్రదాయం మంత్రోపదేశం చేసిన గురువుకే జరగాలి. అంతకంటే గొప్ప గురువులు అంతకంటే లోతుగా తెలిసినవాళ్ళు అంతకంటే లోతుగా చెప్పినవాళ్ళు అంతకంటే హస్తమస్తక స్పర్శ ఇచ్చి నీకు అనుభూతి కలిగించినటువంటి గురువు దొరికినా కూడా, నీకు మంత్రోపదేశం చేసిన గురువుకి అంత శక్తి లేకపోయినా, పాటించవలసినది ఏమంటే ఆ పేరు, ఆ సాంప్రదాయం వదలకూడదు. వంశ ఋషిభ్యో ఆ గురువు ఆ గురు పుత్రుడు ఆ గురుపుత్రుడు గురువైతే వాడికొక వంశం ఆ వంశ ఋషులనే నువ్వు గురుపరంపరగా పూజించాలి, ఆరాధన చెయ్యాలి. కావున సాధనా చతుష్టయ సంపత్తిని పూర్తిగా సంపాదించినవాడే వేదాంత విచారణకు అర్హత గలవాడవుతాడు.

ఈ సంసారము కాయక వాచక ఇంద్రియ వ్యాపారములతో కూడినది కనుక ప్రాపంచిక విషయములందు ఆసక్తి లేనివాడు సులభముగా ఈ సాధన సంపత్తిని పొందగలడు. ప్రాపంచిక విషయాల మీద ఆసక్తి పోవాలి. సామాన్యంగా పుట్టగానే బాల్యావస్థ వుంటుంది. అల్లరి చిల్లరిగా తిరుగుతారు. తప్పులు చేస్తూ వుంటారు. దెబ్బలు తింటూ వుంటారు. యవ్వనం వచ్చే సరికి కొంచెం స్థిరం అవుతారు. కాని ఇంద్రియ భోగాలకు అలవాటు పడతారు. ప్రౌఢత్వం వచ్చేసరికి ఇంద్రియభోగాల యొక్క తపన చల్లారిపోతుంది. కొంతమందికి అప్పుడు కొన్ని భోగాలు లేకపోయినా పర్వాలేదు అనే దానితో వైరాగ్యం వస్తుంది. అలా వైరాగ్యం వచ్చినవాడు వానప్రస్థాశ్రమానికి వెళ్తాడు. వానప్రస్థం అంటే ఏమిటి. వనములో స్థావరం చేసుకుని జీవించడాన్ని వన ప్రస్థానాన్ని వానప్రస్థము అంటారు. అక్కడ వుండి వీరు ఏం చేస్తారు? అక్కడ కూడా ఎవరన్నా తాపసులు గురువులు దొరికితే కందమూలాలు పళ్ళు తింటూ, ఉపవాసములు చేస్తూ, ఇంద్రియాలను భోగములయందు పోనీయక, శుష్కింప చేస్తారు. తరువాత పూర్తిగా ఇక నాకు ఏమీ అక్కరలేదు అన్నప్పుడు సన్యసిస్తారు. ఆ సన్యాసములో కూడా రకాలు వున్నాయి. కుటీచకుడు, బహూదకుడు, హంస, పరమ హంస అని. కుటీచకుడు అంటే కుటీరములో వుంటాడు. స్వల్పంగా ఆహారం తీసుకుని ఆ బ్రహ్మ విషయములో శ్రవణాదులు అనుష్ఠానము చేసుకుంటూ జీవితమంతా గడుపుతాడు. బహూదకుడు అంటే ఒక గ్రామములో నిలబడడు. ఒక కుటీరములో వుండడు. ఎక్కడో ఒక సత్రం చూసుకుని వుంటాడు. భిక్ష తీసుకున్న చోట నిద్రించడు. నిద్రించిన ఊరిలో భిక్ష అడగడు. ఒకేచోట వుంటే మరల గృహస్థులతో పరిచయాలు పెరుగుతాయని, బంధహేతువని, అలా వున్నచోట వుండకుండా తిరుగుతాడు. అజగర సన్యాసం అని ఇంకొకటి వుంది. అజగరము అంటే కొండచిలువ. అది వేగంగా కదలలేదు. పరిగెత్తే ఎలుకపిల్ల కోసం వెంటపడి పట్టుకుని తినలేదు. అది వున్నచోటనే మొద్దులాగా కదలకుండా వుంటుంది. దాని నోటి దగ్గరికి వచ్చిన ఆహారం తింటుంది గాని ఆహారం కోసం ప్రయత్నం చేయదు. ఆహారం లేకుండా నెల రోజులైనా జీవించి వుంటుంది. దొరికిన ఆహారాన్ని మాత్రం తీసుకుని తింటుంది. ఈ అజగర సన్యాసి ఏమిటంటే భిక్షకు వెళ్ళడు. ఎవరైన భిక్ష గనక వేస్తే స్వీకరిస్తాడు. లేకపోతే అలా వుంటాడు.

ఇంకొకడు భిక్షా పాత్ర లేకుండా అరచేయి పడతాడు. ఆ అరచేయి పట్టినంత వరకే తిని ఊరకుంటాడు. ఇక ఆ రోజు అలాగే వుంటాడు. ఇవన్నీ కూడా ఇంద్రియాలను శుష్కింప చేయడం కోసమే. ఒక మానవుని జీవితాన్ని అయిడియల్ కండిషన్‌లో కనుక పెడితే బాల్యము నించి వానప్రస్థానానికి సన్యాసానికి ఏ రకంగా అయితే పరిణామం చెందుతాడో ధర్మార్థకామ మోక్షాలను విని ఆచరించినవాడైతే చివరకు ఆ సన్యసించడమే మోక్షమనుకుని వెళ్ళిపోతాడు. మన జీవన విధానము మన ఆయుష్ కాలము బాల్య యవ్వన వృద్ధాప్యాలన్నీ కూడా ఆ విధంగా డిజైన్‌చేసి వున్నాయి. అయితే మనం ఆ రకంగా నడవడము లేదు. ముసలి వారికి కూడా సంసార బంధాలు పోలేదు. మనమేమి చేస్తాము?

ఇంట్లోనే వుంటూ వానప్రస్థం గడపవచ్చు. ఇంట్లోనే సంసారబంధం లేకుండా గృహస్థాశ్రమంలోనే భార్యాభర్తలు స్నేహితులుగా ఇంతకు ముందటి సంస్కారాలు కొనసాగించకుండా వుండవచ్చు. ఈ సంపత్తి ద్వారా అధికారి అయినవాడు వేదాంత విచారణకు ఉపక్రమించిన యెడల వారు ప్రాపంచిక విషయములయందు ఆశ వీడి వైరాగ్య సిద్ధుడై గురువును ఆశ్రయించి చత్రుర్విధ శుష్రూషలను అధిక శ్రద్ధతో చేయవలెను.

**అహంగ్రహోపాసన:** అహంగ్రహోవాసనా విధితో మహావాక్య విచారణని జోడించాలి. అహంగ్రహోపాసన అంటే ఏమిటి? అహం అంటే నేను, గ్రహించడం, ఉపాసన. అంటే ఇక్కడ గురువులు ఏమీ చేయరు. మనకి మనమే సాధన నేర్చుకుని మనకి మనమే తెలుసుకుని మనకి మనమే పెద్దలందరినీ కలిసి దేశాటన చేస్తూ ఎవరెవరు ఏమి చెప్తారో విని, సగుణ బ్రహ్మని ఉపాసన చేస్తాము. దానికదే కొంతకాలానికి నిర్గుణ బ్రహ్మోపాసనకి దారి తీస్తుంది. ఆ రకంగా నిర్గుణ బ్రహ్మోపాసన ద్వారా ముక్తి పొందుతాడు. అయితే ఎవరికి వారు సగుణ బ్రహ్మోపాసన ద్వారా నిర్గుణ బ్రహ్మోసన ద్వారా ముక్తి పొందే అవకాశం వున్నప్పటికీ, అది దాదాపు అసాధ్యం. కాబట్టి గురువు దగ్గరకు వెళ్ళి చేరవలసిందే. గురువు యొక్క పర్యవేక్షణలో సాధన చెయ్యవలసినదే. గురువాక్యాన్ని శ్రవణ మనన నిది ధ్యాసలతోటి సాధనచేసి ఆ మోక్షాన్ని పొందవలసిందే.

### నన్ను పొందుటకు ద్వాదశ మార్గములు – మెహెర్ బాబా

ద్వాదశ అంటే పన్నెండు మార్గాలు. పన్నెండు మార్గాలు అన్నప్పటికీ ఈ పన్నెండులో ఏ ఒక్కటైనా ఆచరించవచ్చు. ఇన్ని మార్గాలూ అక్కడికే దారితీస్తాయి. ఈ పన్నెండులో ఏ ఒక్కటైనా పరిపూర్ణంగా పటిష్టంగా చేస్తే, నువ్వు ముక్తిని సాధిస్తావు. బాహ్య ప్రపంచం నుంచి నువ్వు విడుదల పొందాలి అంటే, నీ స్వభావము, నీ వ్యక్తిత్వము ఎలా మారాలి? అనే దానిమీద ఈ ద్వాదశ మార్గాలు చెప్పబడ్డాయి. తన దివ్యత్వాన్ని సాధకుడు అనుభవించడానికి ఈ పన్నెండు మార్గాలు వున్నాయి. ఆ దివ్యత్వం సర్వాంతర్యామి సర్వోత్కృష్ఠుడని నీలో సంపూర్ణముగా ఉద్దీపించాలి. ఉద్దీపన అంటే ఉత్–దీపన. అవిద్యా ప్రకాశము నుండియు, మాయా ప్రకాశమునుండియు విడుదలవుతూ స్వయం ప్రకాశానికి పెరుగుట. జీవభావము, బ్రహ్మ భావము మధ్యలో దివ్య అహము అనేది వుంది. దైవత్వముగా వుండే అహంకారము దానిని దివ్యత్వం అంటాం.

అంటే జీవుడు నేరుగా బ్రహ్మ జ్ఞానం పొందటానికి బదులుగా మధ్యలో దివ్య జ్ఞానాన్ని దివ్యత్వాన్ని సంపాదిస్తే, అప్పుడు ఆ బ్రహ్మజ్ఞానం వంటబట్టి, నీకు అనుభవం వస్తుంది. సాధనచేత దివ్యత్వం వస్తుంది. బ్రహ్మ జ్ఞానము ఏ సాధనా లేకుండానే రావాలి. ఎందుకంటే అది సాధించుకుంటే వచ్చే సాధ్య వస్తువు కాదు. అది సిద్ధ వస్తువు. అది నీవే అయివున్నావు. అందుకోసం జీవోహం నించి బ్రహ్మోహం అవాలంటే, మధ్యలో ఒక స్థితి వుంది. అరవిందుల వారు దివ్యజ్ఞాన సమాజం పెట్టి దివ్య జీవనము గురించి మనకి చెప్పారు. దివ్యత్వంలోనే ఈ ప్రపంచంలో ఆనందముగా జీవించే అవకాశం వుందని చెప్పారు. అదొక సిద్ధాంతం. దివ్యత్వం వరకు వచ్చిన వారు మోక్షం సాధించకుండా వుంటారా? వ్యాధి బాధ లేకుండా పూర్ణాయుష్షు తోటి సత్వగుణంతోటి ఎవరితో ఏ తగాదా లేకుండా ఆనందంతో గడిచేటటువంటి ఒక స్థితిని దివ్యాహంగా ఆయన చెప్పారు. అక్కడిదాకా వచ్చినవారు మోక్షానికి కూడా వెళ్ళవచ్చు. ముందుగా ఈ దివ్యత్వాన్ని సంపాదించాలి. అప్పుడే సర్వాంతర్యామిత్వం, సర్వోత్కృష్ఠం సంపూర్ణంగా మనలో ఉద్దీపనమయ్యే అవకాశము కలుగుతుంది.

**1. నిరీక్షణ:** సహారా ఎడారి ఎండలో పెక్కు దినములు పడి వుండి జలము కొరకు నిరీక్షించువారు ఎట్లు ప్రాధేయ పడుదురో అట్లే నాతో ఐక్యము కోరువారు ప్రాధేయతా తృష్ణ అనుభవించవలెను. నిరీక్షణ అంటే ఉదాహరణ చెప్పారు. సహారా ఎడారిలో ఎండలో ప్రాయాణం చేస్తూ దప్పిక అయిన తరువాత కూడా నీళ్ళు ఎక్కడా దొరక్కపోతే, నీటికోసం నీవు ఎంత తపన పడతావో, ఎంత తృష్ణ కలుగుతుందో, అంతటి తృష్ణ నీకు భగవంతుని మీద కలగాలి. ఎక్కడ జలం దొరుకుతుందా అని దప్పికతో తహతహలాడుతూ ఎదురు చూస్తూ వుంటామో అలాగే భగవంతుని దర్శనం కోసం అంతగా తహతహలాడుతూ ఎదురు చూడటమే నిరీక్షణ. అంతటి తృష్ణ వుండి దైవ దర్సనానికి దైవ సాక్షాత్కారం కోసము అలా వెంపర్లాట రావాలి. దానిని నిరీక్షణ అన్నాము.

**2. మనశ్శాంతి:** ఘనీభవించిన సరస్సు ఎంత ప్రశాంతముగా వుండునో, అంత ప్రశాంతముగా వుండగలిగినవాడు నన్ను పొందును. నన్ను అంటే పరమాత్మని. చెప్పినవాడు అవతార పురుషుడు. పరమాత్మే శరీరం ధరించి వచ్చాడు. నన్ను పొందటమంటే పరమాత్మని పొందడమే. కృష్ణ పరమాత్మ కూడా నన్ను పొందు అన్నాడు. నన్ను అంటే కృష్ణుడిని పొందమని కాదు, పరమాత్మని పొందమని. నన్ను అంటే బాబాని పొందమని కాదు. బాబా పరమాత్మ కనుక పరమాత్మ జ్ఞానం కలగాలి.

దానినే పొందటం అంటారు. పొందటం అనేమాట ఎందుకు వాడారంటే దివ్యత్వానికి మన ప్రయాణము. బ్రహ్మత్వానికి కాదు. ఈ సాధన తప్పని సరిగా జరగాలి. ఈ సాధన చేసినప్పుడు లోకంలో అటువంటివాడు వుంటే, వ్యవహారంలో ఆయన దేవుడండీ అంటారు. మోసం చేసినవారికి కూడా అప్పులు ఇస్తాడు. అప్పు తీర్చనివాడికి కూడా మళ్ళీ ఇస్తాడు. అప్పులే కాదు, దాన ధర్మాలు చేస్తాడు. అటువంటి వారి చేతికి ఎముక లేదని అంటారు. తప్పు చేసినవాడిని శిక్షించకుండా వుండేవాడిని దేవుడు అంటాము. అటువంటి స్వభావము వున్నవారు దివ్యత్వంలో వున్నారు. ఆ స్వభావమే దివ్యత్వము. మనశ్శాంతికి ఘనీభవించిన సరస్సు అని చెప్పారు. నిశ్చలంగా వున్న సరస్సులో ఒక రాయి వేస్తే తరంగాలు వచ్చి ఎప్పటికో గాని ఆగవు. అలా చూస్తూ వుంటే కాసేపటికి అవే ఆగిపోతాయి. ఒక చిన్న కర్ర పట్టుకుని ఆగు ఆగు అని తరంగాన్ని కొడితే ఆ తరంగాలు పెరుగుతాయే గాని ఆ నీళ్ళు ఇంకా కదులుతాయే తప్ప నిశ్చలస్థితి రాదు. శాంతంగా దానిని చూసి ఏమీ అనకుండా వుంటే అది నిశ్చలస్థితికి వస్తుంది. నీ మనసు నిశ్చలం కావాలంటే నీ మనసుని అటూఇటూ పోనివ్వకుండా తీవ్రమైన సాధనలు చేయాలి. "ఊరక వుండుము" అన్నాడు రమణ మహర్షి. ఊరక వుంటే మనసు నిశ్చలమవుతుంది. సరస్సు ఉపమానం చెప్పారు. ఐసు గడ్డ కట్టింది. గడ్డకట్టిన సరస్సును మీరు చూసే వుండవచ్చు. ఉత్తరాదిన బధరీనాథ్ కేదారనాథ్ టిబెట్ హిమాలయాల దగ్గరకు వెళితే నదులు సరస్సులు అన్నీ కూడా గడ్డ కడతాయి. ప్రవాహం ఆగిపోతుంది. మంచి నీరు కావాలంటే ఆ గడ్డని కాస్త పగలకొడితే అడుగున నీరు కనబడుతుంది. ఆ గడ్డమీద నడుస్తారు. దాంట్లో తరంగాలు వుంటాయా? దాంట్లో బెత్తంపెట్టి కొట్టినా ఏమవుతుంది. నీ మనసు అలా వుండాలి. అంటే ఎవరు ఎంతమంది రెచ్చకొట్టినా నువ్వు చలించకుండా వుండాలి. చుట్టూ వున్నవారివల్ల నేను బాధపడుతున్నాను వాళ్ళవల్లే నా ప్రశాంతతను కోల్పోయాను, అనే వాళ్ళను చూశాము. వాళ్ళెప్పుడూ అలాగే వుంటారు. నీకు ప్రశాంతత కావాలంటే నీ మనస్సుని నువ్వు శాంతపరచుకుని వుండాలి తప్ప నీచుట్టూ వున్నవారు నీ అశాంతికి కారణమని వారిని నిందిస్తూ కూర్చుండే వారికిది పనికిరాదు. సాధన చతుష్టయ సంపత్తి కోసం దివ్యత్వం రావాలి. దివ్యత్వం వచ్చాక బ్రహ్మజ్ఞాని అవ్వాలి. లోకం ఎప్పుడూ అలాగే వుంటుంది. నిన్ను నువ్వే స్థిరపరచుకోవాలి. నీ మనస్సు చంచలం కాకుండా ఘనీభవించిన సరస్సువలె ఉంటే నీవు భగవంతుని పొందగలవు.

**3) నమ్రత:** ఎట్టి ఆకృతిగా అయినను మలచబడి పోతపోయుటకు ఉపక్రమించు మట్టికి ఎట్టి నమ్రత వున్నదో అట్టి విధముగా ఓర్పు సహనము ఉన్నవాడు నన్ను ఎరుగగలడు. నమ్రత అంటే వినయము విధేయత. బొమ్మలు తయారుచేసేవాడి చేతికి మట్టి తనని తాను సమర్పించుకుంటుంది. ఆ మట్టి ఆ బొమ్మ చేసేవాడి చేతిలో ఏ ఆకారం కావాలంటే ఆ ఆకారం చేయడానికి సహకరిస్తుంది. జిగురు మట్టిగాని, ఇసుకపాళ్ళు ఎక్కువైన మట్టిగాని సహకరించదు. బంక మట్టిలో పగుళ్ళు వస్తాయి. ఇసుక మట్టి విచ్చిపోతూ వుంటుంది. ఆ రెండూ సరియైన నిష్పత్తిలో వుండాలి. అంటే తగు పాళ్ళలో ఇసుక తగు పాళ్ళలో జిగురు తగు పాళ్ళలో నీళ్ళు వుంటే అటువంటి మట్టితో వినాయకుడినే చేస్తాడో శివలింగాన్నే చేస్తాడో, లక్ష్మీదేవినే చేస్తాడో ఆయన ఇష్టం. ఆ మట్టి ఆ బొమ్మలు చేసేవాడికి తన్ను తాను సమర్పించుకుని నీ ఇష్టం వచ్చినట్లు మలచుకో అంటే ఆ మట్టి ఏ బొమ్మ కావాలంటే ఆ బొమ్మని చేసుకుంటాడు. అలా నిన్ను నువ్వు నీ గురువుకో ఇష్టదైవానికో అర్పణ చేసుకుని నిన్ను ఆయన ఎలా మలచుకుంటాడో ఆయన ఇష్టానికి వదిలివేసి నీ ఇష్టం అనేది కొంచెంకూడా లేకుండా వుండాలి. పిల్లి తన పిల్లను నోట కరచుకొని స్థానం మారుస్తూ వుంటుంది. పిల్లి పిల్లని ఎలా పట్టుకుంటుంది? గట్టిగా పట్టుకుంటే గాట్లు పడి పిల్లకు గాయమవుతుంది. మెల్లిగా పట్టుకుంటే జారిపోతుంది. ఎలా పట్టుకోవాలో తల్లి పిల్లికి తెలుసు. అప్పుడే పుట్టిన పిల్లలు కదలవు. రెండు రోజులు గడిచాక వాటికి తెలివి వస్తుంది. తల్లి నోట్లో నమ్రతగా వుండకుండా గింజుకుంటుంది, పడిపోతుంది, పడిపోతే మళ్ళీ పట్టుకుంటుంది. అంటే తక్కువ వయసు వున్న పిల్లకి నమ్రత వుంది, రెండు రోజులు గడిచిన పిల్లకి నమ్రత లేదు. నమ్రత అంటే బొమ్మలు చేసేవాడి చేతిలో మట్టి ఏ బొమ్మ కావాలంటే ఆ బొమ్మగా మారడానికి వీలవుతుందో తన ఇచ్ఛ ఏమీ లేక, తన ప్రయత్నం ఏమీ లేక, తన క్రియ ఏమీ లేక, పూర్తిగా సమర్పణ చేసి తనపరంగా ఏమీ లేకుండా ఎలా వుంటుందో అలా వుండటాన్ని నమ్రత అంటారు. ఇది అహంకారానికి సంబంధించినది. రజో గుణానికి సంబంధించినది. నీకు అహంకారము రజోగుణము లేనప్పుడే ఆ నమ్రత వుంటుంది. మనశ్శాంతి అన్నప్పుడు మనసుకి సంబంధించినది, నమ్రత అనేది అహంకారానికి సంబంధించినది. నిరీక్షణ అనేది ఓర్పు తపనకు సంబంధించినది. అంత తపన అంటే తీవ్ర మోక్షేచ్ఛ అన్నమాట.

**4) నిస్పృహ:** నిస్పృహ వలన మానవుడు ఏ విధముగా ప్రాణ త్యాగమునకు తెగించునో అట్లే నన్ను వీక్షించనిదే బ్రతుకజాలను అను గట్టి నిశ్చయము కలిగినవాడు, ఆ సమయమున నన్ను కాంచగలడు. నిరాశ నిస్పృహ ఎప్పుడైతే కలిగిందో ఆత్మహత్య చేసుకుందాము అనుకుంటాడు. బ్రతికి నేను చేసేది ఏమీ లేదు, ఇన్ని కష్టాలతో ఇన్ని బాధలతో ఇన్ని అవమానాలతో నేనెందుకు బ్రతకాలి? అని అటువంటి నిరాశ నిస్పృహ కలిగినప్పుడు ఆత్మహత్య చేసుకోవడానికి ధైర్యం వస్తుంది. అంతటి నిస్పృహ లేనప్పుడు కొంచెం కోపం వచ్చి, అలిగి ఆత్మహత్య చేసుకుందామని వెళ్ళి భయం వేసి తిరిగి వెనుకకు వచ్చేస్తాడు. ఎవరైతే ఆత్మహత్యకి అటువంటి నిస్పృహతో సిద్ధపడతాడో వాడు వెనుకకు రాడు. అంతటి నిస్పృహ వుండాలి. కాని నిస్పృహ అంటే ఏమిటి? ప్రాపంచిక విషయాలపట్ల వున్న స్పృహ పోవాలి. లౌకిక విషయాల మీద శరీర ఇంద్రియ భోగ సంబంధంమీద ఏ స్పృహ అయితే వున్నదో ఆ స్పృహ లేకపోవడమే నిస్పృహ. అటువంటి నిస్పృహవల్ల ప్రాణత్యాగానికి కూడా ఏ విధంగా అయితే వెనుకాడడో, ఆ విధంగా నీవు నమ్మిన ఆ బాబాని గాని భగవంతుడిని గాని, ఆ బ్రహ్మ జ్ఞానాన్ని పొందటానికి కూడా అంతటి తీవ్రమైన నిస్పృహ కావాలి. అట్లా వున్నప్పుడు తప్పకుండా జరుగుతుంది. ఇప్పుడు చెప్పినటువంటి నాలుగు మార్గాలలో ఏ ఒక్క మార్గం వున్నా చాలు, నాలుగూ అవసరం లేదు.

**5) విశ్వాసము:** పగలును రాత్రి అని చెప్పిన గురు వాక్యము ఎట్టి సందియము లేక విశ్వసించిన కళ్యాణునివలె విశ్వసించినవాడు నన్ను తెలుసుకోగలడు. ఈ కళ్యాణ్ అనేటటువంటి వాడు అతను గురువు దగ్గరికి వెళ్ళాడు. గురువు గారు పగలును చూసి ఇది రాత్రి అన్నారు. గురువు గారు ఏదో అంతరార్థముతో చెప్తారు, ఇది రాత్రే అయివుండవచ్చు, ఆయన చెప్పిందే సత్యం అని నమ్మాడు. కాని గురువు గారూ పగలు కదా ఇది, పగలును పట్టుకుని రాత్రి అంటారేమిటి? ఇది పగలే కదా! అని రుజువుచేస్తాను చూడండి అన్నాడనుకోండి, ఆ శిష్యునికి గురువు మీద విశ్వాసం లేనట్లు. కాబట్టి శిష్యుడు అట్లా అనకూడదు. కళ్యాణ్ అట్లా అనలేదు. అట్లా అనడు. అనకపోవడమే కాదు వెంటనే గురువాక్యమే నిజమని ఒప్పుకుంటాడు. గురువు నంది అంటే నంది, పంది అంటే పంది. అంతే అనాలి. అదేంటండీ? అనేమాట అనకూడదు. ఆయన కావాలనే పరీక్ష పెట్టడానికి అంటాడు. అంతరార్థమూ వుంటుంది. అంతరార్థము చెప్తా వినండి.

పగలును రాత్రి అని ఎందుకన్నాడు? రాత్రి పూట ఏం చేస్తారు? నిద్రపోతారు, నిద్రలో ఏం చేస్తారు? కలగంటారు. కల నిజమా? అబద్ధమా? మరి ఈ పగలు అనే జాగ్రదవస్థ కూడా కలే కదా! ఇవన్నీ కూడా కలలో తోచినవి ఎలాగో అలాగే. ఇదంతా మాయాకల్పితము, భ్రాంతి, అవిద్యాకల్పిత తాదాత్మ్యత. అంతకుమించి ఏమన్నా వుందా? ఏమన్నా నిజమా? మన జాగ్రదవస్థ కూడా హిరణ్యగర్భుని కలే. నువ్వే ఆ హిరణ్యగర్భుడివి. నువ్వే ఆ బ్రహ్మవి. నీ కలలో ఇవి అన్నీ వున్నాయి. నువ్వు మేల్కొంటే ఈ కల అసత్యం. నువ్వు బ్రహ్మ జ్ఞానంలో మేల్కొంటే జాగ్రదవస్థ అసత్యం. కాబట్టి పగలే రాత్రి కాదా! అంతే! అడిగితే చెప్తారు గురువు గారు ఎట్లా అనేది.

అంతటి దృఢ విశ్వాసం వుండాలి గురువుగారి పట్ల. ఆయనకేమీ తెలియదు, మనలోకంలో వుండడు, మనకి తెలిసినట్లు ఆయనకి తెలియదు. ఆయన అట్లాగే చెప్తారు. అక్కడక్కడ తిరగమంటారు, ఆయనకేమీ పనీ లేదు, పాటా లేదు అని అనుకుంటారు. గురువాజ్ఞ అని, అన్నీ ఆయన చెప్పినట్లు చేయాలి. మారుమాట్లాడకూడదు. ఆయన పట్ల అంతటి విశ్వాసం వుండాలి. ఎందుకంటే ఆయన పరబ్రహ్మ స్థితిలో వుంటాడు, లోక విషయాలు పట్టించుకోరు. కాని మనం లోకంలో వున్నాము కదా! మనకి ఏది మంచో ఏది చెడో తెలుస్తుంది. గురువాజ్ఞ అని అన్నీ ఆయన చెప్పినట్లు చేయనవసరం లేదండీ అని ఒకాయన అనేవారు. వారు ఆ దిశలో ఆలోచించరు కాబట్టి కొన్ని విషయాలు వారు చెప్పినట్లే చేయనక్కరలేదు, మన వివేకాన్ని బట్టి చేయవచ్చు అని చెప్పేవారు ఆయన. శిష్యుడి దగ్గరకు వచ్చిన తరువాత, అలా చెప్పారు అంటే, దాట్లో ఏదో నీకు ప్రయోజనము సాధనకి పనికివచ్చేది తప్పకుండా వుంటుంది.

**6) అన్యోన్యత:** తానెరుగకున్ననూ జీవితాంతము తనతో సాహచర్యము చేయుచూ కష్ట సుఖములలో కూడా వీడక, తనకు హితుడయ్యి అహితుడు కాకుండా, శ్వాస నిన్ను ఎట్లా అనుసరిస్తుందో అట్టి శ్వాసవలే తనకు నాయందు విశ్వాసం వుండాలి. బ్రహ్మ జ్ఞానమందు పరమాత్మయందు విశ్వాసముండాలి. అప్పుడే వాడు నన్ను తెలుసుకోగలడు. రోజూ ఉచ్ఛ్వాస నిశ్వాసలు చేస్తున్నారు కదా! మీ మనసులో కొన్ని ముఖ్యమైన చేయవలసిన పనులు వున్నాయి. అప్పుడప్పుడు మిగిలినవి మరచిపోతున్నారా? లేదా? నువ్వు రేచక పూరకాలు కావాలని చేస్తున్నావా? నీ ప్రమేయం లేకుండా జరిగిపోతుంది కదా!

ఒకసారి శ్వాస అనుకున్నదట గానుగ ఎద్దులాగా ఏమిటీ ఈ గోల, నేనిట్లా ఆడుతూనే వుండాలా? పైకి క్రిందకి లోపలికి బయటకి పనిచేస్తూనే వుండాలా? రాత్రి పూట మనసుకూడా విశ్రాంతి తీసుకుని నిద్రపోతోంది. ఇంద్రియాలు అన్నీ విశ్రాంతి తీసుకుంటున్నాయి. నాకు మాత్రం రెస్ట్ లేకపోతే ఎట్లా? అని ప్రాణం కూడా విశ్రాంతి తీసుకుంటే ఏమైపోతావు నువ్వు? అదసలు విశ్రాంతిని కోరుకోకుండా నిన్నెప్పుడూ అది కాపాడుతోంది. నీకు కష్టమొచ్చినా సుఖమొచ్చినా నీలో శ్వాస ఆడుతూనే వుంది. మెలకువతో వున్నా, కలలు కంటున్నా, నీ శ్వాస ఆడుతూనే ఉంది. నువ్వు, నీ మనసు, ఇంద్రియాలు విశ్రాంతి తీసుకుంటున్నా, శ్వాస విశ్రాంతి తీసుకోకుండా ఆ గాఢ నిద్రలో కూడా శ్వాస కొనసాగుతూ నీతోపాటే వుంటుంది. తనకు హితుడై అంటే శ్వాస నీకు హితుడై అహితుడు కాకుండా ఇక్కడ రెండర్థాలున్నాయి. హితుడై అహితుడు కాకుండా అంటే శ్వాసని నువ్వు అప్పుడప్పుడూ తిట్టుకున్నా సరే, దాని పని అది చేస్తూనే వుంటుంది. బలవంతంగా ఆపితే ఉక్కిరి బిక్కిరి అయిపోయినా సరే, శ్వాస నువ్వు మళ్ళీ పీల్చుకునేలాగ చేస్తుంది. శ్వాసిస్తున్నావనేది నీవసలు గుర్తించవు. శ్వాస అంటే ఏమిటో ఎప్పుడు తెలిసింది. ఏదన్నా రుగ్మత వచ్చి శ్వాస ఆడక ఉక్కిరి బిక్కిరి అయి, వెంటిలేటర్ పెడితే, అప్పుడు శ్వాసయొక్క ఔన్నత్యం తెలిసింది. అంతవరకు తెలియలేదు. దాని పని అది చేస్తూనే వుంది. ఒక గానుగెద్దులాగా బానిసలాగా దానిని నువ్వు ప్రేమించినా ప్రేమించకపోయినా, అది మాత్రం నిన్ను రక్షించే పని నిరంతరాయంగా చేస్తూనే వుంది. ఆ శ్వాస నీకు హితమై నిన్ను ఎట్లు అనుసరిస్తూ కాపాడుతూ రక్షిస్తూ వుందో, అట్టి శ్వాసవలే ఆ శ్వాస నిన్నెలా పట్టుకుందో నువ్వు నన్ను అలా పట్టుకో. అవతార పురుషుడు ఆయనను నమ్మి అనుసరించేవారిని, అనుసరించని వారిని కూడా ఏ విధముగా సమానముగా రక్షిస్తాడో, అలా దైవం నిన్ను పట్టించుకోవట్లేదు, అని అనుకోకుండా, నీ భక్తి, విశ్వాసములను నిరంతరాయముగా కొనసాగించాలి. నిన్ను విడవని శ్వాసవలె నిరంతరాయమైన విశ్వాసాన్ని, అర్పణ భావాన్ని నీతో ఉంచుకోవాలి. పరమాత్మను అలా పట్టుకో. అంత విశ్వాసముతో అలా నన్ను పట్టుకుంటే తప్పకుండా నువ్వు నన్ను పొందుతావు.

**7) ప్రేమతో సాధన:** నా యందలి ప్రేమతో విషయవాంఛలయెడల తనకున్న మోహమును దూరము చేయగలిగినప్పుడు నన్ను పొందగలడు. భగవతుణ్ణి ప్రేమించడమంటే విగ్రహాన్ని ప్రేమించమనా? పరమాత్మని ప్రేమించడమంటే అందరిలో పరమాత్మ సర్వవ్యాపక చైతన్యముగా వున్నాడని. ఆ పరమాత్మని ప్రేమించడమంటే ఆ పరమాత్మ అవతార పురుషుడైనటువంటివాడు. ఆ పరమాత్మని అందరిలో సర్వవ్యాపక చైతన్యము అనేటటువంటి భావనతో నువ్వు ప్రేమించాలి. పరమాత్మని ప్రేమించినపుడు ఆ పరమాత్మ భార్యని ప్రేమించరా? ఆ పరమాత్మ యొక్క పిల్లలను ప్రేమించరా? పరమాత్మకి సంబంధించిన ప్రతి వస్తువును ప్రేమించాలి. ఈ సృష్టి యావత్తూ ఆ పరమాత్ముడే కనుక సృష్టి యావత్తు నూ ప్రేమించాలి. ఆ పరమాత్మ సర్వ వ్యాపకుడు కనుక సర్వమందూ పరమాత్మ వున్నాడు కనుక సర్వాన్నీ కూడా పరమాత్మగా ప్రేమించాలి. అంతేకాదు. **సర్వం ఖల్విదం బ్రహ్మ** అనేటటువంటిది లక్ష్యంలో పెట్టుకున్నాం. ఈ కనబడేదంతా బ్రహ్మమే. ఈ నామరూప ప్రపంచమంతా బ్రహ్మమే. అంతా బ్రహ్మమే అని చూచే జ్ఞానదృష్టి వుండాలన్నాము కదా! అయితే అంత జ్ఞానదృష్టి మనకి వచ్చినా రాకపోయినా, మన లక్ష్యం అది. కాబట్టి ప్రయత్నం చెయ్యాలా వద్దా?

ఈ కనబడే ప్రపంచమంతా బ్రహ్మమే. నీకు బ్రహ్మముగా కనబడకపోయినా అది బ్రహ్మమే. శత్రువుగా కనబడుతున్నప్పటికీ అది బ్రహ్మమే. శత్రువు కనబడ్డప్పుడు, శత్రువు కూడా బ్రహ్మం అంటుంది **"సర్వం ఖల్విదం బ్రహ్మ"**. అంతటా బ్రహ్మమును చూచేటి జ్ఞాన దృష్టి కలగాలి అంటే శత్రువును శత్రు భావనతోనూ, మిత్రుడిని మిత్ర భావంతోనూ చూచే దృష్టి పోవాలి. అదీ నీ సాధన. బ్రహ్మని పొందటానికి ఏ సాధన లేదు. కాని బ్రహ్మకంటే అన్యమునుండి విడుదలవడానికి నివృత్తి సాధన వున్నదక్కడ. సాధనంతా నివృత్తి కోసమే. అడ్డం తొలగితే నువ్వే బ్రహ్మ. అడ్డం తొలగించడమే నివృత్తి. గుణాలు తొలగించుకోవడమే నివృత్తి. ఈ ప్రేమ అనేటటువంటిది మనసుకున్నంత వరకు గుణములతో కూడి వుంటుంది. కారణముతో కూడి వుంటుంది. ఒక ప్రయోజనాన్ని ఆశించి ప్రేమ వుంటుంది. ప్రయోజనాన్ని ఆశించి వుండే ప్రేమ రాగమే గాని దివ్యత్వంలో వుండే దైవీ ప్రేమ కాదు. ఇక్కడ మన లక్ష్యం దివ్యత్వం. ప్రేమ అన్నప్పుడు దైవీ ప్రేమ, దివ్యప్రేమ. మానవ ప్రేమ రాగము. దివ్య ప్రేమే బ్రహ్మ జ్ఞానానికి తీసుకువెళ్తుంది. దివ్య ప్రేమే **సర్వం ఖల్విదం బ్రహ్మ**లోకి తీసుకు వెళ్తుంది. దివ్యప్రేమ ప్రపంచాన్ని పూర్తిగా విడిచి పెట్టేటట్లు చేస్తుంది. మన పిల్లల్ని తప్పు చేసినా ప్రేమిస్తాము. గాంధారి దుర్యోధనుడిని ప్రేమించలేదా? కొడుకు ఎంతమందినో హింసించాడు. ఎన్నో అన్యాయాలు చేశాడు. యుద్ధము వచ్చింది. యుద్ధము ఆపమన్నా చేయవలసిందే అన్నాడు. ఎవరిమాటా వినలేదు. అటువంటివాడికి తన తపశ్శక్తినంతా ధారపోసింది గాంధారిమాత. అది రాగమేగా. చివరికి కొడుకు చనిపోతే

గాంధారి ఏడ్చి కృష్ణ పరమాత్మకి శాపం ఇచ్చింది. నువ్వు నీ వంశము కూడా ఇలాగే పోతారు అంది. యాదవ కులములో ముసలము వచ్చి అంతా పోయింది. **ఒకరిమీద వుండే ప్రేమ రాగము. అందరిమీద సమానముగా వుండే రాగము దైవీ ప్రేమ.** ఈ ప్రేమ అనే దానిని సాధనగా తీసుకోవాలి. నాయందలి ప్రేమతో విషయవాంఛలయెడల తనకున్న మోహమును దూరము చేయాలి. నీకు రెండు చేతులలో రెండు వున్నాయి, అవ్వ బువ్వ. అవ్వా కావాలి బువ్వా కావాలి అంటే కుదరదు. ఏదో ఒకటి తేల్చుకో. ఇటు "నేను" కావాలా దైవీ ప్రేమ. ఇటు విషయాలు వున్నాయా రాగముతో కూడిన ప్రేమ. విషయాలమీద రాగముంటే "నేను" దొరకను. నా మీద ప్రేమ వుంటే, విషయాలను వదిలివేయాలి. విషయాలను వదిలివేస్తే నన్ను నువ్వు ప్రేమించవలసిన రీతిగా ప్రేమిస్తావు. నీ ప్రేమ దివ్య ప్రేమగా మారుతుంది. అటువంటి ప్రేమతో జీవించే జీవుని జీవితం దివ్య జీవనంగా మారుతుంది.

**8) నిస్వార్థ సేవ:** పుణ్య పాపములు ఇది తగినదని, ఇది తగనిదని బేధము లేకుండా సృష్టి అంతటనూ ప్రకాశించుచు విశ్వ సేవను యొనర్చు సూర్యునివలే ఫలాపేక్ష లేకుండా సేవ యొనర్చిన యెడల, నన్ను జయించగలరు. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. సముద్రములోని ఉప్పు నీటి మీద ప్రకాశించి దానిలోని మంచి నీటిని ఆవిరిగా మార్చి మేఘాలను తయరు చేస్తున్నాడు. మలమూత్రాదులలోని నీటిని కూడా ఆవిరి చేస్తే ఆ నీరు కూడా స్వచ్ఛ జలముగా మేఘములలో చేరుతోంది. మంచి నీటిని కూడా ఆవిరిగా చేసి మేఘాలయందు చేరుస్తున్నాడు. మేఘము రూపములో మారే సరికి అన్నీ మంచినీరు అయినాయి. అట్లా మంచి చెడు అనేది లేకుండా అన్నిటియందు వున్న ఒకే ఒక జలతత్వాన్ని ఎలా స్వీకరిస్తున్నాడో మురికి నీటిలోని జలతత్వాన్ని, ఉప్పు నీటిలోని జలతత్వాన్ని, మంచినీటిలోని జలతత్వాన్ని మంచి చెడు రెండూ వదలివేసి కేవలం తత్వాన్ని ఎలా సూర్యుడు స్వీకరిస్తున్నాడో పుణ్యాత్ముల యెడల పాపాత్ముల యెడల వారిలో వున్న దైవత్వాన్ని మాత్రమే నీవు స్వీకరించి మిగతావాటిని సూర్యుడు ఎలా వదలి వేశాడో, అలాగే అందరిలోని చెడుగుణాలను అక్కడే వదలివేసి అందరిలోని దైవత్వాన్ని మాత్రమే నువ్వు స్వీకరించేటట్లయితే నువ్వు నన్ను పొందుతావు. ఇది సూర్యుని యొక్క ఉదాహరణ. ఎవరు చేయగలరు ఈ పని? నిస్వార్థ సేవ. సూర్యుడిది నిస్వార్థ సేవ. దుర్మార్గులకి సూర్య ప్రకాశం అందుతోంది. సన్మార్గులకు అందుతోంది. మంచి పదార్థాల మీద, చెడ్డ పదార్థాల మీదా సూర్య ప్రకాశం వుంది. సూర్యుడికి పుణ్యాత్ముడని పాపాత్ముడని లేదు. ఆయన వలన కలిగిన ప్రయోజనం ఇద్దరికీ సమానంగానే వుంది. సూర్యుడికి పక్షపాతం లేదు. పక్షపాతం వుంటే స్వార్థం వుంటుంది. పక్షపాతము లేకపోవడమే నిస్వార్థము. సూర్యుడు ఎలాగయితే తన సహజ ప్రకాశముతో ప్రకాశిస్తున్నాడో, నీవు కూడా నీ ఆత్మ ప్రకాశముతో చైతన్యముతో ప్రకాశిస్తూ పరమాత్మ ప్రకాశము ఎలాగయితే మంచివారిలో, చెడ్డవారిలో, దేవతలలో, రాక్షసులలో, మానవులలో, సర్వ జీవులలో, చరాచర జగత్తు అంతా ఉచ్ఛ నీచ బేధము లేకుండా మంచి చెడూ బేధాలు లేకుండా సమానంగా అణోరణీయాన్‌గా మహతో మహీయాన్‌గా ఎలా వ్యాపించి వుందో, అలా నువ్వు వ్యాపకం కాగలిగితే నువ్వు పరమాత్మవే. నీ వ్యాపకత్వానికి వున్న అడ్డంకులు తొలగించి, నీవు వ్యాపకం కాగలిగితే నీవు పరమాత్మవే. పుణ్య పాపములు ఉచ్ఛ నీచములనే బేధాలను నీవు వర్జిస్తే, విస్మరిస్తే, తప్పకుండా నువ్వు నన్ను పొందుతావు. ఎందుకంటే **సమత్వం యోగముచ్యతే**. నీకు బేధాలు తోస్తున్నంత సేపూ అది యోగం కాదు. అబేధ స్థితే యోగము. సమత్వమే యోగము. ద్వంద్వాతీతమే పరమాత్మ స్థితి. విషయాల పట్ల ద్వంద్వాతీతంగా వుండాలి. విషయాలపట్ల మంచి చెడు అనే విమర్శ నీకు రాకూడదు. అందరి విషయంలో కూడా నువ్వు నిష్పక్షపాతంగా అందరినీ కరుణగా, ప్రేమగా, సానుభూతిగా వారి బలహీనతలని పట్టించుకోకుండా, ఏదైనా తీవ్ర దోషం కనబడినప్పటికీ అది అజ్ఞాన కారణమే తప్ప ఆ పురుషుడు అజ్ఞానంచేత అలా చేస్తున్నాడు గాని, పురుషుడు మాత్రము మాలిన్యము లేనివాడే. వాడు మంచివాడే గాని గుణమే చెడ్డది అంటారు. **మనిషెప్పుడూ మంచివాడే, గుణమే చెడ్డది**. అందరిలో పురుషుడున్నాడు. అందరిలో వున్న పురుషుడు పురుషోత్తముడే. ఆ పురమునందు నివశించు పురుషుడు ఎప్పుడూ మంచివాడే. ఆ పురము ఏ సంస్కారము వలన ఏ గుణాల వలన వచ్చిందో అది మాత్రమే చెడ్డది. దానిని విస్మరించాలి. మెహెర్ బాబా అంటారు – మీలో మీరు ఒకరు మంచి ఒకరు చెడు అంటారు, కాని నా దృష్టిలో మీరందరూ అజ్ఞానులే. తప్పంతా అజ్ఞానానిదే. కనుక అందరినీ నేను ఒకే విధముగా ప్రేమిస్తాను. అజ్ఞానాన్ని వదిలించి మిమ్ము రక్షిస్తాను. మీలో మీకు తేడాలున్నా అవి నా దగ్గర లేవు అన్నారు. నాకు మీ అందరి విషయంలో ఏ తేడా లేదు, అందరూ అజ్ఞానులే. అందరికీ అజ్ఞానం పోవాలి. ఒక్కటే ముక్క. నీ తప్పేమీ లేదు. నీ అజ్ఞానం తప్పు. అజ్ఞానం మనసుది కాబట్టి నేను మనోనాశ్ కార్యక్రమం చేస్తున్నాను, మీ అంతట మీరు చేసుకోలేరు కాబట్టి. అంతే!

ఒకడు తనను తానే ప్రేమించుకుంటాడు. ఇతరులను ప్రేమించడు అది స్వార్థము. ఇంకొకడు తన కుటుంబాన్ని ప్రేమిస్తూ, తను అవసరమైతే త్యాగం చేస్తాడు. వాడు నిస్వార్థపరుడని అనుకొంటాడు. కాని అతను ఇతరులకోసం త్యాగం చెయ్యడు. అందువలన అతడు స్వార్థపరుడే. మరొకడు దేశంకోసం త్యాగం చేస్తాడు. అతడు నిస్వార్థపరుడు. కాని ప్రక్క దేశాలకోసం త్యాగం చేయడు. అందువలన అతడు కూడా స్వార్థపరుడే. ఈ విధముగా స్వార్థము యొక్క పరిధిని అతడు ఒక్కడి నుండి మొదలుపెట్టి విశ్వవ్యాప్తంగా పెంచుకొంటే అప్పుడతడు నిస్వార్థపరుడు. ఈ నిస్వార్థపరుడు సర్వమూ త్యాగం చేసి ఉంటాడు. అప్పుడతడు పరమాత్మయే. ఎందుకంటే తానే పరమాత్మ గనుక, ఆ పరమాత్మ శాశ్వతము గనుక, ఆ పరమాత్మ మిగిలి ఉంటాడు. త్యాగం చెయ్యడానికి ఇంకేమీ లేదు. అప్పుడు ఈ విధమైన పరిత్యాగము చేసినటువంటి స్వార్థపరుడు నన్ను పొందును. అనగా పరమాత్మానుభవము పొందును.

**9) పరిత్యాగము:** శారీరిక మానసిక ఆధ్యాత్మిక సంబంధ విషయములన్నిటినీ నా కొరకు పరిత్యజించినవాడు నన్ను పొందగలడు. పరమాత్మని పొందటానికి ఏమేమి వదలాలి? శరీర సంబంధము వదలాలి, మనసుకి సంబంధించినవి వదలాలి. ఆధ్యాత్మికతకి సంబంధించినవి కూడా వదిలివేయాలి. ఒకటి వదలితే అది త్యాగము. శరీరానికి సంబంధించినది అంటే విషయాలు ఇంద్రియ భోగాలు. మనసుకి సంబంధించినవి అంటే రాగద్వేషాలు అరిషడ్వర్గాలు, నేను నాది నావారు అనేటువంటి వాటితో కూడినటువంటి వాసనలు. ఆధ్యాత్మిక సంబంధమంటే చివరికి "నేను"ని వదలాలి. మనసుకూడా పోయాక ఏ నేనైతే వుందో ఆ నేను మనసులేనప్పుడు **"అహం బ్రహ్మ"** అంటుంది. అటువంటి ఆధ్యాత్మిక **"నేను"** కూడా పోవాలి. పోవాలి అంటే త్యాగం చెయ్యాలి. తను మన ధనములు మూడూ త్యాగము చేయాలి. నీకు కొంత వుంచుకుని పెడితే అది దానము. నీకు వుంచుకోకుండా చేస్తే త్యాగము. త్యాగము చెసేటటువంటి కర్త కూడా లేకుంటే అది పరిత్యాగము. నేను త్యాగము చేస్తున్నాను అనేటటువంటి కర్తృ భావన లేకపోతే అది పరిత్యాగము. చివరికి **"నేనే"** లేకుండా పోయేది పరిత్యాగము. ఆధ్యాత్మికత అంటే ప్రత్యగాత్మ పరమాత్మలు అష్ట తనువులు అన్నమాట. తనువు అంటే మూడు శరీరాలు అని అర్థం. అష్ట తనువులు లేకపోవడమే పరిత్యాగము. పరమాత్మానుభవాన్ని, బ్రహ్మానందాన్ని కూడా త్యాగం చేయడము పరిత్యాగము. ఈ పరిత్యాగం వలన ద్వైతము నశిస్తుంది. అద్వైతము సిద్ధిస్తుంది.

**10) విధేయత:** కంటికి వెలుగు, ముక్కుకు వాసన అప్రయత్నముగా ఎట్లు తెలియబడునో, అట్లే సంపూర్ణమగు సహజమగు విధేయత వున్నచో నన్ను చేరగలవు. మన ఇంద్రియములలో నాలుక మీద పదార్థము పెడితే గాని రుచి తెలియదు. ఏదైనా వస్తువు మిమ్మల్ని తాకితే తప్ప స్పర్శ తెలియదు. శబ్దము మీ చెవిని తాకినప్పుడు తెలుస్తుంది. కాని కళ్ళు ముక్కు తెరుచుకునే వుంటాయి. కళ్ళు తెరుచుకోగానే విషయము వస్తువు కనబడక పోయినా వెలుతురు కనబడుతుంది. చూచినా, చూడకపోయినా, చూపు అనేది ఉందంటే, ఆ కంటికి వెలుగు ఉంటుంది. గ్రుడ్డివాడికి ఆ వెలుగు ఉండదు. కనుక కంటికి వెలుగు సహజంగానే ఉంటుంటి. విడదీయడము కుదరదు. కంటికి వెలుగు, కన్నుకు అధిష్ఠాన దేవత సూర్యుడు. సూర్యుడే వెలుగు. కన్ను పనిచేస్తుందంటే దానిలో సూర్యుని ప్రకాశము అధిష్ఠాన దేవతగా కన్ను చూడటానికి తోడ్పడుతూ వుంటుంది. అలాగే ముక్కుకి వాసన. ఎక్కడున్న వాసనో ముక్కుకి తెలియబడుతుంది. మీకు ఇష్టం లేకపోతే ముక్కు మూసుకోవాలి తప్ప వాసన మాత్రం వచ్చి తీరుతుంది. దీని కోసం మనం ప్రయత్నం చెయ్యం. స్పర్శ కోసము గాని శబ్దము వినడము కోసము గాని ప్రయత్నిస్తాము. శబ్దములు కూడా అప్రయత్నముగా చెవికి వెళతాయి. గాలియొక్క స్పర్శ నీవు వద్దనుకున్నా నీ చర్మానికి తెలియబడుతుంది. వీటన్నింటిలో ముఖ్యంగా కంటికి వెలుగు, ముక్కుకి వాసన అప్రయత్నముగా వస్తాయి. అవి వద్దనుకుంటే మూసుకోవలసిందే తప్ప అవి తెరిచే వుంటాయి. వాటికి అప్రయత్నముగా రూప జ్ఞానము వాసనా జ్ఞానము అందుతుంది. అలాగే సంపూర్ణమైన సహజమగు విధేయత నా యెడల వున్నచో నన్ను చేరగలవు. కన్ను వెలుగు కలిసి ఒక్కటే ఎలా అయిందో ఆ విధముగా పరమాత్మలో నీవు చేరి వుండటమనేది అంత సహజముగా ఉంటుంది. జీవాత్మ పరమాత్మ కన్ను వెలుగు ఎలా సహజంగా కలిసి వుంటాయో విడదీయడానికి వీలు లేక వుంటాయో ఆ పరమాత్మని పొందగలవు. విధేయత అంటే ఇది. ఈ వెలుగే కంటికి విధేయము.

పరమాత్మని పొందటానికి ఎంత విధేయత వుండాలి? వినయానికి విధేయతకి తేడా వుంది. వినయము కంటే విధేయత గొప్పది. నయము అంటే స్పష్ఠత. వినయము అంటే ప్రత్యేకమైనటువంటి, విశిష్ఠమైనటువంటి స్పష్ఠత, నయవిద్య అని వుంది. నయవిద్య అంటే నాకు ఇది తెలుసు అని చెప్పకూడదు. నాకు ఇది తెలుసు అని చెబితే అక్కడ అహంకారం వుంటుంది. నాకింత మాత్రమే తెలుసు, నాకు తెలిసినంతలో నేను చెబుతున్నాను అని చెప్పడము నయవిద్య. అథారిటీగా ప్రమాణముగా చెప్పకుండా వినయముతో అహంకారము లేకుండా చెప్పడము నయవిద్య. ప్రమాణముగా చెప్పినప్పుడు ఆ విషయము నాకే బాగా తెలుసు అనేటటువంటి అహంకారము వుంటుంది. కనుక అహంకారము లేకుండా వుండటమే నయవిద్య. ఆ విధముగా నయవిద్యను పాటించడమనేది వినయము. విశిష్ఠముగా అహంకారము లేకుండా వుండటము వినయము. విధేతయ అంటే ఏమిటి? నీ అహంకారమును పరమాత్మయందు చేర్చి పరమాత్మతో ఐక్యతపొందించి ఈ ఐక్యత పొందినటువంటి ఏ నేను అయితే వుందో, ఆ నేను లేకుండా పోవడమే విధేయత. వినయము కంటే ఒక మెట్టు ఎక్కువ విధేయత. వినయము ఎవరి యెడల అయినా వుండవచ్చు విధేయత మాత్రము పరమాత్మతో వుంటే ఆ పరమాత్మతో ఐక్యము అవుతావు. ఇంకెవరియందైనా వుంటే వారితో ఐక్యం కావు. పరమాత్మతో వుంటేనే ఐక్యం అవుతావు. **వినయములో అహంకారము తగ్గి ఉంటుంది. విధేయతలో అహంకారము సమర్పించబడుతుంది.**

**11) శరణాగతి :** ఎవరికైతే నిద్రపట్టడం లేదో అనేక రోజులుగా వారాలు నెలల తరబడి నిద్రపట్టడం లేదో వారు డాక్టరును సంప్రదించి నిద్ర పట్టడం లేదని చెబితే ఆయన మందులిస్తే మందులు కూడా పనిచేయకపోతే చివరికి అనుకోకుండా ఒకరోజు నిద్ర వచ్చింది. ఆకస్మికముగా వచ్చే నిద్రని ఆహ్వానిస్తున్నారు. మెలకువలో మనసుని విషయాలతో కదిలించేదంతా అందరికీ వుంటుంది. అసలు దాని వల్లనే కదా నిద్ర పట్టక పోవడము. అకస్మాత్తుగా నిద్ర వస్తే విషయాలు వుండవు, మనసు పనిచేయదు. అప్పుడు వాడు నిశ్చింతగా ఆ నిద్రకు ఎలా లొంగిపోతాడో! చాలాకాలంగా నిద్రపట్టని జబ్బు వున్నవాడు ఒకరోజున అకస్మాత్తుగా నిద్రపడితే నిద్రని ఎలా స్వాగతిస్తాడో, నిద్రలో ఎలా ఒదిగిపోతాడో, నిద్రలో ఎలా ఐక్యత చెందుతాడో, ఎవరైతే నిద్రకోసము ఐక్యత కోసము ప్రయత్నము చేశాడో, ఆ నిద్రా కాలములో వాడే వుండడు. వాడు నిద్రలో లయమవుతాడు. నిద్రపట్టగానే లయమవుతాడు. మనము కూడా రోజూ అలా లయమవుతున్నాము. కాని ఎంత విశిష్ఠముగా ఎంత ప్రత్యేకముగా ఆధ్యాత్మిక ప్రయోజనము కోసము అయ్యేదానికి ఉదాహరణ చెప్తున్నారు. చాలాకాలమునుంచి నిద్రపట్టని వ్యాధి వున్నవాడికి ఎప్పుడైనా సరే అకస్మాత్తుగా నిద్ర పట్టేటటువంటి పరిస్థితి వస్తే ఆ నిద్రని ఎలా ఆహ్వానిస్తాడో, ఎలా స్వాగతిస్తాడో, ఆ నిద్ర అనేటటువంటి ఒడిలో ఎలా విశ్రమించి సేదతీరి, ఆనందముగా వుంటాడో, అట్లా ఆ పరమాత్మయొక్క ఒడిలోకివెళ్ళి తాను విశ్రాంతి పొందటాన్ని ఉదాహరణగా చెప్పారు. అదే విధముగా ఆ నిద్రకి నిశ్చింతగా ఏ విధముగా లొంగిపోతాడో అంత మనస్ఫూర్తిగా నాకు అర్పణ అయినవాడు నన్ను పొందగలడు. మరియు నన్ను తనవానిగా చేసుకొనగలడు. శరణాగతి అంటే అది.

**12) ప్రేమ:** ప్రేమ అంటే సెయింట్ ఫ్రాన్సిస్‌కి జీసెస్ యందు ఎంత ప్రేమ వున్నదో అంతటి ప్రేమ నాపై వున్నచో నన్ను ఎరుగుటయే కాక నన్ను ఆనందపరచగలడు. మరియు సంతృప్తి పరచగలడు. సెయింట్ ఫ్రాన్సిస్ అనేవాడు జీసెస్ భక్తుడు. అతను వేరే దేశమునకు వెళ్ళి అక్కడ జీవిస్తున్నాడు. అక్కడి వారికి క్రైస్తవ మతమంటే పడదు. జీసెస్‌ని తిడుతున్నారు. జీసెస్ భక్తులను వేధిస్తున్నారు. అటువంటి పరిస్థితులలో అతను ఈ జీసెస్‌ని ఎంతగా ప్రేమిస్తున్నాడంటే ఆయనయందు ప్రేమను నేను వదలుకోలేను అని అతను వారిచేత ఎన్ని హింసలు పడుతున్నప్పటికీ కూడా ఆ జీసెస్‌నే ప్రేమించడమన్నది మానలేదు. అంతటి ప్రేమ ఎవరికైతే వుంటుందో అటువంటివాడు ఆ పరమాత్మను లేదా పరమాత్మే శరీరము ధరించిన అవతారుడుగా వచ్చినటువంటివారిని, అవతరించినటువంటి భగవంతుడిని ఆనందపరచగలడు. తృప్తి పరచగలడు.

ఇవన్నీ కూడా నిరీక్షణలో పరాకాష్ఠ. మనశ్శాంతికి పరాకాష్ఠ. నమ్రతకు పరాకాష్ఠ. శరణాగతి, ప్రేమ , నిస్వార్థము ఇవన్నీ కూడా పరాకాష్ఠ స్థితిలో ఏ రకముగా పనిచేస్తాయో అవి అలా పనిచేసినప్పుడు నీవు పరమాత్మ దగ్గర వుంటావు. పరమాత్మ అయిపోయి వుంటావు. ఇది సాధనగా వుంది కాబట్టి పొందుట అనే మాట వాడారు. సాధన వలన సాధ్యము అయి పొందబడతాయి. ఆ పైన గురుకృపతో సిద్ధ వస్తువు సిద్ధించినపుడు పొందుట అనే మాట వుండదు.

## చతుర్విధ శుశ్రూషలు
## (అంతర్భావము - లక్ష్యార్థము)

శుశ్రూషలు అందరికీ తెలుసు. అంగ శుశ్రూష, స్థాన శుశ్రూష, భావ శుశ్రూష, ఆత్మ శుశ్రూష. ఇవి బాహ్యార్థములో స్థూలముగా ప్రతివారికీ తెలుసు. దీని లక్ష్యార్థమేమిటి? దీని అంతర్భావమేమిటి? శుశ్రూష ద్వారా శిష్యుడు తాను లేకుండా పోవాలి. గురువులో మమైకమైపోవాలి. గురుసాక్షాత్ పరబ్రహ్మ అనే స్థితి శిష్యుడికి సంక్రమించాలి. అదీ రహస్యమంటే. ఎలా సంక్రమిస్తుంది? స్థూలంగా ఇచ్చేటటువంటిది సంక్రమిస్తుంది. తల్లిదండ్రుల ఆస్తి పిల్లలకు సంక్రమిస్తుంది, ఇవ్వడాలూ పుచ్చుకోవడాలూ లేకుండానే వారసత్వంగా వచ్చేది సంక్రమించడము అంటాము. స్థూలము మనకు తెలుసు. జ్ఞానము ఎలా సంక్రమిస్తుంది? భ్రమర కీటక న్యాయముగా సంక్రమిస్తుంది. దీనికి అంతరార్థము ఏమిటి?

**స్థాన శుశ్రూష :** జాతి, వంశము, ప్రతిష్ఠ, నీయందు అభిమానము, దేహాభిమానము విడిచి సర్వవ్యాపకమైన సద్గురుని హృదయస్థానమందు నిలచి శరణాగతి చేయుటయే స్థాన శుశ్రూష. నీ జాతి గొప్పదని గాని ఇతర జాతులు తక్కువని గాని నీ వంశము నీ పేరు ప్రతిష్ఠలు గాని సామాన్యముగా అందరికీ వీటన్నింటిమీదా అభిమానము వుంటుంది. ఒక బ్రాహ్మణుడు ఒక శూద్రుడైన సద్గురువుకి శిష్యరికము చేయవచ్చు. అటువంటి సద్గురువు యొక్క పాదములను నిరహంకారముగా పట్టుకోవాలి. అప్పుడు జాతి, వంశము, కులము, గోత్రము, ఇటువంటి ప్రతిష్ఠలు, వీటిమీద వుండే అభిమానము వదలాలి. మొట్ట మొదట స్థూలముగా చేయవలసినది అది.

దీనికి అంతర్భావముంది. ఇవన్నీ దేనికి వదలాలి అంటే అన్నమయ కోశానికే కులము. శుక్లశోణితాలకే గోత్రము. బుద్ధి అనేటటువంటి మతికే మతము. మతి అంటే బుద్ధి. మతి అంటే అభిప్రాయము. అభిప్రాయాలను బట్టే మతము వచ్చింది. అన్ని మతాలూ సమానమని ఒప్పుకోము. ఎవరు ఏ మతములో వున్నారో వారికి ఆ మతము గొప్పదని చెప్తారు. ఆ మతము యొక్క ప్రతిష్ఠను ఆ మతముమీద వున్న అభిమానాన్ని ఎవరూ వదలలేరు.

అన్నమయ కోశము దాటినప్పుడు కులం పోయింది. మనోమయ కోశము దాటినప్పుడు గోత్రం పోయింది. విజ్ఞానమయ కోశము దాటినప్పుడు మతము పోయింది. ఆనందమయ కోశము దాటినప్పుడు 'నేను' అనే అభిమానం పోయింది. పంచకోశములు దాటినవాడు ఈ చెప్పిన వరసంతా విడిచిపెడతాడు.

ఆనందమయ కోశమన్నా కారణశరీరం అన్నా అజ్ఞానమన్నా ఒక్కటే. ఆ ఆనందమయ కోశములో 'నేను' అన్న అభిమానము వుంటే అది తమస్సుచేత ఆవరింపబడి వుంటుంది. 'నేను' అనే అభిమానము లేకుండా పోయినప్పుడు ఆ తమస్సు స్థానములో తురీయానుభవము కలిగి తురీయంగా ఆత్మగా సర్వవ్యాపకముగా వుంటాడు. సద్గురువు సర్వవ్యాపకుడే కనుక నీకు కూడా అటువంటి సర్వ వ్యాపక స్థితి కలిగితే, ఆ సద్గురువులో మమైకమవుతావు. ఆ సద్గురుని యొక్క హృదయ స్థానములోకి వెళ్ళగలుగుతావు. అంటే శరణాగతి స్థూలంగా కాదు. పాదాలకు కాదు. సద్గురుని హృదయానికి శరణాగతి చేయాలి. ఇదీ స్థాన శుశ్రూష. నీ పంచకోశాలూ దాటినటువంటిది ఏ స్థానము అంటే, అది గురువుయొక్క హృదయస్థానము. గురువు యొక్క హృదయ స్థానానికి నీ సంకల్పము నీ శరణాగతి చేరాలి. అంత సూక్ష్మాతి సూక్ష్మంగా మారాలి. ఇది అంతర్భావము.

**అంగశుశ్రూష: సూక్ష్మమైన లింగ శరీరము, స్థూలమైన అంగశరీరము, ఆవరణ అయిన కారణ శరీరము** యొక్క సంగత్వముచే ఏర్పడు భ్రాంతులైనటువంటి అరిషడ్వర్గమును విడిచి, సర్వవ్యాపకమైన సద్గురుని ప్రజ్ఞా స్వరూపములో మూడవస్థలలో కూడా ఆశ్రయించి వుండుటయే అంగ శుశ్రూష అనబడును. సూక్ష్మమైన లింగ శరీరము, స్థూలమైన అంగ శరీరము – అంగము అంటే స్థూల శరీరము. లింగము అంటే సూక్ష్మ శరీరము. ఆవరణ అయినటువంటిది కారణ శరీరము. కారణ శరీరము అజ్ఞానము చేత ఆవరించబడి వుంది. కారణములో వాసనలున్నాయంటే అజ్ఞానములో వున్నామని అర్థము. కారణములో వాసన లేకుండా పోయింది అంటే అజ్ఞానం పోయినట్లే. కారణ శరీరమన్నా అవిద్య అన్నా అజ్ఞానమన్నా ఆనందమయ కోశమన్నా ఒక్కటే. శరీర పరముగా మూడు శరీరాలు లేనివాడివై వుండాలి. మూడు శరీరాలు లేకపోతే స్థూల శరీర భావన పోయింది. సూక్ష్మశరీర భావన పోయింది. తమస్సుచేత అజ్ఞానముచేత ఆవరించబడిన కారణ శరీరము కూడా పోయింది. ఎట్లా పోయింది? అవి పోతాయని కాదు. వాటితో నీకు సంగత్వం వుంది. ఈ గురు శుశ్రూషలు చేసేటప్పుడు ఆ మూడిటియొక్క సంగత్వములు విడిచిపెట్టాలి. ఆ సంగత్వము వలన ఏర్పడునట్టి భ్రాంతులు వదలిపెట్టాలి. భ్రాంతులు దేనివలన వున్నాయి? జ్ఞానములో లేవు. జ్ఞానంలో లేకుండా అజ్ఞానములో మాత్రమే వున్నవేమిటి అంటే అరిషడ్వర్గము కామ క్రోధ లోభ మోహ మద మత్సరములు, పంచ మలములు.

**పంచమలములు ఏవి?** కర్మచేత ఏర్పడినది కార్మిక మలము, అవిద్యచేత ఏర్పడినది మాయేయమలము, మాయవల్ల అంటుకున్నది మాయామలము, మరల వీటిలో మూడు భాగములు వున్నాయి. తలపులలో మాటలలో చేతలలో చేసేటటువంటి పనులనుబట్టి, త్రికరణములలో చేయడాన్నిబట్టి, అవి మూడు భాగాలయినాయి. సర్వ వ్యాపకమైన సద్గురునియొక్క అనంత ప్రజ్ఞా స్వరూపముతో మూడవస్థలలో కూడా ఆశ్రయించి వుండాలి. జీవులకు మూడవస్థలున్నాయి. తురీయములో సాక్షిగా వుంటే తప్ప మూడవస్థలలో నీవు గురువుని పట్టుకోలేవు. తురీయంలో మూడవస్థలలో సాక్షిగా వున్నప్పుడు ఏ అవస్థలో వున్నా గానీ ఆ అవస్థకు సాక్షిగా నీవు నీవైనటువంటి చైతన్యముగా సాక్షి చైతన్యముగా కనుక వుంటే సాక్షి చైతన్యమే తురీయము. సాక్షి చైతన్యానుభవమే తురీయానుభవము. ఆ తురీయమే చైతన్యము యొక్క వ్యాపక స్థితి, పరమాత్మ యొక్క వ్యాపక స్థితి కూడా అదే. ఆ పరమాత్మ యొక్క వ్యాపక స్థితిలో అనంత ప్రజ్ఞగా వున్నటువంటి సద్గురువుతోటి ప్రజ్ఞానం బ్రహ్మ అనేటటువంటి అనుభవం దాకా వచ్చినటువంటి శిష్యుడు ఆ గురువుతో మమైకం అవుతాడు. తురీయంలో వున్నది ప్రజ్ఞానానుభవమే. సాక్షి వున్నంత వరకు ప్రజ్ఞే. సాక్షి కూడా లేకపోతే తురీయాతీతము. అది ప్రజ్ఞాన ఘనము.

**భావశుశ్రూష:** కర్మేంద్రియ జ్ఞానేంద్రియ అంతరేంద్రియములు పద్నాలుగు. వీటన్నిటికిన్నీ సాక్షిత్వముగా విలక్షణుడు అని తలంచుచూ సర్వవ్యాపకమైన సద్గురుని హృదయమందు సుస్థిరత కలిగి వుండుటయే భావ శుశ్రూష. భావ శుశ్రూష అంటే గురువు అప్పచెప్పిన పనిమీద గురు శుశ్రూష మీద శ్రద్ధ కలిగినప్పుడు శిష్యుడికి తన వ్యక్తిగతమైనటువంటి కర్మేంద్రియ జ్ఞానేంద్రియ అంతరేంద్రియములు పద్నాలుగున్నూ భోగ పద్ధతిగా వుండకుండా వాటన్నిటికీ విలక్షణంగా, అవి చేసే పనులకు సాక్షిగా, ఆ పనులు వాటి పాటికి అవి జరుగుతున్నా, తనయొక్క మనసు వాటిపట్ల లేకుండా గురువుకి చేసే శుశ్రూషల మీదనే శ్రద్ధతో నిమగ్నమై వుండగలిగితే అట్టి గురువుతో మమైకమవుతావు. అది భావ శుశ్రూష.

**ఆత్మ శుశ్రూష :** తాను సాక్షినని సుస్థిరతనొందినటువంటి ప్రజ్ఞా స్వరూపుడు చిన్మయ ఘనిష్ఠమైనటువంటి సద్గురునియందు అనన్యమై నిలచి, తాను తానైన సచ్చిదానందుడు అను అనుభవమును పొందుటయే ఆత్మ శుశ్రూష. ఆత్మ అంటే నేను స్ఫురణ. ఆత్మ అంటే నేను తెలివి. నీ వెవరు ఇప్పుడు? ఇంతకు ముందు తురీయములో వున్న సాక్షి. గురువు తురీయములో వున్నాడా తురీయాతీతములో వున్నాడా? గురువు తురీయాతీతముగా వున్నప్పుడు సాక్షిగా కూడా లేడు. సాక్షిగా వున్నప్పుడే ప్రజ్ఞ పనిచేస్తుంది. తురీయములో సాక్షిగా వున్నవాడికి ప్రజ్ఞ పనిచేస్తుంది. గురువు శిష్యుని కొఱకు ప్రజ్ఞా స్వరూపుడై వున్నాడు, తురీయములో ఉన్నాడు. యదార్థముగా గురువు ప్రజ్ఞాన ఘనుడు, తురీయాతీతుడు. కాని శిష్యుని కొఱకు తురీయములో పనిచేస్తూ ఉంటాడు. అట్టి స్థితిలోనే శిష్యుడు గురువులో మమైకమవుతాడు.

తురీయాతీతములో ప్రజ్ఞాన ఘనము అయినప్పుడు మూడవస్థలలోకి వ్యాపించనపుడు సాక్షిత్వం కూడా పోయింది. సాక్షి అనేటటువంటిది కూడా పోయింది. ఆ రకముగా సాక్షి అనేటటువంటి **"నేను"** శిష్యునియందు పోవడమంటే శిష్యుడే లేకుండా పోవడము. గురువు లేనివాడు కనుక శిష్యుడు కూడా లేనివాడు అవ్వాలి. ఆ లేని గురువుకి లేని శిష్యుడే శుశ్రూష చేస్తాడు. శిష్యుడు తనపరంగా లేనివాడయ్యాడు. గురువు యొక్క అవసరానికి తగినట్లుగా గురువే తాను తానే గురువు అన్నట్లుగా గురువుకి చేసే ప్రతి పని తనకు తాను చేసుకునే పద్ధతిలో చేస్తున్నాడు. తనకు తాను చేసుకునేది వేరు, గురువుకి చేసేది వేరు అనేది పోయింది. గురువుకి చేసేది మాత్రమే వున్నది. తనకు చేసేది అన్నది త్యాగమయింది. ఇదీ ఆత్మ శుశ్రూష. సద్గురునియందు అనన్యమై ఐక్యతా సిద్ధి పొంది, నిలచి, తాను తానైనటువంటి సత్ చిత్ ఆనందుడనే అనుభవము పొందుతాడు. గురువుకి ఏ అనుభవం వుందో గురువులో మమైకమగుటచేత, మీకు కూడా అదే అనుభవము సంక్రమించింది. ఇట్లా ఈ నాలుగు శుశ్రూషల ద్వారా గురువు యొక్క అనుభవము స్థాయీ బేధాలలో ఆ గురువుతో మమైకమవడం ద్వారా ఆ నాలుగు స్థితుల యొక్క అనుభూతి నీకు కలిగింది. గురువులో వున్నదే నీకు వచ్చింది. నీకంటూ వున్నవన్నీ పోయినవి. గురువులో ఏవైతే వున్నాయో అవన్నీ ఆ నాలుగు స్థితులుగా నీకు సిద్ధించాయి.

1) స్థాన శుశ్రూషలో నీకేమి సిద్ధించింది? సర్వ వ్యాపకమైన సద్గురుని యొక్క హృదయ స్థానమునకు చేరి అక్కడ శరణాగతి పొందావు. కాని పూర్తిగా మమైకం అవలేదు.

2) అంగ శుశ్రూషకెళ్ళేసరికి ఏమైంది? పంచ మలములు విడిచి పెట్టావు. మాయనుంచి అవిద్యనుంచి కూడా విడిపడ్డావు. అప్పుడు అనంత ప్రజ్ఞా స్వరూపుడైనటువంటి గురువులో నీ ప్రజ్ఞ కూడా కలిసిపోయింది. అభిన్నమైనది. అట్లా మూడవస్థలలో ప్రజ్ఞా స్థితిలో వుండి గురువు యొక్క అనంత ప్రజ్ఞకు నీ పరిమిత ప్రజ్ఞకు బేధము లేనట్లుగా నీ పరిమిత ప్రజ్ఞ పోయి గురువుయొక్క అనంత ప్రజ్ఞ దగ్గరకు చేరింది. దాదాపు కలిసిపోయింది.

3) భావ శుశ్రూషలోనేమో పద్నాలుగు ఇంద్రియాలకూ విలక్షణుడు అయ్యావు. అంగ శుశ్రూషలో సర్వవ్యాపక స్థితిలో వున్న సద్గురునికి శరణాగతి అయ్యావు. ఇప్పుడేమో భావశుశ్రూషలో శరణాగతి కూడా పోయింది. సర్వవ్యాపకమైన సద్గురుని హృదయమందు చేరితే నీవుకూడా సర్వవ్యాపివే. ప్రజ్ఞగావుండి సర్వ వ్యాపకమయ్యావు.

4) ఆత్మ శుశ్రూషలో సాక్షిత్వం పోవడం వలన సర్వ వ్యాపకత్వము కూడా లేదు. సర్వ వ్యాపకుడు ఎవరు అంటే సర్వమూ తోస్తూ వుంటే సర్వానికి సాక్షిగా వుంటే సర్వం దాకా నీ ఇంద్రియాలు పోతే నీ మనోబుద్ధులు ఊహలు పోతే అది సర్వవ్యాపక స్థితి. సర్వమూ మిథ్య అని తెలిసి సర్వమూ శూన్యమయినప్పుడు, దేశ కాలాదులే లేనప్పుడు, వ్యాపకత్వము కూడా లేదు. నిజానికి ప్రజ్ఞ వ్యాపించిందా? సాధకుడు ప్రజ్ఞా స్థితిలో వుండి ఇంకా విషయములు తోస్తూ వుంటే ఏ విషయము తోచిందో ఆ విషయము దాకా ప్రజ్ఞా రూపములో వ్యాపకమవుతున్నాడు. ద్వంద్వమనేటటువంటి విషయాలు దేశకాలాదులు నీకు తోస్తున్నంతసేపూ ఆ తోచుట జరుగుతున్నంత వరకూ ప్రజ్ఞగా నీవక్కడికి వ్యాపించి సాక్షిగా వాటికి అంటకుండా తెలుసుకుంటున్నావు. విషయమే తోచకపోతే , విషయాలంతా కల్పితము భ్రాంతి అని. విషయములు దేశకాలాదులు తోచనప్పుడు, కాలంలో వ్యాపకం లేదు, దేశంలో వ్యాపకం లేదు, వస్తువులలో వ్యాపకం లేదు. వ్యాపకము లేనప్పుడు ఆ వస్తువు తెలియబడటము లేదు. తెలియబడటములేదు కాబట్టి నువ్వు సాక్షిగా కూడా లేవు. అప్పుడు ప్రజ్ఞ ఘనమైనది. ప్రజ్ఞ స్వరూపమయింది. స్వస్వరూప లక్షణం అది. ఆనంద ఘనము, సద్ ఘనము, చిత్ ఘనము, ప్రజ్ఞాన ఘనము. స్వరూపమన్నా, ఘనమన్నా ఒక్కటే. ప్రజ్ఞా స్వరూపమని పదము పెట్టారు కాబట్టి ప్రజ్ఞాన ఘనం రెండూ ఒక్కటే.

ఈ ప్రజ్ఞాన ఘనము విశిష్ఠత ఏమంటే సాక్షిత్వం పోయింది వ్యాపకత్వం పోయింది. దాని అర్థమేమంటే దేశకాల వస్తువులు తోచుట లేదు. ఎంత దూరంలో ఏ వస్తువు తోస్తే అంత దూరము నువ్వు వ్యాపకం అయినట్లే లెక్క. సాక్షిగా వున్నప్పుడు వ్యాపకత్వం వుంది. సాక్షిగా కాలేనప్పుడు పరిమితత్వంగా వుంది. సాక్షిత్వం పోగానే ప్రజ్ఞానఘనం అయింది. వ్యాపకత్వం విరమించబడింది. అంటే ప్రజ్ఞ వ్యాపించడము వ్యాపించకపోవడము రెండూ లేవు అక్కడ. ఆవరణ దోషం వలన ఆవరణలో ఏవైతే కనిపిస్తున్నాయో, అధ్యాసగా ఏవైతే తోస్తున్నాయో, తోచిన దాకా నీవు వ్యాపకమైవున్నావు. తోచుట ఆగిపోయినప్పుడు వ్యాపకత్వం కూడా ఆగిపోయింది. అంటే విషయం తోచుట తోచకపోవుటలోనే వ్యాపకత్వం ఉంటుంది. అది భ్రాంతి. విషయం మిథ్య అయినప్పుడు విషయాలన్నీ కూడా కల్పితమైనప్పుడు, వ్యాపకత్వము కూడా కల్పితమే కనుక అన్ని కాలాలలోనూ వాడెప్పుడూ కూడా ప్రజ్ఞానఘనుడే. ఆ ప్రజ్ఞాన ఘనుడైనటువంటి వాడు అనంత ప్రజ్ఞగా వున్నటువంటి గురువులో మమైకమవడమే ఆత్మ శుశ్రూష. ఈ విధముగా చతుర్విధ శుశ్రూషలు చెప్పాము.

**శరీర త్రయ విలక్షణము**

**సీ॥ జ్ఞానేంద్రియంబులు కర్మేంద్రియములంతరేంద్రియంబులు విషయేంద్రియములు ప్రాణాదులును గూడిపరగ నిరువదైదు తత్వంబులును స్థూల తనువునయ్యె**

పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, జ్ఞాతతో కూడినటువంటి అంతఃకరణ చతుష్టయము మొత్తమంతా కలిపి పంచ అంతరేంద్రియములు, విషయ పంచకము, పంచ ప్రాణములు కూడి ఇవన్నీ వెరసి ఇరువది అయిదు తత్వములుగా ప్రతీతి అవుతున్నది ఏదో ఆ ఇరువది అయిదు తత్వములు స్థూల శరీరము అయింది. ఈ 25 తత్వాలు ఆ గోళకములలో వుంటేనే ఆ స్థూల శరీరానికి స్థూల శరీరం అని పేరు. ఆయా గోళకములలో 25 తత్వములు చేరి అవి పనిచేయకపోతే స్థూల శరీరము శవమే. పంచ ప్రాణములుంటేనే అది జీవించి వుంది. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు అంత్రేంద్రియములు పనిచేస్తుంటేనే దానికి వ్యాపారము, వ్యవహారము, మనుగడ, ఉనికి వున్నట్లుగా ఒక అనుభవము వున్నది.

లేకపోతే ఏముంది? **బాహ్యేంద్రియంబులు పది, ప్రాణమునైదు ధీమనంబులు సూక్ష్మ దేహమయ్యె** బాహ్యేంద్రియములు పది అంటే కర్మేంద్రియలు జ్ఞానేంద్రియములు కలిపి 10. ప్రాణము లైదు, ధీమనంబులు సూక్ష్మ దేహంబయ్యె – ధీ అంటే బుద్ధి. బుద్ధి, మనసు ఈ 17 తత్వాలు కలిపి సూక్ష్మ శరీరం అంటారు. కొంతమంది ఈ 17 తత్వాలు సూక్ష్మ శరీరం అంటారు. దీంట్లో మనసు బుద్ధి రెండే వున్నాయి. కొంతమంది మనసు, బుద్ధి, చిత్తం, అహంకారం ఈ నాలుగూ తీసుకువచ్చి సూక్ష్మ శరీరం 19 తత్వాలు అని కూడా అంటారు. 19 అన్నా 17 అన్నా పర్వాలేదు. ఎందుకంటే మనసు చిత్తం కలిపి ఒకటిగానూ,

బుద్ధి అహంకారం కలిపి ఒకటిగానూ చెప్తారు. బుద్ధి నిర్ణయం కాగానే అహంకారం తోస్తుంది. చిత్తవృత్తి రాగానే మనసు పనిచేస్తుంది. కనుక మనసు పనిచేస్తుంది అంటే చిత్తవృత్తి కూడా దాంతోనే కలిసి వుంది. బుద్ధి నిర్ణయించింది అంటే కర్తృత్వ భోక్తృత్వములతో నేను నాది అనే అభిమానము అహంకారమునకు వుంది. అందుకే కొందరు సూక్ష్మ శరీరం 17 తత్వములు అంటారు, కొందరు 19 తత్వములు అంటారు. 17 అన్నప్పుడు మనసు, బుద్ధి. 19 అన్నప్పుడు మనసు, చిత్తం, బుద్ధి, అహంకారం. ఈ రెండు రకములు ఒకటే. దీనిని గురించి ఇతరులతో వాదించనవసరము లేదు. ఇందులో బేధము లేదు. ఈ శరీర ద్వయం అంటే స్థూల సూక్ష్మ శరీరాలే ఈ శరీర ద్వయం.

**హేతుకానాద్యవిద్యావృతంబై కారణాంగమయ్యె – హేతుక, అనాది, అవిద్య, ఆవృతం, కారణాంగమయ్యె. హేతువు** అంటే కారణమే. అనాదిగా వుండేటటువంటి అవిద్య చేత ఆవృతమైనటువంటి ఈ స్థూల సూక్ష్మ శరీరాలు వుండటానికి హేతువైనది. అందువలన స్థూల సూక్ష్మ శరీరాలకు కారణము కారణ శరీరమైతే, దానికి కూడా కారణము అనాది అవిద్య. ఇది మహాకారణము. ఈ మహా కారణానికి కూడా హేతువున్నది. అది అనాది మాయ. అంగము అంటే శరీరము, కారణాంగము అంటే కారణ శరీరము. శరీరమంటే ఏమిటి? ఏదైతే నశిస్తుందో దేనికైతే నశించే స్వభావం వున్నదో దానిని శరీరము అంటారు. స్థూల శరీరం నశిస్తుంది కాబట్టి స్థూలానికి స్థూల శరీరం అని పేరు వచ్చింది. సూక్ష్మ శరీరం నశిస్తుంది. దానికి సూక్ష్మ శరీరం అని పేరు వచ్చింది. కారణ శరీరము నశిస్తుంది కాబట్టి కారణ శరీరం అని పేరు వచ్చింది. వాసనా క్షయమైతే కారణ శరీరం లేదు. ముక్తుడి విషయంలో లింగ శరీరం భంగమైనప్పుడు సూక్ష్మ శరీరం లేకుండా పోతుంది. సూక్ష్మ శరీరం నశిస్తుంది కాబట్టి దీనికి కూడా శరీరము అని పేరు పెట్టారు.

శరీరము శరీరమును ధరించినవాడు అని రెండుగా చెప్పడము జరిగింది. మన శరీరంలో "నేను నేను" అని ఏదైతే వున్నదో అది స్థూల శరీరము కాదు, సూక్ష్మ శరీరము కాదు, కారణ శరీరమూ కాదు. నేను అనేవాడు మూడు శరీరాలను ధరించాడు. మూడు శరీరముల యొక్క వ్యాపారమునకు వ్యవహారమునకు మనుగడకు సాక్షిగా వున్నాడు. కాని అజ్ఞానములో కలిసిపోయి వున్నాడు. ఇది విచారిస్తే నేను వేరు, మూడు శరీరాలు వేరు. నేను సాక్షి విలక్షణము అన్నప్పుడు వాడు శరీరి. ఇవి దేహములైతే వాడు దేహి. ఇవి శరీరములైతే వాడు శరీరి. ఈ శరీరియొక్క విలక్షణుడికి అనుభవము ఏదైతే వున్నదో అది అవస్థాత్రయ సాక్షిగా వున్నది. అనగా తురీయ స్థితిలో వున్నది. దానిని దేహి, శరీరి అంటున్నాము. ఈ తురీయము కూడా కొంతకాలముండి తురీయాతీతము కలిగే సరికి తురీయం లేకుండా పోతుంది. కనుక తురీయ అనుభవం కూడా నశిస్తుంది. కాబట్టి ఈ తురీయంలో ఏ అనుభవమున్నదో ఈ ప్రత్యగాత్మ అనుభవంలో సత్ చిత్ ఆనందమనేది పరోక్షానుభవంగా వుందో తటస్థ లక్షణానికి సంబంధించిన అనుభవంగా వుందో, అది కూడా ఆగిపోయి తురీయాతీతమందు లేనిదవుతుంది కనుక ఈ ప్రత్యగాత్మ కూడా శరీరమే. శరీరి అనేవాడు కూడా శరీరముగా మారిపోయాడు. ఇప్పుడు శరీరి లేడు. ఉన్నవన్నీ జీవ తనువులు నాలుగు. అవన్నీ నశించే స్వభావము కలవి.

సమష్టి స్థూల శరీరం విరాట్ – **శీర్యతే ఇతి శరీరః** అని దానికి కూడా నశించే స్వభావం వున్నది. సమష్టి సూక్ష్మ శరీరం హిరణ్యగర్భుడు. సమష్టి హిరణ్యగర్భ శరీరం కూడా శరీరం అనే పేరు వుంది కాబట్టి అది కూడా నశించే స్వభావము కలది గానే వున్నది. మహాకారణ శరీరము **యద్భావం తద్భవతి**గా సంకల్పాలుచేసేది వున్నది. నిర్వికల్పములో లేదు. అంటే ఒక కారణంతో వుంది, మరొక కారణంతో లేనిది శాశ్వతమైనది కాదు. కాబట్టి అది కూడా నశించే స్వభావము కలది. నశించేది కాబట్టే మహా కారణానికి కూడా మహాకారణ శరీరం అని పేరు.

పరమాత్మ అనుభవం కూడా తురీయంలోనే వుంటుంది. తురీయ అనుభవం మనకి కలిగినప్పుడు మొదలయింది తురీయాతీతంలో అంతమయింది. కనుక తురీయ అనుభవం కూడా పరమాత్మ అనేటటువంటిది కూడా లేనిదయింది. తరువాత సమష్టియందు కూడా అవ్యాకృతుడు లేనివాడయ్యాడు. మహాకారణం లేనిది అయింది. అవ్యాకృతుడే మహా కారణము. వీటన్నిటికీ శరీరాలని పేరు వచ్చింది. ఇంతవరకు శరీరి అనేటటువంటి పరమాత్మ లేనివాడయ్యాడు. కనుక పరమాత్మ ప్రత్యగాత్మ అనుభవములో ఒక్కటే. ఘటాకాశం ప్రత్యగాత్మ అయితే మహాకాశమే పరమాత్మ. కాని ఘటము యొక్క లోపల వెలుపల అనేటటువంటి విభాగము లేకుండా రెండూ అఖండముగా అవిభాజ్యముగా ఒక్కటే. కనుక ప్రత్యగాత్మ యొక్క అనుభవము సత్

చిత్ ఆనందముగా వుంటుందో పరమాత్మయొక్క అనుభవము కూడా అదే వుంది. వ్యష్టి తురీయంలో వున్న ప్రత్యగాత్మ అనుభవము సమష్టి తురీయములో వున్న పరమాత్మ అనుభవము సత్ చిత్ ఆనందమే కనుక ఆ అనందానికి మొదలు చివర వుంది కనుక అది కూడా శీర్యతే ఇతి శరీరః కాబట్టి ప్రత్యగాత్మ శరీరము పరమాత్మ శరీరము అని పిలువబడ్డాయి. అప్పుడు శరీరి ఎక్కడుంది? శరీరి కూడా శరీరము అయిపోయేసరికి మూడు శరీరాలు అన్నది ఇప్పుడు నాలుగు శరీరాలు అయినవి. ఈశ్వర తనువులు నాలుగు అయినవి.

జీవతనువులు నాలుగు, ఈశ్వర తనువులు నాలుగు కలిసి అష్ట తనువులైనవి. ఇక శరీరి అని పిలువబడేవాడు లేకపోయెను. ప్రత్యగాత్మ అని పిలువబడేవాడు లేకపోయెను. శరీరి లేక దేహి అనబడేవారు కూడా శరీరాలే అయినప్పుడు, అంతకుముందున్న శరీరియే, అశరీరి అయినాడు. అనగా ఏమీ లేదు. ఈ **"ఏమీలేదు"** అన్నదే బయలు.

ఏదీ లేకపోవడమే పరమపదము. ఏదైనా వుంటే ఒక అనుభవము ఒక ఎరుక వుంటుంది. ఏదీ లేకపోవడం వల్ల ఏ ఎరుకా లేదు. ఏ అనుభవమూ లేదు. కాబట్టి మనము ఏ తురీయాతీత స్థితికి వెళ్ళామో ఆ తురీయాతీతమే పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మయందు ఏ అనుభవమూ లేదు అని విచారించి తెలుసుకుంటే ఆ పరబ్రహ్మ ఉత్త బట్ట బయలు ఏమీ లేదు.

**మూడు దేహంబులకు ఆది మూలమైన క్షరునకు** అనాది మూలమంటే స్థూల సూక్ష్మ కారణం. మూడు శరీరాలకి మూలమైనటువంటి వాడు క్షరుడు. క్షరుడైన జీవుడికి కారణము అనాది అవిద్య. అక్షర పురుషునికి కూడా కారణము అనాది మాయ. అంటే ప్రత్యగాత్మ అనే మహా కారణమునకు హేతువు అనాది అవిద్య. అలాగే అక్షరుడు అనే పరమాత్మకు హేతువు అనాది మాయ.

**క్షరునకు నక్షరునకు విలక్షణుండ నీవే** అంటే క్షర, అక్షర పురుషులు అనే ప్రత్యగాత్మ, పరమాత్మలకు విలక్షణుడు అశరీరి అయిన బయలు. నీవే ఆ బయలు. అనగా అష్టతనువులకు సాక్షి ఎవరూ లేరు. కావున బయలే ఉన్నది. ఆ బయలే నీవు. అప్పుడేమయ్యింది?

**క్షరపురుషుడనరాదమ్మా అక్షరపురుషుడదిలేదమ్మా**. క్షేత్రజ్ఞుడు క్షేత్రము. అట్లా తీసుకున్నా క్షేత్రము అంటే జీవేశ్వరులు మూడేసి శరీరాలు, క్షేత్రజ్ఞుడు అంటే ప్రత్యగాత్మ, పరమాత్మలు. క్షేత్రము క్షేత్రజ్ఞుడు రెండూ లేవు అనగానే వాటికి అతీతము బయలే. అక్షర పరబ్రహ్మ యోగంలో క్షరమును పోగొట్టి అక్షరమును నిలబెడితే, పురుషోత్తమ ప్రాప్తియోగంలో అక్షర పరబ్రహ్మని కూడా లేకుండా చేశాము. నశించేది అనే అర్థములో క్షర అక్షర పురుషులకు అబేధమయినది. కనుక బయలే ఉన్నది. జ్ఞాన అజ్ఞానానికి అతీతమైనది, క్షేత్ర క్షేత్రజ్ఞులకు అతీతమైనది. కనుక పురుషోత్తముడే బట్ట బయలు. అదే నీవు కనుక అది పరమపదము.

**రమ్యగుణధామ భద్రాద్రిరామ పరశురామ నరసింహ్మ దాస సంరక్షితాహ్వ** ఆ గురుపరంపరను మకుటంగా పెట్టుకుని పరశురామ సీతారాముల వారు వ్రాశారు దీనిని. పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, అంతఃకరణ చతుష్టయముతో కూడిన జ్ఞాత ఒకడు, విషయములైదు, పంచ ప్రాణేంద్రియములతో కలిసి ఈ యిరువది అయిదు తత్వములు స్థూల శరీరము. తమో గుణము అన్నప్పుడు గోళకములు. ఇంద్రియములు తత్వములు అన్నప్పుడు రజో గుణము, ఇది పనిచేయడానికి అవసరమైన శక్తి పరిధి అధిష్ఠాన దేవతలు అన్నప్పుడది సత్వగుణము. మూడూ కలిపి ఒక కూటమి, ఒక త్రిపుటి.

చంద్రుడు అనేటటువంటి సత్వగుణముతో తయారైనటువంటి అధిష్ఠాన దేవత, మనసు అనేటటువంటి రజో గుణముతో తయారైనటువంటి ఆధ్యాత్మ, తమో గుణముతో తయారైనటువంటి గోళకము స్థానముగా జరిగే క్రియను ఆధి భౌతిక క్రియ అంటారు. ఆ మూడూ కలిసి పనిచేస్తాయి. ఇది త్రిపుటి. మెదడు అనే స్థూలము ద్వారా కంఠస్థానము నుండి పనిచేసే పద్ధతిగా, తమోగుణ సంబంధమైన గోళకము ఏర్పడింది. రజోగుణ సంబంధమైన మనస్సు అనే ఇంద్రియము ఆ గోళకములోనికి వచ్చి చేరింది. ఆ మనస్సేమో సత్వగుణ సంబంధమైన చంద్రుడు అనే అధిష్ఠాన దేవత ప్రేరణతో పనిచేస్తుంది. ఈ మూడు గుణముల కూటమియైన గోళకము, ఇంద్రియము, అధిష్ఠాన దేవత, ఈ మూడూ కలిసి పనిచేసే పద్ధతిలో ఒక త్రిపుటి ఉన్నది. ఎలాగంటే, తమో గుణముతో తయారైన కనుగుడ్డు అనే గోళకము, ఒక అవయవము స్థూల శరీరములో ఒక స్థానముగా వున్నది. రజో గుణముతో తయారైన చక్షురింద్రియము సత్వ గుణముతో తయారైన సూర్యుడు అనే అధిష్ఠాన దేవత, ఈ మూడూ కలిసి ఒక త్రిపుటిగా పని జరుగుతుంది. ఈ మూడూ గుణాలు ఒక స్థానమందు కలిసి పని జరపడాన్ని ఒక త్రిపుటి అంటారు.

ఇట్లా త్రిపుటులు ఎన్ని వున్నాయంటే 19 తత్వాలకి 19 త్రిపుటులు వున్నాయి. 17 తత్వాలు అనుకుంటే 17 త్రిపుటులు వున్నాయి. 17 ఇంద్రియములు 17 గోళకములలో చేరి 17 మంది అధిష్ఠాన దేవతలద్వారా ప్రేరేపించబడి త్రిపుటి వ్యవహారము జరుగుతోంది. ఈ త్రిపుటులు మూడు గుణాలచేత తయారయినవి. సత్వ గుణంచేత అధిష్టాన దేవతలు, తమో గుణం చేత గోళకములు, ఆ గోళకములను ఆశ్రయించినటువంటి ఇంద్రియములు రజో గుణముతో ఏర్పడి, ఈ మూడూ జట్లు జట్లుగా త్రిపుటులుగా వ్యవహారము జరుగుతోంది. ఈ 25 తత్వములు గోళకములైనవి. ఆధి భౌతికముగా చూస్తే స్థూల శరీరం అయింది. ఇంద్రియాల వరకు చూస్తే సూక్ష్మ శరీరం అయింది. ఆధి దైవికంగా చూస్తే అధిష్ఠాన దేవతలైనవి. ఈ అధిష్ఠా దేవతలు ఈశ్వరుని యొక్క సమష్టి ఇంద్రియాలు అయ్యాయి. ఈశ్వరుని యొక్క వ్యవహారము సమష్టి ఇంద్రియములతో నడుపుతూ వుంటే, అందులో భాగంగా సర్వ జీవులయొక్క వ్యష్టి ఇంద్రియాలు పనిచేస్తున్నాయి. అవిద్యా దోషము కలిగి వుండటం చేత జీవులు ఈశ్వర కార్యాన్ని తన సొంత కార్యంగా భావించి కర్తృత్వము భోక్తృత్వము అనేటటువంటి అభిమానము కలిగి కర్మకి బద్ధుడు అయ్యాడు. లేకపోతే ఈ జీవుడి విషయంలో కర్మ లేదు. జిల్లెళ్ళమూడి అమ్మ అంటారు **సమష్టి కర్మేగానీ వ్యష్టి కర్మ ఎక్కడుంది?** అని. వ్యష్టి కర్మ అజ్ఞానముచేత మీద వేసుకోవడమే గాని ఈశ్వరుని లీలా విలాసములో మనమంతా పావులం. ఆయన లీలావిలాసములో నేను కదలబడుతున్నాను అనుకుంటే ఇక కర్మ లేదు. నేనే కదులుతున్నాను అనే కర్తృత్వమూ దాని వలన కలిగినటువంటి అనుభవముతో భోక్తృత్వమూ వస్తే అప్పుడు జీవుడు బద్ధుడు అవుతున్నాడు. బద్ధుడు అవగానే వాడికి మోక్షము కావలసి వచ్చింది.

ఇందలి పంచ జ్ఞానేంద్రియములు పంచ ప్రాణేంద్రియములు పంచ కర్మేంద్రియములు మరియు అంతఃకరణగా వున్నటువంటి మనసు బుద్ధి కలిసి ఈ 17 తత్వములు ఆయా గోళకములయందు చేరి వర్తించుచున్నటువంటి ఇంద్రియములు, ఇంద్రియ పదార్థములు కూడి సూక్ష్మ శరీరం అయింది. ఈ తేడాలవల్ల సూక్ష్మ శరీరం అంతాకూడా రజోగుణ సృష్టి. గోళాకాలన్నీ తమోగుణ సృష్టి. తామసిక పంచభూతముల యొక్క పంచీకరణతో గోళకములు ఏర్పడితే, రాజసిక సూక్ష్మ భూతాలయొక్క పంచీకరణతో ఇంద్రియాలు ఏర్పడితే సాత్విక పంచభూతాల యొక్క పంచీకరణతో అధిష్టాన దేవతలు పుట్టారు. కనుక పంచీకరణ మూడుగా చెప్పారు. మనము గోళకముల వరకే చెప్పుకుంటున్నాము. గోళకములు వ్యవహారము చేయవు. గోళకాలలో రజో గుణ సంబంధముగా ఉత్పత్తి అయినటువంటి ఇంద్రియములు మాత్రమే వ్యవహారము చేస్తాయి. అసలు వ్యవహారము వాటిదా? అంటే వ్యవహారము చేయగలిగినటువంటి సత్తా దానిలో చేరి వుంది కాని దానిని ప్రేరేపించేటటువంటివి సత్వ గుణ నిర్మాణముగా వున్న అధిష్ఠాన దేవతలు. కనుక మూడు గుణాలు జట్టుగా త్రిపుటులుగా సర్వ వ్యవహారమూ జరుగుతుంది. అందుకని సత్వ గుణ పంచీకరణవల్ల అధిష్ఠాన దేవతలు రజోగుణ సూక్ష్మ భూతాల పంచీకరణవల్ల ఇంద్రియములు తమోగుణ సూక్ష్మ భూతాల యొక్క పంచీకరణవల్ల గోళకాలు వచ్చాయని తెలుసుకోవాలి.

కార్యరూపమైన పై రెండు శరీరములకు మూలమైన అనాది అవిద్య ఆవృతమయి కారణ శరీరము అయింది. కారణ శరీరము ఎట్లా వచ్చింది? వీటన్నింటివల్ల తాదాత్మ్యత ఎప్పుడు వచ్చిందో అదే అజ్ఞానము. తాదాత్మ్యత ఎందుకు కలిగింది? తనకు తానే లేనివాడు వున్నట్లుగా తోచాడు. ఎక్కడ తోచాడు? మాయే అలా తోపింపచేస్తుంది. మాయే లేనివాళ్ళను వున్నట్లుగా చూపుతుంది. లేని వస్తువును వున్నట్లుగా చూపిస్తుంది. లేని జీవులను ఉన్నట్లుగా చూపిస్తుంది. లేని అధిష్ఠాన దేవతలను ఉన్నట్లుగా చూపుతుంది. లేనిదని నేనంటే మీరు నమ్మాలా? ఎందుకు నమ్మాలంటే మాయ త్రిగుణాత్మికము గనుక.

సత్వగుణం వల్ల దేవతలు, రజో గుణం వల్ల ఇంద్రియాలు, జీవుడు, తమో గుణం వల్ల స్థూల సమష్టిలోనేమో ప్రపంచము, నామరూపాలు, వ్యష్టి లో దేహోపాధులు, ఆయా ఉపాధులలో ఈ పంచీకరణము ద్వారా గోళకములు, ఆ గోళకములను స్థానం చేసుకొని రజో గుణ సంబంధమైన ఇంద్రియాలు, ఇవన్నీ కూడా గుణములతోనే ఏర్పడ్డాయి కాబట్టి ఏ గుణము ఎన్ని పాళ్ళలో ఏ నిష్పత్తిలో వున్నా, ఒకటిగా వున్నా, రెండుగా వున్నా, మూడుగా వున్నా, సమానముగా వున్నా, ఎక్కువ తక్కువులుగా వున్నా, బీజావస్థలో వున్నా, సృష్టి అంతాకూడా మూడు గుణాల సృష్టే. మూడు గుణాలతో కలిపినటువంటి దానికి మాయ అని పేరు. ఈ మాయా సృష్టి అంతా కూడా కల్పితమే. మాయ అంటేనే ఏది లేదో అది వున్నట్లుగా తోపింపచేస్తుంది. అంటే జీవుడు కూడా లేనివాడే. లేని జీవుడికి లేని ప్రపంచం వున్నట్లుగా తోపింపచేస్తుంది.

ఈ మాయ లేనివి వున్నట్లు ఎందుకు చూపిస్తోంది? వున్న మాయ చూపిస్తోందా? లేని మాయ చూపిస్తోందా? వున్న మాయ చూపిస్తే అది నిజమవ్వాలి. లేనిమాయ చూపిస్తోంది కాబట్టి ఇవన్నీ కల్పితమే. మాయ యొక్క లక్షణము లేనితనము. **లేనితనమే స్వభావముగా కలిగినటువంటి మాయ వలన కలిగినవన్నీ కూడా వున్నట్లు కనిపించినప్పటికీ కూడా అవన్నీ లేనివే.** విచారించి చూస్తే లేనిదే. యా మా సా మాయ. యా అంటే ఏదైతే, మా అంటే వున్నదో, సా అంటే లేదు. ఏదైతే వున్నదో అది లేదు అని. మాయ యొక్క నిర్వచనము.

కార్య రూపమైనటువంటి ఈ రెండు శరీరాలకు మూలమైనది అనాది అవిద్య. అనాది అంటే ఆది లేనిది. అనాది అని వదిలేశారు కాబట్టి దానికి అంతం వుంది అన్నమాట. అవిద్యకు అంతం లేకపోతే మోక్షం లేదు. అవిద్యకి అంతముంది కాబట్టే అందరికీ మోక్షమనే దానికి ఒక అవకాశము వుంది. అవిద్య అనంతమనుకో, మన ఖర్మ ఇంతే. ఇలా చచ్చి పుడుతూనే వుంటాము. ఈ బాధలనుండి బయట పడలేము. అసలు మోక్షమనేది లేదు. గురువు లేడు. శిష్యుడు లేడు. విద్య లేదు, ఆత్మ విద్య లేదు, బ్రహ్మ విద్యా లేదు. మోక్షమనేది లేదు. అవిద్య అనాదే గాని, అనంతం కాదు. అంతము వుంది దానికి. అంతము వుండటముచేత సాధన చేసి గమ్యము లక్ష్యము చేరి ముక్తులు కావచ్చు. తిరిగిరాని మోక్షము పొందవచ్చు. అనాది అయిన మాయ అని ఎందుకు అన్నారు. నీవెట్లా వచ్చావు? నీవు రావడానికి ఒక కారణము వుండాలి కదా! అవిద్య కారణంగా వచ్చావు. కనుక నీవు రాకముందే అవిద్య వుంది. నీవు ఉన్నావనే యెరుక ఆది అయితే, నీకంటే ముందే వున్న అవిద్య అనాది. ఇది అందరికీ ఒకే విధంగా జరుగుతుంది. జన్మ ముందా కర్మ ముందా. ఆ సంగతి తరువాత. అందరికీ అవిద్యే కారణ శరీరముగా వుంది. అవిద్యేమో అనాదిగా వుంది. అనాది అవిద్య చేత ఆది కలిగింది. ఆదిలో జడమైనటువంటి ప్రపంచము ప్రకృతి కలిగినప్పటికీ ఏ తెలివీ లేదు. తెలివి వున్నవాడు ఎవడంటే రజో గుణ సృష్టితో తోచినటువంటి జీవుడు. వాడికి ఎరుక వున్నది కనుక వాడి ఎరుక లోనే అనాది అవిద్య కారణంగా ఈ మాయా కల్పితమంతా నిజమనిపిస్తోంది.

అనాది అవిద్యావృతము. అనాది అంటే చెప్పాము. అవిద్య అంటే చెప్పాము. ఆవృతము అంటే చెప్పాలి. అవిద్య ఆవృతమైనది. ఆవృతమంటే ఏమిటి? వృత్తము అంటే సర్కిల్. ఆవృతము అంటే ఆ సర్కిల్ లో పదే పదే తిరగటము. అంటే చక్ర భ్రమణముగా తిరగడము. చక్ర భ్రమణముగా, ఏ విధముగా తిరుగుతున్నాము? జన్మ కర్మ, జన్మ కర్మ, చావు పుట్టుకుల పద్ధతిలో తిరుగుతున్నాము. అట్లా ఒక చక్ర భ్రమణముగా ఆది అంతము లేకుండా తిరుగుతున్నాము. అలా తిరిగేటట్లు చేసేదే కారణ శరీరము.

జ్ఞాతయే కారణ శరీరము. అజ్ఞాన ఆవరణలో వున్న జ్ఞాత కారణ శరీరమయ్యాడు. పంచకోశ ధర్మాలకు వ్యతిరిక్త ధర్మముగా వున్నటువంటి జ్ఞాత అవస్థాత్రయ సాక్షిగా, తురీయంగా వున్నప్పుడు ఆ జ్ఞాతే కూటస్థుడు అవుతాడు. వీటితో కూడ వున్నప్పటికీ కూడా, వాటితో సంగత్వాన్ని గనుక వదిలితే వివేక వైరాగ్యాలతో వాటితో సంగత్వాన్ని వదిలితే, నిత్యానిత్య వస్తు వివేకముతోనూ, ఇహాముత్ర ఫలభోగ విరాగముతోటి, ఆ సంగత్వాన్ని విడిచిపెట్టిన రోజున ఆ జ్ఞాతయే కూటస్థ ఆత్మ. ప్రస్తుతానికి అజ్ఞానములో జ్ఞాత కారణ శరీరము ఒక్కటే అన్నప్పుడు ఏమైంది? సత్వగుణ అధిష్టాన దేవతలయొక్క ప్రేరణతో తమోగుణ సృష్టి అయినటువంటి గోళకములయందు ఆ స్థానములయందు చేరిన రజోగుణ సృష్టియైనటువంటి ఈ ఇంద్రియములన్నీ కూడా జ్ఞాతను అవిద్యా దోషముతో కూరుకుపోయేట్లు చేశాయి. అవిద్యా దోషముతో కారణ శరీరముతో తాదాత్మ్యత చెందినటువంటి అజ్ఞాన జీవాత్మ ఈ పంచీకరణలో వ్యవహారము చేస్తున్నాడు. ఆ వ్యవహారమునే స్తబకము అంటాము.

1. జ్ఞాత సమానవాయువుతో కూడి శ్రోత్రేంద్రియము ద్వారా శబ్దమునెరిగి వాగేంద్రియముతో వచించుట అనేది స్తబకము.

2. జ్ఞాత మనో రూపుడై వ్యాన వాయువుతో కూడి త్వగింద్రియము ద్వారా స్పర్శ నెరుగుచూ పాణీంద్రియముతో దాన ప్రతిదానమును నిర్వహించుచున్నాడు. ఇలాగే అయిదు రకాల స్తబకమున్నది.

కనుక మూడు గుణాలు అనేటటువంటిది అజ్ఞాన అవిద్యా దోషముతో వున్న జ్ఞాత కారణ శరీరములో వున్న వాసనల ప్రకారముగా ఈ 24 తత్వాలతో కూడి ఈ రకముగా చేసే వ్యవహారమును స్తబకము అంటాము.

**అపాణి పాదోహ మచింత్య శక్తిః పశ్యామ్య చక్షుః సశ్రుణోమ్య కర్ణః ।**
**అహం విజానామి వివిక్తరూపోనచాస్తి వేత్తా మమ చిత్సదాఽహమ్ ॥**

**– కైవల్యోప నిషత్**

నాకు ఏ అవయవములు లేవు. అపాణి అపాదః – చేతులు కాళ్ళు లేవు. ఆ విధముగానే పాణీంద్రియము పాదేంద్రియము కూడా లేవు. అచింత్య శక్తిః నా శక్తి అనంతము. చింతన చేయడానికి తెలుసుకోవడానికి దొరకదు. అందుబాటు కాదు. అలాగే అన్ని ఇంద్రియములు, వాటి వ్యవహారము నాకు లేదు. నేను విలక్షణమగుటచేత కళ్ళు లేకుండా చూస్తున్నాను. **పశ్యామ్య చక్షుః** – పశ్యామ్య అంటే చూడటం. అచక్షుః కళ్ళు లేకుండా చూస్తున్నాను. చెవులు లేకుండానే వింటున్నాను. నాకు ఏ రూపమూ లేదు. నాకు సర్వమూ తెలుసు. నేను నిత్యశుద్ధ జ్ఞానశక్తిని. జ్ఞానానంద స్వరూపుడను. నిజానికి జ్ఞాత ఎవరంటే కారణ శరీరంతో తాదాత్మ్యత లేకుండా, 24 తత్వములకు సాక్షియై విలక్షణమై వున్నటువంటి జ్ఞాత 24 తత్వములతో కూడనివాడు. వాటితో కూడనప్పటికీ కూడా, చేతులు లేకుండానే పనిచేసేవాడు. కాళ్ళు లేకుండానే నడిచేవాడు. కళ్ళు లేకుండానే చూసేవాడు, చెవులు లేకుండా వినేవాడు, ఆ మాదిరిగా ఉన్న ప్రజ్ఞా స్వరూపుడు జ్ఞాత. జ్ఞాతయే ప్రజ్ఞ. ఆ ప్రజ్ఞయే బ్రహ్మ. ఆ ప్రజ్ఞయే నిత్యము. ఆ ప్రజ్ఞయే త్రిగుణ రహితమైనటువంటి శుద్ధము. ఆ ప్రజ్ఞయే జ్ఞానమనే జ్యోతి. ఆ ప్రజ్ఞయే జ్ఞానానంద స్వరూపము. 24 తత్వాలతో కలవకపోతే వాడు ఆనంద స్వరూపుడు. కూటస్థ ఆత్మే ఆనంద స్వరూపుడు.

అయితే ఇక్కడ తమాషాగా చెప్తున్నారు. కళ్ళు లేకుండా చూస్తున్నాడు. చెవులు లేకుండా వింటున్నాడు. ఇటువంటివన్నీ పూర్వ జన్మ సంస్కారాలు వుంటే మొదట్లో కళ్ళు వుండి ఆ తరువాత ఏ కారణం చేతమైనా కళ్ళు పోతే ప్రపంచాన్ని ఊహలో చూస్తాడు. మధ్యలో చెముడు వస్తే ఊహలో శబ్దాలు వింటాడు. అట్లాగే పంచజ్ఞానేంద్రియాల విషయ జ్ఞానాన్ని ఆ ఇంద్రియాలు కొంతకాలముండి మధ్యలో పోతే ఆ అనుభవమును అతడు గ్రహించగలుగుతాడు. అతనికి మొదలే ఈ ఇంద్రియములు పనిచేయకపోతే పుట్టుకతోనే జ్ఞానేంద్రియాలు పనిచేయకుండా పుట్టాడే అనుకోండి, వారికి శబ్ద స్పర్శ రూప రస గంధ జ్ఞానం వుండదు. కాని వాడిలో జ్ఞాత వున్నాడు. ఆ జ్ఞాత చూడడు, వినడు, వాసన చూడడు, స్పర్శ నెరుగడు, రుచి చూడడు, ఈ అయిదు విషయముల యొక్క ఎరుక లేకపోయినా వాడు వుంటున్నాడు. ఆ ఎరుక పేరే **"ఎరిగే ఎరుక".** ఎరిగే ఎరుక వుంది గాని ఏమీ ఎరుగడు. ఎరిగే ఎరుక ఏమీ ఎరగనప్పటికీ జ్ఞానేంద్రియాలు పనిచేస్తే ఏ విషయాల వరకు అతను పరిమితమైనటువంటి ప్రారబ్ధమును కలిగివున్నాడో ఆ విషయజ్ఞానము వరకు అతను పరిమితమై వుండి ఆ విషయముల వరకే పెంచుకుంటూ వుంటాడు. అందుకని విషయాల వరకే అయితే జీవుడు, కించిజ్ఞుడు అనబడతాడు.

సర్వజ్ఞుడు ఎవరయ్యా అంటే ఇవన్నీ తెలుసుకోనివాడు సర్వజ్ఞుడు అనిపించుకుంటున్నాడు. ఏమీ తెలుసుకోనివాడు సర్వజ్ఞుడు ఎట్లా అయ్యాడు? సర్వమును తెలుసుకునేటటువంటి సామర్థ్యము వున్నా, ఏమీ తెలుసుకోడు. ఒక సాధకుడు ఆ సర్వజ్ఞత్వానికి వెళ్ళినపుడు (వెళ్ళాలి అంటే) విషయాలను నిర్విషయము చేసుకున్నప్పుడే కదా వాడు వెళ్ళింది! వాసనా క్షయము అయినప్పుడే కదా వాడు సర్వజ్ఞుడు. సర్వజ్ఞత్వము వున్నాగాని, ఏ విషయమూ తెలుసుకోడు. నీవు సర్వజ్ఞుడవు కదా, నీకు తెలియనిది ఏముంది అంటాము. ఆ సర్వజ్ఞత్వ స్థితిలో అతడేమీ తెలుసుకోడు. అయితే శిష్యుడు ఆ సర్వజ్ఞత్వంగా వున్నటువంటివాడిని అటువంటి గురువును, పెద్దలను మేల్కొల్పితే ఆ ప్రజ్ఞగా వాడు సర్వవ్యాపకమైతే, అపుడు శిష్యుడు ఏ విషయంమీద గురువును ప్రశ్నిస్తున్నాడో ఆ విషయం దగ్గరకు భూతకాలంలోకి గాని, భవిష్యత్ కాలంలోకిగాని, ఎంత దూరంగా వున్నా గాని గురువుయొక్క ప్రజ్ఞ వ్యాపిస్తుంది. శిష్యుడు వేసిన ప్రశ్నకు గురువు దగ్గర తత్ క్షణంలోనే అది ప్రజ్ఞ ద్వారా తెలియబడుతుంది. అంటే పరిమితముగా వున్నటువంటివాడికి కించిజ్ఞత్వములో ఇవన్నీ తెలియవు. వర్తమానమే అనుభవములో తెలుస్తుంది. కించిజ్ఞత్వము పరిమితత్వం లేకుండా వున్నటువంటివాడు వ్యాపకమైనప్పుడు చోటుకు కాలానికి అతీత స్థితిలో ఏ వస్తువు దగ్గరకైనా వ్యాపించి ఆ వస్తువుయొక్క జ్ఞానాన్ని కలిగి వుంటాడు. ఆ వస్తువు తెలియబడుతుంది. ఆ సంఘటన తెలియబడుతుంది. ఈ ప్రజ్ఞని **ఋతంభర ప్రజ్ఞ** అంటారు. అది ఎప్పుడూ వుండదు.

సర్వజ్ఞుడు అంటే లోకంలోని లక్షలాది కోట్లాది విషయాలని ఒకేసారి తెలుసుకుంటాడని కాదు. అలా ఒకేసారీ తెలుసుకుంటే వాడు పిచ్చెక్కిపోతాడు. ఒకటి తరువాత ఒకటి తెలుసుకుంటే పర్వాలేదు. సామర్థ్యము వుంది గాని వినియోగించడు. సర్వజ్ఞత్వము వుంది గానీ తాను వాటికి సాక్షి కూడా కాదు. ఎవరైనా కదిలిస్తే, గురువుని శిష్యుడు ఆ విషయం దగ్గరకు లాగితే లాగబడ్డప్పుడు అంతవరకే తెలియబడుతుంది. విడివిడిగా అయితే ఏదైనా తెలియబడుతుంది. తెలియబడేటటువంటి ప్రక్రియ బయట ఏదైనా వుండాలి. శిష్యునియొక్క శరణాగతినిబట్టి శిష్యుడు గురువులో మమైకమయ్యేటటువంటి నాలుగు విధముల శుశ్రూషను బట్టి, గురువుకు ఆ శిష్యునియందు కృప కలిగినప్పుడు, ఆ కరుణా కటాక్ష వీక్షణంచేత శిష్యునికి అవసరమైనంత మేరకు అతనికి

తెలియబడుతుంది. శిష్యునికి అవసరమైనంత మేరకు జ్ఞాన స్వరూపుడైన గురువు శిష్యునిలోనికి వ్యాపిస్తాడు. జ్ఞాన స్వరూపము శిష్యునిలోకి వ్యాపించగానే అదే జ్ఞానం శిష్యునికి సంక్రమిస్తుంది. అదే **గురోరుచ్ఛిష్ట భోజనం**. గురువు భోజనం చేసి ఎంగిలి చేసి తన అనుభవంలో వున్నదానిని శిష్యునిలోనికి ప్రవేశపెడితే అదే అనుభవము శిష్యుడు కూడా పొందితే ఆ అనుభవాన్ని గురోరుచ్ఛిష్ట భోజనము అంటారు. ఇక్కడ భోజనము అంటే బ్రహ్మానుభవము.

నేను నిత్య శుద్ధ జ్ఞాన జ్యోతిని. అంటే అది లక్షణము. సర్వమూ తెలుసు నాకు అంటే తెలుసు కాని తెలుసుకొనడు. సర్వమూ తెలుసుకునే సర్వజ్ఞత్వ స్థితి వుంటుంది కాని ఏమీ తెలుసుకొనడానికి అవన్నీ అతడికి లేవు. తెలుసుకోవడమనేది ఎలా జరుగుతుంది అంటే ఏదైనా వస్తువు మీద ఆసక్తి వున్నప్పుడే దానిని తెలుసుకుంటాడు. ఆసక్తి – అంతకు ముందు తెలుసుకున్నటువంటి అనుభవ జ్ఞానము వాసనా రూపంగా వుంటే ఆ వాసన యొక్క ప్రేరణ చేతనే తెలుసుకుంటాడు. వాసనా రూపములో అంతకు ముందు తెలుసుకున్న దానినే మరలా తెలుసుకుంటారు. తెలుసుకున్నది వాసన అయితే వాసన ప్రేరణతో మళ్ళీ తెలుసుకుంటాడు. మరి ఏ వాసనా లేనివాడు ఏమి తెలుసుకుంటాడు? ఏ వాసనా లేకుండా చేసుకున్నప్పుడు అన్నీ తెలుసుకొనడము మానినప్పుడు, అప్పుడు సర్వజ్ఞుడయ్యాడు. తెలుసుకుంటే మళ్ళీ కించిజ్ఞుడవుతాడు. తెలుసుకోవడానికి కారణం వాసన, విషయాసక్తి. **బంధాయ విషయాసక్తం ముక్తై నిర్విషయం స్మృతః** – విషయం మీద ఆసక్తి వుంటే తెలుసుకుంటాడు. ఆసక్తి వున్నప్పుడు ఆ వాసన వలన అదే అనుభవం మళ్ళీ వస్తూ వుంటుంది. వాడప్పుడు సర్వజ్ఞుడు ఎట్లా అవుతాడు? ఎన్ని తెలుసుకున్నా అన్నీ వాసలే అయినప్పుడు సర్వజ్ఞుడు కాడు. ఏమీ తెలుసుకొననప్పుడే సర్వజ్ఞుడు అయ్యాడు. నిర్విషయము, నిర్వాసన అయినప్పుడే సర్వజ్ఞుడు అయ్యాడు. సర్వజ్ఞునికి తెలుసుకొనవలసినది ఏదీ లేదు. వాడికి తెలుసుకోవలసినది ఏదీ లేదు. వాడిని తెలుసుకునేవాడు ఇంకొకడు లేదు. వాడే పరబ్రహ్మ.

**గుణత్రయవిభాగ పంచదశ సూక్ష్మ పంచీకరణము:**

పైన చెప్పాము సత్వగుణముచేత పంచీకరణ, రజో గుణముచేత పంచీకరణ, తమో గుణముచేత పంచీకరణ, తమో గుణమువల్ల గోళకాలు వచ్చాయనేది ప్రక్కన పెడితే

1. తమోగుణాకాశము యొక్క సత్వగుణ భాగము శ్రోత్రేంద్రియమయింది. తమోగుణాకాశము యొక్క తమోగుణ భాగము శబ్దమయింది. తమోగుణాకాశము యొక్క రజోగుణ భాగము వాక్కు అయింది.

2. తమోగుణ వాయువు యొక్క సత్వగుణ భాగము త్వగింద్రియమైనది. తమోగుణ వాయువు యొక్క తమోగుణ భాగము స్పర్శ అనే విషయమైనది. తమోగుణ వాయువు యొక్క రజోగుణ భాగము పాణీంద్రియమైనది.

3. తమోగుణ అగ్నియొక్క సత్వగుణ భాగము నేత్రమైనది. తమోగుణ అగ్నియొక్క తమోగుణ భాగము రూపమైనది. తమోగుణ అగ్నియొక్క సత్వగుణ భాగము పాదేంద్రియమైనది.

4. తమోగుణ జలము యొక్క సత్వగుణ భాగము జిహ్వేంద్రియమైనది. తమోగుణ జలము యొక్క తమోగుణ భాగము రసమయినది. తమోగుణ జలముయొక్క రజోగుణ భాగము గుహ్యేంద్రియమైనది.

5. తమోగుణ ప్రృథివి యొక్క సత్వగుణ భాగము ఘ్రాణేంద్రియమైనది. తమోగుణ పృథివి యొక్క తమోగుణ భాగము గంధమైనది. తమోగుణ పృథివి యొక్క రజోగుణ భాగము గుదము అయినది.

ఈ విధముగా తమోగుణ పంచభూతాల వలన సత్వగుణ భాగములు జ్ఞానేంద్రియములైనవి. తమోగుణ భాగములు విషయేంద్రియములైనవి. రజోగుణ భాగములు కర్మేంద్రియములైనవి.

దీనినే త్రివృత్కరణము అందురు. మూడు గుణాలతో అయింది కాబట్టి త్రివృత్కరణము. ఇది పంచీకరణమందే అంతర్భాగమై వున్నది. పంచీకరణ అంతా మూడు గుణాలతో మొదట్లో చెప్పుకున్నాము. దాంట్లోనే మళ్ళీ తమోగుణంలో సత్వ గుణం, తమోగుణంలో రజో గుణం, తమోగుణంలో తమో గుణం ఇక్కడ చెప్పుకున్నాము. కనుక ఈ గుణాలు మాయ యొక్క వికృతమైనటువంటి వ్యాపకత్వములో సంయోగ వియోగ పద్ధతిలో పెరుగుతోంది, తరుగుతోంది. ప్రపంచమంతా మాయ మయమే, త్రిగుణాత్మకమే.

**సూక్ష్మ శరీర వ్యవహారము :** నిజానికి జ్ఞాతయే కూటస్థుడు. కూటస్థుడు అంటే కదలనివాడు. జ్ఞాత అంటే ఏదైన తెలుసుకోగలిగినటువంటి జ్ఞానమున్నవాడు. ఏదైనాసరే ఎరుక కలిగినటువంటి ఎరిగే ఎరుకగా ఉన్నవాడే జ్ఞాత. ఎరిగే ఎరుకతో ఏదైనా తెలుసుకునే సామర్థ్యము ఉన్నవాడు జ్ఞాత. ఆ జ్ఞాత నిజానికి కదలడు. అందువల్ల వాడు కూటస్థుడు. కూటస్థుడు అను పేరు ఎందుకొచ్చింది? బంగారాన్ని ఎలాగైతే కంసాలి బత్తుడు అనేక ఆభరణాలుగా చేస్తాడో అప్పుడు ఆభరణాలకు సుత్తి దెబ్బలు కొడుతున్నప్పుడు ఆ బంగారు ఆభరణాలకు దానియొక్క ఆకారము, మార్పు చెందుతున్నది. ఆభరణము తయారుకాక ముందున్న ఆకారము, తయారైపోయిన తరువాతున్న ఆకారములలో తేడాని వికారము అందురు. కనుక ఆభరణాలు తయారయ్యేటువంటి క్రమంలో, అది వికారము చెందుతుంది. ఇదంతా డాగలిమీద జరుగుతున్నది. దేనిమీద వికారము చెందుతున్నాయో, ఆ డాగలి మాత్రం కదలకుండా ఉంది. ఆభరణానికి అంటకుండా ఉన్నది. దానిమీదే ఆభరణాలు తయారవుతున్నాగాని, ఈ ఆభరణాలు నామీద తయారవుతున్నాయనేటటువంటి జ్ఞానము దానికి లేదు. అది కదలకుండా అంటకుండా అట్లానే వుంది. ఆ ఆభరణాలు దానిమీద పెట్టినా పెట్టకపోయినా దానిమీద సుత్తిదెబ్బలు కొట్టినా, కొట్టకపోయినా, ఆ ఆభరణాలయొక్క ఆకారము మారిపోయి వికారము చెందుతున్నా కూడా, ఆ డాగలికి ఎటువంటి సంబంధము లేకుండా ఎటువంటి కదలిక లేకుండా, ఎటువంటి సంగత్వము లేకుండా ఎలాగైతే ఉన్నదో, ఈ జ్ఞాత కూడా అలాగే ఉన్నాడు.

కాని కూటస్థుడు అంటే అర్థం ఏమిటి? ఆ బంగారము ఆభరణముగా మారేదంతా ఆ డాగలిమీద జరుగుతుంది కదా. అక్కడ సుత్తి, ఉలి ఆడుతుంది కదా? దెబ్బలున్నాయి కదా. కొట్టేటటువంటి కంసాలిబత్తుడు ఉన్నాడు కదా? ఇంతమంది మధ్యలో కూడా ఆ డాగలి కదలకుండా ఉంది. అంటే రెచ్చకొట్టినా గాని స్పందించకుండా ఉన్నది. అలాగ అన్నిటిమధ్య ఉండి అన్నిటిచేత కూడా కదిలింపబడుతున్నప్పటికి, తానుమాత్రం కదలనివాడు కూటస్థుడు. కూటములో ఉన్నవాడు కూటస్థుడు.

ఇక్కడ కూటమి అంటే ఏమిటి? 3 గుణాలతో తయారైనటువంటి త్రివృత్కరణమందు, పంచభూతాలతో తయారైనటువంటి 25 తత్వాలయందు, ఈ 25 తత్వాలలోతనుండి జ్ఞాతను వేరుచేస్తే, మిగతా 24 తత్వాలతో కూడినటువంటి కూటమిలో ఉన్న జ్ఞాత కూటస్థుడై ఉన్నాడు. ఈ కూటమిలో కదలకుండా ఉన్నాడు. కాని అజ్ఞానంచేత ఈ కూటమితో తాదాత్మ్యత చెంది ఉన్నాడు. తాదాత్మత చెంది ఉండటమే అజ్ఞానం. తాదాత్మ్యత లేకుండా విడివడి కూటస్థుడిగా ఉండటమే జ్ఞానము. మనమెట్లా ఉన్నాము? ఈ 24 తత్వాలతో కలిసిపోయి తాదాత్మ్యతచెంది వాటికి నీకు ఏ భేదం లేనట్లుగా ఉన్నాము. ఆ ఇంద్రియాలు, ఆ విషయాలే నీవైనట్లుగా నువ్వు ఆ విషయాకారము పొందుతూ ఏ విషయముతో నువ్వు సంపర్కము పెట్టుకున్నావో, అట్టి విషయంతో విషయాకారమై పోయేటటువంటి పరిస్థితిలో ఉన్నాము. దీనిని అజ్ఞానం అన్నాము. రెండు అర్థాలు చెప్పాము కూటస్థుడికి. 24 తత్త్వములలో కలిసిపోయి ఉన్నవాడు కూటస్థుడు. కలిసికూడా విలక్షణంగా ఉన్నవాడు కూటస్థుడు. అంటే 24 రకాలుగా నిన్ను కదలిస్తూ ఉంటే వాటి కారణంగా నువ్వు కదలకుండా నువ్వు మాత్రం కదలకుండా ఉంటే నువ్వు ఆ 25వ వాడివి, కూటస్థుడివి. కూటమిలో ఉండి కూడా కూటమితో అసంగంగా ఉండటము కూటస్థము. కాబట్టి కూటస్థుడు అంటే కూడీ కూడనివాడు. కర్మలు చేసి కూడా చెయ్యనివాడే. ఇంద్రియములతోటి విషయములను గ్రహించికూడా గ్రహించనివాడే, మనసులో ఆలోచించి కూడా, ఆలోచించనివాడే. ఎందుకంటే జ్ఞాత మనోరూపుడైతే అజ్ఞాని. జ్ఞాత మనస్సుకు విలక్షణమైనప్పుడు జ్ఞాని. జ్ఞానమగు జ్ఞాత కూటస్థుడే. ఈ జ్ఞాత గురుమూర్తి అను అధిదేవతచేత ప్రేరేపింపబడి వ్యవహరిస్తున్నాడు. ఈ వ్యవహారము పేరే స్తభకము అంటారు. అది ఎలాగంటే

(1) జ్ఞాత అనువాడు గురుమూర్తి అను అధిష్ఠాన దేవతచేత ప్రేరేపింపబడి, సమాన వాయువుతో గూడి, శ్రోత్రేంద్రియము ద్వారా శబ్దములను గ్రహించుచు, వాగింద్రియముతో వచించుచున్నాడు.

(2) జ్ఞానమగున జ్ఞాత మనోరూపుడై చంద్రుడనేటటువంటి అధిష్ఠాన దేవతయొక్క ప్రేరణచేత వ్యాన వాయువుతో కూడి త్వక్ ఇంద్రియము ద్వారా స్పర్శలను గ్రహించుచూ, పాణీంద్రియము ద్వారా దానప్రతిగ్రహణములను చేయుచున్నాడు.

(3) జ్ఞాత బుద్ధి రూపుడై బృహస్పతి అనే అధిష్ఠాన దేవతచేత ప్రేరేపింపబడి ఉదాన వాయువుతో కూడి చక్షురింద్రియము ద్వారా రూపములను గ్రహించుచు, పాదేంద్రియముతో గమనాగమనములు చేయుచున్నాడు.

(4) జ్ఞానమను జ్ఞాత చిత్తరూపుడై క్షేత్రజ్ఞుడు అనే అధిదేవతచేత ప్రేరేపింపబడి ప్రాణవాయువుతో కూడి జిహ్వేంద్రియము ద్వారా రసములను గ్రహించుచు గుహ్యేంద్రియముతో ఆనందించుచున్నాడు.

(5) జ్ఞానమగు జ్ఞాత అహంకార రూపుడై రుద్రుడు అనే అధిదేవతచేత ప్రేరేపింపబడి అపాన వాయువుతో కూడి ఘ్రాణేంద్రియముతో గంధములను గ్రహించుచు, పాయురింద్రియముతో మలమును విసర్జించుచున్నాడు.

ఇలా క్లుప్తంగా చెబితే మీకు కొంత అర్థం అయ్యింది. దీన్ని క్లిష్టంగా చెయ్యాలి. ఎందుకంటే జ్ఞానమగు జ్ఞాత అన్నప్పుడు ఏం చెప్పాడు? గురుమూర్తి అను అధిదేవత ప్రేరణతో అన్నాము. జ్ఞాత మనోరూపుడైనపుడు ఏం చెప్పాడు? చంద్రుడనేటువంటి అధిష్ఠాన దేవతతో ప్రేరేపింపబడి ఉన్నాడు అన్నాము. బుద్ధిరూపుడైనపుడు బృహస్పతి చేత ప్రేరేపింపబడినటువంటి జ్ఞాత సమాన వాయువుతో కూడాడు. సమాన వాయువుతో కూడినపుడు అక్కడకూడా ఒక ప్రేరణ ఉంది. సమాన వాయువుయొక్క అధిష్ఠాన దేవత అయిన జయుడు యొక్క ప్రేరణచేతనే సమాన వాయువుతో కూడి శ్రోతేంద్రియము ద్వారా, మళ్ళీ శ్రోతేంద్రియమునకు అధిష్ఠాన దేవత ఎవరు? అష్ట దిక్పాలకులు. అష్ట దిక్పాలకులు అనే అధిష్ఠాన దేవతయొక్క ప్రేరేపణగా పనిచేసేటువంటి శ్రోతేంద్రియము ద్వారా అనాలి. శబ్దమును గ్రహించెను. శబ్దము ఎలా వచ్చింది? అక్కడ సదాశివుడు అనేటువంటి అధిష్ఠాన దేవతయొక్క ప్రేరణగా శబ్దము అనే విషయము ఏర్పడగా అట్టి శబ్దమును గ్రహించుచూ, వాగీంద్రియముతో పలుకుచూ అనగానే, వాక్కుచేత ఊరికే పలుకుతాడా? వాగీంద్రియమునకు అధిష్టాన దేవతయైన అగ్ని దేవుడు (వహ్ని) ప్రేరణచేత వాగీంద్రియముతో పలుకుతున్నాడు అని చెప్పాలి. ఎంత క్లిష్టమైందో చూడండి. దీన్ని మరల చెబుతున్నారు చూడండి.

జ్ఞానమను జ్ఞాత గురుమూర్తి అను అధిష్ఠాన దేవతయొక్క ప్రేరేపణతో, మనోరూపుడై చంద్రుడనే అధిష్ఠాన దేవతచేత ప్రేరేపింపబడి, తరువాత వ్యాన వాయువు యొక్క అధిష్టాన దేవత అయిన విశ్వయోని యొక్క ప్రేరణచేత పనిచేసేటువంటి వ్యాన వాయువుతో కూడి, వాయు దేవుడు అనే అధిష్ఠాన దేవతచేత ప్రేరేపింపబడిన త్వగింద్రియము ద్వారా ఈశ్వరుడు అనేటువంటి అధిష్ఠాన దేవత ప్రేరేపణ ద్వారా ఏర్పడినటువంటి స్పర్శను తెలుసుకుంటూ ఇంద్రుడు అనేటువంటి అధిష్టాన దేవతయొక్క ప్రేరేపణచేత పాణీంద్రియము ద్వారా దాన ప్రతిగ్రహణములను చేయుచున్నాడు.

ఇంత ఉంది అక్కడ. ఆ స్తబకములో ప్రతిచోట కూడ పంచ ప్రాణాలు పని చెయ్యనివ్వండి. జ్ఞానేంద్రియాలు పనిచేయనీయండి. కర్మేంద్రియాలు పనిచేయనీయండి. వాటివాటి యొక్క అధిష్టాన దేవతలయొక్క ప్రేరణ అక్కడ ఉన్నది. అంత దీర్ఘముగా మొదటిది చెప్పేసి వదిలివేస్తున్నారు. మిగతాచోట కూడా అలాగే చెప్పుకోవాలి. అంతా కలిపి ఒకే వాక్యంలో చెప్పాలంటే, జ్ఞాతత కూడి అంతఃకరణ చతుష్టయము, వాటియొక్క అధిష్ఠాన దేవతల ప్రేరణతో, పంచ ప్రాణములను కూడి, పంచ జ్ఞానేంద్రియములద్వారా విషయ పంచకము నెరుగుచూ, పంచ కర్మేంద్రియములద్వారా కర్మలను చేయుచున్నాడు. ఇలా అంటే సరిపోతుంది.

జ్ఞాతను, విషయములను విడచి, 19 తత్వములే సూక్ష్మ శరీర తత్వములనబడును. కొందరు 17 తత్వములే సూక్ష్మ శరీరమనెదరు. జ్ఞాతను ప్రక్కనపెట్టండి. ఎందుకని? జ్ఞాతలో ఉండేటటువంటి ఎరిగే ఎరుకే 24 తత్వాల్లో వ్యాపించి ఉన్నది. వ్యాపించినప్పటికి ఆ 24 తత్వాలతో తాదాత్మ్యత చెందినపుడు వాడికి అజ్ఞానం ఆవరించి ఉన్నది. అజ్ఞానానికి విడుదలకోసం ఆవరణ తొలగించుకోవడం కోసం 24 తత్వాల నుండి వేరుపడే అవకాశం ఉంది కనుక, నిజానికి వేరుగానే ఉన్నాడు. కనుక విచారించి చూస్తే జ్ఞాత కూటస్థుడై వేరుగానే ఉన్నాడు. ఆ జ్ఞాతను ప్రక్కన పెడితే, వ్యవహారం చేసే మిగతా 24 తత్వాలలో ఆ జ్ఞాతయొక్క వ్యాపకము వాటిలో లేకపోతే, అవి నిష్క్రియమే.

శ్రోతేంద్రియమునకు వాగేంద్రియమునకు మైత్రి కలదు. ఎందుకని శబ్దముచేస్తేనే శ్రోతేంద్రియము శబ్దాన్ని వింటోంది. వాగేంద్రియము శబ్దాన్ని చేస్తోంది. ఆ రెండింటికి మైత్రి ఉంది. శ్రోత్రము శబ్దమును వినుచున్నది. వాక్కు శబ్దమును చేయుచున్నది. త్వగింద్రియమునకు పాణింద్రియమునకు మైత్రి కలదు. త్వక్కు స్పర్శగుచున్నది. పాణి దానిని నిర్వాహణము చేయుచున్నది. ప్రేమగా నిమిరినపుడు, ఆ చేత్తో చర్మము మీద గట్టిగా దెబ్బ కొట్టినపుడు ఆ చర్మానికి ఆయా స్పర్శల ద్వారానే ఎరుగబడింది. వేడిగా ఉన్నదో లేదో చెయ్యి పెట్టి చూస్తాము. కనుక పాణీంద్రియమునకు, త్వగింద్రియమునకు మైత్రి ఉంది. స్పర్శ ద్వారా మైత్రి ఉంది.

చక్షురింద్రియమునకు పాదేంద్రియమునకు మైత్రి కలదు. చక్షువు రూపమును గ్రహించుచున్నది. పాదము ఆ రూపముల వద్దకు తనను తీసుకొని వెళ్తుంది. జిహ్వేంద్రియము రసమును గ్రహించి ఆనందించును. గుహ్యేంద్రియము శృంగార రసమును గ్రహించి ఆనందించును. ఈ విధముగా రెండింటికిని మైత్రి కలదు. అన్ని ఇంద్రియములను జయించినప్పటికీ, జిహ్వోపస్థలను జయించుట కష్టము.

ఘ్రాణేంద్రియమునకును పాయురింద్రియమునకు మైత్రి కలదు. దుర్గంధమైన ఆహారము భుజించిన, విసర్జనలో ఇబ్బంది కలుగును. ఏదైనా వాసనచూచి ఇష్టమై తిన్నదే సక్రమముగా జీర్ణమగును. పశువులు వాటి ఆహారము విషయములో వాసనమీద ఆధారపడి యుండును. ఈ విధముగా జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములకు మైత్రి కలదు. ఈ సంబంధములన్నీ మూడు గుణముల మైత్రివలన కలుగుచున్నది. కావున పంచీకరణము, త్రివృత్కరణము, వాటి సమష్టి వ్యవహారములతో మూడు గుణముల ప్రమేయము వ్యాకపమై ఉన్నది. ఈ విచారణ వలన కూటస్థుడు విలక్షణుడని తేలుచున్నది.

## పిండాండ పంచీకరణము

### <u>పిండాండ సృష్టి నిర్ణయము</u>

1. పంచ భూతములనుండి స్థూల శరీరములు కలిగెను.
2. పంచ తన్మాత్రలనుడి ఇంద్రియములు కలిగెను.
3. పంచ శక్తులనుండి జీవుడు ఏర్పడెను.
4. పంచ బీజములనుండి ప్రాణము ఏర్పడెను.
5. పంచాధి దేవతలనుండి ప్రత్యగాత్మ కలిగెను.

ఈ పిండాండ పంచీకరణ ఎలా జరిగిందో చూడండి.

బ్రహ్మాండ సృష్టి దగ్గరకు వెళ్తేగాని దేని కారణంగా దేనినుండి ఏది వచ్చి ఏది అయ్యింది అని తెలియదు. మన స్థూల దేహము ఉంది. అది పంచభూతాల వలన, సప్త ధాతువుల రూపంగా తయారైయింది. రక్తము, మాంసము, ఎముకలు, మూలిగ, చర్మము, మెదడు, రసములు. ఇవన్నీ పంచ భూతములు. కాని అలా కనబడట్లేదు. ఏమిటి అంటే, ఆకాశమునుండి వాయువు వచ్చి వాయువులో ఆకాశ గుణము, వాయువు యొక్క గుణము రెండు ఉండి, వాయువు నుండి అగ్ని వచ్చి అగ్నిలో 3 గుణాలు ఉండి, జలము వచ్చి అందులో 4 గుణాలు ఉండి, పృథ్వి వచ్చి అందులో 5 గుణాలుండి పృథ్వికి సంబంధించినటువంటి 5 గుణాలతో పదార్థముగా చూస్తే ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి ఈ ఐదు భూతాలయొక్క తత్వాలు మన శరీరమందున్నాయి.

ఆకాశ తత్వములో ఆశ, మోహము, భయము లాంటివి ఉన్నాయి. వాయు తత్వములో ప్రాణముల చలనము, ఇంద్రియముల చలనము, శరీరము యొక్క చలనము ఉన్నవి. అగ్ని తత్వములో జ్ఞానేంద్రియాలు పనిచేస్తున్నాయి. ఆకలి, దప్పిక, సంగమము, నిద్ర ఇవన్నీ కూడా అగ్ని తత్వము. చెమట, రక్తము, మూత్రము, ఇవన్నీ జలతత్వము. కఠినంగా ఉండేటటువంటి ఎముకలు, నఖములు, వెంట్రుకలు, మాంసము ఇవన్నీ పృథ్వీతత్వము. అవే వచ్చినాయని ఎట్లా చెప్తారు? ఆకాశమునుండి క్రమంగా దిగివచ్చిన వాటినుంచి ఆ 5 కలిసిన పృథ్వినుండి ఓషధులై, ఈ ఓషధుల నుండి అన్నము వచ్చి, అన్నమువల్ల శుక్ల శోణితములు వచ్చి వాటియొక్క కలయికతో ఈ పిండమనేదది ఏర్పడినది. కనుక తప్పకుండా ఈ పిండమంతా కూడా పంచ భూతాత్మకమే. అందువల్ల పంచభూతములనుండి స్థూల శరీరము కలిగెను.

**పంచ తన్మాత్రలనుండి ఇంద్రియములు కలిగెను.** రజోగుణ సంబంధ ఇంద్రియాలన్నీ కూడా పంచ తన్మాత్రలచేత కలిగినవి. తమోగుణ పంచ భూతములనుండి స్థూల శరీరములు వచ్చాయి. రజోగుణ పంచతన్మాత్రల నుండి ఇంద్రియాలు వచ్చాయి. సత్వగుణ పంచ శక్తులనుండి జీవుడు ఏర్పడెను. ఈ పంచశక్తులు (1) పరాశక్తి (2) ఆదిశక్తి (3) జ్ఞాన శక్తి (4) ఇచ్ఛాశక్తి (5) క్రియాశక్తి. ఈ 5 పంచశక్తులే మాయా శక్తులు. ఈ మాయా శక్తులచే లేని జీవులు ఉన్నట్లుగా జీవభావంతో తయారయినారు.

ఈ పంచశక్తులే అధిష్ఠాన దేవతలుగా చెప్పినప్పుడు సత్వగుణము. పంచ తన్మాత్రలుగా వచ్చినపుడు రజోగుణము. ఏమిటి ఆ పంచ తన్మాత్రలు? శబ్ద, స్పర్శ, రూప, రస గంధ గుణములు. అంటే వ్యవహారము కంటే విషయములకంటె ముందు గుణములు ఏర్పడ్డాయి. ఇది ఒకటి గమనించాలి. శబ్ద గుణము ఉన్నది. కాని శబ్ద విషయము లేదు. శబ్ద విషయము కావాలంటే శబ్దము చేసే వస్తువు సృష్టించబడాలి. శబ్దాన్ని గ్రహించేటువంటి శ్రోతేంద్రియము కూడా సృష్టించబడాలి. అక్కడ త్రివృత్కరణము జరగాలి. ఆ జ్ఞాత అనేటువంటి ఎరుక పంచీకరణలో మిగతా 24 తత్వాల్లోకి వ్యాపించాలి. అపుడు ఆ జ్ఞాత మనోరూపుడై, ఆ రూపుడై, ఈ రూపుడై పంచ ప్రాణులయొక్క సత్తాతో కూడి పంచ జ్ఞానేంద్రియముల ద్వారా ఈ పంచ విషయాలను గ్రహించగలిగే ఏర్పాటు జరిగినపుడు మాత్రమే అది విషయమైనది. అంతవరకు అది తన్మాత్రగా ఉన్నది.

అలాగే నేను నేననే జీవాహంకారము రాకముందు సమష్టితో ఈశ్వరాహంకారముగా ఉన్నది. అంతకుముందు మహదహంకారము అనే తత్వముగా ఉంది. సృష్టిలో ఏదైనా తీసుకుంటే ముందు తత్వరూపములో ఉంది. తరువాత శక్తి రూపములో ఉంది. తరువాత వ్యవహార రూపంలో ఉంది. 'నేను' తీసుకుంటే తత్వ రూపంలో ఉన్నప్పుడు మహదహంకారముగా ఉంది. శక్తి రూపంలో ఉన్నప్పుడు ఈశ్వరుడుగా ఉంది. అధిష్ఠాన దేవతా రూపంలో ఉన్నవన్నీ ఈశ్వరునికి ఇంద్రియాలు అయినాయి. నేను సమష్టి రూపం ఈశ్వరుడుగా ఉంది. తరువాత వ్యవహారంలో చూస్తే జీవహంకారముగా ఉంది. ప్రతీది మొదట్లో చైతన్య రూపంలో ఒక్కటిగా ఉన్నది. తరువాత శక్తి రూపంలో అనేకంగా ఉన్నాయి. తరువాత వ్యవహార రూపంలో నానాత్వముగా ఉన్నాయి. శక్తి రూపంలో ఉన్నవన్నీ కూడా బ్రహ్మాండము. వ్యవహార రూపంలో ఉన్నవన్నీ పిండాండము. తత్వ రూపంలో ఉన్నదంతా విశ్వాండము.

తత్వ రూపంలో ఉన్నప్పుడు 'బ్రహ్మణో అవ్యక్తః' అంటే బ్రహ్మమేమో పరతత్వముగా ఉన్నాడు. అవ్యక్తమేమో మాయాశబలిత బ్రహ్మ యొక్క మూలముగా ఉన్నాడు. సృష్టిలోకి ఉపక్రమించినపుడు మహత్ అయ్యాడు. ఈ మహత్‌కి ఒక అభిమాని తోచాడు. వాడి పేరే మహదహంకారము, ఇది అహంతత్వము. మహదహంకారముగా ఉన్న ఆయన యందు ఊహలో పంచతన్మాత్రలు వచ్చినాయి. తత్+మాత్ర = తన్మాత్ర. కాబట్టి ఇవీ తత్వాలే. తత్వాలుగా ఉన్నటువంటి వాటిని తన్మాత్రలు అన్నాము. ఇవి పంచ భూతములకు సంబంధించిన తన్మాత్రలు.

తన్మాత్ర అంటే ఇంకొక అర్థం ఉన్నది. తత్వమసిలో 'తత్' ఏదైతే ఉన్నదో ఆ తత్ కూడా మాత్రమే తత్ మాత్రము. సత్ చిత్ ఆనందములో చిత్–చిన్మాత్రము, సత్–సన్మాత్రము. **'రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయా సమాచ్ఛా దనాత్ సన్మాత్రః కరణోప సంహరణతో'** అక్కడ సన్మాత్ర వచ్చింది. అంటే సద్రూపమే. తత్ అనేటువంటిది తత్వ రూపంలో ఉంటే తన్మాత్ర. సూక్ష్మాతి సూక్ష్మంగా ఉన్నప్పుడు మాత్ర అంటారు. పంచభూతాలయొక్క ఏర్పాటుకి పంచభూతాల యొక్క తత్వాలు, పంచభూతాల యొక్క గుణాలను తన్మాత్రలు అన్నారు.

**పంచ బీజములనుండి ప్రాణమేర్పడెను**. అంటే పంచ బీజాలు ఎక్కడున్నాయి? మహత్ తత్వంలో పంచబీజాలున్నాయి. అం, యం, రం, వం, లం, ఆ పంచ బీజాక్షరాలే, విశ్వ ప్రాణశక్తే తత్వ రూపంలో ఉన్నప్పుడు బీజాలన్నాము. మళ్ళీ బ్రహ్మాండములోకి వచ్చేసరికి ఇది క్రియాశక్తి రూపంలో ఉంది. ప్రాణములు క్రియాశక్తి రూపంలో ఉన్నాయి. పిండాండములో అవి వ్యవహార రూపంలో ఉన్నాయి. పంచ ప్రాణాలుగా పంచకర్మేంద్రియాలుగా ఉన్నాయి.

**పంచాధి దేవతలనుండి ప్రత్యగాత్మ కలిగెను**. ఈ పంచాధి దేవతలు ఎవరు? ఈ పంచాధి దేవతలు ఎవరంటే సదాశివుడు, ఈశ్వరుడు, రుద్రుడు, విష్ణువు, బ్రహ్మ, వీళ్ళు అధి దేవతలు. ఈ అధిదేవతలు అంటే ఏమిటి? చైతన్య రూపులు. వీళ్ళు చైతన్య రూపులు. తత్వ రూపంలో ఉన్నారు. పంచబ్రహ్మ ప్రకాశాలు అని ఇంకో పేరు. **'బ్రహ్మణో అవ్యక్తః'** అంటే అవ్యక్తంలో ఉన్న పంచబ్రహ్మల యొక్క ప్రకాశము. అ పంచబ్రహ్మలే అధిష్ఠాన దేవతలు అయ్యారు. ప్రకాశ రూపంలో ఉన్నప్పుడు తత్వంగా ఉన్నారు. శక్తి రూపంగా మారేసరికి అధిష్ఠాన దేవతలు అయ్యారు. పంచీకరణలో విషయాలున్నాయి, చూడండి. శబ్ద స్పర్శ రూప రస గంధాలు. శబ్దానికి అధిష్ఠాన దేవత సదాశివుడు. స్పర్శకు అధిష్ఠాన దేవత ఈశ్వరుడు. రూపానికి అధిష్ఠాన దేవత రుద్రుడు. రసమునకు అధిష్ఠాన దేవత విష్ణువు. గంధమునకు అధిష్ఠాన దేవత బ్రహ్మ. పంచాధి దేవతలచేత శబ్ద స్పర్శ రూప

రస గంధ తన్మాత్రలు కూడా ఒక స్పందన వలన విషయములు అయినవి. పంచాధి దేవతలనుండి ప్రత్యగాత్మ కలిగెను. ప్రత్యగాత్మ ఒక్కటే అయినప్పటికి 5 ప్రకాశములుగా ప్రకాశించేసరికి పంచబ్రహ్మలు అయ్యారు. 5 ప్రకాశములుగా ప్రకాశించినప్పటికి 5 విధాలుగా, 5 వృత్తులుగా, 5 పద్ధతులుగా ఉన్నప్పటికి ప్రకాశము అనెడి ప్రత్యగాత్మ ప్రకాశము ఒక్కటే. అయితే మాయావరణములో 5 ప్రకాశాలుగా ఉండి నిరావరణమందు స్వయం ప్రకాశముగా ఒక్కటిగానే ఉన్నది. ఇప్పుడు 5 ప్రకాశములుగా ఏదైతే మాయావరణలోనికి వచ్చిందో దాని సంగతి చెప్పవలసి వస్తే వాటి వృత్తులనుబట్టి పేర్లు పెట్టాము, ప్రత్యగాత్మ ప్రకాశము ఒకటే అయినప్పటికి వృత్తి బేధమును బట్టి 5 బ్రహ్మలకు 5 ప్రకాశాలుగా చెప్పినప్పుడు, సదాశివ ప్రత్యగాత్మ ప్రకాశము ఆకర్షణ శక్తి కలిగి ఉంది. ఆకర్షించే చైతన్యముగా ఉంది. ఈశ్వర ప్రత్యగాత్మ ప్రకాశము, లోకాలను సృష్టించేటువంటి లోకాలను విస్తరింపచేసేటువంటి ఉచ్ఛాటన శక్తిగా ఉన్నది. రుద్ర ప్రత్యగాత్మ ప్రకాశము మారణశక్తి కలిగి వృత్తి రూపంలో లయంగా ఉన్నది. అలాగే విష్ణువు యొక్క ప్రత్యగాత్మ ప్రకాశము మోహనంగా ఉన్నది. క్రియాశక్తి దగ్గరకు వచ్చేసరికి పోషిస్తోంది. బ్రహ్మ ప్రత్యగాత్మ ప్రకాశము అక్కడ స్తంభన శక్తిగా వుంది. చైతన్యంగా ఉన్నప్పుడు స్తంభన అన్నాము. వృత్తి రూపంగా మారేసరికి సృష్టి అన్నాము. కనుక చైతన్య రూపంలో ఉన్నప్పుడు ఆ చైతన్యంలో ఉన్నటువంటి సత్తా 5 పద్ధతులుగా ఉన్నదంతా కూడా స్తంభన, మోహన, మారణ, ఉచ్చాటన, ఆకర్షణలుగా ఉన్నవి. అవే వృత్తి రూపంగా మారితే సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణలుగా ఉన్నవి. ఆకర్షణ అనేది కామన్‌గా ఉంది. దానికి రెండు పేర్లు లేవు. చైతన్యమునకు ఆకర్షణ అన్నాము. వృత్తికి వస్తే కూడా ఆకర్షణ అన్నాము. మిగతా వాటినేమో స్తంభన, మోహన, మారణ, ఉచ్చాటన అన్నాము. చైతన్య స్థాయిలో తత్వరూపాలు. శక్తి స్థాయిలో బ్రహ్మాండములోకొచ్చే సరికి అధిష్ఠాన దేవతలు అనే పేరు పెట్టేసరికి, ఆ మార్పు దగ్గర ఏమన్నామంటే వాళ్ళు చేసే క్రియలను సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణలు అన్నాము. అవ్యక్తము దగ్గర ఉన్న పంచ ప్రత్యగాత్మ ప్రకాశాలు సత్తామాత్రంగా ఉన్నాయి. బ్రహ్మాండము కొచ్చేసరికి సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణ శక్తి రూపాలుగా మారాయి. ఇలా పంచ అధిదేవతలనుండి ప్రత్యగాత్మ కలిగెను. ఈ ప్రత్యగాత్మ సర్వ జీవులయందు కూటస్థ ప్రకాశముగా నున్నది.

**శ్లో॥ పృథివీ మూర్తిః । ఆపః క్లేదః ద్రవః । తేజోభి సంతాపః । వాయుః**
**ప్రాణః । వియత్ సుషిరాణి । బ్రహ్మ అంతరాత్మ । యథా ఖలుబ్రహ్మ ।**
**విభూతిః లోకే । అంతరాత్మ పురుషేపి । అంతరాత్మ కీవిభూతః ॥**

శరీరమే భూమి మూర్తి రూపము. అంటే స్థూల రూపం వచ్చిందని, ఇంద్రియ గోచరము అయ్యింది అని. ఇందులోని ద్రవములు, తేమ జలతత్వముగా ఉన్నాయి. ఈ భూమిలో ఉన్నటువటి ద్రవముతో భూమి పిండ రూపము అయ్యింది. అణురూపంలో లేకుండ అణువులయొక్క సముదాయంగా ఉంది. అణువులయొక్క సముదాయము కలసి ఉండుటకు దానిలో తేమ ఉండాలి. ఒక లడ్డు చేయాలి అంటే దానిలో తేమ ఉండాలి. నెయ్యి రూపం కావచ్చు, డాల్డా రూపం కావచ్చు. అలాగే భూమి ఒక గోళాకారంలో ఉంది కాబట్టి ఆకారం అవడానికి అణువులయొక్క సముదాయంతో ఒక రూపంగా ఉన్నది అంటే దాని అర్థం దాంట్లో తేమ ఉంది. అది జలతత్వము. శరీరంలోని వేడిమి అగ్ని తత్వము. ఈ శరీరంలో $98.4^0$F ఉంటేనే మనం జీవించి ఉంటాము. ఉష్ణోగ్రత పెరిగినా, తగ్గినా, ప్రాణం పోతుంది. కనుక ఈ స్థూల శరీరంతో ఉన్నవాడు రక్త మాంసంతో ఉన్నవాడు ఈ కఠినత్వము ఏదైతే ఉందో అది భూమి సంబంధము, పృథ్వి సంబంధము. ఈ మాంసము మెత్తగా ఉంది కాబట్టి దాంట్లో తేమ ఉంది కాబట్టి అది జలతత్వము. రక్తము జలతత్వమే. ఎముకల్లో పృథ్వితత్వము ఎక్కువ ఉంది. అందులో జలతత్వము, ఉష్ణత్వము లేకపోతే ఎముక ఉండదు. ఎముక పెళుసుగా బోలుగా ఉంటుంది. ఎముకలో ఏర్పడినటువంటి పరమాణువుల యొక్క సముదాయంలో కొన్ని సందులు ఉంటాయి. ఆ సందులో వాయువు ఉంటుంది. వాయువు సంచారం కావాలంటే ఖాళీ కావాలి. ఖాళీ అనగా ఆకాశము. అవకాశముంటేనే వాయువు వ్యాపిస్తూ, సంకోచిస్తూ ఉంటుంది. ఖాళీలలోనే పంచ ప్రాణాలు కదులుతూ ఉంటాయి. కనుక ఈ శరీరము పంచభూతాలతో తయారయి ఉంది. శరీరంలో వేడి దీన్ని కాపాడుతోంది.

ఓ గర్భస్త పిండము ఉందనుకోండి. శుక్ల శోణితాలుగా ఉన్నప్పుడు ఏమయ్యింది. అందులో పృథ్వితత్వము, జలతత్వము కొంచెము ఉష్ణోగ్రత ఉంది. వాయువుతో కూడి ఉంది. అయితే శుక్ల శోణితాలు సంయోగము కావాలంటే అగ్నితత్వము కావాలి. తల్లి గర్భము ఆ వేడిని తగినట్లుగా ఇస్తుంది. ఆ అగ్నితత్వము తోటి పిండము క్రమక్రమంగా వృద్ధి చెందుతుంది. వృద్ధి చెందాలంటే పిండము కొంచెము వ్యాపించాలిగా, పెరగాలిగా. శుక్ల శోణిత స్థాయినుండి కొంత బరువు ఉండేటటువంటి చిన్న బిడ్డలాగా పెరగాలిగా. ఆ పెరగటానికి కావాల్సిన మృదుత్వము, జలతత్వము ఉండాలి. గర్భంలో ఒక ఉష్ణోగ్రత మెయింటెయిన్ కావాలి. ఆ ఉష్ణోగ్రత ఉన్నప్పుడే ఆ పిండము ఆకారమును పొందుతుంది. వాయుతత్వము వచ్చేసరికి లోపలనే తిరగటం మొదలు పెడుతుంది. ఆ బొడ్డుతో కనెక్షన్ అయిన నరం మెలిపడుతుంది. అది సడలిపోవాలి. తిరిగి శిరస్సు క్రింది భాగానికి వచ్చినపుడు ఆకాశతత్వము ఉండి లోపల అవకాశమునివ్వకుండా బయటకు నెట్టేస్తే, వస్తుంది. చలనము వలన వాయువు ఉంది. ఆకాశము వలన డెలివరీ అయ్యింది.

ఒక కుండలో నీళ్ళు పోసి దాంట్లో పప్పు వేశాం. పప్పులు, నీళ్ళు కలిశాయా? కలవలేదు. వేడి చేశాం. దాంట్లో పంచదార పోశాం. పాకం అయ్యింది. ఆ పాకం అవ్వడానికి కొంత ఉష్ణోగ్రత ఉంది. అప్పుడు ఏమయినాయి? ఆ పాకం ఈ పప్పులను పట్టి ఉంచింది. ఈ విధంగా పంచభూతాలు మన స్థూల శరీరం తయారవడానికి కొన్ని నిష్పత్తుల్లో ఎక్కువ తక్కువలుగా వాటియొక్క సంయోగముచేత తయారు అయ్యింది. ప్రాణము వాయుతత్వము. నవరంధ్రములందున్న ఖాళీ ప్రదేశములే ఆకాశము. సమాన వాయువు తీసుకొన్న ఆహారాన్ని, అన్న రసాన్ని 72వేల నాడులకు, గుండెకు రక్తంగా మార్చి అందిస్తుంది. అంటే ఆ నాడుల్లోకి ప్రవహిస్తుంది అంటే ఖాళీ లేకుండా ఎలా ప్రవహిస్తుంది? ఖాళీ ఉండటం వల్ల ప్రవహిస్తుంది. కొంత ఖాళీ ఉండాలి. గుండె కొట్టుకోవడం ద్వారా రక్తం పంప్ అవుతుంటే తిరిగి మళ్ళీ గుండెకు చేరుతుంటే, కొంత ఖాళీ ఉండాలి. పూర్తి ఖాళీ కాకుండా కొంత ఖాళీ ఉండాలి. ఆ ఖాళీ ద్వారా రక్త ప్రసరణ గుండెనుంచి బయలుదేరి మరల గుండెకు చేరుతుంది. అందువల్ల అన్ని నరాల్లోను ఖాళీ వుంది. అందుకే రక్తం ప్రసరిస్తూ వుంది. రక్తం గడ్డకట్టినప్పుడు ఏమవుతుంది? ఒకడు చనిపోయాడు. ఒళ్ళు చల్లబడింది. రక్తం గడ్డకట్టింది. రక్తం గడ్డకట్టేసరికి రక్తములో ఉన్న ద్రవము ప్లాస్మా అక్కడనుంచి వేరయ్యింది. వేరై నవరంధ్రాల్లోనుంచి మెల్లగా బయటకు వచ్చింది. ఆ రక్తంలో ఉన్నటువంటి ఎరుపు రంగు తీసుకొని ఈ నీరు ప్లాస్మా ఏదో ముక్కులోంచి వచ్చింది. ఎవరో కళ్ళు దానం చేశారు. కళ్ళలో గుడ్డు తీసేసరికి అక్కడ ఖాళీ (ఆకాశము) ఉందన్నాం కదా. ఆ ఖాళీలోంచి గడ్డకట్టిన రక్తము అంటి ఎరుపును తీసుకొని ప్లాస్మా బయటకు వచ్చింది. ఎవరో అన్నారు. కళ్ళలోంచి నెత్తురు వస్తోంది బ్రతికి ఉన్నారేమో అని. ఏమీ లేదు. ఈ ఉదాహరణ చూస్తే మనకు తెలుస్తుంది. మన శరీరమంతా కూడా పంచభూతాలు వ్యాపించి ఉన్నాయి అని. ఈ శరీరంలో అంతరాత్మ ఉంది. ఈ అంతరాత్మ కూడా శరీరమంతా వ్యాపించి ఉంది. అంతరాత్మ ఎట్లా వుంది? చైతన్య రూపంలో ఉంది. వ్యాపించి ఉంది. ఈ విధంగా పిండాండమందు, స్థూల శరీరమందు, వ్యష్టిలో ఉన్న అంతరాత్మ గురించి ప్రతిపాదన చేశాము. అయితే ఈ అంతరాత్మగా ఉన్నదే బ్రహ్మాండమంతా వ్యాపకమై అనేక విభూతులుగా ఉన్నది. అది ఎట్లనగా,

**శ్లో॥ బ్రహ్మణో విభూతిః । లోకే ప్రజాపతిః । అంతరాత్మనో విభూతిః ।**
**పురుషే సత్వం । యస్త్వింద్రోలోకే । స పురుషే అహంకారః ।**
**ఆతిత్యస్త్వాదానం (గ్రహణశక్తిః) । హృద్రోప్రసాదః । మనస్సు ఖం ।**
**అశ్వినౌ కాంతిః । మరుదు త్సాహః । విశ్వే దేవాః । సర్వేంద్రియాణి**
**సర్వేంద్రి యార్థాస్య । తమో మోహః । జ్యోతిః విజ్ఞానం ॥**

సదాశివ, ఈశ్వర, రుద్ర, విష్ణు, బ్రహ్మల ప్రత్యగాత్మ ప్రకాశము వలన ఈ సృష్టి అంతాకూడా సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణల పద్ధతిగా ఉన్నది. ఇవన్నీ జరుగుటకు ముందుకూడా ఆ పంచ బ్రహ్మల ప్రకాశము కేవలముగా నున్నది. సృష్టి అయిన పిదప, ఆ సృష్టియంతా వ్యాపకమైన పంచబ్రహ్మల ప్రకాశము, విభూతిగా ఉన్నది.

ఈశ్వరుడు లోకాలు విస్తీర్ణచేసి, ఆ లోకాలలో వ్యాపమై ఉన్నాడు. లోకాలు లేనప్పుడు, వ్యాపకమనే లక్షణము లేనివాడై యున్నాడు. అలాగే బ్రహ్మ ప్రజాపతిగా జీవులను సృష్టించాడు. ఆ జీవులయందు అంతరాత్మగా ఉన్నాడు. ప్రజా అంటే సంతానం. ఆ బ్రహ్మ సంతానముగా సృష్టించబడ్డవారికి, ప్రజాపతిగా పిలువబడుతున్నాడు. అయితే సంతానము ఉన్నప్పుడు విభూతి రూపములో వ్యాపకమై యున్నాడు. కాని జీవసృష్టికి పూర్వము అంతరాత్మ అనే పేరు లేదు గాని, బ్రహ్మ ప్రకాశముగా ఉంటూనే ఉన్నాడు. కాని జీవులలో శుద్ధ సత్వ గుణ రూపుడై అంతరాత్మ అని పిలువబడుతున్నాడు.

ఇంద్రుడు కూడా బ్రహ్మమే. కాని సృష్టిలో అహంకార రూపుడుగా కనబడుచున్నాడు. అహంకారము అనే విభూతి రూపము పోతే, ఇంద్రుడు బ్రహ్మమే. అలాగే సూర్యుడు తన గ్రహణశక్తిని ఉపసంహరిస్తే, సూర్యుడూ బ్రహ్మమే. రోషమును పుట్టించే రుద్రుడు, సృష్టి మిథ్య అన్నప్పుడు, రోషమనేదే లేదు గనుక రుద్రుడు బ్రహ్మమే. చంద్రుడు ఈ మిథ్యా జగత్తులో వెన్నెల రూపంలో ప్రకాశిస్తున్నాడు. విచారణ చేస్తే, జగన్మిథ్య గనుక, చంద్ర ప్రకాశము వెన్నెల రూపముగా ఉన్నది మిథ్య. అప్పుడు చంద్ర ప్రకాశము ప్రత్యగాత్మ ప్రకాశము ఒక్కటే. సుఖాన్నిచ్చే వసువులు, కాంతిరూపమైన అశ్వినీ దేవతలు, ఉత్సాహాన్నిచ్చే వాయువులు, ముక్కోటి దేవతలు కూడా, ఆ ప్రత్యగాత్మ ప్రకాశము యొక్క ప్రతిబింబ ప్రకాశములే, ఇక్కడ అనేకముగా విభూతిగా కనబడుచున్నాయి. ప్రతిబింబము లేకపోయినప్పుడు, బింబ ప్రకాశమే సత్యమైనది. ప్రతిబింబ ప్రకాశములన్నీ ఈ సృష్టిలోనే అనేక విధములు. సృష్టి ఉన్నా, లేకపోయినా, బింబ ప్రకాశము ఉన్నదున్నట్లున్నది. సద్రూపమై యున్నది.

ఈ విధముగా పిండ బ్రహ్మాండములందు, అంతరాత్మ, సర్వవ్యాపక పరమాత్మ ఒక్కటే. పిండ బ్రహ్మాండములు ఉన్ననూ, లేకున్ననూ, ప్రత్యక్ అభిన్న పరమాత్మ ప్రకాశము స్వయం ప్రకాశమే. దానికి ప్రతిబింబ ప్రకాశముతో ఎట్టి సంబందము లేదు. దీని సారాంశమేమంటే నిర్గుణ బ్రహ్మమే సృష్టిలో సగుణమై విభూతిగా కార్యకారణంగా కనబడుతున్నాడని, సృష్టి మిథ్య గనుక సగుణ నిర్గుణ బ్రహ్మల భేదము లేదని, నిర్ణయముగా తెలుసుకోవడానికి అన్నీ ఉంటే ఎలాగున్నాడు? అవన్నీ లేకపోతే కూడా కేవలంగా ఉన్నాడని, ఆ ఒక్క బ్రహ్మనే వస్తు నిర్ణయముగా చెప్పడమైనది.

కనుక సాక్షాత్ పరబ్రహ్మ 'తత్' కూడా అయినవాడు గురువు. నీలాగే మనసును, బుద్ధిని, ఇంద్రియాలను వాడుకుంటూ ఉంటేటటువంటివాడు బ్రహ్మము. ఆయనకు తెలుసు **తత్ త్వం** ఒక్కటే అని. మీరు ఇంద్రియాలను వాడుకోవడంలో మునిగిపోయారు. కనుక **"తత్"** అనేది తెలియదు. అందుకని ఆ గురువు తత్త్వమస్యాది లక్ష్యం. ఆ తత్త్వమసి అనేటటువంటి లక్ష్యాన్ని గురువు ప్రత్యక్షంగా మీకు చూపిస్తూ నువ్వు అందుబాటులో ఉన్నప్పుడు నువ్వు ఆయనకు అంగ శుశ్రూష, స్థాన శుశ్రూష, భావ శుశ్రూష, ఆత్మ శుశ్రూష చెయ్యాలి. వాటి వివరాలు చెప్పుకున్నాం.

మొదటి పాఠం శరీరత్రయ విలక్షణము. ఇది గుణాలకు పంచభూతాలకు సమన్వయం చేసుకుంటూ చెప్పుకొచ్చాము. ఉదా: ఆకాశముయొక్క సత్వగుణ భాగము శ్రోతేంద్రియము అయ్యింది. ఆకాశము యొక్క తమోగుణ భాగము శబ్దము అయ్యింది. ఆకాశము యొక్క రజోగుణ భాగము వాక్కు అయ్యింది. ఇది ఒక త్రిపుటి. అలా పంచభూతాలకు 5 రకాల త్రిపుటులు. ఈ బోధ పద్ధతి ఒక ప్రత్యేకమైన పద్ధతిలో నడుస్తోంది. సామాన్యంగా పంచభూతాల గురించి చెప్తారు. 3 గుణాల గురించి చెప్తారు కాని రెండిటిని ఒక్కటిగా సమన్వయం చేసి త్రిపుటిగా చెప్పటం ఎక్కడా లేదు. ఈ రకమైన బోధను ఎవరైతే వెంబడిస్తారో అవగాహన చేసుకుంటారో దానికి తిరుగులేదు. వారు చేసే సాధనలో అనుమానాలుండవు.

ఈ సూక్ష్మ శరీరం యొక్క విధానం అంటే మళ్ళీ తమోగుణంలో గోళకాలు, రజోగుణంతో ఇంద్రియాలు సత్వగుణంతోటి అధిష్టాన దేవతలయొక్క ప్రేరణ జీవ వ్యాపారానికి 3గా జరుగుచున్నది. సత్వగుణం చేత అధిష్టాన దేవతల ప్రేరణచేత, రజోగుణంలో ఏర్పడినటువంటి ఇంద్రియాలు తమోగుణంలో ఏర్పడినటువంటి గోళకాలయందు చేరి వాటియొక్క జీవ వ్యాపారం చేస్తున్నాయి. అలా పంచీకరణకు, గుణాలకు, ఇంద్రియాల్లో మనలో ఏ రకంగా ఉంది అని చెప్పేటటువంటిది ఒక సమన్వయం,

దీన్ని త్రిపుటిగా చెప్పాం. త్రివృత్కరణముగా చెప్పాం. పంచీకరణగా చెప్పాం. అన్ని రకాలుగా చెప్పుకున్నాము. ఇది ఏ ఒక్కటిగా ఉండదు. ఒక సంఘాతముగా పనిచేస్తుంది. సంఘాతము అంటే స్థూల శరీరము, ప్రాణము, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, ఆత్మ. ఈ 5 కలిసి సంఘాతముగా ఉంటాయి. ఆత్మకు తప్ప మిగతా వాటికి ప్రకృతి సంబంధించిన గుణాలుంటాయి. ఆత్మ అన్నింటికీ సాక్షీభూతంగా అసంగముగా ఉంటుంది. కాని ఆత్మయొక్క సత్తాచేత నడుస్తున్నప్పటికి ఆత్మ వీటన్నింటికి విలక్షణము అసంగము.

శరీరత్రయ విలక్షణము ఆత్మ. అవస్థాత్రయ సాక్షి, ఆత్మ పంచకోశ వ్యతిరిక్త లక్షణము ఆత్మ. ఇపుడు చెప్పినవన్నీ ఆత్మ తప్ప మిగిలినవన్నీ అనాత్మ. 3 గుణాలు, 3 అవస్థలు, పంచకోశాలు అనాత్మ. వాటియొక్క ధర్మాలన్నీ అనాత్మ ధర్మాలు. అనాత్మ ధర్మాలు ప్రకటించబడాలన్నా ఆ ధర్మాలతోటి స్పందించాలన్నా ఆ స్పందనకు సంబంధించి మీకొక అనుభవం కలగాలన్నా సుఖదుఃఖాలు అనే అనుభవం రావాలన్నా ప్రతిస్పందనగా రాగద్వేషాలు మీలో కలగాలన్నా వీటన్నిటికీ ఆత్మ చైతన్యము అందుబాట్లో ఉండాలి. ఆత్మ చైతన్యముచేత ఈ జడమైన ఇంద్రియాలు అన్నీకూడా చైతన్యవంతమై పనిచేస్తుంటాయి. జ్ఞానేంద్రియాలు చైతన్యవంతమవటమే కాకుండా ప్రజ్ఞావంతమై శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను గ్రహిస్తాయి. మనస్సు, బుద్ధి చైతన్యవంతమై, ప్రజ్ఞావంతమై ఆలోచించడం, ఊహించడం, నిర్ణయించడం అన్నీ చేస్తుంటాయి. ఆ యొక్క విభాగాలన్నీ వివరంగా చెప్పుకున్నాము.

ఇపుడు పిండాండ పంచీకరణకు వచ్చాము. దాన్ని కొనసాగిస్తున్నాము. దాంట్లో భాగంగా పంచభూతాలనుంచి స్థూల శరీరం కలిగింది. పంచ తన్మాత్రలనుండి ఇంద్రియాలు వచ్చినాయి. అన్నీ పంచీకరణతో వచ్చినవే. స్థూల శరీరం కూడా సూక్ష్మభూతాలయొక్క పంచీకరణలో, స్థూల భూతాలు పృథ్వినుంచి ఓషధులు ఓషధులనుండి అన్నము అన్నము వలన కలిగిన శుక్ల శోణితముల వల్ల కలిగిన పిండములో పిండాండములో పంచభూతాలున్నాయి. పంచభూతాల వల్లనే ఈ స్థూల శరీరము సప్తధాతువులుగా ఏర్పడింది. పంచ తన్మాత్రలయొక్క గుణాలతో కూడిన సూక్ష్మ భూతాలు అన్నీ పంచీకరణై రజోగుణ పంచీకరణలో ఇంద్రియాలు అయినాయి. తామసగుణ పంచీకరణతో స్థూల దేహంలో గోళకాలు అయ్యాయి. పంచశక్తుల వల్ల జీవులు ఏర్పడ్డారు. మహత్‌లో ఉండేటటువంటి పంచప్రాణ బీజాలచేత ప్రాణము ఏర్పడింది. పంచ అధిదేవతలు ఎవరంటే సదాశివ, ఈశ్వర, రుద్ర, విష్ణు, బ్రహ్మ అనేటువంటి ప్రత్యగాత్మ 5 ప్రకాశాలచేత ఈ పంచ అధి దేవతలు అయ్యారు. ఈ పంచ అధిదేవతల వల్ల ప్రత్యగాత్మ కలిగాడు.

లోకములో ఇంద్రుడు అహంకారముగను, సూర్యుడు గ్రహణశక్తిగను, రుద్రుడు రోషముగను, చంద్రుడు ప్రసాద గుణముగను అంటే ఇచ్చేవాడుగాను, అష్ట వస్తువులు సుఖమునిచ్చేవారుగను ఉన్నారు. అంటే మనలో అహంకారముంది. అంటే ఇంద్రుడు ఉన్నాడన్నమాట. మనం అన్నీ చక్కగా ఇంద్రియాలను గ్రహించేటట్టుగా పెట్టుకుంటే మనలో సూర్యుడున్నాడు. సూర్యుడు గ్రహణ శక్తిని ఇస్తున్నాడు. రుద్రుడు రోషమును కలిగిస్తున్నాడు. రోషము అంటే అహంకారము యొక్క కార్యరూపము. చంద్రుడు ప్రసాదగుణం కలిగి ఉన్నాడు. అష్టవస్తువులు సుఖాన్నిస్తున్నారు. అశ్వనీ దేవతలు కాంతిగానున్నారు. గాలి ఉత్సాహముగాను, విశ్వ దేవతలు ఇంద్రియార్థముతో ఉన్నారు. విశ్వంనుండి వచ్చినవారు వైశ్వ దేవులు, వాళ్ళే ఇక్కడ చేరి పనిచేస్తున్నారు.

మన శరీరమంతా కూడా దేవతామయంగా ఉంది. ఇన్ని రకాల దేవతలు మనలో ఉండి వాళ్ళ వాళ్ళ పనిచేసుకుంటున్నారు. పనిచేసుకోవడం ఏమిటి? వాళ్ళ స్వభావాలతో వాళ్ళ లక్షణాలలో వాళ్ళు ఉన్నారు. ఒకడు దుఃఖరూపంలో ఉన్నాడు. ఒకడు సుఖరూపంలో ఉన్నాడు. ఒకడు రోష రూపంలో ఉన్నాడు. ఒకడు ఉత్సాహ రూపంలో ఉన్నాడు. కొందరు ఇంద్రియ జ్ఞాన రూపంలో ఉన్నారు. ఆ ఇంద్రియాలతోటి గ్రహణశక్తిగా ఉన్నవాడు సూర్యుడు. ఈ అనుభవాలన్నింటిని నేను అనుభవిస్తున్నానని కేంద్రంగా కర్త భోక్తకు ఆధారమైన అహంకారముగా ఇంద్రుడు ఉన్నాడు.

ఈ శరీరం యావత్తు ముక్కోటి దేవతలు కొలువై ఉన్నారు. వాళ్ళ వాళ్ళ పనులు వాళ్ళు చేసుకుంటూ ఉన్నారు. ఆ ఉద్దేశ్యం ఉంటే నీవు అక్కడ లేనేలేవు. ఆ రహస్యం తెలిస్తే జీవుడుగా నువ్వు లేనేలేవు. విశ్వదేవతలు ఇంద్రియములు మరియు ఇంద్రియార్థములుగను, చీకటి అజ్ఞానముగను, వెలుతురు జ్ఞానముగను మనలో ఉన్నది. చీకటికి ఒక అధిష్ఠాన దేవత వెలుతురుకు ఒక అధిష్ఠాన దేవత ఉన్నారు. వాళ్ళు వచ్చి మనలో చీకటిగాను, వెలుతురుగాను ఉన్నారు. అప్పుడప్పుడు జ్ఞాన సంబంధముగ ఉన్నప్పుడు ఒక అధిష్ఠాన దేవతయొక్క ప్రేరణ. అప్పుడప్పుడు అజ్ఞానంలో మునిగిపోవడం అనేది దానికి సంబంధించిన ఒక అధిష్ఠాన దేవతయొక్క ప్రేరణ.

ఉదా: మోటారు సైకిల్ నడుపుతూ ఎదురుగా ఏమీ లేకపోయినా ప్రక్కకు వెళ్ళి ప్రక్కన ఉన్న గోడకు కొట్టుకుంటాము. అక్కడ ఒక అధిష్ఠాన దేవత ఏమి చేస్తుందంటే, మీ మతి తప్పించి ప్రక్కకు తీసుకెళ్ళి పడేస్తుంది. ఎందుకు పడతావు అంటే ఆ ప్రారబ్ధకర్మ అట్లా ఉంది అంటాము.

సకల దేవతలు మీచేత ప్రారబ్ధకర్మ అనుభవించేటట్లు చేస్తారు. మీ ప్రమేయం ఏమీలేదు. నువ్వు అనుకుంటున్నావు, నేను స్వతంత్రుడిని అని. ముక్కోటి దేవతలు నీలో కొలువై ఉండి వాళ్ళే నీ ప్రారబ్ధ కర్మను ఏ రకంగా కావాలో ఆ రకంగా జరుపుతున్నారు. ఆ రకంగా జరపడానికి అవకాశము ఇచ్చేటటువంటి శరీరాన్ని సృష్టికర్త బ్రహ్మ తీసుకొస్తున్నాడు. విష్ణువు పోషిస్తున్నాడు. దేవతలు అందరు కొలువై ఉండి నీ ప్రారబ్ధ కర్మను నీచేత అనుభవింపచేస్తున్నారు. అంటే నీ శరీరంలో ఉండి ఆడుకుంటున్నారు. పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణసంకటం అని, ఆ దేవతలయొక్క లీలా విలాసం మన శరీరంలో ఏదైతే మంచి క్రీడగా జరుగుతుందో, ఆ క్రీడ వాళ్ళకు లీలేగాని మనకు వచ్చిందిప్పుడు సంకటము. దాంతో బాధపడలేకపోతున్నాము. మనకొక అభిప్రాయము కలిగింది. ఇదంతా చరక సంహితలో ఉన్నది. దీనిద్వారా భావాన్నిచ్చారు.

పంచాక్షరీతో ఒక కాన్సెప్ట్ ఇచ్చాడు. ప్రణవంలో ఒక భావాన్ని ఇచ్చారు. **'యద్భావం తద్భవతి'**తో ఒక కాన్సెప్ట్ వచ్చింది. ఆ విధముగా త్రిగుణాల్ని, మంత్రాల్ని, ప్రణవాన్ని, నాదబిందు కళల్ని, అవ్యక్తం మహత్ మహదహంకారమును సమన్వయం చేసుకొంటూ వస్తున్నాము.

ముఖ్యంగా పంచీకరణ పద్ధతిలో సృష్టిని, 3 గుణాల పద్దతిలో సృష్టిని, ఓంకార పద్దతిలో సృష్టిని బ్రహ్మణో అవ్యక్తః అవ్యక్తో మహత్ అనే పద్ధతిలో సృష్టిని, మీరు యద్భావంతద్భవతి అనే దాన్ని ఒక కాన్సెప్ట్‌ని తీసుకొని, విడివిడిగా ఎవరికివారు శోధించాలి. పరిశోధించాలి. చేస్తే మీ బుద్ధిలో దృఢత్వము విషయముపట్ల అవగాహన మీమీద అప్లయి చేసుకుంటే మీకు రావాల్సిన అనుభవము విషయములో లక్ష్యం విషయంలో చక్కటి అవగాహన వస్తుంది. ఆరూఢం అవుతాము. ఇది మీ అందరికీ హోమ్‌వర్క్. ఊరకే వినటానికి అలవాటుపడితే సరిపోదు. విన్నదాన్ని వ్రాయటానికి అలవాటు, వేరొకరికి చెప్పే అలవాటు ఉండాలి. ఒక అంశము తీసుకొని దాన్ని పరిశోధించాలి. ఎవరి భాషలో ఎవరికివారికి అర్థమయ్యేట్లుగా తయారు చేసుకోవాలి. అప్పుడే మన లక్ష్యం నెరవేరుతుంది. విజ్ఞాన స్వరూప్ ఇలాగే చేశాడు.

సూక్ష్మాకాశము పంచబద్ధదంతా ఆకాశ పంచకము. సూక్ష్మవాయువు చేత పంచబడితే వచ్చిన తత్వాల్ని వాయు పంచకం అంటారు. సూక్ష్మ అగ్ని భూతము చేత పంచబద్ధవన్నీ అగ్ని పంచకము. అలా సూక్ష్మజలము అర్థభాగమై రెండవ అర్థభాగము 4 పరకలై ఒక్కొక్క పరక జలము ఇతర 4 భూతములతో కలిసి శబ్ద స్పర్శ, రూప, రస గంధాలైనాయి. ఇది విషయపంచకము. అలాగే పృథ్వీ పంచకము వచ్చేసరికి సూక్ష్మపృథ్వి 2 భాగములై అర్థ భాగము పాయువుకు గోళకమై 2వ అర్థభాగము 4 పరకలై వాగింద్రియము, పాణీంద్రియము, పాదేంద్రియము, గుహ్యేంద్రియములకు గోళకములైంది అని చెప్పాము. ఇది పృథివీ పంచకము. ఇదంతా పంచీకరణలో భాగమే. పంచకము అని పేరు ఎందుకు పెట్టారు. పంచకము అంటే 5. పిండాండ పంచీకరణ పటము కనుక చూస్తుంటే జ్ఞాత, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము కలిపి ఆకాశ పంచకము. అలాగే సమాన వాయువు, వ్యాన

వాయువు, ఉదాన వాయువు, ప్రాణవాయువు, అపాన వాయువు కలిపి వాయు పంచకము. ఇలా అడ్డవరసలో పెడితే పంచకములయ్యాయి. జల పంచకములో విషయాలు వచ్చినాయి. పృథ్వి పంచకములో కర్మేంద్రియాలు వచ్చినాయి. అగ్ని పంచకములో జ్ఞానేంద్రియాలు వచ్చినాయి. వాయు పంచకమువల్ల పంచ ప్రాణాలు వచ్చినాయి. ఆకాశ పంచకమువలన అంతరేంద్రియములు వచ్చినాయి. వచ్చినాయి అంటున్నాము గాని తమోగుణము వలన గోళకాలు వచ్చినాయి. రజోగుణము వలన ఇప్పుడు చెప్పిన ఇంద్రియాలు వచ్చినాయి.

ఆకాశ పంచకము: తమోగుణ ఆకాశములో అర్థాంశము జ్ఞాతకు గోళకమాయెను. తక్కిన అర్థాంశము 4 పరకలై ఒక పరక ఆకాశము వాయువునుకూడి మనసుకు గోళకమయ్యెను. రెండవ పరక ఆకాశము అగ్నిని కూడి బుద్ధికి గోళకమయ్యెను. మూడవ పరక ఆకాశము జలమును కూడి చిత్తమునకు గోళకమయ్యెను. నాల్గవ పరక ఆకాశము పృథివిని కూడి అహంకారమునకు గోళకమయ్యెను. ఇక్కడ ఇవన్నీ తమోగుణ సూక్ష్మభూతాలు. ఆ వాక్యాన్ని పొడిగిస్తే కష్టంగా ఉంది. అంత పొడుగు వాక్యం ఎందుకు అని? మనసులో పెట్టుకోండి. తమోగుణ సూక్ష్మభూతాలే పంచీకరణై గోళకాలైనాయి అనుకుని ఇది వినండి. అపుడు వాక్యాలు కొద్దిగా ఉంటే గుర్తుంటుంది. పొడుగు వాక్యం గుర్తుండదు.

వాయువులో అర్థాంశము వ్యాన వాయువుకి గోళకమయ్యెను. తక్కిన అర్థాంశము 4 పరకలై ఒక పరక ఆకాశమును కూడి సమాన వాయువుకు గోళకమయ్యెను. ఇందులో మీరు చెప్పకపోయినా తమోగుణ సూక్ష్మవాయువు అర్థాంశము వ్యానవాయువుకు గోళకమయ్యెను అని అనాలి. తక్కిన తమోగుణ సూక్ష్మవాయువు యొక్క అర్థాంశము 4 పరకలై ఒక పరక తమోగుణ సూక్ష్మ వాయువు తమోగుణ సూక్ష్మ ఆకాశమును కూడి సమాన వాయువుకు గోళకమయ్యెను. ఇలా చదవాలి. అందుకని ఏమి చేస్తున్నాము? తమోగుణ అనేది సూక్ష్మ అనేది కామన్‌గా తీసుకొని మనస్సులో దాన్ని అర్థంచేసుకొని ఒక మూల పెట్టుకొని, అది వాడకుండా, ఇది చదువుకోండి. సరిపోతుంది. మూడవ పరక జలముతో కూడి ప్రాణవాయువుకు గోళకమయ్యెను. నాల్గవ పరక పృథ్విని కూడి అపాన వాయువుకు గోళకమాయెను. ఇవి పంచ ప్రాణములకు గోళకములు.

సూక్ష్మ అగ్ని రెండు భాగములై, అర్థ భాగము చక్షురింద్రియమునకు గోళకమయ్యెను. మిగిలిన అర్థభాగము 4 పరకలై ఒక్కొక్కటి మిగిలిన 4 భూతములను గూడి, శ్రోతేంద్రియము, త్వగింద్రియము, జిహ్వేంద్రియము, ఘ్రాణేంద్రియములకు గోళకములయ్యెను.

తమోగుణ సూక్ష్మ జలము రెండు భాగములై, అర్థభాగము రస విషయమునకు గోళకమయ్యెను. ఒక పరక సూక్ష్మ జలము ఆకాశముతో కూడి శబ్ద విషయమునకు గోళకమయ్యెను. రెండవ పరక సూక్ష్మ జలము వాయువును గూడి స్పర్శ విషయమునకు గోళకమయ్యెను. మూడవ పరక సూక్ష్మ జలము అగ్నితో కూడి, రూప విషయమునకు గోళకమయ్యెను. నాల్గవ పరక సూక్ష్మ జలము పృథివితో గూడి, గంధ విషయమునకు గోళకమయ్యెను.

అలాగే పృథివీ సూక్ష్మ భూతము రెండు భాగములై అర్థ భాగము పాయురింద్రియమునకు గోళకమయ్యెను. మిగిలిన అర్థ భాగము 4 పరకలై ఒక్కొక్కటి మిగిలిన 4 భూతములతో కూడి, వాగింద్రియము, పాణీంద్రియము, పాదేంద్రియము, గుహ్యేంద్రియములకు గోళకములాయెను.

ఇంకా అధిష్ఠాన దేవతలు చెప్పాలి కదా. ఆకాశ పంచకమునకు వెళ్ళండి. ఇవి అంతరేంద్రియములకు గోళకములు. అంతరేంద్రియములు అంటే జ్ఞాతతో కలిపి అంతఃకరణ చతుష్టయము 4 కలిపి 5, పంచకము అంటే 5. జ్ఞాతకు గురుమూర్తి అధిష్ఠాన దేవత, మనస్సునకు చంద్రుడు, బుద్ధికి బృహస్పతి, చిత్తమునకు క్షేత్రజ్ఞుడు, అహంకారమునకు రుద్రుడు, ఈ అంతరేంద్రియములకు అధిదేవతలు. వాయు పంచకముకు కూడా పంచప్రాణములు వచ్చినాయి కదా! ఈ పంచ ప్రాణములకు అధిదేవతలు ఎవరు? సమాన వాయువుకు జయుడు, వ్యాన వాయువునకు విశ్వయోని, ఉదాన వాయువునకు అజుడు, ప్రాణవాయువునకు విశిష్టుడు. అపాన వాయువునకు విశ్వకర్త ఈ పంచ పాణేంద్రియములకు అధి దేవతలు.

శ్రోతేంద్రియమునకు అష్టదిక్కులు అధిదేవతలు. త్వగింద్రియానికి వాయు దేవుడు, చక్షురింద్రియమునకు సూర్యుడు, జిహ్వేంద్రియమునకు వరుణుడు, ఘ్రాణేంద్రియమునకు అశ్వనీ దేవతలు అధిదేవతలు. తామస, సూక్ష్మ భూతాలు అనే పేర్లు వాడకుండా చెప్తున్నాము. వాడలేదు కాబట్టి ఇంకొకటి అనుకోవద్దు. అది వాడితే గుర్తుపెట్టుకోవడము కష్టం అవుతుంది. వాడకుండా దీన్ని అర్థం చేసుకొని బ్రాకెట్‌లో ఇవన్నీ తమోగుణ సూక్ష్మభూతాలు అని వ్రాసుకోండి. ఈ విధముగా ఐదైదులు ఇరవై అయిదు తత్వాలకు 25మంది అధిదేవతలు ఉంటారు. పుస్తకంలో చూచుకొనండి.

కదంబము అంటే ఏమిటి? అనేక రకాల పూలు ఒకే మాలగా కట్టినపుడు మాల ఒకటే అయినా గాని, అందులో 5 రకాల పూలు ఉంటాయి. దాన్ని కదంబము అంటాము. 5 గాని, 3గాని పూలకొట్టుకెళ్ళి పూలమాల అడిగితే కదంబము అంటాడు. కదంబము అంటే అందులో మరువము, దవనము, మల్లెలు, జాజులు, కనకాంబరాలు, అన్నీ కలిపి ఒకే రకమైన మాల కడతారు. అదే కదంబము. ఒక రకమైన పూలమాలను కదంబము అనరు. అన్ని రకాలు కలిస్తే కదంబము. అలాగే పంచభూతాలతో తయారైనవి కదంబాలు.

పృథ్విలో పృథ్వి కూడగా పాయువు పుట్టెను. పృథ్విలో జలము కూడగా గంధము పుట్టెను. పృథ్విలో అగ్ని కూడగా ఘ్రాణము పుట్టెను. పృధ్విలో ఆకాశము కూడగా అహంకాము పుట్టెను. దీన్ని ఎలా చదవాలి అంటే పిండాండ పంచీకరణ చార్టు ఎదురుగుండా పెట్టుకుంటే పృథ్వి అన్నాడు కాబట్టి ఆఖరి గడికి వచ్చి కుడిప్రక్క క్రింద మూలలో 5×5=25లలో 25 దగ్గరకు రండి. 25 దగ్గరనుండి పైకి నడవండి. పాయురింద్రియము, గంధము, ఘ్రాణము, అపాన వాయువు, అహంకారము అని ఉంటుంది. క్రిందినుంచి చదివాముగాని ఒక రకం కాదు. అడ్డంగా ఉంటే అన్ని కర్మేంద్రియాలే, అన్నీ జ్ఞానేంద్రియాలే. నిలువుగా పోతే ఎలా ఉంది. ఒక కర్మేంద్రియము ఒక విషయము, ఒక జ్ఞానేంద్రియము, పంచ ప్రాణాల్లో ఒక ప్రాణము అంతరింద్రియాల్లో అహంకారము కలిపి ఒక కదంబము. రెండవ కదంబము గుహ్యేంద్రియము, రసమనే విషయము, జిహ్వేంద్రియము, ప్రాణవాయువు, చిత్తము ఇది ఒక కదంబము. ఇది ఎట్లా చదవాలి? క్రింది నుంచి పైకి నిలువుగా చెబుతున్నాము. స్తబకము అంటే ఇంద్రియ వ్యాపారము, వ్యవహారము జరుగుతుంది అంటే పైనుంచి క్రిందికి. కదంబము క్రింది నుంచి పైకి, స్తబకము పైనుంచి క్రిందికి

**పృథ్వి కదంబము :** పృథ్విలో పృథ్వి కూడగా పాయువు పుట్టెను. పృథ్విలో జలము కూడగా గంధము పుట్టెను. పృథ్విలో అగ్ని కూడగా ఘ్రాణేంద్రియము పుట్టెను. పృథ్విలో వాయువు కూడాగా అపాన వాయువు పుట్టెను. పృథ్విలో ఆకాశము కూడగా అహంకారము పుట్టెను.

**జలకదంబము :** జలములో పృథ్వి కూడగా గుహ్యము పుట్టెను. జలములో జలము కూడగా రసము పుట్టెను. జలములో అగ్ని కూడగా జిహ్వేంద్రియము పుట్టెను. జలములో వాయువు కూడగా ప్రాణవాయువు పుట్టెను. జలములో ఆకాశము కూడగా చిత్తము పుట్టెను.

**అగ్ని కదంబము :** అగ్నిలో పృథ్వి కూడగా పాదము పుట్టెను. అగ్నిలో జలము కూడగా రూపము పుట్టెను. అగ్నిలో అగ్ని కూడగా చక్షురింద్రియము పుట్టెను. అగ్నిలో ఆకాశము కూడగ బుద్ధి పుట్టెను.

**వాయు కదంబము :** వాయువులో పృథ్వి కూడగా పాణి పుట్టెను. వాయువులో జలము కూడగా స్పర్శ పుట్టెను. వాయువులో అగ్ని కూడగా త్వగింద్రియము పుట్టెను. వాయువులో వాయువు కూడగా వ్యానవాయువు పుట్టెను. వాయువులో ఆకాశము కూడగా మనస్సు పుట్టెను.

**ఆకాశ కదంబము :** ఆకాశములో పృథ్వీ కూడగా వాక్కు పుట్టెను. ఆకాశములో జలము కూడగా శబ్దము పుట్టెను. ఆకాశములో అగ్ని కూడగా శ్రోతేంద్రియము పుట్టెను. ఆకాశములో వాయువు కూడగా సమాన వాయువు పుట్టెను. ఆకాశములో ఆకాశము కూడగా జ్ఞాత పుట్టెను.

**ఆకాశ తత్వస్తబకము :** జ్ఞాత దగ్గరనుండి చెప్పాలి. ఈ జ్ఞానమగు జ్ఞాత, సమాన వాయువును కూడుకొని శ్రోతేంద్రియము ద్వారా సమస్తవిధ శబ్దములను గుర్తెరిగి, వాక్కు ద్వారా వచించుచున్నారు.

**వాయు తత్వస్తబకము :** ఈ జ్ఞానమను జ్ఞాత మనోరూపమై వ్యానవాయువును కూడుకొని, త్వగింద్రియము ద్వారా స్పర్శను గుర్తెరిగి పాణీంద్రియము ద్వారా దానప్రతి గ్రహణము చేయుచున్నాడు.

**అగ్నితత్వ స్తబకము :** ఈ జ్ఞానమను జ్ఞాత ఉదాన వాయువును కూడి, చక్షురింద్రియము ద్వారా రూపములను గుర్తెరుగుచూ, పాదేంద్రియుతో గమనాగమనములు చేయుచున్నాడు.

**జలతత్వ స్తబకము :** ఈ జ్ఞానమను జ్ఞాత చిత్తరూపమై ప్రాణవాయువును కూడుకొని, జిహ్వేంద్రియము ద్వారా రసమును గుర్తెరిగి, గుహ్యేంద్రియము ద్వారా ఆనందించుచున్నాడు.

**పృథ్వితత్వ స్తబకము :** ఈ జ్ఞానమను జ్ఞాత అహంకార రూపమై అపాన వాయువును కూడుకొని ఘ్రాణేంద్రియము ద్వారా గంధమును గుర్తెరిగి, పాయురింద్రియము ద్వారా మల విసర్జన చేయుచున్నాడు. అన్నిటికి **"ఈ"** అనిపెడుతున్నాడు ఎందుకని? ఈ అంటె నీవైపు చూపించుకోవాలి. ఎవరికో చెప్పడం కాదు. నువ్వే ఆ పిండాండానివి. అజ్ఞానంలో పిండాండానివి, జ్ఞానంలో పిండాండము నీ ఉపాధి. అందులో గుర్తు ఎరిగేదే ఎరుక. సర్వము ఎరిగే ఎరుక ఆ ఇంద్రియములలో ఆ గోళకములలో 25 తత్వముల్లో వ్యాపించి ఉన్నటువంటిది "నీవు" అనే ఎరుక. ఆ ఎరుకయే నిజానికి ఆత్మ. ఈ స్తబకము ఈ వ్యాపారము లేకపోతే ఆ ఎరిగే ఎరుకయే **ప్రజ్ఞానం బ్రహ్మ**. ఈ స్తబకము ఈ వ్యాపారము చిత్త ప్రకారం ఉంటే వాడు అజ్ఞానిగా ఉన్న జీవుడు. జీవుడికి అజ్ఞానం పోతే జీవాత్మయే పరమాత్మ. అజ్ఞానంలోనే 24 తత్వాలతో కూడి ఉన్నాడు. జ్ఞాని ఈ 24 తత్వాలతో కర్మ చేస్తూ కూడా అసంగుడిగా ఉన్నవాడు. కూడియు కూడనివాడుగా ఉన్నాడు. కూడి ఉన్నప్పటికి కూడని వాడుగానే ఉన్నాడు.

అందుకే ప్రతిసారి మీరు స్తబకములో గమనించినట్లయితే **"ఈ"** జ్ఞానమగు జ్ఞాత మనోరూపమై **"ఈ"** జ్ఞానమగు జ్ఞాత బుద్ధిరూపమై, **"ఈ"** జ్ఞానమగు జ్ఞాత చిత్తరూపమై **"ఈ"** జ్ఞానమగు జ్ఞాత అహంకార రూపమై పైనుంచి క్రిందిదాకా వ్యవహారం, వ్యాపారం చేస్తున్నాడు. అంతరేంద్రియములలో జ్ఞానేంద్రియములతో, కర్మేంద్రియములతో, పంచప్రాణముల యొక్క శక్తితో వ్యవహరిస్తున్నాడు. శరీర ఇంద్రియాదులకు ప్రాణశక్తి అందించాలి. అందుకే ప్రతిసారి కూడా వాయు పంచకములోని ప్రతి వాయువుతో కూడి కూడి అంటారు. వాటిలో కూడకపోతే ఇంద్రియాలకు ఆ శక్తి సత్తా లేదు. ఆ శక్తి ఉంటే కాని వ్యహరించలేవు.

దీని తరువాత ఇవన్నీ ఎలా వచ్చాయో, ఏ వరుసలో వచ్చాయో తిరిగి అదే వరుసలో వెళ్ళిపోవాలి. ఒక పుష్‌పుల్ ట్రెయిన్ ఉంది అదేం చేస్తుంది? ఒక స్టేషన్‌నుండి మరొక స్టేషన్‌కు వెళ్తుంది. మధ్యలో 5,6 స్టేషన్‌లు ఉంటాయి. మళ్ళీ వెనక్కు వస్తుంది అది. అంటే దానికి రెండువైపుల ఇంజను ఉంటుంది. 2 ఇంజనులు ఉంటాయి. మొదటి ఇంజను లాగితే రెండవ ఇంజను వెనక్కు పుష్ చేస్తుంది. తిరుగు ప్రయాణంలో ముందు ఇంజను లాగుతుంటే, అప్పుడు వెనుకనున్న ఇంజను పుష్ చేస్తుంది. పుష్‌పుల్ ట్రెయిన్ అంటారు దాన్ని. ఉదాహరణకు గుంటూరు నుంచి విజయవాడ రావాలి అనుకోండి. వెళ్ళేటప్పుడు ఏ వరుసలో వస్తాయో తిరిగి వచ్చేటప్పుడు అదే వరుసలో వస్తాయి స్టేషన్స్. అంటే ఏ విధంగా తయారు అయ్యాయో ఆ విధంగానే లయము అవుతాయి. లయము అంటే లేకుండా పోవడం. ఒకటవది పుట్టింది, రెండవది పుట్టింది. తరువాత 3వది, తరువాత 4వది, తరువాత 5వది పుట్టింది. పోయేటప్పుడు మొదట 5వది పోతుంది. తరువాత 4వది, తరువాత 3వది, తరువాత 2వది, తరువాత మొదటిది పోతుంది. ఇది లయ పద్ధతి. కర్మేంద్రియాలు ఆఖరున పుట్టాయి. కదంబములో మనము

పాయురింద్రియముతో మొదలు పెట్టాము. లయము ఎక్కడనుండి ఉండాలి? పాయురింద్రియముతో మొదలవాలి. ఆకాశమునుంచి వాయువు వాయువునుంచి అగ్ని అగ్నినుంచి జలము జలము నుంచి పృథ్వి అన్నాము. పోయేటప్పుడు ఎలా పోవాలి? ముందు పృథ్వి పోవాలి, తరువాత జలము, తరువాత అగ్ని తరువాత వాయువు తరువాత ఆకాశము పోవాలి.

పృథ్వికి కఠినాంశము అంటాము. జలమునకు ద్రవాంశము అంటాము. అగ్నికి తేజాంశము అంటాము. వాయువునకు చలనాంశము అంటాము. ఆకాశము బయలాంశముగా ఉన్నది. అంతకుముందు గోళకము ఎలా ఉంది? తామసిక సూక్ష్మ పృథ్వి అర్ధభాగము 4 పరకలు వాగింద్రియము, పాణింద్రియము, పాదేంద్రియము, గుహ్యేంద్రియము అయినాయి. ఇప్పుడు ఆ సూక్ష్మ పృథ్వి ఆకాశము వాయువు, అగ్ని జలములను పృథ్వి నుంచి విడగొడితే పోతాయి. రెండు కలిస్తే వచ్చినాయి. ఉదా : పసుపు సున్నము కలిస్తే ఎర్ర రంగులో పారాణి వచ్చింది. పసుపులో సున్నాన్ని వేరుచేస్తే పారాణి ఉండదు. కెమిస్ట్రీ ఇది. సోడియం క్లోరిన్ కలిస్తే సోడియం క్లోరైడ్ ఉప్పు వచ్చింది. సోడియం క్లోరిన్ కలవకపోతే ఉప్పు అవ్వలేదు. $H_2O$ అంటే వాటరు. 2 హైడ్రోజన్ ఒక ఆక్సిజన్ కలిస్తే నీళ్ళు అయ్యాయి. నీళ్ళలో ఆక్సిజన్ తీసేస్తే హైడ్రోజన్ వేరుచేస్తే నీళ్ళు లేవు. ఇది లయ పద్ధతి.

**పృథ్వి పంచకలయము :** పృథ్వి యొక్క కఠినాంశములో ఆకాశము యొక్క బయలాంశము చేరగా వాక్కు లయము. పృథ్వి యొక్క కఠినాంశములో వాయువు యొక్క చలనాంశము చేరగా పాణేంద్రియము లయము. పృథ్వి యొక్క కఠినాంశములో అగ్ని యొక్క తేజాంశము చేరగా పాదేంద్రియము లయము. పృథ్వి యొక్క కఠినాంశములో జలముయొక్క ద్రవాంశము జేరగా గుహ్యేంద్రియము లయము. పృథ్వి యొక్క నిండాంశములో పాయువనే అర్థాంశము జేరగా పాయురింద్రియము లయము. చివరకు మొదట్లో ఉన్న సూక్ష్మ పృథివి మిగిలింది.

**జలపంచకలయము :** జలము యొక్క ద్రవాంశములో ఆకాశముయొక్క బయలాంశము చేరగా శబ్దము లయము. జలము యొక్క ద్రవాంశములో వాయువు యొక్క చలనాంశము చేరగా స్పర్శ లయము. జలము ఒక్క ద్రవాంశములో అగ్ని యొక్క తేజాంశము చేరగ రూపము లయము. జలము యొక్క ద్రవాంశములో పృథ్వి యొక్క కఠినాంశము జేరగా గంధము లయము. జలమనే నిండాంశములో రసమనే అర్థాంశము జేరగా రసము లయము. చివరకు సూక్ష్మజలము మిగిలింది.

**అగ్ని పంచక లయము :** అగ్నియొక్క తేజాంశములో ఆకాశము యొక్క బయలాంశము జేరగా శ్రోతేంద్రియము లయము. అగ్ని యొక్క తేజాంశములో వాయువు యొక్క చలనాంశము చేరగా త్వగింద్రియము లయము. అగ్ని యొక్క తేజాంశములో జలముయొక్క ద్రవాంశము జేరగా జిహ్వేంద్రియము లయము. అగ్ని యొక్క తేజాంశములో పృథ్వి యొక్క కఠినాంశము చేరగా ఘ్రాణేంద్రియము లయము. అగ్ని అనే నిండాంశములో చక్షువనే అర్థాంశము చేరగా చక్షురింద్రియము లయము. చివరకు సూక్ష్మ అగ్ని మిగిలింది.

**వాయు పంచక లయము :** వాయువు యొక్క చలనాంశములో ఆకాశము యొక్క బయలాంశము చేరగా సమాన వాయువు లయము. వాయువు యొక్క చలనాంశములో అగ్ని యొక్క తేజాంశము చేరగా ఉదాన వాయువు లయము. వాయువు యొక్క చలనాంశములో జలము యొక్క ద్రవాంశము జేరగా ప్రాణ వాయువు లయము. వాయువు యొక్క చలనాంశములో పృథ్వి యొక్క కఠినాంశము చేరగా అపాన వాయువు లయము. వాయువు అనే నిండాంశములో వ్యాన వాయువు అనే అర్థాంశము చేరగా అపాన వాయువు లయము. చివరకు సూక్ష్మ వాయుభూతము మిగిలింది.

**ఆకాశ పంచ లయము :** ఆకాశము యొక్క బయలాంశములో, పృథివి యొక్క కఠినాంశము చేరగా, అహంకారము లయము. ఆకాశము యొక్క బయలాంశములో జలము యొక్క ద్రవాంశము చేరగా చిత్తము లయము. ఆకాశము యొక్క బయలాంశములో, అగ్నియొక్క తేజాంశము చేరగా, బుద్ధి లయము. ఆకాశము యొక్క బయలాంశములో, వాయువుయొక్క చలనాంశము చేరగా, మనస్సు లయము. ఆకాశము యొక్క నిండాకాశములో, జ్ఞాతయనే అర్థాంశము చేరగా, జ్ఞాత లయము. చివరకు సూక్ష్మ ఆకాశము మిగిలింది.

సూక్ష్మ భూతాలలో పంచీకరణ అంతా రివర్స్‌లో లయమవుతున్నాయి. మొదట్లో ఇవెలా వచ్చాయి మనకి? ఆది శక్తి రూపుడైన హిరణ్యగర్భుడు నుండి జ్ఞాన, ఇచ్ఛా క్రియా శక్తులొస్తే తన్మాత్రలు, పంచభూతాలు, పంచీకరణ ఇది అంతా వచ్చింది. తిరుగు ప్రయాణం ఎక్కడకు వెళ్ళాలి. హిరణ్యగర్భుడు ఊహ మానెయ్యాలి. కనుక ఆకాశ పంచకము లయము కాంగానే హిరణ్య గర్భుడు ఊహ మానెయ్యాలంటే ఎక్కడికి వెళ్ళాలి. హిరణ్య గర్భుడులో లయమవ్వాలి. హిరణ్య గర్భుడు ఎక్కడున్నాడు? మహత్ అభిమానిగా ఉన్నాడు. మహదహంకారము దేనినుంచి వచ్చింది? మహత్తునుండి. అహంకారము లయము కాగానే, అభిమాని ఉండడు. అపుడు మహత్తు ఉంటుంది. మహత్తు దేనివలన వచ్చింది? అవ్యక్తము నుంచి వచ్చింది. అవ్యక్తము కూడా పోవాలంటే ఏం చెయ్యాలో చూద్దాం.

**అష్ట ప్రకృతి లయము :** ఆకాశమునుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని, అగ్ని నుంచి జలము, జలమునుంచి పృథ్వి వచ్చింది. ఇవి లయము ఎలా అవ్వాలి? పృథ్వి జలమునందు, జలము అగ్నియందు, అగ్ని వాయువునందు, వాయువు ఆకాశమునందు లయము కావాలి. ఇపుడు ఆకాశము మహదహంకారమునందు లయము. మహదహంకారము మహత్‌నందు లయము. మహత్ అవ్యక్తమునందు లయము. అవ్యక్తము బ్రహ్మయందు లయము అంటే అపుడు ఏమవుతుంది? బ్రహ్మ సర్వ కారణం అవుతున్నాడు. వాడు దేనికీ కారణం కాదు గదా! వాడు ఉన్నది ఉన్నట్లుగా అచలంగా పరిపూర్ణంగా ఉన్నాడు కదా! అందుకని అవ్యక్తము వరకే లయము. అవ్యక్తము బ్రహ్మయందు లయము అనకూడదు. ఏమనాలి ఇపుడు? అవ్యక్తము దేశకేంద్రులు అనేటటువంటి అశీర గురువు అచల పరిపూర్ణ పరబ్రహ్మము అనే బయలును చూపించగా సచ్ఛిష్యుడు అట్టి బయలును చూసి ఆ శిష్యుడు లేకుండా పోవాలి. మూలము లేని ఈ గుర్తెరిగే దేహమేమీ లేదు అని ఆ శిష్యుడే లేనివాడు లేకుండా పోవాలి. అవ్యక్తము నిర్వికార నిర్వికల్ప అచల పరిపూర్ణ పరబ్రహ్మమును దేశికేంద్రులు అయిన అశరీరి గురువు చూపించగా చూసి, తానే లేకుండా పోయేట్లుగా సచ్ఛిష్యుడు లయమవ్వాలి.

ఇది ఎప్పుడో అయిపోయింది. ఇపుడు చెప్పినవన్నీ శిష్యుడియొక్క రిఫరెన్స్ ప్రకారంగా క్లుప్తంగా ఒక వరుసలో చెప్పుకుంటూ వచ్చాము. ఎందుకంటే దీనిపేరే సర్వ వేదాంత శిరోభూషణం. వేదాలు, వేదాంతము మహా వాక్యాలు, సాధనా మార్గాలు రకరకాలుగా ఉంటాయి. కనుక అన్ని రకాలు కవర్ చేస్తున్నాము. కనుక ఒక రకానికి ఒక రకం ఎక్కడైన సమన్వయం చేయగలము, కాని గొలుసుకట్టుగా ఒక వరుసలో ఉండవు అవి.

కుండలినీ చెప్పగానే ఆ పాఠం తీసేసి ప్రణవం చెప్తాం. ప్రణవం చెప్పంగానే ఆ పాఠం తీసేసి వేరేచోట హంసతత్వము చెప్తాం. అది చెప్పగానే ఆ పాఠం అక్కడ పెట్టేసి, సాంఖ్య పద్ధతిలో పంచీకరణ స్థూల సూక్ష్మ శరీరాలు దీంట్లో 3 గుణములచేత ఏవి ఎలా తయారు అవుతున్నాయి అని చెప్పుకుంటాము. ఈ పంచీకరణ అవ్వంగానే, ఇంకోదానికి వెళ్తాం. పంచకోశాలకి వెళ్తాం. దాని తరువాత అవస్థాత్రయానికి వెళ్తాం. అవస్థాత్రయాలలో సాక్షియే ఆత్మ పంచ కోశాల్లో వ్యతిరిక్త ధర్మమైన సత్‌చిత్ ఆనందమే ఆత్మ. మూడవస్థలకు తురీయమే ఆత్మ. ఇలా అన్ని పాఠాల్లోను ఆత్మ నిర్ణయం చేసుకుంటూ వెళ్తాం. ఈ ఆత్మ నిర్ణయాన్ని తేలిగ్గా అందరికీ అర్థమయ్యేలా చెప్తే ప్రథమాంకము సమాప్తం అవుతుంది.

పంచభూతాలయొక్క కలయికచేత కదంబము అయ్యింది. వ్యవహారము చేత 25 తత్వాలు ఏర్పడిన తరువాత జరిగే వ్యవహారము స్తబకము. ఏ విధముగా కదంబములో ఇవన్నీ పుట్టాయో జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు ఇవన్నీ పుట్టి ఒక వరుస క్రమంలో ఎలా ఏర్పడ్డయో అనేది కదంబము. ఏర్పడ్డవన్నీ మరలా ఎలా వ్యవహరిస్తున్నాయో అనేది స్తబకము. ఏ రకంగా వచ్చినవో ఏర్పడ్డాయో మరల అదే రకంగా తిరిగి ఆ పంచభూతాలన్నీ వాటి వాటి స్థానాలకు వెళితే ఆ ఇంద్రియాలు లయమవుతాయి. అవన్నీ వరుసగా చెప్పాము.

పంచీకరణలో మొట్టమొదట సూక్ష్మ పృథ్వి పంచబడి కర్మేంద్రియాలు అయ్యాయి. తిరిగి అవి ఉపసంహరించుకుంటే సూక్ష్మ పృథ్వి ఏర్పడింది. అలాగే జల పంచకములో సూక్ష్మ జలము పంచబడ్డప్పుడు ఇతర భూతములతో కలసినప్పుడు శబ్దాది విషయాలు వచ్చాయి. తిరిగి పంచబడ్డవన్నీ విరమించుకుంటే ఆ విషయాలు లయమై సూక్ష్మ జల భూతము మిగిలింది. అలాగే ఆకాశ పంచకములో సూక్ష్మ ఆకాశము ఇతర భూతాలతో పంచబడ్డప్పుడు అంతరేంద్రియాలు ఏర్పడ్డాయి. మళ్ళీ ఆకాశ విభాగాలన్నీ ఆ భూతాలనుండి విరమించుకున్నప్పుడు మళ్ళీ సూక్ష్మ ఆకాశం మిగిలింది. అలాగే అగ్ని పంచకములో కూడా ఏ విధముగా ఇంద్రియాలు ఏర్పడ్డాయో ఆ కలయికను మళ్ళీ వెనక్కి తీసుకున్నప్పుడు జ్ఞానేంద్రియాలు లయము. అలాగే పంచ ప్రాణాలు లయము. అన్నీ లయం కాగా ఏం మిగిలింది? సూక్ష్మ పంచభూతాలు మిగిలాయి. సూక్ష్మ పృథివి సూక్ష్మ జలమునుండి పుట్టింది. అందువలన సూక్ష్మ పృథివి సూక్ష్మ జలములో లయం. సూక్ష్మ అగ్నినుండి వచ్చిన సూక్ష్మ జలము తిరిగి సూక్ష్మ అగ్నిలో లయం. సూక్ష్మ వాయువు నుండి వచ్చిన సూక్ష్మ అగ్ని తిరిగి సూక్ష్మ వాయువులోనే లయం. సూక్ష్మ ఆకాశము నుండి పుట్టిన సూక్ష్మ వాయువు తిరిగి సూక్ష్మ ఆకాశములో లయం.

ఈ విధముగా సూక్ష్మ భూతాలనుండి ఏర్పడిన ఇంద్రియాలు, విషయాలు నిష్క్రియమై, నిర్వికల్పమైతే, అవన్నీ వాటి వాటి సూక్ష్మ భూతాలలో లయమైపోతాయి. సూక్ష్మ భూతాలేమో, పృథివి జలములోను, జలము అగ్నిలోను, అగ్ని వాయువులోను, వాయువు ఆకాశములోను లయమైపోతాయి.

అలాగే శబ్ద స్పర్శ రూప రస గంధ విషయాలు ప్రారబ్ధ కర్మానుసారం అనుభవించడానికి ఇంద్రియాలు బహిర్ ముఖానికి వచ్చినాయి. అవన్నీ అవసరాలు తీరిపోయాక వైరాగ్యం వచ్చిన తరువాత నిష్క్రియగా మారాక వాటికి పనిలేదు. వాటికి పనిలేకపోతే విశ్రాంతి తీసుకుంటాయి. బ్రహ్మ కూడా సృష్టిలోకి వచ్చాడు. సృష్టి చేస్తూ వుంటే ఎందుకొచ్చాడో ఆ పని చేస్తాడు. ఈ సృష్టిలోకి వచ్చిన బ్రహ్మ చేయాల్సిన పనులన్నీ మానుకుంటే అసలు ఎందుకొచ్చినట్టు ఇక్కడికి? ఒక పని నిమిత్తం వచ్చాడు. పనిచేయడం అవసరం లేనప్పుడు ఆ బ్రహ్మ నిర్వికల్పంలోకి వెళ్తాడు కదా! సవికల్పముగా వుండి సృష్టిలో పనిచేస్తున్నటువంటి బ్రహ్మ నిష్క్రియం కాగానే ఆ బ్రహ్మ నిర్వికల్పముగా అయిపోయి పరబ్రహ్మ అవడూ? అలాగే ఇంద్రియాలు పనిచేయడానికి సూక్ష్మ భూతాలు అన్నీ పంచీకరణ అయ్యాయి. ఎప్పుడైతే ఇంద్రియాలు పనిచేయలేదో సూక్ష్మ భూతాలు వాటి వాటి స్థానాలకు అవి వెళ్ళిపోయినాయి.

అంతరేంద్రియాలు నిర్వికల్పం కాగానే సూక్ష్మాకాశము జ్ఞాతతోసహా మహదహంకారంలో లయం. మహదహంకారము యొక్క ఊహయే సృష్టి అయింది కనుక. సృష్టి ఆయనలో లయమయింది, అంటే సృష్టికి సంబంధించిన ఊహ ఆగిపోయింది. హిరణ్యగర్భుడి యొక్క ఊహ ఆగిపోతే – హిరణ్యగర్భుడు ఊహిస్తున్నప్పుడు త్రిగుణాలు పనిచేసినాయి. ఊహ ఆగిపోయినప్పుడు త్రిగుణాలు పనిచేయకుండా ఆగినాయి. అప్పుడు త్రిగుణాలు సామ్యంగా వున్నాయి. త్రిగుణ సామ్యం మహత్తు కనుక, ఈ హిరణ్య గర్భుడు లేదా మహదహంకారము అనేటటువంటివాడు మహత్తు లోకి లయమయ్యాడు. త్రిగుణములు బీజనించి అంకురించినాయి. అంకురించి మహత్తులో సామ్యంగా వుంటాయి. త్రిగుణాలవల్ల ప్రయోజనం లేకపోయే సరికి, గుణములు అవ్యక్తంలోకి వెళ్ళిపోయాయి.

టార్చ్ లైట్‌లో బ్యాటరీ వేయండి. అది వాడుతూ వుంటే ఎన్ని రోజులైనా వస్తుంది. తరువాత బ్యాటరీ అయిపోతే కొత్త బ్యాటరీ వేస్తాం. కానీ త్రిగుణాలతో కూడినటువంటి మాయా శక్తి అనే బ్యాటరీని వాడకపోతే కొన్నాళ్ళకు అది డిశ్చార్జి అవుతుంది. అలాగే మహత్తులోని గుణాలు డిశ్చార్జి అవుతాయి. కాని కొన్ని బ్యాటరీలను మళ్ళీ ఛార్జి చేసుకోవచ్చు. అప్పుడది తిరిగి వచ్చే మోక్షమవుతుంది. రీఛార్జ్ చేయవలసిన అవసరము లేకపోతే తిరిగిరాని మోక్షము.

మరి ఎరిగే ఎరుక కూడా లేకుండా చేసినప్పుడు ఏమయింది? మూడు గుణములయొక్క సామ్య స్థితి బీజ స్థితికి వెనక్కి వెళ్ళిపోయింది. అంటే అప్పుడు సూక్ష్మ ఆకాశము మహదహంకారంలో లయమయింది. మహదహంకారము మహత్తులో లయమయింది. మహత్తు అవ్యక్తములో లయమయింది. మళ్ళీ ఇది పోయి ఇంకో దాంట్లో లయమవడానికి ఏముంది? సృష్టి అంతా కూడా మూడు గుణాలు కారణమే గానీ, మరొక కారణము లేదు కదా!

భూమిలో పాతినటువంటి బీజము వెంటనే మొక్క అవదు. పరిస్థితులు వాతావరణము అనుకూలించినపుడు మొక్క అవుతుంది. అంతవరకు అది నిర్గుణము. మొక్క అయ్యాక సగుణము. అలాగే అంతవరకు అది అవ్యక్తము. సహాయ కారణాలు ఉంటే మళ్ళీ మహత్తు అవుతుంది. అవ్యక్తములో వున్న మూడు గుణాలనూ బీజస్థితిలో వుండంగానే నిర్బీజం చేయాలి. పరిపూర్ణ బోధచేత త్రిగుణ రహితం అయినటువంటి అచల పరిపూర్ణము అన్ని కాలాలలోనూ వున్నది. కదలక మెదలక దేనికీ మూల కారణం కాకుండా ఉండుటను పరిపూర్ణ బోధ ద్వారా తెలుసుకున్న వాడు ఏం చేస్తాడు? అటువంటి నిర్వికల్ప నిర్వికార అచల పరిపూర్ణ పరబ్రహ్మమును దర్శించకనే దర్శించి, దర్శించినటువంటి పరోక్షత్వాన్ని కోల్పోయి, అపరోక్షమై పరిపూర్ణంగా అచలంగా ఉంటాడు. అశరీర గురువు ఎవరైతే దేశికేంద్రులో, అచల పరిపూర్ణాన్ని బట్టబయలు రూపంగా దర్శింపచేస్తే దానియందు ఏమీలేక, తన మూలము లేకపోగా, ఆ దృక్కు కూడా లేనివాడవుతాడు. ఆ గురువు బట్టబయలుని చూపించినప్పుడు చూచి మూలములేని గుర్తెరిగే శరీరము ఏమీ లేదని సచ్ఛిష్యుడు ఎవరైతే అవ్యక్తము దాకా ప్రయాణం చేశాడో వాడు లేనివాడు లేకుండా పోతాడు. ఇదిచూచి సర్వం లయము. అటువంటి శిష్యుడు అచల పరిపూర్ణ పరబ్రహ్మని చూచి లయము.

**ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధి దైవతములు :**

జ్ఞాత దగ్గర మొదలు పెడదాం. జ్ఞాత ఆధ్యాత్మికం. జ్ఞాత ఎరుగుట ఏదో అది ఆధిభౌతికం. జ్ఞాత ఎరుగుటకు ఎవరైతే ప్రేరేపిస్తున్నారో ఆ గురుమూర్తి ఆధి దైవికం. మనసు ఆధ్యాత్మికం. సంకల్ప వికల్పములు ఆధిభౌతికం. చంద్రుడు ఆధి దైవికం. బుద్ధి ఆధ్యాత్మికం. నిశ్చయించుట ఆధి భౌతికం. బృహస్పతి ఆధి దైవికం. చిత్తము ఆధ్యాత్మికం. చింతన చేయడం ఆధి భౌతికం. క్షేత్రజ్ఞుడు ఆధి దైవికం. ఈ విధంగా అన్నీ చూసుకోండి అదే మాదిరి. ఉదాహరణకు అంతరేంద్రియాలు ఇచ్చాడు. అంతరేంద్రియాలు అంటే ఏమిటి? జ్ఞాత, మనసు, బుద్ధి, చిత్తం, అహంకారం. ఇవన్నీ ఆధ్యాత్మికము. ఆధి భౌతికం ఎరుగుట, సంకల్ప వికల్పములు, నిశ్చయించుట, చింతన చేయుట, అభిమానించుట. ఆధిదైవికం గురుమూర్తి, చంద్రుడు, బృహస్పతి, క్షేత్రజ్ఞుడు, రుద్రుడు. ఈ విధముగా అంతరేంద్రియాలకు ఇచ్చాము. అదేమాదిరి జ్ఞానేంద్రియాలు, పంచ ప్రాణాలకు వుంటాయి. పంచ ప్రాణాలకు ఏముంది? జయుడు, విశ్వయోని, అజుడు, విశిష్టుడు, విశ్వకర్త అనేవారు ఆధి దైవికము.

కుడిప్రక్క చార్ట్ (53 పేజీ)కి వెళ్తే పంచభూత తత్వములు అని వుంది. ఆకాశ పంచకము లైనులో జ్ఞానమగు జ్ఞాత , మనసు బుద్ధి చిత్తము అహంకారము ఇవన్నీ అంతరేంద్రియములు. వాయు పంచకములో సమాన వాయువు వ్యాన వాయువు ఉదాన వాయువు ప్రాణ వాయువు అపాన వాయువు ఇవన్నీ ప్రాణేంద్రియములు. అగ్ని పంచకములో శ్రోత్రేంద్రియము త్వగింద్రియము చక్షురింద్రియము జిహ్వేంద్రియము ఘ్రాణేంద్రియములు అయిదు. జల పంచకములో శబ్ద స్పర్శ రూప రస గంధములు విషయ పంచకము. పృథ్వీ పంచకములో కర్మేంద్రియములు అయిదు.

తరువాత 54 వపేజీ జ్ఞానేంద్రియములు శబ్ద బేధములు రెండూ అన్నాడు. క్షరము, అక్షరము. క్షరాక్షరము ఏమిటి? ఒక శబ్దం కంటిన్యూగా వుంటుంది. మిగతా శబ్దాలు అలా వినబడతాయి, ఆగిపోతాయి. గంగిరెద్దు మేళంవాడు సన్నాయితో బూర ఊదుతూ వుంటాడు. బూరేమో కంటిన్యూగా వుంటుంది. సన్నాయి ఏమో పాట పాడుతూ వుంటుంది. పాట పాడినప్పుడు అది అనేక స్వరాలు మారిపోతూ వుంటాయి. ఆగిపోతూ వుంటాయి, మారిపోతూ వుంటాయి. అది క్షరము. బూర మాత్రం కంటిన్యూగా వుంటుంది అది అక్షరము. పాట పాడేటప్పుడు కూడా రాగము తానము పల్లవి వుంటుంది. ఒక హార్మనీ పెట్టి వాయించుతూనే వుంటారు. అది అక్షరము, అది ఆగదు. పాటని బట్టి తాళం వుంటుంది. ఇది క్షరములు. స్వరములు ఏడైనా రాగాలెన్నో! అక్కడ ఏడే వున్నాయి, గానీ ఇక్కడ ఓంకారము అనేటటువంటిది ఒక్కటే. అక్షర శబ్దము అంటాం. మిగతా శబ్దాలన్నీ కూడా క్షరములు. మిగతా శబ్దాలు ఎన్ని వున్నాయి? 50 అక్షరాలు. 50 అక్షరాలలో ఓం కారం అనేది అక్షరము. మిగతా 50 అక్షరములు క్షరములు. ఒక అక్షరం తరువాత ఒక అక్షరం మారిస్తే గానీ ఉచ్చారణలో ఆ పదము, ఆ పదము యొక్క అర్థము మనకు తెలియదు.

స్పర్శ బేధములు నాలుగు ఇచ్చారు. ఇది కరక్టే. చల్లదనము, వేడి, మెత్తదనము, కఠినము. రూప బేధములు అయిదు ఇచ్చారు. తెలుపు, పసుపు పచ్చ, నలుపు, ఆకపచ్చ, ఎరుపు. రస బేధములు ఆరు. షడ్ రుచులు అందరికీ తెలుసు. మధురము అంటే తీపి. ఆమ్ల అంటే పులుపు. తిక్త అంటే కారము. కటు అంటే వగరు. కషాయ అంటే చేదు. లవణం అంటే ఉప్పు. గంధబేధములు రెండు : సుగంధము దుర్గంధము. ఒక్కోచోట రెండూ ఒక్కోచోట నాలుగు అంటారు. ఇవన్నీ తేడాలు వున్నాయి సరే. ఒక సబ్జెక్ట్ గా తెలుసుకుంటున్నాం మనం. ఆ తరువాత దాంట్లో (మూడో గడి) శబ్దమే విషయము. స్పర్శయే విషయము. రూపమే విషయము. రసమే విషయము. గంధమే విషయము. అధిష్ఠాన దేవతల పేర్లు వుంటాయి. అష్టదిక్పాలకులు అంటూ వున్నాము, కాని ఇక్కడ దశదిక్కులు ఇచ్చాడు. అంటే ఎనిమిది దిక్కులు, పైన క్రింద కలిపి దశ దిక్కులు. పూర్వమేవ నిరాలంబం అనుకున్నప్పుడు ఏం చెప్పాం. అంతా అయ్యాక ఊర్ధ్వమేవ అన్నాం. మళ్ళీ అథశ్చ ఇచ్చాం. మళ్ళీ లోపల బయట ఇచ్చాం. లోపల బయట అనేదానికి దిక్కేమీ లేదు. లోపల బయట అనేది సాధకుని విషయంలో అంతర్ముఖములో బ్రహ్మనిష్ట వుంది. బహిర్ముఖంలో ప్రపంచం వుంది. అందుకే లోపల బయట అన్నాం. అంతర్ బహిశ్చ సర్వత్ర అచలోయం సనాతనః. అన్నారు. దశదిక్కులూ వుంటాయి, అంటే, ఎనిమిది అడ్డంగా వుంటే పైన క్రింద అనేది ఇంకో రెండు కలిపాం. దశ దిక్కులే అధిదేవత. స్పర్శ బేధానికి రుద్రుడు అధిదేవత. రూప బేధానికి సూర్యుడు అధిదేవత. రస బేధానికి వరుణుడు అధిదేవత. గంధ బేధానికి అశ్వనీ దేవతలు అధి దేవతలు. శబ్దము ఆకాశ భూతమునుబట్టి వుంది. స్పర్శ వాయు భూతాన్నిబట్టి వుంది. రూప బేధాలన్నీ కూడా అగ్ని భూతంవల్ల, రస బేధాలన్నీ జల భూతంవల్ల గంధ బేధాలన్నీ పృథ్వీ భూతంవల్ల. ఈ భేదాలను గ్రహించేవి పంచ జ్ఞానేంద్రియాలు.

వచన బేధములు రెండు. సువాక్యము దుర్వాక్యము. వచనమే విషయం. సరస్వతి అధి దేవత వాక్కుకి. ఇక్కడ అధిదేవతల పేర్లు తేడా వున్నాయి చూసుకోండి. అక్కడ వాక్కుకి పిండాండ పంచీకరణలో అగ్ని (వహ్ని) అని వుంది. ఇక్కడ సరస్వతి. ఇందాక పైదాంట్లో కూడా రుద్రుడు అధిదేవత ఇచ్చారు. కాని పంచీకరణ పఠంలో వాయుదేవుడు అని ఇచ్చారు. అలా కొన్ని మార్పులు వున్నాయి. ఏదైనా వ్యవస్థ ఎలా వుంటుందో చూడండి. **సత్వగుణంతో ఏర్పడినటువంటి అధిదేవతలు రజో గుణంతో ఏర్పడినటువంటి ఇంద్రియాలను ప్రేరేపిస్తే తమోగుణంతో ఏర్పడిన గోళకాలలో కూర్చొని స్థూల శరీరాన్ని ఆశ్రయించి ఇలా కూర్చినటువంటి ఇంద్రియాలతో కూడిన సూక్ష్మ శరీరము మూడు గుణాలతో ప్రవర్తిస్తోంది. ప్రవర్తించడానికి అనేక జన్మలయొక్క సంచితములనుండి విభాగమైనటువంటి ప్రారబ్ధ కర్మ**. మీరు ఒక కాన్సెప్ట్ పెట్టుకుంటే, ఇందులో అధిదేవతల పేరు తేడా వచ్చింది, లేకపోతే శబ్దాలు నాలుగు అంటే ఇక్కడ రెండు రకాలు వున్నాయేంటి? అని ఇవన్నీ పెట్టుకోవద్దు. మీరు వదిలేయండి. అవన్నీ పరిశీలించి చూశాము, అవి ముఖ్యం కాదు.

బ్రహ్మ సత్యం జగత్ మిథ్య. మిథ్య దాంట్లోనేగా ఇవన్నీ. పది లెక్కపెట్టిందీ మిథ్యే, పది కాదు నాలుగు లెక్కపెట్టిందీ మిథ్యే. నాలుగు రైటా పది రైటా అనేది అనవసరం. మీకొక ఉదాహరణ చెప్పాం. నలుగురు దొంగలు వున్నారట. ఎక్కడో దొంగతనం చేసి న్యాయంగా పంచుకున్నారట. న్యాయంగా పంచుకోకపోతే ఏమవుతుంది? వాళ్ళలో వాళ్ళు కొట్టుకుంటే దొంగతనం బయట పడుతుంది. అలాగే దొంగలు న్యాయంగా ధర్మంగా పంచుకున్నారు అంటే వాళ్ళు ధర్మాత్ములా? దొంగలు ధర్మాత్ములయ్యారా? పంచుకోవడం అయితే న్యాయంగా పంచుకున్నారు గాని అసలు సొమ్మెక్కడిది? దొంగతనం. అందుకే ఈ మిథ్యా జగత్తులో ధర్మాధర్మాలు రెండూ వున్నాయి. మిథ్యలో వున్నప్పుడు ధర్మాధర్మాలు వుంటాయి. బ్రహ్మ సత్యం అన్నప్పుడు జగత్తు మొత్తం తీసి అవతల పడేస్తే పాపం పోయింది పుణ్యం పోయింది, ధర్మమూ పోయింది, అధర్మమూ పోయింది. అన్నీ పోయినాయి. అనంత ఉపనిషత్‌లో ఏమంటున్నాము? భావాభావాలు లేవు. సాధ్యాసాధ్యములు లేవు ధర్మాధర్మములు లేవు అని చెప్తున్నాం. మెహెర్‌బాబా వస్తే అందరూ అజ్ఞానులే. అజ్ఞానంలోనే కొందరు మంచివాళ్ళు, కొందరు భక్తులు, కొందరు నాస్తికులు, బాబాదృష్టిలో అంతా సమానమే. మనకే ఈ తేడాలు. నువ్వే అబద్ధపు మనిషివి. నువ్వొక సత్యం, నీకొక అసత్యమా మళ్ళీ?

సత్యాసత్యాలు రెండూ కూడా ఒక అబద్ధపు మనిషికే వున్నాయి. నిజమైన మనిషి ఎక్కడున్నాడు అసలు? కేవల పరబ్రహ్మగా వున్నాడు. వాడికి ఇవన్నీ పట్టాయా? అందుకే ఈ బేధాలన్నీ. సబ్జెక్ట్ ఎలా నడుస్తుందో చూడండి. ప్రకృతిలో వ్యవహారం ఎలా వుందో చూడండి. కాస్త అటూ ఇటూగా వున్నా పెద్ద తేడా లేదు.

గురువులను శాస్త్రం చెప్పేవాళ్ళని, వేదం చెప్పేవాళ్ళని, సూచన చేసేవాళ్ళని, గమ్యం చేర్చేవారని ఎన్ని విభాగాలైనా చేయవచ్చు. బుద్ధి వాక్యం చెప్పే గురువు ఒకరు, జ్ఞాన వాక్యం చెప్పే గురువు ఒకరు, అనుభవ వాక్యం చెప్పే గురువు ఒకరు, తరింపచేసేవారు ఒకరు – నలుగురు. అష్ట విధ గురువులు అనగానే ఎనిమిదుగురు వుంటారనా? ఎనిమిది కాదండీ నాలుగండీ, రెండండీ అంటే ఏమిటి? **గురువులు ఎందరైనా గురుతత్వం ఒక్కటే. ప్రవచించేవారు ఎంతమంది వున్నా ప్రవచనం ఒక్కటే. ఎవరెన్ని వాక్యాలు చెప్పినా దేవుని వాక్యం ఒక్కటే.**

**పంచభూతముల వలన పుట్టిన వివరం:**

పృథ్వివల్ల ఎముకలు, చర్మము, మాంసము, నరములు, రోమములు కలిగెను. జలమువల్ల రక్తము, మూత్రము శుక్లము, శ్లేష్మము, మెదడు కలిగెను. అగ్నివల్ల ఆకలి దప్పిక నిద్ర బద్ధకం శృంగారం కలిగెను. వాయువువల్ల పిండాండమందు మనలో చలనము గమనము తీవ్రత లజ్జ మదము కలిగెను. ఆకాశమువల్ల కామము క్రోధము లోభము మోహము భయము కలిగెను. కొన్ని ఇక్కడ డివైడ్ చేసిపెట్టాం గానీ ఇంకా ఎక్కువే వుంటాయి. మరి అయిదు ఎందుకు పెట్టాం అంటే ప్రధానమైనవి. అస్థి చర్మం మాంసము నరములు రోమములు ఇక్కడ అయిదు వచ్చినాయి. పంచ భూతములు అయిదు కాబట్టి, పృథ్వి వలన అస్థి ఎముకలని, పృథ్విలో జలము చేర్చితే చర్మమని పృథ్విలో అగ్నిలో చేర్చితే మాంసమని పృథ్విలో వాయువు కూడితే నరములని పృథ్విలో ఆకాశము కూడితే రోమములని చెప్పుకోవచ్చు. ఇవి కూడా పంచీకరణ పద్ధతిలో వచ్చినవే. జలమువల్ల రక్తము వచ్చింది. జలము పృథ్వితో కలిస్తే రక్తము. జలము వలన కలిస్తే మూత్రము. జలము అగ్నితో కలిస్తే శుక్లము. జలము వాయువుతో కలిస్తే శ్లేష్మము. జలము ఆకాశముతో కూడితే మెదడు. అగ్ని పృథ్వితో కూడితే ఆకలి. అగ్ని జలముతో కూడితే దప్పిక. అగ్ని వలన నిద్ర. అగ్ని వాయువుతో కూడితే బద్ధకం. అగ్ని ఆకాశముతో కూడితే సంగమం. వాయువువల్ల చలనము. వాయువు పృథ్వితో పంచీకరణ అయినప్పుడు చలనాలు కలిగాయి. వాయువు జలముతో కూడినప్పుడు గమనాగమనములు అయినాయి. వాయువు అగ్నితో కూడినప్పుడు తీవ్రత, వాయువు వాయువుతో కూడితే లజ్జ, వాయువు ఆకాశంతో కూడితే మదం. ఈ మదం అనేది ఆకాశ సంబంధం. మళ్ళీ ఆకాశం పృథ్వితో కూడితే కామం. జలంతో కూడితే క్రోధం, అగ్నితో కూడితే లోభం, వాయువుతో కూడితే మోహం, ఆకాశము వలన భయం. ఇట్లా వచ్చినప్పటికీ ఇది కూడా పంచీకరణే.

**త్రిపుటులు :**

ఇంతకుముందు మనం అధ్యాత్మికము ఆధిభౌతిక్మము, ఆధి దైవికము కలిపి త్రిపుటులుగా చెప్పాం. జ్ఞాత జ్ఞానము జ్ఞేయము అది కూడా త్రిపుటి. స్థూలము సూక్ష్మము కారణము అదీ త్రిపుటి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అదీ త్రిపుటి. త్రిపుటులు అనేకంగా వున్నాయి. ఇక్కడ దేహత్రయము ఆత్మాత్రయము అవస్థాత్రయము ఇవన్నీ త్రిపుటులు. స్థానత్రయము, అభిమాన త్రయము, గుణత్రయము, వర్ణత్రయము, దైవత్రయము, మాతృకాత్రయము. దేహత్రయములో వున్న త్రిపుటులు ఏమిటి? స్థూల సూక్ష్మ కారణాలు. ఆత్మ త్రయములో వున్నటువంటి త్రిపుటి ఏమిటి? జీవాత్మ అంతరాత్మ పరమాత్మ. అవస్థా త్రయములో వున్న త్రిపుటి ఏమిటి? జాగ్రత్ స్వప్న సుషుప్తులు. స్థానాల్లో వున్న త్రిపుటులేమిటి? జాగ్రత్త నేత్ర స్థానము, స్వప్నము కంఠ స్థానము, సుషుప్తి హృదయ స్థానము. అభిమానాన్నిబట్టి త్రిపుటి ఎవరు? జాగ్రదావస్థ అభిమాని విశ్వుడు, స్వప్నావస్థ అభిమాని తైజసుడు, సుషుప్త్యావస్థ అభిమాని ప్రాజ్ఞుడు. కాబట్టి విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు అభిమాన త్రయముగా వున్న ఒక త్రిపుటి. వర్ణ త్రయము. రక్త వర్ణము, శ్వేత వర్ణము, నీల వర్ణము. రక్త వర్ణం రజో గుణం. శ్వేత వర్ణం సత్వ గుణం.

నీలం అంటే సంస్కృతంలో నలుపు. నీలోత్పలము అంటే నల్ల కలువ. నీలము అంటే నీలం కలువ కాదు. ఇది తెలియక సంస్కృత శబ్దం నీలమేఘశ్యాముడు అనంగానే రాముడుకి కృష్ణుడికి నీలం రంగు వేసేస్తారు. వారు నీలంగా ఏమీ లేరు, నల్లగా వున్నారు. నీలిమేఘం వర్షం కురవడానికి నల్లగా ఎలా కమ్ముకొస్తుందో దానిని నీలిమేఘం అన్నారు. నల్లగా వుంటే నీలి మేఘం అని ఎందుకన్నారు? సంస్కృతం తెలుగులోకి వచ్చేసరికి నీలము నీలి అనుకున్నాం గాని మామూలుగా నీలము అంటే నలుపు. నలుపు అంటే తమో గుణం. గుణత్రయం అంటే రాజసము, సాత్వికము, తామసము. దైవత్రయం అంటే బ్రహ్మ విష్ణు రుద్రుడు. మహేశ్వరుడు అనము మనం. ఎందుకంటే పంచ బ్రహ్మలకొచ్చేసరికి సదాశివుడు ఈశ్వరుడు వచ్చారు. మళ్ళీ మనం త్రిపుటులు అన్ని, ఈశ్వరుడొక్కడే. సృష్టి చేసేటప్పుడు ఆ ఈశ్వరుడే బ్రహ్మ అయ్యాడు. ఆ ఈశ్వరుడే పోషించేప్పుడు విష్ణువయ్యాడు. ఆ ఈశ్వరుడే లయం చేసేప్పుడు రుద్రుడయ్యాడు. మనం ఒక పద్ధతి పెట్టుకున్నాక అక్కడ రుద్రుడనే వాడతాం, మన పంచీకరణ సాంఖ్య పద్ధతిలో. వేరే త్రిమూర్తులు వచ్చేసరికి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అంటున్నాం. మన పద్ధతిలో మహేశ్వరుడు బదులు రుద్రుడు అంటాం. మాతృకాత్రయము. అకార ఉకార మకారములు. ఇవే కాకుండా, జ్ఞాత జ్ఞానము జ్ఞేయము అది కూడా త్రిపుటి. ధ్యాత, ధ్యానము, ధ్యేయము ఒక త్రిపుటి. ప్రమాత, ప్రమాణము, ప్రమేయము ఒక త్రిపుటి. ఇలా ఎన్నో త్రిపుటులు.

## సూక్ష్మ శరీరతత్వలయము :

స్థూల శరీరము కర్మజమగుట వలన కర్మము క్షీణించెనేని స్థూల దేహము క్షీణించును. స్థూల శరీరము ఎలా పుట్టింది? ఎందుకు పుట్టింది? అది జడం కదా. పంచభూతాలు ఎందుకు పంచీకరణ అయి స్థూల శరీరంగా మారింది? అన్నము వలన శుక్లశోణితాల వలన పిండం ఎందుకు వచ్చింది? పిండం వచ్చి, బిడ్డ పుట్టి పెరిగి చచ్చేదాకా అనేక సుఖదుఖాలు పొందుతున్నాడు కదా! ఈ స్థూల దేహం దానికే ఉపయోగిస్తోందా. దీనిని ఎవరు తెచ్చుకున్నారు? కర్మ చేయడానికి ఈ పనిముట్టు కర్మ ఫలితాన్ని అనుభవించడానికి కూడా ఈ పనిముట్టు. ఈ పనిముట్టు అవసరం ఎవరికి వుంది? ఏ సూక్ష్మ శరీరం అయితే మంచి చెడు కర్మలు చేసిందో ఆ చేసిన పనే మళ్ళీ చేయడానికి ఈ పనిముట్టు కావలసి వచ్చింది. ఇంకొక జన్మ, ఆ జన్మలో కూడా తృప్తిపడకుండా వున్నది. శరీరాన్ని విడిచి వుండలేకుండా వున్నది. ఏదో చేయాలని చేయలేకుండా వున్నది. ఇప్పుడు చేద్దాం అనేటటువంటి సంస్కారము, వాసన ఏదైతే ఆ సూక్ష్మ శరీరంమీద ముద్రించబడిందో ఆ సూక్ష్మ శరీరమే తను ఇవన్నీ చేయడానికి ఫలితాలు పొందటానికి, మరల ఈ పనిముట్టును తెచ్చుకుంది. అంటే స్థూల శరీరం రావడానికి కారణం సూక్ష్మ శరీరం అన్నమాట. సూక్ష్మ శరీరం అలా వుండటానికి కారణం కారణ శరీరం, వాసనలు. వాసనా క్షయం అయితే లింగదేహం భంగమవుతుంది. కారణ శరీరం వున్నంత వరకు వాసనలు వున్నంత వరకు లింగ శరీరం సూక్ష్మ శరీరంగా వున్నంత వరకు సూక్ష్మ శరీరం స్థూల శరీరమును పనిముట్టుగా తెచ్చుకుంటుంది. స్థూల శరీరము కర్మజ మగుట వలన కర్మము క్షీణించెనేని స్థూల శరీరము కూడా క్షీణించును. వాసనా క్షయం అయితే స్థూల శరీరం వుండదు.

సూక్ష్మ దేహము సహజమగుట వలన కత్తుల చేత నరకబడక జలముచేత నానక అగ్నిచేత దహింపబడక వాయువు చేత శోషింపబడక, ఉంటూనే ఉంటుంది. ఏమిటీ ఆత్మకున్న లక్షణాలు సూక్ష్మ శరీరానికి కూడా వున్నాయి? సూక్ష్మ శరీరం కూడా కత్తుల చేత నరకబడదు. నీళ్ళలో నానదు. అగ్నిచేత కాలదు. వాయువుచేత శోషింపబడదు. వృత్తి ప్రళయము, నిత్య ప్రళయము, దేహ ప్రళయము, మను ప్రళయము, బ్రహ ప్రళయము, విష్ణు ప్రళయము, రుద్ర ప్రళయము, మహేశ్వర ప్రళయము, సదాశివ ప్రళయము, విరాట్ పురుష ప్రళయము ఇవన్నీ దశ విధ ప్రళయాలు. దశవిధ ప్రళయాలయందు కూడా ఈ సూక్ష్మ శరీరము చెడక వుంటుంది. ఇది విదేహ ముక్తి పర్యంతము వుంటుంది. జీవన్ముక్తుడికి కూడా సూక్ష్మ శరీరం వుంటుంది. విదేహ ముక్తుడికి స్థూల శరీరం పడిపోతుంది. లింగ శరీరము భంగమవుతుంది. అంతవరకూ ఈ సూక్ష్మ శరీరం ఉంటూనే వుంటుంది.

ముక్తి కోరువారు ముందుగా సూక్ష్మ శరీరమును చెరపగోరక కారణ శరీరమును చెరపవలెను. మోక్షం కావాలంటే సూక్ష్మ శరీరమును చెడగొట్టడంవల్ల అది పోదు. ఒక రాక్షసుడు చంపితే వాడినుంచి చిందిన ప్రతి బొట్టు ఒక రాక్షసుడు అయింది. అలాగే సూక్ష్మ శరీరాన్ని ముక్కలు చేస్తే కొన్ని వేల ముక్కలు అవుతుంది. వేల ముక్కలు వేల స్థూల శరీరాలను తెచ్చుకుంటుంది. అందుకే ఒక తండ్రికి పదిమంది కుమారులు కూడా, తండ్రే కుమారుడయ్యాడు. దాని అంతరార్థం అది. ఆ రాక్షసుడు ప్రతి చుక్క కూడా రాక్షసుడయ్యాడు. ఒక కారణ శరీరం పది విభాగాలు అయినప్పుడు, తండ్రి యొక్క కర్మ కొడుక్కి పంచబడ్డప్పుడు తండ్రీ కొడుకూ ఒక్కడే. తండ్రి తన శరీరము ద్వారా అనుభవించాల్సినది తృప్తి చెందక తన శుక్లముతో పాటుగ తన సంచిత కర్మలో కొంత భాగాన్ని కూడా కుమారులకు పంచుతాడు. వారు తయారవుతారు. తండ్రి తన భార్య గర్భములో శుక్ల రూపంలో ప్రవేశించి, ఆ తండ్రే ఆ భార్యకు కొడుకు అయ్యాడు. కాబట్టి తండ్రి తనయొక్క భార్యనుండి తానే కొడుకై వచ్చాడు. శుక్లరూపంలోనే కాకుండా సంస్కార రూపంలో వచ్చాడు. నలుగురు కొడుకుల రూపంలో వచ్చినా కూడా నలుగురు బిడ్డలూ కూడా ఆ తండ్రే. ఆ రకంగా సూక్ష్మ శరీరం కూడా ఎన్నైనా విభాగాలు కావచ్చు, కారణ శరీరం కూడా కొన్ని వాసనల కుప్పని ఎన్నైనా విభాగాలు చేయవచ్చు. అయితే ఎప్పుడూ అలా వుండదు. దీనికి కూడా ఒక అవకాశముగా గుర్తు పెట్టుకోండి.

జనాభా పెరగడానికి కారణము ఒక్కొక్క కారణ శరీరము అనేక కారణ శరీరాలుగా విభాగమవ్వడమే. ఎందుకంటే మనం ముందు ఎవరమూ లేము. మహాకారణం నుండి కొన్ని కారణాలు విడిపోయాక, ప్రతి ఒక్క కారణ శరీరానికి సూక్ష్మ, స్థూల శరీరాలు వచ్చి చేరితే మనము ఉన్నాము. జన్మముందా? కర్మముందా? అంటే ఈ విధముగా కర్మేముందు అవుతుంది.

పునర్జన్మలలో తిరిగేవారికైతే మరణానంతరము సూక్ష్మ శరీరము తన అధిష్ఠాన దేవతయైన పితృ దేవతలలోనికి లయమవుతుది. ఇంద్రియాలన్నీ వాటి అధిష్ఠాన దేవతలలో లయమవుతాయి. కారణ శరీరం అవ్యక్తంగా ఉంటుంది. పునర్జన్మలో, స్థూల శరీరం పంచభూతాల పదార్థముగా తయారవుతుంది. గోళకాలు ఏర్పడగానే ఇంద్రియాలు, వాటివాటి అధిష్ఠాన దేవతలనుండి వచ్చి ఆ గోళకాలలో చేరి ఉంటాయి. పితృ లోకమునుండి ప్రేతాత్మ అనబడేటటువంటి సూక్ష్మ శరీరం స్థూలంలోకి వచ్చి చేరుతుంది. కారణము సమయానుకూలముగా కార్యరూపములోకి వచ్చి అనుభవాలను కలుగచేస్తుంది.

ముక్తి కోరువారు సూక్ష్మ శరీరమును భంగపరచాలని చూడక, ముందుగా కారణము శరీరమును సున్నా చేసే ప్రయత్నము చేయవలెను. ఈ రెండు శరీరాలు కూడా మొదట ఎక్కడనుండి ఉనికిలోకి వచ్చాయో, మళ్ళీ అక్కడికే వెళ్ళి లయం కావాలి. అప్పుడే ముక్తి.

ముక్తి కోరేవారిలో సూక్ష్మ కారణ శరీరము ఏకకాలమందు వాటియొక్క అధిష్ఠానములందు లయమవుతాయి. ఈ సూక్ష్మ కారణ శరీరాల అధిష్ఠానం ఎవరండి? ఎవరు వారు? పంచ అధిదేవతలు. సదాశివ ఈశ్వర బ్రహ్మ విష్ణు రుద్ర ప్రత్యగాత్మ ప్రకాశరూపముగా వున్న పంచబ్రహ్మలే పంచకర్తలు. ఈ సూక్ష్మ కారణ శరీరాలకే కాకుండా స్థూల శరీరము పంచీకరణము ద్వారా ఏర్పడటానికి కూడా శుక్లశోణితాలలో వున్నటువంటి జీన్స్ కూడా ఈ పంచ అధిదేవతలే. అధిదేవతలే అక్కడ జీన్స్ రూపంలో స్థూల శరీరోత్పత్తికి అక్కడికక్కడే కారణ భూతంగా వున్నారు. వాళ్ళు ఎక్కడో ఏదో లోకంలో వుండి సృష్టి చెయ్యడం లేదు. ఎక్కడ సృష్టి జరుగుతుందో అక్కడే ఆ ప్రజాపతి బ్రహ్మ వున్నాడు. సూక్ష్మ కారణ శరీరము ఏకకాలమున వాటి అధిష్ఠాన దేవతలయందు లయింపచేయవలెను. పంచబ్రహ్మలయందు లయింపచేయాలి. అంటే అష్టప్రకృతులు లయంలో ఎక్కడిదాకా చెప్పాం. అవ్యక్తం దాకా చెప్పాం. అవ్యక్తంలో ఎవరున్నారు? ఆ పంచబ్రహ్మలు వున్నారు. కనుక అష్ట ప్రకృతి లయము ద్వారా ఇంద్రియ లయము చేసుకొని అవ్యక్తములో వున్న పంచబ్రహ్మలలోకి సచ్ఛిష్యునియొక్క సూక్ష్మ కారణ శరీరములు అక్కడ లయపరచుకోవాలి. అదే విదేహ ముక్తి. లేనిచో అన్యోన్యాశ్రయముగా సూక్ష్మము వుంటేనేమో కారణ ముంటుంది. కారణము వుండటంవల్ల సూక్ష్మము వుంటుంది. ఇద్దరూ కలిసే వుంటారు.

ఈ కారణ శరీరము భ్రాంతిజమగుట వలన అపరోక్ష బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానము చేత భ్రాంతి నశింపజేసెనేని భ్రాంతి వలన కలిగిన కారణ శరీరము నశించును. మొదట్లో మనకు ఎక్కడ భ్రాంతి ప్రారంభిస్తుందో అక్కడే సూక్ష్మ శరీర నిర్మాణం జరిగిపోయింది. ఒకే జన్మ ఒకే మరణం. వాడు ఎన్ని లక్షల జన్మలైనా ఎత్తనీ – పశుపక్ష్యాదులు, క్రిమికీటకాదులు, మానవ పునర్జన్మలు ఎన్నైనా పొందనీ సూక్ష్మ శరీరము కంటిన్యూ అవుతోంది. స్థూల శరీరాలే మారుతున్నాయి. స్థూల ఉపాధులు మారుతున్నాయి. సూక్ష్మ శరీరము సూక్ష్మ ఉపాధి అలాగే కొనసాగుతుంది. ఎప్పుడైతే విదేహ ముక్తుడయ్యాడో, ఎప్పుడైతే వాసనా క్షయం అయిందో, ఎప్పుడైతే కారణ శరీరం సున్నా అయిందో, అప్పుడే లింగ శరీరం భంగమయింది. ఇది ఆ సూక్ష్మ శరీరం యొక్క మరణం. ఒకే జన్మ ఒకే మరణం అంటే ఎప్పుడు భ్రాంతి మొదలయిందో అది జన్మ. ఎప్పుడు భ్రాంతి రహితమయిందో అది మరణం.

భ్రాంతి విడిచినప్పుడు, సర్వము మిథ్య అని తోచును. భ్రాంతిలోనే అన్నీ వున్నాయి అని తోచును. భ్రాంతి పోతే ఏదీ లేదు, నువ్వూ లేవు. నిజంగా నీవు కూడా లేవు. భ్రాంతి పోగానే అన్నీ పోయినాయి. లేనివే లేకుండా పోయినాయి. ముందుగా వున్నవాటికి లేవనే భావంతో మిథ్యగా చూశావు. తరువాత భ్రాంతి రహితం కాగానే మిథ్యగా చూడటం కూడా పోయి, అసలు అవి తోచుటయే లేవు. ఈ ఉపాధి కాని, నీవు కాని, నీ చుట్టూ వున్న దృశ్యమాన ప్రపంచం గాని ఏమీ తోచుట లేదు. ప్రపంచము, జీవోపాధులు మొదలే లేవు. వాటి వాసన లేదు, వాటి వృత్తీ లేదు, వాటి ఎరుకే లేదు. ఒకప్పుడు చూసి ఇప్పుడు చూడకపోతే వాటి జ్ఞాపకం వుంటుంది. అవి ఉన్నాయనే ఎరుక లేకుంటే, ఎలా జ్ఞాపకం ఉంటుంది? అందువలన వాసనలను, జ్ఞాపకాలను, గుర్తులను, వాటన్నింటికీ మూలమై ఎరుకను, ఎరిగే ఎరుకను లేకుండా చేసుకుంటే భ్రాంతి వదిలింది. అట్టితరి కర్మ వాసనలుండవు. మరియు జ్ఞానాజ్ఞానములుండవు. లింగ శరీరము భంగమై, ప్రకృతియందు లయమవుతుంది. అంటే విలయమవుతుంది. మాయ వలన వచ్చింది, కనుక, తిరిగి మాయలోనే విలీనమవుతుంది. కారణ మహాకారణాలు అవ్యక్తము లేక మూల ప్రకృతిలో లయం.

## పంచకోశ వ్యతిరిక్తము

స్థూల శరీరమునకు అన్నమయ కోశమని పేరు. అసలు కోశమంటే ఏమిటి? ఒకదానిని మరొకటి కప్పి వుంచి కవరు చేసిన దానిని కోశం అంటాం. ఉదాహరణ ఏమిటి? కత్తికి ఒరవలే – ఒరలో కత్తి పెట్టుకుని నడుముకు కట్టుకుంటారు. తెలియనివారు ఒరనే కత్తి అనుకుంటారు. దేనినైనా వేటాడటానికి ఆ రాజుగారు ఆ కత్తిని ఒరలోనుంచి తీస్తారు. పరిశీలించి చూస్తే గాని తెలియదు అది కత్తి కాదు ఒర అని. కాబట్టి ఒర కత్తిని కప్పింది. వీణను ఒక చక్కని పెట్టె కప్పింది. వీణ వాయించేవాడి చేతిలో ఒక చక్కని పెట్టె వుంటుంది. దానిపేరు గవిశ. వీణను చక్కగా అందులో పెట్టి మూసేస్తారు. కత్తిని ఒర కప్పినట్లుగా వీణని గవిసె కప్పినట్లుగా చింతపండుని చింతగుల్ల కప్పినట్లుగా నిన్ను కొన్ని కప్పి ఉంచాయి. వాటినన్నీ కోశాలు అన్నారు. అవి ఎన్ని? పంచకోశాలు (1) అన్నమయ కోశము (2) ప్రాణమయ కోశము (3) మనోమయ కోశము (4) విజ్ఞానమయ కోశము (5) ఆనందమయ కోశము.

అన్నమయ కోశం ఎలా వచ్చింది? పంచభూతాల నుండి అఖరికి పృథ్వి వచ్చాక పృథ్వి నించి ఓషధులు, ఓషధుల నించి అన్నము, అన్నమునుంచి శుక్లశోణితాలూ, శుక్లశోణితాల నుంచి పిండ రూపంలో ఈ స్థూల దేహము వచ్చింది కనుక ఇది అన్నమయము. రక్త రూపంలో వున్నా, మాంస రూపంలోవున్నా దాని మూలం అన్నం. అందుకని దీనిని అన్నమయము అన్నాము. పంచదార చిలుకని ముక్కు కొరికినా రెక్క కొరికినా కాలు కొరికినా ఎక్కడ కొరికినా తియ్యగా వున్నట్లుగా అంతా పంచదారమయమే. అలాగే అన్నమయ కోశాన్ని కూడా ఎక్కడ చూచినా సప్తధాతువులే వుంటాయి గాని ఈ సప్త ధాతువులన్నీ పంచభూతాలే కనుక ఈ పంచభూతాలు ఒక క్రమ పద్ధతిలో అన్నమయముగా ఏర్పడింది. ఇక్కడ కనబడేది అన్నము గనుక అన్నమయ కోశము అన్నాము.

రోజూ అన్నం తింటేనే మనం జీవిస్తున్నాము. అన్నము లేకపోతే క్షీణించి నశిస్తున్నాం. కనుక అన్నము మీద ఆధారపడ్డాము కాబట్టి అన్నమయమయింది. ప్రాణం లేకుండా ఇది ప్రవర్తించదు కనుక నేను నేను అనేటటువంటి వ్యాపారము ప్రాణం వుంది కాబట్టి జరుగుతుంది. కాని ప్రాణం లేకపోతే లేదు. స్థూల శరీరమే అన్నమయ కోశమయింది. దీనిలోపల వున్నది ప్రాణమయమయింది. అన్నమయ కోశమే ఈ వ్యాపారం నాది అని ప్రాణమయ కోశాన్ని కప్పింది. నిజానికి ప్రాణం లేకపోతే అన్నమయం స్వతంత్రముగా ఏ వ్యాపారమూ చేయలేదు. అందుకే కోశమయింది. ప్రాణమయ కోశము యొక్క వ్యాపారము అయినప్పటికీ అన్నమయ కోశముగా వుండి నేనే వ్యాపారం చేస్తున్నానని ఆధార కార్డులకు పంచదార కార్డులకు బాంక్‌లో డిపాజిట్లకు ఈ అన్నమయ కోశ రూపాన్ని అక్కడ పెడుతున్నాము. అన్ని వ్యాపారాలకి కనబడేది అన్నమయ శరీరమే. ఆ శరీరమే వ్యాపారము చేస్తుంది. కాని విచారణ చేస్తే ప్రాణమయుడుంటేనే వ్యాపారమున్నది. కనుక నేను ప్రాణమయుడిని.

అటులనే ప్రాణమయ కోశము మనోమయ కోశమును కప్పింది. అదెట్లనగా జాగ్రత్తలో ప్రాణమున్నది. వ్యాపారమున్నది. సుషుప్తిలో ప్రాణమున్నది గాని, వ్యాపారము లేదు. ఎందుకనగా సుషుప్తిలో మనసు లేదు. మనసుంటేనే వ్యాపారముంది. మనసు లేకపోతే వ్యాపారము లేదు. సుషుప్తిలో ప్రాణమున్నప్పటికీ మనస్సు లేదు. వ్యాపారము లేదు. కాబట్టి మనస్సు ఎప్పుడు లేదో అప్పుడు వ్యాపారం ఆగుతోంది. కనుక వ్యాపారానికి మూలకారణం మనసుగాని, ప్రాణం కాదు. ప్రాణమే వీటికి మూలాధారం. కాని వ్యాపారం ప్రాణానికి సంబంధించినది కాదు. మనసుకి సంబంధించినది. మనసుకి సంబంధించిన వ్యాపారం జరుగుతూ వుంటే ప్రాణానికి సంబంధించిన వ్యాపారం జరుగుతుంది అనేటువంటి అజ్ఞానం ఎక్కడైతే వుందో అప్పుడది ప్రాణమయ కోశం అయింది. అప్పుడు దానిని ప్రాణమయ కోశం అన్నాం. కనుక వ్యాపారము మనసుదై వున్నది. మనసున్నప్పుడే వృత్తి, వ్యాపారం వున్నందున ఈ వ్యాపారం నాది అని ప్రాణమయ కోశము మనోమయ కోశమును కప్పింది. వ్యాపారము మనోమయ కోశమునదైనా గాని ఈ వ్యాపారము నాది అని ప్రాణమయ కోశము మనోమయ కోశాన్ని కప్పింది.

ఇప్పుడు వ్యాపారము మనోమయ కోశముదైనది. కాని బుద్ధి నిర్ణయము లేనిదే, మనస్సు పనిచేయదు. నిర్ణయము లేనప్పుడు ఊరక ఉండి, నిర్ణయము కాగానే మనస్సు తన ఇంద్రియాలతో కూడి వ్యాపారము చేస్తుంది. నిర్ణయం చేసేవాడే యజమాని. అతడే విజ్ఞానమయుడు. అందువలన వ్యాపారము విజ్ఞానమయుడిది అయితే మనస్సు వ్యాపారము నాది అని మనోమయ కోశము విజ్ఞానమయ కోశమును కప్పింది.

అది యెట్లనగా, ఒక ఉదాహరణ. ఒక గ్రుడ్డివాడు, ఒక కుంటివాడు కలసి దేహయాత్ర చేస్తున్నారు. కుంటివాడు నడవలేడు. గ్రుడ్డివాడు దారి చూడలేడు. మరి ఎలా? అందుకని కుంటివాడు గ్రుడ్డివాని భుజముల మీద కూర్చొని, దారిచూపుచుండగా గ్రుడ్డివాడు ప్రయాణము చేయగలిగెను. ఈ విధముగా ఇద్దరూ ప్రయాణము చేయుచున్నారు.

గ్రుడ్డివాడేమో, మనోమయ కోశము. కుంటివాడు విజ్ఞానమయ కోశము. మనస్సు విషయాలను ప్రోగుచేసుకుంటుంది. కాని ఏమి చెయ్యాలో బుద్ధి నిర్ణయముపై ఆధారపడుతుంది. బుద్ధి కుంటివానివలె కదలదు. మనసు కదులుతుంది గాని, బుద్ధి నిర్ణయానుసారము కదులుతుంది. బుద్ధిలో వివేకమై వైరాగ్యాలుండి దారి చూపకపోతే, మనస్సు కదలాలని ఉన్నా కదలదు. ఎందుకంటే అది గ్రుడ్డిది. బుద్ధి నిశ్చయము ద్వారా వ్యాపారము జరుగుచున్నది గనుక వ్యాపారము విజ్ఞానమయ కోశముది. అయినా ఇది నా వ్యాపారమని, మనోమయ కోశము విజ్ఞానమయ కోశమును కప్పింది.

కాని ఎవరూ కూడా సుఖాన్ని కోరే నిర్ణయించుకుంటారు గాని, దుఃఖాన్నిచ్చే దానిని ఎవరూ కోరరు. బుద్ధి ఒక్కొక్కసారి త్యాగం చేసి గాని, మోహము చేతగాని, మమకారము చేతగాని దుఃఖాన్నే తెచ్చుకుంటుంది. అయినా సుఖాన్ని త్యాగం చేసింది గాని, సుఖం వద్దని కాదు కదా! సుఖమే కావాలి, దుఃఖము వద్దే వద్దు అని అందరు కామన్‌గా అనుకుంటారు కదా. అదే ఆనందమయ కోశము. దీని ప్రభావము చేతనే బుద్ధి పనిచేస్తున్నది. కనుక ఆనందమయ కోశమే యజమాని.

ఆనందమయ కోశమంటే అజ్ఞానము. అద్దమందున్నదే ప్రతిబింబము ఉండునట్లు, ఆనందయక కోశము అనే అజ్ఞానము ఉంటేనే విజ్ఞానమయ కోశము వచ్చింది. దానిపైన అహంభావన ఉంటేనే వ్యాపారము. ఈ అహం అనేది అజ్ఞానముగా ఉన్న జీవుడు. ఆ జీవుడే యజమాని. అతనికి ప్రియంమోదం ప్రమోదం అనే అజ్ఞాన వృత్తులున్నాయి. అందువలన ఆనందమయ కోశమే విజ్ఞానమయ కోశానికి మూలము. కనుక వ్యాపారము ఆనందమయ కోశమునదైతే, అది నాది అని విజ్ఞానమయ కోశము ఆనందమయ కోశమును కప్పెను.

ఇప్పుడు వ్యాపారము ఆనందమయ కోశముదే. అజ్ఞానములోనున్న అహంభావము అజ్ఞానము వదలినప్పుడు కూడా ఉంటుంది. జీవుడు అనే వాడిని అజ్ఞానము కప్పింది గనుక అజ్ఞానావరణ తొలగితే జీవుడు నిర్వ్యాపారముగా ఉంటాడు. ఈ 'నేను' అనే జీవుడు పై క్రమములో అన్నమయ కోశమునుండి ఆనందమయ కోశము వరకు సాక్షి, విలక్షణమై యున్నాడు.

కావున ఈ పంచకోశ ధర్మాలు జీవుడికి లేవు. అప్పుడు జీవుడు పంచకోశ ధర్మాలకి వ్యతిరిక్తమైనవాడు. ఆ ధర్మాలన్నీ లేకపోతే జీవుడు నిర్వ్యాపారి, నిష్క్రియుడు, నిర్వికారి, శాశ్వతముగా ఉండేవాడు. అతని సత్తాచేతనే పంచకోశ వ్యవహారమున్నది. పంచకోశ వ్యవహారము లేనప్పుడు "నేను" శాశ్వతము గనక సన్మాత్రుడు, సత్తా మాత్రుడు కనుక చిన్మాత్రుడు, త్రిగుణ ప్రభావము లేదు గనుక ఆనందుడు. అందువలన ఆత్మ సత్‌చిత్ ఆనందము. ఈ లక్షణము పూర్తిగా పంచకోశ ధర్మములకు వ్యతిరిక్తము. ఆత్మ సచ్చిదానందము కనుక నేనే ఆత్మను, ఆత్మయే నేను. అందువలన ఆత్మ పంచకోశ వ్యతిరిక్తమైన సచ్చిదానంద రూపము.

ఆత్మ సత్తా నిరతిశయము, ఏకము అయినను ఆత్మసత్తా చేత ఉపజీవమైన పంచకోశములన్నీ సమాన సత్తాలు కావు. కనుక అవి ఒకదానికంటే మరొకటి సూక్ష్మమై, వ్యాపకమై ఉన్నాయి. అన్నమయము శరీరము వరకే పరిమిత వ్యాపకముగా ఉన్నది. స్థూలముగా ఉన్నది. దీనిలో అన్న సారము వ్యాపకమైనది. ప్రాణము అన్నమయ శరీరమంతా సూక్ష్మంగా వ్యాపించి, అన్నమయాన్ని కాపాడుచున్నది. మనోమయ కోశము అంతకటె సూక్ష్మమై, విషయాల వరకు వ్యాపకమగుచున్నది. సున్నితమైన బుద్ధి, విజ్ఞానవంతమై, విషయాలను అధిగమించి ఊహాపోహలతో విశ్వమంతా వ్యాపించగల సామర్థ్యము గలది. ఆనందమయ కోశములోనున్న 'నేనే' అనే జీవుడు అజ్ఞానమత్తులో ఉన్ననూ, అత్యంత వ్యాపకుడు. మత్తు వదలితే సర్వవ్యాపకుడు. అందువలన ఆత్మ సూక్ష్మాతిసూక్ష్మము.

అయితే ఆనందమయ కోశము ఆత్మను ఎలా కప్పెనో తెలియాలి. సూర్యుని సత్తావలన నీరు ఆవిరై, మేఘమై సూర్యుని కప్పినట్లుగా, బంగారము సత్తాచేత తయారైన ఆభరణాలు బంగారాన్ని కప్పినట్లుగా, ఆత్మసత్తాచే ఉపజీవింపబడుచున్న ఆనందమయ కోశము ఆత్మను కప్పవచ్చును. బ్రహ్మము యొక్క సత్తాచే మాయ వ్యక్తమై ఆ నిర్గుణ బ్రహ్మనే కప్పి, సగుణ బ్రహ్మను ఉపజీవింపచేయలేదా?

గొంగళి పురుగులు, పట్టు పురుగులు వాటి సత్తావలన తయారైన గూళ్ళు వాటినే కప్పలేదా? పట్టు పురుగు దాని కోశమునుండి బయటికి రాలేక చచ్చిపోయింది. గొంగళిపురుగు దాని కోశమును చీల్చుకొని, బయటపడి సీతాకోక చిలుకగా ఎగిరిపోయింది. కనుక అజ్ఞాన మత్తు వృత్తులు కొనసాగితే పునర్జన్మలు. ఆనందమయ కోశాన్ని అధిగమిస్తే సీతాకోక చిలువలె, జీవుడే ఆత్మ స్వరూపుడగును. గొంగళి పురుగే సీతాకోక చిలుక అయినట్లు నేన బ్రహ్మను, అహంబ్రహ్మ.

అన్నమయ కోశములో పంచ భూతాత్మకమైన సప్త ధాతు రూపమైన స్థూల శరీరమున్నది. ప్రాణమయ కోశమనగా పంచప్రాణములు, పంచ కర్మేంద్రియములు. మనోమయ కోశమనగా పంచ జ్ఞానేంరదియములతో కూడిన మనస్సు. విజ్ఞానమయ కోశమనగా పంచ జ్ఞానేంద్రియములతో కూడిన బుద్ధి. ఆనందమయ కోశమనగా ప్రియంమోదం ప్రమోదం అనే అజ్ఞానమత్తు వృత్తులు కలది.

ఆత్మను మొదట కప్పినది ఆనందమయ కోశము. అందువలన అజ్ఞానముచే ఆనందాత్మ కప్పబడినది గనుక తిరిగి ఆనందమును పొందుటకు భ్రాంతిలో తోచిన ప్రపంచములోనే వెదకుచుండును. ఆనందము ఇచ్చేవాటియందు ప్రియము కలుగుతుంది. ఆ వస్తువును స్వంతం చేసుకోగానే మోదం కలుగుతుంది. ఆ వస్తు సంపర్కముతో సుఖం కలుగగానే ప్రమోదం కలుగుతుంది.

శరీరత్రయంలో పంచకోశాలు ఎలా ఉన్నాయి? స్థూల శరీరమే అన్నమయకోశము. సూక్ష్మ శరీరమే ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయ కోశాలు. కారణ శరీరమే ఆనందమయ కోశము. ఇదీ శరీరత్రయానికి, పంచకోశాలకు సమన్వయము.

ఆనందమయ కోశము దానికదే ప్రయత్నం చేయలేదు. అందువలన విజ్ఞానమయ కోశములో బుద్ధి అనే కర్తను ఉపయోగిస్తుంది. కాని బుద్ధి కుంటివాడు. అందువలన గ్రుడ్డిగా ఉన్న మనోమయ కోశాన్ని ఉపయోగించుకుంటూ, ఆనందమయ కోశాన్ని సంతోషపెట్టే ప్రయత్నం చేస్తుంది. అనగా అజ్ఞానములో ఉన్న జీవాత్మను సంతోషపెడుతుంది.

మనస్సు ఆజన్మ కర్మ ఫలితంగానే ప్రవర్తిస్తూ ప్రపంచంలోనే సుఖాన్ని పొందాలని చూస్తూ ఉంటుంది. కేవల మనస్సు ఆ పని చేయడానికి ఒక పనిముట్టు కావాలి. అదే అన్నమయ కోశము. శవంతో పని జరుగదు గనుక ప్రాణమయకోశం కావాలి. ఈ విధముగా అజ్ఞానియైన జీవుడు తన పంచ కోశములను తానే తయారు చేసుకుంటున్నాడు. తానే ఆనందమయుడనే సంగతి తెలిసిన జీవుడు, ఈ పంచకోశములను ఇక ఉపయోగించడు. ఎలాగూ వచ్చాయి కాబట్టి ఆయుష్కాలము తీరేదాకా ఉండిపోతాయి. ఆ జీవుడే ఆత్మ స్వరూపుడుగా నిత్యము ఉండిపోతాడు. పంచకోశాల అవసరం తీరిపోయింది గనుక, ఆత్ముడు పంచకోశాలను సృష్టించుకోడు.

ఆత్మసత్తా ఆనందమయకోశము ద్వారా అన్నమయ కోశం దాకా వచ్చేసరికి ఆత్మ లక్షణాలు క్రమక్రమంగా తగ్గుతూ వచ్చాయి. కనుక స్థూల శరీరంతో జ్ఞానం కలుగదు. ప్రాణాలతో ఆత్మ జ్ఞానం లభించదు. సంస్కారాలచేత బద్ధమైన మనస్సు గ్రుడ్డిది గనుక దానికి ప్రయత్నంచేసే నిర్ణయము లేదు. బుద్ధి నిర్ణయాత్మకము గనుక వివేక వైరాగ్యాలతో, విచారణతో, ఊహాపోహలతో, శ్రవణ మననాదులతో తనను ఆత్మ స్వరూపంగా నిర్ణయించుకోగల సత్తా ఆ బుద్ధికి ఉంది. ఆనందమయకోశము యొక్క ఆనందప్రాప్తిని ప్రాపంచిక విషయాలతో కాక, స్వరూపస్థితిలో సహజంగా ఉండే ఆనందాన్ని అందిస్తుంది.

అప్పుడు విజ్ఞానమయుడైన బుద్ధి, కోశధర్మమును విడచి ప్రజ్ఞానుడై, **ప్రజ్ఞానం బ్రహ్మ**గా సహజమై ఉంటాడు. బుద్ధియందు ప్రతిఫలించిన జీవుడు కూడా అజ్ఞానాన్ని వదలి ప్రజ్ఞానుడై, జీవబుద్ధి మాని **అహంబ్రహ్మ** అంటాడు. ఇదియే పంచకోశ వ్యతిరిక్తము ఆత్మ అంటే !

ఈ విధముగా పంచకోశములుంటే, వ్యతిరిక్త ధర్మములంటే ఏమో వివరించుకున్నాము. కోశాలు అన్నప్పుడు ఒక ధర్మాన్ని మరొక ధర్మము కప్పుతున్నది. ఆఖరిది అన్నమయ కోశము. ఇక్కడే నేనెవరు? అని ప్రశ్న వేసుకోవాలి. అన్నమయ కోశమే నేను అయితే ఒక చెయ్యి ఒక కాలు పోయినా నేనున్నాను. నా రక్తం ఇంకొకరికి ఇస్తే, నేను ఇక్కడ లేకుండా పోవుటలేదు. వేరే వారిలో నేను లేను. కొన్ని అవయవాలు నావి ఇంకొకరికి, ఇంకొకరివి నాకు మారుస్తున్నారు. అప్పుడు కూడా నేను వేరే వారిలోకి, వేరేవారు నాలోకి పోవడము, రావడము లేదు. ఈ పనిముట్టుగా ఉన్న స్థూల శరీరంలోని భాగాలు అవయవదానముగా ఇంకొకరికి పనిముట్టులా పనికొచ్చేటందుకు ఇస్తున్నారు. అందువలన అక్కడ ఆ పనిముట్టులో ఉన్నవాడికి తాను తానుగానే ఉన్నాడు కనుక అన్నమయ కోశము నేను కాదు.

ప్రాణము పోయిన తరువాత పనిముట్టును ఖననము, దహనమ చేస్తున్నారు. అయినా పునర్జన్మగా మరొక పనిముట్టును తెచ్చుకుంటున్నాము. అనగా ప్రాణము పోయినా, నేను మరల ప్రాణం పోసుకొని పుట్టుచున్నాను కనుక పోకడ, రాకడ ఉన్న ప్రాణమయ కోశము నేను కాదు.

ఇంద్రియాలు కొన్ని పనిచేసినా, చెయ్యకపోయినా మనస్సు ఉంటున్నది. మనస్సుతోపాటు నేను ఉంటున్నాను. ఇంద్రియాలు లేకపోయినా, పనిచేయకపోయినా, నేనున్నాను. కనుక నేను ఇంద్రియాలను కాను.

గాఢ నిద్రలో మనస్సు లేకపోయినా నేనున్నాను. అలాగే మూర్ఛలో, మరపులో కూడా ఈ మనస్సు ఉండడము లేదు. అలాగే సమాధిలో మనస్సు లేకుండానే నుండగలిగాను. కనుక మనస్సు నేను కాదు. మరణమందు మనస్సు పోయి పునర్జన్మలో మళ్ళీ వస్తున్నది. మనస్సు యొక్క పోకడ, రాకడలతో సంబంధము లేక నేనున్నాను.

బుద్ధి అనే ఆఫీసరువద్ద మనస్సు అనే సూపర్వైజరు పనిచేస్తున్నాడు. అతనిక్రింద దశేంద్రియములు అనే గుమాస్తాలు పనిచేస్తున్నాయి. కలలో ఇంద్రియాలు లేకుండా మనస్సే అన్నీ తానై పనిచేస్తున్నది. మనస్సు నిర్ణయము తీసుకోకుండా, బుద్ధికే అన్ని ఫైళ్ళు పంపుతున్నది. వివేకములేని బుద్ధి మనస్సు ఆశించినట్లుగా నిర్ణయిస్తున్నది. సూపర్వైజరు పంపిన ఫైళ్ళను వివేకంతో చూడకుండా బుద్ధి అనే ఆఫీసరు మంజూరు చేస్తున్నాడు. శాశ్వత ఆనందము కొఱకు నిర్ణయించుటలేదు. మనస్సు అందించే విషయాలనుండి మాత్రమే ప్రియం మోదం, ప్రమోదం అనే పద్ధతిలో నిర్ణయించుచున్నాడు. ఆఫీసరుకు స్వతంత్రత ఉన్నది. కాని మనస్సు చెప్పినట్లు చేస్తున్నాడు. ఆఫీసరే, సూపర్వైజరు అనే మనస్సును నియంత్రించవచ్చును. తాననుకుంటే మనస్సును నాశనము చేయగలడు. అందువలన నేను బుద్ధి అనే ఆఫీసరునేగాని, మనస్సు, ఇంద్రియాలు, ప్రాణము శరీరము నేను కాదు.

విజ్ఞానమయ కోశాన్ని బట్టి ప్రతిబింబముగా నేనున్నాను. నేను ఆనందమయ కోశముగా ఉన్న అజ్ఞానముననుసరించి ఉన్నాను. నేను శాశ్వత ఆనందుడను కావాలి అంటే అజ్ఞానమును పోగొట్టుకోవాలి. నేను బుద్ధికి ప్రతిబింబము గనుక నా బుద్ధికి శాస్త్ర వాక్యమునందించి, గురువాక్య విశేషము నందించి, నా బుద్ధి నేనే శుద్ధ బుద్ధిగా మార్చుకొనగలను. అప్పుడు ప్రతిబింబమైన ప్రజ్ఞానానుభవము పొందితే నేను కూడా ప్రజ్ఞానుడనే. ఆ ప్రజ్ఞయే బ్రహ్మమయితే నేనూ బ్రహ్మనే. అప్పుడు నాకు పంచకోశాలు నేననెడి ఆవరణ తొలగుతుంది. నేను నేనైన నేను ఎప్పుడు స్థిరత్వాన్ని పొందుతానో, అప్పుడు ఆనందం కోసము ప్రయత్నించేవాడుగా కాక, ఆనందమే నేనైనవాడుగా, శాశ్వతముగా ఉండిపోతాను.

అవస్థాత్రయములో పంచకోశాలెలాగున్నాయి? జాగ్రదవస్థలో అన్నమయ, ప్రాణమయ, మనోమయ విజ్ఞానయమ కోశములు నాలుగు గుర్తించబడుచున్నవి. స్వప్నావస్థలో మనోమయ కోశమొక్కటే గుర్తించబడుచున్నది. సుషుప్త్యావస్థలో ఆనందమయ కోశము మాత్రమే ఉన్నది. అజ్ఞత వలన ఏదీ గుర్తించబడదు.

కోశములు ఏ విధముగా అమరి యున్నాయి? దృష్టాంతము. ఒక కుండలో కంకర రాళ్ళు పోశాము. దానిలో ఇసుక పోసి కుదించాము. దానిలో నీళ్ళు పోశాము. ఆ కుండలో కంకర రాళ్ళు పోస్తే ఎంతవరకు మట్టమున్నదో, ఇవన్నీ పోసినా కూడా అంతే మట్టమున్నది. ఎందుకని? స్థూలములో సూక్ష్మము, దానిలో అంతకంటే సూక్ష్మము, అంతకంటే సూక్ష్మము ఎలాగైతే సర్దుబాటైనాయో, అలాగే అన్నమయమంతా ప్రాణమయంతో నిండి ఉంది. ప్రాణమయమంతా మనోమయంతో నిండి ఉంది. ప్రాణమయమంతా మనోమయంతో నిండి ఉంది. మనోమయమంతా విజ్ఞానమయముతో నిండి ఉన్నది. విజ్ఞానమయమంతా ఆనందమయముతో నిండి ఉంది. ఇవన్నీ కూడా ఆత్మసత్తా చేత ములుగ్రుచ్చ సందులేక నిండి ఉన్నాయి. అదే చిన్మయము.

ముందు అన్నమయం లేకపోయినా మిగిలినవి ఉన్నాయి. అలాగే ప్రాణమయం, మనోమయం, విజ్ఞానమయం, ఆనందమయం ఒక్కొక్కటి లేకపోయినా గాని చిన్మయమైన ఆత్మ ఉంటూనే ఉంది. పంచకోశాలు అంటే ఆత్మసత్తా వాటిలో వ్యాపించగా, వాటివాటి ధర్మాలతో అవి ప్రవర్తిస్తూ ఉంటాయి. అవన్నీ లేకపోతే, ఆత్మ సత్తామాత్రముగా ఉండిపోయి స్వానుభవములో శాశ్వతముగా ఉంటుంది. ఆత్మసత్తా లేని పంచకోశాలు చెల్లని 500ల నోటు లాగా, చెల్లని వెయ్యి రూపాయల నోటువలె పనికి రానివి అవుతాయి. అలా వాటి ధర్మాలు విస్మరించబడతాయి. అనిత్యమైన పంచకోశాలలో నిత్యమైన ఆత్మఉండి, అనిత్యము నశించగా, నిత్యమైన ఆత్మ ఉన్నదున్నట్లుగా ఉండిపోతుంది.

ఈ కోశాలు ఆత్మను కప్పాయి అంటే, మేఘాలు సూర్యుడిని కప్పినట్లు. అయితే అజ్ఞానములో ఆత్మ కనబడలేదు అంటే అర్థం, ఆ సూర్యుడిని చూచేవారికి అజ్ఞాన మేఘము ఆవరించినందువలన సూర్యుడు కనబడుటలేదు. అంతేగాని సూర్యుడు లేకుండా పోలేదు. సూర్యునివైపు నుండి చూస్తే సూర్యుడు తన లక్షణమైన ప్రకాశము తనలోనే స్వానుభవముగా నున్నది. సూర్యునికి మేఘము అడ్డు కాదు. అనగా నిజానికి ఆత్మకు పంచకోశాలు ఆవరణ కాదు. ఒక అజ్ఞానాత్మకే ఇవి ఆవరణలు. ఆవరణలు తొలగితే ఆత్మ కనబడిందా? నీవే ఆత్మ గనుక అక్కడ కనబడుటలేదు. అయ్యుండటమే స్వానుభవము.

ఆత్మసత్తా వలన పంచకోశాలు, ఉపజీవించబడుచున్నవి అన్నాము. ఉపజీవనము అంటే ఏమిటి? జడమైన కోశాలు వాటికవే ఏమీ చేయలేవు. ఆత్మ చైతన్యము కారణముగా చైతన్యవంతమైన పని చేస్తాయి. ఆత్మసత్తా వలన వాటిలోని ధర్మాలు ప్రకటితమవుతాయి. ఆత్మ జ్ఞానము వలన అవి వాటివాటి పనులు చేయడానికి అవసరమైన జ్ఞానము కావాలి.

శరీరం శిశువు నుండి వృద్ధులయ్యేదాకా, అలాగే కావాలనే జ్ఞానం ఆ శరీరంలోనే ఉంటుంది. మనం అనుకొని పెరుగుతామా? అనుకోకపోతే మాత్రం యవ్వనం వరకు వచ్చి ఆగిపోతామా? బాలింతలకు పాలు పడటము, ఆగిపోవడము ఆ శరీరానికున్న జ్ఞానమే గాని, అది మన జ్ఞానము కాదు. అలాగే ప్రాణ చలనాలు ఏ విధముగా ఉండాలి? ఎప్పుడు రావాలి? ఎప్పుడు పోవాలి? ఆ ప్రాణానికి తెలుసు. శరీర ధర్మాలు జరామరణాల జ్ఞానం శరీరానికున్నది. ప్రాణధర్మాలు ఆకలిదప్పుల జ్ఞానము ప్రాణానికి ఉన్నది. శోక మోహ జ్ఞానము మనస్సుకు ఉంది. నిర్ణయించేటటువంటి జ్ఞానము బుద్ధికున్నది. నిజమైన జ్ఞానము ఆత్మవద్ద ఉంటే, ఈ పంచకోశాలు ఆ జ్ఞానాన్ని అందిపుచ్చుకొని వాటి పద్ధతిలో అవి ఉపయోగించుకుంటున్నాయి. ఉపజీవము అంటే అదే.

అయితే ఆత్మసత్తా ఆనందమయకోశములో ప్రతిబింబముగా ఉండి ఆనందం అనే లక్షణము ప్రియంమోదం ప్రమోదముగా మారి ఉన్నది. విజ్ఞానమయ కోశములో ఆత్మ జ్ఞానము ఎక్కువగా ఉపజీవిస్తున్నది. కాని అది ప్రాపంచిక విషయాలలోనే ఆ తెలివిని ఉపయోగిస్తున్నది. కాని ఆ బుద్ధికి తన యదార్థమైన ఆత్మ జ్ఞానాన్ని పొందగల సామర్థ్యమున్నది.

మనస్సుకు విమర్శనా జ్ఞానముచాలానే ఉన్నది. ఇది కూడా ఆత్మనుండే సంక్రమించింది. కాని బుద్ధికి అందే దానికంటే తక్కువ అందుతుంది. అలాగే ప్రాణమయ కోశానికి ఇంకా తక్కువ చైతన్యము, ప్రజ్ఞ అందించబడుతుంది. అన్నమయ కోశానికి అంతకంటే చాలా తక్కువగా అందించబడుతుంది. దగ్గరి కోశాలకు ఎక్కువ, దూరపు కోశాలకు తక్కువా ఆత్మసత్తా అందుబాటులో ఉంటుంది. ఆత్మసత్తా ఒక్కటే అయినా, కోశాలలో సమాన సత్తాకాదు అన్నారు. ఇదంతా దాని వివరణ. **'సోయందేవదత్తా'** అనేది పంచకోశాలకు అప్లై చేసి ఈ పాఠాన్ని ముగిద్దాము.

అన్నమయకోశ ధర్మాలతో ఉన్న దేవదత్తుడు ప్రాణమయకోశ ధర్మాలున్న దేవదత్తుడు ఒక్కడే. వాచ్యార్థముగా ఉన్న అన్నమయకోశ ధర్మాలను విడిస్తే అప్పటికి లక్ష్యార్థమైన ప్రాణమయకోశ ధర్మాలుగా ఉన్న దేవదత్తుడే సత్యము. ప్రాణమయకోశ ధర్మాలను వాచ్యార్థముగా విడిస్తే మనోమయ కోశమే ఆ దేవదత్తుడు. అలాగే అన్నికోశ ధర్మాలుగా ఉన్న ఈ దేవదత్తుడే పంచకోశ వ్యతిరిక్తమైన సచ్చిదానంద ఆత్మ అయిన దేవదత్తుడు. ఎలా ఒక్కటవుతుంది? పంచకోశ ధర్మాలను వాచ్యార్థముగా విడచిపెట్టి లక్ష్యార్థమైన ఆత్మ లక్షణాలను ఉంచుకొంటే వాడే వీడు, ఆ దేవదత్తుడే ఈ దేవదత్తుడు, జీవాత్మయే పరమాత్మ!

## అవస్థాత్రయ సాక్షి

జీవుడు జాగ్రత్ స్వప్న సుషుప్తి అను మూడవస్థల అనుభూతి పొందును. ప్రతి జీవుడూ కూడా మూడవస్థలు తప్పకుండా అనుభవిస్తూ వుంటాడు. జీవుడు అనగానే జీవభావం వున్నవాడు జీవుడు అనగానే అంతఃకరణ ప్రతిబింబుడు. జీవుడు అనగానే చైతన్య ప్రకాశము యొక్క ప్రతిబింబరూపమే చిత్ ఆభాసుడు. చిత్తు ఆభాసమయింది. చైతన్య ప్రకాశము స్వయం ప్రకాశం

కాకుండా ఆభాస ప్రకాశం అయింది. అంటే ప్రతిబింబించినటువంటి ప్రకాశం అయింది. వాడే జీవుడు. అసలు అంతఃకరణ ఎందుకొచ్చింది. శరీరం వుంది కాబట్టి శరీరంలో అంతఃకరణ వుంది. శరీరం ఎందుకొచ్చింది? కర్మలు చేయడాలు, కర్మ ఫలితాలను అనుభవించడం కోసం జీవుడు శరీరముగా వచ్చాడు. కనుక ఇప్పుడు చిదాభాసుడు అనే అంతఃకరణ ప్రతిబింబ రూపుడు అయిన జీవుడు మానవ జన్మలో ఏమయ్యాడు? అసత్య నేను అయ్యాడు. అప్పుడు జీవుడు వేరు శివుడు వేరు. మరి ఇప్పుడు అనేక జన్మ సంస్కారాలనుండి జన్మలనుండి, ఒక ఉపాధిలో ఒక అంతఃకరణ వుండి, ఆ అంతఃకరణలో పూర్వ జన్మ వాసనలు ప్రారబ్ధ రూపంలో వుండి, రాబోయే జన్మలలో అనుభవించడానికి, అయిపోయిన జన్మల సంచిత కర్మరాశి అక్కడే వాసనా రూపంలో వుండి, అపక్వ దశలో సంచిత కర్మలుగా ఉండి, పక్వ దశలో ప్రారబ్ధ కర్మలవుతూ ఉంటే, ఇవన్నీ వాసనా రూపంలో వుండి అంతఃకరణని ఆవరించి వుంటే, అది మలిన అంతఃకరణ అయింది. కనుక మలిన అంతఃకరణ ప్రతిరూపుడైన చిదాభాసుడు అసత్య నేనుగా వున్నాడు.

ఈ జీవుడే "నేను నేను" అనేవాడే ఆత్మానాత్మ వివేకంతో , సద సత్ వివేకంతో ఒకరకమైనటువంటి సాధనతో అంతః కరణ మాలిన్యాన్ని తుడిచిపెట్టేటటువంటి ప్రక్రియలో వున్నాడు. మాలిన్యమును పోగొట్టుకొని శుద్ధ అంతఃకరణకి మార్చుకునే క్రియలో వున్నాడు. దీంట్లోనే ఒక భాగంగా ప్రతి జీవుడికి మూడవస్థలు వున్నాయి. చీమ దగ్గరినుండి ప్రతి జీవికి కూడా మూడు అవస్థలున్నాయి. చీమ కల కంటుంది, చీమ నిద్రపోతుంది, చీమ జాగ్రదావస్థలో వ్యవహారం చేస్తుంది. కాకపోతే చీమలో వున్న చైతన్యము సృష్టికర్త బ్రహ్మలో వున్న చైతన్యము మానవుడిలో వున్న చైతన్యము ఒక్కటే. ఉపాధిగతమైన చైతన్యము మాత్రము అది వికసించినటువంటి చైతన్యం కాదు. తమో గుణము ఎక్కువగా ఆవరించినటువంటి చైతన్యము క్రిమికీటకాదులలో వున్నది. కొంచము రజో గుణము ఎక్కువగా వున్న చైతన్యము క్రూరజంతువులయందు వున్నది. సత్వగుణము ఎక్కువగా వున్న చైతన్యము సాధు జంతువులలో వున్నది. మూడు గుణములతో కూడిన చైతన్యము మానవులలో వుంది. తమోగుణ ప్రధానముగా వున్న చైతన్యము నిద్ర పుచ్చుతోంది. రజోగుణము ప్రధానముగా వున్న చైతన్యము స్వప్నాన్ని కలిపిస్తోంది. సత్వగుణము ప్రధానముగా వున్న చైతన్యము జాగ్రదావస్థని ఇస్తోంది.

సత్వ గుణము ప్రధానముగా వున్నటువంటి చైతన్యములో జాగ్రదావస్థలో క్రియాశక్తి పనిచేసి జీవుడు కర్మ చేస్తూ కర్మానుభవం పొందుతూ కొత్త కర్మని పోగుచేసుకుంటున్నాడు. రజో గుణంతో కూడినటువంటి చైతన్యానుభవము స్వప్నతుల్యముగా ఉన్నందున స్వప్నాన్ని అనుభవిస్తున్నటువంటి జీవుడు, క్రియాశక్తి అక్కడ లేదు కనుక, ఆ స్వప్నంలో తాను ఏమి చేసినా కర్మ అంటకుండా వుంది. తమోగుణతో కూడిన చైతన్యములో, గాఢనిద్రలో వున్న జీవుడికి కర్మ జరగటంలేదు నిష్క్రియగా నిర్వికల్పంగా వున్నాడు కాని తమోగుణం ఆవరించి వుంది అక్కడ. కనుక మనం చైతన్యాన్ని మూడు గుణాలనుండి విడుదల చేసినప్పుడే శుద్ధ చైతన్యం అవుతుంది, అంతఃకరణ మాలిన్యం పోతుంది. అందువల్ల ఈ జ్ఞానశక్తి క్రియాశక్తి ఇఛ్ఛాశక్తి అనే మూడు శక్తులు కూడా, కలిసి పనిచేసేది జాగ్రదావస్థ, క్రియాశక్తి లేకుండా కేవలం జ్ఞాన శక్తి, ఇఛ్ఛాశక్తి కలిసి పనిచేసేటటువంటిది స్వప్నావస్థ, ఇఛ్ఛాశక్తి కూడా లేకుండా కేవలం జ్ఞానశక్తి మాత్రమే ఉండి, తమోగుణముతో ఆవరించబడినది సుషుప్త్యావస్థ.

జాగ్రదవస్థలోనే మళ్ళీ మూడు గుణాలతో వ్యవహరిస్తాడు జీవుడు. రజోగుణం వుంటే మనస్సు విషయాలలోకి వెళ్తుంది. క్రియాశక్తి వున్నప్పుడేమో కర్మేంద్రియాలు జ్ఞానేంద్రియాలు కూడా పనిచేస్తాయి. క్రియాశక్తి లేనప్పుడు మనసొక్కటే పనిచేస్తుంది దానికి ఇఛ్ఛ వుంది కాబట్టే కల వస్తుంది. క్రియాశక్తి లేనందువల్ల కలలో ఏమి చేసినాగాని ఏమి అనుభవించినా గాని అవన్నీ అసత్యము, మిథ్య, అక్కడ కర్మ అంటదు నీకు. ఏ ఆసక్తీ లేనందువల్ల కర్మ అంటదు. జాగ్రత్ స్వప్న అవస్థలలో ఇఛ్ఛాశక్తి వుండటం వల్ల ఈ రెండింటికీ నీకు విషయాలు వున్నాయి. నీకు ఏ ఇఛ్ఛాలేని స్థితిలో, గాఢ నిద్రలో, ఏ అనుభవము లేదు కాబట్టి అక్కడ ఇఛ్ఛాశక్తి కూడా లేదు. అందుకని అది ఒక నిర్విషయ స్థితి. ఆ నిర్విషయ స్థితిలో ఏమీ తెలియని అనుభవం వుంది. ఆ నిర్విషయ స్థితిలో విషయాలున్నప్పుడు సుఖదుఃఖాలు రాగద్వేషాలు ఆరాట పోరాటాలు అన్నీ వున్నాయి. ఎప్పుడైతే ఇఛ్ఛా క్రియా శక్తులు లేవో ఇఛ్ఛలేనప్పుడు నీకు నిద్ర వచ్చేసింది. ఎవరైతే పడుకుని ఒక్క నిముషంలో నిద్రపోగలుగుతాడో ఆ సాధకుడు వాడు

ఇచ్ఛాశక్తిని మీరినవాడే. సాధకుడు కాని వాడు పడుకోగానే నిద్ర వస్తుంది, ఎంతకూ లేవడు అన్నంతమాత్రాన వాడు తురీయంలో వున్నట్లు కాదు. వాడు జ్ఞానికాదు. వాడికి తమోగుణం హెచ్చుగా వుంది. అందుకని మానవ స్వభావముతో తమోగుణాన్ని జయించి నిద్రపోవాలనుకున్నప్పుడు నిద్రపోయి, నిద్రపోతూ కూడా చిన్న అలికిడికే మెలకువలోకి వచ్చేసి, అన్నిటినీ గ్రహించగలిగే స్థితిలో వుంటాడు తురీయుడు.

ఈ మూడవస్థలు ప్రతి జీవికి వున్నాయి. మార్చి మార్చి మూడు గుణాలలో ఒకటి ప్రధానంగా పనిచేయడములో, సత్వగుణం ప్రధానంగా వున్నది జాగ్రదావస్థ, క్రియాశక్తి వున్నది. రజో గుణ ప్రధానంగా వున్నది స్వప్నావస్థ, క్రియాశక్తి లేదు, కాని ఇచ్ఛాశక్తి వున్నది, గాడ నిద్రలో క్రియా శక్తి ఇచ్ఛాశక్తి లేదు అక్కడ తమో గుణ ఆవరణ వున్నది, తమో గుణం ఆవరించడం వల్ల మీకు ఏదీ తెలియడం లేదు. ఈ రకంగా మూడవస్థలు వుంటాయని మనం గ్రహించాలి.

సంఖ్య, అవస్థ, స్థానము, వాక్కు, భోగము, శక్తి(బలము). గుణము, అభిమాని – ఇవి ఒక టేబుల్‌గా ఇచ్చాడు. జాగ్రదావస్థ నేత్ర స్థానం నుండి పనిచేస్తుంది. చక్షురింద్రియం పనిచేస్తే జాగ్రదావస్థ. వాక్కు వైఖరి వాక్కు. జాగ్రదావస్థలో చేసేవి అన్నీ కూడా స్పష్టము. వైఖరీ అంటే స్పష్టము. అంతా స్పష్టము కాబట్టి కర్మ అంటుకుంది చక్కగా. అందుకని భోగమేమిటి అంటే నామరూపాలు కనుక స్థూలం. జాగ్రదావస్థలో నామరూపాలు స్థూల రూపంలో వున్నాయి. శక్తి – క్రియాశక్తి వుంది అక్కడ. గుణం సత్వగుణము. అభిమాని జాగ్రదావస్థ అభిమాని విశ్వుడు.

రెండో వరస స్వప్నము. స్వప్నము కంఠస్థానము. కంఠస్థానము మనసు. విశుద్ధి చక్రం మనసుయొక్క వ్యవహారం. అందుకని స్వప్నంలో మనసు మాత్రమే పనిచేస్తుంది. మిగతా ఇంద్రియాలు పనిచేయకపోయినాగాని, శబ్ద స్పర్శరూపరసగంధాలు స్వప్నంలో కూడా అనుభవించే అవకాశం వుంది. దాంట్లో ఏదో ఒకటి కొన్ని తప్పకుండా అనుభవానికి వస్తాయి. మళ్ళీ కళ్ళుమూసుకుని నిద్రపోతున్నప్పుడు నీకు రూపం కనబడుతోంది. బయటి శబ్దాలు వినడంలేదు గాని స్వప్నంలో శబ్దాలు వింటున్నావు. బయటి వాసనలు లేకపోయినా స్వప్నంలో వాసనలు చూస్తున్నాయి. స్వప్నంలో తియ్యటి పదార్థాలు తింటున్నావు. ఆ రుచికి రియాక్ట్ అవుతున్నావు కాని స్థూలరూపంగా జ్ఞానేంద్రియాలతోటి కూడి వున్నటువంటి అనుభవము కాదు. జ్ఞానేంద్రియాలు నిద్రిస్తున్నాయి, మనసే ఆ పాత్ర తీసుకుంది. జ్ఞానేంద్రియాలు అంతకుముందు గ్రహించినటువంటి విషయ జ్ఞానము వాసనా రూపంగా వుంటే, మనసులో వున్నటువంటి వాసనే, కారణ శరీరంలో చేరి వున్నటువంటి ఆ వాసనే కార్యరూపమును దాల్చి సూక్ష్మంగా అనుభవాన్ని ఇస్తుంది. జాగ్రదావస్థ స్థూలానుభవం ఇస్తుంది, స్వప్నావస్థ సూక్ష్మానుభవం ఇస్తుంది. ఇక్కడ క్రియాశక్తి పనిచెయ్యదు, జ్ఞాన శక్తి పనిచేస్తుంది. స్వప్నము కంఠ స్థానము నుండి అనుభవానికి వస్తుంది. అంత స్పష్టముగా వుండదు కాబట్టి అది మధ్యమ, జ్ఞానరూపము అత్యంత స్పష్టముగా వున్నది స్థూలము అదీ వైఖరీ. అంత స్పష్టత లేకుండా వుండేది సూక్ష్మము. అక్కడ శక్తి (బలం), ఏమిటంటే జ్ఞానశక్తి. రజోగుణం వల్ల కలొచ్చింది.

విశ్వాన్ని అంతా కూడా తన ఇష్ట ప్రకారంగా తన కర్మ వాసనలు అనుభవంగా వస్తూ ఉన్నంతవరకు వున్న పరిమితమైన విశ్వాన్ని జాగ్రదవస్థలో చూస్తాడు కాబట్టి వాడి పేరు విశ్వుడు. అభిమాని పేరు విశ్వుడు. కంఠస్థానాన్ని కేంద్రంగా చేసుకుని స్వప్నాన్ని కనేటటువంటి వాడు, భోగము సూక్ష్మ భోగము, పనిచేసేది జ్ఞానశక్తి, అక్కడున్నటువంటి గుణం రజోగుణం, వాడి పేరు తైజసుడు. తైజసుడనే పేరు ఎందుకొచ్చింది? తేజస్సుతో కూడినవాడు తైజసుడు. తేజస్సు అంటే వెలుతురు, ప్రకాశం. ప్రకాశం అంటే ఎక్కడిది? నేనే ఆత్మని. నేనే చిదాభాసుడిని. చైతన్య ప్రకాశమే ప్రతిఫలించి ప్రకాశించేది. ఎందులో? నాలో. జాగ్రదావస్థలో ఆ ప్రకాశంతోనే నామరూపాలు కూడా కలిసి వచ్చినాయి. అప్పుడు విశ్వంలో పడ్డాడు కాబట్టి విశ్వుడని పేరు. విశ్వానికి అభిమాని విశ్వుడు. ఆ కల్పిత వాసన ఎంతవరకు ఆ విశ్వాన్ని గోచరింపచేస్తుందో, తన కర్మ విశ్వంలో ఏ భాగం వరకు అయితే కర్మానుభవానికి వచ్చిందో అంతమేరకు మాత్రమే ఆ విశ్వాన్ని అభిమానిస్తాడు. అందుకని జాగ్రదావస్థలో విశ్వాభిమాని కాబట్టి జాగ్రదావస్థలో అభిమాని పేరు విశ్వుడు.

ఆ విశ్వుడుకి కూడా విశ్వము గోచరింపచేసేటటువంటి ప్రకాశము చిదాభాసుడులో వున్నది. స్వప్నములో ఏమున్నది? కేవలము ఆ తేజస్సే ఆ ప్రతిఫలించిన ప్రకాశమే వున్నది. స్వప్నదృశ్యాలు కనబడటానికికారణమైనటువంటి వెలుతురు తేజసుడు. ఆ తేజో రూపుడు ఈ స్వప్న తేజుడు అయ్యాడు కాబట్టి ఈ స్వప్నతేజుడి పేరు తైజసుడు. తేజమే తానైనవాడు తైజసుడు. ఈ తేజం పరమాత్మ తేజం కాదు. పరమాత్మ ప్రకాశానికి ప్రతిబింబించిన ప్రకాశం ఇది. ఎప్పుడైతే ప్రతిబింబ ప్రకాశం వుందో, ఏ అంతఃకరణ అనే అద్దంమీద పడి ప్రతిబింబించిందో ఆ అంతఃకరణ దోషాలతో కూడి వుంటుంది. అందుకని స్వప్నంలో కూడ జాగ్రదావస్థ లాగానే జాగ్రదావస్థకి ఏ వాసనలు కారణమో, స్వప్నానికి కూడా అటువంటివే సూక్ష్మ వాసనలే కారణం. స్థూల వాసనలు కారణంగా వున్నవి జాగ్రదావస్థ, సూక్ష్మ వాసనలు కారణంగా వున్నవి స్వప్నావస్థ. అక్కడా అంతఃకరణ మాలిన్యం వుంది, ఇక్కడా అంతఃకరణ మాలిన్యం వుంది. అక్కడ స్థూలంగా వున్నప్పుడు భోగము ఇంద్రియాలలో క్రియాశక్తితో కూడి పనిచేస్తుంది. ఇక్కడ సూక్ష్మం స్థితిలో ఇంద్రియాలు క్రియాశక్తితో లేవు కాబట్టి ఇంద్రియాల పాత్ర కూడా మనస్సే పోషిస్తూ ఆ చిదాభాస ప్రకాశంలో తైజసుడు అనేపేరు తోటి స్వప్నాభిమాని అయింది.

మూడోది సుషుప్త్యావస్థ. దీనికి స్థానం హృదయం. హృదయస్థానంలో వుంటే వాక్కు పశ్యంతీ వాక్కు. అంటే గాఢ నిద్ర కూడా తెలుసుకునే వాడికి కొంత తెలిసీ తెలియనట్లుగా వుంటుంది. అందుకని పశ్యంతి. పరా అన్నప్పుడేమో ఏమీ తెలియదు అప్పుడు. పశ్యంతి అంటే తెలిసీ తెలియనట్లుగా గోచరిస్తుంది. మధ్యమ అంటే అస్పష్టంగా గోచరిస్తుంది. సూక్ష్మంగా గోచరిస్తుంది. వైఖరీ అంటే స్పష్టంగా స్థూలంగా నామరూపంగా గోచరిస్తుంది. చేత్తో పట్టుకొవచ్చు, చూడొచ్చు, దానిమీద పరిశోధన చెయ్యొచ్చు అంత స్పష్టంగా వుండేది స్థూలం. స్వప్నంలో కనబడే సూక్ష్మం అంత పరిశోధన వుండదు. స్వప్నం నీకు ఏ కల వస్తే చచ్చినట్లు ఆ కలే అనుభవించాలి గాని అక్కడ మరో రకంగా నువ్వు చెయ్యలేవు. పట్టుబడే కల వస్తే పట్టుబడతావు, విడిపించుకునే కల వస్తే విడిపించుకుంటావు. అదే క్రియాశక్తి పనిచేస్తే జాగ్రదావస్థలో తప్పించుకోగలవు నువ్వు. తప్పించుకునే క్రియ చేస్తవు, తప్పించుకునే కర్మ జరుగుతుంది. తప్పించుకునేటటువంటి ప్రయత్నం వుంటుంది. అక్కడ పురుష ప్రయత్నం వుంటుంది. కలలో పురుష ప్రయత్నం లేదు, జాగ్రదావస్థలో పురుష ప్రయత్నం వుంటుంది. ఈ పురుష ప్రయత్నం అనేది ఆత్మానాత్మ వివేకంతోటి సాధనకి కూడా ఉపయోగించవచ్చు. ఇంద్రియ నిగ్రహానికి ఉపయోగించుకోవచ్చు. పట్టుదలపట్టి ఒక పనిచేయడానికీ ఉపయోగించుకోవచ్చు. అంత స్పష్టంగా వుంటుంది, అంత స్థూలంగా వుంటుంది, అంత వ్యవహారం చేయడానికి అనుకూలంగా వుంటుంది కాబట్టి అది వైఖరీ.

గాఢ నిద్రలో పశ్యంతి వుంది. స్వప్నంలో పశ్యంతినుండి మధ్యమదాకా వచ్చాడు. జాగ్రదావస్థలో మధ్యమ నుండి వైఖరికి వచ్చాడు. గాఢనిద్రలో ఏ విషయం లేనందువల్ల హాయిగా నిద్రపోయాము అంటాము. కనుక భోగము ఆనందం. మరి అక్కడ మోక్షం అనవచ్చునా అంటే వీల్లేదు. అది తమోగుణంతో ఆవరించి వుంది. అందుకని గుణము తమో గుణము. ఏదైనా గుణము వుంటే ఆ ఆనందము బ్రహ్మానందము కాదు. తమోగుణంవల్ల ఆనందం కలగవచ్చు, రజో గుణము వల్ల ఆనందము కలగవచ్చు, సత్వ గుణమువల్ల ఆనందము కలగవచ్చు. ఇతరులని క్షమించి, ఎవరిమీద కోపతాపాలు లేకుండ, నీ మనసుని శాంతపరచుకునే సత్వగుణం వుంటే అప్పుడు నువ్వు శాంతంగా వుంటావు, ఆనందంగా ఉంటావు. కాని అది ఆత్మానందము కాదు.

సత్వగుణం వల్ల శాంతి లభిస్తుంది. రజోగుణము వలన ఆందోళన, టెన్షన్, భయము అన్నీ వుంటాయి. తమో గుణమువల్ల ఏమీ వుండదు. పూర్తిగా నిశ్చలుడుగా నిర్వికల్పంగా వుంటాడు. అక్కడ ద్రవ్యశక్తి ఉంటుంది. అనగా అది జడానుభవము. అంటే గాఢనిద్రలో వున్న తమోగుణ ఆవరణాన్ని తొలగించుకున్నవాడికి తురీయ స్థితి వస్తే ఆనందం అనేది అతడికి స్వానుభవానికి తెలుస్తుంది, తురీయానందం. గాఢనిద్రలో ఆనందం తమస్సుతో కూడి వుంది కాబట్టి అప్పటికప్పుడు తెలియదు గానీ నిద్ర లేచిన తరువాత నేను హాయిగా నిద్రపోయాను అని అంటాడు. ఇక్కడ అభిమాని ప్రాజ్ఞుడు. ప్రాజ్ఞుడు అంటే ప్రజ్ఞ. భోగము ఆనందము, అభిమాని ప్రజ్ఞ అని వుంది. నిజానికి ప్రాజ్ఞుడంటే ప్రజ్ఞానం బ్రహ్మ. ఈ ప్రాజ్ఞుడు తమస్సుతో

ఆవరించబడ్డాడు కాబట్టి వాడు ప్రజ్ఞానం బ్రహ్మ కాదు. ప్రాజ్ఞుడు అని ఎందుకు పేరు పెట్టాము? పశ్యంతి దగ్గర ఆనంద భోగంలో తమోగుణము ప్రజ్ఞను ఆవరిస్తే, ఆవరించినంత మాత్రాన అతడు ప్రాజ్ఞుడు కాకపోతాడా? వాసనలు అపక్వంగా ఉంటే ప్రాజ్ఞుడే. జాగ్రత్ స్వప్నాలలో వాసనలు అనుభవానికి వచ్చాయి కాబట్టి విశ్వుడు, తైజసుడు అన్నాము. గాఢ నిద్రలో ఆవరణ మాత్రమే ఉన్నది. జాగ్రత్ స్వప్నాలలో విక్షేపము కూడా ఉన్నది. ఆ విక్షేపాన్నిబట్టి ప్రాజ్ఞుడి పేరు విశ్వ తైజసులుగా మారింది. విక్షేపము లేనప్పుడతడు ప్రాజ్ఞుడే. ఆవరించబడ్డ ప్రాజ్ఞుడు.

తమస్సులో వున్నప్పుడు విశ్వుడుగా ఎరుగక, తైజసుడుగా ఎరుగక కేవలము ఎరిగే ఎరుక రూపంలో వున్నాడు కాబట్టి వాడిని ప్రాజ్ఞుడు అన్నాము.

**1) జాగ్రదవస్థ:** అవస్థాత్రయ రూపణ పటము వివరించబడినది. ఇప్పుడు పాఠంలోకి వెళ్దాము. చతుర్దశేంద్రియములు, చతుర్దశేంద్రియాధి దేవతలు, చతుర్దశేంద్రియ విషయములు అనే 42 తత్వములు జాగ్రదవస్థయనబడును. 42 అంటే మూడు పద్నాలుగులు 42. చతుర్దశ ఇంద్రియాలు అంటే, 14 ఇంద్రియాలు. వాటికి అధిష్ఠాన దేవతలు 14మంది. ఇంద్రియాలు దేనినైతే విషయీకరించు కుంటాయో ఆ పద్నాలుగు విషయాలు. 14మంది అధిష్ఠాన దేవతలయొక్క ప్రేరణతో ఆ 14 ఇంద్రియాలు 14 విషయాలను సేకరించేదానిని 14 త్రిపుటులు అంటారు. ఈ 42 తత్వాలు జాగ్రదవస్థలో 14 త్రిపుటులుగా పనిచేస్తాయి.

1. పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టము వెరసి 14. ఇదొక సంపుటి.

2. అష్ట దిక్పాలకులు, వాయుదేవుడు, సూర్యుడు, వరుణుడు, అశ్వనీ దేవతలు (5), అగ్ని దేవుడు, ఇంద్రుడు, ఉపేంద్రుడు, ప్రజాపతి, మృత్యుదేవత (5) చంద్రుడు, బహస్పతి, క్షేత్రజ్ఞుడు, రుద్రుడు (4) వెరసి 14. ఇదొక సంపుటి.

3. శబ్ద గ్రహణము, స్పర్శ గ్రహణము, రూపగ్రహణము, రసగ్రహణము, గంధ గ్రహణము (5) వచించుట, దాన ప్రతిగ్రహణము, గమనాగమనము, ఆనందించుట, మల విసర్జనము (5) ఎరుగుట, సంకల్ప వికల్పములు నిశ్చయించుట, చింతన చేయుట, అభిమానము (4) వెరసి 14. ఇదొక సంపుటి.

మొదటి సంపుటి ఆధ్యాత్మికము. రెండవ సంపుటి ఆధి దైవికము. మూడవ సంపుటి ఆధి భౌతికము. ఈ మూడూ కలసిన వ్యవహారము 14 త్రిపుటులుగా జరుగుచున్నది.

ఉదాహరణకు మనస్సు అనే ఆధ్యాత్మ. చంద్రుడు అనే ఆధిదైవికము యొక్క ప్రేరణతో సంకల్పము వికల్పములు చేయుచున్నది. ఈ విధముగా 14 ఆధ్యాత్మమైన ఇంద్రియాలు 14మంది అధిష్ఠాన దేవతల ప్రేరణచే 14 విధములైన ఆధి భౌతిక క్రియలను చేయుచున్నవి. ఈ విధముగా 14 త్రిపుటులుగా ఇంద్రియ వ్యాపారము జరుగుచున్నది.

కనుక జాగ్రదవస్థలో ఈ 42 కలసి 14 త్రిపుటులుగా వ్యవహారము జరుగుచున్నది.

**సీ॥ పంచవింశతి తత్వ పరిపూర్ణమైనట్టి స్థూల దేహమునందు సురచిరముగా ।**
**రస స్పర్శ వలన రూప రసగంధ వచన దాన గమనౌత్సర్జనానందములును ।**
**మానసాహంకార మతి చిత్తముల గూడి జీవుండు ముఖమున జేరి నిలచి ।**
**విశ్వనామము జెంది వేర్వేర విభజించి సకల వ్యాపారములు సలుపుచుండు ।**
**నదియు జాగ్రదవస్థయు ననుదినంబు జనితమై జనుచుండును జన్మ రహిత ।**
**రమ్య గుణ ధామ భద్రాద్రి రామ పరశు రామ నరసింహ్మదాస సంరక్షితాహ్వ ॥**

ఆధ్యాత్మిక ఆధి దైవిక ఆధి భౌతికముగా ఈ మూడు త్రిపుటులు కూడి జాగ్రదవస్థలో వ్యవహారము జరుగుతూ వుంటే వాడికి విశ్వుడని, చిదాభాసుడని, వ్యావహారికుడని మూడు రకాల పేర్లు వున్నాయి. స్థానమేమో ఇక్కడ ముఖములో అన్నాడు, నేత్రము అని కూడా అంటాము. బుద్ధి ముఖస్థానం నిజానికి. బుద్ధి కర్మానుసారిణి – బుద్ధి నిర్ణయాన్నిబట్టి ఏ కర్మ అయినా జరుగుతుంది, ఏ కర్మ అయినా అనుభవిస్తాము కనుక ముఖస్థానము కూడా అనొచ్చు. అందుకే ఒక్కొక్కచోట ఒక్కొక్క రకంగా

వుంటుంది. సకల వ్యాపారాలు సలుపుచుండు. అందుకని వాటి వ్యవహారాలు చూస్తాడు కాబట్టి వ్యావహారికుడు అన్నాం. ప్రతి దినము ఈ జాగ్రదావస్థ వస్తూపోతూ వుంటుంది ఒక ఆవృతముగా వస్తూ వుంటుంది పోతూ వుంటుంది. జన్మ రాహిత్యం అయ్యే వరకు ఇది తప్పదు. జన్మ రాహిత్యం అయ్యేదాకా ఇంతే. జీవుడు పంచవింశతి తత్వాత్మకమైన తనువును గూడి అనగా పంచవింశతి అంటే 25 తత్వములతో కూడి, స్థూల దేహమందు, చతుర్దశేంద్రియ విషయములననుభవించుచు - 14 ఇంద్రియాలతో 14 అధిష్టాన దేవతలయొక్క ప్రేరణతో 14 విషయాలతో తాదాత్మ్యం చెందుతూ, కర్మ చేస్తూ కర్మానుభవం పొందుతూ వుంటాడు. నేత్ర స్థానమందు విశ్వుడనే పేర నిలచి సకల వ్యవహారములను సలుపుచూ కర్మానుభవము అందుచుండును – ఇది జాగ్రదావస్థ. కాని నీవు జన్మరాహితుడవు గనుక, ఈ అవస్థకు సాక్షిరూపుడవు.

**2) స్వప్నావస్థ :** జాగ్రదావస్థయందు శ్రోత్రాది ఇంద్రియములచే అనుభవింపబడిన విషయ జ్ఞానము ఏదైతే వాసనారూపంలో వుందో, అవి తిరిగి క్రియాశక్తి లేకుండా కేవలం ఇఛ్ఛాశక్తి వున్నప్పుడు–తోచునట్టి వాసనలేవియో అదియే స్వప్నావస్థ. జాగ్రదావస్థ నందు వస్తున్నటువంటి వ్యవహారంలో ఏర్పడిన వాసలేవో– అవే సహస్రాంశముగనుండు, వెయ్యోవంతుగా వుండే, అంతకంటే సూక్ష్మముగా కంఠస్థానంలో నుండి “హితా” యనెడి నాడియందుండి, సకలేంద్రియ రాజైనటువంటి – ఇంద్రియాలకి రాజైన – మనసుచేత అనుభవించు అవస్థయే స్వప్నావస్థ.

ఇక్కడ స్వప్నావస్థకి ఏమున్నాయి? అన్ని విషయాలు, ఆధి భౌతికము – స్వప్నావస్థకి అధిష్ఠాన దేవత ఎవరు. జాగ్రదావస్థకి అధిష్టాన దేవత ఎవరు? వీటికి కూడా అధిష్ఠాన దేవతలు వున్నారు. మూడవస్థలకి తురీయానికి కూడా అధిష్ఠాన దేవతలు వున్నారు. కనుక ఆ అధిష్ఠాన దేవతలు ఆధి దైవికము. మనసుచేత అనుభవించు అవస్థలో ఆ పద్నాలుగులో మనసు తప్ప ఏవీ లేవు అక్కడ. బుద్ధి కూడా లేదు అక్కడ. బుద్ధి నిర్ణయం లేదు. బుద్ధి నిర్ణయం వుంటే క్రియాశక్తి వుంటుంది, క్రియాశక్తి వుంటే జాగ్రదావస్థ అవుతుంది. అక్కడ ఒక్క మనసే పనిచేస్తుంది. మనసే బహుపాత్రాభినయం చేస్తుంది. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాల పాత్ర పోషిస్తుంది. ఎట్లా అంటే ఒక ఆఫీసరు వున్నాడు, వేరే ఊళ్ళో వున్నాడు. సూపర్వైజరు ఇక్కడ ఆఫీసులో వున్నాడు. వాడి కింద 10 మంది గుమస్తాలున్నారు. ఈ సూపర్వైజరు పేరే మనస్సు. వేరే ఊళ్ళో వున్న ఆఫీసరుగారు ఫోన్ చేసి అర్జెంట్‌గా మాకు ఫలానా పనిచేసిపెట్టు అన్నాడు. ఆ రోజు శెలవు, ఆదివారం. మిగతా 10మంది గుమాస్తాలకు ఒక యూనియన్ ఉంది. అందువలన వాళ్ళు ఆ రోజు ఆఫీసుకు రాకపోయినా వాళ్ళనేమీ చెయ్యలేము. అందువలన ఆ సూపర్వైజరుగారే 10మంది ఆ గుమాస్తాల పనికూడా చేసి, ఆఫీసరు గారికి వారడిగిన పని అప్పగించారు. అలాగే స్వప్నావస్థలో మనస్సే ఆ పది ఇంద్రియాల పని చేసేస్తుంది. అప్పుడా ఇంద్రియాలు అక్కడ ఉండవు.

మొదటిసారి యాక్ట్ చేస్తూ పోతే ఒక సినిమా తయారయ్యింది. అది ఫిల్మ్‌లో ముద్రించబడింది. ఇప్పుడు సినిమా చూస్తున్నాము. అందులో వాళ్ళు ఇప్పటికిప్పుడు యాక్ట్ చేసింది చూస్తున్నామా? ఎప్పుడో యాక్ట్ చేసింది చూస్తున్నామా? అలాగే జాగ్రత్‌లో జరిగినవి వాసనలుగా ముద్రించబడితే, మళ్ళీ అవే కలలో చూస్తున్నాము. అందువలన కల అసత్యము. జాగ్రదవస్థతో పోలిస్తే కల అసత్యము.

ఆ సినిమా చూసే పద్ధతే స్వప్నము. అక్కడ ఫిల్మ్ తీసేస్తే ఏముంది? వట్టి వెలుగే వుంది. ఆ వెలుగు లేకుండా ఫిల్మ్ ఒక్కటే వుంటే కనబడదు అలాగే ఫిల్మ్ ఉండి వెలుగు లేకపోతే కనబడదు. కాబట్టి ఆ వెలుగు రూపుడే ఆ తేజోరూపుడే తైజసుడు. ఈ ఉదాహరణ తోటి స్వప్నం అంటే ఏమిటో తెలిసింది. కనుక ఈ సూక్ష్మ శరీరంలో స్వప్నావస్థలో అభిమానించే జ్ఞాతని తైజసుడు అంటారు. ప్రతిబింబ ప్రకాశంతో చూస్తున్నాడు. నేరుగా చూడటము లేదు. అందువలన ప్రాతిభాసకుడు అంటారు. స్వప్నములో మాత్రమే కల్పించబడ్డాడు, జాగ్రత్‌లో లేడు గనుక, పైగా అసత్యము వుంటున్నాము గనుక, స్వప్న కల్పితుడు అని కూడా అంటారు.

సీ॥ శబ్దాది విషయపంచకము, వాగాది పంచకము, నీ పదియునిచ్చటను నిల్పి ।
మానసాహంకారమతి చిత్తముల గూడి సప్త దశ తత్త్వ సౌజ్ఞ సూక్ష్మ ।
దేహమందున, కంఠ దేశంబునను జేరి నిలిచి, కొంచెము సేపు నిదురజెంది ।
జాగ్రతయందు తా జరిపినట్లుగ క్రియల్ జేసి, మేల్కొని చూడలేశమైన ।
లేదు గనుకను స్వప్నంబనాది పురుష । సత్యమిదిగాదు జనితమై జనుచునుండు ।
రమ్యగుణధామ భద్రాద్రి రామ పరశురామ నరసింహ్మదాస సంరక్షితాహ్వ ॥

శబ్ద స్పర్శ రూప రసగంధ విషయములను పంచ కర్మేంద్రియములను జాగ్రత్తలో నిలిపి, స్వప్నములోనికి తీసుకొని రాకుండా, మనసు అహంకారము, చిత్తము. ఈమూడూ కలసి ఒక్కటిగా చేసి పదిహేడు తత్వాలుగానున్న సూక్ష్మ శరీరమునందు జేరి, కంఠస్థానము వద్దకు చేరి, అక్కడ నిలచినప్పుడు, కొంచెముసేపు నిద్రపోగానే, అప్పుడు కల ప్రారంభమైనది. ఆ కలలో జాగ్రదవస్థయందు జరిపిన క్రియల వంటివే మళ్ళీ చేస్తాడు. మేల్కొని చూడగా కలలో తోచినవి లేశమైనా గాని సత్యముగా అనిపించలేదు.

జాగ్రత్‌నుండి గాఢనిద్రలోకి వెళ్ళే మధ్యలోను, గాఢనిద్ర నుండి మేల్కొనేలోగా ఆ మధ్యలోను కలలు వస్తాయి. అంటే ఇలా ఉంటుంది. మెలకువ – కల– గాఢనిద్ర – కల – మెలకువ. ఈ మాదిరిగా నిద్రలోకి జారి, గాఢనిద్ర పట్టేలోగా ఒకసారి కల రావచ్చును. గాఢనిద్ర నుండి మేల్కొనేలోగా మధ్యలో తెల్లవారుఝామున ఒకసారి కల రావచ్చును.

ఈ స్వప్నాలు 3 విధములుగా ఉంటాయి. మేల్కొనగానే స్పష్టంగా జ్ఞాపకము తెచ్చుకొని చెప్పగలగటము. సగం సగంగా అస్పష్టముగా జ్ఞాపకము రావడము. ఏదో ఒక కల వచ్చింది గాని, నాకేమీ గుర్తు లేదు అన్నట్లుగా ఉండడము.

స్వప్నంలో జాగ్రత్ అవస్థలో బాగా గుర్తుంటుంది. స్వప్నంలో స్వప్నములో అస్పష్టంగాను, కొంచెము గుర్తుండి, కొంచెము గుర్తు లేకుండా ఉంటుంది. స్వప్నములో సుషుప్తి అవస్థలో ఏదో కల వచ్చినట్లు తెలుస్తుంది గాని, ఏమీ గుర్తుండదు. కల వచ్చినప్పుడు మాత్రము స్పష్టంగానే ఉంటుంది మెలకువ వచ్చేసరికే ఈ మూడు విభాగాలు.

**3) సుషుప్త్యావస్థ :** నిద్రయందుండి లేచి “నేనీ దినమున యేదియు ఎరుంగను, సుఖముగా నిదురించితిని” అని నిద్రాకాలమందు అనుభవింపబడిన అజ్ఞాన స్మరణ స్వరూపమే సుషుప్త్యవస్థ. తన అజ్ఞతను స్మరణ రూపంగా దాచి, జ్ఞాపకంగా జాగ్రదావస్థలో తలచుకొని, స్మరించి, జ్ఞాపకం చేసుకుని, అప్పుడు అంటాడు ఈ నిద్రా సమయంలో నాకేమీ తెలియలేదు అని. ఈ నిద్ర సమయంలో నేను హాయిగా వున్నాను. భోగం ఆనందం అన్నాడుగా, ఆనందంగా వున్నాను అన్నాడు. అజ్ఞత స్మరణ అంటే ఏమీ తెలియదు అనేటటువంటి స్మరణ. అజ్ఞత స్మరణ అంటే ఏమీ తెలియనటువంటి స్థితిని స్మరించుకున్నాడు. అజ్ఞత స్మరణ స్వరూపమే సుషుప్తి అవస్థ అనబడును. బుద్ధి మొదలగు చతుర్దశేంద్రియముల విలయావస్థే సుషుప్త్యావస్థ. ఇక్కడ ఆ అంతకరణ కూడా లేదు. పద్నాలుగూ లేవు. కనుక 14 తోకూడిన 42 తత్వాలు కూదా ఇక్కడ లేవు. ఇదే సుషుప్త్యావస్థ. వ్యష్టి సుషుప్త్యావస్థయందు కారణ శరీరమును హృదయ స్థానమందుండి అభిమానించు జ్ఞాతను ప్రాజ్ఞుడు అందురు. నేను నేను అని చెయ్యి ఎక్కడ పెట్టుకుంటారు? హృదయంమీద చెయ్యిపెట్టి నేను అంటారు ఎవరైనా? కనుక అహంకారానికి స్థానం హృదయ స్థానం. వాడు కేవలం ప్రజ్ఞగా వున్నాడు. కాని ఈ ప్రాజ్ఞుడు కారణ శరీరాభిమాని అవడముచేత అజ్ఞానియే గాని బ్రహ్మ కాదు. వీడికి కూడా మరి మూడు పేర్లు వుండాలిగా. జాగ్రదావస్థ విశ్వుడు, వ్యావహారికుడు, చిదాభాసుడు. స్వప్నావస్థకి తైజసుడు, ప్రాతిభాసికుడు, స్వప్న కల్పితుడు. మరి వీడినేమందాం? ప్రాజ్ఞుడు, పారమార్థికుడు, అపరిచ్ఛిన్నుడు. అపరిచ్ఛిన్నుడు అని ఎందుకన్నాము?

జాగ్రదవస్థలో అనేక విషయాల అనుభవములో ఉంటాడు. తాను, అనేక ఇతరములు ఉంటాయి. అలాగే స్వప్నంలో కూడా. అందువలన అక్కడ పరిచ్ఛిన్నత్వము ఉంది. సుషుప్తిలో విషయములు తోచవు. అనేకమైన అనుభవాలు లేవు. తాను, ఇతరములనేవి తోచవు. ఒకే ఒక అనుభవమున్నది అది అజ్ఞతలో కలిగే హాయి. జాగ్రత్ స్వప్నాలలో ఎవరి అనుభవాలు వారివే, భిన్నములు. సుషుప్తిలో అందరి అనుభవము ఒక్కటే అభిన్నము. అందువలన సుషుప్తి అవస్థ అభిమానిని అపరిచ్ఛిన్నుడు అన్నాము. అనుభవం చేత గాని, దేశకాలాదులచేత గాని, వస్తు జ్ఞానంతో గాని నానాత్వంగా బేధంగా పరిమితంగా లేడు కనుక వీడు అపరిచ్ఛిన్నుడు. పరిచ్ఛేదము లేనివాడు. వేరే అవస్థలలో కాలగమన జ్ఞానమున్నది. కాని ఇక్కడి కాలము తెలియదు. అందువలన ఎలా చూచినా అతడు అపరిచ్ఛిన్నుడే.

**సీ॥ కంఠ దేశమునహంకార చిత్తములుంచి ధీమనంబులరెంట్ని దీసికొనియు ।**
**కారణ దేహ హృత్కమలమందునజేరి యజ్ఞాన సన్నిధియందు నిలిచి ।**
**నది సుషుప్త్యనబడు మహిమీద సర్పంబు బారిన స్మరణ దప్పి ।**
**యుంటి తుర్యంబటంచును యోగివరులు । చాటుచుందురు జనితమై జనుచునుండు ।**
**రమ్యగుణధామ భద్రాద్రి రామ పరశురామ నరసింహ్మదాస సంరక్షితాహ్వ ॥**

అహంకార చిత్తములను కంఠస్థానమందుంచి, మనోబుద్ధులను తీసుకొనివెళ్ళి వాటితో సహా హృదయ కమలమందు జేరి నిలిచి, అజ్ఞాన సామీప్యమున నిలిచి, ప్రాజ్ఞుడనే పేరుతో ఉన్నవాడు ఆ సుషుప్త్యావస్థకు అభిమాని. నేనును, చిత్త వృత్తులను నిలబెట్టేవాడు. మనోబుద్ధులను తీసుకొనివెళ్ళి అజ్ఞానంలో ముంచేశాడు. అందువలన అక్కడ నేను వ్యవహారము లేదు. చిత్తవృత్తులు జనించుట లేదు. మనస్సు నిర్వికల్ప విషయమైంది. బుద్ధి నిశ్చలమైంది. కాని అజ్ఞానములో మునిగినటువంటి చిత్తవృత్తి మాత్రము ఉన్నది. ఆ బుద్ధి ఆ స్థానములో ప్రాజ్ఞుడుగా ఉన్నప్పటికీ, అజ్ఞుడుగా ఉన్నాడు. అయినా అతని పేరు అక్కడి స్థానాన్ని బట్టి ప్రాజ్ఞుడే. అవిద్యను అభిమానించుటచేత, సుషుప్తికి అభిమానియైనాడు.

మనో బుద్ధులు వీడి, అవిద్యను కూడి, జీవుడు లీనమై మూర్ధమునందు ప్రత్యగాత్మ అనే పేరున నిలచి వుంటాడు. ఇదియే యోగుల తుర్యావస్థ. కాని శరీరము మీద పాములు పాకినను తెలియక స్మృతి తప్పియుండును. తురీయమందున్నా యోగికి కూడా శరీర స్పృహ ఉండదు. అది తరువాత పరిశీలిద్దాము. ఈ విధముగా ఏ అవస్థకి ఆ అవస్థయందు సాక్షిగా విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు సర్వజీవులయందు, జ్ఞాతద్వారా అనుభవించుచున్నాడు. వీటన్నిటిలో ఎరిగే ఎరుకగా వున్న జ్ఞాత కనుక లేకపోతే ఇవన్నీ సంభవమా? ఇవన్నీ ఇంద్రియాలు, విషయాలు అన్నీ జడమే. ఈ జడమైనటువంటి వీటియొక్క వ్యవహారము ఈ ప్రతిబింబించిన చిదాభాస చైతన్యము ఏదైతే వున్నదో, వాడు నేను నేను అంటున్నాడు, సత్య నేను గాని అసత్య నేను గాని, ఆ నేను యొక్క చైతన్యంచేత, ఆ నేను యొక్క ఆభాసచేత, ప్రతిఫలించిన ప్రకాశముచేత, ఆ ప్రకాశమే నేను అనబడే వాడిచేత, అది ఆధారంగా వుంటేనే ఇవన్నీ జరుగుతున్నాయి. ఆ జ్ఞాత లేకపోతే ఏదీ లేదు. జ్ఞాత ఆధ్యాత్మికం అయితే జ్ఞాతని ప్రేరేపించే అధిష్ఠాన దేవత గురుమూర్తి అయితే ఎరుగుట అనేటటువంటిది ఆధి భౌతిక క్రియ. ఈ త్రిపుటిలో ఆ జ్ఞాత ఏమి ఎరుగుతాడు? 24 తత్వాలు పుడితే ఎరుగుట అనేది విషయంగా వుంటుంది. 24 తత్వాలు లేకపోతే ఎరిగే ఎరుకగా వుండి ఆ 24 తత్వాలలో వ్యాపించకుండా ఒట్టి ఎరిగే ఎరుకగా వుంటాడు. ఒట్టి ఎరుక మాత్రుడుగా వుంటాడు. జ్ఞాన స్వరూపుడుగా వుంటాడు కనుక వాడు **'జ్ఞః'** స్వరూపుడు కనుక వాడిని జ్ఞాత అన్నాం. అజ్ఞత అనునది గాఢ నిద్రలో వుంది. **జ్ఞః** అను రూపుడై, తురీయంలో పరమాత్మ అయిపోయాడు. **'జ్ఞః'** అనేవాడు జ్ఞాత. 24 తత్వాలతో కూడకుండా కేవలం ఎరుక మాత్రుడుగా **జ్ఞః** రూపంగా వున్నటువంటి జ్ఞాతయే కూటస్థుడు. కూటస్థ అవస్థలో వున్నటువంటి జ్ఞాతయే ప్రత్యగాత్మ. ఆ ప్రత్యగాత్మ అనుభవమే తురీయానుభవము. యోగులకిది తురీయానుభవమైతే, తమో గుణ ఆవరణలో ఉండి అవిద్యా దోషము వున్నటువంటి వాళ్ళకి అది గాఢ నిద్ర.

అయితే అక్కడ వున్నవాడు ప్రాజ్ఞుడు, ఇక్కడ వున్నవాడు కూడా ప్రాజ్ఞుడే గాని తురీయ స్థితిలో ఉండుటచేత ప్రాజ్ఞుడు స్వానుభవంగా వున్నాడు, గాఢనిద్రలో అజ్ఞత అపరిచ్ఛిన్నముగా కొనసాగితే, తురీయములో **'జ్ఞః'** అపరిచ్ఛిన్నముగా కొనసాగుతున్నది. ప్రకృతికి సంబంధించిన మూడు అవస్థలు కొనసాగుచున్నప్పటికీ, ఈ తురీయుడు వాటికి సాక్షిగా ఉన్నాడు. సంగత్వము లేకుండా ఉన్నాడు. తన స్వానుభవానికి ఈ అవస్థాత్రయము అవరోధము కాదు.

గాఢ నిద్రలో అజ్ఞత అనే భోగము ఉంటే, తురీయములో సత్ చిత్ ఆనందమనే తెంపులేని జ్ఞానమున్నది. ప్రాజ్ఞుడు మేల్కొని విశ్వుడైతే, తురీయునికి అవస్థలే లేవు. సాక్షి చైతన్యాన్ని స్వానుభవముగా ఉన్నవాడు.

అవస్థాత్రయ సాక్షి ఎవరో అతడే ఆత్మ స్వరూపుడు. అయిననూ, వ్యష్టి ప్రత్యేగాత్మానుభవము నుండి సమష్టి పరమాత్మానుభవము వరకు తెలుసుకొని, చివరకు సాక్షి చైతన్యానుభవమును కూడా విడచి తురీయాతీతుడు కావలెను. ఇట్లు నిశ్చయజ్ఞానము కలవారు బ్రహ్మ వేత్తలు.

## బ్రహ్మాండ పంచీకరణ

పిండాండమందు పనిచేసే ఇంద్రియాలన్నీ, అవి పనిచేస్తున్నాయి కాబట్టి వాటిని ఆధ్యాత్మికము అన్నారు. ఇక్కడ అధిదేవతలు ప్రేరణ చేస్తున్నారు.

బ్రహ్మాండములో అధిదేవతలు పనిచేస్తుంటేనే పిండాండమందు ప్రేరణ అందుతున్నది. కాబట్టి బ్రహ్మాండమందు అధిదేవతలు ఆధ్యాత్మికముగా మారారు. వారు అక్కడ పనిచేస్తున్నారు కనుక వారిని ఆధ్యాత్మికము అన్నాము.

అధిదేవతలు ఒక్కొక్కరు అందరిలోని అదే ఇంద్రియములను ప్రేరేపిస్తూ ఉన్నారు. ఉదాహరణకు చంద్రుడు అందరి మనస్సులను ప్రేరేపించుచున్నాడు. బృహస్పతి అందరి బుద్ధులను ప్రేరేపించుచున్నాడు. అంటే ఏమైంది? పిండాండములో వ్యష్టి మనస్సు ఉంటే, బ్రహ్మాండములో చంద్రుడే సమష్టి మనస్సు. పిండాండములో వ్యష్టి బుద్ధి ఉంటే, బ్రహ్మాండములో సమష్టి బుద్ధి పేరు బృహస్పతి. ఇలాగే 25 తత్త్వాలను చూడాలి.

పిండాండములో ప్రేరేపించేవారు అధి దేవతలు. బ్రహ్మాండములో వారే శక్తి ప్రసారకులు. అక్కడ వారు చేసే పని ఉంది కాబట్టి వారు ఆధ్యాత్మికము. ఉదాహరణకు గుమాస్తాలు వారి సూపర్వైజరు చెప్పినట్లు చేస్తారు. గుమాస్తాలేమో ఆధ్యాత్మికము, సూపర్వైజరేమో అధి దైవికము.

కాని ఆ సూపర్వైజరు అతడిపై ఆఫీసరుయొక్క ఆదేశాల మేరకు పనిచేస్తూ, గుమాస్తాల ద్వారా పని చేయిస్తూ ఉంటాడు. అతడు ఆఫీసరు చెప్పినట్లు చేస్తున్నాడు. కనుక ఆ సూపర్వైజరు ఆధ్యాత్మికము. ఆఫీసరేమో అధి దైవికము.

ఇక్కడ గుమాస్తాలేమో జీవుల వ్యష్టి ఇంద్రియాలు. సూపర్వైజరేమో, గుమాస్తాలవద్ద అధి దైవికము, కాని పై ఆఫీసరు వద్ద ఆధ్యాత్మికము. అంటే పిండాండములో అధి దైవికమైన సమష్టి ఇంద్రియాలన్నీ బ్రహ్మాండములో ఆధ్యాత్మికమైనవిగా మారిపోయాయి.

వ్యష్టి జీవుడైతే, సమష్టి ఈశ్వరుడు. ఈశ్వరుడు జీవులకు అధి దైవమైతే, పరమేశ్వరుడివద్ద ఈశ్వరుడు ఆధ్యాత్మికము. అలాగే వ్యష్టి మనస్సు, బుద్ధి మొదలగు ఇంద్రియములకు చంద్రుడు, బృహస్పతి అధి దైవతములైతే పరమేశ్వరునియొక్క జ్ఞానశక్తి ప్రేరణ చేతనే ఆ చంద్రుడు, బృహస్పతి పని చేస్తున్నారు. కాబట్టి చంద్రుడు, బృహస్పతి ఆధ్యాత్మికము. జ్ఞానశక్తి అధి దైవికము. ఈ విదముగా 25 తత్త్వాలను తీసుకోవాలి.

పిండాండములో : వ్యష్టి మనస్సు ఆధ్యాత్మికము : సమష్టి మనస్సు, చంద్రుడు అధి దైవికము.

బ్రహ్మాండములో : సమష్టి మనస్సు చంద్రుడు ఆధ్యాత్మికము : జ్ఞాన శక్తి అధి దైవికము

పిండాండములో : వ్యష్టి బుద్ధి ఆధ్యాత్మికము : సమష్టి బుద్ధి బృహస్పతి అధి దైవికము

బ్రహ్మాండములో : సమష్టి బుద్ధి బృహస్పతి ఆధ్యాత్మికము : జ్ఞానశక్తి అధిదైవికము.

ఇదే విధముగా 25 తత్త్వాలకు నిర్ణయించుకోవాలి. అయితే, పరమేశ్వరుడివద్ద ఇన్ని ఇంద్రియాలు లేవు. కేవలము జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఇచ్ఛాశక్తి అని మూడే శక్తులున్నాయి. అందువలన జీవులయొక్క అంతఃకరణ చతుష్టయము, జ్ఞానేంద్రియాలు తొమ్మిదింటికి అధి దేవత జ్ఞానశక్తి. పంచప్రాణాలు, పంచ కర్మేంద్రియాలయొక్క అధి దేవతలు పదిమంది ఆపై అధి దేవత క్రియాశక్తి ప్రేరణ వలన పనిచేస్తున్నారు.

వ్యష్టి జీవుడైతే, సమష్టి ఈశ్వరుడు. జీవుడి ఆధ్యాత్మికమైతే, ఈశ్వరుడు ఆధి దైవికము. బ్రహ్మాండములో ఈశ్వరుడు ఆధ్యాత్మికమైతే, పరమేశ్వరుడు ఆధి దైవికము. జీవుడికి చిత్తవృత్తులు వస్తే, ఈశ్వరుడికి సంకల్పాలు వస్తాయి. ఈశ్వరునికి సంకల్పాలుంటే దానికి కారణము పరమేశ్వరుని యొక్క ఇచ్ఛాశక్తి.




జీవుని ఇంద్రియాలు (9+10) – ఈ పందొమ్మిది వ్యష్టి ఇంద్రియాలు.

ఈశ్వరునియొక్క (9+10) ఈ పందొమ్మిది సమష్టి ఇంద్రియాలు.

అంటే ఈ 19మంది అధి దేవతలు ఈశ్వరునికి ఇంద్రియాలు. అందువలన ఈశ్వరుడు తన 19 సమష్టి ఇంద్రియాలు ముఖముగా చేసుకొని జీవులందరి 19 తత్త్వాలతో కూడిన సూక్ష్మ శరీరాలచేత పనిచేయిస్తున్నాడు. ఈ విధముగా ఈశ్వరుడు కూడా ఆధ్యాత్మికమైనాడు, బ్రహ్మాండమందు. అక్కడి 19మంది అధిదేవతలు కూడా ఆధ్యాత్మికమై పోయారు. ఈశ్వరుడికి ఆధిదైవము పరమేశ్వరుడు. ఈశ్వరునియొక్క 9 సమష్టి ఇంద్రియాలకు అధిదేవత జ్ఞానశక్తి. మిగిలిన 10 సమష్టి ఇంద్రియాలకు అధిదేవత క్రియాశక్తి.

అయితే పరమేశ్వరుడు ఈ మూడు శక్తులతో కూడి, సగుణ రూపమై, సర్వవ్యాపకమై, అంతర్యామియై ఉన్నాడు. అతడికి మళ్ళీ అధిదేవతలు లేరు. అతడే మాయాశబలిత బ్రహ్మము. ఈ మూడు మాయాశక్తులు అలా చూపిస్తున్నాయి గాని, పరమేశ్వరుడు నిజానికి నిర్గుణుడే, పరబ్రహ్మమే. సగుణ నిర్గుణ అని రెండు లేవు. సగుణము మాయ గనుక నిర్గుణమే సత్యము, నిత్యము, అద్వయము.

వ్యష్టి జీవులకు మూడు అవస్థలు, పంచకోశాలు ఉంటే సమష్టి ఈశ్వరుడికి కూడా మూడు అవస్థలు, పంచకోశాలు ఉన్నాయి.

జీవుడు వ్యష్టిలో విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు అవస్థాభిమానులైతే ఈశ్వరుడు సమష్టిలో విరాట్ పురుష, హిరణ్యగర్భ అవ్యాకృతుడు సమష్టి అవస్థాభిమానులు. జీవుల తురీయం ప్రత్యగాత్మ అయితే ఈశ్వరుని తురీయం పరమాత్మ. వ్యష్టి శరీరత్రయమే సమష్టిలో విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృత శరీరాలు.

ఈశ్వరుని యొక్క బహిః ప్రజ్ఞచేత విరాట్ స్వరూపము తోస్తున్నది. ఈశ్వరునియొక్క అంతఃప్రజ్ఞ చేత సమష్టి సూక్ష్మ శరీరమైన హిరణ్యగర్భుడు తోస్తున్నాడు. బహిఃప్రజ్ఞ తోచినప్పుడు జాగ్రదవస్థ. అంతఃప్రజ్ఞ తోచినప్పుడు స్వప్నావస్థ. ప్రజ్ఞ బయటకు, లోపలకు వ్యాపించకుండా స్థిరముగా ఉంటే అవ్యాకృతము. ఇది ఈశ్వరునియొక్క సుషుప్త్యావస్థ.

సమష్టిలో జరిగే క్రియలు వ్యష్టిలో జరుగుతున్నాయి. ఎందుకంటే, వ్యష్టిలన్నీ ఆ సమష్టిలో అంతర్భాగము. వ్యవహారము ఈశ్వరుడిది అయితే జీవులలో ఈశ్వర వ్యవహారమే ఉన్నది. కాని జీవులు వారికి వారే వ్యవహరిస్తున్నట్లు అనుకుంటున్నారు. అజ్ఞానమంటే ఇదే. ఈశ్వరుడేది చేసినా, అది కారణము. దానియొక్క ఫలితమే కార్యము. కారణము ఈశ్వరునియొద్ద ఉంటే కార్యము జీవులవద్ద ఉన్నది. జీవులు స్వయంగా ఏ కార్యము చేయుటలేదు. కనుక జీవులయొక్క కర్తృ భావము, భోక్తృభావము అవిద్యా దోషము వలన వచ్చింది. ఈశ్వరుని వలన జరిగే పనులు ఈశ్వర లీల. అది జీవులనే పావులతో ఆడుతున్న ఆట. అందువలన జీవులు కీలుబొమ్మలే గాని, వారికి స్వతంత్రత లేదుద. ఈ విధముగా భావించుటయే జ్ఞానము. అందుకనే అంతా దైవేచ్ఛ, బాబా యిచ్ఛ అనుకోమన్నారు.

జిల్లేళ్ళమూడి అమ్మ అంటుంది. **"అంతా సమష్టి కర్మేగా, వ్యష్టి కర్మ ఎక్కడున్నది నాయనా!"** మెహెర్‌బాబా అంటారు. **"నేను మందు వేసుకుంటే అందరికీ తగ్గుతుంది. మీరు వేసుకుంటే వేసుకున్న వారికే తగ్గుతుంది"**. అందుకే అందరి మనస్సులు అమనస్కమవడానికి, తానే సమష్టి రూపంలో ఉంటూ, మనోనాశ్ కార్యక్రమము చేశారు. దాని ఫలితముగా జీవులలో క్రమక్రమముగా ఆధ్యాస తొలగుతుంది.

అయితే ఈశ్వరుడికి శరీర తాదాత్మ్యత లేదు. అందువలన సమష్టి శరీరమైనటువంటి విరాట్ శరీరము బాధించదు. ఎందుకంటే ఈశ్వరునికి అవిద్యా దోషము లేదు. అవిద్యా దోషమున్న జీవుడికే శరీర తాదాత్మ్యత ఉంటుంది.

జీవుల యొక్క జాగ్రదావస్థలో జరిగే వ్యవహారము, ఇతర అవస్థలలో జరిగే వ్యవహారంతోసహా హిరణ్యగర్భుడు యొక్క ఈశ్వరునియొక్క స్వప్నావస్థ. హిరణ్యగర్భునికి, ఇదంతా కల. ఆయన కలలోనే అందరు జీవులు ఉన్నారు, అన్ని అవస్థలు పొందుతూ ఉన్నారు. జీవుల యొక్క జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయావస్థలు అన్నీ కూడా ఈశ్వరుని యొక్క హిరణ్యగర్భ స్థితిలో, ఈశ్వరుని యొక్క స్వప్నావస్థలో భాగమే.

జీవులు పుట్టి జీవించి నశించే దంతా కూడా ఈశ్వరుని యొక్క స్వప్నావస్థే. ఈశ్వరుని యొక్క స్వప్నావస్థ ఎంతకాలం కొనసాగుతుందో, కొన్ని యుగాల పర్యంతము, అన్ని యుగాలలోకూడా అనేక జీవులు పుడుతూ జీవిస్తూ చస్తూ అనేక అనుభవాలు పొందినదంతా కూడా ఈశ్వరుని యొక్క స్వప్నావస్థయే.

ఈశ్వరుని యొక్క స్వప్నావస్థ ఆగిపోయి, గాడనిద్రలోకి వెళితే, జీవుల యొక్క ఏ అవస్థలు కానీ, జీవుడు యొక్క ఏ ఉనికి గానీ, స్థూలంగా గానీ సూక్ష్మంగా గానీ ఉండవు. అంటే ఈశ్వరుడికి గాధ నిద్రావస్థే, పిండాండమునందు జీవుల పరంగా చూస్తే అది ప్రళయము. ఈశ్వరునికది అవ్యాకృతము.

ఇంతవరకు అర్థమయితే తప్ప బ్రహ్మాండ పంచీకరణ అర్థము కాదు. ఇక బ్రహ్మాండ పంచీకరణ మొదలుపెడదాము.

వ్యష్టిలో ఆకాశ పంచకం ఏమిటి? అంతర్ ఇంద్రియాలు. అందులో అధి దైవికం ఏమిటి అంటే – గురుమూర్తి, చంద్రుడు బృహస్పతి, క్షేత్రజ్ఞుడు, రుద్రుడు. ఆ ఆధిదైవికాలే ఈ బ్రహ్మాండ పంచీకరణలో ఆధ్యాత్మికాలు. ఈ ఆధ్యాత్మికంగా ఉన్న వీళ్ళకి అధి దైవికం ఏమిటి? అంటే గురుమూర్తి, చంద్రుడు, బృహస్పతి క్షేత్రజ్ఞుడు, రుద్రుడు ఈ 5 ఈశ్వరుని యొక్క సమష్టి ఇంద్రియాలకి, అధి దైవం ఎవరు? జ్ఞానశక్తి. అలాగే సమష్టి జ్ఞానేంద్రియాలకు కూడా జ్ఞానశక్తియే అధిదేవత. సమష్టి పంచ ప్రాణాలకి పంచ కర్మేంద్రియాలకి, ఒకే ఒక అధిదేవత క్రియాశక్తి,

జ్ఞానశక్తి ఏమో సమష్టి అంతర్ ఇంద్రియాల అధి దేవతలకి, సమష్టి జ్ఞానేంద్రియాల అధి దేవతలకు, అధిదైవికంగా ఉంది. సమష్టి పంచప్రాణాలు, సమష్టి కర్మేంద్రియాలకు అధిష్ఠాన దేవతలు ఎవరైతే ఉన్నారో, ఆ పదిమందికి, ఆధి దైవికం క్రియాశక్తి.

**ఆకాశ పంచకము :** ఆకాశంలో అర్ధభాగం గురుమూర్తికి గోళకంగా ఉండి తక్కిన అర్థాంశము నాలుగు భాగములై, ఒక పరక వాయువును కూడుకుని, చంద్రుడుకి గోళకం అయ్యింది. పిండాండంలో మనసుకు గోళకం అయ్యింది అన్నాము.

రెండవ పరక అగ్నితో కూడి బృహస్పతికి గోళకము అయ్యింది. పిండాండంలో ఒక పరక అగ్నిని కూడి, బుద్ధికి గోళకం అయ్యింది అన్నాము. ఒక పరక జలమును కూడి, క్షేత్రజ్ఞుడికి గోళకం అయ్యింది బ్రహ్మాండంలో. పిండాండంలో ఒక పరక జలమును కూడి, చిత్తమునకు గోళకం అన్నాము.

ఒక పరక పృథ్విని కూడి, రుద్రునికి గోళకమయ్యెను. ఈశ్వరునికి ఇవి అంతర్ ఇంద్రియాలకు గోళకాలు.

పిండాండంలో అక్కడ జ్ఞాత కూటస్థుడు. వ్యష్టి కూటస్థుడిని కూటస్థ ఆత్మ అంటాం. బ్రహ్మాండములో సమష్టి కూటస్థుడిని కూటస్థ బ్రహ్మ అంటాము.

గురుమూర్తి సమష్టి జ్ఞాతగాను, చంద్రుడు ఈశ్వరుని యొక్క సమష్టి మనస్సుగాను, బృహస్పతి ఈశ్వరుని యొక్క సమష్టి బుద్ధిగాను, క్షేత్రజ్ఞుడు ఈశ్వరుని యొక్క సమష్టి చిత్తముగాను, రుద్రుడు ఈశ్వరునియొక్క సమిష్టి అహంకారముగాను ఈ ఐదు ఈశ్వరునికి అంతరింద్రియములు. ఇది ఆకాశ పంచకం.

**వాయు పంచకము :** వాయువులో అర్థాంశము విశ్వయోనికి, గోళక మయ్యెను. తక్కిన అర్థాంశము 4 పరకలై, ఒక పరక ఆకాశమును కూడి, జయునకు గోళము అయ్యెను. రెండవ పరక అగ్నిని కూడి, అజునకు గోళకము ఆయెను.

ఒక పరక జలమును కూడి విశిష్టునికి గోళకము అయ్యెను. ఒక పరక పృథ్విని గూడి, విశ్వకర్తకు గోళము అయ్యెను. ఈశ్వరుడికి ఇవి పంచ ప్రాణములకు గోళకములు. విశ్వయోని వ్యాన వాయువుగాను, జయుడు సమానవాయువుగాను, అజుడు ఉదాన వాయువుగాను, విశిష్టుడు ప్రాణవాయువుగాను, విశ్వకర్త అపానవాయువుగాను ఈశ్వరునికి పంచ ప్రాణములయ్యెను.

**అగ్ని పంచకము:** అగ్నిలో అర్థాంశము సూర్యునికి గోళక మయ్యెను. తక్కిన అర్థాంశము 4 పరకలు అయి ఒక పరక ఆకాశమును గూడి, అష్టదిక్పాలకులకు గోళకమైంది. రెండవ పరక వాయువును గూడి వాయుదేవునికి గోళకమైంది. మూడో పరక జలమును గూడి వరుణ దేవునికి గోళకము అయినది. నాలుగవ పరక పృథ్విని గూడి అశ్వినీదేవతలకు గోళకము అయ్యింది. అశ్వినీ దేవతలు ఇద్దరు కవలలు. ఈ అయిదుగురు ఈశ్వరునియొక్క జ్ఞానేంద్రియాలకు గోళకములు. అంటే అష్టదిక్పాలకులు సమిష్టి శ్రోత్రముగాను, వాయుదేవుడు సమష్టి త్వక్కుగానూ, సూర్యుడు సమిష్టి చక్షురింద్రియంగాను, వరుణుడు సమష్టి జిహ్వగాను, అశ్వినీ దేవతలు సమష్టి ఘ్రాణముగాను ఈశ్వరునికి జ్ఞానేంద్రియాలు అయినవి.

**జల పంచకము :** జలములో అర్థాంశము జ్ఞానశక్తికి గోళకము అయ్యెను. తక్కిన అర్థాంశము 4 పరకలై ఆకాశముతో కూడి పరాశక్తికి గోళకమాయెను. అధిష్ఠాన దేవతలుగా కొన్నిచోట్ల సదాశివుడు ఈశ్వరుడు రుద్రుడు విష్ణువు బ్రహ్మ బదులు, ఇక్కడ పరాశక్తి, ఆదిశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, అని చెప్పడం జరిగింది. ఇక్కడ జల పంచకంలో పంచశక్తులను ఉపయోగిస్తున్నాము. ఒక పరక వాయువును గూడి ఇచ్ఛాశక్తికి గోళము అయింది. ఒక పరక అగ్నిని గూడి ఆదిశక్తికి గోళకం మయ్యింది. ఒక పరక పృథ్విని గుడి క్రియాశక్తికి గోళకం అయింది. ఇవి ఐదు కూడా విషయ పంచకం. విషయేంద్రియాలు. ఈ విషయ పంచకం ఈశ్వరునికి పంచతన్మాత్రల గోళకములు. పరాశక్తి శబ్దముగాను ఇచ్ఛాశక్తి స్పర్శగాను ఆదిశక్తి రూపముగాను జ్ఞానశక్తి రసముగాను క్రియాశక్తి గంధముగాను ఈశ్వరునికి పంచతన్మాత్రలు అయ్యెను. ఈశ్వరునియొద్ద ఉన్న తన్మాత్రలే జీవునికి విషయాలుగా రూపాంతరము చెందినవి. మరొక్కమాట. పరమేశ్వరుని వద్ద ఉన్న జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి ఆధి దైవికముగా ఉన్నాయి. ఇక్కడ పంచశక్తులుగా ఉన్నవాటిలో మళ్ళీ జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి క్రియోన్ముఖ స్థితిలో ఆధ్యాత్మికములై ఉన్నాయి. ఇది స్థాయీ భేదము.

**పృథ్వి పంచకము:** పృథ్విలో అర్ధాంశము మృత్యుదేవతకు గోళక మయ్యెను. తక్కిన అర్ధాంశము 4 పరకలై, ఒక పరక ఆకాశమును గూడి అగ్నిదేవునికి గోళకమయ్యెను. అక్కడ వాగింద్రియానికి గోళకమైంది అంటాం, ఇక్కడ అగ్ని దేవుడికి గోళకమైంది. ఒక పరక వాయువుని గూడి, దేవేంద్రునికి గోళకము అయ్యింది. ఒక పరక అగ్నిని గూడి ఉపేంద్రునికి గోళకము అయ్యింది. ఒక పరక జలమును గూడి, ప్రజాపతికి గోళకమయ్యెను. ఈశ్వరుడికి ఇవి కర్మేంద్రియములకు గోళకములు. అగ్నిదేవుడు వాక్కు గాను, దేవేంద్రుడు పాణిగాను, ఉపేంద్రుడు పాదముగాను, ప్రజాపతి గుహ్యముగాను ,మృత్యుదేవత పాయువుగాను ఈశ్వరునికి కర్మేంద్రియములు అయ్యెను.

పిండాండమునందు ఎవరైతే ఆధి దైవికంగా ఉన్నారో బ్రహ్మాండమందు వాళ్ళే ఆధ్యాత్మికం అయ్యారు. ఈ విధముగా ఆకాశ వాయు అగ్ని జల పృథ్వి పంచకాలు అయ్యాయి బ్రహ్మమునందు. పిండాండ మునందు కదంబాలు ఎలా చెప్పామో, అలాగే బ్రహ్మాండమందు కూడా కదంబాలు ఉన్నాయి.

**ప్రుథ్వి కదంబం:** పృథ్వి అర్ధాంశములో మృత్యుదేవత పుట్టెను. పృథ్విలో జలము కూడగా క్రియాశక్తి అయ్యెను. పృథ్విలో అగ్ని కూడగా అశ్వినీదేవతలు అయ్యెను. పృథ్విలో వాయువు కూడగా విశ్వకర్త అయ్యెను. పృథివి ఆకాశము కూడా రుద్రుడు అయ్యెను. క్రిందనుంచి పైకి, చివరి వరుసలో పాయురింద్రియము, గంధము, ఘ్రాణము, అపానవాయువు, అహంకారముగా వున్నవి. కదంబములో అలా కిందినుంచి పైకి వస్తున్నాయి. తరువాత క్రిందినుండి పైకి ఆఖరి వరుసనుండి రెండవ వరుస చూడండి.

**జల కదంబం:** జలములో పృథ్వి కూడగా ప్రజాపతి అయ్యెను. జలముయొక్క అర్ధాంశము జ్ఞానశక్తి అయ్యెను. జలములో అగ్ని కూడగా వరుణుడు డయ్యెను. జలములో వాయువు కూడగా విశిష్టుడు అయ్యెను. జలములో ఆకాశము కూడగా క్షేత్రజ్ఞుడు అయ్యెను.

**అగ్ని కదంబం :** అగ్నిలో పృథ్వి కూడగా ఉపేంద్రుడు అయ్యెను. అగ్నిలో జలము కూడగా ఆదిశక్తి అయ్యెను. అగ్నియొక్క అర్ధాంశము సూర్యుడు అయ్యెను. అగ్నిలో వాయువు కూడగా అజుడు అయ్యెను. అగ్నిలో ఆకాశము కూడగా బృహస్పతి అయ్యెను.

**వాయువు కదంబం:** వాయువులో పృథ్వి కూడగా దేవేంద్రుడు, వాయువులో జలము కూడగా ఇచ్ఛాశక్తి, వాయువులో అగ్ని కూడగా వాయుదేవుడు, వాయువు యొక్క అర్ధాంశము విశ్వయోని అయ్యెను. వాయువులో ఆకాశము కూడగా చంద్రుడు అయ్యెను.

**ఆకాశ కదంబం:** ఆకాశంలో పృథ్వి కూడగా అగ్నిదేవుడు అయ్యెను. ఆకాశములో జలము కూడగా పరాశక్తి, ఆకాశములో అగ్ని కూడగా అష్టదిక్కులు, ఆకాశంలో వాయువు కూడగా జయుడు, ఆకాశము యొక్క అర్ధాంశము గురుమూర్తి అయ్యెను.

ఇది బాగా అర్థం చేసుకోవాలంటే పిండాండంలో ఉన్న ఈ ఐదు కదంబాలు, బ్రహ్మాండంలో 5 కదంబాలు పక్కనపెట్టి చదువుకోవాలి. పిండాండంలో జల కదంబమును చదివి వెంటనే బ్రహ్మాండంలో జల కదంబం చదివితే అక్కడ అధిదేవతలు ఇక్కడ ఆధ్యాత్మికము అయినట్లుగా, అక్కడ వ్యష్ఠి వ్యవహారం ఇక్కడ సమష్టి అయినట్లుగా తెలుస్తుంది. పటాలు చూచి, చెప్పుకుంటూ అవగాహన పెంచుకోవాలి.

కదంబం అంటే ఏమిటి? ఈ ఐదు భూతములు ఎన్ని రకాలుగా రెండు రెండుగా ఉండే అవకాశమున్నదో, దేనిలో ఏది కలసి రెండు రెండు అయినాయో ఆ విధముగా వర్గీకరించబడినదే కదంబము అని అర్థము. రెండు లేక అనేక రకాల పూలతో ఉన్న మాలను కదంబము అంటారు కదా! ఒకే రకం పూలమాలను కదంబం అనరు.

**ఆకాశ భూత స్తబకము:** ఈశ్వరుడనే గురుమూర్తి జయునితో కూడి, అష్టదిక్కుల ద్వారా, పరాశక్తిని గుర్తెరిగి, అగ్ని దేవుని ద్వారా వచించున్నాడు.

**వాయుతత్వ స్తబకము:** స్తబకము అంటే వ్యాపారము వ్యవహారము. ఇంద్రియ వ్యాపారము. ఇక్కడ ఈశ్వరుని విలాసము. ఈశ్వరుడనే గురుమూర్తి చంద్రరూపమై, విశ్వయోనిని కూడుకొని, వాయుదేవుని ద్వారా ఇచ్ఛాశక్తిని గుర్తెరిగి, దేవేంద్రుని ద్వారా దానప్రతిగ్రహణములు చేయుచున్నాడు.

**అగ్ని తత్వ స్తబకము:** ఈశ్వరుడనే గురుమూర్తి బృహస్పతి రూపమై, అజుని కూడుకొని, సూర్యుని ద్వారా ఆదిశక్తిని గుర్తెరిగి, ఉపేంద్రుని ద్వారా గమనాగమన ములు చేయుచున్నాడు.

**జలతత్వ స్తబకము:** ఈశ్వరుడనే గురుమూర్తి క్షేత్రజ్ఞ రూపమై, విశిష్టుని కూడుకొని, వరుణుని ద్వారా జ్ఞానశక్తిని గుర్తెరిగి, ప్రజాపతి ద్వారా ఆనందిస్తున్నాడు.

**పృథ్వితత్వ స్తబకము:** ఈశ్వరుడనే గురుమూర్తి రుద్రరూపమై, విశ్వకర్తను కూడుకొని, అశ్వనీ దేవతల ద్వారా క్రియాశక్తిని గుర్తెరిగి, మృత్యుదేవత ద్వారా మలవిసర్జన చేయుచున్నాడు.

**అష్టప్రకృతి లయము :** ముందు కర్మేంద్రియాలను తరువాత విషయాలని తరువాత జ్ఞానేంద్రియాలను, అట్లాగే వీటన్నింటినీ లయం చేసి, అష్ట ప్రకృతి లయంలో వరుసగా సూక్ష్మ పృథ్వి సూక్ష్మ జలములో లయము, సూక్ష్మ జలము సూక్ష్మ అగ్నిలో లయము, సూక్ష్మ అగ్ని సూక్ష్మ వాయువులో లయము, సూక్ష్మ వాయువు సూక్ష్మ ఆకాశంలో లయము, సూక్ష్మ ఆకాశం మహదహంకారంబు లో లయము, మహ దాహంకారము మహత్తులో లయము, మహత్తు అవ్యక్తముగానున్న అచల పరిపూర్ణమును చూచి లయము అని అన్నాము కదా!

వ్యష్టి జీవుడు సమష్టి ఈశ్వరుడు యొక్క అంశ కదా! అలాగే సూక్ష్మ భూతాల అంశాలుగా తన్మాత్రలున్నాయి. మరి బ్రహ్మాండమంటే సూక్ష్మం కదా! పిండాండం స్థూలం కదా! అందుకని పృథ్వికి కఠినాంశ, జలమునకు ద్రవాంశ ,అగ్నికి తేజాంశ, వాయువుకు చలనాంశ, ఆకాశమునకు బయలాంశ అని బ్రహ్మాండము చెప్పుకోవాలి. ఇక లయ విధానము చెప్పుకుందాము.

**పృథివీ పంచక లయము :** పృథ్వి యొక్క కఠినాంశములో ఆకాశం యొక్క బయలాంశ చేరగా,అగ్నిదేవుడు లయము. పృథ్వి యొక్క కఠినాంశంలో వాయువు యొక్క చలనాంశ చేరగా, దేవేంద్రుడు లయం, పృథ్వియొక్క కఠినాంశంలో అగ్ని యొక్క తేజాంశ చేరగా ఉపేంద్రుడు లయం, పృథివియొక్క కఠినాంశములో జలముయొక్క ద్రవాంశ చేరగా గుహ్యేంద్రియము లయము. పృథివి అను నిండాంశంలో దాని అర్థాంశము చేరగా మృత్యు దేవత లయము.

**జల పంచకలయం:** జలం యొక్క ద్రవాంశలో ఆకాశం యొక్క బయలాంశ చేరగా పరాశక్తి లయం. జలం యొక్క ద్రవాంశంలో వాయువు యొక్క చలనాంశ చేరగా ఇచ్ఛాశక్తి లయం. జలము యొక్క ద్రవాంశంలో అగ్నియొక్క తేజాంశ చేరగా ఆదిశక్తి లయం. జలం యొక్క ద్రవాంశలో, పృథ్వి యొక్క కఠినాంశ చేరగా క్రియాశక్తి లయం. జల మను నిండాంశములో దాని అర్థాంశము చేరగా జ్ఞానశక్తి లయము.

**అగ్ని పంచక లయము:** అగ్ని యొక్క తేజాంశంలో ఆకాశము యొక్క బయలాంశము చేరగా అష్టదిక్కులు లయము. అగ్ని యొక్క తేజాంశము లో వాయువు యొక్క చలనాంశము చేరగా వాయుదేవుడు లయము. అగ్ని యొక్క తేజాంశములో జలం యొక్క ద్రవాంశం చేరగా వరుణుడు లయము. అగ్ని యొక్క తేజాంశంలో పృథ్వి యొక్క కఠినాంశము చేరగా అశ్వనీ దేవతలు లయము. అగ్ని అనే నిండు అంశంలో దాని అర్థాంశము చేరగా, సూర్యుడు లయము.

**వాయు పంచకలయము:** వాయువు యొక్క చలనాంశములో ఆకాశము యొక్క బయలాంశ చేరగా జయుడు లయము. వాయువు యొక్క చలనాంశములో అగ్నియొక్క తేజాంశ చేరగా అజుడు లయము. వాయువు యొక్క చలనాంశంలో జలము యొక్క ద్రవాంశం చేరగా విశిష్టుడు లయము. వాయువు యొక్క చలనాంశములో పృథ్వియొక్క కఠినాంశము చేరగా విశ్వకర్త లయము. వాయువు అనే నిండాంశములో దాని అర్థాంశము చేరగా విశ్వయోని లయము.

**ఆకాశ పంచక లయం :** ఆకాశము యొక్క బయలాంశములో, పృథ్వి యొక్క కఠినాంశము చేరగా రుద్రుడు లయము. ఆకాశము యొక్క బయలాంశములో జలము యొక్క ద్రవాంశం చేరగా క్షేత్రజ్ఞుడు లయము. ఆకాశము యొక్క బయలాంశములో అగ్ని యొక్క తేజాంశము చేరగా, బృహస్పతి లయము. ఆకాశము యొక్క బయలాంశములో వాయువు యొక్క చలనాంశము చేరగా చంద్రుడు లయము. ఆకాశమనే నిండాంశములో గురుమూర్తి అనే అర్థాంశము చేరగా, గురుమూర్తి లయము.

పిండాండ పంచీకరణలో సూక్ష్మ పృథ్వి, సూక్ష్మ జలము, సూక్ష్మ అగ్ని, సూక్ష్మ వాయువు, సూక్ష్మ ఆకాశము ఎలా ఉన్నాయో, వాటి బదులు ఇక్కడ ఏమున్నాయి అంటే, అధిష్టాన దేవతలుగా మృత్యుదేవత, జ్ఞానశక్తి ,సూర్యుడు, విశ్వయోని, గురుమూర్తి ఉన్నారు. పృథ్వి జలములో, జలము అగ్నిలో, అగ్ని వాయువులో, వాయువు ఆకాశములో లయమైనట్లుగానే, మృత్యుదేవత జ్ఞానశక్తిలో లయము, జ్ఞానశక్తి సూర్యుడిలో లయము, సూర్యుడు విశ్వయోనిలో లయము, విశ్వయోని గురుమూర్తిలో లయము. అలా చెప్పుకోవాలి.

**పంచభూత లయము:** కఠినంశము ద్రవాంశమందు, ద్రవాంశం తేజాంశమందు, తేజాంశము చలనాంశమునందు, చలనాంశము బయలాంశమునందు, బయలాంశము మహదహంకారమునందు, మహదహంకారము మహత్తునందు, మహత్తు అవ్యక్తముగానున్న అచల పరిపూర్ణమును చూచి లయము.

సూక్ష్మాతిసూక్ష్మ భూతాలు అంటే, సూక్ష్మ భూతాలయొక్క అంశలు అన్నమాట, అవి లయమైనాయి.

**అష్ట ప్రకృతి ఏమిటి?** కొందరు సూక్ష్మ పంచ భూతాలు, సూర్యుడు, చంద్రుడు, పురుషుడు అంటున్నారు. కొందరేమో పంచతన్మాత్రలు, మహదహంకారము, మహత్తు, అవ్యక్తము అంటున్నారు. మన సాంఖ్య పద్ధతిలో చివరి మూడు మహదహంకారము, మహత్తు, అవ్యక్తము అని తీసుకుందాము. మొదటి ఐదులో పిండాండములో సూక్ష్మ భూతాలను, బ్రహ్మాండములో తన్మాత్రలను అనగా అంశలను తీసుకుందాము.

ఈశ్వరుడు మళ్ళీ సుషుప్త్యావస్థ నుంచి, జాగ్రదావస్థలోకి ఎప్పుడైతే మేల్కొంటాడో అప్పుడు ఈశ్వరునికి సంకల్పం వస్తుంది. అదే ఇచ్ఛాశక్తి. ఇచ్ఛాశక్తివల్ల సంకల్పం కలిగింది. ఆ సంకల్పంవల్ల ఏకకాలంలో బహిః ప్రజ్ఞ, అంతః ప్రజ్ఞ పనిచేస్తుంది. బహిఃప్రజ్ఞ చేసిందంతానేమో పంచ భూతాలు, నామరూపాలు, జోవోపాధులుగా అస్తిత్వము కలిగి ఉంటుంది.

అది విరాట్ పురుషుని యొక్క అన్నమయకోశంగా స్థూలదేహంగా ఉంటుంది. అంతః ప్రజ్ఞగా జరిగేదంతా స్వప్నతుల్యముగా లీలా విలాసముగా, అసంగముగా జగద్విలాసముగా ఉంటుంది.

క్రియాశక్తి అధి దేవతగా పని జరిగేదంతా ఈశ్వరుని ప్రాణమయకోశముగా ఉంటుంది. జ్ఞానశక్తి అధిదేవతగా జరిగేదంతా ఈశ్వరుని మనోమయ కోశముగా ఉంటుంది. ఇచ్ఛాశక్తి అధి దేవతగా ఉండేది ఎక్కడైతే ఈశ్వర సంకల్పము ప్రారంభమవుతుందో, అక్కడ మహత్తుగా ఉంటుంది. అదే ఈశ్వరునియొక్క విజ్ఞానమయ కోశము. అవ్యాకృత స్థితియే ఈశ్వరునియొక్క ఆనందమయ కోశము లేక సుషుప్త్యావస్థ. ఈ విధముగా ఈశ్వరునియొక్క పంచకోశాలు నిర్ణయించాము.

బ్రహ్మాండం కేవలం శక్తిరూపం. పిండాండమందు జరిగే వాటికి ఆ శక్తి ఆధారము. అందువలన శక్తికి కూడా ఒక స్పందన కావాలి. ఆ స్పందన ఈశ్వరుని యొక్క స్పందన. ఈశ్వరుని స్పందనలకు కారణము పరమేశ్వరుని నుండి వస్తోంది. ఈశ్వరుని యొక్క ఇంద్రియాలన్నీ కూడా పరమేశ్వరుని యొక్క ఇంద్రియాలతో పనిచేస్తాయి. ఆ పరమేశ్వరుని యొక్క ఇంద్రియాలు ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి. ఈ మూడూ మాయ గనుక, ఆ మాయయే ఈశ్వరునికి ఉపాధి అయినది. పరమేశ్వరుడు మాయకు ప్రభువైనాడు. అందువలన పరమేశ్వరుడు నిర్గుణుడే.

అంతఃకరణ చతుష్టయము, పంచ జ్ఞానేంద్రియాలు, కలసి 9 ముఖాలతో జ్ఞానశక్తి ప్రేరణతోటి, ఈశ్వరుడు మనోమయకోశంలో ఉండి, ఈ తొమ్మిది ముఖాలద్వారా, జీవుని ప్రేరేపిస్తూ ఉన్నాడు. అలాగే పంచప్రాణాలు, పంచకర్మేంద్రియాలకు అధిదేవతలైనటువంటి 10 మంది దేవతలు క్రియాశక్తి ప్రేరణచేత, ప్రాణమయకోశంలో ఉంటూ, జీవుల యొక్క పంచప్రాణాలను, జీవునియొక్క పంచ కర్మేంద్రియాలను ప్రేరేపిస్తూ అక్కడ పని చేస్తున్నాయి కాబట్టి, ఈ పది ఈశ్వరునియొక్క ఇంద్రియాలు అని పిలువబడేవి,10 ముఖాలుగా పనిచేస్తున్నాయి.

కనుక ప్రాణమయ కోశంలో ఏమో ఈశ్వరుడు పది ముఖాలుగా పనిచేస్తున్నాడు. మనోమయ కోశంలోనేమో 9 ముఖాలుగా పనిచేస్తున్నాడు. అంటే జీవునియొక్క సూక్ష్మ శరీరంలో వున్న19 తత్వాలు ఈ రకంగా 19 తత్వాలలో ఉన్నటువంటి ఇంద్రియాలను ఈశ్వరుడు సమష్టిగా ఉండి, ఈశ్వరుని యొక్క ఇంద్రియాలతోటి, జ్ఞానశక్తి క్రియాశక్తి యొక్క ప్రేరణతో ఈ 19 ముఖాలతోటి, ఈశ్వరుడు పనిచేస్తున్నాడు. ఈశ్వరుని 19 ముఖాలద్వారా జీవుల సృష్టి, స్థితి లయలు జరుగుతున్నాయి.

జీవులయొక్క 19 ఇంద్రియాలు హిరణ్యగర్భునికి ఇంద్రియాలైన అధిష్టాన దేవతల ప్రేరణతో పనిచేస్తున్నాయి. మరల జీవులు వారివారి కర్మానుభవం పొందేటట్లు చేస్తాయి. ఈ పని విరాట్పురుషుని వల్ల స్థూలంలో, హిరణ్యగర్భునివల్ల సూక్ష్మంలో జరుగుతుంది. కనుక ఈ 19 ముఖాలలో పనిచేసేటటువంటిది కేవలం హిరణ్యగర్భుడే కాకుండా, విరాట్ పురుషుడు కూడా. ఇవి ఈశ్వరుని యొక్క అవస్థలే కాని, ఈశ్వరుడు ఒక్కడే.

ఈశ్వరుడు అంతఃప్రజ్ఞతోటి, ఈ 19 ముఖాలతో పనిచేస్తుంటే హిరణ్యగర్భుడుగా పని చేసినట్లు అయ్యింది. అలాగే ఈశ్వరుడు ఈ 19 ముఖాలతో బహిఃప్రజ్ఞతో పనిచేస్తే విరాట్పురుషుడు పనిచేసినట్లైనది.

ఈ రకంగా ఈశ్వరుడు 19 ముఖాలతో జీవులయొక్క వ్యష్టి ఇంద్రియాలను అన్నింటినీ తాను సమష్టి రూపంలో ఉంటూ ప్రేరేపిస్తున్నాడు. ఆయన ప్రేరేపించడం అనేది లేదు. ఆయనవైపు నుంచి చూస్తే ఈశ్వరుడు ఒక ఆధ్యాత్మ, సమష్టి జ్ఞాత ఈశ్వరుడు. ఆయనే చేస్తున్నట్లైనది. కాబట్టి ఇదంతా ఈశ్వరునియొక్క వ్యవహారమైంది.

ఈశ్వరుడు చంద్రుడనే మనస్సుతో జీవుల మనస్సుగా ఆలోచించుచున్నాడు. ఈశ్వరుడు బృహస్పతి అనే బుద్ధితో జీవుల బుద్ధిగా నిర్ణయించుచున్నాడు. ఈశ్వరుడు క్షేత్రజ్ఞుడు అనే చిత్తముతో జీవుల చిత్తముగా చింతన చేయుచున్నాడు. ఈశ్వరుడు రుద్రుడు అనే అహంకారముతో జీవుల అహంకారముగా అభిమానించుచున్నాడు. ఇలాగే మిగిలిన ఇంద్రియాలన్నీ 19 ఇంద్రియాలలో పంచప్రాణాలు పోతే ఇక 14 ఇంద్రియాలు మిగిలినవి. కనుక ఈశ్వరుడు తన చతుర్ధశేంద్రియాలతో సర్వము జీవులయందు విలాసము జరుపుచున్నాడు.

ఈశ్వరునికి సప్త అంగాలు ఉన్నాయి. ఏమిటవి అంటే, భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, పంచభూతాలు, సూర్యుడు, ద్యులోకం మొత్తం 7. ఈ 7 కలిసి సప్త అంగాలు. అంటే, పృథ్వి అనే భూతం ఈశ్వరుని యొక్క పాదాలు, జలము అనే భూతం ఈశ్వరునియొక్క మూత్రస్థానం, అగ్ని భూతం ఈశ్వరునియొక్క ముఖ స్థానం, వాయువు అనేది ఈశ్వరుని యొక్క ప్రాణం, ఆకాశము ఈశ్వరుని యొక్క ఉదరము. ఈశ్వరుడు నేత్రాలు సూర్యుడు, ఈశ్వరునియొక్క శిరస్సు ద్యులోకం. ద్యులోకమంటే సర్వర్గలోకము. ఈ విధముగా ఈశ్వరుడు తన సప్తాంగాలతో, 19 ముఖాలతో జీవులయందు, ఆధ్యాత్మికంగా ఉంటూ, జీవులను కీలుబొమ్మలుగా ఆడిస్తున్నాడు. ఇదీ ఈశ్వర విలాసము.

ఇప్పుడు బ్రహ్మాండ పంచీకరణం ఈ విధంగా చెప్పి ముగిద్దాము.

గురుమూర్తి జ్ఞాతగా, చంద్రుడు మనసుగా, బృహస్పతి బుద్ధిగా, క్షేత్రజ్ఞుడు చిత్తముగా, రుద్రుడు అహంకారముగా పిండాండమందున్న జీవుల అంతరింద్రియముల ద్వారా, వ్యవహరించుచున్నాడు. అది ఆకాశ పంచకం. వాయు పంచకానికి వెళితే, జయుడు సమానవాయువుగా విశ్వయోని వ్యాన వాయువుగా అజుడు ఉదాన వాయువుగా, విశిష్టుడు ప్రాణవాయువుగా, విశ్వకర్త అపానవాయువుగా జీవుల పంచ ప్రాణముల ద్వారా వ్యవహరించుచున్నాడు.

అగ్ని పంచకంలో అష్టదిక్కులు సర్వజీవులయొక్క శ్రోత్రేంద్రియములుగా, వాయుదేవుడు సర్వజీవులయొక్క త్వగింద్రియముగా, సూర్యుడు సర్వ జీవులయొక్క చక్షురింద్రియములుగా, వరుణుడు సర్వ జీవులయొక్క జిహ్వేంద్రియములుగా, అశ్వనీ దేవతలు సర్వ జీవులయొక్క ఘ్రాణేంద్రియములుగా అన్ని వ్యష్టులు కూడిన సమష్టిగా వ్యవహరించుచున్నాడు.

జల పంచకంలో పరాశక్తి శబ్ద తన్మాత్రగా ఆదిశక్తి స్పర్శ తన్మాత్రగా ఇచ్ఛాశక్తి రూప తన్మాత్రగా, జ్ఞానశక్తి రస తన్మాత్రగా, క్రియాశక్తి గంధ తన్మాత్రగా జీవులద్వారా విషయ పంచకమును గుర్తించుచున్నాడు.

విశ్వాన్ని ప్రేరేపించేది తన్మాత్రల రూపంలో ఉంది. ప్రేరేపించబడ్డాక, పిండాండంలో అది విషయం అయ్యింది. పృథ్వీ పంచకములో, అగ్నిదేవుడు సర్వ జీవులయొక్క వాగింద్రియములుగా, దేవేంద్రుడు సర్వ జీవులయొక్క పాణీంద్రియములుగా, ఉపేంద్రుడు సర్వ జీవుల యొక్క పాదేంద్రియములుగా, ప్రజాపతి సర్వ జీవులయొక్క గుహ్యేంద్రియములుగా, మృత్యుదేవత సర్వ జీవులయొక్క పాయురింద్రియములుగా సర్వ జీవులయొక్క వ్యష్టి ఇంద్రియములతో కూడిన సమష్టి కర్మేంద్రియాలతో వ్యవహరించుచున్నాడు. ఇది బ్రహ్మాండ పంచీకరణ. ఇది మననం చెయ్యగా చెయ్యగా స్థిరమవుతుంది. బ్రహ్మాండ పంచీకరణ సామాన్యముగా బుద్ధికి పట్టదు. వ్యష్టి అనుభవము పూర్తియైన వారికి స్పష్టమవుతుంది.

**ముగింపు :**

ఈ సర్వ వేదాంత శిరో భూషణం, ఈ ప్రథమాంకం పాఠం ఎవరు వినాలి? ఎవరు ఆచరించాలి? అంటే ముందు సద్వర్తన కలిగి వుండాలి. పాపచింతన వుండకూడదు. భగవంతుడంటే పాపం చేస్తే శిక్షిస్తాడు అనేటటువంటి భయం వుండాలి. దుష్టక్రియల జోలికి వెళ్ళకూడదు. తప్పు మాటలు మాట్లాడితే బిడియపడి సిగ్గు పడాలి. అదేమిటి ఇలా మాట్లాడాను? ఛీ ఛీ ఛీ. ఎందుకు తొందరపడి మాట్లాడాను? అనేవన్నీ కలిపి సద్వర్తన. సద్వర్తనతో వున్నవాడు సద్గురువుగా వుంటాడు చివరికి. ముందు నీ వర్తనలో, నీ వ్యాపారంలో, నీ వ్యవహారంలో అజ్ఞానంలోనే మంచిగా సమష్టి భావనగా, వ్యష్టిగా కాకుండా, స్వార్ధంగా కాకుండా, పెద్దలయందు గౌరవంతో, గురుభక్తితో, దైవ భక్తితో, దైవానుగ్రహం కోసమన్నట్లుగా, దైవార్పణ బుద్ధితో, ప్రసాద బుద్ధితో అన్నీ అలా కర్మలు చేయాలి. తప్పదురా బాబూ అన్నట్లుగా, నాకైతే అక్కర్లేదు ఇది అన్నట్లుగా, వచ్చాను కాబట్టి శరీరం వచ్చింది, కాబట్టి దానికేదో కావాలి, దానికేది కావాలో అది మాత్రమే చేస్తున్నాను, ఈ శరీరం వుంది కాబట్టి చేస్తున్నాను, ఇది పోతే నాకు మరీ మంచిది అన్నట్లుగా ఉండాలి. ఈ శరీరం పోతే నాకు ఉద్యోగం చెయ్యక్కర్లేదు, వ్యాపారం చెయ్యక్కర్లేదు, డబ్బు సంపాయించనక్కర్లేదు, ఇది వుంది కాబట్టి ఆకలేస్తే దీనికింత అన్నం పడేస్తున్నాను, ఇదే గనక లేకపోతే నాకు వండుకోనక్కర్లేదు, సంపాదించుకోనక్కర్లేదు, అన్నం వెయ్యక్కర్లేదు, దీనిని కాపాడక్కర్లేదు, దీనిని పోషించక్కర్లేదు, ఇది పోతోందంటే చాలా సంతోషించి, హమ్మయ్య ఒకపనైపోయింది, నేను విడుదలయ్యాను అన్నట్లుగా అనే భావంతో నువ్వు అన్ని పనులు చెస్తే అది సద్వర్తన.

సద్వర్తన కలిగిన జనులు – మళ్ళీ జనులంటే ఎవరు 'జ' అంటే పుట్టేవాళ్ళు 'న' అంటే నశించేవాళ్ళు. చావుపుట్టుకలతో వుండేవాళ్ళు జనాలు. ఆ జనాలు శ్రీ గురు పాదకమలముల నాశ్రయించాలి. మళ్ళీ గురువుకు, శ్రీగురువుకి ఏమిటి తేడా? శ్రీ అన్నప్పుడు సగుణంగా వున్నటువంటి గురువు. మాయని అధిగమించినప్పటికీ శిష్యుడి కోసం సగుణంగా నీ దర్శనానికి దృశ్యమైనటువంటి గురువు శ్రీగురువు. తాను పొందినటువంటి అనుభవాన్ని మాటలలో తమయొక్క స్ఫురణతో తనయొక్క మహత్తుతో తనయొక్క శక్తిపాతంతో నీకు ఎట్లా కావాలంటే అట్లా సహాయం చేయగలిగిన స్థితిలో ఆ గురువు వున్నాడు అంటే ఆ గురువు మాయకు ప్రభువు. ఆ గురువుకి లొంగి వున్నటువంటి ఏ మాయ గురువు తరఫున నీకు సహాయం చేసిందో అది శ్రీ. అందుకని శ్రీ గురువు. శ్రీ గురువు లేకపోతే తాను సాక్షాత్ పరబ్రహ్మ అయి వుంటాడు, నీకు వినియోగపడదు. నీకు వినియోగపడాలి అంటే ఆయన సగుణం లోకి దిగి రావాలి. ఆ సగుణమే శ్రీ. అటువంటి గురుపాదుకములను ఆశ్రయించాలి.

గురుపాదమును ఆశ్రయించి, తత్త్వజ్ఞానము తప్ప ఇతరమును కోరనివాడు సచ్ఛిష్యుడు. సత్సాంగత్యం చెయ్యాలి, సత్సంగత్వంలో పాల్గొనాలి. నీకు చేతనైనంత వరకూ ఇతరులకి, నీకు తెలిసినటువంటి జ్ఞానాన్ని పంచిపెట్టాలి. మళ్ళీ ఈ జ్ఞానం ఎంత వరకు కరెక్ట్‌గా వున్నదో లేదో పెద్దల దగ్గరికి వెళ్ళి సరిదిద్దుకోవాలి. ఎప్పుడూ కూడా నిరంతరాయము ఇటువంటి

శ్రద్ధతో, శ్రవణ మనన నిది ధ్యాసలతో, సత్సంగాలతో, శిష్యులతో ఇచ్చి పుచ్చుకుంటూ చెప్పుకుంటూ ఎప్పుడూ కూడా ఆత్మ అనాత్మలని విడగొట్టుకునేటటువంటి వివేకంతో, విచారణతో మీరంతా కూడా ఆ మనసుని పూర్తిగా దాంట్లో ముంచివేసి ఆ పనితప్ప రెండో పని లేదు అన్నట్లుగా వుండాలి. నేను పుట్టినందుకు నాకు ఇదే పని, ఇంతకుమించి నాకు ఏ పనిలేదు, పుట్టాము కాబట్టి ఇది చెయ్యడంకోసం ఏదో చెయ్యాలి, ఆ చెయ్యడానికే ప్రాముఖ్యతని ఇచ్చి ఇప్పటి దాకా చాలా జన్మలు వృథా చేశాను, అందుచేత ప్రారబ్ధములో చెయ్యవలసింది కనీసంగా చేద్దాం, మిగతా టైం అంతా మోక్ష లక్ష్యంమీదే పెడదాం. సంసారము చేస్తూ కూడా ధ్యాస దీనిమీదే పెడదాము. అన్ని పనులూ చేస్తూ కూడా ఆత్మ స్థితికి ఆత్మ లక్ష్యాన్ని ఆత్మ స్థితి యొక్క స్పష్టతని మన మననంలో ఉంచుకుందాము. అన్ని పనులు చేస్తూ కూడా ఈ మననం కొనసాగించే అవకాశం వుంది, అలా నిరంతారాయంగా ఈ భక్తి అనేటటువంటిది ఈ జ్ఞానం అనేటటువంటిది ఈ విచారణ అనేటటువంటిది సర్వకాల సర్వావస్థలలో చెయ్యడానికి వీలుంది. ఎంత వీలుందో ఆ తికమక లేకుండా ఆ సర్కస్ చెయ్యకుండా సమన్వయం చేసుకుంటూ చేసేటటువంటి నైపుణ్యం కనుక వుంటే ఆ గడుసుతనం వుంటే ఆ జాణతనం వుంటే నువ్వు చెయ్యగలుగుతావు. తప్పకుండా చేస్తావు. నువ్వు చెయ్యడం మొదలుపెడితే నీకా శక్తి చాలకపోయినా, నీకు కుదరక పోయినా, అటువంటి వాళ్ళమీద గురువు ప్రత్యేకంగా దృష్టి పెట్టి గురు కృపని చూపిస్తూ వుంటారు. ఆ గురుకృప చేత ఈ సాధనలో శిష్యుడు ఉత్తేజితము కాగలుగుతాడు. జయించగలుగుతాడు.

జిజ్ఞాసులయి ఆత్మ విచారణా క్రమమును ముందు విషయముగా తెలుసుకుని, పాఠముగా తెలుసుకుని, తరువాత సచ్ఛిష్యులై తరువాత ఆణవీ దీక్షను పొందాలి. ఆణవీ దీక్ష అనేటటువంటి ప్రథమ ఉపదేశమును పొందాలి. ఆ తరువాత ఏమి చెయ్యాలి? గురువాజ్ఞానువర్తులై గురువు చెప్పినట్టుగా గురువు ఆజ్ఞనుబట్టి పాదనమస్కారాలు చేస్తారు కొంతమంది మొదటి దీక్ష తీసుకుని ఆ పాదంమీద కళ్ళని ముక్కుని చెవులను చర్మాన్ని జిహ్వని అన్నీ ఆనిస్తారు. అంటే పంచజ్ఞానేంద్రియాలూ గురుపాదానికి అర్పణ చేస్తారు. ఒకళ్ళు అలాగే గురువుకి అర్పణ చేశారు. అయితే సంప్రదాయంగా చేస్తున్నారు గాని పాపం వాళ్ళకి తెలియదు, ఎందుకలా చేస్తున్నారో. నీ జ్ఞానేంద్రియాలు నా పాదాలకి అర్పించేశావు కదా, మరి జ్ఞానేంద్రియాలు లేకుండా ఎలా పనిచేస్తావమ్మా అని అంటే చెప్పలేకపోయారు. నువ్వు పనిచేయడం కష్టము. కాబట్టి నువ్వు అర్పించిన జ్ఞానేంద్రియాలు తిరిగి నీకే ఇచ్చాను, ఇప్పుడు ఈ జ్ఞానేంద్రియాలు నీవి కావు, నీవన్నీ నాకిచ్చేశావు ఇప్పుడవి నావైనాయి. మీ రోజువారీ వ్యవహారానికి, శరీర ప్రారబ్ధకర్మానుసారం నడవడానికి ఎంత అవసరమో అంతవరకు ఉపయోగించుకో. అసంగముగా చేస్తూ నీ సాధన నీ ఆచరణ నీ విచారణ నువ్వు కొనసాగించుకోవడానికి నువ్వు అర్పించినటువంటి నీ జ్ఞానేంద్రియాలను నీకే ఇస్తున్నాను. కనుక నా జ్ఞానేంద్రియాలని నీకు అప్పుగా ఇస్తున్నాను, వాటిని ఈ రకంగా సాధనకి తప్పక ఉపయోగించుకోవాలి, జీవించడానికి మాత్రమే కనీసంగా ఉపయోగించుకోవాలి, అవి లేకపోతే ఇబ్బంది కాబట్టి మళ్ళీ నీకు వెనక్కి ఇస్తున్నాను.

అష్టావక్రుడు కూడా మనసు ఇచ్చేయమంటే జనకుడు ఇచ్చేశాడు. ఇచ్చిన తరువాత సరే ఆ పరీక్ష అయిపోయింది. మళ్ళీ అష్టావక్రుడికి అర్పించబడినటువంటి మనను మళ్ళీ ఆ జనకుడికే ఇచ్చి ఈ మనసు నీది కాదు, నువ్వు నాకు ఇచ్చేశావు కాబట్టి నీ మనసు ఇప్పుడు నా మనసు అయింది, నా మనసుని నీకు అద్దెకి ఇస్తున్నాను, అప్పుగా ఇస్తున్నాను, దీనిని నీ రాజ్య పరిపాలనకి గాని, దేనికైనా లోక వ్యవహారానికి గాని, ఇది తప్పదు ఇది తప్పదు అని ఓ పనైపోయింది ఓ పనైపోయింది అని, గతాన్ని గుర్తు పెట్టుకోకుండా భవిష్యత్తు గురించి చింతపడకుండా, ఆందోళన పడకుండా, నిత్య వర్తమానంలో వుంటూ, నా ఇంద్రియాలని మనస్సుని నువ్వు వాడుకుంటున్నావు ఆ మనసుని పనిముట్టు చేసుకుని నీవు నేను బోధించిన ప్రకారంగా సాధన చేస్తూ ఆచరిస్తూ ఆ మహావాక్యాలు నా దగ్గర శ్రవణం చేసి, దానిని మననం చేస్తూ నిదిధ్యాస చేస్తూ ఆరూఢమై అనుభవజ్ఞుడవై అపరోక్షమై వుండుమా! అని చెప్పాడు. కనుక గురువుకి నువ్వు ఇవన్నీ అర్పించినప్పుడు, ఆ గురువు తిరిగి నీకు ఇబ్బందిలేకుండా వుండటానికి ఇచ్చాడు గాని నా శరీరం నా ఇష్టం, నా నాలుక నా ఇష్టం అని, ఇష్టం వచ్చినట్లు రుచులు ఆస్వాదిస్తాను అనే పద్ధతిలో కాదు. గుర్వాజ్ఞానువర్తులై – గురువు ఆజ్ఞని ఆ విధంగా పాటించాలి.

నీ ఇంద్రియాలు గురువుకి అర్పించి గురువునుంచి ఆయన తిరిగి నీకు ప్రసాదిస్తాడు. గురుప్రసాదంగా ఆ ఇంద్రియాలను తీసుకుని, ఇంద్రియాలు నావి కాదు, గురువు అనుగ్రహించినటువంటి ఇంద్రియాలు ఇవి, నావెప్పుడో నేను అర్పణ చేసేశాను, ఇక నా దగ్గర లేవు, ఇప్పుడు ఇవన్నీ ఆయన ఇచ్చాడు కాబట్టి, ఆయన ఇంద్రియాలని ఆయన ఆజ్ఞ ప్రకారంగా వాడాలి. గుర్వాజ్ఞానువర్తులై తగుపాటి సద్గురువునన్వేషించి – తగుపాటి అంటే సద్గురువులు దొరకటం దుర్లభం. ఎక్కడో అక్కడ నాబోటి చిన్న గురువు దొరికితే చాలు. ఆయన్నే పట్టుకోండి చాలు. ఆయనే చూసుకుంటాడు. వారి పాదపద్మముల నాశ్రయించి లక్ష్యమైన ప్రణవ విషయమును, సృష్టి వివరమును, శివ పంచాక్షరిని, చక్కగా నెరుగవలెను. ఈ పాఠాలన్నీ మనకి అయిపోయినాయి. ప్రణవాన్ని అవ్యక్తంగాను, ఓంకారాన్ని మహత్తుగాను, అకార ఉకార మకారాలు ఈ స్థూల సూక్ష్మ కారణ ప్రపంచములుగాను, స్థూల సూక్ష్మ మానసిక ప్రపంచములుగాను విస్తరించినట్లుగా ఈ ఓంకార ఉపాసనని పైనుంచి క్రిందికి సృష్టి వివరంగా తెలుసుకుని సాధకుడు అనేటటువంటివాడు తన స్థూల సూక్ష్మ కారణ శరీరములు నేను అనేటటువంటి భావననుంచి తన స్థూల ప్రపంచ సూక్ష్మ ప్రపంచ మానసిక అనుభవాలను దాటి, మెహెర్‌బాబా చెప్పినట్లుగా ఆరు చైతన్య భూమికలను దాటి, ఏడవ భూమికయందు బ్రహ్మీభూత స్థితిని సంపాదించాలి. ఆ ప్రణవాన్ని ఆ రకంగా మనం వివరించి చెప్పాం.

తరువాత సృష్టి వివరణని పైనించి క్రిందికి చెప్పాం. ఆ పైనించి క్రిందికి ఎందుకు చెప్పుకుంటున్నాం అంటే ఏ సోపానంలో ఏ మెట్టులో అవరోహణగా పైనుంచి క్రిందికి దిగి వచ్చామో అదే పద్ధతిలో అదే మెట్లెక్కి, ఆరోహించి మళ్ళీ అదే మూలస్థానానికి వెళ్ళి ఆ మూల స్థానం కూడా నీకు మూలం కాదని కార్య కారణ బ్రహ్మముగా లేదని తెలిసి ఈ మూలములో వున్న దానిని మూలము లేనిది ఏదీ లేదని గుర్తెరిగేది ఏదీ లేదని దానిని కూడా మించి, దానికి అతీతమైన పరాస్థితిలో ఏదైతే వుందో ఆ పరాత్పర స్థితిలో వున్నటువంటి బ్రహ్మమును పట్టుకోవాలి. దానికి శివ పంచాక్షరీ ఇచ్చాం నమశ్శివాయ అని. న అంటే ఇంద్రియాలని మ అంటే మనస్సని ఇట్లా అన్నీ చెప్పి ఈ మంత్రంద్వారా నేను లేకుండా చేసుకోవాలి, నిరశించాలి లేకపోతే గురువుకి అర్పణ చెయ్యాలి. అప్పుడు నువ్వు విడుదలైపోయి వాటి సంబంధంగా నువ్వు లేనివాడై పోవాలి. అసలు వున్నవాళ్ళంతా వాటి సంబంధంగానే వున్నారు. కనుక అవి ఎప్పుడైతే లేవో వాటి సంబంధంగా లేనివాడవైతే నిజానికి పూర్తిగా లేనివాడవే అవుతావు. దీనిని చక్కగా ఎరుగవలెను. అప్పటికి, వారిలో తగిన వారలకు – ఇంతదాకా వచ్చిన వారికి బ్రహ్మోపదేశం చేస్తారు. ఎవరైనా వస్తే వారికి బ్రహ్మోపదేశం చెయ్యము. దీని ప్రకారంగా శివ పంచాక్షరీ ఇవన్నీ అయిపోయాక, అందులో బాగా తెలుసుకున్న వాళ్ళని చూసి, వాళ్ళకి పరీక్ష పెట్టి, గురువుగారు సర్వజ్ఞుడు, అందులో ఎవరైతే యోగ్యుడో, అలా ఒకరికో ఇద్దరికో బ్రహ్మోపదేశము చేస్తారు. కాని ఇవ్వాళ ఎవరికి పడితే వాళ్ళకి ఉపదేశం ఇస్తున్నారు. అందువలన దాన్ని ఏమి చేశామంటే అయిదు భాగాలు చేశాము.

మొదట్లో తారక మంత్రాన్ని ఉపదేశిస్తున్నాము. మాంస పిండాన్ని మంత్ర పిండంగా మారుస్తున్నాము, తరువాత సూచన ఇస్తున్నాము, నేను అనేటటువంటి జీవుణ్ణి ఒక హంస రూపంలో పెట్టి, హంసయొక్క ప్రయాణాన్ని శింశుమారక చక్రం వద్ద లేకనే వున్నట్లు ఒక హంస తోచి మండల త్రయం దాటి మానవుని యొక్క సహస్రారంలో చేరి సహస్రంలో సోహంతో అచలహంసై, భూమా దగ్గర కలహంసై, ఆజ్ఞా చక్రందగ్గర జీవ హంసై, స్థాన బేధంచేత వృత్తిబేధంచేత హంస ఒక్కటే అయినప్పటికీ అనేకముగా వుండి అనేక రకాలుగా వ్యవహారం చేస్తూ ఇడా పింగళాలో శ్వాస రూపంగా వుంటూ 72 వేల నాడులతోటి శరీరం అంతా వ్యాపించి హంస యొక్క వ్యాపారము, వృత్తులు ఈ రకంగా జరుగుతున్నాయి, ఈ హంసని విచారిస్తే ఈ హంసని క్రిందినించి పైదాకా తీసుకువెళ్ళి పరమహంస స్థానానికి తీసుకువెళ్తే మండలత్రయాన్ని దాటితే ఈ హంస లేనిదని తెలిస్తే లేని హంస లేకుండా పోతే అక్కడ వున్నదేదో వున్నది అదే ఉత్త బట్టబయలు ఏమీ లేదని పైనుంచి క్రిందికి క్రిందినుంచి మీదకి హంస అనేటటువంటి ఒక పదాన్ని మీకు పరిచయం చేసి నీవు ఆ హంసవై వున్నావు, జీవ హంసగా జీవ భావంతో వున్నావు, ఇక్కడ జీవ హంసలు ఈశ్వర హంసలు పనిచేస్తున్నాయి, ఈశ్వర హంసలు కారణ హంసలుగా వున్నాయి, జీవ హంసలు కార్య

రూప హంసలుగా వున్నాయి, వృత్తి బేధాలుబట్టి మనసుగా శ్వాసగా అనేకరకాలుగా పనిచేస్తోంది. హంస షట్ చక్రాలలో వున్నటువంటి దళాలకి సహస్రారంలో వున్న వెయ్యి దళాలకి దానియందు అంతర్గతంగా వున్న అష్టదళ పద్మానికి, ప్రతి రేకు యొక్క కదలికలు ఆ హంసయొక్క కదలికలు, ఇవన్నీ కూడా కారణమైతే దళాల కదలికే హంస యొక్క కదలికై జీవుడు కర్మలు చేస్తూ ప్రారబ్ధాన్ని అనుభవిస్తూ అనేక జన్మలు పొందుతున్నాడు అని హంస పద్ధతి చెప్పాం. ఇక్కడ దాకా లోక వ్యవహారంగా వున్న నేనుని ముందు మంత్రమయం చేశాం, తారక మంత్రం ద్వారా. తరువాత ఆ నేనుని ఆ హంస అనే పద్ధతిలో వివరించాం. ఇప్పుడు హంసని పైకి నడపండి. పైకి నడిపితే ఏం కావాలి నువ్వు – లక్షాన్ని బోధించాలి ఇక్కడ.

లక్ష్యం ఏంటయ్యా అంటే, నాలుగు మహావాక్యాలు. నాలుగు మహావాక్యాలు అర్థం చేసుకుని శ్రవణ మనన నిది ధ్యాసలు చెయ్యాలి అంటే నీకా సామర్థ్యం వుండాలి, నీకా అధికారిత్వం వుండాలి. ఈ అధికారిత్వం ఏదో అదే సాధన చతుష్టయ సంపత్తి. దానిని కూడా మనం పూర్తిగా చెప్పుకున్నాం. ఒక విధంగా శరీర త్రయం చెప్పాం, అవస్థాత్రయ సాక్షి చెప్పాం, పంచకోశ లక్షణ వ్యతిరిక్తం చెప్పాం, పిండాండ పంచీకరణ చెప్పాం, జ్ఞాతని నిర్ణయించాము, సూచన మంత్రం అయిపోయింది, మూడోది మహావాక్య ఉపదేశం. దీనిని కారణమంత్ర అంటాము. అది బ్రహ్మోపదేశం. ఆ బ్రహ్మోపదేశంలో నీవే ఆ బ్రహ్మవి **'అహం బ్రహ్మ'** అనేటటువంటిది నిర్ణయంగా చెప్పడం జరుగుతుంది. కనుక ఇప్పుడు శిష్యులు మొదటి రెండు మంత్రాలు లెక్కలో లేదు గాని నీకు తర్ఫీదు ఇస్తున్నాము. శిష్యుడికి ఉత్సుకత వుండాలి. తీవ్ర మోక్షేచ్ఛ వుండాలి. సామర్థ్యం వుండాలి. నువ్వు చెప్పిన దానిని ఊహతో అపోహతో పెంచి తైలపాక శిష్యుడిలా వుండాలి. ఒక నూనె చుక్క పాత్రలో వేస్తే ఆ పాత్ర యొక్క ఉపరితలము అంతాకూడా వ్యాపించినట్లుగా, గురువు దగ్గర విన్నటువంటి విద్య తనలో మననం ద్వారా వ్యాప్తిచేసి తనకు తెలిసిన దానిని సాటి శిష్యులకు కూడా అర్థమయ్యేలాగా చెప్పే ప్రతిభ కలిగివుండి, ఆ రకంగా తైలపాక శిష్యుడిలాగా ఎవరైతే విద్యని తనయందు ఇతర సహాధ్యాయులయందు కూడా, దీనిని వ్యాపకంగా ఎవడైతే పెంచుకుంటూ పోగలడో అట్టి ఉత్సుకత కలవాడు, ముముక్షువును గురువులైనవాళ్ళు అట్టివారిని పట్టుకోవాలి.

వాళ్ళు అప్పుడు ఏమి చెయ్యాలి? సాధన చతుష్టయ సంపన్నులు కావాలి. ఈ గురువే వాళ్ళని సాధన చతుష్టయ సంపన్నులుగా తీర్చిదిద్దాలి. అప్పుడు వాడు పూర్తిగా గురువుకి శరణాగతై, గురువుచేత శిక్షింపబడటానికి ఒప్పుదలై, కొట్టినా తిట్టినా నెట్టినా బయటకి పంపించేసినా సరే, ఆ గురువునే పట్టుకుని వేళ్ళాడుతూ, చేసిన తప్పుకి పశ్చాత్తాపపడుతూ, మళ్ళీ గురుకృపకోసం వెంపర్లాడుతూ వున్న శిష్యుడు కావాలి. అటువంటి శిష్యుడు సాధుగుణ సంపన్నుడు అంటే ఇప్పుడు చెప్పినటువంటి స్థితికి వచ్చినటువంటి శిష్యుడు. వారియందు చతుర్విధ శుశ్రూషలద్వారా గురువుని అంగముగా స్థానముగా భావముగా ఆత్మగా, గురువు దగ్గర వున్నటువంటి ఈ నాలుగు, నీ దగ్గర వున్నటువంటి ఈ నాలుగు తేడాగ వున్నాయి కనుక, గురువు దగ్గర వున్నటువంటి ఆ నాలుగు స్థితులను, నాలుగు పద్ధతులలో నాలుగు మార్గాలలో పట్టుకొని, చివరికి నీ పద్ధతిగా నీవు లేనివాడవై గురు పద్ధతిగానే ఉంటూ, గురువులో నువ్వు మమైకమై వుండాలి. ఇదీ గురుశుశ్రూషల యొక్క అంతరార్థం. అలా అంతర్ముఖ ప్రయాణము చేసి సమావిష్టింపచేసి –సమన్వయం చేసుకుని ఆ సమన్వయమైన దానితో ప్రతిష్టితుడయి, తమబిడ్డలుగా గురుపుత్రులుగా జ్ఞానపుత్రులుగా, వాచ్యార్థ లక్ష్యార్థ బోధాక్రమముగా, శరీరత్రయ విలక్షణత్వమును, పంచకోశ వ్యతిరిక్తమును, అవస్థాత్రయ సాక్షిత్వమును కూర్చెదరు.

ప్రథమాంకంలో వీటన్నిటినీ కూడా మనము స్పృశించాము. దానిని మనం సంపన్నం చేసుకోవాలి, జీర్ణం చేసుకోవాలి, ఆ జీర్ణ స్థితిలో సాక్షి స్థితిలో విలక్షణ స్థితిలో ఆత్మ నిష్ఠుడై వుండాలి. ఇది వ్యష్టిలో చెప్పాం, పిండాండంలో చెప్పాం. మరి దీనిని సమష్టికి తీసుకెళ్ళాలి. ఈ పిండాండ నిర్ణయాన్ని బ్రహ్మాండ నిర్ణయంగా ఎలా వుంటుందో దీనికి దానికి వున్నటువంటి భేదాలు, వ్యష్టికి సమష్టికి వున్న భేదాలు చెప్తూ, అనుభవానికి వ్యష్టి సమష్టి భేదము లేదు, పిండాండ పంచీకరణలో వున్నటువంటి 25వ వాడు అయినటువంటి జ్ఞాత కూటస్థుడూ బ్రహ్మాండ పంచీకరణలో వున్నటువంటి 25వ వాడైన జ్ఞాత కూటస్థుడు ఒక్కటే, ఆ రకంగా జీవుడు, ఈశ్వరుడు ఒక్కటే అని, జీవేశ్వరైక్యతా సిద్ధి కలగడానికి ఈ ప్రథమాంకము అకురార్పణ చేసింది. అనుభవార్థమైనటువంటి నిత్యానిత్యవస్తు వివేకము, ఆత్మానాత్మ వివేకముతో సదా సహజమై, స్వభావమై జీవించువారలకు

ఆత్మ సాక్షాత్కార జ్ఞానము, సద్గురు కృపా విశేషమున సిద్ధము. సద్గురు కృప అంటే గురువు సిద్ధంగానే వున్నాడండి! తగిన శిష్యుడు ఎప్పుడొస్తాడో, ఎవరొస్తారో, ఎలా వస్తారో అని నిరంతరమూ శిష్యుల కోసం గురువులు తహపడుతూ శిష్యులే గురువు దగ్గరికి వచ్చే సంప్రదాయం వున్నప్పటికీ, ఇప్పుడు గురువే శిష్యుడి దగ్గరికి వెళుతూ, శిష్యులని తీవ్ర మోక్షేచ్ఛ కోసం ప్రేరేపిస్తూ, వాళ్ళు ఏ ఏ సాధనలలో పూర్వం వున్నారో, ఆ సాధనయొక్క రహస్యాన్ని కూడా చెప్పి, లక్ష్యంవైపుకి నడిపిస్తూ, వాళ్ళలో పరివర్తన తీసుకొస్తూ, మరి ఇవన్నీకూడా గురువే కష్టపడుతున్నాడు. అది గురుకృపా విశేషం. అంటే ఇది సిద్ధంగానే వుంది, ఇది అందుబాటులోనే వుంది. చెప్పేవాడు వున్నాడు, వినేవాడు లేడు. వినేవాళ్ళకోసం గురువు గారు వలేసి పట్టుకుని ఎట్లా అయినా సమీకరించుకుంటున్నారు.

కనుక శిష్యులు గురువులకు రెండు రకాలు ఉపయోగము. వారిని వారే ఉద్ధరించుకోవాలి. శిష్యులకు నిత్యమూ సత్సంగం ద్వారా బోధ చేయడం ద్వారా గురువులో అనుభూతి యొక్క స్థితులు అంచలంచెలుగా పెరుగుతాయి. దానికోసం ఈ శిష్యులందరూ ఉపయోగపడుతున్నారు. అందుకే శిష్యులకు కూడా అదే మార్గం చెప్పి, ఎక్కడికక్కడ మీరు సత్సంగాలు నిర్వహించండి, మీరు సద్గురువు కాకపోయినా, నేను కూడా సద్గురువంతటివాడిని కాకపోయినా. ఎక్కడోఅక్కడ ప్రారంభం చేసి దీనిని సాధనగా, విచారణగా, మననముగా తీసుకున్నాం. శిక్షణగా తీసుకున్నాం. గురువు అవ్వడానికేనన్నట్లు శిక్షణ తీసుకుంటున్నారు. అక్కడికక్కడే సత్సంగాన్ని మీరు చిన్నచిన్న గ్రూపులుగా వర్గాలుగా నిర్వహిస్తున్నారు. కనుక ఈ రకంగా మీరు చేయడం ద్వారా మీరు బహిర్ముఖంనుంచి అంతర్ముఖమై, అంతర్ముఖ స్థితిలో మీ లక్ష్యం ఏమిటో, ఆ లక్ష్యార్థమేమిటో దానిని మీరు తప్పకుండా సిద్ధింపచేసుకుంటున్నారు అని ఈ ప్రథమాంకాన్ని ముగిస్తున్నాము.

ఇక్కడ చెప్పినవాడూ లేడు. విన్నవాడూ లేడు. సద్గురువే చెప్పినవాడిచేత పలికించాడు, ఆ గురువే వినేవాడియొక్క హృదయంలో ప్రజ్ఞా స్వరూపుడై విన్నంతకాలము తన తెలివికంటే మించిన తెలివితో అర్థం చేసుకునే సామర్థ్యాన్ని ఆ గురుకృపతో పొందాడు. గురువే అక్కడ విన్నాడు, గురువే ఇక్కడ చెప్పాడు. అనంత ప్రజ్ఞా స్వరూపుడైన గురువు చెప్పేవాడి ప్రజ్ఞగా వుండి చెబుతూ, వినేవాడి ప్రజ్ఞగా వుంటూ అవగాహన చేసుకుంటూ, ఆ గురువే సర్వత్రా వ్యాపించి సర్వమునందు అంతర్యామిగా వుండి ఆ ప్రజ్ఞా విశేషాన్ని ఆ అవగాహనని, ఆ విద్యను శిష్యుడియొక్క హృదయానికి ప్రవహించేటటువంటి పద్ధతిని గురువే నిర్వహిస్తూ వున్నాడు.

అందరూ దివ్యాత్మ స్వరూపులే. వారిలో నిక్షిప్తమైన దానినే వెలికి తీసి వాళ్ళకి పరిణతనందించి వారికి వస్తు నిశ్చయజ్ఞానం కలిగేటట్లు చేయబడుతున్నది. అది వాళ్ళలోనే వున్నది, వాళ్ళకే బయటపెడుతున్నారు తప్ప, ఎవరూ ఏమీ చెయ్యడంలేదు. ఒక గురుతత్త్వము వున్నది. కొన్ని ఉపాధులను ఎంపిక చేసి ఆ ఎంపిక చేయబడినటువంటి ఉపాధుల ద్వారా ఈ విద్యని ఎక్కడెక్కడ యోగ్యత అర్హత వున్నదో, వాళ్ళందరికీ వ్యాపింపచేటటువంటి పద్ధతి ఏదైతే వున్నదో అది ఈ గురుతత్వం. అటువంటి గురుతత్త్వమే సద్గురువు. సద్గురువు స్థూల రూపంలో వుండకపోవచ్చు. సూక్ష్మ రూపంలో వుండొచ్చు. సూక్ష్మ రూపంలో కూడా లేకపోవచ్చు. సూక్ష్మాతి సూక్ష్మమైన గురుతత్త్వం రూపంలో వుండొచ్చు. యెల్లెడలా ఆ గురుతత్త్వమే పనిచేస్తుంది. గురువులు ఎంతమందైనా గురుతత్వమొక్కటే! ప్రవచనములు ఎన్ని విధాలుగా చెప్పినా, ఎంతమంది చెప్పినా, ప్రవచనము ఒక్కటే! దేవుళ్ళు ఎంతమందైనా దేవాదిదేవుడు ఒక్కడే! జ్ఞానము ఎన్ని విషాయాలుగా పరిచ్ఛిన్నమైనా! అపరిచ్ఛిన్న జ్ఞానము ఆ బ్రహ్మజ్ఞానమే!

సర్వం సద్గురు చరణార విందార్పణమస్తు.

